యని తిక్కన వర్ణించిన యతనితాత యగుమంత్రిభాస్కరుఁ డఁట. 'సారకవితాభిరాముఁ' డని తిక్కనవంటిమహాకవి యిచ్చినబిరుదవిశేషణముం బట్టి యీమంత్రిభాస్కరుఁడు రామాయణమును రచించియుండె ననియుఁ, గావుననే తాను రామాయణమును రచింపక తిక్కనయుత్తరరామాయణమునే రచించె ననియు, మంత్రిభాస్కరునిరామాయణ మేకారణముననో యొక యారణ్యకాండము తక్కఁ దక్కినవెల్ల నుత్సన్నములు కాఁగా హుళక్కిభాస్కరాదులు వానిని బూరించి రనియుఁ జెప్పఁబడుచున్నది. ఈయభిప్రాయమున కెల్ల మొదటిమూల మారణ్యయుద్ధకాండగద్యములభేద మనఁబడుచున్నది. కాని యాగద్యములభేదమును జక్కఁ బరామర్శింపఁగా నిందులకు సాక్ష్య మియ్యకున్నది. ఆరెండుగద్యములలో భాస్కరుఁడు రచించినగద్య, మతఁ డేభాస్కరుఁ డయినను, 'సకలసుకవిజనవినుతయశస్కర భాస్కర' యనెడి యారణ్యకాండపుగద్య మొకటియే. యుద్ధకాండమున భాస్కరునిరచన మున్నను దానితుదిగద్యమం దలికడమను బూరించినయయ్యలార్యునిది. కవులభేదముచే గద్యములు భేదించుట సహజము. ఈ యుద్ధకాండపుగద్యమునుగూడ భాస్కరుఁడే రచించియుండెనేని యారణ్యకాండగద్యమునకును దీనికిని గలభేదముంబట్టి భాస్కరులు భిన్ను లనవచ్చును. ఈరెండుగద్యములను వరుసగా భాస్కరుఁడును నయ్యలార్యుఁడును రచించుటచే వీనిభేదమువలన భాస్కరుఁడు వేఱు అయ్యలార్యుఁడు వే ఱని తెలియుచున్నదే కాని యారణ్యకాండభాస్కరుఁడు వేఱు యుద్ధకాండభాస్కరుఁడు వే ఱని తేటపడుట గలుగదు. కాన యీగద్యభేదముంబట్టి భాస్కరులు భిన్ను లనుట కుపపత్తి లేదు. ఇది యటుండ నారణ్యకాండముగద్యమున 'సకలసుకవిజనవినుతయశస్కర భాస్కర' యని యున్నది. ఇందు భాస్కరశబ్దమున కేయుపపదమును లేదు. ఆకాండమునకు ముందటిబాలకాండముగద్యమునను వెనుకటికిష్కింధాసుందరకాండములగద్యములను 'అష్టభాషాకవిమిత్ర భాస్కరపుత్ర' యని యున్నది. ఇందలిభాస్కరశబ్దమునకు నేయుపపదమును లేదు. యుద్ధకాండముగద్యమున 'భాస్కరసత్కవిమిత్ర' యని యున్న దందు. అక్లేని యిందలిభాస్కరశబ్దమునకు నుపపదము లేదు. అయ్యలార్యుఁడు చెప్పిన 'హుళక్కిభాస్కరమహాకవి' యను పద్యముంబట్టి 'భాస్కరమిత్రుఁ' డగుసతనిని హుళక్కిభాస్కరమిత్రునిఁగాను 'భాస్కరపుత్రుఁ' డగుమల్లికార్జునుని హుళక్కిభాస్కరపుత్రునిఁగాను గ్రహించియుండుట స్పష్టపడుచున్నది. ఇట్లారణ్యకాండము మొదలు నున్ననిరుపపదభాస్కరులెల్ల హుళక్కిభాస్కరుఁడే యని చెప్పఁబడునేని, సదుము వానివలె నిరుపపదముగానే యున్నయారణ్యకాండభాస్కరుఁడును హుళక్కిభాస్కరుఁడగుట సత్యమునకంతగా దూరము గానేరదు. కనుక నీగద్యములం దరసి చూడఁగా నాయిరువురుభాస్కరులు భిన్ను లనుటకంటె నొక్కఁడే యనుట మఱింతయుపపన్నముగా నున్నది.

ఇఁకఁ గాండాదిపద్యములకు వత్తము. ఆరణ్యకాండమున,

క. 'శ్రీహితనయవిలసనవా,ణీహితమృదువచన ధారుణీహితగుణసం
దోహ యనహాయవిక్రమ, సాహసనవసాహసాంక సాహిణిమారా! ౧. ఆశ్వా.
క. శ్రీరామాకుచయుగళీ, హారిద్రోల్లసితవక్ష హరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర, ణీరమణోత్తముఁడు సాహిణీతిలక మిలన్. ౨.ఆ.
అనియు యుద్ధకాండమున
క. 'శ్రీకరకరుణారుచిరవి, లోకనలీలావికాస లోల విపక్షి
ల్లోక వివేకకలాశి,తాకుళలా మేరుధీర సాహిణిమారా.

యనియు నున్నది. ఈరెండు నేకకృతిపతినే గుఱించుటంబట్టి యీరెండు కాండములకర్తృత్వము నొకభాస్కరునికే చెల్లుచున్నది. భాస్కరుఁ డొకఁడే యనుటకు నింతకంటె బలీయమైనప్రమాణ మేమి కావలయును? మఱి యీయొకభాస్కరుఁడు మంత్రిభాస్కరుఁడా? హుళక్కిభాస్కరుఁడా? యనువిషయమున నయ్యలార్యుని 'అమర హుళక్కిభాస్కర' యనుపద్యము హుళక్కిభాస్కరుఁడే యని సిద్ధాంతము సేయుచున్నది. అయ్యలార్యుఁడు

'అమర హుళక్కిభాస్కరమహాకవి చెప్పఁగ నున్నయుద్ధకాం
డముతెగువాయి'

అని యుద్ధకాండమును హుళక్కిభాస్కరుఁడు చేసినట్లు చెప్పెనుగాని యరణ్యకాండమునుగూడఁ జేసినట్లు చెప్పలేదే యన్నచో నిది సరిగాదు. భాస్కరుఁడు యుద్ధకాండమును రచింపఁగా మిగిలినభాగమును దాను బూరించిన ట్లయ్యలార్యుండు చెప్పినాఁడేకాని భాస్కరుఁడు యుద్ధకాండమునుమాత్రమే రచించెనని చెప్పలేదు. తన పూరణమునకుఁ బాలుపడిన దతనియుద్ధకాండమే కాన పూరించుటకై దానిం జెప్పవలసి చెప్పినాఁడింతేకాని తక్కినకాండములు చెప్పనవసరము లేదు. కనుకఁ దక్కినవానిని జెప్పనంతమాత్రకు భాస్కరుఁడు వానిని రచింపలేదనుట సిద్ధింపదు. ఇట్లు, గ్రంథస్థనిదర్శనము లగు నాద్యంతపద్యగద్యములంబట్టియు నయ్యలార్యుని పద్యముంబట్టియు నారణ్యకాండయుద్ధకాండములు హుళక్కిభాస్కరుఁడు రచించెననుటయే యుక్తముగా నున్నది. ఇఁకఁ

## 2. చరిత్రాద్యాధారము.

కృతిపతి యగుసాహిణిమారుని కాలముంబట్టియు మంత్రిభాస్కరాదులకాలములంబట్టియు నీవిషయము పరామర్శింతము. సాహిణిమారుఁడు, ఓరుగంటి రెండవప్రతాపరుద్రునియాస్థానమం దున్నట్లు సోమదేవరాజీయము దెల్పుచున్నది. అందుఁ బ్రతాపరుద్రునిసభలో 'హుళక్కిభాస్కరుఁడు మొదలుగాఁ గలప్రబంధకవీశ్వరు లిన్నూఱుగురును......అశ్వంబుల కధికారి యైన సాహిణిమారనయు నున్నట్లు చెప్పఁబడియున్నది. ఈప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1295 వ సంవత్సరము మొదలుకొని 1321 వఱకు రాజ్యముచేసెను. ఇతనికాలమందు సాహిణిమారనయు హుళక్కిభా

స్కరుఁడు నుండుటచే వీరిరువురు సమకాలికు లై యున్నారు. మొదట సాహిణిమారుఁడు ప్రతాపరుద్రునికొలువున దండనాథుఁడుగా నుండెను. ఆరాజును మహమ్మదీయులు పట్టుకొని కారాబద్ధునిఁ జేసినపిదప నాతనిక్రిందిసేనాపతులు మొదలగువారు స్వతంత్రులై యతనిరాజ్యమును బంచుకొని రాచఱికముతో నేలి రని తెలియుచున్నది. అతనిసేనాని యగుపోలయవేమారెడ్డి వినుకొండరాజ్యమును స్థాపించెను. సాహిణిమారుఁడును స్వతంత్రుఁడై కొండసీమకు (కొండవీఁడు కాఁబోలు) రాజయ్యె. ఇతఁడు దండనాథుఁడును రాజును నయ్యె ననుటకు

'మారయధర, ణీరమణో త్తముఁడు సాహిణీతిలక మిలన్. ఆరణ్య.

అనుట ప్రమాణము. మఱియు నప్పకవీయమం దుదాహరింపఁబడిన

క. ''అప్పు లిడునతఁడు ఘనుఁడా?
యప్పు డొసఁగి మరలఁ జెందునాతఁడు రాజా?
చెప్పఁగవలె సాహిణిమా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్.

అనెడి యీ హళక్కి భాస్కరుని పద్యమువలన సాహిణిమారుఁడు రా జగుటయు హళక్కి భాస్కరుఁడు నతనికాలమువాఁడే యగుటయు స్థాపితమగుచున్నవి. ఇట్లు పదునాలుగవ శతాబ్దమందు సాహిణిమారనయు హళక్కి భాస్కరుఁడు నుండి రనియు నప్పుడే రామాయణము రచింపఁబడె ననియుఁ దెలియుచున్నది.

ఇఁక మంత్రిభాస్కరునికాలమును విచారింతము. దీనిని దిక్కనకాలమును బట్టిగాక మఱియొకవిధమున నిర్ణయించుట కాయితి లేదు. సోమదేవరాజీయమందుఁ దిక్కన కాకతీయగణపతిదేవుని దర్శింపవచ్చిన ట్లున్నది. గణపతిదేవుఁడు పదుమూఁడవ శతాబ్దము మధ్యమువఱకు రాజ్య మేలిన ట్లున్నది. ఆనాఁటికే తిక్కన సోమయాజి యై భారతాదులను రచించియుండెను గాన యప్పటికిఁ జాలవయస్సు చెల్లినవాఁడై యుండఁగూడును. కాన యతఁడు పండ్రెండవశతాబ్దమునఁగూడ నుండవచ్చును. మఱియు మెకంజీదొరగారు సంపాదించి చెన్నపురి రాజకీయపుస్తకనిలయమం దుంచినవ్రాఁతప్రతులలో నొకట

క. 'అంబరరవిశశిశాకా
బ్దంబులు చనఁ గాళయుక్తి భాద్రపదపుమా
సంబున నంబరమణిబిం
బం బనఁదగు తిక్కయజ్వ బ్రహ్మముఁ జేరెన్.

అని యున్నది. ఇది శాలివాహనశకము 1120 సం॥ లు చనఁగా, అనఁగా 1121వ సం॥న తిక్కన మృతినొందినట్లు చెప్పుచున్నది. ఈశకవర్షము 1121 కాళయుక్తియే యగుచున్నది. ఇందులకు హూణశకము 1199 వ సం॥ మగుచున్నది. దేశచరిత్ర 1199 సం॥ మే గణపతిదేవుఁడు రాజ్యమునకు వచ్చె ననుటచే నా

యేకాని తిక్కన మెచ్చుకొనునంతటికవిత్వాతిశయమునుబట్టి వచ్చినది కాదు. కాన దీనివలన నీభాస్కరుఁడు మహాకవిగాఁ దోఁపలేదు. ఇతఁ డెట్టివాఁడయినను గానీ. ఈ రాయనభాస్కరుఁడు మంత్రిభాస్కరుఁడు గాఁడు. ఎట్లన, సునందాపరిణయమును రచించిన చింతకుంట కోదండరామకవి

సీ. ఘనతరౌదార్యదీక్షాకల్పితానల్ప, కరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంతరరాట్సభా, మధ్యవిశ్రుతకీర్తిమండలుండు
కొండపల్లీవినుకొండదుర్గద్వయీ, దేశప్రజావనధీయుతుండు
సకలావనీపకసంతానయాచిత, వస్తుప్రదానప్రవర్తనుండు
అన్నవేమమహీశదత్తాగ్రహార
మదకలాందోళికాశ్వసన్మణివిశేష
భూషణాద్యష్టభూతివిభూషితుండు
భానుతేజుండు రాయనభాస్కరుండు.

అని రాయనభాస్కరుని వర్ణించియున్నాఁడు. నందవరీకుఁ డగుకోదండరామకవి యితనిని దనవంశమువాఁడుగాఁ జెప్పుకొనుటచే నితఁడును నందవరీకనియోగిబ్రాహ్మణుఁడు. మంత్రిభాస్కరుఁ డాంధ్రనియోగికబ్రాహ్మణుఁడు. రాయన భాస్కరునింటిపేరు రాయనవారు. మంత్రిభాస్కరు నింటిపేరు కొత్తరువువారు లేక గుంటూరివారు. రాయని భాస్కరు నివాసస్థలము వినుకొండ. మంత్రి భాస్కరునిది గుంటూరు. రాయన భాస్కరుని కుమారుఁడును మనుమనుఁడును,

సీ. కవులిచ్చి భూపతి గాచిపట్టఁగ నిల్పెఁ, బ్రజలకై రాయన భాస్కరుండు
వరదాతయై మణివలయముల్ కవి కిచ్చెఁ, గుండిభాస్కరుసూతి కొండమంత్రి
భాస్కరువలెఁ గీర్తిఁబడసెఁ దత్పౌత్రుఁడౌ, ఘనరామలింగ భాస్కరుఁడొకండు'

అను ముప్పదిబుద్ధులు మంత్రులపద్యముంబట్టి వరుసగాఁ గొండనయు రామలింగన్నయు నగుదురు. మంత్రిభాస్కరునికొడుకును మనుమఁడును వరుసగాఁ గొమ్మనయుఁ దిక్కనయు నగుదురు. రాయనభాస్కరుఁడు మొదట నుదాహరింపఁబడిన పద్యముంబట్టి యనవేమరాజుకాలమువాఁ డని తెలియుచున్నది. అనవేమారెడ్డి హూణశకము 1340 మొదలుకొని 1366 వఱకు రాజ్యము చేసినట్టు చెప్పఁబడియున్నది. కనుక రాయన భాస్కరుఁడు పదునాలుగవశతాబ్దమువాఁడు. మంత్రి భాస్కరుఁడు పండ్రెండవ శతాబ్దాదివాఁ డని ముందె నిరూపింపఁబడి యున్నది. కాన రాయన భాస్కరుఁడు మంత్రిభాస్కరుఁడు కానేరఁడు. కనుక మంత్రి భాస్కరుఁడు కవిత్వమున ఖ్యాతి గాంచఁడయ్యె నని తెలియుచున్నది. మఱియుఁ దిక్కకవిశిష్యుఁ డగు మారన, రామాయణకర్త మంత్రి భాస్కరుఁడేని, తనగురువంతగొప్పగాఁ జెప్పికొన్నయతనితాతగారిని దానును గవిస్తుతిలోఁ జేర్కొనకుండునా? అతఁడు

ఉ. సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారఁగఁ గ్రోలుచుర్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితర్ మును త్రిపర్వము లెవ్వఁ డొనర్చె నట్టివి
ద్యారమణీయు నంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్.

చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సద్విహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాక్రియా
విభుఁ బరతత్త్వకోవిదు నవీనపరాశరసూను నంతత
త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీశ్వరుఁ గొల్తు భక్తితోన్.

అని నన్నయ్యతిక్కనలను మాత్రమే స్తుతించియున్నాఁడు. మారనకు సమీపకాలపువాఁ డయినమడికిసింగనయు

'సారమతిర్ భజింతు ననిశంబును నన్నయతిక్కనార్యులర్'

అని యాయిరువురనే పేర్కొనియున్నాఁడు. ఈతనికిఁ దగువాతివాఁ డగు నెల్లూరయు నాయిద్దఱుకవులనే స్తుతించియున్నాఁడు. తిక్కన 'సారకవితాభిరాముఁ' డనుటం బట్టియుఁ, గేతన దశకుమారచరితమునందు

శా. శాపానుగ్రహశక్తియుక్తుఁ డమలాచారుండు సాహిత్యవి
ద్యాపారీణుఁడు ధర్మమార్గపథికుం డర్థార్థిలోకావన
వ్యాపారవ్రతుఁ డంచుఁ జెప్పు సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరుర్ భాస్కరున్.'

అని 'శాపానుగ్రహశక్తియుక్తుఁడు' గను 'సాహిత్యవిద్యాపారీణుఁడు' గను జెప్పి యుండుటంబట్టియు, మంత్రిభాస్కరుఁడు మంచికవి గావచ్చును గాని కవిస్తుతుల కెక్కనంతటి మహాకవిగాఁడని తెలియుచున్నది. మఱియుఁ గేతన యతని నట్లు వర్ణించియు రామాయణమును రచించినట్లు చెప్పమిచే దాని నతఁడు రచింపలేద నియుఁ దేటపడుచున్నది.

* ఇది యిట్లుండఁ దిక్కనశిష్యుఁ డయినమారననుబట్టి తిక్కనకాలము మఱింత నిర్ణీతముగాఁ దెలియుచున్నది. మారన 1295 వ సం॥ మొదలుకొని 1328 సం॥ వఱకుఁ బరిపాలనము చేసిన రెండవప్రతాపరుద్రుని సేనాపతులలో నొక్కండగు నాగయగన్నమంత్రికిఁ దన విష్ణుపురాణము నంకితము చేసియున్నాఁడు. కనుక మారనగురుం డయినతిక్కన 1290 వ సం॥వఱకు జీవించి యుండవచ్చును. దీనింబట్టి చూడఁగా 'అంబరవిశశి'యను పద్యముమొదలయినవి యవిశ్వసనీయములుగాఁ జూపట్టుచున్నవి. తిక్కనయీకాలముంబట్టి మంత్రిభాస్కరుఁడు పండ్రెండవశతాబ్దముతుదివాఁ డని తెలియుచున్నది. దీనింబట్టి చూచినను మంత్రి

* కవులచరిత్రము భాస్కరోదంతము మొదలగువానినుండి యిందలివిషయములు కొన్ని గయికొనంబడినవి. విజ్ఞానచంద్రికవారి 'ఆంధ్రులచరిత్రము' నుండియుఁ గొన్నివిషయములు గ్రహింపబడినవి.

భాస్కరుఁడు సాహిణిమారున కంకితముగా రామాయణము రచించె ననుట యసంబద్ధముగా నున్నది.

పదునాలుగవశతాబ్దముమధ్యమువఱకుఁ గవిస్తుతులందు భాస్కరుఁ డను మాటయే కలుగదు. ఆ శతాబ్దముతుదినుండి భాస్కరుఁడు శ్రీనాథుఁడు భీమన రంగనాథుఁడును గవిస్తుతులం గనుపట్టుచున్నారు. ఈభాస్కరుఁడు, పదునాలుగవశతాబ్దపు హుళక్కి భాస్కరుఁడే కావలయును; పండ్రెండవశతాబ్దపు మంత్రి భాస్కరుఁ డైనయెడల నతఁడు నడుమ నున్నశతాబ్దములం దెల్లఁ బేర్కొనంబడక పదునాల్గవశతాబ్దమునంతమునఁ బేర్కొనంబడె ననుట యనుపపన్నముగా నున్నది. మఱియు మధ్యకవులలోనివాఁ డగు అంగర నృసింహకవి తనరాజరాజాభిషేకమందు

ఉ. 'ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రగ్గడన్ మనః
పద్ధతి నిల్పి సూక్తిరుచి భాస్కరుఁ డైనహుళక్కిభాస్కరున్
బుద్ధి ఘటించి సంతతము పూని భజింతు వచఃప్రసాదసం
సిద్ధునిఁ జిమ్మపూడికులశేఖరు నయ్యమరేశసత్కవిన్.'

అని స్పష్టముగా హుళక్కిభాస్కరుఁ డని తెల్పినాఁడు. కనుక ననంతామాత్యుని భోజరాజీయమందు,

'నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథు'

ననియు, వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమున

'ఎన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజినిన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాథునిన్'

అనియు, ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రయందు

'నన్నయభట్టుఁ దిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ బే
రెన్నికఁ జిమ్మపూడియమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్'

అనియు నిట్లే యిటీవలికృతులయందునుం గలభాస్కరుఁడు హుళక్కిభాస్కరుఁడే కాని మంత్రిభాస్కరుఁడు గానేరఁడు

పదేనవశతాబ్దమునుండి భాస్కరుఁడు భీముఁడు రంగనాథుఁడు శ్రీనాథుఁడు మొదలగుకవులు కవిస్తుతులం గానిపించుటంబట్టి వీర లొండొరులకాలములందో యొండొరుల యంత్యకాలములందో, యొండొరులకుఁ బిదప దాపటికాలములందో యున్నవారు గావచ్చును. కాన భాస్కరునితోఁ బాటిగాఁ దఱచుగాఁ గవిస్తుతులందుఁ గానిపించుభీమన యతనికాలపువాఁడో యతనికి సమీపకాలమువాఁడో కావలయును. ఇందులకు నిదర్శనముగా భీమకవి సాహిణిమారననుగూర్చి

'చక్కఁదనంబుదీవి యగుసాహిణిమారుఁడు మారుకైవడిం
బొక్కపడం గలండు చలమున్ బలముం గలయాచళుక్యపుం

జొక్కనృపాలుఁ దుగ్రుఁడయి చూడ్కుల మంటలు రాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరునిమీఁదికి వచ్చిన రిత్తపోవునే.

యని చెప్పినట్లు వదంతి కలదు. దీనింబట్టి యతఁడు సాహిణిమారునికాలమునం దుండవలయు నని తెలియుచున్నది. దీనిచేత నితనితోఁ బాటిగా స్తుతులం గానిపించుభాస్కరుఁడు, సాహిణిమారునికాలమువాఁ డగుహాళక్కి భాస్కరుఁడె కావలయును. మఱియు భీమకవి రాయకళింగగంగునుగూర్చి,

'వేములవాడభీమకవి వేగమ చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ముపొమ్మనన్
మోమును జూడ దోష మిఁక ముప్పదిరెండుదినంబులోపలన్
జామున కర్ధమం దతనిసంపద శత్రులఁ జేరుఁగావుతన్'

అని శాప మిచ్చినట్లును నాచొప్పుననే కళింగగంగు పరులచే రాజ్యము పోఁగొట్టుకొని దీనుఁడై యుండఁగా మరల భీమకవి యతనిని జూచి

'వేయిగజంబు లుండఁ బదివేలతురంగము లుండ నాజిలో
రాయల గెల్చి సజ్జనగరంబునఁ బట్టము కట్టుకో వడిన్
రాయకళింగగంగుఁ గవిరాజు భయంకరమూర్తి చూడఁ డాఁ
బోయిన మీనమాసమునఁ బున్నమ పోయిన షష్ఠినాఁటికిన్'

అని యాశీర్వదించినట్లు చాటువులు కనుపట్టుచున్నవి. ఇందు 'రాయల గెల్చి' యనుటచే నారాయలే కళింగగంగును జయించియుండె నని తెలియుచున్నది. ఈరాయలు, శ్రీనాథుఁడు 'చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద' మని చెప్పిన రాయలే కావలయును. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమబిరుద మిచ్చినయాంధ్రరాయలే యితఁ డగును. ఎట్లన భీమకవి,

'ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దాక్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకటనానాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా.'

అని తెలుంగాధీశుని - అనఁగా ఆంధ్రరాయలను-గస్తూరికాదులం దెమ్మని యన్నాఁడు. శ్రీనాథుఁడు నీతెలుంగురాయలనే

అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దాక్షారామపురీవిహార వరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.'

అని కస్తూరికాదానము సేయు మన్నాఁడు. మఱియు నీకవియే 'రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు కస్తురి కేరాజుఁ బ్రస్తుతింతు' నని కస్తురి

విషయమై తెనుంగురాయ లని యున్నాఁడు. ఈ తెనుంగురాయలనే భీమన 'రా యల గెల్చి' యనియు శ్రీనాథుఁడు 'రాయలయొద్దఁ బాదుకొల్పితి'ననియుఁ గేవల రాయశబ్దముచేఁ బేర్కొనియున్నారు. దీనింబట్టి తెలుంగురాయలకాలమున భీమకవి యును శ్రీనాథుఁడు నున్నవా రని తెలియుటచేత వీ రిద్ద ఱించుమించుగా నేకకాలము వారని తెలుచున్నది. శ్రీనాథుఁడు తిక్కనాదులను బూర్వకవులుగా స్తుతించియుండుట చే నతఁడు వారలకాలమువాఁడు గాఁడనుట నిర్వివాదముగదా. కాన శ్రీనాథునికాల మువాఁడగు భీమకవియుఁ దిక్కన కిటీవలివాఁడగును. కనుక నతఁడు చాటువుచెప్పిన సాహిణిమారనయుఁ దిక్కన కిటీవలివాఁడే యగును. తిక్కన కిటీవలిసాహిణిమారు నకుఁ దిక్కనకు మును పుండినమంత్రి భాస్కరుఁ డంకితముగా రామాయణము చెప్పె ననుట యసంగతముగా నున్నది.

ఇంతవఱకును మంత్రిభాస్కరునిఁ దిక్కనకు మునుపటివానినిగా నెంచి య తనికిం గూర్చిన రామాయణకర్తృత్వమునుగూర్చి విచారముచేయుచుంటిమి. ఇప్పు డామంత్రిభాస్కరుఁడు, తిక్కన కిటీవల, మునుమూరుసంస్థానపుబుద్ధరాజుకడ మం త్రి యై రంగనాథునకుఁ బ్రతిపక్షిగా నునికిని జెప్పియుండుట విచారింతము. ఈకథ యందుఁ గృతిపతి యగు సాహిణిమారయ కొండసీమరాజు గాఁడు; గుఱ్ఱపువాఁ డయ్యెను. ఎట్లన ద్విపదరామాయణమును జేసినరంగనాథుఁడు గోన బుద్ధరాజున కు బంధుఁడు. భాస్కరుఁ డతనియాస్థానపండితుఁడు. రంగనాథుఁడు రాజాజ్ఞనుబొంది ద్విపదరామాయణమును రచింపఁబూని రచించుచుండెను. అతఁడు చాలవఱకు రామాయణమును రచించియుండఁగా, భాస్కరుఁ డసూయవలనఁ దా నతనికంటె ముందుగా గద్యపద్యాత్మకముగా రామాయణము రచించి రాజుమెచ్చు వడయ వలయు నని మల్లికార్జునాదు లగుమువ్వురసాహాయ్యముచేఁ ద్వరితముగా ముగించి యాస్థానమునకుఁ గొనిపోయెను. అప్పటికి రంగనాథుఁడు దనరామాయణమును ముగ్గించి యాస్థానమునకుఁ దెచ్చియుండెను. రా జాయిరువురవృత్తాంతము నెఱింగి రంగనాథునితట్టు కుడిచేతిని భాస్కరునితట్టెడమచేతినిజాఁచెను. భాస్కరుఁ'డది యేమి'యని యడుగఁగా, రాజు 'నేను రంగనాథునకు మును పే కుడిచేతి నమ్మితి'నననఁట. అంతట భాస్కరుఁడు కోపించుకొని 'నీవంటిపక్షపాతి కిచ్చుటకంటె నీగుఱ్ఱపువాని కిచ్చుట మే' లని పలికి కొలువు విడిచి వచ్చుచుండఁగా నారాజుగుఱ్ఱపుదళవా యి యది విని సభాద్వారమున భాస్కరునితో 'కవిసార్వభౌమా! ఆడినమాట తప్పవల' దని యడ్డపడి మ్రొక్కఁగా భాస్కరుఁడు గ్రంథాది నున్నరాజవంశవర్ణ నాదుల నెల్ల నెత్తివైచి 'సాహిణిమారా'యని ముగియునట్లొకపద్యము మొదటఁ జేర్చి దీనిని వాని కంకితముఁ జేసెనఁట. కొంద ఱీబుద్ధరాజునకు మంత్రిభాస్కరుఁడు మంత్రిగా నుండె ననియు నతఁడు రంగనాథునిచే ద్విపదరామాయణమును వ్రాయిం చుటను జూచి యీసుచేతఁ దాను రాజుతోఁ బద్యకావ్యమును వ్రాయించి తెచ్చి

యిచ్చునట్లు చెప్పి హుళక్కిభాస్కరాదులచేత దానిని జేయించినట్లును, రాజు రంగనాథునే సత్కరించినట్లును దానిపయిని దక్కినవిషయములు జరిగినట్లును జెప్పుచున్నారు. మఱికొందఱీకథయందు మంత్రిభాస్కరునిప్రసక్తియే లేక యంతయు హుళక్కిభాస్కరపరముగాఁ జెప్పుచున్నారు. మఱికొందఱు మంత్రిభాస్కరుఁడు బుద్ధరాజుకుమారుఁ డయినసాహిణిమారునికాలమందు మంత్రిగాను నాస్థానకవిగాను నుండె ననియు నితఁడే మొదట రామాయణము నంతయు నారాజునకంకితముగా రచించె ననియు, నీగ్రంథ మేకారణముననో యత్యల్పకాలమున శిథిలము కాఁగా నపుడు కృతిపతి యగుసాహిణిమారునికుమారుఁడు కుమారరుద్రదేవుఁడు తనతండ్రికాలమునుండి యాశ్రితుఁడై యున్నహుళక్కిభాస్కరునిగ్రంథము నుద్ధరింపు మనఁగా నతఁ డాసంపుటమును శోధించి యం దారణ్యకాండము తప్పఁ దక్కిన దంతయు శిథిల మగుటం జూచి యక్కాండమునం దందంద చెడినభాగములను సరిపఱచి వార్ధకమును బట్టి తక్కినకాండములను దానే రచింపఁ బూనఁజాలక మల్లికార్జునాదులసాహాయ్యమున దానిని బూరించె ననియు, నం దెవ్వరు నయోధ్యాకాండమును బూరించుటకుఁ బూనకుండుటను జూచి రాజయిన కుమారరుద్రదేవుఁడు తానే దానిని సంగ్రహముగా రచించె ననియుఁ జెప్పెదరు. పూర్వము రూపింపఁబడినసాహిణిమారాదులయు మంత్రిభాస్కరాదులయు కాలములను బట్టి చూడఁగా నివి యన్నియుఁ గొన్ని కల్పితములును గొన్ని నిరాధారములు నగుట తెలియుచున్నది.

ఆరణ్యకాండము తక్కినకాండములవలెఁ గాక యాశ్వాసములుగా విభక్తమగుటంబట్టి యిది తక్కినకాండములకవులచేతం గాక వేఱుకవిచే రచిత మగు నందురు. మఱియు నారణ్యకాండాంత్యపద్యములును తిక్కనయుత్తరరామాయణమునందలియాశ్వాసాంతపద్యములును నొక్కరూపై యుండుటచే నారణ్యకాండకర్తకును దిక్కనకును గొంతసంబంధము సూచిత మగుచున్న దందురు. ఇట్లాశ్వాసవిభజనమును బట్టి యుద్ధకాండభాస్కరుఁడు గాక మఱియొక భాస్కరుఁడనియు నాశ్వాసాంతపద్యములనుబట్టి యాభాస్కరుఁడు తిక్కనతాత యగు మంత్రిభాస్కరుఁడే యగు ననియుఁ జెప్పఁబడుచున్నది. హుళక్కిభాస్కరుఁడు యుద్ధకాండముకడవఱకును రచింపక నడుమనే విడుచుటచే దాని నాశ్వాసములుగా విభజించుట కయితిలేదు. అయిన నతఁడు రచించినంతవఱకు ౧౧౩౩ పద్యము లుండుటచే నాశ్వాసవిభాగము చేయఁగూడు ననవచ్చును. మఱి యాశ్వాసాంతపద్యములగమనికం బట్టి యారణ్యకాండభాస్కరుని తిక్కనకుఁ దాతఁగాఁ జేయుటయు యుక్తమైనం గావచ్చును. కాని యావిషయములను, మంత్రిభాస్కరుఁడు రామాయణము రచించె ననుటకుఁ గవిప్రస్తావాద్యుపపత్తి లేమింజేసియు, నతఁడు సాహిణిమారునికాలమువాఁడు గామింజేసియు, నంగీకరింప వలను గాకున్నది. వీనినెల్లఁ జూడఁగా నాశ్వా

సాంతపద్యములను మంత్రిభాస్కరుని ననుకరించి తిక్కన వ్రాసె ననుటకంటెc దిక్కన ననుసరించి హుళక్కిభాస్కరుcడు రచించె ననుట మఱింతయుపపన్నముగా నున్నది.

ఇంతవఱకును నీరామాయణమందు మంత్రిభాస్కరునిరచనము లే దని నిరూపిత మయ్యె. ఇcక హుళక్కిభాస్కరుcడే దీనిని రచించినవాcడేని యన్నికాండములను దానే రచింపక యొక రెండుకాండములే రచించుటకును దక్కినవి మల్లికార్జునాదులు రచించుటకును నిట్లు నలుగురుకవులచే రచితమై యుండcగా నిది భాస్కరునిపేరనే వెలయుటకును గారణములు విమర్శింపవలసియున్నది. అందు భాస్కరుcడు వృద్ధుc డగుటచేc దానే యన్నికాండములను రచింపcజాలక తక్కినపుత్రమిత్రాదులం గొని రచించె ననియుc బ్రధానుం డతcడే యగుటంజేసి యతనిపేర నీగ్రంథము వెలసె ననియుc గొందఱును, నతcడు సపుత్రమిత్రచ్ఛాత్రముగాc దాను రచింపcగోరి యట్లు రచించినాc డనియు, రంగనాథరామాయణమునకును దీనికిని నెఱ్ఱనరామాయణమునకును దీనికిని భేదము దెలుపుటకై దీనికవులలో ముఖ్యుండగుభాస్కరునిపేర నిది పిలువంబడె ననియుc గొందఱును, జెప్పెదరు. మల్లికార్జునుcడు 'భాస్కరసత్కవిపుత్ర' యన్నట్లు భాస్కరునిపుత్త్రుం డై యతనియాదేశముచొప్పున బాలకాండాదుల రచించినవాcడేని, తండ్రివలెనే కృతిపతి యగుమారనను బాలకాండముతొలుత నేల సంబోధింపcడయ్యె? మఱి బాలకాండముతుదను శివునే సంబోధించి యున్నాcడు గాని మారనను గాదు. బాలకాండమునc దొలుతc గాని తుదను గాని బొత్తిగా సాహిణిమారునిప్రస్తావమే లేదు. మఱి యతcడు రచించినకిష్కింధాకాండమందో తొలుత

క. 'శ్రీరమణీ ప్రియరమణీ, శ్రీరమ్యోరుకుచకుంభ సేవాలోల
స్ఫారదృగాశ్రయ నేత్రాం,భోగసహ పూజాప్రహృష్ట పురుషవిశిష్టా'

యని యున్నది. ఇది విష్ణువునకుcగాని వలయునేని విష్ణుభక్తుc డగునొకపురుషవరునికిcగాని సంబోధనము గావచ్చును. కాన యిందుc గంఠోక్తముగా సాహిణిమారునికి సంబోధనము లేదు. ఈకాండముతుదినో శివసంబోధన మున్నది. తొలుతటిసంబోధనము విష్ణుపరముగాను తుదిసంబోధనము శివపరముగాను నుండుట మిక్కిలియుc జింత్యము. మఱియు నిందుc దుదిని

'లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి...
పాటింపందగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ'

అని సాహిణిమారునిసంబోధనముగూడcc వ్రాతప్రతులందుc జెక్కుట లేదు; అచ్చుప్రతులందు శివసంబోధనముతోడ నీమారనసంబోధన సైత మున్నది. ఈరెండుసంబోధనములను దుది నుంచుట క్రమ మెట్లు? ఇతcడు రచించిన సుందరకాండముతొలుతనో, బాలకాండకిష్కింధాకాండముల తొలుతను లేని

సాహిణిమారునిసంబోధన మున్నది. ఇందులకుఁ దుదనో కేవలశివసంబోధనమే కానిపించుచున్నది. వీని నెల్లంబట్టి చూడఁగా నితఁడు రచించినమూఁడుకాండములతుదలందును దప్పక శివసంబోధనము లుండుటచే నివి యితఁడు రచించినవియే యగు ననియు, వానితొలుత నొక్కట బొత్తిగా లేకయు నొక్కట సందిగ్ధముగాను మఱొక్కట మాత్రము గలిగియు నున్న మారనసంబోధనము లిటీవల నెవరో తక్కినకాండములం జూచి కల్పించి చేర్చి రనియుఁ దోఁచుచున్నది. కావుననే కిష్కింధాకాండముతుదమాత్ర మున్న 'లాటీచందన' యనుమారనసంబోధనమును గల్పితమే కావలయును. అట్లు కానిచో నట్టిది తక్కినకాండములతుదలందును శివసంబోధనముతోఁగూడ నేల చెప్పఁబడకున్నది? ఆపద్యమును వ్రాఁతప్రతులం బెక్కింట చూపట్టకుండుటయు నది కవిరచితము గాదనుట కొకనిదర్శనముగా నున్నది. మఱియు సుందరకాండముతొలుత నున్న మారనసంబోధనము శివభక్తుఁ డగుమల్లికార్జునుఁడే రచించినదేని యతఁడు సాహిణిమారుని శివభక్తునిఁగా సంబోధించియుండునుగాని విష్ణుభక్తునిఁగా సంబోధింపఁడు. అందు విష్ణుభక్తుఁడుగానే యతఁడు సంబోధింపఁబడుటయు 'హరిచరణసరోజారాధ్యుఁ' డని యారణ్యకాండమం దుండుటను జూచి యట్లితరులచేఁ గావింపఁబడె నని యూహింప నగుచున్నది. మల్లికార్జునుఁడే యారణ్యకాండమందలియాసంబోధనమును జూచి యట్లే సుందరకాండమందును సంబోధనమును నిబంధించి యుండవచ్చు నన్నచోఁ దన తక్కినకాండములతొలుత సాహిణిమారనసంబోధనమును మానుటకే తెగించిన యతఁడు సుందరకాండమున విష్ణుభక్తునిని శివభక్తునిఁగా మార్చుట మాత్రమునకుఁ జాలఁడా? ఇట్లు భాస్కరుని దయినయీరామాయణమునందుఁ జాల భాగము రచించియుండుటఁబట్టియు, గద్యమున భాస్కరునిపుత్త్రుఁ డని చెప్పికొని యుండుటఁ బట్టియు, మల్లికార్జునుఁడు భాస్కరునిపుత్త్రుఁ[illegible]సునం గావచ్చును గాని సాహిణిమారునిసంబోధనము లేనందున నతఁడు దీనిని సాహిణికాలమున రచించె ననుట సందిగ్ధముగా నున్నది. అయోధ్యాకాండమును రచించినకుమారరుద్రదేవుఁడు కాండముతొలుతను దుదను సాహిణిమారునే సంబోధించి యున్నాఁడు. మఱి యితఁడు 'బుద్ధయకుమార సాహిణిమారా' 'కాచమాంబాకుమారా' యనుటచే సాహిణిమారుఁడు బుద్ధయకును గాచమాంబకును బుత్త్రుఁ డని తెలియుచున్నది. గద్యమున 'మారయకుమార కుమారరుద్రదేవ' అనుటచే నితని నా సాహిణిమారునికుమారుఁ డందురు. దీనింబట్టి బుద్ధరాజుకుమారుఁడు సాహిణిమారుఁ డతనికుమారుఁడు కుమారరుద్రదేవుఁ డని చెప్పఁబడుచున్నది. ఈకుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండమును రచించుటకు భాస్కరుని శిష్యుఁ డగుట కారణ మని కొందఱును, దాని నెవ్వరును రచింపకుండఁగాఁ దానే రచించె నని కొందఱును, జెప్పెదరు. ఇం దేది నిజమో తెలియరాదు. సాహిణిమా

రునితండ్రి యగుబుద్ధయ రంగనాథరామాయణకర్తగా నున్నగోనబుద్ధరా జం దురు. అప్పు డుత్తరరామాయణమును ద్విపదగా రచించిన యితనికొడుకులు విఠ్ఠల రాజును గాచవిభుఁడును సాహిణికిఁ దోఁబుట్టువులు కావలయును. సాహిణి తన తండ్రియుఁ దోఁబుట్టువులును రామాయణమును రచించియుండఁగాఁ దా నేల యీ రామాయణమును రచింపింపవలసెనో తెలియరాకున్నది. దీనినిబట్టి చూడఁగా 'మారయకుమార' యనుచోఁ గల కుమారరుద్రుతండ్రి మారయ, సాహిణిమారుఁ డగుట సందిగ్ధముగా నున్నది. యుద్ధకాండముకడమను బూరించినయయ్యలార్యుఁడు తుదను శివునే సంబోధించియున్నాఁడు. ఇతఁడును దాను బూరించిన యుద్ధకాండములోపలుత సాహిణిమారునిసంబోధన ముండియుఁ, దాను దుదను శివునే సంబోధించుటంబట్టియు ౧౧౩౮ పద్యముకడ 'ఈఘట్టమువఱకు హుళక్కిభాస్కర కవివిరచితము. ఇది మొదలు వేదగిరి నాయనింగారిప్రేరణమున నయ్యలార్యుఁడు రచించినది' అని వ్రాఁతప్రతులం దెల్ల నుండుటంబట్టియు, నతఁడు సాహిణిమారన కాలమువాఁడు గాఁ డని తెలియుచున్నది. మఱియు నితనిగద్యమున 'శ్రీశాకల్య మల్లకవి రవిరాహు నృసింహావరజాప్పలార్య వరసుత' యని యున్నది; కాని భాస్కరమిత్త్రుఁడని కానిపింపదు. మఱి వేదగిరినాయనిప్రేరణముననే యితఁ డీగ్రంథమును రచించెనుగాని భాస్కరకవితోడిమైత్రింబట్టి కాదు; కాన యితఁడు భాస్కరమిత్త్రుండనుటకు నుపపత్తిలేదు. ఇవియన్నియు భావిపరిశోధనమునంగాని యిప్పుడు తెల్లము గాకున్నది. కాన యిదమిత్థ మ్మని నిర్ణయింప నింతకు నయితి లేదు.

ఆరణ్యకాండమున 'శ్రీరామాకుచయుగళీ హారిప్రోల్లసిత వక్షః హరిచరణ' యని యున్నది. ఇందు, వక్షశ్శబ్ద మకారాదివలె సమాసమున నుంపఁబడియున్నది. మఱియు 'హరివాకవేధాదులకు' (౨. ఆశ్వా. 33. ప.) ననియు వేధశ్శబ్దము నకారాదివలెనే సమాసమునఁ జూపట్టుచున్నది. ఏతద్దోషసామ్యమునుబట్టి కృతిపతిసంబోధనకర్తయే కాండమునకుఁగూడ కర్త యగు నని నిర్ణయింపఁ దగియున్నది. ఇవియన్నియు నట్లుండ, నారణ్యకాండమున వ్రాఁతప్రతులఁ జూపట్టుపాఠము మిక్కిలియు సంగ్రహముగా నుండ నచ్చుప్రతులందలిపాఠ మ దేమి కారణమో యంతకంటెఁ జాల నధికముగాను బెక్కుచోట్ల మిక్కిలియు భిన్నముగాను జూపట్టుచున్నది. కొన్నిచోట్ల వ్రాఁతప్రతులయొక్కపద్యమునకు నచ్చుప్రతులం బెక్కుపద్యములు చూపట్టుచున్నవి. అచ్చుప్రతులం గానిపించునధికపద్యములుగాని భిన్నపద్యములుగాని మాకు దొరకినన్ని వ్రాఁతప్రతులందును బ్రాచ్యలిఖితభండారమందలి ప్రతులందున్ను గానిపింపవు. ఈగ్రంథమును దొలుత ముద్రణము గావించినకరాలపాటి రంగయ్యగారు మంచికవి యగుటచే సంగృహీతములుగాను గ్రంథపాతములుగాను నున్నయెడల సొంతకవనముచేఁ బెంచియుఁ బూరించియు నుందురేమో యని సందేహము గలుగుచున్నది. మంత్రిభాస్కరునిదా హుళక్కిభాస్కరునిదా

యని వివాదగ్రస్తమై యున్నయీయారణ్యకాండపుఁగవనము మొదలే చాల భాగము మఱియొకకవిదిగాఁ దోఁచుచున్నది.

ఒక యారణ్యకాండమునసే కాదు; అయోధ్యాకాండముతుదను గూడ ౨౨౩ వ పద్యము మొదలుకొని ౩౨౮ వ పద్యమువఱకు నచ్చుప్రతులం గలపాఠము వ్రాతప్రతులం గానరాదు. ఆపాఠమున కెల్ల మాఱుగా వ్రాతప్రతులందు,

సీ. అంత నక్కడ రాముఁ డచటికి భరతుండు, క్రమ్మఱ వచ్చి సామ్రాజ్యమునకుఁ
దన్ను రమ్మనుచుఁ బ్రార్థన సేయునో యని, చింతించి యాత్మలోఁ జిత్రకూట
మున నలమునిజనంబుల వీడుకొని మార్గ, తరువీక్షణంబునఁ గరము వేడ్క
దనర సీతాసుమిత్రాపుత్రసహితుఁ డై, దండకావనమహీస్థలికి నరిగె
ననఁగ నీయయోధ్యాకాండ మభిమతముగ, వినిన వ్రాసినఁ జదివిన విస్తరించి
చెప్పినను వారలకు సుఖసిద్ధి యొసఁగు, సంపదాయురారోగ్యముల్ సంభవించు.

నని యొక్కసీసపద్యమే యున్నది. ఇందుఁ గలకవులకవనమంతయు రసవంతమును మధురమునుగానే యున్నది. అందు భాస్కరునికవనము ప్రౌఢము. మల్లికార్జునుని కవనము వీరభయానకరసములం దంగఱకవితకంటె నొకవన్నె యెక్కుడనవచ్చు. కవిత్రయముచే నవ్యయములుగాఁ బ్రయుక్తము లగు 'అట ఇట ఎట' యనునవి యిందు విశేష్యములుగాఁ జూపట్టుచున్నవి. * అయ్యలార్యునికవనమున ఋకారమున ఋత్వముతోను దన్మిత్రములతోను యతిమైత్రి గానిపించెడిని.

ఈ భాస్కరుని హుళక్కి భాస్కరుఁ డందురు. ఇటీవల హుళిక్కి భాస్కరుఁడని గ్రంథములం దితని వాడుచున్నను బ్రాఁతవ్రాతప్రతులందు హుళక్కి యనియే యున్నది. ఈ యుపపదము వచ్చినవిధ మెట్లన, భాస్కరునింటిపేరు మొదట 'మంగళపల్లి' యఁట. ఇది యిట్లుండ నొకనాఁ డితని కాశ్రయభూతుఁ డయినరాజు రత్నఖచిత మగుబంగారుపళ్లెరమున నమూల్యాభరణాదికలితం బగుకర్పూరతాంబూలము నిడి యెక్కుడురసవంతముగాఁ గవిత్వము చెప్పుకవికి నమూల్యమయిన యావిడియము నిచ్చెద నని చెప్పినట్లును, భాస్కరుఁ డందఱికన్న నతిశయముగాఁ గవిత్వమును జెప్పి యాయగ్రతాంబూలము నందినట్లును, దానం జేసి భాస్కరునికిని దర్వాతఁ దత్సంతతివారికిని హుళక్కి యనునుపపదము గలిగె ననియు, నిప్పటికిని దద్వంశీయులచేఁ జెప్పఁబడుచున్నదఁట. ఇది నిజముగా నుండవచ్చును. హుళక్కి యనఁగాఁ గన్నడమునఁ దాంబూల మని యర్థము. సామాన్యముగాఁ దెనుఁగుసబిరుదులందుఁ గన్నడపదములను గౌరవార్థ ముంచుకొనుట చూపట్టుచున్నది. ఇందలితప్పులొప్పులను దెలుప నెల్లరును బ్రార్థితులు.

తం. శే.

---

* చూడు 575 పుట.

# విషయసూచిక.

## బాలకాండము.



## అయోధ్యాకాండము.

## ఆరణ్యకాండము – ప్రథమాశ్వాసము.



## ఆరణ్యకాండము – ద్వితీయాశ్వాసము.

## కిష్కింధాకాండము.

## సుందరకాండము.

## యుద్ధకాండము.

# శ్రీరామస్తవము.

---

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామణ్డపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రే వాచయతి ప్రభఞ్జనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.

రామాయ రామభద్రాయ రామచన్ద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

శ్రీ రస్తు.

# భాస్కర రామాయణము.



## బాలకాండము.



శ్రీరఘురామచరిత్రము

నారదుఁ డెఱిఁగించుటయును § నలువయనుజ్ఞన్

శారదకృప వాల్మీకి యు

దారత రామాయణముగఁ § దా రచియించెన్. 1

క. రామునిశుభచరితంబును, రామాయణముగ రచించి § [1]ప్రాచేతసుకై
ప్రేమ నెఱిఁగించి తగ నిజ,ధామమునకు నారదుం డు§దారతఁ జనియెన్. 2

వ. తదనంతరంబ. 3

క. వాల్మీకిభరద్వాజయు, తు ల్యాఁ గ గంగ కనతి§దూరమున లతా
గుల్మాంచితతీరయు ని, ష్కల్మషజలయు నగుతమస§కడ కేఁగి తగన్. 4

వ. వాల్మీకి తనశిష్యుం డగుభరద్వాజునిచేతివల్కలంబులు పుచ్చుకొని ధరియించి
యాపుణ్యవాహిని నవగాహంబు సేసి వెడలి నిలువంబడు నెడ. 5

క. అంచితగతిఁ దత్తటమునఁ, గ్రౌంచంబులు రెండు లీలఁ § గ్రాలుచు నుండం
బొంచి యొకశబరుఁ డం దొక, క్రౌంచముఁ బడ నడిచె ర§క్తకణములు దొరఁగన్.

క. శిరమున రక్తము వెడలఁగఁ, బొరలెడుతనవిభునిఁ జూచి § పొడమినవగతోఁ
బగుపధ్వని వాపోవుచుఁ, గరము విషాదించు క్రౌంచిఁ § గనుఁగొని కరుణన్. 7

వ. కటకటంబడి వాల్మీకి యధికరోషసంఘటితకుటిలభ్రుకుటి యగుచు నిషాదుం
గనుంగొని. 8

ఉ. ఓరి మహోగ్రపాతకుఁడ § యోరినిషాదుఁడ క్రౌంచయుగ్మ మిం
పారఁగఁ గాముకేలిమెయి § నాడఁగ నం దొకపక్షి నీల్గ ని
ష్కారణ మేల చంపి తటు § గావున నీవును వేగ చావు పో
రోరిదురాత్మ యంచుఁ గడు§నుగ్రత నమ్ముని పల్కెఁ బల్కినన్. 9

---

1 ప్రాచేతసునకున్.

క. ఆకరుణానిధి యగువా, ల్మీకులశాపాక్షరములు । మితసమవర్ణ
శ్రీకరపాదచతుష్క, శ్లోకం బయి జగతిఁ బరఁగె । సుశ్లోకం బై. 10

వ. అంత నమ్ముని వెఱఁగందుచుఁ దనశిష్యు భరద్వాజుం జూచి యోతపోధన యి ట్లే
నలిగి నిషాదు శపియించినరోషాక్షరంబులు సమవర్ణచతుష్పాదశ్లోకం బయ్యె నని
పలుకుచు నభిషేకంబుసేసి యుచితానుష్ఠానంబులు నాహ్నికవిధులు నాచరించి.

క. తనవెనుక భరద్వాజుఁడు, దనరఁగ జలపూర్ణకలశ । ధరుఁ డయి యేతే
ర నిజాశ్రమమున కొనరఁగఁ, జని తగఁ గూర్చుండి యోగ । సమ్మితబుద్ధిన్. 12

క. ధ్యానంబు సేయునెడఁ జతు, రాననుఁ డేతేర లేచి । ప్రాంజలి యయి స
మ్మానముతోడుత మ్రొక్కుచు, నానావిధపూజ లిచ్చి । నలినజుచేతన్. 13

క. అనుమతుఁ డయి యుచితాసన,మున నుండఁ బితామహుండు । ముదితాత్ముం డై
కనుఁగవలను గారుణ్యం, బెనయఁగ వాల్మీకిఁ జూచి । యి ట్లని పలికెన్. 14

ఉ. పూని సమాధియోగయుత । బుద్ధిఁ దలంపఁగ నీకు నెమ్మెయిన్
మానుగ రామలక్ష్మణుల । మానితవిక్రమసచ్చరిత్రముల్
జానకిపుణ్యశీలము ని । శాచరనాయకయాతుధానసం
తానరహస్యబాహ్యచరి । తంబులు సర్వము గాననయ్యెడున్. 15

ఉ. జానుగ నీముఖాబ్జమున । శారద యున్నది నాయనుజ్ఞ వి
జ్ఞానముతోడ మున్ను సుర । సంయమి చెప్పినవాక్యపద్ధతిన్
సూనృతభాషణార్థముల । శ్లోకనిబద్ధముగాఁ గవిత్వసు
శ్రీ నొగి విస్తరించి తగఁ । జెప్పుము రామకథాప్రపంచమున్. 16

క. భూమిన్ నీవు రచించిన, రామాయణ మావసుంధ । రాదిక్కరిగం
గామకరాకరగిరిరు,ద్ధామసుధాధామతార । కం బయి వెలయున్. 17

వ. అని పలికి బ్రహ్మ యంతర్హితుం డయిన నరు దందుచు నమ్మునియుఁ బూర్వ
శ్లోకంబు మనఃప్రేరితం బయిన. 18

శ్లోకము॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః।
య త్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్॥

క. అని యని యాసుశ్లోకం, బనుమోదించుచుఁ బ్రవీణు । లయి పలుమాఱుం
దనశిష్యులు చదువంగా, మనమున నెంతయుఁ బ్రమోద । మగ్నుం డగుచున్. 19

క. ప్రేమన్ వాల్మీకిముని,గ్రామణి దనశిష్యగణముఁ । గనుఁగొనియింకన్
రామాయణకావ్యం బభి,రామముగా శ్లోకములను । రచియింతుఁ దగన్. 20

వ. అని పలికి జలోపస్పర్శంబుఁ జేసి ప్రాచీనాగ్రంబు లయినదర్భలపయిం బద్మాసనా
సీనుండును ముకుళితకరకమలుండును నిమీలితనయనుండును నయి పరమయో
గధ్యానంబు సేయం దాఁ జెప్పం బూనినరామాయణప్రపంచం బంతయుం గరత
లామలకంబుగాఁ గానంబడిన. 21

రామునిజన్మంబు రమణీయశీలంబు, కౌశికాగమనంబు కార్ముకంబు
చేవఁ ద్రుంచుటయును సీతావివాహంబు, భార్గవరఘురామభాషణములు
రామాభిషేకంబు రాజ్యవిఘాతంబు, రాముప్రవాసంబు ప్రజలవగపు
దశరథుశోకంబు ధరణీశుమరణంబుఁ, దనర భరద్వాజుదర్శనంబు
చిత్రకూటప్రవేశంబు సేయుటయును
భరతుఁ డేతెంచుటయు ధాత్రీవరుఁడు దెగుట
విని జలక్రియచేతయు ననుజు భరతు
మగుడఁ బుచ్చుటయును నంత మనుజవిభుఁడు. 22

మఱియు దండకారణ్యాగమనంబును విరాధువధమును శరభంగుదర్శనంబును సుతీక్ష్ణసమాగమంబును వనసూయావలోకనంబును నంగరాగార్పణంబును శూర్పణఖావివాదంబును జుప్పనాక విరూపినిం జేయుటయును ఖరదూషణత్రిశిరుల మరణంబును రావణురాకయును మారీచువధమును సీతాహరణంబును రామువిలాపంబునుజటాయువధంబును గబంధుదర్శనంబును బంపావలోకనంబును ఋశ్యమూకగమనంబును సుగ్రీవసమాగమంబును సుగ్రీవసఖ్యంబును వాలిసుగ్రీవవిగ్రహంబును వాలిప్రమథనంబును సుగ్రీవుపట్టంబును దారావిలాపంబును వర్షాకాలనివాసంబును రామునికోపంబును గపిబలంబులం గూర్చుటయును సీతాన్వేషణంబు సేయఁ గపినాయకుల దిక్కులకుం బుచ్చుటయును నంగుళీయకదానంబును గపులప్రాయోపవేశంబును సంపాతిం గాంచుటయును సముద్రలంఘనంబును మైనాకదర్శనంబును సింహికం గనుటయు [1]సువేలాచలదర్శనంబును లంకాప్రవేశంబును లంకినీదర్శనంబును పానభూమిగమనంబును నవరోధదర్శనంబును నశోకవనికాయానంబును సీతాదర్శనంబును రావణదర్శనంబును రామాదులవృత్తాంతంబు సీతకెఱింగించుటయును సీత యానవా లిచ్చుటయును వనభంగంబును రాక్షసులం దోలుటయును గింకరనిబర్హణంబు నక్షవధమును వాయుసూనుండు పట్టువడుటయు రావణుదర్శనంబును లంకాదహనంబును [2]మగుడ మహోదధి దాఁటి మధువనంబుసొచ్చుటయు రాఘవదర్శనంబును రామునకు మణి యిచ్చుటయును సముద్రసమాగమంబును సేతుబంధనంబును [3]విభీషణునాగమనంబును రాక్షసవధోపాయంబుఁ జింతించుటయును గుంభకర్ణమేఘనాదనిధనంబును రావణయుద్ధంబును దన్మరణంబును సీతాప్రాప్తియును విభీషణాభిషేకంబును బుష్పకాధిరోహణంబును నయోధ్యకు మరలి వచ్చుటయును భరతసమాగమంబును రామాభిషేకంబును సైన్యంబుల వీడుకొలుపుటయును రాముని రాజ్యంబును నుత్తరకాండకథయునుం గూడ నేడుకాండంబులు నేనూఱుసర్గలు నిరువది

---

1 లంకావలయదర్శనంబును. 2 మగుడ సీతం గాంచుట యును మహోదధి. 3 విభీషణసంగమంబును.

నాలుగు వేలశ్లోకంబులునుగా వాల్మీకిమునీంద్రుండు రామాయణమహాకావ్యంబు
సెప్పెం దత్కథాభ్యుదయం బెట్టు లనిన. 23

—❀ అయోధ్యాపురవర్ణనము. ❀—

క. సరయువుతీరంబున బహు,తరధనధాన్యములు గలిగి ధరణికిఁ దొడ వై
పరఁగెడుకోసలదేశం, బరు దారఁగ మెఱసి యుండు నద్దేశమునన్. 24

క. అమరఁ ద్రియోజనవిస్తీ,ర్ణము దగఁ బండ్రెండుయోజనంబులనిడు పై
కొమరారునయోధ్యానగ,రము మును నిర్మించె మనువు ప్రాభవ మొప్పన్.

ఉ. దానులు రాజ్యవర్ధనులు దత్త్వవిచారు లుదారు లింగిత
జ్ఞానులు మంత్రకోవిదులు సత్యవచస్కులు విద్విషత్తమో
భానులు ధీయుతుల్ చతురుపాయసమస్థులు రాజకార్యసం
ధానపరాయణుల్ వినయతత్పరు లాపురి మంత్రు లెంతయున్. 26

క. స్వామిహితశక్తిమంతులు, ధీమంతులు చండధామదీధితిమంతుల్
భీమాహవభుజవిజయ, శ్రీమత్కృతిమంతు లాపురిని సామంతుల్. 27

చ. దురితహరుల్ స్వకర్మనిరతుల్ విజితేంద్రియు లంచితవ్రతుల్
సరసులు సత్కళావిదులు శాస్త్రమతజ్ఞులు సద్గుణాకరుల్
సురుచిరపుణ్య లవ్యయులు సూనృతవాదులు చిత్ప్రదీపని
స్తరితబృహత్తముల్ సుజనసత్తము [1]లప్పురి భూసురోత్తముల్. 28

చ. తరళితదంతకాంతిసము దంచితబృంహితనీలదేహముల్
పరఁగఁ దటిల్లతాస్తనిత భాసురవారిధరంబులో యనం
బోరిఁబోరి నేనుఁగుల్ దిరిగి పుష్కరశీకరదానధార ల
ప్పురమునఁ జెల్లుగాఁ గురియు భూతల మంతయుఁ బంకిలంబుగన్. 29

చ. జవమున భంజళిన్ మురళిఁ జౌకమునన్ నడ [2]నైదుధారలన్
వివిధవిచిత్రవల్గనవివేకములన్ బొలపంబునన్ శుభ
ధ్రువముల దూరభావముల రూపబలంబుల రూఢి కెక్కి యా
హవజయశీలముల్ గలుగు నశ్వము లెన్నఁగఁ బెక్కు లప్పురిన్. 30

చ. అలఘుతరప్రభావమున నంతకుఁ దేజమునన్ దివాకరున్
బలమున శేషునిం గడిమి భార్గవరాముని వైభవంబునన్
బలరిపు సాటిసేయఁ దగి బాహుబలార్జితశత్రుమండలో
జ్జ్వలధనవంతు లై మహిమ [3]వాలుదు రప్పురి రాజసత్తముల్. 31

చ. కులగిరు లెత్తి నైన వడిఁ గుంభినిఁ గ్రుంగఁగ ద్రొక్క నైన వా
ర్థులఁ గలఁపంగ నైన జము దుప్పలుదూలఁగఁ దోల నైన ది

1. లందుల భూసురోత్తముల్. 2 నడభేరిధారలన్. 3 వ్రాలుదు రంగులరాజవర్గముల్.

గ్వలయమదేభకుంభములు వ్రక్కలు సేయఁగనైనఁ జాలుదో
ర్బలముల గెల్తు రాజిఁ బరిపంథుల నందులవీరసద్భటుల్. 32

చ. మణిఘృణివిస్ఫురత్కనకమండితకుండలహస్తమస్తభూ
షణములుఁ దారహారములు సారసుగంధవిలేపనంబులుం
బ్రణుతదుకూలచేలములుఁ బ్రాభవశోభితపుష్పదామముల్
గుణగణదానకీర్తులును [1]గోరిక మీఱిననారె యప్పురిన్. 33

చ. పదములు చారుపద్మములు భాసురకంఠము లొప్పుశంఖముల్
రదములు కుందముల్ కచభరంబులు నీలము లట్లు గాన స
మ్మదమునఁ గాంతలై నిధులు మానుగ నున్నవి యైన నాపురిన్
సుదతులతుచ్ఛమధ్యములఁ జొచ్చినలేములు వాయ వెన్నఁడున్. 34

క. అని యెన్న లికుచకుచములు, ఘనకచములు మెడలుఁ దొడలుఁ గానులు మేనుల్
పెను పగుకన్నులు వెన్నులుఁ, దనరఁగ నొప్పుదురు లీలఁ గస్తురికాంతల్. 35

వ. మఱియు నప్పురవరంబు మృగమదమలయజమిళితజలంబులం గలయంపు లిచ్చి వివిధమౌక్తికతతులుం గుసుమవిసరంబులుం గలయ నెఱపినరాజమార్గంబులును, మణిఖచితకవాటతోరణంబులును, గనకమాణిక్యముఖ్యసకలవస్తుసంపూర్ణాపణంబులును, విచిత్రాతపత్రధ్వజపతాకలును, గరవాలభిండివాలశూలాయసదండకోదండబాణతూణప్రముఖనిఖిలాయుధంబులును, నంబరతలంబునం గ్రాలుఖేచరవిమానంబులో యనం బొలుచునాభీలాట్టాలకజాలంబులును, రసాతలగతపరిఖాజాలంబులును, యంత్రవ్రాతంబులును, శుభాకారసహకారవనాభిరామారామంబులును, ననల్పశిల్పికల్పితాకల్పభాసురగోపురంబులును, నుత్తాలవిశాలసాలంబులును, నానారత్నప్రభావిపులవప్రంబులును, నైరావతాంజనకుముదవామనసార్వభౌమపుష్పదంత పుండరీకవంశజ మందమృగ భద్రమదమత్తసామజంబులును, గాంభోజవనాయుజపారసీకబాహ్లీకసముత్పన్న సముత్తుంగతురంగంబులును, ననేకవర్ణ పుణ్యాగోగణంబులును, బరరాష్ట్రాయాతసముష్ట్రోష్ట్రంబులును, గణికాగణనృత్యసంచారాంచితకాంచనాగారంబులును, బహువిచిత్రకర్మనిర్మితధర్మహర్మ్యంబులును, గగనోల్లేఖిశిఖరసౌధప్రాసాదంబులును, నానాదేశవ్యవహారులును, శాలితండులంబులును, నిక్షుకాండంబులును, రసవదుదకంబును, ఘంటాకాహళిశంఖదుందుభిపణవడిండిమాది బహువాద్యభీషణఘోషంబులును, సూతవందిమాగధ నటచేటకపాఠకవాంశికవైణికవైణవికమౌరజికవైతాళికాదివిద్యలవారును, సకలగాణిక్యమాణిక్యవిలసితవిమానగృహంబులును గలిగి; జారులుఁ జోరులు ననాచారులు నజ్ఞులు నకృతజ్ఞులు నయోగ్యులు నదానులు ననభిమానులు నభాగ్యులు ననారోగ్యులు నసూయకులు నయోజకులు నన్నృత

1 గోరికఁ బూనినవారు కే రటన్.

భాషులు నవద్యాభిలాషులు నమంగళులు ననధీతులు ననధ్యాపకులు నల్పజీవులు నవగుణులు నవలక్షణులు నవిచక్షణులు లేక; పగలు వగలు జగడంబులు తిరిపంబు లీతిబాధలు దురితంబులు లేక; గానవిద్యలయంద మూర్ఛనలు, వల్మీకంబులయంద ద్విజిహ్వాసంచారంబు, లానందంబులయంద బాష్పోద్గమంబులు, ఛత్రచామరంబులయంద కనకదండంబులు, తరుణులయంద బంధంబులు, ననంగపీడలయంద యధరపానంబులు, నిద్రలయంద యజ్ఞానంబులు, కామినీఘనకుచంబులయంద కఠినత్వంబులు, నయనంబులయంద చాపలంబులు, చూపులయంద పక్షపాతంబులు, బొమలయంద వక్రతలు, రదనంబులయంద దంశితంబులు, గతులయంద జాడ్యంబులు, ప్రణయంబులయంద విప్రయోగంబులు, ఘననితంబంబులయంద మేరగడచుటలు, మధ్యంబులయంద యధికక్షామదశలు, గాని యెగ్గు లొండెడ లేక; సదాశివుని దేహంబునుంబోలె దుర్గావరణభూషితం బయి, గగనతలంబునుంబోలె వినుతబుధకవిరాజమిత్రపరివృతం బయి, భానుమండలంబునుంబోలెఁ బ్రభాభాసురం బయి, యలకాపురంబునుంబోలె నిధానధనేశాశ్రితం బయి, లంకాపురంబునుంబోలెఁ బుణ్యాజనసేవితం బయి, మదనతూణీరంబునుంబోలె నసమాయుధభరితం బయి, రత్నాకరం బయ్యును భంగరహితం బయి, విబుధాప్సరస్సంతానహరిచందననిలయం బయ్యును ధరణీతలవిలసితం బయి, యినకులీనపాలితం బయ్యును భీమవిజయధర్మరాజసుయోధనయువరాజవిరాజితం బయి, పద్మాకరం బయ్యును విషపంకవర్జితం బయి, సకలగుణాకరం బయి వెలయు. 36

మ. జనలోకైకమహారథుండు ద్విజరక్షాదక్షుఁ డాజిం ద్రిలో
చనుఁ డుద్యచ్చతురంగసైన్యుఁడును భాస్వద్రూపపంచాస్యుఁ డ
న్యనృపక్రౌంచషడాననుండు ఘనసత్త్వాశ్వాన్వయుం డష్టమం
త్రినవద్రవ్యనిధీశుఁ డై దశరథాధీశుండు పెం పొందుచున్. 37

క. శశిసదృశుం డసదృశతర, దశదిక్కీర్తియశుండు ధరణీరక్షా
కుశలత జనలోకము దన, వశముగ నానగర మేలె వైభవ మొప్పన్. 38

దశరథుం డశ్వమేధయాగము సేయఁ బూనుట.

వ. ఇట్లయోధ్య సకలజనులుం బుత్రమిత్రకళత్రాదులతోడ ధనధాన్యసంపన్నులయి సకలసుఖంబుల ననుభవింపఁ బెద్దగాలంబు రాజ్యంబుసేసి దశరథుం డొక్కనాఁడు. 39

క. తనకుం గులవర్ధను లగు, తనయులు జనియింప కునికిఁ దలపోసి మనం
బున సంతాపముఁ బొందుచుఁ, దనమది నూహించి మఱియుఁ దజ్జ్ఞతవొడమన్.

క. సుతులం గాననివారికి, గతి లేదు ముదంబు లేదు గావున నింకన్
సుతులం గనియెదుకొఱకును, గతివడ హయమేధ మేను గావింతుఁ దగన్. 41

వ. అనుచు దశరథుండు విజయుండును ధృష్టియు మంత్రపాలుండును సిద్ధార్థుండును రాష్ట్రసాధకుండు నశోకుండును జయంతుండును సుమంత్రుండును ననునెన మండ్రు మంత్రులం బిలిపించి యందు సుమంత్రుం గనుంగొని. 42

తే. మనపురోహితు లగుచున్న । మహితమతుల, ఘను వసిష్ఠుని వామదే । వుని సుయజ్ఞు
ననఘుజాబాలిఁ గశ్యపు । మునుల మఱియుఁ, దగినవారినిఁ గొని సమ్మ । దమునఁ దెమ్ము.

వ. నా విని సుమంత్రుండు వేఁగి ప్రియ మెసంగం బిలిచి యమ్మునులం దోడ్కొని [1]వచ్చిన. 44

క. జనపతి వారల నుచితా,సనములఁ బెం పెనయ నునిచి । సమ్మద మొందన్
[2]గొనకొని పూజించి నయం, [3]బెనయంగా మ్రొక్కి వారి । కి ట్లని పలికెన్. 45

క. సుతులు మును నాకు లేమిని, మతి నెంతయు వనటఁ బొంది । మత్కులహితులన్
సుతులఁ గన నశ్వమేధము, చతురతఁ జేయంగఁ గోరి । సమ్మతి మిమ్మున్. 46

మ. ఇటు రప్పించితి నాదుయాగము మనం । బింపారఁ జేయింపుఁ డా
దట నన్నన్ ముఁ మంది యామునిపతుల్ । ధాత్రీశ పెం పొంద నీ
విటు లూహించినబుద్ధి లెస్స తగ నీ । యిష్టం[4]బ పుష్టంబు గా
ఘటియింపం గల నధ్వరోద్యమము వే । కావింపు మిం కీ వనన్. 47

వ. దశరథుండును మనోరథసంతోషభరితుం డయి మంత్రుల నాలోకించి. 48

సీ. ఒనరంగ సరయువు । నుత్తరతీరంబు, నను యజ్ఞవాట మొ । నర్పుఁ డోలి
[5]సంభారువులు దెండు । శాంతులు సేయింపుఁ, డధ్వరవైకల్య । మరయు చుండు
బ్రహ్మరాక్షసకోటి । క్రతువిఘ్న మైనష్ట, క్రతుకర్త చెడిపోవుఁ । గాన క్రతువు
గురువులయానతిఁ । బరిపూర్తి వొందఁగా, విధ్యుక్తగతిఁ జేసి । వెలయ వలయు
మంత్రకోవిదులార స । మర్థు లగుచు, మానితాశ్వము విడువుఁ డే । మఱక యుండుఁ
డశ్వమేధముసేసి య । న్వయము పరఁగఁ, దగినపుత్త్రులఁ గాంచెద । ధర్మ మెనఁగ.

వ. అని పలికి యమ్మునుల మంత్రుల వీడుకొల్పి యంతఃపురంబున కరిగి యభిమతం బెసంగ. 50

చ. తనప్రియపత్నులం గడుము । దంబునఁ గన్గొని కాంతలార యేఁ
దనయులఁ గాంచఁ గోరి యుచి । తం బగు నేమముతోడ నధ్వరం
బొనరఁగఁ జేయుచుండెద శు । భోన్నతి మీరును దీక్షఁ గైకొనుం
డనవుడు సంతసిల్లిరి ము । ఖాంబుజముల్ వికసిల్ల నత్తఱిన్. 51

సీ. ఏకాంతమున సూతుఁ । డి ట్లను దశరథుఁ, గనుఁగొని భూమీశ । కశ్యపునకుఁ
దగ విభండకముని । తనయుఁడై పుట్టెడి, నమ్మునీశ్వరునకు । ననఘమూర్తి
చిరపుణ్యుఁ డగుఋశ్య । శృంగుఁడు పుట్టెడు, రోమపాదుం డను । భూమివిభుఁడు

1 వచ్చి ముందటం దెచ్చిన. 2. గనుకనిఁ బూజించి. 3. బెనయఁగ మధురోక్తి వారి. 4 బదృష్టంబు సంఘటి. 5 సంభారములు.

జనియించి కూఁతు న§మ్మునికిచ్చి నెమ్మదిఁ, దనయింట నిడుకొని§ తనరఁ గలఁడు
నీవు రోమపాదునిపొత్తు§నెఱయఁ జేసి, యతనిఁ బ్రార్థించి యారాజు§నల్లుఁడైన
ఋశ్యశృంగునిఁ దోడ్తెచ్చి§ఋషులుమెచ్చఁ, బుత్రకామేష్టి సేయించి§పుణ్యమహి
క. కులపాలకు లగుపుత్రుల, నలువురఁ గనియెదవు నీవు § నను వొందఁగ నం [మ.
చలఘుఁడు సనత్కుమారుఁడు, వెలయఁగ ఋషులసభఁ జెప్పె§విజ్ఞానముతోన్.
వ. అని యిట్లు సనత్కుమారుండు సెప్పినయనాగతవృత్తాంతంబు సూతుండుసెప్పిన
విని మనంబున విస్మయానందభరితుం డగుచు దశరథుండు. 54
క. సూతుఁడ నాకెట్లు తనూజాతులు గలిగెదరు పుత్ర§సంభవభాగ్యం
బేతపము సేసి పడసెద, నాతతమతి విస్తరించి § యంతయుఁ జెపుమా. 55

—✿ఋశ్యశృంగముని చరిత్రము.✿—

క. నావుడు దశరథుఁ గనుఁగొని, భూవర మును రోమపాదు§భూమికి నానా
జీవభయావహ మగుఘోరావగ్రహవిగ్రహం బుదగ్రం బయినన్. 56
క. పెను పయినయనావృష్టికి, జననాథుఁడు వనటఁ బొంది § సచివుల మఱియున్
జనువారిఁ బురోహితులను, దనసభకుం బిలువఁ బంచి § తగ నిట్లనియెన్. 57
క. మనయంగదేశమునకుం, జనఁగ ననావృష్టిదోష§శాంతులు సేయం
బొనరినయత్నము లేమిటఁ, దనరారఁగఁ జేయుఁ డీరు § దక్షత ననినన్. 58
వ. వార లయ్యంగదేశాధీశు నుద్దేశించి. 59
క. అనఘుఁడు కశ్యపుఁ డన్ముని, తనయుండు విభండకుండు § తత్పుత్రుఁడు పా
వనమూర్తి ఋశ్యశృంగుం, డనఘాత్ముఁడు బ్రహ్మచారి § యతులుం డెందున్.
క. తరుణియిదియతఁడుపురుషుఁడు, పురమిదియనియెఱుఁగఁడెపుడుఁ § బూతాత్ముండై
పరమస్వాధ్యాయతపోనిరతిం జరియించుచుండు § నిర్జనవనికన్. 61
ఉ. భూరమణేశ [1]యాఘనత§పోవ్రతసంగుని ఋశ్యశృంగునిం
దేరఁగఁ బంపి యాతనికి § ధీనుత నీసుత శాంత నిచ్చినన్
భూరిసువర్షముల్ గలిగి § భూమి సమృద్ధి వహించు నన్న నిం
పారఁగ మీరు వేగ సని § యామునిపుంగవుఁ దెండు నావుడున్. 62
చ. స్థిరమతి ఋశ్యశృంగు నిట § దేరఁగ భూవర యేము చాల మ
ప్పరమతపోధనోత్తముని§పాలికిఁ గాంతలఁ బంపు పంపినన్
సరసతనొక్కి నేఁగిముని§సత్తముఁ జిత్తము వచ్చునట్లుగా
వరఁకులఁ బెట్టి తెచ్చెదరు § వారవిలాసిను లెన్నిభంగులన్. 63
క. అన విని వారస్త్రీలన్, జనపతి రావించి మీరు § చతురతతోడం
జని ఋశ్యశృంగుఁ గొని రం, డని పుచ్చిన వార లరిగి § యభినవగతులన్. 64
సీ. తరలహారద్యుతుల్ § దంతకాంతులుఁ బర్వ, తరులకు నవపుష్ప§తతులు గాఁగ

1 యాఘనతపోవ్రతభంగుని - వారితతపోవ్రతభంగుని.

నధరమరీచులు ♦ హ స్తరోచులుఁ గ్రమ్మ, వరశాఖులకుఁ బల్ల ♦ వములు గాఁగ
[1]రుచిరదృష్టిప్రభల్ ♦ కచరుచులుఁ బొదలి, కాంతారమునఁ దేఁటి ♦ గములుగాఁగ
సుకుమారతనువులు ♦ సురుచిరబాహులు, [2]బలసి కానకు లతా ♦ వలులు గాఁగ
వారకామిను లాపుణ్య ♦ వనము సొచ్చి, మధురమంజులరవము ♦ మనము లింప
రాగములుసేసి పాడుచు ♦ [3]రమణవచ్చి, ఋశ్యశృంగుఁడు మెలఁగెడు ♦ వృతివాటి.

వ. చెంతల నిలిచి కెలంకులఁ బరికించు నెడ. 66

చ. వరముని ఋశ్యశృంగుఁ డట ♦ వచ్చినవారివిచిత్రమూర్తుల
చ్చెరువడి చూచుచుం జెవులు ♦ సేరిచి గానము వించు నుండె న
త్తరుణులుఁ జేరి యోపరమ ♦ తాపస యోమునిపట్టి యేల యొ
క్కరుఁడవుఁ జొచ్చి యీవిజన ♦ కాననభూమిఁ జరించె దీ వనన్. 67

క. వినుఁ డేఋగ్యజ్ఞాంగుం, డనుపేరను ఋశ్యశృంగుఁ ♦ డనియెడునామం
బున మహిలోఁ బరఁగుదు మ,జ్జనకుండు విభండకాఖ్య ♦ సంయమి యొప్పన్. 68

చ. వెలయఁగ వచ్చినార లిట ♦ వింతతపస్వులు మీరు మాననీ
యులు మిముఁ బూజసేసి సుకృ ♦ తోన్నతిఁ బొందెద నంచు నిష్ఠతోఁ
దలకొని యర్ఘ్యపాద్యములు ♦ దర్భలు నాదట నిచ్చి యోలిమై
ఫలములు కందమూలములు ♦ భక్తి నిడం గొని వారు నవ్వుచున్. 69

క. అమృతరుచు లారఁ బాకము, లమరించినమోదకంబు ♦ లాదిగ బహుభ
క్ష్యము లొగి నిచ్చిన నానం,దముతో నందుకొని నమలి ♦ తనిసినమదితోన్.

క. ఈపగిదిఫలము లెన్నఁడు, నేపొలములఁ దరులఁ గాన ♦ మెందుల విపి యీ
తీపులు నిట్టివిచిత్రపు,రూపులు నీఫలము లింత ♦ రుచ్యము లగునే. 71

వ. అని పలుకుచు నమ్మగువలు వీనులు సొగియింపం బాడ నగ్గానంబు విని విని
యెలమిని. 72

క. ఈమధురస్వరవేదం, బే మెన్నఁడు వినము మీకు ♦ నేముని సెప్పెన్
వేమఱు మీతోఁ జదివెద, నోమునివరులార చెప్పఁ ♦ డొప్పఁగ నాకున్. 73

క. అని పలికి మఱియు నమ్ముని, తనముందట నిలిచి యున్న ♦ తరుణులవృత్త
స్తనములు హారంబులుఁ జం, దనచర్చలుఁ బోలఁ జూచి ♦ తగ ని ట్లనియెన్. 74

ఆ. నాకుఁబోలెఁ గావు ♦ మీ కురంబున రెండు,వలుఁదగుజ్జుఁగొమ్ము ♦ లలరుచున్న
వఱుతితులసిపూస ♦ లతిసితములు మేనఁ, దనర నలఁదినారు ♦ తావిభూతి. 75

క. [5]ఈకట్టినవల్కలములు, మీ కెంతయు లెస్స లింత ♦ మృదువులు గలవే
యేకుజములనారలొ యివి, మాకును నివి యొసఁగవలయు ♦ మానుగ మీరల్.

1 రుచిదృష్టులుఁ గచరుచులును బొదివి కాంతారమునకుఁ దేఁటిదాఁట్లుగాఁగ. 2 బెరసి కానకుఁ దీఁగతురుము గాఁగ. 3 రమణఋశ్య, శృంగు మెలఁగెడిచెంతలఁ ♦ జెలులు నిలిచి. వ. కెలంకులఁ బరికించు నెడ. 4 వలఁతితులసిపూస ♦ లతిశీతలంబులు, దనర. 5 'మీకట్టినవల్కలములు, మే కెంతయు' ననియే

వ. అని యిట్లనేక ప్రకారంబుల ముగ్ధాలాపంబు లాడుచుం దమలోఁ గలసి యునికిఁ బరికించి, 77

క. ఒడ లెంతయుఁ బులకింపఁగఁ, బుడుకుచు మేలముల మోసపుచ్చుచు నమ్మె
[1]బెడఁగుసిలుగులం బెట్టిరి, పడఁతుక లాబుష్యశృంగుఁ బార్థివముఖ్యా. 78

వ. ఇట్లమ్ముగ్ధతపోధనుం దమవలలకు లోఁబఱిచి యచటం దడయ వెఱచి పురంబునకుం జని రంత ఋష్యశృంగుండును జింతాకులమానసుం డయి తిరుగుచు నెప్పుడు వీరు వచ్చెదరో యనుచు వారు వోయినత్రోవన వారిరాక కెదురుచూచుచు నుండ నమ్మఱునాఁడు. 79

క. మణిఘృణిగణయుతరశనా, ఝణఝణితాగణితరణిత చరణాంచితభూ
మణఘోషణరణనవిచ, తుణకంకణకింకిణీక ఝంకృతు లారన్. 80

ఉ. అంగన లేఁగుదెంచి ముద మారఁగఁ గాంచి రధీతవేదవే
దాంగుని సర్వసంయమిముఖాబ్జపతంగుని నిర్జితేంద్రియా
నంగుని లిప్తభూతిలసదంగుని సద్గుణసంగునిర్వ్రతా
భంగుని [2]సంతతోదితతపఃకృతిచంగుని ఋష్యశృంగునిన్. 81

క. కనుఁగొని మునిపుంగవ మా, వనమున కేతెంతు గాక వరదుఁడవై నీ
వనవుడు ననుమతి సేసిన, వనితలు సంతసముఁ బొంది వాంఛలు సెల్లన్. 82

ఉ. మచ్చికఁ గౌఁగిలించి పలుమాఱుఁ గుచంబుల నెత్తి యొత్తుచున్
మెచ్చుగ ముద్దు లిచ్చుచును మేలము లాడుచు బాహుపాశముల్
సెచ్చెరఁ గంఠలగ్నములు సేయుచు మోహితుఁ జేసి నేర్పుతోఁ
దెచ్చిరి దీమముల్ మృగముఁ దెచ్చినకైవడి ముగ్ధసంయమిన్. 83

క. పురమున కమ్మునిఁ దేరఁగ, నురుతరవర్షములు గురిసె నుర్వీశుఁడు స
త్వరగతి నెదురుగఁ జని యా,దరమునఁ గొనివచ్చి యిచ్చెఁ దనసుత శాంతన్.

వ. తగ నిచ్చి బహుప్రకారంబుల మన్నించి. 85

క. [3]తనయల్లునిఁ దనకూఁతుం, దనయింటనె యునిచికొని ముదం బందుచు న
మ్మునివరునిప్రసాదమ్మునఁ, దనయులఁ గని యున్నవాఁడు లిద్దయుమహిమన్.

ఉ. కావున రోమపాదమహికాంతునిపాలికి వేగ మేఁగి సం
భావన లాచరించి తగ మైత్రి యొనర్చి ప్రియంబుతోడ న
బ్భావరు నీవు వేఁడికొని పుణ్యచరిత్రు బహుక్రియాకలా
కోవిదు ఋష్యశృంగు నిటకుం గొనివచ్చి [4]మనోహరంబుగన్. 87

తే. పుత్రకామేష్టి సేయించి పుణ్యమహిమఁ
దగినపుత్త్రులఁ బడయుము దశరథేశ

1 'బుడికి జిడుంగులఁ గట్టిరి. వ్రా. ప్ర. 2 సంతతోదిత తపః కృతభంగుని; సంతతోర్జిత తపఃకల్పి చంగుని; సంతతోద్ధిత తపఃస్ఫురితిచంగుని. 3 తనయల్లును దనకూఁతుం. 4 మనోరథంబుగన్.

యింతవృత్తాంతమును మున్ను । యెఱుఁగఁ గంటి
మును సనత్కుమారుఁడు సెప్ప । మునులయెదుర. 88

క. అమ్మునియధ్వర్యుఁడు గా, సమ్మతి హయమేధ మీవు । సనఁ జేసి ప్రమో
దమ్మున నలువురఁ గొడుకుల, సమ్మానితగుణులఁ గనుము । జగతీనాథా. 89

—దశరథుండు ఋశ్యశృంగు నయోధ్యకుం దోడితెచ్చుట.—

వ. అనవుడు సంతోషభరితమానసుం డయి తనగురుం డగువసిష్ఠుఁ బూజించి యమ్మునీంద్రుననుమతిం జతురంగబలసమేతుం డయి ధవళచ్ఛత్రచామరంబులు మెఱయ సచివులుం దాను నెడనెడ నదులు వనంబులు గిరులుం గడచి యంగదేశంబు సొచ్చి రోమపాదునిసమీపంబున దీప్తాగ్నియుంబోలెఁ దేజరిల్లుచున్న ఋశ్యశృంగుని దర్శించి పదంపడి రోమపాదునిఁ బూజించి యతనిచేతఁ దానును బూజితుండయి తదనుమతి నాఋశ్యశృంగు నతిభక్తి నారాధించి యప్పురంబునఁ గొన్నిదినంబు లుండి యొక్కనాడు రోమపాదుం గనుంగొని. 90

క. జనవర నీసుత శాంతను, మునిపుంగవు ఋశ్యశృంగు । ముద మారంగాఁ
బని గలిగి పిలువ వచ్చితిఁ, జనవునఁ బుత్తేర వలయుఁ । జన నాపురికిన్. 91

క. అన విని [1]యల్లునిఁ గూఁతుం, జనుఁ డని తగఁ బనిచి యంగ।జగతీశుఁడు దా
నును దశరథుఁడుఁ [2]గృతాలిం,గనుఁ డయి చన నీడుకొలిపెఁ।గాకుత్స్థవిభున్.

వ. అంత నప్పురంబు వెడలి యొక్కదూతుం జూచి నీవు సని నారాక యెఱింగించి పట్టణం బలంకరింపుఁ డని పౌరులకుఁ జెప్పఁ బొమ్మంచుఁ బనిచి రయంబున దశరథుండు నిజపురంబుఁ జేర వచ్చు నెడ. 93

ఉ. లాజలు నక్షతంబులు ద।శత్కుసుమంబులు మీఁదఁ జల్లి నా
నాజయవాదులై జనులు । నల్గడ మ్రొక్కుచు వేడ్కఁ జూడఁగా
రాజనిభాననల్ మహిత।రత్నసమాజవిరాజమాననీ
రాజనరాజితో నెదురు । రాఁ గడుసొంపున వచ్చి మోసలన్. 94

క. భీకరతరభేరీఘుం, ఢాకాహళతూర్యఘోష।ణములు సెలఁగ న
స్తోకశ్రీకానేకా,నీకంబులు బలసి కొలువ । నిజపురి సొచ్చెన్. 95

క. చొచ్చి యట ఋశ్యశృంగుని, నచ్చుగఁ బూజించి తత్ప్రి।యాంగన శాంతం
దెచ్చెర నంతఃపురికిం, బుచ్చిన నారాజుసతులు । పూజించి రొగిన్. 96

వ. ఇట్లు శాంతాసహితుం డగుఋశ్యశృంగునకు నుచితసత్కారంబు లొనరించుచుండఁ బెక్కుదినంబులకుం దనమనోరథం బార వసంతసమయం బాసన్నం బయిన దశరథుండు. 97

సీ. అభివందనము సేసి । యతిభక్తిఁ బూజించి, ఘను ఋశ్యశృంగుని । ననఘ నీవు
పుత్త్రులు నా కింకఁ । బుట్టెడునట్లుగా, హయమేధ మొనరింపు । మని వరించి

1 యల్లును గూఁతుం. 2 'కృతాలింగను లయి' వ్రా. ప్ర.

వినతుఁడై [1]యాతని వేదపారగులైన విప్రుల నర్చించి విహితగతుల
సకలమునీంద్రులు సంభావనలు సేయ, నానందభరితులై యఖిలజనులుఁ
గ్రతువు సేయ నుద్యోగింపు కడఁకతోడ, నీమనోరథమార నుద్దామబలులఁ
దగినపుత్రులఁ బడయుము దశరథేశ, యనిన ముదమంది తనమంత్రిజనులఁ జూచి.

సీ. ఒనరంగ సరయువు నుత్తరతీరంబు, నను యజ్ఞవాట మొనర్పుఁ డోలి
[2]సంభారములు దెండు శాంతులు సేయింపుఁ, డధ్వరవైకల్య మరయుచుండు
బ్రహ్మరాక్షసకోటి క్రతువిఘ్న మైనష్ట, క్రతుకర్త చెడిపోవుఁ గాన క్రతువు
గురువులయానతిఁ బరిపూర్తిఁ బొందఁగా, విధ్యుక్తగతిఁ జేసి వెలయవలయు
మంత్రకోవిదులార సమస్థు లగుచు, మానితాశ్వంబు విడువుఁ డేమఱకయుండఁ
డశ్వమేధము సేసి యన్వయము పరఁగఁ, దగినపుత్రులఁ గాంచెద ధర్మ మెసఁగ.

వ. అనిన మంత్రులు నధిపునానతిని సర్వంబు నిర్వహించి విహితక్రమంబున నశ్వంబు విడిచి యెదురుసూచుచుండ సంవత్సరంబు నిండి క్రమ్మఱ [3]వసంతసమయంబు నాసన్నం బయిన నంతయు దశరథున కెఱింగింప నలరుచు వసిష్ఠు నాలోకించి. 100

చ. ధరణివిభుండు మ్రొక్కి యుచితక్రమపూజ లొనర్చి నీవు మ
ద్గురుఁడవు మాకు నెంతయు హితుండవుఁ గావున విఘ్న మెద్దియుం
బొరయక యుండ నధ్వరము పూర్ణము సేయు క్రియాంగకౌశలం
బరుదుగ యజ్ఞభారము సమస్తము నీయది సుమ్ము నావుడున్. 101

క. సకలమఖకార్యములఁ దక్కక చేసెద ననుచుఁ బలికి ఖనకులఁ గార్తాం
తికులను శిల్పకరులఁ దక్షకులను నర్తకుల నటుల గణికాతతులన్. 102

క. క్రతుకర్మనిపుణులు బహుశ్రుతులును మంత్రజపపరులు శుచులును నియత
వ్రతులును నగువిప్రవరుల, నతికర్మఠు లయినజనుల నార్యుల మఱియున్.

వ. తగినవారలం గ్రమంబునం జూచి మీరు రాజునాజ్ఞ నిష్టకాసహస్రంబులు దెండు కుండమండపవేదికాదులు నిర్మింపుఁడు వివిధశిల్పంబులు రచియింపుఁడు మహాసనంబులు సత్రాగారంబులు పందిళ్లు మఱియునుం దగినగృహంబులు గట్టుఁడు గీతవాద్యనృత్యంబు లొనరింపుఁడు రాజునకు మేలుగా జపశాంతులు సేయింపుఁడు నానాదేశంబులవారికిం బౌరులకు సర్వవర్ణంబులకుం గామక్రోధవశంబున నవజ్ఞలు సేయక భక్ష్యాన్నపానాదులు [4]గడప వలసిన వన్నువలుగాఁ బెట్టుఁడు పనులయెడ నాయాసపడినవారల మిగుల మన్నింపుఁడు దేవెంటం గొఱంత లేక యుండ నందఱు నన్నిదెఱంగులఁ బనులు సేయుండనిన నాసకలజనులు మీయానతి యెట్లట్ల సర్వంబు నిర్వర్తించితి మన నమ్మునీంద్రుం డలరుచు సుమంత్రుం బిలిచి యిట్లనియె. 104

మ. అతిపుణ్యుల్ మిథిలేశుఁడైనజనకక్ష్మాధీశ్వరుం గేకయ

క్షితిపాలాగ్రణి సింధుదేశవిభుఁ గాశీనాథు సౌవీరు న
ప్రతిమస్నేహుని రోమపాదమహిపుం బ్రాచీనసౌరాష్ట్రభూ
పతులం దక్షిణదాక్షిణాత్యనృపులం బాశ్చాత్యభూమీశులన్. 105

క. ధరణి నతిధార్మికుల భూ,వరులఁ దదీయానుచరుల వలసినబంధూ
త్కరముల దశరథునానతి, సరగునఁ గొనిరమ్ము నీవు సమ్మద మారన్. 106

చ. అనవుడుఁ బెక్కురత్నము లుపాయనముల్ గొని యమ్మునీంద్రుశా
సనమున వేగ మేఁగి తగ సర్వమహీశుల నాదరించి తో
కొని యధికప్రమోదమునఁ గొన్ని దినంబుల కేఁగుదెంచి సం
గనుఁగొని యవ్వసిష్ఠుఁ డధికప్రమదంబున ఱేని కిట్లనున్. 107

క. ధరణీశు లెల్ల వచ్చిరి, [1]వెరవున మన్నించి వారి విడియించితి భూ
వర యజ్ఞము సేయంగా, నరుదె మ్మచట సకలంబు నాయిత మయ్యెన్. 108

క. అనుచు వసిష్ఠుఁడు వలుకను, సునిశితమతి దశరథుండు శుభదినమున శాం
తను ఋశ్యశృంగునిం గో, డ్కొని క్రతువాటంబు సొచ్చెఁ గోరిక లారన్.

తే. ఇట్లు సొచ్చి యద్దశరథుఁ డింద్రకరణిఁ, బావనస్నానుఁడయి దీక్ష పరఁగఁ బూని
తనకులస్త్రీలు దాను సంతసము లార, నలరుచుండ నానాఁటి కయ్యజ్ఞభూమి.

ఉ. బాలురు వృద్ధు లంధులు విపన్నులు రోగులు యోగు లోలి భూ
పాలురు ఋత్విజుల్ మునులు బ్రాహ్మణు లార్యులు బంధు లుత్తమ
స్త్రీలు సమస్తజాతులును జేరి తగం దమయిండ్లకైవడిక్
మే లగునన్నపానములు మెచ్చొదవంగ భుజించుచుండఁగన్. 111

క. కలయఁగ నయ్యాఱుజనములు, వలసినవంకల సువర్ణవస్త్రాభరణా
దులు వెండి లబ్ధసంపద, లొలయఁగఁ జిత్తమునఁ దనివి నొందుచు వెలయన్.

క. మండితమణిమయకాంచన, కుండలమండనవిశిష్టగురుతరరోచుల్
గండస్థలముల నెరయుచు, నుండఁగ నయ్యజ్ఞయాజకోత్తము లొప్పన్. 113

వ. సకలమఖకలాకోవిదు లగువసిష్ఠప్రముఖులును భూసురోత్తములును ఋశ్యశృంగునిం బురస్కరించుకొని యజ్ఞకర్మారంభసంరంభం బెసంగ విహితక్రమంబున గరుడోభయపక్షంబులుగా నిష్టకాచయనంబు లొనర్చి యందగ్నులు ప్రవృద్ధంబులు సేసి ప్రవర్గ్యోపసవప్రాతస్సవనమధ్యందినసవనతృతీయసవనంబు లనుష్ఠించి యేకవింశత్యరత్నిప్రమాణంబు లయిన యాఱేసిబిల్వఖదిరపలాశయూపంబులును రెండు దేవదారుయూపంబులు నొక్క శ్లేష్మాతకయూపంబునుంగా నిరువదియొక్కయూపంబు సంస్థాపించి వస్త్రభూషణమాల్యగంధాలంకృతంబుఁ జేసి శోభనార్థంబుగాఁ గొన్ని కాంచనయూపంబులు తిరిగిరా నిడి చతుష్పాదంబులుం బక్షులుం జలచరంబులుఁ గా మున్నూఱుపశువులు పరివేష్టింపఁ బూర్వ

1 మఱియును మన్నించువారి మన్నించితి; "మరియాదల నెల్లవారి మన్నించితి" అ. 1 ప.

విసృష్టసమానీతాశ్వరత్నంబు నడుమ నిడి యుక్తక్రమంబున మున్నా ఋపశువుల విశసించి యేయే దేవతల కేయేమంత్రంబుల నేయేపశువులపలలంబు లర్హంబు లాయాదేవతల కాయామంత్రంబుల నాయాపశువులపలలంబు లాహుతులు సేసి మఱియుం గౌసల్యాదేవి చేతిఖడ్గత్రయంబునం బత్నీసహితంబుగా నశ్వంబు విశసించి యధ్వర్యూద్గాతృహోతలు హయంబు యజనంబుకడకుం జేర్ప యాజకు లాయశ్వంబువప వెఱికి వేదోక్తక్రమంబున నాహుతులు సేయ నావపాధూమగంధంబు లాఘ్రాణంబు సేసి యఖిలభూపాలురుం బాపంబులం బాయ నున్న యయ్యశ్వంబు సర్వాంగంబులు విహితమంత్రపూతంబులుగా నగ్ని కాహుతులు సేయుచుం బ్రథమచతుష్టోమద్వితీయోక్తతృతీయాతిరాత్రజ్యోతిష్టోమాయురభిజిద్విశ్వజిదప్తోర్యామాదిక్రతుసమేతంబుగా నస్ఖలితమంత్రతంత్రంబుల నయ్యశ్వమేధం బఖిలోపక్రియాకలాపంబుగాఁ బరిసమాప్తిఁ బొందింప దశరథుండు మనోరథలభ్యమానమానసుం డగుచు నధికానందంబుతోడ నధ్వరదక్షిణాల కొఱకు. 114

క. చన హోతకుఁ బ్రాగ్దేశం, బును బ్రహ్మకు దక్షిణంపుఁ। బుడమియు నధ్వర్యునకుం బశ్చిమదేశం, బును నుద్గాతకు నుదీచ్య। భూమియు నిచ్చెన్. 115

తే. ఇచ్చి మఱియుఁ దక్కినవారి।[1]కిట్లయోధ్య, యొకఁడు దక్కంగఁ దక్కిన। సకలభూతలమును నందంద యిచ్చినఁ। బ్రమద మంది, వార లాదశరథమహీ।శ్వరునితోడ.

క. ఏ మెన్నఁ డనుష్ఠానము, నేమంబులు దీర్తు మెపుడు। నియమిత వేదోద్దామాధ్యయనము సేయుదు, మే మెక్కడ భూమి యేలు। టెక్కడ మాకున్.

క. భూమికిఁ దగుమూల్యముగా, హేమము లొండె మణు లొండె। నీప్సితధేనుస్తోమము లొండెను నిమ్మా, భూమండల మీవ యేలు। పొఁడిగ ననినన్. 118

వ. అగుఁ గాక యనుచు ముదితాత్ముం డయి దశరథుండు పదిగోట్లు సువర్ణంబులును నలువదిగోట్లు రజతంబులును వసిష్ఠఋశ్యశృంగాదిఋత్విజులకు నొసంగి మఱియుం దక్కినభూసురోత్తములకుఁ గోటిసువర్ణంబులు ననేకదివ్యాంబరాభరణంబులు నిచ్చి యమ్మునులకు దండప్రణామంబు సేసి సకలభూసురోత్తములు నాశీర్వాదంబులు సేయ సంతోషభరితమానసుం డయి. 119

క. జనవిభుఁడు ఋశ్యశృంగునిఁ, గనుఁగొని యనఘాత్మ పుత్ర। కామేష్టి ప్రియంబునఁ జేయుఁడు మీ రనవుడు, మునివరుఁ డౌఁగాక యనుచు। ముదితాత్ముండై.

వ. నానామంత్రపూతంబులుగా నాహుతుల నగ్ని నిడుచుం బుత్రకామేష్టి సేయం దొడంగిన. 121

## —బ్రహ్మేంద్రాదిదేవతలు నారాయణుని భూమి నవతరింపం బ్రార్థించుట.—

క. అంత హవిర్భాగంబుల, నెంతయు సంతసము నొంద। నేతెంచి సభాభ్యంతరముననుండి సురల్, చింతించిరి రావణుండు। సేసినబాధల్. 122

తే. అట్లు చింతించి యాసుర । లజునితోడ, ధాత నీప్రసాదంబు తద్దయును బడసి
యఖిలజనులకు నవిజయ్యుఁ । డగుచు నిపుడు, రావణుం డనువాఁడు గర్వంబు మె[ఱసి.

క. వాసవసురమునిగంధ,ర్వాసురయక్షావనీసు । రావలి నెపుడుం
[1]గాసిల నలఁచుచు నుండన్, వేసరితిమి వాఁడు సేయు । వికృతుల కెదలన్. 124

వ. వానిం బేర్కొన్న. 125

క. కడ లెత్తి మ్రోయ వెఱచును, జడనిధు లినుఁ డెండ గాయ । శంకిలు వానిం
బొడఁగనునెడ వాయువు లుర,వడి వీవక యడఁగు గిరులు । వడవడ వడఁకున్.

క. నీవరకారణమున నా,రావణుచే ముజ్జగములు । ప్రలయము వొందుం
గావున వానిన్ వేని, ర్జీవునిఁ జేయంగ నీవు । చింతింపు మజా. 127

వ. అనవుడుఁ గమలాసనుం డనిమిషులం గనుంగొని. 128

క. సురయక్షాసురగజనీ,చరకిన్నరసిద్ధసాధ్య । చారణవిద్యా
ధరగంధర్వాదులచే, మరణము నొందండు వాఁడు । మావరశక్తిన్. 129

క. నరులనలనఁ జా కుండఁగ, వర మడుగఁగ మఱచె నన్న । వాఁ డవమతిమై
ధరలో నటు గావున సం,గరమున నరుచేతఁ జచ్చు । గర్వం బడఁగన్. 130

మ. నరసింహాకృతిఁ బూని భీకరగతిన్ । నారాయణుం డుగ్రతో
ద్ధురబాహాబలుఁ డై హిరణ్యకశిపుం । దున్మాడి సంప్రీతి నా
దర మారన్ సురకోటిఁ బ్రోచెఁ దగ నాదై । త్యాధినాథుండ యి
ద్ధర జన్మించెను రావణుం డనఁ బుల । స్త్యబ్రహ్మకుం బుత్రుఁ డై. 131

క. దురమున దశకంఠుని వెసఁ, బరిమార్చి సమస్తసురలఁ । బాలించు ధరన్
నరుఁడయి విష్ణుఁడు మన మా,హరి శరణము సొత్త మనఁగ । నంతటిలోనన్.

ఉత్సాహ.
వక్షమున శ్రీసతియు । నక్షులశశాంకజగ । దక్షులుఁ ద్రిలోకకర । ణాక్షముఁడు నాభిం
గుక్షి భువనంబులును । బక్షిపతి కేతువున । లక్షితకరంబుల వి । పక్షకులశిక్షా
దక్ష మగుచక్రమును । బుక్షపసదృక్షసువ । లక్ష మగుశంఖమును । నీక్షకులకుం బ్ర
త్యక్షములుగాఁగఁగమ । లాక్షుఁ డరుదెంచెనుస । మక్షదివిజావలికి । నీక్షణము లార

క. హరి కప్పుడు మ్రొక్కుచు సురు,చిరమతి సన్నుతులు సేసి । చెప్పంగఁ దొడం[గెన్.
గిరి గీర్వాణులు దశకం,ధరుచేతం దమకు నయిన । దారుణబాధల్. 134

సీ. అఖిలేశ రావణుం । డనురాక్షసేశుండు, బ్రహ్మవరంబునఁ । బ్రబలుఁ డగుచు
నందనవనమున । నలువొంద విహరించు,నప్సరస్సంఘంబు । నదరి త్రుంచె
మునుల విదారించెఁ । గనలి గంధర్వులఁ, బరిమార్చె దనుజులఁ । బరిభవించె
[2]నమరుల నిర్జించె । నసురుల భంజించె, యక్షులఁ దోలె గు । హ్యకులఁ బఱపె
వానిదాడి కోడి । వచ్చితి మిచటికి, నిను శరణుసొరఁగ । నీవు కరుణ

---

1 గాసిలి సలంపుచుండన్; గాసిఁ గలంపుచుండన్.

2 'అహికోటి మర్దించె । యాతుధానులు దక్క,నఖిలభూతంబుల । నాక్రమించె' అని పా.

నభయ మిచ్చి మమ్ము § నాదరింపుము మాకు, దేవ గతియు నీవ § దిక్కు నీవ.

క. నరుచేతఁ దక్క వాఁ డొం, డొరుచే నీల్గండు దశర§థోర్వీశసతుల్
[1]సిరికిన్ వాణికి గౌరికి, సరి యయి యున్నారు పుణ్య§సదమలమతులన్. 136

క. చతురంశంబుల మనుజా, కృతు లలవడఁ బూని యధిక§కృపఁ బంక్తిరథ
క్షితిపతిసతులకు నలువురు, సుతు లయి జనియింపవలయు § సురహిత మెసఁగన్.

ఉ. కావున మర్త్యరూప మిలఁ § గైకొని పావనుఁ డైన రాఘవ
త్మావరపుత్త్రుఁ డై పొడమి § చండపరాక్రమలీల లోకవి
ద్రావణు రావణుం దునిమి § ధర్మ మెలర్ప సమస్తదేవభూ
దేవగణంబులన్ మనుపు § దిక్కుల నీనిజకీర్తి వర్ధిలన్. 138

చ. అన విని మీర లింక భయ § మందక నెమ్మది నుండుఁ డే నిలన్
మనుజుఁడ నై జనించి సుత§మంత్రిసహోదరవాహినీసుహృ
జ్జనసహితంబు గాఁగ సుర§శత్రుని రావణుఁ ద్రుంచి కీర్తి గై
కొని తగ వర్షముల్ పదునొ§కొండుసహస్రము లుర్వి నేలెదన్. 139

వ. అని పలికి సర్వలోకేశుం డగులక్ష్మీశుండు నిజలోకంబున కరిగెఁ దదనంతరంబ.

క. అతినుత మగునా క్రతువున, వితతోద్గతహోమధూమ§వితతులు నానా
తతఘృతధారాహుతివ,ర్ధితపావకశిఖలు గలయ § దీప్తంబులుగన్. 141

—ప్రాజాపత్యపురుషుండు దశరథునకుఁ బాయసాన్నం బిచ్చుట.—

వ. అప్పు డప్పావనహోమాగ్నివలనం గృష్ణవర్ణుండును రక్తాంబరధరుండును రక్తాననుండును దుందుభిస్వనుండును స్నిగ్ధహర్యక్షసదృక్షరోముండును దివ్యభూషణభూషితుండును దివాకరసమాకారుండును దీప్తానలశిఖోపమానుండును నగునొక్కదివ్యపురుషుండు గలధౌతమయపాత్రాంతరితపవిత్రహేమపాత్రంబు హస్తంబున నమర వెడలి దశరథు నీక్షించి యేను బ్రాజాపత్యపురుషుండ దేవనిర్మితంబును నారోగ్యవర్ధనంబును బుత్రోత్పత్తికరంబును నగునిప్పాయసంబు నీప్రియపత్నుల కొసంగు మంచుఁ బలికి. 142

క. తన కవ్విభుఁడు ప్రదక్షిణ, మొనరించి నమస్కరింప § [2]నుజ్జ్వల మగుకాం
చనపాత్ర మిచ్చి వేగం, బున నాపురుషుం డదృశ్య§పురుషుం డయ్యెన్. 143

చ. జనవిభుఁ డంత నెంతయును § సంతస మందుచుఁ గాంతతోడ ని
ర్ధనుఁడు ధనంబు గన్నగతిఁ § దత్పరమాన్నసువర్ణపాత్రముం
గొని చని యాత్మపత్నులకుఁ § గోర్కిగ నా వరపాయసాన్నముం
గనుకని రెండుభాగములు § గా నొనరించి తగంగ నందులోన్. 144

తే. సగము కౌసల్య కిచ్చియా § సగములోన,సగముఁ దగసుమిత్త్రకునిచ్చి§చనఁ గనున్న
సగముకైకకునిచ్చియా§సగములోన, సగముమఱిసుమిత్త్రకు నిచ్చె§సమ్మదమున

1 సిరికిన్ హ్రీకిని గ్రీరికి. 2 నోదన మగుకాం.

క. ఆపాయసానుభవమున, భూపాలునిసతులు గర్భములు దాలుప ధా
త్రీపతి పత్నులఁ గనుఁగొని, యేపారుముదంబుతోడ నెసఁగుచు నుండెన్. 146

క. అమరులుఁ దమమఖభాగము, లమరఁగఁ గొని యమరపురికి నరిగెడిచో న
య్యమరుల నందఱఁ గనుఁగొని, యమరజ్యేష్ఠుండు పలికె నర్మిలితోడన్. 147

క. ఆదట లోకముఁ బ్రోవఁగ, మేదురతరకరుణతోడ మేదినిపైఁ బ
ద్మోదరుఁ డుదయించుఁ జుఁడీ, యాదేవునకుర్వ సహాయ మారఁ గడంకన్. 148

క. ఏ నావులించునెడ నా, యాననమున జాంబవంతు నతివిక్రమస
మ్మానితు మును పుట్టించితి, మానుగ మీరును నిజాంశమహిమలు వెలయన్.

క. కిన్నరవిద్యాధరసుర, పన్నగగంధర్వయక్షభామలయం ద
త్యున్నతబలు లగుకపులం, జెన్నుగ మిముఁ బోలువారి సృజియింపుఁ డిలన్.

సీ. అని పల్క నగుఁగాక యని నాకమున కేఁగి, యనురక్తిఁ బాకశాసనుఁడు వాలి
నర్కుండు సుగ్రీవు ననిలుండు హనుమంతు, ననలుండు బలవంతుఁడైన నీలు
సింధునాథుండు సుషేణు విత్తేశుండు, గంధమాదను విశ్వకర్మ నలునిఁ
బరఁగఁ బర్జన్యుండు శరభుని సురమంత్రి, తారు నశ్వినులు మైందద్వివిదుల
బాఁతిఁబుట్టించి రతిచండబలులఁ గపుల, మఱియుఁ దక్కిన మునిజనామర్త్యయక్ష
గరుడకిన్నరభుజగకింపురుషభూత, చారణాప్సరోగణసిద్ధసాధ్యతతులు. 151

చ. కులగిరు లెత్త దిక్కరులఁ గూలఁగఁ గన్నఁగ వీఁక నంబుధుల్
గలఁపఁగ నింగి మ్రింగఁ ద్రిజగంబులు గ్రుమ్మరఁ గాలమృత్యువుల్
గెలువఁగ బాడబానలముఁ గేల నడంపఁగ శేషుఁ బట్టి పెం
డలఁ దలసుట్టు సుట్టికొనఁ దద్దయు శక్తులు గల్గువారలన్. 152

వ. మఱియుఁ బర్వతాకారులుఁ బర్వతోత్పాటనప్రచండదోర్దండులుఁ బర్వతపాషాణపాదపయోధులును నఖదంష్ట్రాయుధులును సుపర్ణానిలబలసంపన్నులుఁ గామరూపులు నగువీరవానరుల నాగగంధర్వవిద్యాధరాప్సరస్సంఘగోలాంగూలవానరస్త్రీలవలన ననేకలక్షకోటిసంఖ్యలు గలుగువలీముఖోత్తములం బుట్టించి రందుఁ గొందఱు వాలిసుగ్రీవులఁ గొందఱు నలనీలహనుమంతులం గొలిచిరి గొందఱు ఋక్షవంతంబున నానాశైలకాననంబుల విహరించుచుండి రయ్యందఱకును నధిపుండై వాలి వాలుచుండు. 153

క. తనయాగము పూర్ణముగా, జననాథుఁడు సకలజనుల సంభావన వీ
డ్కొని ఋశ్యశృంగుఁ దోడ్కొని, తననగరికి సతులతో ముదంబున నరిగెన్.

వ. అరిగి వసిష్ఠాదిమునుల ఋశ్యశృంగు బహుప్రకారంబులఁ బూజించి వీడ్కొలిపి సుఖంబున రాజ్యంబుసేయుచుం గోర్కులడరం బుత్రోత్పత్తి కెదురుచూచుచున్న యెడ. 155

—శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్నులజననము.—

సీ. వెలయఁ బండ్రెండవ । నెలయందుఁ జైత్రపు, నర్వసుబుధశుద్ధ । నవమినాఁడు
పంచగ్రహంబులు । పరఁగ నుచ్చస్థాన, గతులుగా గురుసుధా । కరులు గూడఁ
గర్కటకాఖ్యల । గ్నమునందుఁ గౌసల్య, [1]హరి కర్ధ మగురాము । నమరఁ గనియె
గురువారమునఁ జారు । తరమీనలగ్నంబు,నను బుణ్యదశమిది । నమునఁ గయిక
పద్మనాభునంశంబున । భరతుఁ గనియెఁ, గర్కటకలగ్న మాశ్లేష । కావ్యవార
మమర నేకాదశిని విష్ణు । నంశమున సు,మిత్రలక్ష్మణుశత్రుఘ్ను । మెఱయఁ గనియె.

క. సుర లపుడు పుష్పవర్షము, గురిసిరి మొగి నప్సరసలు । గొమదారఁగ నా
డిరి గంధర్వులు పాడిరి, సురదుందుభు లోలి మొరసె । సురుచిరభంగిన్. 157

మ. సతతాకీర్ణము లై పురిం జెలఁగె ని । స్సాణౌఘనాదంబు[2]లుం
దతరాగాన్వితమంత్రనాదములు ను । ద్యత్తూర్యవంది స్తవో
ర్జితనాదంబులు గీతనాదములు యో । షిన్నృత్యభూషాసమం
చితవాద్యస్ఫుటనాదముల్ బుధజనా । శీర్వాదనాదంబులున్. 158

వ. ఇట్లనేకప్రకారంబుల సకలజనులు నభినందింపఁ బుత్రమహోత్సవంబు నిర్వర్తించి దశరథుండు పరిపూర్ణమనోరథుండై సూతవందిమాగధులకుం బసదనంబు లొసంగి భూసురోత్తములకు బహుసువర్ణంబులుఁ బెక్కుగోవులు ననేకరత్నంబులు దానంబులు సేసి సకలజనుల నిష్టాన్నపానాదులం దృప్తులం జేసి పదంపడి వసిష్ఠునిం బిలిపించి పండ్రెండవదినమునం బుణ్యాహవాచనపూర్వకంబుగా జాతకర్మంబులు సేయించి నామకరణంబులొనరింపు మనుచుం బలికిన నమ్మునివరుండు.

క. ఘను నగ్రతనయు రాముం, డనుచుం గైకసుతు భరతుఁ । డనుచు సుమిత్రా
తనయులఁ గ్రమమున లక్ష్మణుఁ,డనుచును శత్రుఘ్నుఁ డనుచు । నాఖ్యలు సేసెన్.

సీ. అంత బాలక్రీడ । లాదిగాఁ దమలోనఁ, గవగూడి రామల । క్ష్మణులు భరత
శత్రుఘ్నులును [3]బాల్యసఁగ వేదశాస్త్రముల్, చన ధనుర్వేదంబు । సకలకళలు
నభ్యసించుచు నాయు । ధాభ్యాసములు వాహ,నారోహణాదులు । నాస్థతోడ
నలవరించుచు వార । లన్యోన్యరాగు లై, యమర నేకగ్రీవు । లగుచు గురుల
కెలమి శుశ్రూష సేయుచు । నెల్లజనులుఁ, బొగడ ధీరులు శూరులై । బుద్ధి నీతిఁ
బుణ్యమునఁ దేజమునఁ బేర్మి । భూతినఖల,సుగుణములనొప్పుచుండిరి । సొంపు లెసఁగ.

వ. అంత నొక్కనాఁడు. 162

క. గుణకర్ష జనితపరుష, వ్రణకిణపటుబాహుయుతుల । వాజిగజారో
హణకఠినాంగుల సతతో,ల్బణశస్త్రాభ్యాసకలిత । లఘుతరతనులన్. 163

క. తనయులఁ గనుఁగొని జనపతి, మునుకొని వేడుక వివాహ । ములు సేయఁగ యౌ
వనకాల మయ్యె ననుచుం, దనమదిఁ దలపోయుచుండఁ । దత్సమయమునన్. 164

1 హరికంశమగు. 2 లుద్ధతదాసాన్విత. 3 'నోలి సరి వేద' వ్రా. ప్ర.

—✿ విశ్వామిత్త్రుండు దశరథునిం గానవచ్చుట. ✿—

మ. ధరణీశుం గన గాధిపుత్త్రుఁడు సముద్యత్పుణ్యగాత్త్రుండు భా
సురచారిత్త్రుఁడు సర్వసంయమిజనస్తోత్త్రైకపాత్త్రుండు సు
స్థిరసంపూర్ణతపఃపవిత్త్రుఁ డురుసందీప్తప్రభామిత్త్రుఁ డ
ధ్వరసంపూజితవీతిహోత్త్రుఁ డగువిశ్వామిత్త్రుఁ డేతెంచినన్. 165

క. కని దౌవారికుఁ డురవడిఁ, జని విశ్వామిత్త్రుఁ డిటకుఁ జనుదెంచినవాఁ
డనుడుఁ బురోహితయుతుఁడై, జననాథుఁడు వాసవుండు చతురాస్యునకున్.

క. ఎదు రేఁగినగతి నమ్ముని, కెదురుగఁ జని మ్రొక్కి యర్ఘ్య మిచ్చి ప్రమోదం
బొదవఁగ నుండం గనుఁగొని, హృదయం బలరఁగ మునీంద్రుఁ డి ట్లని పలికెన్.

క. దశరథ నీకుం బ్రజలకుఁ, గుశలమె సుతబంధురాష్ట్రకోశంబులకుం
గుశలమె వసిష్ఠ నీకుం, గుశలమె మునులార మీకుఁ గుశలమె యనినన్.

క. అందఱుఁ గుశలము లన న,య్యందఱుఁ దోడుకొని వచ్చి యర్హాసను లై
యందఱు గృహమున నుండఁగ, నందఱుఁ బూజించె నృపతి యనురాగమునన్.

వ. అప్పుడు దీప్తాగ్నియుంబోలెఁ దేజరిల్లెడువిశ్వామిత్త్రు నవలోకించి. 170

సీ. అమృతంబు సంప్రాప్త మైనచందంబున, మరుభూమి నురువృష్టి గురిసినట్లు
[1]నిఱుపేద కర్థంబు నెఱయఁ గల్గినభంగి, నంబురాశికిఁ బర్వ మైనకరణి
ననురూపసాధ్వియం దనపత్యునకుఁ బుత్త్ర,జనన మబ్బినమాడ్కి మునివరేణ్య
నీశుభాగమనంబు నేఁడు నా కిటఁ గల్గెఁ, గాన ధన్యుఁడ నైతిఁ గంటిఁ గీర్తి
యెల్లపుణ్యభోగములు నా కెదురువచ్చె, శుభచరిత్రుండ వతితపశ్శ్లాఘ్యమతివి
పరమపాత్త్రుఁడ వగునీకు భక్తితోడ, నేమి యడిగిన నిచ్చెద నెలమి నేఁడు.

క. అనవుడు వసిష్ఠశిష్యుఁడ, వనఘుఁడ వతిసత్యధనుఁడ వర్కాన్వయసం
జనితుఁడవుఁ గాన యిటకుం, జనుదెంచితి నాదుకోర్కి సమకూర్పు తగన్. 172

చ. ఇరువురు రక్కసుల్ సవన మెప్పుడు నే దొరఁకొంటి నంతలోఁ
బరిగొని వచ్చి వేదికలపై రుధిరంబులు సల్లి మాంసము
ల్నెరపుచు యజ్ఞవిఘ్న మవలీల నొనర్తురు సారెసారెకుం
గెరలి శపింప వారిఁ బరికించి తపోవ్యయ మోర్వలేమిచేన్. 173

క. [2]దశరాత్రసవనమునకుం, గుశలత నేయంగ వలయుఁ గుటిలనిశాటుల్
భృశగతిఁ జెఱుపక యుండను, దశరథ నీసుతుఁడు వారి దక్షతఁ దునుమన్.

క. కావున నప్పాపాత్ముల, వేవేగ వధించి లోకవినుతులు పొందఁగ
నీవరపుత్త్రుని రాముని, భూవర ప్రియమార నాకుఁ బుత్తెమ్ము తగన్. 175

ఉ. బాలుఁ డశక్తుఁ డీతఁ డనుభావము మానుమి తండు సర్వది
క్పాలకపాలనక్షమనృపాలుఁడు [3]నానతవిద్విషత్క్షమా

1. 'నిఱుఁబేద' వ్రా. ప్ర. 2 దశరాత్రము సవనమునకుఁ. 3 'దారితదేవవిద్విషత్పాలుఁడు వ్రా. ప్ర.

పాలుఁడు లోకపాలుఁడుఁ గృ§పాళుఁడు సజ్జనపాలుఁ డన్యభూ
పాలుర యజ్ఞపాలనకుఁ §[1]బాడిగ నేనిటు కోరి వత్తునే. 176

చ. అలఁతిగఁ జూడ కీర్తనిమ§హాత్త్వ మెఱుంగు వసిష్ఠుఁ డీమహా
బలుఁడు మదీయయాగపరి§పాలనదక్షుఁడు దుష్టరాక్షసా
వలియెడ నిర్భయుండు మది§వంచకు నీసుతు వజ్రవర్మ మై
యలవడఁ గాచి తెచ్చెద సమగ్రతరం బగుమేలు నిచ్చెదన్. 177

వ. అని యిట్లు విశ్వామిత్రుండు పలికిన. 178

క. కువలయపతి కపుడు తనూ,భవుఁ బుత్తె మ్మనుమునీంద్రు§భాషణము ఘన
శ్రవణవిదారణదారుణ, రవ మై వినిపింప మూర్ఛ§[2]గ్రక్కున ముంపన్. 179

వ. సింహాసనచలితుం డగుచు దశరథుం డల్లన తెలిసి. 180

క. ఉల్లము జల్లన నెంతయుఁ, దల్లడ మందుచు విషాద§తప్తుం డగుచుం
బెల్లుగ భయమును బ్రేమయు, మల్లడిగొన మౌనిఁ జూచి§మనుజేశుఁ డనున్.

క. బాలుఁ డకృతాస్త్రుఁ డబలుం, డాలంబుల తెఱఁగు లెఱుఁగఁ§డరుల జయింపం
జాలునె నిశాటవికటా,భీలాకారములు చూచి§బెగ్గిల కున్నే. 182

క. పరనిజశక్తు లెఱుంగఁడు, గురుతరశస్త్రప్రయోగ§కుశలుఁడు గాఁడు
దురరిపుసాధనహేతులకుఁ, దెరలఁగ సైరింపఁ గలఁడె§దృఢదేహుం డై. 183

క. అఱువదివేలబ్దంబులు, నెఱయఁగ మని సుతులఁ గనని§నెవ్వగచేతన్
మఱుఁగుచు జర మేనం గ్రి,క్కిఱియఁగఁ దఱి దప్పి సుతుల§[3]ని ట్లేఁ గంటిన్.

వ. ఆసుతులలోన. 185

క. రాముం డగ్రతనూజుఁడు, రాముఁడు కులవర్ధనుండు§రాముఁడు ప్రియుఁ డే
రామునిఁ బుత్తేఁ జాలను, రాముని నేఁ బాసి క్షణము§బ్రదుకఁగ నోపన్.

క. పదియేనేఁడులబాలుని, సదమలగుణుఁ గాకపక్ష§సంయుతు ని ట్లే
నదయతఁ బుత్తేఁ జాలను, సదయుఁడ వగు రామువలన§సంయమివర్యా. 187

క. అక్షౌహిణిసామంతుల, నీక్షణమునఁ గొనుచు వేగ§మే వచ్చెద నా
రాక్షసుల కెదిరి నీమఖ,రక్ష యొనర్చెదను ధరను§బ్రదికినదాఁకన్. 188

వ. అట్లు గా కున్న. 189

క. నానందను నొక్కనిఁ జను,నా నామది సొరదు గాన§నందనుతోడన్
నానాసేనలతో నట, కే నేతెంచెదఁ గడంక§నేఁగు మునీంద్రా. 190

వ. అని పలికి. 191

శా. ఆరాత్రించరు లెవ్వ రెవ్వఁడు మఖా§పాయంబుఁ బొందింపఁగా
వారిం బంచినవాఁడు వారలబల§వ్యాపార మేచంద మా
క్రూరాఘాన్వితవృత్తు లెవ్వనిసుతుల్§ఘోరాజిలో వారి నా

1 బాలుగ; బాలుర. 2 గ్రిక్కఁఱు. 3. సెట్లో.

కేరూపంబున నోర్వ శక్యము మనం ౹ బింపారఁ జెప్పం డనన్. 192

క. వారలు రావణుపంచిన, వారలు మఖహ_ర్త లగుచు ౹ వ_ర్తింతు రిలన్
మారీచసుబాహులు వా, రారయ సుందోపసుందు ౹ లనువారిసుతుల్. 193

వ. అని పలుక నతిభీతుం డగుచు దశరథుం డంతర్గతంబున. 194

క. అక్కట నాశిశు వెక్కడ, రక్కసు లెక్కడ మహోగ్ర ౹ రణ మెక్కడ నా
రక్కసుల గెలుచు టెక్కడ, నిక్కార్యము లేల పొసఁగు ౹ నిట్టివి గలవే. 195

వ. అని వితర్కించి. 196

ఉ. రావణచోదితప్రబల ౹ రాక్షసు లీక్షణభీషణాకృతుల్
దేవగణోగ్రయుద్ధములఁ ౹ దేటినవీరు లుదగ్రులైనమా
యావులు గామరూపులు భ ౹ యంకరకోపులు లోకభైరవా
రావు లుదగ్రవిగ్రహక ౹ రద్విషదాక్రమవిక్రమక్రముల్. 197

క. ఆరావణచోదితు లగు, మారీచసుబాహు లుగ్ర ౹ మనుజాహారుల్.
వారల మనుజులు మార్కొను, వారా దేవేంద్రుఁ డాజి ౹ నారికి వెఱచున్. 198

క. ఏ మున్ను వెఱతు నట రా, రాముఁడు శిశు వంతకంటె ౹ రాముడు వెఱచున్
మామీఁదఁ గరుణసేయు సు, ధీమయ మగ్గురుఁడ విష్ణు ౹ దేవత వరయన్. 199

చ. అనవుడు నగ్నిలోన ఘృత ౹ మాహుతి వోసినమాడ్కి మండి నె
క్కొను పెనుఁగిన్కతోఁ బలికెఁ ౹ గోరిక లిచ్చెద నంచు నిచ్చతోఁ
జన మును పల్కి బొంకెదు మృ ౹ షావచనున్ నినుఁ జూడఁ గాదు పెం
పొనరఁగ నీవు నీహితులు ౹ నున్నతి నుండుఁడు పోయి వచ్చెదన్. 200

క. అని కౌశికుఁ డలుగఁగ మే, దిని గంపించెను సమస్త ౹ దేవతలు భయం
బునఁ బొంది రపుడు లోకము, మునుకొని బెగడుట వసిష్ఠ ౹ ముని గని నృపుతోన్.

ఉ. ప్రాకటధర్మమూర్తి వతి ౹ బంధురసత్యయశోధనుండ వి
క్ష్వాకుకులప్రసూతుఁడవు ౹ సమ్మతి నిచ్చెద నంచుఁ బల్కి నీ
చాకృతి నీకు బొంకు టది ౹ యర్హమె బొంకిన సర్వధర్మముల్
వే కడతేఱి పోవె యురు ౹ విశ్రుతకీర్తియు మాసి పోవదే. 202

సీ. ధరణీశ దక్షుని ౹ తనయలు జయయు సుప్రభయు నాఁగ భృశాశ్వ ౹ పత్నులందు
జయ కామరూపులు ౹ సత్వసంపన్నులు, నసమాస్త్రరూపులు ౹ నైనసుతులఁ
బరఁగ నేఁబండ్ర సు ౹ ప్రభ శస్త్రరూపులై, భాసిల్లుసుతుల నేఁ ౹ బండ్రఁ గనిరి
దైత్యవధార్థమై ౹ తనర నాశస్త్రాస్త్రవితతి నీతఁడు రాజ్య ౹ వేళఁ బడసె
మఱియు నన్యశస్త్రాస్త్రముల్ ౹ మది సృజింప, నేర్చు నిగ్రహాదులకంటె ౹ నిఖిలలోక
సకలశస్త్రాస్త్రజాలముల్ ౹ సాల నెఱుఁగు, నితఁ డెఱుంగనియస్త్రంబు ౹ లెందు లేవు.

చ. అనలముచేత గుప్త మగు ౹ నయ్యమృతంబునుబోలె నీతపో
ధనపరిరక్షితుం డగుచుఁ ౹ దద్దయు నొప్పెడునీతనూభవుం

డని నకృతాస్త్రిఁ డైనను ని|రాయుధుఁ డైన నిశాటకోటికిం
జెనకఁగ రాదు కౌశికుఁడు | చెప్పఁగఁ గేవలసంయమీంద్రుఁడే. 204

చ. అతులతపంబునందు బల|మందు మతిం ఘనభూతి లోకవి
శ్రుతుఁ డితఁ డానిశాచరులఁ | ద్రుంప సమర్థుఁడ యీమిషంబునం
హితమతి సీతనూభవున | కెంతయు మే లొనఁగూర్పఁ గోరి నీ
సుతుఁ గొనిపోవ వచ్చె నిటు | సూనృత మొప్పఁగ నింక నెమ్మదిన్. 205

క. వేవేగ నీతనూజుని, భూవర కౌశికున కిచ్చి | పుచ్చుము వేడ్కం
నావుడు ముదితుం డగుచుం, భూవినుతుల రామలక్ష్మణులఁ జీరి తగన్. 206

—రామలక్ష్మణులు విశ్వామిత్రువెంట నరుగుట.—

క. పుణ్యాహవాచనంబులు, పుణ్యమునివసిష్ఠమంత్రి|భూసురనానా
పుణ్యాశీర్వాదంబులు, పుణ్యోత్సవఘోషణములుఁ | బోరిఁబోరిఁ జెలఁగన్. 207

క. తనకులకాంతలుఁ దానును, గనుఁగొని దీవించి మస్త|కఘ్రాణము లిం
పెనయఁగఁ జేయుచుఁ గౌశిక,మునిచేతికి నిచ్చె సుతుల|మోదం బెసఁగన్. 208

తే. అపుడు సుఖవాయువులు వీచె | నమరు లోలిఁ, బుష్పవర్షము గురిసిరి|భూరిదివ్య
శంఖదుందుభిస్వనములు|చదలఁ జెలఁగె, ముదితులై రెల్లసురలుస|న్మునులుజనులు.

మ. అతులోత్సాహధురీణు లై పటుతర|జ్యాంతర్ధనుఃపాణు లై
తతగోధాంచితభర్మనిర్మితభుజ|త్రాణాంగుళీత్రాణు లై
యుతబాణోన్నతతూణు లై బిరుదకే|యూరాఢ్యదోస్స్థాణు లై
ప్రతతస్ఫీతకృపాణు లై త్రిభువన|త్రాణైకపారీణు లై. 210

వ. ఆరాజన్యకుమారులు మణిగణాలంకారశోభితాకారు లై శివునివెనుకం జనువినా
యకకుమారులుంబోలె నవ్విశ్వామిత్రువెనుక సార్ధయోజనం బరిగి సరయువు
దక్షిణతీరంబు సేర నెలమి నచ్చటఁ గౌశికుండు రామచంద్రు నవలోకించి. 211

ఉ. ఆఁకలి నీరువట్టు శ్రమ | మంగవిపాటన మార్తి జూర్తి నిం
జోఁకక యుండ విద్య లొగి | సొంపుగ నీ కుపదేశ మిచ్చెదం
దేఁకువ వారిపూరమున | దిగ్గన శుద్ధి యొనర్చి ర మ్మనం
వీఁక రఘూద్వహుండును బ|విత్రజలంబుల వార్చి వచ్చినన్. 212

క. బలయు నతిబలయు ననువి,ద్యలు నన నుపదేశ మిచ్చి | యమ్మౌని యీవి
ద్యలు కమలాసనునితనూ,జలు మార్గము లేఁగుచోట |జపియింతు రొగిన్. 213

క. ఇవి జపియించిన రఘుసం,భవ సుప్తుఁడ వైన మఱి ప్ర|మత్తుఁడ వైనం
భువి రాక్షసభయములు చెం,దవు దుర్దశ లెల్లఁ బాయుఁ |దద్దయు నీకున్. 214

వ. మఱియు నివ్విద్యలవిశేషంబులు. 215

క. అమరఁ బఠించిన సౌభా,గ్యమున నెఱుక బుద్ధినిశ్చ|యంబున దాక్షి
ణ్యమున బలంబున భుజశౌ,ర్యమునఁ ద్రిలోకముల నీకుఁ | బ్రతి లేకుండున్.

క. అని పలుక సంతసిలి యా, ఘనవిద్యాకలితుఁ డగుచుఁ । గౌసల్యానం
దనుఁడు శరత్కాలోదిత, దినకరుచందమున వెలిఁగెఁ । దేజం బెసఁగన్. 217

వ. అంత నమ్మునికి గురుశుశ్రూష లాచరించి తానును దమ్ముండును గౌశికుండును
దృణశయ్యల నిద్రించి యారాత్రి వేగిన. 218

క. తనసుతులఁబోలె నుపలా, లనముల మేల్కొలుప రామ । లక్ష్మణులు రయం
బున మేల్కని యాహ్నికవిధు, లొనరిచి మునిపతికి మ్రొక్కి । యుత్సవ మెసఁగన్.

అంగదేశవృత్తాంతమును రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు చెప్పుట.

వ. గమనోద్యుక్తులై చని ముంగట జాహ్నవిఁ గనుంగొని యచట సరయూసంగ
మంబున ననేకదివ్యసహస్రవర్షంబు లత్యుగ్రతపంబు లాచరించినపుణ్యాతపోవ
నాలయంబు నొక్కటిఁ గనుంగొని కౌశికుం జూచి యిప్పుణ్యాశ్రమం బెవ్వరియా
శ్రమం బిం దెవ్వరు తపంబు సేసిరి మా కెఱుంగ నానతిం డనుడు దరహసితము
ఖుండై కౌశికుండు రాఘవులతో ని ట్లనియె మున్నిచ్చటఁ గందర్పుండు మూర్తి
మంతుఁడై కాముం డనఁ బరఁగె నిది కామాశ్రమం బీయాశ్రమంబున. 220

క. హరుఁడు దప మాచరింపఁగ, హరుతప ముడిగించి మించి । యద్రితనూజన్
హరునకుఁ బెండిలిచేసెద, వెరవుగ సురహితముఁ జేసి । వెలసెద ననుచున్.

క. దర్పకుఁ డెంతయు భుజబల, దర్పంబున హరుఁ గలంపఁ । దలకొని చేరన్
దర్పకుని నుగ్రదృష్టిని, దర్ప మడంపంగ హరుఁ డు । దగ్రతఁ జూడన్. 222

క. అంగములు దొలఁగి కాముఁ డ, నంగుఁ డనం బరఁగె నతని । యంగంబులు భూ
రంగమున నెరయఁ బడఁ బె, త్సంగతి నాదేశ మంగ । సంజ్ఞ వెలసెన్. 223

వ. ఇప్పుణ్యాశ్రమంబున మదీయశిష్యు లయినతపోధను లున్నవా రిక్కడ నివాస
యోగ్యం బగు నీయుభయనదీమధ్యంబు పుణ్యదేశం బిచ్చటఁ బూతస్నాతుల మై
జపహోమాదు లైనయాహ్నికకృత్యంబు లాచరించి యీరాత్రి యిచ్చట
వసియించి యెల్లి యిమ్మహావాహిని దాఁటి [1]పోద మన నంత నక్కడిమును లే
తెంచి నమస్కారపూర్వకంబుగా విశ్వామిత్రున కర్ఘ్యపాద్యప్రముఖాతిథిసత్కా
రంబు లాచరించి పదంపడి రామలక్ష్మణుల నుచితక్రమంబుల సన్మానించి [2]నిజమం
దిరములకుం గొనిపోవ విహితసాయంకాలానుష్ఠానంబు లాచరించి యారాత్రి
పుచ్చి మఱునాఁ డమ్మునులు గొలిచివచ్చి నావ వెట్టించి యింక విచ్చేయుం డన
నగుం గాక యని యమ్మునుల వీడ్కొని నావ యెక్కి యమ్మువ్వురు నెలమి. 224

తే. నావ నానది దాఁటుచో । నడుమ రామ
లక్ష్మణులు మునిఁ జూచి యు । ల్లాస మొదవ
భంగసంఘాతభంగురాం । భః ప్రభూత
తుములఘోషంబు లద్భుతా । ద్భుతముగఁ బర్వ. 225



1 పాదం డన. 2 నిజశిబిరంబులకుం గొని.

వ. వీతెంచుచున్నవివి యెందులఘునధ్వను లన నమ్ముని యక్కుమారులతో నిట్లనియె.

చ. చను రజతాద్రిమీఁద నొక చారుసరోవర మబ్జగర్భుచే
మనమున నిర్మితం బగుట మానసనామము నొంది రూఢిగా
ననువుగ దత్సరఃప్రసృతమై సరయూనది యయ్యయోధ్యచు
ట్టును బ్రసరించి జాహ్నవిఁ గదుర్క వడిఁ గూడఁగ నేఁగుదెంచినన్. 227

క. గంగాసరయూసంగమ, భంగము లొండొంటిఁ దాఁకి ప్రభవించినయు
త్తుంగధ్వను లివి యని ముని, పుంగవుఁ డెఱుఁగంగఁ జెప్పె భూవరసుతులన్.

క. కనుఁగొని మ్రొక్కుఁడు వినయం, బున ననవుడు భక్తితోడ మ్రొక్కుచు నావా
హిని దాఁటి దక్షిణతట, మ్మున నిల్చి రఘూద్వహుండు మునిపతితోడన్.

సీ. కకుభాశ్వకర్ణతిందుకబిల్వఖదిరమ, ధూకపాటలసాలదుర్గమంబు
కంకఝిల్లీబకక్రౌంచఘూకానేక, కాకకులస్వనకలకలంబు
సూకరహర్యక్షశుండాలశార్దూల, శరభాదిమృగకులసంకులంబు
నాయతబహుతరచ్ఛాయానిరస్తస, మస్తతీవ్రాంశుగభస్తిచయము
నంధకారీకృతాశాంతరాంతరంబు, దుర్నిరీక్ష్యంబు జనలోక[1]దురవగాహ
మఖిలవనమృగగణశరణ్యంబు [2]నీయ, రణ్య మారయ నెవరియరణ్య మనిన.

వ. మునిపతి రఘుపతితో ని ట్లనియె. 231

సీ. అమరనాయకుఁడు వృత్రాసురు వధియించి, యధికపాపబ్రహ్మహత్యఁ బొంద
సురలు మునీంద్రులు సరభసంబున వచ్చి, సుత్రాముగాత్రంబు శుద్ధిఁ బొందఁ
గమనీయపావనకలశోదకంబులఁ, గడుగుచు నెమ్మనఁ గలయ నున్న
మలకరూశంబులు లలిఁ బుచ్చి యిలమీఁద, వైవంగ నప్పుడు వాసవుండు
విపులనిర్మలతరదేహవినుతశుద్ధిఁ, బొంది యెంతయు విలసిల్లి భూమి నాదు
మలకరూశంబు లివి రెండు మహిమతోడఁ, బూనెఁగావున నింకనీభూమియందు.

క. మలకలిత మైనదేశము, మలదంబుఁ గరూశయుక్త మహి గలదేశం
బలవడఁ గరూశనామము, నిలఁ గాని మ్మనుచు సంజ్ఞ లింద్రుఁడు సేసెన్. 233

వ. అది యాదిగా మలదకరూశదేశంబులు రెండును ధనధాన్యసంపన్నంబులై చె
న్నొందుచుండఁ గొంతకాలంబునకు. 234

క. తాటక యనియెడునొక్కని, శాటి సహస్రగజబలసమన్విత యయి యు
గ్రాటవిఁ జరించు సుందుని, జోటి యది తదీయసుతుఁడు శూరుం డెపుడున్.

క. అలఘుఁడు మారీచుం డా, మలదకరూశములు రెండు మానక నాశం
బుల్లు సేయుచుండుఁ దాటక, చలమున మార్గములు గట్టి జనులం జంపున్.

వ. అప్పాపాత్ములనిమిత్తంబున నిప్పురంబులు నిర్జనంబులై యుండుట మార్గం బిట్లు
దుర్గమారణ్యం బై యుండు నిచటికి నర్ధయోజనమాత్రంబునం దాటక యు

---

1 దుర్గమంబు నఖిలజనహింసమృగశరణ్యంబు. 2 నీకు రాక్రమారణ్య మెఱరియరణ్య మనిన.

న్నది యచ్చటికి మన మరిగి యప్పాపాత్మురాలి నాపంపునఁ దునిమి యద్దేశం
బులు నిష్కంటకంబులు సేయుము నీకుఁ దక్క నన్యులకు నాతాటక యున్న దే
శంబు గమింప నశక్యంబు. 237

క. అన విని విశ్వామిత్రుం, గనుఁగొని యారాముఁ డనియెఁ § గామిను లబలల్
గనుఁగొన నీయక్షికిఁ బెం, పెసయ సహస్రగజసత్త్వ § మేక్రియఁ గలిగెన్.

చ. అనుడు సుకేతునాముఁ డగు § యక్షుఁ డొకం డనపత్యుఁ డై చిరం
తనతప మాచరించి తగ § ధాతవరంబునఁ గూఁతు నొక్కతెం
దనర సహస్రనాగబలఁ § దాటకఁ గాంచి వివాహవేళయం
దు నలువు నొందుజంభునిసు § తుం డగుసుందున కిచ్చెఁ బత్నిఁగన్. 239

క. సుందుఁడుఁ దాటకయం దొక,నందన మారీచుఁ గాంచి § నాశము నొందన్
నందనుఁడుఁ దాను నాఁకటఁ, గంది యగస్త్యముని మ్రింగఁ § గదియఁగ వారిన్.

క. కనుఁగొని కనలి యగస్త్యుఁడు, ఘనరాక్షసమూర్తు లీరు § గం డని శపియిం
చిన రక్కసులై యిక్కా, ననమునఁ జరియింతు రెపుడు § నరవరముఖ్యా. 241

క. రణశూరత నీదుశ్చా,రిణిని దునుము పాపమతిని § స్త్రీ నైనను ని
ర్ఘృణతం జంపఁగ నగు బ్రా, హ్మణచాతుర్వర్ణ్యరక్ష § ణార్థము గాఁగన్. 242

క. జగదపకారిణి యగునా,భృగుపత్నిం దునిమె శౌరి § పృథ్వి హరింపం
దెగినవిరోచనసుత యగు, మగువఁ బురందరుఁడు దునిమె § మఱియు ననేకుల్.

క. జనహంత్రు లయినకాంతలఁ, దునుమాడిరి భూమిపతులు § దుర్జనతాభం
జనమున నగునది దోష, మ్మనక ప్రజారక్షచేత § యది ధర్మ మగున్. 244

చ. అన విని కౌశికోక్తులకు § నారఘురాముఁడు సంతసించి మ
జ్జనకునియట్ల నీవు ముని § సత్తమ నా కటు గాన నెమ్మి నా
జనపతిపన్పు నీపనుపు § సమ్మతిఁ జేసెద దుష్టతాటకా
హననముఁ జేసి భూసురగ § వామరలోకహితంబు సేసెదన్. 245

—శ్రీరాముఁడు తాటకను సంహరించుట.—

వ. అని పలికి. 246

ఉ. అంతఁ గడంక రాముఁడు [1]సమగ్రభుజాబలవిక్రమోత్సవం
బెంతయుఁ బర్వ నార్వి మొర § యించె దిగంతరదంతికర్ణరం
ధ్రాంతరసాగరాంతరధ § రాధరితలాంతరచక్రవాళశై
లాంతరసర్వభూధరగు § హాకుహరాంతరపూరితంబుగన్. 247

క. ఆతతచాపధ్వని విని, యాతంకముతో వనాటు § లందఱుఁ బఱవన్
భీతియుఁ గోపముఁ బెనఁగొన, నాతాటక యన్నినాద § మగుచక్కటికిన్. 248

చ. ఉరుతరపాదఘట్టనల § నుర్వి చలింపఁగ మేనిగాలి ను

1 'శరాసన మెక్కిడి విక్ర' వ్రా. ప్ర.

ద్ధురతరరేణువుల్ నెఱయఁ [1]దూల శిలాతరువృష్టు లుద్ధతిం
గురియుచు బాడబజ్వలనఘోరత రక్తనిషిక్తవక్త్రగ
హ్వర మెసఁగన్ దిశల్ వగుల నార్చుచు నుగ్రత నేఁగుదేరఁగన్. 249

ఉ. పాటితదుష్టసత్త్వ[2]వనవాటక నిద్ధబలావరుద్ధశృం
గాటక గ్రంథిలభ్రుకుటిగాఢలలాటకఁ గ్రూరతారకా
నాటక నాంత్రకాంచిపరిణద్ధశవప్రపతత్క్రిమిచ్ఛటా
కీటక రక్తసిక్తపటుఖేటకఁ దాటకఁ గాంచి రయ్యెడన్. 250

వ. ఇట్లు గాంచి రఘుపుంగవుం డనుజునితో నిట్లనియె. 251

చ. కనుఁగొను దీని ఘోరఘనకాయము లక్ష్మణ యీనిశాటిఁ జూ
చినజను లాత్మలన్ బెగడి చేష్టలు దక్కరె యైన నాయెడం
గనికర మయ్యెడున్ మగువ గావునఁ జంపఁగఁ జాల దీని ము
క్కును ఘనకర్ణముల్ దునిమి క్రొవ్వఱఁ జేసెద నాఁగ నంతలోన్. 252

చ. జవమున నానిశాచరి భుజంబులు సాఁచుచుఁ గిన్క రామభూ
ధవుపయి నేఁగుదేరఁ గడుఁదట్టన హుంకృతితోడ సంయమి
ప్రవరుఁడు భూరివాక్యముల భర్జనసేయుచు నాత్మలోన రా
ఘవులకు సేమమున్ జయము గావుత మంచును గోరుచుండఁగన్. 253

వ. ఆరాఘవులమీఁద నానిశాచరి రజో,మేఘంబు గావించి మించి రజముఁ గడఁగి గురియుచుమాయఁ గైకొని ముహూర్తముదాఁకఁ,గడుమోహపఱుపరాఘవుఁడు మాయాస్త్రమేసి యమ్మాయ నివారింప, నది శిలావృష్టిపై నడరి కురియ నలిగి సాయకవృష్టి నాశిలావృష్టిరూపడఁగించి యారాముఁ డానిశాటి కరము లురుశరములఁ ద్రుంప గరముడస్సి, చేరి తనసమీపమున గర్జిల్లుచుండఁ గనలి సౌమిత్రి యయ్యక్షి కర్ణయుగము,నగ్రనాసయుఁ దెగనేసె నంత యక్షి.

వ. మఱియుఁ గామరూపంబులు గైకొని యనేకమాయలు పరఁగించుచు నంతర్ధానగతయై యారాఘవుల ననేకాస్త్రవర్షంబుల ముంపఁ గౌశికుండు రామచంద్రుం జూచి దయ చాలు నింక ముందట సంధ్యాకాలం బగుచున్నది యింక మాయలం బ్రవర్తింపఁ గలదు యజ్ఞవిఘ్నకారిణియు మాయావినియుఁ బాపచారిణియు నగునీయక్షి వినుము. 255

క. రఘువర సంధ్యావేళల, లఘులీలల యాతుధానులను గెలువఁగ రా
దఘురహిత దీని వేగమ, మఘవత్ప్రియ మెసఁగఁ దునుము మహిమ మెలర్పన్.

మ. అని పల్కెన్ రఘునాయకుం డధికబాణాసారఘోరంబుగాఁ
గనదుగ్రాశనికైవడిం దనపమున్ గర్జిల్లుచుం బాఱుదేఁ
గని యత్తాటకపెన్నురం బురవడిం గాఁడంగఁ గ్రూరాస్త్ర మే

---

2 ఘోరశిలా... గురియఁగ. 3 తనుపాటక.

సిన నారక్కసి నేలఁ గూలి వడిఁ జచ్చెన్ భీమగాత్రంబుతోన్. 257

క. ఘోరతరాకారముతో, ధారుణిఁ బడి యొఱ్గి యున్న తాటకఁ గని బృం
దారకయుతుఁడై యింద్రుం, డారాముని వినుతిచేసి యర్చించి తగన్. 258

క. ఘనుఁ డగువిశ్వామిత్రుం, గనుఁగొని [1]మన కిష్ట మైన కార్యము సేసెన్
జననీ రాముఁడు సంతస,మునఁ బొందితి మేము నీవు మునివర యింకన్. 259

—విశ్వామిత్రుండు రామచంద్రునకు నానాస్త్రశస్త్రంబు లిచ్చుట.—

క. నీకుఁ గలయస్త్రశస్త్రము, లీకాకుత్స్థునకు నిమ్ము ని మ్మని దివిష
ల్లోకుఁడు నిజలోకమునకు, నాకౌశికుఁ బూజచేసి యరిగెం బిదపన్. 260

శా. సంధ్యాకాలము చేరఁగా నపుడు విశ్వామిత్రుఁ డాశ్చర్యసం
బంధ్యారూఢజయాఢ్యుఁడై నరఘుభూపాలాగ్రణిన్ మానసా
వంధ్యప్రీతి శిరంబు మూరుకొని భాస్వద్వంశ యీరాత్రి నీ
వింధ్యారణ్యమునందు వర్తిలి తగన్ వెల్వొల్లగా వేగినన్. 261

వ. మదీయాశ్రమంబునకుఁ [2]బోవుద మనిన రామలక్ష్మణులు సంతసించి ముక్తనిశాటం బగువనంబున నారాత్రి వసియించి యంతఁ బ్రభాతం బైన రాజపుత్రుల మేల్కొలిపి విహితానుష్ఠానంబు లాచరించి సస్మితముఖుం డై విశ్వామిత్రుండు రామచంద్రుం జూచి నీవలన నెల్లదేవతలును దేవేంద్రుండును ఋషులును సంతోషించిరి నీపరాక్రమం బొప్పు నీకు సురాసురగంధర్వయక్షరాక్షస గరుడోరగాదులను మఱియు నానాశత్రురాజులం దృణలీల గెలువం జాలు దివ్యాస్త్రశస్త్రంబు లిచ్చెద ననుచు దండచక్రంబును ధర్మచక్రంబును గాలచక్రంబును విష్ణుచక్రంబును నైంద్రాస్త్రంబును వజ్రాస్త్రంబును శైవం బగుశూలంబును బ్రహ్మశిరోస్త్రంబును నిషీకంబును బ్రహ్మాస్త్రంబును మోదకియు శిఖరిణియు నను రెండుగదలును ధర్మపాశంబును గాలపాశంబును వరుణపాశంబును వారుణాస్త్రంబును శుష్కార్ద్రం బగునశనిద్వయంబును బినాకాస్త్రంబును నారాయణాస్త్రంబును నాగ్నేయాస్త్రంబును శిఖరాస్త్రంబును వాయవ్యాస్త్రంబును బ్రథనాస్త్రంబును హయశిరోస్త్రంబును క్రౌంచాస్త్రంబును శక్తియుగంబును గంకాలంబును ముసలంబును గాపాలంబును గింకిణియు విద్యాధరాస్త్రంబును నందకాస్త్రంబును నసిరత్నంబును గాంధర్వాస్త్రంబును మోహనాస్త్రంబును బ్రస్వాపనప్రశమనంబులును ధర్షణశోషణసంతాపనవిలాపన మదన కాందర్ప పైశాచమోహనతామసంబులును సౌమనస్యంబును సంవర్తనంబును మౌసలంబును సత్యాస్త్రంబును మాయాధరంబును సర్వమాయాదమనంబును దేజఃప్రభంబును దేజోపకర్షణంబును సౌమ్యాస్త్రంబును ద్వాష్ట్రంబును సుదామనంబును గభస్త్యస్త్రంబును శీతేషువును మానవాస్త్రంబును గంకణంబును నను కామరూ

1 మాహితము లైనకార్యము. 2 బోదం డనిన.

పంబులు నధికబలంబులు నైనయీయస్త్రంబులు శస్త్రంబులు నాదిగాఁ గల ముఖ్యసాధనంబులు పరిగ్రహింపు మనుచుఁ బ్రాఙ్ముఖుం డై శుచియై మునివరుండు సంప్రీతితో దేవదానవులకు దుర్లభంబు లైనదివ్యాస్త్రంబులు రామునకు నొసంగ నవ్విశ్వామిత్రుం డిచ్చినయస్త్రశస్త్రంబులు రామచంద్రుం గొలిచి ప్రాంజలు లగుచుఁ బ్రియవాక్యంబుల నేము నీకింకరులము మమ్ముం బరిగ్రహింపుము నీమనోవృత్తి వర్తించెద మనిన రామచంద్రుండు సంతోషించి యవుంగాక యని విశ్వామిత్రునకు నభివందనంబు సేసి యయ్యస్త్రశస్త్రంబులు పరిగ్రహించి గమనోద్యుక్తు లై పోవుచు రాఘవుండు మునీంద్రా మీయనుగ్రహంబున సురలకు దనుజులకు దుర్ధర్షంబు లైనయస్త్రశస్త్రంబులు గలిగె వీని నుపసంహరించుతెఱంగు లెఱుంగవలయు ననిన విశ్వామిత్రుండు శుచిభూతుం డై యుపసంహారక్రమంబు లెఱింగించి సత్యవంతంబును సత్యకీర్తియు ధృష్టియు రభసముం బ్రతిహారతరంబును బరాఙ్ముఖంబు నవాఙ్ముఖంబును లక్ష్యాక్షివిషమంబును దృఢనాభంబు ననునాభంబును దశాక్షంబును శతవక్త్రంబును దశశీర్షంబును శతోదరంబును బద్మనాభంబును మహానాభంబును సునాభంబును దుందునాభంబును జ్యోతియుఁ గృతంబును నైరాశ్యంబును విమలంబును యౌగంధరంబును వినిద్రంబును మత్తంబును బ్రశమనంబును సార్చిమాలియు ధృతిమాలియు వృత్తిమంతంబును బిత్ర్యసౌమనమ్ములును విధుతంబును సుకరంబు నుగరవీరకరటియును ధనధాన్యంబులును గామరూపంబును గామరుజయు మోహనంబు నావరణంబు జృంభకంబు సర్వనాభంబు సంధానంబు వరణంబు నను భృశాశ్వతనయులం గామరూపంబులు గలయీయస్త్రంబులం బరిగ్రహింపు మందుఁ గొన్ని దివ్యభాస్వర దేహంబులు మూర్తిమంతంబులు శుభప్రదంబులుఁ గొన్ని యంగారసదృశంబులుఁ గొన్నిధూమసదృశంబులుఁ గొన్ని చంద్రార్కసదృశంబులు నని యమ్ముని యిచ్చుటయు నవి కృతాంజలు లగుచు మునీంద్రశిష్యుం డైనరాఘవుం గనుంగొని రఘువరా నీ కేమి సేయుదు మనిన రాఘవుం డి ట్లనియె. 262

క. ఎప్పుడు మిము నేఁ దలఁచెద, నప్పుడ యేతెంచి నాకు నభిమతసిద్ధుల్
చొప్పడఁ జేయుఁడు పొం డన, నప్పలుకుల కలరి మ్రొక్కి యరిగెఁ వేడ్కన్.

వ. తదనంతరంబ రాఘవుండు పయనమై పోవుచుండి ముందట నొక్కఘనశైలంబును దాని కనతిదూరంబున మేఘసంకాశం బగువృక్షషండంబును బొడగని కౌశికుం జూచి యి ట్లనియె. 264

## —వామనుని చరిత్రము—

క. వృక్షలతాకుంజంబులఁ, బక్షులబహునిస్వనముల భద్రద్విపహ
ర్యక్షాదిమృగంబులచే, నీక్షింపఁగ నొప్పుచున్న యీవన మరయన్. 265

ఉ. ఎవ్వరియాశ్రమం బిచటి కెక్కడ నెప్పుడు యజ్ఞవిఘ్నముల్

గ్రొవ్వునఁ జేయు రక్కసులు § గ్రుమ్మరుచుండుదు రద్దురాత్ములన్
నివ్వటిలంగ నీక శిత§నిష్ఠురబాణములన్ వధించెదన్
నెవ్వగ లెల్లఁ బాసి నను § నిర్జరు లెంతయు సంస్తుతింపఁగన్. 266

వ. అని పలికినం గౌశికుండు రామచంద్రుం గనుంగొని యిది వామనునిపూర్వాశ్ర
మంబు వినుము. 267

క. ఈయాశ్రమమున విష్ణుఁడు, పాయక యుగశతము లైన § బహువర్షము ల
త్యాయతతప మొనరించి త, పోయుక్తిం గామ్యసిద్ధిఁ § బొందుచు నుండున్.

చ. బలి యనుదైత్యనాయకుఁడు § బాహుబలోద్ధతి సర్వదేవతా
బలముల నింద్రునిన్ గెలిచి § ప్రాభవ మొప్పఁగఁ బట్టబద్ధుఁ డై
యలరి తదీయరాజ్యము స§మస్తముఁ జేయుచుఁ బేర్మితోడ ది
క్కులఁ దనకీర్తి పెంపెసఁగఁ § గోరిక యజ్ఞము సేయుచున్నెడన్. 269

క. దనుజారిఁ గానఁ బోవుదు, మనయాపద లుడిపి ప్రోచు § మసలక మధుసూ
దనుఁ డంచు నలువ మొదలుగ, ననిమిషు లీయాశ్రమమున § కరుదెంచి తగన్.

చ. కదుముగ మార విష్ణుఁ బొడ§గాంచి జనార్దన భూరివైభవం
బడర విరోచనాత్మజుఁడు § యజ్ఞము సేయుచు నెవ్వ రేమి త
న్నడిగిన వారి కెల్ల నఖి§లాభిమతంబుల నిచ్చుచున్నవాఁ
డడఁకువ లేక యాఘనుని§యజ్ఞసమాప్తికి మున్న వంచనన్. 271

క. వామనరూపము గైకొని, మామే లొడఁగూర్చి దేవ § మముఁ బ్రోవు కృపా
ధామ యని సురలు వేఁడఁగ, నామెయిఁ గశ్యపుఁడు దాను § నదితియుఁగోర్కిన్.

క. చనుదెంచి యీశుభాశ్రమ,వనమున వ్రతనిష్ఠ దివ్య§వర్షసహస్రం
బనుపమతర మైనతపం, బొనరించి తపంబు పూర్తి § నొందఁగ భక్తిన్. 273

మ. కలితశ్రీశుభవక్ష దేవవర నీ§గాత్రంబునన్ ముజ్జగం
బులు [1]పెంపొందుచు నుండు శోభనమహా§మూర్తిం గనుంగొంటి నిం
పలరన్ నీశరణంబు గంటి వరదా§యంచుం బ్రశంసించి ని
శ్చలమోదంబునఁ దాను బత్నియును జం§చద్భక్తితో మ్రొక్కినన్. 274

క. కరివరదుఁడు ప్రీతుం డై, కరుణం గశ్యపునిఁ జూచి§కశ్యప నను నే
వర మడిగె దడుగు నీ కా, వర మిచ్చెద ననిన మ్రొక్కి § వాంఛిత మారన్.

క. అదితికి నాకు సుతుఁడ వై, యుదయించి నిలింపపతికి § నున్నతవిభవం
బొదవఁగ ననుజన్ముఁడ వై, ముదమున నేలింపు లోక§ములు మా యన్నన్.

క. సిద్ధాశ్రమ మిది యభిమత,సిద్ధుఁడ వై తెన్నఁడేని § శ్రీవర నిన్నున్
బుద్ధిఁ దలంచినవారికి, సిద్ధముగా సర్వకార్య§సిద్ధులు గలుగున్. 277

1 'పెంపొందెడు నీతపోమయుఁ దపోమూర్తిం దపోరాశి ని,శ్చలభక్తిం దప మాచరించి నిఖిల స్వామిం గనుంగొంటి నిం, పలరన్ నీశరణంబు గంటి వరదా యంచుం బ్రశంసించినన్.

క. కావున నదితియు నేనును, దేవహితముఁ గోరుచున్న ౹ త్రిజగద్ధితముల్
వేవేగ సిద్ధిఁ బొందఁగఁ, గావింపుము దేవదేవ ౹ కారుణ్యనిధీ. 278

క. అని ప్రార్థన సేసిన వా, మనుఁ డై యదితి కుదయించి ౹ మఖవేళ విరో
చనసుతుఁ డగుబలిపాలికిఁ, జని పుడమిఁ బదత్రయంబు ౹ సమ్మతి వేఁడెన్. 279

చ. క్రమమున నిట్లు వేఁడికొని ౹ గ్రక్కున భూతల మెల్ల నేకవి
క్రమమున నాక్రమించి బలిఁ ౹ గట్టి యుదగ్రత నాజ్ఞ వెట్టి సొం
పమర జగత్త్రయంబు వశ ౹ మై చన నింద్రున కేల నిచ్చి లో
కములఁ ద్రివిక్రముం డనఁ బ్ర ౹ కాశయశంబులం బొందె రాఘవా. 280

క. ఇది సిద్ధాశ్రమ మని ముని, విదితంబుగఁ జెప్పె నాఁడు ౹ విశ్రుతపుణ్యా
స్పద మగునీయాశ్రమమున, సదమలమతి నేను దపము ౹ సలుపుదు నెపుడున్.

క. పాపాత్ము లైనరక్కసు, లేపున వచ్చెదరు వారి ౹ హింసింపుము ర
మ్మాపుణ్యాశ్రమమునకును, వే పోవుద మనుచుఁ బలికి ౹ వేడుకతోడన్. 282

వ. చనిచని యమ్మునీశ్వరుండు నీహారంబుఁ బాసి పునర్వసునక్షత్రసమేతుం డైన చంద్రుండునుం బోలె నాయాశ్రమంబు ప్రవేశించు నెడ నచటిమునులు విశ్వామిత్రుం బొడగని యుబ్బున గంతులు వైచుచు నెదు రేఁగుదెంచి యథాక్రమంబునం బూజించి యంత రామలక్ష్మణుల నతిథిసత్కారంబుల నాదరింప నచట ముహూర్తమాత్రంబు విశ్రమించి రప్పుడు రామలక్ష్మణులు ప్రాంజలు లగుచుఁ గౌశికుం గనుంగొని మునివరేణ్యా మీ రిప్పు డిచట. 283

క. దీక్షవహింపుఁడు మీమఖ, రక్ష యొనర్చెదము దుష్ట ౹ రాక్షసభటులన్
శిక్షించెద మన నమ్ముని, దీక్షితుఁ డై నియతి నుండె ౹ దృఢతరనిష్ఠన్. 284

—రాముఁడు మారీచాదులచేఁ జెడకుండఁ గౌశికునియాగంబుఁ గాచుట.—

వ. ఆరాత్రి రాఘవులు సమాహితు లై యుండి మఱునాఁడు ప్రభాతంబున సంధ్యాదికృత్యంబులు సలిపి యగ్నిహోత్రంబు లాచరించుచున్నవిశ్వామిత్రునకు నమస్కరించి మునీంద్రా యేకాలంబున రాక్షసులు ప్రచరింతు రెందాఁక యజ్ఞరక్ష సేయువార మనవుడు నమ్మాటలకు సంతోషించి యాసిద్ధాశ్రమవాసు లైనమును లారాఘవులం గొనియాడి కౌశికుండు దీక్ష వహించి మౌనంబున నున్నవాఁడు మీ రిమ్మునీశ్వరుని నిదిమొదలుగా నాఱుదినంబులు సావధానుల రై కాచి యుండుం డనిన నగుం గాక యని. 285

క. నేత్రము లెప్పుడు మొగుడక, ధాత్రీశు లధిజ్యచాప ౹ ధరు లై విశ్వా
మిత్రునియాగము పడహో,రాత్రము రక్షించి రతిధు ౹ రంధరలీలన్. 286

వ. అంత నాఱవదివసంబున రాముండు లక్ష్మణుం గనుంగొని శరశరాసనసన్నద్ధుల మై యేమఱక యుండుద మని యిరువురును యుద్ధోన్ముఖు లై యుండ నవ్విశ్వామిత్రుండు నిఖిలమంత్రతంత్రంబులను విధ్యుక్తక్రమంబున నాచరింపఁ గుశనమి

త్ప్రినవసుప్రిక్సుప్రివచరువులనలార్పితంబులు చేసినమంట లాకసంబంట యజ్ఞవేది ఋత్విగ్విశ్వామిత్రసహితంబుగాఁ బ్రజ్వలింప మింట నొక్కమహాఘోషంబు ఘోషించె నాసమయంబున. 287

క. మారీచసుబాహులు నా, నారాత్రించరులతోడ ◆ నభమున మాయా
నీరదములు పన్ని యసృ, గ్ధారలు వేదిపయిఁ గురిసి ◆ గర్జన లెసఁగన్. 288

క. తనమీఁదఁ బాఱుదేరఁగ, జననాథుం డనుజుఁ జూచి ◆ సౌమిత్రి కనుం
గొను మీదుష్టనిశాటుల, ఘనమారుతబాణ మేసి ◆ కౌతుక మెసఁగన్. 289

వ. తదీయవాతూలంబుచేత జీమూతజాతంబులుంబోలె విధూతులం జేసెద నను చుం బలికి. 290

క. ఆలోనన మారీచుని,శాలం బగువక్షమేయ ◆ శతయోజనముల్
తూలముగతిఁ దచ్చరవా, తూలముచేఁ దూలి వాఁడు ◆ తోయధిఁ గూలెన్.

శా. కీలాజాలము మింటఁ బెల్లెగయ నా◆గ్నేయాస్త్రి ముగ్రద్విష
త్కాలాభీలముగా సుబాహుఘనవ◆క్షుం బేసి యారక్కసుఁ
నేలం గూలిచి యున్నరక్కసులపై ◆ నిస్సీమదోశ్శక్తి వా
తూలాస్త్రిం బడరించి త్రుంచె నృపశా◆ర్దూలుండు దుర్వారుఁడై. 292

ఆ. అలుక నట్లు సకల◆యాతుధానులఁ ద్రుంచి, విజయ మొంది దివిజ◆విభునికరణి
నఖిలమునులుఁ దన్ను ◆ నగ్గింప నొప్పారె, రాజవృషభుఁడై న◆రామనృపుఁడు.

క. అంత మునీంద్రుఁడు దనమఖ, మంతయు సంపూర్ణమైన ◆ నారామునిఁ దా
సంతసమున నిట్లను న, త్యంతప్రియ మొందితిం గృ◆తార్థుఁడ నైతిన్. 294

క. పితృవాక్యము చెల్లించితి, క్రతురక్ష యొనర్చి తద్వి◆రప్రతిపక్షు
ప్రతతిఁ దునుమాడి సురముని,హితములు చేసితి సుకీర్తి ◆ నెసఁగితి వత్సా.

వ. అనిన. 296

క. మునివర మీకింకరులము, పను లేమిటి మమ్ముఁ బంపు ◆ భవదాజ్ఞం జే
కొని కావించెద మనవుడు, మనమున నమ్ముని ప్రమోద◆మగ్నుం డగుచున్.

క. అనుపమపుణ్యచరిత్రుఁడు, జనకుఁడు గావించుమఖము ◆ సమ్మద మారం
గనుఁగొన నేనును నిమ్ముని,జనములుఁ బోయెదము వినుము ◆ జనవర యచటన్.

క. వరగంధమాల్యదీపో, త్కరదూర్వార్చితము దేవ◆దత్తంబును నై
సురరాక్షసగంధర్వా, సురనరదుర్ధరము నగుచు ◆ సురుచిరమహిమన్. 299

ఉ. ఒక్కశరాసనంబు దగ ◆ నున్నది యెక్కుడు లావు చూడ్కికిన్
వెక్కసమైనరూపమును ◆ వ్రేఁకఁదనంబును గల్గి చేవమై
నెక్కడ దివ్య నెవ్వరికి ◆ నేగతి మానము గాక లీల నీ
[1]వక్కశినోగ్రకార్ముకము ◆ నక్కడఁ జూడఁగ రమ్ము రాఘవా. 300

1 వక్కశినంపుఁగార్ముకము.

భూపతు లనేకు లాఘన,చాపములా వెఱుఁగ వేఁడి । చనుదెంచి భుజా
టోపముల నెక్కువెట్టఁగ, నోపక వే పోదు రరుదు । నొందుచు మరలన్.

అని పలికి మునిగణసహితుండై రామలక్ష్మణులు తనవెంట నేతేర వనదేవతలార
యీసిద్ధాశ్రమంబునం దపస్సిద్ధుండ నైతి మీకు భద్రంబు గానిమ్ము పోయి వచ్చె
ద ననుచుం బలికి జాహ్నవియుత్తరతీరంబున హిమగిరిం గని ప్రదక్షిణపూర్వ
కంబుగా నమస్కరించి యుత్తరాభిముఖుం డై చన వెనుక సిద్ధాశ్రమవాసు లైన
మృగపక్షిజనంబులు చనుదేరం గడుదూరపథం బరిగి యస్తమయసమయంబున
శోణనదీకూలంబున సంధ్యాద్యనుష్ఠానంబులు సలిపి యొక్క నివాసంబు ప్రవేశిం
చి యాసీను లై యుండ విశ్వామిత్రు నచటిమునిజనులు పూజించి రప్పు డారామ
చంద్రుండు గౌశికుముందటఁ గూర్చుండి యోమునివరేణ్యా యీసమృద్ధవనశో
భితం బైన దేశం బెవ్వరిదేశం బెఱింగింపు మనిన విశ్వామిత్రుండు రామచంద్రున
కి ట్లనియె. 302

—✿కుశనాభుం డనురాజర్షి వృత్తాంతము.✿—

కుశుఁ డన నొకమునిసుతుఁ డస,దృశమతి వైదర్భియందు । ధీరుల రక్షా
కుశలుల వసువుఁ గుశాంబుఁ, గుశనాభు నసూర్తరజునిఁ । గోర్కిం గనియెన్.

కని తనయులఁ గనుఁగొని నం,దనులార సధర్ము లగుచుఁ । దనరఁ బ్రజాపా
లనపరు లై యుండుఁడు మీ, రనవుఁడు నాతండ్రిమాట । కనుమతు లగుచున్.

కుశాంబుండు కౌశాంబీనగరంబును గుశనాభుండు మహోదయాఖ్యపట్టణం
బు నమూర్తరజసుండు ధర్మారణ్యంబును వసువు గిరివ్రజం బనుపురంబును రచియిం
చిరి వసువుపేర నిబ్భూమి వసుంధర యనం బరఁగె నీశైలంబు లీభూమిచుట్టు
నుం బ్రకాశించుచుండు నీపంచశైలమధ్యంబున నొప్పెడుమాగధీనది మగధ
దేశంబుపైఁ బాఱుచుండుట నీభూమి మగధ యనంగ సుక్షేత్రయు సస్యమాలి
నియు నై విలసిల్లుచుండు నిది వసుదేశంబు వినుము. 305

నరవర కుశనాభుం డనఁ, బరఁగెడురాజర్షి గనియెఁ । బ్రమదంబున న
చ్చర యగుఘృతాచివలన, న్సురుచిరరూపవతు లైన । నూర్వురు సుతలన్.

ఆరాజకన్య లభినవ,చారువిలాసంబు లారఁ । జతురతరాలం
కారములు దాల్చి ఘనలీ, లారామము గాంచి చొచ్చి । యనురాగమునన్.

జంగమవల్లులో యమృతసాగరవీచులొ రత్నమూర్తులో
యంగజుమోహనాస్త్రములొ । యంచితహేమశలాకలో మహీ
రంగనటత్తటిల్లతలొ । రాజకళాసఖులో యనంగఁ ద
న్వంగులు వాద్యసంగతుల । నాడుచుఁ బాడుచు నుండ నత్తఱిన్. 308

అనిలుఁడు వచ్చి వారిరుచిరాకృతు లచ్చెరువారఁ గాంక్షతోఁ
గనుఁగొని మాన మేది తమకం బొదవన్ నృపకన్యలార నా

కనుమతి నిష్టభార్య లగుఁ డండఱు నిప్పుడు మీ కనూనయా
వనము సదామరత్వ మనవద్యచిరాయువుఁ గల్గి యుండెడిన్. 309

చ. అన విని వారు నవ్వి సకలాత్మలయందుఁ జరించు దేవతా
తనుఁడవు నీ వెఱుంగనియదంచితధర్మము లెందుఁ గల్గునే
యనుచితభంగి నీకు నిటు లాడఁగఁ గూడునె తండ్రి మీఱి ని
న్నెనయ వరింప మాకుఁ దగునే కులశీలము దాఁటవచ్చునే. 310

క. బ్రాఁతిగ నొడయఁడు దేవుఁడు, మాతండ్రియ మాకుఁ గాన మము నెవ్వరికిన్
మాతండ్రి యిచ్చుఁ బ్రియమున, నాతఁడు మారమణుఁ డంచు నండఱు వల్కన్.

క. కనలి యనిలుఁ డావనితల, తనువులు భంజించి క్రూరతఁ గుజ్జులు చే
సిన నిండ్లకేఁగి లజ్జా, వనతముఖాబ్జముల బాష్పవారి దొరంగన్. 312

క. వనటం బొందెడితనయలఁ, గనుఁగొని కుశనాభుఁ డాత్మఁ గలఁగుచు నానం
దనలార యకట మీ కే, చినకుబ్జత లెట్లు గలిగెఁ జెప్పుఁడ నాకున్. 313

వ. అనుచుఁ జింతాక్రాంతుం డై యున్నతండ్రికిఁ బ్రణమిల్లి వాయుదేవునివలనం దమకు నైనపరిభవక్రమం బెఱింగించిన నాకుశనాభుం డాకన్యలతో ని ట్లనియె.

ఉ. నాసుతలార మీకతన నాకుల మున్నతిఁ బొందె నేఁడు నా
చేసినపుణ్య మొప్పె మదిఁ జింత తొలంగె ముదంబు నొందితిన్
మీసుగుణంబులున్ ధృతులు మిక్కిలి యొప్పును దేవకార్యమై
యీసునఁ దెంపు సేయక సహించితి రీక్షమ యొప్పు నెంతయున్. 315

తే. క్షమయ జనుల కాభరణము క్షమయ కీర్తి
క్షమయ ధర్మంబు క్షమయ సజ్జనగుణంబు
క్షమయ యజ్ఞంబు క్షమయ మోక్షంబు క్షమయ
సకలదానంబు క్షమయందె జగము నిలుచు. 316

వ. కావున క్షమావతు లైనమీకు క్షమయం దన్యకన్యలు సమానలే యనుచు గౌరవించి వీడ్కొలిపి మంత్రులతో మంత్రాలోచనంబు సేసి దేశకాలపాత్రంబు లెఱింగి నాతనయలం దగినవరుని కీ వలయు ననుచుం బలికి. 317

తే. వినుతచరితుండు చూళియన్మునివరుండు, పరఁగనూర్ధ్వ రేతస్కుఁ డై బ్రాహ్మమైన
తపము సలుపంగ నటకు గాంధర్వియైన, యూర్మిళాపుత్రి సోమద సేర్మి వచ్చి.

క. వేమఱు పరిచర్యల మది, కామోదము సేసి యాతఁ డట వరదుఁడు గా
సోమద యామునివలనం, దా మానసపుత్రు బ్రహ్మదత్తునిఁ బడసెన్. 319

క. ఘనుఁ డైనబ్రహ్మదత్తుఁడు, చనఁ గాంపిల్యపురి కరిగి జగతిన్ బుధు తా
నన నేలెం గావున నా, జనపతికి మదీయదుహితృశతకము నిత్తున్. 320

వ. అని బ్రహ్మదత్తుని రావించి సంభావనతోడ. 321

చ. అహిమరుచిప్రతాపుఁ డగునాకుశనాభుఁడు బ్రహ్మదత్తుకై

దుహితృశతంబు నీ నతఁడు । దూకొని వారిఁ గ్రమంబునం గర
గ్రహణము సేయ నావిభుకరం బట్టు మోపినయంతలోన న
మ్మహిళలు కుబ్జరూపములు । మానఁగ నొప్పిరి చారుమూర్తులై. 322

ఉ. [1]తనయలగుజ్జు మానుటకుఁ । దండ్రి గనుంగొని సంతసించి యా
తనయలఁ గూర్మిఁ గౌఁగిట ముదంబునఁ జేరిచి సన్నుతించి యా
జనపతి యల్లునిన్ సుతల । సంతస మొందఁగ నాదరించి నే
ర్పులఁ బయనంబు సేయ నట । పోయిరి వారును వేడ్క నయ్యెడన్. 323

క. పుత్రప్రీతిం గమలజ, పుత్రుండు గుశుండు దనదు । పుత్రునకుఁ దగం
బుత్రులు గలుగక యునికిని, బౌత్రునిఁ గలిగింపఁ జేసెఁ । బౌత్రక్రతువున్. 324

క. చన నయ్యజ్ఞయు వర్తిలఁ, దనయునిఁ గుశనాభుఁ జూచి । తనయుఁడ నీకుం
దనయుండు గాధి గలిగెడు, ననుపమపుణ్యైకలోలుఁ । డవ్విభుకతనన్. 325

క. వినుతయశంబును బొందెద, వని పలికి కుశుండు వారిజాసనలోకం
బున కరుగఁ గొంతకాలము, సనఁ గుశనాభునకు గాధిజనపతి పుట్టెన్. 326

క. ఘనుఁడైనగాధి నాకున్, జనకుఁడు నా కగ్రభగిని । సత్యవతి దపో
ధనుఁడైనరుచికుసతి పతి, చన వెనుకన్ బొందితోన । చనియెను దివికిన్. 327

వ. అట్లు నాకంబున కేఁగి పుణ్యవశంబున. 328

క. సత్యమయమూర్తి యగునా, సత్యవతీదేవి తుహినశైలంబున సం
స్తుత్యగతిఁ బుట్టె లోకను, కృత్యున్నతికొఱకుఁ గౌశికీనది యనఁగన్. 329

క. అనిశము భగినీస్నేహం, బున నీనదిపొంతఁ దపముఁ । బూని చరింతున్
విను మిది సిద్ధాశ్రమ మిటఁ, దనరఁ దపస్సిద్ధుఁడైతిఁ । దగ నీకతనన్. 330

వ. రఘువరా కుశికవనంబున నుదయించి యేను గౌశికుం డన నాయగ్రజ కౌశికి యన విఖ్యాతిం బొందితిమి నీ వడిగినదేశక్రమంబును మాకులాగతక్రమంబును వినిపించితి నిపుడు. 331

క. రక్షోయక్షవిహారస, మక్షుంబు నిలీనమృగచయంబు నిమీల
త్పక్షికులాక్షము నిశ్చల, వృక్షమ్ము నిశాటభూతవిహృతిస్థలమున్. 332

వ. అగుచు నివ్వనం బున్నయది మఱియును. 333

చ. గగనము తారకాగ్రహవికాసవిభాసితమై వెలింగెడున్
మొగిసినచీఁకటిం జెఱిచి । ముంగలిదిక్కులు తెల్లఁజేయుచున్
జగముల కుత్సవం బొదవఁ । జంద్రిక గాయుచు భాసమానుఁడై
నెగడెడు నింగిఁ జందురుఁడు । నిద్దురవోయెడి నెల్లజీవులున్. 334

క. విను మర్ధరాత్ర మయ్యెన్, జనవర నిద్రింపు మీవు । సౌమిత్రియు నిం
కని పలికి యూరకుండెన్, మునివరుఁ డపు డఖిలమునులు । మోదముతోడన్.

---

1 తనయ లకుబ్జ లై మనుట తండ్రి గనుంగొని. 2 సుకృతవశంబున.

వ. కౌశికుం బూజించి నీవంశం బతిపుణ్యప్రకాశంబు నీవంశసంభవరాజన్యులు నతి పుణ్యధనులు నీవందఱకంటె మహాతపోధనుండవు పుణ్యాగణ్యుండవు నీయగ్రజయైన కౌశికి లోకపావని నదీవరేణ్యయనుచుం బ్రశంసింప సంతుష్టహృదయుండగుచు విశ్వామిత్రుండు నిద్రించి యస్తమితభానుండునుంబోలె నొప్పె రామచంద్రుండును లక్ష్మణుండును విస్మితు లగుచు గాధిపుత్త్రు నగ్గించుచు శయనించి రంత మఱునాఁడు విశ్వామిత్రుండు ప్రభాతసమయంబున మేలుకొని కదిసి యుచితోక్తుల మెల్లన.

క. ప్రాతఃకాలము సనియెడు, బ్రాఁతిగ సంధ్యాదివిధులు ✽ పరిపాటిగ నీ
వాతతమతిఁ జేయుము యా, త్రాతత్పరబుద్ధి వగుము ✽ ధరణీనాథా. 337

క. అని తనుఁ గౌశికముని మే, ల్కనుపంగా లేచి ప్రథమ✽కాలవిధులు దీ
ర్చి నృపతనూజులు సంయమి, జనములకున్ మ్రొక్కి వేగ ✽ సనుచో నడుమన్.

క. రాముఁడు మేచకజలద,శ్యాముఁడు సుగుణప్రభావ✽ సంయమివినుతి
స్తోముఁడు గిరిజాధిపనుత, నాముఁడు వాక్రుచ్చెఁ గుశిక✽నందనుతోడన్. 339

చ. తరళతరంగరంగసము✽దగ్రము [1]విస్తృతవారిసైకత
స్ఫురితము సత్యగాధజల✽పూర్ణము దీర్ఘతరప్రవాహస
త్వరమును నైనయీనదిని ✽ దాఁటెడిరే వది యెద్ది యంచుఁ బెం
పరుదుగ దాఁటి దూరపథ✽ మర్ధదినంబున కేఁగి ముందఱన్. 340

క. సురుచిరసరిదురుకమలా, కరనిర్ఝరశిశిరసలిల✽కణగణయుతభా
సురతరసరసిజకువలయ, పరిమళపరిమిళితమలయ✽పవనము లొలయన్. 341

వ. అలరుచు మునిజనంబులతోడం జనుచు. 342

మ. స్ర. ఘను లారాజన్యసూనుల్ ✽ గని రెదురఁ గృతా✽కాశగంగాపరిష్వం
గను రంగత్తుంగభంగం ✽ గలితజలవిహం✽గన్ సదాశంభుసంగన్
మునిగేహోపాంతరంగన్ ✽ మురహరపదసం✽భూతపూతాంబుసంగన్
జనతాంహోభంగచంగన్ ✽ సగరనృపసుత✽స్వర్గసోపానగంగన్. 343

క. కని రాముఁడు సంతోషం, బున విశ్వామిత్రుఁ జూచి ✽ పుణ్యప్రదయై
తనరెడుగంగ జగత్పా,వనజననక్రమము వినఁగ✽వలయున్ మాకున్. 344

క. లోకజ్ఞ లోకహితముగ, లోకపవిత్ర యగునాక✽లోకాపగ ము
ల్లోకములఁ బ్రాఁకి జలనిధి, నేకరణిం గలిసె మాకు ✽ నెఱిఁగింపు తగన్. 345

వ. అనవుఁడుఁ గౌశికుం డిట్లనియె. 346

క. కనకాద్రితనూభవయై, తనరుమనోరమకుఁ దుహిన✽ధరణీధరనా
థునకును గంగయు నుమయును, ననునిరువురు సుతల వేడ్క✽నజుఁడు సృజించెన్.

క. హిమవంతుఁడు లోకహితా, ర్థము తనయగ్రసుత గంగఁ ✽ దగ నమరుల కీ
నమరపథంబున నాసతి, యమరులతోఁ గూడ జనియె ✽ నమరావతికిన్. 348

---

1 [illegible]

—•• కుమారస్వామిజననము. ••—

క. పరఁగ నుమాదేవి మహే, శ్వరుఁగూర్చి మహోగ్రతపము సలుపఁగ హిమభూ
ధరపతి యయ్యుమ నఖిలే, శ్వరుఁ డగునీశ్వరున కిచ్చె సమ్మద మారన్. 349
చ. ఎనయ వివాహయుక్తుఁ డగునీశ్వరుఁ డెంతయు వేడ్క నొక్కెడం
వనసతిఁ జూచి కామశరదర్పితుఁ డై తమకంబుఁ గాంతయుం
దనరఁగఁ బ్రేమతో నుమయుఁ దానును దివ్యసహస్రవర్షముల్
చన రతి సల్పఁగా సుతుఁడు జన్మము నొందక యుండ నయ్యెడన్. 350
క. ఉమకు మహాదేవునకుం, బ్రమదంబునఁ గ్రీడ లొదవఁ బ్రభవించినభూ
తము నెవ్వఁడు సైరింపను, క్షముఁ డనుచుం గమలజాదిసర్వామరులున్. 351
సీ. హరుపాలి కేతెంచి యానమ్రులై దేవ, దేవ మహాదేవ దేవవంద్య
నీమహాతేజంబు నిఖిలలోకములును, భరియింపఁ జాలవు భక్తవరద
నీదు తేజమునంద నీ తేజమును దాల్చి, భూలోకజాలంబుఁ బ్రోవు దేవ
పార్వతితోఁగూడ బ్రహ్మచర్యతపంబు, సలుపంగ నేఁగుము చంద్రమౌళి
మమ్ముఁ గరుణఁజూడు మామ్రొక్కు గైకొను, సకలలోకహితము సమకొనంగ
విన్నపంబు సేయు చున్నారు సుర లెల్ల, నవధరించి ప్రోవు మంబికేశ. 352
వ. నావుడు సురలం గనుంగొని హరుం డి ట్లనియె. 353
క. వినుఁడు స్రవియించు చున్నది, కనుఁగొనుఁ డీయెడల వెడలు ఘనతేజము మీ
రనువున నెవ్వరు దాల్చెద, రన విని యిలఁ దాల్చు ననుచు నమరులు వలుకన్.
క. మృడుఁ డప్పుడు తన తేజము, విడువఁగ నిల దాల్చె సురలు వెండియు ననలుం
బుడమికి నీవు సమీరుఁడుఁ, గడుఁ దోడ్పడి తాల్పుఁ డీశుఘనతేజంబున్.
వ. అనవుడు వాయుసమేతుండై యగ్నిదేవుం డమ్మహాతేజంబుఁ దనయందుఁ బ్రవే
శింపం జేసిన. 356
క. అనలప్రాప్తం బై యా, ఘనతేజము సూర్యపావకప్రభతో శ్వే
తనగంబు గమించి పడా, ననజన్మస్థానశరవణంబున వెలిఁగెన్. 357
వ. అంత సంతోషించి నిఖిలదేవమునిగణమ్ములు నమ్మహాదేవు నుమాదేవిం బూజిం
చి రయ్యెడ నాసురల నాలోకించి. 358
మ. అతికోపంబున నద్రినందన యమర్త్యశ్రేణితో నాకు సం
తతి లేకుండఁగఁ జేయ వచ్చి యిట యత్నం బార విఘ్నంబు చే
సితి రి ట్లిం కిది యాది మీసతులకుం జిత్తోద్భవం బైనసం
తతి లేకుండెడుఁ బొండటంచుఁ గడఁకం దా శాప మిచ్చెన్ వెసన్. 359
క. అనిమిషుల కట్లు కోపం, బున శాపం బిచ్చి పిదప భూమిన్ నానా
జనులకు బహురూపంబుల, ననుభవపత్ని వగు మంచు నలిగి శపించెన్. 360
క. క్షితిధరసుతశాపంబున, నతిలజ్జితు లైనసురల నందఱఁ గొంచుఁ

శతమఖుఁడు పశ్చిమాశా, న్వితగమనుం డయ్యె నంత । నీశుఁడు నుమయున్.

క. హిమవంతము నుత్తరశృం, గమునకుఁ దగ నేఁగి తపము । గైకొని యట నే
మములు సలుపంగ నయ్యెడ, నమరులు సైన్యపతి తమకు । నబ్బెడికోఱకున్.

క. మునిగణయుతులై కమలా, సనుపాలికి వచ్చి మ్రొక్కి । చతురానన మా
కును సేనాధ్యక్షుఁడు లేఁ, డని వేఁడఁగ వచ్చినార । మమరుల మెల్లన్. 363

క. సేనాపతి మా కొసఁగు ము, మానాథుం డుమయుఁ దాను । మహితతపంబుం
బూనినవారలు గావున, సేనాపతి మాకు లేఁడు । సృజియింపు మజా. 364

వ. అనిన విని వారిజాసనుండు వారల కి ట్లనియె. 365

క. ఉమ యిచ్చినశాప మమో, ఘము గావున సురల కింకఁ । గలుగదు సంతా
నము మీకును సేనాపతి, యుమపుత్త్రుఁడు దక్క నన్యుఁ । డొక్కఁడు గలఁడే.

క. సురలార యగ్నిదేవుఁడు, గిరిసుత తేజంబువలనఁ । గృతమతి రిపుసం
హారుఁ డగుసేనాపతి నొ, క్కరు నతివిక్రము సృజింపఁ । గలఁ డాపుత్త్రున్. 367

క. ఈగగనగంగ యత్యను, రాగమునన్ గారవించుఁ । బ్రమదము లారన్
వేగమ యనలునిఁ దోడ్కొని, యాగభుజులు చనుఁడు శంక । రాద్రికిననుడున్.

వ. కృతార్థు లగుచుం బ్రియం బంది నలువకు నమస్కరించి యనిమిషు లయ్యనలుం
బురస్కరించుకొని కైలాసంబున కేఁగి యచట నగ్నిదేవు నాలోకించి నీవు దేవహి
తార్థంబు సుతోత్పత్తికొఱకు నుమాతేజంబుఁ గొనిపోయి గంగాతరంగంబున
విడువు మనవుడు నయ్యనలుండును గంగకడ కరిగి దేవీ దేవప్రియంబుగా నా
పూనినయీతేజంబు ధరియింపు మని వేఁడ నాగంగ దివ్యరూపంబు ధరియిం
ప నామహిమంబు చూచి యంతట నా తేజంబు చిలికించి యద్దేవి నభిషేకంబు
సేసె నాసమయంబున. 369

క. క్షితివర సకలస్రోతః, ప్రతతులఁ బరిపూర్ణ మగుచు । భారముచేయన్
ధృతి సెడి గంగానది యా, హుతవహుతో నిట్టు లనియె । నురుగర్భిణి యై. 370

క. గురుతర మగునీగర్భము, భరియింపఁగ నేను జాలఁ । బావక యం చా
తురపడ నప్పుడు వైశ్వా, నరుఁ డాగర్భంబుఁ దుహిన । నగపాదమునన్. 371

క. బ్రాంతిగ వెడలింపు మనన్, స్రోతోమార్గమ్ము వలన । సురలోకాతి
ప్రీతిగ వెడలించెను గం, గాతటిని నిజాంతరంగ । గర్భం బమరన్. 372

వ. అప్పుడు గంగానిర్గతసౌమ్యతేజంబువలన సువర్ణంబు పుట్టె. సువర్ణతైక్ష్ణ్యంబువ
లనఁ దామ్రకృష్ణాయసంబులు పుట్టె నాసువర్ణమలంబునం ద్రపుసీసంబులు
పుట్టె నాగంగావిక్షేపంబువలనం బొదలుసువర్ణప్రభలం దృణవృక్షలతాగుల్మ
కాననప్రభృతిసర్వవస్తువులు సువర్ణంబు లయ్యెం గావున సువర్ణంబునకు జాత
రూపం బనునామంబు గలిగె నాసమయంబున. 373

క. తనరఁ గుమారుఁడు పుట్టినఁ, గొనకొని [1]కృత్తికల కిచ్చి § కూరిమితో బా
లునిఁ బ్రోవుఁ డనుడు నగుఁగా, కని కుచదుగ్ధములు గుడిపి § యమకులతోడన్.
క. మాకుచదుగ్ధముఁ గుడుచుట, నీకొమరుఁడు మాకుఁ బుత్త్రుఁ § డిందఱకు ననన్
నాకౌకసు లగుఁ గా కన, నాకొమరుఁడు గార్త్తికేయుఁ § డనఁ జెన్నొందెన్.
క. మనమునఁ బ్రమదం బొదవఁగఁ, జనవుమెయిం గృత్తికాకు § చము లొగిని షడా
ననములఁ గుడిచి తదాఖ్యన్, జనులు షడాననుఁ డనంగ § జగతిం బరఁగెన్.
క. ధరఁ గార్త్తికేయభక్తిం, బరఁగెడుపుణ్యుండు పుత్త్ర § పౌత్త్రులతోడం
జిరజీవి యగుచు నతిభాస్వరుఁ డై పడయుం గుమారు § సాలోక్యగతిన్. 377

—✿ సగరునివృత్తాంతము. ✿—

వ. అని చెప్పి. 378
క. చిరపుణ్యుఁ డైనసగరుఁడు, వరపత్నులు గాఁగ మొదల § వైదర్భనరే
శ్వరుపుత్త్రి సుకేశిని మఱి, యరిష్టనేమిసుత సుమతి § నమర వరించెన్. 379
వ. ఇట్లు వరించి. 380
క. పత్నులు దానును బ్రియసుత, రత్నంబులఁ బడయ హిమధ § రంబున కుద్య
ద్యత్నముల నేఁగి నియతిన్, నూత్నతపం బచటఁ జలిపె § నూఱేండ్లు తగన్. 381
వ. అట్టియెడ. 382
మ. భృగుఁ డన్పుణ్యతపోధనోత్తముఁ డతి § ప్రీతాత్ముఁ డై చేరి యా
సగరుం జూచి నృపాల నీవు వర మి § చ్చన్ వేఁడు మే నిచ్చెదం
దగ నీ కన్న ముదంబుతో నృపతి సం § తానంబు నా కిందు నా
నగుఁ గా కయ్యెడు నీకు సంతతి సము § ద్యత్కాంక్ష సిద్ధింపఁగన్. 383
క. వఱలెడునీపత్నులలో, నుఱవుగఁ గులపాలుఁ డొక తె § కొక్కసుతుండున్
మఱియొక్కత కాతతబలు, లఱువదివేవురును దనయు § లయ్యెద రనినన్. 384
వ. సగరుండు మునివరుం జూచి యిం దెవ్వతె కొక్కపుత్త్రుండు మఱియెవ్వతెకుఁ బె
క్కండ్రు పుత్త్రు లనిన నీసతు లడిగినయట్ల యిచ్చెద ననిన. 385
క. ఎలమి సుకేశిని దనకుం, గులపాలకు నొక్కసుతునిఁ § గోరిక నడిగెన్
వెలయ సుమతి పటుబలములు, గలషష్టిసహస్రసుతులఁ § గాంక్షన్ వేఁడెన్.
వ. ఇట్లు వేఁడి యమ్మునీంద్రువలన లబ్ధవరు లై ప్రదక్షిణపూర్వకంబుగా నతనికి న
మస్కరించి పతితోడంగూడ నగరి కేతెంచి రటఁ గొంత కాలంబునకు. 387
తే. మహితగుణసుకేశినియస § మంజుఁ డనఁగ, సుతునిఁగాంచెను వెనుక నా § సుమతి గర్భ
తుంబ మొక్కటిఁగాంచె నా § తుంబ మవిసి, సారిదినఱువదివేవురు § సుతులఁ గనియె.
క. జతనముగా ఘృతపూర్ణా, తతబహుకుంభముల నునిచి § [2]దాదులు పెనుపం
బ్రతిదినముఁ బెరిఁగి యౌవన, యుతు లై విలసిల్లుచుండి § రురుసత్వములన్.

1 కృత్తులకు నిచ్చి. 2 ధాత్రులు పెనుపం,

క. భూనాయక విను సగర, క్ష్మానాథునిపుత్త్రకుఁ డస ƒ మంజుఁడు పాపా
నూనసమాచారుఁడు దు, ర్మానుఁడుఁ గుజనప్రియుండు ƒ మత్తుఁడు నగుచున్. 390
క. బాలుర సరయువుఁలో నా, భీలగతిన్ మునుఁగ వైచి ƒ బెగడునఁ దేలన్
లీలఁ గనుంగొని నవ్వుచు, నోలిన్ బుధజనుల కప్రి ƒ యుం డగుచుండన్. 391
క. సగరుఁడు దనయగ్రసుతుం, డగునాయసమంజుఁ జూచి ƒ యతికోపముతో
నగుఁబుఁడు వీఁ డేటికి నని, నగరము వెడలంగ నడిచె ƒ నాగరు లలరన్. 392
క. ఘనుఁ డగునసమంజునిసుతుఁ, డనఘాత్ముం డంశుమంతుఁ ƒ డతిపుణ్యుఁడు స
జ్జనహితుఁడు ప్రియంవదుఁడును, ననుపమసత్త్వుండు గుణియు ƒ నై పురి నుండెన్.
వ. అంతఁ గొంతకాలంబునకు సగరునకు యజ్ఞంబు చేయ బుద్ధి పుట్టిన. 394
క. హిమశైలవింధ్యగిరిమ, ధ్యము యజ్ఞము సేయఁ బుణ్య ƒ తల మగుటయు ము
ఖ్యముగా సగరుం డద్దే, శమునను యజ్ఞంబు సేయ ƒ సమకొని నియతిన్. 395
వ. దీక్షితుం డై యజ్ఞీయాశ్వంబుఁ గావ నంశుమంతునిం బంచిన. 396
క. అచ్చుగఁ బటుకార్ముకుఁ డై, మచ్చిగఁ గాచికొని యంశు ƒ మంతుం డుండం
జెచ్చెర రాక్షసతనుఁ డై, ముచ్చిలి వాసవుఁడు తురగ ƒ ముం గొనిపోయెన్.
వ. అట్లయ్యశ్వంబు పోవుట యెఱింగి యుపాధ్యాయగణంబు సగరునితో నిట్లనిరి.
క. విశ్వంబు వెదకి వేగమ, యశ్వాపహరున్ వధించి ƒ యాగం బిచటన్
నశ్వరము గాక యుండఁగ, నశ్వముఁ దేరంగఁ బనుపు ƒ మని పలుకుటయున్.

—సగరసుతులు యజ్ఞాశ్వంబు వెదకుట.—

క. అఱువదివేవురు పుత్త్రుల, నెఱయఁగఁ జూచి సుతులార ƒ నియతాశ్వము నే
మఱితిమి రాక్షసకృత్యం, బెఱుఁగఁగ రా దింక మనకు ƒ నెయ్యది దెఱఁగో.
క. ఏనున్ మనుమఁడు దీక్షితు, లై నారము యజ్ఞ మిప్పు ƒ డభిమంత్రిత మై
మా నొందెడు నే మిచటను, బూనిక నెఱపంగ వలయుఁ ƒ బుత్త్రులు మీరల్.
క. అనిమిషలోకములోనికి, ననువుగఁ జని యచట వెదకి ƒ యట లేకున్నన్
జనలోకము శోధింపుఁడు, మునుకొని యీరెండుదెసల ƒ మొగి లే కున్నన్. 402
క. ఒక్కొకయోజనమాత్త్రం, బొక్కొక్కఁడు జలధివేష్టి ƒ తోర్వీవలయం
బెక్కడ నశ్వముఁ గనియెద, రక్కడియుం దాఁకఁ ద్రవ్వి ƒ యతిసత్త్వములన్.
క. పాతాళలోక మంతయు, బాఁతిగ శోధించి హయముఁ ƒ బరికించి యతి
ప్రీతిగ నాతురగముఁ గొని, యేతెం డని స్వస్తివాద ƒ మిచ్చుచుఁ బనుపన్.
క. జనకునిపనుపున కలరుచు, మనమున ముద మొదవ సగర ƒ మనుజపతిసుతుల్
కనుకని బరవసముల గొన, కొని సరభసగతుల నరిగి ƒ గుణధృతు లెసఁగన్.
మ. శతకోటిస్ఫుటకోటికోటిపనుమ ƒ స్ఫూర్జోగ్ర బాహాసము
ద్ధతులం బర్వతభేదనప్రబలవ ƒ జ్రాభీలశూలంబులన్
శితసీరంబులఁ ద్రవ్వఁ జొచ్చి రనఘుల్ ƒ సేకొంచుఁ జక్రంబుగా

క్షితిచక్రంబు నవక్రవిక్రమబలోత్సేకంబు లేపారఁగన్. 406

వ. మఱియు. 407

శా. అధ్వప్రేక్షితరాక్షసాసురభుజంగాత్యుగ్రసత్త్వావళీ
విధ్వంసంబులు వీఁకఁ జేయుచు మహోర్వీచక్రవిస్ఫారఘో
రధ్వానంబులు దిక్కులం జెలఁగ దుర్వారాసిముఖ్యాభ లి
ద్ధధ్వాంతాద్రులలోనఁ బె ల్లెసఁగ నాధాత్రీశపుత్రుల్ వెసన్. 408

చ. [1]గుఱుకొని నేల వ్రక్కలుగఁ ద్రొచ్చియు మన్నులు మ్రింగియున్ శిలల్
వెఱికియు నోలి నొక్కొకఁడు వేగమ యొక్కొకయోజనంబుగా
నఱువదివేవురుం బుడమి నాఫణిలోకముదాఁకఁ ద్రవ్వఁగా
నఱువదివేలుయోజనము లక్కజ మారఁగ నయ్యె నయ్యెడన్. 409

వ. అప్పుడు సురాసురగంధర్వపన్నగాదులు భీతు లగుచు సంభ్రమంబునఁ బితామహుపాలికిం జని యమ్మహానుభావుం బ్రసన్నునిం జేసి విషణ్ణవదనంబులతో నిట్లనిరి దేవా సగరపుత్రులు సకలభూమియు వ్రక్కలించుచు సర్వభూతహింసలు సేయుచు నున్నవా రశ్వంబుకొఱకు నని పలుకం గమలాసనుండు వారివచనంబు లాలించి యి ట్లనియె. 410

క. క్షితి కరయ వాసుదేవుఁడు, పతి గావున నవ్విభుండు పరఁగఁగ లీలా
కృతిఁ గైకొని యీసకల, క్షితియును ధరియించి యుండుఁ జెన్నగ నెపుడున్.

క. భూభేదనకారణమున, నాభూపతిపుత్రు లెల్ల నాకపిలునికో
పాభీలవహ్నికీలల,చే భస్మము గాఁ గలారు శీఘ్రమ యనినన్. 412

క. అలరి త్రయస్త్రింశత్త్రి,దశులు దమతమధామములకు సొంపార ముదం
బుల నేఁగి రచట నాభూ,తలపతినందనులు నధికదర్పము లొప్పన్. 413

మ. నిరతిన్ భూమి నగల్చుచోటను మహానిర్ఘాతసంకాశని
ష్ఠురభూరిధ్వని మ్రోయ మించి మఱియున్ క్షోణీతలం బెల్ల ని
ర్భరతం ద్రవ్వి ప్రదక్షిణం బడరఁ బైపైఁ బేర్చి యచ్చోట నా
తురగంబుం బొడగాన కేఁగి నృపపుత్రుల్ దండ్రితోడం దగన్. 414

మ. సగరక్ష్మావర దేవదానవపిశాచస్తోమదైతేయప
న్నగరక్షోగణకిన్నరప్రభృతినానాజీవులం ద్రుంచుచున్
జగతీచక్రముచుట్టుఁ ద్రవ్వితిమి విశ్వంబున్ మఖాశ్వంబుచొ
ప్పు గనం జోరునిఁ గాన నేర మెచటన్ భూమీశ యింకం దగన్. 415

క. పని యేమి గలదు వలసిన,పనిఁ బంపుము మమ్ము ననుచుఁ బలుకఁగ వారిం

---

1 క. అఱువదివేవురు నోలి, న్వఱలఁగ నొక్కొక్కయోజనము భూవలయం
బఱిముఱిఁ ద్రవ్వఁగఁ జుట్టును, నఱువదివేల్ యోజనంబు లై విలసిల్లెన్. ఇది ప్రక్షిప్తమని తోఁచెడి.

గనుఁగొని మనమునఁ గోపం, బెనయఁగ నాసగరనృపతి § యిట్లని పలికెన్.
క. నాకమున నున్నఁ బన్నగ,లోకంబున నున్న నబ్ధి§లోపల నున్నన్
లోకాలోకముకడపటి,లోకంబున నున్న నైన § లోకులు మెచ్చన్. 417
క. తురగాపహారునిఁ బొరిగొని, తురగము వేవేగ గొంచు § దోర్బలయుతులై
యరుదెం డనవుడు వారలు, నరిగి రసాతలముదాఁక § నతిరభసమునన్. 418
వ. తూర్పుదెస నెల్లభూమియుం ద్రవ్వి త్రవ్వి యద్దిక్కున. 419
క. ఏకరి దనకు నపాయము, గైకొనఁగాఁ దనదుమూర్ధ§కంపము సేయక
లోకమున కపుడు సకలమ,హీకంపము పుట్టు నట్టి§యిభరాజంబున్. 420
మ. ఘనశైలాకృతి మేను పూని సకల§క్ష్మాభాగముం జేవమై
ననిశంబుం దలఁ దాల్చి యొప్పెడువిరూ§పాక్షుద్విపశ్రేష్ఠముం
గని యాదిక్కరికిం బ్రదక్షిణనమ§స్కారంబు లాసక్తితో
నొనరం జేసి యనంతరంబ ఖననో§ద్యోగంబు లేపారఁగన్. 421
వ. వరుసం దక్కినయమ్మూఁడుదిక్కులం గలయం ద్రవ్వి దక్షిణంబునఁ బర్వతాకా
రం బై సకలభూమి ధరియించి యున్నయమ్మహాపద్మం బనుదిగ్దంతావళంబును
బశ్చిమంబున సౌమనసం బనుదిశాగజంబును నుత్తరంబున భద్రం బనునాశాద్విపం
బును నాలోకించి క్రమంబునం బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి యట
మీఁద నీశానభాగంబు ద్రవ్వి ముందఱ. 422

—కపిలమహాముని సగరసుతుల భస్మీభూతులం జేయుట.—

క. ఘనుఁ డగుకపిలునిఁదురగముఁ, గనుఁగొనిసగరసుతులితఁడ § క్రతుతురగముఁ దె
చ్చినమ్రుచ్చని దుర్బుద్ధులు, ఘనతరకోపములు మదులఁ § గదురఁగఁ గడిమిన్.
క. తరుశిఖరిఘనశిలాయుధ,ధరులై పఱతెంచి తురగ§తస్కరుఁడవు నీ
వరయఁగ మాముందట నెం, దరిగెదు నిలునిలువు మనుచు§నలుకం బలుకన్.
క. ఆతతహుంకారము ని, ర్ఘాతోగ్రము గాఁగఁ జేసి § కపిలుఁడు రోష
స్ఫీతానలమున భస్మీ,భూతులఁ గావించె సగర§పుత్రుల నెల్లన్. 425
క. అంతట సగరక్షితిపతి, యెంతయుఁ దనసుతులు దడసి § రేమొకొ యనుచుం
జింతించి విక్రమశ్రీ,మంతుని మనుమఁ డగునంశు§మంతునిఁ దనరన్. 426
చ. కనుఁగొని చాపబాణములు § ఖడ్గముఁ గైకొని వత్స నీవు నీ
జనకులు చన్నమార్గమున § సాగుచుఁ దత్పథవిఘ్నకారులం
దునుముచు నేఁగి యశ్వహరుఁ § ద్రుంచి మఖాశ్వముఁ గొంచు సమ్మదం
బునఁ జనుదెంచి మత్క్రతువు § పూర్ణముగా నొనరింపు నావుడున్. 427
మ. ఘనసత్త్వుం డగునంశుమంతుఁడు ధనుః§ఖడ్గాస్త్రముల్ పూని యే
పునఁ దండ్రుల్ మును ద్రవ్వుచుం జనినయా§భూపద్ధతిం బోయి తూ
ర్పున దిగ్దంతిని గాంచి యక్కరిపదం§బుల్ ముట్టుచుఁ మ్రొక్కి మ

జ్జనకుల్ వచ్చిరి వారిఁ గానవె మఖాశ్వంబున్ నిరీక్షింపవే. 428

చ. అనవుడు దైత్యదానవవిహంగభుజంగపిశాచదేవపూ
జనముల నొందునాగజము సమ్మద మారఁగ నంశుమంతుతో
నను[1]జననాథనందన కృతార్థుఁడ వై తురగంబుఁ గొంచుఁ జ
య్యనఁ జనుదెంచె దన్న ముద మందుచు నేఁగి క్రమక్రమంబుగన్. 429

వ. సకలదిగ్గజంబులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించుచు నాదిగ్గజంబులఁ బితృమఖాశ్వంబులసుద్దు లడిగిన నక్కుంజరములు కృతార్థుండవై వచ్చెద వన్న నట్ల కాక యనుచు నరిగి యమ్ముందటఁ బితృభస్మరాసులు పొడగని యత్యంత దుఃఖంబున శోకించుచు నచ్చేరువం దిరుగుచున్నమఖాశ్వంబుఁ బొడగని వగలం బొగిలి కొంతదడవునకుఁ బితృవర్గంబున కుదకక్రియ లొనరింపవలయు నని యొక్క జలాశయం బరయుచుఁ దనపితృమాతులుం డగుగరుత్మంతుం బొడగనియె నాసమయంబున. 430

మ. గరుడుం డాదట నంశుమంతు నతిదుఃఖశ్రాంతు వీక్షించి స
త్కరుణన్ శోకము మాను పుత్ర సకలాత్మాభేను లై నీపితల్
పరుషోద్యత్కపిలోగ్రకోపశిఖలన్ భస్మంబు లై రత్తఱిఁ
గరయన్ దైవికమున్ జగత్ప్రియము ధైర్యం బొందు మింకం దగన్. 431

మ. సురలోకాపగఁ దెచ్చి యాభసితరాసుల్ ముంచి యాగంగలోఁ
బరఁగం బైతృకకృత్యముం జలుపు నీ పైతృవ్యులన్ నాకమం
దిరసంప్రాప్తులు గాఁగఁ జేయు తురగాన్వీతుండ వై నీవు నీ
పురికిన్ వే చను నీపితామహుని సంపూర్ణక్రతుం జేయఁగన్. 432

క. ఇతరజలక్రియలు సమం,చితగతి నీపితల కెట్లు చేసిన దివి స
ద్గతి లేదు గాన యిప్పుడు, పితరుల కుదక మిడవలదు పితృహితవర్తీ. 433

వ. అని యిట్లు వైనతేయుండు పలుక శీఘ్రంబ యామఖాశ్వంబుం గొని సగరుపాలి కేతెంచి యంతవృత్తాంతంబు నెఱింగింప నాభూపతి విధ్యుక్తక్రమంబున నయ్యజ్ఞంబు సంపూర్ణంబు సేసి తనపురంబున కేఁగి సతులుం దాను ననురాగంబున.

క. సురుచిరభోగము లందుచుఁ, బోరిఁబోరి జనులెల్లఁ దన్నుఁ బొగడఁగఁ గీర్తుల్
పరఁగఁగ ముప్పదివేల్వ, త్సరములు రాజ్యంబు సేసి చనియెన్ దివికిన్. 435

క. జను లనుమతింప సగరుని,మనుమఁడు ధీమంతుఁ డంశుమంతుండు మహీ
జనులకు రా జై వెలయుచు, ఘనుఁ డైన దిలీపనృపతిఁ గనియెం బరఁగన్.

చ. స్థిరమతితో దిలీపు విభుఁ జేసి హిమాచలపార్శ్వకాననాం
తరమున నంశుమంతుఁ డతిదక్షత ముప్పదిరెండువేలువ
త్సరములు నిష్ఠతో నధికదారుణ మైనతపంబు సేసి ని

1 నృపవర్యనందన.

ర్జరపురి కేఁగె సంత సువిచారి దిలీపనృపాలుఁ డాత్మలోన్. 437

మ. నమితారాతి దిలీపభూవిభుఁడు నానాయజ్ఞముల్ సేసి యిం
పమరన్ ముప్పదివేలవర్షములు రాజ్యప్రాప్తుఁ డై తద్దయుం
బ్రమదం బార సుతున్ భగీరథవిభుం బట్టంబు వే కట్టి రో
గముచేతం దుదిఁ బొంది పుణ్యవశతం గాంచెన్ మరుల్లోకమున్. 438

భగీరథుండు గంగను భూమికిం దెచ్చుట.

క. ప్రథితమతి భగీరథుఁ డతి,రథుఁడు సుతుల్ దనకు లేమి రాజ్యంబు మనో
రథ మారఁ జేయుఁ డనుచుం, బృథుమతు లగుసచివులందుఁ బెట్టె సుబుద్ధిన్.

వ. ఇవ్విధంబునం బ్రధానులందు రాజ్యంబు చేర్చి భగీరథుండు గోకర్ణంబునకుం
జని యందు. 440

శా. బాహుద్వంద్వము మీఁది కెత్తి కడఁకం బంచాగ్నితప్తుండు మా
సాహారుండు జితేంద్రియుండు నతినిష్ఠాయత్తచిత్తుండు న
వ్యాహారప్రవణుండు నై బహుసహస్రాబ్దంబు లేకచ్ఛల
గ్రాహిత్వం బమరన్ మహాతపము గోకర్ణంబునం జేయఁగన్. 441

క. జలజాసనుఁ డాతపమున, కలఘుప్రీతాత్ముఁ డగుచు ననిమిషగణముల్
గొలువ భగీరథుపాలికి, నెలమిం జనుదెంచి యతని కిట్లని పలికెన్. 442

క. నీతపమున కెంతయు నేఁ, బ్రీతుఁడ నైతి వర మడుగు ప్రియమున నన నా
ధాతకు మ్రొక్కి భగీరథుఁ, డాతతసంతుష్టహృదయుఁ డై యి ట్లనియెన్. 443

క. అస్మత్ప్రపితామహబహు, భస్మంబులమీఁద గంగఁ బఱపుము నాచి
త్తస్మృతి సఫలతఁ బొందఁగ, నస్మద్వంశజుల నాక మరిగింపు తగన్. 444

క. లోకైకనాథ విను మి,క్ష్వాకుకులం బంతరించి కడచనకుండన్
నా కీ సంతతి యనవుడు, నాకమలజుఁ డతనితోడ నయ్యెడు మనుచున్. 445

క. దివిషద్గంగాపాతం, బవని వహింపంగఁ జాల దానిఁ దాల్పన్
శివు వేఁడు శివుఁడు దక్కఁగ, నవలీలను గంగఁ దాల్ప నన్యులవశమే. 446

వ. అని పలికి బ్రహ్మ తనలోకంబున కేఁగ భగీరథుం డచ్చట. 447

శా. అంగుష్ఠాగ్రము నేల మోపి తప మేకాబ్దంబు నిండంగఁ జే
యంగన్ దర్పకవైరి వచ్చి పరితుష్టాత్ముండ నైతిన్ వియ
ద్గంగం దాల్చెద మౌళి నా నపుడు రంగత్తుంగభంగత్వరన్
గంగాసింధువు నింగినుండి పడియెన్ గౌరీశుజూటంబునన్. 448

వ. అట్లు హరుజూటంబుఁ బ్రవేశించి యంతర్గతంబున. 449

చ. హరుని నతిక్రమించి గగనాపగ పన్నగలోక మేఁగ వే
గిరపడఁ జూచి శంకరుఁడు గిన్కవిరోధము సేసి యాఁప నా
హరునికపర్దకందరమునందు భ్రమించుచు నుండె నెందుఁ దా

నరుగఁగ లేక నేకగణ్యహాయనముల్ చన నంత వెండియున్. 450

వ. అతినిష్ఠ నమ్మహాదేవునిగుఱించి భగీరథుం డుగ్రతపం బాచరింప రఘువరా విను మమ్మహాదేవుండు సంతుష్టహృదయుండై జటాకుహరంబున నున్నగంగను బిందుసరోవరం బుపలక్షించి విడువ నాగంగ యం దేడుప్రవాహంబు లయి పొడమి హ్రాదినియు నలినియుఁ బావనియు నన మూఁడునదు లై తూర్పుదిక్కునకుం జనియె మఱియుఁ జక్షువు సీతయు సింధువు నన మూఁడుపుణ్యనదు లై పశ్చిమంబున కరిగె నందు సప్తమపుణ్యనదీవరేణ్య యగుగంగ మహారథుం డగు భగీరథునిరథంబు వెనుక నేతేరం జొచ్చె నానది శివునిజటామండలకుహరంబు వెలువడి ఘననక్రగ్రాహమకరమత్స్యకచ్ఛపదర్వీకరశింశుమారప్రభృతిజలచరంబులతోడ నాశివునిదేహప్రభ తీఁగెసాగి వెడలుకై వడిఁ బ్రవాహంబు నెఱయ మెఱయ గంభీరఘనధ్వని మ్రోయుచుం బుడమిం బడి యే నూర్ధ్వలోకగామిని నధోలోకంబున కేల పోవుదు ననుమాడ్కి మింటిమీఁది కెగసిన ట్లెగసి తజ్జలావగాహంబు చేసి గగనంబున కెగసి చనునుడుగణంబులో యన రంగదుత్తుంగభంగిభంగురఘనోదకబిందువు లెగయ భగీరథకీర్తివల్లులుంబోలె ఫేనమాలికలు గ్రాల నిజావతరణాలోకనప్రియాగతామరలోకభూషణమణిగణకిరణంబుల నాకాశంబు జలదావకాశం బయి శతసూర్యప్రకాశం బగుచు వెలుంగఁ బాపంబున భూగతు లైనజనులు కృతస్నాను లయి సకలపాపంబులం బాసి యమరు లై గగనసరణిం దమపుణ్యలోకంబుల కరుగ నమరయక్షగంధర్వనరకిన్నరసిద్ధమునిగణప్రభృతు లీపుణ్యజలంబులు సదాశివుపావనాంగసంగతంబు లై వచ్చిన వనుచు నాజలంబుల నోలలాడి కృతార్థు లై వెలయం గొందఱు దేవర్షిగంధర్వసిద్ధచారణాదులు కరితురగవిమానసమారూఢు లై చూచుచుండ మఱియుఁ గొందఱు సురాసురకిన్నరయక్షరాక్షసగరుడోరగాప్సరస్సిద్ధసాధ్యవిద్యాధరాదులు తన వెనువెంట నేతేర నాశ్రితక్లేశనాశంబులు సేయం దోయంబు లైనతోయంబులును గృతపాపభంగంబు లయినభంగంబులును సురనరమునిగణసేవానుకూలంబు లైనకూలంబులును నెఱయ మెఱయ విక్రమశాలి యైనభూపాలుండునుంబోలెఁ బరభూము లొత్తుచు దుష్టశాసనుండునుంబోలెఁ గుజాతజాతంబుల భంగించుచు భార్గవరాముండునుంబోలె భూభృత్కూటంబులు వీటతాటనంబులు చేయుచు నదభ్రగంభీరధ్వని మ్రోయుచు నతిత్వరితగతిం బఱతెంచి ముందట. 451

—గంగ జాహ్నవి యైనప్రకారము.—

మ. అమరన్ జహ్నుఁడు నిష్ఠతో మఖము సేయన్ రంగదుత్తుంగభం
గము లుద్యద్గతిఁ బెల్లుగా నడరి వీఁకన్ వచ్చి యయ్యజ్ఞవా
టము సర్వంబును ముంప నప్పు డతిచండక్రోధదుర్వారవే
గమునన్ జహ్నుఁడు ద్రావె నద్భుతముగాఁ గంగాజలం బంతయున్. 452

వ. అప్పుడు. 453

క. సురమునిగంధర్వులు గడుఁ, బరమాశ్చర్యమున జహ్నుఁ బ్రార్థనతో నీ
సురనది వెడలింపుము త, త్పరబుద్ధిని నీకు మహితపుత్రీభావముఁ బొందన్. 454

క. అన విని జహ్నుఁడు సమ్మద,మునఁ దనఘనకర్ణరంధ్రమున వెడలింపన్
జనె నదిమొదలుగ జాహ్నవి, యనునభిధానంబు జగతి నభినుతిఁ బొందెన్.

ఉ. ఆగతి జహ్నుకర్ణకుహరాగ్రవినిస్సృత యైనగంగ వే
వేగ భగీరథుండు దనవెంటనె వెండియు నేఁగుదేరఁగా
సాగరవీథిఁ జొచ్చి బలిసద్మము చేరఁగఁ బోయి ముందటన్
సాగినభస్మరాశిమయసాగరులం బొడగాంచి దీనతన్. 456

వ. అత్యంతదుఃఖాక్రాంతుఁ డై ప్రపితామహభస్మరాసులు గంగపావనజలంబుల సంసిక్తంబులు సేయునెడ సర్వలోకపితామహుం డగుపితామహుండు వచ్చి భగీరథుం జూచి యి ట్లనియె. 457

చ. సగరతనూజు లందఱును స్వర్గముఁ బొంది రమర్త్యమూర్తు లై
యగణితపుణ్య నీకతన నన్వయ మెల్లఁ బవిత్ర మయ్యె నా
సగరతనూజు లందఱును సాగరతోయము లుర్విలోపలన్
నెగడెడునంతదాఁక దివి నెమ్మది నుండెద రిచ్చ లారఁగన్. 458

ఉ. గారవ మార నీదువిజగంగ భవత్సుత యై తగంగ భా
గీరథి నాఁగ నొప్పెడు భగీరథభూపతి లోకపావనో
దారసుకీర్తి నొంది త్రిపథంబుల నిట్లు గమించెఁ గాన పెం
పార ధరిత్రిలోఁ ద్రిపథగాహ్వయ యై విలసిల్లెడుం గడున్. 459

క. సగరాంశుమద్దిలీపులు, దగ ధర్మప్రవణబుద్ధిఁ దమవంశజులన్
సుగతులుగఁ జేయుకొఱకును, గగనాపగఁ దేర లేక కడచిరి వత్సా. 460

మ. అతిపుణ్యుండవు వంశపావనుఁడ వుద్యద్గోత్రమిత్రుండ వు
న్నతబుద్ధిం బ్రపితామహప్రతతులన్ నాకంబు నొందంగఁ దె
చ్చితి నాకాపగ నింక నీప్రతిన వచ్చెన్ వ్యక్తపూతాంబున
త్కృతు లోలిన్ విరచించి నీపురికిఁ బ్రీతిం బొమ్ము భూనాయకా. 461

వ. అని పలికి బ్రహ్మ దనలోకంబున కరిగె నంత భగీరథుండును దనప్రపితామహులకు నాగంగలో విహితక్రమంబున ధర్మోదకతంత్రం బాచరించి శుచీభూతుం డై తనపురంబున కరిగి సకలజనులు దన్ను సేవింప సర్వార్థసమృద్ధుం డగుచుఁ బరమానందంబున రాజ్యంబు సేయుచుండె గంగావతరణంబు నీకు విస్తరించి వినిపించితి సంధ్యాకాలంబు వర్తిల్లుచున్నది రామచంద్రా నీకు భద్రస్వస్తులు గాని మ్ము గంగావతరణోపాఖ్యానంబు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులందు నెవ్వండు చదువు నెవ్వండు వాఁయు నతనిపితృదేవతలు ప్రీతాత్ము లగుదు రతం డఖిలపా

పంబులం బాసి యాయురారోగ్యంబులు నైశ్వర్యంబులుఁ బుత్రసంపత్తియు ధన
ధాన్యంబులు సకలకామ్యార్థసిద్ధులుం గలిగి నాకలోకఫలప్రాప్తుం డగు నని వి
శ్వామిత్రుండు వినిపింప ననుజసమేతుం డైనరామచంద్రుం డచ్చెరు వందుచుఁ
గౌశికున కిట్లనియె. 462

క. మునివర గంగాగమనం, బును సాగరపూరణంబు ముదమున నీచే
వినఁగా క్షణమై రాతిరి, చనియెను మది విమల మయ్యె నమ్మద మొదవెన్.

క. అని వెఱఁగందుచు నాకథ, మనమునఁ దలపోయుచుం దమస్విని వేవే
గినఁ బ్రథమాహ్నికకృత్యము, లనుజుండును దా నొనర్చి యనురాగమునన్.

క. ఈగంగను దాఁటుద మని. యాగాధిసుతుండు దశరథాత్మజులు మహా
భాగు లతిపుణ్యభాగిని, భాగీరథి నుత్తరించి ప్రముదితు లగుచున్. 465

క. లీలాలోలత నుత్తర, కూలంబున నిలిచి కనిరి కోర్కులతో భూ
పాలక గజహయమణిగణ,జాలను లక్ష్మీవిశాలఁ జారువిశాలన్. 466

క. కనుఁగొని విశ్వామిత్రుఁడు, జననాయకసుతులతో విశాలాపురికిం
జనునెడ రాఘవుఁ డమ్ముని, కను నీపురి కధిపుఁ డెవ్వఁ డనఁ గౌశికుఁడున్.

క. ఘనుఁ డగురామునిఁ గనుఁగొని, యినకులనాథసుత నీకు నీనగరిపురా
తనవృత్తాంతము సర్వం, బును జెప్పెద వినుము రామ పూర్వయుగాదిన్.

## —✿ క్షీ ర సా గ ర మ థ న ము. ✿—

చ. సుమతుల నాదితేయదితిజుల్ దలపోసి సునిశ్చితాత్ము లై
యమరుల మై నిరామయుల మై యజరాంగుల మై వెలుంగ ను
ద్యమమున వార్ధిఁ ద్రచ్చి తగ నం దమృతం బుదయింపఁ గాంక్ష న
య్యమృతముఁ ద్రావఁగా మనకు నయ్యెడు సర్వమనోరథంబులున్. 469

క. అని నిర్ణయించి వాసుకి, యనుఫణిపతిఁ జేరు మందరాద్రిని గవ్వం
బునుగా నొనర్చికొని దితి,తనయులు నయ్యదితిసుతులుఁ దగ దుగ్ధాబ్ధిన్. 470

మ. ఉరుశక్తిం దరువంగఁ జొచ్చిరి సముద్ధోల్లోలకల్లోలస
త్వరదోలాతతి వేల దాఁటగ సముద్యద్బిందువుల్ తారకా
పరిషేకంబులు సేయ బుద్బుదతతుల్ పై నుప్పతిల్లంగ దు
స్తరనిర్ఘాతఘుమంఘుమధ్వనులఁ బాతాళంబు ఘూర్ణిల్లఁగన్. 471

క. ఉరుబలమున నిట్లితరే,తరుల మిగులఁగాఁ బయోధి దరిగొని వేవ
త్సరములు దరువఁగ ధన్వం, తరి దండకమండలువులు దాలిచి పొడమెన్.

వ. తదనంతరంబ. 473

చ. అఱువదికోటు లప్సరస లంచితమూర్తులు పుట్టి రోలి న
త్తఱి మఱి వారికిం దగినదాసు లసంఖ్యలు సంభవించి ర
త్తెఱవలు దమ్ము నెవ్వరుఁ బ్రతిగ్రహణంబులు సేయ కుండుటం

వఱలుచు వారకాంత లయి । వాంఛితవృత్తుల నుండి రిమ్ములన్. 474

వ. అయ్యప్సరసలు మథితాప్సంభూత లగుట నప్సరస లనం బరఁగిరి మఱియునుం దరువ వరుణసుత యగువారుణి యనుసుర యౌడమె నాసుర దితిసుతులు పరిగ్రహింప నొల్లక యసురు లనం బరఁగిరి తత్సురం బరిగ్రహించి సంతుష్టహృదయు లై యదితిసుతులు సుర పేర సురలు నా వెలసిరి మఱియు నుచ్చైశ్శ్రవం బనుహయంబును గౌస్తుభం బనురత్నంబు నమృతంబు నావిర్భవించె నయ్యమృతంబునకు నై సురాసురులకు మహాయుద్ధంబు ప్రవర్తిల్ల నప్పు డదితిసుతులు దైత్యుల సమయింప నాదైత్యులు రాక్షసులుం గూడుకొని సురలతో దారుణరణంబుఁ జేయ నుభయకులక్షయంబును బాటిల్లెఁ దదవసరంబునఁ బ్రభవిష్ణుం డగువిష్ణుం డొక్కమహామోహిని యై మాయఁ గైకొని వేగ యయ్యమృతం బపహరించి కొనిపోవ నసుర లభిముఖు లై తలపడ విష్ణునకు నసురులకు మహాహవం బద్భుతరసావహంబుగాఁ జెల్ల దితిపుత్త్రు లప్పు డదితిపుత్త్రులతో మహాభీమసంగ్రామం బుద్దామంబుగాఁ జేయ నింద్రుండు దైత్యులం దునుమాడి రాజ్యంబు చేకొని సమ్మదం బొదవ లోకంబు లేలుచు సురల మునులం బ్రోచుచుండె నంత. 475

క. సుతు లందఱు మృతు లై నను, దితి మది శోకించి యధిక । దీనతఁ దనస
త్పతిఁ గశ్యపుఁ గనుఁగొని నా,సుతులం దునుమాడి రదితి । సుతు లతిబలు లై.

క. సుతహీన నైతి నేఁ దప, మతిరయమునఁ జేసి శక్ర । హరుఁ డగు నొకస
త్సుతుఁ బడయఁగఁ గోరెద న,మ్మతి గర్భము నిమ్ము నాకు । మహితచరిత్రా.

క. అనుచుం గడుదుఃఖిత యై, మనమున వగఁ బొగులు చున్న । మాన్యచరిత్రం
దనసతి దితిఁ గనుఁగొని యిం,పెనయఁగఁ, గశ్యపమునీంద్రుఁ । డి ట్లని పలికెన్.

మ. చన వేయేఁడులదాఁక నీవు శుచి వై । సమ్యక్తపోయుక్తి నుం
డిన ముల్లోకములన్ సురేశ్వరునిఁ గ । డ్మిన్ గిట్టి తున్మాడ నో
పినపుత్త్రుం దగ నిత్తు నీకు ననుచుం । బ్రేమంబుతో నంగమా
ర్జన మొందించి మరీచిపుత్త్రుఁ డరిగెన్ । శాంతిం దపఃప్రాప్తికిన్. 479

తే. అట్లు కశ్యపుఁ డేఁగఁగ । నధికనిష్ఠఁ, దగఁ గుశాసనమున నుండి । దారుణ మగు
తపము దితి సల్పుచుండఁగఁ । దల్లిపాలి, కరుగుదెంచి యాఖండలుం । డధికభక్తి.

క. ఫలజలదళకుసుమసమి,జ్జ్వలనంబులు మొదలు గాఁగ । వలసినయవి ని
చ్చలుఁ దెచ్చియిచ్చుచును మే,నలమట నొందంగనీక । యనయముఁ గొలువన్.

క. పూనినతనఘనతరతప, మూన సహస్రాబ్ద మగుచు । నొకనాఁ డుండం
గా నపరాహ్ణమున శిర,స్స్నానము కాలుకడ గాఁగఁ । దా విరిడలతోన్. 482

క. నిద్దురవోవఁగఁ గనుఁగొని, యద్దిర కడునశుచి యైన । యది దితి యనుచుం
దద్దయు ముదమున నింద్రుం, డద్దితిజఠరంబుఁ జొచ్చి । యతిదర్పమునన్. 483

చ. కలగొన నేడుఖండములు గా నతిఘోరభుజార్గళస్ఫుర
త్కులిశకఠోరధార వడిఁ గోయ నురుధ్వని బిట్టు గర్భ ము
మ్మలికముతోడ నేడువఁగ మారుద మారుద యంచు వెండియుఁ
నిలువక కోయఁగా నపుడు నిద్దుర దేఱె సవిత్రి యి ట్లనున్. 484

క. వడి నిటు నలఁపకు చంపకు, వెడలుము నీ వనుచు వెడలి వినయముతోడం
బొడచూపి తల్లి ననుఁ దుని, మెడిగర్భము ద్రుంచితిఁ క్షమింపుము నన్నున్.

క. నీ వశుచివి నిద్రితవుం, గావున నీగర్భ మేడు ఖండంబులుగాఁ
గావించితి ననవుడు దితి, యావిధ మగుగర్భహాని కతిదుఃఖిత యై. 486

క. వాసవుఁ డసాధ్యుఁ డగుటన్, గాసిల శపియింప రాక కడువగ మై నా
వాసవుతో ని ట్లను నా, చేసినయపరాధ మిట్లు సేసెం దనుజా. 487

క. నీ వేమి చేయు దింకను, నీవలనన్ సొలయ నేను నిను వేఁడెద స
ద్భావమున నాదుకోరిక, గావింపుము సమ్మదమున గారవ మారన్. 488

వ. పుత్రా భవత్కులిశగళితగర్భసప్తఖండంబులు సప్తమారుతంబు లై గగనవాత
స్కంధంబులం జరియింప నిమ్ము మఱియుం బ్రథమమారుతంబు బ్రహ్మలోకంబున
ద్వితీయమారుతం బింద్రలోకంబునఁ దృతీయమారుతంబు గగనంబునం దక్కిన
చతుర్మారుతంబులు నలుదిక్కుల దేవతామూర్తు లై నీయాజ్ఞం జరియింప నిమ్ము
నీవు మారుద మారుద యనుట మారుతాహ్వయంబులం బరఁగ ని మ్మనిన నిం
ద్రుండు దితి కి ట్లనియె. 489

మ. జననీ నీ విటు నన్నుఁ గోరిన సమస్తంబుం గృతార్థంబుగాఁ
దనరం జేసెద నీతనూజులు సమస్త వ్యాప్తు లై గా జగం
బున నైనం జరియించుచుండెదరు సమ్మోదింపు నీ వంచు నిం
పెనయం బల్కి సవిత్రితో దివికి నయ్యింద్రుండు వోయెం దగన్. 490

క. క్లేశయుతతపము దితి పుత్రాశం జేయఁ బరిచర్య లాదితికిన్ దే
వేశుం డొనర్చు చుండిన, దేశం బిద్దేశ మఖిల దేశాధీశా. 491

క. వినుము ఘనుం డగునిక్ష్వాకునకు నలంబసకుఁ బుట్టెఁ గొడుకు విశాలుం
డన నతఁ డేలుట నిప్పురి, జను లెల్ల విశాల యనఁగ జగతిం బరఁగెన్. 492

వ. ఆవిశాలునకు హేమచంద్రుండును హేమచంద్రునకు సుచంద్రుండును సుచంద్రు
నకు ధూమ్రాశ్వుండును ధూమ్రాశ్వునకు సృంజయుండును సృంజయునకు సహ
దేవుండును సహదేవునకుఁ గుశాశ్వుండును గుశాశ్వునకు సోమదత్తుండును
సోమదత్తునకుఁ గకుత్థ్సుండును నతనికి సుమతియుం బుట్టి రిప్పుడు విశాలను సుమ
తి యేలుచున్నవాఁ డిక్ష్వాకునందను లందఱు విశాల యేలుటం జేసి వైశా
లికులు నతిధార్మికులును దీర్ఘాయుష్మంతులు వీర్యవంతులు నై పరఁగుదురు
రామచంద్రా యీరాత్రి యీపురిని విశ్రమించి యెల్లి జనకునిం జూడఁ

బోవుద మనునమయంబున. 493

చ. సుమతి మునీంద్రురాక విని ఽ సుప్రియుఁడై యెదు రేఁగుదెంచి యు
త్తమమతిఁ బూజ లిచ్చి కడుఁ ధన్యుఁడ నైతిఁ ద్వదీయదర్శనం
బమరపదంబు నాకు నిటు ఽ లబ్బె మునీశ్వర యంచుఁ బల్కి సే
మము తగఁ బ్రీతితో నడిగి ఽ మానుగఁ గౌశికుతోడ నిట్లనున్. 494

మ. కరిసింహోంచితగాము లశ్వినిసమాఽకారుల్ దళత్పద్మభా
స్వరనేత్రుల్ కమనీయయౌవనులు గీఽర్వాణప్రతాపుల్ భయం
కరశార్దూలమహోక్షసన్నిభులు లోఽకత్రాణపారీణు లు
ద్ధురకోదండకృపాణబాణయుతదోఽస్స్థానుల్ ప్రవీణుల్ గడున్. 495

క. ధర విహరింపఁగ వచ్చిన,తరణిసుధాకరులొ దేవఽతావరులొ పర
స్పరసదృశేంగితచేష్టిత,పరిమాణముల సరి యగుచుఁ ఽ బరఁగెద రిచటన్. 496

ఉ. ఈసుకుమారు లెవ్వ రిట ఽ కేటికి వచ్చిరి పాదచారు లై
భాసురపుణ్య నా కెఱుఁగఁ ఽ బ్రాజ్ఞతఁ జెప్పుము నాఁగఁ గౌశికుం
డాసుమతిక్షితీశ్వరున ఽ కారఘురాముఁడు వచ్చి యాగతిం
జేసినవిక్రమక్రమము ఽ చెప్పిన నచ్చెరు వంది వేడ్కతోన్. 497

వ. రామలక్ష్మణులకు నతిథిసత్కారంబు లత్యాదరంబునం జేయంగైకొని యారాత్రి యచ్చట వసియించి మఱునాఁడు మిథిలాపురంబున కేఁగి తదుపవనంబుఁ బొడగని కౌశికునకు రామచంద్రుం డిట్లనియె. 498

క. అమరుచు నిచటఁ బురాణా,శ్రమ మున్నది మునులు లేక ఽ జనశూన్యం బీ
రమణీయాశ్రమ మేయు,త్తమమునియాశ్రమము మున్ను ఽ తజ్జ్ఞతఁ జెపుమా.

క. అనవుడు విశ్వామిత్రుం, డినకులనాయకునిఁ జూచి ఽ యి ట్లనుఁ దగ నీ
వినుతాశ్రమంబు గౌతమ, మునిపుంగవునాశ్రమంబు ఽ మును విను మనఘా.

క. ఈపుణ్యాశ్రమవనమును, బ్రాపించి యనేకగణసఽహస్రాబ్దము లు
ద్దీపితతప మంచితవి,ద్యాపరుఁడై గౌతముఁడు నఽహల్యయుఁ జలుపన్. 501

క. ప్రీతిఁ దఱి వేచి యింద్రుఁడు, గౌతమవేషంబు పొనఁగఁ ఽ గైకొని వేగం
బేతెంచి రూపలావ, ణ్యాతుల్య నహల్యఁ జూచి ఽ యతిమోహితుఁడై. 502

క. కోరిక లొప్పారఁగ నా, సారసముఖిఁ జేరి పాకఽశాసనుఁ డంతం
జారునితంబిని నన్నుఁ, మారసుఖక్రీడఁ దనుపు ఽ మక్కువతోడన్. 503

చ. అనుడు నహల్య యింద్రుఁడు ప్రియంబున గౌతమవేషి యైనవాఁ
డని మదిలో నెఱింగి ముద ఽ మందఁగ నిక్కడ రమ్ము గ్రక్కునన్
మనసిజునమ్ములం దునిసె ఽ మానము చిక్కినమన్మథుండ నై
నను రతిచాతురిం గవిసి ఽ నన్నును నిన్నును గావు నావుడున్. 504

క. తరుణి నినుఁ జూచినప్పుడె, పరితుష్టుఁడ నైతి నింకఁ § బ్రసవాయుధజి
త్వరుఁడ నయి పోదు నని త, త్వరమతి వాంఛితముఁ దీర్చి § తత్తఱపడుచున్.
క. ఉటజము వెలువడి యట ముం, దటఁ దాఁ బొడగాంచె వృత్ర§దమనుఁడు వికటో
త్కటవిస్ఫుటజటి నతిసం, ఘటితతపఃకృశశరీర§కంపనకలితున్. 506
మ. కరసంయుక్తసమిత్కుశాంచితుని గం§గాపూతతోయార్ద్రభా
స్వరమూర్తిం గతధూమసంజ్వలితస§జ్వాలాగ్నికల్పుం సురా
సురదుర్ధర్షుని నక్షపాదు రచిత§శ్రుత్యర్థవాదుం వ్రతా
విరళామోదు సుధీయుతుం బ్రతిహతా§విద్యాతముం గౌతమున్. 507
క. అప్పుడు గౌతముఁ డింద్రుని, నిప్పులు రాలంగఁ జూచి § నీవు కపటివై
చొప్పగు నారూపంబునఁ, దప్పొనరించితి దురాత్మ § తగ దన కంచున్. 508
క. చండక్రోధంబున నీ, యండంబులు దునిసి దర్ప § మడఁగు దురాచా
రుండ యనఁగ నాఖండలు, నండంబులు, దునిసి పుడమి §నప్పుడ పడియెన్. 509
వ. ఇట్లయ్యింద్రుని శపియించి యహల్య నమాంగల్యం గదిసి యీవనంబున ననే
కదివ్యసహస్రవర్షంబులు వాయుభక్షణవు నిరాహారవు భస్మశాయినివియు నై
యెవ్వరికిం గానరాక పాషాణంబవై యుండు మని యంతటఁ గరుణార్ద్రమన
స్కుండై యెప్పు డివ్వనంబునకు రామచంద్రుండు వచ్చు నప్పుడ శాపవిముక్త
వై తదాతిథ్యసత్కారంబున నిజరూపంబు గైకొని ముదం బందెద వని పలికి
యీయాశ్రమంబు విడిచి సిద్ధచారణసేవితం బైనహిమగిరిశిఖరంబున కేఁగి తపం
బాచరించుచుండె. 510
సీ. అనిమిషేశ్వరుఁ డంత § ననలాదిదేవతా, గణముల సిద్ధచా§రణులఁ జూచి
యమలోగ్రతపము గౌ§తముఁ డర్థిఁ గావింపఁ, దత్తపం బమరహి§తంబు గాఁగఁ
జెఱుపంగ నే నేఁగి § చిత్తంబుఁ గలఁగింప, ఘనకోపమున నన్నుఁ § గనలి చూచి
విఫలుఁగా శపియించె § వేగ దానం జేసి, తప మెల్లఁ జెడిపోయె § దర్ప మడఁగె
విఫలుఁడగు నన్ను మీరలు § సఫలుఁ జేయుఁ, డనినఁ బితృదేవతలఁ జేరి § యమరులంత
మేషముష్కముల్గొనివచ్చి § మేఘవాహ, నునకుఁ బొందుగ హత్తింపుఁ § డనినవారు.
క. దండిం బితరులు వెస మే, షాండంబులు ద్రెంచి తెచ్చి § హత్తించిన నా
ఖండలుఁ డది యాదిగ మే, షాండుం డయ్యె నని పలికి § యమ్ముని మఱియున్.
క. ఇది యాగౌతమునాశ్రమ, పద మిచ్చట నమ్మహాను§భావునిసతి యు
న్నది దగ నహల్య యెంతయు, మద మఱి పతిశాపతప్త§మానస యగుచున్.
క. రామ యహల్యకు నీవు ద, యామతి శాపంబు వాప § నరుగుము నా నా
రాముఁడు విశ్వామిత్రుఁడు, సౌమిత్రియుఁ దోడ రా వె§సం జని యెదురన్.
సీ. జలమధ్యసందీప్త§సవితృదీధితిమాడ్కి, నతిదురాధర్షయై § యమరుదాని
భూరిహిమవృత§పూర్ణచంద్రికవోలె, నశ్రుధారామగ్నయై § యైనదానిఁ

ప్రథితభూమావృత। పావకశిఖభంగి, నురుపాంసుకలిత మై। యున్నదాని
శ్యామమేఘచ్ఛన్న। చారుతటిల్లత, కైవడి జడచేతఁ। గ్రాలుదాని
బ్రహ్మనిర్మితశుభమూర్తిఁ। బరఁగుదాని, విపులశాపభరంబున। వేఁగుదాని
నఖిలలోకభూతాదృశ్య। యైనదాని, నంతికాత్తమాంగల్య నహల్యఁ గనియె.

క. కన రామునిదర్శనమున, మునిశాపవిముక్త యగుచు। ముజ్జగముల కె
ల్ల నహల్య గానఁబడియెను, ఘనవిగమస్ఫురితచంద్ర। కళచందమునన్. 516

వ. అప్పుడు రామలక్ష్మణు లతిపుణ్యాకల్య యగునహల్యాపాదంబుల కెఱఁగిన నాదరంబున నాయహల్యయు గౌతమువాక్యంబు దలంచి రామలక్ష్మణుల కర్ఘ్యపాద్యంబు లిచ్చి యతిథిసత్కారంబు లాచరించె నాసమయంబున సురదుందుభులు మ్రోసె సురలు పుష్పవృష్టి గురియ దేవగంధర్వాప్సరస్సంఘంబు లేతెంచి సాధువాక్యంబుల నహల్యం బూజించిరి తపోబలశుద్ధాత్మ యైనతనపత్ని నహల్యం జేకొని యత్యానందంబున రామచంద్రునిఁ బూజించి యారామునిచేత సర్వపూజ లొంది పత్నీసహితుం డై గౌతముండు దపోవనంబున కరిగె విశ్వామిత్రుండును రామలక్ష్మణసమేతుం డై మిథిలాపురంబు చేరి యాపురంబున కీశానభాగంబున.

—❀ విశ్వామిత్రుండు రామలక్ష్మణసహితుండై మిథిలాపురంబున కరుగుట. ❀—

సీ. మాళవనేపాళ। మగధాంధ్రపాంచాల, భోజకాంభోజాది। భూమిపతులఁ
గరిరథాశ్వశ్రేణి। ఘనసమిత్కుశముల, జీమూతసమహోమ। ధూమతతుల
దర్భాసనంబులఁ। దగినపీఠంబులఁ, బంక్తు లై కూర్చున్న। పరమమునుల
సరసస్వరోదార। సామఘోషంబుల, సురుచిరయాగోప। కరణతతుల
భూరిదధిఘృతక్షీరసం। పూర్ణకుంభ, కనకమయవేదికాసము। త్కరముల మఱి
పశుసమంచితయూపాళిఁ। బరఁగుజనకు, యజ్ఞవాటము సౌత్తేర। నప్పు డెఱిఁగి.

క. మానొంద శతానందుఁడుఁ, దానును నర్ఘ్యంబు గొనుచుఁ। ద్వరతో జనక
క్ష్మానాథుఁడు కౌశికమునిఁ, గానఁగ నేతెంచి వినయ। గరిమము లమరన్. 519

క. అర్ఘ్య మొనరించి మ్రొక్కిన, దీర్ఘాయువు నొందు మనుచు। దీవించి లస
న్నిర్ఘోషకలితశుభతర, దీర్ఘము మాధుర్య మెసఁగ। ధృతి ని ట్లనియెన్. 520

క. నిరుపద్రవ మై నీయ, ధ్వర మేపారెడిని నీకుఁ। దగ భద్రమె నీ
పరిచరుల కెల్ల సేమమె, పరఁగఁగ నన జనకుఁ డపుడు। భద్రమ యనుచున్.

చ. మునివర నీవు సంయములు। మోదముతోడ మదీయయజ్ఞముం
*గనుఁగొన నిందు వచ్చితిరి। గావున ధన్యుఁడ నైతి యజ్ఞసం
జనితఫలంబు గంటి నిట। సమ్మతి నుండుఁడు ద్వాదశాహముల్

* "కనుఁగొన నిందువచ్చితిరి । గావున ధన్యుఁడ నైతినో మహా, ఘన వినుపీర లెవ్వరు త।గ న్వినిపింపుము తచ్చరిత్రముల్, వినియెద నన్న నమ్మునియు। వేగమ చెప్పఁగఁ బూన నయ్యెడన్. వ. మఱియును జనకుండు", అని.ః పా.

పనుపడ నంతమీఁదఁ గ్రతుభాగము లొందఁగ వచ్చుదివ్యులన్. 522

వ. చూడవలయు నని పలికి మఱియు నతికౌతుకంబున రామలక్ష్మణులం గనుంగొని.

మ. కరిసింహాంచితగాము లశ్వినిసమాకారుల్ దళత్పద్మభా
స్వరనేత్రుల్ గమనీయయౌవనులు గీర్వాణప్రతాపుల్ భయం
కరశార్దూలమహోక్షసన్నిభులు లోకత్రాణపారీణు లు
ద్ధురకోదండకృపాణబాణయుతదోస్స్థాణుల్ ప్రవీణుల్ గడున్. 524

వ. ఈరాజన్యకుమారశేఖరులు పాదచారు లై వచ్చుట కేమి కారణం బని యడుగఁ
గౌశికుండు జనకుంగనుంగొని వీరలు రామలక్ష్మణు లనువారలు దశరథనందనులు
వా వెనుక సిద్ధాశ్రమంబున కేతెంచి యచట నవక్రపరాక్రమం బడర. 525

ఉ. తాటకఁ ద్రుంచి వైచి యతిదర్పితుఁ డైనసుబాహుసాయకో
త్పాటితుఁ జేసి గీటడఁచి ధర్మ మెలర్ప నహల్యశాప ము
చ్చాటన మొందఁజేసి కడు సమ్మద మారఁగ నీగృహంబునం
జాటఁగ నున్నశంకరునిచాపముఁ జూడఁగ వచ్చి రేర్పడన్. 526

వ. అనవుడు నప్పు డహల్యానందనుం డైన శతానందుం డపరిమితానందుం డై వి
శ్వామిత్రు నవలోకించి మాతల్లిదండ్రులకుఁ గూటమి గలిగె నేము కృతార్థుల
మైతి మనుచు నతని కతం డి ట్లనియె. 527

క. జమదగ్ని రేణుకం బ్రే,మమునం గలసినవిధం బమర గౌతమసం
యమియు నహల్యం దనసతి, సముచితగతిఁ గలిసి వాంఛ సలుపఁగఁజనియెన్.

వ. అనినం గ్రమ్మఱ రోమాంచకంచుకితగాత్రుం డై శతానందుం డి ట్లనియె. 529

చ. దినకరవంశదీపకునిఁ దెచ్చి మునీశ్వర మమ్ముఁ బ్రోచి తీ
యనఘునిదర్శనంబున మదంబయు దుస్తరశాపముక్త యై
తనపతిఁ గ్రమ్మఱం గలిసెఁ దద్దయు నున్నతి కెక్కె మాకులం
బనుచుఁ బ్రియంబుతోఁ బలికి యానృపపుత్రులఁ జూచి యి ట్లనున్. 530

వ. రఘురామచంద్రా మత్కులవార్ధిచంద్రా భవద్దర్శనంబున మజ్జననీజనకుల కంచి
తసంయోగంబు గలిగెఁ గౌశికపాలితుండ వగునీకు నెల్లెడల నెందును భద్రంబ
వినుము చెప్పెదఁ గౌశికుపరాక్రమంబును దపఃప్రభావంబును; మున్ను ప్రజాప
తికిం గుశుం డుదయించె నతనికిఁ గుశనాభుం డుదయించె నతనికి గాధి యుద
యించె నాగాధికి విశ్వామిత్రుండు పుట్టి తేజం బెసంగ ననేకసహస్రవర్షంబులు.

—విశ్వామిత్రునిచరిత్రము.—

క. అశ్వద్విపరథభటబల, శాశ్వతలక్ష్మీసమృద్ధిసంకలితుం డై
విశ్వధరిత్రీచక్రము, విశ్వామిత్రుండు నీతి వెలయఁగ నేలెన్. 532

వ. అట్లు రాజ్యంబు సేయుచు నొక్కనాఁ డక్షౌహిణీసేనాపరివృతుం డై నగరంబుల
నానారాష్ట్రంబుల మహానదుల నానాశ్రమవనంబులఁ గ్రుమ్మరుచు బహుళపరిమళ

మిళితకుసుమమధురఫలకలితవివిధతరువిసరవిలసితంబును నిర్వైరినానామృగసం
కులంబును సిద్ధచారణవిరాజితంబును దేవదానవగంధర్వకిన్నరపరివృతంబును
బహుపక్షిరవకోలాహలంబును దపశ్చరణాగతబ్రహ్మర్షివిభ్రాజితంబును దేవర్షి
సమాశ్రితంబు ననిలాంబుజీర్ణపర్ణఫలమూలాశనమునిజనసమంచితంబును శమ
దమాన్వితజితేంద్రియవాలఖిల్యప్రముఖతపోధనసమాకీర్ణంబు నగుచు బ్రహ్మలో
కంబునుం బోలె నుల్లసిల్లుచున్నవసిష్ఠాశ్రమంబుఁ జొచ్చి యమ్మహానుభావునకుఁ
బ్రణమిల్లిన నాశీర్వదించి యప్పుడు. 533

తే. ఒనర నుచితాసనంబున । నుండఁ బనిచి, యర్ఘ్యపూజలు గాంచి । యధికమధుర
సరసఫలమూలములనుభో । జనము పెట్టి, యెలమి నున్నంతఁ గౌశికుం । డిట్టులనియె.

క. మీరును నిట మీవా రగు, వారును సేమమున నున్న । వారే మీవి
స్ఫారాగ్నిహోత్రతపములు, వారక నిచ్చలును మీఱి । వర్తిలుచున్నే. 535

వ. అనిన వసిష్ఠుండు సర్వంబును బ్రవర్తిల్లు ననుచు నతనిం గనుంగొని. 536

మ. నిరతిన్ భృత్యులఁ బ్రోతె దుష్టరిపులన్ । నిర్జింతె రాజ్యాంగముల్
పరిపాటిం బరికింతె ధర్మమున భూ । భాగంబు పాలింతె నీ
కరయన్ సేమమె నీతనూజులకుఁ గ । ల్యాణంబె భద్రంబె యి
ద్ధర నీవారల కెల్ల నన్న నగు భ । ద్రం బన్న నమ్మౌనియున్. 537

క. చన నీకు విందు సేసెద, నని విశ్వామిత్రు నునిచి । యంచితచిత్తం
బునఁ దలఁచి కామధేనువు, ననువుగ రప్పించి చూచి । యాగవితోడన్. 538

వ. ఈరాజునకు సమస్తబలంబునకు విందు వెట్టవలయు నిష్టాన్నపానాదులు సృజి
యింపు మనుచుం బనుప నాసురభియు షడ్రసోపేతంబులైనఖాద్యచోష్యలేహ్య
పేయాదివివిధవస్తువులును మృష్టాన్నరాసులు నాజ్యప్రవాహంబులును మధుర
దధికుల్యలును వివిధసూపశాకంబులును వలసినవస్తువులు సృజియింప సకల
బలంబులుం దానును బరితుష్టిగ భుజియించి యరుదందుచు నవ్వసిష్ఠు నవలో
కించి విశ్వామిత్రుండు నీచేయుసత్కృతుల కెంతయు సంతసించితి నిం కొక్కటి
వినుము. 539

క. లక్షతురగంబులను మఱి, లక్షమదేభముల వేయి । లక్షలమణులన్
లక్షల గోవుల నిచ్చెద, దక్షత నా కిమ్ము నీవు । తగ నీగోవున్. 540

వ. అనవుడు నవ్వసిష్ఠుం డెంతయు మనంబున వగచి యాకౌశికుతోడ. 541

క. ఈధేనువు నాజీవిత, మీధేనువు నానిధాన । మీధేనువు నా
సాధితకర్మముఁ బ్రాణము, నీధేనువ నాధనంబు । నెల్లతపంబున్. 542

క. నీవు జగత్త్రయ మిచ్చిన, నీజపహోమార్థసురభి । నే నీఁ జాలన్
నావుడు నతికుపితుం డై, యావిశ్వామిత్రనృపతి । యామునిసురభిన్. 543

వ. బలిమిం గొనిపోవ నాధేను వతిదుఃఖంబుం బొంది యాత్మలో నిట్లుపేక్షించునే

నానాథుం డైనవసిష్ఠముని యనుచుం జింతించి యట పోక తన్నుం బట్టుకొని
పోవునుద్దండభటశతంబులం. బడఁదన్ని విడిపించుకొని వాయువేగంబునం బఱ
తెంచి మునివరుమ్రోల నిలిచి. 544

ఉ. నన్ను ననాథఁబోలె నర § నాథునిభృత్యులు చండబాహుద
ర్పోన్నతిఁ బట్టికొంచుఁ జన § నూరక చూచెద విట్లు నీకు నే
ము న్నొకయెగ్గు సేసితినె § ముందట దుర్దశ నొంద స్వామి వై
యున్నమునీంద్ర నన్ను నిటు § లొప్పరికింపఁగ నీకుఁ బాడియే. 545

వ. నావుడు మునివరుం డాసురభి నాలోకించి. 546

క. నీ వొకయపకృతి నాకుం, గావింపవు నిన్నుఁ బేశ్ § గైకొని విడువన్
భూవరుఁడు బలిమి నినుఁ గొని, పోవఁగ నడ్డపడ లేక § పొగిలెద బుద్ధిన్. 547

క. అక్షౌహిణీరథసేనా, ధ్యక్షుం డక్షీణవిక్ర § మాధికదక్షుం
డీక్షోణికి నధిపతి వీ, రక్షత్రియుఁ డితని గెలువ § బ్రహ్మకు వశమే. 548

క. అనవుడు వసిష్ఠమునివరుఁ, గనుఁగొని యాధేను వనియె § ఘనతేజుఁడ వీ
వనిమిషులకు దుర్జయుఁడవు, నిను నెవ్వఁడు మిగుల నోపు § నిర్మలపుణ్యా. 549

క. తలపోయ నెందు క్షత్రియ, బలమునకంటెఁ గడు విప్ర § బల మెక్కుడు నీ
వలిగిన నతఁ డెంతటివాఁ, డలవున నను బనుపు మతని § యఖిలబలంబున్. 550

క. పరిమార్చెద నా నమ్ముని, వగుఁ డప్పుడు కెరలి నీవ § వారితబలకిం
కరుల సృజియించి చెచ్చెర, హరియింపుము వేగ వీని § యఖిలబలంబున్. 551

మ. అని పల్కన్ విని కామధేనువు సము § ద్యత్కోపవేగంబునన్
ఘనహుంకారము సేయఁ దత్ప్రథితహుం § కారంబునం బుట్టి యే
పున శాతాయుధపాణు లై బహుభటుల్ § భూరిప్రతాపంబునం
దునుమం జొచ్చిరి కౌశికోగ్రబలమున్ § దుర్వారు లై శూరు లై. 552

శా. వారిం జూచి యుదగ్రుఁ డై కనలి వి § శ్వామిత్రుఁ డుగ్రాశని
క్రూరాస్త్రంబుల నొంచి యాభటుల సం § క్షోభంబు నొందించినన్
ఘోరప్రేక్షణుఁ డై వసిష్ఠముని యా § గోవుం బ్రబోధింప హుం
కారం బప్పటియట్ల చేయ శబరుల్ § కాంభోజులుం బల్విడిన్. 553

వ. యోనిప్రదేశంబున యవనులును శకృత్ప్రదేశంబున శకులును రోమకూపంబుల
మ్లేచ్ఛులును హారికులుం గిరాతకులు నందంద పదిగోట్లవతరించి భీమరూపం
బుల భీమాయుధంబుల భీమనేత్రంబుల భీమవర్ణంబుల భీమహుంకృతుల భీకరు
లగుచు దర్పాటోపంబుల విశ్వామిత్రుబలంబులకుం గవిసి హరులతోఁ గరులతో
నరదంబులతోడ సర్వబలంబులం బరిమార్చి విజృంభింప నప్పుడు. 554

క. కౌశికుసుతు లురుకోపా, వేశులు నూర్వురు వసిష్ఠు § వెసఁ దాఁకిన న
క్లేశంబున నతఁ డందఱ, నాశము నొందించె ఘనని § నదహుంకృతులన్. 555

వ. అట్లు తనబలంబులుం దనయులుం బొలిసిన నతిదుఃఖితుం డగువిశ్వామిత్త్రుండు.

క. హతదంష్ట్రమహాసర్పము,గతి రాహుగ్రస్తతరణి | కరణిఁ భగ్నా
తతపక్షపక్షికైవడి, గతవేగపయోధిపగిదిఁ | గడు నిష్ప్రభుఁ డై. 557

క. తనసుతు రాజ్యము సేయఁగఁ, బనిచి తగం దుహినశైల | పార్శ్వంబునకుం
జని భూరితపము హరునకుఁ, జనఁ జేయఁగ వచ్చి మెచ్చి | శంభుఁడు కరుణన్.

క. నరవర నీతపమునకును, వరదుఁడ నైతి మదిలోని | వాంఛిత మారఁగ
వర మెయ్యది యడుగు మనఁగ, హరునకు నతిభక్తి మ్రొక్కి | యతఁ డిట్లనియెన్.

క. సముచితభంగిఁ మత్కా,మ్యము నీకృపఁ గలుగునేని | నఖిలధనుర్వే
దము నాకును సాంగోపాం,గము గా నుపదేశ మిమ్ము | కారుణ్యనిధీ. 560

క. సురమునిగంధర్వనిశా,చరదానవయక్షులందు | జైత్రము లగుభా
సురతరశస్త్రాస్త్రంబులు, పరఁగఁగ నిమ్మనిన నిచ్చి | భర్గుం డరిగెన్. 561

వ. అట్లమ్మహాదేవునివలన ధనుర్వేదంబును దివ్యశస్త్రాస్త్రంబులుం బడసి మహో
త్సాహంబునం బొంది దర్పాతిరేకంబున వసిష్ఠాశ్రమంబున కరిగి. 562

మ. అరుదుంగీలలు గ్రమ్మ నాశ్రమముపై | నాగ్నేయబాణావళుల్
పరఁగింపన్ వన మెల్లఁ దీప్రశిఖలన్ | భస్మంబుగా సంయమీ
శ్వరులుం బక్షిమృగప్రతానములు స|ర్వప్రాణులున్ భీతితోఁ
దిరుగంబాఱఁగ నోడకుండుఁ డనుచున్ | దీప్తప్రతాపంబునన్. 563

క. చండభుజాదండోద్ధుర,దండధరోద్దండకాల | దండక్రీడో
చ్చండగతి బ్రహ్మదండ మ,ఖండత్వర నెత్తికొనుచుఁ | గౌశికుతోడన్. 564

ఉ. తక్కక యోరికౌశిక మ | దంబున వచ్చి చిరప్రవృద్ధ మై
యెక్కినసజ్జనాశ్రమము | నేల వినాశముచేసె దింక సొం
పెక్కక నాశ మొందఁ గల | వీదురితంబున నీవు నీబలం
బెక్కడ నాదుబ్రహ్మబల | మెక్కడ క్షత్త్రియవంశపాంసనా. 565

శా. నీక్షత్త్రాఢ్యబలంబు సర్వముఁ జన | న్వీక్షింప నీవంశమున్
నిక్షత్త్రంబుగఁ జేయు నాదుబలము | న్వే చూపెదన్ నేఁడు సూ
క్ష్మక్షాంతిం బరికించి చూడుము విప | క్షక్షత్త్రపక్షావళీ
శిక్షాదండము బ్రహ్మదండము నరి | శ్రేణీభిదోద్దండమున్. 566

వ. అనుటయు.

శా. ఘోరక్రోధముతోడఁ గౌశికుఁ డతి | క్రూరాగ్నిబాణంబు వి
స్ఫారాభీలవిశాలకీల లడరం | బై నేయ నమ్మౌని హుం
కారం బారఁగఁ గిన్క నాశరము ను | గ్రబ్రహ్మదండంబునన్
వారించెన్ ఘనవారి యగ్నిజవమున్ | వారించుచందంబునన్. 567

వ. అలిగి విశ్వామిత్త్రుండు గ్రమ్మఱ వారుణాస్త్రంబు నుపేంద్రాస్త్రంబును బాశు

పత్రాస్త్రంబు నైషీకంబును మానవంబును మోహనంబును గాంధర్వంబును
ప్రస్వాపనంబును జృంభణంబును సంతాపనంబును విలాపనంబును శోషణంబును
దారుణంబును జామదగ్న్యంబును బ్రహ్మపాశంబును గాలపాశంబును వరుణపా
శంబును బినాకాస్త్రంబును శుష్కార్ద్రంబులును పైశాచికాస్త్రంబును గ్రౌం
చంబును ధర్మచక్రంబును గాలచక్రంబును విష్ణుచక్రంబును వాయవ్యంబును మథ
నంబును హయశిరంబు సశనిద్వయంబును గంకాలముసలంబులును వైద్యాధరం
బును ద్రిశూలంబును గాపాలంబును నివి మొదలుగా ననేకాస్త్రంబు లేయ వాని
నెల్ల బ్రహ్మదండంబునఁ జక్కాడి వసిష్ఠమునివరుండు బ్రహ్మతేజోమూర్తి వెలుంగ
నప్పుడు కెరలి విశ్వామిత్రుండు బ్రహ్మాస్త్రంబు సంధించిన నమ్మహాస్త్రంబు
గనుంగొని. 568

క. సకలామరగంధర్వులు, సకలోరగసకలభూత । సకలదిశాపా
లకసకలగ్రహతారక, సకలభువనసకలమునులుఁ । జలనముఁ బొందన్. 569

క. బ్రహ్మాదులు మదిఁ బొగడఁగ, బ్రహ్మాండము విస్ఫులింగపంక్తుల నిగుడన్
బ్రహ్మర్షివరునిమీఁదను, బ్రహ్మాస్త్రము మంట లెగయ । బలువిడి నేసెన్. 570

మ. అటు లేయంగఁ జటచ్ఛటప్రకటఘోరాభీలకీలచ్ఛటా
స్ఫుటధూమాకులవిస్ఫులింగచయవిస్ఫూర్తుల్ వెలుంగన్ విశం
కట వేగంబున బ్రహ్మదండమును [illegible] దాఁటి రాఁ బట్టి యు
ద్భటరోషంబునఁ జేసి మ్రింగె ముని[illegible] బ్రహ్మాస్త్రముల్ వీరుఁడై. 571

వ. ఇట్లమ్మహాస్త్రం బుపసంహరించి. 572

మ. స్ర. అతిచండబ్రహ్మదండం । బసమశమనదం । డాకృతిన్ భీమధూమా
న్వితకల్పాంతాగ్నిభంగిన్ । వెలుఁగుచుఁ దనచే । విస్తరింపం ద్రిలోకా
ద్భుతరూపబ్రహ్మతేజస్స్ఫురణ మెఱయ విస్ఫూర్తిబాణాగ్నికీలా
ప్రతతుల్ దద్రోమకూప । ప్రభవము లగుచుం । బాఱె యగ్గాధిపుత్త్రున్. 573

వ. చుఱుపుచ్ఛం జొచ్చె నప్పు డఖిలమునులు వసిష్ఠుం బ్రశంసించి నీతేజం బమోఘం
బు నీచే విశ్వామిత్రుండు నిరస్తప్రభావుం డయ్యె నింక నుపశాంతిం బొందు మని
పలుక వసిష్ఠుండును బ్రశాంతిగరిష్ఠుం డయ్యె నప్పుడు విశ్వామిత్రుండు దర్పం
బడంగి యతిలజ్జితుం డై యంతర్గతంబున. 574

క. అరుదార నమ్మునీశ్వరు, నురుతర మగుబ్రహ్మదండ । మొక్కఁడ యతిభీ
కరతమసామర్థ్యంబున, వరదివ్యాస్త్రముల నెల్ల । వడిఁ జక్కాడెన్. 575

క. అనివారిత మప్రతిహత, మనుపమ మధికం బజయ్య । మభయప్రద మీ
ఘనుబ్రహ్మబలమ బల మిలఁ, గనుఁగొన నీక్షత్త్రబలము । గాల్పనె యనుచున్.

వ. వనటం బొంది యవ్వసిష్ఠుబ్రహ్మతేజఃప్రభావంబు నుద్దేశించి. 577

క. ఘన మగుబ్రహ్మర్షిత్వము, తనకుం గా నాత్మఁ గోరి । దక్షిణదిశకుం

జని ఫలమూలాశనుఁ డై, చనఁ బత్నియుఁ దానుఁ దపము సలుపుచు నుండెన్.
క. అనఘుఁడు విశ్వామిత్రుఁడు, ఘనవిక్రము లైనసుతులఁ గనియె హవిష్యం
దుని విభుఁడై నమధుస్యం,దుని ధృతినేత్రుని మహారథుం డనువానిన్. 579
మ. అట వేయేఁడులు నిండ నుగ్రతప ముద్యద్దాంతితోఁ జేయఁగా
నట కేతెంచి పితామహుం డనియెఁ బెంపారంగ నీచేయువి
స్ఫుటవిస్ఫారతపంబు సర్వభువనంబుల్ నిండె నీ వింక నా
దట రాజర్షివి గమ్ము పొమ్మనుచు నాతం డేఁగ దుఃఖాత్ముఁ డై. 580
క. భూరిగఁ జేసిన నాతప, మూరక యెర వయ్యె నకట యొనఁగూడదు నా
కారయ బ్రహ్మర్షిత్వం, బీరాజర్షిత్వ మొల్ల నిం కే ననుచున్. 581
వ. కౌశికుం డతిఘోరతపంబు సేయుచుండె నాసమయంబున. 582

—త్రిశంకుమహారాజుచరిత్రము.—

తే. అనఘుఁడిక్ష్వాకుకులవిభుఁడగుత్రిశంకుఁ, డనుమహారాజు తనకు దేహంబుతోన
దివికిఁ జనునట్టియజ్ఞంబు తివిరి సేయు, చిత్తమునఁ బిలిపించి వసిష్ఠుతోడ. 583
క. నాకీదేహముతోడన, నాకము సన నగుమఖం బొనర్పం డనఁగా
నీకీదేహముతోడన్, నాకమునకు నేఁగ రాదు నరవర యనుడున్. 584
చ. తనర వసిష్ఠనందను లుదగ్రతపం బురునిష్ఠ దక్షిణా
బునఁ జలుపం ద్రిశంకునృపపుంగవుఁ డక్కడ కేఁగి సమ్మదం
బునఁ గని యమ్మునీంద్రులకు మ్రొక్కి వసిష్ఠమునీంద్రుఁ డట్లు గా
దనినతెఱంగు తెల్పి వినయంబున వారలతోడ నిట్లనున్. 585
క. సురపురికి నొడలితోడన, యరుగఁగఁ జేయింపుఁ డుచితయజ్ఞము నను మీ
గురుకరుణ ధర్మసాధకు, లరయఁ బురోహితుల కారె యవనీశులకున్. 586
క. అన విని ఘనుఁడు వసిష్ఠుం, డనుమతి సేయంగ లేనియాపని మాచే
నొనరింప నగునె దుర్మతి, గనుఁగొనఁగా లేవు గానికార్యం బగునే. 587
వ. అనవుడు. 588
క. పాయక యీవల నావల, మాయాశ్రితు లగుచు బ్రదికి మద్వాంఛితముం
జేయని మీ రేటికి మఱి, మీయాగురుఁ డేల మాకు మే లొనఁగూడన్. 589
వ. అన్యుచేతం జేయించికొనియెదం గాక యని పలుక నవ్వాసిష్ఠు లలుక. 590
క. చండాలుండవు గమ్మని, చండక్రోధమునఁ బలుకఁ జండాలత యు
ద్దండగతి నపుడ వచ్చినఁ, జండాలుం డై త్రిశంకుజనపతి యంతన్. 591
సీ. ఘనరాజతేజంబు గాలినగతి నమం,గళకాకసన్నిభగాత్ర మమరఁ
బెనుమైల యగుసీలిప్రేలిక మొలఁ గట్టి, పై నొకయెఱ్ఱనిప్రాఁత దాల్చి
మును దాను బూనిన కనకభూషణము ల, యోమయభూషలై యొప్పుచుండఁ
జెదరినకేశముల్ చెనుపరిమంటలు, వికృతస్వరంబును వెలయఁ గలిగి

యినుపయుంగరములుఁ గేల నిడినకోల, నేలనందంద మొరయంగ నెరయనచట
నచటశంబళిశంబళి యనుజనములఁ, గదియ కావలఁదొలఁగుచు నొదుఁగుచుండె.

క. ఆరాజుఁ జూచి యప్పుడు, పౌరులు భృత్యులు నమాత్య బంధుజనంబుల్
చేరక విడిచి రతండును, గారవ మెల్లఁ జెడి పోయెఁ గౌశికుకడకున్. 593

క. కౌశికుఁ డెఱిఁగి యయోధ్యా, ధీశుఁడ వగునీకు నేల యీచండాల
క్లేశము వచ్చెను నావుడు, నాశాపక్రమముఁ జెప్పి యతిదుఃఖమునన్. 594

వ. కౌశికునకుఁ బ్రణమిల్లి యతం డి ట్లనియె. 595

సీ. ఏను జేసెద నన్న యిష్టయజ్ఞము సేయ, నొనర నెన్నఁడు బొంక నొకట మున్న
నిట్టియాపద నున్న నిటమీఁద నైనను, సత్యంబ పాటింతుఁ జలము మెఱయ
బహుతరాధ్వరములు బహుదానధర్మముల్, ప్రియముతోఁ గావించి పెంపుగంటి
గురుల నారాధింతు గురులు నాపైఁ గృపా, రతిలేమి ధర్మకార్యంబు చిక్కెఁ
దనకు దైవంబు లేకున్నఁ దాను జేయు, పౌరుషం బపకారమై పరిభవించుఁ
గాన నాపాలిదైవమై కావు నన్ను, జనశరణ్య విశ్వామిత్ర మునివరేణ్య. 596

మ. అనుడున్ నెమ్మది నుండు భూవర ముదం బారంగ నిచ్చోటికి
ఘనపుణ్యవ్రతులైనసర్వమునుల న్రావించి యజ్ఞంబు గ
న్కనిఁ జేయించి తగంగ నీపలుకు నిక్కంబై ప్రకాశింపఁగా
విను నీదేహముతోన నాకమునకున్ వేవేగ యేఁ బుచ్చెదన్. 597

క. అని తనశిష్యుల నందఱఁ, గనుఁగొని ఋత్విజుల మునులఁ గడువేగమునం
గొని రండు త్రిశంకుఁడు వచ్చినవాఁ డటు గాన మఖముఁ జేయఁగ వలయున్.

చ. అన విని వార లేఁగి రయ మారఁగ వచ్చి మునీంద్రచంద్ర నీ
యనుమతి మమ్ముఁ దె మ్మనిన యందఱఁ దోడ్కొని వచ్చినార మిం
పెనయ వసిష్ఠునాశ్రమము నింద్రులు దక్కఁగ నవ్వసిష్ఠునం
దను లొకకొన్ని యాడిరి మదంబులతో విను వారివాక్యముల్. 599

ఉ. మాలఁడు సోమయాజియట మాలకు రాజట యాజకుండు చం
డాలమఖంబునం గుడువ నల్వనఁ బాఱులు వత్తురట్టె ది
క్పాలకు లేఁగుదెంతురట పైఁబడి తత్క్రతుభాగముల్ గొనన్
వాలి యనామకుండట దివంబునకుం జనువాఁడు బొందితోన్. 600

క. విన నివి యెంతయుఁ జిత్రము, లనుచు వసిష్ఠసుతు లాడి రచ్చోటితపో
ధను లండఱిచ్చటికి రా, మని యుత్తర మిచ్చి రనిన నతికోపమునన్. 601

మ. నుతనిష్ఠం దప ముగ్రతం జలుపునన్నుం గ్రొవ్వి దూషించును
ద్ధతపాపాత్ములు నూఱుభేదములఁ గ్రవ్యాదత్వముం బొంది దు
స్థితిఁ గౌలేయకమాంసముల్ దినుచు వర్తింపంగ నిమ్మూర్ఖ సా
గతి నన్నాడినయామహాధముఁడు వే కాసీ నిషాదుం డిలన్. 602

వ. అని పలికి తనకడ నున్నఋత్విజుల మునుల నాలోకించి. 603

క. మఱిఁ దలఁప నీత్రిశంకుం, డతిపుణ్యుఁడు సత్యసంధుఁ డనఘుఁ డనేక
క్రతువులు చేసినవాఁ డీ,క్షితిపప్రియమఖము మనము సేయుద మనినన్. 604

క. మన మిప్పని గా దనినను మనలం, గ్రోధాగ్ని నితఁడు మండి శపించుం
ఘనరోషి యీతఁ డీతని, పనుపునఁ జేయుదము మఖము ప్రాజ్ఞత ననుచున్.

వ. వార లందఱు నానామంత్రపూతంబుగాఁ జేయుచుండ నయ్యజ్ఞంబునకుం దాన
యాజకుం డై విశ్వామిత్త్రుం డనుష్ఠించుచుండెఁ బ్రసంగం బైన. 606

క. సురల హవిర్భాగము గొన, వరుసను రం డనుచుఁ బిలువ వారలు భూరి
స్వరముల రా మని పేర్కొన, నురుతరరోషమున నలిగి యుగ్రుం డగుచున్.

క. కుశపూత మైనచే నస, దృశగతి నృపు నెత్తి వెస మహాదీర్ఘోగ్రతపో
వశసామర్థ్యము చూడుము, త్రిశంకునృప నిన్ను నిపుడ దివికిం బుత్తున్. 608

వ. అని పలికి నేను బాల్యంబాదిగా నధికపుణ్యతపంబుఁ జేసితి నేని నాతపస్సా
మర్థ్యంబున నింక. 609

మ. సురలోకంబున కేఁగు మీతనువుతో క్షోణీశ నా నానరే
శ్వరుఁడుం నాకము చేర నింద్రుఁ డలుకం జండాల పొమ్మంచు న
త్వరుఁ డై ద్రోచినఁ గావవే కరుణ విశ్వామిత్ర యంచుం భయం
కరభంగిం దలక్రిందుగాఁ బడునెడం గాధేయుఁ డుద్యద్దయన్. 610

క. శరణార్థి యగుత్రిశంకుని, ధరణీశ్వర నెఱవ కనుచుఁ దారామార్గాం
తరమున నిలువు మటంచుం, నరనాయకు నిలిపి తత్క్షణమ చని యచటన్.

క. సురపురికి సురపురంబును, సురలకు మఱి వేఱుసురలఁ జొప్పడ నింకం
విరచింతు ననుచుఁ దలఁపఁగ, సురలును సన్మునులు వచ్చి శుభవాక్యములన్.

క. సురనాథుతోడఁ బురుడుగ, నరనాయకునకును వేగ నాకం బమరం
వెరవున రచించి తారో,త్కరముల సప్తర్షివరులఁ గల్పింపకుమీ. 613

సీ. చిరపుణ్య కౌశిక గురుశాపహతుఁ డైన,చండాలుఁ డద్దివి నుండఁ దగునె
యనిన విశ్వామిత్త్రుఁడనియె వారలతోడ, మానుగా నీరాజు మేనితోడ
వెలయ నాకమునందు నిలిపెద నన్నాఁడఁ, గాన నాపలుకు నిక్కంబుగాఁగ
నేను గల్పించినయీనాకమునఁ దార, కంబులనడుమ నక్షత్రవీథి
కంటెఁబొడువుననమరసంకాశుఁడగుచు, శిరముక్రిందుగ వ్రేలుచుఁబరఁగనింద్ర
భువనములు చెల్లునందాఁక భూరిమహిమ,దనర నుండెడుననవారలనుమతించి.

వ. అతనియనుగ్రహంబుఁ గొనియాడుచు నతని వీడ్కొని నిజస్థానంబుల కరిగి రంత
విశ్వామిత్త్రుండు దనయాశ్రమమునిజనంబులం జూచి యింక నీయాశ్రమం బతి
సమ్మర్దంబు గాఁగలదు తొలఁగి పోద మనుచుఁ గదలి విశాలాపురీసమీపంబునఁ
బొలుచుపుష్కరక్షేత్త్రంబునం దత్యంతతపంబు సలుపుచునుండె. 615

—శునశ్శేఫుని కథ.—

క. అంత నయోధ్యాధిపుఁ డ,త్యంతఘనుం డంబరీషుఁ । డధ్వర మధిక
స్వాంతమునఁ జేయఁ దొడఁగ బ, లాంతకుఁ డెత్తుకొనిపోయె । నామఖపశువున్.

వ. అప్పు డాయాజకుం డారాజు నవలోకించి. 617

క. నీవు మదంబునఁ బశువుం, గావక యేమఱితి పశువు । గలుగక యున్నన్
వేవే ప్రాయశ్చిత్తము, గావింపఁగ వలయు నెట్టి । క్రతువున కైనన్. 618

వ. నరు నైనఁ బశువుఁ గాఁ జేసి యాగంబు సేయవలయు నని పలికి. 619

క. క్రతు వంతరాయ మైనను, గ్రతుకర్త వినాశ మొందు । ఘనపాపముచేఁ
గ్రతు వెడపకుండఁ జయ్యనఁ, గ్రతుపశువుం దేరవలయుఁ । గ్రతుపుణ్యనిధీ.

వ. అనిన రాజు కళత్రపుత్త్రాదులతోడ. 621

చ. వనములఁ గొండలన్ గుహల । వాఁగుల బావులఁ బల్వలంబులన్
ఘనతృణసీమలం బశుని । కాయములోపల గోష్ఠభూములం
దనరెడునట్టికందువలఁ । దక్కిన దేశములం బురంబులం
గనుకనిఁ జూచుచున్ వెదకి । కానక చెచ్చెర వచ్చి యొక్కెడన్. 622

క. అనఘాత్ముం డగురుచికుం, గనుఁగొని మఖపశువు వెదకి । కానము నీనం
దను నొకని లక్షగోవులఁ, గొని పశువుం గాఁగ నిమ్ము । కోరిక ననినన్. [దండ్రి,

తే. పెద్దవాఁడు నా కెంతయుఁ । బ్రియతనూజుఁ, డతని నే నీకు నీఁజాల । ననియెఁ
పిన్నవాఁడు నాకెంతయుఁ । బ్రియుఁడుగాన, యాకుమారుని నీఁజాల । ననియెఁ దల్లి.

వ. అట్లయ్యిరువురుం దగ నాడువాక్యంబులు విని శునశ్శేఫుం డిట్లనియె. [డు

తే. పెద్దవాఁడు తండ్రికిఁజాలఁ । బ్రియసుతుండు, పిన్నవాఁడు తల్లికి ముద్దు । ప్రియసుతుం
వారలిరువురు నొల్లని । వాఁడ నయిన, మధ్యముఁడ నేను వచ్చెద । మానవేంద్ర.

వ. నీ విచ్చెద నననగోవుల వీరి కిమ్ము నీవెనుక నే వచ్చెద ననిన నతం డాలక్షగోవుల వారికిచ్చి శునశ్శేఫుని రథంబున నిడికొని సంతోషంబున నేతెంచి పుష్కరక్షేత్రంబున విడిసి యుండ. 627

సీ. అచట విశ్వామిత్త్రుఁ । డత్యుగ్రతపము సే, యంగ శునశ్శేఫుఁ । డచటి కరిగి
భక్తి నామామకుఁ । బ్రణమిల్లి కృతపుణ్య, తమ కతిప్రేమపా । త్త్రంబు లనుచుఁ
దనపెద్దకొడుకు నా । తండ్రియు మఱి పిన్న, కొడుకు నాతల్లియుఁ । గూర్మి నీక
పాపాత్ము లై యజ్ఞ । పశువుగాఁ గృపమాలి, యంబరీషునకు న । న్నమ్మికొనిరి
తనకు వార లెక్కడితల్లి । దండ్రు లనఘ, నీవ తల్లివి దండ్రివి । నీవ గురువు
క్షితిపుయజ్ఞంబువెలయంగఁ । జేసినన్నుఁ, గావు ప్రాణదానం బిడి । కరుణతోడ.

వ. అనుచు దీనుం డై యభయంబు వేఁడువల్లుని నాదరించి కౌశికుండు దనతనయుల నవలోకించి. 629

క. సుతులార నాకు నల్లుం, డితఁ డారయ మునిసుతుండు । హితమతి మీలోఁ

గ్రతునిష్ఠ నొకఁడు పశు వై, యితనిన్ రక్షింప వలయు ¦ నెంతయుఁ గరుణన్.

క. పురుషులు దనయులఁ బడయుట, పరలోకముకొఱకుఁ గాదె ¦ పరఁగన్ మీ రీ
శరణార్థి నితనిఁ గాచుట, పరలోకము నిదియె నాకుఁ ¦ బరమపదంబున్. 631

వ. అదియునుం గాక యితని రక్షించుట బంధుహితంబును శరణాగతరక్షణంబును యజ్ఞపాలనఫలంబు నగ్నిసంతర్పణంబును దేవతాతుష్టికార్యంబు నగునావచనంబు లాచరించుటయ మీ కతిధర్మం బనిన వార లనుమతింపక యాఁజనకునితోడ.

క. తనసుతులఁ జంపి యన్యుల, తనయుల రక్షింప నాత్మఁ ¦ దలఁతురె యెటు నే
రనివార లైనఁ గావున, జనకుఁడ నైన నగు వినుము ¦ చన వీమాటల్. 633

వ. అని పలికి వార లనుమతింప కునికి యెఱింగి. 634

క. కడు నలిగి శునకమాంసము, నుడుగక వేయేండ్లు దినుచు ¦ నుగదుఃఖములం
బడుఁ డని శపించి మఱి కృప, యడర శునశ్శేపుఁ బిలిచి ¦ యాతనితోడన్.

చ. జయముగ రెండుమంత్రములు ¦ సమ్మతి నిచ్చెద వాని నెంతయున్
నియతి జపింపు సేమ మగు ¦ నీకు నృపాలకుఁడున్ నిజాధ్వరా
వ్యయఫల మొందు నంచు ముని ¦ యావరమంత్రము లిచ్చె నంత వే
ప్రియమున నేఁగె రాజు నట ¦ రేయి సనన్ మఱునాఁడు వేడుకన్. 636

క. క్రతువాటమునకుఁ జన నా, యతిసుతు యూపమునఁ గట్టి ¦ యాతనిమే నం
చితరక్తగంధమాల్యా, న్వితముగఁ బశుపూజ సేసి ¦ విశసించు నెడన్. 637

మ. అరుదారం జలియింప కమ్మునిసుతుం ¦ డామంత్రముల్ రెండు సు
స్థిరనిష్ఠన్ జపియింపఁగా నచటికిన్ ¦ దేవేంద్రుఁ డేతెంచి యా
ధరణీపాలు విశిష్టయజ్ఞఫల ము¦ద్యత్ప్రీతితో నిచ్చి యా
దర మారన్ మునిపుత్రుఁ గాచి చనె నా¦త్మస్థానముం జేరఁగన్. 638

శా. అంతం గౌశికుఁ డెంతయుం దపము ని¦ర్ధారంగ వేయేండ్లతి
శ్రాంతిం జేయఁగ బ్రహ్మయున్ సురలు ని¦శ్చర్చన్ వచ్చి నీవిశ్రుత
స్వాంతం బైనతపంబుచేత ఋషి వై ¦ తం చాడి వా రేఁగఁగా
సంతోషింపక యాతఁ డుగ్రతప మా¦సక్తిన్ వెండియుం జేయఁగన్. 639

మ. కరికుంభస్తనభార మున్నతతటీ¦కృత్కల్పప్రియాకారమున్
హరినీలోపలవేణియుం బ్రథితదీ¦వ్యచ్ఛ్రోణియుం బద్మభా
స్వరరూపాస్యవికాసమున్ శరదుదం¦చచ్చంద్రికాహాసముం
బరఁగన్ మేనక వచ్చి యచ్చటఁ జరిం¦పం జూచి మోహాంధుఁ డై. 640

మ. సుదతీ యుల్లము దూఱుతూపుల మనో¦జుం డేయుచున్నాఁడు స
మ్మద మారన్ రతికేళి సల్పు మని య¦మ్మత్యాసక్తితో వేడుకం
బదివర్షంబులు క్రీడ సల్పి మదిలో ¦ భావించి విజ్ఞాని యై
త్రిదశుల్ నాతప మీనిమిత్తమున వా¦రింపంగ నీయచ్చరన్. 641

క. పుత్తెంచినవా రని దివి, కత్తెఱవను వీడుకొల్పి । యంగజు గెల్వం
జిత్తమునఁ గోరి వేయేం, డ్లుత్తరగిరివెనుకఁ దపము । నుగ్రతఁ జలిపెన్. 642
తే. అట్లు కౌశికుఁ డుత్తర । మందు ఘోర,తపము సేయంగ దేవతల్ । దలఁకి వచ్చి
యబ్జభవుఁ గాంచి నీవు మ । హర్షి వనఁగఁ,గౌశికుం డగ్గలఁడన । నగుఁగాక యనుచు.
మ. అజుఁ డేతెంచి మహర్షి వైతి వనఁగా । నా బ్రహ్మ నీక్షించి య
బ్జజ నీ వారసి నిక్కవంబుగ ననుం । బ్రహ్మర్షి వన్నంతదాఁ
క జయం బొందఁ దపం బొనర్తు నన నాఁ । గా కంచు లోకేశనా
కజు లేఁగన్ మఱియుం జలంబు నెఱయన్ । గాధేయుఁ డత్యుద్ధతిన్. 644

—విశ్వామిత్రుండు రంభను శపించుట.—

మ. అనిలాహారుఁడు నూర్ధ్వబాహుఁడు నిరా । హారుండు నై సీతునం
దనరం దోయములందు నేసవిఁ దగం । బంచాగ్నిమధ్యంబునన్
ఘనవర్షాగమవేళ బట్టబయలం । గా నుండి వేయబ్దముల్
సన నత్యుగ్రతపంబు నోపి సలుపన్ । జంభారి రంభం దగన్. 645
చ. కనుఁగొని రంభ దేవహిత । కార్యము సేయఁగ నేఁగి గాధినం
దనుతప మంతయుం జెఱుపు । నావుడు నన్ను శపించుఁ గిన్క న
మ్ముని తెరు వేను బో వెఱతు । మూర్ఖుఁ డతం డని పల్క నోడ కేఁ
బనుపడి నీకుఁ దో డమరఁ । బంపెదఁ జయ్యనఁ బుష్పబాణునిన్. 646
వ. ఏను నీవెనుకన వచ్చెద నని పనిచిన. 647
సీ. చారుచంద్రికతోడి । చంద్రబింబముఁబోలె,మందహాసానన । మంద మొంద
నింద్రనీలప్రభ । నెడనెడ వెదచల్లు, కుంతలకాంతులు । కొమరుమిగులఁ
బద్మరాగప్రభల్ । పైపయి నిగిడించు,పాదపల్లవరుచుల్ । ప్రజ్వలింప
బాలాతపము గాయు । పసిఁడికుండలమూడ్కిఁ, గుంకుమపరిలిప్త । కుచములమరఁ
తే. గనకరేఖాసమాకృతిఁ । దనువు మెఱయ
రాజహంసయానంబున । రంభ వచ్చి
చిత్తభవుఁ జేయఁ గోయిల । చెలఁగి కూయ
శ్రుతులఁ గూడఁ బాడుచుఁ దన । మ్రోలఁ బొలయ. 648
మ. అపు డీక్షించి ననుం దపోవిముఖుఁ జే । యన్ వజ్రి పుత్తెంచిన
గపలేచ్ఛం జనుదెంచి యున్నది కడున్ । గర్వంబుతో నంచు న
చ్చపలాక్షిం బటురోషవేగమున వి । శ్వామిత్రుఁ డత్యుగ్రుఁ డై
శపియించెం బదివేలవర్షములు పా । షాణత్వముం బొందఁగన్. 649
చ. అటు శపియించి శాపవిహి । తావధికాలము నిండఁ జన్న మీఁ
దట నొకపుణ్యుఁ డైనవసు । ధామరవర్యునిచేత నీ వతి
స్ఫుటముగ శాపమోక్షణముఁ । బొందెదు నా శిల యయ్యె రంభ య

చ్చట నిలువంగలేక వెఱఁ జయ్యన నేఁగె మరుండు నయ్యెడన్. 650

మ. తనవిస్ఫారతపంబు గొంత దఱుఁగం దా నాత్మ వేయేఁడు లిం
క నిరాహారుఁడ నిర్జితేంద్రియుఁడ నేకస్వాంతవృత్తుండ నై
చన నుద్యత్తప మూర్పు వుచ్చ కతినిష్ఠం దాల్మితోఁ జేసెన్
నను బ్రహ్మర్షివి నీ వటం చజుఁడు సన్మానంబుతోఁ బల్కఁగన్. 651

వ. అనుచు నుత్తరంబు విడిచి తూర్పుదెస కరిగి సిద్ధాశ్రమభూమియందు. 652

ఉ. ఆరఁ దపంబు వత్సరసహస్రము నిండఁగఁ జేసి యానతోఁ
బారణ సేయ నున్నతఱి బ్రాహ్మణుఁ డై బలభేది వేఁడ నిం
పారఁగ భోజనం బిడఁగ నన్నము సర్వముఁ దా గ్రహించినన్
వారక వెండియుం దపము వర్షసహస్రము సల్పుచుండఁగన్. 653

క. ఆకౌశికునాదల నతి,భీకరగతిఁ బొగలు నెగసి పేర్చి దిశాచ
క్రాకాశంబులు నిండఁగ, నాకము గంపించె రాలె నక్షత్రంబుల్. 654

క. కడు బెగడు గుడిచె భువనము, లుడుగక జలనిధులు గలఁగె నుడుపథమునఁ బె
న్మిడుఁగుఱు లెడ నెడఁ బొడమఁగ, వడిఁ బిడుగులు వడియెఁ బుడమి వడవడ వడఁకెన్.

వ. అట్టియెడ. 656

క. సురలును గంధర్వులు ముని,వరులుం బరమేష్ఠి కడకు వాంఛం జని యా
సరసిజసంభవునకు నా,దరమునఁ బ్రణమిల్లి యాపితామహుతోడన్. 657

శా. బ్రహ్మం బైనతపంబుఁ గౌశికుఁ డొనర్పం జొచ్చె నమ్మౌనికి
న్బ్రహ్మర్షిత్వము నైన బ్రహ్మపద మైనన్ వేగ యీకుండినన్
బ్రహ్మాండంబులు దత్తపోగ్నిశిఖలన్ భస్మంబు లౌ నావుతున్
బ్రహ్మణ్యుం డగుబ్రహ్మ సంయమినిలింపస్తోమముల్ గొల్వఁగన్. 658

మ. చన నేతెంచి భవత్తపోమహిమ విశ్వామిత్ర బ్రహ్మర్షి వై
తనిశంబుం దప మింక నేల యన బ్రహ్మం జూచి బ్రహ్మాత్మజుం
డును బ్రహ్మర్షియు నైనపుణ్యుఁడు వసిష్ఠుం డిచ్చ నిక్కంబుగా
నను బ్రహ్మర్షిపదుండ వై తనక నే నమ్మన్ జగద్రక్షకా. 659

మ. అనుడున్ బ్రహ్మయు సర్వదేవతలుఁ గామ్యం బొంద రప్పింపఁ జ
య్యన నేతెంచి తపోమహత్త్వమునఁ దథ్యం బొంద బ్రహ్మర్షి వై
తనుమానింపకు మన్నఁ గౌశికుఁడు నెయ్యం బొప్ప భక్తిన్ వసి
ష్ఠునిఁ బూజించెఁ బ్రియంబుతోఁ జనిరి తోడ్తో నంత బృందారకుల్. 660

వ. అని పలికి శతానందుండు రామచంద్రా కేవలతపోమూర్తి యగు కౌశికుతపస్సా
మర్థ్యంబులు చెప్ప ననేకంబు లనిన రామలక్ష్మణులు నక్కడి సభాసదులు నాశ్చ
ర్యసంతోషంబులం దేలి విశ్వామిత్రుం బ్రశంసించి పూజించి రంత. 661

క. నాకులజుఁ డైనరాముఁడు, శ్రీకంఠునివిల్లు విఱిచి సీతం బ్రీతిం

గైకొను రే పని చెప్పఁగ, నాకమునకు నరుగువిధముగ నర్క రవి గ్రుంకెన్. 662

వ. ఆరాత్రి వేగిన జనకుండు రామలక్ష్మణసహితుం డగువిశ్వామిత్రు రప్పించి యర్ఘ్యా సత్కారంబు లాచరించె నప్పుడు విశ్వామిత్రుండు మిథిలేశుం గనుంగొని. 663

క. ఘను లీరాజకుమారులు, దనరఁగ నీయింట నున్న ధనువు క్రమమునం గనుఁగొనఁ గోరెద రిటకున్, జనవర తెప్పింపు మనుడు జనకుం డనియెన్. 664

చ. తనరఁగ యజ్ఞభాగములు దక్షుమఖంబునఁ గ్రొవ్వి దేవతల్
సనఁ దన కీక యున్న నతిచండత నల్గి మహేశుఁ డీశరా
సనమున నెల్లదేవతల జర్జరితాంగులఁ జేయ భీతులై
యనిమిషు లోలి నేఁగి యభయంబులు వేఁడిన నిచ్చి శాంతుఁడై. 665

క. జగతి మదీయకులాగ్రణి, యగునిమి కాఱవతరమున యవనీపాలుం
డగు దేవరాతుచేతికిఁ, దగ నిల్లడ యిచ్చె హరుఁడు తత్కార్ముకమున్. 666

క. చిరకాలం బది మొదలుగఁ, దరతర మక్కార్ముకంబు తగ మాయింటన్
సురుచిరపూజల నొందుచు, నుసుతర తేజంబుతోడ నొప్పుచు నుండున్. 667

క. బాఁతిగ నే నాఁగటఁ గ్రతు,భూతలమును దున్నునపుడు పొలఁతుక వెలయన్
సీతాంతంబునఁ బుట్టిన, సీతానామంబు సేసి చెలువుగఁ బెంపన్. 668

చ. పరిణయయోగ్య యైనఁ దగుభర్తకు నాసుత నీఁ దలంచి య
య్యురుతరచాప మెత్తి బల మొప్పఁగ నెక్కిడ నోపువానికిం
బరఁగఁగ నిమ్మహీతనయఁ బత్నిగ నిచ్చెద నంచు నే స్వయం
వర మని చాటఁ బంచినను వాంఛల నచ్చి యనేకభూపతుల్. 669

క. తమముంగటఁ బెట్టినచా, పము గనుఁగొని యెత్తఁ జేరి పటుతరభుజస
త్త్వములఁ గదలింప లేక,క్షము లై యుండంగ నెఱిఁగి కన్నియఁ దమకున్.

శా. ఏ నీ కుండఁగ నల్గి యెంతయు మదం బేపార నాకోటపై
నానాసేనలతో వడిన్ విడిసిన న్నైసరించి యే నుండఁగా
నానాఁటన్ మును సంచితంబు లగు సైన్యవ్రాతముల్ వోయిన
న్మానొందన్ సురలన్ భజించి బహుసైన్యం గాంచి యాసేనతోన్. 671

క. వడిఁ బురము వెడలి విడిసిన,దడములపై నడువ విఱిగి తత్తఱమున మా
ర్పడి కొందఱు బలములు రా, పడఁగం జెడిపోయి రంత నడరినభీతిన్. 672

వ. అట్టులు గావున. 673

మ. వడి రామక్షితినాయకుండు భుజసత్త్వం బొప్ప నాచాప మె
క్కిడినం జాలు మదీయపుత్త్రిఁ బ్రమదం బేపార నే నిచ్చెద
న్మృడుబాణాసన మున్నమండన దగ న్వే తెందు మీ రేఁగి యి
క్కడ కంచుం బదివేవురం బనిచె వీఁకన్ బాహుసారాఢ్యులన్. 674

—శ్రీరామచంద్రుండు శివునివిల్లు విఱుచుట.—

ఉ. పంబినవేడ్క లుల్లమునఁ బైకొన వారును నేఁగి యష్టచ
క్రంబు నయోమయంబును ధరాధరమూర్తియుఁ గాలమేఘతు
ల్యంబును నైనమందస బలంబున నందఱు ద్రొబ్బి తెచ్చి చో
ద్యంబునతోడఁ గన్గొనఁగ నాసభముందటఁ బెట్టి నిల్పినన్. 675
వ. జనకుండు కౌశికుం గనుంగొని. 676
క. సురగరుడోరగయక్షా, సురకిన్నరదనుజరాక్షసుల కైనను దు
ర్భర మగునీధను వెత్తఁగ, నరు లెంతటివారు గాధినందన యయినన్. 677
ఉ. ఏపునఁ జూపు మీధనువు నీనృపపుత్త్రుల కంచుఁ బల్క నా
తాపసపుంగవుండు వసుధావరశేఖరు రాముఁ జూచి యీ
చాపము లీల నెత్తి భుజసత్త్వ మెలర్పఁగ నెక్కువెట్టు నా
నాపటువిక్రమక్రమసమగ్రుఁడు రాముఁడు చేరి వేడుకన్. 678
క. మందసఁ దెఱచి జనుల్ వెఱఁ, గందఁగ విలు వెడలఁ దిగిచి యాగవుసెన లీ
లం దొలఁగఁ ద్రోచి భూస్థలి, నందముగా నిల్పి మౌర్వి నలవఱిచి వెసన్.
మ. కలభం బాతతచండతుండమున వీఁకన్ శేషనాగేంద్రునిన్
బలిమిం బట్టినభంగి రామధరణీపాలుండు కోదండమున్
బలుముష్టిన్ వడిఁ బట్టి యెత్తి తెగ విస్ఫారంబుగాఁ జేసి ని
శ్చలుఁడై యల్లన లస్తకంబు వగలెం జాపంబు భగ్నంబుగన్. 680
క. నారులఁ బట్టినవారికి, నారయ ధర్మములు గలవె యన నారిఁ గరం
బారంగఁ బట్టి రాముఁడు, పౌరులు చూడంగ ధనువు భగ్నముసేసెన్. 681
మ. ధను వుద్యద్గతి రాముఁ డట్లు విఱువం దద్ఘోరఘోషం బొగిన్
ఘననిర్ఘాతనిపాతజాతనినదోగ్రధ్వాన మై మ్రోసినన్
విని యాస్థానమువార లెల్ల వడిఁ బృథ్విం ద్రెళ్లి మూర్ఛిల్లి రా
జనకాధీశుఁడు రామలక్ష్మణులు విశ్వామిత్త్రుఁడుం దక్కఁగన్. 682
చ. కులగిరు లెల్లఁ బెల్లగిలెఁ గుంభిని యల్లల నాడె దిగ్గజం
బులు బెదరెన్ భుజంగపతి బొమ్మరవోయెఁ బయోధు లన్నియుం
గలఁగె దిగంతముల్ వగిలెఁ గన్కనిఁ జారలు రాలె సూర్యచం
ద్రులగతి తప్పె మేఘములు దూలె నజాండము మ్రోసె నయ్యెడన్. 683
మ. జనకుం డచ్చెరు వంది యెంతయు మదిన్ సంతోష ముప్పొంగ న
మ్మునిచూడామణితోడ ని ట్లనియె రాముం జూపి యీరాజనం
దను శౌర్యం బతివిస్మయం బసమ మత్యంతంబు నాకూఁతు నీ
తని కే నిచ్చెదఁ బ్రీతి నాపలుకు నిత్యం బై నుతిం బొందఁగన్. 684
వ. అని పలికి మునియనుమతిం దగినమంత్రులం బిలిపించి మీరు దశరథుకడ కేఁగి

యానృపతికి నీవృత్తాంతం బెఱింగించి వివాహంబునకుం దోడ్కొని రం డని పను
ప వా రరిగి పుత్రాగమనంబున కెదురు చూచుచున్నదశరథుమనోరథం బారఁ
గదిసి దశరథేశ్వరా సీతనయుం డగురామచంద్రుండు సౌమిత్రిసహితుం డయి
విశ్వామిత్రువెనుకఁ జనుదెంచి యనేకరాక్షసవీరులం దునిమి కౌశికుయజ్ఞంబు
రక్షించి పదంపడి జనకుయజ్ఞంబు చూడం జనుదెంచి యచట సురాసురులకు
దుర్భరం బైనహరుచాపంబు నవలీల మోపెట్టి విఱిచిన రామచంద్రునిభుజవి
క్రమంబునకు జనకుం డెంతయు నాశ్చర్యసంతోషంబులం బొదలి యాతనికిఁ
దనకూఁతు సీత నిచ్చెద నని కౌశికానుమతి నిన్నుం బెండ్లికిఁ బిలువం బుత్తెంచిన
నేతెంచితి మింకఁ దడయక విచ్చేయు మనిన దశస్యందనుం డత్యానందంబునం
బొంది వారల కనేకదివ్యాంబరాభరణంబులుం గనకమణిగణంబులు నిచ్చి
వివాహమహోత్సవంబు చాటించి యమ్మఱునాఁడు వసిష్ఠవామదేవాత్రికశ్యప
కాత్యాయనమార్కండేయజాబాలిముఖ్యులతోడ బహురత్నభూషణకనకమయ
పీతాంబరంబు లలంకరించి మహోత్సవంబున. 685

—దశరథుండు మిథిలాపురంబున కరుగుదెంచుట.—

సీ. రాణ నొప్పారునిస్సాణరావంబులు, కాహళారావముల్ । గ్రందుకొనఁగఁ
కమనీయభూషణ।గణమణిద్యుతులును, శాతాయుధద్యుతుల్ । సందడింప
నాతపత్రధ్వజ।కేతనచ్ఛాయలుఁ, జామరప్రభలును । సరసమాడ
ఘనబలోద్ధతరజం।బును గడు నొప్పఁ బైఁ, జల్లుసుగంధర।జంబు బెరయ
మధురగాననినాదముల్ । మఱులుకొల్ప
వెలయఁ బూరించునాదముల్ । గలయఁ బడఁగ
వందిమాగధజనసూత।బృందవివిధ
ఘోషణంబులు నిసగెలం।కులఁ జెలంగ. 686
మ. కరటిస్కంధము లెక్కి నందనులు ము।క్తాచ్ఛత్రసుచ్ఛాయలన్
సరి నేతేరఁ బురంధ్రులున్ బుధతతుల్ । సామంతులున్ మంత్రులుం
గరులున్ వాజులుఁ దేరులున్ సుభటులున్ । గాణిక్యమున్ గాయకో
త్కరమున్ సూచకసూతవందినటులుం । గైవారులున్ నాగరుల్, 687
క. సకలనియోగంబులఁ దనుఁ, బ్రకటితవిభవములఁ గొలువఁ । బరమప్రేమో
త్సుకతన్ జనకక్షితినా, యకునగరంబునకుఁ జేర । నరుగఁగ నచటన్. 688
సీ. ఎదురుగా మిథిలేశుఁ । డేతెంచి ప్రియముతో, దశరథుఁ గొనిపోయి । తగినచోట
విడియించి యంగడ । వెలయ సన్మానించి, ఘనులు వసిష్ఠాది।మునులు నీవు
నెమ్మి వచ్చితి రిందు । నేఁడు నాకుల మొప్పె, నేను ధన్యుఁడ నైతి । నృపవరేణ్య
నాచేయుమఖ మొప్పె । నలినాప్తకులులతో, సంబంధ మది గల్గె । సకలదిశల
యందు నాకీర్తి పెంపొందె । నర్హభంగి, యమరఁగాఁ బెండ్లిలగ్నంబు । నాప్తబుధుల

నడిగి మనము ప్రవర్తింత । మనినజనకు, పలుకులకు మెచ్చి దశరథుఁ । డలరెనపుడు.

క. రాముని లక్ష్మణుఁ గొని వి,శ్వామిత్రుఁడు ప్రేమ మెసఁగ । వచ్చినఁ గని య
త్యామోదముతో దశరథుఁ, డామునినాథునకు మ్రొక్కి । యభిమత మొసఁగన్.

చ. అనఘ మునీంద్ర మీకృపఁ గృ । తార్థుఁడ నైతిఁ దగంగ సర్వశో
భనములు గంటి నావుడు నృ । పాలక నీ వతిధార్మికుండ వ
త్యనుపమసత్యశీలుఁడ వ । దంచితభాగ్యముకల్మి నీమనం
దనుఁ డగురామునిం బడసి । ధన్యుఁడ వైతి సమస్తభంగులన్. 691

చ. క్రతుపరిరక్షణంబునకుఁ । గైకొని పంచిన వచ్చి నామఖం
బతిభుజశక్తిఁ గాచి రయ । మారఁగ నెమ్మది నిల్పినారు నీ
సుతులను వీరిఁ జూడు మనఁ । జొప్పడఁ బుత్రులు భక్తి మ్రొక్కినన్
హితమతి దీవనల్ పరఁగ । నిచ్చుచుఁ గౌఁగిటఁ జేర్చె నర్మిలిన్. 692

క. మఱునాఁడు దొరలుఁ దానును, మెఱయఁగ సభలోన నుండి । మిథిలేశుం డ
క్కఱ ననుజుఁ గలఁచి నెయ్యము, వఱల శతానందుఁ జూచి । వాంఛితబుద్ధిన్.

క. ఇమ్ముగ నాయనుజుం డని, శమ్మును ధర్మపరుఁ డగుకు । శధ్వజుఁడు ప్రమో
దమ్మున నిక్షుమతీతీ, రమ్మున సాంకాశ్య మనుపు । రంబున నుండున్. 694

క. ఆతం డీకల్యాణము, ప్రీతిం జూడఁ దగు నంచుఁ । బిలిపింప నతం
డేతెంచి శతానందుని, బాఁతిగ జనకవిభుఁ జూచి । భక్తిన్ మ్రొక్కెన్. 695

వ. అనుజుని నుచితాసనంబున నుండఁ బనిచి మంత్రులం గనుఁగొని. 696

ఉ. తోయజమిత్రవంశపతిఁ । దోకొని రం డన మంత్రు లేఁగి భూ
నాయక మావిదేహజన । నాథుఁడు పిల్వఁగఁ బంచె మీయుపా
ధ్యాయులు మీరుఁ బుత్రులుఁ బ్ర । ధానులు రం డన సంతసంబుతో
నాయనసీశ్వరుండు జన । కాధిపుకొల్వున కేఁగి సమ్మతిన్. 697

క. మాకులగురుఁడు వసిష్ఠుఁడు, గైకొని కావింప నెల్ల । కార్యంబులకున్
మాకుం గలవాఁ డనవుడుఁ, గాకుత్స్థునిమాట కలరెఁ । గౌశికుఁ డెలమిన్. 698

వ. అప్పుడు జనకుం జూచి దశరథునన్వయక్రమంబు వసిష్ఠుం డిట్లని చెప్పె నవ్యక్తప్రభవుం డగునాదిబ్రహ్మకు మరీచి మరీచికిం గశ్యపుండును గశ్యపునకు వివస్వంతుండును వివస్వంతునకు వైవస్వతుండును వైవస్వతున కిక్ష్వాకుండు నిక్ష్వాకునకుఁ గుక్షియుఁ గుక్షికి వికుక్షియు వికుక్షికి ననరణ్యుండు ననరణ్యునకు బృథుండును బృథునకుఁ ద్రిశంకుండును ద్రిశంకునకు దుందుమారుండును దుందుమారునకు యువనాశ్వుండును యువనాశ్వునకు మాంధాతయు మాంధాతకు సుసంధియు సుసంధికి ధ్రువసంధియు ధ్రువసంధికిఁ బ్రసేనజిత్తును బ్రసేనజిత్తునకు భరతుండును భరతున కసితుండు నుదయించి రాజ్యంబుసేయ నారాజుపై హైహయులును దాళజంఘులును శశిబిందులు నేతెంచి యుద్ధంబుసేసి

యాక్రమింపం బత్నీసహితుం డై హిమవంతంబునకుం జని మృతుం డయ్యె నా
యసితునిపత్నులు గర్భిణు లై యుండ నందొక్కత సవతిగర్భంబు చెఱుప గరళం
బిడిన గరళయుక్త యగునాకాంత కాళింది చ్యవనునిఁ గాంచి పుత్త్రార్థిని యై
సద్భక్తి మ్రొక్కిన భార్గవకులజుం డగుచ్యవనుండు గాళిందిగర్భంబున నతిశూ
రుండు నధికధార్మికుండును సమస్తగుణసంపన్నుండు నగుకుమారుండు గరము
తోడం గూడఁ బుట్టెడు నని యాశీర్వదించిన నవ్వనిత యమ్మునికి నమస్కరించి
తనగృహంబునకు వచ్చి యతిసుకుమారుం డైనకుమారునిం గనియె నాకుమా
రుండు గరసహితుండై యుదయించెఁ గాన సగరుం డను పేరం బరఁగె నాసగరున
కసమంజుండు పుట్టె నతనికి నంశుమంతుండు నాయంశుమంతునకు దిలీపుండును
దిలీపునకు భగీరథుండును భగీరథునకుఁ గకుత్థ్సుండు నతనికి రఘువు రఘువునకుఁ
గల్మాషపాదుండును గల్మాషపాదునకు శంఖణుండును శంఖణునకు సుదర్శనుండును
సుదర్శనునకు నగ్నివర్ణుండు నగ్నివర్ణునకు శీఘ్రగుండును శీఘ్రగునకు మరుండును
మరునకుఁ బ్రశుశ్రుకుండును బ్రశుశ్రుకునకు నంబరీషుండును నంబరీషునకు నహు
షుండును నహుషునకు యయాతియు యయాతికి నాభాగుండును నాభాగునకు
నజుండు నజునకు దశరథుండును దశరథునకు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు ను
దయించిరి రామచంద్రునకు నీకూఁతు సీత నీఁగంటివి నీకులం బతిపావనం బయ్యెఁ
గృతకృత్యుండ వైతి వని వసిష్ఠుండు రఘువంశక్రమం బంతయుం జెప్పిన.

క. అంత శతానందుఁడు సభ, కెంతయు సమయజ్ఞుఁ డగుచు నిట్లనియెను ధీ
మంతుం డగుజనకక్షితి,కాంతునివంశక్రమంబుఁ గడుఁ దెల్లముగన్. 700

వ. అతిపుణ్యచరితుండును నీతివిశారదుండు నఖిలగుణాభిరాముండు నగునిమిచక్ర
వర్తికి మిథి జనియించె నమ్మిథికి జనకుం డారాజన్యున కుదావసుం డానరేంద్రునకు
నందివర్ధనుం డానృపాలునకు సుకేతుం డాభూపతికి దేవరాతుం డాధరణీశునకు
బృహద్రథుం డాధాత్రీనాథునకు మహావీరుం డావసుధేశునకు సుధృతి సుధృతికి
ధృష్టకేతుం డాపృథివీశునకు హర్యశ్వుం డామండలేశ్వరునకు మరుం డాసార్వ
భౌమునకు బ్రతింధకుం డామూర్ధాభిషిక్తునకుఁ గీర్తిరథుం డాజననాయకునకు
దేవమీఢుం డాజగతీశ్వరునకు సువీరుం డానృపతికి మహీధ్రకుం డామహీక్షితు
నకుఁ గీర్తిరాతుం డారాజేంద్రునకు మహారోముం డామానవవిభునకు స్వర్ణరో
ముం డాపురుషసింహునికి హ్రస్వరోముండు నతనికి జనకుండును గుశధ్వజుండును
జన్మించిరి పిదప హ్రస్వరోముండు జనకుం బట్టంబు గట్టి తపోవృత్తిని వనంబున
కరిగె. 701

మ. జనకక్ష్మావిభుఁ డెంతయున్ మహిమ రాజ్యం బొప్పఁ గావింపఁగా
ఘనగర్వం బొదవన్ సుధన్వుఁ డనుసాంకాశ్యప్రభుం డెత్తి యే
పునఁ బై వచ్చి మహేశుచాపముఁ దగన్ భూపుత్త్రి నొప్పింపు నీ

వని దూతల్ మిథిలేశునొద్దకు రయం బారంగఁ బుత్తెంచినన్. 702

క. దూతం బ్రోపించి భుజా, స్ఫీతబలం బమర వెడలి పేర్చి సుధన్వున్
వే తాఁకి తునిమి జనకుం, డాతనిసాంకాశ్యపురమునం దనుజునకున్. 703

వ. కుశధ్వజునకుఁ బట్టంబు గట్టె నని జనకునియన్వయక్రమంబు వినిపించి శతానందుం డాతనికులశీలపరాక్రమంబులు గొనియాడి సీతగుణంబులు వొగడి నీపుత్త్రునకు సకలగుణాభిరాముం డైనరామునకుఁ జారుగుణశీలసమేత యగుసీతం బెండ్లి సేసి జగన్నుతకీర్తిఁ బొందు మని పలుక శతానందునిపలుకులకు దశస్యందనుం డమందానందంబు నొంది వసిష్ఠవిశ్వామిత్త్రులం గనుంగొని యి ట్లనియె. 704

—శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నుల వివాహమహోత్సవము.—

క. లక్ష్మణకుమారునకు జన, కక్ష్మాధీశునిసుతం దగంగ నూర్మిళ యన్
పక్ష్మలనేత్రను నడుగుఁ డ, సూక్ష్మప్రియమునఁ గుశధ్వజునినందనలన్. 705

క. అలఘు లగుభరతశత్రు, ఘ్నుల కడుగుఁ డనంగ నడుగఁ గోరికిఁ దనకూఁ
తుల జనకుం డిచ్చితి నని, పలికిన నద్దశరథుండు ప్రమదం బొందెన్. 706

వ. మఱునాఁ డఖిలజనంబులుఁ బ్రమదం బంద లగ్ననిశ్చయంబు సేయించి. 707

మ. జనకుం డప్డు వసిష్ఠకౌశికుల వాంఛం జూచి మీ రెంతయున్
ఘనపుణ్యాత్ము లయోధ్యకున్ మిథిలకుం గర్తల్ వివాహంబు లే
పునఁ జేయింపుఁడు యుక్తభంగుల నటం బొల్పొంద వా రేఁగి నే
ర్పునఁ జేయింప నృపాలుఁ డాభ్యుదయికంబుల్ సేసి ప్రీతాత్ముఁ డై. 708

సీ. అనురక్తి దశరథుం డభ్యుదయార్థమై, నలువురుసుతులకు నాలుగేసి
లక్షలుగాఁ బదార్లక్షలసంఖ్యల, గోవులఁ గలధౌతఖురము లలరఁ
గనకశృంగమ్ములఁ గనకపట్టంబులఁ, దామ్రపృష్ఠంబులఁ దనర నేర్చి
గంధమాల్యాంబరకలితలఁగాఁ జేసి, వత్సలతోఁ గూడ వరుసఁ గూర్చి
కాంస్యలోహాలములతోడఁ గరుణభూసు, రోత్తముల కిచ్చి శోభనాయత్తమతిని
మఱియుఁ బెక్కుసువర్ణముల్ మహిమతోడ, వేఁడువారలకందంద వేడ్క నొసఁగి.

వ. తనయులుం దానును వివిధమణిగణభూషణభూషితులును మాల్యాంబరశోభితులును సలలితపరిమళకలితబహుగంధవిలేపనమూర్తులు నగుచుం దనకెలంకుల బంధుమిత్త్రామాత్యవర్గంబులు గై సేసి మాతంగతురంగంబులం గొని వీరభటులును మునిగణంబులు నేతేరఁ బసిండిపళ్లెరంబుల మణిమయవిభూషణంబులు నవ్యదుకూలాంబరంబులు మనోహరపుష్పఫలంబులు ననేకసౌభాగ్యద్రవ్యంబులు నిల్పి క్రంతలు గొని పుణ్యాంగనలు సనుదేర సూతవందిమాగధబృందంబులు బహువారంబులు కైవారంబులు సేయఁ బంచమహాశబ్దంబులు మ్రోయ నెలమిని గాయకులు పాడ వారవిలాసిను లాడ నగరద్వారంబు చేర వచ్చి రంత.

చ. నలి నెదురేఁగుదెంచి యెలనాఁగలు దాఁచినకక్షదీధితుల్

వెలువడఁ బయ్యెదల్ వెడల § వీఁకఁ గుచంబులు నిక్క దీపికా
కలికలు నోష్ఠరాగములు § కాంతుల నీనఁగ లేఁతకౌనుదీఁ
గలు వడఁకాఁడ బాహులతి§కల్ నిగిడించి నివాళు లియ్యఁగన్. 711

క. చన నగరు సొచ్చి మణిమయ, కనకాసనకలితు లగుచుఁ § గడు విలసిల్లన్
జనకుఁడు సపురోహితుఁ డై, మునుకొని వరుస మధుపర్క§ములు సేసి తగన్.

క. ధాత్రిసుత రామునకు సౌ, మిత్రికి నూర్మిళఁ బ్రియంబు§మెయిఁ గై కేయీ
పుత్త్రునకును మాండవినిన్, శత్రుఘ్నునకు శ్రుతకీర్తి § సమ్మతి నిచ్చెన్. 713

వ. అప్పుడా రాఘవు లగ్నిసన్నిధి నిగమోక్తక్రమంబున నాకన్నియలం బాణిగ్ర
హణంబులు సేసి యగ్నిదేవునకు మునులకు దశరథజనకులకు నమస్కరించి బహు
విధభూసురాశీర్వాదంబుల నుల్లసిల్లి రాసమయంబున. 714

క. ధరఁ బుష్పవృష్టి గురిసెను, సురదుందుభు లోలి మ్రోసె § సురకామిను లా
డిరి గంధర్వులు పాడిరి, పరఁగఁగ మోదించి రపుడు § పరమమునీంద్రుల్. 715

క. అన్నిదినంబులశుభములు, కన్నులు దనియంగఁ జూచి § కౌశికుఁడు సుధీ
సన్నుతు దశరథు జనకుని, నున్నతి దీవించి చనియె § నుత్తరగిరికిన్. 716

చ. జనకుఁడు గూఁతులం బిలిచి § సమ్మతి బుద్ధులు సెప్పి వారికిం
గనకవిభూషణాంబరసు§గంధమణిద్రవిణాదిసంపదల్
దనియఁగ నిచ్చి యల్లుర ము§దం బెనయం దగఁ గట్ట నిచ్చి య
య్యినకులనాథుతో ననిచె § నెంతయు నాప్తులు సంతసింపఁగన్. 717

క. తనతనయులుఁ గోడండ్రును, జనుదేరఁగ బంధుమిత్త్ర§సచివులతోడన్
ఘనసేనతోడ దశరథ, జననాథుఁ డయోధ్య కెలమిఁ § జను నెడఁ ద్రోవన్. 718

క. ఖగములభయదస్వరములు, మృగతతులప్రదక్షిణములు § మేదురగతులన్
జగతి వినఁ గానఁబడియెను, జెగడొందెడు నాకు నెడఁద § పెనుపుగ ననుచున్.

వ. దశరథుండు వసిష్ఠున కెఱింగించిన నమ్మునివరుం డెఱింగి పక్షులఘోరస్వనంబుల
వలన నొకమహాభయం బొదవు మృగంబులశుభప్రదక్షిణంబులవలన నాభయం
బడంగు శీఘ్రంబ యన నంతలోనం బ్రతికూలవాయువులు వీచె నభంబునం
బెంధూళి గప్పె భానుమండలప్రభ దూలె సేనలు చీకాకుపడియె నఖిలదిక్కులం
దిమిరంబు గప్పె సకలజనులు నిశ్చేష్టితు లగుచుండి రంత. 720

మ. ప్రళయాదిత్యునికై వడిం ద్రిపురభి§త్ఫాలాక్షుచందంబునన్
విలయజ్వాలవిశాలకీలికరణిన్ § వృత్రఘ్ననిర్ఘాతసం
కులదంభోళిధరాకృతిన్ లయకృత§క్రూరాంతకప్రక్రియ
న్బలిబంధక్రమకృత్త్రివిక్రమగతి § న్రౌద్రం బుదగ్రంబుగన్. 721

మ. అరుదేరం బొడగాంచి రాతతపిశం§గాంచజ్జటాసోమునిన్
ధరణీదేవకులాబ్ధిసోముని సమ§ద్యద్విక్రమోద్దామునిం

గరచాపాశుగభీమునిన్ మదయుతక్షత్త్రాద్రిసుత్రామునిన్
హారణోదారకుఠారవారితవిపక్షారాముని న్రామునిన్. 722

చ. అటు పొడగాంచి యందఱు భయాపహమంత్రము లుచ్చరించుచుం
బటుగతి నర్ఘ్యపాద్యములు భక్తిమెయిం గొనిపోవ వాని నా
దట వరియింప కమ్మునుల దాఁటి మహోగ్రత రాజరాముముం
దట భృగురాముఁ డెంతయును దర్ప మెలర్పఁగ వచ్చి నిల్చినన్. 723

—శ్రీరాముని బరశురాముఁ డడ్డగించుట.—

క. ఆరాముని కతిభక్తిన్, రారాముఁడు మ్రొక్కి యతనిరాజసతేజో
గౌరవముల కరు దందఁగ, నారాముని కనియె నాద్యుఁ డగురాముఁ డటన్.

క. ఫాలాక్షునిచాపము బాహాలఘుసత్త్వమున విఱిచి తని జను లెన్నం
బోల మహేంద్రాద్రిని విని, వాలిననీలాంవు చూడ వచ్చితి నిటకున్. 725

శా. స్ఫీతాక్షీణబలంబు పెంపెసఁగ నాచే నున్నయీచాపముం
జాతుర్యంబున నెక్కు వెట్టి విపులజ్యావల్లి కర్ణాంచలా
స్వీతాకృష్టిఁ దనర్పఁ జేసి శరమున్ నేర్పార సంధించినన్
నీతో ద్వంద్వరణంబు సేసెదఁ గడు న్స్వీగక్రియానైపుణిన్. 726

వ. అనవుడు దశరథుం డతిభీతచేతస్కుండును విషణ్ణవదనుండు నగుచుఁ గరంబులు
మోడ్చి వినయంబున జామదగ్న్యునితో ని ట్లనియె. 727

సీ. మఖవేళఁ గశ్యపముఖమహీసురులకు, ధర యెల్ల నిచ్చిన ధర్మనిధివి
స్వాధ్యాయపరుఁడవు జమదగ్నిసుతుఁడవు, బ్రహ్మవర్చసమూర్తి భాసురుఁడవు
నత్యంతనియతితో నడవిఁ దాపసవృత్తి, విజితేంద్రియుండవై వెలయుసుకృతి
విఁద్రుని ప్రార్థన నెసఁగి క్షత్త్రియహింస, సనఁ జేయ కుండినశాంతమతివి [ల
బాలుఁడీరాముమీఁదఁగోపంబుదగునె, యీకుమారుండుప్రాణమిక్ష్వాకుకులుల
కెల్లఁగావునరక్షింపుమీతనూజు, భద్రకారుణ్యగుణధామ పరశురామ. 728

వ. అనుదశరథుపలుకు లాదరింపక పరశురాముండు రామునిం జూచి. 729

ఉ. రా జఁట యంతమీఁద మఱి రాముఁడు దా నఁట భీకరాజులన్
రాజులఁ ద్రుంచి తత్ప్రిస్రుతరక్తములం బితృతర్పణక్రియల్
రాజిలఁ జేసి యున్నభృగురాముఁడు తుచ్ఛమదాంధు లైనయీ
రాజుల గీజులన్ వెడఁగురాముల గీములఁ జూచి సైఁచునే. 730

చ. అదియును గాక నాకు గురుఁ డైనమహేశ్వరుదివ్యచాపము
న్మదమునఁ బట్టి వే విఱిచినాఁడ వొకింత సహింపు మీవు నా
యెదురను నిల్చి భక్తు లిటు లెన్ని యొనర్చిన నేను నింతతోఁ
దుది సన నిన్ను నుక్కడఁగఁ ద్రుంపక చంపక పోవ నీ ననన్. 731

వ. రామచంద్రుం డి ట్లనియె. 732

క. మునిసుతుఁడవు బ్రాహ్మణుఁడవు, ననఘతపోనిధివి వృద్ధుఁ డగువాఁడవుఁ గా
వున మ్రొక్కితిఁ గాని రణం,బునకుఁ గ మది వెఱచి కాదు మ్రొక్కుట యార్యా.
క. అది నీచేతికుఠారం, బిది నామెడ జామదగ్న్య మెయ్యది యుచితం
బది సేయుము గోబ్రాహ్మణు,లెదురను శౌర్యంబు చూప రిల రాఘవులున్.
క. అనవుడు నన్నుఁ బ్రాహ్మణుఁ, డని పలికితి నీకుఁ క్షత్రియత్వము పోలం
గనుఁగొని నాబ్రాహ్మణ్యము, ననిఁ జూపఁగ నీవ చూచె దపుడనిమఱియున్.
మ. ధర నే నిర్వదియొక్కమాఱు లొగి సమస్తక్షత్రజాతంబులం
బరశుస్ఫారకఠోరధారఁ గొని ప్రైప్రైఁ ద్రుంచి యత్యున్నత
స్ఫురణం బారఁగఁ దత్కళేబరములం సోపానముల్ సేసి ని
ర్జరలోకంబున కోలి మామకపితృవ్రాతంబులం బుచ్చితిన్. 736
క. కడఁక విలువిద్య శివుతో, నెడపక కావించునప్పు డీసున నాతోఁ
దొడరి కుమారుం డోడిన, మృడుఁడు మదీయబల మిచ్చ మెచ్చఁడె పరఁగన్.
చ. వెరవున విశ్వకర్మ తగ విందులు రెండు సృజించె నందులో
హరునకు నొక్కవిల్లు త్రిపురాసురులం గెలువంగఁ బోవుచోఁ
బరఁగఁగ నిచ్చి యున్నవిలు పంకజనాభున కిచ్చె నొక్కనాఁ
డిరువురలావులుం దెలియ నిచ్చల వేల్పులు బ్రహ్మపాలికిన్. 738
చ. అరిగిన వారికోర్కి చతురాస్యుఁ డెఱింగి కడుం విరోధముల్
హరునకు విష్ణుదేవునకు నాత్మలఁ బుట్టఁగఁ జేయ నల్గి వా
రిరువురు చాపముల్ గొని యనేకవిధంబులఁ బోరఁ జూచి యా
హరిబల మెక్కుడంచు సుర లాతని మానిచి కూర్చి పోయినన్. 739
క. ప్రియ మెడలి శివుఁడు దనవిలు, రయమునఁ గొను మనుచు దేవరాతున కిచ్చెం
బయిపై నాచాపం బన్వయపరిపాటి మెయి జనకునకుఁ దగ వచ్చెన్. 740
క. హరుఁ డురుబలమున బహుసం, గరముల లావెల్లఁ గొని తగఁ విడిచినయా
చిరకాలజీర్ణచాపము, వెర వారఁగఁ బట్టి నీవు విఱుచుట యరుదే. 741
క. రుచిరప్రీతిని విష్ణుం, డచలప్రతిమానసార మగునీధనువుం
రుచికునకు నిచ్చెఁ బదపడి, రుచికుఁడు జమదగ్ని కిచ్చె రూఢప్రీతిన్. 742
క. జమదగ్ని నాకు నిచ్చెం, గ్రమమున నిది విష్ణుదేవు కార్ముక మీచా
పము నెక్కువెట్టి పటువే, గముతోఁ దెగఁగొనక పోవఁ గానీ ననుడున్. 743
చ. ప్రళయతరోగ్రకోపమున రాముఁడు భార్గవరాముచాపముం
బలువిడిఁ బట్టి రాఁ దిగిచి బాహుబలోద్ధతి నెక్కువెట్టి య
త్యలఘుశరం బమర్చి తెగ నాశ్రవణాంతము సేసి నీపదం
బులు తెగ సేసి పుచ్చెద నమోఘము నావిశిఖంబు నావుడున్. 744
వ. అప్పుడు బలదర్పంబు లడంగి యున్నపరశురాముని నవక్రవిక్రమాభిరాముం డగు

శ్రీరాముని నవలోకింపం బితామహపురస్సరంబుగా సురలు గరుడోరగగంధర్వ
యక్షరాక్షసప్రభృతులును జనుదెంచి చూడఁ బరశురాముండు శ్రీరామునిం
గనుంగొని. 745

క. నావి ల్లెక్కిడినప్పుడ, నీవు చతుర్భుజుఁడ వౌట నిక్కము మదిలో
భావించి కంటి నితరుల, కీవిక్రమబాహుశక్తు లెందును గలవే. 746

ఉ. కావున నీవు రాఘవ జగత్త్రయకర్తవు సర్వదేవతా
దేవుఁడ వై నవిష్ణుఁడవు తెల్లము నాకిటు లౌట నింద గా
దీవిజయంబు నావిజయ మేనును నీవును వైష్ణవాంశసం
భావితభద్రమూర్తులము పంకజనాభునిలీల లిన్నియున్. 747

క. సకలధరిత్రిం గశ్యపు, నకు నే మును దాన మిచ్చి నాఁడ నిలన్ ని
ల్వకు మనియె నతఁడు గావునఁ, బ్రకటంబుగ నిల్వరాదు రాత్రులఁ బుడమిన్.

వ. నాకు మహేంద్రాద్రికి ననుదినంబు నరుగవలయుం గావున నాచరణంబు లేయక
నాపుణ్యలోకమార్గంబు లేయు మనుడు నా శ్రీరాముం డట్ల చేయం బ్రియంబునఁ
బరశురాముండు రఘురామునకుం బ్రదక్షిణం బాచరించి మహేంద్రాద్రికి నరిగె
నాసమయంబున సుఖవాయువులు వీచె దిశలు ప్రసన్నంబు లయ్యె సేన కుత్సా
హం బొదవె దేవత లభినుతులు సేసిరి రాముండు దనచేత నున్నజామదగ్న్య
చాపంబు వరుణున కిచ్చి మహోత్సాహంబునం జనుదెంచి వసిష్ఠదశరథులకు
మ్రొక్కి పరశురాముండు వోయె నని తండ్రిభయంబు వాపి యింక సేనాసమే
తుండ వై విచ్చేయు మనవుడుఁ దెలివొంది దశరథుం డక్కుమారు నక్కునం
జేర్చి మూర్ధఘ్రాణంబు సేసి యత్యంతసంతోషంబున నఖిలజనసమేతుం డయి
యయోధ్యాపురంబుఁ జేర నరిగి. 749



—దశరథుం డయోధ్యకు వచ్చుట.—

చ. సురుచిరతోరణంబులఁ బ్రసూనవిరాజితమందిరాంగణో
త్కరముల నున్నతధ్వజనికాయని కేతనకేతనంబులన్
వరమణిచిత్రచిత్రితనివాసవిభాసితసౌధవీథులం
బరఁగుచు నున్నపట్టణము ప్రాభవ మొప్పఁగఁ జొచ్చి ముందటన్. 750

క. డంబుగఁ బంచమహాశ,బ్దంబులు మ్రోయంగ నర్తకీతతు లొగిఁ గైవా
రంబులు సేయ సుధాక,ల్పంబులు గానికలుఁ గొనుచుఁ బ్రభువులు డాయన్.

క. లాజలు లలితాక్షతములు, రాజితనూత్నప్రసూనరత్నములు పురం
ధ్రీజనములు సల్లఁగ నీ,రాజనములు సేయఁ బంక్తిరథుఁ డతిమహిమన్. 752

మ. నగరింపారఁగఁ జొచ్చె నప్పు డధికానందంబు లుప్పొంగఁగాఁ
దగఁ గౌసల్యయుఁ గైకయున్ మఱి సుమిత్రాదేవియున్ వచ్చి యి
మ్ముగఁ గోడండ్రఁ దనూజులున్ వరుసతో మ్రొక్కంగ దీవించుచున్

మొగి నాలింగనకేళిఁ దేలిరి మనో మోదంబు లింపారఁగన్. 753

క. కొడుకులుఁ గోడండ్రును దన, పడఁతులు ముద మంద సేన పతులును సచివుల్
దడములుఁ గొల్వఁగ ధర్మం, బడరఁగ దశరథుఁడు రాజ్య మలవడఁ జేసెన్.

క. నుతదివిజయక్షరాక్షస, శతమఖముఖదివిజమకుట సన్మణిగణరం
జితనఖకిరణపదాంబుజ, శ్రితభక్తక్లేశనాశ శివగిరిజేశా. 755

మా. సకలసురశరణ్యా సర్వదేవాగ్రగణ్యా
ముకుటనిహితగంగా ముక్తితాత్పర్యచంగా
శకలితవినతాఘా సాధుసస్యౌఘమేఘా
ప్రకటితనమదింద్రా భక్తవారాశిచంద్రా. 756

గద్యము. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జున
భట్టప్రణీతం బైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు బాలకాండంబు సర్వం
బును నేకాశ్వాసము. 757



శ్రీ ర స్తు.

# భా స్క ర రా మా య ణ ము.



## అ యో ధ్యా కాం డ ము.



రమణీరమణసుధా
ధారాళదయాకటాక్షధామస్మితదృ
క్సైకరవవితరణకరణవి
శారద బుద్ధయకుమార సాహిణిమారా. 1

వ. అవధరింపుము. 2

*క. ఉల్లమున మనోరథములు, మల్లడిగొన నవ్విభుండు మధురస్ఫుటవా
గ్వల్లిక సఫలతకై సభ, కెల్లం జిత్త మిగురొత్త నిట్లని పలికెన్. 3

—దశరథుండు శ్రీరామునకుఁ బట్టాభిషేకం బొనర్ప నిశ్చయించుట.—

క. మిక్కిలి భోగము లందితి, నెక్కుడు సంపదలు గంటి నెల్లగుణములం
జక్కనికొడుకులఁ బడసితి, నిక్కంబినిఁ బెద్దగాల మేలితి నింకన్. 4

క. రాజ్యభరం బఖిలగుణ, ప్రాజ్యుం డగురామునంద ప్రాపించెద సా
మ్రాజ్యపదంబున కెంతయుఁ, బూజ్యుం డతిచతురుఁ డతఁడు పుత్రులలోనన్.

శా. ధీరోదారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్యవి
స్తారుం డుత్తమశీలుఁ డర్కకులవిస్తారుండు శూరుండు గం
భీరుం డిద్ధవిచారసారుఁ డగుటం బెంపార విశ్వంభరా
భారం బెల్ల భరింప రాఘవు మహాభాగుని నియోగించెదన్. 6

వ. అని పలికి వసిష్ఠవామదేవాదిపురోహితులును సుమంత్రాదిమంత్రులును సమస్త
బంధురాజలోకంబును ననుమతి సేయ రామచంద్రుం బిలువం బనిచి యుచి
తాసనంబున నుండ నియోగించి కొండొకసేపునకు నక్కుమారు నవలోకించి. 7

ఉ. ఏను సమస్తదానములు నెల్లవ్రతంబులు సర్వధర్మముల్

*ఇచట భరతశత్రుఘ్నులు యుధాజిత్పురంబునకుఁ బోయి రనువృత్తాంత మీరామాయణమున లేదు. ఇది గ్రంథపాతముగ నుండును. కాదే నీవిషయము బాలకాండముతోనను గొందఱు నయోధ్యాకాండము మొదటఁ గొందఱును జెప్పుటఁబట్టి యీగ్రంథప్రణేతలు భిన్నులగుటచేఁ బరస్పరప్రత్యయమువలనఁ జెప్పరయి రనియుఁ దోఁచుచున్నది.

మానుగఁ జేసి జన్నములు శ్రమానక చేసి వివస్వదన్వయాం
భోనిధిపూర్ణచంద్రుఁ డగుపుత్త్రనిధానము నిన్నుఁ గంటిఁ బెం
పూనఁగ నింక నిన్ను మహిశ్రీసమున్నతిఁ బట్టము గట్ట ధన్యతన్. 8

మ. విను మెల్లుండి దినంబు లెస్స నిఖిలోర్వీచక్రరక్షాభరం
బున కీ వెల్లి ధరాసుతాసహితుఁడవై పుణ్యోపవాసంబు గై
కొని నేమంబున నుండు మొమ్మనుచు వీడ్కొల్పెన్ గుణాలంకరి
ష్ణుని భూయిష్ఠవరిష్ఠనిష్ఠురరణానుష్ఠాననిష్ఠాపరున్. 9

వ. అంత నక్కుమారుండునుం దననగరి కరిగి యథోచితాచారంబుల నియతుండై యుండె నప్పు డప్పురంబునం జతురశిల్పంబులు నెరయం గనకసాలభంజికలం దగినయెడలం దీర్చి వింతరచనలు గూర్చి వివిధమణిరాజితానేకమకరతోరణాలంకృతం బగుచుం దేజరిల్లురాజమార్గంబులును నారాజమార్గంబుల రఘురాజన్యవిజయశ్రీలాంఛనంబులు లిఖయించినరమ్యహర్మ్యతలంబుల నమర్చినం గల్యాణసమయం బగుచు వచ్చె నీరాజు నీరాజనకరణంబులకు రం డనుచు నమరకాంతలఁ బిలుచునోజం గ్రాలు నూతనకేతనంబులును గమనీయహేమదండంబుల రామణీయకంబులం దొంగలిగొనుకాంచనకల్హారంబును నెలకొల్పఁ గలయ నెత్తిన నభోభాగంబునం బెడం గడరుకలువడంబులును గెలంకులం దరుణరంభాస్తంభంబులు నెలకొల్పి విలసదశ్వత్థచూతపత్త్రదామంబుల నభిరామంబులుగాఁ గట్టి పై రుచిరముకురశ్రేణులఁ గీలించినం జెన్నొందు మందిరద్వారంబులును జందనకస్తూరికాకుంకుమజలంబులం గలయంపు లిచ్చి ముక్తాఫలంబుల రంగవల్లికలు దీర్చి కుసుమవిసరంబులు నెరపినం బొలుపెసంగు నకలంకరత్నాంకితాంగణంబులును నానావిధవిచిత్రవిలాసంబు లొనరించి మనోహరప్రాకారంబులం బాటించినం జెలువొలయుభవనవాటికలును నభినవాభరణంబులఁ గైసేసి గంభీరసౌభాగ్యరేఖ లొదవినముదంబునం బొదలుచుఁ బసిండిపళ్లెరంబుల శుక్తిజాక్షతంబులును మాణిక్యదీపకళికలు లోనుగాఁ బరమమంగళోపకరణంబులు చేకొని యున్న పుణ్యాంగనాజనంబులును బ్రసాధికలునై పుణ్యాంబులం గావించు శృంగారభంగులు గలవిభ్రమంబులంకుం గనుఁబాటు దోఁపకుండఁ జేయుతెఱంగునం బొలుచు నవ్విశేషలావణ్యకలాకలాపంబుల జగన్మోహనంబు లగుచుం బొలయు విలాసినీగణంబులును సమస్తభూషణభూషితంబు లగుకరితురగాదులును జెలంగు పంచమహాశబ్దంబులునుం గలిగి యునికిఁ గైకేయీపరిచారిక యగుమంథర యనునది యొక్కసౌధం బెక్కి చూచి యిది రామచంద్రునిపట్టాభిషేకమహోత్సవంబు గాఁబోలు దీనికి విఘ్నంబు గావింపవలయు నని విచారించి తొల్లి కౌసల్యాతనయుచేతం దనకు నైనచరణతాడనభంగంబు వైరకారణంబుగాఁ గొని యక్కేకయరాజపుత్త్రిపాలికిం జని యిట్లనియె. 10

—మంథర కైకకు దుర్బోధనలు చేయుట.—

శా. కైకా నీకు విభుండు గూర్చు ననుచుం ఽ గర్వింతు మున్నెప్పుడుం
శోకైకప్రకటంబుగా నిదిగొ దా ఽ లోలాక్షి. కౌసల్యక
స్తోకప్రేమభరంబు చూపుటకు రాజ్యం జేయుచున్నాఁడు నేఁ
డాకాంతాతిలకంబుపుత్త్రు భరతుం ఽ డట్లుండ నిట్లిమ్ములన్. 11

తే. సవతితల్లికొడుకు ఽ సకలభూభాగంబు, ననుభవించుచుండ ఽ నకట భరతుఁ
డధికదీనవృత్తి ఽ నాతనియడుగులు, గొలిచి యుండవలసెఁ ఽ బలుకు లేల. 12

శా. పాటించుం బతి నిన్ను నీ వడిగినం ఽ బ్రాణంబు వంచింపఁ డీ
వీటం బట్టముగట్ట నీతనయునిన్ ఽ వే రాము నుగ్రాటవీ
వాటిం బోయి చతుర్దశాబ్దము లొగిన్ ఽ వర్తింప నీరెండు మో
మోటం గొంకక వేఁడు మన్న మదిలో ఽ నూహించి యక్కైకయున్. 13

ఉ. బంధులు మంత్రులుం భరతుఁ ఽ బట్టగు రాముఁడు పెద్దవాఁడు స
ద్బంధురదోర్బలుండు గుణ ఽ భాసియు నాసుతుఁ డుండ నాసుతున్
సింధుపరీతధాత్త్రి కభి ఽ షిక్తునిఁ జేయునె భూవిభుండు సం
బంధము గాదు చిక్కితి నుపాయ మెఱింగినఁ జెప్పు మంథరా. 14

వ. అనిన నది యిట్లనుం దొల్లి జయంతపురంబునం బురందరశంబరులకుం గయ్యంబయిన నయ్యింద్రునకుం దోడరిగి దశరథుండు భండనంబు సేయునవసరంబున నారాక్షసుం డనేకమాయలు గావింప నీవు ధవళాంగుం డనుమునివలనం బడసినమంత్రవిద్యచేత వానికిం బ్రతీకారంబు లొనర్చుటకు మెచ్చి నాఁడు నీకు రెండు వరంబు లిచ్చినవాఁడు నేఁ డవి దలంపించి నాచెప్పినయిరుదెఱంగులు వేఁడికొను మవ్విభుండు నీయందు నెయ్యుండును సత్యసంధుండును నగుట నీయడిగినయట్ల యొసంగు ననుచుం బాపోపదేశంబు చేసినం గైకేయి సంతోషించి దానికిం బసదనంబు లొసంగి యొక్కగొంది సొచ్చి ముసుంగు వెట్టుకొని నేలం బరుండి యీలిగిన ట్లుండె నాసమయంబున. 15

సీ. జననాథుఁ డచటికిఁ ఽ జనుదెంచి యట్లున్న, కైకేయిఁ బొడగని ఽ కడుఁ గలంగి
చిత్తంబు మదనార్తిఁ ఽ జిడిముడిపడి యుండ, నేమికారణమున ఽ నిట్టు లునికి
యెవ్వారు నీదెస ఽ నెగ్గు చేసిరి నీకు, నహితవాక్యము లెవ్వ ఽ రాడి రిచట
నడిగినఁ బ్రాణంబు ఽ లాదిగా నెవ్వియే, వంచింప కిత్తును ఽ వనజవదన
ముసుఁగు పుచ్చవేల ఽ మొగమేల యలరింప, వకట నెపము లేక ఽ యలుగ నేల
పలుక నేల మృదుల ఽ పర్యంక మటులుండ, నొడలు నొవ్వ నేల ఽ నుండ నేల. 16

క. నావుడుఁ బతిమదనాతుర, భావం బవ్వనిత చూచి ఽ పార్థివవర నాఁ
డీ విచ్చినవరములు నేఁ, డీవలయును రెండు ననుడు ఽ నిచ్చితి ననుచున్. 17

—కైక రాముని వనంబునకుం బంప దశరథు నడుగుట.—

క. పలికిన భరతునిఁ బట్టము, నిలుకుం గట్టుటయు రాము । నీ రేడబ్దం
బులు కానకుఁ బొ మ్మనుటయు, నిలువేల్పులు సాక్షి గాఁగ । ని ట్లీరెండున్. 18

ఉ. వేఁడిన వేఁడిమాట నృప । వీరుఁడు సైఁపక కర్ణరంధ్రముల్
సూఁడినభంగిఁ దాఁకుటయు । స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే
నాఁడు నృపాలపుత్త్రి వని । నమ్మి వరించితిఁ గాక యిమ్మెయిన్
నేఁ డొకకాలసర్ప మయి । నీ విటు సేయుట నాకుఁ దోఁచెనే. 19

ఉ. కీడున కోడ కించుకయుఁ । గేకయభూపతియింటఁ బుట్టి చొ
ప్పాడక పాపజాతి వయి । తక్కట యిట్లని వేఁడ నోళ్లు నో
రాడెఁ ద్రిలోకపూజ్యుఁ డగు । నాకొడు కేమిట నీకు నొప్పఁడే
పాడిదలంప కీపలుకు । పల్కితి దోసము నాక నాకడన్. 20

ఆ. భరతుకంటె నీకు । భక్తుండు తమ్ముల, ముగుర నొక్కభంగి । ముద్దుసేయుఁ
దల్లు లెల్ల నరియ । తగునె యాపుత్త్రుని, ధానమునకుఁ గీడు । దలఁప నకట. 21

క. విడుతుం బ్రాణము లయినను, విడుతున్ మహిరాజ్య మెల్ల । వేఁడిన రామున్
విడుతునె యాగుణరత్నము, విడువను దత్పాపచింత । విడువుము తన్వీ. 22

సీ. అనవుడు సక్కైక । జననాథుతో ననుఁ, నిక్ష్వాకువంశమ । హీశు లెల్లఁ
బలికి తప్పరు నీవు । కులధర్మ మొల్లక, కౌసల్యదిక్కునఁ । గరము వెఱచి
సడికోర్చి సత్యంబు । విడువఁగఁ దలఁచెదు, భూపాల యిదియొక్క । పురుషగుణమె
బొంకుదురే రాజు । లింక నీముందర, విష మాని ప్రాణముల్ । విడుచుదాన

తే. నంతభరతునిసమయించి । యనుఁగుఁదనయు, రామునిష్కంటకంబుగా । రాజ్యమునకు
నధిపుఁ గావించి నీవు నీ । యగ్రసతియు, విభవమున నుండుదురుగాక । వేయు నేల.

చ. తలఁ పొడఁగూడెఁ బొమ్ము వసు । ధావర నావుడు నొక్కమాటయుం
బలుకక మిన్ను వచ్చి పయిఁ । బడ్డ తెఱంగునఁ దూలి నెమ్మనం
బలఁగ మొగంబు వంచుకొని । యశ్రులు రాలఁగ శోకవహ్నికిం
గొలువగు చుండె భూరమణ । కుంజరుఁ డంతఁ గ్రమక్రమంబునన్. 24

చ. అళికుల మల్లనల్ల నవ । హల్లక మొల్లక కేసరోల్లస
ద్దళదరవిందమందిరవి । తానము చేర నగాధదీర్ఘికా
జలజనవీనగంధములు । చల్లుచుఁ జల్లనిగాడ్పు లిమ్ములం
బొలయ గృహప్రదీపముల । పోఁడిమి దూలఁ బ్రభాత మొప్పినన్. 25

సీ. వివిధమంగళతూర్య । రవము లొప్పఁగ వంది, సూతమాగధజన । స్తుతులు గలయఁ
జెలఁగఁ బుణ్యోదకం । బుల రామచంద్రుండు, జనకపుత్త్రియుఁ దాను । జలకమాడి
మహితాంబరంబుల । బహురత్నరాజిత, మండనంబుల రమ్య । మాల్యతతుల
సురభికస్తూరికా । గురుచందనాదుల, లలితాంగ రేఖావి । లాసకళలఁ

దగ నలంకరించి । జగదమందానంద,కారు లగుచు సహజ।గౌరవమున
సరసభంగు లమర । నిరువురు శచియు నిం,ద్రుండుఁబోలె నలరు । చుండి రెలమి.

వ. అపుడు వసిష్ఠుండు సకలమునిజనంబులతో నభిషేకమండపంబున కేతెంచి నానాదేశంబులరాజులను సమస్తమంత్రివరులను నరుంధతి మొదలయినపురంధ్రీజనంబులను రావించి సర్వధాన్యంబులు వివిధరత్నంబులు ననేకదివ్యాంబరంబులు నశేషభూషణంబులుం గల్యాణపల్లవంబులుం గ్వారాదిమంగళకుసుమంబులుం జందనకర్పూరకస్తూరీగోరోచనాదిసుగంధద్రవ్యంబులును గంగాయమునాదిమహానదీసముద్రోదకపూర్ణంబు లగుసువర్ణకుంభంబులును రాజయోగ్యంబు లగు కరితురగస్యందనంబులును ధవళచ్ఛత్రచామరంబులును దానార్థంబుగాఁ గన్యకాధేనువృషభంబు లొక్కొక్కలక్షయుం దెప్పించి మాణిక్యఖచితంబు లగునౌదుంబరభద్రపీఠంబులు మణిమండపమధ్యంబునం బెట్టించి సింహచర్మంబు పయి నమర్చి బహుగీతనృత్తవాద్యంబులుం బ్రశస్తహోమంబులుం బుణ్యాశాంతులుం జేయం బంచి శుభలగ్నంబు సాధించి సుమంత్రునిం బిలిచి నీవు దశరథుం దోడ్కొని రమ్మని నియోగించిన నతం డంతఃపురంబునకుం బోయి కైకేయీగృహద్వారంబున నిలిచి యి ట్లనియె. 27

తే. దేవ యుదయాద్రి కినుఁ డేఁగు।దెంచుచున్న
సమయ మభిషేకలగ్న మాఁ।సన్న మయ్యె
నర్హ మగుభంగి రాము రా।జ్యాభిషిక్తుఁ
జేయవలయును నటకు వేం।చేయవలయు. 28

క. అని విన్నపంబు సేయుట,యును నిద్దురపోయినట్టు । లూరక యుండెన్
మనుజపతి కైక యప్పుడు, జననాయకుపలుకు గాఁగ । సాహసబుద్ధిన్. 29

క. అభిషేకోత్సవలీలా, విభవం బలరారఁ గొడుకు । వేడుకతోడన్
విభుఁడు గయిసేయఁ గోరెడు, రభసంబున నీవు పోయి । రఘురత్నంబున్. 30

మ. ఇటకుం దోకొని రమ్ము నావుడు నతం । డేతెంచి విచ్చేయు మ
చ్చోటికిన్ నిన్ను విభుండు రమ్మనియె నం।చుం జెప్ప నాశీర్వచ
స్స్ఫుటనాదంబులతో సుమిత్రకొడుకున్ । భూపుత్రియుం దాను నొ
క్కొటఁ దేరెక్కి నృపాలఫాలముల మ్రొ।క్కుంగెలుదో యొప్పఁగన్. 31

క. పంచమహాశబ్దంబు లు,దంచితగతి మొరయ జయజ।యధ్వను లులియం
జంచన్నానాసేనా, సంచయములు బలిసి కొలువ । సమ్మదలీలన్. 32

ఉ. మంగళపుష్పసంఘములు । మాత్తపుసేసలు నింతనంతఁ బు
ణ్యాంగన లొలిఁ జల్ల నగ । రల్లన డాయఁగ నేఁగుదేరఁ ద
ద్వంగులు రత్నదీపకళి।కాళి నివాళు లొనర్పఁ జేసె ను
త్తుంగరథావరోహణము । తోరణపంక్తుల నొప్పుమోనలన్. 33

వ. ఇట్లు రథారూఢుం డై వచ్చి రాజమందిరద్వారంబున రథంబు డిగ్గి రామచంద్రుం డుచితప్రకారంబునఁ గేకయరాజనందనగృహంబునకుం జనుదెంచి బాష్పాకులలోచనుండును దీనాననుండు నయి యున్నతండ్రిం జూచి భీతుం డగుచు నతనికిం గైకేయికి నమస్కరించి యద్దేవి నుద్దేశించి. 34

క. జననీ రాజు వివర్ణాననుఁ డై యిట్లుండఁ గారణం బేమియొకో
జననాయకునాజ్ఞోల్లంఘన మే నవినీతబుద్ధిఁ గావింపఁ గదా. 35

చ. అనవుడుఁ గైక రామునిభక్తియుం బు గనుంగొని నీకు నప్రియం
బని పలుకండు దా మును రణావని నిచ్చినయావరద్వయం
బును దగ వేఁడితిన్ భరతుభూమికిఁ బట్టము గట్ట నొక్కటన్
నినుఁ బదునాలుగేఁడులు మునిస్థితిఁ గానకుఁ బుచ్చ నొక్కటన్. 36

క. జనకునిసత్యము నెరపెదు, తనయుఁడ వయితేని నీవు తాపసవృత్తిం
జను వనమున కన నగుఁ గా, కని మొగమునఁ దొంటికంటె ననువొప్పారన్.

వ. రామచంద్రుం డిట్లనియె. 38

చ. జననివి నీవు వేఁడుటటు సత్యము తండ్రికి నెక్కు నట్టె నా
యనుజుఁడు నేల యేలునటు యక్కడ సన్మునిపాదపద్మవం
దనమటు కృత్య మిట్లగుట ధన్యుఁడ నేఁ గడుఁ గాన నేను మీ
పనిచినయట్లనే భరతుఁ బట్టముగట్టు సవిత్రి ధాత్రికిన్. 39

—శ్రీరాముఁడు సీతను వనంబునకుఁ దోడ్కొని పోవ నియ్యకొనుట.—

ఉ. నావుడు సీత రాముఁడు వనంబున కేఁగుతలం పెఱింగి ల
జ్జావనతాననంబు విరహాతిశయంబున శీతధాముధా
మావలి గప్పనంబుజమునాకృతి వెల్లఁదనంబు వొంద లోఁ
జేవ గొనంగ లేక ధృతి చీలఁగ మానము దూలఁ దూలుచున్. 40

ఉ. గద్గదకంఠి యై పలుకుఁ గానకు నీవు ననంగ నేను శ
శ్వద్గుణధామ నీవెనుక వచ్చెద నిచ్చోట నుండ నొల్ల న
స్మద్గమనంబు మానుచు విచారము మాను మయోధ్య రాజయో
షిద్గణసన్నిధిం గరముఁ జేడ్పడి యొంటిఁ జరింప నేర్తునే. 41

క. నీవు వెలి యైనభోగము, లేవియు నే నొల్ల నిన్ను నెప్పుడుఁ గొలువం
గావలయు నాకు ననుపలు, కావిభుఁ డొకభంగి నోర్చి యాసతితోడన్. 42

ఉ. ఏనును నీవియోగము సహింతునె నా కిది సత్యశాసనం
బై నతెఱంగు మజ్జనకునాజ్ఞయు నక్కట నీకు నేటికిం
గాన లెఱుంగ వీవు బలుగాములుఁ బాములుఁ గ్రించుచెంచులున్
దానవమాయలుం గలపథంబులు దుర్గమభంగు లంగనా. 43

ఉ. నీకుఁ జరింప శక్య మగునే శరభోత్కటచండగండకా

నీకతరక్షురంకురురు§నిష్ఠుర ఫేరవదంతిదంతిభి
ద్భీకరఘోటకారిశల§భిత్కిటిమర్కటపుండరీకభ
ల్లూకవృకాదిఘోరమృగ§లోకములోపల లోలలోచనా. 44

వ. అదియునుం గాక వనవాసం బధికాయాసం బభ్యాగతుల కిడి మిగిలినకందమూల ఫలంబు లాహారంబుగాఁ గొనుచుఁ బర్ణశాలల వసియించుచుఁ గుశతల్పంబుల శయనించుచు విషమస్థలంబులఁ జరియించుచు శీతాతపవర్షంబుల కోర్చుచు నివ్విధంబున దినంబులు గడపవలయు నీ వత్యంతసుకుమారాంగివి దురంతక్లేశంబు లనుభవింపఁ జాల విచ్చట నాయమలకు బ్రియాచరణంబు లొనర్చుచుండుము నీవు రా వలవ దన నద్దేవి కోపించి యి ట్లనియె. 45

ఆ. నన్ను నీకు నిచ్చి § నరనాథు నాతండ్రి, సంతసించి యుండు § నెంతయేనిఁ
జనునె యగ్నిసాక్షి § సహధర్మచారిణి, నయిననన్ను నిలువు § మనుట నీకు. 46

క. దనుజమృగోరగభయములు, ననుఁ జెందునె నీవు గలుగ § నాథా నాకుఁ
నినుఁ బాసి మనుటకంటెను, మనమునఁ దలపోసి చూడ § మరణం బొప్పున్.

తే. అనిన సీతరాకకు రాముఁ§డనుమతించె, నపుడుసౌమిత్రి కోపర§క్తాస్యుఁ డగుచు
బొమలు గీలించి విస్ఫులిం§గములు చెదర, నతులఖడ్గంబు నంకించి §యన్నతోడ.

చ. తలఁపఁగ నీ వశక్తునివి§ధంబున నాడెదు రామచంద్ర నీ
కొలఁది యెఱుంగఁ డీతఁ డతి§కుత్సితుఁ డై మతిఁ దప్పి యాలిమా
టలు విని యింత తెంపున కొ§డంబడెఁ దా నొకసత్యవాది యై
పలుకఁడె నిన్న నేఁడు నినుఁ § బట్టముఁ గట్టెద నంచు బొంకొకో. 49

క. నిను నభిషిక్తునిఁ జేసెద, ననుచు వసిష్ఠాదిమునులు § నఖిలమహీశుల్
విన నాడె నీవరంబులు, తనయాలును దానుఁ గా కి§తరు లెఱుఁగుదురే. 50

క. మదనాతురతం బలికిన, యది సత్యం బఁట మహాస§భాంతరమునఁ దా
విదితంబుగాఁగఁ బలికిన, యి ది బొం కఁట దీని కింక § నే మన వచ్చున్. 51

క. జనకుఁడు నీతిజ్ఞుం డై, పనిచినఁ బుత్రులకు నెన్ని§భంగులఁ జేయం
జనుఁ గాక తగవు దప్పిన, విన నేటికి ధర్మమార్గ§విరళవిధంబున్. 52

క. నీకినుకకు నే వెఱతుఁ, గా కెవ్వరు గలరు దీనిఁ § గా దన నాచేఁ
గేకయులును గీకయులును, గై కేయికిఁ బూని రేనిఁ § గనియెదరు బలే. 53

శా. అస్మత్కార్ముకముక్తబాణవిసరం § బాభీలదంభోళిసం
ఘస్మేరాగ్రము గాఁగ యుష్మదభిషే§కప్రాతికూల్యంబు దా
నస్మార్యం బటు గాక తక్కిన నయో§ధ్యాపట్టణం బంతయుఁ
భస్మీభూతము సేసి పుచ్చెద మహీ§పాలాన్వయగ్రామణీ. 54

వ. అనిన విని రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని నీవు నాకు భక్తుండ వగుటయు నెంతకైనం జాలుటయు నే నెఱుంగుదు మనకులాచారగౌరవంబులు నుత్త

మశీలంబులును విచారించి పలుకు మేను గురువచనంబు చెల్లింపఁ గలవాఁడ నాపూనికి నిర్వహింపం జేయునదియ నీకు నర్హకృత్యంబు నావలనిభక్తియు నల్లుం గాక. 55

ఆ. దశరథేశ్వరుండు తండ్రి కేకయమహీ, పాలపుత్త్రి తల్లి భరతుఁ డనుజుఁ
డిందులోన నితరు లెవ్వరు వీరోక్తు, లేల నాడువ నుడుగు మీఁతలంపు. 56

క. ఒరులు దలలెత్తి చూడఁగఁ, గరకరి మనలోన వలదు గాని మదాజ్ఞన్
భరతుకడ నుండి యతిసుస్థిరమతి రాజ్యంబు నీవు సేయింపు మనా. 57

సీ. అనవుడు సౌమిత్త్రి యన్నమాటలు విని, మాఱాడ కిట్లను మనుజనాథ
యిక్కడిభోగంబు లెవ్వియు నే నొల్ల, వనభూములను జటావల్కలములు
నెమ్మితో ధరియించి నీపాదపద్మముల్, గొలిచి వచ్చెదను నే వలవ దనిన
నొల్లఁ బ్రాణము లన్న నుడుప నేరక రాముఁ, డనుజునిరాకకు ననుమతించె
నపుడు దశరథేశుఁ డారాఘవేశ్వరుఁ, డడవి కేఁగునిశ్చయం బెఱింగి
భరితశోకజనితపరితాపదందహ్య, మానహృదయుఁ డై సుమంత్త్రుఁ జూచి. 58

మ. తురగస్యందనమత్తసామజభటస్తోమంబులన్ మంత్త్రులన్
వరకాంతాజనులం బురప్రజల సర్వస్వమ్మునుం గొంచు నిం
క రఘూత్తంసముఁ గొల్చి నీవు సనఁగాఁ గైకేయికిం జెల్లదే
భరతుం బట్టము గట్టి రిత్త యగుభూభాగంబు భోగింపఁగన్. 59

ఆ. రామువెనుక సకలరాజ్యసంపదలతో, నరుగు మీవు శూన్య మైనపురము
భరతుఁ డేల నిమ్ము పాపమ్ము సిద్ధించెఁ, గైక దీన నేమి గట్టుకొనియె. 60

—శ్రీరామసీతాలక్ష్మణులు వల్కలధసితాదులు దాల్చుట.—

చ. అన విని కైక కోపమున నజ్జనవల్లభుఁ జూచి మేదినీ
తనయయు లక్ష్మణుండు సయితంబుగ రాముఁడు నారచీర లేఁ
గనుఁగొనుచుండఁ గట్టుకొని కాననభూమికి సర్వశూన్యుఁ డై
చనక వరంబు లొల్లను మృషావచనుండవు గమ్ము నెమ్మదిన్. 61

ఆ. రఘుకులేశు లైనరాజు లెవ్వరు నాడి, తప్ప రొకఁడ వీవు దప్ప ననుడు
మగుడ మూర్ఛమునిఁగె మనుజేశుఁ డప్పుడు, జననిఁ జూచి రామచంద్రుఁ డనియె.

క. గురుఁడును దండ్రియు రాజును, బరికింప నితండ యితఁడు పనిచినఁ దల్లీ
గరళంబేఁ గొనియెద నా, గర మైనం జొత్తుఁ జొత్తుఁ గార్చిచ్చైనన్. 63

ఉ. నాకు నసాధ్యముల్ త్రిభువనంబులయందును లేవు గావునన్
వే కొనితేరఁ బంపు మునివేషము గైకొన వల్కలాదు లం
చాకొమరుండు వల్కుటయు నాతనిముందటఁ బెట్టఁ బంచె న
క్కైకయు నప్డు రాముఁడు వికాసవిభాసిముఖారవిందుఁ డై. 64

సీ. కస్తూరికాపుష్పగంధబంధురమణి,బంధ మూడిచి జటాభార మూని

కోమలచారుదు|కూలంబు లెడలించి, కర్కశవల్కాంశు|కములు గట్టి
పరిలిప్తచందన|పంకంబు పోఁజేసి, నిర్మలభసితంబు | నిండ నలఁది
మహనీయబహురత్న|మండనంబులు వుచ్చి, లీలమై నక్షమా|లికలు దాల్చి
రాజజూటునోజ | రమణీయతేజోవి, రాజమానమూర్తి | రాజకీర్తి
రఘుకులాబ్ధిజనిత|రత్నంబు రాజన్యచక్రవర్తి రామ|చంద్రుఁ డొప్పె. 65

వ. తదనంతరంబ జనకరాజపుత్రియు సౌమిత్రియుం దపోవేషంబులు గైకొని రప్ప డారాజపరమేశ్వరుం డగురాఘవేశ్వరుం డన్నరేశ్వరుం గనుంగొని. 66

సీ. పదునాలు గేఁడులు | పదునాల్గు దినములుగాఁ బుచ్చి వచ్చెదఁ | గాననమున
వర్తించు టిది యెంత | వసుధేశ దీనికి, మదిలోన నీ కింత | మఱుఁగ నేల
భరతుఁడు నాకంటె | భక్తుఁడు గాన నీయాజ్ఞ దప్పక చేయు | ననుచుఁ బలికి
వలగొని తత్పాద|వనజంబులకు మ్రొక్కి, కైకకుఁ బ్రణమిల్లి | కడిఁది మూర్ఛఁ
దన్ను మఱచి యున్న|తండ్రి వీడ్కొని సుమిత్రాసుతుండు జనక|రాజసుతయుఁ
దోడ రాఁగ ముదము|తోఁ దల్లిపాలికి, సగుణుఁ డెంచె రాముఁ | డంత నచట.

వ. కౌసల్యాదేవియుఁ బట్టాభిషేకంబునకు విఘ్నంబు గాకుండ విహితవ్రతోపవాసంబులు గైకొని సమస్తదేవతాప్రార్థనంబు సేయుచుఁ బుత్రాగమనంబు విని సంతోషించి విశేషాక్షతాదిమంగళద్రవ్యంబులు గైకొనుచు నీరాజనకరణంబులకుఁ బుణ్యాంగనలు తోడరా నెదురేఁగు దెంచి యారాజర్షిరత్నంబుఁ గనుంగొని.

క. ఉల్లము గలఁగఁగ మొగమున, వెల్లఁదనం బొలయఁ దాల్మి | వీడంగఁ గడుం
దల్లడ మందుచు నుండఁగఁ, దల్లికిఁ బ్రణమిల్లి యతఁడు | దగ ని ట్లనియెన్. 69

ఉ. రాజు మహాజి నిచ్చినవ|రద్వితయంబునఁ గైక నేఁడు వి
భ్రాజితలీలమై భరతు|పట్టము నే వనభూమిలోన నీ
రోజఁ జతుర్దశాబ్దము ల|నూనతపస్స్థితి నుండ వేఁడె ని
ట్లాజనయిత్రి కోర్కియు నృ|పాగ్రణిసత్యముఁ జల్పు వేడుకన్. 70

క. ఏ నిట్లు తపోవేషముఁ, బూని నరేంద్రుండు వగలఁ | బొగులుచు నుండం
గా నేఁ జెంచితి నిటకును, మానసమున దీని కింక | మఱుఁగకు మనినన్. 71

క. మూలంబు దెగినతరువును, బోలెం బెనుమూర్ఛ నొంది | భూస్థలిమీఁదన్
వ్రాలి యనంతరమున ను, న్మీలితనయనాబ్జ యగుచు | నృపరత్నంబున్. 72

—కౌసల్య రామునివనగమనవృత్తాంతం బెఱింగి యడలుట—

మత్త. లిప్తనిర్మలభూతిభాసురు | లేమ చూచి విషాదసం
తప్తచిత్తముతోడ ని ట్లనుఁ | దమ్ముఁడా నిను మేదినీ
గుప్తికై కని యెట్టకేనియు | గొడ్డువీఁగితి నంచు నే
సప్తవింశతివత్సరంబులు | సంతసంబున నుండితిన్. 73

శా. ఇంకం దొల్లిటినోము లిట్లగుట కే | నే మందు నోపుత్ర ని

శ్శంకం గేకయరాజపుత్రి ధరణీసామ్రాజ్యభోగంబు దా
నంకం బైననిజేశుచేఁ బడయుఁ గా కన్యాయబుద్ధిన్ గుణా
లంకారున్ నినుఁ గాన కేఁగు మన నేలా కోర్కి సిద్ధించినన్. 74

మ. పతి నెయ్యుం డని కైక కిట్టడుగఁ జొప్పా పూన్కిఁ ద న్నేల ని
చ్చితి విన్నేలను నిన్ను నేల వనవాసిం జేసె ని ట్లైనచో
నతఁడుం గా దన కూరకుండె నఁట కామాంధుండు నై నీకు ని
ట్టి తెఱం గక్కట కైకొనం దగునె తండ్రీ తండ్రి మధ్యస్థుఁ డై. 75

సీ. ముదముతో దీవించి నుదుట వసిష్ఠుండు, గట్టినయభిషేకపట్ట మమర
బంధురలీల నరుంధతీముఖ్యయో, షిజ్జన ముంచినసేస లొప్పఁ
గెలఁకుల మంగళలలితగీతాదుల, రవములసొగయింపు చెవుల నాలయఁ
బంకజాక్షులరత్నకంకణక్వాణనముల్, రాజిల్లువీచోపు లోజ మెఱయ
నెలమి ధవళాతపత్రంబు లెసక మెసఁగ, మస్తకన్యస్తరాజన్యహస్తకమల
ములును దృక్చంద్రికావీథి మొగుడుచుండ, నాకునిది మ్రొక్కనేతెంచు టేకుమా [ర.

క. ఈవార్తకు మును దైవము, చావొసఁగదె యెట్టిపాపజాతినొ నాకుం
బోవునె యిడుములఁ గుడువం, గావలసినకర్మ మొకటి గలుగఁగఁ బుత్రా. 77

మ. భరతుం బట్టముగట్టి యొక్కటి మహీభాగంబు భోగించుచుం
బరమానందముతోడఁ గైక తనసౌభాగ్యంబు శోభిల్లఁగా
సిరి పెంపార విభుండుఁ దాను మనఁగాఁ జేడ్పాటుతో నేను బా
హిరమై యుండెద నొంటి నీ వకట న న్నేకాకినిం జేసితే. 78

క. నాసవతి యైనకైకకు, నీసును జల మెక్కఁ దల్లి నీటు వాసి చనన్
దోస మనక వనవాసా, యాసమునకు నియ్యకొనఁగ నగునే నీకున్. 79

శా. నాచేతం దొలుమేన నిష్ఠురగతిన్ నానావిషాదోన్నమ
ద్వీచీదుస్తర మైనపుత్రవిరహాబ్ధిం ద్రోవఁ బడ్డా రొక
ల్లీ చందంబున నిప్పుడాఫలము నా కేభంగులం దప్పునే
వేచెం గీడు విధాత దేల పలుకుల్ వేయుం గుమారోత్తమా. 80

క. ఏమని దైవము దూఱుదు, నే మని శోకింతు నడవి కీగతిఁ జనఁగా
నేమని ధైర్యము నిలుపుదు, నే మని పలవింతు నింక నెక్కడఁ జొత్తున్. 81

సీ. భరతున కభిషేకపట్టంబు వలసిన, నేఁ డేల పతి మున్ను వేఁడఁ గాదె
మనుజేశుఁ డిచ్చిన మహిమతో నిన్నేల, నాలుగుచెఱఁగుల నేల రాదె
మగఁడు వాటించినమాకంటె నెక్కుడు, దొడుగఁ గట్టఁగఁ బాయ నడుగరాదె
యన్న నీవనవాస మది దక్క నాథుచేఁ, గడలేనిమన్ననల్ వడయరాదె
యింత తెంపుసేయ నిట్లందు నెవ్వతె, నేర్చె దీని కెట్టు లోర్చె రాజు

కనికరం బొకింత I గలదె దానికిఁ బాప, మొఱ్ఱొ పాదవుచూడ I నక్కటకట.
తే. అనుచుఁ బెక్కెఱంగుల I నడలుచున్న
జనని నూరార్చి యోతల్లి I సవతితనము
కైకదెసఁ జూపి యాడెదు I గాని నీదు
కులము శీలముఁ బరికించి I పలుక వేల. 83
క. పతివాక్యాతిక్రమణము, సతులకు నెబ్భంగిఁ జేయఁ I జన దని ధైర్య
స్థితి నిలుతురుగా కెందును, సుతులం బాయంగ లేని I సుదతులు గలరే. 84
ఆ. భార్గవుండు తండ్రి I పనుపున రేణుకా, దేవి తల్లి యనక I తెంపుసేసెఁ
గుండిసుం డొనర్చె I గోహింస జనకాజ్ఞఁ, గాన పితృనియుక్తిఁ I గడవఁ జనదు.
క. జననీ ఋట్లగుటను మ, జ్జనకుపలుకు మీఱఁ గాదు I సమకొల్పు ధృతిన్
మనమున వగవకు మిట్టి, ట్టని సొలవకు రాజువలనఁ I గైకేయిదెసన్. 86
క. అని పలికిన నద్దేవియుఁ, దనయుని తెం పెఱిఁగి యెట్లుఁ I దప్పదు దైవం
బును బగవారిం గూడెను, నను రాముఁడు విడిచె నే మ I నం గల దింకన్. 87
వ. అనుచు వగలం బొగులుచున్నసమయంబున నక్కుమారుండు. 88

—సీతారామలక్ష్మణులు కౌసల్యాసుమిత్రలచే వనవాసంబున కనుజ్ఞ గొనుట.—

ఉ. మ్రొక్కినఁ గౌఁగిలించి మది I ముట్టినమోహము ద్రెంప లేక లోఁ
బొక్కుచు వేఁడియూర్పుఁ దగఁ I బుచ్చి తొడింబడఁ గొంతసేపు వే
ల్పెక్కినభంగి నుండి ధృతి I నెట్టకునేనియుఁ బూని కుత్తుకం
జిక్కడలించి పుత్త్రుఁ గని I చిత్తములోనఁ దలంపు గూడినన్. 89
సీ. వినయంబుతో నెల్ల I వేల్పులఁ బేర్కొని, దక్షిణకరమున I రక్షఁ గట్టి
నీరాజనం బిచ్చి I నృపవర దనుజులఁ, బరిమార్చి రక్షింపు I సురల మునుల
నఖిలదేవతలు వృ I త్రాసురు గెలువఁబో, నెసఁగంగ నింద్రున I కొసఁగుశుభము
నమృతంబునకు నేఁగు I నప్పుడు వినత వి,హంగాధిపతి కిచ్చు I మంగళంబు
లింపు సొంపారఁ బుత్ర గా I నిమ్ము నీకు
ననుచు దీవించి సౌమిత్రి I వినతుఁ డైన
నన్న లక్ష్మణ నీవు మా I యన్న వెనుకఁ
జనియెదే పట్టి సుఖివి గ I మ్మనుచుఁ బలికి. 90
ఉ. కోడలు మ్రొక్కినన్ మదిని I గుందుచు నక్కున నక్కుఁ జేర్చి నిన్
వేడుక నిచ్చునప్డు రఘు I వీరుఁడు రాముఁడు వార్ధి మేరఁగా
నీడితకీర్తితోఁ బుడమి I యేలెడు నంచుఁ దలంచెఁ గైకచే
మూఁడఁగ నున్నదీని మును I ముట్ట భవజ్జనకుం డెఱుంగునే. 91
ఉత్సాహ. రాజబింబవదన జనక I రాజు నిన్ను నిమ్మహా
రాజపుత్త్రుఁ డైనసుగుణ I రత్నమునకు నిచ్చితిం

దేజ మెసఁగు మంచు సమ్మతించి యున్నచోట నోం
జ్జోజ నిచట దైవఘటన ♦ మున్న నేమి సేయుదున్. 92
క. అతివలు ధనవిరహాతు లగు, పతులను దిగవిడుతు రెన్నిభంగుల ధర్మ
స్థితిఁ దలఁపరు తాదృగ్విధ, సతులను నినుఁ జెప్పి చెప్పఁ ♦ జనునే సాధ్వీ. 93
క. నిర్ధనుఁడు గాఁడు రాముఁడు, వర్ధిష్ణుఁడు పడయఁ జాలు♦వాసవభోగ
స్పర్ధి యగువిభవ మితఁడు ధ,నుర్ధరుఁ డై యమ్మ దెసఁ గ♦నుంగొనుమాత్రన్.
వ. అని వెండియు. 95
చ. దశరథువాక్యశాసనము ♦ తప్పుట త ప్పని నిశ్చయించి యీ
దశను ధరించి లోకవిది♦తంబుగఁ గానలలో శరచ్ఛతు
ర్దశకముఁ బుచ్చి వచ్చి రఘు♦రాముఁడు నిర్మలకీర్తిచంద్రికల్
దశదిశలన్ వెలుంగ వసు♦ధాపరిపాలన కేళి సల్పెడిన్. 96
వ. అని పలికి సంగనువదనారవిందం బవలోకించి తెప్పలు వ్రాల్చైచి మనంబునం
బొగులుచుండె నప్పు డారాఘవేశ్వరుండు తల్లి నామంత్రణంబు చేసి సీతాలక్ష్మణ
సమేతుం డయి సుమిత్రాదేవిపాలి కేతెంచి యంతవృత్తాంతంబు నెఱింగించి
నమస్కరించి వీడ్కొనుసమయంబున నజ్జననియు శోకదందహ్యమానమానస
యగుచు ని ట్లనియె. 97
క. అక్కట కైకకుఁ దగునే, యిక్కొడుకున కెగ్గు సేయ ♦ నిటు గలదే రా
జిక్కొడున కోర్చఁ గదే, నిక్కము కృప గలదె కామి♦నిమగ్నులకున్. 98
వ. అని పలికె నంత లక్ష్మణుండు నమస్కరించుటయు దీవించి యక్కుమారువదనం
బాలోకించి. 99
క. మనమున రాముని దశరథ, జననాయకుఁగాఁ దలంపు ♦ జనకతనూజన్
ననుఁగాఁ దలఁపుము కాననము నయోధ్యగఁ దలఁపు మేఁగు♦ముదముసఁ జంద్రీ.
ఉ. భూమితనూజ ముగ్ధ వన♦భూములఁ బెక్కులు దైత్యమాయ లు
ద్దామబలాఢ్యుఁ డై సుగుణ♦ధాముఁడు రాముఁడు నిద్రవోవుచో
నేమఱ కెప్ప నీవు శర ♦ మేర్చి యధిజ్యశరాసనుండ వై
సేమ మెఱింగి యుండు మని ♦ చెప్పఁ బదంపడి సీత మ్రొక్కినన్. 101
ఉ. అక్కున నక్కు సేర్చి ముద ♦ మారఁగ దీవన లిచ్చి తల్లి నీ
వెక్కుడుపుణ్యశీలమున ♦ నిష్టమతిం బతి కానుకూల్యమున్
దక్క కొనర్చుచుండు మని ♦ తత్పరతం దగ బుద్ధు లిమ్ములం
బెక్కులు చెప్పి వీడ్కొలిపెఁ ♦ బేర్చినశోకముఁ దాల్మి నాఁగుచున్. 102
వ. అంత రామచంద్రుండును సౌమిత్రియు ధరిత్రీపుత్రియుం దోడరా నాతపత్ర
ధ్వజచామరశూన్యుండును బాదచారియు నై రాజమార్గంబునం గ్రందుకొని
తమవేషంబులకుం బొగులుచున్నపురజనంబులం జూచి నవ్వుచు నిజమందిరంబు

నకుఁ జనుదెంచి వసిష్ఠపుత్త్రుం డైనసుయజ్ఞునకుం బదికోట్లసువర్ణంబులు ననేక రత్నాంబరంబులును సమర్పించి వసిష్ఠాదిమునులకు నానాదీనజనంబులకు సమస్తధనంబు లిచ్చె నంత జనకాత్మజయు నాత్మీయమందిరంబున కేతెంచి భూషణంబులు హేమరాసులును వసిష్ఠవాసిష్ఠపత్నులకొసంగె నాసమయంబున నరుంధతి వసిష్ఠుం గనుంగొని. 103

తే. నీ కుపేక్షింపఁ దగునె యిక్ష్వాకుకులము,లోన నింతలు నొప్పము లైనచోట
ననిన నమ్మునియధికసమాధియుక్తి, నయ్యనాగతవృత్తాంత మరసి చూచి.

వ. ఇది దైవికం బగుట నెఱుంగు దీనిం గనుంగొనుచు నూరకుండు మని పలికె నప్పు డారామచంద్రుండు సమస్తమునులకు గృహదేవతలకు నమస్కరించి శరశరాసనసన్నద్ధుం డయి నగరు వెడలి చనిన జనులయార్తరావంబు వీతెంచె నపుడు దశరథుండు శోకవివశుం డగుచు సుమంత్రుం గనుంగొని. 105

—సీతారామలక్ష్మణులు వనంబున కరుగఁ బౌరులు వెంబడించుట.—

తరల. రథము వే గొనిపొమ్ము రాముఁ డరణ్యభూమికి నేఁగెడున్
శిథిలతం దనువల్లి దూలఁగ సీత మెల్లన పాదముల్
పృథివి మోపుచు నింత కెంత చలించుచుండునొ నావుడుం
బృథులరత్నమరీచు లార గభీరనేమిరవంబుతోన్. 106

ఉ. ఆతఁడు తేరు దెచ్చి వసుధాధిపునానతి రత్నకాంచన
స్ఫీతరథాధిరోహణము సేయుఁడు నావుడు సీతయుఁ సుమి
త్రాతనయుండుఁ దానును రథంబు రఘూద్వహుఁ డెక్కి పోవ నా
నాతురనాదముల్ సెలఁగె నప్పుడు తత్పురిరాజవీథులన్. 107

వ. మఱియు. 108

ఉ. కొందఱు కైక నాడ నృపుఁ గొందఱు పేర్కొని యెగ్గు లెన్నఁగాఁ
గొందఱు రామచంద్రుఁ దనరుం జన నేటికి నాఁగ మంథరం
గొందఱు తిట్టఁగా సొలసి కొందఱు దైవము దూఱ రాఘవ
స్యందనవీథి నిట్లు జనశబ్దపరంపర నిండె వెండియున్. 109

వ. మఱియుం బెక్కుదెఱంగుల. 110

మ. కులనిస్తారకుఁ డీతఁ డిట్లరుగఁ గాకుత్స్థాన్వయం బింతతోఁ
బొలిసెన్ మంథర యింత సేసె నది దుర్బోధంబుగాఁ జూడ కి
మ్ముల నక్కైకయు నావరంబు లడిగెన్ మోహాంధుఁ డై రాజు ను
గ్మలికిం బాపసహాయుఁ డయ్యె నకటా కౌసల్యకుం బండెఁ బో. 111

సీ. సంతానసిద్ధికి సకలమునీంద్రులఁ, బితృదేవగణములఁ బ్రీతిఁ గొలిచి
బహుకాలతపమునఁ బరిపక్వ మగుపుణ్య,ఫలమునఁ గశ్యపబ్రహ్మమనుమఁ
డశ్వమేధంబున నధ్వర్యుఁ డయి పుత్ర,కామేష్టి గావింపఁ గాఁ బ్రసక్తి

మై నగ్ని దేవుఁడు మహనీయచరు వటు, దయ సేయఁ బుత్రరత్నములఁ బత్ను
లందుఁ బడసి యున్న యట్టిసంతోషసం,వర్ధనకము లెల్ల వమ్ము గాఁగఁ
గైకకొలఁకు నకట గానకు సీరఘూ,త్తముల నరుగు మనియె దశరథుండు. 112

శా. స్వచ్ఛందస్థితిఁ గీర్తి దిక్తటములన్ వర్తింప నేకాతప
త్రచ్ఛాయంబుగ భూమి నేల రఘురత్నం బున్నచో ధర్మముం
బ్రచ్ఛాదించి విభుండు గూర్చు నని నిర్బంధించి యిబ్భంగిఁ దు
శ్చేచ్ఛం గైక వరంబు వేఁడె విధితో నెవ్వాఁడు నేర్చుం గటా. 113

సీ. మంథర తగ వేదిమతకంబు లూహించి, కైకకుఁ జెడుబుద్ధిఁ గఱపె నకట
తగదని కినియక దానిమాటలకు నా,చేడియ గడుఁదెంపు సేసె నకట
పాపంపువరములు పత్ని వేఁడినయట్లు, లోఁడఁబడి వసుధేశుఁ డొసఁగె నకట
యభిషేకవేళ నట్టడవికిఁ బొమ్మన్నఁ, గొడుకు దానికి నియ్యకొనియె నకట
యన్నమనసు నొచ్చు నని సుమిత్రాపుత్త్రుఁ, డొండు మదిఁ దలంపకుండె నకట
ధర్మపథము విడిచి దైవంబు పగవాఁడు, దలఁచినట్లు కీడు దలఁచె నకట. 114

వ. అని యిట్లనేకప్రకారంబుల శోకించుచు నెడనెడ నిలువ కప్పురజనంబులు తద్రథంబు నిలుండం జనుదేరం జూచుచు రామచంద్రుం డయోధ్యాపురగోపురంబు వెడలె నాసమయంబున. 115

ఉ. ఆనగరంబు వెల్వడి ధరాత్మజ ముంగటఁ గానవచ్చును
ద్యానముఁ జూచి కోమలకరాబ్జమునన్ భుజ మప్పళించుచున్
లేనగ వొప్ప నల్లతరులే మనయోఁగెడు కాననంబు నా
నాననపద్మ మెత్తె వసుధాధిపుఁ డశ్రువితానపంక్తితోన్. 116

వ. అంత నక్కడ దశరథుండును గౌసల్యాసుమిత్రలకరంబు లవలంబించి యంతఃపురంబుచేడియలు తోడరా నధికవిషాదంబుతో నగరు వెలువడి నేత్రంబులం దొరఁగుబాష్పంబులకతన రామురథమార్గంబు గానరామికిం బెక్కుదెఱంగుల విలపించుచుం బోవుసమయంబున. 117

—దశరథుండు రామునరణ్యగమనంబునకు విలపించుట.—

సీ. దినకరప్రభ దప్పె దిశలఁజీఁకటి గప్పెఁ, బొగయుచు నగ్నులు పొనుఁగుపడియె
గృహశారికాకీర కేకిహంసావళి, వికృతముల్ విపరీతవిధము లయ్యె
నిభములమదధార లింకె నుత్తమతురం,గములకన్నుల నశ్రుకణము లొలికెఁ
బురజను లెలుఁగెత్తి పొరిఁబొరి శోకింప, నిగిడి హాహాధ్వనుల్ నింగి ముట్టె
విబుధతతులయడలు వీతెంచెఁ బౌరుల, కిట్లమంగళంబు లెసఁగుచుండ
నప్పురంబువెడలి యరదంబు గని నృపాలుఁడు సుమంత్రునకు నెలుంగు, సూపి.

శా. కూడం జాలు రథంబు నిల్పు మని యాక్రోశించుచుం గూడ రాఁ
జూడం దండ్రియవస్థఁ జూచి మదిలో శోకం బధైర్యంబుతోఁ

గూడం దోడని తెంపు గూడుటయు నక్కుంఠితవ్యధీశాగ్రణీ
చూడారత్నము తేరు వేనడపు మంచుం జెప్ప నయ్యాజ్ఞకున్. 119

క. హరుల సుమంత్రుఁడు వో ని,చ్చె రయంబున నప్పు డావసిష్ఠుఁడు నిలు మో
నరనాథ వెనుక నడలుచు, నగరం జన దనఁగ నిలిచి యధికాతురతన్. 120

ఉ. పంపినపుత్రమోహమునఁ బార్థివుఁ డారథ మేఁగఁగా విషా
దంబునఁ జూచి చూచి యరదంబటఁ గానక తద్గరాపరా
గం బటు సూచి చూచి యది గానక కొండొకసేపు దా నిరా
లంబనదృష్టి యై కడుఁ గలంగి మనోభ్రమ నిండ వెండియున్. 121

వ. నిజనందనస్యందనంబు ముందటం దోఁచిన ట్లయిన. 122

చ. అదె రఘువీరుఁ డున్నరథ మల్లదె పోయెడి రాము తేరు పో
మ్మదె యదె పోయె నయ్యరద మక్కడఁ దోఁచెఁ దదీయభూరజం
బదియు నడంగెఁ బో మ్మకట హా గుణరత్నమ హా కుమార హా
సదమలకీర్తిహార నృపసత్తమ హా ననుఁ గూడ నీఁ గదే. 123

శా. ఓపట్టీ నను డించి నీ వరిగెదే యుగ్రాటవీవాటికిన్
నాపుణ్యం బిటు లయ్యెనే వినఁ గదే నా కేది దిక్కంచు నా
భూపాలుం డతిదుస్తరవ్యథఁ బడుం బొక్కున్ గళద్బాష్పుఁ డై
చూపాడిక్కున దవ్వు గాఁగ నిగిడించుం దూలు దైన్యంబునన్. 124

వ. ఇట్లంతకంతకు మోహావేశం బడరి మూర్ఛాపరవశుం డగుచు నేలంబడి పొరలి
ధూసరితాంగుం డై కొండొకసేపునకుం దెలిసి కైకేయిం గనుంగొని. 125

ఉ. పాతకవర్తి వై ననినుఁ బత్నిఁగఁ గైకొని యున్న నేనునుం
బాతకవర్తి నింక నతిపాతకవర్తిని ముట్టఁ గాదు వి
ఖ్యాతిగ నిట్లు నింద కొడిగట్టితి సంతస మందు దీన దు
ర్నీతి దురాత్మురాల వగునీక చనుం గులనాశకారిణీ. 126

క. అని పతి పలుకఁగఁ గనుఁగొని, వనితలు నిందింపఁగా నవనతానన యై
వినుచుండెం గైకేయియుఁ, దనయంతన మగిడెఁ బురికి ధరణివిభుండున్. 127

తే. అరుగుదెంచియు నిర్జనం బయినపురము, విన్నఁబోవుటఁ జూచినిర్విణ్ణుఁ డగుచు
నగరుసొత్తెంచి చిత్తంబు వగలఁబొగుల, నయ్యపై మేను వైచి కౌసల్యఁ జూచి.

సీ. ఇంతకు రఘురత్న మెంతద వ్వరుగునో, యకట యప్పుణ్యుఁ డేయంఘ్రిపముల
నీడల నుండునో నేఁ డెట్లు కందమూ,లము లారగించునో లలితచరిత
భూపుత్రి యేగతిఁ బొందునో రాముఁ డ,మ్ముద్దియ వాడినమోముఁ జూచి
హృదయంబు గందంగ నే మని వగచునో, సౌమిత్రి నాదుష్టచరితములకు
నొచ్చి యెన్ని వల్కునో యంచు వగవఁ గౌ,సల్య లోనుగాఁగ సతులు గూడి
పాపజాతిఁ గైకఁ బలుమాఱు దూఱుచుం, దంద నడలుచుండి రచట నంత.

ఉ. పౌరసమేతుఁ డై రఘునృపాలకుఁడుం దమసాతరంగిణీ
తీరము సేరఁగా నరిగి తే రట డిగ్గి పితృప్రసూచితా
చారవిధంబు లత్తటినిఁ జల్పి జలంబులు ద్రావి ధైర్యవి
స్తారత విశ్రమించె మృదుతల్పసమస్థితిఁ బర్ణశయ్యపై. 130

క. పురజనులు దిరిగి వచ్చియుఁ, దరతరములు రాముఁ గొల్చి తద్గుణగణనా
పరవశతం దమతమమం,దిరములదెసఁ దలఁపు మఱచి నిద్రించుటయున్. 131

క. ఎప్పుడు విడువక తిరిగెద, రిప్పౌరుల డించి చనఁగ నిది తఱి నా కం
చప్పుడు విభుఁడు సుమంత్రుం, జప్పుడు గాకుండ గూఢసంజ్ఞం దెలిపెన్. 132

ఆ. తెలిపి రథ మయోధ్యదెసకుఁ బోవఁగ నిచ్చి, తప్పు తెరువునందుఁ ద్రిప్పి తెచ్చి
తమసనదియు వేగ దాఁటింపు మనవుడు, నర్ధరాత్ర మతఁడు నట్ల చేసె. 133

వ. రామచంద్రుండును నన్నది నుత్తరించి తత్తీరవనభూములు భూమిజకుం జూపుచు
నయ్యాయిజనపదంబులవిలాసంబులను వినుచు వేగవతియు సరయువునుం దాఁటి
దివసావసానసమయంబునకు గంగాతీరంబుఁ జేరి యొక్కయింగుదీతరుప్రాంతం
బున విడిసె నిక్కడఁ దమసానదీతీరంబున. 134

ఉ. పౌరులు మేలుకాంచి నరపాలకుఁ గానక విన్నఁబాటుతో
నారథమార్గ మారసి నృపాగ్రణి క్రమ్మఱఁ బోవఁబోలు నిం
పార నయోధ్య కంచుఁ జని యప్పురలక్ష్మి యమంగళంబులం
గోరుట చూచి గేహములఁ గొందల మందుచు నుండి రక్కడన్. 135

—•• గుహుండు సీతారామలక్ష్మణులను గంగ దాఁటించుట. ••—

క. గుహుఁ డనునిషాదనాథుఁడు, మహితాంబరరత్నఖచితమండనసుమన
స్సహితోపాయనములతో, విహితంబుగ రామవిభుని వేడుకఁ గనియెన్. 136

సీ. కని మ్రొక్కి యట్లున్కి గనుఁగొని వెఱఁగంది, యేమి యో దేవ నీ వీతపస్వి
వేషంబు ధరియించి విగతసైన్యుండ వై, కానకు విచ్చేయుకారణంబు
మీబంట నే నుండ మి మ్మింత సేసిన, ద్రోహి వాఁ డెవ్వఁడు తులువ నాదు
బాణాసనార్చులపాలు గావించెద, ననిన నవ్వుచు రాముఁ డంత తెఱఁగు
నోలిఁ దెలియంగఁ జెప్పి వీరోక్తు లుడుప, శబరపతి యప్డు గైకదోషంబునకును
రాజునవివేకమునకు నారాఘవులకు, నయినదురవస్థకును దుఃఖితాత్ముఁ డయ్యె.

వ. అంత నమ్మహీపతియుం గిరాతపతిని బోధించి సంధ్యానియమంబులు దీర్చి నిద్రించె
నాసమయంబున. 138

ఉ. ఆపదునాలుగేఁడులు నహర్నిశముం దననిద్ర దప్పి యా
రోపితచాపుఁ డై రఘువరుం గొలువం బరమాద్భుతప్రతి
జ్ఞాపరుఁ డైనలక్ష్మణుఁడు జానకివిన్నఁదనంబు చిత్తసం
తాపము సేయ నాశబరనాథున కద్దెసఁ జూపి వెండియున్. 139

వ. కౌసల్యాసుమిత్రలశోకంబుఁ జెప్పి రామధైర్యంబు గర్హించుచు నర్హంబగు నెడ గుహుండును దానును గూర్చుండి వగలం బొగులుచుండె నంతఁ బ్రభాతం బేఁగుదెంచిన. 140

ఆ. సమయవిధులు దీర్చి § సౌమిత్రిసహిత మీఁ, రేడువత్సరములు § ధృతి గరిష్ఠ
నిష్ఠఁ దపముసేయ § నేమంబు గైకొని, మనుజనాయకుఁడు సు§మంత్రుఁ జూచి.

చ. అనుచిత మింక మాకు రథ§యానము గావునఁ దే రయోధ్యకుం
గొని చని మా తెఱంగునకు § గుండెలు గ్రుళ్లుచు నున్నయన్న రేం
ద్రునకును మువ్వురమ్మలకు § మ్రొక్కితి మే మని విన్నవింపు నీ
వనునయభంగి వారిహృద§యంబులశోకము లార్పనేర్పునన్. 142

ఉ. నావుడు గద్గదస్వరము§నం బతితో నను రామచంద్ర ని
న్నీవనభూమి డించి చని § యే మని పౌరుల కింకఁ జెప్పుదుర్
భూవిభునొద్ద కెట్లు గొని § పోవుదు శూన్యరథం బవశ్యముం
దావకసేవకుండ భవ§దంఘ్రుల నే నిటఁ గొల్చివచ్చెదన్. 143

ఉ. ఆనతి యిమ్ము నావుడు ర§యంబున నీ వటు వోయి వారు గం
గానది దాఁటిపోయి రని § కైకకు నమ్మిక పుట్టఁ జెప్పినం
గాని నిజంబుసేయ దటు § గాన యయోధ్యకు నేఁగు మన్న దీ
నాననుఁడై యతం డరిగె § నారథ మెక్కి విషాద మందుచున్. 144

వ. తదనంతరంబ గుహుండు కర్ణధారుండుగా నావ యెక్కి సీతాసమేతంబుగా నక్కుమారనిధానంబులు. 145

మ. ఘనబాహాపరిఘాభిరాములు కన§త్కాండప్రచండాశుగా
సను లుత్తుంగవిశాలవక్షులు విరా§జత్పంకజాక్షుల్ సుధాం
శునిభాస్యుల్ గమనీయమూర్తులు రఘు§క్షోణీశు లప్పుణ్యభా
గిని భాగీరథి నుత్తరించి రకలం§కీభూతచేతస్కులై. 146

తే. ఇత్తెఱంగున నాగంగ§నుత్తరించి, గుహునిచేఁ ద్రోవఁజూపించు§కొని ప్రియమ్ము
తోడ నక్కిరాతాగ్రణి § వీడుకొలిపి, యమ్మహారణ్యపథమున § నరుగునపుడు.

క. హతవిధి కృతి నిట్లతికఠి, నతరస్థలి నడుగు లిడుచు § నడు మసియాడం
గతిపయమృదుపదగతి నా, క్షితిసుత డయ్యుటయుఁ జూచి § చిత్తం బవియన్.

చ. నడు మిసుమంత మీఁదఁ గఠి§నస్తనభారము తోర మంతకుం
దడఁబడు లేఁతనెన్నడ ప§దమ్ములు నూతనపల్లవంబులం
గడచినకోమలంబు లని § కాదె తనుల్ నిలు మంటి నింట నేఁ
బడియెడు నన్నిపాటులనొ § పక్ష్మలలోచన చూడు లక్ష్మణా. 149

క. నడవం జాలక యడుగులు, తడఁబడఁ బొగులుచును నోరు § దడుపుచు నకటా
కడుఁ దూలె ననుచు విభుఁ డెడ, నెడ నీడల నిలిచి నిలిచి § యిభనిభగమనన్.

వ. అలయకుండం దోఁకొని నాఁడు మూఁడుయోజనంబులు సని సుదర్శనం బను స
రోవరంబు గాంచి తత్తీరవటమూలంబునవిడిసి మృణాళఖండంబు లాహారంబుగా
గొని యారాత్రి యచ్చటనుండి మఱునాఁడు యోజనత్రయం బరిగి. 15

క. అమితాఘభంగరంగ,త్క్రమచంగము మృదులతుంగతరతరళతరం
గము గంగాయమునాసం,గము చేరి ప్రయాగవటము గని దాశరథుల్. 15

ఆ. అందు మునివరేణ్యుఁ డగుభరద్వాజుఁ, డ్రి,కాలవేది శిష్యగణసమేతు
మహితమూర్తిఁ గని నమస్కరించుటయు దీ, వించివారిఁగాంచి వెఱఁగునొంది

క. యోగసమాధి నతీతా,నాగతవృత్తాంత మరసి యాఘనులకు నా
నాగుణధనులకుఁ గరుణా,సాగరులకుఁ జేసె నతఁడు సత్కారంబుల్. 15

క. ఇత్తెఱఁగున నాసంయమి,సత్తముచే నుచితకృతుల సత్కృతులై భూ
పోత్తములు రాత్రి మహిమో,దాత్తస్థితి నచట నిలిచి రట దివసమునన్.

మ. ఘనదుర్గం బగుచిత్రకూటనగమార్గం బాభరద్వాజుచే
విని తత్పాదసరోరుహంబులకు నాశీరోత్తముల్ మ్రొక్కి వీ
డ్కొని వేడ్కం జని రప్డు రాముఁడు కనత్కోదండశుంభద్గుణ
ధ్వని మ్రోయించి మృగావళుల్ బెదర సీతం బ్రీతిఁ బొందించుచున్. 156

శా. ఆలోలాక్షికిఁ దద్విలోకనవినోదాసక్తి రెట్టింప ను
త్తాలాభీలవిశాలసాలవిచలద్వాతూలదూరాగ్రశా
ఖాలీలాభ్రము లోలిఁ జూపుచు మహాకల్లోలినీరత్నముం
గాళిందీనది దాఁటి సిద్ధవటముం గన్గొంచు నమ్మ్రుండటన్. 157

వ. మఱియు నానావిధంబులైనవినోదంబుల నమ్మేదినీసుతకు దుర్గగమనపరిశ్రాంతి
దోఁపకుండం జేయుచుండె నాసమయంబున. 158

—❖ శ్రీరామమూర్తి చిత్రకూటంబు చేరుట. ❖—

చ. అటఁ జని కాంచి రంత వసుధాధిపు లారతిలోలకిన్నరీ
ఘటితగుహాకుటీకనకకమ్రకవాటము సన్మణిప్రభా
హాటదురుశృంగజూటము సమావృతమాల్యవతీతరంగిణీ
తటతరువాటముఁ బహుళతాపసకూటముఁ జిత్రకూటమున్. 159

సీ. మహనీయతరహోమమంత్రస్వరంబులు, గంధర్వమంజులగానతతులు
విలసితకిన్నరీవీణారవంబులు, శారికోపన్యాసచతురతలును
రాజకీరాలాపరచనాకలాపముల్, కలహంసనిస్వనకలకలములు
కమనీయకోకిలకలనినాదములు రో,లంబఝుంకారకోలాహలములు
గలుగుదాని వేదగంభీరఘోషముల్, గలయఁ జెలఁగుదాని గాలి నోలి
మొరయువేణురంధ్రములదానిఁ జేరఁగ, నేఁగుదెంచి యన్నగేంద్ర మెక్కి.

మ. దళదంభోజపరాగరాగవిలసత్కల్లోలకేళీనట
త్కలహంసవ్రజచక్రసారసబకక్రౌంచభ్రమద్భృంగసం
కులనానారవశిక్షణద్బహుసరస్కూలానుకూలక్రియా
లలితాలోలసమీరకంపితలతాలాస్యంబు లీక్షించుచున్. 161

తే. వచ్చి సంయమీంద్రుల కభివందనంబు, చేసి సత్కారములు వారిచేతఁగాంచి
యమ్మహాత్ములయనుమతి నచటఁ బర్ణ, శాలఁ గట్టించుకొని తపశ్చరణనియతి.

క. నెఱసినరాజ్యసుఖంబులు, మఱచి మహామునులగోష్ఠి మచ్చిక లలరం
గిఱికొనుచిత్తంబులతో, నుఱుతెఱఁగుల నుండి రంత నొకనాఁ డెలమిన్. 163

సీ. అవనిజ దేవోపహారఫలంబులు, చెలువార నలవాటు సేయుచోట
నుపహతిగావింప నొకకాక మేతెంచి, సుడియంగఁ బలుమాఱుఁ జోఁపిచోఁపి
కడు డయ్యుటయు దానిఁగనినృపాలుండిషి, కాస్త్రంబుమంత్రించియలుక వైవ
నదియు వెన్నడి నస్త్రమైతోల నక్కాకి, త్రిజగంబు గ్రుమ్మఱి దిక్కు లేక
మగుడ నేఁగుదెంచి మనుజేంద్ర యపరాధిఁ, గావుమనుడు విభుడుకరుణచూడ్కి
నోలయ నల్ల నగుచు నోపక్షి నావిశిఖంబు రిత్తపోదు గాన వినుము. 164

క. నీయం దొకనయనము నా, సాయకమున కిచ్చి బ్రతికి చను మనవుడు నా
వాయసమును నొకయరబక, మాయంబకమునకు నిచ్చియరిగెం బెలుచన్. 165

ఆ. అంత వారు సహస్రతావశిష్టము లగు, నాఫలంబు లెలమి నారగించి
మునులఁగొలిచి మిగులముదముతోఁ జిత్రకూ, టాచలమున నుండిరతులగతుల.

వ. అంత నిక్కడ సుమంత్రుం డయోధ్యానగరంబు సొచ్చి దీనాననుం డయి రాజ
మార్గంబునం జనుదేరఁ దేరిచప్పు డాలించి రామచంద్రుండు రాఁబోలు ననుచుఁ
బురజనంబులు సంభ్రమంబునం బఱతెంచి రామలక్ష్మణవిరహితస్యందనుం డగు
నాసుమంత్రునిం బెక్కుదెఱంగులం దిట్టుచు నధికశోకంబునం బొగులుచుండి
రంత నప్పలుకు లాలించుచు నతండు నగరివాకిట రథావతరణంబు సేసి యంతః
పురంబులోనికిం బోయి దశరథేశ్వరునడుగులం బడి గద్గదికతోడం దొడరు
నెలుంగున. 167

తే. దేవ రాముఁడు గంగానదీతటమున, జడలు గైకొని నీకును జననులకును
నలఘుమతి మ్రొక్కు నన్నువీడ్కొలిపి చనియె, నత్తటిని దాఁటి చిత్రకూటాద్రికనిన.

ఉ. రామయుఁ దమ్ముడుం గొలువ రాజశిఖామణి చిత్రకూటచూ
డామణి యైనవార్త చెవి డాసిన నొచ్చితి నింక నారఘు
గ్రామణి యున్నచోటికి కనఘా ననుఁ దోకొని వేగ పోఁ గదే
రామవియోగవేదనను బ్రాణము లుండక తల్లడిల్లెడిన్. 169

క. అనిన సుమంత్రుం డిట్లను, జనవర వనమునకు నీవు చనఁగాఁ బౌరుల్
వెనుకొని వత్తురు వచ్చినఁ, గనుఁగొని యది కైక యొండుగా భావించున్. 170

క. అది గావున సిద్ధింపదు, హృదయంబున నిచటినుఖము § లెల్ల మఱచి న
మ్మది రాముఁడు మునిసన్నిధి, సదమలమతి నున్నవాఁడు § చరితార్థుం డై. 171
వ. అని పలికిన దశరథుండును సుమంత్రుని వీడ్కొలిపి రామచంద్రునిం బేర్కొని
బహుప్రకారంబుల శోకింపఁ గౌసల్యాదేవి యన్న రేంద్రుం గనుంగొని. 172
సీ. మదిలేనిశోకంబు § మనుజేశ నీవు నా,యెదుర నటించెద § వెఱుఁగనట్లు
బహుకాలతపమునఁ § బడసినసుతు రామ,చంద్రుని లోకంబు§నడికి నోర్చి
కడుఁ బూన్కి పట్టంబు§గట్టెద నని యెల్ల,నృపతులు విన నాడి § నిజమపోలె
నొకమహాసంభ్రమ § మొనరించి యటఁబోయి, కైకేయితోఁ§గూడి§కపటవృత్తి
నక్కుమారుఁ బిలిచి § యడవుల కనుపఁగఁ, జాలినట్టిపరుష§సాహసునకు
క నేటికరుణ నీకు § నెక్కడిపరలోక, మేటిసూనృతంబు § నేటితగవు. 173
నావుడు నిన్నియుఁ గలవే, నావలనం బరుషభాష§ణము లిం కేలా
జీవం బేగతి నిలువదు, పోవదు తనకర్మఫలము § పొందక తన్వీ. 174
మ
అది యె ట్లం టేనియుం జెప్పెద నాకర్ణింపుము. 175

—❀ దశరథుఁడు కౌసల్యతోఁ దనకుఁ గలిగినమునిశాపంబు చెప్పుట. ❀—

డొ
ధ్వని స్నాఁ డొక§నాఁ డేను నడురేయి, సరయూతటంబునఁ § జండచాప
నె కాపుండి § దంతావళక్రోడ, భల్లూకమహిషాది§బహుమృగంబు
శా. ఆలోలాత్త
లయేట § నొగిఁ ద్రావఁగా వాని,చప్పుడు లక్షించి § శబ్దవేధ
త్తాలాభీలవి
ము లేసి§యుండంద హింసించు, నెడనొక్క మహితాత్ముఁ§ డేఁగుదెంచి
ఖాలీలాభ్రమ
పప § ఘుమఘుమధ్వని విని, కుంభినినదబుద్ధిఁ § గోలఁ దొడిగి
గాళిందీనది దాఁ
§మడలింప వీతెంచె, హా నమ శ్శివాయ§యను నెలుంగు. 176
వ. మఱియు నానావిధ
ంది వెఱఁ§గందుచు వెండియు వింటి నొంటి నీ
నోఁపకుండం జేఁ
నంచి కతి§న ప్రదరాహతి నొచ్చితిం గదే
ాతకం బనక § యెవ్వఁడొకో యిటు లేసె నేగతిన్
చ. అటఁ జని ంక నన్ను నతి§వృద్ధులు సంధులు నై నమద్గురుల్. 177
ఘటితగులఫలమూలము, లుపవాసము లుండి తినుచు § నొగిఁ బితృసేవా
హట్టంత నుండెడినే నే, యపరాధముఁ జేసినాఁడ § నాయుధవృత్తికిన్. 178
మునికుమారుఁ డై నక§ముగ్ధు నన్నిటు సేసి, కాంచులాభ మేమి § గలుగవలసి
బాణ మేసినాఁడు § ప్రాణంబులకు నేను, వగవఁ దల్లిదండ్రు§లగతు లగుట. 179
క. కన్నులు లే వను నెవ్వగ, యెన్నఁడు మదిఁ దోఁపకుండ § నిమ్ముల నేనే
కన్నులమాత్రై యుండితి, నెన్నివిధములందు నింక § నెయ్యది గతియో. 180
సీ. జలములు దెమ్మన్నఁ § జనుదెంచి యిచ్చోటఁ, బడితి నే నిష్ఠుర§బాణనిహతి
నెఱుఁగరు మద్గురు § లీఘోరదురవస్థ, దడసె వీఁ డనుభీతి §దగిలి నన్ను
నెంత కోపింతురో § యేమని వగతురో, ధృతి నెట్లు దూలిరో § దిక్కుమాలి

రించెవ్వ రుదకంబు § లిచ్చెద రెవ్వ రె, ట్లరసెద రే నిట్టు § లైనవార్త
వినినయప్పుడప్రాణముల్ §విడువఁగలఁగు, మువ్వురముగూడ నీశిలీ§ముఖమునందుఁ
దెగితి మేమని దైవంబు§తెంపుఁ జెప్ప, నకట హాతల్లి హాతండ్రి§యనుచునడలె.

చ. అడలఁగ నీతఁ డొక్కముని § యక్కట పాపముఁ జేసితిం గదే
తొడిఁబడ బాణ మేయుటయుఁ § దూఱఁగ నాటెనె యెప్పు డీతమం
బెడలునొ చూడ నయ్యెడకు § నెప్పుడు వోదునొ నాఁగఁ జంద్రుఁ డ
ప్పుడ పొడతెంచె నామనసు§పోల్కిఁ బయోజము లుబ్బడంగఁగన్. 182

వ. ఏ నత్తరంగిణి దాఁటి తత్తీరంబున. 183

చ. విరిసినయజ్జటాభరము § విన్ననిమోము దురంతవేదనం
బొరల ధరాపరాగమున § బ్రుంగినయంగము గల్గి యమ్మహా
శర మటు దూఱ దుస్సహద§శం గలశంబున నొత్తగిల్లి నె
త్తురు దొరఁగంగ నాతురతఁ § దూలుచు నున్నమునీంద్రనందనున్. 184

క. కనుఁగొని యుల్లము జల్లన, ధనువును బాణములు వైచి § తడయక జలముల్
గొనివచ్చి మోము దుడువఁగఁ, గనుఁగవ దెఱచుటయుఁ జూచి§కడుభీతుఁడ నై.

చ. అనఘ యెఱుంగ నేను మృగ§యాపరతంత్రుఁడ నై విధాతృశా
సనమున నింతఁ గంటి నిది § సాహసకర్మము సంభవించె నా
ఘనతిమిరంబునప్పు డుద§కంబుల నీ విటు కుండ ముంప నా
నినదము హస్తినాద మని § నెట్టన నేసితిఁ దప్పు సేసితిన్. 186

వ. అనిన నమ్మునికుమారుం డల్లన యి ట్లనియె. 187

మ. అడవిం దాపసవృత్తి నున్ననను నే§యం గారణం బేమి నీ
యెడ నేయె గ్గొనరించినాఁడ నది దా § నె ట్లుండె నావార్తకుం
గొడు కొక్కండును బోయెనే యనుచు నా§క్రోశించుచుం జత్తు ర
క్కడ నయ్యంధులు మూఁడుపాతకము లిం§కం జెందు నిన్నుం బలే. 188

వ. అయినను నెఱుంగమింజేసి యేసి తింతియ కాదు పశ్చాత్తాపంబునుం గలదు
గావున నిమ్మహాపాతకంబు నీకుం గాక యుండు ననుచుం బలికి పదంపడి. 189

క. బాణవ్యథచే మేనం, బ్రాణంబులు నిలువ లేవు § బాణముతోడం
బ్రాణములు విడువఁ జన దో, క్షోణీశ్వర దీనిఁ బెఱుకు § కొంకకు మింకన్.

చ. మహితసమాధియోగమున § మద్గురు లిత్తెఱఁ గెల్లఁ గాంచి దు
స్సహ మగుచున్నశోకమునఁ § జాలఁ దపించి శపించి రేని యా
గ్రహపటురోషవహ్నిఁ గొని § కాల్చు భవత్కుల మమ్మహాటవీ
దహనము పేర్చునర్చుల ను§దగ్రతఁ గానన మేర్చుచాడ్పునన్. 191

సీ. అదిగాన మునుముట్ట § నచటికి నీకుండ, నుదకంబు కొనిపోయి § మొదల వారి
తృషఁ దీర్చి యిబ్భంగిఁ § దెగియు మీకొడు కట్టె, తప్పు సేసితి నని § చెప్పు మింక

నీగతోదకబంధ మేటికిఁ బో నిమ్ము, కడచన్న దానికి నడల వలవ
దనుమాటలకు నేను నాఘోరసాయక, మతిభీతిఁ బెలుక నయ్యతిసుతుండు
మేనుదాఁటఁగ నతనిస్మృతి కేను శోకించి, కుండతోడ నీరు గొనుచుఁ దపసు
లున్నవనము చేర నొగిఁ బోయి సుతురాక, గోరు చున్నయట్టివారిఁ గంటి.

క. అక్షివిహీనుల వృద్ధుల, నక్షములఁ దృషాతురుల ననన్యగతికులం
బక్షములు విఱిగి యొరగిన,పక్షులగతి నున్నవారిఁ బరమవ్రతులన్. 193

క. కని యల్లన కదియఁగ న, య్యనఘులు నాకాలిచప్పు డాలించుచు నో
తనయుఁడ నీ విటు తడయం, జనునే యీయున్నయేటిసలిలంబులకున్. 194

ఆ. ఏల రాఁడొ యనుచు నేను మీతల్లియుఁ, గలఁగఁబడితి మెచట నిలిచి తకట
మధ్యరాత్రి మిట్లు మసలుదురే మాకుఁ, గన్ను లన్న నీవ గతియు నీవ. 195

క. జలతృష్ణ నీదు రాకయు, తలపోయుచు నుండె నింకఁ దల్లికి నుదకం
బులు వోయు బుద్ధిచెప్పిన, నలిగినయ ట్లేల పలుక వని పల్కుటయున్. 196

ఉ. దేహము దాహముం బొరయఁ దెంపునఁ జెప్పఁ దలంచి పుత్త్రుపై
స్నేహముఁ జూచి చెప్ప నసి చెప్పక పో దని నిశ్చయంబుతో
సాహసబుద్ధిఁ జేసి మునిసత్తమ మీతనయుండఁ గా మహా
ద్రోహగరిష్ఠుఁడన్ దశరథుం డనుపేరిటిపాపకర్ముఁడన్. 197

ఉ. ఎక్కడఁ జూడఁ జెప్ప నిటు లెవ్వరుఁ జేయనియట్టిపాప మే
నొక్కడఁ జేసి మీకడకు నోడక వచ్చితి నేమి సెప్ప నీ
యెక్కుడుచీఁకటిం జలము లిమ్ముగఁ ద్రావురవంబునిక్కకుం
దెక్కలితూపు లేయుచు మదించుమృగంబులఁ జంపు చున్నెడన్. 198

వ. మీతనయుండును సరయువునం గుండ ముంప నాచప్పు డాలించి విధివశంబున.

క. అంజక తత్తటమున నొక,కుంజంబునఁ బొంచి యుండి కుంభధ్వనికిం
గుంజర మని యేసితి ముని,కుంజర నీకొడుకు నేలఁ గూలం గోలన్. 200

వ. అప్పు డక్కుమారుండు. 201

క. బాణహతి నెలుఁగుసేసినఁ, బ్రాణంబులు గలఁగఁబాఱి బాణము పెఱుకం
బ్రాణములు విడిచె ననవుడుఁ, బ్రాణంబులు జల్లనంగఁ బడి మూర్ఛిల్లెన్. 202

క. ఏమని చెప్పుదు నిట్లను,నామాటయుఁ దెగకమున్న హాపుత్త్రా యం
చామునిపత్నియు నప్పుడు, భూమిం బడియుండె రిత్తబొందియపోలెన్. 203

వ. ఇత్తెఱంగున మూర్ఛాపరవశు లయి యున్నయత్తపస్వులం జూచి చిత్తంబు
గలంగి యే నల్లన బోధింప నెట్టకేనియుం దెప్పిఱి వారు నాదెసకు దీనవదనంబు
లెత్తి నోళ్లు దెఱచుచుం బెదవులు దడుపుచు డగ్గుత్తికలు వెట్టుచు నెలుంగులు
రాల్పడ నిట్లనిరి. 204

సీ. ఏమయ్యా మాపట్టి నింతపాపము సేసి, తేమి చేసినఁ జావ నేసితయ్యా

తగునయ్య వనమునఁ దపసులమై యుండ, దయమాలి యా తెంపుఁ దలఁతురయ్య
చీకులు వట్టినఁ జేకోల యది పోయెఁ, జీకుల మెచ్చోటఁ జేరువార
మప్పుణ్యు నేసినయమ్మున మమ్మును, బడనేసి దీవన బడయవయ్య
నీదునిష్ఠురబాణంబు నెఱఁకు దూఱఁ, గాఁడి పరవశుఁడై వ్రాలుకడఁక నపుడు
తండ్రి నేమని యెలుఁగిచ్చెఁ దల్లడంబుఁ, జెంది తల్లి నేమని పిల్చెఁ జెప్పుమయ్య.
ఉ. ఆగురుభక్తితత్పరత నాపరమవ్రతనిష్ఠ నాతపో
యోగవిభూతి నొప్పెడుగుణోన్నతుఁ డుత్తమచర్యుఁ డమ్మహా
భాగుఁడు పుణ్యగర్హితవిపద్దశ కర్హుఁడె యట్టివాని కి
ట్టీగతి సంభవించె నఁట యేమని పొక్కుదు మింక నక్కటా. 206
క. మతిఁ దలఁప నొడ లనిత్యము, మృతుఁ డవుఁ గాకేమి మఱి నిమిత్తము లేదే
యతిసుతుఁ డఁట నిర్ఘాతా,యతభీకరబాణపాత మఁట బాపు విధీ. 207
వ. అనుచుం బెక్కుదెఱంగుల శోకించుచు నప్పు డత్తపోధనుండు నన్ను నుద్దేశించి.
శా. వానప్రస్థునిఁ జంపి యొక్కవడితో స్వర్ణాఘుఁడుం ద్రుంగు ధా
త్రీనాథుం డన నెంతవాఁ డట విచారింపంగ నీ కెంత నే
ర్పేనిం బోవు శిరంబు వ్రక్కలయి తప్పెక్ దప్పె నిక్కృత్య మ
జ్ఞానంబుం గడు నోడి చెప్పితివి పశ్చాత్తాపతప్తుండ వై. 209
క. కావున ని న్నే మన నిది, దైవాధీనంబ యింక ధరణీశ మముక్
వేవేగ యచటికిం గొని, పోవుట పురుషార్థ మనుడుఁ బొగులుచు వారిన్.
వ. ఏ నక్కుమారుం డున్నయెడకుం గొనిపోయి వీఁడె మీతనూజుం డనుటయుం
దడఁబాటుచేతులతోడ ధరఁ దడవి కొడుకుమీఁదం బడి మూర్ఛిల్లి కొంతదడ
వునకుం దెలిసి విలపింపం దొడంగి రంత నత్తల్లి యుల్లం బెఱియ నెలుంగెత్తి
హా యజ్ఞదత్తా యనుచుం దనూజుం బేర్కొని. 211
సీ. అక్కట నాతోడ నలిగిన ట్లున్నాఁడ, వెన్ని చీరినఁ బల్క వేల పుత్త్రి
ప్రాణమై యుండియుఁ బాసిపోయితి వీవు, ప్రాణంబు న న్నేల పాయ దనఘ
యంధుల మగుమాకు నాధార మగుచున్న,ని న్నేల నేసె నీనృపుడు వత్స
కడలేనిదైవంబు కన్నుల కిదియును, ఘన మయ్యె నేమనం గలదు తండ్రి
కూన యెట్లు నీదుగుణములు మఱతు నిం, కేమి సేయుదాన నెందుఁ జొత్తు
నిషువు నాటునప్పు డెంతభీతాత్ముండ, వైతొ పాపజాతి నయితిఁ దనయ.
చ. కొడుక శిలీముఖం బెచటఁ గూర్కొనె నిన్ను నటంచు నెత్తుటం
దడసినయక్కుచేఁ దడవి తత్ప్రదరక్షత మంటి కాలితిం
బొడవఱి పొక్కితిం బొలిసి పోయితిఁ బొ మ్మని కూర్మిపుత్త్రుపైఁ
బడి కనుమూసి కొంతవడి పల్కులుఁ జేష్టయుఁ దక్కి యుండియున్. 213
వ. విధివశంబునం దెలిసి పెక్కువిధంబుల విలపించుచుండె నంత నత్తపోధనుండు.

సీ. ననుఁ జూచి యాలింగ*నముసేయు మలుగంగ, నిన్ను నే నేమని * యన్నవాఁడఁ
జీఁకటి నేటికి * శిశువు నిన్నొక్కనిఁ, బట్టి పొమ్మన్నట్టి*ఫలము గంటి
నేతనూజున కింక * నేవేదశాస్త్రంబు, లనఘ చెప్పెదుఁ బ్రజ్ఞ * కలరి యలరి
ఫలమూలజలములు * భక్తితోఁ గొనివచ్చి, తనయ మమ్మెవ్వరు * దనుపువారు
కుశసముచ్చయంబు * కొడుక యెవ్వరు దెత్తు, రగ్నిహోత్రకలన * మట్టు లుండె
నధికవార్ధకమున * నాత్మజశోకంబు, ననుభవింప వలసె * నక్కటకట. 215

క. నిర్ఘృణతఁ గడంగి మదా,శీర్ఘటితఫలంబు నేఁడు * సేసెనొ విధి యే
దీర్ఘాయు వనుట కర్థము, నిర్ఘాతపటిష్ఠబాణ*నిహతియె పుత్రా. 216

వ. అనుచుం బనవి పనవి. 217

ఉ. హా యను నోకుమార యను * నక్కట పల్క వదేమి పుత్ర పు
త్రా యనుఁ దల్లిఁ జూడు మనుఁ * దమ్ముఁడ తూరఁగ నాటెనే యహో
ఘోరాయతసాయకం బను నృ*పాధముఁ డేటికి నేసెఁ బట్టి ప
ట్టీ యను నీకు నీగతి ఘ*టించెఁ గదే యను దైవమా యనున్. 218

వ. ఇట్లనేకప్రకారంబుల శోకించి కొడుకుం బేర్కొని వేదవేదాంగపారగులు నశ్వమేధాదిసమస్తాధ్వరకర్తలును నానాధర్మకర్మనిరతులునగునట్టియుత్తముల కేలోకంబులు గలుగు నట్టియుత్తమలోకంబులు నీకుం గలుగుంగాక యని పలికి విహితాగ్నిసంస్కారంబులు సేసి తిలోదకదానం బాచరించుటయు నయ్యజ్ఞదత్తుండును నొక్కదివ్యవిమానం బెక్కి దివ్యదేహప్రభలు వెలుంగ నింగిం బొలిచి తలిదండ్రులం గనుంగొని యోగుగులార మీకుం బరిచర్య సేయుటం జేసి నాకుం బుణ్యలోకంబులు గలిగె మీ రింక వగలం బొగుల కుండుం డవశ్యం బయ్యెడు నది యగుంగాని యొండు గానేరదు గావున నీరాజువలన నెగ్గు లేదు వీనిం గరుణింపుం డని పలికి దివంబునకుం జనియె నప్పు డత్తపోధనుండు నన్ను నుద్దేశించి యేము నిదె మాపుత్రుం గూడం బోవుచున్నారము నీవును బుత్రవియోగంబున మృతిఁ బొందఁగలవాఁడ వని నాకు శాపంబిచ్చి పత్నీసమేతుండయి ప్రాణంబులు విడిచె నే నత్తపస్వుల సంస్కరించి చింతాక్రాంతుండ నయి యయోధ్యకేతెంచితిఁ దత్ఫలంబు నేఁ డాసన్నం బయ్యె నెట్లుం డేని 219

—✿దశరథుండు పరలోకగతుం డగుట.✿—

క. కన్నులఁ జీఁకటి గప్పుచు, నున్నది వినరావు పలుకు * లుల్ల మదరఁ జొ
చ్చె న్నిలువదు మే నెలుఁగును, సన్నం బై వచ్చె నెఱుక * సాలదు నాకున్.

క. దురవస్థం బ్రాణంబులు, తిరుగుడువడఁ జొచ్చె రామ*దేవునిలీలా
దరహాసవికాసశ్రీ, కరముఖకమలంబుఁ జూడఁ * గానను గంటే. 221

వ. అని పలికి. 222

క. హా కులవర్ధన హా కరు,ణాకర హా ధర్మలోల * హా గుణనిధి హా

శ్రీకర హా జయవరల,క్ష్మీకర హా రామ యనుచు మేను దొరలంగెన్. 223

వ. ఇత్తెఱంగునం బ్రాణంబులు విడుచుటయు నతం డలసి నిద్రించుటగాఁ దలంచి కౌసల్యాదేవియుం గనుమొగిచి యుండెఁ బదంపడి సూతవందిమాగధస్తోత్రంబులును మంగళతూర్యంబులునుం జెలంగ దాసదాసీపరిచారకులు తమతమపనులు నిర్వర్తింపం బ్రభాతవేళకుం జేరి సూర్యోదయావసరం బతీతం బగుటయు నిది యేల మేల్కొనరో యీరాచవా రనుచుం జింతించుచున్నంత సర్వాకాంత లంతఃపురంబునకుం జనుదెంచి యన్నరేంద్రుపడియున్నచందంబు గని భయాతురతం గదిసి కరతలంబు లీక్షించి వక్షస్థలం బంటి యూర్పు లరసి విగతాసుం డగుట నిశ్చయించి మొగంబు లడుచుకొనుచు మహారోదనంబు సేయఁగ బెదరి నిద్ర దేఱి కౌసల్యాసుమిత్రలు పతి నేర్పడం జూచి హా రాజకుంజర హా నాథ హా భర్త యనుచు నార్తరవంబు లొలయ నాక్రందనంబు సేయుచున్న నావిధంబు విని శోకసంభ్రమంబులతోడం గైకేయియు రా నక్కడ నున్న యువిదలుం దారు నయ్యింతిమీఁదం బడి వోఁదికొనుచుఁ గైకా నీకోర్కి సఫలం బయ్యె రామచంద్రు నడవికిం బో నడిచి మగనిం జంపి తింక నీవలసినట్లు భోగింపు మనుచుం బలుక నప్పురుషభాషణంబులకుఁ దల వాంచికొనుచు వచ్చి యచ్చెలువయుం బ్రియునిపయిం బడి విలపింపం దొడంగె నాసమయంబున. 224

సీ. పతిఁ జూచి కౌసల్య పనవుచు దశరథ, క్షోణీశ నీయట్టిసుకృతి కిట్టి
మరణంబు సిద్ధించె మది దీని కేమందు, నకట నాసుతుఁ బాసినైన నీకుఁ
బరిచర్యసేయుచుఁ బదునాలుగేఁడులు, జీవంబు నొకభంగిఁ జిక్కఁబట్టి
యొకనాఁడుకడగాంతునో కోయంచునుంటి,నదితప్పెఁబుత్రమోహమునఁగీడు
పలుకు లప్పు డన్ని పలికితి ని న్నట్లు, వెడఁగ నయితిఁ గోలుపడితిఁ జుమ్ము
రాజమౌళి వీరరత్నంబు లోకాభి,రాము గుణసముద్రు రామభద్రు. 225

చ. వనమున కేఁగి నీపలు కవంధ్యము గాఁ బితృభక్తుఁ డై చిరం
తన మగుకీర్తి గాంచె గుణధాముఁడు రాముఁడు సత్యసంధుఁ డీ
జనపతి నాఁగ నీవును బ్రశంసకు నెక్కితి నాథ నాకు ని
న్ననుచితభంగి నిష్ఠురము లాడినపాపము దక్కెఁ జూచితే. 226

వ. అని యనేకప్రకారంబులం గౌసల్య శోకింప సుమిత్రలోనుగా నంతఃపురకాంత లెల్ల నడలుచుండి రంత నుదయసమయంబున వసిష్ఠవామదేవాదిపురోహితులును సుమంత్రపురోగము లయినమంత్రులును నధికసంభ్రమంబుతోఁ జనుదెంచి నానాప్రకారంబుల దుఃఖించిరి పదంపడి రఘువంశగురుం డైనవసిష్ఠుండు సర్వజనసమ్మతిం గాలోచితంబు నిశ్చయించి దశరథేశ్వరు దేహంబు తైలపక్వంబు సేయించి సింహాసనంబునం గూర్చుండఁ బెట్టి జయంతుండు మొద

లుగా నలువురుమంత్రులం బిలిచి మీరు వస్త్రాభరణంబులు గైకొని గిరివ్రజపు రంబున కరిగి భరతుం దోడ్కొని రండని నియోగించిన వారును నయోధ్య వెడలి యేడవరాత్రి నక్కేకయరాజునగరంబు సొచ్చి రంతకు మున్న సముద్రం బింకిపోవను జంద్రమండలంబు నేలం బడియుండనుం గలగని యాదుస్స్వప్నంబును సుహృజ్జనంబులతోడం జెప్పుచున్న భరతుం గాంచి మ్రొక్కి తమ తెచ్చిన యుపాయనంబు లిచ్చి దేవా వసిష్ఠుండు మహాకార్యంబు గలిగి మమ్ముం బుత్తెంచె నీ వయోధ్యకు విచ్చేయవలయు నని విన్నవించుటయు నాదూతలచేష్టలకు భీతిల్లుచుఁ గేకయనాథుకడకుం జని యత్తెఱం గెఱింగించి యన్నరేంద్రు వీడ్కొని శత్రుఘ్నసహితుం డయి కదలి సప్తరాత్రంబులకుఁ బురంబున కేతెంచి యంతిపురంబు సొత్తెరం దల్లి యెదురుగాఁ బఱతెంచి యాలింగనంబు సేయుటయు నద్దేవికి నమస్కరించి కేకయపతి పుత్తెంచినయాభరణంబు లిచ్చి వారిసేమం బెఱింగించి పదంపడి యిది యేమి రాజమార్గంబు లమంగళావృతంబు లై యున్నయవి నగ రేల శూన్యం బై యున్నది సంతోషనాదంబు లేల వీతేవు నామనంబు గలంగెడు నెల్లవిధంబుల భద్రంబుల కదా యిట్లునికికిం గారణం బేమి యనుటయు నక్కైక యిట్లనియె. 227

—భరతశత్రుఘ్నులు రామునివనగమనాదులు విని యడలుట.—

సీ. వసుమతీపతి రెండువరములు మును నాకు, నిచ్చినయవి గల వేను వాని
నొకట నీపట్టంబు నొక్కట రాముని, విపినవాసముఁ బోల వేడికొంటి
సంతసంబునఁ దండ్రి సత్యంబు పాలింప, జానకీలక్ష్మణసహితుఁ డగుచు
నారాఘవుం డేఁగె నడవికి మృతుఁ డయ్యెఁ, బుత్రశోకంబున భూవిభుండు
నిష్ఠురంబు లెల్ల నీకొఱ కి ట్లేను, గట్టికొంటి నింక గారవమునఁ
బట్టి పూను రాజ్యపట్టంబు నా మూర్ఛ, వచ్చి వ్రాలి కొంత వడికిఁ దెలిసి.

క. కనుఁగవ నిప్పులు రాలఁగఁ, గనలుచు భరతుండు గైకఁ గనుఁగొని యారా
మునిఁ గాంతారంబునకుం, జను మన నెట్లాడె నోరు చయ్యన నీకున్. 229

చ. అడవుల రామచంద్రుఁడు జటాజినముల్ ధరియించి యుండ నేఁ
బుడమి భరించి భోగములు పొందఁ గలానకొ యిట్టిచొప్పు లే
మెడఁ గల వింక నన్ను మొగ మేమి తెఱంగునఁ జూతుఁ బాపపుం
గడుపునఁ బుట్టి యీభువనగర్హకుఁ బాత్రుఁడ నైతి రాక్షసీ. 230

క. నాచిత్తవృత్తి యెఱిఁగియు, నాచరితము గనియు రామునకు ద్రోహింగా
నీచమతి యెగ్గుసేసితి, వోచెల్ల మనంబు నొచ్చెనో రఘుపతికిన్. 231

వ. దీనికి సుమిత్రాపుత్రుండు నామీఁద నెంత కోపించెనో నీనిమిత్తంబున నిన్ని చేటులు పుట్టె నీ వొక్క రక్కసునకుం బుట్టఁబోలుఁ గేకయరాజబీజం బింత కేల తొడంగు నీవు పాపజాతివి పతిహంత్రివి నీతో సంభాషింపం దగ దని పలుక

నప్పలుకులు వాకిటం బొంచి వినుచున్నమంథర నంతఃపురకాంతలు శత్రుఘ్ను నకుం జూపి దీనిదుర్మంత్రంబున నీయనర్థంబు లిన్నియుం బాటిల్లె ననవుడు నతండు రోషావిష్టుం డగుచుఁ బెలుచ దానిం బడఁదాఁచి కేలం గడకాలు వట్టి మీఁది కెత్తి జిఱజిఱం ద్రిప్పి నేలతో వ్రేసి ఖడ్గంబు దిగిచి యంకించుచుం దొలం గుం డిద్దురాత్మురాలితల ద్రుంచెద ననుచుఁ గైకకుం గవిసినం దత్పరిచారికలు వాఱి కౌసల్యాదేవిమఱువు సొచ్చి రప్పు డాభరతుం డోహో శత్రుఘ్ను మన మీపాపజాతిం జంపిన మాతృహంత లని రామచంద్రుండు మనమొగంబులు సూడండు గావున నీపుణ్యహీన తనదురితంబునఁ దాన పోవుంగాక దాసీవధం బును నర్హంబు గాదు దీన నేమి గలుగుఁ బోవ నిమ్మనుచు నలుక వారించి య తం డనుజసహితంబుగాఁ బోయి కౌసల్యాసుమిత్రలయడుగులం బడి రోదనంబు సేయుటయు నయ్యగ్రసవిత్రియుఁ బుత్రులం గనుంగొని. 232

తే. భరత మీతల్లి పతి బందె । వట్టి నీకు, రాజ్యపట్టంబునకు వేఁడి । రాము నడవి
కనిచెఁ దద్వియోగమున గ । తాసుఁ డయ్యె, నృపుఁడు నీ వింక నెమ్మది । నేలవేలు.

సీ. అనవుడుఁ గడు నొచ్చి । యతఁడు కౌసల్యతో, నారామునకు ద్రోహి । నైతి నేని
నభిషేకలక్ష్మికి । నాససేసితి నేనిఁ, గైక గావించిన । కపటకర్మ
విధ మెఱింగితి నేని । విప్రుఁ జంపినవాని, గతికి గుర్వంగనా । గామిగతికిఁ
గల్లు ద్రావినవాని । గతికి సువర్ణాప, హరణంబు సేసిన । యతనిగతికి
భండనమున నోడి । పాఱినయాపంద, గతికిఁ బోదు నాదు । కడిఁదిశపథ
ములకు సాక్షు లఖిల । మునులు దివ్యులు భూజ, లానిలాంబరాన । లార్కశశులు.

వ. అని పలికినం బృథివ్యాదిమహాభూతంబు లితనిపలుకులు సత్యంబు లనునెలుం గులం జెలంగెఁ గౌసల్యాసుమిత్ర లప్పు డప్పుత్రులం బట్టుకొని సంకులాక్రంద నంబులు సేయ నప్పుడు వసిష్ఠుండు వారి వారించి యంతఃపురంబునకుం దోడ్కొ నిపోవుటయు నప్పు డక్కుమారులుం దండ్రికళేబరంబు సూచి మూర్ఛ వొంది వసుంధరం బడి రంతఁ గొంతసేపునకుం దెలివొంది భరతుం డెలుఁగెత్తి యోరా జకుంజర యోదివాకరాన్వయరత్నాకరసుధాకర యోదశరథేశ్వర కేకయరాజు మీకుఁ బుత్తెంచినభూషణంబులు దెచ్చినాఁడ వీని నేల కైకొనవు నాతోడం బలుక వేను గైకకొడుకఁ గాన సంభాషణార్హుండఁ గానో యిదె చూడు శత్రు ఘ్నుండు ధరిత్రిం బడి పొరలుచు ధూళిధూసరితాంగుం డయి యున్నవాఁ డితని నాలింగనంబుసేసి లీలం గేల సమ్మార్జనంబు సేయ వేల నేము రామునకు ద్రోహు లము గామేల యనాదరణీయుల మయితి మనుచుం బనవి పనవి హాహాకారంబు లెసఁగ రోదనంబు సేయ ననేకభంగుల బోధించి యాసమయంబున. 235

తే. భరతుఁ జూచి యారఘువంశ । గురుఁడు నీవు, తండ్రికగ్నిసంస్కారాది । తంత్ర మింక
ననఘ నడపంగవలయు శా । స్త్రార్థసరణి, ననుడు నగుఁగాక యనిలక్ష్మ । ణాగ్రజుండు.

వ. మఱునాఁడు సకలమునులను రాజులను రప్పించి వసిష్ఠుం బురస్కరించుకొని దశ
రథేశ్వరునికళేబరంబు దివ్యాంబరాభరణగంధమాల్యంబుల నలంకరించి కోటి
సంఖ్యాకంబు లగుమహిమగోగజాశ్వాదిదానంబు లొనర్చి సువర్ణవిమానంబునం
బెట్టుకొని యారాజశవంబుపిఱుందం గౌసల్యాదికాంత లాక్రందనంబు సేయుచుం
జనుదేర ముందట నగ్నిహోత్రాగ్నిఁ గొని భరతుండు వసిష్ఠాదిపురోహితులు
తోడం గూడిరా శత్రుఘ్నసమేతుం డయి నడచి యయోధ్యానగరంబు వెడలి
సరయూతటంబున సొద పేర్చి యం దారాజశవ మిడి త్రేతాగ్నుల నయ్యాయి
మంత్రంబుల విహితావయవంబులఁ బెట్టి స్రుక్స్రువాదియజ్ఞాంగంబుల నర్హాంగ
కంబులఁ జేర్చి వేదోక్తమార్గంబున దహించి తిలోదకదానం బాచరించి నగరి
కేతెంచి విహితద్వాదశాహకృత్యంబులు నిర్వర్తించి కృతకృత్యుం డయ్యె నంత
ననంతరదివసంబున. 237

తే. సకలనృపమంత్రిమునిలోకసమ్మతమున
భరతుఁ గనుఁగొని రఘువంశగురుఁడు రాష్ట్ర
మి ట్లరాజక మై యున్న నెగ్గు దొడరుఁ
గాన నీ వింకఁ బట్టంబు గట్టికొనుము. 238

చ. అనవుడు సైఁప కి ట్లనియె నక్కట ప్రాకృతుఁ డాడునట్టు లో
మునివర నీవు మత్కులసముజ్జ్వలధర్మముఁ జూడ కాడె దే
మని విననేర్తు వీఁ డల దురాత్మకురా లగు కైకనందనుం
డనునది దక్క నాదుమన మారసి యొండొకతప్పు చెప్పుమా. 239

శా. రాముం బుణ్యగుణాభిరాము నెలమిం బ్రార్థించి తో డ్తెచ్చి ది
క్సీమాతిక్రమణక్షమాన్వయలసత్కీర్తుల్ వెలుంగొంద ను
ద్దామశ్రీ కభిషిక్తుఁ జేయుదు రఘూత్తంసంబు రాకున్న నా
భూమీశాగ్రణిఁ గొల్చి నిల్తు నటవీభూమిం దపోవేషి నై. 240

వ. అని పలుక సభాసదులు శిరఃకంపంబు సేయ నక్కుమారుండు. 241

ఉ. మాతలు మూవురున్ సకలమంత్రులుఁ బార్థివులుం బురోహిత
వ్రాతము నవ్వసిష్ఠమునివర్యుఁడు దమ్ముఁడుఁ దోడ రా గజా
శ్వాతతసర్వసైన్యయుతుఁ డై పురి వెల్వడి యేఁగుదెంచి గం
గాతటినీతటిన్ విడియఁ గా భరతుం డనువార్త మ్రోసినన్. 242

వ. వినిగుహుండు సంభ్రమంబున శృంగిబేరపురంబు వెల్వడి తత్సైన్యంబుఁ గనుంగొని.

సీ. క్రూరతఁ గైకేయికొడుకట్లు తమతల్లి, చేసినయది మున్ను చెల్లెఁ గాన
యంత నె యుండ కి ట్లారాజపరమేశు,పై నెత్తిపోయెడిఁ బాపచింత
ననుబుద్ధిఁ దనసైన్య మాయితమై యుండఁ, గావించి రేవులు గట్టఁ బనిచి
యేతెంచి భరతుతో ని ట్లని పలికె న,క్కట మహారాజ్యభోగములు విడిచి

తండ్రిపనుపు నెఱపఁ దపసియై యడవికి, నేఁగి యున్న రాఘవేంద్రువెనుక
సకలసేనతోడఁ జనుదెంచుచున్నాఁడ, వింత సేయ నాతఁ డేమి సేసె. 244

ఉ. తమ్ముఁడుఁ దాను నోంటిఁ బడి తాపసులై వనభూమి నుండఁగా
నిమ్ములఁ గిట్టి పట్టి వధియింపఁగఁ బోవుచు నున్నవాఁడ వా
యమ్మకుఁ బుట్టినాఁడ వఁట యక్కట సీతలఁ పేమి సెప్పని
న్నిమ్మెనతోడఁ బోవిడుచనే గుహుఁ డిప్పుడు సూడు మంతయున్. 245

క. నీసేన విఱిగి పోవఁగ, నాసురగతి నెత్తువఱద లడరఁగఁ బటుబా
ణాసారము చూపెద బా,ణాసన మనుఘోషభీషణాభ్రమువలనన్. 246

తే. ఏను నమసిన వెనుక నీ వేఱు దాఁటు, మనినరోషోక్తులకు సస్మితాస్యుఁ డగుచు
రాముఁ బట్టముఁగట్టఁ గిరాతనాథ, తోడితేఁ బోయెదనుగాని ద్రోహిఁగాను.

వ. అనిన విని సంతోషించి గుహుండు మ్రొక్కి రామచంద్రుండు విడిసినయింగుదీ
తరువును బర్ణతల్పంబును జడలు ధరించినచోటునుం జూప భరతుండు సూచి
విలపించుచుఁ బదంపడి శత్రుఘ్నసమేతుం డయి తానును జటాభారంబు గై
కొని గంగాతరంగిణి దాఁటి యక్కిరాతపతిచేతఁ ద్రోవఁ జూపించుకొనుచు
నతని వీడ్కొని భరద్వాజాశ్రమంబునకుం జని యమ్మునీంద్రునకు నమస్కరిం
చుటయుం గోపంబున నత్తాపసోత్తముం డిట్లనియె. 248

శా. క్షోణీరాజ్యము నీకు నిచ్చి మునియై ఘోరాటవీవాటి న
క్షీణక్షాంతి వహించి యుండఁగ మహాసేనాసమేతుండవై
ప్రాణద్రోహము సేయ నేఁగెద వొకో పాపాత్మ యిట్లాజగ
త్త్రాణుం డల్పుఁడె కైక తల్లియఁట నింకదం బొంద నీ వోడుదే. 249

చ. అనవుడు నప్డు డాభరతుఁ డమ్మునిపుంగవుకోపచిహ్నముల్
గనుఁగొని భీతుఁడై నృపశిఖామణి రామునిఁ దోడితెచ్చి భూ
వనితకు నాథుఁ జేయుటకు వచ్చుట గాకిటు ద్రోహచింత నా
మనమున లేదు నాకు నిట మార్గము సూపు తపోధనోత్తమా. 250

తే. అనిన ముద మంది మునినాథుఁ డతనిఁ గాంచి
తగినవిందులు సేయ నద్దాశరథియుఁ
జిక్కి యారాత్రి మఱునాఁడు చిత్రకూట
శిఖరితెరువు భరద్వాజుచేత నెఱిఁగి. 251

వ. అమ్మునీంద్రు వీడ్కొని చనియె నంత నక్కడ సీతాసమేతుండై రామచంద్రుండు
చిత్రకూటాద్రియందు విహరించుచుండి తత్సేనాకలకలంబునకు బెదరి కనుకనిం
బాఱుగజమహిషవరాహశార్దూలాదిమృగంబులం జూచి యవ్వల నాలోకించి
ధరాపరాగపటలంబునుం గాంచి లక్ష్మణా యిది యేమొకో మృగంబు లాకులార్త
రవంబులతోడం బఱవం దొడంగె నద్దిక్కునం బెంధూళి యెగసెం జూడు మన

నతండును నధికసంభ్రమంబున నొక్కయుత్తాలపాదపశిఖారోహణంబు సేసి యుత్తరపథంబునం జతురంగబలాకీర్ణం బగుమహాసైన్యంబు గనుంగొని మఱియు నేర్పడం బరికించి. 252

—భరతుఁడు చిత్రకూటంబున కరుగుదెంచుట.—

చ. తరణికులప్రధానబిరుదధ్వజపంక్తులఁ జూచి సేనతో
భరతుఁడు దాడివెట్టి తముఁ బట్టఁగ వచ్చుటఁ గాఁ దలంచి ని
ష్ఠురగతి లక్ష్మణుండు ఘనచుంబిమహీరుహశాఖనుండి య
గ్గిరి యగలంగ డిగ్గ నుఱికెం గులిశాతతపాతమో యనన్. 253

వ. ఇట్లుఱికి యోరామచంద్రా భరతుండు సేనాసమేతుం డయి మనమీఁద వచ్చుచున్నాఁడు నీవుం గవచంబు ధరియించి బాణాసనసన్నద్ధుండవు గమ్ము కాదేని వైదేహిం దోడ్కొని గిరిగహ్వరాంతరంబున కరుగుము నీశాంతియ నిన్నింత చేసె నింక సైరింప నతనిప్రాణంబులు గొందు ననిన విని రాఘవేశ్వరుండు కోపించి నాకుఁ దమ్ముండ వై యుండియు నింతవినయశూన్యుండ వై నీచోక్తులేల యాడెదవు నీకంటె వాఁడు నాకు భక్తుండు మనల నయోధ్యకుఁ గొనిపోవు తలంపున వచ్చువాఁ డయ్యుత్తమునిచిత్తవృత్తి యెఱుంగవు సంభ్రమం బుడుగు మనిన నమ్మాటలకు వెఱచి సుమిత్రాపుత్రుండు లజ్జావనతవదనుం డయి యుండె నాసమయంబున. 254

తే. దూరమున సేన నిల్పి శత్రుఘ్నుతోడఁ
బాదచారి యై చనుదెంచి పర్ణశాలఁ
గాంచి భరతుండు విపులశోకమునఁ గనదు
హృదయ మెరియుచు నుండంగ నిట్లు లనియె. 255

సీ. మహనీయమణిమయమందిరంబుల నుండు, ప్రభుఁడు నేఁ డున్నాఁడు పర్ణశాల
మెత్తనిపాన్పున మే నొత్తుసుఖ నేఁడు, తనువు సేర్చినవాఁడు దర్భశయ్య
లలితమాల్యంబులు లలిఁ బూనుపతి నేఁడు వలనొప్పఁ గయికొన్నవాఁడు జడలు
మృదులాంబరంబుల మెఱయుపుణ్యుఁడు నేఁడు, వలనొప్పఁ గట్టినవల్కలములు
కోరి రాజన్యలోకంబుఁ గొల్చురాజ, మౌళిమణి నేఁడు మునిసేవ మరగినాఁడు
వలసె నా కిప్పు డీదురవస్థ చూడఁ, గైకకడుపునఁ బుట్టినకారణమున. 256

వ. అనుచుఁ బర్ణశాల సేరం జనుదెంచి రామునిం గని తదంఘ్రిపురోభాగంబున ననుజసమేతుం డయి దండప్రణామంబులు సేసిన నారఘుపుంగవుండు నక్కుమారయుగళంబునుం గ్రుచ్చి యెత్తి యక్కునఁ జేర్చి యాలింగనంబు సేసి గారవించెఁ బదంపడి. 257

క. జనకజకు సుమిత్రానం, దనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితిదర్భా
సనముల నుండఁగ రఘుపతి, యనుజన్ములఁ జూచి సేమ మారాజునకున్.

—✿ రామచంద్రుండు దశరథునకుఁ దిలోదకాదు లిచ్చుట. ✿—

వ. అనిన విని డగ్గుత్తికవెట్టుచు దేవా మీరు విచ్చేసినయేడవదివసంబున భవద్వియోగశోకాతురుం డయి భూలోకపతి లోకాంతరంబు నొందె నని పల్కుటయు నప్పలుకు లశనిపాతఘోషంబునుం బోలెఁ గర్ణపథంబునం బడిన రామచంద్రుండు మూర్ఛాపరవశుం డయ్యె జనకరాజపుత్రియు సౌమిత్రియు మృతిఁ బొందిన యట్లుండి రంతఁ గొంతదడవునకుం దెలిసి లక్ష్మణాగ్రజుం డనేకప్రకారంబుల విలపింపం గనుంగొని. 259

క. భరతుం డిట్లనియె నరే,శ్వర ప్రాకృతునట్లు తాల్మి వ్రయ్యఁగ శోకా
తురతం బొందక ధర్మ,స్థిరతం బితృఋణము నీవు దీర్పఁగ వలయున్. 260

వ. అనినం దెలివొంది మందాకినియందు సీతాలక్ష్మణసమేతంబుగా స్నానంబు లాచరించి తిలోదకంబు లిడి విహితద్వాదశాహకృత్యంబులు నడపి బదరీఫలమిశ్రితంబు లగునింగుదీయవపిణ్యాకంబులం బిండంబులు వెట్టి కృతకృత్యతం బొంది పర్ణశాల కేతెంచి తమ్ములం బట్టికొని రోదనంబు సేయఁ జిత్రకూటాశ్రయు లైనమునులును యక్షగంధర్వకిన్నరకింపురుషులు నేఁగుదెంచి వారిశోకంబులు వారించి రాసమయంబున వసిష్ఠుండు కౌసల్యాదిమాతలం దోడ్కొనివచ్చిన వసుధాపుత్రీసమేతుం డయి రఘువరేణ్యుండు సవిత్రులయడుగులం బడి దెసలద్రువ రోదనంబు సేయుటయు నచ్చటియతులధృతులు గలంగఁ గౌసల్య కొడుకులం గోడలి నెత్తి కౌఁగిలించుకొని యత్తలోదరితో రోదనంబు సేయ నచ్చట నున్నగరుడగంధర్వకిన్నరకింపురుషాదికాంతలు దురంతదుఃఖంబులం బొగులు చున్నసీతం గనుంగొని. 261

క. జనకుండు తండ్రి దశరథ,జననాథుఁడు మామ రామచంద్రుఁడు విభుఁ డ
య్యును నీయబల విపద్భా,జన మైనది దైవగతి కసాధ్యము గలదే. 262

క. అని శోకించుచుఁ గైకం, గనుఁగొని యిప్పాపజాతి కారణమున ని
వ్వనితారత్నమునకు ని,వ్వనవాసాయాస మొందవలసె నటంచున్. 263

వ. పలుకుచుండి రనంతరంబ వసిష్ఠువచనంబుల వారు శోకం బుడిగి చిత్రకూటాచలవాసు లగుమునీంద్రకిన్నరకింపురుషగరుడగంధర్వవిద్యాధరులతోడ యథోచితాసనంబులం గొలువుండి రప్పుడు సభామధ్యంబున నున్నయన్న నవలోకించి కేలు మొగిచి భరతుం డిట్లనియె. 264

సీ. ఒకపాము మోవంగ నోపునా భూమిని, బార్థివు ముంజేతిబలిమి గాక
యిల కెల్ల దలదండ చెలియలికట్టయే, రాజాజ్ఞ నబ్ధి పైరాదు గాక
వేదంబులా వర్ణవృత్తి కాధారంబు, జనపతిపాలనశక్తి గాక
యినరశ్ములా వెలుంగీలోకమున కిడు, దీప్రతేజోదీపదీప్తి గాక
గొడుగు విఱిగిన ధారుణి గూలు నబ్ధి, మేర దప్పు వర్ణాశ్రమాచార ముడఁగుఁ

గలయ దిఙ్మూఢ మగు నట్లు గాక యుండ, భూరిధారుణీభారంబు పూను మధిప.

తే. దేవ కైకేయి కీడు చింతించి పాప
నింద కింతయు రోయక నిన్ను నడవి
కరుగు మని యన్నమాటకు నరుగ ధర్మ
మగునె విచ్చేయు మీ తెంపు దగునె సేయ. 266

ఉ. నీ దగు రాజ్యలక్ష్మి ధరణీవర యేను ధరింపఁ జాల ని
త్యోదయసంపదల్ వొదలు చుండఁ బ్రజాపరిపాలనక్రియా
పాదనలీలతో భువనభారము పూనఁగ నేఁగుదె మ్మయో
ధ్యాదయితత్వ మన్యులకు నర్హము గా దటు గాక తక్కనన్. 267

—భరతుఁడు రాముపావలు గొని నందిగ్రామంబున వసియించుట.—

వ. ఇదె మీముందటఁ బ్రాయోపవేశంబు సేయుదు నని దర్భాస్తరణశాయి గా
నున్న నన్నరేంద్రుం డెత్తి యాతమ్మునిం గౌఁగిటం జేర్చి యిది యేమి భరతా
మనకులాచారధర్మంబులు విచారింపక యాడుచున్నావు నాయట్టికొడుకు దశ
రథునట్టితండ్రిసత్యంబు పాలింపఁడేని లోకం బెట్లు నడచు నేను వ్రతంబు సం
పూర్ణంబైనమీఁద నయోధ్యకు వచ్చెద నీచలం బుడుగు మనవుడు రావణవధం
బు గోరుచున్నకిన్నరకింపురుషగరుడగంధర్వమునీంద్రాదు లనాగతవృత్తాంతం
బెఱింగి యవ్వాక్యంబులకు సంతోషించి రక్కుమారుండును జింతాక్రాంతుం డ
గుచు మొగంబు వాంచిన వసిష్ఠుండు రామచంద్రునితో ని ట్లనియె. 268

చ. భరతుఁడు భక్తియుక్తి నినుఁ బ్రార్థన సేయుచు నున్నవాఁడు నీ
వరయఁగ భక్తవత్సలుఁడ వట్లగుటం గృపతోడ మేదినీ
భరము భరింప నీతొడుగుపాదుక లానతియిమ్ము నావుడున్
గురువచనంబు మీఱక రఘుప్రవరుం డటు సేసి తమ్మునిన్. 269

చ. ప్రియ మడరంగ వీడుకొలిపెఁ మది నప్పుడు రామచంద్రుని
శ్చయము తెఱంగెఱింగి రఘుసత్తముచిత్తము నొచ్చు నంచుఁ దా
భయమున నొత్తి యొండొకటి పల్కక సానుజుఁడై దివాకరా
న్వయపతికిం బ్రదక్షిణము వచ్చి నమస్కృతిసేసి భక్తితోన్. 270

వ. భరతుం డుచితప్రకారంబున వీడుకొని మస్తకంబున నప్పాదుకలు ధరియించిచని
శత్రుంజయం బనుపట్టపేనుంగుకుంభస్థలంబునం బెట్టి తానును శత్రుఘ్నుండును
నిరుగెలంకుల ఛత్రచామరంబులు ధరియించి సమస్తపరిజనంబులుం దానును
జిత్రకూటంబు వెడలి భరద్వాజుని కంతవృత్తాంతంబునుం జెప్పుచు గుహున
కెఱింగించుచు నేతెంచి యయోధ్యానగరంబు సొచ్చి తల్లుల నంతఃపురంబునకుం
బుచ్చి మూలబలంబు నగరికాపు వెట్టించి రామశూన్యం బగునప్పురంబున నుండ
రోసి సమస్తమంత్రిజనానుమతంబున నందిగ్రామంబున. 271

చ. అఖిలనృపాలలోక మరు । దంద నిజాన్వయకీర్తిచంద్రికల్
నిఖిలము గప్పి యొప్ప నయ । సిర్భరతఁ భరతుండు పాదుకా
ముఖమున రాజ్యభారము స । ముజ్జ్వలభంగి వెలుంగ భూప్రజా
సుఖము లొనర్చుచుండె గుణ । సుందరుఁ డగ్రజుశాసనంబునన్. 272

వ. అక్కడ రామచంద్రుండును జిత్రకూటాశ్రమవాసు లయినమునులం దగ నా శ్రయించి సమాధానంబున నుండి భరతుండు మగిడి పోయినవెనుక నచ్చటిము నులు నయనభ్రుకుటిసంజ్ఞలం దనవల నుపలక్షించుచు నొండొరులం గదిసి మంత నంబు లాడం గడంగినం దలంకి యీసంభ్రమచేష్టితంబుల కేమికారణం బొకో యని విచారించి వితర్కించి కృతాంజలి యగుచుం గులపతి యగుమునివరుం గనుంగొని. 273

చ. అనఘ మదీయవర్తనము । నం దొకదోషము గన్నవారొ నా
యనుజుఁడు లక్ష్మణుండు తన । కర్మము గానిగతిం జరించెనో
జనకతనూజ నాకుఁ బరి । చర్యలు సేయుతఱిం దపస్విని
జనపరిచర్య లేమఱెనొ । సంభ్రమకారణ మేమి సంయముల్. 274

క. అనుడుఁ దపోవృద్ధుం డ, మ్మునివర్యుఁడు రాముతోడ । ముదిసినచందం
బునకుం దగ వడఁకుచు ని, ట్లను నోహో నీచరిత్ర । మట్టిదె తలఁపన్. 275

శా. నీయం దింతయుఁ గీడు లేదు ముని వై । నీ విమ్మునిశ్రేణితో
ధీయుక్తిం జరియింతు నీయనుజుఁడున్ । ధీరుండు సౌమిత్రి దా
నాయుష్మంతుఁడు సర్వసాధుజనస । మ్యక్చారుచారిత్రుఁ డా
ర్యాయత్తం బగువర్తనంబు గలక । ల్యాణాకరుం డారయన్. 276

చ. రఘువర యివ్వనాంతమున । రాక్షసు లుండుదు రిమ్మునీంద్రు ల
మ్మఘవదరాతిబాధ లిట । మాన్చువిచారము సేయుచున్నవా
రఘచరితుండు గర్వితస । హాయుఁడు రావణుతమ్ముఁ డెంతయున్
లఘుమతి భీకరాకృతి గ । లండు ఖరుం డన నొక్కఁ డిక్కడన్. 277

వ. అద్దురాత్ముండు జనస్థానంబున నుండుఁ దదీయనియోగంబున నిశాచరు లాశ్ర మాంతగహనాంతరతరుమూలంబుల నొదిఁగి హోమకాలంబుల హుంకార భయంకరాట్టహాసంబు లెసంగ ఘోరాకారంబులు సూపి యనేకప్రాణిహింస లుసేయుచుఁ గర్ణమూలంబుల బిట్టార్చుచు స్రుక్స్రువమృద్భాండంబులు పాఱవై చుచు హావిర్భాగంబుల శోణితంబు గలుపుచుఁ గుశకుసుమసమిత్కలశాదు లెత్తికొని పోవుచు నిట్లు తపోధనబాధ లొనర్చుచుండుదు రిది కారణంబుగా ని చ్చోటు పాసి యొండెడకుం బోవుతలంపున నాతో నాలోచనంబు సేయుచున్న వారు నానావిధకందమూలఫలంబులం బొలిచి యనతిదూరంబున నొక్కపురా తనతపోవనం బున్నది యవ్వనం బాశ్రయించెద మిది రాక్షససమీపంబు నీ

వునుం జనుదెంచు టొప్పఁ గళత్రంబుతోడ నిట నొంటి నిలుచుట యుచితం
బు గా దని పలికి తమ్ముం దగువాక్యంబులం బెక్కుదెఱంగుల నిలువఁ దలంపు
గొన్న రఘునందనుల నోడంబఱిచి కులపతి మునిగణసమేతుం డయి చనియెం
దదనంతరంబ. 278

క. మరగినబాలమృగంబులు, దిరుగుడువడు తెఱంగుఁ జూచి § ధృతి గలఁగఁగ న
న్నరపతి బహువిధముల నచ, టెరవయి మునిశూన్య మగుట § నింపకయున్నన్.

క. భరతుఁడుఁ దల్లుల బంధులఁ, బురజనులం గూడి వచ్చి § భూపతి లోకాం
తరగతుఁ డగు టెఱిఁగించిన, నెరి సెడినది దలఁప ధైర్య § మెడలెడి నిచటన్.

—రాముఁ డత్రిమహామునియాశ్రమంబు చేరుట.—

క. నాకంటెను సౌమిత్రికి, నీకంజాక్షికి రుచింప § దిక్కడ భరతా
నీకనివేశనమున న, స్తోకాశ్వద్విపకరీష § దూషిత మగుటన్. 281

వ. అని విచారించి రామభద్రుండును జిత్రకూటంబు విడిచి యత్రిమహామునియా
శ్రమంబునకుం జనుదెంచి సీతాలక్ష్మణసమేతుం డగుచు నమ్మునీంద్రునకు నమ
స్కరించిన. 282

క. అత్రియుఁ బ్రేమ నటించుచుఁ, బుత్రునిగతిఁ జూచి యధిక § పూజలఁ దగ న
మ్మిత్రకులాగ్రణి కొసఁగి సు,మిత్రాసుతు సీతఁ గరుణ § మెయి మన్నించెన్. 283

తే. విహితకృతు లి ట్లొనర్చి స § న్మహితచరిత,సిద్ధ సహవృద్ధఁ బత్ని నీ § క్షించి రాజ
పత్ని యగునీయశస్విని § బరమసాధ్వి, సీతమన్నింపు కోర్కులు § సెలఁగ నెలమి.

వ. అని పలికి రామచంద్రుం గనుంగొని. 285

సీ. ఏకమానమున నీ § రేడువేలబ్దంబు, లత్యుగ్ర మగుతప § మాచరించి
యనసూయ మనువ్రత § మతినిష్ఠఁ జరియించి, తదభిధానంబుచేఁ § దగ వెలింగెఁ
బదియేఁడు లిలఁ జిన్క § పడకున్న ఫలమూల,కందముల్ గల్పించి § గంగఁ బఱపె
వేల్పులు దగ వచ్చి § వేఁడిన వర మిచ్చి, రాత్రులు పది యొక్క § రాత్రి చేసె
నీమహాతపస్విని భూత § హితచరిత్ర, బ్రహ్మచారిణి యీపుణ్య § భాగ నింక
రామ కౌసల్యఁబోలె నీ § రాజతనయ, కొలుచుఁ గా కన్న రాఘవ § కుంజరుండు.

మ. మునివాక్యంబులు వింటె జానకి మనో § మోదంబు సంధిల్ల నీ
వనసూయన్ భజియింతుగాక భవది § ష్టావాప్తికై నావుడుం
జని వాతూలవిధూయమానకదలీ § స్తంభంబుచందంబునం
దనుకంపంబున నొప్ప దుస్తరతప § స్తప్తాంగి నత్తాపసిన్. 287

క. కని యేను జనకనందన, ననుచుం బ్రణమిల్లి తల్లి § యడిగెదఁ గుశలం
బనిన నగుఁ దల్లి సేమం,బున జనకుం డున్నవాఁడె § ముదమే నీకున్. 288

ఆ. బంధుజనుల విడిచి § సింధురగామిని, రాము వెనుక ని ట్లరణ్యమునకు
వచ్చి తిచట సుఖమె § నిచ్చలు ధర్మని,రీక్షణంబు సేయు § దే మృగాక్షి. 289

వ. అని వెండియు. 290

తే. ఒక్కమన్ననతో నున్న § నొల్లకున్నఁ, గరము నెయ్యుఁడై యున్నను § గాకయున్న
మగఁడు ప్రియతముఁడనియుండు § మానవతికి, నెల్లలోకసుఖంబులు § నెదురువచ్చు.

క. నడవడి యొప్పక యుండినఁ, గడునిర్ధనుఁ డయినఁ బతియె § గతియును విను మె
క్కుడుబంధుండును బ్రియుఁడుం, బడఁతులకుం బరమగురుఁడుఁ § బరదేవతయున్.

తే. ఇంతి శీలదోషంబుల § నిట్టిపతికి, నతివ లెవ్వరు ప్రతికూల § లయి చరింతు
రమ్మహాపాపవతులు దు § ర్యశము నొంది, కూలి కాంతు రధోలోక § ఘోరగతుల.

క. పతిపరిచర్యాపరిణత, గతి లోకము మేలు కీడు § గనియుండు పతి
వ్రతలు నినుఁబోనిగుణవతు, లతులితసుఖకీర్తు లెందు § నందుదు రబలా. 294

ఉ. నావుడుఁ బత్నికిం బతియ § నమ్మినబంధుఁడు నిష్టదైవముం
గా వివరించి మజ్జనని § గారవ మారఁగ మున్ను సెప్పె నా
కీవిధ మత్తగారుఁ గృప § యేర్పడ నానతియిచ్చి రిష్టు మీ
చే విని ధన్య నైతి విల § సిల్లె మనంబు మహాతపస్వినీ. 295

ఉ. నుత్యము లైనజన్మములు § నూఱును వేమఱు సేసినం దప
స్సత్యశమక్షమాదిగుణ § సంపదతోడ వనైకవాసు లై
నిత్యసమాధియోగమున § నిల్చిన నేరికిఁ బొందవచ్చునే
పత్యనుకూల లైనకుల § పాలిక లందెడుపుణ్యలోకముల్. 296

చ. పతియెడ రెండు లేక కుల § భామలు తా రతఁ డెట్టిఁ డైన న
న్మతిఁ జరియించు టొప్పు నని § నం గమనీయచరిత్రుఁడుం గృపా
న్వితుఁడు జితేంద్రియుండు నతి § నిర్మలధర్మయుతుండు సూనృతో
ర్జితుఁడును రాముఁ డీరఘువ § రేణ్యుని నేగతిఁ గొల్చు టొప్పదే. 297

క. విను కౌసల్యకుఁ దక్కన, జననుల కతిభక్తి నొక్క § సరి యై నడచుఁ
జనపతి యొకపరి ముట్టిన, వనజాక్షులఁ దల్లి నొక్క § వడువునఁ జూచున్. 298

వ. అని వెండియు. 299

క. గుణవతి సావిత్రియు స, త్ప్రణుత యరుంధతియు ధర్మ § పరిణత రో
హిణియుఁ గనుట పతిశుశ్రూ, షణమునన కదా సదాయ § శస్సౌఖ్యంబుల్. 300

వ. మఱియుం గొండ ఱిట్టిపతివ్రతలు పతుల నచలమతుల నారాధించి తమతమధర్మం
బుల నుత్తమలోకంబు లందుచుండుదు రిదియును మాయత్త యెఱింగించినట్టిది
యనిన ననసూయ సీతతోఁ బతిభక్తిమాహాత్మ్యవిషయం బై నీచెప్పినవాక్యంబు
లొప్పు నీధర్మనిర్మలచరితంబునకు సంతోషించితి నీకుం బ్రియం బయ్యెడివరం
బిచ్చెద ననుటయుఁ గరంబులు మోడ్చి యచ్చెలువ నిల్చుటయుం బదంపడి. 301

చ. ఇదె యొకకుంకుమంబు కమ § లేక్షణ యిచ్చెద సర్వమంగళా
స్పద మగు నివ్విలేపనము § శశ్వదలంకృతి మేని కంచుఁ జెం

పొదవ వినూతనాంబరసకముజ్జ్వలభూషణపూర్వకంబుగా
ముదమున నిచ్చి యిం పలర క ముద్దియతో మునిపత్ని యి ట్లనున్. 30

—॥ సీతాదేవి యనసూయతోఁ దనవివాహవృత్తాంతము చెప్పుట. ॥—

క. నిను రాముఁడు వరియించుట, విని యుండుదుఁ గొంత యంతకవృత్తాంతంబు
జనకజ నీచే నిప్పుడు, వినఁ గోరెదఁ జెప్పు మనుడు క వేడుకతోడన్. 30

తే. రాజధర్మంబు మెఱయ భూకరక్షణంబు, సలుపుచుండి మజ్జనకుఁడుకజనకుఁ డెలవి
సకలసహధర్మచారిణీకసహితుఁ డగుచు,నుచితకర్మంబునకు నేఁగికయొక్కనాఁడు

క. ఝుణఝుణితకనత్కంకణ, మణిమయమంజీరజనితకమంజులశింజా
రణితనభోభాగనిరీ,క్షణ మల్లన నేసి మేనకకం బొడగాంచెన్. 30

క. కని యయ్యచ్చరరూపం,బున కచ్చెరు వంది యధికకపుణ్యుఁడఁ గానే
యనపత్యుఁడ నగునే ని, వ్వనజాననయం దపత్యకవంతుఁడ నైనన్. 30

తే. అనుచుఁ దలపోయ నీకు నికత్తనులతాంగి,వలన సమరామణీయకకవై భవంబ
వెలయుమాన సాపత్యంబుకగలుగునిప్పు,డనుచువీతెంచెనొకవాక్యకమాకసమున

క. జనపతియును నవ్వాక్యము, విని యలరుచు బీజముష్టికవిక్షేప మొన
ర్చు నెడం బృథ్వీగర్భం,బునఁ బుట్టితిఁ దదనురాగకభూషిత నగుచున్. 30

వ. ఇవ్విధంబున మేదిని భేదించుకొని జనియించిననన్నుం గనుంగొని మజ్జనకుండ
విస్మితుఁ డగుచు నెత్తికొని యపత్యస్నేహానందంబు నంద మఱియు నాకా
వాణి యి ట్లనియె. 30

క. సీతాపద్ధతి నీసుత, భూతలమునఁ బొడమెఁ గాన క భూతి దలిర్పఁ
సీత యనుపేరు భువి వి,ఖ్యాతంబుగ నుల్లసిల్లు క నని పల్కుటయున్. 31

ఆ. కురిసెఁ బుష్పవృష్టికసురదుందుభులుమ్రోసె, జనకుఁ డప్పు డధికకసంభ్రమము
మహితచరిత యగ్రకమహిషిచేఁ గూఁతుఁగా, బెంపనిచ్చె నన్నుఁకప్రియముతోడ

వ. అంత నొక్కనాఁడు. 31

క. ఏనును బరిణయయోగ్యం, బై నవయౌవనరముఁ బొందుకనప్పుడు నాకుఁ
మానవనాథుఁడు తగువరుఁ, గానక చింతించి బుద్ధిఁ క గని మంత్రులతోన్. 31

క. సీతాస్వయంవర మ్మని, భూతలమునఁ గలుగుసకలకభూపాలురకుం
బ్రీతి నెఱిఁగింపఁ బుచ్చుట, నీతి యనుచుఁ జేసెఁ గార్యకనిశ్చయము మదిన్.

వ. ఇట్లు కార్యంబు నిశ్చయించి సమస్తరాజన్యుల రప్పించి తానును మున్ను జన్న
బొనరించుసమయంబున నధికసత్త్వసంపన్ను లగువారు పదివేవురు మోచి
చ్చినయొక్కమహనీయకోదండంబును నక్షీణబాణతూణీరంబులును వరుణనిక్షి
ప్తంబు లయి నిజమందిరంబునం దేజరిల్లువాని నమ్మనుజపతులకుం జూపి యిక్కా
ర్ముకం బొక్కచేత నెత్తి యెక్కిడి తెగఁ దిగువం జాలుభూపాలున కిత్తు నాకూ
తు నని పలుకుడు నచ్చాపం బుపలక్షించి యిది ధరాధరదుర్ధరం బని మ్రొక్క

చుందు రంతఁ గతిపయదినంబులకు విశ్వామిత్రసహితుం డయి యమ్మహాభా
గుం డేఁగుదెంచి దశరథసఖుం డై నమజ్జనకునకు నమస్కరించినం గుశలం బడిగిన
యనంతరంబ యుచితకథాప్రసంగంబు లాడి మంత్రులం గనుంగొని. 315

ఉ. ఒక్కశరాసనంబు వినియుండుదు మిచ్చట నెట్టిచాపమో
యెక్కిడఁ దివ్యలోకమున నేరికి రాదఁట చూచువేడ్క మా
కెక్కుడు నావుడున్ విని నరేంద్రుఁడు సంతస మంది మంత్రులుం
దక్కినబంధులోకము ముదంబునఁ బొందఁగ నీరఘూత్తమున్. 316

ఉ. తోడ్కొని వచ్చి శక్రగజతుండమహాపరిఘాభిరామ మై
చూడ్కికి వింత యైనవిలు చూపుడు నయ్యురుశింజినీకమున్
వేడ్కయుఁబోలె లీల రఘువీరుఁడు దాపలికేల నెత్తె న
మ్మాడ్కి ధరింప నెవ్వరికి మానము గానిధనుర్లలామమున్. 317

తే. ఎత్తిచూపఱు వెఱఁగంద నెక్కుద్రోచి, వేడ్కఁ దెగ దివ్వ నవ్విల్లు విఱుగుచప్పు
డశనిగతి యైన మూర్ఛిల్లి రచటిజనులు, జనకకౌశికరామలక్ష్మణులు దక్క.

వ. తదనంతరంబ మాతండ్రి సంతోషంబునం బొదలి రఘుపతిభుజబలంబు ప్రశంసిం
చి నీ వింక నిక్కన్యం బరిగ్రహింపు మని పలికిన దశరథానుమతంబు వలయు
ననుటయు నమ్మహీపతి రావించి నన్నిరాజన్యునకు ధర్మపత్నిం జేసి నాచెలియలి
నూర్మిళ నీసుమిత్రాపుత్రునకు నిచ్చె నని యిట్లు స్వయంవరప్రకారంబు సెప్పిన
నమ్మునిపత్ని సీతపలుకు లాలించి పదంపడి భానుమండలం బపరశిఖరిశిఖరతిరో
హితం బగుటయుఁ గనుంగొని. 319

చ. చెలఁగఁ దొడంగె నీడములఁ జేరి విహంగము లాశ్రమాంఘ్రిపం
బుల కుదకంబు వోసి మునిపుత్రులు వచ్చెద రోలి వేదికా
తలములఁ బొందెదున్ మృగవితానము లబ్జిని నిద్రవోం దెడిం
దెలువుల మ్రింగుచుం దమము దిక్కులఁ గప్పెడి నంత కంతకున్. 320

క. కలయ నిశాచరసత్త్వం,బులు దిరిగెడు హోమధూమపుణ్యామోదా
మిళితానిలములు మెలఁగెడు, వెలిఁగెడుఁ జుక్కలును దోఁచె విధుమండలమున్.

ఉ. ఇంక లతాంగి రాముకడ కేను గనుంగొనుచుండఁ గుంకుమా
లంకృత వై వినూతనవిలాసముతోఁ జను మన్న నంగరా
గాంకితకాంతి నొప్పెసఁగి యమ్మునిపత్నియుఁ జూచుచుండ న
ప్పంకరుహాక్షి వచ్చి జనపాలున కంత తెఱంగు చెప్పినన్. 322

క. విని సతి నవసౌందర్యముఁ, గనుఁగొని మది నలరి నృపశిఖామణి యయ్యా
మిని నచటఁ బుచ్చి వేగినఁ, జనుదెంచి కృతాగ్నిహోత్రసమయం బయినన్.

చ. మునిచరణాంబుజంబులకు మ్రొక్కిన దీవన లిచ్చి తండ్రి యి
వ్వనభువి ఘోరరాక్షసు లవారితు లై చరియింతు రిత్తపో

ధనులు పలార్థమై చనుపథంబున నేమఱి కేఁగు మన్యకా
ననమున కన్న నత్తపసినాయకు వీడ్కొనె సమ్మదంబునన్. 324

ఉ. రాజకిరీటకీలితవిరాజితనూతనరత్నరాజినీ
రాజనమంగళాచరణరంజితపాదసరోజ ఖడ్గధా
రాజయలభ్యమానరుచిరద్యుతిమన్మణిశాతకుంభ వి
భ్రాజితసద్వితీర్ణ రిపుపార్థివఖండన కీర్తిమండనా. 325

క. భూరిభుజార్గళలసదసి, ధారాచలితప్రతాప దహనమహోదు
ర్వారశిఖాంతరనిపత, ద్వైరారికుమారశలభ విక్రమసులభా. 326

మా. వినయగుణవిశాలా విశ్రుతాచారలోలా
వినుతశుభచరిత్రా విద్వదంభోజమిత్రా
ఘనవిజయధురీణా కామినీపంచబాణా
కనకకుధరధీరా కాచమాంబాకుమారా. 327

గద్యము. ఇది సకలకలావిశారద శారదాముఖముకురాయమాణసారస్వత భట్ట
బాణనిశ్శంక వీరమారయకుమార కుమారరుద్రదేవప్రణీతం బయిన శ్రీరామా
యణంబునం దయోధ్యాకాండంబు సర్వంబు నేకాశ్వాసము. 328



శ్రీ ర స్తు.

# భా స్క ర రా మా య ణ ము.

## ఆ ర ణ్య కాం డ ము.



హిత నయవిలసితవా
ణీహితమృదువచన ధారుణీహితగుణసం
దోహ త్రివిక్రమవిక్రమ
సాహస నగధైర్యసార సాహిణిమారా. 1

ఉ. పుణ్యచరిత్రుఁ డత్త్రిమునిపుంగవు వీడ్కొని రాముఁ డంచితా
గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునం జని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమివిరాజితచారుతపోనుజాతస
త్పుణ్యము నిర్మలాంబువరపుష్కరపూర్ణసరోవరేణ్యమున్. 2

మ. కని బాణాసన మెక్కిడించి ధరణీకాంతుండు కాంతారమం
డనకల్పం బగునాశ్రమాంతతరువాటం బప్డు సొత్తేరఁగా
మును లేతెంచి నమస్క్రియామహితులై మోదంబుతో మీర లీ
దిన మిచ్చో వసియింపుఁ డన్నఁ జని రాత్రిధ్యార్థ మప్పార్థివుల్. 3

వ. తదనంతరంబ తపోధను లుచితసత్కారంబుల వారలం బూజించి వినయంబున.

ఆ. నృపతి దలఁపఁ బూజనీయుండు మాన్యుండు, దండధరుఁడు గురుఁడు ధర్మనేత
పతియు శరణదుండు బంధుండు గావునఁ, దండ్రి మమ్ముఁ బ్రోవఁదగుదు వీవు.

క. జననుతుఁడై జనవల్లభ, జననాయకుఁ డింద్రునందుఁ జతురంశములం
గొని ప్రజలం బాలింపను, ననుపమభోగంబు లంద నగ్గుం డెందున్. 6

తే. ఊర నున్న వనంబున నున్నఁ బ్రజల, నియతి రక్షింప శిక్షింప నృపుఁడె కర్త
యేము నీయేలునిలను నింపెసక మెసఁగ, మునికి నీచేత రక్షణీయులము వినుము. 7

వ. అనుచు నభినందింప రఘువరుం డారాత్రి యచ్చట నిలిచి మఱునాఁడు మునుల
నామంత్రణంబు సేసి వారిచే నెఱింగినపథంబున. 8

* క. కాకోలవ్యాకులమును, ఘూకాకులభీకరంబు ఘోరమృగవ్యా
ళాకరమును ఝిల్లీనిన, దాకర్ణనదుస్సహంబు నగు పేరడవిన్. 9

---

*క. నృపచూడామణి రాఘవుఁ, డపరిమితక్రోడమహిషవారిభల్లూక
ద్వీపశరభచండగండక, విపులమహావిపినములఁ బ్రవేశించి తగన్. అని పా.

చ. అనుజుఁడు సీతయుం బిగుల ♦ హర్షమునం జనుదేరఁ బద్మలో
చనుఁడు రఘూద్వహుండు మృగ♦సంఘములన్ నిజచాపశింజినీ
ధ్వనులఁ దొలంగఁ దోలి సుప♦థంబుగఁ జేయుచు నేఁగి ముందటం
గనియె మహామునీశ్వరని♦కాయనివాసతపోవనంబులన్. 10

తే. కనియుఁ దమ్ముఁడు దానును ♦ గార్ముకంబు
లెక్కు లటు డించి వినతులై ♦ యేఁగి మ్రొక్కి
చేరి మును లెల్లఁ బూజింప ♦ గారవమున
నచట నారాత్రి నిలిచి య♦హర్ముఖమున. 11

క. జనపతి ప్రియ మెసలారఁగ, మునివరులకు నెల్లఁ జెప్పి ♦ మ్రొక్కుచుఁ దగ వీ
డ్కొని జనకరాజపుత్త్రియు, ననుజన్ముఁడు గదిసి తోడ ♦ నరుదేరంగన్. 12

చ. చని చని దట్టమై యిసుము ♦ చల్లిన రాలనిఘోరకాననం
బునఁ గని రొక్కచో నెదుర ♦ భూధరసన్నిభకాయు నుగ్రలో
చను నతిదీర్ఘదంష్ట్రుఁ గర♦సంభృతశూలుఁ గఠోరనాదగ
ర్జనభయదాట్టహాసు ముని♦సంఘవిరోధు విరాధు నుద్ధతున్. 13

—శ్రీరాముఁడు విరాధునిఁ జంపుట.—

సీ. శరభసింహవ్యాఘ్ర♦చయములగుదులు భు, జాభీలశూలము♦నందుఁ గ్రాల
దౌడల నిరుదెసఁ ♦ దనరి వక్రములైన, బలితంపుఁగోఱల♦తెలుపు నిగుడఁ
దపనరథాంగవృ♦త్తములైనకన్నుల, నెండ చండంబుగా ♦ నిండి పర్వఁ
*గహకహ యనియెడు ♦ కటికిచప్పుడు పర్వు, చప్పుడు బ్రహ్మాండ ♦ మప్పళింప
సమదభంగిఁ గదిసి ♦ జానకిఁ బట్టి శీ, ఘ్రముగఁ జంకఁ దాల్చి ♦ రభసగమన
చరణఘాతచలిత♦సర్వంసహాచక్రుఁ, డగుచు రాముఁ గదిసి ♦ యార్చి మఱియు.

వ. క్రోధంబున విరాధుం డిట్లనియె. 15

క. ధనురస్త్రఖడ్గధారుల, వనితాసహచరుల ధర్మ♦వర్తనుల మిముం
దునుముదు నెత్తురుద్రావుదు, నను వినరె విరాధు ననుచు♦నవ్వుచు మఱియున్.

క. మునిమాంసభోజినై యి, వ్వనమునఁ జరియింతు నేను ♦ వచ్చినమాయా
మునులం బిమ్ము సహింతునె, వనితారత్నంబు మనుజ♦వర యర్హంబే. 17

వ. అని పలుకునిశాచరునంకోపరిభాగంబునం బవనవేగంబునం గదలుకదలివి
ధంబునం బులిబారిం బడి బెగడుహరిణికరణిఁ గంపంబు నొందునక్కురంగన
యనం గనుంగొని దీనవదనుం డయి కౌసల్యానందనుండు సుమిత్రానందనున
కిట్లనియె. 18

చ. ఘనతరకార్ముకంబుఁ బటు♦కాండచయంబును గేల నుండ నా
తనువునఁ బ్రాణముం గలుగఁ ♦ దమ్ముఁడ యిద్దశ పొందెఁ జూచితే

* కహకహ యనియెడు ♦ కంఠనిర్గత మైన, చప్పుడు బ్రహ్మాండ ♦ మప్పళింప.

జనకతనూభవం బరమసాధ్వి నిరంతరభాగ్యలీలలం
దనరినమత్ప్రియన్ దశరథక్షితినాథునముంగుఁగోడలిన్. 19

క. అని పలికి వినుము లక్ష్మణ, జనకజదైన్యంబు సూడఁ § జాలుటకంటెన్
ఘన మగుశోకము నాకెం,దును లేదంబ ప్రియ మందఁ § దొఱఁగెడఁ దనువున్.

తే. ధరణిరాజ్యముగోల్పాటుఁ § దండ్రిచావు, నిష్టబంధువియోగంబు § దుష్టయాతు
నిష్ఠురారణ్యవాసంబు § నేఁడు నాదు, దేహదాహంబు సేసె వైదేహికతన. 21

మ. అని బాష్పాకులలోచనుం డగుచు దైన్యం బొందునన్నం గనుం
గొని సౌమిత్రి మహాభుజంగముగతిం § గ్రోధోగ్రనిశ్వాసము
ల్దనరం గంపముతోడ నిట్లనియె నేలం గూల్చెదన్ వీని నే
విను మీతుచ్ఛుఁడు నీకు నెంత తలఁపన్ § వీరోత్తమగ్రామణీ. 22

తే. నాఁడుభరతుపైఁ బుట్టినవేఁడికోప, మగముపై వజ్రి వజ్రంబు § నిగుడఁజేయు
నట్లు నేఁడు వుచ్చెద నిద్దురాత్ముమీఁదఁ,దఱుచుకీలాలధారలు § ధరణిఁ దొరఁగ.

చ. కనలుచు రుక్మపుంఖవిశిఖంబుల నేడిట వానివక్షమే
సిన నవి యుచ్చి పాఱి తదసృక్పరిషిక్తము లై వెలింగె వాఁ
డును వడి వైచె నార్చుచుఁ గదుం బెనుమంటలు మింట నెక్కొనం
గనదురువిస్ఫులింగములు § గ్రక్కుమహాశనిఁ బోలుశూలమున్. 24

తే. అదియు సౌమిత్రి కభిముఖం § బగుచు నిగుడఁ
గనలి రాముఁడు దాని ముత్తునియలుగను
రెండుబాణము లెడ నడరించి యొక్క
కడిఁదివాలమ్ము వానివక్షమున గ్రుచ్చె. 25

వ. మఱియును. 26

శా. సక్రోధుం డయి రాముఁ డప్పుడు భుజాసంరంభ మొప్పార వ
జ్రక్రూరాస్త్రము లైదు శీఘ్రముమెయిన్ § సంధించి నానామను
ష్యక్రవ్యాదు విరాధు నేయుటయు వక్షం బుద్ధతిం గాఁడి ని
ర్వక్రక్రీడఁ బగిల్చి యుచ్చి చనినన్ § వాఁ డంతఁ బో కుద్ధతిన్. 27

వ. జానకి డించి. 28

మ. కదియం బాఱి నృపాలసూనులభుజాగర్వంబు గైకోక బ
ల్లిదుఁడై డగ్గఱి యుగ్రరోషమున దోర్వల్లీలాసముల్లాసి యై
పొదువం బట్టి వహించె మూఁపుల మహాభూమీధ్రశృంగంబులం
దుదయాదిత్యుఁడు నిందుఁడున్ వెలుఁగున § ట్లొప్పారి రయ్యోద్ధతిన్. 29

ఉ. అత్తఱి మిన్ను ముట్టినమహాసురుమూఁపులు గ్రుంగ లావుమై
నొత్తిన వాఁడు నొచ్చియు మహోద్ధతితో నతిఘోరమూర్తి యై
యెత్తుకపోవఁగా నృపతి § యేఁగఁగ నిమ్మొట కేఁగెనేని వీఁ

డెత్తెరు వేఁగె నత్తెరువ యిష్టము పో మన కంచు నుండఁగన్. 30

క. కనుఁగొని జానకి దానవు,ఘనబలమునఁ జిక్కి రనుచుఁ గాకుత్స్థునిఁ ద
మ్మునిఁ బనవి యధికశోకం,బున మూర్ఛిల్లుటయుఁ. జూచి పొగు లొదవి వెసన్.

స్ర. సంభూతక్రోధఘోరజ్వలనపరిగతస్వాంతు లై విస్ఫురత్సం
రంభం బెసార రామప్రభుఁడు ననుజుఁడున్ రాక్షసాధీశుబాహు
స్తంభంబుల్ ద్రుంచి ఖడ్గోగ్రతరుచు లెసఁగన్ దాఁటి రవ్వైరి గూలెన్
శుంభద్దంభోళిధారాచ్యుతవిపులగురుక్షోణిభృత్పాతభాతిన్. 32

వ. ఇవ్విధంబునం గూలియు ననేకజంతువులతోడం గూడ నచ్చేరువ భూరుహంబులును బొదలును జదియం బొరలునయ్యసురం బొలియింపమి కర్జంబు గా దని కదిసి నిర్ఘాతపాతవజ్రప్రహారంబులంబోనిపిడికిళ్లను జానుకూర్పరఘాతంబులను నొప్పించినం బ్రాణవ్యయసమయంబున వాఁడు తలయెత్తి రఘునందనుం గనుఁగొని పేరెలుంగున మీ రెవ్వ రెచ్చోటి కరుగుచున్నవారు నావుడు నన్నరేంద్రుం డేము సూర్యకులవరేణ్యుం డగుదశరథునితనయులము రామలక్ష్మణు లనువార మని చెప్పి నీ వెవ్వండ విట్లు ఘోరాకారంబు గైకొని యీమహారణ్యంబునం జరియింపఁ గారణం బేమి మా కెఱింగింపు మనిన నారాక్షసుం డి ట్లనియె.

క. జననాథ యేను దుంబురుఁ, డనుగంధర్వుఁడను రంభ కనురక్తుఁడ నై
మొనసి తనుఁ గొలువ మఱచిన, ధనదుఁడు శపియించె నంతఁ దనువిదియయ్యెన్.

మ. పటుశాపాహతి యస్మదీశుఁడు భవద్బాణంబు ప్రాణంబు లో
క్కొటఁ దూలించిననాఁడు గల్గు ననుచుం గోపోపశాంతిం బరి
స్ఫుటనాదంబునఁ బల్కెనాఁ డది రఘుక్షోణీశ సిద్ధించె నా
డట నేఁ గ్రమ్మఱ నీనిమిత్తమున గంధర్వత్వముం బొందెదన్. 35

చ. ఇచటికి సార్ధయోజనసమీపమునన్ శరభంగుఁ డున్నవాఁ
డచలతపోవిభూతి గలయమ్మునిముఖ్యుఁడు గారవించి మి
మ్ముచితవిధంబులం బ్రియము లొందఁగ జేయుఁ దదాశ్రమంబునం
బ్రచురకుతూహలంబు జనపాలతనూభవ మీకుఁ జేకుఱున్. 36

ఉ. ఏను మదీయలోకమున కేఁగెద నింక నరేంద్రచంద్ర యీ
మే నధికప్రయత్నమున మేదిని నొక్కెడఁ బాఁతిపెట్టఁగా
నానతియిమ్ము లక్ష్మణుని కంచుఁ గరంబులు మోడ్చి మ్రొక్కుచున్
ఫేనిలరక్తపూరములు పెల్లుగ ముక్కున నోరఁ గ్రక్కుచున్. 37

శా. రక్షోదేహము వీడి తుంబురుఁడు పూర్వస్థానముం బొంద రా
మక్షోణీపతిపన్పునన్ వనమహీమధ్యంబునం దొక్కచోఁ
నిక్షేపించె వృకాదిసత్త్వములకు న్భేదింప రాకుండఁ ద
ద్రక్షాగాధకృతావటంబున సుమిత్రాపుత్త్రుఁ డగ్గాత్రమున్. 38

వ. తదనంతరంబ రఘువరుండు జనకనందనం దేర్చి లక్ష్మణుం గనుంగొని. 39

చ. ఇది కడుఘోర మైనవన మిక్కడ నక్కడఁ దాపసోత్తముల్
మెదలరు దుష్టరాక్షసనమీపము గావున నింక నిందు ని
ల్చెద మనరాదు తుంబురుఁడు సెప్పినయాశరభంగునాశ్రమం
బది మనకున్ నివాస మగు నందుల నేఁడు వసింత మిమ్ములన్. 40

వ. అని పలికి. 41

మ. ధరణీపుత్త్రిఁ బ్రమోదపూరభరితాత్మం జేసి నానావిధా
ధ్వరసంగున్ శరభంగుఁ జూచుటకుఁ జిత్తం బుత్సవం బొంద భా
స్కరవంశాగ్రణి యేఁగి కాంచె నచటన్ జంభారి రంభాదిని
ర్జరనారీకరచామరోద్భవమరుత్సంచారలోలాలకున్. 42

సీ. హరితవర్ణము లగునశ్వసహస్రంబు, పూనినవరదివ్యయాన మొప్ప
నిరువదియేనువత్సరములప్రాయంబుఁ, బాయనిసురకోటి బలసి కొలువ
సాంద్రచంద్రాతపచ్ఛాయలఁ జల్లుచు, ధవళాతపత్త్రంబు దనరి మెఱయఁ
గనుఱెప్పవెట్టని తనవేయికన్నులు, నెఱివిరిదమ్ములనెరసు దెగడ
నమరనయ్యింద్రుఁ జేరంగ నరుగఁదలఁచు, రాము నెన్నిక మెఱిఁగి సుత్రాముఁ డరిగె
నధికవనవాసపరిగతాయాసఖిన్ను, నిమ్మహాత్ముని నిటు చూడ నేల యనుచు.

తే. అంత శరభంగుఁ జేరంగ నరిగి రామ, చంద్రుఁ డమ్మునిపుంగవుచరణములకుఁ
బ్రణతుఁడై నన్మునీంద్రుండు ప్రణుతితోడ, నర్చనములీయఁగైకొని యతనిఁ గొలిచి.

—శరభంగమహామునిదర్శనము.—

వ. ఉన్నయెడ నమ్మునీశ్వరుం డతనితో ని ట్లను సురేశ్వరుండు దన్నుఁ బరమతపో
లబ్ధం బైనయుత్తమలోకంబునకుం దోడ్కొని పోవం జనుదెంచుటయు నేను
భవదీయాగమనం బెఱింగి నీకు నాతిథ్యం బొనరింపం దలంచి నిలిచితి నిఖిలలోక
పూజ్యుండ వగునిన్నుం బూజించుటకంటెఁ గర్తవ్యం బెయ్యది యెయ్యది గోరిన
మత్తపోబలంబునం గల్పించి నీకు సమర్పించెద ననుటయు రామచంద్రుండు. 45

క. మునివర నీవు కరుణ ననుఁ, గనుఁగొనుటయ చాలు నింతకంటె శుభం బెం
దును గలదె మీయనుగ్రహ,మున సర్వము నాకు సులభములయే ప్రొద్దున్.

క. ఇయ్యడవిలోన నిలువఁగ, నెయ్యెడ తగు మాకు నచ్చొ టెఱిఁగింపుఁడు నే
నయ్యెడన నిలిచి కొలిచెద, నెయ్యంబున నచటిమునుల నిచ్చలు ననినన్. 47

క. ఘనపుణ్యుండు సుతీక్ష్ణుం, డనుముని యెఱిఁగించు మీకు నర్హం బగున
వ్వన మమ్మునియావాసం,బును నిన్నది దాఁటి యరుగఁ బొడగాన నగున్. 48

చ. అని యెఱిఁగించి యయ్యనఘుఁ డగ్నిముఖంబున నింద్రుపీటికిం
జనియె రఘూద్వహుండు నిట జాహ్నవి దాఁట నెదుర్కొనెం దపో
వనవనజాకరప్రకరవారిరుహోత్పలసౌరభావళీ

వనరుహవల్లరీకుసుమవాసితమందసుగంధవాయువుల్. 49

వ. తత్సమయంబున. 50

సీ. అక్కాననఁ గలిగిన యఖిలతపస్వులు, చనుదెంచి శ్రీరామచంద్రుఁ గాంచి
యమ్మహీపాలుండు ననుజుండు సీతయు, మ్రొక్కిన దీవించి ముద మెలర్పఁ
గొనియాడి యోరామ గుణధామ మమ్ము నీ, వరయంగ వలదె యీ యడవిలోనఁ
దాపసవర్యులఁ బాపాత్ము లగుదైత్యు, లుడుగక చంపఁగఁ దొడరి రనినఁ
జాల శోకించి యమ్మహీపాలుఁ డనియె
నెచట దైత్యులు మెలఁగెద రచటఁ గదిసి
పీచ మడఁగింతు మీ కెట్లుఁ బ్రియము సేయఁ
గనుటఁ బోలునె వేఱొక్క పనియు మాకు. 51

క. అని పలికిన మును లందఱు, ననుపమమోదమునఁ బొంది రమ్మాటలు మా
నినపిదప సీత రాముని, వినయంబునఁ జేరి యొరులు వినకుండంగన్. 52

క. ఘోరముగ నిట్లకారణ, వైరముఁ బూనంగఁ దగునె వసుధాధిప యీ
యారణ్య లయినదనుజుల,తో రాయిడిఁ గొనుట మేలె దోర్గర్వమునన్. 5

క. పగ యెట్టివారిమనముల, వగఁ బుట్టింపంగఁ జాలు వలవనివైరం
బగునే పూనఁగ నెందును, జగతీశ్వర హింస దలఁప సద్ధర్మంబే. 5

సీ. మునిపతి యొక్కండు ముదమునఁ దప మర్థి, నాచరింపఁగ విఘ్న మాత్మలోఁ
నూహించి సురపతి యొకరాజరూపుఁడై, యడిదంబుఁ జేకొని యరిగి మ్రొక్కి
యిదె యేను బోయి వచ్చెద ఖడ్గ మందాఁక, నిది పట్టుఁ డని చేతి కిచ్చి చనిన
నతఁ డూర కుండక యయ్యసి జళిపించి, వేడ్కఁ దీఁగలు చెట్లు వ్రేయఁదొడఁ
నంతకంతకుఁ దద్వ్యసనాతిశయతఁ, గ్రూరమతి జీవహింసావిహారలీలఁ
దిరిగి దుర్జయుఁడై పోయె నరవరేణ్య, వింటి నీకథ నొకవృద్ధవిప్రుచేత. 5

ఉ. నీవు కృపావిధేయుఁడవు నిష్ఠ మెయిం దప మాచరింపఁగా
నీవనభూమి సొచ్చి యిటు లేటికిఁ గ్రూరత నీకు మున్ను దై
త్యావళి కీడు సేసెనె జనాధిప యన్న నతండు ప్రీతి న
ద్దేవిహితంబు భక్తియు నుతించి సతీ విను మేను జెప్పెదన్. 5

ఉ. శిష్టహితంబు దుష్టజనశిక్షయుఁ జేయనిరాజు రాజె యు
త్కృష్టతపస్వికోట్లను వధించునిశాటులఁ జంపకుండినం
గష్టత రాదె నాకు గుణగణ్యావు ధర్మపథంబు నీకు న
స్పష్టమె యిట్టు లేల యనఁ బంకరుహాయతచారులోచనా.

క. అని యొడఁబడఁ జెప్పి మహా,మునిసంఘముతో సుతీక్ష్ణమునిపాలికిఁ దా
జనపతి చని మ్రొక్కినఁ ద,ద్వినతికి దీవించి యతఁడు వికసితముఖుఁడై.

ఉ. ఎంతయుఁ బ్రీతితోఁ గదిసి యెత్తియుఁ గౌఁగిటఁ జేర్చి నిర్మల
¹స్వాంతుని నమ్మహీవిభుని సంభ్రమ మొప్పఁగఁ బూజసేయ న
త్యంతముదంబునన్ నిలిచి తద్దిన మమ్మునియింట విందు లై
రంతఁ బ్రభాత మైన మును లందఱుఁ గ్రంగుగఁ జేరి రామునిన్. 59

ఉ. రామ శమాభిరామ రఘురామ యశోధనకామ దోర్బలో
ద్దామ యనేకనామ నృపతారకసోమ సమగ్రశౌర్యసు
త్రామ పటుప్రతాపబలధామ వినిర్జితకామ సద్గుణ
స్తోమ తపోవనస్థలులఁ జూడఁగ ర మ్మిటు మాకు విందవై. 60

క. అని యొక్కొకదిన మొక్కొక,ముని తమతమ నెలవులకుఁ బ్రమోదంబునఁ దో
డ్కొని చని సంభావింపఁగ, ననఘుఁడు చరియించె సతియు ననుజుఁడుఁ దానున్.

చ. పరమతపస్వు లిమ్మెయిఁ దపఃఫలదాయకుఁ డైన యమ్మహీ
శ్వరుఁ గని యిట్లు సంతతము సంభ్రమముం దళుకొత్త నన్నరే
శ్వరుఁ గొనియాడి రవ్విభుఁడు సన్మునికోటుల నెల్లఁ గొల్చుచుం
దిరిగి యనేకదైత్యుల వధించుచుఁ బేర్మిఁ జరించె నెల్లెడన్. 62

—మందకర్ణి మహాముని కథ.—

క. ఇత్తెఱఁగునఁ దిరుగుచు రాజోత్తముఁ డొకచోటఁ గనియె యోజనదీర్ఘా
యత్తమగుకొలఁకుఁ గనుఁగొని, యత్తోయములందు వినియె నంచితరవముల్.

వ. ²మఱియును. 64

శా. వీణానిక్వణనం బవార్యనినదావిస్పష్టభూషామణి
శ్రేణీమంజులశింజితంబును సుధాసిక్తోల్లసద్గానముం
వేణుక్వాణముఁ దా నదృష్టజన మై వీతేరఁగా నారఘు
క్షోణీనాథుఁడు విస్మితుం డగుచుఁ దత్కోలాహలం బారయన్. 65

1. స్వాంతమతిన్ మహీపతికి సంభ్ర.

1. 64...70-వ పద్యములకు మాఱుగా వ్రాఁతప్రతులపాఠము—

మ. 'విని యన్నిటికి నెట్లు గల్గెనొకో యీవీణానినాదంబు గా
యనినాదంబును నన్న నానృపునితో నచ్చోట వర్తించుస
న్మును లిచ్చో మును మందకర్ణుఁ డనుపుణ్యుం డొప్పి చేసెం దపం
బు నిరాహారుఁడుఁ బంచతప్తుఁడును నంభోమగ్నదేహుండు నై.

చ. అనిమిషకన్య లేను రమరాధిపుపంపున వచ్చి కొల్చి ర
మ్మునివరు నాతఁడుం గడుఁ బ్రమోదమునన్ విహరింపఁ గోరి యీ
ఘనసలిలాశయం బిచటఁ గల్గఁగఁ జేసె జలాంతరంబునం
దనుపమరమ్య మై తనరుహర్మ్య మొనర్చెఁ దపోబలంబునన్.

క. ఈనీటినడుమ బయల న,మానుషతేజంబుతో నమర్త్యస్త్రీలుం

వ. తదుపాంతతపోవనంబునకుం జని యందు ధర్మభృతుం డనుమునీంద్రునకు నమ
స్కరించి విహితసత్కారంబులు గైకొనుచు నమ్మునీంద్రుం గనుంగొని. 66

చ. ఇది కడునద్భుతంబు జను ♦ లెవ్వరుఁ దోఁపరు తూర్యనాదముల్
ముదముగ నంబుమధ్యమున ♦ మ్రోయుచు నుండుట కేమి కారణం
బది యెఱిఁగింపు నా కనుడు ♦ నమ్ముని యిట్లను మందకర్ణి య
న్నదమలపుణ్యుఁ డొక్కముని ♦ సత్తముఁ డిందుఁ దపోబలంబునన్. 67

క. కుహరీకృతసలిలాంత, ర్గృహమున నచ్చరలతోడఁ ♦ గ్రీడాపరతన్
విహరించుచుండు నీవిధి, మహిళాజనజనితవివిధ ♦ మంజులరవముల్. 68

వ. ఇట్లగుటకుం గారణంబు విను మిమ్మునీంద్రుండు వాయుభోజనుండును శిలాశ
యుండు నగుచుం బదివేలవత్సరంబు లుగ్రతపంబు సేయుచున్న నగ్నిదేవుం
డాదిగా నఖిలదేవతలును నీతపంబు మనయం దొకనిపదంబున కొదవుచున్న
యది వీని కేప్రత్యూహం బొనర్ప నగు ననుచు నేవు రచ్చరలం బనుప నచ్చెలువ
లేతెంచి మదనపరతంత్రునిం జేసినం దదీయాలాపవినోదంబు లనుభవించుచు
నిజనిర్మితం బగునీసరోవరంబున నున్నవాఁ డదిమొదలిదియును బంచాప్సరసం
బనుపేరం బరఁగుననుచు నమ్మందకర్ణివృత్తాంతం బెఱింగించిన సంతోషించుచుఁ
బదంపడి యాశ్రమాంతరంబులకుం జని చని. 69

శా. మాసార్ధం బొకచో దినం బొకయెడన్ ♦ మాసద్వయం బొక్కచో
మాసం బొక్కెడ వత్సరార్ధ మొకచో ♦ మాసత్రయం బొక్కెడన్
మాసత్రిద్వయ మొక్కచో నొకయెడన్ ♦ మాసాష్టకం బొక్కచో
నాసల్ మీఱ వసించుచున్ రఘువరుం ♦ డయ్యైతపోభూములన్. 70

వ. మఱియు నెడనెడం బరమతపం బాచరించుచు దయాళువు లగుమహామునుల
చరణారవిందంబులకు వందనం బొనర్చుచు వారలచేతం బురాతనపుణ్యపురుష
ప్రవర్తనకీర్తనకథావితానంబులు వినుచుఁ గ్రించు లగునక్తంచరులఁ ద్రుంచుచు
నుత్తుంగంబు లగుగిరిశృంగంబు లెక్కి విహరించుచుఁ జల్లఁదనంబు వెదచల్లుచుం
దోలంకుకొలంకులకు డిగ్గుచు నాతపభయసంహారంబు లగుగహ్వరంబులం బ్ర
వేశించుచు విశాలంబు లగునదీకూలంబుల విడియుచు మధుశీకరంబు లగుకమ
లాకరంబులం గెలిసలుపుచు ఖగమృగశరణ్యంబు లగునరణ్యంబులం జొచ్చుచు స
మావృతాంతరిక్షంబు లగువృక్షంబులం జూచుచు నుత్ఫుల్లపల్లవమంజరీపుంజంబు

---

దాను విహరించె నతఁడు, గానం బాదివ్యసతుల ♦ గానం బధిపా.

క. అంచితముగ నిక్కొలనును, బంచాప్సర మందు రనినఁ ♦ బతి ముని నభినం
దించుచు వీడ్కొని యచ్చో, సంచరితుం డయ్యె నిట్లు ♦ సమ్మదలీలన్.

తే. ఎలమి నొకటియుఁ బది పది ♦ యేనుతిథులు, నాఱు నాలుగు మూఁడు రెం ♦ డయిన నెలలు
నొండు రెండును నేండ్లుగా ♦ నోలి మునిత, పోవనంబుల నుండె సీ ♦ తావరుండు.

లగునికుంజంబుల నిలుచుచు నడవం జనఁ ద్రోవయీక వీఁకమీఱం బెరిఁగినయీ అంబులు దూఱిపోవుచుఁ బావనంబు లగుతపోవనంబుల నిద్రించుచు నతివ్యాళం బు లగుశుండాలంబులం దోలుచు నసహ్యంబు లగుసింహంబులం దెరల్చుచు నుగ్ర ప్రసభంబు లగుశరభంబుల నదల్చుచుఁ బ్రచండంబు లగుభేరుండంబులం బఱ పుచు నొక్కొక్కయెడఁ గఠినంబు లగుముదురువెదుళ్లొండొంటిం గ్రిక్కిఱిసి బెట్టొరసి పెట్లి పొగ లెగసి పేర్చినకార్చిచ్చులు రాజద్రోణంబు లగువరుణబా ణంబులు ప్రయోగించి యార్చి యచ్చెరువఁ దపస్వులభయంబులం దొలంగించి ప్రియంబు సేయుచుఁ గ్రొవ్వు గలమృగమాంసంబుల నిత్యంబు నాహారకృత్యం బులం దీర్చుచు నతిమనోహరస్థలంబులం బర్ణగృహంబులం గట్టి వసియించుచు ముగ్ధు లగుచెంచులం బొడగని యనురూపసల్లాపంబులు సేయుచుఁ బెరలు పగిల్చి వారలకుం దేనియ లాస నిచ్చుచు నతిదూరశాఖాశిఖలం బొల్చుపరిపక్వఫలగు చ్ఛంబులం బడనేసి మునికుమారులకుం బెట్టుచు నానావిధవిహారంబుల నానా విధవిశేషంబులు సూచుచు వనవాసనియమవ్రతవత్సరంబులలోనం బదియేండ్లు వర్తించి వెండియు సుతీక్ష్ణమునిపాలికిం బోయి. 71

చ. అం దొకకొన్నివాసరము ♦ లమ్మునిఁ గొల్చుచు నుండి రుల్లస
చ్చందనపారిజాతఘన ♦ సారకుమారకదంబనింబమా
కందతమాలతాలతిల ♦ క క్రముకార్జునభూర్జతిందుక
స్యందనసర్జఘూర్జరక ♦ సాలవిశాలవనాళిఁ జూచుచున్. 72

క. ఉన్నయెడ రామచంద్రుఁడు, విన్నప మొనరించె నుచిత ♦ వినయవచనసం
పన్నత మెయి నొకనాఁడు ప్రసన్నుం డగునమ్మునీంద్ర ♦ చంద్రునితోడన్. 73

చ. కమలభవప్రభావుని న ♦ గస్త్యమహామునిఁ జూడఁ బూని చి
త్తము గడువేడ్క నూనెడు న ♦ తండు తపం బొనరించు నెందు సం
యమివర యెంతదవ్వు గల ♦ దానతి యిం డెఱుఁగంగ నన్న భూ
రమణునితోడ నమ్ముని క ♦ రంబు ప్రియం బెసలార నిట్లనున్. 74

చ. సులభవివేక కుంభజునిఁ ♦ జూడఁగ ని న్నట పుచ్చువాఁడ నై
తలఁపఁగఁ గోరి తీవు గురు ♦ ధర్మవినిర్మలు నుల్లసత్తపో
బలరిపుహేతిభగ్నపటు ♦ పాతకపర్వతు నమ్మునీశ్వరుం
దలఁచిన విన్నఁ బేర్కొనినఁ ♦ దర్శనమాత్రన పాయుఁ బాపముల్. 75

సీ. మేర చెప్పఁగరాని ♦ వారాశిజలములు, వడిఁ గ్రోలి యుదరాగ్ని ♦ నడఁగఁ జేసెఁ
దపనుమార్గొనిని మిన్ను ♦ దాఁకినవింధ్యభూ, ధ్రముఁ గాలనేలమ ♦ట్టముగఁ ద్రొక్కె
నాకాధిపతి యైన ♦ నహుషునిఁ దేజంబు, గుదిచి పాముగ భూమిఁ ♦ గూలవైచె
మునులమేనులు వ్రచ్చి ♦ తినుక్రూరదైత్యును, కక్కఱ మ్రింగి వాతాపి ♦ నణఁగఁ ద్రేంచె
నక్కజంబుగ దక్కిన ♦ దిక్కునందు, దివిజులకు నెల్లఁ దుల యయి ♦ తివిరి నిలిచె

నద్భుతావహ మగునమ్మహాత్ముమహిమఁ, బూని వర్ణింప గోచరమే నరేంద్ర.

చ. [1]అని కొనియాడి యివ్వనముననం దనిశంబు నిశాచరుల్ తపో
ధనులకుఁ గీడు సేయుదురు తద్వ్యథ మీ కొనరించి మమ్ముఁ జే
కొను మనుచుం గఠోరతరఘోరశరోజ్జ్వలరత్నతూణముల్
ఘనతరచాపముఁ నిశితఖడ్గయుగంబును నిచ్చె వేడుకన్. 77

తే. అనుచు వినిపించి కుంభజునాశ్రమంబు, తెరువు సంజ్ఞాభియుక్తిమైఁ దెలియఁజెప్పి
వీడుకొల్పినఁ గదలి భూవిభుఁడునాల్గు, యోజనము లేఁగి ముందటనొక్కచోట.

వ. [2]రామచంద్రుండు సౌమిత్రిం గనుంగొని యిట్లనియె. 79

—అగస్త్యమహామునిమాహాత్మ్యాభివర్ణనము.—

సీ. ఇవ్వనంబునఁ దొల్లి యిల్వలవాతాపు, లనుమహ్రాక్షసు లధికపాపు
లుండు భూసురహింస లొనరింతు రెట్లన్నఁ, బిత్రుకార్య మొక్కటి పేరు సెప్పి
యగ్రజుం డిల్వలుం డనుజుని వాతాపిఁ, గపటమేషాకృతిఁ గైకొనంగఁ
బంచి హింసించి తత్పలల మామంత్రిత, ద్విజులకు వడ్డించి తృప్తులైన
పిదప భుక్తశేషమునకుఁ బిల్చుకరణి
నింక వాతాపి రమ్మని యిట్లు పిలువ
వాఁడు నవ్విప్రజఠరముల్ వ్రచ్చికొనుచు
నిలకు నేతెంచుఁ జంబోతునెలుఁగు సెలఁగ. 80

వ. ఇత్తెఱంగున ధరామరోత్తముల ననేకుల వధియించుచుఁ దత్పిశితభక్షణంబు సేయుచు నుండ నప్పాపాత్ములదుశ్చరిత్రంబులు విని యగస్త్యుం డొక్కనాఁడయ్యాశ్రమంబున కేతెంచి కపటక్షణంబు గైకొని తాదృశం బగుభోజనవిధానంబును జలిపి హస్తావసేచనానంతరంబునఁ దొల్లింటివిధంబునం దమ్మునిం బిల్వ నిల్వలుం గనుంగొని నవ్వుచుం గడుపు సవరించుచు జీర్ణుం డయ్యె వాతాపి యనుచుం బలికి కృతకవిప్రుం డగునారాక్షసుం గ్రోధనిరీక్షణంబున భస్మీభూతుం గావించె నిట్లన్నిశాచరయుగళంబును బొలియించినయమ్మహాపురుషుననుజుం డిమ్మునీంద్రుండు గావున నిమ్మహాత్మునిదర్శనంబు మనకు నభ్యుదయహేతు వను

1. 77...78-వ పద్యములకు మాఱుగా
'అనుచుఁ గొనియాడి కుంభజువాశ్రమంబు, తెరువు సంజ్ఞాభియుక్తిమైఁ దెలియఁజెప్పె
... ... ... ... ...' వ్రా. ప్ర.

2. 79...98-వ పద్యములకు మాఱుగా
చ. అనఘుఁ డగస్త్యుతమ్ముని మహాముని గాంచి తదీయమైనయ
వ్వనమున నాఁడు నిల్చి జనవల్లభుఁ డమ్మునిముఖ్యు భక్తి వీ
డ్కొని యట కాంచెఁ గుంభజుఁ బ్రఘూర్ణితపూర్ణమహార్ణవాంతరాం
బునివహసర్వపూరపరిపూరితవిస్తరహస్తపంకజున్.

చు లక్ష్మణానుచరుండై చనుదెంచి కుంభసంభవానుజునకుం బ్రణమిల్లి తదాచ
రితసత్కృతుం డగుచు నారాత్రి యచ్చట నిల్చి మఱునాఁడు ప్రయాణోచితసమ
యంబున. 81

తే. అమ్మునీంద్రు వీడ్కొని యగస్త్యాశ్రమంబు
గదియ నేతేర రాముని నెదురుకొనియెఁ
గుసుమపరిమళోపాయన మొసఁగి హోమ
గంధబంధురుఁ డగుచున్న గంధవహుఁడు. 82

మ. ధరణీనాయకుఁ డప్పు డిట్లను సుమిత్రాపుత్రుతో నిమ్మునీ
శ్వరుసామర్థ్యము సెప్పెదన్ విను వివస్వన్మండలంబుం దనుం
దిరుగం జేయుదు నంచు మేరుగిరితో ద్వేషించి వింధ్యం బవం
ధ్యరయం బారఁగ మింటికిం బెరిఁగి యయ్యాదిత్యుతే రాఁగినన్. 83

క. అమరహితంబుగ నీనం,యమివరుఁ డద్దెసకు వచ్చు నప్పుడు పాతా
ళమునకు దిగఁబడ నయ్యాచ,లముఁ జరణాంగుష్ఠమున నలఘుగతి నదిమెన్.

క. అదిమొదలు వింధ్య మిమ్ముని,పదశిక్షం బెరుఁగ వెఱచుఁ బగ లే కిచ్చో
మదవద్గజములు సింగపుఁ,గొదమలు హరిణములు పులులు గూడి చరించున్.

క. సురయక్షసిద్ధవిద్యా,ధరగంధర్వాదిదివ్యతనువులు మనుజుల్
ధరియించి విమానంబుల, నరుగుదు రిట దపము సలిపి యమరావతికిన్. 86

క. సురకిన్నరవిద్యాధర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వాదుల్
పరమప్రీతిం జనుదెం,తురు పొరిఁబొరి నిమ్మునీంద్రధూర్జటిఁ గొలువన్. 87

క. వనవాసశేష మే ని,వ్వనమున నీయనఘుపాల వర్తించెద నిం
పెనయ మనరాక లక్ష్మణ, మునిపతి కెఱిఁగింప నరుగు ముందట ననినన్. 88

వ. అరిగి తదాశ్రమద్వారప్రదేశంబున నిల్చి లక్ష్మణుం డగస్త్యశిష్యు నొక్కనిం
గాంచి నిజాగమనాభిధానంబులు సెప్పి మునీంద్రునకు విజ్ఞాపనంబు సేయు మనవు
డు నక్కుమారుం డగ్నిశరణంబునకుఁ బోయి ముకుళితకరకమలయుగళుం డగు
చు నమ్మహాత్మున కిట్లనియె. 89

క. మునిజనవల్లభ దశరథ, జననాయకసుతుఁడు రామచంద్రుఁడు మిమ్ముం
గనుఁగొనఁ జనుదెంచెఁ దపో,వనికాద్వారమున నున్నవాఁ డయ్యనఘున్. 90

వ. కొలిచి సీతాలక్ష్మణులు లేతెంచినా రని విన్నపంబు సేయుటయుఁ దన కచట నిలు

---

చ. కని కడుభక్తి మ్రొక్కుటయు గారవ మొప్పఁగఁ గౌఁగిలించి తా
మును దనుఁ గొల్చియున్న మునిముఖ్యుల కెల్లను రామచంద్రుస
ద్వినుతగుణావలుల్ ప్రకటవిస్తరభంగిఁ జెప్పచుం బ్రియం
బునఁ గొనియాడుచున్ వివిధపూజలఁ దృప్తులఁ జేసె నెమ్మితోన్.

వ నేటి కరుగుదెంచుఁ గా కనుచుఁ బలుక నమ్మునిశిష్యుండును మగిడి వచ్చి సౌ
మిత్రిం బురస్కరించుకొని చనుదెంచు రామచంద్రుం గనుంగొని. 91

క. జననాయక మిమ్ముం దోడ్కొని ర మ్మని మమ్ముఁ బనిచెఁ । గుంభజుఁ డింకం
జనుదెం డనుడుఁ దదాశ్రమ,వనముఁ బ్రవేశించి యద్దివాకరతేజున్. 92

క. కని యప్పుడు కౌసల్యా,తనయుఁడు సౌమిత్రితోడఁ । దత్సామర్థ్యం
బనురక్తిం గొనియాడుచుఁ, జని యాసంయమివరేణ్యు । చరణంబులకున్. 93

వ. నమస్కారంబు సేయుటయు నమ్మహాభాగుండు నాశీర్వదించుచు నక్కుమారుల
నెత్తి కౌఁగిటం జేర్చి మూర్ధాఘ్రాణంబు నొనరించి పురోభాగంబునం బ్రణత
యైనసీతాదేవి నభినందించి యమ్మువ్వుర నుచితప్రకారంబులఁ గూర్చుండ నియో
గించి కుశలం బడిగి ముదితహృదయుం డగుచు నిజశిష్యునిం గనుంగొని. 94

క. సురవరులకంటెఁ బూజ్యుం, డరయఁగ నీపురుషవృషభుఁ । డ ల్లగుట గుహో
త్తరునకు నీహవి వేల్చిన,చరుశేషముఁ దెచ్చి పెట్టు । సంభావనతోన్. 95

క. విను మతిథి గృహంబునకుం, జనుదెంచినఁ దనకు దొరకు । శక్తిం బూజిం
పనిదుర్మతి నిజమాంసా,శనుఁ డగుఁ బరలోకమున న । సత్సాక్షిగతిన్. 96

వ. అని పలికి నియమింప నమ్మునికుమారుండు నవ్విధం బాచరించెఁ దదనంతరంబ
వానప్రస్థవిధిప్రకారంబున నమ్మునిపుంగవుండు పూజించి. 97

చ. కలశభవుండు రామునకుఁ । గౌతుక మొప్పఁగ దివ్య మైనయు
జ్జ్వలఘనఖడ్గయుగ్మమును । వైష్ణవ మైనశరాసనంబుఁ బెం
పలరునమోఘసాయకము । లక్షయతూణయుగంబు నిచ్చి నీ
వలసినవానిఁ గోను మని । వారణ నిత్తు నరేంద్ర నావుడున్. 98

క. అన్నియు మీకృపఁ గడుసం,పన్నంబుల మాకు నునికి । పట్టుగ నిట మీ
రెన్నెల వానతియిచ్చెద, ర న్నెలవున నిలుతు మేను । ననుజుఁడు సతియున్. 99

క. అనుటయు నిచటికి దక్షిణ,మునఁ బంచవటం బనంగ । మోదావహ మై
తనరుచు గౌతమిచేరువ, వన మొప్పగు నందు నిలువు । వసుధాధీశా. 100

## జటాయుదర్శనము.

క. అని పలికినఁ దగ వీడ్కొని, జనపాలుఁడు లక్ష్మణుండు । జనకాత్మజయుం
జనఁ జన నొక్కెడ ముందటఁ, గని రద్భుతమూర్తి యైన । ఖగపతి నొకనిన్.

సీ. బలితంపుఱెక్కలు । గలిగినదై నాక,కుధరంబు మీఱిన । గొప్పమేను
గండభేరుండాది । ఖగములఁ గబళించి, వ్రక్కలు గావించు । వలుఁదముక్కు
నుదయార్కబింబంబు । నురుదీప్తిఁ గప్పెడు,ఖరదృష్టిఁ బెంపారు । కన్నుఁగవయు

---

క. జనవరునకు లక్ష్మణునకు, జనకసుతకుఁ గందమూల । శాకాదిక మై
మునిమాననీయ మగుభో, జనమునఁ బరితుష్టి సేసి । సముచితభంగిన్.

చ. కలశభవుండు రామునకుఁ ... ... ... ... ... ... వ్రా. ప్ర.

వజ్రాయుధంబుక్రొవ్వాఁడిమి మెచ్చని, ఖరనఖంబుల నొప్పుచరణయుగముఁ
దనదుసత్త్వంబు దెలుపంగఁదనరునట్టి, యమ్మహాఖగము నృపాలుఁ డంతఁ జూచి
యేనుమీతండ్రిసఖుఁడ రాజేంద్రచంద్ర, యరుణపుత్త్రుండ నన్నుజటాయువండ్రు.

క. అనుడు నెదుర్కొని రాఘవుఁ, డనుజన్ముఁడుఁ దాను నుచితమగుమాటలఁ బెం
పునఁ బక్షినాథు నెయ్యము, వినయముఁ గొనియాడె నతఁడు వెండియు భక్తిన్.

చ. వితతగిరీంద్రశృంగముల వేడుకఁ జూడఁగఁ గోరినప్పు డ
ద్భుతముగ మిమ్ము మోచికొని పోయెద జానకికాపు వెట్టెదన్
సతతముఁ గాచియుండెద వెసం జని చేసెద నెంతదవ్వునం
దతిశయ మైనయట్టిపని యైనను బొచ్చెము గాదు రాఘవా. 104

క. అఱువదివేలేండ్లు ధర, మెఱయంగా నేలినట్టిమీతండ్రికి నే
నఱ లేనిసఖుఁడ నెమ్మెయి, మఱితు నెయ్యు రాజసుతుల మాన్యుల మిమ్మున్.

తే. అరిదియగుమేలు వినఁగఁ దా ననుభవింప, నేను వెలి గాఁగ నొల్లని వానిఁ గీర్తి
ధన్యు నాసఖు దశరథుఁ దలఁపఁగంటిఁ, బరమపుణ్యులమిముఁ జూడఁ బడయఁగంటి.

వ. [1]అనవుడు. 107

క. క్షితిపతి విహంగపతి నం, చితమతిఁ బూజించి తమకుఁ జేసినయాస
త్కృతిఁ గైకొని తజ్జననం, బతికౌతుకబుద్ధి నడుగ నతఁ డిట్లనియెన్. 108

క. విదితంబుగ విను మెఱిఁగిం, చెద మజ్జననక్రమంబు సృష్టికి మొదలం
బదు నెనమండ్రు ప్రజాపతు, లుదయించిరి వరుస నలఘు లుజ్జ్వలతేజుల్. 109

వ. వా రెవ్వ రంటేనిఁ గర్దముండు విక్రీతుండును శేషుండును సంశ్రయుండును బహుపుత్త్రుండును స్థాణుండును మరీచియు నత్రియుఁ గ్రతువును మహాబలుండును బులస్త్యుండును బులహుండును బ్రచేతసుండును దక్షుండు నాంగీరసుండును వివస్వంతుండు నరిష్టనేమియుఁ గశ్యపుండు ననువార లందు దక్షప్రజాపతికఱువండ్రు దుహితలు జన్మించి రక్కన్నియలందుఁ బదుమువ్వురను గశ్యపుండు పరిగ్రహించె నున్నవారల ధర్ముండును సోముండు ననుమహాపురుషులు వరియించి రక్కశ్యపపత్ను లగువార లదితియు దితియు దనువును గాళియు నరిష్టయుఁ గపయు సురసయు సురభియు వినతయుఁ గద్రువయు వ్యాఘ్రయుఁ గ్రోధవశయుఁ దామ్రయు ననువార లందు నదితికి నాదిత్యులును రుద్రులును దితికి దైత్యులును దనువునకు నశ్వగ్రీవుండును గాళికి నరకకాలకులును గంధర్వులు నప్సరసలు నరిష్టకు సిద్ధులును గపకు రక్షుండును ననం బుత్త్రు లుదయించిరి సురభికి రోహిణియు గంధర్వియుఁ గ్రోధవశకు మృగియు మృగమందయు హరియు భద్రయు మనువును భూతయుఁ గపియు దంష్ట్రయు శ్వేతయు సురసకు నిరయు వనస్పతియు వనస్పతికి వృక్షలతావీరున్మాతలు మువ్వురును దామ్రకు శ్యే

1. 107 మొదలుగా 111 వఱకుఁ గలపాఠము వ్రాఁతప్రతులందుఁ గానిపింపదు.

నియు భాసయుం గ్రౌంచియు ధృతరాష్ట్రియు శుకియు ననుకూఁతులుం బుట్టిరి కద్రువకు నాగసహస్రంబులును సురసకు నేకశిరంబు లగుసర్పంబులు నూఱు నుద్భవించె వినతకు నరుణుండును గరుడుండు ననువిహంగమప్రముఖు లుద యించి రందు. 110

క. ఏనును సంపాతియునుం, గా నరుణున కుదితుల మఱి ఖగముల మనుజుం
డై నజటాయు వనెడువాఁ, డేనును బుత్త్రులము శ్యేని కే మిరువురమున్. 111

ఉ. బాంధవ మొప్ప నిట్లు తగఁ బల్కినపక్షిపతిం బ్రియోక్తిసం
బంధ మెలర్ప వీడుకొని బాహుబలోద్భటశక్తిశౌర్యగ
ర్వాంధవిరోధిభూధ్రభిదురాయుధుఁ డావిభుఁ డేఁగె నల్లతా
గ్రంథిలకుంజపుంజములఁ గల్గినపంచవటంబుచెంతకున్. 112

క. చని యచ్చట ననుజన్ముని, గనుఁగొని యొకపర్ణశాల గావింపు మనా
మన మిచ్చట నిటమీఁదటి, వనవాసదినంబు లుండవలయుం బ్రీతిన్. 113

మ. అనినన్ వాస్తువిధిజ్ఞతం బరశుదాత్రాదిద్రుమచ్ఛేదసా
ధనముల్ గైకొని భూరిపర్ణతృణసంతానంబు ఛేదించి చ
య్యన సంధించి యమర్చి కట్టినతదీయాగార మున్నంతఁ జూ
చి నగేంద్రుండు నిజానుజుం బొగడి చేర్చెం గౌఁగిటం జిక్కఁగన్. 114

క. ఆమందిరంబుచెంతను, రామానుజుఁ డొక్కయిల్లు రచియించి నయ
శ్రీమహితుం డై రేవగ, లేమఱక మహీశుఁ గొల్చె నెంతయు భక్తిన్. 115

చ. బహుమృగమాంసఖండములు పక్వఫలంబులు తేనియల్ రఘూ
ద్వహుసతి గోరుభూరుహాలతాకుసుమాదులుఁ దెచ్చి యిచ్చుచున్
మిహిరసమానతేజుఁడు సుమిత్త్రతనూజుఁడు గొల్వఁగా ముదా
వహముల యయ్యెఁ దత్సమయవాసరముల్ గురువంశభర్తకున్. 116

వ. [1]అంత నొక్కనాఁడు. 117

— లక్ష్మణుఁడు జంబుకుమారునిం జంపుట. —

సీ. రామభూనాథుండు రామానుజునిఁ గని, యెంతయుఁ బ్రేమతో నిట్టు లనియె
నివ్వనంబున కేఁగి యింతికి ఫలములు, వేగ దెమ్మన్న నవ్విభునిపాద
పద్మంబులకు మ్రొక్కి భక్తిమై లక్ష్మణుం, డవ్వని కేఁగి విహారలీలఁ
గొమరొప్పు ఫలములు గోయుచు నుండ నా, సాంత విద్యుజ్జిహ్వాపుత్త్రుఁ డైన
ఘోరదైత్యుండు జంబుకుమారుఁ డుగ్ర
తపము సలుపంగ నెఱిఁగి సుత్రాముఁ డాది
సురలు పుత్తెంచి రపుడు భాసురకఠోర
చంద్రహాసంబు నది వాఁడు సరకుగొనక. 118

1. 117 మొదలుకొని 132 వఱకుఁ గలపాఠము వ్రాతప్రతుల లేదు.

క. ఉన్నయెడ లక్ష్మణుం డది, క్రన్ననc బరికించి కేలc గైకొని యట య
త్యున్నతతరువుల వ్రేయc బ్ర, సన్నాననుఁ డగుచు మానితసత్తము తెలమిన్. 119

తే. ఓమహారాజపుత్ర నీ కుచిత మగున, ఫూచి కాచి తనర్చినభూరుహముల
వ్రేయc బూనెదు వలవదవ్వాదురుపాదరు,నొక్కవ్రేటుననణుకు మతిత్యుగ్రగతిని.

వ. అని మునీంద్రులు సెప్పిన సుమిత్రానందనుండు తనకరంబున నున్ననూతనచం
ద్రహాసంబు జళిపించి ప్రచండబాహుఁదండం బెత్తి యవ్వాదురుపాద నొక్కవ్రేటు
నం బడ నఱకిన నచ్చటిమునీంద్రులు సంతసంబునం గొనియాడి రందుc దెగిన
రక్షోవీరుని వీక్షించి లక్ష్మణుండు మహాతాపసోత్తముం జంపి పాపంబుc గట్టికొం
టి నింక భూపాలున కెఱింగింప వలయు ననుచు భయంబున ఫలంబులు గొంచు
నత్యంతచింతాక్రాంతస్వాంతుం డై యమ్మహీకాంతుపాలికిం బోయి తచ్చరణార
విందంబులకు వందనం బాచరించిన నక్కుమారు నెత్తి కౌఁగిటం జేర్చి నీ వతి
ఖిన్నుండ వై విన్నంబోయి యున్నవిధం బే మన్న నయ్యన్నకు నున్న తెఱం గె
ఱుంగం జెప్పిన రామచంద్రుండు కటకటంబడి యిమ్మహాఘోరపాతకం బేరూ
పంబునం బాయునో యని విచారించు చున్నసమయంబున. 121

తే. మునులు రఘురాముc గానవచ్చిన విభుండు
నమ్మహాత్ముల కెదురేగి యధికభక్తిc
బుడమిc జాగిలి మ్రొక్కి సంపుటకరాబ్జుc
డగుచు వినయంబు దోcప నిట్లనియెc బ్రీతి. 122

వ. మహాత్ములారా మాసౌమిత్రి యెఱుంగమి నొక్కమునివరుం జంపె మీయనుగ్ర
హంబున నిమ్మహాపాపం బితనిం బొంద కుండునట్లు చేసి రక్షించి యతనిప్రాణం
బు లోనంగుం డని ప్రార్థించిన వారలు మందస్మితవదనారవిందు లై రఘునంద
నున కి ట్లనిరి. 123

తే. మిహిరకులనాథ యిపుడు సౌమిత్రిచేతc
ద్రుంగినాతcడు తాపసేంద్రుండు గాcడు
దనుజవరవీరుc డతనివృత్తాంత మెల్ల
నెఱుcగc జెప్పెద మని రాఘవేంద్రుc జూచి. 124

వ. విద్యుజ్జిహ్వానందనుం డగుజంబుకుమారుండు తండ్రిపగ తీర్చుటకు నై యాఖండ
లుం గూర్చి యఖండితతపంబు సలుపుచున్న నత్తపంబునకు మెచ్చి యింద్రాదు
లు సాంద్రద్యుతిభాసురం బగుచంద్రహాసం బంపిన నవ్వీరుండు మదీయతపోబ
లంబున కిది యేటికిం బనిచి రని యొల్లకున్న నల్లన గగనంబున మెలంగుచున్న
దాని నీరాజనందనుం డందికొని జళిపించి ఫలవృక్షంబుల వ్రేయ నమకట్టిన నేము
వల దని యవ్వాదురుగుమి నూపినం బడవ్రేసె నావ్రేటున నారాతుఁడుండు దెగిన
లక్ష్మణకుమారుండు చూచి యాకులితమానసుం డై మీకడ కేcగుదెంచినవాc

డతనియందు దోషంబు లేదు మహాపుణ్యంబు సంభవించె మీ రింక వగవకుండుం
డని యారాఘవుల నాశీర్వదించి యమ్మునులు నిజాశ్రమస్థానంబుల కేఁగి సుఖం
బున్నంత. 125

—శ్రీరామలక్ష్మణులకడకు శూర్పణఖ వచ్చుట.—

క. బోసంబు దెచ్చి యట నిజ,సూనుఁడు దెగి యున్నఁ జూచి ǂ శూర్పణఖ వివ
ర్ణానన యై నేలం బడి, హా నందన యనుచు దుఃఖిǂతాత్మక యగుచున్. 126

క. మౌనవ్రతుఁ డై పరమ,ధ్యానంబునఁ దపము సలిపి ǂ తండ్రివిరోధిం
బూని జయింపఁ దలంచిన, నానందనుఁ డిట్లగుట మǂనం బెటు లోర్తున్. 127

వ. అని చింతించి. 128

చ. కనదురువిస్ఫులింగములు ǂ కన్నుల రాలఁగఁ జుప్పనాతి య
మ్మునిజను లున్నచోటికి సǂమున్నతి నేఁగియు నమ్మహాత్ములం
గనుఁగొని యున్నరూపు నెఱుఁǂగన్ వినిపింపుఁడు లేకయున్న మి
మ్మును బరిమార్తు నన్న మునిǂముఖ్యులు తల్లడమంది రంతటన్. 129

తే. అప్పుడొక్క మహాత్ముఁ డిǂట్లనియె దాని,తోడ నో కాంత యిచటి కǂస్తోకభుజబ
లాఢ్యుఁడొకరాజువచ్చినిǂయాత్మభవునిఁ,దునిమె నెఱుఁగమతండువోǂయినపథంబు.

క. ఇక్కరణిఁ జెప్పిరన్ విని, వెక్కసపడి వనమునందు ǂ విహరింపఁగ నం
దొక్కదినంబున నక్కడ, నక్కరుణాకరుఁడు సీత ǂ యనుజన్ముండున్. 131

వ. విలాసంబునఁ బర్ణశాలయందు వసియించుచు నమ్మహీకళత్రుండు జనకరాజపు
త్రితో సరససల్లాపంబు లాడుచున్నంత. 132

ఉ. అత్తఱిఁ బంక్తికంఠుచెలిǂయల్ కఠినాత్మక చుప్పనాక దా
నెత్తినవేడ్క నచ్చటికి ǂ నేనియు [1]నాఁడటు వోయి పోయి రా
జోత్తము రాముఁ జూచె నసిǂతోత్పలవర్ణు వినీలకుంతలుం
జిత్తజసన్నిభున్ నృపతిǂసింహు మనోహరదీర్ఘలోచనున్. 133

క. కనుఁగొని యెంతయు మెచ్చుచుఁ, దనివి సనక మఱియుఁ జూచిǂతద్దయు రాగం
బునఁ దలయూఁచుచు నెద న,య్యనఘునియొప్పునకు [2]విస్మిǂతాత్మక యగుచున్.

సీ. రేకు లన్నియు విచ్చి ǂ రేయెండ జిగి నిండి, కర మొప్పు తెల్లదాǂమరలకంటె
నఱలేని నెఱదీప్తి ǂ మెఱుఁ గెక్కి సరిమింటఁ, జరియించుసంపూర్ణǂచంద్రుకంటె
నునుఁదీఁగజిగి దోఁగి ǂ నునుపారి నిగ్గారి, తనరుదిక్కరులహǂస్తములకంటె
నిగిడి చేరువ లెల్ల ǂ నీలోత్పలద్యుతుల్, పచరించుహరినీలǂరుచులకంటె
నితనికన్ను లొప్పు ǂ నీరాజుమో మొప్పు, నితనికరము లొప్పు ǂ నితనిమేని
కాంతి యొప్పుననుచుఁǂగడువేడ్క నన్నిశా,చరిణి చూచె రామǂచంద్రుఁ దవిలి.

ఆ. చూచి చేర నరిగి ǂ సురుచిరాకార నీ,పేరుఁ గులముఁ జెప్పు ǂ ప్రియము పుట్టె

1. నేడ్తెఱఁ బోయి పోయి. 2. 'వలచి ♦ యతివిస్మిత యై' అ. ప్ర.

నాకు వినఁగ ననినఁ గాకుత్స్థుఁడున్నరూ, పెఱుఁగఁ జెప్ప నెల్ల తెఱఁగుఁ దెలియ.

క. విని నీవు నన్నుఁ జెప్పితి, నను విను మెఱిఁగింతు ననుచు నరవరులో న
ద్దనుజాంగన యి ట్లనుఁ దన, కనుఁగొనలం గలికిచూపు గమి పొలుపారన్. 137

చ. బలిమి జగత్త్రయంబుఁ బలుబాములఁ బెట్టుచు దేవతావళుల్
పెలుకుఱఁ బంక్తికంఠుఁ డను పేరఁ దనర్చినదైత్యభర్తకుం
జెలియలఁ బేరు శూర్పణఖ చెప్పెడి దేమి మహీశ నీకు నేఁ
గలసితి నిన్నుఁ దక్క నొరుఁ గైకొన నీవును బాయు మీసతిన్. 138

తే. తనరు నిచ్చేరువన జనస్థాన[1]మున ఖరాసురుఁడు మత్సహోదరుఁ డధికసేన
తోడనున్నాఁడుననునీవు గూడియున్న, నతఁడునినుఁగాచు వేడ్క వియ్యంబవనుచు.

క. కొఱమాలినదుర్లక్షణ, కొఱ గా దిది నీకు నాలె గుత్తంబుగ ని
జ్జఱభి వధించెద నీతో, నఱ లేనిమనోజకేళి నలరెద నెలమిన్. 140

చ. ఇది ననుఁ బోలునే వెడఁగ యే నినుఁ బొందినఁ బెక్కురూపులన్
మదనకళాకలాపము లమందగతిన్ వెలయింతు దీని ప్రిం
గెద నిటు సూడుమీ పిడపఁ గేళికిఁ జొచ్చినయప్డు మత్సుగ
ద్గదమధురోక్తులున్ హితరతంబును బంధవినోదరీతులున్. 141

క. మన మిచ్చట నెచ్చోనై, నను గేళిం దేలవలయు నరవర తమ్ముం
డని చూడకు వీనిం బొరి, గొనియెద నేకాంత మొప్పగుం జతురతకున్. 142

చ. అన విని యల్ల నవ్వి వసుధాధిపుఁ డద్దురితాత్మఁ జూచి యి
వ్వనితకు నేను గూర్తుఁ జెలువా నవతా లన నోర్తు గల్గునీ
మను విది యేల లక్ష్మణకుమారు వినిర్జితమారుఁ బొందు వే
చను సుఖ మందు నీకుఁ దగు జాణఁ డతం డని చూపి [2]వెండియున్. 143

క. వరవర్ణిని యగునీకుం, బురుషుఁడు బలుదిట్ట యతనిఁ బొందుము లీలన్
సురధరణీధరము దివా, కరదీధితి పొందునట్టికరణిం దరుణీ. 144

వ. అని యిట్లు చెప్పిన. 145

క. నగ వవు టెఱుఁగక యిది యురి, తగులున సౌమిత్రిఁ జేరి దానవి దనకున్
మగఁడ వగు మనిన నాతఁడు, నగ వొదవిన నగక శూర్పణఖ కి ట్లనియెన్.

చ. త్రిజగములందు నేర్పులకు దిట్ట యనం దగురాముఁ డుండ వా
రిజముఖ చేల వై చెలువు రిత్తగ నవ్విభుదాసు నన్ను శు
ద్ధజడునిఁ బొంది నీవు నొకదాసివి గాఁ దలపోసె దేల స
ద్గజగతి నేఁగు మీసరసుఁ గన్గొని కైకొను నిన్ను నెమ్మెయిన్. 147

క. ఈముక్కుచెవు లీమొగ, మీమెలుపుం బొలుపుఁ గలదె యేచెలువకు నీ
కోమలిక మెఱుఁగుటకునై, రాముఁడు మెలఁగించి చూచె రమణీ నిన్నున్.

---

1 మనఁగ, వదె ఖరాసురతరుఁడు దా ♦ నధిక. 2 'చెప్పినన్. క. నగ నగు టెఱుఁగక' వ్రా. ప్ర.

క. నినుఁ గనినప్పటఁ గోలెను, దనమది సుడివడఁగ రామ♦ధరణీశుఁడు నిన్
గనుఁగొనఁ గోరెడుఁ దడయం, జన దియ్యెడ వదినె వైతి ♦ చను మయ్యెడకున్.
చ. అనవుడుఁ బొంగి దానవి ర♦యంబున నయ్యెడ [1]కేఁగుదెంచినం
గనుఁగొని సీత నవ్వుటయుఁ ♦ గన్నులఁ గోపము వేర్చి నన్నుఁ గై
కొన కిది నవ్వె నాసవతి♦కోఱడ మెట్లు సహింతు దీనితో
మను విది యేల యీచెడుగు♦మానిసి మ్రింగెద నంచు నుగ్రతన్. 150
చ. [2]కాఱవులభంగి మండుమిడి♦గ్రుడ్డుల నిప్పులు రాల దీప్తి గ్రి
క్కిఱియ మహోల్క రోహిణి ప♦యిం బఱతెంచినమాడ్కిఁ జూడ్కికిన్
వెఱపు జనింప సీతపయి ♦ వే పఱతేర నృపాలుఁ డొక్కచే
బిఱుసునఁ బట్టె నయ్యబలఁ ♦ బెల్కుఱ రాక్షసిఁ బట్టె నొక్కటన్. 151
వ. ఇట్లన్నిశాచరిం బట్టి లక్ష్మణుం గనుంగొని. 152

—❀ లక్ష్మణుఁడు శూర్పణఖముక్కుసెవులు గోయుట. ❀—

క. క్రూరులు దుష్టాత్ములు నగు, వారలతో నగవు లెపుడు ♦ వలవదు కంటే
నేరమి మనదెసఁ గల్గుట, నీరక్కసి జనకతనయ ♦ కిమ్మొయిఁ దొడరెన్. 153
వ. కావున దీని నింక విరూపిం జేయు మనుటయు నాసుమిత్రాపుత్త్రుండు. 154
క. ఘోరక్రోధంబున న, వ్వీరోత్తమునాజ్ఞ నొక్క♦వెస నన్నక్తం
చారిణి నప్పుడ పట్టి కు, ఠారంబున ముక్కుసెవులు ♦ డగ్గఱఁ గోయన్. 155
ఉ. భంగము నొంది యద్దనుజ♦భామిని దిక్కులు మ్రోయ రోఁజుచున్
నింగికి మ్రొగ్గుచున్ నెగసి ♦ నీలవలాహకభంగిఁ బాఱి యు
త్తుంగసభాస్థలిన్ ఘనకు♦తూహలతన్ దనుజాళి గొల్వఁగా
ముంగలఁ బేర్చి యున్నఖరు♦ముందటఁ గూలి భుజంగిచాడ్పునన్. 156
క. పొరలుచు నేడ్చినఁ గని య, చ్చెరువును గ్రోధంబుఁ గదుర ♦ శీఘ్రగతిన్ వి
స్ఫురదుగ్రభ్రూకుటిభీ, కర మగుబలుమొగముతోడ ♦ ఖరుఁ డి ట్లనియెన్. 157
ఉ. ఎవ్వఁడొకో లయాంతకుని ♦ నే నని మార్కొని కోఱ మీఱె వాఁ
డెవ్వఁడొకో పురాంతకుని♦యెక్కుడుక న్నఱకాలఁ దన్నెఁ దా
నెవ్వఁడొకో నమిత్రముగ ♦ నిప్పుడ చావఁ దలంచె నింతవాఁ

---

1 ‘కేఁగినం గనుం,గొని మహిజాత నవ్వుటయుఁ ♦ గోపము రేఁగ నిజేల నన్నుఁ దాఁ, గనుఁగొని నవ్వె నాసవతి ♦ కావల మెట్లు’. అ. ప్ర.

2. 151 మొదలుకొని 155 వఱకుఁ గలపాఠమునకు మాఱుగా
“చ. అవని చలింప నైజవికృ♦తాకృతిఁ గయికొని పేర్చి సీతపైఁ
గవిసినఁ జేయి మాటిడుచు ♦ గ్రమ్మన లక్ష్మణ దీనిఁ బట్టి యం
గవికలఁ జేయు మన్న నురు♦గాఢరయంబునఁ గోసె ముక్కునుం
జెవులును గ్రూరధార విల♦సిల్లుకుఠారమునం గఠోరతన్.” వ్రా. ప్ర.

డెవ్వఁడో వానిపే[1]రెఱిఁగి ‡ యిప్పుడ చెప్పుము నాతి మ్రింగెదన్. 158

క. అని పలికిన ఖరుతో న,మ్మనుజేంద్రులపొలువుఁ బలువు ‡ మహిఁ బంచవటం
బున నున్న తెఱఁగు సెప్పిన, విని కన్నుల నిప్పు లురుల ‡ విస్ఫురితగతిన్. 159

వ. [2]మండుచు ఖరుం డంతకాకారులఁ బదునలువుర రాక్షసులం గనుంగొని. 160

చ. ఇరువురు మర్త్యు లొక్క హరి ‡ణేక్షణతోఁ జనుదెంచి దండకాం
తరమున నున్నవా రట ర ‡ ణంబున వారి వధించి యిన్నిశా
చరికిఁ బ్రియం బొనర్పుఁడు వె ‡ సం జనుఁడీ యని పంప నట్లు వా
రరిగిరి చుప్పనాతి ముద ‡ మందుచు ముందఱఁ ద్రోవ వెట్టఁగన్. 161

క. చనుటయు దనుజుల దవ్వులఁ, గని రాఘవుఁ డనుజుతోడఁ ‡ గంటే మనపైఁ
గొనివచ్చె వికృతదానవి, తనవా రగువారిఁ గ్రూర ‡ దైత్యుల ననుచున్. 162

చ. కరమునఁ జూపి శాతవిశి ‡ ఖంబులుఁ జాపముఁ బుచ్చికొంచు భీ
కరముగఁ గొంతద వ్వెదురు ‡ గాఁ జని యిట్లను మీకుఁ బ్రాణముల్
గరముఁ బ్రియంబు లేనిఁ దొల ‡ ఁగం జనుఁ డుద్ధతి మాని పూని సం
గరమున నిల్చినన్ బ్రదుకఁ ‡ గా వశమే యని చెల్పి పల్కినన్. 163

వ. (అద్దానవు లి ట్లనిరి.)

శా. [3]రక్షోనాయకుఁ డల్గెనేని వశమే ‡ రా రామ ప్రాణంబు లా
జిక్షోణిన్ మెయి నిల్ప నీ కనుచు సా ‡ క్షేపించుచున్ శూలముల్
రూక్షప్రేక్షణు లన్నిశాటభటవీ ‡ రుల్ వైచి రీరేడు వి
శ్వక్షోభంబుగ నార్చుచున్ సురవిప ‡ క్షగ్రామణుల్ పెల్లుగన్. 164

తే. వైచుటయు నొక్క తెగఁ గ ‡ త్తివాతియమ్ము
లతఁడు పదునాల్గు నిగిడించి ‡ యద్భుతముగఁ
దునిమెఁ బదునాల్గు శూలమ్ము ‡ లను మహోగ్రు
లగుచు వా రంతఁ బోక పై ‡ నడరుటయును. 165

ఉ. వెండియుఁ జండకాండములు ‡ వే పదునాల్గు సమగ్రశక్తి ను
ద్దండరయంబునం దొడగి ‡ దైత్యుల నేసినఁ దూలి కూలి రా
ఖండలుఁ జేచి తెక్కలు దె ‡ గన్ వడి వ్రేసిన నోలిఁ గూలు పె
న్గొండలభంగిఁ బాదహతిఁ ‡ గుంభిని గంపము నొంద దండడిన్. 166

---

1 రు చెఱిఁగింపుము మున్నిడి నాతి; రెఱిఁగి ♦ యేర్పడఁ జెప్పుము నాతి.

2. 160 మొదలుగా 161 వఱకుఁ గలపాఠమునకు మాఱుగాఁ

క. మదనాగాయుతసత్త్వులఁ, బదునలువుర దనుజభటులఁ ♦ బనిచె ఖరుం డ
మ్ముదిత వెసఁ దెరువు వెట్టఁగ, వదయులు చని రసుర లుగ్ర ♦ వగురథసమునన్.

వ. [1]ఆసమయంబున. 167

శా. రక్తాలక్తము లుర్విపైఁ బొరయఁగా ♦ రాజన్యబాహాధను
ర్ముక్తక్రూరశిలీముఖంబు లడరం ♦ దోస్త్రోడఁ దగ్ధాస్త్రముల్
రిక్తప్రాణము లైనఁ గన్గొని భయా ♦ ర్తిం గ్రమ్మఱం బాఱె నా
నక్తంచారిణి దిక్కులం జెలఁగ నా ♦ ర్తనారోదనధ్వానముల్. 168

వ. ఇత్తెఱంగునం బాఱి ఖరునిముందట నిలిచి పేరెలుంగున నేడ్చిన నతండు నచ్చె
రు వందుచు నన్నిశాచరిం గనుంగొని. 169

మ. పడఁతీ క్రమ్మఱ నేల యేడ్చెదవు నీ ♦ పన్నంబు నీఁగం గడుం
గడిమిం బేర్చినవీరులం బనుపనే ♦ కార్యం బెఱింగింపు మూ
ఱడు శోకింపకు వారు వారి నని మీ ♦ ఱం బూని తా రేఁగి రే
ర్పడ దేచందము నీమనోరథము దీ ♦ ర్పం జాలరో ప్రేల్మిడిన్. 170

క. అనవుడు నది యిట్లను నీ, పనిచినయారజనిచరులఁ ♦ బదునలువుర న
న్మనుజాగ్రణి యొక్కట వే, తునుమాడె నిశాతశరచ ♦ తుర్దశకమునన్. 171

సీ. ఇంక రక్కసు లెంద ♦ ఱేఁగిన మిడుతలు, కార్చిచ్చుపైఁ జన్న ♦ కరణి నతని
మార్గణార్చులఁ బడి ♦ మ్రంది పోఁగలవారు, గావున బాహువి ♦ క్రమము నెరయ
రాత్రించరేశ్వర ♦ రయమునఁ జని వారిఁ, బరిమార్చి నాపరి ♦ భవము నీఁగఁ
జాలవేనియు జన ♦ స్థానంబు విడిచి నీ, వెందేనిఁ బాఱి పొ ♦ మ్మిచట నునికి
పొసఁగ దే నిపుఁ డంతయుఁ ♦ బోల వింటి, రజనిచరవధార్థము దాశ ♦ రథులు వచ్చి
నారు మనదూచుసామాన్య ♦ నరులుగారు, వారు రామలక్ష్మణు లను ♦ వారు వినుము.

చ. మగఁటిమి నేఁగి రాక్షసులు ♦ మ్రొగ్గిరి నీపెనుఁబ్రాపు నమ్మి నా
పగకొఱ కైన నీవు నిజ ♦ బాహుబలోద్ధతి మీఱి మార్కొనం

1. 167 మొదలుకొని 189 వఱకుఁ గలపాఠమునకు మాఱుగా

క. ఒక్కఁడ పదునలుగుర ని, ట్లక్కజముగఁ గూలి నిహతు ♦ లైనఁ దలఁకుతో
ముక్కిఁడి రక్కసి పఱచెను, గ్రక్కున ఖరుఁ డున్నయెడకుఁ ♦ గడుశోకమునన్.

చ. చని ఖరుముందటన్ దనుజ ♦ సంఘము చూడఁగఁ గూలి రోరి నీ
పనిచినవారు రాముపటు ♦ బాణములం బడి రోపితేని నీ
పనికి నెదిర్చి రమ్ము ప్రథ ♦ నాంతకు నారఘువీరుఁ బోరిలో
జెనయఁగ నీవశంబె వెసఁ ♦ జేరుము లంకకు నొండె నావుడున్.

ఉ. భీషణభంగిఁ బొంగి తను ♦ బిట్టుగఁ బల్కిన గోఁజూచున్ మహా
రోషకఠోరవాక్యముఖ ♦ రుండు ఖరుండు మహోగ్రఘోషణున్
దూషణుఁ బిల్చి సైన్యములు ♦ దుర్దమలీల నమర్పు కింకిణీ
భూషణశస్త్రివర్మరథ ♦ భూరిమదద్విరదాదికంబుగన్.

క. వాలినఘనసేనలఁ బదు, నాలుగువే లమరఁ బేర్చి ♦ నడపింపుము నా
ళీకముంతఘనకర, వాలాభీలముగ నొక్క ♦ వడి నని కడిమిన్.

దగదె యకైన నీ వీట వృథాకథ లెన్నుచు బంట నంచుఁ బ
న్నుగ నిదె యిప్పు డిద్దఱుమనుష్యుల కోడెద వెంత యాడినన్. 173

ఉ. తక్కుదురే నిశాచరవధం బొనరింపక వారు వారిపై
నెక్కొన పేదతాపసుల నేఁచుమదోద్ధతు లెల్లఁ జెల్లునే
యెక్కుడు గంటి నింకఁ గథ లిన్నియు నేటికిఁ జావు దక్కనే
దిక్కున నొందు లే దనుచు దిక్కుల మాఱుసెలంగ నేడ్చుచున్. 174

క. ధరణిఁ బడి భుజగివిధమునఁ, బొరలుచు నట్లున్నఁ జూచి భుగ్నభ్రుకుటీ
స్ఫురదురుఫాలతలంబునఁ, గర మలుకం జెమట వొడమఁగా ఖరుఁ డనియెన్.

మ. ఇటు శోకింపఁగ నేల రాముఁ డనఁగా నెవ్వాఁడు మీయన్నముం
దట దిక్పాలుఁడొ పన్నగాధిపుఁడొ గంధర్వేంద్రుఁడో నేల న
త్తుట జొత్తిల్లఁగ నింక నన్నరులఁ ద్రుంతుఁ నాదు బాహాజయ
స్ఫుటనాదంబుల నింతు దిక్తటనభోభూభాగమధ్యంబులన్. 176

క. నీపరిభవమునఁ బుట్టిన, కోపము గంగాప్రవాహఘూర్ణత్వరతో
నేపారెడు లెమ్మనవుడు, నాపలుకుల కలరి నిల్చి యది యిట్లనియెన్. 177

—✤ ఖరదూషణాదిరాక్షసులు రామునిమీఁద యుద్ధమునకు వచ్చుట. ✤—

చ. రజనిచరాధినాథుఁ డగురావణునట్టిమహాబలుండు న
కృజ మగునీదుభూరిబలగర్వము సర్వముఁ జూపఁ గాదె ది
గ్విజయము చేసి లోకములఁ గీర్తికి నెక్కట వీరవర్య నీ
భుజమ కదా సహాయ మగుఁ బోర సురారుల కెల్ల నెల్లెడన్. 178

ఉ. ఏపున దండనాయకున కెమ్మెయిఁ జెప్పి యతండు మున్నుగా
నాపదునాల్గువేలు దనుజాగ్రణులుం దనతోడ రా సమా
టోప మెలర్ప నల్లన పటుత్వమునం దనతేరు గ్రాల న
ద్దీపితకోపుఁ డై ధను వుదీర్ణరుచిన్ మెఱయంగ నుగ్రతన్.

సీ. ఘనవిక్రములు సేనగామియుఁ బురుషుఁడు, యజ్ఞశత్రుండు విహంగముండు
కరవీరనేత్రుఁడు కాలకర్ముకుఁడు మ, హాకపాలుఁడు రుధిరాశనుండు
రక్తమాలియు ద్విశిరప్రభూతుండును, సర్వ్యానునుండును జలదమాలి
వజ్రఘోషుండును వజ్రదంష్ట్రుండును, నగ్నినేత్రుండు బ్రహ్మాశనుండు.
గాయముఖస్థూలనేత్రదుర్జయులు మఱియు, జంబుకాసురుఁడును బృథుగ్రావదూష
ణాదిదైత్యులు గదిసి రా నమితగర్వ, పరుషభాషణపరుఁ డై వఖరుఁడు నడిచె.

ఉ. అత్తఱి రాలెఁ జుక్కలరుణాభ్రము లెల్లెడఁ బెల్లు వన్ని క్రొ
న్నెత్తురు నెమ్ములుం గురిసె నేల వడంకె సృగాలఘూకముల్
మొత్తము గట్టి గ్రోసెఁ గడు గ్రొమ్ముగ్గ హయాదులు వానిఁ జూచియుం
జిత్తములం గలంగ కని సేయఁ దొడంగిరి సంకటంబునన్.

వ. అనుచు నగ్గింప నప్పు డతండు దనచేరువం గొలిచి యున్నతమ్ముని దూషణుం డను సేనానాయకుం గనుంగొని నీ వింక వేగ మరిగి మహాభీకరాకారులు నేకమనస్కులుఁ బవనబలసంపన్నులుఁ గాలమేఘగర్జాడంబరులు నఖిలప్రాణిహింసాపరాయణులు మాయాపారీణులు నగు మేటిరక్కసులం బదునాల్గువేవురను శరశరాసనాదిసాధనభరితంబుగా నొక్కరథంబును నాయితంబు సేసి కొని రమ్మని పనిచినం జని వాఁడు నట్ల కావించి యుద్ధసన్నద్ధసేనాసమేతుం డై మగుడ నేతెంచి యన్నిశాచరేశ్వరున కి ట్లనియె. 179

క. అరద మిదె వచ్చె వచ్చిరి, దురమునకుం గడఁకఁ గదలి దోర్బలగర్వ
త్వరితు లగుచు నిదె నక్తం,చరవీరులు గలని కరుగ సమయం బనినన్. 180

వ. అప్పుడు ఖరుండును సమరసన్నాహంబు మెఱయం జనుదెంచి బహురత్నకీలితంబును గనత్కనకమయంబును బతాకాభిశోభితంబును వైదూర్యఖచితకూబరంబును నానావిధచిత్రరచనావిరాజితంబును గాంచనాచలశృంగోన్నతంబును శబలవర్ణాశ్వకలితంబును శరశరాసనాదిసాధనభరితంబును నగు నారథోత్తమం బెక్కి తోడన దూషణుండును త్రిశిరుండును దమతమయరదంబు లెక్కి వెలుంగునుత్సాహంబును సేనాసంభ్రమంబునుం గనుంగొని యలరుచుఁ గ్రూరభటపరివేష్టితుం డై శూర్పణఖ ముంగలగా జనస్థానంబు వెడలె నాసమయంబున. 181

సీ. కుంభిని గంపించె ఘూకారవంబులు, వీతెంచెఁ గీలాలవృష్టి గురిసెఁ
బిడుగులు వడిఁ గూలె భీకరోల్కలు రాలె, నతిఘోరపరివేష మర్కుఁ బర్వెఁ
బొరిఁజుక్కలినుచుట్టుఁ బొడసూపెఁ బడగపైఁ, జెదుగ్రద్ధగూర్చుండె సిడమువిఱిగె
దేరివాజులు మ్రొగ్గె దెసలఁ గావిరి గప్పె, బహుచిత్రమేఘము ల్బయలనిండె
వాయు వెదురువీచె నాపోయె వఱదులు, ధూమకేతువితతి దోఁచెఁ దిమిర
మడరె నన్నిశాచరాధీశుడామూఁపుఁ, గన్ను నదరె నశ్రుకణము లొలికె.

వ. మఱియు మహోత్పాతంబు లి ట్లనేకంబులు పొడమినం గనుంగొని నవ్వుచు నవ్వీరుండు రాక్షసులతో ని ట్లనియె. 183

క. ఇవి చూచి మగిడి పోదు నె, బవరంబున దాశరథులపై నాశరముల్
కవిసిన నుడుతతి వడు మృ,త్యువునకు మృతి గలుగుఁ బల్కు లోం జేమిటికిన్.

---

ఉ. పంచవటంబులై నడువఁ బంచె నుదంచితలీల సేన న
క్తంచరకోటి దోఁచుటకుఁ దాఁ గర మొప్ప నిమిత్తభంగు లూ
హించి సుమిత్రపట్టికి నరేంద్రుఁడు ఘోరరణంబు గల్గు నేఁ
డం చట వల్కె దక్షిణముఖం దట పర్వె ధరాపరాగముల్.

మ. కని కాకుత్స్థవరుండు లక్ష్మణునితోఁ గంటే మహోత్సాహవ
ర్ధనదుర్వారగజేంద్రవాహభటబృందవ్యూహసేనాప్రవా

ఆ. అమరగణము గొల్వ । నైరావతము నెక్కి
వజ్ర మలుకఁ బూని । వాసవుండు
వచ్చెనేనిఁ బోరఁ । జచ్చు నాచే నన్న
వెడఁగునరులు పోరఁ । దొడఁగువారె. 185

వ. అని వీరాలాపంబులు సెలంగ సప్తాలస్యుండు సమరకేళీకుతూహలి యై శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముండును దుర్జయుండును గరవీరాక్షుండును బహుషుండును గాలకార్ముకుండును మేఘమాలియు మహామాలియును సర్పాస్యుండును రుధిరాశనుండు నను మేటిరక్కసులు పన్నిగురు దనకెలంకులను ముంగటం ద్రిశిరుండును నగ్రభాగంబున దూషణపురస్సరంబుగా స్థూలాక్షుండును మహాకపాలుండును బ్రమాథియు నను వారు మున్నురుం జనుదేర సేనామధ్యంబున నిజస్యందనంబు మెఱయ నిల్లు నడచి పంచవటి సాత్తేర మునీంద్రదేవగంధర్వసిద్ధచారణులు రణంబు చూచు వేడ్కఁ నంబరంబున నుండి గోబ్రాహ్మణులకు లోకంబులకు శుభంబులు నిమ్మహోత్పాతంబులం గలుగుదోషంబులు నోపాచకులకు గోచరించుంగాక యనుచుండ రప్పుడా రజనీచరులకలకలం బెఱింగి రఘుపుంగవుండు సౌమిత్రిం గనుంగొని. 186

సీ. ఇదె చూడు మిడుఁగులు । లీనుచున్నది విల్లు, కీలితబహురత్నకీల లెసఁగఁ
దూపులు దమయంతఁ । దూణముల్ వెలువడి, రాఁజుచున్నవి భీకరంబు లగుచుఁ
బోరిఁబోరి నపసవ్య । భుజమును గుడికన్ను, నదరుచున్నవి గాన । కదన మిపుడ
సిద్ధించు జయమును జేకులు నాకు నీ, దైవసూచకము దిగ్గయును మేలు
మనసుదిరమయియున్నది । మస్త్రులగుచు, వరుసనిటుగూడి మనమీఁద వచ్చుచున్న
యిన్నిశాటుల నందఱ । నేన పూని, విశిఖములపాలు సేసెద । వివిధగతుల.

చ. జనకజ మున్న భీరువు ప్రచండనిశాచరఘోరరూపముల్
గనుఁగొని యెంత బెగ్గిలునొ । కావున నీవును బాణిపాణి వై
ధనువు ధరించి మీవదినెఁ । దమ్ముఁడ యీగిరిగహ్వరాంతరం
బున నొకగొంది దాఁపు మును । ముట్టఁ దొలంగుట మేలు లక్ష్మణా. 188

ఆ. అరుగు మధికబలుఁడ । వగుట దే నెఱుఁగుదు
నెంత కైనఁ జాలు । దెన్న సమర
కాంక్ష యొందు సెప్పఁ । గడఁగిన నీకు నా
యాన యనిన నాతఁ । డపుడ కదలి. 189

---

హనిశాటేశచమూపమాహవసమీహాలోలమై వచ్చె నీ
దనుజవ్రాతము నేన త్రుంచెద మహీధ్రం బెక్కి నీ వక్కడన్.

క. సీతారక్షణతత్పర, చేతోగతి నుండు చనుము శీఘ్రము మదిలో
భీతవారిజాక్షి దైత్యవ్రాతము గని బెదరు ననిన వడిఁ జని యతఁడున్.

క. ధరణీధరగహ్వరమున, గురుభామిని నుండఁ బనిచి ఘోరాసిధను
ర్ధరుఁడై యచ్చేరువ భీ,కరగతి సౌమిత్రి నిలిచెఁ గడుభక్తిమెయిన్. 190

వ. [1]అప్పుడు గ్రహామధ్యంబున వెలుంగునంగారకుతెఱంగునఁ గ్రూరరక్షోభటపరి
వేష్టితుండై ఖరుండు ఘోరసైన్యంబుతోడ నాశ్రమంబు దఱియం జొచ్చి వచ్చి
ముందటం దోఁచిన రఘుపుంగవుండు. 191

చ. కవచలలామముం దొడిగి కాంచనసూత్రనియంత్రితంబుగాఁ
గవదొన లూని చైత్ర మగుకార్ముక మెక్కిడి ఘోరశింజినీ
రవము దిగంతరంబున నిరంతరపూర్ణముగా నొనర్పఁ బైఁ
గవిసిరి విస్ఫులింగములు గ్రైదువులం జెదరంగ రాక్షసుల్. 192

చ. పొరిఁబొరి నార్పుచుం గవిసి భూరితరంబుగ గర్జదభ్రముల్
ఖరకరుఁ గప్పినట్లు రణకర్కశు నారఘువీరుఁ గప్ప న
య్యురవడి సూచి యప్పుడు నృపోత్తముఁ డొక్కఁడు వీండ్రు పల్వు రి
ద్ధుర మెటు లౌనొ యంచు మది దూలఁగ నుండిరి నింగి నిర్జరుల్. 193

వ. అయ్యవసరంబున. 194

—శ్రీరాముండు రాక్షససైన్యంబుల నుఱుమాడుట.—

సీ. అమరేంద్రుమీఁద దండై పేర్చి యేతెంచు, కొండలఁ బోలు వేదండతతులు
ప్రకటప్రభంజనుపై నెత్తివచ్చుకా,రంబినిఁ బోలు రథవ్రజంబు
కుంభజుమీఁద మార్కొనవచ్చు సంభోధి, తరఁగలగమిఁ బోలు తురగచయము
పంచాననముమీఁద బలువిడి నడచు వే,దండయూథముఁ బోలు దైత్యభటులు

1. 191 మొదలుకొని 198 వఱకుఁ గలపాఠమునకు మాఱుగా
క. అంత మహాగగనాంతర, మంతయుఁ గరవాలకిరణ...నపరిఘా
కుంతక్షురికాపరశు,ప్రాంతముగా వచ్చుసేనఁ గని రఘుపతియున్.
ఉ. కాంచనరత్నదీప్త మగుకంకటముం ధరియించి శాతబా
ణాంచిత మైనతూణయుగ మంసముగా బిగియించి మించి దీ
పించుమహోగ్రకార్ముకము భీమరయం బెసలార నారి యె
క్కించి గుణస్వనంబుఁ బరఁగించుచునుండెఁ బ్రచండమూర్తి యై.
ఉ. ఆసమయంబునన్ సురవిహాయచ్చరసిద్ధసముత్కరంబులున్
వాసవలోకవాసినృపవర్గము దివ్యవిమానదీధితుల్
భాసురభంగి నింగిఁ గనుపట్టఁగఁ జూడఁగ వచ్చె నోలి భీ
మాసురకోటితోడ నసహాయత మార్కొనురామభద్రునిన్.
సీ. అమరేంద్రుమీఁద దండై పేర్చి యేతెంచు, కొండలఁ భోలు వేదండతతులు
ప్రకటప్రభంజనుపై నెత్తి వచ్చుకా, రంబినిఁ బోలు రథవ్రజంబు
కుంభజుమీఁద మార్కొన వచ్చు సంభోధి, తరఁగలగమిఁ బోలు తురగములును
బంచాననముమీఁద బలువిడి నడచు వే,దండయూథముఁ బోలు దైత్యభటులు

కులిశసమమార్గణుండును ◆ నలఘుబలుఁడు
నుగ్రతేజుండు రాజసింహుండు నైన
రాముఁ గని యార్చి నడచె నుద్దామగమన
గాఢవిభ్రాంతి మెఱయంగ ◆ ఖరునిబలము. 196

సీ. అంత రక్కసు లనేకాస్త్రంబు లొక్కటఁ, గురియుచు నంపంద ◆ పరశుఖడ్గ
పట్టిస తోమర ◆ పరిఘ గదా చక్ర, దండ ముద్గర శక్తి ◆ భిండివాల
శూలాదులను భూమిపాలు నిరీక్షించి, వైచిరి వైచిన ◆ వాని కోర్చి
కుసుమితాశోకంబుకొమరున నమరుచుఁ, గ్రేఁగంటిచూపునఁ ◆ గెంపు దోఁప
నన్నిశాటకోటి ◆ నతఁ డతినిశితశ, రముల నుక్కడంచి ◆ రయము మెఱయ
మఱియు వాఁడితూపులఱిముఱిఁ బెనుమంట, లెగయఁ బెక్కులొక్క ◆ తెగ నిగిడ్చె.

చ. మఱువులు సించుచుం బెలుచ ◆ మర్మము లూడ్చుచు నోలిఁ గైదువు
ల్విఱుచుచుఁ దెలుదోయి విదళించుచుఁ గండలు చెక్కుచుం దల
ల్నఱకుచు రక్తపూరము లిలం దొరఁగించుచుఁ బ్రాణవాయువుల్
పెఱుకుచు నన్నిశాచరులఁ ◆ బెక్కు తెఱంగులఁ జంపె నేపునన్. 197

ఉ. పైకొని వెండియుం వివిధబాణపరంపర లేయ వాని బ
ల్లీకునఁ దున్మి కట్టలుకఁ ◆ బేర్చినఁ జెచ్చెర నప్డు రాక్షసా
నీకము పెల్లు గాఁగ ధరణీస్థలిఁ గూలె గరుత్మదుత్పత
ద్భీకరపక్షమారుతహతిం దరుషండము గూలుచాడ్పునన్. 198

ఉ. అట్టియెడన్ శరావళి ఖరాసురుఁ జేసె మహీశు నంతయున్
బెట్టుగ నార్చి దానవులు ◆ పెల్లు నిగిడ్చి రనేకబాణముల్
దట్టము గాఁగ వైచిరి గదాముసలాదులు నింగి చూడ్కికిం
బట్టెడ లేక కైదువులు ◆ పందిరికైవడి నిండి క్రమ్మఁగన్. 199

క. ఇమ్మెయిఁ బఱపినఁ దనపైఁ, గ్రమ్మెడుశస్త్రాస్త్రతతులు ◆ గాకుత్స్థుఁడు చా
పమ్మునఁ బొడమినఘోరపు, టమ్ములఁ బెనువెల్లిఁ బఱపి ◆ యడఁగం జేసెన్. 200

చ. ఘనరథసమ్మునన్ నిగుడు ◆ కైదువులన్ నుఱుమాడి మీఱి తాఁ
కినశరపంక్తిచేతఁ దొరఁగెన్ రుధిరంబు నిశాటసేన న

---

కులిశసమమార్గణుండును ◆ నలఘుబలుఁడు, నుగ్రతేజుండు రాజసింహుండు నైన
రాముఁ గని యార్చి నడచె నుద్దామభీష, గమనవిభ్రాంతి మెఱయంగ ◆ ఖరుని గడచి.

ఉ. ఆభీలంబుగ నిట్లు దైత్యఘనసైన్యం బుద్ధతిం ద్రోవఁ డై
పైభూరేణువుఁ బర్వ బాణమున కుద్యద్భంగిగాఁ జూఁచినన్
శోభిల్లెన్ రఘురామహస్తము దిశాకుండాలకుండాభ మై
భూభృద్విధ్వస్తఘూర్ణరావహమహాభోగీంద్రభోగాభ మై.

ద్దనుజాశరాదు లప్రతిహ।తం బయి బల్విడి మీఱి వచ్చి తాఁ
కిన నిట రాముమేనఁ దొరఁ।గెఁ రుధిరంబు మహాద్భుతంబుగన్. 201

చ. వెసఁ బదునాల్గువేలబలు।విండ్లను దానవు లేయుబాణముల్
ప్రసభరయంబునం దునిమి । పార్థివుఁ డొక్కఁడు నేయుబాణముల్
మసలక యెక్కుడై సిగిడి । మాడుచుఁ బాఱి యనేకఘోరరా
క్షసులయురంబు లుచ్చి చని । కాఁడు రణాంచలమేదినీస్థలుల్. 202

క. మును గైదువులం బొరిగొని, చని జోళ్లను నుఱుము సేసి । సర్వాంగములం
గొని వ్రచ్చు రాముశరములు, దనుజానీకములఁ బొదివి । తరతరమ వడిన్. 203

సీ. మదగజేంద్రంబుల।నుదురులు గాఁడి తోఁ,కల నుచ్చిపోవును । గ్రందుఁగాఁగ
రథసముద్ధతు లగు।రథికసారథు లొక్క,గుది యయి ధారుణి । గూలఁ దాఁకు
నద్భుతాటోప మై । యాశ్వీకవ్రాతంబుఁ, దునుముఁ దురంగాలి।తోఁన తునియఁ
బటుసముద్ధతి వీర।భటుఁ దాఁకి యవ్వలి, భటుఁ దాఁకి పేరుగాఁ । బాఱి గ్రుచ్చు
బిరుదుపడగల గొడుగుల।పిండు నుగ్గు
నూచముగఁ దాఁకు రామధ।నుర్విముక్త
నిష్ఠురోత్పాతనిర్ఘాత।నిభనిశాత
చండసంపాతకాండప్ర।కాండసమితి. 204

వ. ఇవ్విధంబునం బ్రళయకాలోద్దండకండధనునంమఁ బెలుచం గలుగునుద్దండరేఖ యుఁ గల్పావసానసమయసముదీర్ణప్రతాపదీపితుం డగుతపనువలనం గలుగు వేఁడిమియును సంవర్తవేళాప్రవర్తితదారుణసంహారవిహారుం డగురుద్రునందలిరౌద్రంబును దనయందుఁ దోఁప నతిఘోరాకారుం డై యశనిసదృశంబు లగుతీక్ష్ణశరంబులు నిగిడించునారాఘవేంద్రుం గనుంగొని యల్గి ఖరుండు ఖరస్వరంబున నార్చుచుం జేయి వీచి కదియుండు పొడువుండు పోకుండ మ్రింగుం డొక్కమనుష్యున కనేకమనుష్యాశనులు దెరలనేల యని పురికొల్పినం బై పైఁ బదురక్కసులంబెక్కండ్రు రూపుమాపుచు మాయల నందండ కదియురథయూథగజవ్రజహయచయసైనికనికరసూతవ్రాతభటపటలస్ఫుటచటులనిశాటసేనాకాననంబు నఱకం దొడంగిన బాణంబులుఁ గృపాణంబులుఁ గరిదంతంబులుఁ గుంతంబులు శూలంబులు ఫాలంబులుఁ గపోలంబులు శిరంబులు నసిచయంబులు రథావయవంబులు భగ్నంబులుగ బహువిధనాదంబు లెసంగఁ జరణజంఘోరుమధ్యజానుస్కంధకంధరాధరాదిప్రదేశంబులు ద్రెస్సి పరశుపట్టిసప్రాసశరాసనతోమరముద్గరకుఠారక్షురికాదిసాధనంబులతోడ నేపఱి రూపఱి పదుపదాతులును గళంబులుం బాదంబులు ఖలీనంబులుఁ బుచ్ఛంబులుఁ బక్కెరలుఁ బల్యాణంబులు నాశ్వికులతోడన పొడిపొడి యై నేలం గలయునశ్వంబులును వరూథంబులుఁ గూబరంబులు యుగ్యంబులు రథికులు సారథులుఁ గేతువులుం జక్రంబులుం జక్కు

డిచినట్లు పెక్కుతునియలై యోలిం గూలురథంబులును నంకుశంబులు రాలియు
మావంతులు గూలియుఁ దుండంబులు దునిసియు నంగంబులు వ్రస్సియుఁ గుం
భంబులు పగిలియు బొందులు నొగిలియు నవగ్రహంబులు వాహిత్థంబులు నీషి
కలు నిర్యాణంబులుం జాలికలు నాపుంఖస్యూతంబు లయ్యును బుచ్ఛంబులు
దునిసియుఁ గులిశనిహతగిరినికరంబులుంబోలెఁ బొలియుకరినికరంబులును నానా
విధంబుల బలువిడిగాఁ జతురంగబలంబుల బారిసమరినం దెగిపడియును బండ్లు
గొఱుకుచు నార్చువికటదంష్ట్రిలతోడితలలును దలలు దెగినం బడక తిరుగుకబం
ధంబులు ద్రెళ్లి పైఁబడినం జదియురథంబులును రథంబులు విఱిగి కూలునెడఁ
దొడిఁబడి తునియుపదాతులును బదాతులచేతుల హేతులలోన వాగి మిట్టిమిట్టి
పడుచోటులును రామశరంబులు కన్నులం గాఁడినఁ దిరిగి తమవారిన చదుపు
నేనుంగులును గోలలు గుప్పలుగూర నాటిన నిలువున విగతాసులై య
మ్ములదిమ్ములుంబోలె వ్రాలుదానవులును గాలు సేలు తొడ మెడ ప్రక్క
డొక్క కోఱ దాఁడ యనునివి రూపఱం ద్రవ్వినం బర్వతఖండంబులభంగిం
బడి యున్నదితిజవ్రాతంబు నై యాసైన్యంబు కించిదవశిష్టంబుగాఁ గూలి తెర
లుటయును. 205

చ. తెరలినసేన నిల్పి సము। దీర్ణరయంబున రాము నేయుచుం
బురికొనఁ జేసె దూషణుఁడు। పొంగుచు సేనలు దండనాథుతో
నురవడిఁ బేర్చి యార్చుచును। నొక్క మొగంబుగ దైత్యు లమ్మహీ
వరు నలయించి పట్టుకొను। వారయి చేరిరి దాపునొద్ధతిన్. 206

క. చేరి మహావృక్షంబుల, భూరిశిలల నస్త్రశస్త్ర। పుంజంబుల న
వ్వీరుని నొంపఁ గడంగిన, నారాజన్యుండు గ్రోధ। మగ్గల మగుడున్. 207

ఉ. స్థూలకపాలముల్ వగులఁ। దోరపుమేనులు వ్రయ్య నాయుధా
ధీరభుజావళుల్ దునియ। భీమముఖంబులు నాట నుగ్రదం
ష్ట్రాలి మహీస్థలిం బడ భ। యంకరనేత్రము లుచ్చిపోవ ను
త్తాలవిశాలవక్షములు। దండడిఁ గూల నిగిడ్చె బాణముల్. 308

మ. వడిఁ దూణమ్మున నమ్ము గైకొనుట తీ। వ్రస్ఫూర్తి సంధించు టే
ర్పడ లీలం దెగవాపు టేయుట మదిన్। భావింపఁగా రాక వి
ల్లుడు సై యుండుటయుం బ్రచండగతి ర। క్షోవక్షముల్ వ్రయ్యుచ
ప్పుడు వా రొక్కటఁ గూలుమ్రోఁతయు నభో। భూభాగముల్ గప్పఁగన్. 209

క. ఇంచుకతడవున కాన, క్తంచరసంఘములఁ బలుచ। గాఁ జేసినఁ గో
పించి పతిమీఁదఁ బఱపెం, జంచద్గతి దూషణుండు। సాయకపంక్తుల్. 210

క. దార యమ్మోయిఁ దఱిమిన నొ, క్కురవడిఁ జేయంగఁ గలుగు। యోధతతి రిపుం
బరిమార్పుఁడు పొడువుం డను, పరుషోక్తులతోడఁ గదిసెఁ। బటురౌద్రమునన్.

వ. *ఇట్లు కవిసిన. 212

శా. జ్యానాదంబు చెలంగఁ జిత్రతరవేగాలక్షితాధానసం
ధానాకర్షణమోక్షితుం డగుచు గంధర్వాస్త్రపూర్వంబుగా
నానాబాణము లేసె నవ్వసుమతీనాథుండు దద్బాణసం
తానం బుద్ధతిఁ బర్వె నల్లెడ మహోద్ధ్వానంబుతో నత్తఱిన్. 213

క. శరములు బలువిడి నిగుడుచుఁ, బరువడి నయ్యాతుధానభటముక్తశిలా
తరుశస్త్రపరంపర లెడఁ, దొరఁగించుచు వారిఁ దోన తునుమాడునెడన్.

చ. వికటవిభూషణావలులు విస్ఫురితాంగదబాహుఖండముల్
శకలితసాధనంబులు విశంకటకంకటకాంశుకంబులు
న్మకుటవికీర్ణరత్నములు నూతనకుండలచారుమస్తక
ప్రకరములున్ విచిత్రతరభంగి వెలింగె రణాంగణంబునన్. 215

—దూషణాదులు రామునితోఁ బోరి చచ్చుట.—

వ. అప్పుడు రఘువగువివిధవిశిఖంబుల బడలువడం బడిననిశాచరకళేబరంబులం గనుంగొని ఖరుండు రెట్టించినకోపంబునం గదలి రామున కభిముఖంబుగా నరదంబు పోనిమ్మనుచు సారథి నియోగించి శింజిని మ్రోయించుచు సేనాపురస్సరంబుగాఁ దక్షిణకేతుమధ్యంబున వెలుంగుసైంహికేయుండునుంబోలె ఘోరరాక్షసపరివృతుం డై వెలుంగుచుఁ బోరికిఁ గడంగు నెడ నెడసొచ్చి తలకడచి సమస్తపౌలస్త్యులు గర్జిల్లుచుం బెల్లు గురియునీలమేఘంబుల విడంబించుచు సాయకాసారంబు ఘోరంబుగాఁ గురిసి యవ్వీరుపై ఖడ్గముద్గరశూలపరశుచక్రాదిసాధనంబులు వైవ వాని కతం డొక్కింతయుం దలంకక తదీయాస్త్రవేగంబులు సముద్రంబుం జొచ్చిననదీప్రవాహంబులకరణిం దనశరపరంపరల నడంగ మాడ

* ఈవచనము మొదలు 244 పద్యమువఱకు వ్రాతప్రతులయందుఁ గనఁబడుపాఠము.

మ. కదియం జూచి మహీవిభుండు నగుచున్ ♦ గాంధర్వబాణంబు బె
ట్టిదుఁ డై యేసిన నంపవెల్లువలమా♦డ్కిం బొంగి పైఁ బేర్చినం
జదిసెన్ వారణపంక్తి గూలె రథముల్ ♦ సర్వంబుఁ జచ్చెన్ హరుల్
సొగులై కూలిరి దైత్యవీరులు సమి♦ద్భూభాగ మల్లాడఁగన్.

మ. బల మెల్లం దుము రైన దూషణుఁడు కో♦పంబున్ సమాటోపముం
జలమున్ శోకముఁ గప్ప నవ్విభునిపైఁ ♦ జండాశుగంబుల్ వెసం
గలయన్ నాటిన నొచ్చి వాని విరథుం ♦ గాఁ జేసె రాజాగ్రతన్
విలసద్బాణపరంపరాప్రతతిచే ♦ విస్ఫారదోశ్శక్తిమై.

మ. విరథుం డయ్యును బీఱువోక ఘనదో♦ర్విన్యాస మొప్పారఁగాఁ
బరిఘం బుద్ధతిఁ బుచ్చుకొంచుఁ గదియం ♦ బాఱంగ వే ద్రుంచెఁ ద
త్కరయుగ్మంబును బాణయుగ్మమున న♦ల్కన్ వచ్చెఁ దద్వక్షము
ద్ధురబాణంబునఁ గూలె వాఁడు భువనో♦ద్బోధంబుగా శోఁజాచున్.

లీకృతకోదండుం డగుచు విజృంభించి మఱియుఁ గాలపాశసంకాశంబు లగునసే కశిలీముఖంబులు నిగిడింప నాకాశంబున ధూమాగ్నిపగిది మండుచు నడరి వారి నానావిధంబుల వధియింప నయ్యాతుధానులు మెండుకొని వెండియుం బోవక.

క. ఇషువులు గురియఁగ నారఘు,వృషభుం డని సైఁచి నిలిచె । వెస నప్డు మహా
విషధరములు వర్షింపఁగ, వృషభంబు దలంక కున్న । విధ మొప్పారెన్. 217

ఆ. ఇట్లు మెఱసి మెఱుఁగు । లీనువాలమ్ములఁ, బఱపి వివిధగతుల । బారిసమర
సమర ముడిగి విగత । శస్త్రులై ధరణి గం,పింపఁ బాఱి రా ని । లింపరిపులు.

ఉ. అప్పుడు దూషణుండు వసు । ధాధిపునమ్ములచేతఁ బైపయిం
గుప్పలు గాఁగ రక్కసులు । గూలినచందము చూచి కన్నులన్
నిప్పులు రాలఁ బెల్లడరి । సింగఁ జెలంగెడునార్పుతో వడిం
గప్పె నఖండచండతర । కాండపరంపర నారఘూత్తమున్. 219

మ. పెలుచం గప్పిన నన్నిశాచరుపయిన్ । స్ఫీతాగ్నిపాతిం బెనం
దలఁపింపం దగు నస్త్రపంక్తిఁ గినుకం । దా నేసె నస్త్రీయ న
బ్బలుబాణంబుల గోర్చి వాఁడు మఱియుం । బంటింపఁ గాళీవిషో
జ్జ్వలశస్త్రంబు లనేకముల్ వఱపె నా । తన్మోపాలుపై నేపునన్. 220

సీ. పఱపె నవ్వీరుండు । పండ్రెండుకోలల, బ్రహ్మాండంబుల । బగిదివాని
నొక్కటఁ దొడిగి యం । దొక్కటఁ బడగయు,నొకశరంబున విల్లు । నొకట సూతు
మస్తకంబునుఁ జతు । ర్మార్గణి నరదంబు,మాపుల రెంట మై । మఱువు నొకట
నాతపత్రము రెండు । శాతశరంబుల, ఘనరయంబునఁ ద్రుంచి । మొనసి మఱియు
విస్ఫులింగతతులు । వివిధముఖంబుల, వెడలునట్లు గాఁగ । నడుగుమెఱుఁగు
టంపగముల మిగులు । నన్నియు నఱికిన, నప్డు విరథుఁడగుచు । నవని కుఱికి. 221

చ. మఱియు మహాకపాలుఁడఁ బ్రమాథియుఁ బంచసహస్రయోధులుం
బఱిమి నరేంద్రు నుగ్రశర । ధారల ముంచిన వారి నందఱం
బఱియలు నుగ్గునూచములుఁ । భాగశతంబులునై ధరిత్రిఁ బె
ల్లొఱలుచుఁ గూలి క్రందుగను । నొక్కటఁ బ్రోవులుగట్ట నేసినన్.

క. స్థూలాక్షుఁ డార్చి కదిసిన, వాలమ్ములు నిగుడఁ జేసి । వచ్చెను వడి భూ
పాలుం డర్కరథాంగ, స్థూలం బగువానికన్ను । దో యుగ్రగతిన్.

ఉ. వచ్చిన నమ్మహాసురుఁడు । వాలినవేదన గూరి త్రోలుచుం
జచ్చిన శ్యేనగామి యను । సైనిపుఁ డాదిగ నాప్తకోటితో
వచ్చి ఖరుండు దాఁకె నని । వారణమైఁ ద్రిశిరుండు దాను గా
ర్చిచ్చున కగ్గమై యుఱుకు । సింగమున ట్లతిరౌద్రభంగిగన్.

ఉ. తాఁకినఁ బేర్చి యేసె వసు । ధావరుఁ డార్చి శరాలి నుగ్గుగాఁ
దాఁకఁగఁ జండదీప్తి దివి । దాఁకెడునమ్ముల గుండె వ్రయ్యఁగాఁ
దాఁకినఁ గూలుదానవులు । దండడి నొండొరులతోడ వీడ్వడం

క. గద దిగిచి వైచె వైచిన, నది నడుమన తునిసి తొరఁగ । నందంద పటు
ప్రదరంబులు పఱపియు నెని, మిదినారాచములు వాని । మేనం గ్రుచ్చెన్. 222

వ. అంత నప్పౌలస్త్యుండునుం గనలి కనకపట్టవేష్టితంబును నాయసశంకుకీలితంబును నశనిసమస్పర్శంబును నాదిత్యఛత్రనిభంబును గుపితోరగఘోరంబును గాలదండప్రచండంబును ననేకప్రాణిశోణితమలినంబు నగునొక్క మహాపరిఘంబు గరంబున నమర్చి మెఱుంగులు సుడివడం ద్రిప్పుచుఁ బతంగంబు కార్చిచ్చు మొగంబునకు వచ్చువిధంబునం గడంగె నప్పు డెడసొచ్చి మహాకపాలప్రమాథిస్థూలాక్షు లార్పులు నిగుడ శూలపరశుపట్టిసంబు లంకించి వైచిన రఘుపుంగవుండు వానిం దెగనేసి యమ్మహాకపాలు నొక్కభల్లంబునం దల డొల్ల నేసి విశిఖదశకంబునం బ్రమాథిం బంచత్వంబు నొందించి యాస్థూలాక్షు మేనం బెక్కంబకంబులు నించి వధించిన నత్తెఱంగుం గనుంగొని దూషణుండు రెట్టించినకోపంబున నతనిం బేర్కొని. 223

ఉ. ఇమ్మహనీయసాధనము । నింక సహించెదు గాక నీవు ని
క్కమ్ముగ నంచుఁ బూని పరి । ఘం బిరుచేతుల నెత్తి నవ్విభుం
డమ్ముల రెంటఁ జెక్కలుగ । నాభుజయుగ్మము ద్రుంప వాఁడునుం
గొమ్ములు ద్రుంపఁబడ్డ సవ । కుంభివిధంబునఁ గూలెఁ గుంభినిన్. 224

క. దూషణుఁడు వడిన మఱియును, దోషాచర శేష మెల్లఁ । ద్రుంచుటకు మహా
రోషంబునఁ జాపజ్యా, ఘోషం బొసరించి మునుము । గొని తునుము నెడన్.

---

దాఁకఁగ నెక్కజంధముల ♦ తాఁకున ధాత్రికి వ్రేఁగు దాఁకఁగన్.

క. ఖరుఁడును ద్రిశిరుఁడుఁ బెక్కఁగ, నొరలును సైన్యంబు నపుడు ♦ ద్రుంగిన వెస నా
ఖరుతోఁ ద్రిశిరుఁడు నన్నుం, దిరమై యిటు నూడు మనుచుఁ ♦ దీవ్రస్ఫురణన్.

ఉ. లావు వలిర్ప నాఁడుతల ♦ లం ద్రిజగంబు చలింప నార్పుచున్
వావిరిఁ దేరు దోలుకొని ♦ వచ్చి రఘూద్వహుఁ దాఁకి యేసె నా
నావిధచండకాండగమ ♦ నస్ఫుటజాతసమీరకంపితా
శావలయత్వమావలయ ♦ సామజభూధరభూరుహంబుగన్.

వ. ఇట్లేసిన.

మ. కని యత్యుద్ధతి రాముఁ డవ్విశిఖముల్ ♦ ఖండించి తత్సూతుఁడుం
దునియన్ వాజులు గూల వాఁ డవశుఁడై ♦ తూఁగాడి వ్రాలంగ నే
సిన నాలోనన మూర్ఛదేఱి యలుకన్ ♦ శీఘ్రంబుమై ఖడ్గముం
గొని యంకించుచుఁ బెల్చఁ బై నడరినం ♦ గోపించి భూపాలుఁడున్.

మ. తల లోలిం దెగ నొక్కయేటునను దో ♦ ర్దర్పంబుమై నేసినం
గులిశాఘాతవిభిన్నపక్షవిపుల ♦ క్షోణీధ్రముంబోలె భూ
స్థలిఁ గూలెం దనుజేంద్రు మొండెము వడిం ♦ దత్పాతముం జూచియుం
దలఁ గొక్కించుక లేక పేర్చి నృపతిం ♦ దాఁకెన్ ఖరుం డుద్ధతిన్.

వ. శ్యేనగామి శక్తియుఁ బృథుగ్రీవుండు భిండివాలమ్మును యజ్ఞశత్రుండు శూలం
బును మహారథుండు పరశ్వథంబును దుర్జయుండు తోమరంబును కరవీరాక్షుం
డు కరవాలంబును బరుషుండు పరిఘంబును గాలముఖుండు ముసలంబును మేఘ
మాలి ముద్గరంబును మహాబాహుండు గదయును సర్పాస్యుండు పట్టిసంబును
రోహితాంబరుండు కుంతంబును గొని చఱల నదరులు చెదర నంకించుచుం
గవిసినఁ దత్కరంబులతోన శిరంబులు దునియం బండ్రెండు పటుభల్లంబులు
నిగిడించి మఱియు వివిధవిశిఖంబుల నిరవశేషంబుగా రక్కసులను నుక్కడంచి
దక్షాధ్వరధ్వంసంబు సేసినధూర్జటికిం బాటియగుచు సంగరాంగణంబున వెలుం
గుచున్నరఘుపుంగవుం గనుంగొని ఖరుండు గోపంబు దీపింపం గడంగునెడఁ
ద్రిశిరుం డతని కిట్లనియె. 226

—త్రిశిరుండును ఖరుండును రామునిచేఁ జచ్చుట.—

చ. నను విను రాక్షసేశ్వర ♦ రణంబున నీతనిఁ ద్రుంచివైచి నీ
మన మలరింతుఁ జొచ్చి పటు♦మార్గణసంపదసొంపు సూపెదం
దునిసెద నొండె నవ్విభుని♦తూపుల నిశ్చలభంగి నింక వే
యును బని లేదు నీ వొకము♦హూర్తము తప్పక చూడు మేర్పడన్. 227

ఆ. అనుచు నతని నుడిపి ♦ ధనువు మ్రోయించుచు, నంపగములు వఱప ♦ నవ్విభుండు
వాని నెల్ల వింట ♦ వడిఁ బాఱఁజదుపుచు, లెక్కసేయకుండె ♦ నుక్కుమెఱసి. 228

క. ఉన్నఁ గనుంగొని మఱియుం, గ్రొన్నారాచములు మూఁడు ♦ గొని నుదు రేయం
జెన్నగుకుసుమాభరణం, బున్నతెఱంగైన దాని ♦ కొయ్యన నగుచున్. 229

తే. శరచతుష్టయమున రథా♦శ్వములు మ్రొగ్గ
నంబకాష్టకమున సూతుఁ ♦ డవని నొఱఁగ

---

వ. ఇట్లు దలపడి.

మ. ఖరదైత్యాధిపుఁ డేయుబాణములు నా♦కాకుత్స్థబాణౌఘముల్
సరి నాకాశము నిండి తాఁకుదలలం♦జండాగ్నికీలాసము
త్కరముగ్రంబుగఁ జేయఁ దద్గతఘన♦ధ్వానంబు బ్రహ్మాండక
ర్పరముం దాఁకి తెరల్చి రాల్చె నుడుతా♦రామౌక్తికశ్రేణులన్.

క. సేవలతోఁ బెనఁగుట ని, మ్మానవపతి డస్సె నింక ♦ మర్దితుఁ డగు నా
చే నని ఖరుఁ డాసాసల, నానరపతితోడఁ బెనఁగె ♦ నాగ్రహభంగిన్.

క. ఖరుఁ డించుక యొడ గని యా, ధరణీశ్వరువిల్లు దునుమ ♦ దండడి నృపశే
ఖరుఁడును గుంభజుఁ డిచ్చిన, వరచాపం బెత్తి యేసె ♦ వడి నాఖరునిన్.

చ. అలయక పోరుదానవుస♦ముగ్రత సైఁపక సూతు నేసి వా
జులఁ బటుచాపముం దునిమి ♦ శోణితపూరితగాత్రుఁ జేసినం
బ్రళయవిజృంభమాణయమ♦భాతి దలిర్పఁగ విస్ఫురద్గదా
కలితకఠోరబాహుబల♦గర్వ మెలర్ప నెదిర్చి యార్చుచున్.

నొక్కకోలఁ గేతువు దెగ ♦ నొకట వాని
యురము దూఱి పాఱఁగ నేసి ♦ విరథుఁ జేసి. 230

క. ధర కుఱుక మూఁడుశరముల, శిరములు దునుముటయు భగ్న ♦ శృంగం బగుభూ
ధరముగతి నన్నిశాచరుఁ, డురుతరకీలాలధార ♦ లొలుకం గూలెన్. 231

వ. ఇత్తెఱంగునం ద్రిశిరుండు గూలినం గనుంగొని ఖరుండు కోపాటోపంబున శింజిని మ్రోయించుచు శరపరంపరలు పరఁగించుచు నరదంబు చిత్రగతుల మెఱయ రఘువరుం దలపడియె నప్పు డవ్వీరుండును వివిధవిశిఖాసారంబు ఘోరంబుగా నెదుర్కొనియె న ట్లయ్యిరువురమార్గణంబుల నంతరిక్షం బలక్షితం బగుచుండె నాసమయంబున. 232

క. బరిగోలచేత మదసిం, ధురముం గనలించినట్లు ♦ దూపుల నాభూ
వరుఁ గనలించుచుఁ గవచము, మురియలుగా నేసి విల్లు ♦ ముష్టికిఁ ద్రుంచెన్.

ఉ. త్రుంచిన నన్నరేంద్రుఁడు వి♦ధూమహుతాశనుభంగి మండుచుం
గాంచనరమ్యమైనవిలు ♦ గ్రమ్మఱ నొండు ధరించి విక్రమో
దంచితలీలఁ దుత్తునియ ♦ లై పడ భల్లములం బతాక ఖం
డించి కడిందితూపులు వ♦డిం బదుమూఁ డరిఁబోసి వెండియున్. 234

క. ఒగి విల్లు సూతుతలయుం, దెగిపడ నొకటొకట హరులు ♦ ద్రెళ్ల నిరుగవక్
నొగి రెంట మూఁట నిరుసులు, నొగలు విఱుగ నొక్కొటవాని ♦ నొనేయుటయున్.

వ. అతండు గదాపాణి యగుచు నిలాతలంబున కుఱికి నిలిచినం గనుంగొని. 236

క. ఓ రాఘవ యిప్పాటునఁ, జేరుగు జము నంచు ఘోర♦శీఘ్రసమగ్రో
దారత నైచిన మంటలు, పూరించుచు నడరె నది న♦భోభాగమునన్.

చ. అడరిన నుజ్జ్వలాస్త్రనిచ♦యంబు రయంబున నేయ నంత బ
ల్పిడుగును బోలు చుల్కలను ♦ బెల్లుగ రాల్చుచుఁ జేర్చుమంట న
య్యడవి ననేకభూరుహచ♦యంబులఁ గాల్చుచుఁ దూలి మేదినిం
బడియె మహోగ్రమంత్రబల♦భగ్నభుజంగమపుంగవాకృతిన్.

మ. గద నుగ్గై పడినం గడంక నొకవృ♦క్షం బుద్ధతిం గొంచు వే
కదియన్ వచ్చిన బ్రాను ద్రుంచి పటుదో♦ర్గర్వంబుమై నొంచినన్
మది శంకింపక చొచ్చి పట్టుకొన నా♦త్మం గోరి డాయంగ వే
పదినాఱుల్ శరముల్ నిగిడ్చి ఖరుశుం♦భద్దేహముం దూఱఁగన్.

క. ఉరుశరము లవయవమ్ముల, సరభసముగ నాటి యుచ్చి ♦ చన గైరికభూ
ధర మట్టు లెదురుసను నా, ఖరుతో వరపాలుఁ డనియెఁ ♦ గలుషం బెసఁగన్.

తే. ఇంచుకేనియు దయలేక ♦ యేపు రేఁగి, మునులఁ బెక్కండ్ర నమలి తి♦వ్వనమునందు
నేఁడు జముఁ గూడఁ బుచ్చెద ♦ నీచకష్ట, చరిత నిలు మని రోషసం♦భరితుఁ డగుచు.

క. పలికి యమోఘాస్త్రం బు, జ్జ్వలతేజం బెసఁగ వింట ♦ సంధించుటయుం
గఱఁగె మహీవలయనభో, వలయంబులఁ గలుగుభూత♦వర్గం బెల్లన్.

ఉ. ఓరి నిశాచరాధమ మదోద్ధతిఁ దాపసవిప్రకారముల్
వారక చేసి తా ఫల మవశ్యముఁ బొందక పోవునే యమా
గారగతుండ వై కుదువఁ గాలము నీ కిదె చేరె నింక నా
ఘోరశరంబులన్ జమునికోర్కులు దీఱఁగ నిన్నుఁ ద్రుంచెదన్. 237

కవిరాజవిరాజితము.

అన విని నవ్వుచు నావసుధేశున కాతఁడు గ్రమ్మఱ ని ట్లను నీ
వని మొన నిప్పుడు గొందఱ దుర్బలు లైనయలంతినిశాచరులం
దునిమితి నంచు మదింపక విక్రమధుర్యుఁడ వేని మదీయగదా
ఘనహతిఁ గూలక చక్కనిబంటవు గమ్ము వృథాకథ లేమిటికిన్. 238

చ. అనుచుఁ బ్రదీప్తహేతివలయం బగునగ్గద ద్రిప్పి వైవఁ జోఁ
కినవనభూరుహంబులను గీలల నీఱుగఁ జేయుచున్ మహా
శనిగతి విస్ఫులింగములు చల్లుచుఁ బెల్లడరంగ దాని ము
త్తునియలు గాఁగఁ గ్రొమ్మెఱుఁగుతూపుల నవ్విభుఁ డేసె నేసినన్. 239

ఆ. మరల నొక్కసాల మిరుగేలఁ బెఱికియు, దీనఁ దెగితి వంచుఁ దిగిచి వైవ
నలిగి నేఁడుభల్లములఁ ద్రుంచి వేవేగ, మంగకముల వేయు నంట నేసె.

వ. అ ట్లేసినం దొరఁగునెత్తుటం జొత్తిల్లి యున్మత్తునివిధంబున. 241

చ. బలువిడి ముష్టియుద్ధమునఁ బట్టి వధించెద నంచు భూరిదో
ర్బలమదరేఖ బిట్టనఁగఁ బైఁ బఱతేర నగస్త్యదత్త మై
పొలిచినవైష్ణవాస్త్ర మరిఁబోసి లసన్మణిపుంఖదీధితుల్
వెలుఁగుచు నుండ నిండుతెగ వే కొని కూలఁగ నేసె నాఖరున్. 242

వ. ఇట్లు రాక్షసవీరు వధించి వృత్రాసురవధం బొనరించిననాఁటిసురేంద్రుండునుం
బోలె నన్నరేంద్రుండు దేజరిల్లె నాసమయంబున. 243

మ. కురిసెం బెల్లుగఁ బుష్పవర్షములు గాకుత్స్థాన్వయాధీశుపై
మొరసెం గ్రందుగ దేవదుందుభులు సమ్మోదాతిరేకంబునం
బొరసెన్ దేవమునీంద్రసంఘములు సంపూర్ణంబుగా దిక్కుల
న్బెరసెన్ మెండుగ రామచంద్రుసుగుణోన్మేషప్రభాజాలముల్. 244

---

మ. అతిఘోరాస్త్రము నిమ్మెయిం దొడిగి గాఢాకర్షణాపూర్ణసం
గతి గావించి నరేంద్రుఁ డేయ నది వీఁకం దాఁకి కూలెన్ సము
ద్ధతిమైఁ జేర్చి ఖరాసురాంగము మహేంద్రక్రూరబాహావిని
ర్గతవజ్రచ్యుతపక్షతిక్షతకులక్ష్మాధ్రంబుచందంబునన్.

వ. ఇట్లారాక్షసవీరు వధించి వృత్రాసురవధం బొనరించిననాఁటిసురేంద్రుండునుంబోలె నన్నరేం
ద్రుండు దేజరిల్లె నాసమయంబున.

వ. తదనంతరంబ యచ్చేరువతపోవనంబుల మునిగణంబులు చనుదెంచి రామచంద్రు ననేకాశీర్వాదంబుల నాదరంబు లెసంగం గొనియాడి రంత లక్ష్మణుండు జానకిం దోడ్కొని వచ్చి యారాజపరమేశ్వరుపాదంబులకుం బ్రణామంబు చేసి సంతోషసాగరంబునం దేలె నమ్మునీంద్రు లారాజేంద్రు నభినందించుచు వీడ్కొని నిజనివాసంబులకుం జని రవ్విభుండును బరమహర్షభరితాత్ముం డగుచు సీతాలక్ష్మణసమేతుం డై విశాలం బగుపర్ణశాలకుం జని యం దిష్టవినోదంబుల నుండె నంత నిఖిలరాక్షసక్షయంబునకు భయం బంది జనస్థానంబునం గలహతశేషదోషాచరనికరంబు వికలంబై పలుదెసలకుం జనియె నొక్కయ్యంబునం జావక తక్కిన వాఁ డొక్కరుం డకంపనుం డనువాఁడు రావణుం డున్నయెడకు నతిత్వరితగతి నరిగి యేకాంతంబున నన్నిశాచరపతిం గదిసి శంకించుచుం జెప్ప నోడినం దలంకక కలరూ పెఱింగింపు మనిన నభయంబు వేఁడి వాఁ డిట్లనియె. 245

—•• అకంపనుఁడు రావణునకు రామువృత్తాంతంబు చెప్పుట. ••—

చ. దశరథరాజనందనుఁడు తమ్ముఁడు భార్యయుఁ దోడరాఁ దపో
వశగతి దండకాటవికి వచ్చి ఖరాదినిశాచరావళిన్
మశకములన్ హరించుపెనుమంటయుఁబోలె నడంచి మాఱు లే
క శరశరాసనోగ్రుఁ డయి క్రాలెడుఁ బంచవటీస్థలంబునన్. 246

మ. అనిసం గన్నుల నిప్పు లుప్పతిల రోషావేశముం బొందున
ద్దనుజేంద్రుం బ్రణుతించి చెప్పెద సమాధానంబు మైఁ గార్యముం
గనుఁగొ మ్మాహవభూమి రాముఁ జెనయం గా రాదు గల్పాంతవ
ర్తనరౌద్రోద్ధతరుద్రకోటి కయినం దథ్యంబు లంకేశ్వరా. 247

సీ. ధరణీతలంబు పాతాళంబునకుఁ గ్రుంగ, నడుమ నింగికి నెత్త నతఁడె చాలు
గ్రహతారకౌఘంబు మహిఁ గ్రందువడ రాల్ప, నవిపొందుపడ నిల్ప నతఁడె చాలు
జలధు లన్నియుఁ బాఱఁ జల్లి యింకింపంగ, నవి నిండఁ బూరింప నతఁడె చాలుఁ
ద్రిజగంబు మార్పడఁ ద్రిప్పి మున్నటియట్ల, యలవడఁ జేయంగ నతఁడె చాలుఁ
జండశతకోటిశతకోటి సారఘోర, నిశితనిష్ఠురశరసముల్లసితచాప
దీపితాటోపనిర్జితత్రిభువనుండు, ఘనుఁడు కాకుత్స్థతిలకుండు దనుజనాథ.

చ. అతనియనుంగుఁదమ్ముఁ డసహాయపరాక్రమశాలి నిర్భరా
ద్భుతభుజసారుఁ డుగ్రవనభూముల నన్నకు భక్తిసేయుచున్
సతతముఁ దాఁ జరించు సువిచారుఁడు లక్ష్మణనామధేయుఁ డ
య్యతులబలుండు నానృపునియట్టిఁడ సంగరరంగభూములన్. 249

ఉ. కావున వారలం దొడరఁ గాఁ దలపోయుట దుర్నయంబు నీ
కేవిధి నైన వారి నమయింపఁగ నిష్టమ యేని బూని రా
మావనినాథుభార్యఁ గుటిలాలక సీత హరింప దాన శో

కావిలుఁ డై వెసం బొలియు నాతఁడు దమ్ముఁడుఁ జచ్చు నన్నతోన్. 250

క. అని పలికిన నక్కపటము, దనుజవిభుఁడు పొగడి నీవు తగుహితుఁడవు నా
కని వాని నాదరించుచుఁ, దనమది పొంగంగఁ గదలి తద్దయుఁ గడఁకన్.

తే. నీచు తినపూర్వమంత్రి మారీచుకడకు
నేకతమ యేఁగ నతఁ డెదు రేఁగుదెంచి
ప్రియము సేసినఁ గైకొని నయముతోడ
నతని కిట్లని పలికె నెయ్యంబు దనర. 252

క. ఖరుఁ డాదిగ మనవారలఁ, బొరిగొని రఘురాముఁ డనఁగఁ బోటరి యై దు
ర్నరుఁ డొకఁడు దండకాటవిఁ, దిరిగెడు ననుజుండుఁ దానుఁ దీవ్రస్ఫురణన్.

ఉ. వాని వధించియుండెడి బలవంతపుమాయల ముంచి యుండెడి నా
కానరనాథుదేవి కుటిలాలక సీత యనంగ నొప్పున
జ్జానఁ దెచ్చికోవలయు నన్నఁ గడుం భయ మంది యాతఁ డ
ద్దానవనాథుతోడ నుచితం బగునీతి దలిర్ప నిట్లనున్. 254

చ. హరిహరపద్మజాదులకు నారఘురాముఁ డసాధ్యుఁ డమ్మహా
పురుషునిభార్య నేమిటికిఁ బుణ్యవిహీనతఁ గోరెదెందునుం
బరసతిఁ గోరువాఁ డధికపాతకుఁ డీచెడుబుద్ధి నీకు నె
వ్వరు మది కింపుగాఁ బగతువా రయి చెప్పిరి రాక్షసేశ్వరా. 255

చ. అరదెగ గొన్న గేటునఁ గులాచల మైన హిమాద్రి యైన మం
దరగిరి యైన హేమవసుధాధర మైన నజాండ మైన ని
ష్ఠురతఁ బగుల్చు నక్కడిఁదిజోదు పురాంతకువిల్లు లీల మైఁ
బొరిగొని కొన్నభార్య యది పోలవు రావణ నీవిచారముల్. 256

తే. అని యనేకవిధంబుల నతనియాగ్రహంబు డిగువడఁ జెప్పి రామావనీశు
నతులదివ్యాస్త్రమహిమయు నల్లఁ దెల్పి, వైర ముడిపిన రాక్షసవరుఁడు మగిడి.

క. పురమునకు నరిగి విభవ,స్ఫురణంబు దలిర్పఁ బెంపు పొల్పొంద నిశా
చరకోటులు గొల్వఁగ మి, న్నొరసినయాపసిఁడిమేడ నున్నట్టియెడన్. 258

వ. [1]అక్కడ శూర్పణఖయు సంగరాంగణంబున నత్తెఱంగున రఘుపుంగవునుగ్రశిలీముఖంబులం దెగి బడలువడం బడినఖరదూషణాదిసమస్తపౌలస్త్యులకళేబరంబులను గనుంగొని పొడమునాశ్చర్యభయశోకంబులు మనంబునం బెనంగొన నవ్విధం బంతయు లోకవిద్రావణుం డగురావణున కెఱింగింతు ననుచు మహానాదంబున రోదనంబుసేయుచుం బాఱి లంకానగరంబు సొచ్చి పుష్పకమధ్యంబున

---

1. 259 మొదలుగా 262 వఱకుఁ గలపాఠమునకు

చ. పొలుపఱ ముక్కునుం జెవులుఁ బోయిన మోటమొగంబుమీఁద న
స్రులు దొరఁగంగ రక్కసులు చూచి కడుం బెఱఁ గంద నార్తి ది

నఖిలమంత్రిజనసేవితుం డై మరుద్గణపరివృతుం డగువాసవుని ధిక్కరింపం దగి
సమంచితకాంచనవేదికాతలంబున వెలుంగుననలునోజఁ దేజరిల్లుచు దేదీప్య
మానం బగుమణిమయభద్రపీఠంబున. 259

సీ. వజ్రాదిసాధనవ్రణకిణాంకిత మగు, మేనఁ జందనచర్చ మెఱయుచుండ
భువనభయంకరభ్రూకుటి యగుముఖ, శ్రేణి దంష్ట్రారుచుల్ చెలువు మిగులఁ
బర్వతోత్పాటనప్రౌఢంబు లగునిరు, వదిచేతుల విభూషలు దనరారఁ
గుంఠితాఖండలకుంభిదంతం బగు, నురము విస్తారమై యోలిఁ గ్రాల
రుచిరకోటీరదశకంబు రోహిణాద్రి
శిఖరముల నవ్వ నుద్వృత్తిఁ జెలువుగొన్న
సురవిలాసిను లొరసి వీఁవోపు లిడఁగ
నెలమిఁ గొలువున్నయారాతి సేంద్రుఁ గనియె. 260

—శూర్పణఖ రావణునకు నిజపరిభవంబు తెఱం గెఱింగించుట.—

క. కని తనవికృతాకారము, గనుఁగొని పౌలస్త్యు లెల్లఁ గడునాశ్చర్యం
బునఁ బొంద సభామధ్యంబున నేడ్చుచుఁ బరుషవాక్యముల నిట్లనియెన్.

క. నీవును నీప్రియమంత్రులు, నీవిధమున నున్నఁ జాలు నింతియ నీవా
రేవిధిఁ బోయిన నే మగు, నా విని రావణుఁడు శూర్పణఖఁ గనుఁగొనినన్.

సీ. కైలాస మెత్తిననీలావుకరములుఁ, గరములఁ గలపెంపు గాసి గాఁగ
ముల్లోకములయందుఁ జెల్లెడునీయాజ్ఞ, నీయాజ్ఞ తేజంబు నెరసు దఱుఁగ
దెసలెల్ల గెలుచుట నెసఁగు నీవిజయంబు, జయలబ్ధ మగుప్రకాశతయు నడఁగ
నిఖిలంబు నిండిననీయశంబును నీయ, శంబునఁ గలవికాసంబుఁ గంద
నీసహోదరి నని చెప్ప నీసుతోడ, నుఱక నన్నొకఁ డిమ్మాయిఁ బఱిచి నామ
మణఁగ కున్నాఁడు నేఁడు నే మందు నిన్నుఁ, 'త్రిభువననూతనశితికంఠ పంక్తికంఠ.

వ. [1]అనిన విని. 264

మహా. స్ఫుటకోపాటోపభుగ్నభ్రుకుటిదశకముల్ భూరిదృఙ్నిర్గతోల్కా-
చ్ఛటలుల్ ఘర్మోదబిందుస్ఫురణకృతతనుప్రక్షాళనంబుం బ్రవాళో
ద్భటబాహాచంద్రహాసప్రభలుఁ గ్రకచవిస్ఫారదంష్ట్రాసముద్య

గ్వలయము బ్రమోయ నేడ్చుచును వచ్చి సభాస్థలిఁ గూల వ్రాలి పే
రెలుఁగునఁ బేర్చి శూర్పణఖ యి ట్లని యేడ్చెఁ గరంబు దీనతన్.

1. 264 మొదలుకొని 277 వఱకుఁ గలపాఠమునకు

చ. అని తనభంగపాటు రిపునాగ్రహవృత్తియుఁ దోఁపఁ బల్కినన్
గని విని రోషవర్తనవికారఘనభ్రుకుటీకఠోరరా
ద్రనిటలపట్టికాప్రకరదారుణదృక్ఛటయువిస్ఫురోగ్రదం
ష్ట్రానిశితదంతఘట్టనదశాముఖుఁ డయ్యె దశాస్యుఁ డయ్యెడన్.

త్తటిదావిర్భూతిభూత♦త్రసనముగ సభా♦స్థాన మెల్లం గలంగన్. 265

క. కటములుఁ బెదవులు నాసా,పుటములు నదరంగ మేను♦ పొరిఁ గంపింపం
జిటిలిపడి మండి యెవ్వం, డిటు నిన్నుం జేసె ననిన♦ ని ట్లను నదియున్. 266

సీ. రాముఁ డనఁగ నొక్క♦రాసుతుం డతివతోఁ, ననుజసహాయుఁడై♦ యరుగుదెంచి
దండకాటవి సొచ్చి♦ తా నుండునచ్చటి, కే నుండఁ బోయిన♦ నిట్లు సేసెఁ
గడఁగి నాకై వచ్చి♦ ఖరదూషణాదులు, పదునాల్గువేవురు♦ ప్రధనభూమి
నతనిమహాస్త్రాన♦లార్చుల మ్రందిరి, పలుమఱు వేయును♦ బలుకు లేల
యక్షగంధర్వసిద్ధవి♦ద్యాధరాది, సకలదివిజులతోఁ బగ♦ సాలఁ గొనియు
నీవు రాజ్యమదంబున♦ నిన్ను మఱచి, వేగు లరయింపకున్న నీ♦వెతలు వచ్చె.

క. దూరస్థు లయ్యుఁ గార్యము, చారులచేఁ గనుటఁ జార♦చక్షులు రాజుల్
వా రని చెప్పఁగ వినవె వి, చారము దోఁచునె కుమంత్రి♦సహితున కెందున్.

వ. అని వెండియు. 269

శా. ఏకాంగుష్ఠము నేల మోపి తప మ♦ ల్లేనూఱువే లబ్ధముల్
గోకర్ణాశ్రమవాసి వై సలిపి ర♦క్షోనాథ యవ్వేధచే
నీకై కొన్నవరంబు లెన్నఁటికొకో♦ నేఁ డిట్లు గా నాఁడు శ్రీ
వాకండూతికి వేల్చితో శిరముల♦న్వైశ్వానరజ్వాలలన్. 270

క, బంధుజనక్షేమములు మ,దాంధుఁడ వై యరయ కునికి♦ నపకీర్తి మరు
ద్గంధర్వాదులు నగ దశ, కంధర నినుఁ జెందె నేటి♦గర్వం బింకన్. 271

ఉ. నా విని రాముఁ డెవ్వఁడు వ♦నంబున కేటికి వచ్చినాఁడు యు
ద్ధావని నెట్టు లొక్కరుఁడ♦ యట్టిఖరాదులఁ జంపె నెట్టివాఁ

---

క. కనుఁగొని దానవు లందఱు, దనుజాధిప యభయ మిమ్ము♦ దశముఖ యనుచుం
గొనియాడి రతఁడు జగ శూ, ర్పణఖం గని పల్కె నిట్లు♦ భంగము నీకున్.

ఉ. ఎవ్వఁడు సేసె వానిసెల♦ వెక్కడ వాఁ డెట వోయె వానిపే
రెవ్వఁడు వాని కిట్టిమద♦ మెవ్వనిచేఁ గలిగెన్ వధింతు వాఁ
డవ్వల నెట్టివాఁ డయిన♦ నత్తెఱఁ గేర్పడఁ జెప్పు మన్న మో
మవ్వల వాంచి శూర్పణఖ♦ యన్నకుఁ జెప్పఁ దొడంగె నంతయున్.

సీ. దశరథుం డనుధరా♦ధవునిపుత్రుఁడు తండ్రి, యాజ్ఞచేఁ దమ్ముండు♦ నాలుఁ దాను
మునివేషములు దాల్చి♦ వనములఁ బదునాల్గు, వర్షంబు లుండంగ♦ వచ్చి నిల్చి
దండకాటవిఁ జొచ్చి♦ తాపసప్రీతిగా, దనుజులఁ ద్రుంచెద♦ ననుచుఁ బూని
విహరించుచుండ న♦వ్వీరునికులకాంత, త్రైలోక్యసుందరి♦ ధరణిజాత
తోన వర్తింపఁ గన్గొని♦ యేను నీకు, నవ్వధూమణిఁ దెచ్చెద♦ ననుచుఁ జేరి
మెలఁగుటయుఁ బట్టి యిటు సేసె♦ నలుకతోడ, నసురపతితోడఁబుట్టువ♦ ననిన నుఱక.

వ. మఱియు నానరపాలుండు.

డావసుధేశుతమ్ముఁ డగుǂనాతఁడు నెట్టిఁడు నామ మేమి రూ
పేవిధ మానితంబినికిǂ నెయ్యది నా కెఱిఁగింపు మాఖ్యయున్. 272

—❀ శూర్పణఖ రావణునకు సీతారామలక్ష్మణులవృత్తాంతముఁ జెప్పుట. ❀—

వ. అనిన నది యి ట్లను నతండు దశరథుం డనునరేంద్రునందనుండు దమతండ్రి పనుపునం దపోవేషంబు గైకొని శస్త్రాస్త్రంబులు ధరియించి దండకారణ్యంబున కేతెంచి తదాశ్రమవాసు లైనమహామునులసన్నిధి వారికిం బ్రియంబుగా రాక్షసవధం బొనర్చుటకుఁ బ్రతిన పూని పంచవటియందు వర్తించుచుఁ గృతప్రతిజ్ఞుం డగుట జనస్థానంబునం గలుగుసమస్తపౌలస్త్యులం బరిమార్చె నప్పు డసహాయుం డై విక్రమంబున విజృంభించినయవ్వీరవరుకోదండపాండిత్యవిశేషం బెట్టి దనిన. 273

క. వడి దొనఁ దిగుచుట దొడుగుట, వెడలం దెగఁగొనుట శరముǂ విడుచుట గానం
బడక విలు గుడుసువడుటయు, నుడుగక రక్కసులు వడుటǂయును గానఁబడున్.

మ. పొరి నుద్వేలకరాళకీల లడరంǂ బుంఖానుపుంఖంబు లై
శరజాలంబులు భూనభోంతరము నాǂచ్ఛాదించుచుం బెల్లు పైఁ
గురియం గూలె నిశాచరావలి రఘుǂక్షోణీంద్రుచే నింద్రుచేఁ
గరకావృష్టిపరంపరం బడుపతంǂగశ్రేణిచందంబునన్. 275

ఆ. ఆఁడుదానిఁ జంపǂ నర్హంబు గా దని
నను వధింప కునికిǂ నల్లఁ జేరి
నీకు నిత్తెఱంగుǂ నిక్క మే నెఱిఁగింప
దిక్కు గల్గె నింకఁǂ బెక్కు లేల, 276

తరల. అతనితమ్ముఁడు లక్ష్మణుం డనుǂనాతఁడుం బరికింపఁగా
నతనియట్టిఁడ సాహసంబునǂ నంచితాకృతి నగ్గుణా
న్వితుఁడు దక్షిణబాహుసన్నిభుఁǂ డెందు నన్నకు సీత య
య్యతివ పేరిల నేతలోదరుǂలందుఁ గల్గరు తాదృశల్. 277

---

క. అలిగి జనస్థానంబునఁ, గలదానవు లెల్ల మీఁదఁ♦ గవిసిన లీలం
బొలియించె నాఖరాదుల, నలవోకయపోలె మదభ♦రాలసుఁ డగుచున్.

ఉ. ఆనరముఖ్యుఁ డప్పు డసు♦రావలిఁ జంపఁగ నేను జూచితిం
గానఁగ వచ్చు నప్డు తెగ♦గైకొన వట్టువ యైనవిల్లుఁ బె
ల్లై నభ మెల్లఁ గప్పుచు మ♦హాధ్వనితోఁ జనుదెంచునమ్ములన్
మేనులు ద్రెవ్వి మిట్టిపడి♦ మేదినిఁ గూలునిశాటకోటులున్.

క. అని పలికి యన్నచిత్తము, జనపాలకుదేవి యైన♦జానకిదెసకుం
జను టెఱిఁగి విను దశానన, వినిపించెద సీతలలిత♦విభ్రమభంగుల్.

సీ. విదియచందురుఁ డైన వెలఁదినెమ్మోమునఁ, గలిసిన సంపూర్ణకాంతి వడయు
వడగాలి యైన సప్పడఁతియూర్పులచెంతఁ, బరఁగిన మలయాద్రిపవనుఁ బోలు
సమవసయిరు లైన [1]నయ్యింతిచిఱునవ్వు, సొలపున వెన్నెలచెలువుఁ బూను
నలరి యేఋతువుల నయిన నాసతిమేని, ప్రభ గన్నవనములు పల్లవించు
బట్టబయ లైన నాసితపద్మనేత్ర
కన్నుఁగవయొప్పు జిగిసొంపు గడలుకొనిన
విమలకమలషండంబులవిధము నొందు
నెందు నరి వోల్పఁ గలరె యయ్యిందుముఖికి. 278

వ. [2]మఱియును. 279

సీ. మణిమయమంజీరమంజురుతమ్ములఁ, గలహంసికలఁ బిల్చి గతులు నేర్పుఁ
గమ్మయూర్పులఁ దేఁటిగముల నాకర్షించి, లలి గానలీలల నలవరించు
హస్తపల్లవకాంతి హరిణుల నెలయించి, దృష్టివిభ్రమములఁ దెలుఁగుఁ జూపు
రుచిరబింబాధరారుణదీప్తిఁ జిలుకల, రావించి మధురోక్తిరచనఁ గఱపు
నన వితర్కింపఁదగుచు నయ్యబలఁబోఁడి, యనుపమానవిలాసంబులలర నమరు
నమరగంధర్వయక్షవిద్యాధరాది, జాతులం దెందుఁ జూడ నీచంద మొఱుఁగ.

క. అంగవిలాసమ్మున న, వ్వంగికిఁ జెలువారు తెఱఁగు లవి యే మని చె
ప్పంగల దయ్యొప్పిదము గ, నుంగొన మగువలకు నగు మనోభవవికృతుల్.

క. ప్రమదాజను లోరు లేటికి, నమరాంతక లంక యేటి కారామార
త్నము సిద్ధించినవారికి, నమరేంద్రపదంబు గోరునది యేమిటికిన్. 282

ఉ. కావున రామలక్ష్మణులఁ గయ్యమునం బరిమార్చి లోకవి
ద్రావణ మైననీదుభుజదర్ప మెలర్పఁగ సీతఁ దెచ్చి సం
భావన నిష్టభోగఫలభాగినిఁ జేయుదుగాక యన్న నా
రావణుఁ డప్పు మన్మథశరంబులఁ జిత్తము దూల లోలతన్. 283

1 నయ్యింతిచిఱునవ్వు, సొలపిన వెన్నెలవెలుఁగుఁ గడచు.

2. 279 మొదలుకొని 289 వఱకుఁ గల వ్రా. ప్ర. పాఠము.

క. అని కొనియాడిన దనుజుని, మనమంతన మరుఁడు సొచ్చె మారీచతపో
వనమున కరిగె రయంబునఁ, గనకరథం బెక్కి గగనగతి నట్టియెడన్.

చ. గరుడుఁడు తొల్లి లీల గజకచ్ఛపయుగ్మముతోడఁ గూడ నే
తరువునశాఖ నూఁదె విదితంబుగ నప్పెనుమఱ్ఱిముందటం
దెరువునఁ జూచుచుం దనమదిన్ వినతాసుతులావు మెచ్చుచున్
సరభసభంగి నేఁగియును సాగరతీరతపోవనంబునన్.

క. మారీచుఁ గాంచుటయు నతఁ, డారక్షోవిభునిఁ జూచి యర్చించి ప్రియం
బారఁగఁ గ్రమ్మఱ వచ్చిన, కారణ మే మనివఁ బంక్తికంధరుఁ డనియెన్.

—✿ సీతను దెచ్చుటకు రావణుఁడు ప్రయాణమై పోవుట. ✿—

వ. శూర్పణఖపలుకులకు సంతోషించి మంత్రులం జూచి ఖరదూషణాదుల వధించినయారఘువరువిక్రమవిశేషంబులు వితర్కించి వంచనోపాయంబున సీతం గొనివచ్చుట కార్యంబుగా నిశ్చయించి కొలువు విడిచి రథంబు సారథిం దెమ్మనుచుఁ బ్రచ్ఛన్నమార్గంబునం బురంబు వెలువడి రత్నకాంచనమయంబును బిశాచముఖాశ్వకలితంబును గామగమనంబును వివిధాయుధభరితంబు నగునిజస్యందనంబు పిఱుంద నచ్చుటయు నెక్కి రయంబున నయ్యరదంబు గగనగమనంబున మెఱయ నానావృక్షలతాదులం బొల్చు వేలావనంబు నెడనెడ ననేకద్వీపంబులుం గనుంగొనుచు నబ్ధిమధ్యంబునం జనిచని బహువిహగకులసంకులంబును విటపివిటపాక్రాంతరోదోంతరాళంబు నగునొక్కపురాణవటోత్తమంబు సూతునికిం జూపి తొల్లి వైనతేయుం డమృతంబునకుం బోవుచుండి గజకచ్ఛపంబుల భక్షింప శతయోజనవిశాలం బగు దీనిశాఖ నిడిన నది విఱుగ నం దున్నవాలఖిల్యాదిమహామును లాక్రోశించిన విని యక్కొమ్మ నగ్గజకచ్ఛపంబులరెంటినిం జరణమండంబులం బట్టికొని జవంబునం బఱచి తండ్రి కెఱింగించిన నక్కశ్యపుండును వారిం బ్రార్థించి తగవతరణంబు సేయించినం బగంపడి జనకనిర్దిష్టం బగునిషాదమండలంబున నాశాఖ వైచి హిమాచలతటంబున నక్కరటికమఠంబుల నాహారంబు గొనియె నిమ్మహీరుహంబుపేరు సుభద్రం బనుచు సముద్రంబు గడచి మారీచునాశ్రమంబు సొచ్చి రథంబు డిగ్గి జటావల్కలధరుం డైనయున్నిశాచరుపాలికిం బోయి కనుంగొనుటయు. 284

క. మారీచుఁడు గనుకని నపు, డారక్షోవిభునిఁ బ్రీతి ♦ నర్చించి నయం
బారఁగఁ గ్రమ్మఱ వచ్చిన, కారణ మే మనినఁ బంక్తి♦కంఠుం డెలమిన్. 285

వ. శూర్పణఖ తనకుం జెప్పినవృత్తాంతం బతనికి సవిస్తరంబుగాఁ జెప్పం దలంచినవాఁ డై వెండియు నద్దశకంధరుం డి ట్లనియె. 286

సీ. నక్తంచరోత్తమ ♦ నాకాక విను రాముఁ, డనువాఁడు దమతండ్రి♦యలిగి పురము
వెడలఁద్రోచిన దపో♦వేషి యై పత్నియు, ననుజుండుఁ దోడ రా ♦ నరుగుదెంచి
దండకాటవి నుండి ♦ దర్పించి మనశూర్ప,ణఖఁ బట్టి ముక్కుఁగ♦ర్ణములుఁ గోసి
దాన నిల్వక జన♦స్థానంబునం దున్న,ఖరదూషణాదిరా♦క్షసులఁ గడఁగి
నిరవశేషంబుగాఁ జంపె ♦ నిఖిలలోక,జయుఁడ నగునాకు నెగ్గిట్లు ♦ సలిపెఁగాన
యేను నాక్షత్రియాధము♦నింతి సీతఁ, దెత్తు నీసహాయతఁ బగ ♦ దీర్తు నేఁడు.

---

చ. పరమహితుండ వార్యుఁడవు ♦ బంధుఁడ వాప్తుఁడ వెల్లభంగి నీ
వరయఁగ నీసహాయమున ♦ నంబుజలోచన రాముదేవి న
ద్ధరణిజ నేను గైకొని మ♦దంబునఁ దేలుదు నాబలంబు నీ
శరవును మాయయుం గలుగ ♦ శేయువిధంబుల నబ్బు నింతియున్.

శా. [1]మాయావిద్యల నెవ్వఁడుం దలఁపఁగా । మారీచ నీయంతవాఁ
డీయజ్ఞానసస్పృష్టి లేకునికి ని । న్నేఁ బంచెదన్ రాఘవా
పాయం బేగతి మేదినీతనయకుం । బాటిల్లు నవ్వంచనో
పాయం బొక్కఁ డొనర్తుగాక యన మే । నాకంపముం బొందఁగన్. 288

క. హృదయ మదరంగ సంధులు, ప్రదులఁగఁ జిత్తము గలంగఁ । బెంజెమ టొదవం
బెదవులు దడుపుచు నాదట, వదనునితోఁ గొంతవడికి । వాఁ డి ట్లనియెన్.

శా. పుణ్యుం డూర్జితశౌర్యధైర్యమహిమ । స్ఫూర్తిస్ఫురద్వైభవా
గణ్యుం డార్యజనానురంజితమహా । కారుణ్యుఁడున్ శ్లాఘ్యసా
గుణ్యుం డన్వయవార్ధిచంద్రుఁడు రిపు । క్షోణీశ్వరస్థాపితా
రణ్యుం డార్తశరణ్యుఁ డుజ్జ్వలయశో । రమ్యుండు సౌమ్యుం డిలన్. 290

క. మతివిజితసురాచార్యుఁడు, చతురత్వచతుర్ముఖుండు । సహమలవృత్తా
[2]యతపంకజలోచనుఁడును, శ్రితవినుతగుణప్రధాధు । రీణుఁడుఁ బేర్మిన్. 291

మాలిని. వితరణఖని యుద్య । ద్వీర్యశౌర్యప్రభావో
న్నతుఁడు భుజబలాత్యు । న్మాదవిద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్భూ । భాగగమ్యుండు సంభా
వితపరిణతచిత్తో । ర్వీసురుం డుర్వి నెందున్. 292

గద్యము. ఇది సకలసుకవిజనప్రణుతయశస్కర భాస్కరప్రణీతం బయిన శ్రీరామా
యణంబునందు నారణ్యకాండంబునం బ్రథమాశ్వాసము. 293



1 తే. ఎన్నివిధముల నైన న । య్యీగురుఁ బోఁడి, నాకుఁ జేయనుపాయంబు । నీకు నెట్లు
పోలు నట్లుగ నొనరించి । భూపసుతుల, మొఱఁగి మాతుల యొంతయుఁ । దెఱఁగుపఱుపు.
క. అనివం జిత్తము జల్లనఁ, దనమదిలోఁ గలఁగి వణఁకి । దనుజేశ్వర రా
మునివిక్రమంబు నీకును, వినిపించెద నున్నరూపు । విను తెలియంగన్.
2 యతచిత్తపంకజుఁ డాశ్రితరక్షణగుణమహాధు । రీణుఁడుఁ.

శ్రీ ర స్తు.

# భాస్కర రామాయణము.



## అరణ్యకాండము - ద్వితీయాశ్వాసము.

రామాకుచయుగళీ
[1]హారిద్రోల్లసితవక్షోహరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలక మిలన్. 1

వ. శ్రీరామచంద్రు (ండు మహామహిమాభిరాముం డాత)నిమాహాత్మ్యంబు చెప్పెద విను మని మారీచుండు దశకంధరున కిట్లనియె. 2

—రామునిజోలికిఁ బోవల దని మారీచుఁడు రావణునితోఁ జెప్పుట.—

మ. సమదాటోపత రాముఁ గైకొనక విశ్వామిత్రుయజ్ఞంబు వి
ఘ్నముసేయంగ ననేకదైత్యతతి రాఁగా నేఁగి యేఁ దొల్లి కం
టి మహానాగములట్లు సింహములమాడ్కిం దీవ్రదంభోళిసం
ఘముచందంబున దైత్యకోటిఁ బొలియం గాఁ జేయ రామాస్త్రముల్. 3

చ. సమదసహస్రదంతిసమసత్త్వుని న న్నొకయమ్ము దాఁకి శీ
ఘ్రమ శతయోజనంబు లతిగాఢరయంబున నెత్తి తెచ్చి పె
ల్లెముకలు పెల్లగిల్ల వడి నియ్యెడ వైచిన మూర్ఛఁ బొంది భా
గ్యమున సజీవి నైతి దనుజాధిప రామునిసత్త్వ మే మనన్. 4

ఆ. అతనిపిన్ననాఁటియస్త్రబలం బిది, యిపుడు లావు మెఱసి యేఁపు మిగిలి
యున్నవాఁడు మునిగణోజ్జ్వలఘనతపో,బలముచేతఁ దనదుబలము దనర. 5

క. [2]వినువక మఱియుం జని య, వ్వసుధేశుఁడు దండకమున వర్తింపఁగఁ దా
పసహింసాపరు లగురా,క్షసు లిరువురు నేను గూడి కపటాకృతులన్. 6

చ. ఉరుతరచిత్రగాత్రములు నుజ్జ్వలశాతవిషాణముల్ భయం
కరముఖగహ్వరంబులును గల్గుమృగంబుల మై వధింపఁ బై

---

1. "హారిద్రోల్లసితవక్షోహారి" అనియే వ్రా. ప్ర.

2. 6 మొదలుకొని 18 వఱకుఁ గలపాఠము.

క. ఈనడుమ రామచంద్రుని, నేను దొరలు మువ్వుర ముగ్రనియతిఁ బులుల మై
పూని వధింపఁగఁ జని చని, యానరపతి నింతనంత నట చేరుటయున్.

1సురవడిఁ బాఱ నట్లతఁడు నుగ్రశరంబుల నేయఁ దోడివా
రిరువురుఁ జావఁగాఁ బఱచి యే నిట వచ్చితి నేమి సెప్పుదున్. 7

మత్త. నాఁటఁగోలెను నామనంబున నాటుకో వెఱ నాకు నిం
కేటిజీవన మంచు నీతప మిట్లు వన్నితిఁ గాక యో
నాఁట నే నియతవ్రతస్థుఁడ న న్నెఱింగియు నిట్టినా
బోఁటిభీతుని నీకుఁ దోడనఁ బోలునే దశకంధరా. 8

క. ఎద్దెసఁ జూచిన రఘువరుఁ, డద్దెసఁ బొడసూపినట్టు లగుఁ దద్భీతిన్
నిద్దుర లేదది కల్గిన, నద్దశరథసుతున కాంతు నక్కలలందున్. 9

క. రణరథముఖరేఖాదిక, ఫణితిప్రారంభణములఁ బరహృదయభిదా
చణ మగురామాఖ్యోచ్చా, రణమో యని బెగడు పుట్టు రావణ నాకున్. 10

వ. అని వెండియు. 11

క. ఇచ్ఛావాదము లాడెదు, తుచ్ఛులు పెక్కండ్రు గలరు దుర్లభుఁడు విభు
స్వచ్ఛందోక్తులకుం జొర, కచ్ఛలముగఁ బలుకునతఁడు నది వినునతఁడున్. 12

చ. త్రిదశులు వెట్టిసేయ నిటు దివ్యపదంబుగ లంక నేలుచున్
మదిమది నుండలేక యొకమానుషసత్త్వముగాఁ దలంచి దు
ర్మదమున రాముపై నలిగి మాయల నమ్మహితాత్ము దేవిఁ దె
చ్చెద నని చూచెదే చెడుగుఁ జేఁతలకుం జొర రాక్షసేశ్వరా. 13

ఉ. ఈకొఱగానికార్య మిటు లెవ్వఁడొకో యనుకూలశత్రుఁడై
నీకుఁ బ్రియంబుగాఁ బలికె నీవును నిత్తెఱఁ గాచరింపఁగా
రాక తలంచి చూడ నిది రాక్షసవంశవినాశకాలమో
కా కిటుగాను దీకొనునె కాదన కీదృశ మెవ్వఁ డేనియున్. 14

క. దినకరునిఁ బాపి తత్ప్రభఁ, గొనివచ్చెద ననునె యట్టికుమతియు నారా
మునిశరశిఖిఁ బడ నరిగెదు, పని వలవదు సీత నీకు బయలం గలదే. 15

క. లోకము రక్షించుటకై, కైకేయివరంబు నెపము గా నప్పుణ్య
శ్లోకుఁడు తండ్రికి నన్నృతము, రా కుండఁగ వచ్చినాఁ డరణ్యంబునకున్. 16

క. రక్షోవధ మొనరింపఁగ, నాక్షత్రియవరుఁడు పూను టది వినవో జగ
ద్భక్షణు లైనఖరాదుల, శిక్షించుట వినియు వినవు చెప్పినబుద్ధుల్. 17

క. కాలము సేరిన రోగికి, మే లగునౌషధము లెందు మెయికొనునె మదిన్
బేల చెడనున్నతఱి వినఁ, బోలునె దగుబుద్ధు లల్పబుద్ధుల కెందున్. 18

క. మిడుతలు కార్చిచ్చుపయిం, బడఁ బోయినయట్ల చూవె బల్లిదుఁ డగునా
పుడమిపతిమీఁద బల్విడి, నడరఁగ మనతలఁచు టెల్ల ననినం గినుకన్. 19

---

1 క. శరములు మూఁడొకముష్టిం, దిరముగఁ దొడి యేయువారు ద్రెళ్ళిరి వెస నే
సురిఁగి యిట వచ్చి ఘనభయ, పరవశగతి నున్నవాఁడఁ బటుశౌర్యనిధీ.

క. ఖరుఁ డాదిగఁ గలహితులం, బొరిగొని శూర్పణఖ నట్లు § పోఁడిమి చెడ ను
ద్ధురభంగి భంగపెట్టిన, దురితాత్మునితోడ నెట్లు § దొడరక పోదున్. 20

ఉ. మానము దూల బుద్ధి పలు § మాఱును జెప్పట మాను మెట్లు న
మ్మానవుభార్యఁ జెత్తు నవ § మానము లే దిదె నీవు రాక దు
ర్మానముఁ బొంది యున్న నభి § మానముఁ బ్రాణముఁ గొందుఁ జాల స
న్మానము సేసి మెత్తు నవ § మానము సేయక తోడు వచ్చినన్. 21

క. అని తెంపు మీఱఁ బల్కిన, దనుజుండు దశాస్యునెదురఁ § దాఁ బలుకక చ
య్యనఁ గదలి యతనితోడన, చనియెం బతికినుక కులికి § చతురుం డగుచున్.

వ. అమ్మారీచుండు దనమనంబున నిన్నిచుచేతం జచ్చుటకంటె రఘురాముచేతఁ జచ్చి
నం బరమగతిగలదు కావుననిదియ మేలు కార్యం బనిపూని రావణునకనేకమాయో
పాయంబు లుపన్యసించి చూపుచుం జనియె నతండు నీవు నాకుం బ్రాణమిత్రుండవు
పూర్వామాత్యుండ విక్కార్యంబు సిద్ధించిన నర్ధరాజ్యం బిత్తు నని యుపచరిం
చుచు (నెడనెడ గిరులు నదులు వనంబులుఁ గనుంగొనుచుఁ బెక్కుదేశంబులు
గడచి దండకారణ్యంబు సొచ్చి నానాతరుగుల్మశోభితం బగుచున్న పంచవటీతీరంబునం
దేరు డిగ్గి మారీచుం జూచి మనవచ్చినకార్యం బనుష్ఠింతువు గాక యని నియోగిం
చిన వాఁడును.) 23

—మారీచుఁడు మాయాకురంగమై రామాశ్రమమునకు వచ్చుట.—

సీ. రుచిరవైదూర్యంబు § రూపార నచ్చున, వచ్చినవిధమున § వదన మమర
ధర్మనిర్మితపద్మ § పత్త్రంబు లలవడ, నొత్తిన యఁ గర్ణ § యుగము మెఱయ
లలితమాణిక్యశ § లాకలలాగు మై, కొన నమర్చినభంగిఁ § గొమ్ము లొప్ప
నింద్రనీలములబా § గేర్పడ ద్రచ్చివై, చినగతి గొరిజలు § చెలువు మిగుల
నుదర మిందుబింబద్యుతి § నుల్లసిల్లఁ, గనకకేసరాంకురరోమ § కాంతి నిగుడ
నొక్క మాయాకురంగమై § యొయ్యనొయ్యఁ, జనియె నిలుచుచు నాపర్ణ § శాలకడకు.

సీ. నెలలోనియిఱ్ఱికి § నీలకంఠునిచేతఁ, బొలుపారు లేడికిఁ § బుట్టె నొక్క
యజుఁ డన్నిరత్నంబు § లందునుం గలుగుక్రొ, మ్మించుల దీనిఁ గ § ల్పించె నొక్కొ
రోహిణాచలము మే § రువుఁ గూడి యురుతర, ప్రభల నీహరిణంబుఁ § బడసె నొక్కొ
క్రొక్కారుమెఱుఁగులుఁ § జుక్కలరొయిఱపును, గలసి యీమృగమయి § వెలసె నొక్కొ
దీనిఁబోలంగ జంతువుల్ § త్రిభువనముల, యందు మఱి కలవొకొ యని § యాత్మ మెచ్చి
ప్రీతి వనదేవతలు నూడ § సీతదృష్టి, మార్గమున కల్లఁ జనియె న § మ్మాయయిఱ్ఱి.

28 మొదలుగా 25 వఱకుఁ గలపాఠమునకు మాఱుగా

తే. ఇవ్విధంబున నరిగి రా § జేంద్రచంద్రుఁ, డున్నకదలివనంబున § కొయ్యఁ జేరి
యచట రావణు నిలిపి మా § యాకురంగ, మయ్యె మారీచుఁ డురుదీప్తు § లతిశయిల్ల.

ఉ. అత్తఱి నెమ్మొగంబు జిగి నచ్చపువెన్నెల గాయ నింపు ద
ళ్కొత్తు సమీపభూజముల నొయ్యనఁ బువ్వులు గోయుచున్న రా
జోత్తము దేవి చూచెఁ జిగు [1]రొత్తెడు వేడ్కలు సందడింపఁ గ
న్గ్రొత్తమెఱుంగు లేణమునకుం దనరున్ నడు మెల్ల నిండఁగన్. 26

మహా. ధరణీసంజాత ప్రీతిం దనుఁ గనుఁగొన నుద్యద్గతిం బాఱుఁ దాఱుం
బోరి డాయుం బూరి మేయుం బొలుపుగ నిగుడుం బొంగుఁ గ్రుంగుం జెలంగుం
దిరుగుం గుప్పించు మించున్ దెసల నెసఁగ వర్తించు వే చౌకళించున్
గర మొప్పన్ నిల్చుఁ బొల్చుం గనకహరిణ మక్కాననాంతంబులోనన్. 27

క. (మరగినవిధమునఁ జేరువఁ, దిరుగుం బసిఁ గొనుచుఁ గలయఁ దృణములు వెదకున్
ఖురపుటమునఁ గడుఁ బొయ్యన, బరికిఁ గొనుచుఁ జక్క నిలుచు బలుమఱు నెదురన్).

క. ఈలీలం బొలయఁగ నా, లోలాక్షి విలోలయై విలోకించి మహీ
పాలుని లక్ష్మణుఁ బిలిచినఁ, జాలఁగ వెస నేఁగి కనిరి సారంగంబున్. 29

తే. అపుడు లక్ష్మణుఁ డేర్పడ నామృగంబు, నద్భుతాకారవిలసన మధికసంశ
యాత్ముఁడై చూచి నిజబుద్ధి నసురమాయ, గా నిరూపించి యనియె నగ్రజునితోడ.

మ. మనలం బిల్చుట భూమిపుత్త్రి మది నిమ్మాయామృగంబున్ నిజం
బని భావింపఁగఁ బోలు వీఁ డసుర మాయారూపుఁ డిందేని నొ
క్కనెపం బిమ్మెయిఁ జూపి చిక్కువఱుపం గాఁ జూచె మోహంబునన్
జననాథోత్తమ పట్టఁ జూచెదు సుమీ చర్చింప కుద్యద్గతిన్. 31

క. అని పలుకఁగ నాలోనన, జనకజ పతి డగ్గఱంగఁ జనుదెంచి కనుం
గొను రాజముఖ్య యొప్పుల, గని యగు నీమృగవిలాసకమనీయగతుల్. 32

క. కరువున గండరువునఁ జి, త్తరువున నినచంద్రరుచులఁ దారలరుచులన్
[2]హరిహరధాత్రాదులకీ, హరిణము సరిరూపు వడయ నలవియె యెందున్. 33

వ. అనుచు సాభిలాషంబుగాఁ బెక్కు చందంబులం గొనియాడి. 34

చ. అలఘుచరిత్ర దీని వెరవారఁగ నెమ్మయి నైనఁ బట్టి తె
వలయు నరేంద్ర మిమ్ముఁ బనిఁ బంపెదుదాన నె దీనిమీఁద మీ
రలరుచుఁ జూచు భంగిఁ గని యాడితిఁ గన్నులపండు వెప్పుడున్
గలుగదె యెల్లనాఁడు నధికంబుగ [3]నీమృగరత్న మబ్బినన్. 35

చ. అని కడువేడ్కతోఁ బ్రియుని నామృగలోచన వేఁడినన్ మనం
బునఁ గడు నుత్సవం బొదవఁ బోయెద నిప్పుడ పట్టి తెచ్చెదం
గనుఁగొను మంచుఁ బూన నిజకాంతునితో ననురాగభావసం
జనితవికాసభాసి యయి జానకి యిట్లనుఁ గౌతుకంబునన్. 36

1 రొత్తెడు నంఘ్రులు...... మెఱుంగు లామృగమునకుం దనరున్.
2 'హరిహరవేధాదుల' అనియే వ్రా. ప్ర. 3 నీమృగచర్మ మబ్బినన్.

తే. [1]ఎట్లు గ్రుంకులు పెట్టుచు నేచి పట్ట, నీక యెట పాటెనేనిఁ బో నీక శరము
పాలుపడఁజేసి తెమ్ము భూపాల యొప్పఁ, జారుతర మైనయామృగచర్మ మైన.

వ. అని పల్కునవసరంబున సౌమిత్రి విన్నఁబోవుచు నింత యెఱుంగమి గలదె య
సురమాయం దగిలి రామచంద్రునకు హరిణరూపం బైనకలంకం బొందె నను
చుఁ దద్విఘ్నవచనంబు లాడ నోడి వెఱచుచు నుండె వెండియు రఘువరుండు.

క. సౌమిత్రిఁ బిలిచి లక్ష్మణ, యీమృగముం దనకుఁ దెచ్చి యి మ్మనియెడు నీ
భూమిజ విలునమ్ములుఁ దె, మ్మేమఱకుము వచ్చునంత కిట మీవదినెన్. 39

క. అన విని యతఁ డన్నకు ని, ట్లనుఁ దాపసహింస చేయు నలమారీచుం
డనువాఁడు కనకమృగ మై, చనుదెంచెం బొనఁగ విట్టిచందము లెందున్. 40

క. వసుమతి మన మింతకు మును, వసుధాధిప కంటిమే సువర్ణమృగము రా
జసకృత్య మ్మిది వలవదు, మసలుఁడు నతు లతులచపలమతులు దలంపన్.

—శ్రీరామమూర్తి మాయాకురంగంబుం బట్ట నరుగుట.—

వ. అనిన విని కౌసల్యానందనుండు సుమిత్రానందనున కి ట్లనియె. 42

క. అడిగినవస్తువు లెప్పుడు, నెడపక గలిగించుకతన నీయబల మనం
బొడఁబడి పురి నున్నట్టుల, కడు ముదమునఁ బొంది యుండుఁ గాంతారమునన్.

తే. పసిఁడిమృగము నిక్కం బైనఁ బట్టి తెచ్చి, జనకసుతకోర్కి దీర్చెద సమ్మదమున
లేక మాయామృగం బైన నిలఁ ద్రుంచి, హితమొనర్చెద మునులకు నెల్లలెస్స.

క. అని పలికి విపులబాణా, సనమును గవదొనలు పూని సౌమిత్రిఁ గనుం
గొని జనకతనయ సుమ్మీ, యని పలుమఱు నప్పగించి యట నన నదియున్.

చ. నిలువక మెల్ల దాఱు నటు నిల్చినమెల్పు నటించుఁ బట్టఁ జే
యలఁతికిఁ జేరినం జిదిమినట్టులు దూరము దాటుఁ గ్రమ్మఱం
గొలఁదికి డాసినం బొదలు గొందులు సొచ్చు నడంగె నన్న న
వ్వలఁ బొడసూపు మాటుగొని వచ్చిన వెండియు నుండు నొండెడన్. 46

వ. అప్పుడు రఘువరుం డపరభాగనిరూఢశరాసనుండును నాకుంచితాంగుండు నగు
చు నొయ్యన. 47

---

1. 37 మొదలుగా 50 వఱకుఁ గల వ్రాఁతప్రతులపాఠము.

క. కనకపుమేనును రత్నపుఁ, జనురుచులును గలుగుమృగము ధరణిం గలదే
జనవర యిది మాయామృగ, మని యెఱుఁగఁగ రాదె మీకు నసురులమతముల్.

చ. అన విని యల్ల నవ్వుచు ధరాధిపుఁ డెంతయుఁ బ్రీతిఁ దమ్మునిం
గనుఁగొని యామృగంబుపయిఁ గౌతుక మెక్కుడు పుట్టి తేరఁగాఁ
జన కిట యూరకున్న మది జానకి యెంతయుఁ జిన్నఁబోదె చ
య్యనఁ గొని యేఁగుదెంచెద గుణాకర యేమఱ కుండు మియ్యెడన్.

క. మునివ్రేళ్లు నేల మోపుచు, వెనుకదెసం జప్పు గాక । వెరవునఁ గదియం
దనుఁ జూచియు తెప్పలకడ, లును లే కటు నిలుచు నిలిచి । లోఁబడుకోలఁదిన్.

క. పిఱిఁదికిఁ బో నిచ్చినవి, ల్లఱితికి నై యల్లఁ జాఁప । నది గనుఁగొని పె
ల్లుఱికి చను లతలు పులువడఁ, జిఱుముం గడు నాసపుట్ట । శృంగాగ్రములన్.

వ. ఇవ్విధంబునం బెక్కుదూరం బరిగి యెండమావు లుదకంబు లని తలంచుచుఁ
దృష్ణాతిరేకంబునం దగులుమృగపతియునుంబోలె నారామచంద్రుండు. 50

సీ. పొదదండగాఁ జేరి । యుదరిపాటునఁ బట్టఁ, బొంచెద నంచును । బొంచిపొంచి
మొక్కలంబున నున్న । ముట్టి పర్వాన డయ్యఁ, బాఱి పట్టెద నని । పాఱిపాఱి
దొడ్డికట్టై యున్న । తోరంపుటీరంబుఁ, జొరఁ జొపి వెనువెంటఁ । దిరిగితిరిగి
పొరకలు మెఱుఁగునిండఁ । బూరించుకొని పచ్చ, చెట్టుచందంబునఁ । జేరిచేరి
మడుఁగులకు నల్ల దార్చుచు । నడుసు గలుగు
[1]కోలఁదిఁ బట్టంగ నగు నని । వెలిచి వెలిచి
యలమృగము వెంట నొయ్య నా । సాసఁ దిరిగ
నామృగవ్యాధరుద్రుఁడో । యనఁగ విభుఁడు. 51

వ. మఱియు నంగంగ తఱుముచుం బ్రిదిలి పోవుచు నిత్తెఱంగునం దార్చుసమ
యంబున. 52

సీ. నీరాకయెఱుఁగుదు । నిక్కంబుననుమార్కి, నోరచూపునఁ జేరి । రొయ్య గిఱువుఁ
జందురునిట్టితో । సమరంబునకు నేఁగు, పగిదిఁ గుప్పించి యు । ప్పర మెగయును
సురిఁగిపోయెద నన్నఁ । జొరఁ జోటు లే దింక, నీవె దిక్కనుభంగి । నెదురువచ్చుఁ
దనయకోర్కికి నుర్వి । తనుఁ బట్టు ననుగతి, నవనిపై నిలువ కం । దండ దాఁటు
మరలిచూచుఁ దిరుగు । మఱియు నద్దెసఁ బాఱు, నలసినట్ల నిలుచు । నల్లబెదరు
మెలఁగి దెసలు వెదకు । మెడయెత్తిగాలిది, క్కరయు నక్కురంగ । మచటనచట.

---

క. ఇది దనుజమాయ యని మీ, మది సంశయ మేల మాయ ♦ మాయించి శిత
ప్రదరంబులఁ దునిమెద నని, కదలెం బతి ఖడ్గతూణ ♦ కార్ముకధరుఁ డై.

చ. కదలి రఘూద్వహుండు చనఁ ♦ గా నది ముందటఁ గొంతచేరువన్
మెదలుచు డాసినన్ బెదరి ♦ మీఁదికి నట్లది దాఁటుచున్ మృగం
బదె యిదె నాఁగఁ బెంపొదల ♦ నవ్వలఁ దోఁచుచుఁ బాయుచున్ రయం
బొదవఁగ డాయడాయఁ గొని ♦ పోయె మహాగహనంబులోనికిన్.

1. పొలఁతిపట్టుగ నని వెల్చి ♦ నిలిచినిలిచి, యామృగము సేయకరొ పట్టు ♦ నాసఁ దిరిగ.

2 52 మొదలుగా 60 వఱకుఁ గల వ్రాఁతప్రతులపాఠము.

క. తిరిగి తిరిగి కడుఁ దడవున, కరయఁగ నిది దనుజమాయ ♦ యగు నని కోపో
ద్ధతుఁ డై యమోఘశరమున, ధరణీశ్వరుఁ డేసె శీఘ్ర ♦ దారుణభంగిన్.

క. నిలువక తరుగుల్మాంతర,ములలో వడిఁ బాఱునపుడు ♦ మొగులులు వాఱం
దలతల వెలుఁగుచు నెడనెడఁ, బలుమఱుఁ జందురుఁడుఁ దోఁచు♦పగిదిం దోఁచున్.

వ. ఇట్లు దోఁచిన విస్మితుం డగుచు. 55

మ. కదియం జొప్పడ కంతకంత కట యా♦కాంతారమధ్యంబునం
దది యెందుం గమియించినం బిదప డ♦య్యంబాఱుచుం బట్ట లే
కిది మాయామృగ మచ్చుగా ననుచు నిం♦కే దీనిఁ బో నీక చం
పెద దూరం బెలయించె నంచు నలుకం♦ బృథ్వీశుఁ డేతేరఁగన్. 56

క. మాయాహరిణము మిగులుదు, వాయువు దెగఁబఱతు ధరణి♦వలయము గడతుం
దోయధి దాఁటుదు ననుక్రియఁ, గాయద్యుతు లడర నొక్క♦గతిఁ దెగి నిగిడెన్.

—✿ శ్రీరాముఁడు మారీచుని రూపుమాపుట. ✿—

క. నిగిడి కడునలసి యట యొక, మృగయూథముఁ జొరఁగఁ బోవు♦మెయిఁ దోడనె వెం
గగిలి యగపాటు గని యెఱు, పగు వెరవున నిచ్చి రాముఁ♦ డద్యోణంబున్. 58

శా. చంచత్కాంచనకంకపత్రము ధను♦ర్జ్యావల్లి సంధించి ర
త్నాంచత్పుంఖముఁ గర్ణచుంబితముగా ♦ నాకృష్టిఁ గావించి క్రొ
మ్మించుంగీలలు గ్రమ్మ నేయ నదియుః ♦ మే నుచ్చి హాలక్ష్మణా
యంచుం గూలె నిజాకృతిం బుడమిపై ♦ నయ్యస్త్రపాతంబునన్. 59

వ. అట్లు గూలి గతాసుఁ డగునమ్మారీచుఘోరాకారంబు సూచి విస్మితుం డగుచు రఘువరుం డంతర్గతంబున. 60

ఉ. తమ్ముఁడు సెప్పినట్ల బలు♦దానవుఁ డయ్యెఁ గురంగ మక్కటా
యిమ్మెఱ కమ్మహాత్ముఁడు మ♦హీజయు నెంతఁ దలంకిరో కదే
యిమ్మెయిఁ గీడు సేయువిధి♦ కెవ్వ రసాధ్యులు నేఁడు వారలం
గ్రమ్మఱఁ జూడఁ గందునొకొ ♦ కాననొకో ధృతి దూలె నెట్లొకో. 61

క. నను మాయామృగ మై వడి, దనుజుం డిట దెచ్చె నచటఁ ♦ దమ్ముని నెమ్మె
ఘనదైత్యులు పొదివిరొకో, జనకజ యే మయ్యెనొ మది ♦ శంకించెఁ గడున్.

తే. అనుచు వేగంబ రఘురాముఁ ♦ డచట మాయ
మెగము వధియించి కైకొని ♦ వగలు వొదువు

---

చ. అది మును మాయ మ్రింగి దను♦జాంగము సొచ్చి పగుల్ప వాఁడు బె
ట్టిదుఁ డయి మీఁదికిన్ నెగసి ♦ డప్పర మై యిలఁగూలి వ్రాలెఁ బె
ల్లదరుచు లక్ష్మణా యనుచు ♦ హా యని రాము సెలుంగుభంగి నై
యుద్రువఁగ నన్నిదిక్కులు మ♦హాధ్వని సీత గలంగునట్లుగన్.

క. అని ఘోరంబుగ నఱచుచు, దనుజుఁడు పుడమి నిజరూప♦ధరుఁ డై పడియెం
బెను మేనితోన రాముఁడు, గముఁగొని విభ్రాంతి సొలఁ ♦ గదిసెడుమదిలోన్.

నంతరంగంబుతో నేఁగ ♦ నప్పుడచట
నార్తరవ మట్లు మ్రోసిన ♦ నాత్మఁ గలఁగి. 63

వ. [1]ఉల్లంబునం దల్లడం బొదవ ధాత్రీపుత్రి సుమిత్రాపుత్త్రుం బిలిచి దీనవదన
యగుచు నిట్లనియె. 64

శా. వింటే లక్ష్మణ రామునార్తరవ మై ♦ వీతెంచె నే నొంటి పా
ప్మంటిం దమ్ముఁడ యేమి పుట్టనో కదే ♦ హా లక్ష్మణా యంటగా
వింటిం దాలిమిఁ బట్టఁ జాల నటవీ ♦ వీథిం గురంగంబువె
న్వెంటం బోక తలంపఁ గీడు సనవే ♦ వేగంబ నీ వేఁడఁగన్. 65

క. కుడికన్నదరఁ దొడంగెను, దడయం దొకకీడు లేక ♦ ధరణీశుం డె
య్యెడ నైన నిన్నుఁ బిలిచెనొ, వడిఁ జేకొనవయ్య భ్రాతృ ♦ వత్సల రామున్. 66

చ. అని పలుమాఱు దైన్యమున ♦ నశ్రులు గ్రమ్మఁగఁ బల్కునట్టియ
వ్వనితకు నాతఁ డిట్టు లను ♦ వాసవపద్మజరుద్రు లైన నా
ఘనున కెదుర్ప నోడుదు ర ♦ గణ్యపరాక్రముఁ డమ్మహాత్ముఁ డే
దనుజుల నైనఁ ద్రుంచి వెసఁ ♦ దా నిట వచ్చుఁ దలంక నేటికిన్. 67

తే. మాయరక్కసుఁ డొక్కఁ డీ ♦ మాడ్కిఁ జీరె
నన్ను నెలుఁగెత్తి యెలుఁగ నే ♦ నాకసంబు
విఱిగి పైఁబడ్డ నాత్మలో ♦ వెఱవఁ డెపుడు
నమ్మహాత్ముని నీఱు సేయ ♦ నవనిఁ గలరె. 68

క. [2]నిను నిట్లూఱడిపోయెను, మనుజేంద్రుఁడు నాకుఁ దగునె ♦ మానిని యిచ్చో
నిను డించి పోవఁ బోయిన, ననుమానము లేదపాయ ♦ మగు నీ కిచటన్. 69

వ. [3]అని వెండియు. 70

క. దెప్పర మప్పురుషాగ్రణి, కెప్పాటను గలుగ నేర ♦ దెందును నోహో
నిప్పుఁ జెదలంట నేర్చునె, తప్పుఁ దలంచితివి యేల ♦ తలఁకెద వకటా. 71

ఉ. అట్టిద యైన నింతక య ♦ హర్పతి తప్పఁ జరించు మేరు వి

---

1. 64 మొదలుగా 66 వఱకుఁ గలవ్రాఁతప్రతులపాఠము.

ఉ. భూపతి యార్తిఁ బొందె నని ♦ భూమిజ దల్లడ మొంది లక్ష్మణా
పాపము వొందె లెమ్ము వెసఁ ♦ బాఱుము రాక్షసబాధఁ బొందఁగా
నోపు రఘూద్వహుం డనిన ♦ నొత్తిలి చీర నిశాటకోటిచే
నే పఱిఁ బోలుఁ బోయి వెస ♦ నేఁగు జవంబునఁ బొమ్ము క్రమ్మనన్.

2. నను నిల్లూరిడి పోయెను; నిను నిల్లడ యిడి పోయెను.

3. 70 మొదలుకొని 74 వఱకుఁ గలవ్రాఁతప్రతులపాఠము.

క. అనవుడుఁ బేర్చినశోకం,బునఁ బెల్లేడ్చుచు మహాత్ముఁ ♦ బుణ్యచరిత్రున్
మనుజేంద్రుఁ గావఁ దగవే, చనునే రాముననుఁ దోడు ♦ చనవు రయమునన్.

ట్టట్టుగ డొల్లు భూవలయ మల్లలనాడు సురాసురావలిం
దొట్టి జయింపఁ జాలు నృప ధూర్జటి కెక్కడిచిక్కు గల్గు నీ
వెట్టని చూచెదా వినద మెట్లును రాక్షసమాయ నావుడున్. 72

క. రామునిదెస కట్లెఁగిన, ప్రేమావేశమున మనసు బెగడి వివేకం
బేమియుఁ దోఁపక తగవును, మోమోటము దక్కి యలుక ముద్దియ పలికెన్.

క. దిగు లంది యేను బనిచిన, మగుడం జెప్పెదవు గాని మది నించుకయున్
బెగడవు సవతులకొడుకులు, పగవా రని నీతివిదులు పలుకుట బొంకే. 74

తే. అనుచు సంతాప మందుచు నతనికడఁక, లేమి గనుఁగొని కోపించి లెక్కసేయ
వగ్రజునిచేటు గని ప్రియం బాత్మఁ గదిరి, నట్ల యున్నాఁడ వధికపాపాత్మ నీవు.

చ. అనుజుఁడ నంచు మున్నొకదు రాత్ముఁడు రాజ్యవిభూతి యెల్లఁ జే
కొని యటు సేసె నీవుఁ గడుఁ గ్రూరత రామునిచావు వేచి తే
మనఁ గల దింక నిన్నుఁ గుటిలాత్మక నా కని కాచినాఁడవే
నినుఁ గయికొందునే నిలువు నీ యయి కూలుదు గాక దుర్మతీ. 76

క. 1అనవుడు నవు డప్పలుకులు, సునిశితవిషలిప్తదీప్తసూచీముఖభే
దనగతిఁ జేయుఁడు శివశివ, యనుచుం గరగుప్తకర్ణుఁ డై కట్టెదురన్. 77

ఆ. అశ్రుకణము లొలుక నాకంపితాంగుఁడు, నవనతాననుండు సగుచుఁ గొంత
సేపు మనసునందుఁ జింతించి యద్దేవి, తోడ ననియెఁ గేలుదోయి మొగిచి.

క. పరదేవతవును దల్లివి, గురుపత్నివి నీవు నీకుఁ గూడునె నన్నీ
పరుసములు వలుక నింకన్, నరపతిపను పైనఁ జగునె నా కిట నిలువన్. 79

క. నీకు మహాభూతంబులె, పోకాఁడిక నేను నిదిగొ పోయెద రక్షో
భీకరమృగకులసంకుల, మీకానన మింత నీవ మెలఁగుము తల్లీ. 80

---

1. 77 మొదలుగా 91 వఱకుఁ గలపాఠము.

వ. అనిన నమ్మాటలకుఁ దప్తలోహంబు చెవులం బోసిన ట్లయినం దల్లడిల్లి వివశుం డై సౌమిత్రి ధాత్రి నొరిగి నదియు వైశికంబుగాఁ గైకొని మఱియుం బరుషంబులు పలుకుచు నంతం బోక శోకాకుల యై.

తే. అకట నామాట వినవని యానవంబు, వేసికొనుచు మహాభయవివశ యగుచు
నేడ్చుసతిఁ గని తల్లడం బెడఁదఁ గలిగి, కదలి సౌమిత్రి యక్కాంత కెదుర నిలిచి.

క. ఎల్లదెఱంగుల నిన్నుం, దల్లింగాఁ జూతు నిట్లు తగునే యిమ్మై
నుల్లంబు గాలఁ బలికెదు, తెల్లము నాపొక కీడు దేవీ నీకున్.

చ. అనుచుఁ బ్రదక్షిణించి ఘనుఁ డాసతియంఘ్రులు చూచి మ్రొక్కుచుం
జనుచు సమస్తభూతములు సాక్షిగ నాదెసఁ బాపబుద్ధి లే
దని పలుమాఱుఁ బల్కుచు నిజాగ్రజుపోయినవంకఁ బోయినం
దనమదిఁ బొంగి రావణుఁడు తాపసవేషముతోడఁ జెచ్చెరన్.

ఆ. అనుచు నక్కుమారుఁ డడవనతుం డై దృష్టి, నిగుడునంతదాఁక మగిడి మగిడి
పర్ణశాలదిక్కు పలుమఱుఁ గనుఁగొంచు, నరిగె నంత నిట దశాననుండు.

—రావణుఁడు సన్న్యాసివేషంబున సీతకడకు వచ్చుట.—

సీ. తుదివ్రేల నెగసనఁ ద్రోచినపుదియబొ, ట్టురుఫాలపట్టిక నుల్లసిల్లఁ
దులసీదళాంకితతుచ్ఛశిఖాపుచ్ఛ, మలవడ నునుఁదల నంద మొంద
గావిగోఁచియుఁ గుశగ్రంథులుఁ బెనఁచిన, ముక్కోల వలపలిముష్టి నమర
నిర్మలజలములు నిండ నించినకమం,డలువు డాకేల బెడంగు మిగుల
నిట్లు భిక్షువేషము ధరియించి కపట,వార్ధకంబు నటించుచు వచ్చి పర్ణ
శాలవాకిటఁ బథిపరిశ్రాంతి నొంది, యల్ల మెల్లన హరిహరి యనుచు నిలిచె.

వ. ఇట్లు నిలిచి కెలంకు లరయుచుం దొంగి చూచి పర్ణశాలాభ్యంతరంబున. 83

మ. హరిణం బిక్కడ కేల వచ్చె విభు నేల న ట్లేల పొమ్మంటి నా
తరవం బేటికిఁ బుట్టె నట్టిమఱఁది న ప్పాడి నొప్పించి యీ
దురితం బేటికిఁ గట్టికొంటి ననుచుం దోఁతెంచుకన్నీటితోఁ
గరపద్మంబును నక్కు సేర్చి వగలం గంగంగ నయ్యంగనన్. 84

క. కనుఁగొని యలరుందూపులు, గనచిత్తము దూరఁ గాఁడఁ దాలిమి దూలన్
మనసిజవికృతిం బొందుచు, మునుమిడి కొనుకపటమంత్రమును వాతప్పన్. 85

సీ. వలరాజు పాటించువాలారుటమ్ములు, గామినీరూపంబుఁ గాంచె నొక్కొ
భర్మనిర్మితసాలభంజిక దియ్యంపుఁ, జెయ్వులు దగ నభ్యసించె నొక్కొ
మహితసమ్మోహనమంత్రాధిదేవత, సురుచిరాకృతిఁ బొడసూపె నొక్కొ
లసితసరోవరలావణ్యసంపద, సీతాభిధానంబుఁ జెందె నొక్కొ
యనుచు నడరుకోర్కు లనురాగసాగర
వీచు లగుచు ధైర్యవేలఁ గడవ
నుండి యుండి మఱియు నొకమాయఁ బొందె నా
ననిమిషత్వ మొందె నాత్రిదండి. 86

ఉ. అప్పుడు సీతయుం బొడముకన్నశ్రులు లెప్పల నప్పళించుసొం
పొప్పఁ గుచద్వయంబుపయి నుండక జాఱిన నున్నకొంగు చే
నెప్పటియట్ల కాఁ దిగిచి యెవ్వరొ పీ రొకపెద్ద లంచు న

---

ఉ. మానిత మైనదండముఁ గమండలువున్ ధరియించి రక్తగా
పీనము నొప్పఁ దాల్చి జరఁ బెద్దయుఁ బ్రాలినమేనితోడ న
చ్చో నటు నిల్చి యల్లసిలుచున్ హరినామము లుగ్గడించుచున్
జానకి యున్నమందిరముఁ జక్కటిఁ జే యొలయించి పట్టుచున్.

తే. అరిగి నారాయణా యంచు నల్ల పర్ణ, శాలలోపలఁ జొచ్చిన జనకతనయ
యతివరుండు మహావృద్ధుఁ డనుచు దర్భపీఠ మిడి యర్ఘ్యపాద్యముల్ ప్రియముతోడ.

చొప్పున నున్న రావణునిఁ ǂ జూచెఁ దృణావృతకూపసన్నిభున్. 87

వ. చూచి వినయంబుతో నర్ఘ్యపాద్యాదు లిచ్చినం గైకొని యమ్మాయాపరివ్రా
జకుం డిట్లనియె. 88

శా. ఇంతీ యెవ్వరిదాన వెందునికి ముǂన్నే మండ్రు నీనామ మి
క్కాంతారంబున కేల వచ్చితి జగǂత్కల్యాణ మీదేహ మ
త్యంతాయాసముఁ బొందఁ జేసిననిమిǂత్తం బేమి నీ వేటికి
వంతం బొందినదాన వి ట్లనుడు నǂవ్వామాక్షి దా ని ట్లనున్. 89

క. చిరపుణ్యుఁడు జనకుం డను, నరపతిసుత సీత యండ్రు ǂ నన్ను నయోధ్యా
వరుఁ డగుదశరథధరణీ,శ్వరుకోడల నేను రామǂచంద్రునిభార్యన్. 90

వ. అని చెప్పి తమవనవాసవృత్తాంతంబును గనకమృగంబుపిఱుంద రామలక్ష్మణు
లు నన్న తెఱంగు నెఱింగించి. 91

క. మునినాథ విశ్రమింపుఁడు, జననాథుం డిపుడ వచ్చి ǂ సత్కారము మీ
కొనరించు ననిన రావణుఁ, డనియెను భూపుత్త్రిఁ జూచి ǂ యధికప్రీతిన్. 92

క. నీతెఱఁగుఁ బతితెఱంగును, జేతోముద మొదవ నాకుఁ ǂ జెప్పితి వనితా
నాతెఱఁగు నాబలంబును, నీతో నెఱిఁగింతు వినుము ǂ నెయ్యం బొదవన్. 93

చ. కమలభవుండు తాత గుణǂగణ్యుఁడు విశ్రవసుండు తండ్రి హే
మమయవినూత్నరత్నమయǂమండిత మాత్మపురంబు లంక వి
క్రమము త్రిలోకభీకర మǂఖండశుభాకర మైనదైత్యరా
జ్యమునకు నేను భర్తఁ బటుǂశౌర్యుఁడ రావణనామధేయుఁడన్. 94

సీ. మృత్యువునైనను ǂ మృత్యువుఁ బొందింతు, నగ్నినైనను సమǂగ్రాగ్ని నోర్తు
యమునైన లయకాలǂయముఁడనై శాసింతుఁ, దపనునైనను నేఁ బ్రǂతాపతీవ్ర
తపనుఁడనై మింతు ǂ ధనదునినైనను, ఘనధనదుండనై ǂ గర్వ మడఁతు
వజ్రినైనను మహాǂవజ్రినై వధియింతుఁ, బవను నైనను జండǂపవనుఁ డనఁగ
నెదిరిభంజింతుజగముల ǂ నెందుఁ బరఁగు, సుందరులఁదెచ్చిభోగింతుǂసుందరాంగి
నీవిలాసంబు విని యాత్మ ǂ భావభవుని,చేత నలఁగి వచ్చితి వేయుఁ ǂ జెప్ప నేల.

---

చ. గురుమతి నిచ్చినం బ్రియము ǂ గూరఁగఁ గైకొని యింత యొప్పనే
హరిహరి యీనివాస మని ǂ యల్లన నాసతియొప్ప నూచుచుఁ
బురుఁడు గలంచినం దరుణిǂమాటలు కొన్ని వినంగఁ గోరి నీ
చరితము నూరఁ బేరుఁ బతిǂచందము చెప్పుము నాకు నావుడున్.

వ. ఇమ్మహాత్మునికిం జెప్పిన నేమి కొఱంత యని యమ్ముగ్ధ మొదలుకొని సవిస్తరంబుగా.

క. జనకునిమహిమయు దశరథు, పెనుభును దత్సుతులవిధముఁ ǂ బ్రీతి యొసంగన్
వనమునకు రామచంద్రుఁడు, చనుదెంచిన తెఱఁగుఁ జెప్పె ǂ సముచితభంగిన్.

వ. చెప్పిన విని రావణుం డిట్లనియె.

వ. [1]అని వెండియు. 96

చ. నిను విని కోర్కె లుల్లమున ॥ నెక్కొన ధైర్యము నుజ్జగించి గో
వనితలపొందు నొల్ల కిట ॥ వచ్చితి నచ్చెరువాయనీవిలో
కనములు గాముబాణముల॥కంటె మనంబును దూఱఁ జొచ్చె నం
గన నను గక్కునేలికొనఁ ॥ గాదె ముదంబున వేయు నేటికిన్. 97

సీ. కుసుమితవనలతా॥కుంజపుంజములను, వరుసఁ జెన్నగునుప॥వనములందు
మకరందమత్తాళి॥మధురగానంబులఁ, గొమరారు నెత్తమ్మి॥కొలఁకులందు
సమయసూచకయంత్ర॥సాలభంజిక లొప్పు,కృత్రిమాచలమహా॥గృహములందు
రమణీయబహుచిత్ర॥రచనావిశేషంబు, లమరునత్తుంగహ॥ర్మ్యములయందు
నబల నాతోడ నీ వింక ॥ ననుదినంబు, లంక నకలంకలీలల ॥ లలితరతులు
సలుప నేతెంతుగా కొక్క॥చపలుఁగూడి, ఘోరకాంతారభూములఁ॥గుందనేల.

క. అన విని రోషము మనమునఁ, బెనఁగొనఁ గంపంబుతోడఁ ॥ బృథ్వీసుత యి
ట్లను నట్టికమలజునకున్, మనుమఁడ వై తగునె యిట్టి॥మాటలు నీకున్. 99

క. రామునకు నీకు హస్తికి, దోమకుఁ గలవాసి యతని॥దుర్వారశర
స్తోమమునఁ బొలియఁ దలఁచితొ, కో మదిమది నుండి యుండి ॥ కుత్సితచరితా.

మ. అనుచున్ వెండియు రోషవిస్మయభయ॥వ్యాలోల యై వీతధ
ర్ముని దుష్కర్ముని నిన్ను నే మునియ కా ॥ మోసంబునం బూజ సే
సినపాపంబున నిట్టు లాడి తకటా ॥ శీఘ్రింబ కాకుత్స్థను
గ్రనిశాతాస్త్రమహాగ్నిలో మిడుత వై ॥ కాలం దలం పెత్తెనే 101

మ. గరళం బెత్తుక క్రోలఁగాఁ దలఁచితే ॥ కష్టాత్మ కందర్పసం
హారుఁ జక్రాయుధుఁ బద్మజుం గడచను॥ద్యత్తేజు శ్రీరాము ని
వ్వానిఁగాఁ జూచెద వాఖరాంతకునితీ॥వ్రక్రూరబాణాగ్నిచే
ధరణిం గూలెద వేల ప్రేలెదవు బ॥ద్ధస్పర్ధ దుర్వాక్యముల్. 102

వ. [2]అనిన విని సక్రోధంబుగా నప్పాపు నద్దశాననుం డి ట్లనియె. 103

చ. పెఱుకుదు నే ఫణీంద్రవిష॥భీకరదంష్ట్రలు నేలఁ గ్రుంగఁ జే

1. 96 మొదలుకొని 101 వఱకుఁ గలవ్రాఁతప్రతులపాఠము.

తే. ఏను మన్నించు సుందరులెల్ల ♦ వేన వేలు, నిన్నుఁ గొలుతురంగధన్య వై ♦ నన్నుఁ జెంది
మనెదు గా కింక నీపేద♦మనుజు తోడి, మనువు నీ కేల చనుదెమ్ము ♦ వనజవదన.

మ. అనినన్ భూసుత రోషసంభ్రమభయ♦వ్యాలోల యై

... ... ... ... ... ...

2. 103 మొదలుగా 109 వఱకుఁ గలపాఠము.

అనిన నవ్వె నిగాఁ జూచి ♦ యాడి తనుచు, నసుర వింశతిబాహులు ♦ నలికయోగ్ర
వదనదశకంబు మెఱయంగ ♦ వాహునయన, యెసుర నిలిచినఁ గంపించి ♦ యొదిలికొనుచు.

సఱతును నింగి మ్రింగుదును § చండదిశాగజదండకాండము
ల్విఱుతును వారిధుల్ పుడిసి§లింతును మందర మంగుటంబునం
జెఱుముదునే జగంబు లఱ§చేతికిఁ దెత్తును మత్తకాశినీ. 104

—✤ రావణుఁడు సీతను గౌఁగిలిఁగొనిపోవుట. ✤—

చ. మదమున నింద్రుఁ డాదిగ స§మస్తనిలింపుల వెట్టిగొన్న నా
యెదుర మృగాక్షి నీ వకట § హీనపరాక్రము రాము గీముఁ జె
ప్పెద విటు సూడు నన్ననుచు § బిట్టునిజాకృతితోడ నిల్చె ని
ర్వ్యదిభుజశాఖలుం బదిశి§రంబులు నోజ యొనర్పఁ జూడ్కికిన్. 105

వ. ఇట్లు నిలిచి తనదుభయంకరాకారంబునకు మూర్ఛం బొంది పుడమిం బడి యున్న జనకతనయం బొదివి పట్టి రథంబుపయిం బెట్టి లంకాభిముఖుండై గగనగమనంబునం జన నయ్యింతియుం గొంతతడవునకుఁ దెలిసి దెసలు గలయం గనుంగొని.

చ. ననుఁ జెఱగొంచు రావణుఁడు § నా నొకరక్కసుఁ డేఁగుచున్నవాఁ
డినకులరాజరత్నమ శు§భేక్షణ లక్ష్మణ తేరు వేగమై
చనియెదు రాఁగదే యెఱుక § సాలక తమ్ముఁడ నిన్ను నప్పు డే
ననుచితభంగి నిష్ఠురము § లాడినపాపఫలంబు గాంచితిన్ 107

ఉ. ఓనరనాథ యుద్ధగతి § నొక్కనిశాచరుఁ డాననంబు లీ
రేను ధరించినాఁడు నను § నెక్కటిఁ గోకొని పోవుచున్నవాఁ
డే నొకదిక్కు లేక యిదె § యేడ్చుచుఁ జీరుచు నున్నదాన నీ
వేనన రాఁగదే నిఖిల§లోకశరణ్య మదీయరక్షకున్. 108

శా. ఓహో నామొఱ యెవ్వరుం విననియ § ట్లున్నారొ కం డైన మీ
బాహాదర్ప మెలర్పఁ దాఁకఁ దగదే § బందీవిమోక్షంబు మీ
కాహా పుణ్యము గాదె కీర్తి యరుదే § యాలింపరే యోరి వై
దేహిం దెత్తువె యంచు నడ్డపడరే § దిక్పాలు రీద్రోహికిన్. 10

ఉ. వెండియు సీత శోకమున § విహ్వలభావము తల్లడంబు నొం
డొండ మనంబునం గదుర § నో రఘువల్లభ యో నృపాల యు
ద్దండత నన్ను నొక్కబలు§దైత్యుఁడు వే కొని పాఱెఁ జొచ్చెఁ గో
దండభుజుండ వై కదిసి § దానవుఁ ద్రుంపఁ గడంగవే వెసన్. 11

---

క. తిరుగుడు వడి వెనువెనుకకు, నరుగఁగ వడిఁ బొదివిపట్టి § యరదముపైఁ జె
చ్చెర నిడి యంబరపథమున, నరిగె దశాననుఁడు వికసి§తాననుఁ డగుచున్.

ఉ. అత్తఱి సీత దల్లడిలి § హా రఘునాయక హా నరేంద్ర న
న్నిత్తఱిఁ గావ రమ్మనుచు § నెత్తిలి యేడ్వఁగఁ బంక్తికంధరుం
డత్తరుణీ నయం బఱి భ§యంపడునట్లుగ బిట్టదల్చుచుం
దత్తఱపాటుతో నిజర§థంబు నభంబునఁ బోలె నుద్ధతిన్.

శా. అన్నా లక్ష్మణ నిన్నుఁ బుణ్యనిధి నే । నజ్ఞాననై పల్కితిఁ
నన్నాపాపము వచ్చి ముట్టకొనియెఁ । నాపాలిదైవంబవై
యిన్నీచుం బరిమార్ప వేగ పఱతే । వే నన్ను రక్షింప మీ
యన్నం గ్రన్ననఁ జీరవే [1]యరుగవే । యత్యుగ్రశీఘ్రంబునన్. 111

ఉ. (హా యను నో నరేంద్ర యను । హా రఘుకుంజర నీవు వేగ రా
వే యను నెంతదూరమున । కేఁగితొకో యను నాయెలుంగు విం
టే యను విన్న నీశరము । లీతల లింతకుఁ ద్రుంచివైవకు
న్నే యనుఁ గైకకోర్కి ఫలి । యించె బళీ యను దైవమా యనున్. 112

ఉ. రాఘవుదేవిఁ దేరఁ దగు । రా యన రెవ్వరు నోర నిత్తెఱం
గాఘనబాహువిక్రమున । కైనను జెప్పరు దన్నిరంతరా
మోఘశరాళి వీనిశిర । ముల్ దునుమాడువిధంబు సూడ రో
మేఘములార వేగ చని । మీ రయినం బతితోడఁ జెప్పరే.) 113

వ. అని యనేకవిధశోకాలాపంబులతోడ నంకంద యాక్రందనంబు సేయుచు నలు
దిక్కులు సూచి. 114

సీ. పావనాకార గో । దావరీదేవి నీ, వెఱిఁగింపవమ్మ రా । జేంద్రుతోడ
నో మాల్యవంత పు । ణ్యోన్నత గిరినాథ, చెప్పంగదే రాజ । సింహుతోడ
నో జనస్థానమ । హీజములార యీ, విధ మెఱిఁగింపరే । విభునితోడ
నో దండకాటవి । నున్నతాపసులార, నాపాటు చెప్పఁడీ । నాథుతోడ
నేను శ్రీరాముభార్య మీ । రెవ్వరైన, నడ్డపడి తాఁకి విడిపింప । రయ్య కావ
రయ్య సురలార మునులార । యక్షులార, యఖిలదిక్పతులార పు । ణ్యాత్ములార.

క. అని ఘనశోకాతుర యై, పనవఁగ నయ్యేడ్పు వినియెఁ । బక్షీంద్రుఁడు శా
తనఖాగ్రకులిశధారా, వినిహతభేరుండవిహగ । విగ్రహుఁ డంతన్. 116

వ. [2]విని యోహో వెఱవకు మే నున్నవాఁడ నిన్నీచుం బొరిగొని నిన్ను విడిపింతు
నని పలుకుచుం బెలుచ. 117

సీ. తనయున్నగిరి బెట్టు । తాఁచి బిట్టెగసిన, నది శేషుపడగలఁ । గుదియ నదుము
జవమునై నెఱకలు । జాడించువడిఁ బుట్టు,ధూళి మేఘంబులఁ । దూలఁదోల
నిలునిలుమీ దైత్య । నిను వ్రత్తు నని పేర్చు,నదలుపు బ్రహ్మాండ । మద్రువఁజేయ
విపులకోపోద్రేక । వృత్తము లైననే,త్రములరశ్ములు రవి । రశ్మి నగువ
శరభసింహాదిమృగరక్త । సాంద్రశోణ, ఘోరచంచుప్రభాఘన । క్రూరవక్ర
నఖరకులిశప్రచయసమ । న్నతశరీరుఁ, డగుజటాయువు గదిసె । నయ్యసురవీరు.

---

1 మగుడవే. 2 ఇందులకు "విని యోహో వెఱవకు వెఱ, వను నీ కే వెనుక నున్నవాఁ డన యిన్నీ, చునిఁ బో నీ కిపుడ వధించి నినుఁ విడిపింతు ననుచుఁ జెచ్చెరఁ బెలుచన్" అని వ్రాఁతప్రతులం బద్య మున్నది.

—✿ జటాయువు రావణునితోఁ బోరి నేలం గూలుట. ✿—

చ. కదిసి దశాస్య యేఁ గలుగఁ ‡ గా రఘువీరుని దేవి నెట్లు నీ
కదయతఁ గొంచు నేఁగ వశ ‡ మంచు రథంబున కడ్డ మేఁగి యో
రి దనుజ సీత డించి సుచ ‡ రిత్రతఁ బ్రాణముఁ గాచికొమ్ము కా
కది యిది యాడితేని నుఱు ‡ మాడుదుఁ గండలు రాల్తు మేదినిన్. 119

క. ఓరి నిశాచర త్రిభువన,వీరుం డగురాముదేవి ‡ విడువుము దనుజ
శ్రీ రాజిల్లఁగ బ్రదుకుము, కోరుదురే వెడఁగ కాల ‡ కూటము గ్రోలన్. 120

చ. అఱుగునె యుక్కుగుండు కడు ‡ నంగద మ్రింగిన నూఁచి చూచినన్
విఱుగునె మేరుభూధరము ‡ వెంగలివై రఘురాముభామినిం
జెఱగొని పోవఁ జూచెదవు ‡ చెచ్చెర నిప్పుడ యోరి నీచ నా
కఱపినబుద్ధిఁ గైకొనుము ‡ కాచెద జానకి డింపు మిమ్మహిన్. 121

క. అని పలుతెఱఁగులఁ జెప్పఁగ,దనుజుఁడు గైకొనక యరుగఁ ‡ దలఁచి [1]కదలినన్
వినువీథి కెగసి మార్కొని, వెనుఁబడ నందంద బిట్టు ‡ వ్రేయుచుఁ గడిమిన్.

స్రగ్ధర. చండాతిక్రోధగృష్టుల్ ‡ చగలఁ [2]బొదల భా ‡ స్వద్దశాస్యాంగసంధుల్
ఖండించుం జించు నొంచున్ ‡ [3]ఖరచరణనఖా ‡ గ్రంబులం బోఁజుఁ దేరు
ద్దండాటోపంబునన్ భూ ‡ స్థలిఁ బడ నడుచున్ ‡ దండడిం ద్రిప్పు నుద్య
త్సండీనోడ్డీనవృత్తిం ‡ ద్వరితగతి సము ‡ త్సాహసంరంభలీలన్. 123

క. పెనుగాలిఁ దూలుమేఘం,బునుబోలెను బక్షివిభుని ‡ భూరిబలమునం
దన కెట్లు నరుగరాక, ద్దనుజరథము [4]దిరిగె నీఱ ‡ తాఱల నడలన్. 124

సీ. ప్రకటితోద్ధతి డాసి ‡ మకుటముల్ విఱిచిన, జల్లున రత్నసం ‡ చయము దొరఁగ
బెగడొంద నందంద ‡ మొగములు వ్రేసిన,భుగభుగ మని రక్త ‡ పూర మొలుక
రథ మాక్రమించి ఘో ‡ రంబుగా వీచిన, జిఱజిఱం దిరిగి పె ‡ ల్లొఱఁగఁ బడఁగ
సరభసంబుగ సిత ‡ చ్ఛత్రధ్వజాదులు, విఱిచినఁ బెళపెళ ‡ విఱిగి కూలఁ
జాల సుడివడి దనుజుఁ డా ‡ [5]భీలరౌద్ర, భంగిఁ బదివిండ్లు నెత్తి య ‡ పక్షివిభుని
నూడుకొనఁజేసి తిరిగి వే ‡ ఱొక్క [6]దిక్కు, తెరువుగా నూడఁజూచిన ‡ నరుగనీక.

చ. వెనుకొని పాఱుఁ బాఱి నడి ‡ వీఁపు మహోగ్రతఁ దన్నుఁ దన్ని మా
ర్కొని వడి నొంచు నొంచి యిట ‡ కున్ దివికిం జన నిచ్చు నిచ్చి యే
నని వెస నార్చు నార్చి వెగ ‡ డందఁగ దండడిఁ జేరి దుర్దశా
వినిహతు నద్దశాననుని ‡ వ్రేయు జటాయువు పేర్చి వెండియున్. 126

---

1 ‘కడఁగినన్, ఘన మైన కోపవహ్నియు, వెనుఁబడ’ అ. ప్ర. 2 ‘బొదలఁగా ♦ స్వాంగసంధుల్ దెగంగా.’ అ. ప్ర. 3 ‘ఖరనఖరములన్ ♦ గాత్రముం జొన్పఁ దేరు’ అ. ప్ర. 4 విఱిగె. వీఱ♦తాటన మగుచున్. 5 భీలభంగిఁ, బదికరంబుల విం డ్లెత్తి ♦ పక్షివిభుని. 6 ‘జాడ, నరుగఁ జూచినరాక్షసు ♦ నరుగనీక.’ వ్రా. ప్ర.

చ. (కడఁగు కడంగు మోరి సురకంటక పోరికి నొంచె జానకిన్
విడు విడు ధాత్రిపుత్రి యిదె వీని వధించెద నోడ కోడ కే
పడరఁగ వీఁడు వోవునె జటాయువుముందట నంచు వక్త్రముల్
వెడఁచటువం బతత్రముల వ్రేసి బలోద్ధతిఁ జేర్చి వెండియున్. 127

క. దశముఖుఁడు వివిధముఖముల, విశిఖంబులు వఱపఁ బక్షవిక్షేపములన్
దిశలకు జడియుచు వెస న,గ్దశరథసఖుఁ డసమసమరదక్షత మెఱయన్. 128

శా. దట్టించుం గెరలించు నవ్వు రథ ముద్దండాగ్రతుండంబునం
బట్టుం గ్రిందికి నెత్తు నెత్తి మొగదప్పం ద్రిప్పు దర్పంబునన్
గిట్టుం జట్టిప లార్చు నార్చు నగయుం గేడించి పో వచ్చినం
జుట్టుం బాఱుచు వ్రేయుఁ బాయు నొడియుం జూడావళీరత్నముల్. 129

వ. ఇట్లవక్రవిక్రమంబునం బరిభవించిన నన్నిశాచరుండు. 130

క. నాళీకవిమతశిలీముఖ, జాలము పైఁ బఱప నదియుఁ జరణాహతులం
దూలించిన మఱియుం బది,వాలమ్ముల నేసె నేసి వడి నార్చుటయున్. 131

లయవిభాతి.

తూణములు వోఁజదిపి బాణములు సక్కడిచి
పాణివలయస్ఫురితబాణశితశస్త్ర
శ్రేణి చెదరం జఱిచి వేణు వెడలించియును
రేణువులుగా మకుటకోణవిలసత్పా
షాణములు రాచి కవచాణువులు రాలిచి క
రేణుకరిభిత్ప్రబలశోణితరతుండ
ద్రోణిఁ గొని దిక్కులకు శోణితముఁ జల్లుచుఁ బ్ర
క్షీణబలుఁ జేసి పటుప్రాణ చెలఁగంగన్).

మ. వడిఁ జుట్టుం జని యార్చుఁ జేర్చుఁ గదియన్ వచ్చున్ వెసన్ వ్రచ్చుఁ జే
డ్పడ నొంచుం గబళించుఁ జించుఁ దొలఁగున్ డాయున్ గదన్ వ్రేయుఁ బో
వడి నొత్తున్ దివి కెత్తుఁ గిట్టుఁ గదియుం బట్టుం బడం ద్రోయు బ
ల్విడిఁ దాఁచున్ రుధిరంబుఁ బీల్చుఁ జెలుచున్ వీక్షించుఁ గ్రోధంబునన్. 133

వ. ఇబ్భంగిం బొంగి పోనీక పొదివి యదల్చి మరల్చినం బిశాచవదనహయంబులం గల్గిన యత్తేరు తిరుగుడువడినం బంక్తిముఖుండు తీవ్రనఖుం డగునప్పక్షిపతి నాక్షేపించుచుఁ గ్రోధంబున బిట్టు జలపడియె నట్లయ్యిరువురు దొడరి చలంబును బలంబును గోపంబును నాటోపంబును దీపింపఁ జండగతి నొండొరుల నరకుఁగొనక కల్పాంతకాలమేఘంబులవిధంబున గర్జిల్లుచు ఱెక్కలు గలబలుకొండలక్కైవడి నొండొరుం జుట్టుకొని తిరుగుచు నత్యుగ్రవిగ్రహగ్రహంబులుంబోలెఁ దారాపథంబున ఘోరంబుగాఁ బెనంగు నెడఁ బంక్తిముఖుం డాఖగపతిం గ్రూరనారాచం

బులు పదింట నొప్పించినం బ్రచండగతిం గదిసి కోదండంబు తుండంబుచేసి యెగయు నెడ గదాదండంబు వైచినం దప్పఁ గ్రుంకి లంకేశ్వరునడితలల జొత్తులెగయ మొత్తినం జిమ్మ దిరిగి దశశిరుండు రౌద్రం బెసంగం గదిసిన నారాక్షసవీరు తేరిహయంబుల రెంటిని బఱియ లై పడం జఱిచి పెల్లార్చినం గినిసి వింశతిబాహులం డిరువదితోమరంబులం బఱగించి సొలయంజేసినం దూలి వేగంబ తెలిసి పయింబడి ముఖంబుల గళంబుల గండంబులఁ గండలు రాల్చుచుం జేరి సారథిం జీరినఁ బదంపడి రయమ్మున నడిదమ్ము బెడిదమ్ముగా విసరినఁ దొలంగ నుఱికి చనువాని నక్కైదువునన వైచినం బత్త్రిపతి తప్పించుకొని తిరిగి నొప్పించి చనునెడ దట్టంబగునలుకఁ పెలుచ నరదంబు విడిచి బిట్టుగసి కదిసి తలప్రహారంబుల సొమ్మవోవ నడిచి మగుడునెడ నంతన తెలిసి శకుంతవరుం డాదశవదను విపుల వక్షంబు నఖకులిశంబుల భేదించిన నాతురుం డై యతం డరదంబునకు వచ్చినం దోడనె వచ్చి రథచక్రంబు భూచక్రంబునఁ బడఁ దన్నినం దూలి పొరలంబడునాలోనన హతశేషంబు లగురథఘోటంబుల రెంటినిం బొరిగొనియె నట్లు తేరు వికలం బై యొఱగునెడ నేమఱక దశకంఠుండు జానకిం జంక నిఱికి సురుఁగం జూచునాలోనన యతిక్రూరావక్రక్రోధంబున గ్రక్కునం గొని యమ్మేటితనువు వెన్నునం గ్రొన్నెత్తురు దొరఁగునట్లుగా నూరియు నఖంబులం జీరియుఁ గంఠంబుల నొగిల్చియు శిరంబులఁ బగిల్చియుఁ బార్శ్వంబులం జెండియు రక్తంబును మాంసంబును బెల్లు దొరంగించిన రక్కసుం డొక్కెడ నక్కొమలి డించి యాగ్రహం బెసంగ డగ్గఱి యగ్గలిక నయ్యరుణతనయుం గలపడి యరుణపూరంబులు నిజకరంబుల శిరంబులఁ జరణంబుల నురంబునం దొరంగం బెరిఁగిన యచ్చలంబునం బొలివోనిబలిమికలిమి నతిఘోరంబుగాఁ బోరునానమయంబున. 134

మహా. కినుకం బక్షీంద్రుఁ డుగ్రాకృతిఁ గదిసి దశగ్రీవు నందంద వ్రేయన్
ఘనరౌద్రోద్రేకభంగిం గదుము నదుము వేగంబుమైఁ జేరుఁ జీరున్
వెనువెంటం బాఱుఁ దాఱున్ వెస నెడఁగుదియున్ వీచుఁ దాఁచుం గలంచుం
దనుసంధుల్ సించు నొంచుం దలలు నఱచు దుర్దాంతదర్పం బెలర్పన్. 135

క. ఇత్తెఱఁగునఁ దను నొంపఁగ, నత్తినకోపమున దానవేంద్రుండు విహం
గోత్తముఁ దలపడి కండలు, నెత్తురు బిట్టొలుకఁ బోరె నిష్ఠురలీలన్. 136

సీ. అంతకంతకు నెక్కునాటోపములు గోప,ములు రౌద్రభావంబుఁ బదనరఁ జేయ
బలుగోళ్లఁ బగిలియు బాహులనొగిలియు, నఖలాంగకములు వ్రయ్యంగఁ దొరఁగు
శోణితజలమున జొత్తిల్లుమేనులు, జేవురుఁగొండలఁ జెలువు దాల్ప
నొండొరు నొవ్వంగ నుడుగక పెనఁగంగ, నొదవినదప్పుల నుదిలకొనుచుఁ
జలము శోభిల్ల నొండొరుసమయఁ జేయ, వేగపడి పెల్లునొంచుచో వ్రేటుఁబోటు
నాటు నగపాటు నొండొరు లోటుపడక, దారుణంబుగఁ బోరి రవ్వీరవరులు.

చ. ఇలకు నభస్స్థలంబునకు । నేపున డిగ్గుచు నెక్కుచున్ వడిం
దలపడి వీఁక నొండొరులఁ । దాఁకుచుఁ బాయుచుఁ దోర మైనయీఁ
కలుఁ బెనుఁగండలుం దొరఁగఁగా ఖగదానవవీరు లిట్లు మూ
ర్ఛలఁ బడి సోలుచున్ సరభ।సంబునఁ దేఱుచుఁ బోరి రుగ్రతన్. 138

చ. పొలియుదు గాక నన్నరుణ।పుత్త్రు జటాయువుఁ దాఁకి చాక పో
నలవియె నీకు నంచుఁ దెగ।టారుదు గాక దశాస్యుతోడుతన్
నిలిచి పెనంగఁగాఁ బులుఁగ । [1]నీకు వశంబె యటంచుఁ బల్కుచున్
బలమున నొప్పఁ బోరి రటు । పైకొని యొండొరు మీఱునానలన్. 139

క. (మ్రుచ్చిలి రఘునాయకుసతిఁ, దెచ్చినయ ట్లగున పురము । ధృతి చెడి పాఱం
జొచ్చితి విస్సి మగతన, మచ్చుపడియె నిప్పు డంచు । నలుకం జులుకన్.)

చ. తడఁబడ మింటితుట్టతుద।దాఁక రయంబునఁ బోవుచున్ మహిం
బడి పొరలాడుచుం గదిసి । పాయక లంకియ లై పెనంగుచున్
విడువిడు మంచుఁ దీవ్రగతి । [2]వ్రేయుచు నొంచినచోట నొంచుచుం
బడుపడు మంచు భూస్థలి న।భస్స్థలిఁ బోరిరి దారుణోద్ధతిన్. 140

వ. అయ్యవసరంబున. 141

చ. తనువున నెల్లెడన్ రుధిర।ధారలు గ్రమ్మఁగ సత్త్వహీనుఁ డై
పెనుదగ నెత్తి యార్తిమెయిఁ । బెల్కుఱి చంచువు పెల్లు విచ్చుచుం
గనుఁగవ సోల భూతనయఁ । గన్గొనుచున్ వగ మానసంబునం
బెదఁగొనఁ జిక్కి పక్షిపతి । పెద్దయుఁ దూలుచు నిల్చె భూస్థలిన్. 142

క. అజుఁ డిచ్చినవరబలమున, భుజబలమును నాత్మబలముఁ । బొలు పఱక వెసన్
రజనీచరవరుఁ డిట్లా, ద్విజవరుబల మఱుట సూచి । తీవ్రస్ఫురణన్. 143

చ. అరదము భగ్నమై పడిన।యప్పుడు మేదినిఁ బడ్డఖడ్గము
ద్ధురగతితోడఁ బుచ్చుకొని । తోరపుడప్పి వగర్చుచున్నభూ
ధరసమకాయు నాకసుఖ।ధర్మమహీయు జటాయువున్ భయం
కరగతి డాసి వ్రేసె దశ।కంఠుఁ డకుంఠితవిక్రమంబునన్. 144

క. పక్షియు లయి మేను వ్రస్సిన, నొఱగె మహీతలముమీఁద । నుక్కుఱి రుధిరం
బక్షిముఱిఁ బెనుఁగాలువ లై, పఱవఁగ భూపుత్త్రి డిల్ల।పడి తల్లడిలన్. 145

వ. [3]ఇత్తెఱంగునఁ బక్షిపతి భంజించి దశగ్రీవుండు మహానాదం బగుసింహనాదం

---

1 "నీవశమే యనుచున్ బలంబున,చ్చలము దలిర్ప సీత మది । సంతసమున్ వగపుం బెదం
గొనన్" వ్రా. ప్ర. 2 "వ్రేసినచోటన వ్రేసి నొంచుచుం" వ్రా. ప్ర.

3 ఇదిమొదలు "అమ్మల వింతు" లను 386-వ పద్యమువఱకుఁ గలవ్రాఁతప్రతులపాఠము.
వ. ఇత్తెఱంగునఁ బక్షిపతిని భంజించి దశముఖుండు జటాయువు పడుటకు శోకాకులితచిత్త యై
తన్నుఁ దాన నిందించుకొనుచు నాక్రందనంబు సేయుచున్నభూపుత్త్రిం బట్టం జనిన నాదేవి

బు సేసిన జనకతనయ సంభ్రమంబునం బఱతెంచి య ట్లసిధారాదళితుం డై ధరణిం బడి నెత్తుటం జొత్తిల్లి కొఱప్రాణంబులతో నున్నజటాయువుం గనుంగొని వీరోత్తమా యింక నేది దిక్కని పెక్కు దెఱంగుల విలపింప నన్నిలింపారాతియు మగుడ వచ్చినతన్నుం గని భయంబుం బొంది యద్దేవి హా రామ హా రామ యనుచు నొక్కవృక్షంబు బిరుగేలం బట్టికొని యీడిగిలంబడి యున్న బెట్టదల్చి తరువు విడిపించి యెత్తుకొని వియత్తలంబున కెగసి పఱవం దొడంగిన నయ్యింతి పంక్తికంఠుని నిందించుచుం దిట్టుచు ని ట్లను నోరి పాపాత్మ రాముకోపానలంబున సబాంధవంబుగాఁ ద్రుంగెదు ఘోరరౌరవంబున బ్రుంగెదు నిర్మూలం బయ్యెదు వలదు విడిచి చను మని మఱియుం బెక్కువిధంబుల నార్తిమెయిం బలుకుచున్నవాఁడును దక్షిణాభిముఖుం డై చనుసమయంబున. 146

ఆ. సకలమునులు శోక । సంతాపములఁ బొంద, నంధకారభరిత । మయ్యె జగము
నలువ బుద్ధిఁ జూచి । నాకారిచే టింక, నిక్క మయ్యె ననుచు । నిశ్చయించె.

ఆ. అంత నఖిలదిశలు । హా రామ హా నాథ, యను నెలుంగు వినుచు । నడలఁ దొడఁగె
జనకతనయ నీడ । జాడ సింహాదిస, త్త్వములగములు వెంటఁ । దగులుచుండె.

క. పవనచలితశాఖాప, ల్లవము లభయహాసచేష్ట । గలం బొనరఁ జెలం
గువిహంగంబులు రుతముల, నవనిసుతను వెఱకువెఱకు । మన్న ట్లుండెన్. 149

తే. ఓలి శృంగంబు లెత్తిన । కేలు గాఁగ, నిర్ఝరంబులపెనుమ్రోఁత । నిగిడి బెరయ
గిరులు జనకరాజాత్మజ । పరిభవంబు, జగము లెఱుఁగ నాక్రోశించు । పగిదిఁ దోఁచె.

క. జనకజఁ జెఱఁగొనిపోవుట, జనులకు వినఁ జాటినట్లు । జనితఝుణఝుణ
ధ్వనిఁ గేళిహంసఖ్యా, పనచణ మగుహంసకంబు । పడియె మొరయుచున్.

క. స్మితలక్ష్మి సీతఁ బాసిన, గతిఁ గ్రొవ్వాద విరులు రాలెఁ । గఠినకుచతట
చ్యుతహార మభ్రగంగా, వతరణనైపుణము మెఱసి । వసుధం బొలిచెన్. 152

క. నిజభూరితేజమున న, క్కజముగ వెలుఁగొందుజనక । కన్య యుదంచ
ద్భుజమున మహోల్కఁబోలెను, రజనీచరుఁ డెత్తికొంచు । రయమున నరుగన్.

క. విలసిత మగుసీతాని, ర్మలవదనము నభమునందు । రావణునంక
స్థలమున మెఱసెను మేచక, జలదము వెడలిచన వెలుఁగు । చంద్రుఁడుఁబోలెన్.

క. వనజదళాభము శుభకర, మును సితరదనాంశులలిత । మును నగుభానం
దనముఖ మలరారదు రా, మునిఁ బాసి వినాళపద్మ । మువిధం బగుచున్. 155

క. రామునిఁ బాసినకతమున, రామారత్న మగుసీత । రమ్యాననము
ద్దామవికాసశ్రీకిఁ, ధామము గా కుండె దినసు । ధాకరుభంగిన్. 156

క. సురుచిరపల్లవరుచినుం, దరతను వగుసీతఁ గదిసి । దశముఖుఁ డొప్పెం

---

తల్లడించి హా రామ హా రామ యనుచు నొక్కవృక్షంబు బిరుగేలం బట్టుకొని యీడిగిలఁబడియున్న వి ట్టదల్చి చేతులపట్టు వదల్చి తరువు విడిపించి యెత్తి రథంబునం దిడుకొని వియత్తలంబున

బరఁగఁగఁ గాంచనకాంచిన్, నెరవుగఁ దాపించి యున్న నీలముఁబోలెన్. 157
క. అలఘుశ్యామలవర్ణము, గలరావణుతనువుఁ జెంది కనకప్రభ శో
భిలుసీత నీలజలధర, కలితతటిల్లతికభంగిఁ గ్రాలుచు నుండెన్. 158
క. జనకజభూషణగణని,స్వనముల దశకంధరుండు చాలఁగ మెఱసెన్
ఘనపదమున గురుతరగ,ర్జనములఁ దనరారు నీలజలదముకరణిన్. 159
క. రమణీయహేమరుచివి,భ్రమ యగునలసీతచేత రావణుఁ డొప్పెం
గమనీయకనకకక్ష్యం, గొమరారుచు నున్నభూరికుధరముపగిదిన్. 160
క. అతిరమ్యము లగుధరణీ, సుతకనదతిశుద్ధకనకశుభభూషణముల్
క్షితిపైఁ బడియెను నిజస,ద్గతి చెడి భూమిఁ బడుతారకంబులపగిదిన్. 161
క. ఖలుచేఁ జెఱఁబడి భీతిం, గలఁగెడుసీతఁ గని దైన్యకలితుఁడు విగతో
జ్జ్వలతేజుఁడు పాండురమం,డలుఁడును నై భానుఁ డుండె నభమునఁ జూడన్.
క. నలినులు భీతిన్ ముకుళిం, చలలును విధ్వస్తవారిజలును నిరుచ్ఛ్వా
సలు నై యెంతయు నడలుచు, జలజాక్షికి శోక మొందుచాడ్పున నుండెన్.
క. జనకజదైన్యము గనుఁగొని, వనదేవత లధికభీతి వడఁకుచు దుఃఖం
బున శోకించిరి గగనం, బున నాక్రోశించె నఖిలభూతావళియున్. 164
క. క్షోణీసుత యపు డాత్మను, క్షీణవ్రత నైతి శత్రుచేఁ జెఱఁబడితిం
బ్రాణేశుం బాసితి నా, ప్రాణము లేమిటికి నాదుబ్రతు కేమిటికిన్. 165
క. భూనాథుఁడు సౌమిత్రియు, నే నీగతిఁ జిక్కువడుట నెట్లెఱిఁగెద రీ
మానసదుఃఖపయోనిధి, నే నెన్నఁడు దాఁటుదాన నెయ్యది గతియో. 166
వ. అని వెచ్చ నూర్చి రోషావేశంబున రావణుం గనుంగొని. 167
ఉ. అచ్చుగ మాయ వన్ని పతి నక్కడఁ బాయఁగఁ జేసి వంచనన్
ముచ్చిలి నన్నుఁ దెచ్చుట సమున్నతశౌర్యముచొప్పె బంట వై
చెచ్చెరఁ బేరు సెప్పి యనిఁ జేవ నెదుర్కొన రాదె కొంతప్రొ
ద్దచ్చట నున్ననిన్ను విభుఁ డప్పుడ యమ్ముల గ్రుచ్చి యెత్తఁడే. 168
క. ఖరదూషణాదిరాత్రిం,చరులం బదునాల్గువేల సంగరభూమిం
బరిమార్చుట యెఱుఁగవె యా, ధరణీశ్వరుఁ గడిమిఁ దొడరఁ దరమే నీకున్.
క. కాలము సేరినమనుజుఁడు, బాలిశచిత్తంబుతో నపథ్యములఁ గొనం
జాలిఁబడుఁ గాని తనకున్, మే లగుపథ్యములు గొనఁగ మొయికొనఁ డాత్మన్.
మ. జములోకంబున కేఁగుచోఁ గనెదు యుష్మత్కంఠముల్ కాలపా
శములం గట్టి ప్రచండభంగిఁ దిగువన్ ఘోరాస్రకల్లోలసం

---

*గవి గగనమార్గంబునం బఱవం దొడంగ నప్పు డాయింతి పంక్తికంఠునిం దిట్టుచు నిట్లనియె నోరిపా
పాత్మ రామునికోపానలంబున నీవు సబాంధవంబుగాఁ గ్రుంగుదు ఘోరరౌరవాదినరకంబులం గూలెదు

భ్రమవద్దైవతరణీతరంగిణిని దుర్దాంతాసిపత్రాటవీ
సముదగ్రాయసకంటకోగ్రకనకాంచచ్ఛాల్మలీవృతమున్. 171

క. నావిశ్రుతసుకృతము చెడుఁ, గావున నే నిపుడు నిన్నుఁ గనలి శపింపన్
రావణ నన్నుం దగవుగ, భూవిభుకడ కనిచిపుచ్చు పుచ్చక యున్నన్. 172

శా. రక్షశ్శిక్షణదక్షరామవిశిఖవ్రాతంబు లోలిన్ భవ
త్పక్షాపేక్షసమక్షరాక్షసబలాధ్యక్షౌఘయక్షవ్యముల్
పక్షిక్షుద్గతరూక్షవక్త్రములకున్ భక్షింపవే పెట్టి నీ
దక్షప్రక్షిపదక్షికుక్షిగళదోర్గర్వంబుఁ జెండాడెడున్. 173

చ. అని పలుకంగ సీతను దశాస్యుఁడు గొని సంతసంబుతో
వనములు భూరిశైలములు వాహినులుం గమలాకరంబులుం
గనుఁగొనుచున్ నరేంద్రుదెసఁ గల్గువెలన్ దెస లోలిఁ జూచుచున్
ఘనతరచాపముక్తపటుకాండరయంబున నింగి నేగఁగన్. 174

ఉ. ఆయెడ సీత యొక్క విపులాచలశృంగమునందు లీలమైఁ
బాయక యున్నవీరకపిపంచకముం గని యుత్తరీయకౌ
శేయము భూషణంబులును జేరఁగ వైచెను మీఁద రామభూ
నాయకుతోడ నా తెఱఁగు నమ్మఁగఁ జెప్పుదు రన్ తలంపునన్. 175

క. ఆవరభూషణముల సుగ్రీవుఁడు దాఁపంగఁ బంచెఁ బ్రియమునఁ బంక్తి
గ్రీవుఁడు సీతాసహితుం, డై వారాశి వడిఁ జేరె నాసమయమునన్. 176

క. జలచరములు తిరుగుడువడ, జలరాశి గలంగ సిద్ధచారణులు నభ
స్తలమున ని ట్లనిరి ఖలుం, డలవఱి యింకన్ గతాసుఁ డయ్యెడు ననుచున్.

క. ధర్మనిధి యైనరాముస, ధర్మిణి నెత్తికొనిపోయె దశముఖుఁ డింకన్
ధర్మంబు మఱి యహింసా, కర్మము నార్జవముఁ దగవుఁ గలవే లంకన్. 178

—❖ రావణుఁడు సీతను లంకయం దుంచుట. ❖—

వ. అనునంత నారావణుండును దనపాలిమృత్యుదేవతయుంబోలె సీత తోడరా సముద్రంబు గడచి లంకాపురంబు సొచ్చి వివశురా లయినసీతను డించి త్రిజట రప్పించి యారక్కసితోడ ని ట్లనియె. 179

చ. మణిగణకమ్రకాంచనసమంచితభూషణతారహారముల్
ప్రణుతదుకూలవస్త్రములు భాసురసౌరభపుష్పమాలికా
గణములు చందనాదిబహుగంధములున్ మఱి యెవ్వి గోరు ను
ల్బణమతి వాని నన్నిటిని బైపయి నీసతి కిందు వేడుకన్. 180

క. తరుణీపురుషులలో నె,వ్వరు విమతులు వారు నూడ వల దీచెలుపం

---

నిర్మూలంబయ్యెడు చలంబు వలదు నన్ను విడిచి మిన్నక చను మని మఱియుఁ జెక్కు భంగుల వార్తి
మెయిం బలుకుచు నలుదిక్కులు నూచి యొక్కగిరిశృంగంబున నున్నకపుల శేఖరం గాంచి తనక

బరుసము లాడకుఁ డెవ్వరు, పరఁగఁగఁ గొలువుండు కదిసి ‡ పలుకుఁడు ప్రియముల్.

వ. అని పలుక నాత్రిజటయు సీత నంతఃపురంబులోనికిం గొనిపోయె నప్పుడు రావణుం డాత్మం జింతించి యధికవిక్రము లైనయెనమండ్రు రాక్షసుల రప్పించి వారలతోడ. 182

క. సమరమున సకలరాక్షస, సముదాయముఁ గడిమిఁ ద్రుంచి ‡ సర్వజనస్థా
నము నిశ్శేషజనస్థానముగం జేసి జయ మంది ‡ నరుఁ డొకఁ డరిగెన్. 183

శా. ఆకూటవ్రతతాపసుం గలనఁ బోకయుం ద్రుంచునందాఁకఁ జి
త్తైకాధీనత నిద్ర లేక వగతో ‡ నే నున్నవాఁడన్ మదిన్
నాకార్యంబు ఫలింప నాచపలుని ‡ న్మర్దించి బాహాబలో
త్సేకం బొప్పఁ దదీయమాంసమునఁ బక్షిశ్రేణి రక్షింపుఁడా. 184

వ. మీబలంబు లెఱుంగుదు మీ రింక జనస్థానంబున కరిగి నాపగ దీర్చి యచట నుండుం డనుచుఁ బలుక నారక్కసులు దండప్రణామంబు లాచరించి రావణు వీడ్కొని దర్పంబు లెసంగ జనస్థానంబున కరిగిరి. 185

క. అంతం గృతకృత్యుం డై, సంతోషముఁ బొంది రాక్షసవరేణ్యుఁడు భూ
కాంతునికాంతన్ మనమునఁ, జింతించి మనోజదళిత‡చిత్తుం డగుచున్. 186

ఉ. మున్ను లతాంగిఁ బెట్టినస‡మున్నతగేహము సొచ్చి యచ్చటం
గన్నుల బాష్పపూరములు ‡ గాఱఁగ నేడ్చుచు దీనవక్త్ర యై
విన్నఁదనంబుతో వగల ‡ వేఁగుచుఁ బల్మఱు వెచ్చ నూర్చుచుం
జె న్నఱి పాణిపల్లవము ‡ సెక్కిటఁ జేరిచి కుందసుందరిన్. 187

తే. భయదరాక్షసభామలు ‡ బలసి కొల్వ
వఱలుమృగయూథముఁ దొఱంగి ‡ వచ్చి యుగ్ర
శునకసంహతి చేరువఁ ‡ జుట్టుముట్టి
యుండుమృగిభంగి నున్నయ‡య్యువిదఁ జూచి. 188

సీ. హాటకప్రాసాద‡హర్మ్యసంకులమును, భామాసహస్రవి‡భ్రాజితంబు
స్ఫటికవిద్రుమరౌప్య‡బహువజ్రవైడూర్య, శాతకుంభస్తంభ‡సంభృతంబు
కలధౌతకరిదంత‡కమ్రగవాక్షంబు, భూరితోరణరత్న‡భూషితంబు
కమనీయతపనీయ‡ఖచితభూతలమును, ధర్మవిచిత్రసో‡పానయుతము
వివిధరత్నప్రభాజాల‡విభ్రమంబు, చారుదుందుభినిర్ఘోష‡పూరితంబు
నైనమందిరరాజంబు ‡ నడరుకోర్కి, సీతతోఁ గూడఁ జేరి ‡ యాసీతఁ జూచి.

క. ఇవె నాదివ్యాంబరతతు, లివె నావరభూషణంబు ‡ లివె నారంగ
ద్భవనము లివె నారత్నము, లివె నాధనకనకగృహము ‡ లివె నాలక్ష్ముల్.

---

ట్టినపుట్టంబుకొంగు సించి దానం దనభూషణసంచయంబు ముడిచి వారలనడుమఁ బడవైచి చని యా నివ్విధంబున వియద్గమనంబున నతిత్వరితగతిని రావణుం డనేకగిరిసరిదరణ్యంబులు గడచి చని

క. కల విన్నియు నీయవి నా, నెలఁతలు నీదాసు లేను నీదాసుఁడ న
ర్మిలిఁ గవయుము నీప్రాణం, బులు నాకును జీవితంబు పూర్ణేందుముఖీ. 191
చ. కొలఁకుల సైకతస్థలులఁ గోమలచూతపరీతవల్లికా
విలసితకుంజపుంజముల విభ్రమకేళిగుహాగృహంబులన్
సులలితహర్మ్యసౌధముల శోభితపుష్పవనాంతరంబులన్
వలసినచోటులన్ రతులు వారక సల్పుద మిచ్చలారఁగన్. 192
క. యౌవన మస్థిర మెంతయుఁ, గావున యౌవనము వేగ గడచనకుండన్
నీవును నేనును నిమ్ముల, భావజరతి సలుప వలయుఁ బరమప్రీతిన్. 193
క. అనిలముఁ బట్టఁగ నలవియె, కనదనలము మ్రింగఁ దరమె కాలాంతకు గె
ల్వను శక్యమె లాఘవ న నె, వ్వనికిన్ లంకాపురంబు వశమే కదియన్. 194
ఆ. కాన రాముఁ డిటకుఁ గడిమితోఁ జనుదేరఁ, గన్నులారఁ జూతుఁ గాంతుతోడ
ననువిచార ముడిగి యంగన నాతోడఁ, గామకేళి సలుపు ప్రేమతోడ.
క. లలన పురాకృతదుష్కృత, ఫలమున వనవాస మొంది బహుతరదుఃఖం
బులు గుడిచి తింక సత్కృత, ఫలమున నిటఁ బొందు సకలభాగ్యశ్రీలన్. 196
చ. పొలఁతుక పుష్పగంధములు పూని సమంచితరత్నభూషణం
బులు మృదులాంబరంబులును బోఁడిగఁ దాల్చుచుఁ జెన్ను మీఱ నే
బలిమిఁ గుబేరునిన్ గెలిచి బాగుగఁ గొన్నరవిప్రకాశమై
యలరుచు నున్నపుష్పకము నందు రమింపుము కోర్కు లారఁగన్. 197
క. తిరముగ నీపదములు నా, శిరములపైఁ బెట్టు నేగ చేకొను నన్నా
దరమున మ్రొక్కెద నీకుం, దరుణీ వశ్యుండ నైతి దాసుఁడ నైతిన్. 198
మ. సురయక్షాసురపక్షిదానవభటస్తోమాహిగంధర్వకి
న్నరులం దెవ్వఁడు లేఁడు నాకు సముఁ డెన్నం జేవ నాముందటన్
నరుఁడున్ దీనుఁడు రాజ్యహీనుఁడును క్షీణప్రాణుఁడుం గాననాం
తరవాసుండును నైనరాముఁ డఁట యుద్ధక్రీడలన్ వాలెడున్. 199

—సీత రావణునిం బదరుట.—

సీ. అని పల్క నిశ్శంక నాసీత తృణ మడ్డముగఁ బెట్టుకొని పంక్తిముఖుని కనియె
దశరథుఁ డనురాజు ధర్మశీలుఁడు సత్యసంధుఁ డౌనమ్మహీశ్వరునిపుత్రుఁ
డమరేంద్రసదృశుండు నతిపుణ్యచరితుండు, పితృవాక్యపాలుండు భీమబలుఁడు
నమ్మహాత్మునిపత్ని నతిసాధ్వి నన్నిటు, వంచనఁ గొనివచ్చి వదరె దీవు

---

సముద్రము దాఁటి లంకాపురంబుఁ బ్రవేశించి జానకి నశోకవనంబున డించి యనేకదనుజాంగనలఁ గావలియుంచి బహువిధంబులగుమారవికారచేష్టల నాజగత్కల్యాణికిమిగులశోకంబాపాదించుచు నమ్మహాపతివ్రత తన్ను నిరాకరించి పలుకుపలుకులకు మదనునిపూములుకులకు సెరియుచుండె నంత నక్కడ.

లంక వైధవ్యకలిత మై పొంక మడఁగి
నేలపాలుగఁ జేసి నీ వేల త్రుంగె
దనుజుఁడును దాను నారాముఁ డరుగుదెంచి
యఖిలబలములతోడఁ జక్కాడు నిన్ను. 200

మ. ఉరుగర్వంబున నన్నుఁ బట్టికొని నీ వుద్వృత్తిమై రాఁగ నా
ధరణీనాథుఁడు గన్న నప్పుడ జనస్థానంబునం దుగ్రుఁడై
ఖరునిం గూల్చినరుక్మపుంఖచయనిర్ఘాతచ్ఛటావిస్ఫుర
చ్ఛరజాలంబుల నీయుదగ్రగళముల్ చక్కాడి తున్మాడఁడే. 201

క. లీలను రాముని పటుశర, జాలము లోలి భవదీయసన్నాహంబుం
దూలించుఁ వడి గంగా, కూలము నురుతరతరంగకులములుఁ బోలెన్. 202

క. దేవాసురాదులయెడం, జావక మను నిన్ను విభుఁడు చంపెడు నింకన్
రావణ చెడ నున్నది నీ, జీవము యూపగతపశువుజీవము భంగిన్. 203

క. జలజారి నేలఁ గూల్చిన, జలనిధు లింకించినం గృశాను శమింపం
గలిగిన నిన్నున్ రాముఁడు, బలగర్వశ్రీ నడంచి పరిమార్చు వెసన్. 204

క. ప్రీతిఁ బతి నెపుడుఁ బాయని, సీతకు దైవగతి ఖలునిచేఁ బడవలసెన్
వే తనతమ్ముఁడుఁ దానును, భూతలపతి యిటకు వచ్చి పొడమినకిన్కన్. 205

మ. కలనన్ నీబలవిక్రమోచ్ఛ్రయమనోగర్వంబు నింకించి చం
చల మందన్ భవదీయగాత్రముపయిన్ శాతాశుగోదగ్రవృ
ష్టులు చాలం గురియించి నిన్నుఁ బరిమార్చున్ శౌర్య మేపార నీ
ఖలబంధుక్షణదాచరావలులకుం గాలంబు సేరెం జెడన్. 206

సీ. పాపాత్మ నను నీవు బలవంతముగఁ బట్టి, కొని పోవ నేను నాకులతఁ బొంది
పలుమాఱు నాక్రోశములు సేసి యవశగా, నుండు నామూర్తి నీయొద్ద నెట్లు
ద్విజమంత్రపూతయు వినుతస్రుగ్భాండస, మన్వితయును నైన యజ్ఞవేది
చండాలవాటిక నుండఁగా నర్హంబె, కాన నా కీకష్టకాయ మేల
యింక బహుభాష లాడంగ నేను జాల, వేగ నామేనిప్రాణముల్ విడుచుదాన
ననుచు నాసీత పరుషవాక్యములు పలికి, యూరకున్న నారావణుం డువిదఁ జూచి.

క. ద్వాదశమాసంబులకుఁ ద, లోదరి నన్నున్ వరింప కుండిన మేనిన్
భేదించి పలలములు క్ర, వ్యాదులకున్ నమల నిత్తు నని మఱి కిన్కన్. 208

క. బలిమిఁ బడఁదిగిచి యాతొ, య్యలిగాత్రము వ్రచ్చి వేగ నసామిషముల్
నలి సేవింపుం డనఁ బ్రాం, జల లై సతి బలసి రాక్షసస్త్రీ లుండన్. 209

చ. కనలి సమస్తరాక్షసులఁ గన్గొని యాదశకంఠుఁ డిట్లనున్

---

తే. అన్న కాదు రేఁ గుతమ్ముని కచట నుండి, వచ్చు రఘురామునకు బలవంత మైన
తలఁపుఁ గలఁకయు మనమునఁ దలకొనంగఁ, దొడఁగె దుశ్శకునంబులు వొడమె నంత.

జనకజ మీ రశోకవనసద్మమునం దిడికొంచు నింతిఁ ద
ర్జనముల సాధువాక్యములఁ జక్కటి సెప్పి మహీజ నాకు నిం
పెనయఁగ వశ్యఁ జేయుఁ డని యిమ్ముగఁ బల్కిన నన్నిశాచరుల్. 210

క. భూమిజ నశోకవనికా, భూమికిఁ గొనిపోయి యచటఁ బొలుపగుచోటన్
సేమమునఁ బెట్టికొని వి, శ్రామంబున నుండి రోలి జతనము గాఁగన్. 211

క. అవనిజ లక్ష్మణుఁ దనప్రియుఁ, డవురామవిభుం దలంచి యాత్మను వంతల్
గవియఁగ నుండెను నచ్చట, నవశగతిన్ క్షుత్తృషాకృశాంగంబులతోన్.

వ. అంత నిక్కడ. 213

శా. మారీచుం బరిమార్చి వేగమున రామక్షోణినాథుండు రా
మారత్నం బగుసీతఁ జూడఁగఁ బ్రకామప్రీతి నేతేరఁగా
ఘోరక్రూరదురారవంబు పెలుచన్ భీమంబుగాఁ బర్వఁ ద
ద్భూరిధ్వాన మమంగళం బగుట నాభూనాయకుం డాత్మలోన్. 214

క. తలఁకొందుచు ని ట్లను నతి,బలుఁ డగులక్ష్మణుఁడు లేనిపట్టున సుగుణో
జ్జ్వల యగుసీతకు దుర్దశ, గలకొనియెనొ దుష్టయాతుధానులవలనన్. 215

క. ఆమారీచునికృత్రిమ, భీమస్వరము విని సీత బెగ్గలి వింటే
రామునియార్తధ్వానము, నే మయ్యెనో వేగ మరుగవే విభుకడకున్. 216

క. అనుచుం గడుదీనతతో, జనకజ పంచినమదీయసన్నిధికి వెసం
జనుదేరఁగ లక్ష్మణు నా,యనుజునిఁ జంపిరొ మహోగ్రులైననిశాటుల్. 217

తే. అశనిసంకాశభీషణం బైననాని, శాతబాణంబు నెఱి నాటి చచ్చునపుడు
నా యెలుంగున హాలక్ష్మణా హతోస్మి, యనుచు మారీచుఁ డనునీచుఁ డవని ద్రెళ్లి.

క. ఆదుస్సహనాదము విని, గా దుర్దశఁ బొందిరో మహీపుత్రియు నా
సోదరుఁడును వారికిఁ గీ, డౌ దెసఁ గాకుండుఁ గాక యనుచును వగతోన్.

క. సౌమిత్రికి భూపుత్రికి, సేమంబులు గలుగ నాత్మఁ జింతించుచు ను
ద్దామజవం బెనఁగఁగ నా, రామవిభుం డాశ్రమము సారం బోయెడిచోన్.

క. తా మప్రదక్షిణంబుగ, భూమీశునిఁ దిరిగి వచ్చి పోరిఁ బక్షిమృగ
స్తోమము లఱవఁగఁ గనుఁగొని, యామ్ముందట ననుజుఁ గాంచె నతిదీనముఖున్.

క. మనమునఁ గుందుచు ఖిన్నా,ననుఁ డై లక్ష్మణుఁడు గదిసి నన్ వామకరం
బున నల్ల దిగిచి రాముఁడు, దనతమ్మున కి ట్లనియె వితర్కము లారన్. 222

ఉ. పంచినవేడ్కతో మరలి పద్ధతి వచ్చుచుఁ జెక్కుదుర్నిమి

---

ఉ. చింతఁ దలంకువానిఁ గడుఁ జింతఁ దలంకెడువాఁడు తద్గుణ
వంత దొలంకువాని బలవంతపువంత దొలంకువాఁడు దా
నెంతయు వార్తు నార్తిఁ గని యెంతయుఁ దూలెడువాఁడు దుర్దశా
క్రాంతుని దుర్దశామయుఁడు గాంచె వరానుజుఁ డగ్రసంభవున్.

త్తంబులు గంటి నన్ను వసు । ధాసుతతో నెడఁబాపి చాల దూ
రం బెలయించి తెచ్చె మృగ । రాక్షసుఁ డీవును సీత నుగ్రదా
వంబున డించి నాకడకు । వచ్చితి గావున భీతి పుట్టెడున్. 223

క. పుడమిసుతఁ బాసి లక్ష్మణ, యెడఁదవ్వుల నీవు వేగ । మేతేర నినుం
బొడగాంచినయప్పుడ నా, యెడమదెసభుజమును గన్ను । హృదయము నదరెన్.

— లక్ష్మణుఁడు సీతను విడిచి వచ్చినందులకై రాముఁడు చింతించుట. —

క. జగతీసుత యట నీల్గెనో, ఖగమృగరాక్షసచయంబు । గ్రహియించెనో య
మ్మగువ మనశత్రుఁ డొక్కం, డగణితశక్తిఁ జెఱగొంచు । నరిగెనో వత్సా. 225

చ. ఎన యగురాజ్యముం విడిచి । యే నతిదీనుఁడనై చరింపఁ గా
ననములఁ దాను నావెనుక । నా కతిదుఃఖసహాయ యై ప్రియం
బునఁ జనుదెంచె సాధ్వి నృప । పుత్త్రిక వేగమ డించి వచ్చితా
జనకజ యెట్లు లున్నది ప్ర । చండతరాటవి నాకుఁ జెప్పవే. 226

క. కమలాక్షి లేని ధరణీ, సముదంచితరాజ్య మేల । చనఁగ ధనేశ
త్వము నొందఁగ నేటికి నా, కమరత్వం బేల జీవ । మది యేమిటికిన్. 227

క. అమలగుణ నమరకన్యా,సమ నుర్వీతనయఁ బాసి । క్షణ మైనం బ్రా
ణముతో మనఁ దగ సన్న్యా,సము నొందఁగఁ గోరెదను ప్ర । శస్తము గాఁగన్.

క. ప్రాణములకంటెఁ బ్రియ యగు, ప్రాణేశ్వరి సీతఁ బాసి । ప్రాణంబులతో
క్షీణదశ బ్రదుకుటెంతెను, ప్రాణంబులు విడుచు టధిక । భద్రము నాకున్. 229

క. జనకజయు నేను లేమికి, మనమునఁ గౌసల్య వంది । మరణము నొందుం
గని కైక వేగ గ్రమ్మఱఁ, జను రాజ్యము సేయఁ బురికి । సమ్మద మారన్.

మ. ఖరు నేఁ జంపినయానిమిత్తమున ను । గ్రక్రోధులై రాక్షసే
శ్వరుఁ డుద్దండనిశాటులం బనిచినం । వా రుద్ధతిం వచ్చి నా
వరపత్నిం గ్రహియించిరో యడవిలో । వైదేహి సన్న్యాసి యా
తురతం దూలుచు నెంతబెగ్గలముతో । దుఃఖించి శోకించునో. 231

క. సుదతి నటు గాచుకొని తగఁ, గదలక యుండు మని నిన్నుఁ । గావలివెట్టన్
మది వెఱ కుగ్రాటవి మీ, వదినెను నిట్టుల విడిచి । వచ్చితి చెపుమా. 232

వ. అనిన విని సౌమిత్త్రి యన్నతో నిట్లనియె. 233

— లక్ష్మణుఁ డన్నతోఁ దాను సీతను విడిచివచ్చినందులకుఁ గారణము నెఱిఁగించుట. —

క. అలమారీచుఁడు దవ్వుల, బల మెఱి నీపలుకుగాఁగఁ । బటుమతితోడం
బలుకఁగ నజ్జనకజ బె, గ్గల మందుచు నిట్టు లనియెఁ । గడు దైన్యమునన్. 234

మ. అలఘుం డారఘురాముఁ డాతురదశం । హా లక్ష్మణా భ్రాతృవ

---

క. కనుఁగొని మ్రొక్కిన రాముఁడు, మనమునఁ దలరుచును బుద్ధి । మంతుఁడ వయ్యున్
వనమున జానకి నేకతఱి, జనుసే చనుదేర నేల । చనుదెంచితనా.

త్సల రక్షింపుము వచ్చి న న్ననుచు నశ్రాత్యార్తశ్రుతిం బల్కె న
వ్వల నే మయ్యెనొ రాముఁ డావిభునిఁ గావఁగ వేగ నీ వేఁగవే
కలఁగంబాఱెడుఁ బ్రాణముల్ మనము శంకం బొందెడిం దమ్ముఁడా. 235

వ. అని సీత పల్కిన నేఁ దలంకక భవత్సామర్థ్యంబు నుద్దేశించి యి ట్లంటి. 236

క. అనిమిషులకు రక్షకుఁ డగు,మనుజేశ్వరుఁ డేల తనదుమానము సెడి న
న్నను రక్షింపుము లక్ష్మణ, యనునీకష్టంపుమాట లాడును దన్వీ. 237

క. మూఁడుజగంబులలోపల, వాఁడిమగంటిమిఁ గడంగి వడి నాలమునన్
వేఁడిమితో మార్కొన నె,వ్వాఁ డోపును రామవిభుని వాసవశౌర్యున్.238

క. ఇది యొకరాక్షసకృత్యము, మది వెఱవకు మనుచు నెన్నిమాటలు దర్పం
బొదవఁగఁ దను బోధించిన, హృదయము పదిలింపలేక యెడపనిచింతన్.

చ. కనుఁగవ బాష్పముల్ దొరఁగ గద్గదకంఠముతోడ నేడ్చుచున్
మనమున దుఃఖ మొందుచును మానము దూలఁగ దీనవక్త్ర యై
ననుఁ బలుమాఱు నార్యనుత నావిభుఁ గావఁగఁ బోఁగదయ్య నీ
వనుచు భయార్తితోఁ బలుక సజ్జనకాత్మజఁ జూచి వెండియున్. 240

క. కన్నీ రేటికి నించెదు, విన్నఁదనం బేల నీకు వెఱ పేమిటికిన్
న న్నేటికిఁ బొ మ్మనియెదు, మున్నే మాయన్నశౌర్యమును నెఱుఁగ వొకో.

వ. అని పలికిన నుపశమింపక రోషారుణనేత్ర యై నన్ను ని ట్లనియె. 242

తే. అన్న యాపద నొందంగ నాత్మ నడల
నేను బనిచిన విభువెన్క నేఁగ వొగియు
వధిపునార్తఘోషము విని యటకు నరుగ
వగ్రజునిచేటు గోరి పో వచటి కీవు. 243

క. పాయక పో వేఁ బోవవు, నాయెడ నేయెగ్గు దలఁచినాఁడవొ యిట భూ
నాయకుఁడు లేనిచోటను, దాయాదులచిత్తవృత్తి తగ వెట్టిదియో. 244

వ. అని సీత న న్నచట నుండరాకుండ నిష్ఠురోక్తులు పల్కిన సైరింపలేక మిమ్ముం
గాన వచ్చితి ననిన రాముండు రోషించి లక్ష్మణుం గనుంగొని. 245

— శ్రీరాముఁడు లక్ష్మణునితో సీత నొంటి విడిచి వచ్చినది తప్పని చెప్పుట. —

ఉ. చారుకులాభిమానమును సన్నుతధర్మము పీటఁబుత్తురే

---

మ. అనినం గన్నులబాష్పము ల్దొరఁగ నయ్యబ్జాస్య త న్నట్టు లా
ప్పనివాక్యంబుల నొవ్వఁ బల్కుటఁ బ్రకంపం బైనదేహంబులో
ననుజుం డల్లనఁ జెప్పెఁ జెప్పుటయు దుఃఖావేశ మంతంతకుం
దనుకం బాపఁ దలంచి తాఁ గలఁచె నద్దైవంబు సీతం గటా.

క. ఏ నసురచేతఁ జిక్కుట, గా నాత్మఁ దలంచి నిన్నుఁ గరకరిమాటల్
మానిని యాడినయంతన, డీనికి నిటు రాఁగఁ దగు నెఱ్ఱీరవిచారా.

యారుచిరాంగి వేగపడి ♦ యప్రియవాక్యము లెన్ని యాడినన్
సైరణసేయఁగాఁ దగదె ♦ చండమృగోరగరాక్షసోగ్రకాం
తారములోన నయ్యబలఁ ♦ దమ్ముఁడ యొక్కత డించి వత్తురే. 246

క. ఆయింతి నిన్నుఁ బొమ్మన, నాయానతిఁ దప్పి నీమ♦నంబున నతికో
పాయత్తుఁడ వై నీ విటు, నాయొద్దకు నేల వచ్చి♦నాఁడవు వత్సా. 247

శా. అన్నా నన్ను బలాఢ్యుఁగా నెఱుఁగు దీ♦వన్నాతి శోకార్తిమై
నిన్నుం బల్కిన నంతనంత నయినన్ ♦ నీ వుండవై యింతకున్
నన్నున్ నిన్నును నేఁచు దానవులు మా♦నం బూనమై పోవఁగా
నన్నాతిం గొనిపోవ కుండుదురె ♦ యయ్యజ్ఞాననం గ్రూరతన్. 248

క. అని పలికియు మృగరూపం, బున న న్నెలయించుకొనుచుఁ ♦ బో దూరము పో
యిన నెఱిఁగి యిద్దురాత్ముఁడు, ఘనవంచనశీలుఁ డంచుఁ ♦ గడుఁగోపమునన్.

శా. ఆరాత్రించరు నుగ్రబాణమున నే♦యం బల్విడిం దాఁకి వి
స్ఫారోరస్స్థలిఁ గాఁడినంత మృగరూ♦పం బేది యస్థద్వనిన్
ఘోరార్తశ్రుతి దిక్కులం జెలఁగ నా♦క్రోశించుచున్ రాక్షసా
కారుం డై ధరఁ గూలి చచ్చె నురుర♦క్తం బుర్విపైఁ గ్రక్కుచున్. 250

క. అని పలికి యాత్మలోపల, జనకజఁ దలపోయుచున్ వి♦చారముతోడన్
జనవిభుఁడు జనస్థానము, నను జుండును దానుఁ జొచ్చి ♦ యయ్యెడఁ ద్రోవన్.

చ. ఎడనెడ రామభూవిభుఁ డ♦నేకవిధంబుల దుర్నిమిత్తముల్
పొడగని యాత్మలో భయముఁ ♦ బొందుచు లక్ష్మణుఁ జూచి యిట్లనుం
గడు నశుభప్రకారములు ♦ గానఁగ నయ్యెడి నేమి కీడు పొం
దెడునొ కుమార యంచు నతి♦దీనత నేఁగెను బర్ణశాలకున్. 252

---

శా. అన్నా నన్ను బలాఢ్యుఁగా నెఱుఁగు దీ♦వన్నాతి శోకార్తిమై
నిన్నుం బల్కిన నింతనంతి నయినన్ ♦ నీ వుండవై యింతకున్
నన్నున్ నిన్నును వేఁచుదానవులు మా♦నం బూనమై పోవఁగా
నన్నాతిం గొనిపోవ కుండుదురె హా ♦ యయ్యో కడుం గ్రూరతన్.

చ. దనుజులచేత జానకి వి♦ధాతృవశంబునఁ బోవు నేనియున్
మనమునఁ గ్రందుశోకమున ♦ గ్రుంగుదు నే నట మున్న చత్తు నీ
వనయము దుఃఖవార్ధి మన♦యమ్మల కింతయుఁ జాల నెక్కుడై
తనరదె కైకగర్వము సు♦ధాకరుఁ డై మును పొంగఁ జేయఁగన్.

ఆ. అనుచుఁ బెక్కుదలఁపు ♦ లాత్మలోఁ దలకొనఁ, దల్లడిలుచుఁ జాలఁ ♦ దెల్లనగుచు
నతఁడు నతఁడు వేగ ♦ మరిగియుఁ దమపర్ణ, శాలకడకు రామ♦చంద్రుఁ డంత.

సీ. అల్లంత నెదురుగా ♦ నబ్జాస్య ప్రియముతో, జేశేర కుండుట ♦ యెట్టులొక్కొ
ముంగిట నైన నా♦ముగ్ధ మెలంగుట, యెఱుఁగంగ రాదయ్యె ♦ నెట్టులొక్కొ

వ. అట్లేఁగి ముందట. 253

—రాముఁడు పర్ణశాలయందు సీతం గానక పలవించుట.—

సీ. చంద్రిక లేనినిశాగగనముమాడ్కి, శారిక లేనిపంజరముకరణి
నలినసంతతి లేనికొలనికైవడి రేయి, దీపిక లేనిమందిరముపగిది
సూనైకఫలరాజి లేనియారామంబు, గతి నాస లేనివక్త్రంబుభంగిఁ
జెలఁగుకోయిల లేనియెలమావిచాడ్పున, నినదీప్తి లేనిదుర్దినమునట్లు
చారుమౌర్వి లేనిచాపదండమునోజ, లలితతంత్రి లేనియొళగుఁబోలె
నవసితనయ లేనియావాస మంతయుఁ, బాడువాటి యుండఁ బార్థివుండు.
క. ఉల్లము జల్లన దేహము, దిల్లవడఁగ ధృతి గలంక దెప్పర మొందం
దల్లడముతోడ నుటజం, బెల్ల వెదకెఁ బ్రియను గాన కెంతయు భీతిన్. 255
క. పొలఁతుక మెలఁగెడుచోట్లం, గలయంగా వెదకి యెచటఁ గానక కడువి
హ్వలుఁ డగుచుఁ బర్ణశాలకు, లలిఁ గ్రమ్మఱ వచ్చి చూచి లక్ష్మణుతోడన్.
తే. తిరిగి వచ్చినచోటులు దెలివితోడఁ, గలయ వెదకియు నెచ్చటఁ గానలేక
పర్ణశాలలోపల లేదు బాల యంచుఁ, జెప్పి యధికాతురత భ్రాంతచిత్తుఁడగుచు.
క. ఏమెయి నడుగులు లేనిది, యేమనుదో పర్ణశాల యిది గాదొకొ నే
రాముఁడఁ గానో రాముఁడు, రామం బెడఁబాసి క్షణము బ్రతుకఁగఁ గలఁడే.
వ. అని పలికి. 259
శా. ఏమె ట్టీయది మెట్టు గా దిది వనం బే రాకుమారుండనో
సౌమిత్రీ విను నీవు రాముఁడవె నత్తా నిక్క మే రాముఁడన్

---

యదె మందిరద్వార మాలోని బయలఁ గట్టెగుటను గనఁదోఁప దెట్టులొక్కొ
యాలోను నూడంగ నాలుగుమూలల నింతి లేకుండిన నెట్టులొక్కొ
యనుచుఁ బెదవులు దడుపుచు నాననంబు, డిల్ల పడఁగను గుండెలు జల్లనంగ
నమ్మహారాజు పర్ణగృహంబు సొచ్చి, చూచి మూర్ఛిల్లె దుఃఖాబ్ధి వీచు లడర.
మ. పతి మూర్ఛిల్లిన లక్ష్మణుండును భయభ్రాంతాత్ముఁ డై మెల్పుతో
నతనిం దెల్పుచు నర్థి దేవ మన మీయారణ్యదేశంబులన్
సతి నన్వేషణ మాచరింపక మదిన్ సంతాప మి ట్లేల భూ
సుత యిచ్చేరువ నుండఁబోలు నిట వచ్చుం జేరెదం జూచెదన్.
మ. అనుచుం బెల్లుగ బొప్పముల్ దొరఁగఁగా నన్నుం గనుంగొంచు గ్ర
క్కున నల్దిక్కులు నేఁగి చూచుచును నక్షోణీటవీవీథులన్
జని యోజానకి యోమహీతనయ రాజస్వామి యేతెంచె ర
మ్మనుచుం బల్మఱుఁ జీరుచున్ భరితశోకాక్రాంతుం డై తూలుచున్.
వ. సముద్భ్రమితుం డయి భ్రమియింప నిట రామభూకాంతుం డత్యంతమూర్ఛాపరవశుం డై కడ
కడ దెలిసియుండ నమ్ముందట నై దేహి వచ్చి నిలిచిన ట్లయిన దిగ్గన లేచి.

భూమీశుండవు రామచంద్రుఁడవు హా భూమిజ చంద్రాననా
యేమీ యెక్కడ నున్నదాన విట రావే యుల్ల మల్లాడెడిన్. 260

శా. ఈతిగ్మాంశుఁడు నేఁపఁ జొచ్చె నను రే యేనాఁట నర్కాస్పదం
బీతం డిందుఁడె యౌనా లక్ష్మణుఁడ నీకే మాదు నేఁ జెప్పమా
నాతోఁబుట్టువు గావె నాథ మఱి యే నాథుండ నిక్కంబుగా
సీతానాథుఁడ వెందుఁ బోయితివె యోసీతామనోవల్లభా. 261

చ. తపనుఁడు వేఁపఁ జొచ్చె ననుఁ దమ్ముఁడ వృక్షముక్రిందఁ బెట్టు నాఁ
దపనుఁడు రేయి లేఁడు వసుధావర చంద్రుఁడు గాని చంద్రునిన్
నృపసుత యెల్లజెంగితివి నీవు మృగాంకము చూడ నున్కి హా
చపలమృగాక్షి చంద్రముఖి జానకి యెక్కడ నున్నదానవే. 262

వ. అని పలికి మఱియు విభుం డిట్లనియె. 263

చ. పొలఁతుక నొక్కఁ డెత్తికొని పోయెనొ యెక్కడ బ్రుంగెనో భయా
నలమునఁ గ్రాఁగెనో తరుణి నాశము నొందెనో జీవ మూడెనో
యలరులు గోయఁ బోయెనొ ఫలావళి కేఁగెనొ యించువాంఛమైఁ
గొలఁకుల కేఁగెనో నదికిఁ గోరికఁ బోయెనొ యెందుఁ బోయెనో. 264

---

ఉ. కన్నులు విచ్చి సీతఁ బొడ♦గానక కానన మెల్లఁ గ్రుమ్మరున్
గన్నులు మూసినప్డు పొడ ♦ గానఁగ వచ్చిన సంతసిల్లుఁ దాఁ
గన్నులు విప్పనోడుఁ బొడ ♦ గాననొకో యని విహ్వలించు ని
ట్లెన్నివిధంబులం దలఁపు ♦ లేఁపఁగ రాముఁడు దూలు నెవ్వగన్.

వ. ఇవ్విధంబున.

క. అనుజుండును ఘనశోకం, బునఁ దూలుచు నధికశీఘ్ర♦మున నయ్యెడకుం
జనుదెంచి యచ్చటెల్లను, మునుకొని తడవంగ నుల్ల♦మునఁ దలఁచి వెసన్.

వ. అగ్రజున కత్తెఱంగు తగుభంగులం జెప్పి.

మ. వెదకం జొచ్చిరి రామలక్ష్మణులు పృ♦థ్వీజాత గర్తంబులం
బొదలం బుట్టల భూగృహంబుల లతా♦పుంజప్రదేశంబులన్
నదులం గొండల నీరపుంగుహాలలో♦నన్ లోయలన్ సానుదే
శదృషత్సంధులఁ గ్రంతలం బదుకులన్ ♦ శాఖిప్రతానంబులన్.

క. అప్పుడు రాముఁడు శోకం, బుప్పొంగఁగఁ దల్లడిల్లి ♦ యుల్లము వగలం
ద్రిప్పుకొనఁ బర్ణశాలకు, నెప్పటి చనుదెంచె నలఁత ♦ యెక్కుడు గదురన్.

వ. తత్సమీపతరుజాలంబులఁ గలయం బరికించి పరిభ్రమించుచు.

సీ. సహకారతరువ వ♦త్సహచరి నతిముక్త,కంబ యనతిముక్తఁ ♦ గాంచనంబ
కాంచనవరవర్ణఁ ♦ గర్ణికారంబ యా,కర్ణాంతలోచనఁ ♦ గ్రముకతరువ
వరనవక్రముకకం♦ధరఁ దిలకంబ స,త్కులతిలకంబు బం♦ధూకకుజమ
బంధూకకుసుమవి♦భ్రాజితాధరఁ బీన,సరకుచ లికుచంబ ♦ చంపకంబ

సీ. తాళంబ కానవే ♦ తాళఫలస్తనిఁ, గుందంబ కానవే ♦ కుందరదనఁ
దిలకంబ కానవే ♦ తిలకరమ్యలలాటఁ, గమలంబ కానవే ♦ కమలవదన
హరిణంబ కానవే ♦ హరిణబాలేక్షణ, సింహంబ కానవే ♦ సింహమధ్యఁ
బికరాజ కానవే ♦ పికమంజులస్వనఁ, గీరంబ కానవే ♦ కీరవాణి
లలితకలభంబ కానవే ♦ కలభగమన, బంధుజీవమ కానవే ♦ బంధుజీవ
మైనజనకనందన సీత ♦ ననుచు రాముఁ, డచట నచట నీగతి వాని ♦ నడిగి యడిగి.

క. నాకాంతఁ బాసి యెంతయు, శోకించుచు నున్నవాఁడ ♦ శుభతరకృపతో
శోకాపనుద యశోకమ, శోకము వారింపు నన్ను ♦ శోకుం గాఁగన్. 266

వ. మఱియు మనోభ్రమ గప్పి యతండు. 267

మ. రమణిం దవ్వుల నున్నయట్లు కడుదూ ♦ రం బార్తితోఁ బాఱి వృ
క్షము లడ్డంబుగ నాకుఁ గానఁబడ కె ♦ చ్చో డాఁగి నీ వేటికిన్
భ్రమ నొందించుచు దుఃఖపెట్టుచు ననున్ ♦ బాధింపఁ బాలింప వే
గమ రావే పొడసూపవే పలుకవే ♦ కామాతురుం గావవే. 268

తే. ఏను జూడంగ నెందాఁక ♦ నేఁగె దీవు, ప్రేమ నామీఁదఁ గల్గినఁ ♦ బ్రియముతోడఁ
దడవుసేయక వచ్చెదఁ ♦ దమక మొంది, పీతకౌశేయవాసిని ♦ సీత నిలువు.

తే. దీను భగ్నమనోరథుఁ ♦ దీవ్రశోక, తప్తు ననుఁ బాసి లక్ష్మణ ♦ ధరణిపుత్రి
యెందుఁ జనియె నస్త్రాద్రిస ♦ మేతుఁ డైన, జలజహితునిఁ సత్ప్రభ పాసిచన్నకరణి.

చ. ధరణిజ కుంభికుంభలసి ♦ తస్తనయుగ్మముఁ దియ్యవాతెఱన్
సరసిజశస్తహస్తములఁ ♦ జంద్రనిభాస్యముఁ గంబుకంఠమున్
గరభనిభోరులన్ మృదుల ♦ గాత్రముఁ జంపకచారునాసికన్
వరసకలాంచితాంగముల ♦ వాంఛ గ్రసించిరి మాంసభక్షకుల్. 271

వ. నావుడు లక్ష్మణుం డేల చింతాశోకంబులం బొందెదు దేవ నీదేవి వెదకం బోదం
డనుచు నచటు వాసి పోవునెడ. 272

---

చంపకప్రసవన సను ♦ జాగుతమశి, రీషవృక్షంబ నవ్యశి ♦ రీషపుష్ప
సదృశకోమల భూమిజ ♦ జనకతనయఁ, గానరే యంచు రాముఁ ♦ డక్కాననమున.

క. వెదకుచుఁ బ్రేమం దిరుగఁగ, నుదిలకొనుచు లక్ష్మణుండు ♦ నురుతరశోకా
స్పదచిత్తుఁ డగుచు వెదవెడ, గదిసి తిరిగి తిరిగి నెడలఁ ♦ గ్రమ్మఱఁ దిరుగన్.

క. పలుమాఱుం గ్రమ్మఱుటకుఁ, గలఁగంబడ కడవిలోనఁ ♦ గలమృగములు ని
శ్చలగతిఁ దము నాలించుచుఁ, బోరి మేయఁగ వాని నడుగఁ ♦ బోవుచు మఱియున్.

ఉ. గంధగజంబ గంధగజ ♦ గామిని సింహమ సింహమధ్యఁ బు
ష్పంధయ పుష్పరంజితవి ♦ భాసిలతానివహంబ చారుపు
ష్పంధయపుంజరంజితవి ♦ భాసిలతానిభకుంతలాంగి నో
బంధురచక్ర చక్రకుచఁ ♦ బద్మమ పద్మనిభాస్యఁ గానరే.

క. పడుచును లేచుచుఁ బొఱలుచు, సుడివడుచును దెసలు గలయఁ ♦ జూచుచుఁ బెదవుల్
దడుపుచు ననుజుని వెన్నడి, నడలుచు నయ్యైవనంబు ♦ లరయుచు వగతోన్. 273

క. ఘన మగు నజ్ఞానాంబుధి, ననుపమవిజ్ఞానభానుఁ ♦ డస్తంగతుఁడై
నను దుర్భ్రాంతితమిస్రము, మనమునఁ బర్విన విభుండు ♦ మతి సెడి యడవిన్.

సీ. అదె చలత్తన్వంగి ♦ యనుచు నల్లన చేర, నది చూతలత యైన ♦ నట్ల నిలుచు
నదె మంజులాలాప ♦ యనుచు నల్లన చేర, నది కోకిలం బైన ♦ నట్ల నిలుచు
నదె లోలలోచన ♦ యనుచు నల్లన చేర, నది కురంగం బైన ♦ నట్ల నిలుచు
నదె నీలకుంతల ♦ యనుచు నల్లన చేర, నది మయూరం బైన ♦ నట్ల నిలుచు
నదె మహీజ నన్ను ♦ నచటికై చేసన్న, చేసె ననుచు నల్లఁ ♦ జేర నదియు
లలితమలయపవన ♦ చలితపల్లవ మైన, నట్ల నిలుచు రాముఁ ♦ డచట నచట.

ఉ. హా యను సీత సీత యను ♦ నక్కట యెక్కడఁ బోయి తిందు రా
వే యను నిల్వు నిల్వు మను ♦ నీగతిఁ జేరెద నాదుపల్కు విం
డే యను వేగ మో యనఁ గ ♦ దే యను నీశుభదర్శనంబు నీ
వే యను నన్నుఁ బాయఁ జను ♦ నే యను నాడటఁ జూడవే యనున్. 276

శా. ఏలా చిక్కులఁ బెట్టె దియ్యడవిలో ♦ నేలే ననుం జేరవే
యేలే జానకి పిల్చినం బలుకవే ♦ యేలే కృపం జూడవే
యేలే తాలిమిఁ బట్టఁ జాల సరసం ♦ బెందాఁక నీ వాడెదే
యేలే దూరపథిశ్రమాగతుని న ♦ న్నిట్లేల కారించెదే. 277

క. ప్రీతిగ లక్ష్మణ యెక్కడ, సీతం బొడగంటి నాకుఁ ♦ జెప్పుము వేగం
బాతతదుఃఖం బందఁగ, భ్రాతా నాతోడ నేల ♦ పలుకవు వత్సా. 278

ఉ. అంబురుహాస్య నాకడఁ బ్రి ♦ యంబుగ నుండఁగ నాకు దర్భత
ల్పంబులు హంసతూలికల ♦ పానుపు తా ఫలకందమూలభ
క్ష్యంబులు నోలి నా కమృత ♦ కల్పము లౌఁ బరఁగంగ నా కర
ణ్యంబులు నా నయోధ్య యగు ♦ నాకుటజంబులు దివ్యగేహముల్. 279

వ. అని పలికి పురోభాగంబునం బొలుచుభూమిం గీ లెడలి పడినతోడవులు మొగ్గ
లు మాల్యంబులుం బొడగని రాముండు సౌమిత్రితో ని ట్లనియె. 280

ఉ. భూమిజతప్తకాంచనవి ♦ భూషణబృందములుం బ్రసూనముల్
భూమితలంబునన్ నెరసి ♦ పోఁడిగ నున్నవి పోలఁ జూచితే
యామహిపుత్రి నిచ్చట ర ♦ యంబున దైత్యులు ద్రుంచి వైచి తా

---

తే. అనుచు నేమిటి నైనను ♦ నడిగి యడిగి, యెక్కడికి నైనఁ జని చని ♦ యెందు నైన
మెలఁగి మెలఁగి యెచ్చట నైన ♦ నిలిచి నిలిచి, యెంతయును దిమ్మదిరిగె రా ♦ జేంద్రసుతుఁడు.

సీ. ఇబ్భంగిఁ దిరుగంగ ♦ నబ్భూమిపాలుని, ముందటఁ బిఱుఁదను ♦ గ్రందువోలని
జానకి పెంచిన ♦ చారుకురంగశా, బకములబడి వాని ♦ భావ మరసి

రామిషమున్ గ్రహించి ముద ◆ మందుచుఁ బోయినవారు లక్ష్మణా. 281

—◆ రాముఁడు సీత నరణ్యంబులందు వెదకుట. ◆—

వ. అనుచు ననుజసమేతుం డై క్రోశమాత్రం బాశ్రమంబు గడచి రాముం డగ్రభాగంబున నత్యద్భుతం బై నవిధ్వస్తధరణిపతితరణోపకరణంబులం బొడగని సౌమిత్రిం జూడు మని పలికి. 282

సీ. కనకభూషితము ముక్తామణిసహితంబు, నగుభగ్నధను విదె ◆ యనుజ చూడు
శతశలాకము మాల్య ◆ చయశోభితవిభిన్న,దండము నగునెల్లి ◆ ధాత్రిఁ జూడు
బాలార్కసదృశంబు ◆ బంధురహైమంబు, వైదూర్యగుణరాజి ◆ వరుసఁ జూడు
మతివిశీర్ణము ధరా ◆ పతితంబు నగుతను,త్రము సూడు నుగ్గైన ◆ రథము సూడు
కనకవర్మముల్ ధరియించి ◆ ఘనపిశాచ,ముఖములును గలవేసడ ◆ ములు ధరిత్రిఁ
బడినవి వెచూడుతపనీయ ◆ బాణతతులు, నెరసియున్నవి గఁ జూడు ◆ ధరణిఁ గలయ.

వ. అని లక్ష్మణునకుం జూపి యంతరంగంబున. 284

క. జనకజఁ బాసినదుఃఖం, బున కోర్వఁగఁ జాల కేను ◆ బొలిసి దివికి వే
చనిన ననుం గనుఁగొని మ,జ్జనకుఁడు మది రోసి లోన ◆ సమ్మతుఁ డగుచున్.

మ. మునివృత్తిం బదునాలుగేం డ్లడవిలో ◆ మోదించి వర్తించెదం
జన నే నంచుఁ బ్రతిజ్ఞ నాయెదుర నిచ్చం జేసి యాకాల ము
ర్వి నొగిం బూర్ణముగాఁ జరింప కిటకున్ ◆ వీఁ డేటికిన్ వచ్చెనాఁ
డని నన్నుం గడుఁ గామచారుఁ డనృతుం ◆ డత్యంతదోషుం డనున్. 286

మ. హరిణాక్షిన్ గుంభికుంభకుచఁ బద్మాస్యం బికోక్తిం జిత
స్వర బింబాధరఁ జారునీలకచపాశన్ సీత నీకాన భీ
కరశార్దూలమృగేంద్రకుంజరచర ◆ త్క్రోలరాజీశుకో
త్కరకేకివ్రజముల్ బహుక్రమములం ◆ గారించు భీతిల్లఁగన్. 287

తే. అనుచుసీతఁగానకమది ◆ వనటఁబొందు, నన్నఁజూచిలక్ష్మణుఁ డాత్మ ◆ ఖిన్నుఁడగుచు
దేవ శోకంబు వలవదు ◆ దేవి నెల్ల,యెడల వెదకుద మని పల్కి ◆ యిట్టు లనియె.

క. నలినికిఁ బోయెనొ కానకు, నలుగులు గోయంగ లీల ◆ నరిగెనొ వెనకై
వలినికిఁ జనియెనొ మనమున, ములు సూడఁగ డాఁగి యొరకమున నున్నదియో.

క. మనలన్ వెఱపింపఁగఁ గా, ననమున నున్నదియొ డాఁగి ◆ నవ్వులకై మా
టున నడఁగియుండఁ బోలును, జనకజ వెదకంగ మనము ◆ ననవలయు నృపా.

వ. అని పలికి యన్నతోఁగూడ నొక్కకమలాకరంబు సేరి యప్పుడు. 291

---

యవి చొప్పచూపెడు ◆ నవియును బోలె నై, యరిగెడు నని వాని ◆ యరుగుజాడఁ
దిరుగంగ దక్షిణ ◆ దిశవస్తై యవి చేరఁ, దోడన నృపుఁ డేగఁ ◆ దోఁచె నెగుర
సీతతలపువ్వులును చక్కి ◆ శేషవినుత, తారహారంబు విలసిత ◆ చారుపాద
కటకమును నంతనంత న ◆ క్కానలోన, వానిఁ గనుఁగొని రామభూ ◆ వరుఁడు దలఁచి.

క. చలదంబుజసైకతశై,వలచక్రోత్పలతరంగ ॥ వరబంధూకం
బుల నడరునలినిఁ బొడగని, కలఁగి నరేంద్రుండు మోహ ॥ కలితుం డగుచున్.

మ. అదె వైదేహి ప్రసన్నవక్త్ర మదె ర ॥ మ్యం బైనవేణీభరం
బదె వృత్తస్తనయుగ్మ మల్లదె మనో ॥ జ్ఞాకారనేత్రద్వయం
బదె రాజద్వళిపంక్తి సూడు మదె సే ॥ వ్యం బైనశ్రోణీభరం
బదె యందున్నది డాఁగి సీత జలలీ ॥ లాసక్తయై నావుడున్. 293

వ. అతం డచ్చట లేదు సీత యొండెడ నున్నది వెదక నటకు మనము వోవలయు.

క. అనవుడు నగుఁ గా కని తన,యనుజుండును దాను నచటి ॥ యగసానుగుహా
వనముల వెదకి మహీనం,దనఁ గానక రాముఁ డనియెఁ ॥ దమ్మునితోడన్. 295

క. చాలఁ బరీక్షించితి మీ, శైలంబున నెచట భూమి ॥ జం గాన మయో
లోలాక్షి యేమి యయ్యెనొ, నా లక్ష్మణుఁ డనియె వగచు ॥ నవ్విభుతోడన్.

క. జననాథ నీవు శోకం,బునఁ దూలకు వేగ సీతఁ ॥ బొందెదు నయ్యం
బున విష్ణుఁడు భుజశౌర్యం,బున బలి బంధించి భూమిఁ ॥ బొందినభంగిన్. 297

వ. అనవుడు రాముండు దుఃఖవాక్యంబుల సౌమిత్రి కిట్లనియె. 298

చ. సరసుల సైకతస్థలుల ॥ శైలనితంబములన్ గిరీంద్రగ
హ్వరముల సింధుతీరముల ॥ నాతతమార్గములన్ వనంబులం
దరువులచల్లనీడల ను ॥ దంచితకుంజతలంబులందు ని
ర్ఝరముల భూబిలావలుల ॥ సానుసమీపనివాసభూములన్. 299

చ. వెదకితి మెల్లచోట్లఁ బృథి ॥ వీసుతఁ గానము యింక నేమి సే
యుద మని సొమ్మఁబోవు మఱి ॥ యొయ్యన దేఱు విషాద మొందు గ
ద్గదనినదంబుతోఁ బలుకుఁ ॥ గామిని వోయితి వింక నేగతిన్
బ్రదుకుదు నెందుఁ బోదు నినుఁ ॥ బాసి శరీరముతోడ మైథిలీ. 300

వ. అని విచారించి రాముం డంతరంగంబున. 301

సీ. చపలదృష్టులఁ గని ॥ శార్దూలములు సంపు,నధరంబుఁ గని చిల్క ॥ లలమి యేఁచుఁ
జారుమధ్యముఁ గని ॥ శరభముల్ మననీవు, నెమ్మోముఁ గని యళుల్ ॥ నెగులు వెట్టు
ఘనవృత్తకుచములఁ ॥ గని సింహములు నొంచుఁ, గరములు గని కురం ॥ గంబు లలఁచు
సురుచిరోరులు గని ॥ కరులు బెగ్గిలఁ జేయుఁ, గేశపాశముఁ గని ॥ కేకు లొడుచుఁ
గోమలశ్రుతి విని కాక ॥ కులము లడుచుఁ
గాన కానలో సీతకుఁ ॥ గలదె నేమ
మనుచుఁ జింతించు వగఁ దూలు ॥ నడలి యడలి
రామ వెదకి కానఁగ లేక ॥ రామవిభుఁడు. 302

---

ఉ. అక్కట సీత నొక్కఁడు మహాదనుజుండు భయంకరంబుగా
నిక్కడ [illegible] దొరఁకి ॥ యిమ్మెయి రాలినభూషణంబు లి

క. వనట నిటులు విలపించుచు, ననుజుఁడు బోధింప మాన కాతురపడుచుం
గనుఁగవ నశ్రులు రాలఁగ, ఘనబాహులు మీఁది కెత్తి గగనోన్ముఖుఁ డై.
క. భావజలీలలఁ బ్రియమునఁ, గావించు సుఖోపభోగకాలంబుతఱిన్
నావల్లభ ననుఁ బాసిన, నే వందెదఁ గాకఁ ద్రిభువనేశ శచీశా. 304
వ. అని యాక్రోశించి సౌమిత్రిం గనుంగొని. 305
క. మందాకిని కేఁగి మహీనందన కమలములు గోసి నలువున లీలం
జెందఁగ నున్నది లక్ష్మణ, పొందుగ నీ వచటి కేఁగు భూమిజఁ జూడన్. 306
క. అని పలికిన సౌమిత్రియు, ఘనవేగమునఁ జని యచటఁ గలయ మహీనం
దనఁ జీరి వెదకి కానక, జనపతితోఁ జెప్ప లేదు జనకజ యంచున్. 307
తే. అప్పు డఖిలభూతంబులు నాదశాస్య, చావుకొఱకు మందాకిని నీవు పోయి
రామవిభుతోడఁ జెప్పుము భూమితనయ, వార్త యనవుడు నానది వచ్చి యెలమి.
క. రామునితో దశకంఠుఁడు, భూమిజ నెత్తుకొని వేగ పోయెను లంకా
ధామంబున కని చెప్పుచు, నామందాకిని నిజాలయంబున కరిగెన్. 309
వ. అంత రాముండు సౌమిత్రితో నిట్లను మందాకినిని జనస్థానంబునఁ బ్రస్రవణ
గిరులను వెదకితిమి సీత నెక్కడం బొడగాన మనుచు దుఃఖించుచున్న యన్నను
లక్ష్మణుం డూరార్చి యెక్కడ సీతం బొడగని యెదము గాక యనుచుం బలుక
నప్పుడు రాముండు పుష్పదామంబు గని సౌమిత్రి కిట్లనియె. 310
తే. భూమిసుతశిరంబున నున్న పుష్పమాల, నేఁ బడియున్న యది దీనిఁ బోలఁ జూడు
మనుజ విరు లివె నెరసిన వవనిపుత్త్రి, యుండ నోపు నీఘన మగు కొండమీఁద.
వ. అని పలికి రోషావేశంబున నన్నగంబు మిడుఁగుఱులు వాఱం జూచి రాముం
డి ట్లనియె. 312
క. సీతం జూపక యుండిన, నీతరుసానువులు నాదునిష్ఠుర బాణ
వ్రాతాగ్నిఁ గాల్చి భస్మీ,భూతంబులు గాఁగఁ జేసి పుచ్చెదఁ గడిమిన్. 313
క. ఈతటిని నిగురఁ జేసెద, శాతోగ్రాస్త్రముల ననుచు జగతీస్థలి న
త్యాతతరావణుపదములు, సీతపదంబులును గాంచి క్షితిపతి యచటన్. 314
క. పొడగని సౌమిత్రికి న, య్యడుగులు సూప నవి సూచి యాలక్ష్మణుఁ డొ
క్కఁడు భీతిఁ బొందె రాముఁడుఁ, దడయక వి ల్లెక్కువెట్టి తమ్ముని కనియెన్.
క. నాకడ జానకి యుండఁగ, నాకాలుఁడు సపరివారుఁ డయ్యును గాంతఱ్
వే కదియ లేఁడు రక్కసుఁ, డాకసమున కేఁగినాఁడొ యవనిజతోడన్. 316

చక్కటిఁ జల్లి యద్దనుజుఁ డక్కడు వం దతి గాన నైతి నిం
కెక్కడి పౌరుషం బనుచు నెంతయు మూర్ఛను వ్రాలె భూస్థలిన్.
క. అనుజుఁడు ఘనశోకంబున, మునుఁగుచు రఘునాథుఁ దేర్చి ముద్దియ నీచా
పృనఁ దరయుద నని చెప్పఁగ, వినుచుం బలి మతియు శోకవివ్వాలుఁ డగుచున్.

వ. ఆకాశం బలత్కృయం బేరికిం బోరా దని పలికి. 317

క. వైదేహిఁ గొంచు రక్కసుఁ, డేదిక్కున కరిగినాఁడొ ✽ యెంతయు వగతో
నాదిక్కున కేఁగఁగవలె, నేది యుపాయంబు మనకు ✽ నింకం జెపుమా. 318

వ. అనవుడు లక్ష్మణుండు రామునితో ని ట్లనియె. 319

క. అలఘుఁడు దుఃఖముఁ బొందిన, నలఁగక బుద్ధి ధృతిఁ బెంచు ✽ నల్పుఁడు దుఃఖం
బలమిన ధృతి సెడి మునుఁగును, జలములలో శిలలు మునుఁగు ✽ చాడ్పున నధిపా.

క. శోకముఁ బొందినవానిన్, భీకరరోగములు సెందుఁ ✽ బృథులార్థంబుల్
సేకుఱవు వాని కెప్పుడు, శోకము గని విడుచువాఁడు ✽ సుజ్ఞాని నృపా. 321

క. ఓలిం గడు శోకించెద, వేలా యజ్ఞుగతిఁ గార్య ✽ మేమఱి యాప
త్కాలంబునఁ గార్యము సెడి, బాలిశుఁ డత్యంతశోక ✽ పరుఁడై పొలియున్. 322

వ. నావుడు రాముండు లక్ష్మణుం గనుంగొని. 323

ఉ. తమ్ముఁడ నీదువాక్యములు ✽ తప్పక సేసెద నంచుఁ బల్కి క్రౌ
ర్యమ్మున శాంతి వోవిడిచి ✽ యాగ్రహ మొందుచుఁ జంద్రికన్ వినా
శమ్ముగఁ జేసి మించురవి ✽ చండమునన్ వెలుఁ గొంది ఘోరకో
ప మ్మడరంగ రామజన ✽ పాలుఁడు లక్ష్మణుతోడ ని ట్లనున్. 324

మ. ఉరుధర్మాన్వితుఁ డై నమజ్జనకున ✽ గ్గోదార వాక్యమ్మునన్
ధరణీరాజ్యముఁ బాసి దీన యగుమా ✽ తన్ డించి యత్యంతభా
స్వరధర్మంబుఁ బురస్కరించుకొని యి ✽ చ్చన్ దండకారణ్యముం
బరఁగం జొచ్చియు ధర్మవృత్తిఁ దప మొ ✽ ప్పం బూని యే నుండఁగన్. 325

క. సీత మృతిఁ బొందఁ జూచుచు, భూతంబు లుపేక్ష సేసె ✽ భూమీశులు నా
పూతవ్రతఁ గాచి నను, బ్రీతాత్మునిఁ జేయ రైరి ✽ పృథ్వీశసుతా. 326

క. మృదువర్తనుఁ గరుణాన్వితు, హృదయుని దాంతియుతు లోక ✽ హితకరు నన్నుం
ద్రిదశేంద్రుఁడుఁ గరుణింపఁడు, మది దుర్బలుఁ డై నహీన ✽ మానవుఁ బోలెన్.

క. ఏ ని ట్లాక్రోశింపఁగ, నూనినకృప నన్ను శోక ✽ మొందఁగ నేలా
మాను మన రెవ్వరును నా, జానకిఁ జూప రటు గాన ✽ సరభస మెసఁగన్.

క. నాలలనఁ జూపకుండిన, నీలోకము లెల్లఁ ద్రుంతు ✽ నేకక్షణమున్
లోలాక్షిం బాసి మనం, గాలేను జగత్త్రయంబు ✽ గల్గిన నేలా. 329

శా. అస్మచ్చాపవిముక్తబాణముల ను ✽ ద్యద్భూతలం బంతయున్
భస్మీభూతము సేసి యిందుభగణ ✽ ప్రద్యోతనాకాశమున్

ఉ. ఏ నిలఁ బాపకర్ముఁడఁగ ✽ నిమ్మెయి నాసతిఁ గ్రూరకర్ముఁ డై
దానవుఁ డొక్కరుండు ధృతిఁ ✽ దాఁ జెఱవట్టఁగ నూరకుండిరే
భానుఁడుఁ బంచభూతములుఁ ✽ బాపవిచారుఁబు వీరిఁ ద్రుంచినం
గాని మనంబు సెక్కగలు ✽ గ్రాఁగవు నా కని యుగ్రమూర్తి యై.

విస్మిత్యన్వితబాహుశౌర్యమున నుర్విం గూల్చి కల్పాంతకో
గ్రస్మర్తవ్యమహోద్ధతిన్ సకలలోకప్రాణులన్ ద్రుంచెదన్. 330
వ. అని వెండియు. 331
మ. ధరణీనందనఁ జూపకుండిన నమర్త్యశ్రేణి బాధించెదన్
వరుసన్ యక్షపిశాచరాక్షసచమూవర్గంబు నుగ్గాడెదం
బూరి గంధర్వుల సంహరించెద మహాభూతంబులం ద్రుంచెదన్
నరులం జంపెదఁ గిన్కఁ గిన్నరులఁ జండక్రీడఁ జెండాడెదన్. 332
చ. వరుస నజాండభాండములు వ్రయ్యలుగా జలరాసు లింక భూ
ధరములు నుగ్గునూచముగ ధారుణి ధూళిపటంబు గాఁగ నం
బర మినచంద్రతారకసమాజముతో నిలఁ గుప్పఁ గూర ది
క్కరిశిరముల్ దెగంగఁ ద్రిదశగంబులు చూర్ణము గాఁగఁ జేసెదన్. 333
ఉ. అప్పుడు భీతిఁ బొంది కమలాసనముఖ్యులు సీతఁ దెచ్చి నా
కప్పన సేసి సమ్మదము నందుచు నేఁగెద రింకఁ జేవమైఁ
దప్పక చూడు నాబలము తమ్ముఁడ నీ వని పల్కి కన్నులన్
నిప్పులు రాలఁ గోపమున నిష్ఠురచాపముఁ గేలఁ బూనినన్. 334
చ. గగనము వ్రోసి బిట్టవిసెఁ గన్కని నుల్కలు రాలె నెల్లచో
దిగిభము లోలి వ్రాలె జగతీతల మల్లలనాడె నేడు పె
న్నగములు సంచలించె సురనాయకుఁ డాకులపాటు నొందె ము
జ్జగములుఁ దల్లడిల్లె రవిచంద్రులు దప్పఁ జరించి రయ్యెడన్. 335
వ. అప్పుడు సీతాహరణదుఃఖితుండును నతితప్తుండును నుష్ణదీర్ఘనిశ్వాసుండును నధి
జ్యశరాసనుండును నై లోకంబులు గాల్చు కాలాగ్నియుంబోలె దక్షాధ్వరధ్వం
సంబు సేయఁ బూనినరుద్రుండునుంబోలె దుర్నిరీక్ష్యుం డై యున్నయన్నం
జూచి ప్రాంజలి యై వినయవాక్యంబుల సౌమిత్రి యిట్లనియె. 336
క. లోకైకశరణ్యుండవు, లోకత్రాణుఁడవు సర్వలోకేశుఁడవున్
లోకహితంబుగ రాక్షస, లోకముఁ బరిమార్తు గాక లోకారాధ్యా. 337
క. వికృతి యొనర్చినఖలుఁ డ, క్కక శిక్షింపంగఁ జంపఁ గర్తవ్యము గా
కొకఁ డపరాధము సేసిన, సకలజగత్త్రయముఁ జంపఁ జను నే దేవా. 338
క. మును నీవు భూతహితవ, ర్తనమునఁ బెంపొంది యిపుడు తద్దయు రోషం

---

వ. సముద్దండం బగుకోదండంబు గైకొని రోషభీషణంబుగా గుణనినాదంబు సేయుచు.
మ. అతిరూక్షేక్షణుఁ డై రఘూద్వహుఁడు బ్రహ్మాస్త్రంబు సంధింపఁగాఁ
గుతలం బల్లలనాడెఁ జుక్క లురిలెన్ గొండల్ వణంకెన్ భయా
హతి సప్తాశ్వనియశ్వసప్తకము మోహభ్రాంతిఁ దూలెన్ దిశా
పతు లెల్లం గలఁగంగఁ బాఱిరి సముద్భ్రాంతాత్మచేతస్కు లై.

బువఁ గడఁగి భూతహింసన, మొనరింపఁగ నాగ్రహించె । దుచితమె నీకున్. 339

క. తరణికిఁ దేజంబు సుధా,కరునికిఁ గళ పవనునికిని । గమనంబు వసుం
ధరకు ధృతి నైజ మగుగతి, నరనాయక నీకు దమము । నైజగుణ మిలన్.

క. సురగంధర్వప్రభృతులు, ధరణీశైలాపగాబ్ధి । ధాత్రీజాదుల్
నరవర నీ కేయపకృతి, యగయఁగ గావించె జగములం దెవ్వాఁడున్. 341

వ. జనవర నీకు నప్రియంబు సేయంగలవాఁడు లేఁ డేనును నీవునుం గూడి యధిక ప్రయత్నంబున గిరుల నదుల వనంబుల బిలంబులం గమలాకరంబుల సముద్రంబుల దేవగంధర్వకిన్నరగరుడోరగామరలోకంబుల సర్వదిగంతంబుల వెదకి సీతాపహారునిం గానకున్న మనకు దేవతలు వాని నప్పగింపకున్న మీఁద సచరాచరంబు లైనలోకంబుల నిర్ఘాతసంకాశబాణంబుల నిరవశేషంబుగాఁ జేయుదము మొదట యుక్తక్రమంబున ధర్మంబు నడపి యటమీఁద రాజు నర్హదండక్రమంబున వర్తించు టొప్పు నని పలికి లక్ష్మణుండు మఱియు నిట్లనియె. 342

క. ఆపద సమస్తలోకులఁ, బ్రాపించుఁ దొలంగు నపుడ । పవనముభంగిం
బైపడునాపద సైఁచిన, భూపాలా క్షణములోనఁ । బొందు శుభంబుల్. 343

వ. రఘువరా యల్పతేజుం డైనసామాన్యుండు దుఃఖంబు సహింపనోపునె యార్తుం డైననరునికి విజ్ఞానం బేల కలుగు నెవ్వం డాపన్నుండు గానివాఁడు గలండు నహుషుం డింద్రసాలోక్యంబు సెడి యధఃపతితుండు గాఁడె మహర్షిశ్రేష్ఠుం డైనవసిష్ఠునికిఁ బుత్రశతంబు విశ్వామిత్రుచేత హతిం బొందదె లోకనేత్రంబు లైనచంద్రసూర్యులు రాహుగ్రస్తులు గారె సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు గారె కాన నినుబోఁటితత్త్వదర్శులు తత్త్వంబు బుద్ధిం దలపోసి ప్రాజ్ఞులై శుభాశుభంబు లొందినఁ బొంగక తలంకక సంతసింపక దుఃఖింపక ధీరులై యుండుదురు నీవు బృహస్పతిసమానబుద్ధిమంతుండవు నీయట్టియధికబలపరాక్రమవిజ్ఞానగరిష్ఠుండు సీతానిమిత్తంబున నజ్ఞునిగతి నుండి దుఃఖించు టుచితం బగునే మన మెవ్విధంబుననేని సీతాపహారునిం బరిమార్చి పుణ్యాసమేత యైనసీత సాధించి తెత్త మనిన రాముం డనుజువాక్యంబులకు సంతసించి లోకంబుల సంహారింప నత్తినకోపం బుడిపి యతని కిట్లనియె. 344

క. ఎక్కడ నున్నది జానకి, యెక్కడఁ బో నగును వెదక । నేది యుపాయం
బక్కామినిఁ గన నెయ్యది, దక్కక సేయుదము సెపుమ । తమ్ముఁడ నెమ్మిన్.

---

వ. ఇట్లు ప్రళయకాలసముద్దీప్తరౌద్రుం డయినరుద్రుండునుంబోలె నున్నయారామభద్రునితోడ జగన్మైత్రీకరణచరిత్రుం డగుసుమిత్రాపుత్రుం డిట్లనియె.

సీ. మును శాంతమతిఁ గృపా♦ముగ్ధుండు నా నుండు, నీకు నీవిధమున ♦ శోకమోహ
ముసఁ జేసి బుద్ధిమా♦లి నిజస్వభావవి, కల్పనం బొనరింపఁ ♦ గణఁగ నగునె
కుటిలమానవుఁ డొక్కఁ ♦ డిటు లెవ్వఁ డే నకృత్యము సేయ నింతకు ♦ నలుఁగ ధర్మ

వ. అనిన సౌమిత్రి యన్నతో ని ట్లను నీజనస్థానంబునం గలగిరిదుర్గవనబిలంబులు నడులుం గిన్నరగంధర్వనిలయంబులుం ద్వరితగతి వెదకుదము నీయట్టిబుద్ధిసంపన్ను లైననరోత్తము లాపదలకుం గంపంపరు వాయువేగంబునకుం జలియింపని శైలంబులుంబోలె నని పలికిన లక్ష్మణసహితుం డై రాముం డాజనస్థానంబునం గలయన్నిచోట్ల వెదకి సీతం గానక కోపాటోపంబునఁ జాపంబు గ్రహించుచు నగ్రభాగంబున. 346

జటాయువు సీతావృత్తాంతము రాఘవులకుఁ జెప్పుట.

క. పక్షంబులు దెగి ఘోరా,జిక్షితిఁ బడి యున్నరక్త♦సిక్తాంగు నుద
గ్రక్షోణిధరాకారునిఁ, బక్షీంద్రు జటాయువును నృ♦పాలుఁడు గనియెన్. 347

వ. కని రాముఁడు లక్ష్మణునితోడ. 348

ఉ. వీఁ డొకరక్కసుం డెడరు♦ వేచి మహీసుత మ్రింగి యిచ్చటన్
వాఁడిమి వాలుచున్ మనము♦ వచ్చు టెఱింగి విహంగవేషి యై
పోఁడిగ నున్నవాఁ డనుజ♦ భూరిపరాక్రమ మొప్ప వీనిఁ గ్రొ
వ్వాఁడిశరంబులం దునిమి♦ వైచెద నంచు మహోగ్రబాణమున్. 349

క. వడిఁ గొని యేయం బూనినఁ, గడుభయమున రుధిరధార♦ గ్రక్కుచు విభు న
ప్పుడు గని జటాయు వనుఁ గృప, యడరఁగ నోరామ రామ♦ యార్తశరణ్యా.

క. ఏను జటాయువ దశరథ, భూనాయకుసఖుఁడ రామ♦భూవర మీరల్
లేనియెడ సీతఁ గొంచు ద,శాననుఁ డరుగంగ వాని♦ నాఁగి కడంకన్. 351

ఉ. ఏపున వానిఛత్రము మ♦హీస్థలిఁ గూలిచి జోడు సించియుం
జాపము ద్రుంచివైచి బహు♦సాయకముల్ విదళించి వాజుల
న్రా పడఁగించి తద్రథము♦ నుగ్గుగ మోఁది నఖాళిఁ జంచువి

మే లోకమున నెల్ల♦ దెలసి తడవ మన, యాయాస మెఱిఁగియు♦ నవనితనయ
నఱుడు చూప నెఱిఁగి♦ యాద్రోహిఁ గని పట్టి, పేర్చి యాప్తమిత్ర♦భృత్యపుత్ర
యుతముగా వధించి♦ యుర్వీజఁ దెత్తము, గాక లోకభయముఁ♦ గాతుగాక.

క. అని పల్కినతమ్మునివా, క్యనిరూఢి మనంబులోనఁ♦ గైకొని రోషం
బు నడఁచి ధరణీతలమ్మున, ధను వల్లన యూఁది శాంతి♦ దనమదిఁ గదురన్.

వ. కౌసల్యానందనుండు సుమిత్రానందనుం గనుంగొని యింక మనకుఁ జేయ వలయుపని యెయ్యది యని యడిగిన నతం డి ట్లనియె.

సీ. ఈధూమఘనము లున్న♦యీజాడ విడువక, పోవఁ బోవ నెఱుంగఁ♦ బోలు మనకు
నెల్లఁ దెల్లంబుగా♦ నిది నిశ్చయం బన్న, నట గొంతద వ్వేఁగి♦ యచట వజ్ర
పటుపాతనక్షత♦పక్షశైలోత్తుంగ, ఘోరాంగుఁ డై ధాత్రిఁ♦ గూలి యున్న
వాని నీరంధ్రని♦శ్వాసధూసరుని వి,హంగపుంగవుని న♦ల్లంత నంతఁ
గాంచి రఘుపతి లక్ష్మణ♦ కంటె వీఁడు, జనకజను మ్రింగి గ్రద్దరూ♦పావరఁ దాల్చి
కాత్యమున నున్నవాఁ డుగ్ర♦సాయకమున, వీనిఁ బొలియింతు నన్న మ♦గ్వసుతశక్తి.

క్షేపములఁ గశద్రుధిరసిక్తశరీరునిఁ జేయఁ జెచ్చెరన్. 352

వ. అలుకు గొని యన్నిశాచరుండు. 353

మ. విరథుం డై సతి డించి బెగ్గలమునన్ వేగంబుతోఁ బాఱఁగా
విరుదారన్ వెనువెంటఁ బాఱి కడు దర్పిం బొంది యే నుండ భీ
కరఖడ్గంబునఁ బక్షముల్ దెగి పడం గా వ్రేసి యాపం క్తికం
ధరుఁ డుర్వీసుత నెత్తికొంచుఁ జనియెన్ దర్పాతిరేకంబునన్. 354

వ. అని పలుకుజటాయువుం బట్టి కౌఁగిలించుకొని సౌమిత్రిసమేతుఁ డై రాముండు మహారోదనంబు సేసి యతిదుఃఖంబున. 355

సీ. రామభూవిభుఁ డప్పు సౌమిత్రి కిట్లను, రాజ్యంబు తొలఁగు టరణ్యవాస
మును దండ్రిచావును జనకజ వోవుట, మొదలుగ శోకాబ్ధి మునిఁగియుండ
నాపక్షమున వచ్చి యీపక్షినాథుఁ డాఁతతవజ్రవాగురఁ దగులువడియెఁ
బున్నమ నుప్పొంగుపూర్ణాబ్ధి శోషించె, నక్కట నాయభాగ్యంబు కతన
ఘనుఁడు మజ్జనకుసఖుఁడు ఖగకులేంద్రుఁ
డగుజటాయువు ఱెక్కలు దెగి మహామ
హోర్వి రక్తసిక్తాంగుఁ డై యున్నవాఁడు
పొగులుచును నాదుపుణ్యంబు పొలిసెఁ గాన. 356

క. అని వగచి జటాయువుతో, జనకజ నాప్రాణదయిత సద్వ్రత యేది
క్కున కరిగెననుచు రాముఁడు, ధనువును బాణములు విడిచి ధరణిం బడియెన్.

వ. పడి యాఖగపతిచేత సీతవృత్తాంతంబు విస్పష్టంబుగా విని రాముం డనుజసమేతుం డై యిరువురు నెలుంగెత్తి వాపోవుచు నేలం బడి పొరలుచు మూర్ఛిల్లి నిశ్చేష్టితు లై యుండి రంతఁ గొంతదడవునకు సౌమిత్రి దేఱి యన్నచరణంబు లొత్తుచు నారాము బోధించి యోరామ దశరథుండు నీగుణంబులం గట్టువడి భవద్వియోగంబు సైరింపఁ జాలక తపోయోగమార్గంబునం బ్రాణంబులు విడిచి నాకగతుం డయ్యె నని భరతుండు సెప్ప నీవు చరితవ్రతనుండ వై సీతతోఁ గూడ మరలి పురంబున కేతేర నిన్నుం గన్నులం జూచుజను లతిపుణ్యులు నధికధన్యులు నతిసుముఖులునుంగాఁ బురాభిముఖుండ వై యరుగునిన్నుం జూచి కౌసల్య పరమానందంబునం బొందు. 358

---

మ. అనుచుం గ్రూరశరంబు వే తొడుగఁగా నాలించి హీనస్వరం
బునఁ బక్షీంద్రుఁడు రామచంద్రు నను నోభూనాథ సీతాసతిం
గొనిపోవన్ దశకంఠుఁ డాదనుజునిం గ్రూరోద్ధతిం దాఁకి నే
నని ని ట్లైతి జటాయు వంద్రు ననుఁ దౌత్యం బింతయుం జెప్పితిన్.

క. అనునప్పలుకులకుఁ గృపా, జనితుం డై యేయ కుడిగి సౌమిత్రియుఁ దా
నునుఁ జేర నరిగి ఖగపతిఁ, గనుఁగొని తదవస్థ చూచి కడు దుఃఖితుఁ డై.

మ. జనకుం డమ్మోయి సంతసింపఁగఁ దగన్ సత్యప్రతిజ్ఞుండ వై
వనవాసవ్రతశేషమున్ నడపి సర్వప్రీతితోడం బురం
బున కేతేరఁగ నిన్నుఁ జూచినజనుల్ పుణ్యాత్ము లయ్యున్ మనం
బున నీరాకకు నుత్సహింత్రు వెస నుబ్బుం దల్లి కౌసల్యయున్. 359

క. అతిపుణ్య యదితి త్రిజగ,న్నుత యింద్రునిఁ గన్నపగిది నోములు పెక్కల్
వ్రతనిష్ఠ నోమి సుగుణా, న్వితయగుకౌసల్య గనియె నిన్ను నరేంద్రా. 360

క. కథితాఖిలదానంబులుఁ, బ్రథితాశేషసుకృతములు బహుయజ్ఞములుం
బృథులమతిఁ జేసి యిల దశ,రథభూపతి నిన్నుఁ బడసె రామమహీశా. 361

వ. అని లక్ష్మణుండు పెక్కుదెఱంగుల బోధింపం దెలివొంది రామచంద్రుండు జటా
యువుం గనుంగొని. 362

చ. జనకజ నన్ను నే మనియె జానకి రక్కసుఁ డెందుఁ గొంచు వే
చనియెఁ గడంక వానిబలసంపద యెట్టిది యద్దురాత్ముఁ డె
వ్వనిసుతుఁ డెట్టివాఁడు తగ వాఁ డెట యుండుఁ దదీయనామ మే
మనఁబడుఁ బక్షినాయక సమస్తము నా కెఱిఁగింపు నావుడున్. 363

చ. జనవర రావణుం డనునిశాచరవీరుఁడు భూరిశక్తి దు
ర్వినయత మాయఁ గైకొని పరిశ్రమ మొందిననన్నుఁ జూచి యు
క్కున ఘనపక్షముల్ విఱుగఁ గ్రూరతఁ ద్రుంచి మహీజఁ గొంచుఁ జ
య్యన దివి దక్షిణాభిముఖుఁడై చనియెన్ బలదర్ప మొప్పఁగన్. 364

క. భూవర సంగ్రామంబున, రావణుఁ బరిమార్చి నీవు రమణీయజయ
శ్రీ వెలయ సీతఁ బొందెదు, వావిరి నాదేవి కాత్మ వగవకు మంచున్. 365

క. ఇర వఱి ప్రాణంబులు నే, దిరుగుడువడఁ జొచ్చె నాదుదేహంబు గడుం
బరవశ మయ్యెడు భ్రాంతిం, బొరసెడుఁ జిత్తంబు మూర్ఛపొదివెడు నంచున్.

క. ధర శిరము వైచి పొరలుచుఁ, జరణంబులు గుదిచికొంచుఁ జంచలమున నె
త్తురుఁ గండలుఁ గ్రక్కుచుఁ బొరి, పొరి నాతురపడి విహంగపుంగవుఁ డీల్గెన్.

వ. ఇట్లు గతాసుండై శైలంబువోలెం గూలి యున్నజటాయువుం గనుంగొని
రాముండనుజుండునుం దానును బహువిధంబులశోకించి లక్ష్మణుంజూచి యక్కట

---

వ. మహాత్మా దశకంఠుం డెట్టివాఁడు వాఁ డేల నాతోడ విరోధంబుఁ బూనె వాఁడు మహీతనయ
నట్లు గొనిపోవునెడ నాసాధ్వి యేమని విలపించె నీ వెచటనుండి వచ్చి యి ట్లయితి వింతయుం
జెప్పనోపుదేనిఁ జెప్పవే యనుటయు నతం డెట్టకేలకు నొక్కింత యెలుంగు దెచ్చుకొనియిట్లనియె.

శా. ఈవుం దమ్ముఁడు దవ్వుగాఁ జనుడుఁ దా నేతెంచి సీతన్ దశ
గ్రీవుం డుద్ధతిఁ గొంచు నేఁగునెడ ధాత్రీపుత్రి దా నార్తితో
రావం బెల్లెడఁ జెల్లొనర్ప విని దుర్వారోద్ధతిం దాఁకి య
ద్దేవారాతి నెదుర్ప నే నడచి యుద్దీప్తస్ఫురచ్ఛక్తిమై.

పక్షీంద్రుండు రావణు మార్కొని బహుప్రకారంబుల యుద్ధంబు సేసి బలవిక్ర
మంబులు నెఱపి నాకొఱకు రావణుచేత మృతిఁ బొందె నట్లు గాన జటాయువు
నకు స్వర్గం బవశ్యంబునుం గలుగు నీజటాయువు మన కిట్టిపురుషార్థంబు సేయు
టరయఁ దిర్యగ్జాతులయందు నార్యులు శూరులు శరణ్యులు ధర్మచరితులుఁ గల
రని పలికి. 368

—❀ శ్రీరాముఁడు మృతుం డైనజటాయువున కగ్నిసంస్కారాదు లొనర్చుట. ❀—

క. పితృపైతామహ మగుసం,తతరాజ్యము పుత్రమిత్ర|దారామాత్య
ప్రతతిం బాసి ఖగేంద్రుఁడు, హతుఁ డయ్యెను నాకుఁ బూని|యకట మహాజిన్.

క. ఆలితనంబునఁ బెక్కుల్, వేలేఁడులు బ్రతికి యధిక|విక్రమయుతుఁ డై
యాలమునఁ బొలిసె నితఁడుం, గాలము నెవ్వాండు గడిమిఁ | గడవఁగనోపున్.

వ. సౌమిత్రీ మనకు నిప్పక్షీంద్రుం డుపకారంబు సేయవచ్చి మృతిం బొందినఁ జూచి
సీత పోవుటకంటె దుఃఖం బొదవెడు మనకు నిప్పక్షీంద్రుండు దశరథునియట్ల
పూజ్యుండును మాననీయుండునుం గాన యగ్ని మథించి కాష్ఠభారంబులు దెమ్ము
చితిమీఁద జటాయువుం బెట్టి దహించెద నని పలికి. 371

చ. అనుజ మహీవదాన్యులకు | హాటకదానుల కాహవానివ
ర్తనులకు నాహితాగ్నులకు | ధర్మసమగ్రుల కాపదర్థస
జ్జనశరణార్థిపాలురకు | జానుగఁ గల్గెడుపుణ్యలోకముల్
ఘనుఁ డగునీఖగేంద్రునకుఁ | గావుత నాదుపరిగ్రహంబునన్. 372

వ. అని పలికి చితి పేర్చి యాచితిమీఁద జటాయువుం బెట్టి నాచేత సత్కృతుం
డయినపక్షీంద్రుం డితండు నాయనుజ్ఞ నుత్తమలోకంబులఁ బొందు ననుచుఁ బలికి
జటాయువునుదహించి లక్ష్మణసమేతుం డై వనంబున నొక్కహరిణిం జంపి తదీయ
మాంసంబునం బచ్చనికడిమిడిపట్టునం జటాయువుం దలంచి దర్భప్రాంతంబుగాఁ
బిండంబు వెట్టి విధ్యుక్తక్రమంబునఁ బ్రేతత్వనిర్గమనంబుఁ గలుగంజేసి మఱి
గోదావరి కేఁగి కృతస్నానుం డై యాపుణ్యనదీజలంబుల ధర్మోదకం బిచ్చిన

---

తే. రణ మొనర్చితి నాదుప♦రాక్రమమున, దానవుని రథరథ్యకే♦తనశకలము
లవనిఁ జేడ్పడి తొఱఁగి యు♦న్నవి నరేంద్ర, యవధరించెద వవియెల్ల ♦ నచటనచట.

సీ. తడవుగా ననిచేసి ♦ తలఁగిన నన్ను నా,రాక్షసుం డసిధారఁ ♦ బక్షయుగముఁ
గడువడి ఖండించి ♦ పడఁద్రోచి కొనిపోయె, భూమిజ నది బిందు♦నామధేయ
మగుముహూర్తము గాన ♦ యావేళఁ జే దప్పి, పోయినసొమ్ములు ♦ పోవు పాసి
తత్కర్తఁ జేరు నిం♦తయు నిక్కువము నీవు, శోకింపకుము సీత ♦ నీకుఁ జేరు
వాఁడు విశ్రవఃపుత్రుఁడు ♦ వైశ్రవణుని, యనుజుఁ డని చెప్పి మఱి చెప్ప ♦ నవశుఁ డగుచుఁ
బక్షివల్లభుఁ డుత్క్రాంత♦పవనుఁ డయిన, మనుజపతి శోకదందహ్య♦మానుఁ డగుచు.

క. మిత్రోత్తముఁ డీపుణ్యచ, రిత్రుండు పతత్రిపతి ధ♦రిత్రిజ కై మ

మహాపుణ్యుం డైనరామునిచేత సంస్కృతుం డగుటను రణనిహతుం డగుటను జటాయు వత్యంతపుణ్యలోకంబున కరిగె రామలక్ష్మణులు శోకవ్యాకుల చిత్తు లగుచు. 373

చ. అరుణుఁడు గ్రుంక నప్పుడు ని♦జాశ్రమవాసములోని కేఁగి య
య్యిరువురు నిద్ర లేక చట ♦ నెంతయు వందుచు నుండి యవ్విభా
వరిఁ దరియించి శూన్య మగు♦వాసముఁ బాసి మహీజ యున్నచో
టరయఁగఁ బశ్చిమాభిముఖు♦లై చని రాతతవేగ మారఁగన్. 374

వ. చని శరచాపహస్తు లయి ముందట నప్రతిహతమార్గంబున నడచి కిసలయకుసుమఫలలతాపరివృతంబును సింహవ్యాఘ్రాదిసత్త్వభీమంబును నతిదుర్గమంబును నైనమహారణ్యంబు గడచి జనస్థానంబునకుఁ ద్రిక్రోశమాత్రంబున నున్న క్రౌంచవతిఁ బ్రవేశించి వరపక్షిగణాన్వితంబును నానావర్ణపుష్పఫలశోభితంబును బహుపర్వతదుర్గమంబును నగునొక్కవనంబు గని యవ్వనంబున సీత నన్వేషించుచుఁ దమసానదిం గని. 375

తే. తత్సమీపావనీస్థలి ♦ దాశరథులు, ఘనులు గాంచి రయోముఖి ♦ యనునిశాటి
నూర్ధ్వకేశి లంబస్తని ♦ నుగ్రగంధిఁ, గుండకుక్షి ఘూకస్వర ♦ ఘోర నెదుర.

క. అగ్గలిక నానిశాచరి, దగ్గఱఁ జనుదెంచి రాము♦తమ్మునికరముఁ
దిగ్గనఁ బట్టి మనంబున, బెగ్గడిలక వికటదంష్ట్ర♦భీకర యగుచున్. 377

వ. సౌమిత్రి కిట్లనియె. 378

---

చ్ఛత్రుం దొడరి సుమిత్రా, పుత్ర వినుము దివికి నరుణ♦పుత్రుం డరిగెన్.

వ. ఇంక నేమి సేయువార మనుచు శోకాక్రాంతుం డయి పెక్కువిధంబులం బలవించి యమ్మహీకాంతుండు సౌమిత్రిం గనుంగొని.

క. మనజనకుం డాదశరథ, జననాథున కెట్టు లట్ల ♦ సద్విధిఁ బక్షిం
ద్రునకుఁ బితృమేధకార్యం, బొనరింపఁగ వలయు ననుచు ♦ నుల్లము దనరన్.

తే. అచ్చటను గాష్ఠసంచయ♦మనుజుఁ డొయ్యఁ, జేర్ప నన్నిటిఁ జితిగా నొ♦నర్పఁ బనిచి
యందుఁ బ్రజ్వలితాగ్నివి♦హంగనాథు, వినుతదేహంబు సంస్కార♦విధి యొనర్చి.

చ. అనవరతాత్మపుణ్యులకు ♦ నార్తశరణ్యులకుం బ్రశాంతవా
క్యనిరతభవ్యచిత్తులకు ♦ నాప్తనువృత్తుల కెట్టిభంగిఁ బూ
జ్యనియతభోగముల్ గలుగు ♦ నట్టిపదంబులు సౌఖ్యసిద్ధి యి
య్యనఘునకుఁ జటాయువున ♦ కయ్యెడు మంచు మదిం దలంచుచున్.

వ. గౌతమీగంగకు నరిగి యం దుదకకర్మం బాచరించి కృతకృత్యులై తదనంతరంబ.

ఉ. భానుకులావతంసములు ♦ పశ్చిమ మై యట యేఁగి యజ్జన
స్థాన మతిక్రమించి మఱి ♦ దక్షిణమార్గము కొంతదవ్వు వోఁ
గా నెదురన్ ధనుర్ధరులు ♦ గాంచిరి సింహతరక్షుసైరిభా
ఖ్యానమృగోగ్రసంగ్రహముఁ ♦ గ్రౌంచమహాగహనంబు ముందటన్.

ఆ. అర్థి నిన్నుఁ జూచి § నప్పుడ వలచితి, భార్యగా వరింపు § పరమపురుష
నీదురతికిఁ గోరు § నాదుపే రడిగెదే, విను మయోముఖి యని § వీరవర్య. 379

క. అనుటయు నతఁ డవ్వికృతా, ననఁ బాయం ద్రోచి కదిసి § నాసాకర్ణ
స్తనఖండన మొనరించెను, సునిశితకరవాలధారఁ § జులుకన నలుకన్. 380

తే. ఇట్లు వికృతాంగిగావించి § యిట్టులనియె, నోనిశాటి యీరొప్పుతో § నున్న నిన్నుఁ
గన్న నార్తిని దూలరే § కాముచేత, జేల నీ కింతవలవని § జాలి యేల. 381

క. ఈలీల సుమిత్రాసుతుఁ, డాలిగొనంగ నెత్తు రోడల § నంతటఁ గాఱం
దూలుచు సోలుచు వ్రాలుచు, నోలుచుఁ బాఱివసరుచును § నువ్వనఁ గూలెన్.

వ. తదనంతరంబ యాకాశపథం బెల్లం బగిలించునొక్క మహాశబ్దంబు విని యాశ
బ్దంబుచక్కటివనంబున కేతెంచి యమ్ముందట. 383

—❀ రామలక్ష్మణులు కబంధునిం గాంచుట. ❀—

మ. కని రారాజతనూజు లుత్సుకము § గ్రగ్రీవు నాభీలసం
హననుం దుంగమహీధరోన్నతు సము § ద్యద్బాహువక్షస్స్థలున్
ఘనభూరిస్వను నీలమేఘసదృశుం § గాలాంతకక్రూరు యో
జనదీర్ఘాయతబాహుయుగ్మకలితుం § జంఘోరగాభస్థితున్. 384

మహా. సతతాస్యక్ష్వానశీలుం § జటులకఠినదంష్ట్రాచయాభీలు నానా

---

క. ఆవనమధ్యంబునయం, దావీరులు తటమహోర్మి ♦ హస్తను సంస్తు
త్యావర్తనాభి ఫేనా, లీవిలసనఁ గనిరి నుతస ♦ లిలఁ దమసనదిన్.

తే. తదుపగోధవనీస్థలి ♦ దాశరథులు, ఘనులు గాంచి రయోముఖి ♦ యనునిశాటి
నూర్ధ్వకేశి లంబస్తని ♦ నుష్ట్రికంఠి, కుండకుక్షి ఘూకస్వన ♦ ఘోర నెదుర.

క. అగ్గలిక నానిశాచరి, దగ్గఱఁ జనుదెంచి రాము ♦ తమ్ముకరమ్మున్
దిగ్గనను బట్టి కటికిన, వుగ్గడువుగ వికటదంష్ట్రి ♦ లాగి మెఱవంగన్.

తే. అన్నిశాటి సౌమిత్రి కి ♦ ట్లనియె:నర్థి, నిన్నుఁ జూచి నే వలచితి ♦ నన్ను భార్య
గాఁ దలంపుము రతికేళిఁ ♦ గావు నాదు, పే రడిగితే నయోముఖి ♦ వీరవర్య.

క. అని పలికిన నవ్వికృతా, ననఁ బాయఁగఁ ద్రోచి కినిసి ♦ నాసాకర్ణ
స్తనఖండన మొనరించెను, సునిశితకరవాలధారఁ ♦ జులుక న్నలుకన్.

తే. ఇట్లు వికృతిగా నొనరించి ♦ యిట్టు లనియె, నోనిశాటి నీయొప్పున ♦ నున్న నిన్నుఁ
గన్నవా రార్తిఁ దూలరె ♦ కాముచేత, జేల నీ కింతవలవని ♦ జాలి యేల.

క. ఈలీల సుమిత్రాసుతుఁ, డాలిగొనంగ నెత్తు రోడల ♦ నంతటఁ గాఱన్
దూలుచు నంతన సోలుచు, వ్రాలుచు నోలుచును బాఱె ♦ వడి నాసురియున్.

క. ఆనృపసూనులు తమసను, స్నానం బొనరించి ప్రీతిఁ ♦ జనుదెంచిరి శా
ఖానూనతరువ్రజముల, చే నుగ్రాతపముఁ దమ్ముఁ ♦ జేరమిని నటన్.

క. మును భయముఁ బిదప విజయం, బును నగుశకునములు గాంచి ♦ భూపాలకులల్
వన మెల్లఁ గదలుఘనని, స్వన మాలించి యిది యేర ♦ వం బొకొ యనుచున్.

గతసత్త్వవ్రాతమాంసగ్రసనవివృతవక్త్రప్రచండప్రచారుం
దతఘోరస్కంధు భూతత్రసనకరబలోద్యన్మదాంధుం దరత్యూ
ద్ధతదంతివ్యాఘ్రసింహాహరణనిపుణబాహాతిబంధుం గబంధున్. 385

వ. అంత నారాఘవుల జంఘారహితకబంధుం డగునాకబంధుండు యోజనదీర్ఘంబు
లగుతనబాహువుల నిరువురం బొదివి సూర్యగ్రహణకరుం డగుగ్రహణగ్రహం
బునుంబోలె నాగ్రహం బొదవ నదల్చి వారి కి ట్లనియె. 386

సీ. అమ్ములు విండులు నడిదమ్ములునుదాల్చి, యెటువోయెదరు మీర లిపుడునాదు
ఘనదీర్ఘతరభుజార్గళయుగ్మమునఁ జిక్కి, పొలిసితి రిం కెందుఁ బోవవచ్చు
నని యంటఁ బట్టిన నారామచంద్రుండు, ధైర్యధుర్యుఁడు గాన దలఁకకుండె
నప్పుడు లక్ష్మణుం డతిదుఃఖితాత్ముఁడై, యవనీశ చిక్కితి మసురచేత
వీని కొకభంగి నను బలిగా నొనర్చి, నిన్ను విడుచుతెఱఁగు గోరి నిశ్చయింపు
మర్థి నిట్టైన బ్రదుకు దీవైన నదియ, యనువు దలఁప మహాపదయైనయెడల.

మ. అనినం దమ్మునిమాట దన్ను ఘనదుఃఖాక్రాంతుఁగాఁ జేయ న
జ్జననాథుండు మహార్తిఁ బొందుచు ననుఁ సౌమిత్రి యిబ్భంగి న
న్నును నిన్నుఁ దనుజాధముం డొకఁ డదీనుం డై నిరోధించె నె
వ్వని నెబ్భంగుల నెట్లు సేయ దిల దైవం బెప్పు డేపట్టునన్. 388

సీ. అనుచు శోకింపఁగ నసుర వారిఁ దిగిచి, ఘనతరనిజవక్త్రగహ్వరంబు
చేరఁగఁ దెచ్చుచో నారామచంద్రునిఁ, దప్పక కనుఁగొని తదనుజన్ముఁ
డి ట్లను నోరాఘవేశ్వర వీఁడు ని,రాయుధుఁ డని యవధ్యత్వబుద్ధిఁ
దెగ కున్కి నీయందుఁ దెల్ల మై తోఁచె నా, కతిపాపకర్ముఁ డీయధముఁ డేల
యీవిచారంబు వధియింపు మిపుడ యనుచుఁ
దెలిసి ఖడ్గంబు వెఱికి దైతేయుదీర్ఘ
కఠినభుజదండ ముగ్రవేగమున నఱికె
ననుజుఁ డట్టుల చేసెఁ దక్కినభుజంబు. 389

వ. చని ముందట.

శా. శిరముం గంఠము లేక వక్షమునఁ బ్రస్ఫీతాంబకంబుఁ నిజో
దరదేశంబున వక్త్రముం గలుగు నద్దైత్యాధముఁ శత్రుభీ
కరసారోగ్రు నుదగ్రవిగ్రహారయద్దుర్వ్యగ్రహగ్రస్తు ను
ద్ధురమోహాంధునిఁ గ్రౌర్యబంధునిఁ గబంధుం గాంచి రారాఘవుల్.

వ. అట్టియెడ శిరోవిరహితమహితకబంధుం డగునాకబంధుండు యోజనదీర్ఘంబు లగుతనబాహుల
నమ్మహానుభావుల నిరువురం బొదివి సూర్యగ్రహనిగ్రహకరం బగుగ్రహణగ్రహంబునుంబోలె నదల్చి
వారి కి ట్లనియె.

ఉ. ఇమ్మెయి బాహువుల్ దునిసి § యే పతి రక్తజలంబు పైపయిం
గ్రమ్మఁగఁ గూలె రోఁజుచును § మ్రాఁకులునుం బొదలుం బ్రపాతవే
గమ్మునఁ జాపకట్టువడఁ § గాఁ గులిశక్షతపక్షశైలరూ
పమ్మునఁగా వసుంధరఁ గ§బంధుకబంధము ఘోరభంగిగన్. 390

వ. [1]ఇట్లు కూలి దైత్యుం డొక్కింతవడికిఁ దెలివొంది మీ రెవ్వ రలఘుశౌర్యులార యన సుమిత్రాసుతుం డిట్లని చెప్పె. 391

క. కాకుత్స్థరాముఁ డీతఁడు, నా కగ్రజుఁ డేను లక్ష్మ§ణాఖ్యాకుఁడ మఱి
భూకాంతునిసతి జనశూ, న్యైకాటవి రాక్షసాప§హృత యై పోవన్. 392

ఉ. ఆరమణీలలామ నిట § నారయ వచ్చితి మీవు నిచ్చటం
బేరుర మాస్యమై వికృత§భీషణభంగి వెలుంగ భగ్నజం
ఘోరుముఖుండ వై వికృతి § నొంది కబంధమువోలెఁ గుత్సితా
కారత నున్నవాఁడ వధి§కప్రభ నెవ్వఁడ వీవు సెప్పుమా. 393

చ. అనవుడు నాతఁ డాత్మ ముద § మందుచు రాఘవులార మిమ్ము న
త్యనఘులఁ గంటి భాగ్యమున § ధన్యుఁడ నైతి మదీయశాపముం
జనియెడు మీప్రసాదమున § సమ్మతిఁ జూడుఁడు హేయ మైనయి
చ్చెనఁటిశరీరము౯ విడిచి § చెన్నగుమూర్తి వరింతు నాకమున్. 394

వ. అస్మద్విధంబు చెప్పెద వినుండు. 395

సీ. దను వనియెడునామ§మునఁ బ్రవర్తిల్లుదుఁ, గాంతిఁ జంద్రునిఁ బ్రభా§కరునిఁ దేజ
మునయందుఁ బాకశా§సను భోగమునఁ బోలు, నితఁ డనుకీర్తి వ§హింతు నజునిఁ
[2]దపమున మెప్పించి § ధరఁ జిరజీవిత,త్వము కామరూపంబు § వరము గాంచి
క్రౌర్యపరుండ నై § కడఁగి హింసారతి, నెలమితోడుత మించి § యెపుడు సమద
లీలఁ దిరుగుచు నుండుదు § స్థూలశిరుఁ డ
నంగ నొక్కఁడు దపము సే§యంగ నచటి
కిట్టివికృతాకృతిని దాల్చి § యేఁగి యతని
యెదురఁ దిరుగ నాసంయమి § యెఱిఁగి యలిగి. 396

క. ఈరూపము కడుఁ బ్రియపడి, గారవమునఁ దాల్చి వేడ్కఁ § గ్రాలెద విదె నీ

---

1 తే. ఇట్లు కూలినదైత్యుఁ డొ§క్కింతవడికిఁ, దెలివి నొంది మీ రెవ్వ ర§త్యలఘుశౌర్యు
లార యనఁ దమకథల న§ల్లనను దెలియ, నంతయును జెప్పె నాసుమి§త్రాత్మజుండు.
క. విని రామలక్ష్మణులఁ గని, జనవంద్యులు మీరు మీప్ర§సాదంబున మ
ద్ఘనదుఃఖ మెల్లఁ బాసెను, వినుఁ డస్మద్విధముఁ దెలియ § వినిపింతుఁ దగన్.
2. తపమున మెప్పించి § తత్కృపఁ జిరజీవి, కతయును దీరంబుఁ § గామరూప
కత్వము నేఁ గాంచి § క్రౌర్యపరుండ నై, హింస కాస్పదుఁడ నై § యెపుడు సమద
లీలఁ దిరుగుచు నొక్కచో § స్థూలశిరుఁడ,నంగ నొకముని తపము సే§యంగ నచటి

కోరిక సఫలతఁ బొందఁగ, నోరి దనుజ యింక నిట్ల యుండు మనుటయున్.
తే. తల్లడిల్లియే ముందటి తనువుఁ దాల్చి, యర్థి మ్రొక్కి ప్రార్థించిన నత్తపస్వి
కరుణ నిట్లను రామలక్ష్మణులు నీదు, కరయుగము ద్రుంపఁ దీఱు నీకల్మషంబు.
క. మఱి యారఘువీరులు నీ, ముఱుమొండెము వేగ దగ్ధముగఁ జేయఁగఁ జే
కుఱుఁ బూర్వాకారము నీ, కుఱవుగ శాపమున కవధి యును నప్పు డగున్.
సీ. అని యానతిచ్చె నమ్ముని యంత నీరూప, సహితుండ నై వేగ సమదవృత్తిఁ
జని యింద్రు సంగరమునకుఁ బిల్చిన వీఁకఁ, జనుదెంచి యతఁడు వజ్రమున వ్రేసెఁ
గంఠంబు శిరమును గాళ్లును బొట్టలో, పలఁ జొర నట్లేసి బలవిరోధి
మతిఁ గాంచి దీర్ఘజీవితుఁడుగా మును వరం, బబ్జగర్భుం డిచ్చె నట్లు గాన
బ్రదుక వెర వొనర్చెద నొకభంగి ననుచుఁ
గడుపునందు వక్త్రంబు వక్షమునఁ గన్ను
నొసఁగి యోజనబాహువు లెసఁగ నిచ్చె
నాఁటఁ గోలెను నిక్కానమున నుండి. 400
క. ఆమడలోపల మెలఁగిన, సామజభల్లూకసింహ సైరిభహరిణా
ద్యామిషమృగముల మనుజ, స్తోమంబులఁ బెనఁచి తినుచు దుర్దాంతగతిన్.
తే. ఎంతయునుగాల మిట్లుండ నిపుడు మీప్ర, సాదమున శాపమోక్షంబు సంభవించె
ననుచుఁ జెప్పిన రాముఁ డిట్లను దశాస్యు, నెఱుఁగకుండెడి నే యాతఁ డెఱుక ననుచు.
సీ. అనుజన్ముఁడును నేను నజ్జనస్థానంబుఁ, బాసి పోయినచోటఁ బంక్తిముఖుఁడు
మద్భార్య సద్గుణ మహిజ వంచనఁ గొని, పోయె వాఁ డట వానిపోక దక్క
నెక్కడ మనికియు నెఱుఁగము మీబోఁటి, వా రెల్ల నెఱుఁగరే వానివిధము
నెచ్చోట వసియించు నెమ్మెయిఁ జరియించు, నెట్లుండు నేభంగి నేము గందు
మఖిలమును జెప్పి మత్సంశయంబు వగయుఁ
జింతయుం బాపవే యార్తిఁ జెంది పొగులు
చున్నవారము దగుచుట్ట మొకఁడు లేమి
ననిన దనువు రాఘవున కిట్లనియెఁ బ్రీతి. 403
వ. స్థూలశిరుని శాపంబునం జేసి నాకుఁ దెలివియుం దొలంగినయది యీదుర్దేహం
బుం గాల్ప నొందుశరీరంబున నెఱుకయు నగు నప్పుడు హితంబు సెప్ప నగు
సూర్యాస్తమయంబునకు మున్న క్రన్నన నిమ్మేను దహింపుం డనిన నయ్యిన
వంశవర్యుం డనుజుండునుం దానును దెచ్చినదారుఖండంబుల నాతుండంబులం
బొదిగ వైచి తరుమథనానలంబు దరికొల్పిన దగ్ధుం డై యప్పుడు దివ్యవస్త్రమా
ల్యాభరణభూషితంబు లైన సర్వాంగంబులు శోభిల్ల నాకాశంబున దివ్యవిమా
నారూఢుం డై తనదివ్యతేజంబున దశదిశలు వెలింగించుచు దివ్యుం డైన కబం
ధుండు రామచంద్రున కిట్లనియె. 404

చ. శతమఖవైరి రావణుఁడు ♦ చండమదంబున మీఁగు లేనిచో
క్షితిసుత లీల నెత్తుకొని ♦ చెచ్చెర లంకకు నేఁగె నింక మీ
రతిబలుఁడైనశూరుని సహాయునిఁగాఁ గొని కాని వాని ను
ద్ధతిఁ బరిమార్ప లేరు వసుధాధవర మీకు హితంబుఁ జెప్పెదన్. 405

క. లలి వాలి వెడల నడిచిన, నలువురు మంత్రులును దాను ♦ నళినాప్తసుతుం
డలవడ నున్నాఁడు విని, శ్చలమతితో ఋశ్యమూకశైలాగ్రమునన్. 406

ఉ. ఆకపినాథుతోడఁ బ్రియ ♦ మారఁగ సఖ్యము సేయు మాతఁడ
స్తోకబలుండు విక్రమయుతుండు కృతజ్ఞుఁడుఁ గామరూపియౌ
నీకు సహాయుఁడై హితము ♦ నేర్పునఁ జేయఁ గలండు వానరా
నీకము లోలిఁ బెక్కులు గణింపఁగ నాతని కొప్ప భూవరా. 407

వ. ఆసుగ్రీవుండు దేశకాలజ్ఞుండు వాలివలనిభీతిం బోయి సకలదేశంబులుం జూచి నాఁడు గాన మహావీరులైనవానరుల నెల్లదిక్కులకుం బనిచి యెక్కడ నున్నను రావణుని సాధించి సీతను దెచ్చి నీకు సమర్పింపఁ గలం డని పలికి వెండియు. 408

శా. సుగ్రీవుండు ప్లవంగసైన్యములతో ♦ సొంపార నేతేరఁగా
నుగ్రోదగ్రత లంకపై నడచి వీరోత్సాహ మేపారఁ బం
క్తిగ్రీవుం బరిమార్చి రామనృపధాత్రీపుత్రిఁ దోకొంచు నీ
వగ్రియప్రియ మార నేఁగెద వయోధ్యారాజ్యముం జేయఁగన్. 409

వ. రామచంద్రా యాత్రోవం బశ్చిమదేశంబున బిల్వతాళ ప్రియాళురసాలప్లక్షన్యగ్రోధకింశుకాశ్వత్థకర్ణికారమధూకమంజులరోహితకకుభాదితరువులు విలసిల్లు నందు వలసినవృక్షంబులెక్కి ఫలంబులు రాల్చి యమృతకల్పంబులైనయాఫలంబులు భక్షించి యరిగి ముందట నున్నవిపినంబుల దేశంబులఁ జూచుచుం జారుకమలోత్పలంబుల మెఱసి విలసిల్లుచు హంసక్రౌంచసారసంబులు పలుకుస్వనంబుల నొప్పారుపంపాసరోవరంబున కరిగి యట విశ్రమించి సుగ్రీవునితోడ సఖ్యంబు సేయుండు కార్యసిద్ధి యయ్యెడు నేఁగుం డనుచుం బలికి రామునిచేత ననుజ్ఞాతుం డై తనదివ్యరూపంబుతోడ రెండవసూర్యుండునుంబోలె వెలుంగుచుం గబంధుండు నాకలోకంబున కరిగె నప్పుడు రామలక్ష్మణులు వెఱఁగందుచుం గబంధుండు చెప్పినజాడం బూర్వదిశాభిముఖులై యరుగుచు నక్షుద్రకల్పఫలవృక్షంబులు గలయొక్కశైలంబు గని యాశైలంబువెనుక రాత్రి వసియించి మఱునాఁడు దూరమార్గం బేఁగి విచిత్రవనశోభితం బగుపంపాతీరపశ్చిమదేశంబు సేరి నిల్చి బహుకుసుమఫలభరితతరువిలసితం బగుశబరియాశ్రమంబు గని యయ్యాశ్రమంబు సొచ్చి యేతేర నారామలక్ష్మణుల కెదురుగాఁ గృతాంజలి యై శబరి వచ్చి వినయంబు సేయునప్పుడు శబరిం జూచి రాముం డి ట్లనియె. 410

—❀ శ్రీరాముఁడు శబరిం గరుణించుట. ❀—

చ. ఉరుతరవిఘ్నముల్ దొడర నున్నతి నొందఁ దపంబు సేయుదే
గురువుల భక్తితోఁ గొలుతె కోపము మోహము లేక యుండుదే
యిరవుగ సంయమంబు విజితేంద్రియవృత్తియుఁ గల్గి సౌఖ్యముం
బొరయుదె పుణ్యసంయములు పోఁడిగ నీకడ కేఁగుదెంతురే. 411

క. అనవుడు సర్వము భద్రం, బని యాసతి నృపతితోడ ననియెఁ రఘునం
దన నీశుభదర్శనమునఁ, దనరఁ దపస్సిద్ధిఁ గంటి ధన్యత మంటిన్. 412

చ. జనవర చిత్రకూటమున సమ్మతి మీరు వసించి యుండఁగా
దినపసదృగ్విమానములఁ దేజము లార మహాత్ము లైనన
న్మును లిట కిచ్చ వచ్చినఁ బ్రమోదము లారఁగ నర్చ లిచ్చినన్
మానముల సంతసించి మఱి మచ్చిక ని ట్లని రాతపోధనుల్. 413

చ. ఘను లగురామలక్ష్మణులు గార్యముమై యిట కేఁగుదెంతు రే
పునఁ జన నానృపాలురకుఁ బూజ లొనర్చి సమగ్రపుణ్యు వై
యనిమిషలోక మేఁగె దని యాదర మారఁగ నాకుఁ జెప్పి యిం
పెనయఁగ వారు నాకమున కేఁగిరి రామనృపాలశేఖరా. 414

చ. వివిధము లైనవన్యములు వేడుక నే నొనఁగూర్చి మిమ్ముఁ బ్రా
భవమునఁ బూజసేయఁగను బ్రార్థనసేసెద మీరు దీని గా
రవమున స్వీకరింపుఁ డన రాఘవుఁ డారమణీయవన్యముల్
ప్రవిమలబుద్ధిఁ జేకొని తపస్విని కారఘురాముఁ డి ట్లనున్. 415

క. దనుసుతుఁడు నీప్రభావము, మును నాకుం జెప్ప నిపుడు మోదముతోడం
గనుఁగొంటి ననుడు నాసతి, మన మలరఁగ విభునితోడ మఱి యి ట్లనియెన్.

వ. అనఘ యివ్వనంబు మతంగవనం బనంబడు నీపుణ్యస్థానంబునం బులులు మృగం
బులుం గలసియుండు నేప్రాణులకు నైన నన్యోన్యవైరంబులు లే వమ్మునులసా
మర్థ్యంబున నీయాశ్రమంబున దేవతావిరచితవేది యున్నది యావేది నొక్కగృ
హంబు నిర్మించుకొని కడుం బురాతనకాలంబున. 417

క. ఎలమి మును హోమవేళం, బొలుపుగ మద్గురులు మంత్రపూతంబులుగా
జ్వలనుని నర్చించినపువ్వులు వాడవు దర్భ లెండవుం దగ నుండున్. 418

మ. జననాథాగ్రణి యామహాత్ము లుపవాసశ్రాంతిమైఁ దీర్థముల్
సన లే కేడుపయోధులం దలఁప నాసప్తాబ్ధులుం జేరఁ జ
య్యన నేతెంచినఁ దారు గ్రుంకు లిడి యుద్యద్వల్కలంబుల్ దివం
బునకుం బోవుచుఁ బెట్టి పోయి రిలపైఁ బొల్పారెడుం జూడవే. 419

వ. అని మఱియుం దమగురువులసామర్థ్యంబులు పెక్కులు సెప్పి యే నమ్మునీశ్వరుల
పరిచారిణిం గాన వారికి శుశ్రూషసేయ వార లున్నపుణ్యస్థానంబున నీకలేబ

రంబు విడిచి పోవం గోరెద ననుజ్ఞ యిండని యారామలక్ష్మణులచేత ననుజ్ఞాతయై తన్ను నగ్నిదేవునికి నాహుతి సేసి దివ్యమూర్తి వెలుంగుచుం దమగురువులున్న స్వర్గలోకంబునకు నాశబరి సనిన రామలక్ష్మణు లాశ్చర్యంబుం బొంది యాశబరిస్థానంబును గడచి పంపాభిముఖులై యేఁగుచు నాతపస్వులసామర్థ్యంబు దలంచి రాముండు లక్ష్మణునితోడ ని ట్లనియె నియ్యాశ్రమంబునకు సప్తసముద్రతీర్థంబులం దెచ్చి యధికతపంబులు సలిపి రమ్మహాత్మును లిట్టిపుణ్యస్థానంబు సేరి పితృసంతర్పణంబులు సేసి కృతార్థుల మైతిమి వర్షశతంబులైన నుండ నర్హంబైనపుణ్యస్థానం బిది యైన మనము గార్యాసక్తులము గాన ఋశ్యమూకాచలంబున కేఁగి రవిసుతునకు హితం బాచరించి సీత వెదకంగం బోవలయు ననుచు నయ్యాశ్రమంబు గడచి యేతెంచి ముందట. 420

—•• పంపాసరోవరవర్ణనము. ••—

సీ. కూలచంపకనారి కేలసాలరసాల, తాలహింతాలతక్కోలతరులు
తీరభూజారూఢ హారీతటిట్టిభ, కీరకోకిలకాక కేకికులము
సారసకలహంస చక్రబకక్రౌంచ, కారండవాలాపకలకలంబు
కైరవేందీవర కల్హారకువలయ, పుండరీకాంభోజపుష్పతతులు
నింగి కుప్పొంగురంగత్తరంగసంచ,యములు నిందిందిరలసిత విమలవారి
మత్స్యకచ్ఛపోరగశింశుమారచటుల, జలచరమ్ముల కలఁకువల్ గలుగుదాని.
మ. ప్రవిలాసాంచితసద్గభీరవిమలాంభఃపూరసంసేవ్యమా
నవిహంగోత్కరసమ్మదావహమహాసక్రక్రిశ్రితాభ్యంతరా
నవిశేషోర్మితరంగసంకులజనశ్లాఘ్యప్రభావా సరః
ప్రవరంబుం గని రాన్నృపాత్మజులు పంపం బెంపు సొంపారఁగన్. 422
వ. కని యచ్చెరు వందుచుం జేర నరుగునప్పుడు. 423

—✤ పంపాతీరంబున రాముండు విరహవేదనచే విలపించుట. ✤—

క. [1]సరసిజకువలయపరికర, పరిమళపరిమిళితశిశిరపావనరంగ
త్తరళతరంగాంబుకణో, త్కరధరమలయానిలంబు దనపైఁ బొలయన్. 424
సీ. సౌమిత్రి నామీఁద సారెసారెకు నవ్య,కుసుమముల్ గురిసెడుఁ గుజము లోలి
నవచూతవల్లిక న న్నదె సన్నలు, సేయుచున్నది లీలఁ జిగురుఁగేల
మధురస్వరంబుల మదకోకిలంబులు, సేరెడుఁ బలుమాఱుఁ జెలఁగి చెలఁగి
కరి కరేణువుఁ జేరి కరమునఁ బుడికెడు, హరిణంబు ననియెడు హరిణివెంట

1 సీ. ఆసగోవరమునం దాన్నృపాలాత్మజు, లతిశయస్నానపానాదివిధులు
ప్రియమునఁ జలిపి సంప్రీతాంతరంగులై, తత్సమీపోన్నతతరుచయంబు
శీతలచ్ఛాయ నాసీనులై కొండొక, యలసట దీఱంగ నచట నిలిచి
సౌఖ్యంబు నొందిరి సత్సేవ్యమైనయీ, యారణ్యకాండంబు నర్థితోడ

నల్లవలిగాలి యుల్లంబు ♦ దల్లడిల్ల, బహువనప్రసవోదిత ♦ పరిమళంబు
లలమి తెచ్చి పైఁబొలసెడు ♦ నళులుగలయ, మధురగీతము వాడెడు ♦ మనముగలఁగ.

చ. ఘనతరశైలసానువులఁ ♦ గాంతయుఁ దానును గూడి వేడ్కతోఁ
జన రతిలీలఁ బొందుచు వె♦సనం బురి విచ్చి మయూర మోలి న
ర్తన మొనరించుచున్నది ము♦దంబున నావరపత్త్రికై వడిం
దనప్రియఁ గొంచు రక్కసుఁ డు♦దగ్రతఁ బోవక యుండఁగాఁ జుమీ. 426

క. సౌమిత్త్రి కనుఁగొంటివె, ప్రేమంబున నలినిఁ గూడి ♦ పెంపొంది సుఖో
ద్దామత నున్నది మధుపము, గామిని వెసఁ గవసి యున్న ♦ కాముకుభంగిన్.

క. వినుతింప సుఖులలోపల, ఘనతరసుఖ చక్రవాక ♦ ఖగ మొక్కెడ వే
చనఁ దొడఁగె నీడకై వడిఁ, జనఁ బ్రియ వెనువెంటఁ దాను ♦ సమ్మతి గనుటన్.

క. భూనాథపుత్త్ర పర్వత,సానువులం బ్రియలతోడి ♦ సంగతి మృగముల్
మానసము లలర నున్నవి, యేనైన మహీజఁ బాసి ♦ యిట్లున్నాఁడన్. 429

ఉ. ప్రేయసిఁ బాసి యేగతిఁ జ♦రింతు సరిద్వనభూమిఁ దెమ్మెరల్
డాయఁగ వేఁడివెన్నెలలు ♦ డంబుగఁ గాయఁగఁ దావితూపులం
గాయముఁ జేయఁగా నళులు ♦ గన్కని మ్రోయఁగ గండుఁగోయిలల్
గూయఁగఁ బుప్పవార మతి♦ఘోరత మానము నీఱుసేయఁగన్. 430

వ. అని పలికి తమకం బెసంగ. 431

క. మంగళపవనము నాదుప్రి, యాంగనపైఁ బొలసి పొలయు ♦ మాదట నాపై
నంగం బలఁపక పంపా, సంగతరంగత్తరంగ ♦ శైత్యము లొలయన్. 432

వ. అని సీతావియోగభరంబునఁ దాపంబు దీపింపఁ బెక్కుదెఱంగులం బ్రలాపించు
చున్న రామచంద్రు నూరార్చి మనము సుగ్రీవుతోడం జెలిమి సేయవలయు ఋ
శ్యమూకంబునకుఁ బొదం డని లక్ష్మణుండు పలికిన నగుం గాక యనుచు ననుజస
మేతుం డై పంపానది యుత్తరించి యవ్వలికూలంబున నిల్చి యగ్రభాగంబున.

ఉ. రాకొమరుల్ గనుంగొనిరి ♦ రమ్యగుహాగతకిన్నరీకముఁ
స్వీకృతనాకసింధుజల♦సేకము సంకులదంతిదంతిభి
ద్భీకరపుండరీకమును ♦ దీపితసంయమివేదనాదజ
ల్పాకము సిద్ధసేవితత♦పఃపరిపాకము ఋశ్యమూకమున్. 434

వ. ఇట్లు కనుంగొని యన్నరవరోత్తములు సంతోషితస్వాంతులై విశ్రమించియుండి
రంత. 435

శా. వైరిక్ష్మాతలనాథపర్వతమహా♦వజ్రాయుధుఁ ఘోరదు
ర్వారాంహఃప్రథితారిదుస్సహతమి♦స్రప్రస్ఫురద్భాను గం

---

వినినఁ జదివిన వ్రాసిన ♦ విస్తరించి, చెప్పినను వారలకు సౌఖ్య♦సిద్ధి యగును
సంపదాయురారోగ్యముల్ ♦ సంభవించు, నఖిలపుణ్యంబు లెప్పుడు ♦ ననుభవింత్రు.

క్షీరాంభోనిధి ధీరతానిమిషభూభృన్నాథు నత్యంతవి
స్తారోదారగుణప్రసిద్ధినవరాధాపుత్రు సన్మిత్రునిన్. 436

క. లలనాజనవరభద్రుని, బలవద్రణరౌద్రవీరభద్రుని నుద్య
త్సలభతరగుణోన్నిద్రుని, బలవిలసితవినుతరామభద్రునిఁ బ్రీతిన్. 437

మాలి. విభవజితసురేంద్రున్ విస్ఫురత్కాంతిచంద్రున్
శుభతరవరగాత్రున్ సూరిసంస్తోత్రపాత్రున్
బ్రభుజననివహోద్యున్ బ్రాజ్ఞవిద్యానవద్యున్
సభయరిపుశరణ్యున్ సంభృతాగణ్యపుణ్యున్. 438

గద్యము. ఇది సకలసుకవిజనవినుత యశస్కర భాస్కరప్రణీతం బైన శ్రీరామాయ
ణంబునం దారణ్యకాండంబు సర్వంబును ద్వితీయాశ్వాసము. 439



శ్రీ ర స్తు.

# భాస్కర రామాయణము.

## కిష్కింధా కాండము.



రమణీప్రియరమణీ
శ్రీరమ్యోరుకుచకుంభసేవాలోల
స్ఫారదృగాశయనేత్రాం
భోగుహాపూజాప్రహృష్ట పురుషవిశిష్టా. 1

చ. ఘను లగురామలక్ష్మణులఁ గార్ముకబాణకృపాణపాణులన్
సునిశితవిక్రమక్రముల సూర్యతనూజుఁడు చూచి భీతుఁడై
మనము గలంగఁబాఱి ధృతి మాయఁగ నచ్చట నుండ నోడి యే
చినపెనువంతతోడఁ దనుఁ జేరినమంత్రులఁ జూచి యిట్లనున్. 2

తే. ఘోరశస్త్రాస్త్రపాణు లై వీర లున్న, వారు కపటంపుఋషివేషధారు లగుచు
వాలిపంపున వచ్చి యీవనమునందు, వలసినట్లు క్రుమ్మరుచున్నవార లనిన.

వ. ఆసుగ్రీవుమంత్రులగువానరవీరులు నారామలక్ష్మణులం జూచి యధికభయంబున
జిత్తంబులు గలంగి. 4

క. తరువులు నఱుముగఁ బుష్పో,త్కరములు రాలంగ ధరణిధరశిశిరంబుల్
చరణప్రహతుల విఱుగఁగఁ, గరిశార్దూలాదిమృగనికాయము బెదరన్. 5

క. గిరిగిరిశిఖరంబులకును, దరుతరుశాఖలకు దావదావంబులకుం
బొరిఁబొరి దాఁటులు వైచుచుఁ, ద్వరితగతిం బాఱి రన్యవననగములకున్. 6

వ. ఇట్లు కలంగి తొలంగినసుగ్రీవసచివులు హనుమంతుం బురస్కరించికొని యొ
క్కడ నొనరించి యున్నసుగ్రీవుపాలి కేతెంచి ప్రాంజలులై యుండ నప్పుడు హన
మంతుం డినతనయు నుపలక్షించి నీ వెవ్వరిం జూచి వాలి పంపినవా రనుభయం
బునఁ దొలఁగ నేతెంచి యున్నవాఁడ విచ్చట. 7

ఉ. వాలి యధీశుఁడై పనుప వచ్చినవారలు గారు వార లా
వాలియుఁ గిల్బిషం బిపుడు వావిరిఁ జేయఁడు మర్కటత్వముం
బోలఁగ నీవు దాల్చుటకుఁ బూర్ణవివేకము లేక బేల వై
యేల మనంబునన్ బెగడె దింగితబుద్ధిఁ దలంచి చూడుమా. 8

క. బుద్ధిం గార్యము దలఁపని, బుద్ధివిహీనులను భూతభయములె శాసించున్
సిద్ధింప దారయ నసద్బుద్ధులకును రాచకార్యభూతులు గలుగన్. 9

మ. అని పల్కెన్ హనుమంతుతో ననునయంబారంగ సుగ్రీవుఁ డి
ట్లను బాణాసనబాణతూణయుతబాహాహోత్యుగ్రులున్ దీర్ఘులో
చనులున్ దేవసుతోపమానులును నై చండప్రభన్ వాలునా
ఘనులం జూచిన నేరికిన్ భయము సంక్రాంతంబు గాకుండునే. 10

ఉ. వారలు వాలిపంపునన వచ్చినవా రనుశంక నామదిన్
వారక నాటి యున్నయది వాలియు నాయెడఁ గ్రించురాజు లే
పార ననేకమార్గముల నప్రియులం దెగఁజూతు రేర్పడన్
వారి నెఱుంగఁగా వలయు నచ్చున నమ్మఁగ నెందు రాజులన్. 11

వ. మఱియుఁ బ్రచ్ఛన్నవేషధారు లగువారలం జారులవలన నెఱుంగ వలయు. 12

క. నమ్మఁ జన దెదిరిఁ దమ్మును, నమ్మినవారి మదిలోన నమ్మక పరుపైఁ
గ్రమ్మఱఁ ద ప్పిడి చెఱుతురు, నమ్మ న్నేవారి నిపుడు నాహిత మారన్. 13

చ. అనిలతనూజ నీవు ప్రియ మారఁగ వారలఁ జేరి వార లీ
వనమున కేమికారణము వచ్చిరొ యేటికి నస్త్రశస్త్రముల్
తనరఁగఁ బూనినారొ రణదర్పమునం జనుదెంచినారొ నే
ర్పునఁ బరికింపు రూపములఁ బోలఁగ మాటల సత్త్వదృష్టులన్. 14

క. వారలు సన్మను లైనం, గోరిక విశ్వాసపఱిచి కూడి ప్రశంసల్
సారెకుఁ జేయుచు సామం, బారఁగఁ గావింపు మనకు నభిమత మొందన్. 15

క. అని పలుకఁగ నగుఁ గా కని, హనుమంతుఁడు భిక్షుకత్వ మలవడఁగాఁ గై
కొని రామలక్ష్మణులకడ, కనుపమతరబుద్ధి నేఁగి యారాఘవులన్. 16

వ. ప్రియోక్తుల నగ్గించుచు హనుమంతుండు వారల కిట్లనియె. 17

మ. ఉరుమత్తద్విపవీర్యు లార్యగుణు లింద్రోపేంద్రతుల్యుల్ ప్రభా
కరతేజస్కు లుదారధీరులు శుభాకారుల్ బహుశ్రీయుతుల్
హరిసంచారులు భూరివక్షులు విశాలాక్షుల్ నిలింపేంద్రభా
స్వరచాపాంచితచాపసంయుతభుజుల్ శస్త్రాస్త్రవిద్యావిదుల్. 18

శా. మీ రీకాననమృగంబులం గపులఁ బేర్మిన్ భీతిఁ బొందించుచుం
దీరోపాంతతరుప్రతానముల నర్థిం జూచుచున్ వేడ్కతో
నీరమ్యాపగచెంత నొప్పెదరు మీ రేపారు తేజంబునన్
గారా మారఁగ నిన్నగేంద్రము వెలుంగం జేయు చున్నా రొగిన్. 19

క. సింహప్రేక్షణు లాతత, సింహపరాక్రములు భూరిసింహస్కంధుల్
సింహసమానబలాఢ్యులు, సింహకృశోదరులు పురుషసింహులు మీరల్. 20

క. కీలితకనకజ్వాలలఁ, గ్రాలెడి మీ కేల ముక్తకంచుకకీలా

జాలకరాళజనాంతక, కాలవ్యాళములువోలెఁ గరవాలంబుల్. 21

క. నరమునివేషము లొందిన, నరనారాయణులపగిది నాకాగతని
ర్జరవరవహ్నులసరణిని, ధరణిం జరియించుచంద్రతరణులకరణిన్. 22

వ. నెరయ మెఱయుచుం బరస్పరసమానరూపయౌవనగుణలక్షణవిక్రమక్రమవి
శేషంబులఁ బరఁగుచున్నా రని పలికి మఱియును. 23

మ. పరిఘాత్యాయతబాహు లశ్వినిసరూపప్రాప్తు లుగ్రప్రభా
భరితుల్ పార్థివలక్షణాకలితులై భాసిల్లుచున్నారు మీ
రరయన్ వార్ధిపరీతభూభువనరాజ్యం బొంద నర్హుల్ జటా
భరకృష్ణాజినవల్కలంబులు ధరింపం గారణం బేమొకో. 24

శా. సుగ్రీవుం డనువానరేంద్రుఁడు రణోత్కృష్టోన్నతిం దన్ను న
త్యుగ్రప్రక్రియ వాలి ద్రోలినఁ గడున్ దూరస్థుఁడై ఋశ్యమూ
కగ్రావంబున నుండి మీకడకు సఖ్యం బొప్పఁ గావింప బు
ద్ధిగ్రాహిత్వముతోడఁ జెల్మికిని బుత్తేరంగ నే వచ్చితిన్. 25

క. తపనతనూజునిసచివుఁడఁ, గపిమూర్తిని గామరూపిఁ గామగముఁడఁ గా
డ్పుతనయుఁడ హనుమంతుఁడఁ, గపటపుభిక్షుకుఁడ దూతకార్యమ్మునకున్.

వ. మీపాలికి నేతెంచి మీ రేరాజసుతులరో యే మహానుభావులరో యీపంపాతీర
దుర్గమారణ్యంబున కరుగుదెంచినకారణం బేమియో యని హనుమంతుండు
పలికిన రామచంద్రుండు మందస్మితవదనారవిందుం డై సుమిత్రానందనుతోడ
మనవచ్చినవృత్తాంతం బెఱింగింపు మనిన సౌమిత్రి యావాయుపుత్రుంగనుంగొని.

సీ. దశరథుం డనుపేరిధరణిపాలాగ్రణి, కగ్రపుత్రుండు నాకగ్రజుండు
సర్వభూతహితుండు జనతాశరణ్యుండు, విక్రమక్రమశాలి విజయశీలి
రాముఁ డీసుగుణాభిరాముండు జనకుని, సత్యంబు నెఱప రాజ్యంబు విడిచి
తనపత్నియును దాను వనమున కేతేర, రక్కసుం డొక్కఁ డీరాజుదేవి
విపులపుణ్య సీతఁ గపటియై కొనిపోయె, నేము లేనిచోట నేము వానిఁ
గాన నెల్లదిశలుఁ గలయంగ వెదకుచుఁ, దిరిగితిరిగి యొక్కసరణి రాఁగ. 28

క. మునిశాపంబున రాక్షసతను వొందినదనుసుతుండు దనువు మహీనం
దనసుద్ది మీకుఁ జెప్పెడి, నినజుం డని మాకుఁ జెప్పి యేఁగెన్ దివికిన్. 29

క. కావున సుగ్రీవునిచే, నీవసుధేశుసతివార్త యెఱుఁగంగ సుహృ .
ద్భావంబును భానుజుతోఁ, గావింపఁగ నిటకు రాక కపికులవర్యా. 30

వ. అని మఱియు నిట్లనియె. 31

ప్రజలు ప్రసాదంబుఁ బడయఁగోరెడుభర్త, తరుచరేంద్రునిప్రసాదంబునొంద

సీ. సకలలోకులకును శరణదుం డగురాజు, కర మర్థి సుగ్రీవు శరణు సొరఁగ
నరనాథుఁ డగులోకనాథుండు ప్లవగనాథుం డిచ్చఁ దనకు నాథుండుగాఁగ

నఖిలలోకసహాయుఁ డై యుండుపుణ్యుఁడు, కపివరుసాహాయ్యకంబు వేఁడ
రాజు లెల్లను సేవించు రాజగురుఁడు, వానరేంద్రుని సేవింప వచ్చినాఁడు
రామచంద్రుని కిట్టిదుర్దశలు వచ్చెఁ, జాగుచారిత్ర యగుసీత కారణమున. 32

క. ఏ లక్ష్మణుఁడను రామమ,హీలలనుం డన్న గాన యీవిభువెనుకం
బోలఁ దపోవేషము నేఁ, దాలిచి వచ్చితి నభీష్టతను గానలకున్. 33

తే. ధైర్యనిధియయ్యుఁదనపత్నిఁ దలఁచితలఁచి, రామచంద్రుఁడుశోకవారాశిచంద్రుఁ
డగుచు నధికదైన్యంబుతో నాననంబు, విన్న నై యుండ నిచ్చట నున్నవాఁడు.

—శ్రీరామసుగ్రీవులకు హనుమంతుండు సఖ్యంబుచేయుట.—

వ. అనుచు బాష్పాకులలోచనుం డగుచున్నలక్ష్మణుం గనుంగొని హనుమంతుం డూ
రార్చుచు నతని కిట్లనియె. 35

శా. ఆలం బుద్ధతిఁ జేసి చేవ చెడి ధైర్యం బేది యవ్వాలిచే
నాలిం గోల్పడి వీడు వోవిడిచి రాజ్యభ్రష్టుఁ డై సంచిత
శ్రీ లెల్లం జెడి కానలో మఱుఁగుచుం జేడ్పాటుతో నుండుటం
జాలం బోలఁగ మీకు నర్కజునకుం సఖ్యంబు వే కల్గెడున్. 36

క. మీరును సుగ్రీవుండును, గారవమునఁ బొత్తు సేసి కపిసేనలతో
నారవిజుఁడు దోడ్పడఁగ ను,దారత సాధింపఁ గలరు ధారుణి యెల్లన్. 37

వ. అనవుడు సౌమిత్రి ముదం బంది రామచంద్రుం గనుంగొని. 38

క. చన నామాటల కలరుచు, ననురక్తిం జిత్తగించి యభిముఖుఁ డై యీ
హనుమంతుఁడు వినుచుండుట, నినజునకుఁ మనకు మైత్రి యిప్పుడ కల్గున్. 39

వ. అనిన రఘువరుండు హనుమంతుని సంభావించి యతని కిట్లనియె. 40

క. ఉగ్రాంశుకులీనుల మే, ముగ్రాంశుసుతుండు దాను నుచితం బరయన్
సుగ్రీవునకును మాకును, సగ్రియసఖ్యంబు సేయ నర్హము గాదే. 41

వ. అని పలుకుచుండ హనుమంతుండు ముదం బంది కృతకార్యసిద్ధు లయిరి రాఘవు లనుచు నారామలక్ష్మణుల సముచితసంభాషణంబులం దేల్చి వారలం దోడ్కొని ఋశ్యమూకంబు గడచి మలయాద్రి కరిగి యచ్చట రాఘవుల నునిచి సుగ్రీవునిసన్నిధి కేఁగి సుగ్రీవా నీతోడిసఖ్యంబునకు రామలక్ష్మణులం దోడ్కొని వచ్చితిఁ గృతార్థుండ వయితి వాఁరామచంద్రుండు ధర్మజ్ఞుండును గృతజ్ఞుండును సత్యసంధుండును బితృవాక్యపరిపాలకుండు నధికబలపరాక్రముండు నాశ్రితవత్సలుండును గావున నీమనోరథంబు సఫలంబు సేయ సమర్థుండు జనకాజ్ఞ నడవి కేతెంచి తనపత్ని రాక్షసాపహృత యైననిమిత్తంబున నిన్నుం గాన నేతెంచె నీవు నమ్మహానుభావుని నభివందనపూర్వకంబుగా సంభావింప నర్హుండ వనిన హనుమంతువాక్యంబులకు సంతోషించి సుగ్రీవుండు వాలివలనిభీతి వాడినపుష్పదామబునుంబోలె విడిచి హనుమంతునితోఁ గూడ నధికసమ్మదంబున నేతెంచి. 42

క. మర్కటకులవల్లభుఁ డగు, నర్కతనూభవుఁడు వచ్చి యనురక్తి సమి
త్కర్కశభుజవిక్రమనం, పర్కుని రాముఁ గని మ్రొక్కి ప్రాంజలి యగుచున్.
చ. జనవర నీదుధర్మజయసత్యపరాక్రమశక్తు లొప్పఁగా
ననిలసుతుండు సెప్పె నవి యట్టివ నీశుభదర్శనంబు నా
కనుపమరాజ్యభూతికర మయ్యెడు వానరకోటితోడ నా
మనమున నీకు నాకుఁ దగ మైత్రి యొనర్పఁగ బుద్ధి పుట్టెడున్. 44
క. మనమున నమ్మిక పుట్టఁగ, జనవర చేసాఁపు మనుడు జనపతి యగుఁ గా
కని యితరేతరమస్తక, మనుకూలతఁ బట్టి చేసి రాలింగనముల్. 45
చ. అనిలసుతుండు కాష్ఠయుగ మప్పుడు గూర్చి మథించి యగ్నిసం
జనితము గాఁగ నర్చు లిడి చాలఁ బ్రవృద్ధము చేసి ముందటం
దనరఁగ దెచ్చి పెట్టినఁ బ్రదక్షిణముల్ సని వచ్చి నమ్మ న
య్యనలము సాక్షి గాఁగ మన మారఁగ సఖ్యము సేసి రిద్దఱున్. 46
వ. ఇట్లగ్నిసాక్షికంబుగా సఖ్యంబు సేసి యధికానందంబులం దనియ నన్యోన్య
ముఖావలోకనంబులు సేయుచుండి రప్పు డర్కజుం డర్కవంశజు నాలోకించి.
క. కాకుత్స్థ యింక వగవకు, నీకడకుఁ వేగ దెత్తు నీసతి దివిష
ల్లోకమున నున్నఁ బన్నగ,లోకంబున నున్న నబ్ధిలోపల నున్నన్. 48
వ. అని పలికి మఱియు రామచంద్రు నవలోకించి. 49
ఉ. రావణునంకమధ్యమున రౌద్రభుజంగికతిఁ వెలుంగుచుఁ
వావిరి బొమ్మముల్ దొరఁగ వారక గోడ్చుచు రామరామ గాఁ
బోవుచు నున్నదాన గుణభూషణ లక్ష్మణ నీవు వేగ న
న్గావఁ గదయ్య యంచు నధికవ్యథఁ జీగుచు భీతి నేఁగుచున్. 50
వ. ఆసమయంబున. 51
మ. ఘనశైలస్థలి నేను నల్వురుకపుల్ గాంచుఁ వినోదింపఁగా
జనకాధీశతనూజ మమ్ముఁ గని లజ్జన్ నమ్రవక్త్రాబ్జయై
తనయాకల్పము లుత్తరీయమునఁ బొందం గట్టి మాముందటం
గనుపట్టన్ దిగవైచుచుం జనియె శోకధ్యానముల్ సేయుచున్. 52

—※ సుగ్రీవుండు దెచ్చి యిచ్చినభూషణోత్తరీయంబులం గని రాముండు వగచుట. ※—

క. జనవర యాసతితొడవులు, తెనరఁగ నే డాఁచినాఁడఁ దద్భూషలు దె
మ్మని యానతిచ్చినఁ వెసఁ, గొనివచ్చెద ననిన వేగ గొని రమ్మనుడున్. 53
క. దినకరతనయుఁడు రయమునఁ, జని గిరిగుహఁ జొచ్చి యందు జతనంబుగ డాఁ
చినభూషణములు ప్రమదం,బునఁ గొనివచ్చి రఘువిభుని ముందటఁ బెట్టెన్.
క. ఉల్లము జల్లన ముఖమునఁ, బెల్లుగ బొమ్మములు దొరఁగఁ బ్రేమంబున హా
వల్లభరో యనుచును మది, పల్లటిలన్ రాముఁ డుర్విఁ బడి మూర్ఛిల్లెన్. 55

వ. ఇట్లు మూర్ఛిల్లి యల్లన దెప్పిఱిలి యాభూషణంబుల నుత్తరీయంబును బోలం గనుంగొని. 56

సీ. మాసియున్నవి యిట్లు మండనంబులు నేఁడు, కాంతమైచాయతోఁ గలయ లేక
మణిహార మంగన మధురోష్ఠరుచిఁ బాసి, యురురాగహీనమై యున్నదిపుడు
భాసురహారముల్ ప్రభ దప్పి యున్నవి, ముదితముఖజ్యోత్స్న యొదవకునికిఁ
బ్రియ నెమ్మిఁ బదములఁ బెట్టక యున్న నో,ళ్లడఁగి యున్నవి నేల హంసకమ్ము
లనుచు రాముఁడు ప్రేమతో నావిభూష
ణములు పలుమాఱు వీక్షించు నానఁ దూలి
కేల నకున నిడుకొని సోలు సొగయు
బాష్పములు నించు శోకించుఁ బలవరించు. 57

వ. మఱియు నాయుత్తరీయంబుం గనుంగొని. 58

సీ. ఘనరతిశ్రమజాతఘర్మాంబు లార్పంగ, నతివకు వీవన యగుదు గాదె
ప్రణయకోపానన నక్ బాసి తా నున్నచో, నంబుజాస్యకుఁ దల్ప మగుదుగాదె
కనుఁబాటు గాకుండ వనితచన్దోయికి, నంచిత ప్రతిసీర యగుదు గాదె
తరుణికిఁ బేరెండ తాఁక కుండంగ సి,తాతపవారణ మగుదు గాదె
యట్టియవనిజఁ బాసి నీ వకట దూర, మెట్లు వచ్చితి నాకడ కెలమి మిగుల
ననుచు నయ్యుత్తరీయంబు నల్లఁ దిగిచి, కప్పుకొని బాష్పధారలు గ్రమ్మవగచి.

వ. తనపార్శ్వంబున నిరంతరధారాళబాష్పధారామగ్నుం డగుచు శోకించుచున్నల క్ష్మణుం గనుంగొని. 60

చ. జనకజమేన నేమమున జానుగ నుండెడునుత్తరీయము
న్వినుతవిభూషణంబులును నిర్మలకాంతులుఁ జాల లేక నేఁ
డనుజుఁడ నేల నున్నయవి యక్కట సూచితె సీత యాత్మలోఁ
నెనసినలజ్జ నింక నివి యేటికి నా కని పాఱవైచినన్. 61

అని పలికి యాత్మ నుర్వీ, తనయం దలపోయుచున్నఁ దద్దయుఁ జిత్తం
బున భ్రమ గప్పిన నాసతి, తనముందట నున్నయట్లు తనకుం దోఁపన్. 62

క. అంగన యీతొడవులు నీ, యంగములకుఁ జాల వదలులై యుండిన నే
మంగళముగఁ దాల్పఁగ భూ, రంగమునను వైచి చనితె రయమున నకటా.

క. మక్కువ నేఁ దొడఁ గోరిన, నక్కట యీభూషణములు హరిణేక్షణ మున్
తక్కువలై పట్టక యిపు, డెక్కువలై యున్నకత మదేటికిఁ జెపుమా. 64

వ. అని పలికి యధికరోషావేశంబున. 65

క. హాలాహలభీకరబల, కాలవ్యాళంబువోలె ఘననిశ్వాసా
భీలుం డగుచును రఘుభూ, పాలుం డిట్లనియె నపుడు భానుజుతోడన్. 66

ఉ. ఎక్కడఁ గంటి సీతఁ బ్రియ నెక్కడికిం గొనిపోయె రక్కసుం

డెక్కడ నుండు వాఁడు ప్లవ । గేశ్వర చెప్పుము నాకు నాఖలున్
వ్రక్కలు సేసెదం దనువు । వ్రచ్చెద నమ్ముల గ్రుచ్చెదం దల
ల్చెక్కెద నుక్కడంచి విద । లించెద నొంచెద సంహరించెదన్. 67

వ. అనవుడు సుగ్రీవుండు ప్రాంజలి యై రామునికిట్లనియె. 68

మ. జనపాలాగ్రణి శోకమున్ విడువు ము । త్సాహంబుతో జానకిం
గొనిరా యత్నము సేసెదన్ సకలర । క్షోవీరులం బంక్తివ
క్త్రునిఁ జక్కాడి భవత్పరాక్రమసుకీ । ర్తుల్ వృద్ధిఁ బొందింపు మే
వినయప్రాంజలి నై సఖిత్వగతి నా । వేశించి ప్రార్థించెదన్. 69

చ. ఉరుతరదుస్తరవ్యసన । మొందినఁ బ్రాణభయంబుఁ బొందినన్
సురుచిరబుద్ధిసంయుతుఁడు । శోకముఁ బొందఁడు దుఃఖపుంజముల్
బెరసిన నజ్ఞుఁ డెంతయును । భీతి మునుంగును శోకవారిధి
న్బర మధికంబుగాఁ గలుగు । నావ పయోధి మునుంగుకైవడిన్. 70

క. శోకము సుఖముం జెఱుచును, శోకము తేజంబు నడఁచు । శోకము బుద్ధిం
బోకార్చుఁ గాన దాలిమిఁ, గైకొని శోకంబు విడువఁ । గావలయు నృపా. 71

క. జనవర వయస్యభావం,బున నీ కింతయును హితముఁ । బొందించెద మ
న్నన నిన్నుఁ జూచి నాప్రా, ర్థన గైకొని శోక ముడుగు । తగ నీ వనినన్. 72

క. ఉరుబాష్పపూరముల నం, బరమున మార్జనము సేసి । ప్రమదస్థితిభా
సురుఁ డగుచును సుగ్రీవునిఁ, బరిగంభణకేళిఁ దేల్చి । పరమప్రీతిన్. 73

చ. అనుమతి నెయ్యుఁడున్ హితుఁడు । నై నవయస్యుఁడు సేయుకృత్యముల్
పొనరఁగఁ జేసి తీవు నినుఁ । బోలెడుబంధుఁడు మాకు నిప్పు డెం
దును బరికింపఁగాఁ గలఁడె । దుఃఖముఁ బాసితి నీహితోక్తుల
స్మనము గలంక దేఱెఁ బ్రమ । దస్థితి నెమ్మదిఁబోనఁ బొంగితిన్. 74

క. మన మేవెరవున ధాత్రిఁ, దనయన్ వెదకుదము ఖలుని । దశకంఠుని నే
యనువునఁ జని నిర్జింతము, మన మారఁగ నాకుఁ దెల్పు । మర్కటవీరా.

క. నీకుం గోరిక యెయ్యది, యాగోరిక సేయ నిక్క । మగుశపథంబుం
గైకొని చేసెద ననవుడు, నాకపినాథుండుఁ గపులు । హర్షించి రొగిన్. 76

క. అంతట సుగ్రీవుఁడు మదిఁ, నెంతయు సంతోష మొంది । యిమ్ముగ రఘుభూ
కాంతుఁడు నను రాజ్యశ్రీ,మంతునిఁ జేయు నని తలఁచి । మఱి రామునితోన్.

క. నీవును నేనును గూడిన, దేవేశ్వరురాజ్య మైనఁ । దృణలీలఁ గొనం
గావచ్చు ననిన నిజసం,భావితరాజ్యములు వోలఁ । బడయుట యరుదే. 7

క. వెలయఁగ నీతోఁ జెలిమిం, గలయుట నమరులకు నేను । గ్రాహ్యుఁడ నైతిన్
వలసినబంధువ్రాతం, బులకు వయస్యులకుఁ జాలఁ । బూజ్యుఁడ నైతిన్. 7

క. నను నేన చెప్పనేరను, జనవర నీ కేను దగిన । సఖుఁడ నగుట భూ

జనులవలన నాగుణములు, విని యెఱిఁగెదు గాక నన్ను విశ్రుతపుణ్యా. 80

క. నినుబోఁటిమహాత్ములు పో, ల నొనర్చినచెలిమి నిశ్చలలై యుండున్
వినుతాత్మధ్యానంబులఁ, దనరారెడుయోగిజనులధైర్యముఁబోలెన్. 81

క. అరయఁగ సముఁడు నదోషా,కరుఁడును నగుసఖుఁడు పరమగతి చెలికొఱకై
సిరి విడుతురు దేశము విడు,తురు బంధుల విడుతు రెలమితో నార్యజనుల్.

— సుగ్రీవుండు రామునితో నిజవృత్తాంతంబు చెప్పుట. —

వ. అని పలికి సుగ్రీవుండు రామలక్ష్మణులం గన్నులారం జూచుచు నటఁ జని కుసుమవిసరభరితయు లోలంబావృతయు నగుచుం జాల విశాల యగునొక్కసాల శాఖ విఱిచి తెచ్చి రామభద్రునితో నాశాఖపైఁ గూర్చుండె హనుమంతుం డప్పుడు వారిం జూచి మఱియొక్కభూరిసాలశాఖ విఱిచి కొనివచ్చి యాశాఖపై లక్ష్మణుం గూర్చుండఁబెట్టె నప్పుడు సుగ్రీవుండు బాష్పాకులలోచనుం డగుచు శ్రీరామచంద్రున కిట్లనియె. 83

మ. బలిమిన్ నా ప్రియపత్నిఁ దోఁచుకొని కోపక్రూరతన్ వీటిలో
ఎల నన్నున్ వసియింప నీక వెలికిం బాఱంగ నే తోలినన్
బలవంతుం డగువాలి కోర్వక భయభ్రాంతుండనై చింత లో
నెలయన్ వందుచు నున్నవాఁడ నగతో నీఋశ్యమూకస్థలిన్. 84

క. దేవ యనాథుఁడ నన్నుం, గావుము నామాన మనుచుఁ గాకుత్స్థుఁడు సు
గ్రీవ యుపకార మెఱుఁగుదు, నీవాంఛిత మార నీకు నెయ్యం బెసఁగన్. 85

చ. కనదురురత్నపుంఖములు కాలభుజంగమహోగ్రముల్ మహా
శనిసదృశప్రభావములు షణ్ముఖకాననసంభవంబులున్
ఘనతరకంకపత్త్రములు గల్గినయీశితసాయకంబులం
దునిమెద వాలి లీలఁ ద్వరతో నిల శైలముఁబోలెఁ గూలఁగన్. 86

వ. అనవుడు సుగ్రీవుండు సంతోషితస్వాంతుం డై శ్రీరామభూకాంతుం గనుంగొని.

క. జనవర మర్మవిదారణ, కనదురుశితసాయకములఁ గాల్పుము వాలిన్
దినకరుఁ డుగ్రమరీచులఁ, గనలుచు లయవేళ జగముఁ గాల్చినభంగిన్. 88

వ. అని పలికి వాలి పౌరుషధైర్యయశోజవంబులు వినిపించెద నవధరింపుము. 89

చ. ప్రకటమదోద్ధతిన్ విపులపర్వతశృంగము లెత్తి వాని నిం
గికి నెగయంగ వైచి వెసఁ గేల వడిం బడఁ బట్టుఁ జింత నొం
దక యుదయంబుకంటె మును దక్షిణవారిధినుండి యుత్తరా
బ్ధికి నపరాబ్ధినుండి తొలిదిక్కుపయోధికి నేఁగు నిచ్చలున్. 90

క. తనబల మెఱిఁగెదుతలఁపున, ననిమిషపతిసుతుఁడు వేగ మరుగఁగ నవ్వీ
రునిజవమున బహుతరఘన, వనతరుజాలములు విఱిగి వసుధం ద్రెళ్లున్. 91

సీ. దుందుభి యనుపేరిదుష్టోగ్రమహిషంబు, హిమవంతమున కేఁగి హిమనగంబ

యుద్ధంబు నాతోడ నొనరింపు మనవుడు, మదిలోనఁ దలపోసి మత మెఱింగి
తన్నుఁ జంపక యుండఁ దక్కొరుచే వానిఁ,జంపింపఁ దలపోసి శైల మనియె
నీతోడ యుద్ధంబు నెఱిఁ జేయ నేఁ జాలఁ, గయ్యంబు నీతోడఁ గడఁగి చేయ
వాలి చాలుఁ గిష్కింధ నవ్వాలి యుండు
నేఁగి యావాలిమధువన మీవు సొచ్చి
మధువుఁ జెఱుపంగ నేతెంచు మద మడంచు
విజయుఁడై వాలి నినుఁ గాచి విడుచునొండె. 92

చ. అనవుడు వాఁడు భీమగతి నార్చుచు వానరనాథు ప్రోలికిం
జని రణకేళికిం బిలువఁ జండపరాక్రమశాలి వాలి చ
య్యనఁ జనుదెంచి దుందుభి నుదగ్రతఁ బట్టి వధించె వానియా
ఘనధవళాస్థి యున్నది ప్రకాశముగా రజతాద్రికై వడిన్. 93

క. భూనాయక దుందుభి యను,వానికళేబరము నెత్తి వాలి యొకండౌ
నే నొకఁడ నగుదుఁ దక్కిన,వానికి నాఁడొక్క నెత్తి వచ్చునె జగతిన్. 94

ఉ. ఇట్టిబలోగ్రశౌర్యముల నేచినవాలికిఁ గోప మాత్మలోఁ
బుట్టినయప్పు డౌరుషముఁ బూనిన సర్వము సంహరించు ము
న్నట్ట నతండు విక్రమము నూల్కొన నాజికిఁ జేరకుండ నా
తట్టున నొక్కయమ్మునన దక్షతఁ జంపుము నీవు నావుడున్. 95

క. లీల నగి లక్ష్మణుఁడు నయ,శీలత నేకార్య మిపుడు సేసిన నేమ
వ్వాలిం జంపఁగ నోపుట, నీలో నమ్మెదవు నీవు నిక్కము గాఁగన్. 96

వ. నావుడు సుగ్రీవుం డి ట్లనియె. 97

ఉ. పంపినశక్తి వాలి కడు బాఁతిగ ముందట నున్న యోడుతా
ళంకుల నోలి నొక్కటిగ లావున నల్లనఁ బట్టి వానిప
ర్ణంబులు దూసివైచు వడి రాముఁడు చిత్రము గాఁగ నొక్కయ
స్త్రంబునఁ దత్పలాశములు సర్వము నుర్విఁ బడంగ సేసినన్. 98

క. ఆలమున వాలిఁ జంపఁగఁ, జాలుపరాక్రమము రామచంద్రునకు నతి
స్థూలంబు గాఁగఁ గల దని, నాలో నిశ్చయముగాఁగ నమ్మెద నెలమిన్. 99

వ. అని పలికి శోకార్తుం డగుచు మఱియు ని ట్లనియె. 100

శా. కాంతం గోల్పడి తద్వియోగశిఖ నంగం బంతయున్ వేఁగ న
త్యంతార్తిన్ విలపించెదన్ నిలువ లే కస్తోకశోకుండ నై
యంతర్దుఃఖము గాల్చుచున్నది మదీయస్వాంతమున్ దుఃఖసం
క్రాంతిం బొందిననాకు నీవ గతి యింకన్ రామభూనాయకా. 101

ఆ. కరము సాఁచి యగ్ని కరిగాఁగ సఖ్యంబు, చేసినార మగుటఁ జెలిమి దలఁచి
నాదుదుఃఖ మార్పు నాదుఃఖవశమునఁ, బలుకుచున్నవాఁడ వలసినట్లు. 102

క. అనుచుం బాష్పాకులలో, చనుఁడై దుఃఖమున మనము ‡ చలనం బొందన్
వనజాప్తసుతుఁడు మనుజేం, ద్రునిసన్నిధి మాట వలుకఁ ‡ దోఁపక యుండెన్.
వ. అట్లుండి. 104
క. జనపతి దను నూరార్చినఁ, గనుఁగొనలం దొరఁగుబాష్ప ‡ కణములు ధైర్యం
బున నాఁచి యున్నయశ్రులు,గొనకొని పోఁదుడిచి యతఁడు ‡ కువలయపతితోన్.
క. తనరాజ్యం బేఁ జేయఁగ, ఘనబలుఁ డగువాలి వచ్చి ‡ కడుఁగోపములో
ననుఁ గని భర్జించుచుఁ జ, య్యనఁ బురివెడలంగ నడిచె ‡ నతిదుర్మతియై. 106
క. ప్రాణముల కెక్కు డగునా, ప్రాణేశ్వరి దోఁచికొనియెఁ ‡ బట్టి మదాప్త
ప్రాణుల బంధించెను మ, త్ప్రాణంబులు గొనఁగ నెపుడుఁ ‡ బయికొనియుండున్.
శా. నన్నుం జంప ననేకవానరుల య ‡ త్నం బారఁ బుత్తెంచినం
గన్నారం గని వారిఁ జంపితిఁ గడం ‡ కం గాన నాశంక యా
త్మన్నిండారఁగఁ జేసి మీ రిచటికా ‡ నన్ వచ్చి యుండంగ మి
మ్మున్నెయ్యంబునఁ గానరా వెఱచితిన్ ‡ ము న్నేను భీతుండనై. 108
క. ఈకపు లనిలజముఖ్యులు, నాకు సహాయులుగ బ్రతికి ‡ నాఁడన్ వీరల్
సేకొని రక్షింతురు విను, పైకొని నే నెచట నున్నఁ ‡ బాయరు నన్నున్. 109
వ. ఈమాటలు వేయు నేల వినుము. 110
శా. కాలాభీలపటుప్రతాపుఁడు నుద ‡ గ్రక్రూరదోస్సారుఁడుం
జాలన్ శత్రుఁడు నాకు నెప్పుడు మన ‡ శ్శల్యంబునై యుండు న
వ్వాలిం గూల్పక నాగుదుఃఖ మొకటన్ ‡ వార్యంబు గా దెవ్వఁ డ
వ్వాలిం జంపు నతండు నాసఖుఁడు జీ ‡ వత్రాయకుండుం జుమీ. 111
క. సుఖదుఃఖము లొందినయెడ, సఖునకు సంతతము సఖుఁడ ‡ సద్గతి గాఁడే
సఖుఁడవు నా కీ వగుటను, నిఖిలముఁ జెప్పితిని దెలియ ‡ నీకు నృపాలా. 112
వ. నావుడు రాముండు సుగ్రీవుం గనుంగొని. 113

—✿ మాయావి యనుదనుజునివృత్తాంతము. ✿—

ఉ. వాలికి నీకు నేమిటికి ‡ వైరము పుట్టె వినంగఁ గోరెదం
బోలఁగఁ జెప్పు మేను విని ‡ భూరిబలాబలచింత సేసి య
వ్వాలి వధించి నీమనము ‡ వంత నడంచెద వేగ నావుడుం
జాలఁగ సంతసించి రెద ‡ సర్వవనాటులు భానుసూనుఁడున్. 114
మ. అటు సంతోషము నొంది భానుతనయుం ‡ డారాముతో నిట్లనుం
బటుబుద్ధిన్ విను చెప్పెదన్ సకలముం ‡ బాలించి మాతండ్రి యా
దట రాజ్యం బొనరించి చన్నపిదపం ‡ దన్మంత్రు లేపారుమ
ర్కటరాజ్యంబున కెల్ల వాలి నధిపుం ‡ గావించి రర్హంబుగన్. 115
క. వాలియు వానరరాజ్యముఁ, బాలించుచు నుండెఁ గరము ‡ ప్రమదంబున న

వ్వాలియు నను( బంచినపని, యోలిం బ్రియ మందఁ జేయుచుండుదు నంతన్.

మ. తనకుం గాలికిఁ గామినీకరవిరోధం బాత్మ నత్యంత మై
యునికిన్ దుందుభియగ్రపుత్త్రుఁడు బలాత్యుగ్రుండు మాయావి యన్
దనుజుం డుద్ధతి రాత్రియై జనులు నిద్రం బొందఁ గిష్కింధకున్
ఘనగర్వంబున వచ్చి వాకిట మహాగంభీరుఁ డై యార్చుచున్. 117

క. ఆలం బుద్ధతిఁ జేయఁగ, వాలిని ర మ్మనుచుఁ బిలువ వాలియుఁ గోపా
భీలముఖుండును సత్త్వవి,శాలుఁడు నై వానిమీఁదఁ జనుసమయమునన్.

చ. మునుకొని యేను గాంతలును మ్రొక్కుచు నడ్డపడంగ నందఱం
గనుఁగొని పాయఁ ద్రోచి యధికత్వరఁ బోవఁగ నన్ను గాన యే
పున వెనువెంట నేను నటఁ బోవఁగ నిద్దఱఁ జూచి భీతుఁ డై
దనుజుఁడు పాఱఁ జొచ్చె వడి దట్టపువెన్నెల గాయ నయ్యెడన్. 119

క. తెరువునఁ బొడగనవచ్చినఁ, ద్వరితగతిం బాఱె వాఁడు తల్లడమున మే
దురతరతృణవృతభూకం, దరము వడిం జొచ్చె నేముఁ దడయక వెంటన్.

వ. ఆబిలద్వారంబుఁ జేరితి మప్పుడు తనముందట నున్ననన్ను నవ్వాలి యి ట్లని
నియోగించె. 121

శా. ఈమాయావి వధించి గెల్పుసిరితో నే వచ్చునందాఁక నీ
వీమై నేమఱ కీగుహాముఖమునం దేపారఁగా నుండు మం
చామోదంబున నన్నుఁ బెట్టి బిల ముద్యచ్ఛక్తి మైఁ జొచ్చె సు
త్రామాత్మోద్భవుఁ డంత నేఁడు గడవం దా రాక యున్నన్ మదిన్. 122

వ. ఇది యేలొకో రాఁ డని భీతిం గలంగుచున్నంత. 123

ఉ. ఫేనిలరక్తపూరములు పెల్లుగఁ గ్రమ్మెఁ గుహాముఖంబునన్
దానికి దుఃఖ మందుచును దారుణగర్జితభూరినాదము
ల్దానవుఁ డార్వ వింటి మఱి లా వఱి కూలినవాలియాతుర
ధ్వానముఁ బోల వింటి విని తద్దయుదుఃఖము నన్ను ముంచినన్. 124

క. తాలిమి సెడి మతిలేమిని, వాలి హతుం డయ్యె ననుచు వైరులు నాపై
నోలిఁ జనుదేరకుండఁగ, శైలము గుహవాతఁ బెట్టి సముచితభంగిన్. 125

క. వాలికిఁ దిలోదకము లిడి, వాలినవగతోడఁ బురికి వచ్చిన నంతన్
వాలి మృతుఁ డయ్యె నన విని, పోలఁగ రాజ్యమునకుం బ్రభుఁడు లే కునికిన్.

క. పౌరులు మంత్రులు నన్నున్, గారవమునఁ బట్టభద్రుఁ గావించిరి పెం
పారఁగ నేనును ధర్మా, చారంబున రాజ్య మఖిలసమ్మతిఁ జేయన్. 127

మ. ఘనసత్త్వంబున వాలి వాలి కుహరాగారంబునం దున్నయా
దనుజుం బట్టి వధించి తద్బిలమువాతన్ రాయి త్రోపాడి యే
పునఁ గిష్కింధకు వచ్చి రాజ్యమహిమం బొల్పొందునన్నుం గనుం

గొని రక్తాయతనేత్రుఁడై పలుమఱుం గ్రోధించి భర్జించుచున్. 128
ఉ. తప్పులు వెట్టి నాకడఁ బ్రధానుల బద్ధులఁ జేయ ధర్మవుం
జొప్పు దలంచి యగ్రజుఁడు సూడఁగ దండ్రిసమానుఁ డంచు నే
మప్పుడు వాలిఁ జంపఁగ సమర్థుల మయ్యును సైఁచి గౌరవం
బొప్ప నమస్కరించి యుచితోక్తులు పల్కుచు సంభ్రమంబునన్. 129
మ. కర మొప్పారఁగఁ బట్టినాఁడ నిదె ముక్తాకీలితచ్ఛత్రచా
మరముల్ గైకొని నీవె రాజవు మముం మన్నింప నాథుండవుం
బరిపాటిం దగ నీవు లేనియెడ నీపట్టంబు నీమంత్రు లి
చ్చిరి నా కింతయు నీదురాజ్య మిది వే చేపట్టు నేఁ బోయెదన్. 130
ఉ. మండితబుద్ధి నన్నుఁ గృప మానుగఁ జూడుము రిత్త నాపయి
న్మండకు మాగ్రహం బుడుగు నాథ యనాథుఁడ నైననాకు నా
థుండవు నీవ నీకు జయదుందుభిపుత్రునిఁ గ్రూరశత్రు ను
ద్దండతఁ ద్రుంచి తెంతయు ముదంబునఁ బొందితి నీకు ద్రోహిగాన్. 131
క. ననుఁ గనుఁగొని కోపంబునఁ, గనలెడునిన్నుం బ్రసన్నుఁ గావించెద మ
జ్జనకుండవు నగ్రజుఁడవు, నను మన్నింపు మని పల్కినయమార్గములన్. 132
వ. ఏ నెంత వేఁడిన లెక్కగొనక. 133
క. సచివులఁ బ్రజలను బంధుల, నుచితగతిం జేరఁ బిలిచి యుక్తముగా నా
వచనములు మీరు వినుఁ డని, యచలచరాధీశుఁ డనియె నందఱు వినఁగన్.
సీ. మాయావి యనువాఁడు మత్సరి కేతెంచి, కయ్యంబు నాతోడఁ గడఁగి చేయఁ
గడిమి రమ్మని పిల్వఁ గడు నల్గి వానిపై, నేఁగంగ నావెన్క నినసుతుండు
తానును జనుదేర దనుజుఁ డిద్దఱఁ జూచి, భీతుఁడై వడిఁ బాఱి బిలముసొచ్చె
బిలమువాకిటి కేము పృథువేగమునఁ బోయి, యేవచ్చునందాఁక నిచటనుండు
శత్రుఁ బరిమార్చి వచ్చెద శౌర్యమెసఁగ, ననుజ నీవనిపల్కి తన్నచట నునిచి
బిలము వెసఁజొచ్చి మాయావిఁ గలయ వెదకి, కాన కేఁడుకాలమునకుఁ గంటినతని.
చ. కని దనుజుం సహాయులను గ్రన్ననఁ జంపి తదీయశోణితం
బున గుహ నిండుటం బురికిఁ బోవఁగ వాకిలి గానరాక నా
మనమున దుఃఖ మంది తను మాటికిఁ బేర్కొని చీరి చీరి యో
యనుతగుమాట లేక భయ మారఁగ నల్గడఁ జూచి యాత్మలోన్. 136
క. నారాజ్యము గొన నెప్పుడుఁ, గోరుచు మది నుండు వీఁడు కుటిలుఁడు భ్రాతృ
స్ఫారస్నేహము దలఁపం, డారయ ననుఁ జిక్కఁ దలఁచి యరిగెం బురికిన్.
మ. అని యూహించితి నట్ల న న్నిటకుఁ బాయం జూచి వేగం బురం
బునకుం వచ్చి మదీయరాజ్య మెలమిం భోగించుచున్నాఁడు దు
ర్జనశీలుండు ఖలుండు వీఁ డనుచుఁ దుశ్చస్వేచ్ఛ భర్జించుచుం

నను నేకాంబరుఁ జేసి పాఱ నడిచె ♦ న్శంకింప కుద్దండుఁ డై. 138

వ. అట్లు వెడల నడిచిన. 139

మ. అమరేంద్రాత్మజుచేత నాదుప్రియభా ♦ ర్యన్ రాజ్యముం గోలుపో
యి మదీయాగ్రజుచెంత నిల్వక భయా ♦ న్వితుండ నై చాల దుః
ఖముతో భూస్థలి నెల్లఁ గ్రిమ్మరుచు శం ♦ కం బొంది యీఋశ్యమూ
కమునం దుండుదు వాలి కీనగము వీఁ ♦ కం జేర రాకుండుటన్. 140

వ. రఘువరా నీ వడిగినవృత్తాంతం బంతయుఁ జెప్పితి ననపరాధి నైననాకు వచ్చిన దుఃఖంబు చూడు మఖిలలోకభయనివారకుండ వైననీవు నాదుఃఖంబు వాపి నన్ను రక్షింపం దగు దనిన సుగ్రీవుం జూచి యల్లన నగుచు రామచంద్రమహీవల్లభుం డి ట్లనియె. 141

క. మదిలో వగవకు దినకర,సదృశము లగునియ్యమోఘ ♦ శాతాస్త్రములం
ద్రిదశేంద్రతనూజునిఁ ద్రుం,చెద నీకడ నిలిచినపుడ ♦ చేవఁ గపీంద్రా. 142

క. అనవుడు నతఁ డావిభుతో, నను నింద్రసమేతు లైన ♦ యమరుల నైనం
దునుమఁగఁ జాలుదు వాసవ,తనయుఁడు నీ కెంతవాఁడు ♦ దలఁప నరేంద్రా.

క. మృగములలో సింహంబును, దగఁ బురుషులలోన నీవుఁ ♦ దగుశౌర్యమునన్
నెగడుదు జగముల సూర్యుం, డగణితతేజమున వెలుఁగు ♦ నట్లు మహీశా. 144

వ. అని మఱియు సుగ్రీవుం డి ట్లనియె. 145

—✿ దుందుభి యనుదనుజునిచరిత్రము. ✿—

క. నరవర దుందుభి యనువాఁ, డురునాగసహస్రసారుఁ ♦ డుగ్రాసురుఁ డు
ద్ధురవీర్యోత్సేకంబున, వరగర్వమున భయ మేది ♦ వాలుచు నుండున్. 146

ఉ. ఆదనుజుండు దర్పమున ♦ నంబుధిపాలికి నేఁగి నీవు నా
తో దొరయంగ సంగరము ♦ దోర్బల మారఁగఁ జేయు మన్న క్షీ
రోదధి వానితో ననియె ♦ యుద్ధము సేయఁగ నేను జాల నీ
కాదట ద్వంద్వయుద్ధము ర ♦ యంబున నిచ్చు బలాఢ్యుఁ జెప్పెదన్. 147

క. గిరివరుఁడు హరునిమామయు, నురునిర్ఝరకలితగుహుఁడు ♦ నున్నతవనభా
సురుఁడును నగుహిమవంతుఁడు, దుర మొప్పఁగఁ జేయు ననిన ♦ దుందుభి కడఁకన్.

చ. హిమగిరికాననంబునకు ♦ నేఁగి తదీయగజప్రమాణవి
భ్రమధవళాశ్మముల్ దిశలఁ ♦ బాఱఁగఁ గొమ్ముల వీఁకఁ జిమ్ముచున్
సమధికఘోరనాదములు ♦ సారెకుఁ జేయుచు నుండ నాత్మశృం
గమున హిమాద్రి నిల్చి ననుఁ ♦ గట్టలుకం బగిలింప నేటికిన్. 149

క. దానవ ని న్నెదురఁగ లే, నేను దపస్స్థితుఁడ వెఱతు ♦ నేపారఁగ నీ
తో నని సేయఁగఁ జాలెదు,వానిం జెప్పెద బలాఢ్యు ♦ వానరవీరున్. 150

క. కిష్కింధ కేఁగు మాహవ, పుష్కలబలశాలి వాలి ♦ పృథుతరబాహా

నిష్కర్ష యమర నీతో, దుష్కరయుద్ధంబు సేయు దుర్జయలీలన్. 151
వ. అని పల్కిన. 152
చ. ఘనతరనీలమేఘనిభగాత్రము నాతతశాతశృంగముల్
దనరఁగ సైరిభాకృతి యుదగ్రతఁ దాలిచి భూరిదుందుభి
స్వన మెసఁగించుచుం బ్రథితసత్త్వుఁడు దుందుభి వాలిప్రోలికిం
జని యట వాకిటన్ మలసి సర్వవనాటులుఁ దల్లడిల్లఁగన్. 153
వ. క్రొక్కారుమొగులునుంబోలె గర్జిల్లిన. 154
క. కింకఁ దదీయధ్వని విని, పంకజలోచనలుఁ దానుఁ బ్లవగేంద్రుఁడు ని
శ్శంకఁ జనుదెంచెఁ దారా, సంకలితుం డైనపూర్ణచంద్రునిభంగిన్. 155
వ. అట్లు చనుదెంచి గనుంగొని. 156
క. దుందుభి ని న్నెఱుఁగుదు నేఁ, గ్రందుగ వాకిట ని దేల గర్జించెదు వీఁ
కం దొలఁగుము ప్రాణంబులు, పొందుగ రక్షించుకొనుచుఁ బొమ్మెటకైనన్.
వ. అనిన వాఁడు కోపసంరక్తలోచనుం డై వాలిం గనుంగొని. 158
ఉ. కాంతలముందటన్ మిగుల గర్వము లాడుట పాడి గాదు నీ
పంత మెలర్ప నా కిపుడ భండన మిమ్ము మదీయభూరివి
క్రాంతి యెఱింగి దాజి నటు గాక సహించితిఁ గోప మేను నీ
కాంతలు నీవుఁ గామితసుఖంబులఁ బొందుము రాత్రి నిండఁగన్. 159
ఆ. సైఁప రానియధికశత్రువీరుని నైన, మత్తుఁ డైననుం బ్రమత్తుఁ డైన
సుప్తుఁ డైన రాత్రిఁ జొచ్చినయామీఁదఁ, జేరి చంప రలిగి శూరవరులు.
మ. అని పల్కం బ్రహసించి భీకరబలుం డవ్వాలి యాదైత్యుతో
నను యుద్ధంబున మత్తుఁ డై యతఁడు ప్రత్యర్థిప్రభుప్రాణముల్
గొనఁగా నప్పుడు మత్తుఁ డీతఁ డని నీకున్ భీతి వర్తింపఁగా
నను వీక్షించి యెఱింగె దీ వనుచుఁ జండక్రోధసంరంభుఁ డై. 161
క. తారమొదలయినతనప్రియ, నారులఁ దొలఁగంగ ననిపి నాకేశుఁడు చె
న్నారఁగ నిచ్చిన కాంచన, హారం బటు వుచ్చి పెట్టి యతివేగమునన్. 162
చ. బలువిడితోడ వచ్చి ఘనపర్వతసన్నిభుఁ డైనదుందుభిన్
బల మఱఁ గిట్టి శృంగములు పట్టి కుదించి సముల్లసద్భుజా
ర్గళపటుశక్తితో సకలరంధ్రములన్ రుధిరప్రవాహముల్
వెలువడఁ దచ్ఛరీరము భువిన్ జలదధ్వని మ్రోయుచుం బడన్. 163
ఉ. వాలి యుదగ్రసత్త్వమున వానిశరీరము నెత్తి పట్టి వే
తూలముఁబోలె యోజనముదూరము పాఱఁగఁ గాలఁ జిమ్మినం
గ్రాలుతదీయవక్త్రమునఁ గాఱెడునెత్తుటఁ దొప్పదోఁగె ను
త్తాలతపస్సమాశ్రితమతంగమహాశ్రమము ఋశ్యమూకమున్. 164

ఉ. దానికి నాత్మలోపల మ । తంగమునీశ్వరుఁ డాగ్రహంబునన్
వానరనాథుఁ డై పరఁగు । వాలి మదంబున వచ్చి యోట లే
కీనగ మెప్పు డెక్క నపు । డీలుగుఁ బొమ్మని శాప మిచ్చె న
మ్మౌని ననుగ్రహింపు మని । మానుగఁ బ్రార్థనచేసె వాలియున్. 165

వ. అది మొదలుగ మునిశాపభయంబున వాలి యీదిక్కు చేర వెఱచుం గావున నిశ్శంక నిగ్గిరిచెంత నేనును నామంత్రులుఁ జరియించుచుండుదు మఱె వాలి కాల నెత్తి పాఱం జిమ్మినదుందుభికళేబరం బాడొక్క నీవును బాదంబున నెత్తి పాఱం జిమ్ము పిమ్మట. 166

క. ఆలమున వాలిఁ జంపఁగఁ, జాలుపరాక్రమము రామ । చంద్రునకు నతి
స్థూలమ్ము గాఁగఁ గల దని, నాలో నిశ్చయము గాఁగ । నమ్మెద ననినన్. 167

క. అమ్మెయి రాఘవుఁ డంగుష్ఠమ్మున లఘులీల నెత్తి । శైలప్రతిమా
న మ్మగుదుందుభిఘనకా, యమ్మం బదియోజనమ్ము । లరుగం జిమ్మెన్. 168

వ. దానికి నరుదందక సుగ్రీవుండు లక్ష్మణుం గనుంగొని. 169

తే. వాలి యెత్తెడునాఁడు స । ర్వప్రతీక
ములును మాంసశోణితపూర్ణ । ములుగ నునికి
దనుజకాయ మెంతయుఁ బ్రేఁగు । దలఁప నిప్పు
డస్థిమాత్రమ యగుట బ్రేఁ । గల్పతరము. 170

—✤ శ్రీరాముఁడు సప్తతాళంబులం గూల్చుట. ✤—

వ. కాన రామచంద్రుం డీడొక్కయెత్తినయంత నీతనిశక్తి వాలిశక్తికెక్కు డని నిశ్చయింపరా దిస్సేడుతాళంబులు నొక్కశరంబునం దెగనేసిన నప్పు డీతనిశక్తి వాలిశక్తికి నగ్గలం బని నమ్మ వచ్చు. 171

క. అని కపినాథుఁడు పలికిన, జననాథుం డపుడు శై । లచరనాథునకుం
దనసత్త్వము ప్రత్యయముగ, ఘనతరకార్ముకము లీలఁ । గైకొని కడిమిన్.

చ. ఘనధను వెక్కువెట్టి పటు । కాండము నారి నమర్చి భూరిగ
ర్జనఁ దెగ నిండఁగాఁ దిగిచి । సాయక మేసిన సప్తతాళముల్
తునిమి నగంబు గాఁడి యిలఁ । దూఱి రసాతల మంటి చేతికిం
దనరఁగ వచ్చె హంసగతిఁ । దచ్చర మెంతయు నాతతత్వరన్. 173

సీ. అప్పుడు దెగిపడ్డ । యాతాళములు సూచి, యచ్చెరు వందుచు । నర్కసుతుఁడు
శిరమున నంజలిఁ । జెన్నారఁ జేరిచి, మణికుండలాంచిత । మస్తకంబు
ధర మోవ భక్తితో । దండప్రణామంబు, తగఁ జేసి సంగరో । ద్దండబలుని
సర్వాస్త్రకోవిదుఁ । జండోరువిక్రమ, శౌర్యుని వరుణేంద్ర । సదృశు రాముఁ
జూచి సుగ్రీవుఁ డిట్లను । శూరవర్య, రామ యిట్టిది గలదె నీ । ప్రదరశక్తి
బాణమొక్కటి తాళసప్తకము నురుల, సారిదిఁ ద్రుంచిపాతాళంబు । సొచ్చివచ్చె.

క. జనవర నీఘనసత్త్వము, గనుఁగొంటిఁ బగలఁ బాయఁ గంటిని బ్రీతిన్
మనఁ గంటిని నీముందట, నని నెవ్వఁడు నిలువఁ జాలు నతిశౌర్యనిధీ. 175

వ. అనిన విని సంతోషించి రఘువరుండు సుగ్రీవుం గౌఁగిలించుకొని గారవించి సుగ్రీవా నీ వీవనచరులతోడఁ గిష్కింధాద్వారంబునకు నడువు మిదె నేనును వెనుక వచ్చెద ననుచుం గదలి సౌమిత్రియుఁ దానును సుగ్రీవుండును సకలవానర సహితులై కిష్కింధ చేర నరిగి యొక్కెడ నిలిచి ఘనవృక్షమండంబులు దమకు నావరణంబులు చేసికొని సుగ్రీవుం జూచి నీవింకఁ గిష్కింధాద్వారంబు చేరి వాలిం గయ్యంబునకు నాహ్వానంబుచేసి నాదృష్టిపథంబునకు వచ్చునట్లుగాఁ జేయు మవ్వాలిం దునిమి నీమనోరథంబు గావించెద ననిన ముదం బంది యరవిందమిత్ర నందనుండు కిష్కింధాద్వారంబున నిలిచి ప్రళయకుపితభైరవారావంబున నంబరంబు భేదిల్ల నార్చె నాసమయంబున. 176

—వాలిసుగ్రీవుల ప్రథమయుద్ధము.—

ఉ. ఆనినదంబు తత్కుహర మంతయు నిండ మహాభ్రగర్జిత
ధ్వానమొ నాఁగ వాలి విని దారుణరోషవశంబునం గనుం
గోనల నిప్పుకల్ నెఱయఁ గ్రూరత నాగుహ దాఁటి వచ్చి యా
భానుజుఁ దాఁకె బల్విడుగుభంగి దిశల్ వగులంగ నార్చుచున్. 177

వ. అప్పు డయ్యిరువురకును బుధాంగారకులకుంబోలె సంగరం బయ్యె నట్లయ్యిరువురుఁ గోపాటోపం బెసంగ. 178

ఉ. నింగియు నేలయుం బగుల నిష్ఠురభంగిఁ జెలంగి యార్చుచుం
బొంగి పదోగ్రఘట్టనల భూమి చలింపఁగఁ బాఱు తెంచుచున్
జంగమభూరిశైలములచాడ్పునఁ జేరుచు ఘోరమత్తమా
తంగయుగక్రమంబుల మదంబున నొండొరు వీఁకఁ దాఁకుచున్. 179

వ. మఱియు. 180

మ. కడిమిఁ గడంగి ఘోరపవికల్పతలంబుల రక్తపూరముల్
వెడల శరీరముల్ వగుల వ్రేయుచు వజ్రనిపాతముష్టులం
బడ వడి గ్రుద్దుచున్ నఖరపంక్తుల వ్రచ్చుచుఁ బట్టఁ జేరుచుం
బొడుచుచుఁ దన్నుచుం బొడిచి పోవుచుఁ దాఁకుచుఁ బోరుచున్నెడన్. 181

క. ఘనతరకోదండంబున, సునిశితసాయకముఁ బూన్చి శూరత్వమునన్
జననాథాగ్రణి వాసవ, తనయుని రవితనయుఁ బోలఁ దాఁ గనుఁగొనుచున్.

చ. ఇతఁడు సురేంద్రపుత్త్రుఁ డని యేయఁగ బాణము నారిఁబోసి కాఁ
డితఁడు దినేంద్రపుత్త్రుఁ డని యేయక క్రమ్మఱఁ జూచి రాఘవుం
డితఁ డగు వాలి యంచుఁ దెగ యేపునఁ దీసి కడంకఁ జూచి కాఁ
డితఁ డతఁ డౌతఁ డీతఁ డని యిద్దఱుఁ బోరఁగ సంశయంబునన్. 183

వ. ఇట్లు సంశయంబున నరేంద్రుం డేయ కున్నెడ వాలి సుగ్రీవునిఁ బాణితలముష్టి ప్రహారంబులఁ జదియ నడిచిన. 184

చ. అనిమొన వాలిచేత బలసమంతయుఁ దూలి భయాకులుండు భం
జనయుతుఁడుం బ్రహారచయజర్జరితాంగుఁడుఁ గ్లాంతచిత్తుఁడున్
ఘనతరరక్తసిక్తపటుకాయుఁడునై సుమహాజవంబుతో
నినజుఁడు ఋశ్యమూకమున కేఁగె నరేంద్రునిదిక్కు సూచుచున్. 185

వ. అట్టియెడ. 186

క. అనిలతనూజుఁడుఁ దానును, ననుజుఁడుఁ గూడంగఁ రాముఁ డర్కజుకడకుం
జని సేమంబున వచ్చితె, యనవుడుఁ దల వాంచి యనియె నవ్విభుతోడన్.

క. జనవర నీపలికినవిధ, మునఁ బోరఁగ వాలి చావ మోఁది కృపం జే
కొని విడిచిన సేమంబునఁ, జనుదెంచితి నీదుపలుక సత్యము గాదే. 188

వ. అని వెండియు. 189

ఉ. చెచ్చెర వాలి నాహవము సేయఁగఁ జీరుము వాలి నీపయి
న్వచ్చినఁ జంపువాఁడ నని నాకడ నాడితి నన్ను లావుమైఁ
జొచ్చి యతండు నొంపఁ గని చొప్పడ వచ్చితి వాలిచేతనేఁ
జచ్చినమీఁద వాలి ననిఁ జంపఁగ నేటికి నీవు నావుడున్. 190

వ. శ్రీరాముండతిదీనుండగుచు రవిసూనునిం గనుంగొని కోపం బుడిగి వినుము చెప్పెద.

క. స్వరములునురములుశిరములుఁ, గరములుఁబెందొడలుమెడలుఁగన్నులువెన్నుల్
సురుచిరపదములు రదములు, నిరువురకుం జూడ నొక్కయియై యునికిన్.

క. తొడిగిననాపటుబాణము, కడుఘోర మమోఘ మంతకకర మగుటను నే
విడువను దొడిఁబడ నెవ్వనిఁ, గెడపునో యని సంశయమున గిరిచరవర్యా.

వ. అని పలికి రామచంద్రుండు లక్ష్మణుం గనుంగొని. 194

ఉ. ఈనలినాప్తపుత్రునకు నే ననిఁ జూచి యెఱుంగునట్లుగా
జానుగ నానవాలిడుము చయ్యన లక్ష్మణ యంచుఁ బల్కినం
బూనిక గాఁగ నొక్కగజపుష్పపుమాలిక దెచ్చి చిన్నగా
భానుతనూజుకంఠమున బాఁతిగఁ బెట్టె నృపానుజన్ముఁడున్. 195

—సుగ్రీవుఁడు రెండవమాఱు వాలితో యుద్ధము సేయఁ బోవుట.—

వ. అప్పు డాగజపుష్పమాలిక ధరియించి బలాకాంచితమాలాపరివృతజీమూతంబు నుంబోలెఁ గంజాతాప్తతనూజాతుండు తేజరిల్లె రామచంద్రుండును గాంచనభూషణభూషితం బగుచాపం బెత్తి యాదిత్యసంకాశంబును మహోరగేశ్వరప్రతిమానంబును మహేశ్వరశరసదృశంబును నగునమశరంబు కేలం గ్రాలఁ దనముందట సుగ్రీవుండును వెనుక లక్ష్మణుండును హనుమంతుండును నలనీలతారప్రముఖహరియూథపులును బలసి యేతేరఁ గుసుమవిసరభరానతతరులుం బ్ర

సన్నాంబుప్రవాహసాగరగామినీమహానదులును గుహాప్రస్రవణనిర్ఝరంబులును బలుశైలశిఖరంబులును వైడూర్యసదృశవర్ణపద్మకువలయప్రభృతిజలకుసుమంబులును హంసకారండవచక్రవాకబకజలకుక్కుటాదిసలిలపక్షులుం గలతటాకంబులును నానాపక్షికులకోలాహలకలితస్థలంబులును గలిగి గిరిసన్నిభంబు లయి మదధారలు గండస్థలంబులం దొరఁగ శైలంబుల శితదంతంబులం బగులఁ బొడుచు మత్తదంతావళప్రభృతిఘనసత్త్వంబులను వనచరఖేచరశైలచరశకుంతకులంబులను జూచుచుఁ ద్వరితగతి నేతెంచి ముందట నొక్కతరుషండంబుఁ బొడగని రామచంద్రుండు సుగ్రీవుం గనుంగొని నింగి వెలుంగుమేఘంబునుంబోలెఁ బరివృతఘనసంకాశకదళీవనశోభితం బయినయీతరుషండం బెయ్యది యెఱుంగఁ జెప్పు మనిన నినజుండు రఘువరున కిట్లనుఁ గదళీతరువనపరివృతంబును సర్వమూలఫలోపభోగంబును జనశ్రమనిరాసకంబును గృతమునిజనవిశ్రమంబును నగునియ్యాశ్రమంబునందు జననాథ మునులు సప్తరాత్రంబుల కొక్కవారం బాహారంబు గొనుచు సమీరాహారులు నిర్జితేంద్రియులును నై సప్తశతవర్షంబులు తపంబులు సేసి శరీరంబులతోన దివంబునకుం జనిరి వారితపఃప్రభావంబునం దరువులు దుర్గమప్రకారంబునఁ బ్రాకారంబునుంబోలెఁ బరివృతంబులయి యుండుట నియ్యాశ్రమంబు దేవేంద్రాదిసురలకు దురాధర్షం బయి యుండుం బక్షులు నన్యవనచరంబులుం బ్రవేశింపకుండు దైవవశంబునం బ్రవేశించినఁ బునరావృత్తి లేకుండు నిచటఁ దూర్యగీతస్వనంబులు సకలకథలు మధురాక్షరంబు లయి వినంబడు పరిమళమందపవనంబు లొలయుచుండు నిమ్ములఁ ద్రేతాగ్నులును గానంబడు నేతదాశ్రమపరివృతవృక్షాగ్రంబులగరుడప్రభంబు లైనకపోతంబులు గానంబడు నమ్మునుల నుద్దేశించి కృతాంజలి వగుచుఁ బ్రణామంబు సేయుమని పలికిన నమ్మహాతేజు లయినమునులగుఱించి రాముండు సలక్ష్మణుండై దండప్రణామంబు లాచరించి సంతుష్టహృదయుం డై యానప్తజనాశ్రమంబులు దాఁటి యట దూరంబున బహుపాదపగుల్మమధ్యంబును బహువానరపరివృతంబును గాంచనతోరణమండితంబును దురాధర్షంబును నాతతధ్వజయంత్రప్రాకారంబును వాలిపాలితంబును నగు కిష్కింధానగరంబు సేరి యచ్చట వృక్షమండావృతుం డై వన మెల్ల వీక్షించుచుండె నప్పుడు సుగ్రీవుండు బ్రహ్మాండం బంతయు నిండ మహానాదంబు సేసి నీలజీమూతసంకాశుం డగురామభద్రు నాలోకించి యి ట్లనియె. 196

క. నరనాయక కిష్కింధా, పుర మిదె చేరితిమి వాలిఁ ◌ బొలియించెద న
న్వరమ ప్రతిజ్ఞ సఫలముఁ, గర మొనరింపంగ వలయుఁ ◌ గాలములోనన్. 197

చ. అనవుడు ని న్నెఱింగెద రణయంబున నీగజపుష్పమాల లాం
ఛనముగ నీవు వాలిపురిఁ ◌ జయ్యనఁ జేరి గుహాముఖంబునన్

ఘననినదంబు భీకరము గాఁ బొనరింపుము వాలి యామహా
ధ్వని విని సంగరంబున కుదగ్రసముద్ధతి వచ్చునట్లుగన్. 198
క. శూరుఁడు శత్రునిగర్జన, మారఁగ విని సైఁపఁ గలుక నడరును రిపుపై
నారులకడ బీరము మగ, వారికిఁ గడుఁ బెద్దయగుచు వాలుచు నుండున్. 199
వ. కావున వాలి యధికశూరుండును దారాదిదారాన్వితుండును నీకు నజయ్యుండు నగుట నీగర్జనంబు విని సైరింపక కోపాటోపంబున నిన్నుఁ బ్రహరింప సంగరంబునకు వచ్చు వచ్చి నాదృష్టిపథంబునం బడిన వాలి నవలీల సమయించి నాప్రతిన సఫలంబుగాఁ జేయుదు నని పలికిన నుత్సహించి రామునానతిఁ గిష్కింధాద్వారంబు చేరి ప్రళయామోఘమేఘౌఘంబు లుఱిమినగతి భూనభోంతరాళంబు పగుల నార్చె నప్పు డమ్మహానాదంబు విని బెగడి గోవృషంబులు పఱచె సకలవనచరులు నాకులమానసు లయిరి మృగంబులు రణంబున జర్జరితాంగంబు లయి విడివడినహయంబులకరణిం బఱచె ఖగంబులు క్షీణపుణ్యగ్రహంబు లుంబోలెఁ బుడమింబడియె బిలంబుల మహానాదంబులు సెలంగెనాసమయంబున.
ఉ. ఆనినదంబు వాలి విని యాగ్రహనిగ్రహచండభూరికో
పానల మాత్మలోఁ బెరయ నగ్నికణంబుల నక్షు లీనఁగా
భానుజుమీఁద వేగమునఁ బాదహతిన్ ధర గ్రుంగ శారద
స్థానము దాఁటి పోవునెడఁ జయ్యన నడ్డము వచ్చి భీత యై. 201
—❖ వాలికిఁ దార హితోపదేశంబు సేయుట. ❖—
శా. వాలిం దార గవుంగిలించుకొని జీవస్వామి నిరుం గడున్
మే లేఁ జెప్పెదఁ గోపమున్ విడువు నేకమ్మిన్ నాహితాలాపముల్
పోలంగన్ విను మర్కనందనుపయిం బోఁ జూచునుద్యోగ మి
వ్వేళం బథ్యము గాదు నిల్వుము మదిన్ వీక్షింపుమా కర్జమున్. 202
మ. అని నీచే నటు మోఁదులం బడి కడుం బ్రాణార్తుఁ డై పాఱి పో
యినసుగ్రీవుఁడు క్రమ్మఱన్ భయము లేకే తెంచి నిన్నాహవం
బునకుం జీరఁగ రాక సూడ బలవిస్ఫూర్తిన్ నినున్ గెల్చి వే
తనుఁ గావం గలబల్లిదుం డొకఁడు మీఁదన్ లేక రాఁ డింతలోన్. 203
ఉ. అంగదుచేత వింటి విను మత్తెఱఁ గర్కజుఁ డాత్మవాంఛ దీ
ర్పం గలవీరుఁగా నెఱిఁగి రామునితోఁ దగ మైత్రి సేసె నా
రంగ దినేంద్రపుత్రునకు రామవిభుండు మహాసహాయుఁ డై
సంగడి వచ్చినాఁ డతఁడు సంగరకర్కశుఁడున్ బలాఢ్యుఁడున్. 20
చ. అరిబలసూదనుండు శరణాగతవత్సలుఁడున్ లసద్గుణా
కరుఁడు నజయ్యుఁడున్ విజయకర్మఠుఁడున్ రఘురాముఁ డాసహో
దరుఁడును నట్టివాఁడ రణదర్పమునం బటుచాపహస్తు లై

యిరువురు నిల్చినఁ హరిహ।రేంద్రులు నడ్డము గారు వారికిన్. 205

క. సుగ్రీవుఁడు రామునకు న, తగ్రీవుం డగుట నీకుఁ । దలఁకం డింకన్
విగ్రహ మాగ్రహమునఁ గొన, కుగ్రాంశుతనూజుతోడ । నురుతరబుద్ధిన్.

మ. పరఁగన్ భానుజు యౌవరాజ్యమునకుం । బట్టంబు వే కట్టు మా
దరణీయుం డగునీసహోదరుని నం।దం బొంద మన్నింపు సు
స్థిరవైరం బనుజన్ముతోఁ దగదు శాం।తిం బొందు రామక్షితీ
శ్వరుప్రా పొందినభానునందను నరిన్ । సాధింప రా దేరికిన్. 207

సీ. మనయింటఁ గలసర్వ।మణిధనంబులు గొంచుఁ, గాకుత్స్థుఁ గాన నం।గదునిఁ బుచ్చి
యారాముతో సంధి । యతిభక్తిఁ గావించి, కొని నిర్భయంబున । మనుట మేలు
కాదేని కిష్కింధ । కడువేగమున డించి, ఘనదూరదేశంబు । చనుట లెస్స
యొండేని రఘురాము।నొద్దకుఁ బ్రాణముల్, పోషించికొన నీవు । పొమ్ము బుద్ధి
నీవు దనపాలి కేఁగిన । నృపతి నిన్ను, నాదరంబున మన్నించు । మోదమెనఁగఁ
జేయు నీ కపకారంబు । సేయఁ డాఘ,నుండు శరణార్థిజనరక్ష।కుండు గాన. 208

క. అని యిట్లు పెక్కుభంగులఁ, దనరఁగఁ బ్రియ మారఁ దార । తజ్జ్ఞతఁ బలుకన్
విని వాలి నిరుత్తరుఁ డై, తనలోఁ దలపోసి కొంత।తడవున కనియెన్. 209

క. ఈకిష్కింధానగర, మ్మీకపిరాజ్యంబుఁ బాసి । యే మనఁ జాలన్
నాకుం బ్రియ మిటు చెప్పితి, చేకొని హిత మగుట సంత।సించితిఁ దరుణీ. 210

శా. ఘోరాజిం బడ మోఁది పొమ్మనిన నా।కుం గాక భీతాత్ముఁ డై
దూరాద్రిస్థలి దిక్కు లేక రవిపు।త్రుం డుండి దైన్యంబుతో
నారాముం బ్రణతాంగుఁ డై కొలిచెఁ గా । కజ్జాస్యకై వ్రాలుచున్
వీరత్వంబు దొఱంగి తక్కొరుని సే।వింపంగ నా కేటికిన్. 211

మ. ఉరువింధ్యాద్రి కరంబులం బెఱుక ని। మ్మూర్వీశుఁ డేపారఁగా
ధరణీచక్రము ద్రిప్ప నిమ్ము కనదు।ద్యత్పావకస్పర్ధిభీ
కరబాణంబులఁ జంద్రతారకయుతా।కాశస్థలంబున్ సనా
గరభూలోకముఁ గాల్ప నిమ్ము తుది శం।కం బొంద నే నింతయున్. 212

క. రామున కే నపరాధం, బేమియుఁ గావింప నాకు । నింతయు నలుగం
డామహితాత్ముఁడు సుగుణో, ద్దాముఁడు సద్ధర్మవిదుఁడు । తలఁకకు మబలా.

క. ఉరుతరబలదర్పంబును, బరిపంథిరణంబు సేయఁ । బైకొని పిలువన్
బిరు దఱి తొలఁగుటకంటెను, మరణం బెంతయును మేలు । మగవారలకున్.

చ. అనిమొనఁ బాఱిపోయి భయ।మందక క్రమ్మఱ వచ్చి లజ్జ లే
కినజుఁడు నన్ను మార్కొనఁగ । నేపునఁ దా మగవాఁడపోలె గ
ర్జన మొనరించుచున్ మదవ।శంబునఁ ద్రుళ్లెడు వానిప్రాణముల్

గొని విజయంబుతోఁ బురికిఁ | గోరిక లారఁగ వేగ వచ్చెదన్. 215

చ. మనమునఁ జింత నొందకయ | మానముతోఁ జను తార నీవు నీ
వనితలు నన్ను వందురుచు | వాలినిఁ గౌఁగిటఁ జేర్చి కూర్మి నిం
చినమదితోఁ బ్రదక్షిణము | చేసి నిజేశ్వరు గెల్వు మంచు దీ
వన లిడుచున్ గృహంబునకు | భామలుఁ దానును నేఁగె నయ్యెడన్. 216

వ. అతికుపితమానసుం డగుచుఁ గిష్కింధానగరంబు వెడలి యధికసంరంభంబున.

శా. క్రూరవ్యాళముఁబోలె దీర్ఘభయద | క్రోధోగ్రనిశ్శ్వాసముల్
ధీరోదగ్రతఁ బుచ్చుచున్ రిపుఁ గనన్ | దిక్కుల్ పరీక్షించుచున్
దూరాగ్రస్థలిఁ గాంచె వాలి కనద | త్యుగ్రాగ్నితేజున్ మహో
దారున్ సంగరవిక్రమోన్నమితరుం | దగ్రీవు సుగ్రీవునిన్. 218

చ. అటు పొడగాంచి గాఢముగ | నర్కజుఁ జూచుచు భూరిముష్టి యు
ద్భటగతి నెత్తికొం చరిగి | పైఁ బఱతేరఁగ భానుసూనుఁడుం
బటుబలశాలి వాలిఁ గని | బంధురముష్టి ప్రచండభంగి ముం
దటఁ గనుపట్ట నెత్తికొని | తద్దయు బల్విడి జేరె నేపునన్. 219

— వాలిసుగ్రీవులద్వితీయయుద్ధము. —

క. తనపయి నినజుం డురవడిఁ, జను దేరఁగఁ జూచి వాలి | చండక్రోధం
బున నోరి దురాత్ముఁడ యీ, ఘనతరముష్టి నినుఁ జంపుఁ | గడువడి ననుడున్.

క. అలుకన్ వాలిఁ గనుంగొని, జలజాప్తసుతుండు వృక్ష | చర నీప్రాణం
బులు గొను వడి నీపిడికిలి, బలువడి నీనెత్తిమీఁదఁ | బడియెడు ననినన్. 221

మ. పిడుగత్యుద్ధతిఁ దాఁకునిర్భరముగాఁ | బెన్ముష్టి నవ్వాలి బల్
విడి సుగ్రీవునిపెన్నురంబు వొడిచెన్ | వే దూలి భగ్నాంగుఁడై
యొడ లెల్లన్ రుధిరంబునం దడియ ర | క్తోద్గారముల్ సేయుచుం
గడు ఘోరంబుగ నుండె ధాతుజలసి | క్తస్థూలశైలాకృతిన్. 222

వ. అట్లుండి తదనంతరంబ. 223

క. అనమునఁ భానుజుఁ డాగ్రహ, మెసఁగఁగ నొకసాలవృక్ష | మేపునఁ గొని య
య్యసమబలశాలి వాలిని, వస మఱి వసుధఁ బడ వీఁక | వక్షము వ్రేసెన్.

వ. ఇట్లు సాలతాడనంబున వివశుం డై యొక్కముహూర్తంబునకుం దేఱి యధిక
కోపంబున యుగాంతాగ్నియుంబోలె మండుచు నెగసి వచ్చి సుగ్రీవుతోఁ దలఁ
పడియె నప్పు డయ్యిరువురును. 225

క. సరి బాహాబాహిని ని, ర్భరముష్టీముష్టి మఱియుఁ | బాణీపాణిం
జరణాచరణి నఖానఖి, నురుదంతాదంతిఁ బోరి | రుగ్రాకృతు లై. 226

వ. మఱియు నవ్వాలిసుగ్రీవులు సుపర్ణానిలబలవేగులు నితరేతరవిక్రమాక్రాంతుల
ఘోరాకారులు నై బుధశుక్రులుంబోలెఁ బోరుచుండ నప్పు డవ్వాలిచేత బఁ

దర్పంబు లడఁగి సుగ్రీవుండు చిక్కుటయు వాలిసామర్థ్యంబును బరికించి రామ
చంద్రుం డధికవిక్రమాటోపంబున. 227

—శ్రీరాముఁడు వాలిం గూల నేయుట.—

శా. చండాశీవిషఘోరసాయకము చంచజ్జ్యాసమేతంబు గా
నిండారం దెగ దీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీ
శుం డాస్ఫోటన నేసె దుందుభిఘనక్షోణీధ్రదంభోళి ను
ద్దండారింధనకీలి నిర్దరణవిద్యాశాలి వాలిం బడన్. 228

తే. అట్లు ఘోరాస్త్రపతితుఁడై యూరణోర్వి, బంకమగ్నద్విపేంద్రంబుపగిది నున్న
వాలి బాష్పముదొరఁగ భూపాలుఁ గాంచి, యార్తరవమున నిట్లనియల్లఁబలికె.

క. తామసమునఁ బరుతో సం, గ్రామము గావింపఁగాఁ బరాఙ్ముఖు నన్నుం
భీమామోఘశరంబున, నేమే లొంగంగఁ బొంచి యేసితి వకటా. 230

క. అని నీచేఁ జిక్కిననా, కును మదిలో వగవఁ దారకును వగవ సుహృ
జ్జనులకు వగవను నానం, దనుఁ డంగదునకును వగచెదం గాని నృపా. 231

ఉ. అంగదుఁ జారురత్నకనకాంగదు నంగము చల్లగాఁ బరి
ష్వంగము చేసి వక్త్రజలజం బలరారఁగ ముద్దు లాడి యు
త్సంగమునందుఁ బెట్టుకొని శైశవ మాదిగ నెత్తి పెంచితిన్
మంగళమూర్తి నా ప్రియకుమారునిఁ బాసెద నింక దైవమా. 232

వ. అనుచు శోకించు చున్నసమయంబున. 233

సీ. ఘనరక్తసిక్తమై తనశరీరము పుష్పి, తాశోకముంబోలె నమరువానిఁ
బుణ్యాంతమై దివంబుననుండి ధరకు వ, చ్చినయయాతియుఁబోలెఁ జనరువానిఁ
బ్రళయకాలమున భూతలపతితుం డైన, భానునికైవడిఁ బరఁగువాని
విలయానిలాహతి నిలఁ దూలి కూలిన, యింద్రధ్వజాకృతి నెసఁగువాని
నింద్రుపగిది దుర్ధర్షుఁ డుపేంద్రుకరణి
నఖిలశత్రుదుస్సహుఁడును నైనవాని
నింద్రపవిఘోరశరహతు నింద్రమూర్తి
నింద్రసుతు హేమమాలిఁ గపీంద్రు వాలి. 234

క. కని రాముఁడు వేగంబున, ననుజుండుం దాను జేర నరిగినఁ గోపం
బున వాలి వారలం గని, యినకులనాయకునితోడ నిట్లని పలికెన్. 235

—వాలిరాఘవులసంవాదము.—

చ. కనుకని నన్నుదమ్ములకుఁ గయ్యము లా మఱి యడ్డ చక్కనౌ
నని నపరాధిగాని నను నన్యరణాన్వితుఁ జంపఁ బాతకం
బనక నన్నున్ వధించినదురాత్ముఁ దృణావృతకూపసన్నిభున్
నిను నతిధార్మికుం డనుట నేరమి గాదె సుధీజనాళికిన్. 236

చ. అనఘుఁడు పుణ్యశీలుఁడు కృపాన్వితుఁ డుత్తమవంశజుండు స
జ్జనహితశీలుఁ డార్యుఁ డని సర్వజనంబులు నిన్ను నెన్నఁగాఁ
జన విని నమ్మి తార వను సమ్మతిఁ బోవకు నాఁగ వచ్చి నీ
ఘనవిశిఖంబుపా లయితిఁ గార్య మెఱుంగక మోసపోయితిన్. 237

క. విను రాజఘ్నుఁడు నన్నకు, మును పెండిలియైనవాఁడు ముచ్చును గోహిం
సనకరుఁడు విప్రహరుఁడు, జ్జనహంతయు నాస్తికుండు నరకప్రాప్తుల్. 238

క. తరుచరరాజును నన్నుం, బరిమార్చితి నీవు సత్సభాస్థలమున ని
ద్దురితము వాయఁగ నీకుం, బురుషార్థముఁ గాఁగ నెట్లు బొంకెదు పోలన్.

క. ఇల బ్రహ్మక్షత్రియులకు, నలువుగ భక్ష్యములు పంచనఖములు గలజీ
వు లయిదు శ్వావిత్కూర్మం,బులు మఱి గోధియును శశకమును శల్యకమున్.

క. నినుబోఁటిధర్మపరు లగు, ఘనులకుఁ గపితోలు దాల్పఁ గా దస్థి కరం
బున ముట్టరాదు మాంసం, బు నములఁ గా దేల నన్నుఁ బొలియింపంగన్.

క. నీ వొకభూనాథుఁడవే, నీ వేలెడుభూమి యెల్ల నిష్ఫల గాదే
కేవలషండునకును శ్రీ, లావృత యైనసతి పత్ని యైనవిభాతిన్. 242

క. జననుతపుణ్యుఁడు దశరథ,జననాథుం డిట్టిపాపజాతిఁ గృపాదూ
రుని సాధుబాధకాటో, పుని నిను నేమికొఱ గాఁగఁ బుట్టించె నొకో. 243

క. అతిగూఢచరితుఁ గపట,వ్రతు నినుఁ గాన కనిఁ బాపవశమున ఘనద
ర్పితుఁ డగునీచేతం జ, చ్చితి నిద్రితనరుఁడు పాముచేతం బోలెన్. 244

క. ననుఁ గానకుండఁ గపటం, బునఁ జంపితి గాక నీవు భుజబలమున నేఁ
గనుఁగొన నని మొన నిలిచిన, నిను నంతకుఁ గూర్చి పుచ్చనే యవలీలన్.

క. ధరణిజఁ జెఱ వట్టినని, ర్జరరిపుఁ డగురావణుఁడనె రాజ్యము గొని నిర్
బురి వెడలఁగఁ ద్రోయించిన, భరతుండనె నీవు నన్నుఁ బగగొని చంపన్.

క. విను నృప నేఁ జావక మున్, నినజునకున్ నాదురాజ్య మేలఁగఁ దగునే
యని వానికిన్నై తగ వఱి, ననుఁ జంపితి గాక నీ వనయమార్గమునన్. 247

చ. జనవర నన్నుఁ బంచినఁ బ్రచండబలంబునఁ బట్టి పంక్తివ
క్త్రుని మెడగట్టి నీకడకుఁ దోడ్కొని ముంగటఁ దెచ్చి పెట్టనే
జనకజ నబ్ధిఁ బెట్టిన భుజంగమలోకమునందుఁ బెట్టినం
బొనరఁగఁ దెచ్చి యశ్వతరిఁ బోలె సమర్పణ నీకుఁ జేయనే. 248

వ. అని పలికి బాష్పంబులు దుడిచికొని యల్పచేతనుం డై రాముని దూఱనాడక
యూరకుండె నప్పుడు. 249

క. కుపితమహాతేజుం డగు,తపనునిపగిది నుపశమితదహనునికరణిన్
వ్యపగతజలమేఘముగతి, విపులబలం బేది యున్నవిబుధేంద్రసుతున్. 250

క. వాలిం గనుఁగొని రఘుభూ, పాలాగ్రణి యపుడు వేగపాటునఁ జాలన్

బోలఁగ ధర్మార్థసమే,తాలాపముల నిటు లనియె । నాతనితోడన్. 251

క. వనచరధర్మముఁ గామం, బునవర్తన లోకసమయ।మును నెఱుఁగక న
న్నును నిందింపఁగ నగునే, యనుజునిభార్య రుమఁ జెఱుప । నగునే నీకున్. 252

క. జాత్యంధులతోఁ గూడిన, జాత్యంధుఁడుఁబోలె నీవు । చపలకపులతో
నిత్యముఁ జపలుఁడ వై సాం, గత్యము గావింపఁ దగవు । గానక నన్నున్. 253

క. పలుమఱుఁ గాపేయంబునఁ, దలరక పలికెదవు నీవు । ధర్మాధర్మం
బుల నెఱుఁగవు పోలఁగఁ బె, ద్దలధర్మము లాత్మఁ దలఁపు । తలఁచిన నీకున్.

క. రభసంబున నీచేసిన, యభిమతదుష్కృతము గాన । నయ్యెడుఁ గార్య
ప్రభవము లగుజనులశుభా,శుభములు హృదయాంతరాత్మ।సూచుచునుండున్.

సీ. మృగయుండు మృగముల । నొగిఁ బొంచి వెసఁ జంపుఁ
గానకుండఁగఁ జంపుఁ । గడఁకఁ జంపు
విముఖంబు లై యుండ । వే చంపు మఱి సమ్ము
ఖంబున నుండఁగఁ । గడఁగి చంపు
వలబోను లాదిగా । బలుయంత్రములఁ జంపు
వడి మీఱుశునకాలి । పిడిచి చంపు
మఱియొక్కమృగముతో । మలసి పోరఁగఁ జంపు
దీమంబునకుఁ జేర్చి । తెగువఁ జంపు
నెన్ని భంగులనయినమాం।సేచ్ఛమృగము,నరులుచంపుదురిలదాన।దురితమొంద
రఖిలధర్మార్థకోవిదు । లైనరాజ,వరులు మృగయాభిరతు లైన।వారు కారె.

క. నీవును శాఖామృగమవు, కావున నే రాజ నయిన।కాకుత్థ్సుఁడ నా
పావకనిభశరమున నీ. జీవంబులు గొనుట నాకు । శీలమ కాదే. 257

వ. అదియునుం గాక. 258

క. జను లొనరించినపాపము, పనుపడ జననాథుఁ బొందుఁ । బ్రాయశ్చిత్తం
బున నాదురితము వాయును, జనులకు నృపశిక్ష డాయు । సకలార్థంబుల్. 259

మ. అనుజన్మప్రియపత్ని యైనరుమఁ గా।మాంధుండ వై కాంతతో
ననిశంబున్ రమియించె దీదురిత మిం।పారన్ వినం గూడునే
యనుజస్త్రీరతుఁ బాపకర్ము నిను దు।ష్టాచారు రా జైనయే
ననిలోఁ జంపినయీయఘంబునకుఁ బ్రా।యశ్చిత్త మేపారునే. 260

క. ధరలో దివిజులు ధాత్రీ, వరరూపంబులు ధరించి । వర్తింతురు వా
రురుధర్మజీవితసుఖో, త్కరదాయకు లఖిలభూమి।తలవర్తులకున్. 261

తే. కానఁ బ్రత్యక్షదేవత । లైనయట్టి, ఘనుల రాజుల శపియింపఁ । గాదు ధిక్క
రింపఁగాఁ గాదు క్రొవ్వునఁ।జంపఁగాదు, వారి కప్రియములు పల్క।వలనుగాదు.

క. ఘనతరపాపంబులు సే, సినవారలు రాజుచేత । శిక్షితు లయి తా

రనిమిషలోకము గాంతురు, సునిశితధర్మంబుచేత సుజనులువోలెన్. 263

క. కావున నాశరమునఁ దెగి, నీ వఘముల నెల్లఁ బాసి నిర్మలతరపు
ణ్యావాసం బగుదివిజేం, ద్రావాసంబునకుఁ బోయె దంచితమహిమన్. 264

చ. అన విని వాలి రామునకుఁ బ్రాంజలి యై జననాథ బాణవే
దన సహియింపలేక నినుఁ దాఁకఁగ నాడితి నీవు వారిజా
సనదివిజేంద్రతుల్యుఁడవు సమ్మతి నక్షమియింపు మాదరం
బెనయఁగ జూడు మంచును సమీక్షణతత్పరుఁ డయ్యె నయ్యెడన్. 265

—రామబాణహతుం డగువాలిం జూచి తార లోనగువారు దుఃఖించుట.—

చ. అలఘుఁడు వాలి రామవసుధాధిపుఘోరశిలీముఖంబుచే
నిలిగినవేఁడిమాట విని యెంతయు నుల్లము జల్లనంగఁ గొం
దలపడి తార యంగదుఁడుఁ దాను మహీస్థలి వ్రాలి బిట్టు మూ
ర్ఛిలి మఱి యెట్టకేలకు సచేతన యై కనువిచ్చి చూచుచున్. 266

క. అప్పుడు చాపధరుం డగు,నప్పురుషవరేణ్యు రాము నస్త్రహతుం డై
దెప్పర మొందినవాలినిఁ, దప్పక వీక్షించి రచటితరుచరు లెల్లన్. 267

ఉ. ఎంతయు భీతి యూథపవిహీనమృగంబులుఁబోలె నార్తు లై
వంతలఁ బాఱుదేరఁ గని వాలి పరాక్రమశాలి రామభూ
కాంతునిచేతఁ జిక్కెఁ బ్లవగప్రభు మీపతిఁ బాసి దూరదే
శాంతర మేఁగుఁ డింకను వనౌకసులార యనూనదుఃఖు లై. 268

వ. అని తార పలికిన విని యంగదసహచరు లగునవ్వాలిహితయూథపవీరు లేము
లుబ్ధకులు దమలో నాలోచనంబు సేయ వింటిమి వాలి రామబాణహతుం డై
చిక్కినయెడఁ గొందఱు సమీపకాననంబులం గళత్రవంతులు నిష్కళత్రులు
నయి మన కహితు లయినమేటివనచరు లున్నవారు వారలు మనకుం గలగిరిదుర్గ
వనంబులను గిష్కింధానగరంబును నాక్రమింపకుండ వలయు మామాటలు విను
మనుచుఁ దారతో నిట్లనిరి. 269

ఉ. అంగన నీవు సేమమున నంగదుతో మరలంగ నేఁగు మీ
యంగదు వాలిరాజ్యమునఁ గారఁగఁ బట్టముగట్టు శూరుఁ డై
యంగదుఁ డాప్తవానరసహాయత నీపురి యేలనిమ్ము వా
లిం గడతేర్చె నంతకుఁడు లీల భయంకరరామమూర్తి యై. 270

వ. అనినఁ దార వారల కిట్లనియె. 271

చ. అకట సురేంద్రపుత్త్రుఁడు మహాత్ముఁడు రామశరాభిఘాతుఁ డై
యొకరుఁడ యున్నవాఁడు సమరోర్వి శయించి మదీశుఁ డొక్కకు
త్తుక యగుచున్నయట్టిపతితోడిద లోకము నాకుఁ గాన హే
యక మగురాజ్య మేమిటికి నంగదుఁ డేటికి జీవ మేటికిన్. 272

క. అనిపలికి తలయు మొగమును, ఘనకుచకుంభములు నురముఁ గడునొవ్వఁగ లా
వున నడిచికొనుచు నొలుచుచుఁ, గనుఁగవ బాష్పములు దొరఁగఁ గడు వేగమునన్.
వ. రాఘవామోఘశరపాతితుం డైన వాలిపాలి కేతెంచి యచట నున్న రామలక్ష్మణ సుగ్రీవులం గనుంగొనుచు ముందట బహుప్రహారజర్జరితాంగుండును రక్తసిక్త ధూళిధూసరితాంగుండు నగుచు నేలం గూలి మహావాతపతితభూజాతంబుచందంబునఁ గంఠీరవంబు కబళించినశుండాలంబుపోలిక వజ్రివజ్రాయుధంబునం గూలిన కులశైలంబునుంబోలె రణభూమిం బడి యున్నవాలిం గదిసి పోల నాలోకించి తార తనయుండునుం దానును బిట్టు నేలం బడి మూర్ఛిల్లి కొంతదడవునకుం దెలిసి యత్యంతదుఃఖాక్రాంత యై యక్కాంత యమ్మ ధూళిగా మోఁది కొనుచు హానాథ హావల్లభ హావానరేశ్వరా హాదేవా హారణవీరా కాలిత్రిం జెడితి ధూళిం గలసితి ననుచు బహుప్రకారంబులఁ గురరియుంబోలె విలపించుచు నేలం బడి దీనవదనుం డై యున్నయంగదుని నధికదైన్యంబున శోకించువాలిమంత్రుల నాలోకించి కడుదుఃఖిత యై యున్నసమయంబున. 274
క. ఘననాదంబుల నేడ్చుచు, వనచరపతిపత్ను లెల్ల వచ్చి మహారో
దనములు దుఃఖమ్ముల గొన,కొనఁ జేసిరి తారఁ బట్టికొని దెస లద్రువన్. 275
వ. అట్లు శోకించి యుపశమించి యానవతులు తారం గనుంగొని. 276
చ. అధిపతి యైనవాలి సమరావనిఁ గూలుటఁ జేసి శోకతో
యధి మునుగంగఁ బాలయితి మద్భుతరాఘవసాయకంబున
న్విధవల మైతి మందఱము నిక్కముగా వగ మాకు లేదె యి
వ్విధమున నేల గోడ్చెదవు వేమఱు వారక తార నీ వనన్. 277
వ. శోకంబు సైరింపం జాలక యత్తార యధికదుఃఖావేశంబున. 278

—తారావిలాపము.—

ఉ. వాలినిఁ గౌఁగిలించుకొని వల్లభ యంగదు నీకుమారు ని
ట్లేల ప్రియంబుతోఁ బిలువ వేటికి శోకము మానిపింప వి
ట్లేల సుతుండు నేలఁ బడి గోడ్వఁగ నక్కున గ్రుచ్చి యెత్త వి
బ్బాలకుఁ డింక నెవ్వరికి బంటయి కొల్వఁగ నేర్చు నక్కటా. 279
చ. కదనమునందు జర్జరితకాయుఁడ వై యురురక్తపూరముల్
ప్రదరముఖంబునన్ వెడల బాహుబలం బఱి బాణవేదనం
బొదవఁగ నేలఁ గూలి యిటు లుండఁగఁ జూచుచు నున్నదాన నా
హృదయము వేయివ్రక్క లయి యీల్గను దైవమ యేమి సేయుదున్. 280
క. తగ దనక యనుజుభార్యం, దెగువ మెయిం జెఱిచి తీవు ధృతి సెడి తోఁబుట్టుగుఁ బురము వెడల నడిచితి, పగగొని యాఫలము నిన్నుఁ బడవైచె నిటన్
వ. అని విలపించి సుగ్రీవుం గనుంగొని. 28

మ. అని నీయగ్రజు వాలి నర్కసుత నే § ర్పారంగ శాసించి తిం
క నళంకంబుగ సాధ్య మయ్యె రుమతోఁ § గామోపభోగంబు ల
త్యనురాగంబునఁ బొందుచుం బ్లవగరా § జ్యం బేలు దుఃఖించుచు
న్నననుం దోడిసపత్నులం గని మదిన్ § నందింప కాసక్తితోన్. 283

వ. అని పలికి దుఃఖావేశంబున. 284

చ. తనపతిపాదమూలమున § దైన్యముతోఁ బడి తార యేడ్చుచున్
వనచరనాథ నీవెనుక § వచ్చెదఁ బాయఁగఁ జాల నిన్ను నా
ఘనతరమాంసఖండములు § కాకులు గ్రద్దలు జంబుకాదులుం
దనియ భుజింపఁ బ్రాణములు § దద్దయు సమ్మతి నీకు నిచ్చెదన్. 285

చ. తనప్రియపుత్త్రుఁ డంగదుఁడు § దైన్యము నొందఁగ డించి నాథుతో
ననుగమనంబు సేయు టిది § యర్హము గా దని ప్రాకృతాంగనల్
కనుకని నాడ నిమ్ము చనఁ § గాఁ బతితోడివ నాకు లోక మ
త్యనుమతుఁ డైనఁ గాక ఖలుఁ § డైనను నాథుఁడ లోక మింతికిన్. 286

క. జనకునితో సోదరుతోఁ, దనయునితోఁ దాతతోడ § దగుమైత్త్రిం జ
చ్చినసతికిం బతితోఁ జ, చ్చినగతిఁ గైవల్యపదము § చెందం గలదే. 287

క. జనని యొకయెగ్గు సేసినఁ, దనయుఁడు గోపించుఁ గాంత § తనతోఁ గోపిం
చినఁ బ్రియపడుఁ బతి యిటు చె,ప్ప నిలన్ సతికిఁ బతిఁ బోలు § బంధుఁడు గలఁడే.

వ. అని పలికి తనభూషణంబులు పుచ్చి తొలంగవైచి యప్పుడు భూషణవిహీన యై చంద్రునిం బాసినశర్వరియుంబోలె బాష్పసంరుద్ధనయన యై యుపరాగయుక్త రోహిణియుంబోలె విలసిల్లి దివినుండి పడినట్లు నేలం ద్రెళ్లి పాంసుదూషిత సర్వాంగి యై యొడ లెల్ల ధూళి బ్రుంగఁ బొరలి యేడ్చుచు మఱికొంతదడవునకు లేచి సుగ్రీవునిం జూచి యధికరోషావేశంబున. 289

క. పతివధయు శస్త్రవధ సతి, కతివకుఁ బతి లేనిజీవ § మది యేటికి నా
పతిఁ జంపితి నీచేఁ జ,చ్చితి నేనును నీవు బ్రదుకు § సేమముతోడన్. 290

క. అని తార పల్క లజ్జా,వనతాననుఁ డై మనంబు § వందఁగ నిలఁగ
న్గొనుచు మఱుమాట వలుకక, యినతనయుం డూరకుండె § నెంతయు భీతిన్.

వ. అప్పు డా తార వనచరస్త్రీలు బహువిధంబుల బోధింపఁ గొంత సహించి క్రమ్మఱ దుఃఖం బెత్తి వాలి నాలింగనంబు చేసి యంతర్గతంబున. 292

క. సంగతజాతాంగపరి, ష్వంగాంచితసుఖముకంటె § శవ మై యి ట్లు
న్నం గాంతునియంగపరి,ష్వంగము గావించు టధిక § సౌఖ్యము నాకున్. 293

వ. అని పలికి. 294

క. నీమానము నీగుణములు, నీమన్ననతోడిచూపు § నీమధురోక్తుల్
నీమందస్మితవదనము, నీమోహముఁ దలఁచి మనము § నీఱుగఁ జొచ్చెన్. 295

వ. అని విలపించి రామచంద్రు నుద్దేశించి తార యి ట్లనియె. 296

—తార రాఘవుని శపియించుట.—

మ. పరుతోఁ బోరఁగఁ బొంచి నావిభునిఁ జంపం బాడిగా నీకు లా
వరి వైనం బొడసూపి కయ్యమున నిర్లజ్జం జూచి గోశ్యక్తిమైఁ
బరఁగం జంపఁగ రాదె నీ కహిత మాపాదించెనే యీకపీ
శ్వరు నిష్కారణ మేల చంపి తతిదోషం బిట్లు గావింతురే. 297

క. వనమున వన్యాశను లయి, యొనరఁగ మనువారి రామ యూరక చంపం
జనునె మహాత్ములు వనితల, వనచరుల నధర్మ మనుచు వధియింప రిలన్.

తే. ఇత్తెఱంగు దోష మగుట నీకు వెఱుఁగకునికి, వాలిపాలియభాగ్యంబు వాలిపత్ని
నయిననానోముఫలము గాకరసిచూడ, నిజము నీ వేమి సేయుదు నృపవరేణ్య.

క. నరవర యాకులకొఱకు, న్వరఫలయుతచూతతరువు నఱకఁగ నగునే
ధరణిజతోడనె నీసురు,చిరపుణ్యగుణమ్ము లెల్లఁ జెడిపోయె నొకో. 300

ఉ. అక్కట నీవు వానరసహాయము గోరిన వాలి పంపఁడే
దిక్కుల కెల్ల వానరుల దిగ్గునఁ దాఁ జని భూరిశక్తిమై
రక్కసులన్ బలాఢ్యుఁ డగురావణునిన్ వధియించి సీత నీ
వక్కజ మంది చూచి ముద మందఁగ ముందటఁ దెచ్చి పెట్టఁడే. 301

క. పోలఁ బతివ్రతఁ గావున, నోలిం బొలియన్ శపింప నోపుదు నీ వి
ట్లాలిం గోల్పడి వగలం, గ్రాలెదు నిను వేఱ యేల కడఁగి శపింపన్. 302

చ. నరవర యి ట్లకారణమ నాపతిఁ జంపితి గాన యీవు బం
ధురభుజశక్తితో మహిజఁ గోరొనివచ్చిన సీత నీకడం
జిరతర కాల మింపుగ వసింపక నీ వతిదుఃఖపాటుతో
నెరియుచు నుండ భూమిఁ జొర ని మ్మనుచున్ శపియించెఁ గన్కతోన్. 303

వ. అట్లు శపియించి దుఃఖంచుచు నేలంబడి పొరలి యేడ్చుచు బహుప్రకారంబుల.

చ. అడలుచుఁ దార వాలిశిర మంకమునం దిడి చూడ్కి బాష్పముల్
వడియఁగ నేడ్చుచున్న మఱి వాలి ప్రియాంగనరోదనంబు లే
ర్పడ విని నేత్రముల్ దెఱచి పత్నిఁ బ్రియాత్మజు దీనవక్త్రునిం
బొడగని దుఃఖ మంది రఘుభూపతిఁ జూచి యుదగ్రకోపుఁ డై. 305

వ. అప్పు డధికదుఃఖతుం డై వాలి ప్రాణాంతకరం బైనవేదన సహింప లేక పరుష
వాక్యంబులతో రామచంద్రున కి ట్లనియె. 306

క. శమమును దానము ధర్మము, క్షమయును బటువిక్రమంబు సత్యంబును శీ
లము దుర్జనశిక్షయు భూ,రమణునకుం గలుఁగ వలయు రాజితగుణముల్.

వ. వనమృగంబు లగుమా కీగుణంబులు వలదు గాని మీబోఁటిరాజులకు వలవ

నీయందు ధర్మగుణంబు లేశంబును లేదు నిజవ్రతభ్రష్టుండ వై పరహింస సేయం
దొడంగినవాఁడ వని పలికి వెండియు. 308

చ. కనకము వెండియుం బసిఁడి । కాయము భూమియు వైరమూలముల్
వనములఁ గాయ పండు దిను । వన్యమృగంబుల మేము మాయెడ
న్ధనఫలలాభ మొంద దిటు । నన్ను నకారణ మేల నిర్దయన్
హననము సేసి తీవు ముని । వైనమహాత్ముఁడు హింస సేయునే. 309

సీ. ధర్మక్రమంబున । ధరణిఁ బాలించుచు, భరతుండు మృగపక్షి । నరులఁ గూర్చి
దుష్టనిగ్రహమును । శిష్టరక్షణమును, జేకొని సమవృత్తిఁ । జేయుచుండు
నెల్లవానరవీరు । లేనును భరతాజ్ఞ, నెడపక నర్తింతు । మెల్ల చనఁగఁ
దప్పు గల్గిన మమ్ముఁ । దగవుతో భరతుండు, దండింప మా కొడ । యుండు గాక
నీవు రాజ్యంబు సెడి వచ్చి । నిక్కమైన, తపసిగతి జటావల్కల । ధారి వగుచు
నడవినుండి యర్హపథంబు । విడిచి నన్నుఁ, గడఁగి శిక్షింప నీ కేమి । కారణంబు.

క. రామావిరహాతురతను, గామాతురచింత నొంది । ఘనతరధర్మం
బేమియుఁ గాన కధర్మము, గామించి యొనర్చి తీవు । కడు దుర్బుద్ధిన్. 311

వ. అని పలికిన నవ్వాలితో రామచంద్రుం డి ట్లనియె. 312

క. జనకుఁడు జ్యేష్ఠభ్రాతయు, ఘనవిద్యాప్రదుఁడు ధర్మ । కార్యములయెడన్
జనకసమానులు తమ్ముఁడుఁ, దనయుఁడుఁ బ్రియశిష్యుఁడును సు । తప్రతిమానుల్.

క. లౌకికమును ధర్మంబును, గైకొన కీ వనుజుభార్యఁ । గామాంధుఁడ వై
చేకొంటి వాయఘంబున, నీ కీవిధి వచ్చెఁ గ్రూర । నిశితాస్త్రమునన్. 314

శా. నిన్నుం జంపఁ బ్రతిజ్ఞ వానరసభన్ । నిక్కంబుగాఁ జేసితిన్
నిన్నుం దున్మక నాకుఁ బోవ నగునే । నెయ్యంబు గావించితిన్
ము న్నే నర్కజుతో వయస్యునిపనిన్ । మోదంబుగాఁ దీర్ప కు
న్నన్నా సౌహృద మేల దుష్టచరితు । న్మన్నింపఁగా వచ్చునే. 315

వ. అది గావున రాజులకు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనంబు లర్హకృత్యంబులు నిన్ని
విధంబున వధించుట యర్హంబు మనఃఖేదంబు విడువు మదియునుం గాక. 316

క. భరతుండు దురాచారులఁ, బోరిగొను మని నన్నుఁ బంపఁ । బూని తదాజ్ఞం
బరఁగ నిట వచ్చి తగవునఁ, బరిమార్చితి నిన్ను ననుజ । భార్యాపహరున్. 317

వ. అని యిట్లు రామచంద్రుండు ధర్మార్థయుక్తంబుగాఁ బలికిన నిరుత్తరుం డై మంద
బుద్ధియు నష్టసర్వేంద్రియవర్తనుండు నవశుండు నై యూర్పులు పుచ్చుచు నం
గదసుగ్రీవులం జూచి యధికరోదనంబు సేయుచు మెల్లనియెలుంగున వాలి
తమ్ములవిందుచూలిం గనుంగొని. 318

—వాలి తారాంగదులనుగూర్చి సుగ్రీవునితో నొప్పగింతలు పెట్టుట.—

క. కంఠగత మయ్యె జీవము, కుంఠిత మయ్యెడును రామ । ఘోరప్రదరో

ల్లుంఠితదోషుఁడనై వైఁ, కుంతమునకు నరుగువేళ గూడె నాకున్. 319

సీ. భానుజ రాజ్యంబుఁ బ్రాణము సర్వస్వ,మును డించి సురపురంబునకుఁ బోవు
చున్నాఁడఁ గపిరాజ్యము న్నాపుర శ్రీలఁ, గైకొమ్ము కామాంధకార మడర
దగవును ధర్మంబుఁ దలఁపక తమ్ముఁడ, నీ కెగ్గుఁ జేసితి నీచబుద్ధి
నాతప్పు సైరించి భ్రాతృసౌహార్దంబు, నామీఁదఁ బాటించి నడవు మింకఁ
దొరఁగుబాష్పధారలమోము దొప్పఁదోఁగ
నెగలు మిగులంగ నేడ్చుచు వసుధ వ్రాలి
ధూళిధూసరగాత్రుఁ డై చాలఁ దూలి
యున్నవాఁ డంగదునిఁ గంటె యుల్ల మెరియ. 320

శా. ఈతారాసుతుఁ డైనయంగదు సుఖాస్వీతాత్ముఁ గా నీగతిం
బ్రీతిం బెంచితి నింతకాలము కడుం బెంపొందఁ బ్రాణప్రియుం
డీతం డెంతయు నాకు నర్కసుత నీ వీపట్టి నామాఱుగాఁ
జేతోదుఃఖము వాయ గారవమునం జేపట్టి రక్షింపుమీ. 321

క. ఈతఁడు మత్సదృశబలా, న్వీతుం డితనికి నీవ యెప్పుడు నింకన్
దాతవు నేతవును బరి, త్రాతవు యువరాజుఁ జేయు తగ నీపుత్రున్. 322

ఉ. రాముఁడు రావణున్ గెలిచి రాజస మొప్పఁ బరాక్రమంబునన్
భూమిజఁ దోడితే నటకుఁ బోయినయప్పుడు నీవు చూడ సం
గ్రామములోన నీకుఁ గడుఁ బ్రాపయి ముందట వీఁడు రాక్షస
స్తోమముఁ ద్రుంచి వైచి యతిదోర్బలసంపద వాలెడుం దగన్. 323

క. ఈతార సుషేణుని సుత, యాతతజపశీల సువ్రతాన్విత పరఁగన్
నీతిపరురాలు గావున, నీతార సుబుద్ధి నడపు మెడపక యెపుడున్. 324

క. రాముఁడు పంచినకార్యం, బేమఱ కటు సేయు వేగ మెంతయు వేడ్కం
దామసమునఁ దత్కార్యం, బేమఱినను నన్నుఁబోలె హింసించుఁ జుమీ.

వ. అని యిట్లు పలికి రామచంద్రుం గనుంగొని. 326

క. కరములు మొగిడిచి భక్తిని, శిరమునకుం జేర్చి మ్రొక్కి సీతేశునితో
వరమతి నంగదుకొఱకుం, దరుచరపతి యైనవాలి తగ నిట్లనియెన్. 327

—వాలి యంగదుని రామున కొప్పగించి మృతుం డగుట.—

క. ఘనుఁడు నుదారకులుండును, ననుపమభుజబలుఁడు నైన నతిదుఃఖము పొం
దినఁ గృపణుఁ డగుచు నుండును, జనవర యటు గాన నేను సమసినమీఁదన్.

క. ఘనతరశోకముపాల్పడి, యనిశము నాసుతుఁడు గృపణుఁ డై యుండఁ గలం
డని యెంతయు శోకించెద, మనమున నిట నాదుకొఱకు మఱుఁగ నరేంద్రా.

క. నానందనుఁ బ్రియమున మును, గానక మన నింకఁ బాపకర్ముఁడు దివముం
గాననివిధమున నంగదుఁ, గానక పోనకట నాకుఁ గాలం బయ్యెన్. 330

క. నరవర లోకుల కెల్లను, శరణుఁడ వగునీవ దిక్కు సమ్మతి నాకుఁ
వరసుతుశోకము వాయఁగఁ, గరుణఁ రక్షింపుమయ్య కారుణ్యనిధీ. 331
వ. అని తనతనయు నప్పగించి వాలి యన్న రేంద్రుతో మఱియు ని ట్లనియె. 332
క. కనకశతపత్త్రమాలిక, యెనయఁగ నా కింద్రుఁ డిచ్చె నీమాలిక నే
ఁ గొను నీవొండెను నీయను,జున కి మ్మొండెఁ దగ నిమ్ము సుగ్రీవునకున్. 333
వ. అని పలికిన రామచంద్రుండు ముదం బంది యింద్రనందనుం జూచి నాశరంబు నం బావనుండ వైతి వింక మహేంద్రలోకంబున కరుగు మని పలుకఁ దత్ప్రసాదంబునకుఁ బ్రహర్షించె నప్పుడు రాముండు సుగ్రీవ నీ వీకాంచనమాలిక దాల్పు మన నారాముని యానతియు సుత్రామతనూభవుననుజ్ఞయుం బడసి హేమమాలిక తామరసాప్తసూనుండు ధరియించె ననంతరంబ వాలి యంగదు నూరార్చి దుఃఖంబు దీర్చి ప్రియంబున ని ట్లనియె. 334
చ. ఇనజునిచిత్తవృత్తిఁ జరియింపుము నిన్నతఁ డేనుబోలె మ
న్ననఁ దగఁ బ్రోచుఁ దద్రిపుజనంబులసన్నిధి నుండ కర్కనం
దనునకు నప్రసంగ్రహ మొకనర్పు మొగిఁ సుఖదుఃఖముల్ క్రమం
బున నిను దేశకాలములఁ బొందినఁ జేకొను మొక్కరూపునన్. 335
వ. కుమారా నీ వింక నామీఁదిభక్తియు మోహంబును జాలించి దుఃఖం బుడుగు మని యూరార్చె నంత న వ్వాలికి. 336
క. కనుఁగవఁ జీఁకటి గవిసెను, మనమున మఱపొదవె నెలుఁగు మందంబయ్యెఁ
విను టుడిగె నవశ మయ్యెం, దను వసువులు సంచలించెఁ దల్లడ మొదవెన్.
వ. అప్పుడు రామునిబాణంబు ప్రాణంబులు వెఱుకఁ గన్నులు తేలగిలవైచి తీక్ష్ణరదనంబులు గానంబడ వాలి వివృతాననుం డై జీవంబులు విడిచెఁ దదనంతరంబ సకలవనచరులును హాహాకారంబులు సేయుచు నధికదుఃఖంబుల విలపించిరి తార మృతుం డయినపతిం జూచి నేలం బడి పొరలి యాలింగనంబు సేసి ముఖాస్వాదనంబు సేయుచు నధికశోకంబున హానాథ హావీరవరేణ్యా హాకపిశేఖరా యీవిషమరణతలంబున నీ వొక్కరుండవు పడి యున్నవాఁడవు ఋక్షవానరు లనేకులు నిన్నుం బరివేష్టించి దుఃఖించుచున్నారు నన్ను నంగదు సుహృజ్జనుల నేల సంతోషపఱుపవు నీపుత్త్రుం డయినయంగదుండును భృత్యామాత్యులుఁ జుట్టాలునధికశోకంబునవిలపించుచున్నారు మమ్ము నెఱుంగ వేల లెమ్మనుచుం బలికి.
సీ. అంగదుచే వింటి నధిప సుగ్రీవుఁడు, కాకుత్స్థుశరణంబు గనియె నంటి
రామునిప్రాపున నిన్ను రవిజుఁ డాజికిఁ బిల్వ, వచ్చినవాఁడు పో వలవ దంటి
నారామునితో సంధి యలవడఁ గావించి, భయ మేది నెమ్మది బ్రదుకు మంటి
రాముండు నీచేత రణమునఁ జిక్కఁడు, శక్రముఖ్యులకు నసాధ్యుఁ డంటి
మనఁగ నాబుద్ధి వినక నా మన్నిగొంటి, వింక నీశోకవారాశి నెట్లు గడతుఁ

దిక్కుమాలితినింక నే § దిక్కు సొత్తుఁ, గుటిలదైవంబు నిన్నుఁ ద్రె § క్కొనియెనకట.

క. ననిచినప్రియుఁడవు భర్తవు, ననుపమబంధుఁడవు నాకు § నయ్యును నిటు న
న్ను ననాథఁ జేసి యెక్కడి కేఁ, జనునే దిగవిడిచి పోవ § శక్రతనూజా. 340

క. తనవిభుఁడు లేనికాంతను, ధనధాన్యసమృద్ధ నైనఁ § దగుపుత్రిణి నై
నను విధవ యండ్రు ధాత్రీ, జను లీకష్టంపుమాట § సైఁపఁగ వశమే. 341

క. ఘనశరము నాటి నీయుర, మున నున్నను నాకు నిన్ను § మోవఁగఁ జన్నుల్
మొనలెత్తఁగ గాఢాలిం, గన మొనరింపంగ రాదు § కామం బొదవన్. 342

సీ. నాదిక్కుఁ జూడవు § నాకంటెఁ బ్రియురాలె, యుర్విఁ గౌఁగిటఁ జేర్చి § యున్నవాఁడ
వీల్గి యుండియు మాన § విలమిఁదిమోహంబు, న న్నేల విడిచితి § నాథ నీవు
తనయుఁ డంగదుఁడు మ్రొక్కినవాఁడు దీర్ఘాయు, వగుమని దీవింపు § మాదరమునఁ
బరదేశ మేఁగెదు § పట్టి నక్కునఁ జేర్చి, యెలమి మూర్ధఘ్రాణ § మేల సేయ
వకట పైఁబడి తమక మే § పార మున్ను, నన్నుఁ గౌఁగిటఁ జేర్చుచు § నలమికొందు
విప్పుడేఁ బయిఁబడి మాన § మేదియున్న, నలమి యాలింగనము చేయ § నలర వేల.

వ. అని బహుప్రకారంబుల విలపించుచున్న. 344

క. నీలుం డాలో బలువిడి, వాలియురస్స్థలము నాటి § వఱలెడునత్యా
భీలశరంబును బెఱికెను, సాలాన్విత మైనక్రూర § సర్పముఁ బోలెన్. 345

క. వనచరపతిమెయి నాటిన, సునిశితశర మపుడు వెలిఁగె § సురుచిరరుచితోఁ
దనరెడు వర్షాగమమున, ఘనగూఢోదిత తటిత్ప్ర § కాశముభంగిన్. 346

క. ఉరుతరబాణక్షతమునఁ, దరుచరపతిమేన రక్త § ధారలు వెడలెం
బొరి వర్షము గురియఁగ భూ, ధరమున వడి వెడలుధాతు § ధారలువోలెన్. 347

చ. తనపతిమోము బాష్పజల § ధారలఁ దోఁగఁగఁ దార యేడ్చుచుం
దనయునిఁ జూచి పుత్ర గుణ § ధామ దివంబున కేఁగెడున్ భవ
జ్జనకుఁడు నీవు మ్రొక్కు మనఁ § జయ్యన లేచి యతండు భక్తి మిం
చినగతి గోత్రనామములఁ § జెప్పుచు మ్రొక్కెఁ బదావలంబి యై. 348

వ. అప్పుడు తార వాలి నాలోకించి. 349

ఆ. సంగరాధ్వరంబు § సమ్మతిఁ గావించి, నాథ ధర్మపత్ని § నన్ను డించి
శాతరామబాణ § జలమున నవభృథ, స్నాన మాచరింపఁ § జనునె నీకు. 350

క. మందర మెబ్బులి వ్రేసినఁ, గొందలపడి తెగినయట్టి § గోవత్సముపో
లెం దెగిననిన్ను నేనును, నందనుఁడును బలసి నిలిచి § నారము వగలన్. 351

క. శూరునకుఁ గన్య నీఁ జన, దారయ మృతిఁ బొందు శూరుఁ § డన వేగమ యే
శూరునకుఁ బత్ని నై శుభ, గౌరవ మెడలంగ విధవఁ § గానె కపీంద్రా. 352

తే. సమరమున నీవు మాయావిఁ § జంపినపుడు, చాలనీవిక్రమముచూచి § సంతసమున
విబుధవిభుఁడు నీ కిచ్చెను § విజయశీల, కనకమాలిక నీమెడఁ § గాన నిపుడు.

క. ఆజి న్నీ వీల్గిన నిను, రాజశ్రీ వాయ దనఘ । రాజిల్లెడు నం
భోజాప్తుఁ డస్తమించిన, రాజితకనకాచలంబు । ప్రభయుం బోలెన్. 354
ఉ. ఇక్కడఁ బ్రాణముల్ విడిచి । యే దివి కేఁగెదునిన్ను వెన్కొనన్
నిక్కము నీవు నన్ విడిచి । నీకృతపుణ్యఫలానుభూతి కిం
పెక్కినయన్యలోకముల । కేఁగిన నక్కడ నిట్టు లొంటివై మోఁ
జిక్కఁ గదయ్య నన్నుఁ గృపఁ । జేకొని పాయక యుండుదే యటన్. 355
క. నీవు నను డించిపోయిన, నీవెంటనె నన్నుఁ బాసి । నినుఁ బొందెను నా
లావణ్యశుభశ్రీ లటు, గావున ననుఁ బాయఁ జనదు । కపికులవర్యా. 356
ఉ. ఇన్నివిధంబులం బిలువ । నే మన వాదటఁ జూడ వప్రియం
బెన్నఁడుఁ జేయ నీకు హిత । నే నయి యుండుదుఁ దప్పు గల్గినన్
నన్ను క్షమింపు నాథ సుర । నాథతనూభవ యింక వేగ మ
త్యున్నతపుణ్యు లొందెడుస । దుత్తమలోకముఁ బొందు సమ్మతిన్. 357
వ. అని యిట్లనేకప్రకారంబులం దార విలపించుచున్నసమయంబున. 358
క. వాలి మృతుఁ డవుట పోలఁగ, నాలో లక్ష్మణుఁ డెఱింగి । యర్కజుతోడన్
బాలుఁడువోలెం దాలిమి, మాలితి విది యేమి యకట । మఱఁగెద వింకన్.

—✿ సుగ్రీవుఁడు వాలికి దహనాదికృత్యంబు లాచరించుట. ✿—

క. తారాంగదులకు శోకము, వారింపుము వారు నీవు । వాలి దహింపం
జారఁగ నీపురి నేయియు, భూరీంధనవస్త్రగంధ । పుష్పచయాదుల్. 360
వ. వేవేగ మఱియు వలసినయవి దెప్పింపు మనుచు హనుమంతుం జూచి పావనీ నీవు వివిధవస్త్రమాల్యఘృతతైలాదినమస్తవస్తువు లెల్లఁ దెమ్ము తారుండ నీవు శీఘ్రంబ శుభశిబికం గొనిరమ్ము ఘనుం డయినవాలిని మోవంజాలువారు లగు మేటివానరు లాయత్తపడుం డని పలుకం దన్నియోగంబునఁ దారుండు గుహ సొచ్చి శిబిక గొని వేగ మేతేర నప్పుడు వాలిని వస్త్రగంధమాల్యభూషణాలంకృతుం జేసి యధికదుఃఖంబున శోకించుచు సుగ్రీవాంగదు లాకపీంద్రు నెత్తికొని తెచ్చి శిబికయందుఁ బెట్టి కొనిపోవుచు నడుమ భూమిని శిబిక యుక్తక్రమంబున డించి యెత్తికొనుచు నంగదసహిత లై తారాదికాంతలు రోదనంబులు సేయ సుగ్రీవుండును సకలభృత్యామాత్యులు నడలఁ దదీయరోదనధ్వానంబు లాకర్ణించి సకలవానరస్త్రీలు గుహ లెల్లఁ జెలంగ నధికాక్రందనంబులు సేయ విహితక్రమంబున వాలివిమానంబు గొనిపోయి పర్వతావృతం బయిన గిరినదీపులినంబున శుద్ధకాంతస్థలంబున శిబిక డించి రప్పు డాతార పతిం జూచి యవ్వాలిమస్తకంబు దనతొడలమీఁద నిడికొని యధికదుఃఖంబున. 361
ఉ. అక్కట నన్ను నీసుతుని । నంగదు నీప్రియ లైనకాంతలం
దక్కినబంధుమిత్రులఁ బ్ర । ధానుల భృత్యులఁ బట్టణంబుఁ బెం

పెక్కనరాజ్యసంపదల \ నిక్కడ డించి సురేంద్రపుత్ర నీ
వెక్కడఁ బోయె దొక్కఁడవు \ నే నెటు పాయుదు నింక వల్లభా. 362

వ. ఏ నెన్నివిధంబుల నిన్నుం బాయఁజాల నంగదుని మిత్రామాత్యభృత్యవర్గంబును వీడుకోలుపు మీాయభిరామారామంబుల నీవును నేనును రతిలీలలం దేలుద మనుచు బహుప్రకారంబులం బలవించునత్తారను వానరస్త్రీలు దొలంగం గొని పోవ నప్పుడు సుగ్రీవాంగదులు వాలిం జితిమీాఁదఁ బెట్టి యుక్తక్రమంబున దహించి బంధుమిత్రామాత్యభృత్యవర్గంబులతోడ వాలిపూర్వాపరాక్రమంబు లుగ్గడించుచుఁ బంపాసరోవరంబున కేఁగి కృతస్నాను లయి యార్ద్రవస్త్రంబుల తోడఁ దిలోదకవిధానంబు లాచరించి రామచంద్రుపాలికిం జను దెంచిన రాముండు వారిసూరార్చి పురంబున కరిగి వాలికి దశాహతంత్రంబులుఁ బారలౌకికాదికృత్యం బులు నడపు మనిన సుగ్రీవుండు రాఘవానుమతి నట్ల చేసి పూతస్నాతుం డయి యంగదుండును దానును నఖిలవానరపుంగవులును భయభక్తులతో రఘుపుంగవు పాలి కేతెంచి దండప్రణామంబులు సేసి కరకమలంబులు మొగిచికొని బ్రహ్మ ముందటిబుషులునుంబోలె నుండి రాసమయంబున. 363

క. బాలార్కముఖుఁడు గాంచన, శైలసమాంగుండు వాక్యచతురుఁడు నగువా
తూలతనూజుఁడు రఘుభూ, పాలున కి ట్లనియెఁ బ్రీతిఁ \ బ్రాంజలి యగుచున్.

శా. శుష్కారీంధనదావపావక రఘుక్షోణీశ నీప్రాపునం
గిష్కింధాపురరాజ్యముం బడసె సుగ్రీవుండు లక్ష్మీశుభా
విష్కారం బెసఁగన్ సమస్తకపులున్ \ వే గొల్వ నుగ్రాంశురో
చిష్ణుం డై విలసిల్ల నర్హ్యపదుఁ డై \ చెన్నారు చున్నాఁ డిలన్. 365

మ. కృతనిష్ఠం బరలోకసత్క్రియలు భక్తిన్ వాలికిం జేసి న
మ్మతి సుగ్రీవుఁడు మంత్రతంత్రములఁ బూతస్నాతుఁ డైనాఁడు త
త్పితృపైతామహ మైనరాజ్యమునకుం \ బెంపొంద లక్ష్మీసమ
న్వితుఁగాఁ బట్టముగట్ట నిచ్చఁ బురికిన్ \ విచ్చేయు భూనాయకా. 366

వ. అని హనుమంతుండు పల్కిన రామచంద్రుండు సుగ్రీవున కి ట్లనియె. 367

మ. జనకాజ్ఞం బదునాలుగేండ్లు చన నిష్ఠం గానలం దుండి యె
ప్పున మీాఁదన్ మఱికాని గ్రామనగరంబుల్ దూఱ నీ వింక శో
భన మందం బురి కేఁగి పౌరు లలరం \ బట్టాభిషిక్తుండ వై
సునయుం బారఁగ నర్కపుత్ర యువరాజుం జేయుమీా యంగదున్. 368

క. పోలంగ వానకాలము, నాలుగుమాసములు గడచనక శత్రుని ని
ర్మూలము సేయఁగఁ బయిఁ జనఁ, గాలము గా దింకఁ గార్తికమ్మగుదాఁకన్.

క. సరసిజకువలయపరిమళ, భరితామలసలిలయుతయుఁ \ బరిహృతపవన
త్వరయు నగుసీగిరిస్ఫుర, దురుగుహ లక్ష్మణుఁడు నేను \ నుండెద మెలమిన్.

—సుగ్రీవునిపట్టాభిషేకము.—

వ. నీవు కిష్కింధ కేఁగు మిప్పానకాలంబు చనునందాఁక నెమ్మది నుండి యంతమీఁద శత్రుని సాధింప సమస్తసేనాసమన్వితుండ వై యేతెమ్ము పొమ్మనుచుం బలికిన రామభద్రునకు దండప్రణామంబులు సేసి సకలవానరవీరులు బలసి తన్నుఁ గొలువ నుద్దీపితధ్వజపతాకాభిశోభితంబును నానావర్ణతోరణాలంకృతంబును వివిధకుసుమవిసరవిలసితరాజమార్గంబును బంచమహాశబ్దభరితంబును బరమమంగళద్రవ్యశోభితంబును నగుకిష్కింధాపురంబు సొచ్చి సకలవానరులు జయజయధ్వనులతో దండప్రణామంబులు సేయ వారి నందఱ నాదరించుచు వాలియంతఃపురంబు సొచ్చి వెడలె నప్పుడు సుగ్రీవుని నఖిలవానరవీరులు నింద్రునికి నమరులుం బోలె నభిషేచనంబుసేసి సింహచర్మంబు నించినభద్రాసనంబుపయి నునిచి భూసురోత్తములను వస్త్రమాల్యాలంకృతులం జేసి మణికనకాదివస్తువులఁ దనిపిన వారునుం గుశపరిస్తరణంబుసేసి యర్చనలెసంగ నగ్నిప్రతిష్ఠాపనంబుసేసి విహితహోమద్రవ్యంబుల మంత్రతంత్రపూతంబుగా హోమంబు సేసి గంధమాల్యవస్త్రలాజసువర్ణాక్షతాలంకృతంబులును బుణ్యనదీనదసముద్రోదకపూర్ణంబులు నగుసువర్ణకలశంబులు రెండు ముందట ధాన్యవేదికల నిలిపి వివిధాశీర్వాదమంత్రపూతంబులుగాఁ బుణ్యాహవాచనంబులు సేయఁ గెలంకుల వారకాంతలాడుచుం బాడుచుండఁ బంచమహాశబ్దంబులు చెలంగ మణిగణకనత్కంకణనిక్వణనంబులు సేయుచుఁ బుణ్యకాంతలు దమకుచకుంభంబుల బెరయుసువర్ణకుంభంబులఁ బుణ్యపావనోదకంబు లందియ్య గజగవయగవాక్షగంధమాదనమైందద్వివిదసుషేణజాంబవంతులు వసువు లింద్రునింబోలె సుగ్రీవు నభిషేకంబుసేసి రప్పుడు పట్టాభిషిక్తుం డయినసుగ్రీవునకు హేమదండమండితం బైనధవళచ్ఛత్రంబు పవనసుతుండు పట్టె నలుండును దారుండునుం గనకరత్నమయంబు లైనచామరంబులు వీవం దొడంగి రివ్విధంబున రాజ్యాభిషిక్తుం డయినభానునందనుండు వాలినందనుం డైనయంగదుని సమ్మదంబున నాలింగనంబు సేసి రఘుపుంగవు నానతిక్రమంబున యావరాజ్యపట్టం బంగదునికిం గట్టె నప్పు డఖిలవానరులు నాతగవునకు సంతోషించి సుగ్రీవుం బ్రశంసించి రభిమతంబున. 371

క. భూపాగ్రణి యగురాముని, ప్రాపునఁ గపిరాజ్యపట్టబద్ధుం డై తా
రాపరిణతుఁ డై కిష్కిం, ధాపట్టణ మేలుచుండెఁ దపనజుఁ డెలమిన్. 372

తే. అంతసౌమిత్రితోఁగూడ సంతసమునఁ, బ్రస్రవణశైలబిలమునఁ బరఁగుచున్న
రామభూవిభుఁ డానగప్రాంతభూమి, యతిమనోహరలీలల నలరుచున్న. 373

క. సురుచిరసరిదురుపరిమళ, సరసిజకువలయసరోవిసరసుమఘనభా
సురవనహిమకరకరశుభ, శరరజనులు పెల్లు వెలయఁ గామాతురుఁ డై. 374

చ. ధరణిజ నాత్మలోఁ దలఁచి తద్దయు శోకముఁ బొంది బొమ్మముల్

దారంగాఁగ వెచ్చ నూర్చుచును ♦ దుఃఖపరంపర నిద్ర లేక తా
నోరలుచు లేచుచుం వనట ♦ నొందుచుఁ గన్నులు సాము మూయుచుం
బోరిఁబోరిఁ దేఁటి చూచుచును ♦ భూవిభుఁ డుండెను దుఃఖితాత్ముఁడై. 375

వ. ఉన్నయెడ లక్ష్మణుం డన్న కిట్లనియె. 376

క. శోకము సర్వార్థంబులఁ, బోకార్చును శోక మాత్మఁ ♦ బొందక ముదమున్
జేకొని కృతకృత్యుండ వయి, కైకొను తేజంబు జయముఁ ♦ గడుధర్మంబున్.

చ. ఉరుతరవిక్రమక్రమసముద్ధతిఁ గిట్టి సమస్తలోకము
ల్దిరుగఁగ వైవఁజాలు దవ ♦ లీలను రక్కసుఁ డొక్కఁ డేఁడ నీ
కరయఁగఁ బంక్తికంఠుని సమస్తసుహృజ్జనపుత్త్రమిత్త్రసో
దరపరివారవర్గసహితంబుగఁ ద్రుంపుము కీర్తి వర్ధిలన్. 378

క. నావుడు నతిపథ్యము లగు, నీవాక్యములకు మనంబు ♦ నిర్మల మై స
ద్భావముఁ బొందితి శోకముఁ, బో విడిచితి సంతసంబుఁ ♦ బొందితి వత్సా.

వ. అనిన సౌమిత్త్రి తనయన్నను జూచి వర్షాకాలంబు వచ్చె శరత్కాలంబుదాఁక సైఁచి దండెత్తి పోయి శత్త్రుని సాధింత మనిన నగుంగాక యని యనుజసమేతుం డై యగ్గిరి నుండె నంతఁ గతిపయదివసంబులలోన. 380

—వర్షాకాలవర్ణనము.—

మ. ధృతశక్రాయుధ మింద్రగోపయుత మార్ద్రీభూతభూభాగ మూ
ర్జితవాఃపూర్ణసరస్తటాకతటినీశ్రేణీక మానందన
ర్తితకేకిప్రకరం బలక్షితదిశాదిత్యంబు నీలాంబుదా
వృతశైలౌఘము చాతకోత్సవము ప్రావృట్కాల మేపారఁగన్. 381

మ. యమునద్గంగము కృష్ణభూమదిల మబ్జాతున్మనుష్యంబు నీ
లమహీధ్రన్నిఖిలాచలావలి తమాలద్భూజ మిందీవర
త్కుముదశ్రేణి పికద్విహంగము దమస్తోమన్నిహారప్రభా
సముదాయం బగుచుండె లోక మలఘుశ్యామాభ్రముల్ పర్వినన్. 382

క. తనసుతుపగ నీఁగెడుకొఱ, కనిమిషనాయకుఁడు నిజశరాసనయుతుఁ డై
ఘనశరవర్షము గురిసెను, జనపతి యగురాముఁ డాత్మ ♦ సంచల మందన్. 383

క. దొరసినక్రొక్కారున భా, సురశాద్వలతలము లోలిఁ ♦ జూడఁగ నొప్పెన్
మరకతమణిగణములు భా, స్వరముగఁ దాఁపించి యున్న ♦ జగతియుఁ బోలెన్

క. అంతట రామక్షోణీ, కాంతుఁడు లక్ష్మణునితోఁ దగంగ ని ట్లనియెన్
సంతసమున దంపతు ల, త్యంతరతుల్ సలుప నీరదాగమ మయ్యెన్. 38

క. ఇనరుచుల సర్వరసములుఁ, బనుపడఁ దిగిచికొని గగనభామిని ధరియిం
చినయష్టమాసగర్భము, గనుపట్టె రసాయనంబు ♦ గనియెడు వేళన్. 38

క. ఘనమేఘంబులు వొదివిన, దినమునఁ దేజంబు దూలి ♦ దినకరుఁ డున్నాఁ

డనుజుఁడ యురుతరశోక, మ్మొనయంగా ముంచి యున్న। యేనుంబోలెన్. 387
క. తరణికిరణసంతాపిత, ధరణి పయస్సిక్త యగుచుఁ। దనరెడుఁ గంటే
విరహపరితాపయుత యై, పొరిఁబొరి బాష్పములు విడుచు। భూసుతవోలెన్.
క. లలితశ్యామలజలధర, కలితచలతటిన్మతల్లికలు కడుఁ జూడఁగ
వెలిఁగెడు రావణునంకస్థలమునఁ జరియించు చున్న। జానకివోలెన్. 389
తే. వికసితార్జునకాంచన। విసరభరిత, మైనయిగ్గిరి వర్షధా। రాభిషిక్త
మగుచునొప్పెడుఁ జాలశాం। తారియగుచుఁ, బ్రీతి నభిషిక్తుఁ డైనసు। గ్రీవుభంగి.
క. నీరదము లావరించిన, మారాక్రాంతజనవిసర। మానసహిత లా
నీరాత్రులు నష్టగ్రహ, తారారజనీశ లగుచుఁ। దనరెడుఁ జూడన్. 391
క. ఈవర్షాగమమున సు, గ్రీవుఁడు ప్రియసఖులుఁ దానుఁ। గ్రీడించుచు ల
క్ష్మీవిభవముతో రాజ్యముఁ, గావించుచు నున్నవాఁడు। గతవిమతుం డై. 392
క. ఏ నిపుడు రాజ్యహీనుఁడ, నై నాప్రియపత్నిఁ బాసి। యస్రులు దొరఁగఁగ
నానుచు నున్నాఁడఁ గడు, దీనత లోఁగొన్నవాహి। నీతీరగతిన్. 393
వ. అని యిట్లు వగలం బొగిలి పదంపడి రామచంద్రుండు సౌమిత్రిం జూచి సాగరం బతివిస్తారంబు గడుదుస్తరంబు మార్గంబులు గడుదుర్గమంబులు రావణుండు నవార్యశౌర్యుండు వాని సాధింపఁ గడింది వాలిం జంపి సుగ్రీవునితో సఖ్యంబు సేసితి మాతండు మనకుం బ్రియసఖుండు మనదుఃఖంబునకుం గుందుచుండుఁ జిరకాలంబు ప్రియపత్నిం బాసి యెట్టకేలకుం గూడినవాఁడు గాన పత్నీసహితుండై సుఖంపనిమ్ము మనము చేసినయుపకారంబు చెడ దతని నిప్పుడ బలిమి రప్పింపవలవదు కాలం బెఱింగి తనయంతన తా నుపకారశీలుం డై రాఁగలవాఁడనవుడు సౌమిత్రి ప్రీతుండై దేవా మీ రవధరించినట్టిద కార్యంబు భానునందనుండు శరత్కాలంబు వొడముటయు నధికసేనాసమన్వితుం డై పగఱ సాధింప మిమ్ముఁ గొల్వ నేతెంచు శరత్సమయంబుదాఁక సైరింపవలయు ననిన నగుంగాక యని యవ్వనంబున రామచంద్రుండు జానకిం దలపోయుచుండె నంత వానలు వెలిసె నన్నీరదంబులు శరదాగమనంబు చెప్ప నేతెంచినగతి నతిశుభ్రంబు లై పొడసూపె నాసమయంబున హనుమంతుండు. 394

—హనుమంతుండు సుగ్రీవుని సీతాన్వేషణంబునకుఁ బురికొల్పుట.—

క. ధర్మార్థసౌహృదంబు ల, ధర్మమతిం బోవ విడిచి। దర్పకలీలా
కర్మరతుఁ డగుచుం గ్రాలెడు, ఘర్మాంశుతనూజుఁ డున్న। కడ కేఁగి యటన్.
క. అచ్చరలతోడఁ గ్రీడలు, నిచ్చలు నందనమునందు। నెరపుచుఁ బ్రొద్దుల్
పుచ్చు సురేంద్రుఁడుఁ బోలెను, మచ్చిక విహరించుచున్న। మార్తాండసుతున్.
ఉ. రామునిఁ గానఁ బో మఱచి। రాజ్యము మంత్రులయందుఁ బెట్టి యు
ద్దామవిలాసకేళిఁ దగఁ। దారయుఁ దాను నిచ్చఁ జల్పుచుం

గామసుఖాతిరేకమునఁ గర్జముత్రోవ యెఱుంగకున్నరు
గ్రామజుఁ జేరి మారుతి హితంబును ధర్మముఁ దోఁప నిట్లనున్. 397

ఉ. రాముఁడు నీకు నిత్యచిరరాజ్యము కంటకమాఱ నిచ్చినం
గామితభోగసంపదల గౌరవ మందుచు నున్నవాఁడ వా
రాముఁ డతిప్రభావుఁడు పరాక్రమశీలుఁడు సద్గుణాన్వితుం
డామహనీయకీర్తికిఁ బ్రియం బొనరింపు కృతజ్ఞబుద్ధితోన్. 398

క. మనమున మిత్రుని మఱవక, తనమిత్రహితంబు సేయు తజ్జ్ఞుఁడు రాజ్యం
బును యశముఁ బ్రతాపముఁ గని, జనశేఖరుఁ డై చరించు సర్వశ్రీలన్.

ఉ. కావున నీకు రామమహికాంతుఁడు తద్దయుఁ గూర్చుమిత్రుఁ డా
భూవిభువల్లభన్ వెదకఁ బూనినకాల మతీతకాల మై
పోవఁగఁ జొచ్చె నర్కసుత భూమిసుతన్ వెదకంగ వానరేం
ద్రావళిఁ బుచ్చఁగా వలయు నారఘురాముఁడు సంతసింపఁగన్. 400

క. ఇలఁ బాతాళమున నభ, స్థ్సలి నంబుధి నాఁకపడక చరియింపఁగ శ
క్తులు గలవానరవీరులు, గల రెన్న ననేకు లేను గల నీపనికిన్. 401

చ. అనవుడు మారుతాత్మజునియాప్తహితోక్తుల కాత్మ నర్కనం
దనుఁడు ముదంబు నొంది నయదక్షుని నీలునిఁ జూచి వానితో
వినతులు దండపాశికులు వేగనమగ్రులు నైనవారి వే
పనుపు ప్లవంగయూథపులఁ బైపయి దిక్కులఁ గూర్చి తేరఁగన్. 402

చ. సరభసవృత్తి నేడుదివసంబులమీఁదటిదాఁక నేవనే
చరుఁ డిట రాక యుండు నతిసాహసుఁ డై మఱి వానిఁ బట్టి ని
ర్భరతరచండదండములపాలుగఁ జేసి వధింతు నంచు నా
తరణితనూజుఁ డేఁగె నిజధామములోనికి నంత నక్కడన్. 403

సుగ్రీవుండు తన్నుఁ గానరామికి రాఘవుండు చింతించుట.

శా. సోమస్ఫూర్తికరంబు నిర్మలనదీస్తోమప్రవాహంబు ని
ర్జీమూతంబు నిరస్తకర్దమధరిత్రీకంబు శుభ్రీకృత
వ్యోమాశాంతము పుల్లకాశముఁ దుషారోద్గారి యున్మిలితో
ద్దామాంభోజసరోవికాసము శరత్కాలంబు గానంబడెన్. 404

క. రాముఁడు వర్షారాత్ర, స్తోమము నొకభంగిఁ గడపి తోయదసమయం
బేమియు లేమియు భూమిజ, రామియుఁ దలపోసి శోకరాగము లెనఁగన్.

క. శరదాగమ మై యున్నది, తరణితనూజుండు రాక తడసెను దారా
తరుణీగురుతరకుచభర, పరిరంభణకామకేళిపరతంత్రుం డై. 406

వ. అని వితర్కించి హేమధాతుభూషితం బైనపర్వతాగ్రంబునం దాసీనుం డై శా
రదశ్రీ నవలోకించి సీతం దలంచి విరహచకితుం డగుచు లక్ష్మణుం గనుంగొని.

క. అలఘుతరవారిధారా, జలముల నిలఁ గలయఁ దడిపి సస్యావళులన్
ఫలియింపఁజేసి యింద్రుం, డలరెడుఁ గృతకృత్యుఁ డగుచు నవనీశసుతా. 408

క. హరివానరదర్దురని, ర్ఝరశాఖినినదము లుడిగె జలధరసమయ
స్ఫురణములు గలయ నడఁగెను, ధరణీపంకంబు లింకెఁ దటినులు డొంకెన్.

తే. కుసుమితంబులై యొప్పెడుఁ గోవిదార, పనసస ప్తపర్ణంబులు కనకరుచుల
శ్వసనతరళితకాశమంజరులు గ్రాలు, చున్న వవె మద్యమదలోలయువతులట్లు.

క. దళదుత్పలములఁ గుముద, మ్ముల వికసితపుండరీకముల సరసులు మం
జులభంగులఁ జెన్నారెడు, లలితశ్రీకలితలైన లలనలకరణిన్. 411

క. శరదాపగ లల్లనఁ దమ, సురుచిరపులినములు వరుసఁ జూపెడు నవ్య
స్మరకేళీరంజిత లగు, తరుణులు చూపెడులసన్నితంబములగతిన్. 412

చ. దళదరవిందగంధ కుముదస్మితతారకహార చంద్రికా
మలయజ బంధుజీవకుసుమస్ఫురితాధర యుల్లసన్నదీ
పులిననితంబబింబ తిలపుష్పసునాసిక యుత్పలాక్షి ని
ర్మలవిధుమండలాస్య యయి రమ్యశరన్నవలక్ష్మి యొప్పెడున్. 413

క. అరులపయిన్ రాజులు భీ, కరగతి దండెత్తి పోవుకాలము వచ్చెన్
హరిసేనతోడ నినజుఁడు, బరవసమున రాక సమయభంగము సేసెన్. 414

క. క్షితితనయఁ బాసి శోకా, న్వితమతినై యునికిఁ జేసి యెసఁగినవర్షా
గతమాసచతుష్కంబును, శతవత్సరసదృశ మగుచుఁ జనియెన్ నాకున్. 415

మ. ధరణీరాజ్యముఁ గోలుపోయి ప్రియకాంతం బాసి యత్యంతదు
స్తరశోకాగ్ని మనంబు గ్రాఁగఁగఁ బ్రవాసం బొంది యే నుండఁగా
స్మరకేళీవ్యసనైకచిత్తమున భామామగ్నుఁడై నాయెడం
బురుషార్థక్రియ దక్కినాఁడు దినకృత్పుత్రుండు కామాంధుఁడై. 41(

మ. తరుణిం గోల్పడి రాజ్య మెల్లఁ జెడి చింతం బొంది కామార్తుఁడై
పరదేశంబున దుఃఖముం బొదవ నాపద్యుక్తుఁడై వచ్చి నా
శరణం బొందినఁ గోర్కి దీర్చి నిజరాజ్యం బిచ్చితిన్ మున్న నే
శరణం బొందిన నన్నుఁ గైకొనఁడు కీశస్వామి దుష్టాత్ముఁడై. 41

—— రాఘవుండు కిష్కింధకు లక్ష్మణు నంపుట. ——

క. నాలుగునెలలకు సీతం, బోలఁగ నెల్లెడల వెదకఁ బుచ్చెద గోలాం
గూలప్రవరుల నని యి, చ్చాలాపము లాడి తప్పె నతిదుర్మదుఁడై. 41

క. కావునఁ గిష్కింధకుఁ జని, నీ వచటం గామకేళినిరతుం డగుసు
గ్రీవునితోడను లక్ష్మణ, నావాక్యంబులుగఁ బలుకు నయనిష్ఠురతన్. 4

ఉ. పాపము సేయ నొండె నతిబంధురధర్మము సేయ నొండె న
ల్లాపము లాడి సత్కృతి తలంపక బొంకెడువాఁడు నర్థికిం

జేపడ నంచితోపకృతి చేసినవానికి వాంఛితంబు సం
క్షేపమనస్కుఁడై తనరఁ జేయనివాఁడును బూరుషాధముల్. 420

క. ఉపకృతుఁడై యుపకారికి, నుపకారం బిచ్చిఁ జేయ కుండుకృతఘ్నుం
డపగతుఁడైనం దద్గా,త్రపరీతామిషముఁ దినవు క్రవ్యాదములున్. 421

వ. అని మఱియును. 422

శా. ఉద్యజ్జ్వాలత ఘోరఘోషయుత వజ్రోగ్రధ్వనిన్ మ్రోయఁగా
విద్యుత్సంఘముభంగి వ్రాలెదుసమిద్వీరాహితత్రాసనం
పాద్యస్మత్పటుదోర్వికష్టఘనచాపం బాజిలోఁ జూడఁగా
నుద్యోగింపు యమాలయంబు చొర నీకుత్సాహ మేపారినన్. 423

మ. మదవృత్తిం గడు వాలి వాలి తనకున్ మాఱెందు లే దంచు ను
న్మదుఁడై యుండఁగ నీకుఁ బూని రఘురామక్ష్మావిభుం డుగ్రుఁడై
కదనోద్దండత నొక్కయమ్మునన వ్రక్కల్ సేసె నవ్వాలి నా
ప్రదరం బిప్పుడు మొక్కవోదు నినుఁ ద్రుంపం జాలుఁ గ్రొవ్వాఁడిమిన్. 424

మ. జగతీనాథునితోడ నాడిన ప్రతిజ్ఞావాక్యముం జేసి స
త్యగరిష్ఠుండవు గమ్ము రాఘవునమోఘాస్త్రంబునం ద్రెళ్లి వే
గ గతప్రాణుఁడవై మహోగ్రయమలోకం బేఁగి యచ్చోటఁ బ్రే
తగతిం బొందినవాలిఁ జూడకు సముద్యద్బుద్ధిహీనుండవై. 425

మ. అని సుగ్రీవునితోడ నాడు చను మం చారాముఁ డుద్వృత్తిఁ బం
చిన సౌమిత్రి మహోగ్రచాపశరముల్ చేఁ దాల్చి యత్యుగ్రుఁడై
జననాథాగ్రణితోడ నిట్లనియె నా శాతాశుగశ్రేణిచే
నినపుత్రున్ విదళించెదం దునిమెదన్ హింసించెదం ద్రుంచెదన్. 426

క. అచ్చుగ సీతన్ వెదకం, బుచ్చనియాఖలుని మద్విపులబాణములం
గ్రుచ్చినఁ జచ్చి ప్రియంబునఁ, జెచ్చెర మఱి పుచ్చుఁగాక సీతన్ వెదకన్. 427

క. అనుచును రోషావేశం, బున మండుచు నున్నయనుజు భూవిభుఁడు ప్రియం
బునఁ గనుఁగొని కారుణ్యం, బెనయఁగ శాంతవచనముల నిట్లని పలికెన్.

క. ఇనజున కెగ్గొనరింపకు, మనుజుఁడ నినుబోఁటిసుజనుఁ డఘముం గావిం
చునె యన్యునిభంగి నఘము, చన నెవ్వఁడు చేయుచు వాఁడ సత్పురుషుఁడిలన్.

తే. కావునను నీవు సుగ్రీవు గాన నేఁగు, మతనితోఁ దగ సామంబు లాడు నిష్ఠు
రంబు లాడకు మనకుఁ గార్యంబు గలదు, ననిన నౌనని యన్నవీడ్కొని యతండు.

—రామప్రేషితుఁడై లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ గానఁబోవుట.—

సీ. దండధరోద్దండదండంబుకరణిఁ గో,దండంబు తనదుహస్తమున నమర
భూరిరోషస్ఫుటభ్రూకుటిభీకర, ప్రళయకాలాంతకుపగిదిఁ గడఁగ
నురుమారుతోద్ధతి నూరు వేగంబున, వృక్షషండంబులు విఱిగి కూలఁ

ప్రబలవజ్రముఁబోలెఁ బదఘాతమున నద్రిశృంగముల్ దునియలై శిలలు రాల
ధరణి గ్రుంగఁబడఁగఁ ద్వరతోడ దవ్వుగాఁ, దుంగభంగి నిడుదచెంగ లిడుచు
ఘోరరౌద్రరూపకోపుఁ డై సౌమిత్త్రి, రవిజుపురికి నేఁగె రభస మెసఁగ.

ఆ. అవ్విధమున నరిగి యనతిదూరంబున, గిరిగుహాంతరాళభరితకీశ
భూరిసింహనాదములచేఁ జెలంగు కిష్కింధఁ గాంచి కింకఁ జేర నరిగి. 432

మ. అరుదారన్ ఘనశైలశృంగతరువుల్ హస్తంబులం దాల్చి భూ
ధరధారాధరభూరికుంజరసముద్యద్గాత్రముల్ గ్రాలఁ ద
త్పురకాంతారమునందుఁ గ్రుమ్మరుకపిస్తోమంబులం గాంచి భీ
కరకాలాంతకకాలమృత్యుసముదగ్రక్రోధసంరంభుఁ డై. 433

ఉ. అప్పు డుదగ్రకోపవిలయాంతకు వైవడిఁ గ్రాలులక్ష్మణుం
దప్పక చూచి వానరులు తద్దయు భీతిలి పాఱి సొంపుతో
నొప్పెడుభానుపుత్త్రునగరుద్ధతిఁ జొచ్చి నరేంద్రనందనుం
డిప్పుడు వచ్చినాఁడు పురి కెక్కుడులావున నంచుఁ జెప్పినన్. 434

క. ఇనజుఁడు తారయుఁ దానును, మనసిజలీలావిలోలమానసుఁ డగుచుం
దనయంతస్సదనంబున, నునికిన్ రాకొమరురాక యొగి వినకుండెన్. 435

వ. ఆసమయంబున మంత్రినియుక్తులై మేఘగిరికుంజరసన్నిభులు నఖదంష్ట్రాయుధు
లు వికృతదర్శనులు వికృతాకారులు నైనయనేకవానరయూథపనికరంబులు
వృక్షపాషాణపాణులై యప్పురంబు వెడలిన నవ్వానరబలంబులం గనుంగొని సౌ
మిత్త్రి వారిలెక్కగొనక పురద్వారంబుసొచ్చిపోవుచు ముందటఁ దప్తకాంచనవేది
కంబును గైలాసనంకాశంబును నగుసుగ్రీవునినగరు పొడగని తద్ద్వారంబున నిలిచి.

క. రాణించి షడ్జమంజుల, వీణానిక్వాణన మలర విలసితవేణు
క్వాణనధురీణ మగువర, గాణిక్యమనోజ్ఞమధురగానము వినియెన్. 437

వ. తదనంతరంబ. 438

చ. మణిగణకమ్రకంకణసమంచితనూపురముఖ్యచారుభూ
షణములు దివ్యగంధములు సౌరభశోభితపుష్పమాలికల్
ప్రణుతవిచిత్రవస్త్రములు బాఁతిగఁ దాల్చి సురూపయౌవనో
ల్బణమగురేఖలం గలుగుభామల ముందటఁ గాంచె నయ్యెడన్. 439

వ. మఱియును. 440

మ. ఘనపుణ్యుం డగురామభూవిభుని దుఃఖప్రాప్తియున్ భానునం
దనురాజ్యాధికవైభవోన్నతియు నంతస్తాపముం జేయ నే
పౌనరం గోపముతోడ వేఁడు లగునిట్టూర్పుల్ మొగిం బుచ్చుచుం
గనదుగ్రాక్షులఁ దామ్రరోచు లడరం గాలాగ్నిసందీప్తుఁ డై. 441

వ. మఱియు నతిదర్పితులు నతిమదోద్ధతులు నత్యద్భుతాకారులు నగుసుగ్రీవునిపరి

వరులం జూచి రోషావేశంబున. 442

క. శరశల్యాతతజిహ్వాం, దురుకార్ముకభోగయుతుఁడు సుద్ధురతేజ
స్స్ఫురితవిషుండును నై భీ, కరపంచాస్యాహికరణిఁ గ్రాలుచు నుండన్. 443

క. ధీరుఁడు లక్ష్మణుఁడు గృహ, ద్వారంబునయందుఁ గనియెఁ దారాసుతుఁ డా
తారాసుతునిన్ లక్ష్మణుఁ, డీరస మెసఁగంగఁ జూచి యిట్లని పలికెన్. 444

క. రామునియనుజన్ముఁడ నే, సౌమిత్రిని రామునాజ్ఞఁ జనుదెంచితి సా
త్రామిజ వే చెప్పుము రు, గ్ధామజుతో ననిన నతఁడుఁ దరణిజుతోడన్. 445

ఉ. అచ్చుగ రామభూవిభునియానతి లక్ష్మణుఁ డుగ్రతేజుఁ డై
వచ్చినవాఁడు వాకిటి కవారితరోషముతోడ నావుడుం
జెచ్చెర భానునందనుఁడు చిత్తములోనఁ గలంగి చింతిలం
జొచ్చెఁ దదాజ్ఞ నంగదుఁడు శూరకపిప్రకరంబుఁ బంపినన్. 446

వ. అప్పు డతిసత్త్వసంపన్ను లైనయాకపియూథపులు బరవసంబునఁ బఱతెంచి కోటచుట్టును గవంకులం గలయ నలమి వజ్రసంకాశఘోరఘోషంబులు చెలంగ లక్ష్మణుసమీపంబున సింహనాదంబులు సేయఁ దద్భూరిఘోషంబులం దారవాక్యంబులం బ్రబోధితుం డై సుగ్రీవుండు తనమంత్రులు వినతనలనీలసుషేణహనుమదంగదప్రముఖబలీముఖులు తన్నుఁ బరివేష్టింప సురగణపరివృతుం డైనసురేంద్రుండునుంబోలెఁ గ్రాలుచుండి మంత్రాలోచనంబు సేయం దొడంగిన మంత్రసిద్ధికొఱకు నమ్మంత్రు లుపన్యసించు ప్రభుమంత్రోత్సాహధర్మార్థప్రపంచప్రకారంబు లుపలక్షించి మంత్రులయనుమతంబున లక్ష్మణాగ్రహాభివ్యగ్రుం డగుసుగ్రీవుం గనుంగొని సర్వామాత్యులును ధర్మార్థయుక్తనీతివాక్యంబుల నాతనిఁ బ్రశాంతుం జేసిరి ధీమంతుం డగుహనుమంతుండు మఱియు నిట్లనియె. 447

ఉ. ఆతతరాజ్యదాయకులు సత్యుపకారులు సత్యసంధులున్
భ్రాతలు రామలక్ష్మణులు రామునిపంపున దారితాహిత
వ్రాతుఁడు లక్ష్మణుం డిటకు వచ్చినవాఁడు మహోగ్రకోపుఁ డై
యాతనిఁ జూచి భీతిఁ గపు లార్చెద రెంతయుఁ గంపితాత్ము లై. 448

చ. ముదమునఁ బుత్రమిత్రభటముఖ్యులు మంత్రులుఁ దోడఁ గూడి రా
నెదురుగ నేఁగి మస్తకసమేతకరాబ్జము లొప్ప మ్రొక్కి స
మ్మద మొనరించి లక్ష్మణుని మానుగఁ దోడ్కొని వచ్చి కామిత
ప్రద మగుచున్ననీసకలరాజ్యము వర్ధిలఁ జేయు నేర్పునన్. 449

మ. తగ నారాసుతుఁ దెచ్చి సంతసము నొందం జేయు రా కుండినన్
మగుడం బుచ్చుము మిన్నకుండు టిది ధర్మం బైనచందంబె నీ
మొగసాలన్ నిలువంగఁ బాత్రమె మహాత్ముం డవ్విభుం డల్గినన్
జగముల్ నీఱుగఁ జేయ నోపు నతిభీష్మక్రోధదుర్వారుఁ డై. 450

క. అని పావని వల్కిన న, ల్లన నతముఖుఁ డై బలాబ | లంబులు చిత్తం
బునఁ బోలఁ జూచి మంత్రుల, కినతనయుఁడు గొంతవడికి | ని ట్లని పలికెన్. 451

క. రామున కే నపరాధం, బేమియుఁ జేయను దురుక్తు | లేమియు నాడన్
సౌమిత్రి యూర కేలొకొ, నామీఁదం గోపమెత్తి | నాఁ డుగ్రముగన్. 452

తే. మిత్రభేదంబు సేయ న | మిత్రుఁ డెవ్వఁ
డట్లు సౌమిత్రికిని గోప | మడర నన్ను
నహితుఁగాఁ జెప్పినాఁడొ నా | యందు దోష
మొండు గావించి యాతఁడు | మందువాఁడొ. 453

క. అతిమిత్రుఁ డగుసుమిత్రా, సుతుఁ డధికక్రోధ మాత్మఁ | జొఁకి యునికి నా
కతిశాతహృదయశల్యము, గతి నున్నది మానసమునఁ | గడుదుస్సహ మై. 454

క. మనుజేశుఁడు నాకుం జే,సినయుపకారంబు మఱవఁ | జిత్తం బలరన్
మును చెలిమి చేసి విభుతోఁ, దనరం బలికినప్రతిజ్ఞ | తప్ప కొనర్తున్. 455

వ. అనిన విని హనుమంతుండు సుగ్రీవునిఁ గనుంగొని. 456

క. నీవలన నెగ్గు గానము, నీవు కృతజ్ఞుఁడవు ప్రతిన | నెఱపెదు మీఁదన్
భూవిభుతమ్ముం డిటకున్, వే వచ్చినకారణంబు | వినుము కపీంద్రా. 457

క. జానకి వెదకం బుచ్చెద, వానలు [1]వెలియంగ ననుచు | వసుధేశునితోఁ
బూనికఁ బలికితి విస్మృతు, వానలు వెలిసెను శరత్తు | వాలఁగఁ జొచ్చెన్. 458

క. కాలం బెఱుఁగక రతిసుఖ, లోలత నీ వునికి నాత్మ | లోనన్ వగలం
దూలుచు లక్ష్మణు రామనృ,పాలుఁడు పుత్తెంచెఁ బ్రణయ | భరరోషమునన్.

ఆ. వాలిఁ జంపి నీకు | వనచరరాజ్యంబు, రామచంద్రుఁ డిచ్చెఁ | బ్రేమ మెసఁగఁ
గాన కృత మెఱింగి | మానవేంద్రునికోర్కి, చెలిమిఁ దడయకుండఁ | జేయవలయు.

వ. అని హనుమంతుండు పలుకుహితోక్తులకు సుగ్రీవుం డెంతయు సంతోషించె
నంత సుగ్రీవమంత్రిసమానీతుం డై లక్ష్మణుండు జాతరూపమయంబును గనక
సాలభంజికాచిత్రితవైడూర్యస్తంభసంభృతంబును దివ్యరత్నసమాకీర్ణప్రవాళో
ద్ధూతతోరణంబును బహులఫలదళకుసుమవిసరభాసురోద్యానభాసమానంబును
ధర్మనిర్మితహర్మ్యప్రాసాదరమ్యంబును దేవగంధర్వసంభూతవానరసంఘాతసమ
న్వితంబును జందనాగురుకమలకువలయప్రముఖకుసుమమైరేయాదివాసనవా
సితరాజమార్గంబును విమలాప్సరోవరమనోహరంబును దేవతాయతనోపరిశో
హితశాతకుంభదేదీప్యమానంబును విశ్వకర్మనిర్మితంబును నగుకిష్కింధానగరం
బు సొచ్చి ముంగట నంగదమైందద్వివిదగజగవయశరభశతబలికుముదపనసన
నీలవిద్యున్మాలిసంపాతి వీరబాహు సుబాహుహనుమత్సుషేణరంభజాంబవద్వృష
భాదివీరవానరులగృహంబుల నాలోకించుచుఁ దదగ్రభాగంబునఁ గైలాసశిఖ

1 వెలువంగ ననుచు.

సంకాశప్రాసాదశిఖరవిజితంబును సర్వకామప్రదఫలకుసుమవిలసితపాదపాభిశో
భితంబును వివిధాయుధకలితనీలజీమూతసన్నిభవీరవానరపరివేష్టితద్వారంబును
దివ్యపుష్పదామాభిరామకాంచనతోరణసమంచితంబును గనకచిత్రపుత్రికారూ
పానురూపరూపాజీవాసేవితంబును నగుసుగ్రీవునినగరు చేరి తదీయనియోగంబున
ముకుళితహస్తు లగుచు మస్తకన్యస్తహస్తు లైనహనుమత్ప్రముఖామాత్యులు
తన్ను నెదుర్కొన్న వారి నుచితోక్తుల నాదరించుచు దివ్యయానాసనసమావృ
తంబు లైనసప్తకక్ష్యంబులు గ్రమంబునఁ గడచి హేమరాజితపర్యంకంబులుఁ
మహాస్తరణోపేతసింహాసనంబులు గలయంతఃపురంబుకట్టెదుర. 461

సీ. మండితమణిమయ ॥మండనంబులు దాల్చి, మృదులాంబరంబులు ॥మెఱయఁ గట్టి
సురభిమాల్యంబులు ॥సొంపార ధరియించి, కమనీయగంధముల్ ॥గలయ నలఁది
కంకణక్వాణముల్ ॥గ్రాల నారులు హేమ,చారుచామరములు ॥చేరి పట్టఁ
దారాధిపానన ॥తార దాపలిదెస, రుమ దక్షిణంబున ॥నమరుచుండ
సరసకామినీశతసహస్రములు గొలువ, నప్సరోగణపరివృతుఁ ॥డగుచు మహిమ
నమరునమరేంద్రుగతి నున్న ॥హారరత్న,కిరణసంవృతగ్రీవు సు॥గ్రీవుఁ గనియె.

క. కని యాసుగ్రీవుని పెం,పును నౌదాసీన్యగతియు ॥భూవిభుదైన్యం
బును దలఁచి లక్ష్మణుఁడు బిల, ఘనసంక్రుద్ధాహికరణి ॥గాసిలుచుండెన్. 463

మ. తటిదంచద్గుణచాపబాణధరు సం॥దష్టాధరోష్ఠుం బట
త్కటనాసాపుటసంకటోగ్రముఖు ను॥ద్యద్భ్రూకుటీభంగసం
ఘటనాఘూటలలాటు నుష్ణకరదీ॥ర్ఘశ్వాసవేగుం విశం
కటకోపోత్కటవిస్ఫులింగయుతరూ॥క్షప్రేక్షణుం లక్ష్మణున్. 464

చ. కని రవిజుండు భీతిఁ దన॥కాంతలు మంత్రులుఁ దాను హస్తముల్
వినయముతోడ మోడ్చుకొని ॥ వేగ మెదుర్కొని యానరేంద్రపు
త్రుని సదనంబులోపలికిఁ ॥ దోడ్కొని వచ్చి తగంగ నంచితా
సనమున నుండు మీ వనిన ॥సమ్మతిసేయక యాతఁ డిట్లనున్. 465

—లక్ష్మణుండు సుగ్రీవునితోఁ బరుసంబు లాడుట.—

క. జనపతి పంచినదూతను, జననాథునిపంపు గాక ॥సత్కారము గై
కొనఁగ భుజింపఁగ నిటఁ గా,ల్కొని నిలువఁగ నుచిత మౌనె ॥కుమతీ నాకున్.

వ. అనవుడు సుగ్రీవుం డతివ్యథితచిత్తుం డై దండప్రణామంబు చేసి మైత్రి నెరయ
సౌమిత్రి కిట్లనియె. 467

శా. రామక్ష్మాపతి కేను భృత్యుఁడ నుద॥గ్రస్నేహ మేపార నా
భూమీశాగ్రణియాజ్ఞ సేసెదఁ దగం ॥బూజ్యాననస్థుండ వై
ప్రేమం గైకొను మర్ఘ్యపాద్యములు ధా॥త్రీనాథసత్పుత్ర నా
రామక్ష్మావిభుతమ్ముఁ డిట్లనియె ధ॥ర్మం బొప్పు సుగ్రీవుతోన్. 468

క. మును రామవిభునియానతి, చనఁ జేసినయంతమీఁద సత్కృతులను జే
కొనియెద విను సీతోడను, జననాథుం డాడు మనిన సముచితభాషల్. 469

క. కులబలలలితుఁడు సూనృత, కలితుండు జితేంద్రియుండుఁ గరుణాన్వితుఁడున్
విలసితధర్ముఁడు నగురా, జిలలో నతిపూజ్యుఁ డగుచు నేపారు సిరిన్. 470

క. ఉపకారి యైనమిత్రున, కుపకృతి సేయం బ్రతిజ్ఞ యొనరించి మృషా
లపితుండై యుండెడునా, కపటాత్ముం డధికహింసకతముం డరయన్. 471

సీ. పశువాంఛ బొంకినఁ బంచపశుఘ్నుఁడౌ, గోనృతాత్ముఁడు దశగోప్రహర్త
యశ్వానృతుండు శతాశ్వహింసకదోషి, [1]పురుషానృతసహస్రపురుషహరుఁడు
వసుధకై బొంకినవాఁడు సర్వధ్వంసి, కనకంబుకొఱకు బొంకినఖలుండు
సకలజాతాజాతజనులఁ ద్రుంచినవాఁడు, తనపల్కు మిథ్య చేసినయతండు
దన్ను నాప్తజనులఁ దా వధించినపాపి, భువిఁ గృతఘ్నుఁ డఖిలభూతఘాతి
యని కృతఘ్నుఁ గూర్చి యఖిలలోకేశుండు, పరఁగఁ బల్కినట్టి పలుకు వినుము.

క. మతిఁ దలఁప వచోభగ్న, వ్రతునకును సురాపునకు నిరంతరమును ని
ష్కృతి గలదు గాని తగ ని, ష్కృతి లేదు కృతఘ్నబుద్ధికిని విబుధోక్తిన్.

క. ఉపకృతుఁ డై యుపకారికి, నుపకారం బిచ్చఁ జేయ కుండుకృతఘ్నుం
డపగతుఁ డైనను దద్గా, త్రపరీతామిషముఁ దినవు క్రవ్యాదములున్. 474

చ. నృపతికిఁ దోడువత్తు ధరణీసుత నారయఁ బుత్తు నంచు ని
ష్కృపగతి [2]ఋశ్యమూకమునఁ గందువ సేయవె యగ్నిసాక్షిగా
శపథము చేసి తప్పి యిట సంతతదారరతానుభూతి మో
హాపడుచు నున్నవాఁడవు నృపాగ్రణి మేలు దలంప వేమియున్. 475

క. రామునిచే రాజ్యముఁ గొని, ప్రేమం గామినులతోడఁ గ్రీడించెద వా
రాముని తెరువు దలంపవు, కామాంధుఁడు గనునె యర్వాకార్యము చేయన్.

క. మును నీ వాడినమిథ్యా, సునయోక్తుల రాముఁ డలరె శుభతరచిత్తం
బున నారసి మండూక, స్వనఫణి వగు టెఱుఁగఁ డకట జనపతి నిన్నున్. 477

మ. మదవృత్తిం గడు వాలి వాలి దనకుం మాఱెందు లేదంచు ను
న్మదుఁడై యుండఁగ నీకుఁ బూని చని రామస్వామివిభుం డుగ్రుఁడై
కదనోద్దండత నొక్కయమ్మునన వ్రక్కల్ సేసె నవ్వాలిఁ ద
త్ప్రదరం బిప్పుడు మొక్కవోదు నినుఁ ద్రుంపం జాలుఁ గ్రొవ్వాఁడిమిన్. 478

శా. ఉద్యజ్జ్వాలత ఘోరఘోషముల వజ్రోగ్రధ్వనిన్ మ్రోయఁగా
విద్యుత్సంఘముభంగి వ్రాలెడుసమిద్వీరాహితత్రాసనం
పాద్యస్మత్పటుదోర్విక్రుష్టఘనచాపం బాజిలోఁ జూడఁగా
నుద్యోగింపు యమాలయంబు చొర నీకుత్సాహమే పారినన్. 479

1. పురుషానృతుఁడు సహస్రపురుషహరుఁడు. 2. ఋశ్యమూకమున కందువఁ జేయడె యగ్ని.

మ. జగతీనాథునితోడ నాడినప్రతిజ్ఞావాక్యముం జేసి స
త్యగరిష్ఠుండవు గమ్ము రాఘవునమోఘాస్త్రంబులం ద్రెళ్లి వే
గ గతప్రాణుఁడ వై మహోగ్రయమలోకం బేఁగి యచ్చోటఁ బ్రే
తగతిం బొందినవాలిఁ జూడకు సముద్యద్బుద్ధిహీనుండ వై. 480

క. నీచేసినయవమానము, నాచిత్తములోన ననహానం బై పైపై
నేచుచునున్నది పున్నమ, వీచులచేఁ బొంగుజలధివిధమున నీచా. 481

క. అత్యుపకృతిరహితుండ వ, సత్యుఁడ వకృతజ్ఞమతి వసఖ్యుండ వన
త్ప్రీత్యయయుతుఁడవు స్త్రీసాం, గత్యవ్యసనుఁడ వపుణ్యకర్ముఁడవు కపీ. 482

వ. కావున నా బాణంబులం దునిమి ని న్నిపుడ యమలోకంబున కనిచెద నని రోషా
వేశంబునం బలుకుచున్నసమయంబున. 483

—✿ తార లక్ష్మణునకుఁ గోపోపశమనంబు సేయుట. ✿—

క. తారానిభతారాంచిత, [1]హారిణి తారాభరదన యకలంకలస
త్తారాధిపసదృశానన, తారాసతి యనియె నపుడు తారాసుతుతోన్. 484

చ. తరణిసుతుండు లక్ష్మణ కృతఘ్నుఁడు గాఁ డనృతుండు గాఁడు దు
శ్చరితుఁడు గాఁ డవజ్ఞుఁడు నృశంసుఁడుఁ గాఁడు కృతోపకారవి
స్మరణయుతుండు గాఁడు నృపసత్తమునాజ్ఞకుఁ దప్పఁ డేల యీ
పరుసపుమాట లాడె దిటు బంధురకోపము డింపు లక్ష్మణా. 485

క. ఈరాజ్యముఁ గిష్కింధయు, నీరుమతోఁ గూడ నన్ను నీమణికనకో
దారధనధాన్యలక్ష్ములు, నీరవిజున కిచ్చినార లెలమిన్ మీరల్. 486

క. మీపెట్టినచెట్టినజుఁడు, మీపం బొనరింపఁగలఁడు మిత్రత నెరయన్
వే పుచ్చినాఁడు సకలది, శాపథములకుఁ గపిపతుల జయ్యనఁ దేరన్. 487

క. ఇనజుఁడు మీతోఁ బుట్టువు, జనపతి కెంతేయుఁ బ్రియుండు సంపూజ్యుఁడు రా
మునకును గపిబలములతో, ఘనతరసాహాయ్యకంబు గావించుఁ దగన్. 488

క. ఆర్యుఁడవు ధర్మపరుఁడవు, గార్యజ్ఞుఁడ వీవు దప్పు గానక సఖునిన్
సూర్యసుతు మాన్యుఁ జనునె య, వార్యక్రోధమునఁ బరుషవాక్యము లాడన్.

క. యతి యగువిశ్వామిత్రుఁడు, మతి చెడి మేనకకుఁ జిక్కి మన్మథలీలా
రతుఁ డై యుండఁడె పదియేం, డ్లితరుఁడు కార్యంబు నెఱుఁగ నేగతి నేర్చున్.

వ. వినుము లక్ష్మణా దురాత్ముం డైనరావణునకపారసత్త్వసంపన్నులుఁ గామరూపు
లు నైనరాక్షసవీరులు దశకోటిసహస్రంబులు షట్త్రింశదయుతంబులుఁ గల రా
రక్కసులనసహాయులై గెలువ నశక్యంబు గాన యతిబలులైనవానరకోట్లతోడ
సుగ్రీవుండు రామునకు సహాయుం డయి లంకపై దండెత్తిపోవుతలంపున సముద్ర
పర్యంతభూమివనచరుల సాగరద్వీపవాసు లైనబుఋక్షకోటిసహస్రంబులఁ దో

1 తారాభనయనమనోజ్ఞ ♦ తారావిలస, త్తారా.

డ్కాని తేర బలిమి గలవానరులం బంచినవాఁడు గావునఁ గోపం బుడిగి ప్రస
న్నుండవు గ మ్మనుచుఁ బలికి. 491

ఉ. దేవనుతుండు రామజగతీపతి వానరసేనఁ గొంచు సు
గ్రీవుఁడు తోడుగాఁ జని గరిష్ఠవిశిష్టబలాఢ్యుఁ డై దశ
గ్రీవు వధించి సీతఁ గొని ప్రేమ మెలర్పఁగ వచ్చు నంచు సం
భావన నాకు వాలి మును ప్రాజ్ఞత యొప్పఁగఁ జెప్పెఁ గావునన్. 492

క. రావణునిఁ దునిమి రామ, క్ష్మావిభుఁడు మహీజతోడ జయలక్ష్మీనం
భావితకీర్తులు వెలయఁగ, వేవేగ మయోధ్య నేల వేంచేయుఁ దగన్. 493

చ. అని దయ మీఱఁ దార తగ నాడెడుమాటల కిచ్చగించుచున్
ఘనుఁ డగులక్ష్మణుండు వినఁగా నపు డవ్విభు వెంట నాత్మ నే
చినభయ మెల్ల బోవ విడిచెం గమలాప్తసుతుండు ద్రెంచి వా
డినగజపుష్పదామము తొడింబడఁ బాఱఁగ వైచుకై వడిన్. 494

వ. అట్లు లక్ష్మణునివలనిభయంబుఁ బాసి సుగ్రీవుండు ప్రస్తుతవాక్యంబుల హృద
యం బలర నిట్లనియె. 495

చ. జగతీనాయకునాజ్ఞ నే మఱతునే సైన్యంబులం గూర్చి తేఁ
దగువారిన్ మును సర్వదిక్కులకు నాస్థం బంచి నేఁ డెల్లి శీ
ఘ్రగతిన్ వచ్చెద రంచు వానరచమూపాంసుచ్ఛటాసమ్మిళ
ద్గగనాభోగనిరీక్షణోన్ముఖుఁడ నై గాసిల్లెదం గాంక్షతోన్. 496

మ. నను ముబ్బాములఁ బెట్టువాలి ననిలో నన్ లీలఁ దున్మాడి నా
కనుమోదంబుగ సర్వసంపదలఁ బ్రాజ్యం బై నరాజ్యంబు ని
చ్చె నృపాలాగ్రణి తత్ప్రసాదమున నీశ్రీ లొంది యున్నాఁడఁ బెం
పెనయన్ నామది నామహాత్మునిఋణం బే నేమిట న్నీఁగెదన్. 497

క. అరుదుగ నేకాస్త్రమునన, ధరణీశుఁడు లీల నేడుతాళంబులు భూ
ధరమును భూతలమును దా, నురవడిఁ గాఁడి చన నేసె నుద్ధురభంగిన్. 498

చ. ధరణి సమస్తమున్ వడఁకెఁ దద్ధను వప్పుడు మ్రోయ రాముఁ డొ
క్కరుఁడ భుజోగ్రశక్తిఁ ద్రిజగంబుల గెల్వఁగ నోపు నానము
ద్ధురభుజశాలి కెవ్వరును దోడ్పడ నేటికి నైన సేనతో
నరిగెద లంకమీఁదికి నృపాగ్రణి కే ననుయాయిమాత్ర మై. 499

క. జననాథుఁడు మన్నించుటఁ, జనవు మెఱసి యైన నధికసఖ్యంబున నై
నను నేఁ దడసితి దాసుఁడ, ననుఁ జేకొను మనపరాధి నరనాథసుతా. 500

వ. అనిన ముద మంది సౌమిత్రి మైత్రి నెరయ నమ్మిత్రసూనుం గనుంగొని. 501

క. దైవము నీకును రామ, క్ష్మావిభునకు నిట్లు మైత్రి గలుగఁగఁ జేసెన్
నీవును నృపతియుఁ గులమున, లావున దొరయఁ దగువారు ప్లవగాధీశా.

క. నీవు సహాయుఁడుగా సు, గ్రీవ దశగ్రీవుఁ దునిమి | కీర్తి వెలుంగన్
భూవిభుఁడు సీతఁ దోడ్కొని, వావిరి సాకేతపురి క|వశ్యం బరుగున్. 503

చ. ధరణిజఁ బాసి నెవ్వగలఁ | దగ్దయు వేఁగుచు నున్న రామభూ
వరుకడ కేఁగుదెంచి ప్రియ|వాక్యములన్ ముద మందఁ జేయు వా
నరవర దుఃఖ మైననర|నాథునిపంపున నల్గి నిన్ను ని
ష్ఠురములు పెక్కు లాడితిఁ గ|దున్ మది సైఁపుము నన్ను మైత్రితోన్. 504

క. అని లక్ష్మణుండు పలికిన, మనమున సంతోష మంది | మర్కటనాథుం
డెనయఁగఁ దనపార్శ్వంబునఁ, దనరెడుహనుమంతుఁ జూచి | తగ నిట్లనియెన్.

శా. నీలాస్తోదయసహ్యభూధరముల | న్వింధ్యాంజనాగంబులం
గైలాసంబున హేమకూటనిషధ|గ్రావప్రదేశంబులం
బ్రాలేయాచలమేరుమందరమహేం|ద్రక్షోణిభృల్లోకలో
కాలోకాద్రుల మాల్యవన్మలయము|ఖ్యాశేషధరేంద్రంబులన్. 506

చ. ధరఁ గలసర్వపర్వతక|దంబనివాసులఁ బూర్వపశ్చిమో
త్తరజలరాశితీరసము|దగ్రసరిద్వనభూములం గరం
బిరవుగ నున్నవానరుల | నే మును దేరఁగఁ బంచినాఁడ బం
ధురగతి నీవు సత్త్వజవ|ధుర్యగతిజ్ఞులు నైనవారలన్. 507

వ. శతసహస్రకోటిసంఖ్యలు గలవానరవీరులం బుచ్చి సకలదిక్కులకపుల సామదానాదుల మన్నించి వేవేగ యిటకు రప్పింపు మని నియోగింప నాంజనేయుండును నట్ల పనుపఁ దదీయనియుక్తు లయినవీరమర్కటకోట్లాటోపంబున. 508

చ. ఉరవడి నింగికిన్ నెగసి | యుద్ధురవేగము లార నేఁగి తా
రురుగిరులం బయోధుల వ|నోపవనంబుల సింధుభూములం
బరఁగఁగ నున్న వానరుల | భానుజునానతిఁ జెప్పి మీరు స
త్వరగతి వానరేంద్రుఁ గొలు|వం జనుఁ డంచును జీరి యేఁపునన్. 509

క. తరణిజుదూతలు వనచర, వరులు మధురకందమూల|వాంఛితఫలముల్
వరుసం గొని కిష్కింధా, పురమునకున్ వచ్చి రెలమి | భూరిత్వరులై. 510

ఉ. వచ్చి సమస్తవానరులు | వన్యఫలంబులు కందమూలముల్
తెచ్చి యుపాయనోచితగ|తిం దగ నిచ్చి కపీంద్ర మమ్ము మున్
పుచ్చినసర్వదిక్కులకుఁ | బోయి వనాటుల నోలిఁ జీరి వే
వచ్చితి మెల్లవానరులు | వచ్చెద రిప్పుడ యంచుఁ జెప్పినన్. 511

వ. సుగ్రీవుండు సంతసంబు నొంది తనమనోరథంబు సఫలంబు నొందె రామచంద్రునికోర్కెఁ దీర్పం గలిగె నని తలపోసి వచ్చినవారల వీడ్కొలిపె నంతఁ గపిరాజుశాసనంబున నస్తాచలవాసులు దప్తహేమప్రభగలవారలు మనోవేగులు మూఁడుకోట్లప్లవంగయూథపులుఁ గైలాసశిఖరంబున నున్న సింహకేసరభాసుర

వర్ణులు సప్తకోటిశతసహస్రశైలచరవీరులును హిమగిరిసమాశ్రితులు సహస్రోత్తరసహస్రకోటిహరివీరులు వింధ్యాచలవాసులు నంగారనికరాభులు భీమవిక్రములు భీమాకారులు నగుసహస్రకోట్లు మర్కటోత్తములుఁ గిష్కింధకు వచ్చిరి మఱియు క్షీరోదధివేలానిలయులు నారికేళాశనులును జండాకారులు నైనబలీముఖు లసంఖ్యానీకంబులఁ గూడి మార్తాండమండలంబు నిరోధించుచు నేతెంచిరి వెండియు. 512

ఉ. దిక్కులు నాకసంబు జగ|తీతలభాగము నెల్లచోటులుం
గ్రిక్కిఱియంగఁ గ్రందుకొని | కీశబలంబులు వెన్క ముందటం
బెక్కుపథంబులన్ నడువ | భీకరభంగులఁ గ్రొవ్వు లారఁగా
నక్కజ మంద వచ్చి ప్లవ|గాధిపుఁబట్టణ మెల్ల ముంచినన్. 513

వ. కని మనంబున నుత్సహించి మరుత్పుత్రుతో సుగ్రీవుం డిట్లనియె. 514

శా. నే నీసేనలతోడఁ గూడఁగఁ బ్రియా|న్వేషుండ నై తన్ను వే
కానం బోయిన నాదుయత్న మతికాం|క్షం జూచి నామీఁద నా
భూనాథాగ్రణి కింక దక్కు కరుణా|పూర్ణాత్ముఁ డౌఁ గా కెదం
దా నగ్గొందు దలంచినం దలఁపనీ| తన్గొల్వ నేఁ బోయెదన్. 515

వ. అనిన విని హనుమంతుం డతని కిట్లనియె. 516

ఉ. రాముఁడు నిత్యసత్యుఁడు శ|రణ్యుఁడు న్యాయపరుండుఁ ద్రాతయున్
స్వామియు ధర్మవత్సలుఁడు | సత్యసమేతుఁడుఁ గాన పాపహిం
సామతి గాఁడు లక్ష్మణుఁడు | చాల సహాయుఁడు గాఁగఁ జన్న ని
న్నేమియుఁ జేయఁ డర్కసుత | యేఁగుము వేగమ రాముపాలికిన్. 517

వ. నావుడు సంతోషించి మిత్రపుత్రుండు మైత్రి నెరయ సౌమిత్రి కిట్లనియె. 518

క. శూరత వాలిన వాలి, న్దారుణగతిఁ దునిమి యిచ్చె | నాకున్ రాముం
డీరాజ్యము నీనగరము, నీరుమ నీతార నీస|మృద్ధశ్రీలన్. 519

ఉ. వచ్చి రుదగ్రవేగబల|వంతులు నాప్తులు నైనసర్వభూ
భృచ్చరవీరవానరులు | పెంపును సొంపును నొప్పఁగాఁ బ్లవం
గోచ్చయముల్ కెలంకులను | గొల్వ సముద్ధతి రామభూవిభుం
డచ్చట నున్నవాఁ డచటి | కేఁగుద మవ్విభుఁ డుత్సహింపఁగన్. 520

—•• సుగ్రీవుఁడు లక్ష్మణసహితుం డై మాల్యవంతంబునకు వచ్చుట. ••—

వ. అని పలికి గమనోత్సాహం బెసంగ. 521

స్రగ్ధర. భూరిప్రస్థానభేరు|ల్బోరిఁబోరి జయము|ల్బొంగ వేయించె నుద్య
త్పారావారోగ్రయాదః|ప్రకరభయకర|స్ఫారఘోరస్ఫురద్భాం
కారారావంబు లారన్ | గగన మద్రువ దిగ్భాగము ల్వ్రయ్యఁ గిష్కిం
ధారుంద్రక్షోణిభృత్కం|దరములు వగులన్ | ధాత్రి యాకంప మొందన్.

వ. ఇట్లు ప్రయాణభేరులు వేయించి తారాదికాంతల నంతఃపురంబున కనిచి సౌమిత్రి కుచితసత్కృతు లొనరించి వానరులచే నొక్కమణిశిబికం దెప్పించి ముందటం బెట్టించి చేతులు మొగిచికొని రామభూవిభుఁ గొలువం బోదము శిబిక యెక్కు మని ప్రార్థించిన. 523

మ. మణిరాజచ్ఛిబికాధిరూఢుఁ డయి రత్నచ్ఛత్రముల్ పట్ట నీ
రుణభద్రామలచామరంబు లిడ శంఖస్ఫారభేరీనము
ల్బణరావంబులు పెల్లుగా మొరయఁ బైపైఁ వందిసందోహముల్
ప్రణతుల్ సేయఁగ లక్ష్మణుం డరిగె నారామప్రభుం గానఁగాన్. 524

చ. ఇనతనయుండు దాను నొకహేమలసచ్ఛిబికాధిరూఢుఁ డై
సునిశితశస్త్రపాణు లొగిసూరెలఁ గొల్వఁగ శంఖదుందుభి
స్వనములు దిక్కులం జెలఁగ సైన్యపదాహతులన్ సమస్తమే
దినియుఁ జలింప రామజగతీపతిపాలికి నేఁగె సమ్మతిన్. 525

వ. ఇట్లరిగి మాల్యవంతంబు చేరి యనతిదూరంబున. 526

క. లక్ష్మణరవిజులు [1]శిబికలు, సూక్ష్మత్వర డిగ్గి వినయశోభితు లై రాఁ
బక్ష్మలితాక్షుం డై రా, మక్ష్మాపతి వారిఁ జూచె మచ్చికతోడన్. 527

చ. తరణిసుతుండు రామవిభుదవ్వులఁ గన్గొని హస్తపద్మముల్
శిరమునఁ జేర్చి మ్రొక్కుచును జేరఁగ వచ్చి సమగ్రభక్తితో
ధరపయిఁ జక్కఁ జాఁగిపడి దండమువెట్టినఁ గేల నెత్తి భూ
వరుఁడు కవుంగిలించెఁ గపివల్లభునుల్లము పల్లవింపఁగన్. 528

వ. అట్లు గారవించి కృతాంజలు లై ముంగట నిలిచియున్నసుగ్రీవునిం దక్కనవనచరవీరులం గూర్చుండ నియోగించి యాసీనుం డైనసుగ్రీవునిం జూచి ప్రణయకోపావేశంబున ని ట్లనియె. 529

క. సతతము ధర్మార్థార్జన, రతుఁ డయ్యును విహితసమయరక్తిం గామో
చితములు సల్పెడుజనపతి, యతులితరాజ్యంబు నొందనర్హుం డెందున్. 530

క. సురుచిరధర్మం బెప్పుడుఁ, బరికింపక నీవు కామపరతంత్రుఁడ వై
తరుణీసంగతి నుండఁగ, మరగి నను జెలిమిఁ జేర మఱచితి మదిలోన్. 531

క. ఏ నిన్నుఁ బిలువఁ బంచిన, మానుగ నీబ్రదుకుకొఱకు మఱి వచ్చి తిటం
గాని తగుమైత్రి నెఱయన్, జానుగ నీయంత రావు చనునే చెపుమా. 532

క. లంకన్ రావణుఁడు నిరా, తంకంబుగ సీత దాఁచి తా నున్నాఁ డా
వంకం జానకి వెదక న,శంకితు లగుకపులఁ బనుపు చయ్యన నింకన్. 533

చ. అన విని భానుసూనుఁడు కృతాంజలి యై ప్రణమిల్లి యాత్మలో
నెనసినభీతిఁ బో విడిచి యెంతయు సంతస మంది యి ట్లనున్

1 శిబికల, సూక్ష్మత్వర లుడిగి వినయ......బక్ష్మవిలాక్షుఁ డై.

జనవర నాకుఁ బ్రాణములు శాశ్వతరాజ్యము సర్వసంపదల్
చనఁ బ్రియకాంతలుం జిరయశంబును గ్రమ్మఱఁ గల్గె నీకృపన్. 534

క. నీ వతిసఖుఁడవు భర్తవు, దేవుండవు నీకు నుపకృతి యొనర్పనివాఁ
డీవసుధ నధమపురుషుఁడు, నావిన్నప మవధరింపు నరవరవర్యా. 535

వ. మున్ను నేను సకలదిక్కులకు దూతలం బంచిన వా రేఁగి భూమిం గలసర్వవానరర్క్షగోలాంగూలబలంబులం గొని వేగ వచ్చుచున్నవారు దేవగంధర్వపుత్రులుఁ గామరూపులు నైనవానరవీరులు తమతమబలంబులతోడ. 536

చ. శతములు వేలు లక్షలును శంఖశతంబులు నర్బుదార్బుదా
యుతములు గోటిశంఖములు నోఘసముద్రమహాసముద్రసం
హతులును వేయిఖర్వములు సంత్యపరార్థసహస్రబృందముల్
క్షితితతియున్ మహాక్షితితియుఁ జెప్ప నసంఖ్యవనాటసైన్యముల్. 537

వ. రఘువరా మిమ్ముఁ గొలువ వచ్చెదరు వచ్చి లంకకు నిశ్శంకం జని పుత్రమిత్రామాత్యులతోడం గూడ రావణుం బరిమార్చి కల్యాణగుణసమేత యగుసీతం గొనివచ్చెద రని పలికిన సంతోషించి రామచంద్రుండు సుగ్రీవుని నాలింగనంబు చేసి యతనితో ని ట్లనియె. 538

చ. పరహితవాంఛఁ జీకటులు భానుఁ డడంచుట చందురుండు శ
ర్వరి నలరారఁ జేత సురరా జిల వానల నాన ముంచుటల్
ధరణి సమస్తభూతములఁ దాల్చుట చిత్రమె కావునన్ దివా
కరసుత నాకు నీవు నుపకార మొనర్పఁగ రాక చోద్యమే. 539

క. తరణితనూభవ సూనృత,పరుఁడవుఁ బుణ్యుఁడవు నాకు బంధుఁడవు సహో
దరుఁడవుఁ బ్రియుఁడవు సఖుఁడవుఁ, బరమాప్తుఁడ వట్లుగాన ప్రమదం బెసఁగన్.

—వానరబలంబులు సుగ్రీవుం జేర వచ్చుట.—

వ. సీత వెదకఁ దగినవానరవీరులం బుచ్చు నీవలన నాకోర్కి సఫలం బయ్యెడు నను నంతలోన నదీనదసముద్రతీరపర్వతప్రాంతవాసు లయినసుగ్రీవునిసైనికులు నూఱులు వేలు లక్షలు కోట్లు గము లై సాలతాలశిలాపాణులును నఖదంష్ట్రాయుధులును సితాసితకనకకేసరవర్ణులుఁ గామరూపులుఁ గామగమనులు నీలజీమూతభీమాకారులు నగుమర్కటవీరులు దెసలు నాకసంబును నిండి రాఁ దొడంగి రయ్యెడ. 541

ఉ. వాలువిశాలవాలములు వావిరిఁ ద్రిప్పుచు సాలతాలహిం
తాలముఖద్రుమంబులు నుదగ్రశిలాచలభూరిశృంగముల్
గేల ధరించి నల్గడలఁ గ్రేళ్లుగ దాఁటుచు నార్పులన్ దెసల్
ప్రేలఁగఁ జేయుచున్ బహుబలీముఖసేనలు వచ్చె నేపునన్. 542

వ. తదనంతరంబ పదివేలకోట్లవనాటులతోడ శతబలియు ననేకశతసహస్రకోట్లతోడ

సుషేణుండును బహుదశసహస్రంబులతోడ హనుమంతునితండ్రి కేసరియును మహావేగులైనకోటిగోలాంగూలురతోడ గవాక్షుండును శతసహస్రకోటిఋక్ష వీరులతోడ ధూమ్రుండును మహాబలసమానులైనపదికోట్లబలీముఖులతోడఁ బనసుండును బదికోట్లకపులతోడ నీలాంబుదనిభుండును యూథపయూథపుండు నగునలుండును బండ్రెండుకోట్లతోడ ననాథుండు నొక్కొక్కకోటితోడ గజగవయవృషభశరభులు నేడెనిమిదికోట్లతోడ మైందద్వివిదులు నాఱుకోట్లతోడ గంధమాదనుండును గోటిఋక్షవరులతోడఋమణ్వంతుండునుసహస్రశతశంఖంబుల తోడ నంగదుండును సహస్రకోట్లతోడఁ దారాధిపద్యుతి గలతారుండును బెక్కుసేనలు గొలువ వేయికోట్లతోడ హనుమంతుండును బద్మకోటిశతంబులతోడ నింద్రజానుండును శతకోటిశతంబులతోడ నీలద్యుతి గలనీలుండును బండ్రెండు కోట్లప్లవగవీరులతోడఁ బ్రజంఘుండును సహస్రఖర్వంబులతోడఁ గుముదుండును నిరువదియొక్కకోటితోడ దధిముఖుండును బొడచూపిరి మఱియును వినతుండును విజయుండును సంపాతియు జాంబవంతుండును వేగదర్శియు మహాహనుండును శతార్చియు శతగుల్మండును సుహోత్రుండు నుల్కాముఖుండును మొదలుగాఁ గలకామరూపులైనప్లవంగపుంగవులు తమతమసైన్యంబులతోడ శైలవనసాగరసహితమైనసర్వంసహ నావర్తించి గునియుచు నుప్పరం బెగసి దాఁటుచుం ద్రుళ్లుచు గర్జిల్లుచు వచ్చి సుగ్రీవునిం బరివేష్టించిరి తత్సమయంబున సుగ్రీవుండు రామచంద్రున కిట్లనియె. 543

చ. జనవర వచ్చి రిచ్చటికి సర్వదిగంతరకీశవీరులున్
జనకజఁ జూచి వచ్చెదరు చయ్యన నెచ్చట నున్ననైన వే
పనుపుము వీరి నావుడు నృపాలుఁడు సంతస మంది యిట్లనున్
వనచరనాథ నాకుఁ గలవాఁడవు నీవ సమస్తభంగులన్. 544

క. కావున జానకి వెదకం, బోవఁగ రాఁ గలప్లవంగపుంగవులఁ దగన్
నీవ యెఱుంగుదు వారల, వేవేగం బనుపు మహిజ వెదకఁ గపీంద్రా. 545

సుగ్రీవుఁడు వినతునిఁ దూర్పునకు సీతను వెదకం బుచ్చుట.

వ. అని పలుక సుగ్రీవుం డలరి శైలాకారుండై భీమనిర్ఘోషంబు సేయుచున్నవినతుం డనుయూథపుం బిలిచి సోమసూర్యాత్మలు దేశకాలజ్ఞులు గమనాగమనప్రవీణులు నైనశతసహస్రవానరులతోడం గూడఁ దూర్పునకు వైదేహి వెదకనరుగుము తదీయమార్గంబు విను మనుచుం బలికి. 54(

శా. శోవాశోణనదోపకంఠముల నర్థిం జాల శోధించి శి
ప్రావాహిన్యభిరామభూమిఁ దమసాప్రాంతంబునన్ గోమతీ
కావేరీనదిపొంతఁ గౌశికికడం గాళిందితీరంబున
న్దేవద్వీపవతీసమీపమున నన్వేషింపుఁ దుర్వీసుతన్. 54

వ. మఱియు నందాసరస్వతీసరయూప్రముఖనదీతటంబుల నంగవంగమగధమాళవకోసలపుండ్రవిదేహాదినగరప్రాంతంబుల వెదకి యటమీఁద సముద్రతీరనదీనదపట్టణవనసమీపంబులఁ జూచి మందరకుధరంబున నున్నమందకర్ణప్రావరణులు నుష్ట్రకర్ణులు గిరాతులు నేకపాదులు నగుయవనులు గాపున్న గేహంబులం బరికించుచు నానారత్నశోభితద్వీపంబును సువర్ణకుంభంబును సువర్ణమరకతమండితంబును నగుజంబూద్వీపంబు దాఁటి గగనోల్లేఖిశిఖరవిలసితం బగుశిశిరబీజపర్వతం బున్నది యీగిరిశృంగమహాగుహానిర్ఝరంబుల శోధించి యటమీఁద బ్రాహ్మణధనాపహారులు ఛాయాగ్రాహకులు నిత్యకాలబుభుక్షితులు నగురాక్షసులు కమలాసనుశాసనంబున నిలయంబులు లేక వర్తింతు రచటికిం బోయి కాలోరగకరాళం బగుకాలోదకనామసముద్రంబును రక్తజలఘోరం బైనలౌహిత్యసంగమంబు నతిక్రమించి కైలాససంకాశంబును విశ్వకర్మనిర్మితంబును నగుసువర్ణావాసదేశంబు వెదకి తదనంతరంబ శతసహస్రశృంగంబుల సముద్రంబు వెడలి యెగసి గోశృంగపర్వతంబునందు శంఖనిభకర్ణులును ఘోరాకారులును నానారూపులు నైనమందేహనామరాక్షసులు రవికిరణంబులవేఁడిమికి నోడి దివాసమయంబుల నెల్ల సముద్రంబులో మునింగి రాత్రులు వెడలి యప్పర్వతశిఖరంబుల వ్రేలుచుండుదురు వారిం గనుంగొని యట దాఁటి ముక్తానిభోదకం బగుక్షీరసాగరంబుకడ కేఁగి యాసాగరమధ్యంబున నంశుమంతఁ బనురజతపర్వతంబు వెలింగెడు నాపర్వతసమీపంబున దివ్యగంధబంధురకమలకువలయహేమకేసరశోభిత యైనసుదర్శననామకనలిని విలసిల్లు నందుఁ గిన్నరచారణయక్షగంధర్వపతంగోరగాదులు సంతతంబును గ్రీడింప నేతెంతు రానలిని వీక్షించి దుగ్ధసాగరంబు గడచి యుదధిశ్రేష్ఠం బగుఘృతోదధి కరిగి యందు హయగ్రీవముఖుం డగుకపిలమహాముని వసించి సువిఖ్యాతం బగునాఘృతంబు నహర్నిశంబును ద్రాగుచుండు నచట బడబానలముఖంబున నాక్రోశించుజలచరాక్రందననాదంబు వినఁబడుచుండు నాఘృతోదధియుత్తరకూలంబునఁ జతుర్దశయోజనప్రమాణంబున నొప్పారుచు జాతరూపశిలానామకపర్వతంబు గల దాపర్వతశిఖరాగ్రంబున శ్రీకలితుండును సహస్రశిరుండును నీలాంబరుండు నైనయనంతదేవుం డాసీనుండై యుండు నమ్మహాత్ముని కేతువు త్రిశిరంబై కాంచనతూలంబు గలిగి వేదికామధ్యంబునం జెలువారుచుండు దానిం గనుంగొనుచు ముందట బ్రహ్మనిర్మితం బగు నొక్కద్వీపంబు గల దాద్వీపమధ్యంబున హేమమయం బగునుదయపర్వతంబు దీపించుచున్నయది జాతరూపమయంబులు సూర్యసన్నిభంబులు నగుసాలతాలతమాలకర్ణికారంబులచేత శోభిల్లుచు గగనోన్నతంబును శతయోజనాయతంబు నగునాపర్వతంబు వెలుంగుఁ దదీయగుహాదుర్గవనంబుల సీత నన్వేషించుచు యోజనాయుతవిస్తారంబును శతయోజనోన్నతంబును నగుసౌమనశ్శృంగంబు కనకమ

యంబై విలసిల్లు నందు వైఖానసు లైనవాలఖిల్యులు సూర్యకిరణాహారు లై ప్రాదేశప్రమాణు లై యుండుదు రట మేరువు సూర్యప్రభలు సంక్రమింప సంధ్యారక్తవర్ణం బై యుండు నచ్చోటఁ ద్రివిక్రమదేవుండు ప్రథమపాదంబు పెట్టి ద్వితీయపాదంబు మేరుశిఖరంబున బెట్టె నామేరుశిఖరంబు నాక్రమించి సూర్యుండు తేజరిల్లుచు జంబూద్వీపంబువారి కెల్లఁ గానంబడుచు సకలజీవులకుఁ గన్నులవెలుంగై యుండుఁ దత్పూర్వభాగం బెల్ల నంధకారావృతంబై యుండు నటమీఁద మీరు గమింప నశక్యం బాశైలవనస్థలనదీప్రదేశంబుల సీతారావణుల శోధింపుఁ డని పలికి. 548

మ. ఇట నేఁ జెప్పినచండభానుకిరణాస్వీతాఖిలక్ష్మాకులం
బటుబుద్ధిన్ మఱి మీరుఁ జెప్పనిమహీభాగంబులం బోల మ
ర్కటవీరుల్ చని జానకిన్ వెదకి వేగ రం డొక్కమాసంబులో
నటమీఁదం దడ వున్నవాని వెసఁ జెండాడించి చంపించెదన్. 549

చ. వనచరవీరులార రఘువల్లభువల్లభ వేగ చూచి వ
చ్చినకపివీరసింహునకుఁ జెచ్చెర నాసగరాజ్య మిచ్చెదన్
జనపతికోర్కి సేయుట యశంబును బ్రాణపదంబు ధర్మవ
ర్తనము నవశ్యకార్యమును దద్దయు లోకహితంబు వెండియున్. 550

క. మన కెల్ల బ్రదుకుఁదెరువును, మనమున కెంతయుఁ బ్రియంబు మర్కటవీరుల్
ఘనసత్త్వజవము లారం, జని వైదేహిం గని రండు సమ్మద మొదవన్. 551

వ. అని పలికి వినతప్రముఖులఁ దూర్పుదిక్కునకుం బనిచి దక్షిణదిగ్దేశంబునకుఁ దగువారిం బుచ్చుతలంపున. 552

— హనుమంతుండు మొదలగువానరుల దక్షిణదిక్కునకుఁ బుచ్చుట. —

మ. అనిలతనూజునిన్ గజగవాక్షుల మైందసుహోత్రగంధమా
దనుల నుదారునిన్ ద్వివిదు ధాతృసుతుం డగుజాంబవంతునిన్
వినతుని నంగదప్రముఖవీరుల నగ్నితనూజు నీలునిం
గనుఁగొని భానునందనుఁడు కార్యము చొప్పడ వారి కిట్లనున్. 553

వ. అతిబలులు సర్వకార్యనిర్వాహకులు నైనకపివీరులారా మీరు దక్షిణదిగ్భాగంబున కరిగి యచట నచట సీతారావణుల వెదకుచు సహస్రశృంగం బగువింధ్యంబున కేఁగి నర్మదావేత్రవతీతీరంబుల నావింధ్యపాదవనదుర్గగుహల జానకిని వెదకి వేగవతీకృష్ణవేణీదేవికామేఖలోత్కలాకంబువతీంద్రవతీసమీపంబులవిదర్భఋషికామాహిష్మతీపట్టణంబుల శకపుళిందనిషధదశార్ణకుకురాదిదేశవనగిరికందరంబుల సీత వెదకుచు దండకారణ్యంబున కరిగి యచట గిరివనదుర్గంబుల గోదావరీతీరంబుల నంధ్రపుండ్రకేరళకురుదేశంబులఁ బరికించుచుఁ జిత్రపుష్పితపాదపచందనవనశోభితం బైనమలయపర్వతంబునకుం జని యాపర్వతకందరచందనమండత

మాలవనంబులం జూచుచు నటమీఁద. 554

మ. మలయగ్రావమునందు భానుసమరమ్యస్ఫారతేజస్సము
జ్జ్వలుఁడై యున్నయగస్త్యతాపసుని నిచ్చం జూచి యాశైలముం
గలయం జుట్టి ప్రసూనమాలికగతిం గావేరి యొప్పారెడున్
నలినాపాంతఁ బులస్త్యుఁ డుండు నతనిన్ స్నానొంద వీక్షించుచున్. 555

వ. ఆకావేరి దాఁటి సముద్రమర్యాద యగు వేల చేరి యచ్చటఁ గేతకీపున్నాగవనంబుల నవలోకించుచు నావేల యతిక్రమించి ముక్తామణిభూషితంబును గవాటగుప్తంబును నగుపాండ్యులహేమపురంబున కరిగి యప్పురంబుఁ జూచుచుఁ దదనంతరంబ. 556

సీ. ఘనుఁ డగస్త్యుండు పెట్టినయుపహారమ్ము, గడఁగి రంగత్తరంగములచేత
వితథంబు చేసిన మతి నల్గి యమ్ముని, యంతరంగుఁడవు గమ్మని శపింప
నాశాపమున వార్ధి యంతరంగం బెల్ల, నపుడు గానఁగరాఁగ నంతరంగుఁ
డై యుండె నది మొదలద్దేశ మంతరం,గాఖ్య మా రూఢిచే నచోటు గడచి
జాతరూపశృంగము సిద్ధ[1]సాధ్యచార, ణాప్సరోగణసేవ్యంబు నగుమహేంద్ర
గిరికి నరుగుఁ డయ్యద్రికి సురవిభుండు, వరుసఁ బర్వపర్వంబుల వచ్చుచుండు.

వ. ఆపర్వతంబునం దప్రమత్తుల రై సీతను వెదకి యాగిరిపాదంబున శతయోజనాయతం బగుద్వీపము గల దది మనుష్యుల కగమ్యం బని యచటివనగోచరులు చెప్పుదు రాద్వీపంబునం సీతం గలయ వెదకి యాద్వీపంబు గడచి సాగరోత్థితంబును జంద్రసూర్యసంకాశంబును సాగరాంబుపరిఖంబును నంబరోల్లేఖశిఖరంబును నగుకనకగిరి గని యాశైలశృంగంబుల నొక్క హేమశిఖరంబున సూర్యుండును మఱియొక్క రజతమయం బైనశిఖరంబునఁ జంద్రుండును వెలుంగుచుండుదురు కృతఘ్నులు నృశంసులుఁ బాపకర్ములు నాశైలంబును గనలే రగ్గిరికి నమస్కరించి సీత నందు శోధించి యగ్గిరి గడచి చతుర్దశయోజనపరిమితం బగుసముద్రాపరభాగంబున కరిగి యచట ఫలమూలాంబుమధువులు తనియ సేవించి యాసాగరంబు దాఁటి సర్వకాలఫలదళవృక్షంబులు గలిగి విశ్వకర్మనిర్మితం బైనవిద్యుద్వంతం బనుపర్వతంబు గల దచటి కరిగి యందు సీతారావణుల వెదకి మఱియు జాతరూపశృంగనానాధాతుశోభితం బైనయుశీరబీజం బనుపర్వతంబు పొడగనుం డప్పర్వతంబు మరణాసన్నకాలు రైనవారికిఁ గానంబడ దన్నగంబు శృంగంబుల సీత వెదకి యన్నగం బతిక్రమించి దుర్దర్శనం బగుమాల్యవంతంబు గని యటకుఁ జతుర్దశయోజనమాత్రంబున శక్రధ్వజాకారం బగుకుంజరపర్వతంబు గల దగ్గిరియందు విశ్వకర్మనిర్మితం బగునగస్త్యభవనం బున్నది యక్కడ నగస్త్యాభిషేకంబుకొఱకు నోషధివనశైవలినీశోభిత యైనయంజనానది యున్నది

1 చారణాను, రాప్సరోగణ.

యచ్చట నున్న యగస్త్యునిం బూజించి యాకుంజరపర్వతంబు గడచి రక్తచందన సంరక్తయు మణివిద్రుమశర్కరయు దేవర్షిసేవితయుఁ బవిత్రయు నైనసరస్వతీ నది వెలయుచుండు నచట యోజనవిస్తారంబును శతయోజనోన్నతంబును బన్న గాభిశోభితంబును నగు కాంచనతోరణంబు దీపించుచున్నది యచ్చట మహావిషో రగరక్షితం బైనట్టిభోగవతీపురి చెలువారు నాపురి వాసుకి యేలుచుండు నది సర్పనిలయం బాపురి నతిక్రమించి నానావర్ణదివ్యచందనశోభితం బైనమహావృ షపర్వతంబు గలదు మోహితులై శైలూషగ్రామణిభిక్షు స్తనబభ్రు లనుగం ధర్వు లాపర్వతంబునఁ గ్రీడఁ గాపుండుదురు దేవతలు నప్సరోగణంబులుఁ గ్రీడిం తురు దానిం గనుచుఁ ద్రిశృంగమహీధరంబుఁ జేరి తచ్ఛిఖరంబునఁ బ్రభవించి సౌమనసానది విలసిల్లుఁ దత్తీరోత్తరపర్వతంబున నానావర్ణపక్షికులంబులమధుర స్వరంబులు చెలంగు నటమీఁద నంధకారాక్రాంతం బైనపితృలోకం బదృశ్యం బు నతిదారుణంబు నై యుండు నందుఁ గాంచనతలంబును వజ్రవైదూర్యవేదికంబు నగుప్రాసాదం బొప్పు దానిమీఁద ధర్మాసనాసీనుం డగుచు నంతకుండు సర్వ ప్రాణులసుకృతదుష్కృతంబు లెఱింగి యుచితఫలంబు లొందించుచుండు నా లోకంబు గడచి. 558

క. సురుచిరమౌక్తికమణిఫల, భరవిలసితకనకపాదప ప్రకరవిభా
సుర మగుతృణాంగిసంయమి, వరునాశ్రమమునకు నరిగి వలసినభంగిన్. 559

చ. జనకజఁ జూచి రండు కపిసత్తములార యభీష్ట మొంద న
మ్మునివరు నాశ్రమంబుకడ ముట్టి వెలుంగుచునుండు దక్షిణం
బున కటమీఁద మీ కరయఁ బోవ నశక్యము భానుదీప్తులుం
జనఁ బ్రసరింప వవ్వలను జానుగ నంచును బల్కె యక్షితోన్. 560

క. హనుమంతునిఁ గనుఁగొని రవి,తనయుం డి ట్లనియె బలము దగవు నెరయ రా
మునికోర్కి దీర్చి జగముల,ఘనసన్నుతిఁ బొంద నిదియె కాలము నీకున్. 561

క. అతిజవతేజోలాఘవ,గతివీర్యములందు సాటి గా నీకు సదా
గతి దక్కఁగ నన్యుం డీ,క్షితిలో నీసాటివాఁడె గిరిచరవర్యా. 562

క. సురగంధర్వాసురకి, న్నరఖేచరసిద్ధసాధ్యనరలోకంబుల్
పరఁగంగా నీ వెఱుఁగుదు, ధరణిజ వెదకంగ నీవె దక్షుఁడ వరయన్. 563

క. దివియందు నభమునందును, భువియందును జలములందుఁ బోయెడు నెడ నీ
కవరోధ మెచటఁ గల్గదు, పవమానతనూజ నీవు ప్రబలుఁడ వెందున్. 564

ఉ. కావున భూమిజన్ వెదకి కాంచి రయమ్మున రమ్ము రాఘవ
క్ష్మావిభుచింతఁ బాపు తగ మమ్ముఁ గృతార్థులఁ జేయు లోకసం
భావితకీర్తితో వెలయు పావని నావుడు సంతసించి సు
గ్రీవునితోడ భూపతివరేణ్యుఁడు రామనరేంద్రుఁ డిట్లనున్. 565

—రాముఁడు హనుమంతునిచేత ముద్రిక యిచ్చుట.—

ఉ. ఈహనుమంతునందుఁ గల § వెక్కుడుశక్తియు విక్రమంబు ను
త్సాహము [1]దేశకాలవిహిత§క్రమయుక్తియు సాహసంబు న
గ్రాహితనీతి యున్నతియు § నాతతతేజము వేగ మేఁగి వై
దేహిఁ గనంగ నోపుటయు § ధీరతయుం గృతకార్యసిద్ధియున్. 566

క. ఇనసుత యీతనివలనం, దనర మదీయాభిమతము § ధన్యత నొందున్
విను మని పావనిఁ గనుఁగొని, మనుజేశ్వరుఁ డిట్టు లనియె § మన్ననతోడన్.

క. జానకి వెదకఁగఁ జని కని, యానందముతోడ వచ్చి § యాదట రఘుసం
తానము నాప్రాణంబులు, మానుగఁ గలుగంగఁ జేయు § మారుతపుత్రా. 568

క. మానుగ నీముద్రిక గని, మానసమున సంతసించి § మారుతసుత నిన్
నే నటఁ బుత్తెంచితి నని, జానకి సత్కృతులు నీకు § సమ్మతిఁ జేయున్. 569

క. అని నిజనామాంకితకాం, చనమణిగణకమ్రకిరణ§సదమలశోభా
కనదంగుళీయకము న, త్యనురక్తిం జేతి కిచ్చె § ననిలజుఁ డంతన్. 570

క. శిరమున ముద్రికఁ దాలిచి, నరపతిపదములకు మ్రొక్కి § నలువుగ గంతుల్
పౌరిఁబోరి వైచుచు పావని, తరుచరసైనికులనడుమఁ § దద్దయు వెలసెన్. 571

క. [2]ఇనజుఁడు దక్షిణదిశ కి, ట్లనిలజముఖకీశవగుల § నవనిజ వెదకం
జనఁ బనిచి వెనుక సమ్మతిఁ, దనమామ సుషేణుఁ జూచి § తా ని ట్లనియెన్.

—సుగ్రీవుఁడు సుషేణుని బశ్చిమదిక్కునకుఁ బుచ్చుట.—

వ. కపివర నీవు రెండులక్షలవానరవీరులతోడఁ బశ్చిమదిగ్భాగంబునకు నేఁగు తదీయమార్గంబు నెఱుంగఁ జెప్పెద వినుము సౌరాష్ట్రసౌహిత్యబాహ్లికశూద్రాభీరజనపదంబుల వకుళాధివాసితంబు లయినపున్నాగగహనంబులఁ గేతకీషండంబుల నారికేళవనంబులవిహరించి యధిక ప్రవాహనదులఁ దాపసారణ్యంబుల నెమకి కేకయసౌవీరత్రిగర్తదేశంబుల మహోగ్రగ్రాహసంకులం బైనపశ్చిమసముద్రద్వీపంబుల వై దేహి వెదకి చైత్రపాదపశోభితం బైనమరీచిపట్టణంబున సరస్సాగరశైలవనస్థలంబుల మఱియునుం గలపురాణవనంబుల రత్నశోభితపట్టణంబుల సింధుసాగరసంగమంబుల వైదేహి వెదకుచు శతశృంగంబులు గలమహాహేమగిరి చేరి తోయదస్వనమత్తమాతంగంబుల దృప్తసింహంబుల నీడవాసు లైనబలవత్పక్షిగణంబులఁ గని యగ్గిరిసానుతటంబుల వెదకుచు నచట నున్నవిస్తీర్ణకమలాకరంబులఁ దీర్థంబులఁ దాపసారణ్యంబుల గిరిస్థలంబుల వనోపవనంబుల సీత వెదకుచు మఱియు గజవనంబులఁ బంచనదశోభితం బైనకాశ్మీరమండలంబున దక్షిణశిలానగరంబున గాళకేకయాదిదేశంబులఁ బట్టణంబుల సాగరద్వీపంబుల

1 దేశకాలహిత§సంక్రమవృత్తియు. 2 ఇనజుం డతిబలవేగుల, హనుమంతప్రముఖకపుల § నవనీతనయుం, జని వెదకఁ బనిచి సమ్మతిఁ.

వెదకి యట గడచి కాంచనమయంబు లగు గగనోల్లేఖశిఖరంబులు గలపారియా
త్రశృంగంబును గదిసి యందున్నగంధర్వకోట్లావనఫలమూలంబులఁ గాచి
కొని యుందురు వారిచెంతలఁ జేరక యటఁ జని వైదేహి నరయుచుం జని.

క. జలధికి నాలవపాలై, యలరారెడుచక్రవంత * మనుశైలం బు
జ్జ్వలమణిమయశృంగంబుల, ఫలవిలసితకల్పపాద * పంబుల వెలయున్. 574

క. అట విష్ణుఁ డయోమయమును, జటులోగ్రసహస్రకోటి * సంభృతమును ను
ద్భటదైత్యభంజకము నగు, హటగంచితవజ్రనాభ * మనుచక్రంబున్. 575

వ. చేకొనియె నట మఱియును. 576

క. ఘనశక్తి హయగ్రీవుం, డనుదనుజునిఁ బంచజనుని * హరియించి ఘన
ధ్వనిఁ దనరుపాంచజన్యం, బనుశంఖముఁ బుచ్చుకొనియె * నసురారి వెసన్.

వ. అటఁ గడచి యగాధం బగుసముద్రమధ్యంబున సువర్ణశృంగంబును జతుష్షష్టి
యోజనవిస్తృతంబును నగువరాహపర్వతంబు గని తద్ద్వీపపార్శ్వనితంబగుహా
వనస్థలంబుల సీత నాలోకించుచు నగ్గిరి దాఁటి సహస్రధారాపరివృతశిఖరంబును
గాంచనశోభితంబును నభ్రంకషంబును గాంచనతరుపరివృతంబును దేవర్షిసేవి
తంబును శుకకోకిలమయూరసింహవ్యాఘ్రకులసంకులస్వనభరితంబును దేవరా
క్షసపరివేష్టితంబును మహేంద్రపాలితంబును సురరాజ్యాభిషేకయుక్తస్థలంబు
ను నగుమఘవత్పర్వతంబును గని యగ్గిరి నతిక్రమించి తరుణార్కవర్ణంబులును
గాంచనమయంబులు నైనయఱువదివేల పసిండికొండలనడుమ దినకరునివరప్ర
సాదమహిమం జేసి తననిజసువర్ణదీప్తుల సన్నిహితవస్తువుల నెల్ల ననిశంబును సు
వర్ణమయంబులం జేయుచుండు మేరుశైలంబున వసురుద్రాదిత్యమరుద్గణంబు
లు పశ్చిమసంధ్యావేళ నగ్గిరికి వచ్చి యాదిత్యునిఁ గొల్చి పూజింతురు ద్విసహ
స్రయోజనపర్యంతంబు నిమిషార్ధంబున గమించునాసూర్యుండు సర్వభూతం
బులకు నదృశ్యుం డై యస్తమించునయ్యస్తాద్రిశృంగంబునందు సూర్యసన్ని
భంబును విశ్వకర్మనిర్మితంబును జిత్రపాదపనానాపక్షిసమాకులంబును శతసౌ
ధసంబాధంబును నగువరుణునిపట్టణం బొప్పారు నచ్చట రెండవసూర్యుండునుం
బోలెఁ దేజరిల్లుమేరుసావర్ణి యనుమునివరేణ్యునకు నమస్కరించి యయ్యస్తాచల
మేరుమధ్యంబున సువర్ణమయంబును జిత్రవేదికావిరాజితంబును దశశిరంబును
నగుతారాద్రి విలసిల్లుఁ దదీయగుహానిర్ఝరవనప్రదేశంబుల సీతను వెదకి మఱి
తప్తకాంచనవర్ణంబును లోకహితార్థప్రభవంబు నుజ్జ్వలజ్వలితతేజంబు నైనయ
య్యస్తాద్రి నాలోకించి ఖగమృగపన్నగదేవాసురయక్షరాక్షసాదులకు నేరికి
గమింప నశక్యం బవ్వల రవికిరణప్రచారంబు లేక యుండు నంధకారాక్రాంతం
బగుచు. 578

క. అస్తాచలపర్యంతన, [1]మస్తాచలములును నీ కమరఁ జెప్పితి నా
కస్తోకపద్ధతిని సతి, నస్తోకసుమతిని వెదక నరుగుము మామా. 579

క. నీ వనఘ నాకు మామవు, కావున మజ్జనకునట్ల కనుఁగొన నురుసం
భావన కర్హుఁడవు తగఁ, భూవరుసతి వెదకి వేగ ప్రోవుము మమ్మున్. 580

క. ఎవ్వఁడు మాసములోపల, నివ్విభుసతిఁ గాన వెదకి యే తేకుండుం
గ్రొవ్వాఱ ఘనదండంబుల, నవ్వనచరనీచుఁ జావ నడిపింతు వడిన్. 581

—సుగ్రీవుఁడు శతబలి నుత్తరంబునకుఁ బుచ్చుట.—

క. [2]అనుచు సుషేణునిఁ బడమటి, కనుమతిఁ బుచ్చి మఱి వీరుఁ డగుశతబలిఁ గ
న్గొని రామహితంబుగ నా, తనితో ని ట్లనియె సునయతరవాక్యములన్. 582

క. ధనదునిదెసఁ గలగిరిబిల, వనపురదేశముల నెల్ల వసుధాతనయం
జన వెదకి కాంచి యిటకుం, జనుదెమ్మలవునఁ దదీయసరణి విను తగన్.

వ. కపివరా నీవు సహస్రకోటివానరవీరులం గొని మంత్రిసమేతుండ వై యక్షరాక్షసగంధర్వకిన్నరేశుం డైనకుబేరుండు పాలించునుత్తరదిక్కునకుం జని మత్స్యపుళిందశూరసేనభద్రకకురుగాంధారయవనమాళవబాహ్లికచేదిశకబర్బరకుకురుకాశకాంభోజదేశంబుల నయ్యైపురగిరివనబిలనదీస్థలంబులను భూమిజ వెదకుచు నట దాఁటి లోధ్రపద్మకదేవదారుసాలతాలభూర్జఖర్జూరవనంబులను సిద్ధచారణకిన్నరపిశాచయక్షరాక్షసతాపసగుహ్యకగరుడోరగమృగపక్షుల వనశైలంబులు శతయోజనప్రమాణంబులుగాఁ దిరిగివచ్చి యున్నహిమవంతంబు చేరి యయ్యైస్థలంబుల జానకి వెదకి చని భృగుశృంగం బనుమహాశ్రమంబు పరికించుచు నీలశైలంబు చేరి తదీయశృంగబిలంబులుఁ బద్మాకరంబులు నతిక్రమించి హేమగర్భంబును సుదర్శనంబునుం గడిసి ధూమపర్వతశృంగంబు ప్రియంగువనంబుల శోధించుచు హేమగర్భంబులును దేవసంభవంబులును నగుగిరులం గడచి శతయోజనంబును బహుపర్వతవృక్షనదీచయంబు నగునాకాశం బనుశైలంబు గల దాశైలాధిత్యకాతలంబున శతయోజనం బైనవనంబు గల దది నిర్జలంబును దరణికిరణతప్తంబును మృగపక్షిగణరహితంబును నై యుండు నటఁ దడయక కదలి కైలాసంబున కేఁగుం డం దరిగి యచ్చటఁ బాండురమేఘసన్నిభంబును జాంబూనదభూషితంబును విశ్వకర్మనిర్మితంబును నగుకుబేరునగరం బున్నది యచ్చటఁ గమలకువలయహంసకారండవచక్రవాకాభిశోభితంబులును ముక్తావైదూర్యవాలుకంబులును నై కమలాకరంబు లలరుచుండు గుహ్యకకిన్నరసమేతుం డై కుబేరుం డాకొలఁకులఁ గ్రీడించుచుండు నాకైలాసగుహానిర్ఝరప్రదేశంబులఁ సీతారావణుల వెదకి యగ్గిరి దాఁటి త్రిశృంగగిరి కరుగుం డందుఁ దప్తకాంచనభూషితం

1 మస్తస్థానములు నీ కమరఁ.

2 వ. అని మఱియును. క. ఇనజుఁడు సుషేణుఁ బడమటి.

బును దివ్యంబును నైనయాగిరిశృంగంబువలన నొక్కమహానది పొడమి యొప్పు
చుండు నానదీహ్రదంబున వెడలి సరయూనది పాఱుచుండు నగ్గిరిశృంగంబు లొ
కటి కాంచనమయంబు నొకటి వైదూర్యమయంబు నొకటి రజతమయంబును నై
యుండు నచట ము న్నేభూతంబులుం బుట్టకమున్న సర్వభూతశ్రేష్ఠుం డైనవిశ్వ
కర్మ యొక్కమహారణి నగ్నిహోత్రంబు కల్పించె నందుఁ ద్రేతాగ్నులు విల
సిల్లె నయ్యగ్నిమహాముఖంబున మహాదేవుండు సర్వభూతంబులం బశువులుగా
వేల్చినమహావేదిక యున్నది యావేది దర్శించి యాత్రిశృంగపర్వతంబునఁ బ్రస
న్నసలిలప్రవాహ మైనకూటమహానది వర్తిల్లు దేవదానవపతంగోరగాదులకు గ
మింపరాక ప్రదీప్తపావకంబునుంబోలెఁ దేజరిల్లు నాపర్వతశృంగమహావనంబుల
సీత వెదకి యాశైలంబు గడచి దేవదానవసేవితం బైనక్రౌంచాద్రి కరిగి యందు
సూర్యప్రభ గలిగి దేవతార్చితులు దేవసన్నిభులు నైనమహామును లున్నవా
రాశైలశిఖరంబున దివ్యం బైనవిహగాలయం బున్నది యక్కడ దేవదానవరా
క్షసాదిసర్వభూతంబులకు గమింప రాకుండు నగ్గిరి గుహానితంబసానువులఁ దదీయ
శృంగంబుల సీత వెదకి యగ్గిరి నతిక్రమించి మైనాకంబున కేఁగి యగ్గిరియం దర్శ్య
మవనం బున్నది యచ్చట జంబూద్వీపజంబూవృక్షం బప్సరోగణంబులచేఁ బూ
జితంబును సతతంబు ప్రభల వెలుంగుచుండు నందలిచిత్రసుగంధవనంబుల నశ్వ
ముఖకాంత లుండుదురు రమ్యం బైసలౌదాశ్రమంబు మహర్షియుతంబును ధర్మ
నిలయంబు నూర్ధ్వరేతస్కమునిసమాశ్రితంబును నై దీపించు నాయాశ్రమంబు న
తిక్రమించి వైఖానసులయినవాలఖిల్యులుమరీచిప్రాయులై యుండుదురుగాన వారి
ని సీతావృత్తాంతం బడుగుచు నటఁ జనితరుణాదిత్యసంకాశంబును హేమరసోదకం
బును హేమహంససమాకులంబు నగువైఖానససర స్సున్నయది యందుఁ గుబేరు
సార్వభౌమం బనుదిగ్గజం బాఁడేనుంగులతోడఁ గ్రీడించుచుండు నాకొలను గడచి
నష్టచంద్రదివాకరంబును నక్షత్రగ్రహానిర్మేఘపవనాదికవ్యోమంబును నై సూర్య
దీప్తులుంబోలెఁ దేజరిల్లు నతిశాంతతాపససిద్ధసేవితం బయిన మైనాకంబు గడచి సి
ద్ధచారణసేవితంబును దమాలతాళీవనశోభితంబును జతుష్షష్టియోజనపరిమితంబు
ను నగుగంధమాదనంబున కరిగి తదీయశృంగంబునఁ బ్రసన్నసలిలాశయంబును
బుష్పితోపవనశోభితంబును శుద్ధాగురుగంధధూపితంబును నగుదివ్యహ్రదంబుచెం
త దర్శనీయజాతరూపవిలసితంబును సవేదికంబును నగుజంబూవృక్షం బున్నది
యాగంధమాదనశృంగగుహావిపినంబుల సీతం బరికించుచు నటఁ గడచి పితామ
హాదేవదానవసేవితంబును దుషారచయసంకాశంబును సితాసితపుష్పవిరాజితం
బును రమ్యాగురుధూపితంబును ఘృతపిండంబును నగుమందరపర్వతంబున కరిగి
యందు మందాకినీతీరంబుననుండి లోకాద్భుతఘోషంబులతో గైరికాంజనసం
యుతమై శిలలు నుగ్గుగాఁ బడ మహాప్రవాహంబుతోఁ బాఱుచుండు నమ్మహా

నదిని సకలదేవమునీంద్రులు సన్నుతింతురు పుణ్యయైన కౌశికానదియును నచట విలసిల్లు మఱియు రక్తజలప్రవాహయుఁ గేశమాంసాస్థివాలుకయు నైనవైతరణియుఁ దత్సమీపంబునఁ బాఱుచున్నది యచ్చట యక్షగంధర్వపిశాచోరగపతంగాదులు కాలవశంబున దేహంబులు విడుచుచుందు రచ్చట వారిదేహంబులు గానంబడు భువి మనుష్యులదేహంబులుంబోలె నటఁ గడచి కాలమేఘసంకాశంబును ఘోరగ్రాహసంకులంబు నగునుత్తరసముద్రంబున కేఁగి తదుత్తరతీరంబు చేరి కొండొకసేపు విశ్రమించి తత్తీరంబున నున్నసహస్రశిఖరాయతంబును గాంచనమయంబును సూర్యసంకాశంబును నగుబహుకేతుపర్వతంబు గని యాగిరిమీఁద నున్నదివ్యప్రసన్నోదకహ్రదంబును మహాశరవణంబునుం గని కాంచనమయం బైనయాశరవణంబు చేరి. 584

తే. కాలమేఘసంకాశంబు గ్రాహభీక, రంబు బహురత్నరాజివిరాజితంబు
నైనయుత్తరవారాశి కరిగి యుత్త, రంపుఁదీరంబుఁ జేరి విశ్రామ మొంది.

చ. అలరి యటన్ సహస్రశిఖరావళికాంచనదీప్తమండలిన్
గలబహుకేతునామగిరి గ్రాలుచు నుండును దానిమీఁద ని
ర్మలసలిలహ్రదం బమరు మానుగ నచ్చటఁ గార్తికేయజ
[1]న్మలలితదీప్తిమచ్ఛరవణంబు వెలుంగుఁ దదీయసన్నిధిన్. 586

క. సలిలాశయ మొక టిరవుగఁ, గలదు హయగ్రీవుఁ డును గపిలుఁ డనంతుం
డలమిం దద్దీర్ఘికలో, నలవడ జలకేళిఁ దేలి యాడుచు నుండున్. 587

వ. అగ్గిరిశృంగగుహానిర్ఝరంబుల సిద్ధచారణసేవితపుష్పితవనాశ్రమంబుల జనకజ వెదకుచు నద్దేశంబు దాఁటి ముందట నున్నశిలోచ్చయనదిని దత్తీరకీచకవేణువులం దెప్పలు గట్టికొని యాపుణ్యనదీజలస్పర్శనంబు చేసి యానది నుత్తరించి యావల సీతానదిఁ బొడగని యానది నవగాహంబు సేసి శుచీభూతు లై పుణ్యాత్ము లగుచు నటఁ గడచి. 588

క. సురపురసదృశము లగునుత్తరకురుదేశములు గలవు తద్దేశములం
జరియించుజను లుదారులుఁ, దరుణవయోలలితు లధికధన్యులు మఱియున్.

ఉ. ఆగతహర్షభాగులు నిరంతరనిర్జరరాజభోగులుం
జాగులుఁ బుణ్యభాగులును శాశ్వతరాగులు [2]నిష్టసౌఖ్యసం
యోగులు నిర్గతాగులు సముజ్ఝితశోకభయార్తిరోగులున్
శ్రీగులు నిత్యదానరతిసేవితకందరకాంచనాగులున్. 590

వ. ఆదేశంబున శీతోష్ణజరామరణంబులు శోకభయామర్షంబులు లేవు సూర్యుండు ప్రసరింపఁడు భూమి వశీకరయు నిస్తృణకంటకయుఁ బాండువర్ణయు సమతలయు విగతబాధయు నారోగ్యవతియు శాద్వలవతియు సర్వకాలఫలవృక్షశోభితయుఁ

---

1. న్మలలితహేమతచ్ఛరవణంబు. 2. నిత్యసౌఖ్య.

జారుకాంచనమణిమండితయు సువర్ణపక్షిగణవిరాజితయు నగుచు నీలవైదూర్య వర్ణోత్పలంబులును మణిమయకనకదండహేమకేసరరక్తోత్పలవనంబులును దప్త కాంచనపద్మంబులుం గలిగి సుగంధబంధురంబు లగుపద్మాకరంబులు మణికాంచన విచిత్రకింజల్కనీలోత్పలషండంబులు గలభూములు మణిరత్నసంకీర్ణకాంచనవాలు కానదులు సువర్ణమణిరత్నగిరులు హేమాభిరామద్రుమచ్ఛాయలుం గలమణి పర్వతంబుల ననర్ఘ్యనిస్తులముక్తాఫలమణిగణరాజితకమలాకరంబుల నదుల నని శంబును గామితఫలంబు లొసంగుచు మధురమధువులు గురియుతరువులుం గలిగి యాభూములు విలసిల్లు నచ్చట సప్తర్షిభవనంబులు మందాకినీనదియును ధనదుని చైత్రరథంబును క్షీరనదులు నాజ్యప్రవాహంబులును బాయసకర్దమంబులును విలసిల్లు మఱియు బ్రహ్మనిర్మితకల్పతరువులు సతతంబును బుష్పఫలాన్వితంబులై నానావర్ణమృదులాంబరంబులు ముక్తావైదూర్యకనకచిత్రభూషణంబులుఁ జిత్రా స్తరణశయనంబులుఁ గామితగంధపుష్పమధురరసంబులు నతిస్వాదుపానంబులు వివిధభక్ష్యంబులును మఱియు స్త్రీపురుషుల కనురూపఫలంబులు నొసంగుచుండు సిద్ధగంధర్వకిన్నరనాగవిద్యాధరులు నచటం దరుణీసహితులై రమించుచుండు దురు వార లెన్నండును వియోగంబులు లేక పరస్పరప్రియులై యుండుదురు కాంతలు కాంతిమతులు లావణ్యవతులు సర్వాభరణభూషితులునై విలసిల్లు దురు పురుషులు శుభాకారులు రూపవంతులు మహాతేజులు వితంద్రాత్ములును నై యుండుదు రచట నెవ్వరు ససంతుష్టులు నప్రియులు లేక మెఱయుదురు.

చ. తనపురికంటె సద్గుణవికాసములుం గమనీయలక్ష్ములుం
గనుఁగొన నొప్పుచున్ శుభసుఖంబుల కెల్లను భోగభూమియై
యునికిని నాధరిత్రిఁ గలయోషలు తన్ను గణింప కెంతయు
న్మనసిజతంత్రముల్ దినదినంబును జల్పుచు నున్నదానికిన్. 592

వ. ఇంద్రుం డీసున నక్కాంతల నాగుహాముఖంబునన జరామరణదుఃఖితలై యుం డుం డని శపియించుటయు వార లాశాపంబున నమ్మహాగుహను దినదినంబును ముదిసి చచ్చుచుఁ బుట్టుచు నుండుదురు. 593

క. తిమిరవతి యనఁగ నగ్గుహ, యమరుం దద్బిలములో గుహాగేహసహ
స్రము లుండు వానిలో భూ, రమణునిసతి వెదకి కపులు రభసము లారన్.

వ. దేవసేవితం బగునయ్యుత్తరదేశంబు దాఁటి ముందట నున్న హేమమయం బగు సోమగిరి కరుగుం డింద్రలోకగతులు బ్రహ్మలోకగతులును నగుదివ్యు లప్పురంబు రక్షించుచుండుదురు గగనోన్నతం బైనయాసోమగిరిప్రభ సూర్యుండు ప్రవే శించుచుండునది సూక్ష్మదర్శులకు భానుతేజోమయం బై మెఱుంగం బడు. 595

క. అదట నగ్గిరిపై నే, కాదశరుద్రాత్ముఁ డైనగౌరీశుఁడు స
మ్మోదమున నుండు నట నజు, గాదిలితనయుండు మనువు కైకొనియుండున్.

వ. అదియుం జతుర్విధభూతసృష్టితోడ నచట వర్తిల్లుట దాని మనుష్యానం బంద్రు
దేవదానవుల కది దుర్గమం బాశైలం బన్యులకు గమింప నశక్యంబు కపులార
మీ రాసోమాద్రి వీక్షించి తదీయపార్శ్వకటకగుహావనోద్యానవనగంధర్వభవ
నంబుల రామదేవుదేవిని వెదకి యటమీఁద శమీస్థానంబు నొంది మఱి యమ
రారులు మహోలూఖలమేఖలులు నగురాక్షసులు గల రారాక్షసులఁ గలసి
యేకరాత్రం బక్కడనుండి యెల్లచోట్ల రాముసతి వెదకుండు మఱియును.

మ. అటపై నేరికిఁ బోవరా దినరుచుల్ వ్యాపింప వెల్లప్పుడుం
స్ఫుటమర్యాద మమందసాంద్రతిమిర స్తోమప్రకీర్ణంబు మీ
రట నేఁ జెప్పినచోటులం జనకజం వ్యక్తంబుగాఁ జూచి మ
ర్కటవీరుల్ నెలలోన రం డతికృతార్థత్వంబు సొంపారఁగన్. 598

క. నెలలోన రానివాని, న్బలువిడిఁ జంపింతుఁ బూని నాహితమును భూ
లలనునిహితముం జేసిన,యలఘుం రక్షింతు రాజ్య మంతయు నిత్తున్.

క. నావుడు నవ్వుఁ గా కని సు,గ్రీవునకును రామనృపతికిని మ్రొక్కి లస
ద్భావన శతబలి కపిసే,నావృతుఁడై యుత్తరమున కరిగెం గడిమిన్. 600

వ. అప్పు డొక్కవనచరుం డి ట్లనియె. 601

క. మృత్యుముఖంబునఁ దక్కఁగ, క్షిత్యాత్మజ యెచట నున్నఁ జెచ్చెర లోక
ప్రత్యయము గాఁగఁ దెచ్చెద, నత్యంతబలంబుతోడ నార్యులు మెచ్చన్. 602

వ. మఱియొక్కవానరుం డి ట్లనియె. 603

క. వినుఁ డే నిప్పుడ శతయో,జనముల్ చని కార్యసిద్ధిసహితుఁడ నై వే
చను దేరఁగఁ గల నేటికి, వనచరులను దుఃఖపఱుప వనచరపతికిన్. 604

వ. మఱియొక్కయగచరుం డి ట్లనియె. 605

క. భూతలభూధరసాగర, పాతాళనదీవిపినన భంబులు నాయ
త్యాతతగమనత్వరకు వి,ఘాతంబులు సేయ లేవు కావున బలిమిన్. 606

క. ఏవలన నున్న నైనను, రావణుఁ బరిమార్చి విజయ రమ్యశ్రీతో
భూవల్లభుప్రియపత్నిం, వేవే గొనివత్తు నేన విక్రమ మెసఁగన్. 607

వ. మఱియొక్కవృక్షచరుం డేపున గంతులు వైచుచు ని ట్లనియె. 608

చ. గిరు లగలించెదం జముని గెల్చెద బాడబవహ్ని మ్రింగెదం
ధర విదళించెదం దెసలు దాఁటెద సాగరముల్ గలంచెదం
ఖరకరచంద్రతారకనికాయముఁ గూల్చెద లీలఁ బంక్తికం
ధరుఁ బరిమార్చెదం గడిమిఁ దత్పురిఁ జొచ్చెద సీతఁ దెచ్చెదన్. 609

వ. అని యివ్విధంబున మఱియు ననేకప్రకారంబుల దర్పంబులు పలుకుచు. 610

ఉ. వాలము లెత్తి త్రిప్పుచును వారిరి గంతులు వైచుచుం దెసల్
వ్రీలఁగఁ జేయుచుం నెగసి విన్నటు ముట్టఁగ మ్రొగ్గుచుం ఘన

త్క్ష్వేళలు నుగ్రతర్జనలుఁ ॱ జేయుచుఁ బాఱుచుఁ బాఱి వచ్చుచున్
శైలము లెత్తియాడుచును ॱ జండగతిం జరియించి వానరుల్. 611

క. మిడుతలలఱుచునఁ బొడవుగ, నుడుపథ మన్నువంగ నడరి ॱ యొండొరుఁ గడవన్
బడిబడి దిశలకుఁ జన న, ప్పుడు రఘుపతి పలికెఁ బవన ॱ పుత్రునితోడన్. 612

క. నీ వెన్నఁ డిన్నిభూములు, వావిరిఁ గన్నాఁడ వనిన ॱ వనచరనాథుం
డావసుధేశునితో సం, భావన నిట్లనియె నపుడు ॱ ప్రమదం బెసఁగన్. 613

క. బలవంతుఁ డైనవాలికిఁ, దలఁకుచుఁ గిష్కింధ వెడలి ॱ త్వరతో నద్ది
క్కులకుం బాఱి మహీమం, డల మంతయుఁ జూచినాఁడ ॱ నాఁడు నరేంద్రా.

వ. జనవరా జనకజ వెదకఁ దూర్పుదిక్కునకు వినతప్రముఖవీరవానరుల దక్షిణ
దిగ్దేశంబునకు నాంజనేయాంగదతారముఖ్యకపిపుంగవులఁ బశ్చిమంబునకు సుషే
ణాదిప్లవగోత్తముల నుత్తరదిక్కునకు శతబలిప్రముఖయూథపులను బుచ్చితి
నని చెప్పి. 615

క. బల్లిదు లగునక్కపివరు, లుల్లాసము లార నరిగి ॱ యొగిఁ దెల్లముగా
నెల్లెడల వెదకి తగ నీ, వల్లభఁ బొడగాంచి వేగ ॱ వచ్చెద రనఘా. 616

వ. అని సుగ్రీవుండు పలుక రామచంద్రుం డుల్లసిల్లె నట్టియెడ. 617

క. చని తూర్పుదెసకు నీచె,ప్పినచోటుల నెల్ల వెదకి ॱ పృథివీశుసతిన్
జనకజఁ గానక వచ్చితి, నని వినతుఁడు చెప్పె నప్పు ॱ డర్కజుతోడన్. 618

క. చెచ్చెర నుత్తరభూముల, విచ్చలవిడి నెల్లయెడల ॱ వెదకి వెదకి గ్రో
నచ్చట జానకిఁ గానక, వచ్చితి నని చెప్పెను శత ॱ వలి యినజునకున్. 619

వ. మఱియుఁ బశ్చిమదిగ్భాగంబున కరిగి సుషేణుండు బలకలితుం డై మరల నే
తెంచి సుగ్రీవుసన్నిధి మున్ను నీచెప్పినభంగి దేవిం జూచి కానక. 620

చ. పురములఁ బల్లెపట్టులను ॱ [1]భూరినికుంజమహోగ్రశైలకం
దరములఁ గానలం దుపవ ॱ నంబుల సాగరతీరభూములన్
సరసుల నిర్ఝరస్థలుల ॱ సైకతచారునదీనదంబులం
దరువులనీడలం బొదలఁ ॱ దాపసవర్యులయాశ్రమంబులన్. 621

క. మానక యారసి యెచ్చో, మానినిఁ గానంగ లేక ॱ మఱి వార్తయు మా
వీనులు సోఁకక మగుడన్, వానరతతితోడ వేగ ॱ వచ్చితి నిటకున్. 622

వ. అని పలికి. 623

చ. అమితబలాఢ్యుఁ డై పవ ॱ నాత్మజు రాకయ కోరుచున్నవా
రము సతిఁ జూడ నాదెసన ॱ ప్రత్యయ మయ్యెడు బుద్ధివీర్యవి
క్రమకలితుండు సర్వగుణ ॱ రమ్యుఁడు నైనమగుత్సుతుండు భూ
రమణుని దేవిఁ జూచి యను ॱ రాగముతోఁ జనుదెంచు నర్కజా. 624

---

[1] భూవివరంబులలోన శైల.

వ. అని సుషేణుండు ప్రియంబులాడె నట దక్షిణదిగ్భాగంబునకుంబోయినవానరులు.

క. తారాంగదాదివానర, వీరులు వాయుతనయుండు వింధ్యాద్రికి నే
పారఁ జని యచటిగిరిబిల, భూరుహషండవనకుంజపుంజాపగలన్. 626

క. కలయ సతి వెదకి కానక, ఫలజలమూలోపభోగపరు లై కపివీ
రులు చని యొండొకదేశము, నలవడఁ బొడగాంచి యలరి యచ్చటఁ జూడన్.

తే. లీలమైఁ బదియేఁడులబాలుఁ డైన, తనసుతుఁ డరణ్యమునకును జని గతాసుఁ
డైనఁ దండ్రి యామునివరుఁడాగ్రహమున, నావనము శపియించిననావనంబు.

చ. అలికులపర్ణహీనవికచాంబుజవారిరుహాకరంబు ని
ర్దళఫలపుష్పవృక్షనికరంబును నిర్గతజీవనాపగా
వలికలితంబుఁ బక్షిమృగవర్జితముం జ్యుతమూలమున్ ఘనా
చలగహనంబు నిర్జలముఁ జక్షురసహ్యము నై వెలుంగఁగన్. 629

చ. అటఁ బరికించి యొక్కకనకాచలముం గని తద్బిలంబు ను
గ్భటగతిఁ జొచ్చి యందు ఘనపర్వతసన్నిభుఁ డైనదైత్యు ముం
దటఁ బొడగాంచి యయ్యసుర దాఁటి సమస్తగుహాంతరంబు వి
స్ఫుటముగ నంగదుల్ వెదకి భూమిజఁ గానక దుఃఖితాత్ము లై. 630

సీ. అటఁ బాసి కపులొక్కవిటపిమూలముఁ జేరి, యాసీను లై యుండ నపుడు వారి
కనిలజుఁ డిట్లను నినజుండు చెప్పిన, చోటులఁ జెప్పనిచోటులందు
వెదకితి మెచ్చోట విభుదేవిఁ గాన మ, వ్వనజాక్షివార్తయు వినఁగఁబడదు
సమయకాలంబును జనఁజొచ్చెఁ గడముట్ట, నిఁకమీఁదఁ జేయంగ నేమిగలదు
రామచంద్రునికామితార్థంబు గలుగఁ, జేసి యానందకీర్తులఁ జెంద లేదు
గాన ప్రాణంబువిడిచెదఁ గాక యన్న, నంగదుఁడు పావనికి నిట్టు లనియెఁ బొసఁగ.

చ. అమితబలాఢ్యు లిందఱు సమర్థులు నెంతటి కైన రామభూ
రమణునికామితార్థము పరాభవ మొందదు సర్వవానరుల్
క్రమమున నెల్లచో వెదకఁగాఁ దగుఁ గ్రమ్మఱ యుక్తకార్యయ
త్నము ఫలియించు నొక్కయెడఁ దక్కక చేయఁగ వంత యేటికిన్. 632

చ. పతిహితకార్యముం జెఱిచి పందల మై భయలజ్జ లేది యే
గతి దివసేంద్రనందనునిఁ గానఁగఁ బోదము పోయినప్పు డు
ద్ధతి నతఁ డాత్మనాథుప్రియ మాఱడిఁ బుచ్చినయట్టినీచు లం
చతిభయదక్రియన్ మనల నందఱ వధ్యులఁ జేయకుండునే. 633

వ. అనవుడు గంధమాదనుం డంగదుండు చెప్పినట్ల మన మెల్లచోటుల వెదకుదము పదం డనుచు నట లేచి యందఱుం గూడి దక్షిణదిగ్భాగంబున నున్నవింధ్యాద్రి సమీపంబుఁ జేరి. 634

మ. విలసల్లోధ్రకసప్తపర్ణగహనన్ వీతప్రభావిస్ఫుర

త్కలధౌతాచల మెక్కి డెక్కి యతిదక్షత్వంబు లేపార నం
దుల నానాతరుకుంజపుంజవిపినస్తోమాపగాభూములన్
నలినాక్షిం బరికించి కానక విషణ్ణత్వంబునం బొందుచున్. 635

వ. అగ్గిరి డిగ్గి యిలఁ గొంతదడవు విశ్రమించి యుల్లాసంబు దెచ్చుకొని యంగ
దాంజనేయమైందద్వివిదనలతారజాంబవంతులు క్రమ్మఱ వింధ్యాద్రిగుహావనం
బుల మఱియుఁ దగుచోట్ల వెదకుచు నరుగుదెంచి. 636

క. పుడమిసుత వెదకి యెచ్చటఁ, బొడగానఁగ లేక యొక్కభూజముక్రిందం
గడు డస్సి నిలిచి తృష లే, ర్పడ నడరం గపులు దెసలు పరికించు నెడన్.

మ. కలయం బెల్లునినాదముల్ చెలఁగ ఱెక్కల్ లీల సారించుచుం
గలహంసవ్రజచక్రసారసబకక్రౌంచాదినానారవ
జ్జలపక్షుల్ వెడలం గనుంగొనుచు వృక్షచ్ఛాదితం బై నయా
బిలముం గాంచిరి తోయపానవిపులాపేక్షాస్థు లవ్వానరుల్. 638

—✤ హనుమజ్జాంబవదాదులు స్వయంప్రభగుహలోఁ బ్రవేశించుట. ✤—

వ. హనుమంతుం డప్పుడు దవ్వులం గనుంగొని. 639

క. కమలార్ద్రపక్షములతోఁ, గమలరజస్సిక్తరక్తగాత్రంబులతో
నమరుచు జలపక్షిసమూహము లోలిన్ వెడలుచున్న వవె గుహావాతిన్.

చ. అరయఁగ నుండ నోపుఁ గమలాకర మందు జలంబు ద్రావి వే
ధరణితనూభవన్ వెదకు దండు పదండు కపీంద్రులార యం
చరిగి ఘనాంధకారభరితాంతరముం గడుదుష్ప్రవేశముం
హరిరుచిదుర్గమంబు నగునాబిల మందఱుఁ జొచ్చి యచ్చటన్. 641

ఉ. చండఘనాంధకారమున సర్వవనాటులుఁ ద్రోవఁ గాన లే
కొండొరుఁ గౌఁగిలించుకొని యోజన మేఁగి తృషాబుభుక్షలన్
నిండుశ్రమంబునన్ ధృతులు నీఱుగ జీవముతోడివాంఛ లే
కుండిరి మాన మొక్కఁ డటు లుండి జలస్థలిఁ జేరి ముందటన్. 642

వ. వెలిఁగెడునొక్కతెలుపు పొడగని యచటి కరిగి తిమిరం బంతయు నడంగి బిలం
బెల్ల దేదీప్యమానం బై పొడగానంబడ నచటికాంచనమయకిసలయవిసరకుసుమ
స్తబకఫలవిలసితవరపర్ణసువర్ణశాఖలం దచ్ఛాఖాకలితంబులై సలలితకలరవకల
కలంబులఁ బొలుచుజాతరూపసురూపపక్షిచయంబులం గనదనలశిఖోపమాన
కనకలతాహింతాలతక్కోలనారికేళసాలరసాలకకుభచంపకపున్నాగనారంగాది
తరునికరంబుల సురుచిరభూషణభూషితహేమాభిరామధామంబుల నీలవైదూ
ర్య రత్ననిర్మితకనకరజతకువలయంబుల నాస్ఫోటితహాటకమత్స్యకచ్ఛపాదిజల
చరంబులఁ బరివేష్టితజాంబూనదవృతజలపక్షికులంబులం బెల్లు విలసిల్లువిమలా
ప్సరోవరంబులఁ జామీకరచారువిమానంబుల ముక్తాజాలాంతరగవాక్షలక్షిత

కలధౌతసమవిరాజద్గృహంబుల రుక్మరౌప్యభాజనంబులఁ బూర్ణస్వర్ణరజతక్షో
మాదిదివ్యవస్త్రగంధమాల్యాంగరాగంబుల మధురమధురాహారమధుగపానం
బుల వివిధధాన్యంబుల మణిచిత్రచిత్రితకంబళాజినసంచయంబులఁ దనరారు
హేమధామంబుల నచటనచటఁ జూచుచు నేతెంచి యరుణకాంచనచిత్రాస
నాస్తీర్ణరత్నపటలంబుల మధుస్రావులైనభక్ష్యభోజ్యలేహ్యపానీయఫలవృక్షం
బుల రమణీయమణిగణంబుల హరితవర్ణపక్షంబుల సామస్వరనినాదంబుల విద్యు
త్కాంచనప్రభల శోభిల్లుమధుపంబులు గలవృక్షశాఖాగ్రంబుల నాలోకిం
చుచుం జనుదెంచి యాకపు లగ్రభాగంబున. 643

ఉ. భ్రాజితహేమవిష్టరముపై నచలస్థితి నుండి చారుకృ
ష్ణాజినమున్ ధరించి సముదగ్రసమాధిసమేతయై తప
స్తేజము లుల్లసిల్ల విలసిల్లు స్వయంప్రభఁ గాంచి రాధరి
త్రీజచరుల్ మరుత్సుతుఁడు దిగ్గున నప్పుడు మ్రొక్కి యిట్లనున్. 644

చ. నిరుపమపుణ్యవే సతివి నీ విటు లొప్పుచు నున్నయీగుహా
సురుచిరరత్నహేమవనశోభితకాంచనమందిరంబు లె
వ్వరివి సువర్ణకూర్మఝషవారిచరంబులు దేలియాడెడున్
సరసుల విస్మయంబు లివి సర్వము మా కెఱిఁగింపు మేర్పడన్. 645

క. అనవుడుఁ బావని కాసతి, చన ని ట్లను నేను మేరుసావర్ణితనూ
జను నాపేరు స్వయంప్రభ, యనిశము నుండుదుఁ దపోనియతి నీగుహలోన్.

చ. ఉరవడి వాసవుం డసురయుగ్ధమునప్పుడు వజ్రమొత్తి ని
ర్భరగతి వైవ నీనగము వ్రస్సె బిలంబుగఁ గర్మకౌశల
స్ఫురితుఁడు విశ్వకర్మ మును భూతహితంబుగ నిమనోజ్ఞకం
దరము రచించె రత్నభరితంబు సురాసురదుర్గమంబుగన్. 647

క. ఘనమాయామహిమ మయుం, డనుదానవవిశ్వకర్మ యమరెడునీకాం
చనవనగృహాదివస్తువు, లెనయఁగ నేర్పున సృజించె నీగుహలోనన్. 648

చ. అరుదుగఁ గాననాంతమున నామయుఁ డోపికఁ బెక్కువేలవ
త్సరములు నిష్ఠతోఁ దపము సల్పఁగ నాతని కబ్జగర్భుఁ డా
దరమున నిచ్చె నీబిలము దానవనాయకుఁ డిందులోన న
చ్చర యగుహేమతో సురతసౌఖ్యము లొందుచు వైభవంబునన్. 649

క. మృత్యువు వంచించి మయుం, డత్యాయతకాల మీగుహను హేమాసాం
గత్యమున నుండఁ గని యా,దిత్యేశుఁడు వచ్చి మయునిఁ దెంపునఁ జంపెన్.

క. హేమాగృహ మిది నా కా,హేమ ప్రియవయస్య గాన యేఁ జెడకుండం
బ్రేమంబున నీహేమా, ధామము గాచికొని యున్నదాన మహిమన్. 651

వ. అని పలికి. 652

క. వలసినఫలమూలాదులు, నలువునఁ జిత్తములు దనియ । నమలుఁడు మధురా
మలజలములు ద్రావుఁడు సే, దలువాయఁగ ననుడుఁ బవన । తనయుఁడు నతితోన్.
క. లోలమతిఁ జొచ్చి గుహ నా,భీలశ్రమ తృషలు వొడమఁ । బేరాఁకటితో
నీలాగువగలఁ జావఁగఁ, బాలై యున్నార మిచటఁ । బావనచరితా. 654
క. మాకాహారము లొసఁగి కృ,పాకరమతి మమ్ముఁ బ్రోవు । మనఘాత్మ యనన్
వే కందమూలఫలములు, గోకొం డని యొసఁగ నంది । కొని నమలి కపుల్.
వ. అతిప్రీతులై మఱియు జలము లాపోవం ద్రావి తృప్తిం బొంది యాస్వయం
ప్రభఁ బ్రశంసించి రప్పు డాతపస్విని వారలం గనుంగొని. 656
క. ప్రేమంబుతోడ ని ట్లను, నేమాడ్కిన్ వెదకి కంటి । రీబిలమున్ మీ
రేమహిమంబునఁ జొచ్చితి, రేమిటి కిట వచ్చినార । లెక్కడి వారల్. 657
వ. అనిన నక్కపు లాతపస్వినికిఁ దమవచ్చినవిధం బెల్లను జెప్పి భాగ్యవశంబున నిన్నుఁ
బొడగని నీప్రసాదంబున మృష్టాహారంబులం గొని మధూదకంబులు ద్రావి పరి
తుష్టిం బొంది విగతశ్రాంతుల మైయున్నార మింక మావచ్చినకార్యంబు వినుము.
క. ఇనజుఁడు మాసములోపల, జనకజఁ గానంగ వెదకి । చనుదెం డనినం
జనుదెంచి మాస మంతయుఁ, జనఁ జెడి యున్నార మెందుఁ । జన లేకిచటన్.
క. రాముఁడు పుణ్యశ్లోకుం, డామహితాత్మునతి వెదక । నరుగఁగ వలయున్
నేమంబున మము నీబిల, ధామము వెడలింపు కరుణఁ । దల్లి యనినన్. 660
క. ఏరికిఁ బ్రాణంబులతోఁ, బోరా దీబిలము సొచ్చి । పోఁడిమితో నా
భూరితపఃప్రాభవ మరు, దారఁగ నీబిలము వెడల । నను పుదు మిమ్మున్. 661
క. వృత్తచరులార వేగమ, యక్షులు మూసికొనుఁ డీగు । హాదుర్గం బ
ధ్యక్షుమ మీ రీక్షింపఁగ, దక్షత వెడలింప రా దు । దగ్రత ననినన్. 662
మ. బిల మావానరు లందఱున్ వెడలుసం । ప్రీతిన్ నిజాక్షుల్ గరం
బులఁ గానంబడకుండ మూసికొన నా । పుణ్యాత్మ యోగాంచితో
జ్జ్వలశక్తిన్ నిమిషంబులోనన గుహా । ద్వారంబు దాఁటించి వా
రల కీశైలము వింధ్య మంచు ముక మా । కారం జెప్పి దీవించుచున్. 663
వ. ఆతపస్విని యబ్బిలంబు చొచ్చెఁ దదనంతరంబ. 664
ఉ. ఆరఁ దపోబలంబున స్వ । యంప్రభ తమ్మటు కేలఁ దాల్చి త
ద్ద్వారబహిఃస్థలిన్ విడువ । వానరు లక్షులు విచ్చి చూచి యా
చేరువ నున్నసాగరముఁ । జెన్నగుపల్లవపుష్పవల్లికా
చారువసంతమాసతరు । షండముఁ గన్గొన నంగదుం డనున్. 665

—✥ హనుమదాదులు సీతం గానమికిఁ జింతిల్లుట. ✥—

క. ఇనజుఁడు మితిచేసినయా, దినములు పోఁజొచ్చెఁ గాన । తిరుగఁగ నిచటన్
జనకజఁ గానమ యటకున్, మన మేఁగిన రవిజుఁ డపుడ । మడియం జేయున్,

వ. అని పలుకఁ గపులు తమలోన. 667

తే. అంగదుఁడు చెప్పినట్ల యర్యర్కసుతుఁడు
ఘనతరక్రూరుఁ డిక్కడిఁ గార్య మెఱుఁగఁ
డామహీజఁ గానక మన మటకు నేఁగఁ
గినిసి రామప్రియంబుగా మనలఁ జంపు. 668

సీ. అని పల్కు వారితో నంగదుం డి ట్లను, మన మిప్డు వెడలినఘనబిలంబు
బహుపక్వఫలజలభరితంబు నేరికి, దుస్సాధతరమును దురధిగమము
మాయావినిర్మితమహితదేశముఁ గాన, క్రమ్మఱ నీగుహఁ గడఁక లారఁ
జొచ్చి కాపుండుద మిచ్చటఁ గపులార, యాబిలంబున మన మిప్పు డున్న
నింద్రుఁ డాదిగ దేవత లెల్ల వెదకి, మనలఁ గానంగ లే రన్న మనుజు లైన
రామలక్ష్మణులును మఱి రవిజముఖ్య,వానరప్రవరులు వచ్చి కానఁ గలరె.

వ. అని పలుకు నంగదువాక్యంబు లాదరింపక హనుమంతుం డి ట్లనియె నీవు వెడఁగుబుద్ధి వీకపులం గూర్చుకొని యీబిలంబుఁ జొచ్చి ప్రబలుం డయినసుగ్రీవుతో మరలంబడఁ జూచెదవు జను లెల్లఁ బ్రబలునిఁ జేపట్టుదురు గాని దుర్బలుని తెరువోల్లరు నేనును నీలుండును దారుండును వాలి గలనాఁడు సుగ్రీవునివారలమై యుండుదుము సుగ్రీవునిఁ బాసి మాకు నుండ నర్హంబు గాదు దక్కినవారును జపలమతు లై యిక్కపులు దమతమపుత్రమిత్రకళత్రాదులం బాసి నీయాజ్ఞకు లో నై నీకడ దుఃఖంబు లనుభవించుచుందు రే మేమందఱముఁ దొలఁగిన నీవొక్కరుండవు నీబిలంబున నె ట్లుండెదో వట్లుం గాక. 670

మ. సురరాజుగ్ధతి నొక్కవజ్రమున నీక్షోణీధ్రముల్ వ్రచ్చి క
ద్దర మొక్కం డొనరించె లక్ష్మణునకు న్వజ్రోగ్రనారాచముల్
పరికింపం గల వెన్నియేని నతఁ డాబాణంబులన్ వీఁక ని
గ్గిరిఁ జూర్ణంబుగఁ జేసి నిన్నుఁ దునుముం గింకన్ మహోదగ్రుఁ డై. 671

వ. కావున దుర్విచారంబులు మాని మమ్ము ముందట నిడుకొని సుగ్రీవునికడ కేఁగు మతండు సత్యసంధుండును ధర్మయుక్తుండును మీతల్లి కత్యంతానురక్తుండు నగుటం జేసి పుత్రుండ వై ననిన్ను యుక్తక్రమంబునఁ బట్టంబుగట్టు బోదము రమ్మనుచుం బలుక నంగదుండు సుగ్రీవు నుద్దేశించి యి ట్లనియె. 672

మ. చన నీయంగదు యౌవరాజ్యయుతుఁగా [1]సంప్రీతితోఁ జేయు మీ
తనికిం దప్పట నాకుఁ దప్పు టని యుగ్యద్వ్యతిప్రీతితోఁ బంచినన్
సునయం బారఁగ రాముసాజ్ఞ యువరాజుం జేసెఁ గా కిచ్చమైఁ
దనయంతన్ యువరాజుఁ జేసెనె ననున్ ధర్మంబు చెల్వారఁగన్. 673

చ. అరుదారన్ గుహఁ జొచ్చి వాలి రిపుతో నానన్నుఁ డై పోర ని

1 పాలింపు సుగ్రీవ యీ, తనికిం.

ర్భరనత్వంబున వాలికిఁ వెడలి రా । రంధ్రంబు లేకుండఁ దా
నురుశైలంబు బిలంబువాత నిడి రాజ్యోల్లాసి యై వచ్చి వా
నరరాజ్యం బనురక్తిఁ జేకొని కడుం । గర్వాతిరేకంబునన్. 674

క. జనకసముం డగ్రజుఁ డా, తనిసతి ధర్మమునఁ దల్లి । తనయగ్రజుదా
రను దారను వరియించెను, జన దన కినసూనుఁ డతఁడు । సద్ధార్మికుఁడే. 675

క. తనకును రాజ్యం బిచ్చిన, ఘను రాముని గానఁ బోక । కడుఁగిన్కను రా
మునితమ్ముఁడు వచ్చిన మఱి, మనమున బెగ డంది కాదె । మగమఱి వచ్చెన్.

వ. ఆసుగ్రీవుండు కృతఘ్నుండును పాపచిత్తుండును గావున మాతండ్రివలనిపూర్వ
వైరంబుఁ దలంచి మట్టుపెట్టుం గాని న న్నేల పట్టంబుఁ గట్టు నని పలికి. 677

చ. జనకజఁ గాన కే నరుగఁ । జండగతిఁ ననుఁ బట్టి [1]గిట్టి త
ర్జన మొనరించి దండముల । జర్జరితాంగునిఁ జేయుఁ గాన గే
హినిజనిపొంతఁ బో వెఱతు । నిక్కడఁ బ్రాణములం ద్యజించెదన్
వనచరులార మీ రటకు । వాంఛలతోఁ జని యానతాంగులై. 678

క. ఏ నిట నీల్గుట విన్నఁ, మానసమున దుఃఖ మొంది । మరణం బొందుం
గాన మును దార మొగపడి, మానుగఁ గుశలంబు లడిగి । మఱి నే ర్పమరన్.

వ. నా తెఱం గెఱింగించి యంతమీఁద. 680

క. పతియును సుతుఁడును లేమికిఁ, గతదుఃఖముఁ బొందుజననిఁ । దారను మఱిన
మ్మతి రుమను శోక ముడుగఁగఁ, గృతమతి బోధించి బుజ్జగింపుఁడు మీరల్.

—ప్రాయోపవిష్టులైన హనుమదాదులకడకు సంపాతి వచ్చుట.—

వ. అని పలికి యంగదుండు రోదనంబు చేయుచు దర్భశయనుం డయ్యె నప్పుడు
సకలకపులు బాష్పధారలు దొరఁగ నంగదుసిం దిరిగివచ్చి జలాచమనంబు చేసి
దక్షిణాగ్రంబు లైనదర్భలమీఁద నుత్తరశిరస్కులై ప్రాఙ్ముఖు లగుచుఁ బర్వత
సన్నిభు లైనయవ్వనచరు లొఱలుచుఁ బ్రాయోపవేశంబు చేసి రపుడు మందర
పర్వతవినిర్గతుం డై వింధ్యపర్వతశిఖరాగ్రంబున నున్నసంపాతి కడంక. 682

క. తనబిలము వెడలి చేరువ, మునుమిడి ప్రాయోపవేశ । మును వరుసం గై
కొని వగలఁ బొగులుకపులం, గని యాసంపాతి యుత్సు । కత ని ట్లనియెన్.

క. దైవాధీనము లోకము, దైవము సర్వంబు భూత । తతి కొడఁగూర్చుం
గావున నా కాహారము, దైవము ముందఱికిఁ దెచ్చి । తనరఁగఁ బెట్టెన్. 684

క. చిరకాలం బాహార, మ్మిరువుగఁ గొని తిరుగ లేని । యే నింకను జె
చ్చెర ముందట మరణేచ్ఛా,పరు లై యీల్గువనచరుల । భక్షింతు వెనన్. 685

చ. అన విని యాత్మ దుఃఖపడి । యంగదుఁ డి ట్లను వాయుపుత్రుతో
మనల గ్రసించెదన్ వెసఁ గ్ర । మంబున నం చొకఘోరపక్షి యిం

1 కట్టి భర్జన లొనరించి.

పెనయఁగఁ బల్కె నిట్లు మనకేరికి మున్నిటుఁగాఁగ రాని యీ
ఘనవిపదద్భుతక్రమము గల్గెఁ గదే యని పల్కె వెండియున్. 686
తే. నృపతిసతి సీత వెదకెడునెపము వన్ని, మర్కటప్రాణములు [1]గొనమదిఁదలంచి
చటులకాలుఁడు మనలనిచ్చటికిఁదెచ్చె, నినజుఁడును రామచంద్రుండునేమిసేయు.
తే. రామువనవాసమును దశరథునిమృతియు
ధరణిజాహరణముఁ బక్షివరునిహతియు
వాలిమరణంబు మనకుఁ జావలయుటయును
గలిగెఁ బాపపుఁగైకేయికారణమున. 688
ఉ. కైక వరంబు తన్నడుగఁగానకు రామునిఁ బుచ్చి యాత్మలోఁ
బైకొనుపుత్రశోకమునఁ బంక్తిరథుండు గతాసుఁ డయ్యె సు
శ్లోకుఁడు రాఘవుం డడవిలోఁ జరియింపఁగ భిక్షువేషముం
జేకొని సీత నెత్తుకొని శీఘ్రమె రావణుఁ డేఁగె నేఁగఁగన్. 689
క. రామహితంబుగ మార్కొని, రామునిసతికొఱకుఁ బేర్చి రావణుచే సం
గ్రామమున నీల్గి నిర్జర, ధామంబు జటాయు వొందె ధన్యత వెలయన్. 690
క. జనపతి కెంతయు హితముగ, జను లెన్న జటాయు వీల్గి సద్గతిఁ గనియెన్
మనము జటాయువుకరణిన్, జనపతికిని హితముగాఁగ సమయుద మింకన్.
క. ధరణిజ వెదకెడుపనికై, తరణిజుతోఁ జెలిమిచేసి తగ రాఘవుఁ డా
తరణిజుకొఱకు వాలిం, బరిమార్చి దినేంద్రపుత్త్రుఁ బట్టము గట్టెన్. 692
వ. పట్టాభిషిక్తుండై రామునినియోగంబున. 693
మ. మనలన్ జానకిఁ జూచి రం డనుచు నమ్మార్తండి వే పంచినం
జన నేతెంచి సమస్తదేశములు నిచ్చం బోల వీక్షించి యెం
దును నారామునిదేవిఁ గానక ధృతుల్ దూలంగ బ్రాయోపవే
శనముం గైకొని యెంతయున్ వగల నీశైలాగ్రదుర్గాటవిన్. 694
తే. ఒదవునాఁకటిచిచ్చుచే నుల్ల మెరియ, నెపుడు నాహారములులేక యిష్టదార
ధనగృహంబులఁ బాసియత్యంతభీతిఁ, బ్రాణములువిడుతురుకపుల్ పతికివెఱచి.
క. ఘనుఁడు జటాయువు సమయను, వనచరపతి వాలి పొలియ వచ్చి విపత్తిన్
మన మిటఁ జావ దురాత్ముఁడు, దనుజుం డెత్తికొనిపోయె ధరణితనూజన్.
క. ఇల భరతుని నేలింపఁగ, ఖలబుద్ధిం బాపజాతి కైకేయి వరం
బులు వేఁడి విభుని రాఘవ, కులముం గపికులముఁ బక్షికులముం జెఱిచెన్.
క. అని యిట్లు పలుక విని తన, యనుజుండు జటాయు వీల్గెనని యతిదుఃఖం
బున శోకించుచుఁ గపులం, గనుఁగొని సంపాతి పల్కెఁ గడుదైన్యమునన్.
క. ఘనబలుఁడు జటాయువు నా, యనుజుఁడు సంపాతి నే మహాహవమున నె

1 గొనుమతము దలఁచి.

వ్వనిచే జటాయు వీల్గెను, ఘనుఁ డా దశరథసఖుండు గడచెన యకటా. 699

క. అని పల్కి రాముఁరాకయు, జనకజశోకయును ననుజుసమరము మరణం
బును సర్వము నేర్పడఁగా, వినవలయుర్ నాకు నింక విదితము గాఁగన్. 700

క. వృక్షచరులార నాకుం, బక్షంబులు లేవు గాన పదముల నడతే
నక్షముఁడను భవదీయస,మక్షమునకుఁ గొంచుఁ బొండు మన్నన సన్నున్.

వ. అని యిట్లు పలుకుసంపాతిపలుకులు విని యఖిలకపులుఁ జింతించి యీపక్షి మనల భక్షించునో యెట్లునుం బ్రాయోపవేశంబు గైకొని మరణేచ్ఛ నున్నారము మనల మ్రింగిన మ్రింగనిమ్ము మృతులమై నాకంబున నుండుద మనునిశ్చయంబుతో నరిగి సంపాతిం బట్టి తెచ్చి తమసన్నిధి నిడుకొని రప్పుడు సంపాతిం జూచి యంగదుండు. 702

ఉ. రామువనప్రవాసమును రావణుఁ డాగతి వచ్చి వంచనర్
భూమితనూజ నెత్తికొని శోకయుఁ దా మినజుండు పంచినర్
రామునివల్లభర్ వెదక రాకయు జానకిఁ గానలేక తా
రామెయి నున్నచందము సమస్తము నేర్పడఁ జెప్పి వెండియున్. 703

ఉ. రాముని దేవి నెత్తుకొని రావణుఁ డేఁగఁగ వీఁకఁ దాఁకి ని
స్సీమబలంబునర్ విరథుఁ జేసి మదం బడఁగించి యెంతయుం
బ్రేమముతోడ సీత విడిపించి జటాయువు వానిచేతి సం
గ్రామములోనఁ జచ్చి పరఁగంగ దివంబున కేఁగె ధన్యుఁ డై. 704

వ. తదనంతరంబ రాముండు చనుదెంచి రావణునిచేత నసిధారాదళితపక్షుండై పడియున్నజటాయువుం జూచి శోకించి దశరథునింబోలె సంస్కరించి ధర్మతంత్రం బాచరించి నాకంబునకుం బుచ్చె నని పలుక విని సంపాతి దుఃఖించి యంగదాదులతోడ ని ట్లనియె. 705

మ. ఇనచండాంశులఁ బక్షముల్ గమలి నే నెచ్చోటికిం బోవ లే
కునికిర్ వార్ధక మొందుటర్ ఘనబలం బొప్పారఁగా లేమి నా
యనుజుం జంపినరక్కసుర్ వినియు నుద్యచ్ఛక్తి నారావణుం
దునుమం జొప్పడ కున్నవాఁడ మదిలో దుఃఖంబునం దూలుచున్. 706

చ. అన విని యంగదుం డనియె నాఖగనాయకుతోడ వేగ నీ
యనుజునిఁ జంపి చన్నదివిజారి వధించెద నంచుఁ బల్కి తీ
వనఘ వయోధికుండవు సమస్త మెఱుంగఁగ నేర్తు మాకు నిం
పెనయఁగఁ జెప్పు పంక్తిముఖుఁ డెక్కడఁ బెట్టినవాఁడు జానకిన్. 707

వ. అని పలికిన సంపాతి వారి కి ట్లనియె. 708

క. దూరపథ మేఁగి నా కా, హారముఁ దెచ్చుకొనఁ జాల నటు గావున నా
కూరిమిపుత్త్రుఁడు నా కా, హారముఁ గొని తెచ్చి పెట్టు నాఁకలి వాయన్.

వ. మఱియు నొక్కనాఁడు. 710

క. తనతల్లిఁ జూచువేడుకఁ, జని యామఱునాఁటిదాఁక § సమ్మతి నాకుం
దిన మాంసము లే కేతెం,చిన నాఁగొని చండకోప§చిత్తముతోడన్. 711

ఉ. వారక నిష్ఠురోక్తులను § వావిరిఁ దూర సుపార్శ్వుఁ బల్కినన్
సైరణచేసి యాసుతుఁడు § సమ్మతి నిట్లని చెప్పె నీకు నా
హారము దేర వేగ చని § యర్థి మహేంద్రనగంబు చేరి త
ద్ద్వారమునందుఁ గాచికొని § తద్దయుఁ గోరిక నున్నయంతటన్. 712

క. రావణుఁడు వచ్చి నన్నుం, ద్రోవ యడిగె నేను జెప్ప § దోర్బల మెసఁగన్
వేవేగ నన్నొరసికొని, నావాససమీపపథము§నం బోవునెడన్. 713

క. ఖలుఁ డగురావణుసన్నిధి, నలఘువిభూషణసమేత § యై రామమహీ
తలపతిసతి నీలాంబుద, కలితతటిల్లతికకరణిఁ § గానంబడియెన్. 714

చ. ననుఁ బొడగాంచి లజ్జ వద§నంబు నతంబుగఁ జేసి యాత్మమం
డనములు వేగ పుచ్చుచు ఘు§నధ్వని రాముని రామచంద్రుత
మ్మని నెలుఁగెత్తి చీరుచును § మోమున నశ్రులు రాల నేడ్వఁగా
జనకతనూజ నెత్తికొని § చయ్యన రావణుఁ డేఁగె లంకకున్. 715

వ. అంత. 716

క. అచ్చట నుండుమునీంద్రులు, వచ్చి నన్నున్ వత్స పంక్తి§వదనునిచేతం
జెచ్చెరఁ జావక బ్రదికితి, విచ్చట నుండవల దరుగు § మెచటికి నయినన్. 717

వ. అని పలికిన నిరామిషుండ నై వచ్చితి నని సుపార్శ్వుండు చెప్పె నిప్పుడు యో
గదృష్టిం జూడ నాకును. 718

క. బలసి భయంకరరాక్షస, లలనలు గాచికొని యుండ § లంకాపురిలో
పల నున్నది జానకి బెగ, డలవడఁగా వ్యాఘ్రకలిత§హరిణియుఁబోలెన్. 719

చ. తరుచరులార గృధ్రములు § తద్దయు దూరము గాంచి దూరసం
చరణముఁ జేయు గృధ్రకుల§జాతవరేణ్యుఁడ నేను గావునన్
వెరవున లావుమై నెగయు§వేళ దిశల్ పరికించువేళ న
త్యురుతరదృష్టిఁ గాంతు శత§యోజనదూరత నున్నసర్వమున్. 720

క. అటు గాన యిచట నుండియు, నట నున్నఖలున్ దశాస్యు § నాసీతను వి
స్ఫుటముగఁ గనుచున్నాఁడను, బటుతరదూరప్రసార§భాసురదృష్టిన్. 721

వ. కావున మీ రింక. 722

చ. మరణోద్యోగము లెల్లఁ దక్కి బలసా§మర్థ్యంబు లేపార సా
గరమున్ దాఁట నుపక్రమింపుఁడు కడం§కం బూని యుత్సాహత
త్పరు లై వానరవీరులార యనుచుం § బ్రాయోపవేశంబు లా
దరణీయోక్తుల మానిపించి పలికెం § దా వారితో వెండియున్. 723

క. అనుజుఁడు జటాయువునకుం, దనరఁగ ధర్మోదకములు ♦ దద్దయు నాప్యా
యనముగ నిడవలె నాకును, వనచరులార కొనిపొండు ♦ వారిధికడకున్. 724

—సంపాతి కపులతో నిజవృత్తాంతము చెప్పుట.—

వ. అని పలుకఁ గపులు సంపాతిని సముద్రతీరంబునకుం గొనిపోయిన నతండు కృతస్నానుం డై జటాయువునకుఁ దిలోదకదానం బాచరించినవెనుకఁ గ్రమ్మఱం గొనివచ్చి యాసీనుం జేసిన సంపాతి సకలవానరులు హర్షింప నిట్లనియె వినుం డేకచిత్తంబున నావృత్తాంతం బంతయు దక్షిణసముద్రతీరంబున నున్నవింధ్యపర్వతాగ్రంబున నిశాకరుం డనుమునివరేణ్యుం డెనిమిదివేలేండ్లత్యుగ్రతపం బాచరింప నేనును జటాయువు నమ్మునీంద్రునాశ్రమంబున వసియించితిమి. 725

క. పూవనికావనితరువులు, లే వమ్మునియాశ్రమమున ♦ లీలన్ నవపు
ష్పావళులఁ బొలసి కమ్మని,తావులు వెదచల్లు మారుతము [1]ప్రసరింపన్. 726

క. సురలోకమ్మున కమ్మని,వరుఁ డిచ్చం జన్నవెనుక ♦ వడి వా డై మ
చ్చరమున నేను జటాయువు, సరభసమున వేగ యాకసంబున కెగయన్. 727

క. ఇనరశ్మ్ములవేఁడిమి నా, ఘనతరపక్షములు గమరి ♦ కడుఁ దూలి రయం
బున వింధ్యశిఖరిపైఁ బడి, దినషట్కముదాఁక మూర్ఛ ♦ దేలక యుంటిన్.

వ. మఱి మెల్లన లబ్ధసంజ్ఞుండ నై దిక్కులు చూడ నదులు గిరులు వనంబులు సముద్రంబులు గానక మఱికొంతవడవునకు వింధ్యం బని యెఱింగి ముని చన్నవెనుక నమ్మునియాశ్రమంబున మున్నూఱేండ్లుండియు మునిం గాననిదుఃఖంబునం బొగులుచు నాపర్వతంబు డిగ్గి దర్భకంటకపరీతం బైనపుడమి నతిదుఃఖంబునం జరించుచు మునీశ్వరు వెదకం బోయి యొక్కవృక్షమూలంబున నుండి దూరంబున భానుప్రభాభాసురుండును గృతాభిషేకుండు నుదఙ్ముఖుండును నై వచ్చుచున్న మునీంద్రుం గని సంతసంబున నటఁ జూడ. 729

మ. [2]పరఁగన్ లేఁగలు గోవువెంట మరులింపం బోవుభంగిన్ మునీ
శ్వరుఁ డాత్మాశ్రమ మొందఁ బోయెడునెడన్ ♦ వారింపఁ బో కెప్పుడుం
గరిసింహాదిమృగంబు [3]లెల్ల నెడదాఁకన్ వెన్నడిం బోయి మం
దిర మమ్మౌని చొరంగ వే మగిడి యర్థిం బోవు మేపుల్ గొనన్. 730

వ. అట్టియెడ నేనుం బోయి వాకిట నుండ. 731

క. పక్షములు లేనినన్ను ని, రీక్షించియు నెఱుఁగలేక ♦ యేమియు నాతో
దక్షతఁ బలుకక తనగృహ, మక్షీణాసక్తిఁ [4]జొచ్చి ♦ యాదర మొదవన్. 732

వ. క్షణమాత్రం బుండి మగుడ నేతెంచి క్రమ్మఱ నన్నుం జూచి యమ్ముని యిట్లనియె. 733

1 మధురింపన్. 2 పరఁగం బ్రాణము తల్లివెంట మధురింపం బోవు. 3 లాలయము దాఁకం. 4 జొచ్చె నా సమయమునన్. వ. ఇట్లు క్షణమాత్రం బుండి వెడల నేతెంచి.

ఉ. భ్రాతలు కామరూపు లతి। బంధురసత్త్వు లుదారు లైనసం
పాతిజటాయువుల్ జగతిఁ। బ్రాజ్ఞులు వారలఁ జూచినావె య
న్వీతమనుష్యరూపధరు। లిద్దఱులోపల నగ్రజుండు సం
పాతి జటాయు వాతనికి। మక్కువతమ్ముఁడు పక్షిశేఖరుల్. 734

క. ఎక్కడ వా రున్నా రీ, వెక్కడివాఁడ విట వచ్చి। తేమిటికిన్ నీ
వెక్కుడుదుఃఖముఁ బొందెదు, తక్కక నీఱెక్క లేల। దగ్ధము లయ్యెన్. 735

వ. అని పలుకునమ్మునిచంద్రునితోడ. 736

క. అనఘాత్మ జటాయువు నా, యనుజుఁడు సంపాతి నే ను। దగ్రగతిన్ నా
ఘనతరపక్షద్వంద్వము, చెనఁటిగఁ గాలినవిధంబు। చెప్పెద మీకున్. 737

క. ఏను జటాయువు నెంతయు, మానసమున మదము లొదవ। మత్సరములతో
భానుని మనలో నెవ్వఁడు, మానుగ మును గదియనోపు। మాపటిలోనన్.

క. అతనికి మామారాజ్యము, లతులితగతి నిచ్చువార। మనుచుఁ బ్రతిజ్ఞల్
గతివడఁ గైకొని యిరువురు, వితతబలోత్సాహధైర్య। వేగము లెసఁగన్. 739

క. ఖగగతి నిరువురమును న,త్యగణితవేగములతోడ। నన్యోన్యగతుల్
నిగుడ నెగసి కడుఁబొడువున, గగనంబుననుండి పుడమి। గనుఁగొన మాకున్.

క. పురములు రథచక్రంబుల,కరణిన్ గిరు లూళ్లపగిది। ఘననదులు వసుం
ధర హంసగణములగతిన్, ధరఁ గలకులగిరులు సౌధ।తతిగతిఁ దోఁపన్. 741

వ. మఱియుం బొడువుగా నెగసి గగనతలంబున సిద్ధమార్గంబుల ఖచరసహస్రంబుల భూషణభూషితాప్సరోగణంబులఁ జూచుచు నట నెగసి కనుంగొన నానాశాద్వలసస్యంబులు భూమికిఁ దిరిగి వచ్చినకులాచలంబు లావరణంబులుగాఁ బెట్టి నిడినయాభరణంబులుంబోలె నుండ ధరణికిఁ బరివేష్టితసాగరంబులు ముక్తాహారంబులుంబోలె నుండ మఱియుం బొడవున కెగసి యాది క్కీది క్కని యెఱుంగలేక యతిదూరంబునఁ బ్రళయకాలాగ్నిగతిఁ గ్రాలుచున్నయంబరంబున మహాగ్నిరాశియుంబోలె రక్తవర్ణుం డై భూమండలప్రమాణుం డై దేదీప్యమానుం డైన భానుండు గానంబడియె నప్పు డాదేవునితీవ్రాంశువుల దాహస్వేదశ్రమమూర్ఛాతమంబులు గవియ వివశుం డై జటాయువు తలక్రిందుగా నురవడిం బడుచుండఁ జయ్యన నాయనుజు ఱెక్కలనడుమ దాఁచుకొని దగ్ధుండు గాకుండ దిగంబడుచుండఁ దరణికిరణంబులవేఁడిమి నాపక్షంబులు గమలె నేను వింధ్యగిరిమీఁదం బడి మఱి సముద్రంబులోఁ బడి మునింగితి జటాయువు జనస్థానంబునం బడియె నని వింటి భాగ్యవశంబున గిరిమీఁద సముద్రంబునఁ జావక వెడలి పక్షంబులు చెడి కాష్ఠలోష్టంబుపగిది నున్ననాకు నింకేటిజీవనం బనుచు శైలశిఖరంబున నుండి విఱుగంబడ నుద్యోగించిననన్ను నచ్చటిజనులు నివారింపఁ బడ కున్నాఁడ నిట్లు. 742

క. అని పలికి బాష్పధారలు, కనుఁగవలం గ్రమ్మఁదేర । ఘనతరదుఃఖం
బున నున్ననన్నుఁ గనుఁగొని, తనమతిఁ దలపోసి మౌని । తగ నిట్లనియెన్.
సీ. దశరథుం డనుపేరి । ధరణీశునకు రాముఁ, డనురాజు పుట్టెడు । నామహీశుఁ
డనుజసమేతుఁడై । యాత్మపత్నియుఁ దాను, జనకాజ్ఞఁ గానల । సంచరింప
రావణుఁ డారాము । దేవి మ్రుచ్చిలి కొని, పోవ నాచొప్పున । దేవి వెదక
నారాముపంపున । నధికవానరవీరు, లేతేరఁ గలరు వా । రిటకు వచ్చి
యెపుడు సీతోడ భాషింతు । రపుడ నీకుఁ
బక్షములు వచ్చి ప్రాయంబు । బలము జవముఁ
గన్నులును గల్గి క్రాలెదు । మున్నపోలె
నని మునీంద్రుఁడు చెప్పె నె । య్యమున మఱియు. 744
వ. ఖగవర మరణేచ్ఛ మారామదూతలు వచ్చునందాఁక నిచట నుండుము నీకు
ను రామలక్ష్మణులకును సురమునిబ్రాహ్మణులకు నింద్రునకు హితంబైన జానకీ
వృత్తాంతం బెఱింగింపుము రామలక్ష్మణులం జూడ నాకును బ్రియంబు గలదు నీ
విచట నుండు నీకు సర్వంబును మే లయ్యెడు ననుచుం బలికి యమ్మునివరుండు
గ్రమ్మఱ నయ్యాశ్రమంబుఁ జొచ్చె నేను నంత. 745
క. మునివరునానతి చిత్తం,బున నిడికొని యిచట జీవ । మును విడువక య
ల్లనఁ బాదమ్మున వెడలం, జని క్రమ్మఱ బిలముఁ జొచ్చి । సముదితచింతన్.
వ. రే లెల్ల నిదుర గానక కాలంబున కెదురుచూచుచుండ నూఱేండ్లు చనియె నం
త నిశాకరుం డనుమునివరుండు క్రమ్మఱ నాకమ్మున కరిగె నే నతిదుఃఖంబుఁ బొం
ది జీవంబు చిక్కంబట్టుకొని యుండ నేఁటికి వానరముఖ్యులై సమీరార లేతెంచి
తిరి మీతోడ సీతావృత్తాంతంబు చెప్పితి నివె నాకుఁ బక్షంబులు వచ్చె మున్న
పోలెఁ బరాక్రమయౌవనంబులఁ బొందితి నని పలుక వానరులు వానిం జూచి
సంతోషించి సీతాన్వేషణగమనోత్సుకులై యుండ నవ్వానరులం జూచి క్రమ్మ
ఱ సంపాతి యిట్లనియె. 747

—✿ సంపాతి వానరులకు సీత యుండుచో టెఱింగించుట. ✿—

సీ. రూపింప నిచటికిఁ । గ్రోశమాత్రంబున, దక్షిణాంబుధిచెంతఁ । దనరి యొక్క
యచల మున్నది వీఁక । నయ్యద్రిపై నుండి, శతయోజనం బగు । జలధి దాఁటి
యట లంకఁ గాంచెద । రాలంకలోఁ బుణ్య,శీల యున్నది మీరు । సీతఁ జూచి
కృతకార్యసిద్ధులై । యతిమోదమున మీఱి, వెసవచ్చెదరు రామ । విభునికడకుఁ
దప్ప దమ్మునీంద్రునిప్రసా । దమున నాత్మ
వెలయఁ జూచిన నంతయుఁ । దెలియఁ గాన
వచ్చెఁ గాన చెప్పితి మీకు । వలయువాంఛి
తార్థలాభంబు లొంద నిం । డనుచుఁ బలికి. 748

క. హిమనగమునందు మలయో, త్తమశృంగముచెంత నాసదన మున్నది నా
రమణియు నానందనుఁడును, నమరఁగ నున్నారు గాన యరిగెద నటకున్.

వ. అని పలుక జాంబవంతుండు సంపాతిం గనుంగొని నీవు రామహితంబును మ
ద్వాంఛితంబు నైనసీతావృత్తాంతంబు చెప్పితి సంతసంబునఁ బొందితి మింక సము
ద్రోల్లంఘనం బెట్లు సేసెదమో యనుచింతం జింతిల్లుచున్నార మివ్వనధి దాఁట
నీవును సహాయంబు గావలయు నన్న సంపాతి జాంబవంతున కిట్లనియె. 750

క. వృక్షచరులార బలజవ,దక్షత నీయంబురాశి దాఁటం జాలం
బక్షములు గలిగి యున్నను, రక్షోనాయకున కెదిరి బ్రదుకఁగ నోపన్. 751

తే. కాన నాసుతుఁ బంచెద ఘనుఁడు వాఁడు
శంక లే కంబునిధి దాఁటి లంకఁ జొచ్చి
సీతఁ బొడగాంచి కృతకార్యసిద్ధుఁ డగుచు
వచ్చు నిట కంచుఁ దనపుత్త్రు వాంఛఁ దలఁప. 752

క. ఎఱకలగాలిం దరువులు, నఱుముగ విఱిగి కుసుమములు నలుగడ రాలన్
నెఱి చెడి వడి మేఘంబులు, పఱవఁగఁ దండ్రికడకును సుపార్శ్వుఁడు వచ్చెన్.

క. వచ్చి తను నచటివానరు, లచ్చెరువడి చూడఁ దండ్రి కతఁ డిట్లను నీ
విచ్చఁ దలంచిన నిటకున్, వచ్చితి నేమిపని చేయ వలయుం జెపుమా. 754

వ. అనిన సంపాతి తనయునకు నంతవృత్తాంతంబును జెప్పి సీతం జూచి రమ్మని పనుప
నతం డెంతయు సంతోషించి యంగదుం గనుంగొని. 755

క. పారావారము దాఁటెద, నారావణులంకఁ గొంక కద్భుతసత్త్వో
దారతఁ జొచ్చెద వచ్చెద, నారాముని దేవిఁ జూచి యతిశీఘ్రముగన్. 756

వ. [1]అని పలుక నతనికడంకకు సంతోషించి యంగదుం డతనిం జూచి సుపార్శ్వ నీ
వధికబలుండ వెంతటికైనం జాలుదు మీతండ్రియు నీవును నెమ్మది సుఖంబున
నుండుండు మీ రాయాసపడ వలవదు సీత లంకలో నున్న దని మున్ను మీ
తండ్రి దివ్యదృష్టిం జూచి చెప్పినప్పుడ మా కత్యంతసహాయసంపన్నత్వంబు మీ
రు చేసినట్టి దయ్యె మే మవలీల సముద్రంబు దాఁటి లంకఁ ద్రికూటాచలంబు
తోఁ బెఱికి పేటాడం జాలుదు మిట మహావీరవానరులు విష్ణురుద్రపరాక్ర
ము లైనమహాకపికోటులు నున్నారు మే మింక సముద్రలంఘనగమనోద్యోగం
బు సేసెద మని పలుక విని సంపాతియు నధికజవంబున మింటికి నెగసె నా
సమయంబున. 757

1. వ. అని పలుక నంగదుండు సుపార్శ్వుం జూచి నీ వధికబలశాలి వవార్యవేగుండవు నగుదు నీవాక్యం
బులకు సంతోషించితిమి మీతండ్రియు నీవు నెమ్మది నుండుఁడు మున్నె యేము విన్నారము సీత
లంకలో నునికి నవలీల సముద్రంబు దాఁటి లంకఁ ద్రికూటాచలంబుతోడం బెఱికి పేటాడం జాలు
దుము...పా. అ.

క. [1]గగనంబున కెగ్గెగయుచు, ఖగపతి యంగదునితోడ ♦ గ్రక్కున మీరల్
జగతీసుతవృత్తాంతము, నెగడెద రని పలికి చనియె ♦ నిజగృహమునకున్. 758
వ. అని పలికి సంపాతి పోయిన నంగదుండు కపులం గనుంగొని మన మింక సంపాతి చెప్పినమార్గంబునఁ గడలి దాఁటి పోవుద మనుచు సకలవానరవీరులతోడ దక్షిణసముద్రతీరంబున నున్నయగ్గిరి యెక్కి యచట నాసీను లై సింహానంఘంబులపగిదిఁ గొంతదడ వుండి యట దక్షిణసముద్రంబునుత్తరభాగంబున నవ్వానరవీరులు. 759
సీ. జగములు ముంపంగ ♦ సమకొన్న కైవడి, నుద్వేలముగ నుబ్బు ♦ చున్నదానిఁ
బాతాళనాగముల్ ♦ పైఁ దేలి యాకాశ, గంగలో విహరింపఁ ♦ గడఁగుదాని
నింగి ప్రింగెడుభంగి ♦ నెగయునముత్తుంగ,భంగసంఘంబులఁ ♦ బరఁగుదానిఁ
గూలంకపాటోప ♦ కుటిలతరగ్రాహ, బడబాగ్నిఘోర మై ♦ ప్రబలుదాని
నురుఘనధ్వని నుడుగక ♦ మొరయుదాని, నాతతావర్తభీకర ♦ మైనదాని
నిబిడవర్షధారాపూర్ణ ♦ నిఖిలసింధు,భూరిజలసముత్సేధి నంభోధిఁ జేరి. 760
క. కొందఱు శైత్యము నొందిరి, కొందఱు కూర్చుండి రచటఁ ♦ గొందఱు భయముం
జెంది విషాదము నొందిరి, కొందఱు నిశ్చేష్టు లైరి ♦ కొందఱు ప్లవగుల్. 761
వ. అప్పు డంగదుండు వారలభయం బెఱింగి వెఱవకుం డనుచుఁ బలికి యెల్లి వారిరాశి దాఁటుద మీరాత్రి యిచట నిద్రింపుండు నెమ్మది నని బుజ్జగించి యారాత్రి యచటఁ బుచ్చి మఱునాఁ డరుణోదయంబున సకలవానరవీరులుఁ బరివేష్టించి కొలువ నాగిరితటంబునఁ గూర్చుండి విషణ్ణు లైనవానరులం జూచి యంగదుండి ట్లనియె. 762
ఉ. శోకముఁ బొందునే ఘనుఁడు ♦ శోకము కాలవిషంబు శోకము
ద్రేకముఁ బొంద మానస మ ♦ తివ్యథపాల్పడు శోకమగ్నునిం
బై కొని చంపుఁ గ్రూరఫణి ♦ బాలునిఁబోలెను శోక మాత్మలోఁ
జేకొనువానికిం బరఁగఁ ♦ జెల్లునె చేయఁ బరోపకారముల్. 763
వ. కావున శోకం బుడిగి వినుండు. 764
ఉ. ఎవ్వఁడు రామమోదకరుఁ ♦ డెవ్వఁడు భానుజవాక్యపాలకుం
డెవ్వఁడు వార్ధి దాఁటఁగలఁ ♦ డెవ్వఁడు లంకఁ జొరంగ నోపువాఁ
డెవ్వఁడు కీశదుఃఖహరుఁ ♦ డెవ్వఁడు జానకిఁ జూచి వచ్చువాఁ
డెవ్వఁడు రామలక్ష్మణక ♦ పీంద్రులఁ జేరుచు మమ్ము నెమ్మదిన్. 765
క. వననిధి నవలీలం గడ, చనువాని ప్రసాద మొంది ♦ సతులు గృహంబుల్

---

1 క. గగనంబున కెగ్గెగసిన, ఖగపతి నంగదుఁడు చూచి ♦ కపుల మనుప నీ
ఖగపతి సీతావృత్తము, నెగడఁగ వినిపించి చనియె ♦ నిజగృహమునకున్.
వ. అని పలికి యంగదుండు వనచరులార మన మింక......నవ్వానరవీరులు. పా. అ.

ధనములు నఖిలసుఖంబులు, మన మారం గాంతు రోలి ॥ మర్కటు లెల్లన్.
వ. అని పెక్కుభంగులం బలుక నఖిలవనచరులు నతనిపలుకుల కిచ్చగింపక తెచ్చవడి యున్న మఱియు నావనచరయూథపులం గనుంగొని. 767
చ. జనపతి సీత కిమ్మనుచు ॥ సమ్మతి ముద్రిక యీఁడె లంకలో
జనకజఁ జూచి రం డనుచు ॥ సారసబంధుసుతుండు పంపఁడే
పనివడి లంకఁ జొత్తు మని ॥ [1]పైఁబడి తా రిట వచ్చి యిప్పు డీ
వననిధిఁ జూచి భీతిగొని ॥ వానరు లూరక యుండఁ బాడియే. 768

—అంగదాదులు సముద్రంబు దాఁటఁ దమకొలందు లెఱింగించుట.—

వ. ఇంక మీర లీసముద్రంబు దాఁట సమర్థులు గారె వనచరపుంగవులగు దృఢ పరాక్రములరు నభంగగమనులరు నతిప్రఖ్యాతులరు మీ రెంతంతమేర సముద్రం బు దాఁట నోపుదురు చెప్పుఁడు. 769
సీ. అని యంగదుఁడు వల్క ॥ నగచరవీరులు, దమతమసత్త్వముల్ ॥ దలఁచిచూచి
గజుఁడు యోజనదశ ॥ కంబు గవాక్షుఁ డ,త్యుద్ధతి నిరువది ॥ యోజనములు
శరభుండు గడఁకఁ ద్రిం ॥ శద్యోజనంబులు, ఋషభుఁ డన్కపివీరుఁ ॥ డేపుతోడ
నలువదియోజన ॥ ములు గంధమాదనుఁ, డోపిక నేఁబది ॥ యోజనములు
నురుగతిని మైందుఁ డఱువది ॥ యోజనములు
నోజ ద్వివిదుండు డెబ్బది ॥ యోజనములు
నురవడిని దారుఁ డెనుబది ॥ యోజనములు
జలధి దాఁటఁగఁ గల మని ॥ పలికి రపుడు. 770
వ. అట్లందఱు కపులుఁ బలుక వారలం జూచి మారుతసమానవేగుండును ధాత్రీరా ష్ట్రసమజవాధికుండును నతిప్రాజ్ఞుండును శతవృద్ధుండును నైనజాంబవంతుండు నా పూర్వవృత్తాంతంబు వినుం డని యి ట్లనియె. 771
క. గరుడుఁడు పుట్టనికాలము,సుర లమృతము ద్రచ్చుటయును ॥ సురలును దైత్యుల్
దురములు గావించుటయును, బరువడిఁ గన్నాఁడ మున్ను ॥ బహువారంబుల్.
వ. అట్లు గాన బహుకాలంబునాఁటివృద్ధను జవసత్త్వంబు లడఁగియున్నవాఁడఁ బిన్ననాఁటిబలపరాక్రమంబు లిప్పుడు చెప్ప వచ్చిన మహోహాస్యాస్పదం బై యుం డు నైనం జెప్పెద నాకర్ణింపుఁడు. 773
సీ. విక్రమం బెసఁగఁ ద్రి ॥ విక్రమదేవుండు, విక్రమత్రయమున ॥ విశ్వధరయు
మేదురగతి [2]నాక్ర ॥ మించినప్పుడు భక్తి, యమర నాఱుప్రదక్షి ॥ ణములు చేసి
వరున సుషేణుతో ॥ నిరువదియొకసారె, లీలఁ బ్రదక్షిణ ॥ మోలిఁ జేసి
సురలకు మునులకుఁ ॥ జోద్యంబుఁ బ్రీతియు, నమరించితిని బలి ॥ యజ్ఞవేళ
నిచ్చ నోషధుల్ నాచేతి ॥ కిచ్చునప్పు,డమరులను వేఁడి త్రాగితి ॥ నమృత మేను

1 పైఁజాలతో నిట వచ్చి. 2 నాక్రమించిన యామిని, కమర.

గాన నాఁ డతిసత్త్వంబు గలదు నాకు, నిద్ధశక్తి నా కెవ్వరు నీడుగారు. 774

క. తరుణవయోవేళను నే, నరుదుగ నుదయాద్రినుండి యస్తాద్రికి న
త్వరగతితోడం జని మఱి, హరుగిరి కేఁగి విబుధాలయమునకుఁ జనుదున్. 775

క. అతివృద్ధ నిప్పుడు జరా, తతభారము నొందినాఁడఁ దరుణత్వసమం
చితబలమును జవమును న, స్మతియును దరుణత్వమంద మఱి యవి గలదే.

వ. ఒక్కనాఁడు కైలాసపర్వతసమీపంబున నగ్నితేజులైన ఋషులు యజ్ఞంబు సేయ నయ్యజ్ఞంబు సూడఁబోయి యమ్మునులతో భాషించి యచటం గూర్చుండితి నంతఁ గుపితమృత్యువుంబోలెఁ జంప నిశ్చయించుబలిపుత్త్రుం గంటి నాపర్వతహంత యగుదైత్యుం డిరుచేత నెత్తి యొక్కపర్వతంబు వైచె నప్పర్వతంబు వడి నేతేర జానువున నాపర్వతంబు వగిలించితి నది గారణంబుగ జానువు భగ్నం బైనం గుంటనై శిథిలవిక్రముండ నైతి నిప్పుడు జరాక్రాంతుండను బలహీనుండనుం గాన మిగుల దాఁటం జాలం దొంబదియోజనంబు లోపుదు నటమీఁద సందేహం బని జాంబవంతుండు పలుక విని నలుండును దొంబదియోజనంబులు దాఁటెద నని పలికె నప్పు డాంజనేయుండు తనపౌరుషం బేమియుం బలుక కూరకుండె నప్పుడు జాంబవంతుం గనుంగొని. 777

క. తనలావు దలఁచి తారా, తనయుం డి ట్లనియె నబ్ధి దాఁటెద శతయో
జనమానము వేగమ మఱి, ఘనజవమున మగిడి రాఁగఁ గలనో లేనో. 778

వ. అనిన జాంబవంతుం డంగదున కి ట్లనియె. 779

క. లీలను యోజనశతమును, గాలిగతిన్ వార్ధి దాఁటి క్రమ్మఱ వే రాఁ
జాలుదు బలవేగంబుల, వాలికి సరివత్తు వీవు వాలితనూజా. 780

చ. అలవున వాలి యోజనసహస్ర మతిత్వర దాఁట నోపు నా
కొలఁదిజలాధికుండు కపికుంజర భానుసుతుండు నీవు న
య్యలఘునియంతవాఁడవు సమర్థుఁడ వెంతకు నైన వానరా
వలి నిను వాలిఁబోలెఁ గొలువంగల రేల విచార మియ్యెడన్. 781

మ. ప్లవగస్వామివి వాలిపోలెఁ గపులం బాలింప శిక్షింపఁ గ
ర్తవు నీయాజ్ఞఁ జరించువార మతియుక్తప్రేష్యభావంబునన్
భవదిచ్ఛాగతి మమ్ము నెల్లపను లొప్పం బంచి చేయింపు రా
ఘవుదేవిన్ వెదకంగ నేము గలుగం గా నీకుఁ బో నర్హమే. 782

వ. అంగద నీవు వోయిన మా కొడయం డెవ్వఁడు మాకు దిక్కెక్కడిది నీవు మాకు మూలంబు నీ కేము శాఖాపుష్పఫలంబులవంటివారము మూలంబు లేక శాఖాపుష్పఫలంబులు గలవె నీవు మాకు గురుండవు గురుపుత్త్రుండవు రాజవు నీదాసులము నెమ్మదినుండి నిన్నుఁబోనీఁజాలము నిన్నుఁ బురస్కరించికొని సర్వకార్యముల మేమ సాధించెదము మేము లేక నీకు లంకాప్రాపణంబు సేయ నశక్యం బనిన

నంగదుం డి ట్లనియె. 783

సీ. ధరణిజ వెదకక § తనయాజ్ఞఁ దప్పిన, నినజుఁ డప్పుడ పట్టి § మనలఁ జంపుఁ
సతికల్మిలేములు § నన నిశ్చయింపక, సంశయంబునఁ బోవఁ § జాలఁ గినిసి
పొం డని వెదకంగఁ § బుత్తెంచుఁ గ్రమ్మఱ, నింతి లేదని నిశ్చ§యించి పోవఁ
గరుణఁ గాచినఁ గాచుఁ § గాన జానకివార్త, నిజముగా నెఱుఁగక § నీరజాప్త
తనయునొద్దకుఁ బోరాదు § మనకు నిచట
నొనరఁ బ్రాయోపవేశంబు § నొందుటొండె
వనధి దాఁటి జానకిఁ జూచి § వచ్చుటొండె
వలయు మఱి యొండుమార్గంబు § వలను గాదు. 784

ఉ. ఏను బయోధి దాఁటి బల § మింకక లంకకుఁ బోక రాముతో
జానకివార్త గో మనుచు § సమ్మతిఁ జెప్పుదు నూర కేఁగి యా
భానుజుచండదండముల § పాల్పడి చావఁగఁ జాల వేగ మె
ట్లైనఁ బయోధి దాఁటి వసు§ధాధిపువల్లభఁ జూచి వచ్చెదన్. 785

క. అన విని ముకుళితకరు లై, వనచరవిభు లెల్ల నపుడు § వాలితనూజుం
గనుఁగొని వననిధి దాఁటఁగ, మనకును శక్యంబు గాదు § మదిఁ దలపోయన్.

క. నిను వాలిఁబోలెఁ జూచుచు, ననిశము నీతోడఁగూడ § నందఱు సుఖ మై
నను దుఃఖ మైనఁ బొందెద, మినజుం డే మైనఁ జేయ § నిమ్ము కపీంద్రా. 787

క. అనవుడు జాంబవంతునకు § నంగదుఁ డి ట్లను సారబుద్ధి వీ
వనఘు సమస్తకార్యములు § నారసి కానఁగ నేర్తు రామభూ
జనపతి యాత్మలో నలర § జానకిఁ గన్గొని కార్యసిద్ధితో
ననుపఁగ వేగ రాఁ గలయు§పాయము మా కెఱుఁగంగఁ జెప్పవే. 788

క. అని పలుక జాంబవంతుం, డను నంగదముఖ్యవాన§రానీకముతో
మనపూనిక సేయంగల, ఘనుఁ జెప్పెదఁ బలుకు లుడిగి § కపు లుండుఁ డొగిన్.

వ. అని పలికి. 790

—❖ జాంబవంతుండు హనుమంతుం గొనియాడుట. ❖—

చ. రామహితంబు సేయఁ గపి§రా జగుభానుజుపం పొనర్ప ను
ద్దామజవంబునన్ జలధి § దాఁటఁగ లంక సొరంగ దక్షతన్
భూమిజఁ జూచి రాఁ గలుగు§భూరిపరాక్రమశాలి వానర
గ్రామణి వాయునందనుఁడు § గల్గఁగ నేరికిఁ జింత యేటికిన్. 791

వ. అని పలికి జాంబవంతుండు హనుమంతుం గనుంగొని. 792

ఉ. మారుతి నీదుకృత్యములు § మాపయిఁ బెట్టి తొలంగి లీలతో
నూరక యున్నవాఁడవు ప§యోనిధి దాఁటఁగ మావశంబె వి

స్ఫారతర ప్రతాపమున । సత్త్వబలంబుల [1]శౌర్యబుద్ధులన్
భూరితరోగ్ర తేజమునఁ । బోలుదు రాఘవభానుసూనులన్. 793

క. గరుడునికంటెను జవమున, శరనిధి దాఁటంగఁ బెక్కు । సారులు వినుమ
గ్గరుడునిపక్షములకుఁ గల, పరుషత్వము గలదు నీదు । బాహుద్వయికిన్. 794

చ. లలితవిలాసరూపశుభ । లక్షణశోభిత యైనపుంజిక
స్థల యనునప్సరోవనిత । శాపముచేతఁ బ్లవంగ కాంత యై
చెలువుగ నంజనాహ్వయము । చేకొని కేసరిపత్ని యయ్యెఁ బెం
పలరఁగఁ గామరూపిణి యొ । కప్పుడు పొల్చు మనుష్యకాంత యై. 795

క. కనకఖచితమణిగణఘృణి, కనదాభరణప్రసూన । గంధాంబరశో
భిని యై యొకనాఁ డంజన, ఘనశైలాగ్రమున లీలఁ । గ్రాలుచు నుండన్. 796

మ. అనువృత్తోరులు కుంభికుంభనిభర । మ్యశ్రోణియుగ్ సంచల
త్తనుమధ్యంబును నిమ్ననాభియును ను । ద్యచ్చక్రవాకాంచిత
స్తనభారంబును దర్పణోల్లసితక । క్షద్వంద్వముం గాన రా
ననిలుం డంజనమేనిచేలఁ గదుసి । గ్గారం దొలంగించినన్. 797

వ. అప్పుడు సర్వాంగలావణ్యగణ్య యైనయంజనాదేవిం గనుంగొని. 798

క. మనసిజశరగోచరుఁ డై, యనిలుఁడు ప్రేమకంబుతోడ । నంగన నాలిం
గన నొనరింపఁగ నయ్యం,జన సంభ్రమ మడరఁ గోప । సంభృత యగుచున్.

క. నాపాతివ్రత్యోన్నతి, చాపలమునఁ జేసి చెఱుప । సమకట్టినవాఁ
డేపురుషుం డో యనవుడు, నాపవనుం డుచితభంగి । నాసతితోడన్. 800

క. సతి నీతో మానసనం,గతి చేసితి దీన నీకుఁ । గల్యాణము దు
ష్కృతి సెంద దేకపత్నీ,వ్రతహీనవు గావు వెఱకు । రాగం బొప్పన్. 801

క. అనుపమబలవేగంబులు, ఘనతరవిక్రమముఁ గామ । గమనము ధైర్యం
బును మఱియుఁ గామరూపం, బును గలిగెడునట్టిపట్టి । పుట్టెడు నీకున్. 802

చ. అని పవనుండు వల్కి చనె । నంజనతో భుజశక్తి వాసి కె
క్కినకపిలోకముఖ్యుఁ డగు । కేసరి కారయ క్షేత్రజుండ వా
యనిలున కౌరసాత్మజుఁడ । వాతతవేగమహాబలంబులం
[2]దనిలునిఁ బోలువాఁడ వని । లాత్మజ వానరవంశదీపకా. 803

సీ. బాలవయోవేళ । బాలార్కబింబంబుఁ, గనుఁగొని ఫల మను । కాంక్షఁ బెక్కు
వేలయోజనములు । వెస మింటి కెగసి చం,డాంశురోచులవేఁడి । నంగ మెరియఁ
గడువిషాదించుచు । గగనంబుపై నుండి, హనువు భగ్నము గాఁగ । నద్రిమీఁద
నతిరయంబునఁ బడి । తదిగారణంబుగ, హనుమంతుఁ డనునామ । మమరఁగంటి

1 శౌర్యబుద్ధులుగా, నారయ సర్వభూతముల । యంతటికంటె ఘనుండ వంతయుగా, భూరి బలోగ్రతేజమునఁ । బోలుదు రాఘవభానుజాదులన్. 1 దనిలునితోడిసాటి వని । లాత్మజ.

విద్ధబలుఁడవు ఖగకులాధీశుకంటె, నధికజవసత్త్వయుక్తుఁడ వరయఁ జిత్ర
మైననీవిక్రమముఁ జూడ నానతోడ, నెదురుచూచుచు నున్నవా రెల్లకపులు.

క. క్షోణిజఁ గని వచ్చి జగ, త్ప్రాణజ రఘువంశవరుల ప్రాణంబులు మా
ప్రాణంబులు సుగ్రీవుని, ప్రాణములుం గావు నీవ ప్రాణము మాకున్. 805

ఉ. కావున నీవు రామహితకార్యము సేయఁగ నబ్ధి దాఁటి యా
రావణులంకఁ జొచ్చి మఱి రాఘవువల్లభఁ జూచి రమ్ము సు
గ్రీవుఁడు సంతసింప మము క్షేమముతోఁ గొనిపొమ్ము లోకసం
భావితకీర్తిఁ బొందు మిఁక బంధురధర్మముఁ బొందు పావనీ. 806

వ. అని పలుకునప్పుడు. 807

మ. గిరిరుద్ధాంఘ్రులు మింటితోఁ నొఱయ [1]వాక్షేపించులాంగూలముం
దరుణాదిత్యవిధూమపావకసముద్దామాననంబుం గరం
బరు దారంగఁ ద్రివిక్రమక్రమసముద్యన్మూర్తియై దృప్తకే
సరివిస్రంభవిజృంభణం బెసఁగఁ గీశశ్రేణి యగ్గింపఁగన్. 808

—హనుమంతుఁడు నిజజనవృత్తాంతంబు వానరులకుఁ జెప్పుట.—

వ. పున్నమఁ గడలొత్తి యుప్పొంగుసముద్రంబునుంబోలె మేను వొంగ బలోత్సాహంబు లంతకంతకు నెసఁగ హనుమంతుండు వనచరులతో ని ట్లనియె మజ్జననీజనకులవృత్తాంతంబును మజ్జన్మక్రమంబును వినుండు పశ్చిమసముద్రంబుచెంత మునిజనసేవ్యం బైన ప్రభాసం బనుపుణ్యతీర్థంబు గల దప్పుడు మును లాతీర్థంబున నవగాహనంబు సేయం జొత్తు రప్పుడు [2]శంఖశబలనామంబులు గలదుష్టగజంబులు రెండు కోపాటోపంబున దుష్టమానసంబు లగుచు నాఋషులం బొడగని పడం బొడుచుచు నుండు నవి యొక్కనాఁడు మునిపూజితం బైనపుణ్యవనంబుఁ జొచ్చి యచ్చట నున్నభరద్వాజుపైఁ గవియ నచటఁ బర్వతకూటంబున నున్నమజ్జనకుం డక్కుంజరంబుల బొడగని రోషావేశంబున. 809

చ. బలువిడి నార్చుచున్ గజముపై గజముం బడవైచి పెన్నఖం
బుల వడి వానినేత్రములు భూరిరయంబున వ్రచ్చి యంతలో
నిలకు రయంబునన్ డిగి యహీనబలంబున నొక్కసాలమున్
లలిఁ బెకలించి పట్టి కడు లావున వ్రేసి వధించె నొక్కటన్. 810

---

1 సుక్షేపించు.

2 ఇట హనుమంతుఁ డొక్కగజమునే చంపినట్లు వ్రాతప్రతులఁ గానఁబడుచున్నది. కాన 'శంఖశబలనామకం బగుదుష్టగజంబు......దుష్టమానసం బగుచు నాఋషులం......నది యొక్కనాఁడు మునిపూజితం......డక్కుంజరంబుఁ బొడగని......చ. బలువిడి......గజము పైఁ గవియం బటుతీవ్రతన్ నఖం, బుల వడి దాని నేత్రములు భూరి......లావున వ్రేసి వధించె నక్కరిన్.

వ. అ ట్లగ్గజంబులం జంపిన భరద్వాజుండు సంతసిల్లి మునులకడ కేతెంచి మజ్జనకుం జూపి యీకపిరాజు మునధర్మవిరోధులైనకుంజరంబుల వధియించెఁ గుంజరసూదనుండు గావునం గేసరి నాఁ బరఁగు నీతఁ డితనికిం బ్రియంబైనవరం బిం డనిన నమ్మును లతనిం గనుంగొని. 811

క. దురమున భీకరముగ నా, కరులం జంపితివి గాన కరము ప్రియం బే
వర మిట నడుగుము నావుడుఁ, బరమప్రియ మంది నాకుఁ బ్రమదం బెసఁగన్.

క. అనిలబలసముఁడు నవ్యయ, తనుఁడును గామగముఁ డిద్ధతరజవసత్త్వుం
డును గామరూపియును నగు, తనయుఁడు గలుగ వర మిండు తాపసవర్యుల్.

వ. అనిన నమ్మును లట్ల వరం బిచ్చి రంత నొక్క నాఁడు. 814

క. కుంజరుఁ డనియెడువానర, కుంజరునితనూజ చారుగుణరూప మనో
రంజన పుణ్య యనం జను, నంజన నాతల్లి లీల యౌవనవేళన్. 815

చ. జలధిజలాభిషేచనము జానుగఁ జేసి జలార్ద్రకేశియై
మలయగిరింద్రశృంగమున మానస మింపఁ జరింప నంజనా
లలితశరీరయౌవనవిలాసము లారఁగఁ [1]గౌఁగిలించి య
త్యలఘుతరానురాగమున నాసతిఁ జూచి సమీరగుఁ డిట్లనున్. 816

వ. అంగన నే నఖిలప్రాణులకుఁ బ్రాణుండ నైనజగత్ప్రాణుండ నంగజశరచ్ఛిన్నమానసుండ నై భవదీయాలింగనంబునుం జేసితి మదీయాంగసంగదోషంబు నీకు లేదు నావలన నీకు వానరరూపుండును మహాజవుండును నధికుండును సౌమ్యుండును నగ్నితేజుండును మదీయసమవేగబలశాలియు నగుపుత్త్రుండు పుట్టెడు నని పలికె న ట్లయ్యంజనాదేవికి జనియించితిఁ గేసరికి క్షేత్రజుండ ననిలున కౌరసపుత్త్రుండను గావునఁ బవనగమనవేగంబున నాకు సమానుం డెందును లేఁ డని పలికి వీరరసావేశంబున. 817

సీ. అస్మద్భుజోరువాతాతివేగమున నం, భోనిధిగ్రాహముల్ మూర్ఛఁ బొంద
విఱిగి పాదపశైలవిపులశృంగమ్ములు, నెగసి యాకస మెల్లఁ బగుల నడువ
వడిఁ గులాచలములు వడవడ వడఁకంగ, జగతీతలం బెల్ల సంచలింపఁ
దోయదమాలికల్ దూలి నల్లడఁ బాఱ, సకలదిక్కులు స్రూయ జగము బెగడ
వీఁక జలరాశి యవలీల వేగ దాఁటి, లంక నిశ్శంకతోఁ జొచ్చి లలితపుణ్య
సీతఁ బొడగాంచి కృతకార్యసిద్ధితోడ, నరుగుదెంచెద ముద మొందుఁ డఖిలకపులు.

చ. వనధిఁ గలంచెదం బుడమి వ్రక్కలు సేసెద నింగి మ్రింగెదన్
ఘనతరశైలముల్ వెఱికి క్రన్నన నూడ్చెదఁ గాలమృత్యువున్

వ. అ ట్లగ్గజంబుఁ జంపిన......ధర్మవిరోధియైనకుంజరంబు వధియించె......క. దురమున నక్కరిఁ జంపితి గాన నీకుఁ గరము' అని పాఠ మున్నది.

1 జూచి మానసం, బలరఁగఁ గౌఁగిలించికొని యాసతిఁ.

దునిమెద మేరువుఁ బెఱుకఁ ద్రోచెద శేషునిఁ బట్టి నుల్చెదన్
వనజభవాండముల్ పగుల వ్రైచెద దాఁటెద నేడుదీవులన్. 819

క. సరసిజహితుఁ డురుజవమున, నరుదుగ నొకమాటు దిరుగునంతటిలో ని
ర్జరనగము వేయిమాఱులు, దిరిగెద నత్తరణిఁ గడచి దృఢగతితోడన్. 820

క. గగనముననుండి యురవడిఁ ఖగతతి పుడమిఁ బడుచుండఁగా వేమాఱుల్
ఖగపతిఁ గడవఁగఁ బఱచెద, జగములు నాజవముఁ జూచి సంస్తుతి సేయన్.

క. పారావారము సవ్వలి, పారమునకు దాఁటి నిలువఁబడక మగిడి యీ
పారము మగుడఁగ దాఁటి య, పారమతిం బాఱుదేరఁ బటుజవశాలిన్.

మ. అరుదారం బదివేలయోజనము లుద్యచ్ఛక్తిమై దాఁటెదన్
ధరణీపుష్కరచక్రముం దిరిగెదన్ దంభోళివీర్యత్వరం
గరయుగ్మంబున ఋశ్యమూకమును లంకాద్వీపముం బట్టి స
త్వరభంగిం గొనివచ్చి యిచ్చటనె సీతారాములం గూర్చెదన్. 823

క. శరనిధి నున్నభుజంగము, నిరవుగఁ బక్షములనడుమ నిడుకొని గరుడుం
డురుగతిఁ దెచ్చువిధంబున, నురవడిఁ దెచ్చెదను లంక నున్నమహీజన్. 824

వ. అని పలికి. 825

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకలాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనావక్షోజహారావళి
పాటింపం దగునీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ. 826

మాలి. సురనుతపదపద్మా శుద్ధవిజ్ఞానసద్మా
హరిణకలితహస్తా యాపగాసిక్తమస్తా
హరిహయసురరమ్యా యంచితధ్యానగమ్యా
స్ఫురదురుగిరిచాపా పుణ్యవీథిస్వరూపా. 827

గద్యము. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికా
ర్జునభట్టప్రణీతం బైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునఁ గిష్కింధాకాండము
సర్వంబు నేకాశ్వాసము. 828



శ్రీరస్తు.

# భాస్కరరామాయణము.



## సుందరకాండము.



రమణీహృదయేశ్వర
కారుణ్యసుధాంబురాశికల్లోలభవ
శ్రీరంజితవరవైభవ
సారయశశ్శ్రీవిహార సాహిణిమారా. 1

క. అంతం గపివీరులతో, సంతస మందంగఁ జండసమరజయశ్రీ
మంతుం డగుహనుమంతుం, డెంతయు బలగర్వ మెసఁగ నిట్లని పలికెన్. 2

చ. ఉరవడి నుప్పరం బెగయ నూఁకుమదీయపదాగ్రఘట్టన
స్ఫురణము సైఁపలేక వడి భూమి దిగంబడుఁ గాన యిమ్మహీ
ధరదృఢభూరిశృంగములు దాఁపలుగా లఘులీల దాఁటి స
త్వరగతితోడ యోజనశతంబునుగూడ నతిక్రమించెదన్. 3

—హనుమదాదివానరులు మహేంద్రగిరిం జేరుట.—

చ. అన విని సంతసంబున సమస్తకపీంద్రులుఁ జేరి యాసురేం
ద్రున కనురక్తి దేవతలు మ్రొక్కువిధంబున మ్రొక్కి వాయునం
దను నవపుష్పమాలిక నుదంచితకాంచనకుండలంబులం
గనకమయాంగదంబులఁ దగంగ నలంకృతుఁ జేసి రత్తఱిన్. 4

చ. అనుపమవిక్రమక్రమసమగ్రభుజార్గళుఁడైన వాయునం
దనుఁడు నిజాప్తవానరులుఁ దానును నెక్కె మరుత్సురాంగనా
జనకృతసంగశృంగచయసంగతతారకసూర్యచంద్రముఁ
[1]ఘనవనమంద్రముఁ సుజనగమ్యనగేంద్రము నమ్మహేంద్రమున్. 5

వ. ఇవ్విధంబున నెక్కి బహుఫలకిసలయకుసుమవిలసితలతాతరువిసరభాసురంబును ఘోరతరరవశరభసైరిభభైరవకంఠీరవచండమదోద్దండవేదండపుండరీకభల్లూకవిపులవిషాభీలకాలవ్యాళకోలస్థూలగోలాంగూలప్రముఖప్రాణికులంబును గాక ఘూకానేకపక్షికులవ్యాకులంబును నభ్రంకషోత్తుంగశృంగంబును సురాసురయ

1 ఘనవరరుంద్రముఁ.

క్షగంధర్వసిద్ధవిద్యాధరసేవితంబును గనత్కనకమణిసానుసంతానభాసమానం
బును నానావర్ణద్యుతిరాజివిరాజితంబును నానాసత్త్వమందిరకందరంబును
గామరూపాభిరామంబును మహౌషధీదీపప్రదీపితంబును నగు నన్నగోపరిభా
గంబున. 6

క. మరకతనిర్మలజలభా,సురశాద్వలతలమునందుఁ జూడఁగ నొప్పెం
దరుచరవీరుఁడు గమలా, కరమున విహరించుమత్తకరిచందమునన్. 7

క. మృగపతిపగిదిన్ మృగముల, బెగడం దోలుచు మహీజబృందంబులపై
ఖగముల నెగయం జోపుచు, నగచరవీరుండు ప్రియవిహారము సల్పెన్. 8

క. మారుతసూనుం డక్కజ, మారెడు తేజంబుతోడ నతిధీరుం డై
భూరితరశైలశృంగము,పై రెండవతరణికరణి భాసురుఁ డయ్యెన్. 9

క. విక్రమవిభవము మెఱయఁ ద్రి,విక్రమములు విస్తరించి వెలయంగఁ ద్రిలో
కక్రమణశాలి యైనత్రి,విక్రమదేవుగతిఁ బ్లవగవీరుం డొప్పెన్. 10

వ. ఆసమయంబునం బావనిపాదఘాతంబులం గంఠీరవపాదఘాతంబుల నొఱలుమత్త
ద్విరదంబులకరణి నొఱలుచుం బవనతనయుపదతలహతి శిల లురుల శిఖరం
బులు విఱిగి పడఁ గుప్పించునినిలసుతునిచరణప్రహరణంబుల శిలాంతరాళవి
షంబులు సధూమస్తోమజ్వాలాభీలజ్వలనంబుల నుమియుచు నర్ధవినిస్సృతంబులై
నెగయించుఫణావళులచేత నుద్దీపితనూతనకేతనావృతుండునుంబోలెఁ దేజరిల్లు
చు సమీరకుమారాక్రాంతసకలస్థలనిర్గళితపాండురజలధారలు ముక్తాహారంబు
లుంబోలె నలంకరింప నయ్యద్రి నెఱయ మెఱసె నంత ననతిదూరంబున. 11

శా. భూరిధ్వానభయప్రకారము సదా భూయిష్ఠగంభీరతా
కారం బుత్థితతుంగభంగచయ[1]రంగత్సారడిండీరవి
స్తారం బవ్యయవారిపూర మురుమత్స్యక్రూరనక్రానిలా
హారగ్రాహవిహంగఘోరతరసారావార మేపారుచున్. 12

చ. తొడరి సురాసురుల్ గడఁకతో మును ద్రచ్చి రగస్త్యుఁ డల్గినం
బుడిసిటిలోనఁ బెంపు చెడిపోయితి వారిమహత్త్వ మారయం
గడు నది నాకు నీచదశ గా దని యుండితిఁ గాక క్రోఁతి యే
పడి నను దాఁటు నన్నగతి వారక నింగి చెలంగ మ్రోయుచున్. 13

చ. పరిచితచక్రవాకకుచభారము నుత్పలదృష్టులున్ దళ
త్సరసిరుహాస్యముం బులినచారునితంబముఁ జూచి వార్ధి ని
ర్జరనదిఁ గౌఁగిటం బొదువఁ జాఁచినచేతు లనంగ నూర్ము లం
బరతల మప్పళింపఁ గని పావని చిత్తములోన నిట్లనున్. 14

క. సాగరముపెంపు చూచిన, నేగతిఁ గడవంగఁబాఱ నవ్వాఁడ నేని

1 రంగద్వీచికావిస్ఫుర, త్స్ఫురం.

ట్లాగుణనిధికృప గగనా, భోగంబున కెగసి కడచి § పోయెదఁ బ్రీతిన్. 15

ఉ. ఇంక విచార మేల జవ § మింకక యీజలరాశి దాఁటెదన్
లంకకుఁ బోయెదం గడిమి § లావులు సూపిదరాక్షసావలిం
బొంక మడంచెదన్ జనక § పుత్త్రినిజస్థితిఁ జూచి వచ్చెదం
గింకరధర్మవృత్తి పరి § కింపఁగ వంచన కీర్తిహేతువే. 16

చ. పొరిఁబొరి లంకలో వెదకి § భూసుతిఁ గాంచెదఁ గాన కుండినం
గర మమరావతిన్ వెదకి § కాంచెద నందును గానకున్న ని
ర్జరరిపుఁ బట్టి కట్టి పెలు § చం గొనివచ్చెద నొండె వానితో
నురవడి లంక వే పెఱికి § యుద్ధతిఁ దెచ్చెద రామునొద్దకున్. 17

క. జానకి వెదకెద నని యూ, భూనాయకు నెదుర భాను § పుత్త్రుం డలరన్
వానరవీరులు మెచ్చఁగఁ, బూనితి నే రిత్త మగిడి § పోయిన నగరే. 18

వ. అనుచు మహోత్సాహంబున. 19

క. ఇనపవనశక్రచతురా, ననసాగరములకు వంద § నము చేసి మనం
బున రామలక్ష్మణులకున్, వినయంబున మ్రొక్కి బంధు § వితతిం బ్రీతిన్. 20

క. వలగొని యాలింగనముల, నలరించుచు వారిచేత § నాశీర్వాదం
బులు గైకొనుచును జలనిధి, బలువిడి లంఘింపఁ బూని § ప్రాఙ్ముఖుఁ డగుచున్.

మ. నరిపాదంబులు పొందుగా నిలిపి దో § స్స్తంభంబు లంకించి ని
ర్భరదర్పంబునఁ బొంగి యున్నమితశుం § భద్వాల మభ్రంకష
స్ఫురణోగ్రంబుగ లంకదిక్కు గనుఁగొం § చుం గ్రోధరక్తాస్యుఁ డై
గిరి గ్రుంగంబడఁ దాఁచి దాఁటెఁ జటుల § క్రీడాగతిన్ మింటికిన్. 22

క. అగచరుఁ డరిగెడుజవమున, గగనాపగదాఁక నెగసి § క్రమ్మఱి వచ్చెన్
మొగిఁ దరులు గిరులు దూరా, ధ్వగుఁ డగుప్రియు ననిచి మగిడి § వచ్చినభంగిన్.

క. ఆలోఁ గెలఁకుల లఘుతర, తూలికల తెఱంగు దోఁపఁ § దోడన జలముల్
జ్వాలికలు దెరలి చన ను, త్తాలగతిన్ నింగిఁ బవన § తనయుం డరుగన్. 24

—✿ సముద్రము దాఁటుహనుమంతునకు మైనాకం బెదురగుట. ✿—

వ. జలనిధి తనచే రక్షితం బైనమైనాకంబుఁ గనుంగొని. 25

చ. అడవిఁ జరింప రాక్షసవ § ధార్థము వచ్చినరాముపంపునం
గడఁగి మహీసుతన్ వెదకఁ § గా నిదె పావని వోవుచున్నవాఁ
డుష్టగణవీథి లంకవల § నొక్కఁడు నొక్కనిమేష మాత్రమం
బుడుగ హిరణ్యనాభ తగ § నూఁకువ గ మ్మని నెమ్మిఁ బల్కినన్. 26

క. పారావారముపంపున, మారుతి కొక్కింత వడవు § మైనాకం బా
ధారం బగుతలఁపున జల, పూరము కడ లడర వెడలి § పొడవుగ నెగయున్.

ఉ. వీఁడొకరక్కసుం డెదురు § వేచి వియత్తలవీథి నడ్డము

న్వాఁడు మదాతిరేకమున § నా కవరోధము సేయ వేఁడి య
వ్వాఁడిమి మొక్కవుత్తు నని § వక్షమునం బఱతెంచి తాఁకినన్
వేఁడిమి విస్ఫులింగములు § వెల్వడఁగా ధరణీధరేంద్రమున్. 28

క. కడిమిం దాఁకినయురవడిఁ, బిఱుగడిచినభంగి యైన § బిమ్మిటితోడన్
సుడివడుచు నుండి కొండొక,డడవునకుం దెలిసి నిలిచి § తాలిమికలిమిన్. 29

శా. ఆకాశంబున నొక్కదివ్యపురుషుం § డై యాత్మశృంగస్థలిన్
వే కానంబడి పల్కెఁ బేరెలుఁగునన్ § వీరోత్తమా యేను మై
నాకంబం బ్రియబంధుకృత్యమునకు § న్వారాశి పుత్తేరఁగా
నీ కడ్డంబిటు లైతిఁ గాక కలరే § నీ కడ్డ మెవ్వారులున్. 30

క. సగరుం డినకులదీపకుఁ, డగురామునితాత యనఁగ § నవనిఁ బ్రసిద్ధుం
డు గుణాంబుధి యంబుధి యా, జగతీపతిపేరఁ గాదె § సాగర మయ్యెన్. 31

చ. అదియును గాక లోకహితుఁ § డై యుదయించినరామచంద్రుపం
పిది శతయోజనం బుదధి § యిక్కడఁ గావున నీవు నాపయిం
బదయుగళంబు మోపి పరి § పక్వఫలాదులఁ దృప్తిఁ బొంది నె
మ్మదిఁ జను పూజనీయుఁడవు § మారుతనందన యెన్నిభంగులన్. 32

క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెదఁ గృతయుగాది § నెఱకలతోడం
బఱతెంచి జనపదంబులు, నఱుముగఁ బడుచుండు నెల్ల § నగములు ధరణిన్. 33

ఆ. అది యెఱింగి యింద్రుఁ § డలుకఁ గొండలఱెక్క, లశనిధారఁ దునుమ § నప్పుడేను
భీతిఁ గలఁగి పాఱ § మీఁతండ్రి పవనుండు, జవముతోడ నన్ను § జలధిఁ జేర్చె.

క. జలధియు నోడకు మని నను, నెలమిం దనలోన దాఁచె § నే నది మొదలా
జలధికిఁ బ్రియమై యుందుదు, జలధి శరణ్యుండు వృక్ష § చరవర నాకున్. 35

చ. అనవుడు నంజనాతనయుఁ § డగ్గిరిపుంగవుఁ జూచి నాకుఁ బెం
పొనరఁగ నీ వొనర్చుసమ § యోచితకృత్యము వచ్చెఁ జూచితే
వనరుహబంధుమండలము § వాఁడిమి పొన్పడఁ జొచ్చెఁ బ్రొద్దు లే
దనిమిషవైరివీటికి ర § యంబున నేఁగుట కార్య మారయన్. 36

క. ఈమకరాలయ మిట నూ,తామడ కై దీని కేఁటి § కలయఁగ నద్రి
గ్రామణి యారాజన్యశి,ఖామణిపని కై చనంగఁ § గాంచితి ననుచున్. 37

క. వానరవీరుం డగ్గిరి, పై నటు గే లూఁది గగన § భాగంబునకున్
వే నెగసి చనియె నటఁ జనఁ, గా నిట కిందుండు వచ్చి § గారవ మారన్. 38

క. గిరివర రఘుపతిదూతకుఁ, బరమాప్తుఁడ వగుట నాకు § బంధుఁడ వింకన్
ధర కనురాగం బొనఁగుచు, నురుపక్షద్వయముతోడ § నుండుము నెమ్మిన్. 39

క. అని పల్కి పాకశాసనుఁ, డనిమిషనగరమున కరుగ § నమరప్రభృతుల్
చని సురసాఖ్యం బన్నగ, జననిం గని యిట్టు లనిరి § సమ్మద మారన్. 40

మ. కడుఁ దెంపార సమీరసూనుఁడు మహోగ్రగ్రాహసంచార మై
నడుమన్ వారిధి యుండఁగా నరుగు చున్నాఁ డభ్రమార్గంబునం
గడఁకన్ లంకకు జానకిన్ వెదక నింకం గార్య మెట్లౌనొ యి
క్కడ నివ్వీరవరేణ్యుఁ డొక్కరుఁడు పెక్కం డ్రక్కడన్ రక్కసుల్. 41
తే. అని విచారించి సుర లెల్ల ననిలసుతుఁడు
సాఁగి యిదె వచ్చె నితఁడు దుర్జయుఁడొ కాఁడొ
నీవు నని వేగ మవ్వీరు లావుకొలఁది
యరయఁ దగు నన్న నగుఁ గాక యనుచు సురస. 42

—❖ సురసాసింహికలనిరాకరణము. ❖—

ఉ. దారుణ మైనమే సమరఁ దా నొకరక్కసి యై చెలంగుచున్
మారుతవీథి నంబునిధిమధ్యమునం బఱతెంచి పల్కె నో
రోరి వెడంగువానర మదోద్ధతి నెక్కడఁ బోయె దింక నా
హారము గమ్ము నా కని గుహాసదృశం బగునోరు విచ్చినన్. 43
క. ఆరక్కసిఘోరాకృతి, మారుతతనయుండు సూచి మానిని వినుమే
నారాముబంట రావణుఁ, డారఘువరుదేవి దండకారణ్యమునన్. 44
క. మాయం జెఱగొని పోయెం, బోయినయాచొప్పు వెదకఁ బోయెద నాభూ
నాయకుసతిఁ గని వచ్చెద, నీయాఁకలి దీర్చికొనుము నెఱి నటమీఁదన్. 45
ఉ. అట్టనుమాటకుం గెరలి యారజనీచరి భీకరాకృతిన్
నెట్టన దృష్టిజాలముల నిప్పులు రాల మహాట్టహాసనం
ఘట్టన నాకసం బద్రువఁగా వివృతానన యయ్యె నైన నే
నెట్టును జిక్క దీని కిటు లేటికి సంకిలి నాకు నిక్కడన్. 46
మ. అని యూహించుసమీరపుత్త్రుని రయం బారన్ భుజంగాంబ గ్ర
మ్మన మ్రింగన్ దశయోజనాయతముగా నాస్యంబు వే పెంచినం
గని తానున్ దశయోజనాయతమహాకాయుండు గా నింత న
న్గాని తా వింశతియోజనాయతముగాఁ గ్రూరాస్యమున్ విచ్చినన్. 47
సీ. అతఁడు త్రింశద్యోజనాయతతనుఁడు గా, సురగాంబ నలువదియోజనముల
యంతనోరెత్తిన నాతఁ డేఁబదియోజ, నములంతవాఁ డైన నాగజనని
వెస షష్టియోజనవివృతాస్య గాఁగ నా, నరుఁడు డెబ్బదియోజనములయంత
ఘనుఁ డైన సురసాఖ్య యెనుబదియోజన, ములయంత వివృతాస్యబిలముఁ జెంప
మారుతి నవతియోజనమానుఁ డగుచు
సమర నాకాంత శతయోజనములయంత
వివృతవక్త్రంబు సూప నవ్వీరవరుఁడు
మఱి పయోదముగతి మేను కుఱుచపఱిచి. 48

తే. చిత్రతరభంగి నంగుష్ఠ । మాత్రుఁ డగుచు
దానిజఠరాంతరము సొచ్చి । తాన మరలి
వదనమార్గంబు వెలువడి । వచ్చి నగుచు
నోనిశాటి నీయాఁకలి । యుడిగెనోటు. 49

చ. అరుగుట సెప్పి రాకతల । నాఁకలి దీర్చెద నన్నఁ జాల వే
గిరపడుచున్కి నీయుదర । గేహము సొచ్చితిఁ జక్క వచ్చితిన్
నరపతికార్య మేఁగెద న । నం దనరూపముతోడ నిల్చి యా
సురసయు నిట్లనుం బవన । సూనుఁ గనుంగొని సమ్మదంబునన్. 50

క. అతిబలులు నిశాచరు లని, హితమతి నీలావు సూడ । నేఁ గపివర వ
చ్చితి దివిజులపంపున నూ, ర్జితశక్తివి గాన నీకు । సేమం బెందున్. 51

ఆ. అనుచు సురగజనని । తనలోకమున కేఁగె, నంత నింగి వెలుఁగ । ననిలసుతుఁడు
రఘుకులేంద్రుఁ డలిగి । రాక్షసపురముపైఁ, బఱపుచిచ్చుటమ్ము । పగిది నిగిడె.

క. ఘనవీథిం జనుహనుమం, తునికాయచ్ఛాయ చూడ । దోఁచెను దశయో
జనవృత్తముఁ ద్రింశద్యో, జనదీర్ఘము నగుచుఁ జాఁగి । జలనిధినడుమన్. 53

శా. ఛాయాగ్రాహిణి యైనసింహిక మహా । సంరంభ మేపారఁగా
వాయూత్థప్రతిగోగ్రఘట్టనపటు । ధ్వానంబు దుర్వార మై
మ్రోయం దుంగతరంగభంగ మగున । మ్మున్నీటిపెన్నీటిపైఁ
గాయచ్ఛాయ ననంగఁ జూచి చులుకం । గట్టల్క దీపింపఁగన్. 54

క. ఉడువీథి కెగసి యార్చుచు, నొడిసి వడిం బట్టి మ్రింగ । నురవడి నతఁడుం
గడుపు విదళించి నెత్తుటఁ, గడిసినమే నొప్ప వెడలెఁ । దరుణార్కగతిన్. 55

క. జలజహితుఁ డప్పు డస్తా, చలమునకుం జనఁగ వృక్ష । చరవీరుఁడు నా
జలనిధి గడచి సువేలా, చలమునకుం జనియె నధిక । జవసత్త్వములన్. 56

వ. ఇట్లు శతయోజనాయతం బగువారాశి ననాయాసంబున దాఁటి యన్నగోపరి
తలంబున నిలువంబడు నెడ. 57

క. తరుచరవీరునిపదహతి, నురవడి గిరి గదలఁ దరువు । లూఁగఁగఁ బుష్పో
త్కరములు రాలెన్ ఖచరులు, గుగుతరమతిఁ బుష్పవృష్టి । గురిసినభంగిన్.

—❖ హనుమానుఁడు లంకం బ్రవేశించుట. ❖—

వ. అంత నయ్యద్రిప్రాంతంబునం గొంత విశ్రమించి సమీరనందనుండు గట్టెదుర.

ఉ. సాలకదంబనింబకుట । జవ్రజకింశుకనారికేళత
క్కోలజటాజటాలవట । కుంజవిశాలరసాలతాలహిం
తాలతమాలకోలదళ । దాడిమమంజులవంజులార్జునో
త్తాలమధూకతిందుకవి । తానవికాసితకాననంబులన్. 60

క. వికసితనుతకేతకిచం, పకతిలకక్రముకపారి । భద్రకకరవీ

రకరంజకురంటకకురవకవకుళకపిత్థబిల్వవనవాటికలన్. 61

మ. దళదిందీవరకైరవోత్కరలసత్కల్హారబంధూకని
ర్మలరాజీవముఖప్రసూనరసధారాస్ఫారకల్లోలచం
చలలోలాంతరకేళిలోలకలహంసక్రౌంచచక్రవ్రజా
కులకారండవభృంగభాసురసరిత్కూలంబులం జూచుచున్. 62

మ. పరిఘాభీలము వప్రదుర్గము ఘనప్రాకారఘోరంబు గో
పురనానాద్భుతయంత్రభీకరము సంపూర్ణాస్త్రశస్త్రధ్వజ
స్ఫురదట్టాలకజాలభీషణము రక్షోవీరదుస్సాధముం
దురగస్యందనమత్తసింధురభటస్తోమాతిభూయిష్ఠమున్. 63

వ. అయి నెఱయ మెఱయుచు మఱియును గగనోల్లేఖరజతశిఖరిశిఖరంబునుంబోలె నభ్రంకషంబై తనరుచుఁ గ్రూరోరగసంకీర్ణం బగుభోగవతీపురంబునుంబోలె దంష్ట్రాకరాళముఖులు నాభీలశూలపట్టిసహస్తులు నైన రక్షోవీరులచేత వెలుంగుచు నానాధనవిరాజితం బై యలకాపురంబునుంబోలె వెలయుచున్నలంకాపురంబు గనుంగొని యరుగందుచు నుత్తరద్వారంబు సేరి. 64

తే. అరసి చూడ సురాసురదురధిగమము, చతురుపాయప్రయోగదుస్సాధతరము
గాన కపులెంతవార లిక్కడిఁదిపురము, సేరియారాఘవుఁడు నేమిసేయఁగలఁడు.

క. రావణుఁడు లోకభయదుఁడు, గావున వాఁ డెఱుఁగకుండఁ గనుమొఱఁగి పురం
బేవిధిఁ జొచ్చెదనో మఱి, యే విధమున నేను సీత నీక్షించెదనో. 66

క. జనకజ నేకాంతంబునఁ, గనుఁగొని యెద నేన యొరులు గానకయుండం
దనుమధ్యకలిమి యెట్లొకో, చని చూచెదఁ గాక యిచట సందియ మేలా.

క. రక్కసులు వెక్కసంబుగ, దిక్కుల నన్నింటఁ గడిమిఁ ద్రిమ్మరుదురు న
న్నిక్కడఁ గనుఁగొనఁ గార్యము, చిక్కును నా కిచట నింత చెల్లదు నిలువన్.

తే. ఏను యాతుధానుఁడ నైన నితరజనుఁడ, నైన నెఱిఁగి నివారింతురపుడ నన్ను
గాలికైన రక్కసులకుఁ గానఁబడక, సురిఁగి యీపురద్వారముఁ జొరఁగరాదు.

వ. అనుచు నొక్కముహూర్తమాత్రంబు చింతించి ధీమంతుం డగుహనుమంతుండు తనయద్భుతప్రకారం బగునాకారం బవలోకించి. 70

ఉ. ఈయురుమూర్తితోడఁ బుర మేను జొరన్ వెఱఁగంది చూచుచుం
బోయి నిశాటులాగ్రహము పుట్టఁగ రావణుతోడఁ జెప్ప వాఁ
డాయతశక్తి నన్ను నిట సంకిలివెట్టిన నప్పు రామభూ
నాయకునాజ్ఞ గైకొనిననాపని చెల్లక గాలిపోవదే. 71

ఉ. కావున రామచంద్రుపని గైకొని చేయఁగ నేభయంబు నా
కేవిధి గాకయుండ నను నెవ్వరుఁ గానక యుండ నాత్మర
తోవిధ మొప్ప సూక్ష్మతరగాత్రము దాలిచి రాత్రివేళ లం

కావరణంబు సొచ్చి కడంకన్ సతి నంతటఁ జూచి కాంచెదన్. 72

వ. అనుచు సూర్యాస్తమయసమయం బవలోకించు నెడ. 73

క. నా కెంతయుఁ బ్రియశిష్యుం, డీకపివరుఁ డితనిపనికి నెడ గా కుండం
బోక యుచిత మనుకరణి వి, భాకరుఁ డపు డపరశిఖరిపై కరుగుటయున్. 74

క. భానుఁడు నాపగవాఁ డా, భానుకులునిసతిని వెదకఁ బని వచ్చిన ని
న్నే నేల మహిసుతం బొడ, గానఁగ నిత్తు ననుకరణి ఘనతమ మడరన్. 75

వ. కనుంగొని యమ్మహీధరసన్నిభం బగుతనగాత్రంబు సంకోచించి యణుమాత్ర దేహుం డగుచుఁ దత్పురగోపురప్రాసాదాధిరోహణంబు సేసి సమంచితకాంచన ప్రాకారంబులు నీలప్రవాళముక్తాఫలవైదూర్యరజతకనత్కనకశోభితంబు లగు గృహంబులుం గలలంకాపురంబు గలయం గనుంగొనుచు నమ్ముందట రుచిరవైదూర్యవజ్రోపలతలంబులు నిర్మలస్ఫటికపద్మరాగాంతరసికతాపూరంబులు ముక్తామణిదామాభిరామంబు లైనహాటకస్తంభంబులు మణిప్రభాభాసమానజాంబూనదసమున్నతవేదికలు నానారత్నసోపానసంతానంబుల భర్మనిర్మితసాలభంజికలు నింద్రచాపానురూపవివిధమణివిచిత్రచిత్రితతోరణంబులుఁ జారుచామీకరమండితనూతనకేతనంబులు నుద్దామాభిరామక్రీడాద్రిహేమశృంగంబులు నభినవరత్నఖచితసువర్ణపూర్ణానల్పశిల్పాభిశోభితద్వారంబులు వీరభటవారణతురగస్యందనసంచారరణన్మణిగణకింకిణీశింజితమంజుమంజీరాదిభూషణఘోషణంబులు నిరంతరావార్యతూర్యఘోషంబులు నాసన్నజలధిప్రతిఘోషంబులుం గలిగి హంసక్రౌంచమయూరపారావతసేవితంబులు సాంద్రచంద్రికాధౌతమయంబులుఁ బ్రచురలసదిందిరంబులు నగుశుభమందిరంబులుం గలిగి విచిత్రమాణిక్యమయవప్రయు గోష్ఠాగారావతంసయు శాతకుంభకుంభస్తనయును రత్నదీపికానిరస్తసదనాంధకారయు నగుచు విలాసినియునుంబోలె వెలయుచున్నరావణునగరంబు గనుంగొని విస్మితాంతరంగుండును సీతాదర్శనోత్సుకుండు నగుచు నాసౌధంబు డిగ్గ 76

—హనుమంతుండు లంక యనునిశాటిని నిగ్రహించుట.—

క. అటు చూచి డిగ్గి తగ ముం, దటఁ జనునెడ లంక పవనతనయునిఁ గని యు
త్కటపటునిటలతటోగ్ర, త్కుటిలతరభ్రుకుటివికటఘోరాకృతి యై. 77

ఉ. ఎక్కడిమర్కటాధముఁడ వెవ్వఁడ వేటికి నోట లేక నీ
వెక్కడ వచ్చినాఁడవు సురేంద్రభయంకరుఁ డైనరావణుం
డెక్కుడుచేవ నేలుపుర మేరికిఁ జేరఁగ వచ్చు నిమ్మెయిన్
నిక్కము చెప్పు మే నెఱుఁగ నీతెఱఁ గంతయు విన్నమీఁదటన్. 78

శా. కింకన్ నిన్ను వధించి పుచ్చెద ననం గీశప్రభుం డప్పు డా
లంకన్ నీవు నిశాటి వేమి ధృతి నేలా నన్ను భర్జించె దా

తంకం బొందక యున్నదానవు పురద్వారంబునం దింక ని
శ్శంకఁ బొంకక చెప్పు మన్న నది యాసామీరితో నిట్లనున్. 79

క. లంక యనుపేరఁ బరఁగుదు, లంకాపురచోరవర్తిలం గడతేర్తున్
లంకాపతియానతి నీ,లంకాపురిఁ గాతు నేను లంకామూర్తిన్. 80

వ. ఇంక నీవు వచ్చినపని యెఱింగింపు మనిన నతం డిట్లనియె. 81

క. ఈపురిఁ గలగృహతోరణ,గోపురఘనసాలసౌధకూటప్రాసా
దాపణవనోపవనజన,వాపీకూపములు చూడ వచ్చితి వేడ్కన్. 82

చ. అనవుడు నన్నిశాచరి భయంకరహుంకృతితోడ నార్చి యి
ట్లనియె వెడంగువానర రయంబున నక్కడి కేల పోయె దే
పున నిట నన్ను మీఱి మఱి పోదలె నావుడుఁ బోయి వచ్చి నీ
పని మఱి చక్కఁజేసెద నెపంబు సహింపుము వేగ మేటికిన్. 83

క. అని యతఁడు వలుకఁ బరుష,ధ్వని నాతినియురము హస్తతలమున వ్రేయం
గనలి నిశాచరికే లు,క్కునఁ గమియఁగఁ బట్టి భీతి గొనఁ దిగిచి వడిన్. 84

క. పిడుగుగతిఁ బెడిదం బగు,పిడికిట వక్షంబుఁ బొడువ బిమ్మిటితోడం
బుడమిఁ బడి నోరు దెఱవఁగఁ, గడ తేర్పఁడు దానిఁ గరుణఁ గామినియనుచున్.

సీ. అంత గద్గదికతో నాలంక హనుమంతుఁ, గనుఁగొని నను గావు కపివరేణ్య
వినుము చెప్పెద మున్ను విన్నవృత్తాంతంబు, వనచరుఁడొక్కఁడు జనకతనయ
వెదక నెప్పుడు వచ్చి వే నిన్ను భంజించు, నది యాదిగా లంక యడఁగఁ గలదు
రావణుండును సర్వరాక్షసోపేతుఁ డై, సీతనిమిత్తంబు చేటు నొందు
ననుచు నజుఁడు నాతోఁ జెప్పె నమ్మహాత్ము,పలుకమోఘంబుగావునఁ బలికినట్ల
యగు సమస్తంబు నీవింక నతులబలుఁడ, వెందు వలసిన నేఁగు నీకెదురు గలదె.

వ. అనిన విని యంత నాలంక నతిక్రమించి హనుమంతుండు తద్ద్వారంబు సొరక లంకాప్రాకారంబు దాఁటి మాతంగమదసౌరభవాసితంబును బుష్పమౌక్తికవిరాజితంబును వివిధసౌధాభిశోభితంబును నానాగృహవిలసితంబును నగురాజమార్గంబున మంజులమంజీరసమంచితకాంచీనినాదంబులుఁ బంచమహాశబ్దంబులును మదభరాలస లైనసుదతులమధురగీతంబులును రక్కసులయట్టహాససింహానాదాదినాదంబులును వినుచు నెడనెడ గృహంబులు గలయఁగనుంగొనుచు మంతనంబు లాడువారివలను సేరి యరయుచు రావణస్తుతిపరాయణు లగురక్షోవీరుల నాలోకించుచు వచ్చి మధ్యమగుల్మంబున జటిలకేశులు నజినాంబరధారులు స్వాధ్యాయనిరతులు నైనవారలం బరికించుచు మాల్యభూషితుల నేకకర్ణుల నేకాక్షుల నేకపాదుల నేకహస్తుల లంబోదరపయోధరులం గరాళుల భుగ్నవక్త్రుల వికటుల నుత్కటుల విక్రుతోరఃస్కంధశిరస్కుల నతికుబ్జుల నతిదీర్ఘుల నతిస్థూలుల నతికృశుల విరూపుల సురూపులఁ బరిఘపట్టిసపరశుప్రా

సాసిదండభిండివాలతోమరశూలచక్రగదాముసలముద్గరచాపబాణఖడ్గశతఘ్నీ
హస్తులను జిత్రవర్మధారులను జూచుచు నర్కసంకాశహేమప్రాకారంబును బద్మ
కైరవకల్హారాదిపుష్పవిలసితపరిఖావలయితంబును నగునగరంబు వీక్షించుచు
హేషాఘోషంబుల బృంహితస్వనంబులఁ గలధౌతనగోన్నతచతుర్దంతదంతా
వళంబులఁ జాగుతురంగంబుల గజదానధారాపంకిలప్రదేశంబుల వీరభటసంకు
లాలాపంబుల సేవాగతాంగనాశింజితంబుల ద్వారపాలకు లదలించుచండహుం
కృతులఁ జెలఁగురావణునగరద్వారంబుఁ జేరునట్టియెడ. 87

క. చేకొని చూడఁగ నొప్పెం, బ్రాకటముగ లంకమీఁద బహుతారాపూ
ర్ణాకాశం బెత్తినము, క్తాకీలితనీలపటవితానముభంగిన్. 88

క. పావనికి సీత వెదకం, గా విశ్వము గానిపింప ఘనతమ మడఁపన్
దేవత లెత్తినదీపము, కైవడిఁ జందురుఁడు వెలిఁగె గగనతలమునన్. 89

వ. ఇట్లు వెలుంగుచందురుం గనుంగొని హనుమంతుం డలరి యానగరద్వారంబు
సొచ్చి యరయుచుం జని ముందట. 90

—హనుమంతుండు లంకాపురంబున సీతను వెదకుట.—

సీ. వరవజ్రగర్భితవైదూర్యతలముల, భాసురస్ఫటికసోపానరాజి
మణిహారచారుహేమస్తంభపంక్తులఁ, జిత్రకాంచనరత్నశిఖరవితతి
విలసితనవరత్నవేదిరంగంబుల, ద్వారచిత్రితరత్నతోరణముల
మహితముక్తాదామమయవితానంబుల, బహుచిత్రశోభితభద్రవలభిఁ
దనరి వీరరాక్షసరక్షితంబు వార,యువతిసేవితమును మంత్రియుతము వివిధ
చిత్రమృగచర్మవర్మరాజితము నగుచు, వెలయునాస్థానసదనంబు గలయ వెదకి.

చ. పరువడి నాపణంబులఁ బ్రభామయభూముల మండపంబులన్
ద్విరదరథాశ్వసద్మముల వీథుల రచ్చల వేశపంక్తులన్
గిరికటకంబులన్ గుహలఁ గేళిగృహంబుల గుళ్ల వప్రగో
పురముల హర్మ్యసౌధముల భూసురశాలలఁ జిత్రశాలలన్. 92

క. నారులసదనంబుల నధి,కారులగేహముల యక్షగరుడోరగబృం
దారకకిన్నరనారీ,కారాగారోపకారికాభవనములన్. 93

వ. మఱియుం గుంభకర్ణవిభీషణమహోదరమహాపార్శ్వప్రహస్తవిద్యుజ్జిహ్వవిద్యు
త్కర్ణవిద్యున్మాలిజంబుమాలిసుమాలిశుకసారణవజ్రదంష్ట్రవజ్రగ్రీవవజ్రకాయ
కటవికటఘనప్రఘనహస్తిముఖనాగేంద్రజిహ్వాకరాళవిశాలాంత్రాగ్నికేతురశ్మి
కేతుసూర్యశత్రుసంపాతివిరూపాక్షధూమ్రాక్షభీమాక్షశోణితాక్షాష్టమత్తకమ
త్తోన్మత్తకుంభనికుంభదేవాంతకనరాంతకాతికాయమహాకాయకంపనాకంపనమ
కరాక్షమేఘనాదాక్షాగ్నివర్ణత్రిశిరఃప్రముఖయాతుధానగృహంబుల లీలోద్యా
నంబుల వెదకి యచటం గానక చనిచని పురోభాగంబున నయనాభిరామం బగు

నొక్క మహాహేమధామంబుఁ బొడగని చొచ్చి యచ్చట నొగు లొరులం గౌఁగి లించుకొని తమతమవదనంబులు నుదరంబు లూరులు నారులు నాభిమూలంబులుం గక్షమూలంబులుఁ జన్నులు వెన్నులు బయల్పడం గనువులు మఱచి నిద్రించువనితాజనంబుల నవలోకించి పరదారమర్మనిరీక్షణభయంబునం గలంగి.

ఉ. అక్కట బ్రహ్మచారి నిటు • లన్యపురంధ్రులగాత్రమర్మముల్
దక్కక చూచితిం గదిసి • ధర్మవిహీనుఁడ నైతి నాకు నిం
కెక్కడిపుణ్యలోక మని • యెంతయుఁ జింతిలి యాత్మలోపలన్
నిక్కముగాఁగ ధర్మపథ • నిర్ణయనిర్మలబుద్ధి దోఁచినన్. 95

క. మన సేమిటిపైఁ దగులమిఁ, దనరం గామించునట్లు • తగ మేలును గీ
డును నగు నేనీయింతుల, మనమునఁ గామించి చూడ • మన్మథవశతన్. 96

క. సుదతిని సుదతులలోపల, వెదకక మృగకులములోన • వెదకుదురే యీ
సదనంబులలో నృపసుతి, వెదకక యొండెడల నాకు • వెదకఁగ నగునే. 97

వ. అట్లు గాన నే నిక్కాంతల మదనవికృతమానసుండ నై చూడ నింతియ కాదు పుణ్యశ్లోకుం డగురామునిపంపున వచ్చిననాకు నెందును శుభంబె యగు నని యచట నచట వెదకుచు నగ్రభాగంబున నొక్కదివ్యవిమానంబు పొడగని. 98

తే. వెలయ నేవిమానంబు దా • విశ్వకర్మ, యర్ధయోజనవృత్తంబు • సార్ధయోజ
నాయతము గాఁగ నజునకు • యమకుబేర, వరుణమందిరములకంటె • వఱలఁ జేసె.

క. వారిజగర్భునకుం దప, మారఁగఁ గావించి కాంచె • యక్షేశుఁడు దు
ర్వారగతి నతని గెలిచియు, దారుఁడు రావణుఁడు గొనియెఁ • దత్పుష్పకమున్.

ఉ. ఉగ్రతరధర్మనిర్మితము • నుజ్జ్వలరత్నమయంబుఁ బ్రస్ఫుట
స్మరణసమాగతంబు గృహ • మధ్యగృహప్రకరంబు లోకసుం
దరమును విశ్వకర్మరచి • తంబును బుష్పసుగంధిదీపస
త్పరిమళితంబుఁ గామగమ • భద్రవితానవిమానరాజమున్. 101

సీ. వరవజ్రవైదూర్య • మరకతవేదియుఁ, జారుమౌక్తికనీల • జాలకంబుఁ
దపనీయమణిమయ • స్తంభవిభ్రమమును, బహుమణిస్ఫటికసో • పానయుతము
మాణిక్యకుట్టిమ • మహితకుడ్యంబును, జిత్రకాంచనరత్న • పుత్త్రికంబుఁ
గ్రథితవజ్రోపల • ప్రాకారరుచిరంబు, భానునిభప్రభా • భాసురంబు
మేరుమందరసదృశంబు • మేఘమార్గ, చరము నగునవ్విమానంబు • నరగ నెక్కి
యందు వేవురు కాంతల • నారఁ గాంచె, నధికనిద్రాపరాయణ • లైనవారి. 102

అక్కాంతలు మధుపానమదవ్యాయామంబుల నలసి నిద్రాపరవశ లై కొందఱు తిలకంబులు దుడిచియుఁ గొంద అందియ లూడిచియుఁ గొందఱు వలువలు విడిచియుఁ గొందఱు పుష్పమాలికలు దలం జుట్టుకొనియుఁ గొందఱు కెలంకుల హారంబులు వ్రాలం గొందఱు మేఖలలు మెలికలువడం గొందఱు పర

స్వరావయవంబు లాలింగనంబు సేసి పతుల కా నలరుచుం గొందఱు భూషణం బు లూడి నెఱయఁ గొందఱు తమతమవదనంబులు కమలంబు లని తావులకుం దేంట్లు ముసర వివృతవదనలు నిమీలితనయనలు వికీర్ణకేశపాశలు నగుచు మఱియును. 103

చ. అలఘునితంబసైకతచయంబుల నాభిసరోవరంబులన్
విలసదురోజచక్రముల వేణిభరాళులఁ జారులోచనో
త్పలముల భ్రూతరంగముల బాహుబిసంబుల వక్త్రపంకజం
బులఁ దగి సుప్తవాహినులపోల్కిన నొప్పెడువారిఁ జూచుచున్. 104

వ. చని కాంచనచతుస్స్తంభదీపంబులు శశికిరీటమణిదీపంబులు వెలుంగ దుకూలాస్తరణశోభితతల్పంబు కైలాసకల్పం బగుచు నమరం గనుంగొని యరుదందుచుఁ జప్పుడు కాకుండ నల్లనల్లనఁ జేర నరిగి. 105

సీ. కనకాంబరము తటిత్కల్పమై విలసిల్ల, మేచకాభ్రముభంగి మేను మెఱయ
రమణీయతరలిప్తరక్తచందనచర్చ, కలితసంధ్యారాగకాంతిఁ దనర
భ్రుకుటిరేఖాభీలభూరిఫాలము లొప్ప, దంష్ట్రాకరాళాస్యదశక మెసఁగఁ
గుండలమణిరుచుల్ గండభిత్తుల నిండ, మణిముద్రికలు వ్రేళ్ల ఘృణుల నీన
నభ్రగజదంతకులిశవ్రణాంకములను, దనరుబాహుల రత్నాంగదంబు లమర
వారికడ నిద్రవోవురావణునిఁ గాంచె, నమరలోకవిద్రావణుం డనిలసుతుఁడు.

మ. అమరేంద్రధ్వజదిక్కరీంద్రకరపంచాస్యోరగశ్రేణిచం
దమునం జేతులు శయ్యపై నమరఁగాఁ దనొప్పఁ మంథాచలే
ద్రిముభంగిన్ మకరాలిరాజు డగుచున్ నాగేంద్రపూత్కారఘో
రముగా నూర్పులు పుచ్చురావణునిపర్యంకప్రదేశంబునన్. 107

వ. కొందఱు కాంతలు నయనాభిరామంబులుగా విచిత్రగతుల నాడియుఁ గర్ణామృతంబులుగాఁ బాడియు శ్రుతిసుఖంబులుగా వాయించియు నలసి విపంచివీణాదులు మురజమృదంగపణవడిండిమాదులు కౌఁగిలించుకొని పరవశలై యుండ వారలఁ జేర నరిగి. 108

ఉ. మేదురనీలనీరదసమేతతటిల్లతమాడ్కిఁ బంక్తికం
ఠోదితగాత్రసన్నిధిసముజ్జ్వలకాంచనకాంతి నొప్పుమం
దోదరిఁ గాంచి సీత యని యుబ్బుచు నాడుచుఁ గంటి నింక స
మ్మోదము గంటి నంచుఁ గపిముఖ్యుఁడు గ్రమ్మఱఁ జూచి తజ్జ్ఞుఁడై. 109

మ. అరయంగా నిది నిర్మలాంబర సుగంధాకల్పయుక్తాంగి యా
దరణీయానవవాసితాస్య రుచికృత్తాంబూలరాగాంచితా
ధర యుత్ఫుల్లనవప్రసూనవిలసద్ధమ్మిల్ల కేళీకృత

స్మరముద్రాంకితకంఠగాఢసురత § శ్రాంతప్రసుప్తాకృతియున్. 110

క. కాన యిది పంక్తికంఠుని, మానిని గా నోపు నకట § మతిహీనుఁడ నై
యే నొండుగాఁ దలంచితి, భూనాయకుపుణ్యసాధ్విఁ § బూతచరిత్రన్. 111

చ. ధరణిజ పుణ్యసాధ్వి విను § తవ్రత పావని సీత లోకసుం
దరి త్రిదశేంద్రవంద్య గుణ § ధాముని రాముని బాసి యన్యకా
పురుషులశయ్యపై నిదుర § వోవునె పుష్పసుగంధభూషణో
త్కరములు దాల్చునే మధువు § ద్రావునె భోగము లిచ్చగించునే. 112

వ. కాన యిది జానకి గా దనుచు నచ్చోటు వాసి పానశాల కరిగి యందు నొక్కెడ నిర్మలహర్మ్యప్రదేశంబునఁ జందనమృగమదపంకంబులం గలయ నలికి ఘనసార రేణువులు సల్లి వివిధకుసుమవిసరంబులు నెఱపి నలుదిక్కుల ముక్తాఫలంబుల రంగవల్లికలు దీర్చి నడుమ నజమృగవరాహమహిషకుక్కుటమయూరప్రముఖ ప్రాణిపలలంబులు రాసులుగాఁ బోసి పుష్పమాలికాక్షతవేష్టితంబు లైనయిక్షు రసాసవమధ్వాసవపుష్పాసవపూర్ణంబు లగుస్ఫటికమణిమయకలశాతకుంభ కుంభంబులు దిరిగిరా నిడి వాసనాపూర్ణసుగంధకుసుమంబులు నామ్లలవణాది షడ్రసంబులు ఘృతార్ద్రికాదిమిశ్రితంబు లైనమృగసూకరచ్ఛాగమహిషకు క్కుటమయూరామలకఖర్జూరములు నుప్పుఁగండలుఁ బందివాళ్లు నించినకనకరజతస్ఫ టికచషకంబు లెల్లెడల నిలిపి వివిధలేహ్యపేయఖాద్యాదివస్తువుల నానాఫలం బుల మహోపహారంబులు సేసినపానప్రదేశంబులు సూచి వెఱఁగందుచు బహు ప్రకారంబులఁ బానక్రియలు సలిపి మదావేశంబున సొలసి యొండొరులం గౌఁగిలించుకొనియు నితరేతరవస్త్రంబులు పైకిఁ దిగిచికొనియు విగతవసనలై నిద్రించువనితాసహస్రంబులఁ గలయం గనుంగొనుచుఁ గస్తూరికాగంధసార ఘనసారాంగరాగకుసుమవిలసితాసవపరిమళమిళితపవనాఘ్రాణంబు సేసి యరు దందుచు నవ్విమానాధిరాజంబు డిగ్గి యొక్కెడ నిల్చి యంతర్గతంబున. 113

—హనుమంతుఁడు సీత కానరామికిఁ జింతించుట.—

చ. కొలఁకుల నిష్కుటావళులఁ § గుంజతలంబులఁ గేళిమందిరం
బుల నదులం దటాకములఁ § బుష్పగృహంబుల సెజ్జపట్లఁ బ
ల్వలముల భూగృహంబుల బి § లంబుల రచ్చల దుర్గమస్థలం
బుల గిరులన్ వనోపవన § భూముల గొందులఁ బానశాలలన్. 114

క. సొలవక నిలువక మఱియును, గలదిక్కుల నెల్ల లంకఁ § గలగుం డిడి యె
వ్వలనను నెల్లెడ నెడపక, కలయఁగ వెదకితి మహీజఁ § గానన యెచటన్. 115

వ. అని వెండియు. 116

క. సురగరుడోరగరజనీ, చర ఖేచరసిద్ధసాధ్య § చారణవిద్యా
ధరనరకిన్నరయువతూ, సురకాంతలఁ గంటి రాము § సుదతిం గానన్. 117

క. వనధిఁ గని హృదయ మవిసెనొ, తనుఁ గైకొనకున్నఁ గనలి దశకంఠుఁడు మ్రిం
గెనొ వికృతఘోరరాక్షస, జనఘనరూపములు సూచి సమసెనొ భీతిన్.

మ. సతి నా కెక్కడఁ గానరా దలిగి రక్షస్స్త్రీలు భక్షించిరో
పతి భావించుచుఁ బ్రాణముల్ విడిచెనో పౌలస్త్యుచేఁ దప్పి యు
ద్ధతి నంభోనిధిఁ గూలెనో దశముఖోద్యద్బాహుసంపీడనా
న్వితయై స్రగ్గెనొ పంక్తికంఠుఁ డెడగా వేఁ ద్రొందుచో డాఁచెనో. 119

సీ. జానకిఁ బొడగాన కేను బోయినఁ జూచి, మనుజేంద్రుఁ డప్పుడ మరణమొందు
నన్నకు శోకించి యనుజుండు మృతిఁబొందు, వారలిద్దఱు లేనివార్త యెఱిఁగి
భరతశత్రుఘ్నులుఁ బ్రాణముల్ విడుతురు, జనను లద్దశ సూచి చత్తు రోలిఁ
గాకుత్స్థకుల మంతఁగడ తేఱు రాఘవుల్, దెగఁ జూచి రవిజుఁడుఁ దీఱు నతఁడు
దీఱఁ దత్పత్ని రుమ దీఱు దినపసుతుని
వాలిఁ దలఁచి తార నశించు వారి కడలి
యంగదుఁడుఁ జచ్చుఁ గపు లెల్ల నంతఁ బొగిలి
వివిధగతుల జీవంబులు విడువఁ గలరు. 120

ఆ. కాన రాముకులముఁ గపికులంబును గ్రుంప, నేను బోవఁ జాల నెదుర నన్నుఁ
గాంచి గారవమునఁ గంటె జానకి నన్న, వెరవు మాలి రామవిభునితోడ.

క. భూమిజఁ గానన యే నని, భీమానలతప్తసూచిభేదనబాధో
ద్దామం బగుదుర్వాక్యము, లే మని వినిపింతు నెదుటి కే మని పోదున్. 122

క. జానకిఁ బొడగని రాఁ గల, నే నని నా కెదురుచూచు హితవానరసం
తానము నే మని చేరుదు, భానుజుముందటికి నేమిపని యై పోదున్. 123

క. జానకిఁ గానక యుండిన, వానప్రస్థుండ నగుదు వనధిం బడుదుఁ
మేను ఖగావలి కిత్తు మ,హానలముఖశిఖలఁ జొత్తు హతవిధిఁ జత్తున్. 124

క. నిశితబలదర్పితుం డగు,దశముఖు విదళించి రామధరణీశునకుం
బిశితోపహార మిచ్చెదఁ, బశుపతికిం బశువుఁ జంపి బలి యిచ్చుక్రియన్.

క. ముచ్చిలి రఘుభూపతిసతిఁ, దెచ్చినదుర్వృత్తికిం బ్రతీకారముగా
మచ్చటులముష్టిహతుల వి, యచ్చరకంటకుని దర్ప మడఁచి వధింతున్. 126

మ. అటు గా కుర్వి సమస్తముం బెఱికికొం చారాముఁ డీక్షింప నం
తట శోధించెద సీతఁ జూపు మని వేధం బట్టి బాధించెదం
బటురోషమ్మునఁ బాఱ మీఱెద వడిం బ్రహ్మాండముల్ వీఁక నొ
క్కట లంకాదినిశాటకోటి నుదధిం గాలించి [1]కాఱించెదన్. 127

వ. అని యి ట్లనేకప్రకారంబులఁ గలపోసి నా కిపుడు వేగిరపడ నేల జనకరాజనం
దనం గనుంగొనునందాఁక నిశ్శంక నీలంక నుండి వెదకెద ముందట నొక్కయు

1 కూలించెదన్.

ద్దామారామంబు నయనాభిరామం బగుచు నొప్పారెడు నింతకుము న్నావనం బుం బరికింపఁ బవనుండును దదీయప్రాంతంబున నురవడి మెలంగ వెఱచి మెలుపునం బొలయుచున్నవాఁ డందు జనకనందన యుండ నోపుఁ బరికించెదం గాక యనుచు నిశ్చయించి నిర్మలభావంబున. 128

ఉ. వాయుతనూజుఁ డప్పుడు శివాయ రమారమణాయ భారతీం
ద్రాయ సురేశ్వరాయ పవనాయ పయోరుహబాంధవాయ చ
న్ద్రాయ వినాయకాయ శమనాయ సమీరసఖాయ పాశహ
స్తాయ నమో నమో యనుచు దత్తత వారికి మ్రొక్కి వెండియున్. 129

క. వసురుద్రాదిత్యమరు, ద్వసరములకు నశ్వులకును విలసిల్లుదివౌ
కసులకు రఘునందనులకు, వసుధాసుత కినజునకును వరమునితతికిన్. 130

—హనుమంతుఁ డశోకవనంబుఁ బ్రవేశించుట.—

వ. అతినిష్ఠ నభివందనంబులు సేసి మదీయాభిమతంబు సిద్ధింపం జేయుం డని వేఁడుచు నెప్పుడాజగదేకమాత సీతం బొడగాంచెదనో యనుచుం జూపులు తీవులుగొనం జని విశాలసాలచంపకాశోకామ్రవనవేష్టితం బైనతదుపకంఠంబు సేరి కీరమయూరకాకోలూకకోకిలాలికులసంకులకలరవకోలాహలంబు లాకర్ణించుచు ధైర్యం బవలంబించి యస్త్రులు దుడిచికొని యం దుత్తుంగాగారప్రాకారమండలమండితంబును మఱియు శారదనీరదావృతంబును నీలజలదమాలికాపరివేష్టితంబును నై నగతి నవధవళసౌధవలయితంబును దమాలపరివృతంబును నగుచు మెఱయునశోకవనంబు గదిసి గదాహస్తు లగుకాలకింకరక్రూరరాక్షసరక్షితద్వారం బగునాయుపవనంబు సొచ్చి యందు నిద్రాముద్రితాక్షంబు లగుపక్షుల నెగయం జోపి తత్పక్షవిక్షేపణజాతవాతవిధూతవృక్షవ్రాతకీర్ణకుసుమవినరసంకీర్ణం బై పుష్పగిరియుంబోలె మెఱయుచుం దనుం గనుంగొనినభూతంబులు వసంతుం డని సకలదిక్కులం జరియించుచుఁ గంపితతరుపతితకుసుమాలంకృతయై విలాసినియుంబోలె వెలయువసుధ నవలోకించుచు నిజశాఖాలంఘనోత్కంపితపతితఫలకుసుమపలాశంబు లగుమహీరుహంబు లొగులచేత వస్త్రాభరణంబు లొలువంబడినకితవులుంబోలె ఱిచ్చవడి యుండం గనుంగొనుచు మఱియును దనపాదదంతనఖహతులం గంపించి ఫలదళకుసుమంబులు రాలి కొమ్మలు చిక్కి యున్నమహీజంబులు విలేపనాదివిలాసంబు లెడలి నఖదంతరేఖలం గానంబడువేశ్యాయువతులపగిది నుండ వీక్షించుచు లలితశ్యామలతమాలంబులు నీలజలదంబులుఁ గుసుమవినరంబులు తారకాగణంబులు నరుణపల్లవవృక్షభాగంబు సంధ్యారాగంబునుగా రెండవగగనం బనం జని తనరం జూచుచుఁ గెంజిగురాకులజొంపంబులు మంటలు తేఁటిమొత్తంబు లెగయుట పొగ లెగయుటయు ఖద్యోతంబులు విస్ఫులింగంబులునుగా జనకతనయశోకాస్తోకశోకాగ్నులవలనం బురి దరికొని మం

డెడువిధంబునను దా నిఁకమీఁద లంకాపురమందిరంబులమీఁదఁ జిచ్చు లి
దుట సూచించుచందంబునను నుండ నరుదెందుచు సాలరసాలతాలహింతాల
నారికేళఘనసారఖర్జూరకోవిదారమందారజంబీర తిలక కురవక క్రముక తిందుక
చంపక కేతకీపారిభద్రవకుళనిచుళపాటలలవంగలుంగమాతులుంగ నారంగ నింబ
కదంబనికురుంబంబుల నరుణసితాసితహరితవర్ణద్రుమంబులఁ గనకకలధౌతపాద
పంబుల మణిప్రవాళస్ఫటికనీలసోపానవితానంబులు ముక్తాసికతాతలంబులుఁ
గమలకువలయకల్హారాదికుసుమంబులుఁ జక్రవాకసారసహంసక్రౌంచకారండవ
ప్రముఖజలవిహంగంబులు మత్తభృంగంబులుం గలకొలంకుల నదులం దటా
కంబుల నీక్షించుచు మృగమహిషవరాహభల్లూకపుండరీకవేదండకంఠీరవప్రము
ఖమృగంబులుఁ గృతకవననదీతటాకంబులుఁ గనత్కనకమణిరజతస్తంభంబులుం
గలిగి యనేకశిఖరంబుల శిలాగృహంబుల నొప్పుచు మేఘసంకాశం బగునొక్కన
గోత్తమంబు గని యన్నగశృంగంబుల కెగసి పరుషధ్వని నురవడిం బాఱి ముం
దట నడ్డపడినవృక్షాగ్రంబులవలన మరలం ద్రొట్టిన నది కోపంబునఁ బ్రియుం
బాసి యలిగి చనం జుట్టలు మరలుప మగిడి ప్రసన్నతఁ బ్రియునొద్దకు వచ్చుప్రి
యకాంతగతి నలరం గనుంగొనుచు నయ్యచలంబు దాఁటి ముందట. 131

చ. ఫలితసువర్ణపాదపవిభాసితకృత్రిమతీరకాననం
బులు సికతీకృతస్ఫటికభూరిసుమౌక్తికవిద్రుమంబులున్
లలితసమగ్రశీతలజలంబులు హేమమయాంబుజోత్పలం
బులు గలవిశ్వకర్మకృతపుణ్యతరంగిణిఁ జేరఁబోవుచున్. 132

క. అంచితశిఖిదీప్తులు గల, కాంచనతరురుచులు పొదువఁ గపివర్యుఁడు నేఁ
గాంచనమయ్యైతి నంచుం, గాంచనగిరికరణి నొప్పి ఘనతేజమునన్. 133

వ. మెఱయు చున్నసమయంబున. 134

క. తెలుపులు దిక్కుల నెఱయఁగ, మలయానిల మల్లఁ బొలయ మధుపము లొలయన్
జలజంబులు నగఁ గుముదం, బులు మోములు వంప వేగుఁ బ్రొద్దెంచెన్.

క. అంత ఖగంబులు మేల్కని, యెంతయు నెలుఁగింపఁ దొడఁగె నింపార రతి
శ్రాంతిని నిద్రించినతమ, కాంతలఁ గాముకులు మేలు [1]కనిపెడుభంగిన్. 136

క. ఇదె జానకి యిక్కడ ను, న్నది రమ్మని పిలుచువిధమునన్ వీతెంచెన్
మదకోకిలశిఖికులష, ట్పదకారండవమరాళబకశుకరవముల్. 137

ఉ. వించుఁ గడంక నేఁగి పరివేష్టితహాటక[2]వేదివిస్ఫుర
త్కాంచనశింశుపాతరువుఁ గాంచె రణచ్ఛతకింకిణీకమున్
సంచితపర్ణపుష్పఫలసాంద్రలతాకము నంతికాశ్రితో
దంచితహేమవృక్షము నుదగ్రశిఖాకలితాంతరిక్షమున్. 138

---

1 కలిపినభంగిన్. 2 జాలవిస్ఫుర.

వ. ఇట్లు గాంచి వడి దాఁటి యక్కాంచనశింశుపావృక్షాధిరోహణంబు సేసి నలుదె
సలు పరికించి కనత్కనకకమలకువలయకలితజలజాకరంబులును సకలర్తుసమయ
సముదితఫలదళకుసుమలసితారుణసితాసితహరితతరునికరంబులు నుదయరాగసం
కాశపుష్పితాశోకకింశుకషండంబులుం గల్పకసంతానపారిజాతాదినిఖిలవృక్షం
బులుం గలిగి నందనచైత్రరథంబుల కెన యనం దగి నానాప్రసూనరత్నరత్నా
కరం బగుచు బహుగంధబంధురం బగురెండవగంధమాదనం బన నెఱియ మెఱ
యుచున్న యశోకవనమధ్యంబున వివిధప్రాకారసౌధావృతంబును భద్రవిద్రుమ
సోపానభాసమానంబును దప్తజాంబూనదసముదితవేదికావిరాజితంబును ననేక
మణిమయభాసురాసనగృహాలంకృతంబును శాతకుంభస్తంభసహస్రశోభితంబును
నగుచైత్యప్రాసాదంబు గని వెఱఁగందుచు నయనానందకరలసదిందిరమంది
రంబున. 139

—హనుమంతుఁడు సీతం గాంచి దుఃఖించుట.—

తే. బాలచంద్రనూతనరేఖపగిది డస్సి, పంకదిగ్ధమృణాళికభంగి మాసి
వాన లేనివల్లికగతి మేను వాడి, నిగుడుచింతాపరంపర నిండ నలమి. 140

సీ. కెంగేలు చెక్కునఁ గీలించి యంగంగ, కనుఁగొనలను బాష్పకణము లొలుక
వెండ్రుకల్ జడగట్టి వేఁడినిట్టూర్పుతో, విన్ననై వదనంబు వెల్లఁబాఱ
[1]నుపవాసములఁ గ్రుస్సి విపులపీడలవాడి, యురుపంకమున బ్రుంగి యొడలు నలఁగ
దిక్కెవ్వరును లేక దీనతఁ గడుఁ దూలి, వలవంత లోఁ దాఁటి వగలఁ బొగిలి
యుగ్రకోపతర్జనముల నుల్ల మవియ
ఘనభయంకరాకారరాక్షసులనడుమఁ
బగుపతరవృకావృతయైనహరిణికరణి
భయముఁ [2]బొంది యలంతమైఁ బరఁగుదాని. 141

వ. మఱియును. 142

మ. అతినిందాన్వితకీర్తికై వడి విహీనార్థోక్తిచందంబునం
దతధూమావృతవహ్నిసంగతిని సచ్ఛన్నచంద్రప్రభా
కృతిఁ బంకావిలగంగభంగి శిశిరక్లిష్టాబ్జినీరీతి మృ
ద్గతమాణిక్యశలాకమాడ్కి మలినాంగచ్ఛాయతోఁ దూలుచున్. 143

ఆ. చందురుండు లేనిశర్వరిగతిఁ జక్ర, వాకవిరహచక్రవాకికరణి
దినకరుండు లేనిదినలక్ష్మికై వడి, నొప్పు దూలి యొంటి యున్నదాని. 144

మ. గళదస్రాదకసిక్తవక్త్రిఁ గుటిలక్రవ్యాదసంతర్జనా
కులచిత్తఁ విరహాగ్నితప్తఁ గృపణం గ్రూరవ్యథాసంశ్రితఁ

1. ఉపవాసముల వాడి యురుపంకమున బ్రుంగి, యొలయిక నెంతయు నొడలు డస్సి.
2. బొందినమృగశాబనయనఁ గనియె.

మలినాంగిఁ సతతోపవాసకృశ రా।మప్రేమచింతాసమా
కలితఁ శోకసమేత సీతఁ గనియెం।గార్యంబు ధుర్యంబుగన్. 145

వ. ఇట్లు గని యెంతయు సంతసిల్లి యంతర్గతంబున. 146

క. ఏమేమితొడవు లున్నవి, భూమిజ కని మున్ను చెప్పె।భూపతి నాతో
నీమెయి నాతొడవుల యీ, రామకు నున్నవి మహాభి।రామము లగుచున్.

క. గగనగతి నరుగునప్పుడు, నగచరు లీక్షింప నాఁడు।నగశృంగమునం
దగిలినపై చేలయు నీ,మగువ ధరించినదియును స।మానాంబరముల్. 148

క. ధారుణిపై దిగవిడిచిన, యారాజోత్తముని దేవి।యాభరణము లీ
నీరేజాస్యాభరణము, లారయఁగా నొక్కమేని।యాభరణంబుల్. 149

క. పతి మును చెప్పినగతి నీ, సతి కున్నవి హేమపట్ట।సమవస్త్రము సం
చితరత్నకంకణంబులుఁ, దతకాంచనకర్ణవేష్టి।తములుం దనరన్. 150

వ. కావున నిక్కారణంబు లన్నియుఁ గల్గుటం జేసి యిద్దేవియ రాఘవేంద్రుదేవి యని కృతనిశ్చయుం డై మఱియును బోలం గనుంగొనుచుఁ దనమనంబున.

క. నరపతి సెప్పినగతి నీ,యురుకుచ కొప్పారు నూరు।యుగము మొగము భా
సురతరపదములు రదములుఁ,గరము లురముఁ గౌను మేనుఁ।గన్నులుఁ జన్నుల్.

సీ. సరసిజసౌందర్య।సదనంబు వదనంబు, చారుసుధారస।స్రావి మోవి
పరిభూతబిసపద్మ।ఘాతులు చేతులు, కదళికాయుగళంబు।గడలు దొడలు
ముహురుదంచితకాంతి।ముచములు కుచములు, భూరిసువర్ణవి।స్ఫూర్తి మూర్తి
చతురవిలోకనా।సాధ్యంబు మధ్యంబు, తీ పారుకందర్ప।తూపు చూపు
లోలభావసూచనములు।లోచనములు
ధర్మవతిమతియభిమాన।ధనము మనము
కాన యీసతి కెన యగు।మానవతులు
సౌరిది మూఁడుజగంబులఁ। జూడఁ గలరె. 153

క. ఆరామున కీసతి దగు, నీరామకు నానరేంద్రుఁ।డెనగాఁ దగు నీ
చారిత్రం బీసుగుణం, బీరూపము నీసతీత్వ।మెంతయు నొప్పన్. 154

సీ. ఈసాధ్వి కై రాఘ।వేంద్రుఁడు కృత్రిమ,కాకంబు శిక్షించె।ఘను విరాధుఁ
జంపె శూర్పణఖనా।సాకర్ణములు గోసె, ఖరదూషణాదిరా।క్షసులఁ ద్రుంచె
మారీచుఁ బరిమార్చె।వీరు వాలి వధించె, నినజుఁ బట్టముగట్టె।నెల్లకపుల
నఖిలదిక్కులయందు।నరసి రం డని పంచె, నే వచ్చి యీలంక।నెల్ల వెదకి
భూమితనయ నిచటఁ గంటి।భుజగిఁబోలె
నిగుడునిట్టూర్పు పుచ్చుచు।వగలఁ బొగిలి
భీకరాంగారకగ్రహా।పీడ నొంది
యున్నరోహిణికైవడి।నున్న దాని. 155

తే. రామలక్ష్మణసతతాభిరక్షచేతఁ, బరఁగునీసాధ్వి యక్కటా భయదరాక్ష
సీసురక్షిత యై భీతిఁ జెంది వగలఁ, దాలుచున్నది నే మందు దైవగతికి.

చ. ధనమదసంపదల్ విడిచి దారుణభూములఁ గందమూలము
ల్గొనుచు విచిత్రహర్మ్యములలోపల నుండెడునట్లు ఘోరకా
ననములలోనఁ దాను దననాథునిఁ గూడి సుఖించుచుండు నీ
వనిత నిజేశుఁ బాసి వలవంతలఁ గూరెడు నిప్పు డక్కటా. 157

క. ఈరామమనం బెప్పుడు, నారామునియంద యుండు నారామమనం
బీరామయంద యుండును, ఘోరవ్యసనము లిరువురకు సమానంబుల్. 158

క. ఇరువురుఁ జిత్తంబుల నొం, డొరువులఁ బెడఁబాసి యునికి నొక్కెడఁ దారొం
డొరులఁ గనఁ దివురునాశా,భరముల నున్నారు తెగక ప్రాణంబులతోన్. 159

క. అతివకుఁ బతియ విభూషణ, మితరంబులు లేక యున్న నీ సతి యతిభా
స్వతి యయ్యును నెట్లున్నది, పతిఁ బాసినకతన మలినభావముతోడన్. 160

క. తనుఁ బాసితి ననువగపున,ననుచరి వోయె నని కరుణ నంగనఁ బొడగా
నన యని దీనతఁ బ్రియ లే, దని కామవ్యథ నరేంద్రుఁ డతితప్తుఁ డగున్.

క. ఈకోమలి కీదుర్దశ, నేకరణి విధించె భారతీశుఁ డకట యీ
శోకమునకు మూలం బగు,కైకకు నే మందు దైవగతి కేమందున్. 162

క. అని యిట్లు పెక్కువిధముల, మనమునఁ దలపోసి వేగుమాసం బయ్యెఁ
జనకజకావలిరాక్షస, వనితలు, మేల్కన్నకతన వసుధాసుతతోన్. 163

తే. వెలసి భాషింప నిప్పుడు వేళగాదు, తపనుఁ డుదయించిక్రుంకునందాఁక సైఁచి
రాత్రి వచ్చినకార్యంబు రాముసతికి, విన్నవించెదఁ గాక నే వెరవుతోడ.

వ. అనుచు నల్పగాత్రుం డై యాతరుశాఖపర్ణంబుల నొదిఁగి చూచుచుండె నప్పుడు ప్రభాతభేరు లులియ రాత్రించరసత్త్వంబులు నిద్రింప దివాచరులు మేల్కని తమతమవిహారంబులకు నేఁగుచు నొండొరులం జీరునాహ్వానస్వనంబులు రావణు నగరివాకిట నెసంగించు ఘంటాకాహళశంఖదుందుభిప్రభృతిస్వనంబులు జయ జయగీతవేణువీణాస్వనంబులు నభ్రస్వనంబులుంబోలె నింగిఁ జెలంగ మారుతో ద్ధూతగంధబంధురహోమధూమంబుల నప్పురవరంబు యజనభూమియుంబోలె నుండె నాసమయంబున. 165

మ. లలిఁ గస్తూరి దొఱంగి చందనము లీలం దాల్చి సొంపారున
ట్లలఘుధ్వాంతముఁ బాసి శుభ్రతరరమ్యస్ఫూర్తి నొప్పారుచుం
[1]జెలువొందంగను దూర్పు చెన్నసఁగఁగాఁ సిందూరికాక్లృప్తవృ
త్తలలామం బనఁ దోఁచె భానునిసముద్యద్బింబ మేపారుచున్. 166

వ. ఇట్లుదయించి చండకిరణంబుల భూమండలం బెల్లఁ దపింపఁజేసి పడంపడి. 167

---

1 చెలువొందం గడ లింపుఁజెన్నొసఁగఁగన్ సిందూరకాంతిన్ గుప్ప, త్తలలామం బన.

క. ఘనతనుతాపము లోఁబడ, ననసినరాగంబుతోడ నినుఁ డపరదిశాం
గనఁ జేర నరిగెఁ దనప్రియ,వనితం జేరంగ నరుగు వల్లభుకరణిన్. 168

వ. తదనంతరంబ. 169

చ. కువలయపర్వ మబ్జములకుం గొంగ చకోరమనోరథంబు జ
క్కవకవపాయుత్రోవ కలకంతునియాదలపువ్వు చిత్తసం
భవుదళవాయి దేవతలపారణ మంబుధియుబ్బు లోచనో
త్సవము దమోవ్యపాయము నిశామణి తూర్పునఁ దోఁచె నయ్యెడన్. 170

తే. గగన మొప్పారె నీలోదకంబుకరణిఁ, దారకప్రకరంబులు కైరవముల
పగిది విలసిల్లెఁ జంద్రుండు భాసమానుఁ,డగుచుహంసవిధంబున నమరె నడుమ.

వ. ఇట్లుదయించి యమృతకిరణుండు వెలుంగుచుఁ దనశిశిరకిరణంబులం దనువునకుఁ దనుపుసేయ ననిలసంకసనుం డుండె నంత నర్ధరాత్రసమయంబున ననేకబ్రహ్మరాక్షసులు చదువునధ్యయనబ్రహ్మఘోషంబులు సెలంగం బంచమహాశబ్దంబులు మంగళగీతస్వనంబులుఁ దెలుప మేల్కని కందర్పదర్పాతిరేకంబునం దమకంబొదవ జనకరాజనందనం దలంచి శయ్యావతీర్ణుం డై చంద్రికాధవళదుకూలంబులు గట్టి మృగమదమిళితమలయజాదిగంధంబు లలంది వివిధకుసుమపిసరంబులు ముడిచి మణిమయభూషణాలంకృతుం డై నీలమేఘంబునుంబోలె దేదీప్యమానుం డగుచుఁ దనవెనుకం బ్రియవిలాసినులు సనుదేర నగరు వెలువడి యగ్రభాగంబున. 172

—✿ రావణుఁ డశోకవనమునకు వచ్చి సీతతో దుర్భాష లాడుట. ✿—

ఉ. మంగళతూర్యముల్ మొరయ మానుగ ముందట ధూళి వాయఁ ద
న్వంగులు వారిపూర మొలయంగను జల్లుచు రాఁగ నంతఁ దా
నందన యోగ్యరత్నకలితాసవపూరితపాత్రహస్తయై
ముంగల నేఁగుదేర నొకముద్దియ గేలిడి త్రోవపెట్టఁగన్. 173

సీ. ఘనకుచంబులు నిక్క గంధర్వకామినుల్, ధవళాతపత్రముల్ దాల్చి నడువఁ
గంకణకింకిణీఝుంకృతుల్ సెలఁగంగ, సురవిలాసినులు వీచోపు లిడఁగ
నెలమిఁ గిన్నరసతుల్ మలయానిలము చల్ల, రమణమై నాలవట్టములు పట్ట
గంధతైలము నించి గరుడకాంతలు సేరి, కెలఁకుల దీపముల్ చెలఁగి పూన
బలసి ఖడ్గాదిసాధనపాణు లగుచు, దనుజకాంతలు దనుఁ గొల్వ దళకిరీట
రుచులు మణిరుచిదీపికారుచుల గెల్వఁ, బొలిచి వెసనశోకారామభూమిసారఁగ.

మ. కరిణీమధ్యగతద్విపేంద్రముగతిం గాంతానమోపేతుఁ డై
యరుదేరం బొడగాంచె ముందట నరన్యాటుండు కైలాసదు
ర్భరభారక్షమబాహు నిర్జితనిలింపవ్యూహునిం బంక్తికం
ధరు దోర్గర్వధురంధరుఁ దివిజరక్తస్రావణుఁ రావణున్. 175

వ. కని వీఁడు రావణుం డిద్దురాత్ముండు మనసిజగోచరుం డై వచ్చుచున్నవాఁ డిక్కడ వచ్చి యేమేమిదురుక్తులాడెడినో చూచెదం గాక యనుచు నొక్కశాఖకు గంతు గొని తఱుచగువిటపపర్ణంబుల నొదిఁగియుండె నిట దశగ్రీవుండు కదియ నేతేర సీతకుఁ గావలియున్న రాక్షసభామినులు సంభ్రమంబున మ్రొక్కుచు నోసరిల జనకతనయయుం గని ప్రవాతవేగంబునం గదలుకదళిచందంబున వడవడవడంకుచుం జన్నులు చేతులం గప్పికొని పీడినకచభరంబున వెన్నును జఘనంబును మాటువడ నూరుల నుదరం బడంచుకొని యశ్రువు లురుల నున్న నమ్మానినీరత్నంబుఁ జేరి రావణుం డి ట్లనియె. 176

ఉ. మానిని నన్నుఁ జూచి తనుమధ్యము దాఁపఁగ నేల యేరికిం
గానఁగ వచ్చు నీబయలుఁగా నిది యేటికి నన్నుఁ జూడ వ
బ్జానన నీవిలోకనము లచ్చెరు వారఁగ నెన్నఁడేని నా
[1]మానస మాడియున్నయవి మన్మథమోహనసాయకంబు లై. 177

సీ. విమలదుకూలముల్ వెలయంగఁ గలుగంగ, గడు మైల యీచీర గట్ట నేల
కస్తూరికాముఖ్యగంధంబు లవి గల్ల, భూరిపంకంబున బ్రుంగ నేల
సారాన్నపానముల్ చవులూరఁ గలుగంగ, నుపవాసముల డస్సి యుండ నేల
[2]మెత్తనిపాన్పుల మెఱయుశయ్యలు గల్గఁ, గఠినోర్వి శయనించి కంద నేల
విజయలబ్ధత్రివిష్టపవిభవుఁ డైన, ఘనుఁడ నేఁ గల్ల నొకపేదమనుజుఁ గూడి
కాయగసరేఱికొని తించుఁగానలోన, ఘోరదుఃఖముల్ గుడువంగఁ గోర నేల.

మ. జగతీనాథునిఁ జేసి నీజనకునిన్ సంతోష మొందించెదం
దగురత్నంబులు భూషణంబులు సుగంధద్రవ్యవస్త్రాదులుం
బొగడొందం గల వెల్లలక్ష్ములు వెసన్ భోగింపు నిస్పర్థి ము
జ్జగముల్ గొల్వఁగఁ బంచి నీకడ నభీష్టక్రీడలం దేలెదన్. 179

క. పరసతి యొడఁబడ కుండిన, నరభోజను లాక్రమించి నలిఁ బొందుట బం
ధురధర్మ మైన నీయను, చరణము లేక నినుఁ బొంద సమ్మదలీలన్. 180

క. ఎల్లసుఖంబులఁ జేకొనఁ, జెల్లుట యౌవనమునంద చిక్కిన మఱి పా
టిల్లున వెన్నెలదినముల, నల్లో నేరేళ్లు గాక యావలఁ గలవే. 181

క. కావున యౌవన మాఱడిఁ, బోవఁగ నీ కేల రతులఁ బ్రోవుము నన్నున్
నావనితలు నీదాసులు, నీ వేలుము లంక యింక నెమ్మదిఁ దరుణీ. 182

చ. కామిని నీకటాక్షములు కాయజమోహనబాణముల్ బొమల్
కామునిచాపముల్ మొగము కంతునిమామ మృదూక్తు లంగజో
ద్దామశరాభిమంత్రము లుదంచితబాహులు మారుపాశముల్
కాముకచిత్తముల్ మరునిగాఢశరవ్యము లట్లు గావునన్. 183

1 మానము నాటియున్న. 2 'మెత్తనిపుష్పముల' మెఱయు. అ. ప్ర.

క. మారుఁడు నిన్నుం జూచిన,వారలమానములఁ గిన్క । వాలమ్ములచేఁ
బారింపక తూలింపక, కారింపక యున్నె యతివ । గైకొన కున్నన్. 184

సీ. వృత్తోరుకుచములు । వీఁక వక్షము గాఁడ, నను వేడ్క నాలింగ।నంబు సేయు
కుంభికుంభస్థల।గురునితంబంబున, రణితమేఖల యొప్ప । రతులఁ దేల్పు
పున్నమచందురుఁ । బోలునెమ్మొగమునఁ గొమరారునమృతంబు । గ్రోలనిమ్ము
మర్మముల్ నాటిన।మరుబాణముల గెల్వ, నీదృష్టి నామీఁద । నిగుడనిమ్ము
వరసకోకిలస్వరయుక్త।చతురకీర
సురుచిరోక్తులు నాచెవుల్ । సొగియఁ బల్కు
కాముకేళిఁ గైకొని నన్నుఁ । గావు మింకఁ
గడచి చన్నయాతపసిపైఁ । గాంక్ష విడువు. 185

చ. వనముల నాకలంబుఁ దిని । వంతలఁ గుందుచు నింత కెన్నఁడే
మనుజుఁడుఁ దాను జచ్చు నడి।యూస లిఁకేటికిఁ జాక తక్కి నర్
వననిధి దాఁటి రాఁగలఁడె । వాఁడిమి వచ్చిన నన్ను నేగతిం
జెనకి జయించు నాజి నను । జేరఁగ నోపునె ముజ్జగంబులున్. 186

క. హరిహరకమలభవామర,వరు లురుబలకలితు లగుచు । వచ్చిన నైనం
బొరిగొందు నేను దశకం,ధరు ననియెనఁ జెనకువారె । నరులుం గిరులున్.

క. బలమునఁ దపమున రూపునఁ, గులమునఁ దేజమునఁ గలిమి । గుణముల నాతోఁ
దులఁదూఁగఁ గలఁడె రాముఁడు, చలమునఁ గైకోవుగాక । సమ్మతి నన్నున్.

క. వారక వంతలఁ గుందియు, భూరేణువుచేతఁ జాల । బ్రుంగియు నాహా
నీరూపి ట్లున్నది శృం,గారించిన నిన్నుఁ జూడఁ । గన్నులు గలవే. 189

—సీత రావణు నిరాకరించి పలుకుట.—

వ. అనుచుఁ గర్ణకఠోరంబులుగాఁ బలుక దీనవదనయు నార్తస్వనయుఁ దామ్రాక్షి
యు నాకంపితాంగియు శోకతప్తచిత్తయు నగుచు నద్దేవి కోపంబునఁ దృణఖండం
బతని కడ్డంబుగాఁ బట్టికొని పరాఙ్ముఖ యగుచు ని ట్లనియె. 190

క. జనకునితనయను దశరథ,జనపతికోడల నరేంద్ర।చంద్రుం డగురా
మునిభార్య నన్నుఁ గవిసెద, ననుచిత్తము విడువు నీ క।నర్థం బగుటన్. 191

ఉ. కందినయన్యకాంతయెడఁ । గామము దక్కుము నన్నుఁ జేరరా
దందనిమ్రానిపండులకు । నఱ్ఱులు సాఁతురె నీదుకోర్కి నీ
సుందరులందుఁ దీర్చికొను।చొప్పునఁ బోక ఖలుండ పాపముం
బొందెదుత్రోవఁ బోయి తుదిఁ । బోదు మదం బఱి కాలుప్రోలికిన్. 192

ఉ. నాపతి డాఁగురించి కుహ।నాగతి న న్నిటఁ దెచ్చి బంటవై
పాపము లేల యాడెదు నృ।పాలుఁడు సన్నిధి నున్న నానమ
చ్చాపవిముక్తశాతశర।జాలములన్ నిను నీకులంబు ను

దీపితశక్తితోఁ దలలు ద్రెంపక చంపక పోవ నిచ్చునే. 193

క. సిరిఁ జూపి నన్ను లోఁబడ, మరిపెద నని చూచె దేల మనుజేశునిపైఁ
దిర మగునామది వాయదు, తరణిం బాయనితదంచితప్రభభంగిన్. 194

శా. ప్రాణంబుల్ వలతేని రామునకు నేర్పారంగ నన్నిచ్చి న
త్త్రాణుం డై మను మట్లు గాక మదిలో దర్పించినం దద్రణ
క్షోణీయుక్తఖరాస్త్రసిక్తపటుదోస్స్థాణోగ్రబాణాసనా
క్షీణస్ఫారకఠోరఘోరశరముల్ చెండాడు నీకంఠముల్. 195

చ. వినయముతోడ నన్ను రఘువీరున కిచ్చి వినమ్రుఁ డైన నొం
డని యెడువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁ డాదయాళుతో
ననువుగ సంధి సేసికొని యాదట మై బ్రదుకుండు నీవు నీ
జనములుఁ గ్రొవ్వి చచ్చుట విచారము గా దటు గాక తక్కినన్. 196

శా. పంకేజాననుఁ జొచ్చినన్ జవమునం బాతాళముం దూఱినన్
లంకారాక్షసవంశవారిధిఁ గరాళజ్వాలజిహ్వాల మై
సంకీర్ణస్ఫుటవిస్ఫులింగపటలీసంచార మై ఘోర మై
కింకన్ రాఘవబాణబాడబముఖాక్షీణాగ్ని గ్రోలుం జుమీ. 197

వ. అనవుడు రావణుం డి ట్లనియె. 198

క. లలనలు పురుషుల దూఱఁగఁ, బలుకుట ప్రియవతుల యగుటఁ బైఁ బడి వారిం
గలఁచుట కొఱ కీవిట్టులు, పలికిన సైరించి మనసు పట్టెదఁ గరుణే. 199

క. అతివలకును దాక్షిణ్యము, వితతవిభూషణము నీకు వెదకిన నది లే
దతినిష్ఠుర వేవిధమునఁ, బతికిం బ్రియురాల వైతి పరుషప్రవచా. 200

ఆ. అతివఁ జంపఁ బాప మని యూరకుండిన, నోరికొలఁదు లాడె దోర నన్ను
వనిత కింతవాఁడితనం బేల, ప్రభుల నోట లేక పలుకు టేల. 201

క. న న్నంత మిగిలి పలికిన, ని న్నిప్పుడు చంప బ్రదుకు నెమ్మదితోడన్
రెన్నెల్లదాఁక మీఁదట, న న్నొల్లక యున్నఁ గిన్క నఱకుదు నిన్నున్. 202

క. అని పలికి సీతకావలి, వనితల నీక్షించి మీరు వసుధాతనయుం
జన బుజ్జగించియైనను, ననువుగ బోధించియైన నదలిచియైనన్. 203

క. రెన్నెల్లలోన నాకుం, జె న్నొంద నధీనఁ గాఁగఁ జేయుఁడు మఱి తా
కున్న నిశాచరు లందఱుఁ, గ్రన్ననఁ జక్కాడి తినుఁడు ఘనపలలంబున్. 204

వ. అని యిట్లు జంకింప నతిభీత యగుసీతం జూచి యచ్చట నున్నగీర్వాణగంధర్వ
కాంతలు విషాదించుచు నయనభ్రూకుటినంజ్ఞల నూరార్ప నద్దేవి కోపంబున
రావణుం గనుంగొని. 205

క. ఇనకులనాథుం డనియెడు, ఘనసర్పముఁ బోలె నిన్ను ఖండించి జవం
బున విహగేంద్రుఁడు భుజగిం, గొనిపోయెడుభంగి నన్నుఁ గొనిపోవుఁ దగన్.

ఉ. నావిభునాజ్ఞ లే కునికి నాతప మంతయు రిత్త యై చెడుం
గావున నిన్ను భస్మముగ గాఢతరోక్తి శపింప నిప్డు యు
ద్ధావని గిట్టి నిష్ఠురశరావలులం బరదారచోరు ని
న్నావసుధేశ్వరుండు పరిమార్పఁగ నిమ్మని పల్కెఁ బల్కినన్. 207

మ. కుటిలభ్రూకుటిధూమరేఖ లొదవం గోపాగ్నిసందీప్తుఁ డై
చటులాక్షిస్ఫుటవిస్ఫులింగచయసంచారంబు ఘోరంబుగాఁ
బటుబాహాకరవాలకీల లడరం బ్రస్ఫారహుంకారసం
కటనంతర్జనభీకరుం డగుచు లంకానాథుఁ డజ్జానకిన్. 208

క. కదియునెడ ధాన్యమాలిని, కదిసి వెసం బట్టి పంక్తికంధర నీ కీ
సుదతియెడఁ గిన్క యేటికి, సదయుఁడ వగు మాఁదుదానిఁ జంపం జనునే.

క. అనుకూల గాక పెనఁగెదు, వనితయెడం గలదె సుఖము వలతే నాతోఁ
దనియఁగ రతులం దేలుము, చన నెంకఱు లేరు నీకుఁ జక్కనికాంతల్. 210

క. అన విని యల్లన నవ్వుచు, మనసిజసాయకవిభిన్నమానసుఁ డై యా
వనితయుఁ దానును మగుడం, జనె దశకంఠుండు గేళిసదనంబునకున్. 211

వ. అంత నద్దశకంఠుచేత నియుక్తలైన నక్తంచరభామిను లందఱు జనకనందనపాలి
కేతెంచి మొగంబులఁ గోపంబు ముడివడం బరుషంబు లాడుచుండ నం దేక
జట యనునది యిట్లనియె. 212

—రాక్షసాంగనలు సీతను దుర్బుద్ధులు గఱపుచు బెదరించుట.—

క. చతురాస్యునకున్ మానససుతుఁడు పులస్త్యుండు పుట్టె సుతుఁ డతనికి స
న్మతి పొడమెను విశ్రవసుం, డతనికి రావణుఁడు పుట్టె నతివిక్రముఁ డై. 213

క. నాలవబ్రహ్మ దలంపఁగఁ, బౌలస్త్యుం డితఁడు నీకుఁ బతిగాఁ దగఁడే
పోలఁగ నామాటలు విని, పౌలస్త్యు వరింపు [1]భోగభాగిని వగుచున్. 214

వ. అనినఁ గుటిలభ్రూకుటిదుర్నిరీక్ష యగుచు హవిర్జట యనునది యిట్లనియె. 215

క. మందోదరితో వేవురు, సుందరు లతిరూపవతులు శోభిల్లుచుఁ దన్
మందిరమున నుండఁగ న, య్యందఱ నొల్లందు నీక యతిమోహితుఁ డై.

సీ. కింక నెవ్వాఁడు సర్వగీర్వాణయుతుఁ డైన, యమరేంద్రునంతకు నాజి గెల్చె
నని నోడి యెవ్వని ననిమిషగంధర్వ, దానవోరగపతుల్ దనరఁ గొలుతు
రెవ్వనిదెస భీతి నినుఁ డెండ గాయఁడు, వీఁకతో వాయువు వీవ వెఱచు
జలదంబు లెవ్వని కులికి యింపారంగ, సురుచిరతోయముల్ గురియుచుండు
నెవ్వనికి బెగ్గలం బంది యెల్లతరులు, సురభిపుష్పవర్షంబులు సొరిదిఁ గురియు
నిట్టిరావణు వరియింప నేల యొల్ల, వేము నీకుఁ జెప్పినబుద్ధు లేల వినవు.

వ. అనియె నంత నఖలరాక్షసభామలుఁ గోపాటోపంబున నిట్లనిరి. 218

---

1 'భోగభామిని వగుచున్'. అ. ప్ర.

క. బాల జగత్పాలకభూ,పాలకదిక్పాలకాళిఁ । బఱపి తదీయో
త్తాలశ్రీలన్ వాలెదు, పౌలస్త్యునిపత్ని వగుట । భాగ్యము గాదే. 219
క. మానముతో మన నీకును, మానము గా కొక్క హీన । మానవుఁ గోరం
గా నేల రాక్షసేంద్రుని, మానిని వై మనుము నీవు । మన్ననతోడన్. 220
వ. అనిన విని బాష్పాకులలోచన యగుచు వైదేహి వారల కిట్లనియె. 221
క. మనుజు వరింపక మనుజాం,గన మనుజాశను వరించి । కాఱియవడునే
వినఁగానిమాట లే విన, నను మ్రింగిన మ్రింగుఁ డింక । నరభుగ్వనితల్. 222
సీ. సగరుఁ గేశినివోలె । సౌదాసు మదయంతి,గతి వసిష్ఠుని నరుం।ధతివిభాతి
నిను సువర్చలభంగి । నింద్రుని శచిమాడ్కిఁ, జంద్రు రోహిణిరోజ । సత్యవంతు
సావిత్రివిధమునఁ । జ్యవను సుకన్యక,యట్టులు నలు దమ।యంతిపోల్కిఁ
గువలు శ్రీమతిలీలఁ । గుంభసంభవుని లో,పాముద్ర కైవడి । భక్తితోడ
రఘుకులాబ్ధిరాకాచంద్రు । రామచంద్రుఁ, గొలిచియేనుసమ్మతినుండి । వెలయుదాన
నాని జేశుఁడు రాజ్యవి।హీనుఁ డైన, నట్టివాఁ డైనఁగాని నా । కెట్టు లెన్న.
వ. అని పలుక నఖిలరాక్షసులు నధికక్రోధతామ్రాక్షు లగుచు నౌదు గఱచుచుఁ గ
టము లదర రాక్షసేశ్వరుం డగురావణు నేల యొల్ల వని పరుషవాక్యంబుల భ
ర్జించుచు ఖడ్గపట్టినప్రాసాదు లంకించుచు శింశుపామూలంబుఁ జేరం జనుదెం
చి విటపపర్ణంబుల నొదిఁగినహనుమంతుం డూరక చూచుచుండ నుగ్రాకార
లయి కదియ నజ్జనకతనయ భయకంపితాంగి యగుచుఁ గన్నుల బాష్పాంబువులు
దొరఁగ శోకించుచుండ నందఱుం దిరిగివచ్చి గర్జించుచు భర్జించుచుండ నప్పు
డు దీనానన యగుచున్నజానకిం జూచి యతికుపిత యగుచు వినత యనునది యి
ట్లనియె. 224
క. వనమున జీవము విడిచిన,మనుజునిపైఁ గూర్మి యేల । మాకుం జూడన్
ఘనబలుఁడుఁ బ్రియంవదుఁడును,ననుకూలుఁడు భోగభాగి । యధికుఁడు నగుటన్.
క. కాలము గడపఁగ నేటికిఁ, బౌలస్త్యుఁడు నీకు నెల్ల । పదవు లొసంగున్
లీలం బ్రసూనమాలా, చేలాభరణాంగరాగ । శృంగారిణి వై. 226
క. సరసిజభవునకు శారద, హరికిని సిరి రవికి సంధ్య । హరునకు నుమ ని
ర్జరపతికిని శచి వైశ్వా,నరునకు స్వాహా శశిరాంశు । నకు దాక్షిగతిన్. 227
క. రక్షోవిభునకు నీ వతి, దక్షతఁ బత్ని వగు కాక । తక్కిన నిన్నున్
రాక్షసభామిను లందఱు, భక్షించెద రీక్షణంబ । పటుకోపమునన్. 228
వ. అనియె నంత నిటలతటగ్రంథిలకుటిలభ్రూకుటి యగుచు విశంకట యిట్లనియె.
క. అనునయమున నతిపరుషత, నిను నొడఁబఱుపంగ లేము । నీకై దుఃఖం
బునఁ బడఁజాలము రావణుఁ, జనఁ గామించెదవొ లేక । చచ్చెదొ చెపుమా.
వ. అనుడు నతిఘోరప్రేక్షణదుర్ముఖ యగుచు హాయముఖ యిట్లనియె. 231

క. వనితాస్తనహస్తము, లొనరఁగ నినుఁ గొల్వఁ బావకనోద్యానములం
దనుపమభోగము లందుచు, దనుజేశునిఁ [1]జేరికొనుము ధన్యత వెలయన్.

క. వననిధి దాఁటుట వచ్చుట, యనిసేయుట చాల మనుట యది సమకొనునే
మనుజుఁడు నినుఁ గొనిపోయెడి, ఘనుఁ డెవ్వం డేము నీకుఁ గావలియుండన్.

మ. అని దేవారి జయించి నిన్ను నరుఁ డేయాసక్తిఁ గొం చేఁగెడిన్
దనుజాగారముఁ జొచ్చి పోదు నను చిత్తం బేల వంటిల్లు సా
చ్చినకుం దేటికి నీకుఁ బోక గలదే చింతించి నావాక్యముల్
విను మింకన్ వినకున్న నీరుధిరముల్ వే క్రోలి నిన్ మ్రింగెదన్. 234

వ. అనునంత నయోముఖి యిట్లనియె. 235

క. మనమాటలు విన దింకన్, మన మీవనితను వధించి మాంసము దించుం
దనియఁగఁ గ్రోలఁగవలయును, మనకుం గొనిరండు మంచిమద్యము లీలన్.

వ. అనిన శూర్పణఖ యిట్లనియె. 237

క. పరఁగ నయోముఖి చెప్పిన,కరణిన్ ఖండించి దీని క్రవ్యము దించున్
సుర ద్రావి నికుంభిల కే, నరిగెద వెసఁ గ్రీడతోడ నాడెద నెలమిన్. 238

వ, అనినం జండోదరి గేల శూలంబు ద్రిప్పుచు విదుర్చుచు నిట్లనియె. 239

క. త్రాసోత్కంపితకుచ యగు, నీసతిరుధిరంబు ద్రావి హృదయము వ్రత్తున్
గాసిల గ్రసింతు నసిఁ దలఁ, గోసి వెసం గండసిందు గుండెలుఁ దిందున్. 240

వ. అనినఁ బ్రతపన యిట్లనియె. 241

క. జడమతి వై మనమాటల, కొడఁబడ దిది యేల మనకు నుద్ధతి దీనిన్
మెడ దునిమి వైచి నెత్తురు, గడు పారఁగఁ ద్రావి మాంసఖండముఁ దిందున్.

వ. అని యిట్లనేకప్రకారంబుల భయంకరాకార లైన రక్కసలు తర్జనభర్జనంబులఁ బరుషవచనంబుల [2]బెగ్గడిల్లం జేయఁ గుందియు వందియు ధరిత్రీపుత్రి కంపంబు నొంది నీలవేణి కృష్ణభుజంగియుంబోలెఁ దూల బాష్పధారలు గుచంబులఁ దొరఁగ నేడ్చుచు నేలం బడి పొరలుచు ధూళిధూసరితాంగి యగుచు లేచి పుష్పితాశోకశాఖాలంబనంబు చేసి గద్గదవాక్యంబుల నిట్లనియె. 243

క. నోసినడెందము వగులఁగ, నాసతి హారామచంద్ర హాలక్ష్మణ హా
కౌసల్య హాసుమిత్రా, పాసితి మి మ్మెల్ల దుఃఖభాజన నైతిన్. 244

క. ఖలుఁ డగురక్కసుచేఁ బడి, నిలుచుట జను లాడునడికి నిలయమ వైతిం
జెలువునిఁ బాసినయప్పుడ, బలువిడిఁ బ్రాణములు వోక బ్రదికెద నకటా.

క. వలసినయప్పుడ మరణము, కలిగింపఁడు పాపజాతి కాలుఁడు గరళా
దులవెంటఁ జావు దొరకదు, బలుగావలి వై నిశాటభామిను లునికిన్. 246

క. తిరముగ మును నాచేసిన,దురితం బెట్టిదియొ నాకు దుష్టనిశాటీ

1 జేసికొనుము. 2 బెగ్గలం బందియుఁ గుందియు.

పరివృత యై యిట్లతిదు,ర్భరదుఃఖము లందవలసెఁ బరదేశమునన్. 247

క. మాణిక్యభూషణధన,శ్రేణులు ప్రియహీన కేటికి ప్రియములు నాకుం
బ్రాణేశ్వరుఁ బాసిననా, ప్రాణము లేమిటికి నాదు బ్రదు కేమిటికిన్. 248

క. నాకై పతి మును కృత్రిమ,కాకంబు విరాధు ఖరముఖ క్రవ్యాదా
నీకంబుల శిక్షింపఁడె, వే కైకొని కనకమృగము వెంటం బోఁడే. 249

తే. కాన రాఘవుల్ విడుతురె కలయ వెదకి, నన్నుఁగానక వగల సన్న్యస్తశస్త్రు
లగుచుఁదరుమూలములనిరాహారనిష్ఠఁ, దెగిరొ రావణుమాయలనెగులువడిరొ.

క. అట్టేటికి నగుఁ గావఁగ, గట్టిగ నేఁ డెల్లి వచ్చి గారవమున వా
రెట్టుల గొనిపోవంగల, రిట్టుల మగుబాహుశౌర్య మెంతయు నొప్పన్. 251

సీ. నాజాడ వెదకుచు నరనాయకుఁడు వచ్చి, విహగపుంగవుచేత విని కడంక
జలనిధి లంఘించి చన లంక భేదించి, దశకంఠుఁ జక్కాడి తలలు దునిమి
యని వానిపలలంబులను భూతబలి యిచ్చి, లంక నీఱుగఁ జేసి లంకఁ గలుగు
దుష్టాసురశ్రేణిఁ దునియలు గావించు, విధవ లై యింటింట వివిధగతుల
నెల్లరాక్షసభామలు నేడ్వఁ గలరు
లంక యేడ్పుల శవధూమసంకరములఁ
బృథులభస్మరాసులతోడఁ బ్రేతభూమి
యోజఁ గడు నమంగళ మయి యుండఁ గలదు. 252

—త్రిజటాస్వప్నవృత్తాంతము.—

వ. అని యిట్లనేకప్రకారంబులం జింతించుచుండ సీతం గదిసి కటము లదరఁ బండ్లు గీటుచు రక్షోభామ లీపాపజాతి క్రూరనిశ్చయ దీని భక్షింపుఁ డనుచు మిడుఁగుఱులు సెదరం గైదువు లంకించుచు జంకించుచున్నెడఁ జేరువ నిద్రవోయినత్రిజట మేల్కని సంభ్రమంబున నోహో వేగిరపడ కుండుఁడు రాక్షసవినాశకరంబును రామునకు విజయకరంబును నగునొక్కస్వప్నంబు గంటి వినుం డని పలుక నారక్కసులు బెగ డందుచుఁ దిరిగి వచ్చి యది యెట్టిదని వినిపింపు మనిన నాత్రిజట యిట్లనియె. 253

క. సామజసహస్రశోభితుఁ, డై మి న్నందుచు ఘనశిబికారూఢుం డై
రాముఁడు రుధిరము ద్రావుచు. భూమండల మెల్ల మ్రింగఁ బొడగంటిఁ గలన్.

క. శ్వేతాంబరములు దాలిచి, సీత నిజేశుండుఁ దాను సేమంబులతో
నాతతజలధిపరిక్షి, ప్తతులితాచలముమీఁద నమరం గంటిన్. 255

క. ఇనశశుల సీత పరిమా, ర్జనమును గావింపఁ గంటి రాఘవుఁ డనుజుం
డును దాను వచ్చి భూసం,దనతోఁ బుష్పకము నెక్కి తనరం గంటిన్. 256

సీ. ధవళపుష్పాంబరతారహారము లొల్లి, ధరియించి సితచతుర్దంతదంతి
నడుమ రా రాముఁడు నలువార నవ్విభు,నంకోపరిస్థల మారఁ జేరి

జానకి ముందట సౌమిత్రి దమయన్న, వెనుకభాగంబున వెలయ నెక్కి
వడి నగ్గజేంద్రంబు వారి నందఱఁ గొంచు, సొంపార నీలంక సొరఁగఁ గంటి
మఱియు శుభ్రపుష్పాంబరమహితుఁ డగుచు
రాఘవుం డష్టవృషభోఢరథము నెక్కి
యవనిజాలక్ష్మణులతోడ నధికమహిమ
నరుగుదేరంగఁ బొడగంటి నంతమీఁద. 257

వ. రావణుం డొక్కయుగ్మలి తిగువఁ బుష్పకంబుననుండి దిగువంబడను మఱియు ముండితశిరుండును గృష్ణాంబరధరుండును రక్తమాల్యానులేపనుండును ఖరయుక్తరథుండును నై దక్షిణపథంబున నరిగి గోమయహ్రదప్రవేశంబు సేయం గలఁగంటి మఱియుఁ గర్దమలిప్తాంగియుఁ గాళియు నగునొక్కవనిత రక్తవస్త్రంబు మెడఁగట్టి తిగువ రావణుండు యామ్యదిగ్భాగంబున కరుగం బొడగంటి వెండియు రావణుండు వరాహంబును నింద్రజిత్తు శింశుమారంబును గుంభకర్ణుం డుష్ట్రంబు నెక్కి యంతకదిగ్భాగంబున కరుగ రాక్షసులు రక్తమాల్యాంబరధారులై యాడుచుం బాడుచుం బ్రశంసించుచుఁ దైలంబు ద్రావుచు దక్షిణంబు వోవను లంక గరితురగసమాకులయును భగ్నప్రాకారతోరణయునై సముద్రంబునం బడను గంటి రాక్షసాంగనలు తైలపానంబులు సేయుచు భస్మీభూత యైనలంకలో మహాస్వనంబుల నగుచు నాడుచుం బాడుచు నికుంభకుంభకర్ణాదులతోడ రక్తవస్త్రులై పోయి గోమయహ్రదంబులోనం గ్రీడింపం బొడగంటి విభీషణుండు మంత్రిసమేతుండై యొక్కరుండును శ్వేతపర్వతసమారూఢుం డై యుండం గలఁగంటి నాకల నిక్కల రాముండు వచ్చి సకలరాక్షససమేతంబుగా రావణుం బరిమార్పఁ గలండు గావున నానరేంద్రపత్నికి వెఱచి యుండుద మనుడు నారక్కసలద్దేవికిఁ బ్రణమిల్లి ప్రియవాదినులై యుండి రంత సీతయు రావణుండు మానద్వయంబునం దన్ను హింసించెద నన్నపలుకులు దలపోసి భయం బందుచు నిట్లనియె. 258

సీ. అఖిలబంధులఁ బాసి యన్యదేశమునఁ గ్రవ్యాదుచేఁ జావఁ బాలైతి నకట
హరిణాధమము వెంట నరిగి పైఁడిమృగమంచుఁ, బ్రాణేశు నేల పా మ్మంటి నకట
మముఁ బాపఁ గాలుండు మాయాకురంగమై, పసుపాటవులఁ గాడు పఱిచె నకట
తపముఁ బాతివ్రత్య దమశీలసత్య శౌ,చాదులు విఫలంబు లయ్యె నకట
ఘోరదుఃఖంబు లిబ్భంగిఁ గుడువకుండ
వేయివ్రయ్యలై హృదయంబు విరియ దకట
సకలమునులును నుత్తమసతులు నాకుఁ
దనర నిచ్చుదీవన లెల్లఁ దప్పె నకట. 259

వ. అని పలుకుసమయంబున నాసతికిం దనువున నానందపులక లెసఁగ రామచంద్రుండు ముందటఁ దోఁచిన ట్లయ్యె మఱియును. 260

తే. సీత కప్పుడు మంగళ§చిహ్న లొదవె
నెడమదెసఁ జన్నుఁ గన్నును § దొడయు భుజము
మొగి నదరఁ జొచ్చె రాహువి§ముక్తుఁ డైన
చంద్రుగతి వెల్గుచును ముఖ§చంద్రుఁ డొప్పె. 261

వ. ఆసమయంబున వైదేహివృత్తాంతంబును ద్రిజటవాక్యంబులును మఱియు సర్వంబును నెఱింగినహనుమంతుం డిప్పు డందఱు రాక్షసస్త్రీ లెఱింగియుండుట మెఱసి సీతతో భాషించుట కర్జంబు గా దొకవెరవున రామలక్ష్మణులను దద్బంధుజనంబులను బేర్కొని యీసతీరత్నంబునకు శ్రవణోత్సవంబుగాఁ దగినవాక్యంబులు పలికి ప్రసన్నఁ జేసి నావచ్చినకార్యం బెఱింగించెదఁ గాక యని విచారించి కొండొకదడవున కవసరం బైన నిట్లనియె. 262

—❀ మారుతి సీతకు రామాదులవృత్తాంతంబు వినిపించుచుం దన్నెఱింగించుట. ❀—

మ. హరకోదండవిఖండనుండు జనక§క్ష్మాధీశుజామాత భా
స్కరవంశాగ్రణి జానకీప్రియుఁడు వి§శ్వామిత్రయాగాహితా
సురసంహారి విరాధకాలుఁడు ఖరా§సుధ్వంసి మారీచసం
హరుఁ డన్యప్రమదాపరాఙ్ముఖుఁ డయో§ధ్యానాయకుం డాదటన్. 263

క. కాకుత్స్థకులగ్రామణి, లోకైకత్రాణకేళి§లోలుఁడు పుణ్య
శ్లోకుఁడు సీతాశోకవి, మోకత్వరితహృదయుండు § ముదమున నన్నున్. 264

క. సీతన్ వెదకం బంచిన, నే తెంచితి నబ్ధి దాఁటి § యేను హనూమ
త్ఖ్యాతుఁడ రాఘవుదూతను, భూతలపతిదేవి నెచటఁ § బొడగాంచెదనో. 265

వ. అని పల్కి మఱియు సవిశేషంబుగా నెఱింగించువాఁ డై యిట్లనియె. 266

సీ. దశరథుం డనుపేరి§ధరణీశుఁ డొకఁ డాజ్ఞ, నెల్లభూచక్రంబు § నేలె వెలయ
నలఘు లాతనికిఁ బు§త్రులు రామలక్ష్మణ,భరతశత్రుఘ్నులు § పరఁగఁ గలరు
వారి కగ్రజుఁ డైన§యారాముఁ డనురక్తి, జానకీలక్ష్మణ§సహితుఁ డగుచుఁ
గైకవరంబునఁ § గాంతారమున కేఁగి, మాయామృగము వెంట § మసల కరుగ
రావణుఁడు సీతఁ గొనిపోవ § రయము మెఱయ
మగిడి పర్ణశాలకు వచ్చి § మగువ నచటఁ
గాన కడలుచు నిరువురుఁ § [1]గానలోనఁ
గలయ వెదకుచు ఋశ్యమూ§కంబుఁ జేరి. 267

క. సుగ్రీవునితో సఖ్య ము,దగ్రగతిం జేసి యతని § కభిమతముగ న
త్యుగ్రుని వాలిం దునిమి నృ,పాగ్రణి కిష్కింధఁ బట్ట § మర్కజుఁ గట్టెన్. 268

వ. ఇట్లు సుగ్రీవునకు సమ్మదం బాచరించి తత్పురస్సరంబుగా ననేకవానరకోట్ల నకలదిక్కులకుఁ వెదకం బనిచె నేను సంపాతివచనంబున భవత్సందర్శనోత్సుకత్వం

1. గలయ వెదకి, కడఁగి తిరుగుచు ఋశ్యమూకంబు.

బున సముద్రం బవలీల దాఁటి యీలంక నిశ్శంకఁ జొచ్చి యెల్లచోట్ల వెదకి నా భాగ్యవశంబున నిన్నుఁ బొడగంటిఁ గృతార్థుండ నైతి వినుము. 269

క. సౌమిత్రియుఁ దానును నా, రాముఁడు నీసేమ మడిగె | రవిజుండును నీ
సేమ మడిగె వా రందఱు, సేమంబున నున్నవారు | సేమమె నీకున్. 270

క. అనిన విని యాశ్చర్యం, బును బ్రియముం బెనఁగొనంగ | మో మెత్తి మహీ
తనయ కనియె నంతికమున, ఘనతరుశాఖపయి నున్న | కపికులవర్యున్. 271

వ. కని యుల్లంబు జల్లన నొల్లంబోయి యల్లన దేటి కలలోన వానరుం బొడగంటి నిది దుస్స్వప్నం బని శాస్త్రంబుల వినంబడు నీచెడుగుకల నగుకీడు జనకరామసౌమిత్రులకును నాకుం గాక యుండుం గాక యని దీవించి దుస్స్వప్నదోషపరిహారంబుగా వజ్రివాచస్పతిస్వయంభూహుతాశనులం బేర్కొని నమస్కరించి మగుడం దెలివి నొంది యి ట్లనియె. 272

క. వేమఱుఁ దలఁచినతలఁపు, స్వేమఱుఁ బేర్కొన్నయదియు | నిద్రం గల యా
వేమఱు రాముని తలఁతును, రామునిఁ బేర్కొందు రామ | రామా యనుచున్.

క. అనఘుని మత్ప్రియుఁ బాసిన, ఘనతరవిరహాగ్ని నెరయుఁ | గతనను రక్షో
వనితలదారుణబాధల, నెనసినపెనుభీతి నిద్ర | యెన్నఁడుఁ గానన్. 274

వ. కాన యిది కల గాదు నాకన్న రామస్తుతిపరాయణుం డగు వానరేంద్రుండు రాముదూతయ నిజంబ కా ని మ్మనుచుం బలికె నంతం దరుశాఖావతరణంబు సేసి విద్రుమసమాననుం డగు హనుమంతుం డతిభక్తి నంతంతఁ బ్రణమిల్లుచు శిరంబునం జేతులు మొగిచికొని వినయవినమితశరీరుం డై జానకి నాలోకించి ప్రియం బార ని ట్లనియె. 275

క. చిరపుణ్య నీవు మలినాం, బర మిట్టులు గట్టి చాలఁ | బరితాపముతోఁ
దరుశాఖాలంబిని వై, పొరిఁబొరిఁ గన్నీరు దొరఁగఁ | బొగిలెద వేలా. 276

క. సురకామినివో విద్యా, ధరవరవర్ణినివొ రుద్ర | తరుణివొ వసుసుం
దరివొ మరున్నారివొ కి, న్నరకాంతవొ యక్షసతివొ | నాగాంగనవో. 277

క. దివిఁ జంద్రుఁ బాసి వసుమతి, కవిరళమతి వచ్చి యున్న | యారోహిణివో
యవమాన మొంది రోషము, న వసిష్ఠుం బాసి వచ్చి | నయరుంధతివో. 278

క. వినుతశుభలక్షణంబులు, గనుఁగొన నృప మహిషి వీవు | గా నోపుదు వం
చన దశకంఠుఁడు గొనివ, చ్చిన రాఘువుపత్ని యైన | సీతవొ చెపుమా. 279

క. అన విని జానకి పావనిఁ, గనుఁగొని నాపేరు సీత | ఘనపుణ్యుం డౌ
జనకునికూఁతుర దశరథ, జనపతికోడలను రామ | చంద్రునిభార్యన్. 280

వ. అని పల్కి తా నయోధ్యను బండ్రెండేం డ్లనుపమభోగంబులు భోగించుటయుఁ బదుమూఁడవయేఁడు దశరథుండు రామచంద్రుఁ బట్టంబు గట్ట నుద్యోగించుటయుఁ గైక విఘ్నంబు సేయుటయు రామసౌమిత్రులతో వనవాసంబునకు

వచ్చుటయుఁ దన్ను రావణుం డపహరించి తెచ్చుటయుఁ దనపడుబన్నంబులును రెన్నెల్లమీఁద రావణుండు తన్నుం దునుమాడెద నన్నక్రూరభాషణంబులుం జెప్పిన హనుమంతుండు దుఃఖితాత్ముం డగుచు నిట్లనియె. 281

సీ. కళ్యాణి నీ వేల ♦ కడుదుఃఖ మందెదు, నీనాథుఁ డగురామ♦నృపతి నిన్ను
వెస సర్వదిక్కుల ♦ వెదకంగఁ గడఁకమైఁ, బ్లవగవీరుల నెల్లఁ ♦ బనిచినాఁడు
కాకుత్స్థకులవిభుల్ ♦ కపికులనాయకుల్, నీవ ప్రాణములుగా ♦ నిలిచినారు
నీయున్న తెఱఁ గేను ♦ బోయి చెప్పినయప్డు, వడి లంకపై వచ్చి ♦ విడిసి కన్క-
స్వజనపుత్త్రభ్రాతృ♦సచివయుతము
గాఁగ రావణుఁ జక్కాడి ♦ కడిమి మెఱయ
నిన్నయోధ్యకుఁ గొనిపోవు ♦ నయ్య మెసఁగ
సకలసుఖముల నొందెదు ♦ సమ్మదమున. 282

క. అని మ్రొక్కి భక్తిఁ జేరినఁ, గని బెగడుచు వీఁడు పంక్తి♦కంఠుఁడు మాయా
వనచరుఁ డై నన్నలఁపఁగఁ, జనుదేరఁగ నోపు ననుచు ♦ సంశయమతితోన్.

క. అనద నుపవాసకృశ నిట, నను నేటికి దుఃఖపఱుప ♦ నక్తంచర వ
చ్చినవాఁడ వీవు నిక్కపు,వనచరుఁ డై తేని యిపు డ♦వంచనమతి వై. 284

ఉ. ఎట్టిఁడు నాని జేశుఁడు శు♦భేక్షణ మెట్టిది సద్గుణోత్కరం
బెట్టిది రూపురేఖ లవి ♦ యెట్టివి యంగవిశేషసౌష్ఠవం
బెట్టిది వర్ణలక్షణము ♦ లెట్టివి లక్ష్మణుఁ డెట్టివాఁడు నా
కిట్టని పోలఁ జెప్పినఁ గ♦పీశ్వర యుండెద నమ్మి నెమ్మదిన్. 285

వ. నావుడు నద్దేవి మనస్సంశయంబు వాప నాసతీలలామకు విశ్వాసప్రత్యయసంతోషంబులు పుట్టింపం దలంచి హనుమంతుం డిట్లనియె. 286

క. రాఘవుఁడు చారుమేచక, మేఘశ్యాముఁడు గృపాస♦మేతుఁడు విబుధ
శ్లాఘాకలితుఁడు సమరా, మోఘాస్త్రుఁడు వికచపద్మ♦ముఖుఁడును మఱియున్.

మ. రవిరోచిష్ణుఁడు భూసహిష్ణుఁడు రణ♦ప్రస్ఫారనానాజయో
త్సవవర్ధిష్ణుఁడు సచ్చరిత్రుఁడు సుర♦స్త్రీకేళివిష్ణుండు నా
హవవీరారినిరాకరిష్ణుఁడును స♦త్యాలంకరిష్ణుండుఁ బ్రా
భవలక్ష్మీప్రభవిష్ణుఁడుం గుణగణ♦భ్రాజిష్ణుఁడుం జిష్ణుఁడున్. 288

క. బ్రహ్మప్రార్థితజన్ముఁడు, బ్రహ్మాస్త్రప్రముఖదివ్య♦బాణచయుండుం
బ్రాహ్మణభక్తిప్రవణుఁడు, బ్రహ్మవిదుఁడు బ్రహ్మచర్య♦పరమవ్రతుఁడున్. 289

వ. జానకి విను నీదేవుం డగురామదేవుండు ధాతయు జగత్త్రాతయు లోకనేతయుఁ గర్తయు భర్తయుఁ గామక్రోధప్రహర్తయు సర్వభూతహితుండును రాజవిద్యావిశారదుండును వర్ణాశ్రమసీమాప్రవర్తకుండును వేదవేదాంగధనుర్వేదకోవి

దుండును సత్యసంధుండును బంధుప్రియుండు నాశ్రితవత్సలుండును బితృభక్తితత్పరుండును శీలదాక్షిణ్యసంపన్నుండును బహుశ్రుతుండు ననంతప్రతాపుండు నతిగంభీరుండును మహాజవసత్త్వసంపన్నుండును మహేంద్రప్రతిమానదుర్జయుండును జంద్రసమాననితాంతకాంతుండును మారాకారుండును మహారథుండును బృహస్పతిసమానబుద్ధియు యక్షేశసంకాశసర్వలోకరాజ్యధురంధరుండును సకలగుణాకరుండును శత్రుభీకరుండును బరసుందరీపరాఙ్ముఖుండును దుందుభిస్వనుండును విపులాంసుండును మహాహనుండును మహాబాహుండును మహోరస్కుండును గంబుగ్రీవుండును గూఢజత్రుండును సుతామ్రాక్షుండును స్నిగ్ధవర్ణుండును సముండును సమవిభక్తాంగుండును సువిక్రముండును సులలాటుండును ద్రిశీర్షుండును బీనవక్షుండును జతుష్కిష్కుండును జతుర్దంష్ట్రిండును జతుర్గతియుఁ జతుర్లేఖుండును జతుష్కలుండును జతుర్దశసమద్వంద్వుండును ద్రిస్థిరుండును ద్రివ్యాప్తుండును ద్రివళీయుతుండును ద్రికాలజ్ఞుండును ద్రితామ్రుండును ద్రిస్నిగ్ధుండును ద్విశుక్లుండును దశపద్మవంతుండును దశవిశాలుండును షడున్నతుండును బంచస్నిగ్ధుండును నష్టవంశవంతుండు ననునివి మొదలుగా ననేకశుభలక్షణంబులు గలవు నాకన్నయవి నీకు విన్నపంబు సేసితి మఱియు సువర్ణవర్ణుండు గాని సౌమిత్రియు నన్నిగుణంబులం దమయన్నచందంబువాఁడు నారాక కెదురుసూచుచు సముద్రతీరంబున నంగదాదు లనేకవానరులతోడ నున్నవా రింక నీసేమంబు వేగంబ యెఱింగింప రామచంద్రునొద్దకుం బోవ వలయు ని న్నట్లు జనస్థానంబునం గోల్పడి నీపోయినమార్గంబు వెదకుచు వచ్చి ఋశ్యమూకంబు చేరి యచట సుగ్రీవునితో సఖ్యం బాచరించి నీప్రసంగంబు దడవుడు నతండు నీవు రావణుచేతం బట్టువడిపోవుచు లజ్జ నింకేటికిఁ దొడవు లనుచు నీపై చేలకొంగున ముడియఁగట్టి భూనిక్షేపంబు సేయుచుం బోయినతొడవు లేఁ గొనివచ్చి యిచ్చిన నందికొని భానునందనుండు రఘునందనులముందటం బెట్టిన రామచంద్రుం డాతొడవు లంకోపరిస్థలంబునం బెట్టికొని బాష్పధారామగ్నుం డగుచు నక్కునం జేర్చికొని చూచి యాలింగనంబుసేసి తమ్ముఁడుం దానును బహుప్రకారంబుల విలపింప నేనును భానుజుండును నెట్టకేలకుం దేర్చి ప్రసన్నులం జేసి తన్నియోగంబున నిన్ను నన్వేషింప వచ్చినరాఘవేంద్రునిదూతను సుగ్రీవునిసచివుండఁ బవనతనయుండ హనుమంతుం డనువాఁడ భవద్దర్శనోత్సాహంబున సముద్రంబు దాఁటి లంక సొచ్చి సర్వంబును బరికించితి రావణుం డిట వచ్చుట యెఱుంగుదు నిక్కంబు నీదాసుండ నమ్ము మనుచుం బాదంబుల కెరఁగి లేచి వినయంబున నింక నేచింత వలదు నీనిజేశుండు సకలగుణాభిరాముం డగురాముండు నీ కానవా లిచ్చినభద్రముద్రిక యవధరింపు మని చేతి కిచ్చిన. 390

—✿ హనుమంతుఁ డానవాలిచ్చినయుంగరమును బుచ్చుకొని సీత చింతించుట. ✿—

క. తనువునఁ బులకము లెగయఁగఁ, గనుఁగవ నానందబాష్పకణములు గ్రమ్మం
గనుఁగొని లజ్జావనతా, ననయై తగ మఱియుఁ జూచి నాథుఁడపోలెన్.

ఉ. అక్కునఁ జిక్కఁ జేర్చి ముదమారఁగ ముద్దిడి యింతగాల మే
నిక్కడ నిట్ల యుండఁగ నిజేశుఁడు నీవును నన్నుఁ బాసి మీ
రక్కడ నుండ నెట్లు మనసాడె విభుం డట నన్ దలంచునా
నిక్కము చెప్పు నావలని నెయ్యము భూపతి కెట్టిచందమో. 292

క. బాఁతిగ నిడ గ్రైవేయక, మై తోఁచెదు నాకు నాదు ప్రాణేశునకుం
జేతం బెట్టఁగఁ గంకణ, మైతో కేయూర మైతొ యచ్చటఁ జెపుమా. 293

క. నరపతికి నాకుఁ బరిణయ, మిరవారఁగ నాఁడు చేసి యిప్పుడు దేశాం
తరమునఁ జిక్కిననన్నును, వరునిం గూర్పంగ నీవ వచ్చితి కరుణన్. 294

వ. అని పలికి హనుమంతుం గనుంగొని. 295

క. శౌర్యఘనుండవు నానా, కార్యసమర్థుఁడవుఁ బ్రజ్ఞ గలవాఁడవు నీ
వర్యమకులు లగురఘునృప, వర్యులసేమంబుఁ జెప్ప వచ్చితి నాకున్. 296

క. నలు వొందితి బ్రదికితి నీ, వలనన్ రాఘవులకుశలవార్తలు వింటిం
దెలియఁగ రఘుకులరక్షణ, మెలమిం గావింపఁ బుట్టి తీవు కపీంద్రా. 297

క. అసహాయశూరుఁడవు నీ, వసమప్రజ్ఞుఁడ వుదాత్తయశము బలముఁ బెం
పెసఁగఁగ ని మ్మెందును రా, క్షసభయములు నీకు లేవు కపికులవర్యా. 298

క. కొంకక గోష్పదలీల వి, శంకటజలరాశి దాఁటి సత్వరగతి నీ
లంకాపుర మంతయు ని, శ్శంకం ద్రిమ్మరితి వీవు సామాన్యుఁడవే. 299

క. ఎన్నఁడు రాముఁడు రాఁ గలఁ, డెన్నఁడు గొనిపోవు నన్ను నెన్నఁడు దుఃఖా
పన్నత లేకుండుదు నే, నెన్నఁడు సాకేతపురికి నేఁగుదుఁ బతితోన్. 300

క. అన విని పావని సీతం, గనుఁగొని యిట్లనియెఁ దల్లి ఘనచింతన్ వే
దనఁబడియెదు నీవిభుఁ డగు, జనపతి నీవలనఁ బ్రియుఁడు సదయుఁడు నగుటన్.

సీ. నిన్నుఁ బాసినగోలె నియతితో నంచిత, స్థండిలశయనుఁ డై యుండు నెపుడు
మధుసేవ సేయఁడు మాంసంబు ముట్టఁడు, నిద్ర యెన్నఁడుఁ బోఁడు నిద్రఁ గన్నఁ
గల నిన్నుఁ బేర్కొనుఁ గమనీయఫలపుష్ప, కాంతాదివస్తువుల్ గన్నయపుడు
హా సీత హా సీత యనుచు మానము దూల, వలవంత లోఁ గుందు వగలఁ బొగులు
వేఁడియూర్పులు నిగిడించు విరహవహ్ని, వేఁగు నీపోకఁ దలఁపోయు విన్నఁబోవు
వినుతవిక్రమకథలందు వేడ్క లేదు, పత్ని చెఱఁబోయె నని లజ్జఁ బలవరించు.

క. అనుచరి యగుమత్ప్రియతో, నన వాసిననాదుజన్మ మేటికి నాకుం
దను వేటికి మను వేటికి, ధను వేటికి దివ్యబాణతతు లేమిటికిన్. 303

వ. అనుచుం బ్రలాపించుచు మఱియు నెప్పుడు నీయంద చింతాక్రాంతుం డై యుం

డు నాచేత నీవృత్తాంతంబు విన్నయప్పుడ నాకంటెఁ బ్రబలు లైనయనేక
వానరవీరులతోడ దండెత్తి వచ్చి పుత్రమిత్రభ్రాతలతోడ రావణుం బరిమా
ర్చి నెయ్యం బార నిన్నయోధ్యకుం గొనిపోయెదు నంతదాఁక సైరింప లేకున్న
వినుము. 304

క. వీఁ పెక్కి రమ్ము లంకా,ద్వీపముతోఁ గూడ నైన * దేవీ నిను నే
నేపునఁ గొనిపో నోపుదు, నీపతికడ కబ్ధి గడచి * నిమిషములోనన్. 305

క. ఈపనికి సంశయించిన, భూపక్షిమృగాదిరూప*ములు పూనెద నే
రూపమున నైన నినుఁ గొని, భూపతిసన్నిధికి వేగ * పోయెద జననీ. 306

ఉ. నావుడు సీత యెంతయు మ*నంబున సంతస మంది యిట్లనున్
నీ వతిసూక్ష్మగాత్రుఁడవు * నిక్కువ మారఁగ నన్ను నేగతిన్
భూవరునొద్ద కెత్తికొని * పోవఁగఁ జాలుదు వన్న నవ్వుచుం
బావని నాదురూప మిదె * భామిని గన్గొను మంచు నేపునన్. 307

క. జలనిధులు జానుదఘ్నం, బులుగాఁ గులగిరులు గజ్జ*పొడవులుగాఁ దా
రలు దలపువ్వులుగా ది,క్కులు కడవం బెరిఁగెఁ గనక*కుధరముభంగిన్. 308

వ. ఇట్లేచి ప్రళయకుపితభైరవాకారప్రకారం బగుతనయాకారంబు సీతకుం జూపి
వజ్రదంష్ట్రాకరాళుండును దీప్తవహ్నిసన్నిభుండును బాలార్కతామ్రవక్త్రుండును
మేరుమందరాకారుండును నై హనుమంతుండు సచరాచరాధిష్ఠితం బగులంకా
ద్వీపంబుతోడం గూడ నైన నిన్నెత్తికొని సురాసురాదు లడ్డపడిననైన మీఱి
రామదేవుకడకుం గొనిపోయెద గమ్మనుడు నద్దేవి పావనిం జూచి నీ వెంతకైన
సమర్థుండ వగు టెఱుంగుదు ననుచు నిట్లనియె. 309

మ. మరుదుద్యద్గతి నన్ను నెత్తికొని భీ*మవ్యోమమార్గంబునం
దరుగన్ బ్రాణము లంతరిక్షమున ని*ర్యాతంబు లా నొండె ని
ర్భరవాతోద్ధతపాదఘాతముల న*భ్రవ్రాతముల్ దూల సా
గరమధ్యంబునఁ గూలి గ్రాహతిమిన*క్రగ్రాస మై పోవుదున్. 310

వ. అట్లు గాక నన్నెత్తికొని నీవు సన దశముఖుం డెఱింగి పనుపఁ గ్రూరాకారు
లైనరాక్షసులు శరశరాసనకరవాలశూలపరశుపట్టిసముసలముద్గరతోమరకుంత
చక్రప్రముఖప్రహరణంబులఁ గీలాభీలంబుగాఁ గవిసి నొప్పింప నీవు నిరాయు
ధుండ వద్దురాత్ముల నెట్లోర్చెదవు నన్నెట్లు సముద్ధరించెద వాతుములసమరం
బున నీకుం బ్రమాదంబు పుట్టెనేని సకలయత్నంబులు విఫలంబు లగు నీచేఁ
దప్పి పడిననన్ను విశసించి రాక్షసులు భక్షింతురు కాన యత్తెఱం గలవడదు
మఱియు నొక్కవిశేషంబు చెప్పెద నాకర్ణింపుము. 311

క. పరపురుషులతను వంటని, పరమపతివ్రతను నాఁడు * పంక్తిగ్రీవుం
డురవడిఁ బెనంగి నన్నుం, బరవశ నై యుండఁ బట్టి * బలిమిం దెచ్చెన్. 312

తే. అనుడు హనుమంతుఁడమ్మాట | కాత్మ మెచ్చి, తల్లి నీపుణ్యశీలంబుఁ | దగవుఁదపముఁ
జారుగుణములుఁ జెయ్వులుఁ | జాలలెన్న, విభున కిన్నియు వినిపింతు | వేడ్క నెరయ.
తే. తడయ రాదింక నిచ్చట | ధరణిపతికిఁ, బోల నీయున్కి సెప్పంగఁ | బోవవలయు
విభుఁడు నమ్మెడు తెఱఁగున | విన్నవింతు, నెఱుక కేమైన నానవా | లిమ్ము లెమ్ము.

సీత హనుమంతునితోఁ గాకాసురునివృత్తాంతము చెప్పుట.

వ. అని పలుక సీత హనుమంతుం గనుంగొని చిత్రకూటాచలపూర్వోత్తరపార్శ్వంబున ఫలదళకుసుమసమృద్ధం బై నతాపసాశ్రమం బొప్పు నాచేరువ సిద్ధాశ్రమంబు గలదు తత్సమీపంబున మందాకినీతీరంబున నొక్కయుద్ధామారామం బభిరామం బగుచుండు నందు విహరించి జలకేళిం దేలి పరిశ్రాంతనై మదీశునంకశయ్యాశయనించితిఁ బరువడి నతండు మదంకశయ్యా శయనించి యుండ నొక్క కాకంబు వచ్చి నన్నాసక్తిం జూచి నాపయ్యెదకొంగు చండతుండాగ్రంబున నెడలించి కుచాంతరంబు నఖాగ్రంబున విదారించిన నే నొక్క యిషీకంబు వైచిన నది వోక చేరువన మేపు గొనుచుండఁ దత్క్షతవ్యథ కే నేడ్చిన మేల్కని నగుచు నాకన్నీరు దుడిచి విభుం డుపలాలించి కొంతవడికి రక్తసిక్తం బగుకుచాంతర కాకనఖరేఖ నవలోకించి నిటలతటకుటిలభ్రుకుటి యగుచు నాశీవిషభీషణరోషోగ్రనిశ్వాసంబులు నిగిడించుచు ని ట్లనియె. 315

క. నాకినుక గోరి యెవ్వం, డీకృత్రిమ మాచరించె | నెవ్వఁడు కుప్య
ద్భీకరతరవిషధరద, ర్వీకరసహకేళి సలుప | వేడుక సేసెన్. 316

వ. అనుచుఁ గెలంకులు పరికించుచున్నసమయంబున. 317

క. నా కభిముఖమై క్రమ్మఱఁ, గాక మ్మొడియంగ రాక | గనుఁగొని కిన్కం
గాకుత్స్థాన్వయనాథుఁ డి, షీకము మంత్రించి వైచెఁ | జెన్నఁటి కాకిన్. 318

వ. ఇట్లు మంత్రించి వైచిన నది బ్రహ్మాస్త్రం బగుచు. 319

చ. విడువక నీడవోలెఁ దన | వెంటనె మంటలు మింట నంటఁగాఁ
బిడుగులు పెల్లుగాఁ బడఁగ | భీమగతిం బఱతేర భీతితో
వడిఁ గరటంబు లోకములు | వారక త్రిమ్మరి నిల్చి చూడ వె
న్నడి నది రాఁగఁ జూచి నర | నాథునియొద్దకు వచ్చి మ్రొక్కుచున్. 320

క. అపరాధి నన్నుఁ గావుము, నృప నీశరణంబు గంటి | నిందితపాప
వ్యపగతుఁడ నైతి నావుడుఁ, గృపణపువిహగంబుఁ జూచి | కృప ని ట్లనియెన్.

క. విను నాబాణ మవంధ్యము, సన నీయంగ మొకఁ డిచ్చి | చను మన నగుఁ గా
కనుచుం దనలోచన మా, ఘనసాయకమునకు నిచ్చి | కాకము సనియెన్.

వ. ఇత్తెఱంగునం బూర్వచిహ్నితం బైనకుచాంతరక్షతంబును జెప్పి తనగండస్థలంబున రాముండు లిఖయించినమనశ్శిలాపత్త్రరేఖయు నెఱింగించి యంతమీఁద. 323

—సీత హనుమంతునికి శిరోమణి యానవాలిచ్చుట.—

క. చనఁ దనకొంగున ముడిచిన, సునిశితరుచి గలయనర్ఘ ।చూడామణి యి
చ్చిన ।మ్రొక్కుచు నారత్నము, ననురక్తిం బుచ్చుకొని ధ।రాత్మజ కెలమిన్.

వ. ప్రదక్షిణపూర్వకంబుగా దండప్రణామం బాచరించి లేచి శిరంబునం జేతులు మొగిడ్చి యభివందనంబు సేసి దశస్యందననందనపదారవిందంబులు దనడెందంబున నిడికొని పవననందనుండు ప్రయాణోన్ముఖుం డగుటయు నవలోకించి యద్దేవి యి ట్లనియె. 325

క. రాముని కట నామ్రొక్కుగఁ, బ్రేమంబున నీవు మ్రొక్కి ।భీమనిశాటీ
స్తోమమ్ముచేత నాపదు, లాములు సకలంబుఁ జెప్పి ।బాగుగ మఱియున్.

క. తనసతి ఖలుఁ డొకఁ డుద్ధతిఁ, గొనిపోయిన నూరకునికి ।గుణమే పతికిన్
వినఁగ నపకీర్తి గాదే, జను లాడరె ధర్మ మగునె ।క్షాత్త్రము వలదే. 327

వ. అని పలుకు మని వెండియు. 328

క. జననిగతి నన్నుఁ జూచును, జనకునిచందమున రామ।చంద్రునిఁ జూచున్
జననీజనకులపంపునఁ, బెనుఁగానల మమ్ముఁ గొల్చి ।ప్రీతిన్ వచ్చెన్. 329

వ. అట్టినాముద్దుమఱందితోడం గుశలం బడిగితి నని మఱియు నగ్గుణనిధితో ని ట్లనుము. 330

క. కూడనిపరుసంబులు దను, నాడినయాఫలము గంటి ।నను మింకను నా
కీడు దలంపకు మను మీ, కాడిక రాకుండ మెలఁగు ।మను కృప పుట్టన్. 331

వ. రామలక్ష్మణసుగ్రీవాదులఁ గుశలం బడిగితి నను మింక నేచందంబున నైన నొక్కమాసంబుదాఁకఁ బ్రాణంబులు చిక్కంబట్టి యుండెద నను మెల్ల తెఱంగులుఁ జెప్పితి నివ్విధంబు లన్నియుం జెప్పి వేవేగ సకలసైన్యంబులతోడ రామదేవునిం దోడితెమ్ము కపికులచంద్రా నీవిటరాకకుం బ్రమోదంబు నొందితి గుణనిధివైన నీ వటఁ బోకకు ఖేదం బగుచున్నయది యనుచు బాష్పాకులలోచనయును దీనవదనయు నై యున్న జానకి నూరార్చి పవమానసూనుండు పునఃపునః ప్రణామంబులు సేసి వీడ్కొని యటఁ జనిచని మనంబున నూరక పోనేల కొంతపౌరుషంబు సూపెదం గాక యనుచు విక్రమక్రమోత్సాహం బెనంగ నవ్వనంబు నకుం గవిసి. 332

—హనుమంతుఁ డశోకవనభంగంబు చేయుట.—

చ. ఫలములు డుల్లిపోఁ జఱిచి ।పర్ణము లన్నియుఁ ద్రుంచి వైచి కొ
మ్మలు నుఱుమాడి కుంజము ల।మందగతిన్ వెసఁ ద్రెంచి పాదపం
బుల వెన వేళ్లతోఁ బెఱికి ।పువ్వులు రాలిచి డొల్లఁ దాఁచి పెం
దలిరులు నేలఁ గూలఁగ ల।తావితతుల్ విదలించి వెండియున్. 333

వ. ప్రలయకాలాభీలవాతూలంబులీల వృక్షంబులు విఱుగఁ దాఁచుచు కుంభత్సం

రంభదంభోళియుంబోలెఁ బర్వతశృంగంబులఁ బగుల వ్రేయుచుఁ జండమదోద్దండ
శుండాలంబుచందంబునఁ గమలాకరంబులు గలఁచియాడుచుఁ గ్రూరావిర్భావదా
వపావకుండునుంబోలెఁ బ్రమదావనంబుల భస్మీకరించుచు నివ్విధంబున దారుణ
విహారంబు సల్పుచుండ నందుఁ బొడమిన కాకోలకేకిశుకపికఘూకబకకులసంకు
లస్వనకోలాహలంబును భీకరదర్వీకరపుండరీకభల్లూకకంఠీరవభైరవకలకలంబు
ను నాకర్ణించి లంకానివాసు లందఱుఁ గొందలపడి వెగడుపడి పఱవ వారి నంద
ఱం గనుంగొని లయకాలభైరవభీకరాకారుం డై దెస లద్రువ నార్చుచుఁ దోరణ
స్తంభంబు సేరె నిట సీతాసమీపంబున నిద్రించి యున్న రాక్షసవనితలు. 334

క. అప్పుడు దరువులు విఱిగెడు, చప్పుడు వడి నేలఁ గూలు।చప్పుడుఁ బైపై
నుప్పర మెగసెడుపక్షుల, చప్పుడు నారవము లెసఁగు।చప్పుడుఁ జెలఁగన్. 335

క. మిట్టిపడి లేచి వన మొగి, బట్టబయలు గాఁగఁ జెఱుకు।పవనతనూజుం
గట్టలుకఁ జూచి రక్కసు, లిట్టట్టుగఁ బాఱి సీత।కిట్లని రలుకన్. 336

క. ఎక్కడిమర్కటుఁ డిటకును, మొక్కలముగ వచ్చి నీదు।ముందట మాటల్
పెక్కులు ప్రేలి వెసం జని, స్రుక్కక వన మెల్లఁ జెఱుకఁ।జొచ్చెం గడిమిన్.

వ. అని పలుక వారలకు సీత యిట్లనియె. 338

క. మాయావులు రాక్షసు లే, మాయలు పన్నుదురొ నాదు।మానము గలఁగం
జేయఁగ నాకుహాకులయ, మ్మాయలు నా కెఱుఁగ వశమె।మాయాప్రౌఢల్.

వ. మీ రెఱుంగుదురు గాక మీరాక్షసమాయలు పా మెఱుంగుఁ బాముకాళ్లిత
రుల కెఱుంగవచ్చునే యేనును మనంబునం గలంగుచున్నదాన నిది రాక్షస
మాయ గానోపు ననవుడు నతివిస్మయభ్రాంత లగుచుఁ గొంద ఱత్తన్వియొద్దన
యుండిరి కొందఱు భయంబునం బఱచిరి కొందఱు సంభ్రమంబునం బాఱి
కంపంబు వొడమ రావణున కిట్లనిరి. 340

చ. సురపతిదూతయో ధనద।చోదితదూతయొ సీత రామభూ
వరుఁ డరయంగఁ బంప నిట।వచ్చినదూతయొ వానరుం డొకం
డరుదుగ వచ్చి సీతకుఁ బ్రి।యంబులు వల్కి మహోగ్రమూర్తి యై
తరుతతు లన్నియుం బెఱికె।దత్ప్రమదావన మెల్ల రిత్తగన్. 341

తే. ధరణిసుత యున్నశింశుపా।తరువు నైనఁ
బెఱుకఁ డెపుడును జూడఁడు।ప్రియముతోడ
వసుమతీసుత కుండ నీ।వాన మగుట
నీడతో నామహీజంబు।నిలుప వలసి. 342

క. సీతకడ కేము వెసఁ జని, నీతో భాషించి చనిన।నీచుం డెవ్వాం
డాతనిఁ జెప్పుము నావుడు, మాతోఁ దా నెఱుఁగ ననుచు।మాయుర వెఱఁగన్.

చ. ఘనతరఫాలపట్టికల।ఘర్మకణంబులు గ్రమ్మ భీకరా

ననములు జేవుఱింపఁగ ఘ।నభ్రుకుటిస్ఫుటకోపదీప్తుఁ డై
కనదురువిస్ఫులింగములు । కన్నుల రాలఁగ [1]నాఁడు దీటికొం
చెనుబది వేలరక్కసుల । నెక్కుడుశౌర్యము గల్గువారలన్. 344

వ. పనిచిన వారు నాటోపంబున శూలముద్గరతోమరపరిఘగదాముసలభిండివాలచక్రాదిసాధనంబులు కీలాభీలంబులుగా నడచి ముందట హనుమంతుం గనుంగొని.

క. మిడుతలు దావానలమునఁ, బడ వడిఁ బఱతెంచుకరణిఁ । బైపైఁ దనపైఁ
బుడమి వడఁక మేఘంబులు, సుడివడఁ గైదువులు ద్రిప్పుచుం బఱతేరన్.

శా. కాలవ్యాళకరాళవాల మొగిఁ జుట్కల్ రాల నభ్రావలుల్
దూలం ద్రిప్పుచు లోకభీకరతర।స్థూలాత్ముఁ డై యుద్ధలీ
లాలోలాగ్రహవృత్తి నార్చెఁ బెలుచన్ । లంకాగుహాగేహది
క్కూలానేకపకర్ణకోటరజగ।ద్ఘూర్ణప్రఘూర్ణంబుగన్. 347

క. బెగడిరి రక్కసు లప్పుడు, ఖగములు సుడివడుచుఁ బడియెఁ । గర్ణపుటంబుల్
వగులం దారలు రాలెను, దిగిభంబులు సోలి వ్రాలె । దిక్కులు వ్రీలెన్. 348

వ. ఇట్లద్భుతంబుగా నార్చి యి ట్లనియె. 349

ఉ. రాముఁడు లక్ష్మణుండుఁ గపి।రాజును బంపఁగ వచ్చినాఁడ నే
రామునిదూత మారుతి ని।శాతికులఘ్నుఁడ మీర లెంత సం
గ్రామములోన నా కెదిరి । రావణకోటులు వచ్చినన్ శిలా
భూమిజవృష్టి ముంచి పొరి।వుచ్చి బలోద్ధతిఁ బేర్చి వెండియున్. 350

క. సురవైరిపురము గాలిచి, యరుదందుచు యాతుధాను । లందఱుఁ జూడన్
ధరణిజకు మ్రొక్కి పోయెద, శరనిధి లంఘించి రామ।చంద్రునికడకున్. 351

క. అనిన విని యతనిపరుష, ధ్వనికిన్ బెగడుచును యాతు।ధానులు సంధ్యా
ఘననిభు మారుతిఁ గనుఁగొని, ఘనసాధనకీల లడరఁ । గవిసిరి కడిమిన్. 352

క. వారిం గని హనుమంతుఁడు, తోరణనిక్షిప్తమైన।దుర్భరభార
క్రూరాయసపరిఘము గొని, ఘోరనిశాచరబలంబుఁ । గూలఁగ మోఁదెన్.

వ. ఇట్లవక్రవిక్రమంబు సలిపి గరుడహస్తగృహీతం బైనపన్నగంబుకరణిఁ దన కేలఁ బరిఘంబు గ్రాల గముల కెగయుచు గగనప్రచారుం డై యుండఁ గొందఱు బెగ్గలం బంది చూడఁ గొందఱు నింగికి లంఘించి శూలముద్గరప్రాసపరశ్వధంబుల వ్రేయుచుం బొడుచుచుం దన్నుఁ బరివేష్టింపం గనలి యింద్రుం డసురుల వజ్రప్రహతులం జేయుభంగి నారాతులఁ బరిఘంబుపాలు సేసి విజృంభించి యి ట్లనియె. 354

ఉ. ఎక్కుడుచేవ గల్గినయ।నేకవలీముఖు లోలిఁ గొల్వఁగా
విక్కడి కుగ్రసేనఁ గొని । యేపున భానుసుతుండు వచ్చు నిం

1 నాండ్లు దీటికొం.

కెక్కడిలంక మీఁకుఁ గల । దెక్కడ రావణుఁ డుండువాఁడు మీ
రెక్కడివార లింకఱకు । నేర్పడఁ గాలము చేరె నావుడున్. 355

ఆంజనేయుఁడు జంబుమాలిని మంత్రిసుతసప్తకంబుం జంపుట.

వ. కొందఱు దిగ్భ్రమ నొకరొకరికిం జెప్పక దిక్కులకుం బాఱిరి కొందఱు బెగ్గలం
బునం గొందలపడుచుఁ జేష్టలు దక్కి కూర్చుండి కనుంగొనుచుండిరి కొంద ఱుర
వడి మేనులు చెమర్పఁ దలలు వీడం బాఱి రావణున కత్తెఱం గెఱింగింపం గోపం
బున బొమలు గీలించుచుఁ బ్రహస్తపుత్త్రుం డైనజంబుమాలిం జూచి నీవు
వోయి వనచరునిం బరిమార్చి ర మ్మని నియోగించిన. 356

ఉ. మండితకుండలుండును సమంచితవాసవచాపతుల్యకో
దండుఁడు రక్తమాల్యపరిధానధరుండును భూరిఘోరదం
ష్ట్రుండు ఖరప్రదీప్తరథుఁడుం బటురోషనిరీక్షణుండు ను
ద్దండరణప్రచండభుజదండశరుండును నై బలోద్ధతిన్. 357

క. దిక్కరిశుండాదండన,దృక్కోదండగుణటంకృతిధ్వానంబుల్
ధిక్కృతవనధిధ్వను లై, దిక్కులఁ బిక్కటిలి చెలఁగ । దెంపున నడిచెన్. 358

వ. ఇట్లరుగుదెంచి శరాసారఘోరంబుగా సమీరకుమారుపైఁ గవిసి. 359

క. వదన మొకయర్ధచంద్ర,ప్రదరంబున నొంచి శిరము । పటుతరకర్ణిన్
విదళించి రెండుబాహులు, పదినారాచముల నేసెఁ । బవమానసుతున్. 360

క. ఉరుతరశరహతి నప్పుడు, తరుచరవీరుని మొగంబు । తామ్రం బై వా
సరకరకరవిద్ధం బగు, శరదరవిందంబుపగిదిఁ । జాలఁగ నొప్పెన్. 361

క. కనలుచు హనుమంతుం డొక,ఘనశిల వడిఁ బెఱికి వైచెఁ । గ్రవ్యాదుని వై
చిన నారక్కసుఁ డాశిల, సునిశితవిశిఖదశకమునఁ । జూర్ణము సేసెన్. 362

క. ఆలోఁ గ్రమ్మఱ నొకఘన,సాలము కపివరుఁడు పెఱికి । జవమున వైవన్
లీల నిశాటుఁడు దానిన్, నాలుగుబాణములఁ ద్రుంచి । నగచరవీరున్. 363

క. శిర మొకశరమున వక్షోం,తర మిషుదశకమున భుజము । దాఁకన్ శితని
ష్ఠురబాణపంచకంబున, నురవడి వాఁ డేసె విక్రమోద్ధతి మెఱయన్. 364

మ. భ్రుకుటిప్రస్ఫుటకోపనుం డగుచు నాస్ఫోటించి నక్తంచర
ప్రకరం బాతతభీతిఁ బాఱ వడి నభ్రవ్రాతముల్ దూల నం
తకుభంగిం బరిఘంబు ద్రిప్పి యురుదర్పన్ వ్రేసెఁ గ్రవ్యాదుమ
స్తకబాహార్గళజానుకార్ముకరథాశ్వశ్రేణి చూర్ణంబుగన్. 365

వ. ఇట్లు మహోగ్రంబుగా వైచి సకలరాక్షసుల నతిక్రమించి మారుతి తోరణ
స్తంభంబు చేరె సమరవిముఖు లైనవారలచేత జంబుమాలిపాటు విని రావణుం
డు రోషావిష్టుం డగుచు మరుత్సూనుమీఁదికి మంత్రిసుతసప్తకంబుం బనిచిన.

చ. అనలసమానతేజులు మహాహవశూరులుఁ గేతనోల్లస

త్కనకరథాధిరూఢులును । గాంచనభూషణభూషితాంగుల్ ఘనధనురస్త్రధారులును । గాఢబలాఢ్యులు సైనమంత్రినం దను లొగి నేడ్వు రుద్ధతి మ।దంబులతో నరు దంద నార్చుచున్. 367

సీ. కమనీయమణిచిత్ర।కాంచనచాపముల్, శక్రచాపంబుల।చాడ్పు గాఁగ సారెసారెకు లీల । సారించుమౌర్వులు, పటుతటిల్లతికల।పగిది గాఁగ భీషణతరవాజి।హేషోగ్రఘోషంబు, లురుగర్జితంబుల।కరణి గాఁగ మేనుల నిగిడెడు।మేచకరోచులు, దిక్కులఁ జీఁకట్ల।తెఱఁగు గాఁగ భూనభోంతర మద్రువంగ।సేనతోడ, మేఘసన్నిభాకారముల్ । మెఱయఁ దఱిమి విపులగిరికల్పుఁ డగుకపి।వీరుమీఁదఁ, బరుషసాయకవర్షముల్ । గురిసి రపుడు.

క. రక్షోభటపరివృతుఁ డై, వృక్షచరప్రవరుఁ డభ్ర।విసరావృతుఁ డై నక్షత్రపథమున సహ, స్రాక్షుఁడు గొమరారుకరణి । నమరుచుఁ గడిమిన్. 369

వ. వారలశరవేగంబులు వారించి యమ్మహాసైన్యంబు దిరుగుడువడ బడలువడం జేసి కొందఱ నిర్ఘాతసమముష్టినిహతులం బొలియించియుఁ గొందఱం గరతలం బులం దలలు పఱియలుగాఁ జఱిచి మడియించియుఁ గొందఱఁ గాలదండోద్దండ భుజాదండంబులం బడమోఁది పరిమార్చియుఁ గొందఱ నశనిసమస్పర్శనంబు లైనపాదంబులం బడఁ దాఁచి వధియించియుఁ గొందఱఁ దీవ్రనఖంబుల వ్రచ్చి తెగటార్చియుఁ గొందఱ శిలాకఠినం బైనయురంబునం జదియ నదిమి చంపియుఁ గొందఱ నూరుప్రహారంబులం బ్రాణసంహారంబు గావించియుఁ గొందఱ మహా భైరవారావంబున గతాసులం జేసియు రథధ్వజవాజిరాజివివిధాయుధభూషణ ప్రకరంబు లాజిక్షోణిఁ గ్రిక్కిఱియ బహుభంగుల రూపడంచియు నివ్విధంబున దారుణరణవిహారంబు సల్పి విజృంభించిన హతశేషదోషాచరులు నలుగడలం బాఱి రావణున కెఱింగింపఁ గనలి యతండు యూపాక్షవిరూపాక్షదుర్ధరప్రఘస భాసకర్ణు లనుసేనానాయకులం జూచి యి ట్లనియె. 370

—— హనుమంతునితోఁ బోరి సేనానాయకపంచకంబు మడియుట. ——

క. ఏలోకంబునఁ గ్రోఁతుల, కీలాపులు గలవె తొల్లి । గో నెఱుఁగుదు నా వాలిని జాంబవదినసుత, నీలద్వివిదాదు లగువ।నేచరపతులన్. 371

క. వారల కీమతియును ని, చ్చారూపము విక్రమంబు । జవము నభస్సం చారమును బలోత్సాహము, నారయఁగాఁ గలవె యీవ।నాటుం డరయన్.

తే. అలుక నాకుఁ గీడొనరింప।నాత్మఁ గోరి, తపముఘనముగఁ జేసి య।త్తపమువలన నాకవిభుఁడు గల్పించిన।లోకభయద, భూరిసత్త్వవిగ్రహమహా।భూత మొక్కొ.

వ. అట్లు గాక. 374

క. సురమునిగంధర్వాదులు, కర మలుకన్ నన్నుఁ జెఱుపఁ । గల్పించినభీ కరకృత్య మహాఘనవన, చరరూపముఁ బూని రజని।చరుల నడంపన్. 375

వ. అదియునుం గాక. 376

క. అని నాకు నోడి యింద్రా,ద్యనిమిషు లొనరించినట్టి యపకారం బే
యనుమానము లే దింకను, వనచరునిం బట్టి తేర వలయును మీరల్. 377

వ. కావున రథకరితురంగపదాతిబలంబులతోడం గూడి వివిధాయుధసంపన్నుల రై యరుగుం డు మీ కెదిరి యింద్రప్రముఖసురు లైన నిలువంగలరె య ట్లయినను గేవలవానరుంగాఁ జూడక యతిప్రయత్నంబునఁ గదనంబు సేసి వానిం బట్టి తెం డనవుడుఁ బతియాజ్ఞ శిరంబున ధరియించి హుతాశనప్రదీప్తమూర్తులును జతురంగబలపరివృతులును వివిధాయుధకలితులు నగుచు నరిగి మకరతోరణంబు మీఁద నుదయాచలస్థుం డై నతపనునికరణి దేదీప్యమానుం డగుచున్న పవమానసూనుం గనుంగొని యఖిలదిశలు నస్త్రమయంబులుగాఁ బొదివి రాసమయంబున దుర్ధరుండు దలకడచి. 378

క. మారుతసుతు నయి దాయత,నారాచంబులు శిరంబు నాటించిన ది
క్పూరితముగ నార్చుచుఁ గపి,వీరుఁడు గగనమున కెగయ వెస దుర్ధరుఁడున్.

క. తో నెగసి బాణవర్షము, వానరుపైఁ గురియ దాని వారించి మరు
త్సూనుఁడు నింగి సెలంగ మ,హానిల మంబుదముఁ దోలు నగ్గతిఁ దోలెన్. 380

వ. ఇట్లు దోలినం బోక వెండియు వాఁ డనికిం గదిమిన. 381

క. కడుఁబొడవు కెగసి మెక్కుడు,వడి దుర్ధరు తేరిమీఁద వనచరుఁ డుఱికెం
బిడు గురవడి గిరిపైఁ బడు,వడువున రథసహితుఁ డగుచు వాఁ డిలఁ గూలెన్.

వ. ఇట్లు నేలం గూలి గతాసుం డై నదుర్ధరుం జూచి యూపాక్షవిరూపాక్షు లుగ్ర
కోపంబున. 383

చ. ఇరువురు నింగికిన్ నెగసి యెక్కుడుదర్పము లార భూరిము
ద్గరములు ద్రిప్పి వైచిన నుదగ్రత నుర్వికి డిగ్గి వాయుజుం
డురుతరసాలముం బెఱికి యుగ్రతఁ ద్రిప్పుచుఁ బాఱుతెంచి య
య్యిరువురఁ గూలనేసి పొలియించినఁ గన్గొని యాగ్రహంబునన్. 384

తే. ప్రఘసుఁ[1]డు గ్రంపుఁ బ్రాసంబుఁ బట్టిసంబు, భాసకర్ణుఁడు శూలంబుఁ బరఁగఁ బూని
యలుక నొప్పింప రక్తసిక్తాంగుఁ డగుచుఁ, బవనజుఁడు బాలసూర్యునిపగిది నొప్పి.

క. తరుపన్నగమృగయుత మగు,గిరిశిఖరం బొకటి పెఱికి కినుకఁ దరఁగ న
య్యిరువుర రజనీచరులను, ధరపైఁ బడి నుగ్గుగా నుదగ్రత వైచెన్. 386

వ. అట్లిరువురం బరిమార్చి శేషించినసైన్యంబునకుం గవిసి. 387

క. కరిహరిరథయోధులతోఁ, గరిహరిరథయోధతతులు క్రమమున నుగ్గై
ధరఁ బడఁ బోరిఁబోరి వ్రేయుచుఁ, దరుచరవీరుండు దఱిమె దైత్యసైన్యంబున్.

1 డుఁ గ్రక్షురప్రాస పట్టిసంబు.

క. విఱిగినరథముల ధరఁ గ్రి, క్కిఱియఁ బడినకరటిఘటల కె నెమ్ములు నుగ్గై
యొఱిగినహయములఁ బఱియలు,పఱియలుగాఁ ద్రెళ్లియున్న భటసంఘములన్.

—అక్షకుమారుఁ డాంజనేయునితోఁ బోరి చచ్చుట.—

వ. అమ్మహాహవం బద్భుతరసావహం బగుచు రుద్ధమార్గం బయి యుండం గనుం గొని యార్చుచు హనుమంతుండు తోరణాధిరూఢుం డయ్యె న ట్లయ్యేవురు సేనానాయకులు బలంబులతోడఁ బొలియుట హతశేషులవలన విని సామర్షుండై రావణుం డక్షకుమారు నీక్షించినఁ గనుసన్న యెఱింగి కాంచనకార్ముక ధరుం డై హుతప్రదీప్తానలుండునుంబోలె నేపారి సభామధ్యంబు వెడలి తండ్రికి దండప్రణామం బాచరించి ముకుళితకరుండై నిల్చిన నీవు వోయి యా మర్కటాధముం బొలియించి ర మ్మనిన నతండును యుద్ధసన్నద్ధుండై త ప్తకాంచనమయంబును బాలసూర్యప్రభాశోభితంబును సమస్తాస్త్రశస్త్రపరివృతంబును రత్నమయధ్వజపతాకాభిరామంబు నతిమనోజవస త్త్వతురంగాష్టకయు క్తంబును వ్యోమగామియు నగునొక్క దివ్యస్యందనంబెక్కి మణిమయకుండలాంగదంబులు వెలుంగం దురంగశతాంగమాతంగవీరభటపరివేష్టితుం డై హయహేషాకరిబృంహిత రథనేమిస్వన వీరభట సింహనాదంబులు శంఖకాహళభేరీపణవాదివాద్యంబులతోడం గూడి రోదసీకుహరాంతరపూర్ణంబుగా నార్చుచు వచ్చి మకర తోరణంబునఁ గల్పాంతకాలాగ్నియుంబోలెఁ బ్రజ్వరిల్లుహనుమంతుం గనుం గొని విస్మయసంభ్రమాకులచేష్టుం డగుచుఁ గదిసి యతనివేగపరాక్రమంబులు వారించుచు మహీమధ్యదివాకరుండునుంబోలె వ ర్తించి సమరంబునకుం గంపిపక దుర్నివారుండై యున్నమారుతిం గని మూఁడువాఁడితూపుల ఫాలంబు నాటనేసి వెండియు నాటోపంబునఁ జాపంబు సారించుచు నొక్కయమోఘబాణంబు ద్రిప్పుచుం జనుదెంచిన. 390

మ. ధర గంపించెఁ బయోనిధుల్ గలఁగ వీతం బయ్యె వాతంబు భా
స్కరతేజం బడఁగెన్ గిరుల్ వడఁకెఁ జుక్కల్ రాలె నుల్కాసము
త్కరముల్ గూలె నభంబు మ్రోసె వడి భూతవ్రాతముల్ భీతిలెన్
నెరసెం జీఁకటి దిక్కులందుఁ బడియెన్ నిర్ఘాతసంఘాతముల్. 391

వ. అయ్యవసరంబున. 392

క. విమమబలుం డనిమిషవి, ద్విషుఁ డంచితహేమపుంఖవిమకలితాశీ
విషభీషణంబు లగుమూఁ, డిషువులు మ స్తకము గాడ నేసెఁ గపీంద్రున్. 393

తే. అపుడు నెత్తుటఁ దోఁగినయక్షుల మర, మ స్తకాలీఢబాణాంశుకమంతుఁ డగుచు
నంచితాంశులచేత నొప్పారునంశు,మంతుకై వడి నాహనుమంతుఁ డెనఁగె.

మ. నరిఁ జాపంబు సురేంద్రచాపము ధనుష్టంకారముల్ గర్జ లు

ద్ధురనానాయుధకీలజాలములు విద్యుత్పంక్తులుం గారణాం
బరయుక్తాతుకవారివాహము హనూమత్పర్వతేంద్రంబుపై
శరవర్షంబులు పెల్లుగాఁ గురిసె నాశాకుడ్యముల్ దూలఁగన్. 395

క. అంత హనుమంతుఁ డెంతయు, నంతకుకోపంబుతోడ నక్షునిఁ గని క
ల్పాంతఘనధ్వని నఖిలది, గంతరపూర్ణంబుగాఁగ నార్చుచుఁ బెలుచన్. 396

క. పరుషతరక్రోధంబున, నరుణాక్షుం డగుచు మారుతాత్మజు నక్షుం
డురుతృణసంవృతకూపముఁ, గర ముద్ధతిఁ గరటి చేరుకరణిం జేరన్. 397

శా. ఆకీశప్రభుఁ డాగ్రహంబున మహోద్యద్వాయుసంరంభుఁ డై
యాకాశంబున కుద్ధతిన్ నెగయఁ గ్రవ్యాదుండుఁ దోనేఁగి నా
నాకాండావలు లేయ వానిఁ గడిమి న్వారింప వాఁ డాతతా
నేకాస్త్రంబుల నంతరిక్షము దురుత్ప్రేక్షంబుగా నేయుచున్. 398

వ. తదీయాశుగభిన్నభుజుం డగుచు హనుమంతుం డంత సన్నద్ధశరాసనుండును సమరోన్ముఖుండును మహారథశ్రేష్ఠుండును బలపరాక్రమదక్షుండును నగునక్షునిం జూచి బాలుం డని తలంప రా దితనిబలపరాక్రమంబులు సురాసురులకు మనోభయంబులు గావున వీని వేగంబ పరిమార్ప వలయు నని యవక్రవిక్రమోత్సాహంబున. 399

క. పరుషతరహస్తతలమున, నురవడిఁ జఱవఁ దురగాళియుగసాయకకూ
బరములతోడను నుఱుమై, యరదము గగనమున నుండి యవనిం ద్రెళ్లెన్.

తే. రక్కసుం డట్లు నుగ్గైన రథము విడిచి, ఖడ్గకోదండపాణి యై గగనమునకు
నెగసె యోగపథంబున నియతితోడ, నాడలు దిగఁ ద్రావి దివి కేఁగు యోగిపగిది.

సీ. ఇట్లుగ్రుఁ డై మింటి కెగసినయక్షునిఁ, బక్షీంద్రుఁ డురగంబుఁ బట్టినట్లు
కడకాళ్లు వడిఁ బట్టి పుడమికి నేతెంచి, తొడవులు సెదరంగఁ దొడలు విఱుగ
నంగసంధులు వీడ నస్థులు నఱుముగా, భుజములు చదియంగ భూరిశిరము
పుఱియలుగా రక్తపూరముల్ గ్రక్కఁగ, వేమాఱు నేలతో వ్రేసి వ్రేసి
యంపపొదితోన నుఱుమాడి చంపి తన్ను
గరుడయక్షభూతములు నాఖండలాది
సురలు మానులు వెఱఁగంది చూడ విజయ
మంది తోరణమున కేఁగె ననిలసుతుఁడు. 402

వ. ఇట్లక్షుండు పొలియుట విని రావణుండు దనయంతరంగంబున దుఃఖాక్రాంతుం డై యెంతయుం జింతించి కొంతవడికి ధైర్యం బవలంబించి కోపసంఘటితభ్రుకుటినిటలుం డగుచు నింద్రజిత్తుం గనుంగొని. 403

క. అస్త్రధరశ్రేష్ఠుండవు, నిస్త్రైసుఁడ వఖిలనీతినిపుణుండవు ర

ఉస్త్రాతవు నిర్జితసుమన, స్త్రిదశేంద్రుఁడవు రిపువినాశనమూర్తీ. 404

చ. తనయ విరించిదత్తశరధన్యుఁడవుం రణకోవిదుండవుం
ఘనభుజవీర్యవంతుఁడవు గాఢతపఃపరిరక్షితుండవుం
వినుతతరప్రతాపుఁడవు విక్రమశాలివి నేను నీబలం
బనిమిషసేనఁ దోలి దివిజాధిపుఁ బట్టిననాఁ డెఱుంగుదున్. 405

క. ననుఁ బోలుదు బాహుబలం,బున నస్త్రబలంబునను దపోబలమునఁ గా
వున నిను లోకత్రితయం,బున నోర్వఁగ నెవ్వఁ డోపు భుజశౌర్యనిధీ. 406

వ. అని పలికి మఱియు ని ట్లనియె జంబుమాలిప్రముఖు లైనరాక్షసవీరు లనేకాసీకం బులతోడం బోయి పోలిసి రిం కెవ్వరు పోయిన నవ్వానరవీరునిచేతం బోలియు టయ కాని వానిం బొలియింప సమర్థులు లేరు నీ వసమానబలుండవు నీ కసాధ్యం బెద్దియు లే దైనను రాజధర్మంబు సెప్పెద నస్త్రశస్త్రబలంబులు దక్కఁ దక్కినబలంబులఁ బనిలేదు గావున వజ్రి వజ్రంబున మారుతం బాశుగమనంబున నగ్ని తీవ్రశిఖల జగద్విజయంబు నొందుపగిది నీవు నమ్మహావీరుం డగువానరుని బలపరాక్రమంబు లెఱింగి నిన్నేమఱక దివ్యాస్త్రప్రభావంబు సూపుచుఁ దగినవెరవున వానిం జిక్కువఱిచి లోకంబులు మెచ్చ విజయంబు నొందు మనవుడు నయ్యింద్రజిత్తు ప్రదక్షిణపూర్వకంబుగాఁ దండ్రికి దండప్రణామంబు లాచరించిన నతండును గాఢాలింగనంబు సేసి విజయశ్రీ గైకొను మని దీవించి యనుప వీఁ డ్కొని తీవ్రదంష్ట్రాముఖంబులు గరుడవేగంబులుఁ గలయాభీలతురంగంబులం బూన్చినయాదిత్యనిభం బగునొక్కరథం బెక్కి బధిరీకృతదిగ్వారణశ్రవణపుటం బుగా శుంభద్ధనుర్నిర్ఘోషంబు సెలంగించుచు నరుగఁ దద్ఘోరఘోషం బాలించి హనుమంతుండు సమరోత్సాహంబున మహానాదంబుగా సింహనాదంబు సేయ నతం డమ్మహానాదంబు విని కోపాటోపంబునం గదియ నడచె నాసమయంబున.

క. ఉరగులు సిద్ధులు యక్షులుఁ, బరమర్షులు నటకుఁ జూడఁ బ్రముదితు లై వ
చ్చిరి మృగములు వాపోయెం, దిరిగి విహంగములు మ్రోసెఁ దిక్కులు గలఁగెన్.

క. ఉరుతరవేగోద్ధతులును, నిరుపమబలయుతులు సమరనిశ్శంకులు ని
ష్ఠురబద్ధవైరులును నై, యిరువురుఁ జేరిరి సురాసురేంద్రులభంగిన్. 409

క. చేరి వడి [1]నింద్రజిత్తతి, దారుణబాణంబు లేయఁ దచ్ఛరవేగం
బారాముదూత వేగ ని,వారించుచు మింటి కెగయ వాఁ డాగి మఱియున్.

ఉ. ఆతతరత్నపుంఖనముదంచితరోచుల నేమిఘట్టనో
ద్ధూతరజోంధకారము విధూతముగా వినరద్గరుత్సము
ద్భూతసమీరఘాతములఁ దోయదమాలిక లోలిఁ దూల ని
ర్ఘాతనిపాతవేగపటుకాండపరంపర లేసె నేసినన్. 411

[1] నింద్రజితుండును.

క. శరముల కెదురై నడచును, శరమండలిలోన నాడు శరలక్ష్యము గా
కుఱుతరజవమునఁ దిరుగును, ¹శరవేగ మడంచు నగచరుఁడై మలయున్.

వ. ఇట్లిరువురు నొండొరులయంతస్సారం బెఱుంగక మత్సరంబునం బోరుసమయంబున నారావణి తనబాణంబు లమోఘంబు లయ్యును దనయేటున కగపడక లక్ష్యగోచరుండు గాక యద్భుతవిక్రమంబున మెఱయుచున్నపవమానసూనుం జూచి యతనిబలవేగంబుల కరుదందుచు నితం డవధ్యుం డజయ్యుం డని విచారించి యింక నూరక పోవుట కర్తవ్యంబు గా దనుచు నేకాగ్రచిత్తుం డై సమంత్రకంబుగా బ్రహ్మాస్త్రంబు వింట సంధించి బలుదెగఁ గొని మింటం బెనుమంట లడర బెట్టేసిన. 413

క. అమరులు బెగడఁగ నగనాం,తమునను బఱతెంచి వాయుతనయుని నయ్యా
స్త్రము బంధింపఁగ జవస,త్త్వము లెడలి విచేష్టుఁ డగుచు ధరణిం గూలెన్.

సీ. అటు గూలి తెప్పిఱి హనుమంతుఁ డట్లైన,బంధంబు బ్రహ్మాస్త్రబంధ మగుటఁ
దనగో నెఱిఁగి మున్ను దన కబ్జగర్భుండు, వలఁతియై యిచ్చినవరము దలఁచి
బ్రహ్మేంద్రమారుతపాలితుం డగునాకు, నీయస్త్రబంధంబు పాయు నెంత
యని యాత్మనియతిబ్రహ్మాస్త్రమంత్రధ్యాన,ము నొనర్చి బంధవిముక్తుఁ డగుచు
నజునియానతియును గొంతయనుసరించి,రాక్షసులు పట్టికొనిపోవరాక్షసేంద్రు
నొద్ద కేఁగి యతనితోడనొనర మాట,లాడి చూచెదఁ గాక యం చలరుచుండ.

క. అలుకను రాక్షసు లందఱు, బలువిడిఁ బఱతెంచి చూచి భర్జించుచు మ్రో
కులఁ బావనిఘనసంధులు, బలువుగ బంధించి పట్టి పైపైఁ దివియన్. 416

వ. పావనియు రావణదర్శనకుతూహలుం డగుచు. 417

క. తనబంధ మూడు టెఱిఁగియుఁ, గనుకని రక్కసులచేతఁ గట్టుల నంత
ర్జనముల ²నాటులఁ బోటులఁ, బెనుభర్త్సన వడుచు నధికభీతుఁడపోలెన్. 418

వ. ఉన్నహనుమంతుం గనుంగొని యితం డప్పుడ బ్రహ్మాస్త్రబంధవిముక్తుం డైన వాఁ డనుచు నింద్రజితుం డాశ్చర్యవిషాదంబులు పెనంగొన నంతరంగంబున.

ఉ. అక్కట యిట్టిలోకభయదాస్త్రముచేతను జిక్కఁడయ్యె వీఁ
డిక్కపి కన్యసాయకము లెంత దలంపఁగ నంచు లజ్జ నా
రక్కసుఁ డాసమీరసుతు రావణునొద్దకు మున్ను రక్కసుల్
గ్రక్కునఁ గట్టినట్టిపెడకట్టులతోడన తెచ్చి పెట్టినన్. 420

వ. అప్పు డుగ్రాకారుం డయి దశముఖుండు పదిముఖంబులఁ గోపంబు ముడివడ హనుమంతుం గనుంగొని. 421

ఉ. ఎక్కడిమర్కటుండొ తను నెవ్వఁడు వంచెనొ యేమి సేయఁగా

---

1 శరవేగము లోర్చు. 2 గాట్లం బోట్లం.

నిక్కడ వచ్చినాఁడో వధియింతము కాల్తము మొత్తి పుత్తమం
చెక్కుడుగిన్క రాత్రిచరులిందును నందును బట్టి యీడ్చుచుఁ జ
స్రుక్కక వ్రేయుచుం బొడుచుచుం జుఱ నిరసించుచు నుండ నయ్యెడన్. 422

క. రక్షోనాయకుఁ డుద్ధతి, వృక్షచర ప్రవరు రోషవిస్ఫారితతా
మ్రాక్షులఁ బావని గిన్క, వీక్షించె నతండు నాత్మ విస్మితుఁ డగుచున్.

సీ. తపనీయభూషణోదంచితరోచులు, సౌదామినులమాడ్కిఁ జాల మిగుల
రమణీయతనులిప్తరక్తచందనచర్చ, కలితసంధ్యారాగకాంతి మెఱయ
మకుటనానారత్నమణిగణదీధితుల్, పర్జన్యకార్ముకప్రభల నీన
భూరివక్షంబునఁ బొల్చుహారశ్రేణి, లలితబలాకాళిచెలువు నొలయ
భయదహుంకృతి గర్జలపగిదిఁ జెలఁగ, మేచకాభ్రంబుకైవడి మేను వెలుఁగ
దృష్టి కక్కజమారెడుతేజ మెసఁగ, వాఁడిమగఁటిమితోఁ గడువాలుమహిమ.

మ. పటువిస్ఫూర్జితపంక్తిమస్తకఫణిప్రస్ఫారబాహోగ్రుఁడుం
గుటిలభ్రూకుటిభీమధూమచటులక్రూరస్ఫులింగచ్ఛటో
ద్భటరోషాగ్నిశిఖాకులేక్షణుఁడుఁ బ్రోద్యత్ప్రలంబోష్ఠవి
స్ఫుటదంష్ట్రాళికరాళవక్త్రుఁడును జక్షుర్భీకరాకారుఁడున్. 425

ఉ. హాటకశైలశృంగసముదంచితజూటుఁడు రత్నచిత్రిత
స్ఫాటికభాసురాసనుఁడుఁ జారుదుకూలసమావృతుండు నై
జోటులు కంకణక్వణనశోభితపాణులు చేరి చామర
ల్వాటిగ వీవఁ బ్రాభవవిలాసనమున్నతు లొప్ప నొప్పుచున్. 426

వ. నానారత్నవిచిత్రితంబును గాంచనమయంబును నైనయాస్థానమండపంబునఁ బ్రహస్తప్రముఖు లైనమంత్రులు పరివేష్టింప సమరసేవితుం డైనదేవేంద్రుని మాడ్కి దేదీప్యమానుం డై మెఱసి యున్నలోకవిద్రావణు రావణుం జూచి జగత్ప్రాణతనూభవుం డచ్చెరు వందుచు నంతరంగంబున. 427

క. ఈరూపము నీఘనభుజ, సారము నీధృతియు నిట్టిసౌందర్యము వి
స్ఫారోదారగుణంబులు, నీరాక్షసవిభుని కొరయి ట్లొప్పెడునే. 428

క. పాతకవర్తియు రాక్షస, జాతుఁడుఁ గా కుండెనేని శక్రాదిసుర
వ్రాతంబున కధిపతి యై, యీతఁడు లోకంబు లెల్ల నేలం దగఁడే. 429

వ. అని విచారించువృక్షచరుని రోషతామ్రాక్షుం డగుచు నిరీక్షించి రాక్షసచక్రవర్తి ప్రహస్తున కి ట్లనియె. 430

క. నిను నెవ్వఁడు పుత్తెంచెను, వన మేటికిఁ జెఱికి తీవు వడి రాక్షసభం
జన మేల సేసి తెవ్వఁడ, వని యడుగుము నావుడుం బ్రహస్తుం డతనిన్. 431

క. కనుఁగొని తేజము చూడఁగ, వనచరమాత్రుఁడవు గావు వచ్చినపని వం
చనసేయక భయ మందక, వినిపించిన నిన్ను వేగ విడిపింతుఁ దగన్. 432

క. సురవరుఁడో దండధరుఁడో, వరుణుఁడో ధనదుండో దైత్యవరుఁడో ని న్నీ
పురి సొర దూతగఁ బంచిన, యురుబలుఁ డెవ్వండు నాకు నొప్పఁగఁ జెపుమా.
వ. అనినం బ్రహస్తున కనిలజుం డి ట్లనియె. 434

—హనుమంతుఁడు తనవృత్తాంతంబును రామునిప్రభావంబును రావణునకుఁ జెప్పుట.—

క. హనుమన్నాముఁడ మారుతతనయుఁడ రఘురాముదూతఁ దపనప్రియనం
దనునకు సచివుఁడ నిక్కపు, వనచరుఁడఁ సీత వెదక వచ్చితి నిటకున్. 435
క. దివిజారిదర్శనం బన్యవిధములఁ నాకు దొరక దని వనభంగం
బు వడిం జేసితిఁ జేసితి, బవరము నారక్షకోటికి బలములతోడన్. 436
చ. కరము విరించిచే వరము గాంచిననన్ను శరంబులఁ సురా
సురులకుఁ గట్టరాదవుటఁ జూ శరముక్తుఁడ నైతి లోకభీ
కరు దశకంఠు నొందుగతిఁ గాన నశక్యము గాన రాక్షసో
త్కరములచేతఁ గట్టువడి కన్గొను వేడుకతోడ వచ్చితిన్. 437
వ. అని పలికి రావణుం గనుంగొని. 438
క. ఇనజుఁడు నీతోఁబుట్టువు, నినుఁ గుశలం బడుగు మనియె నృపతియు రవినం
దనుఁడును నీకును బుద్ధులు, దనరంగాఁ జెప్పు మనిరి తగవున నీవున్. 439
వ. వినుము దశరథుం డనురాజేంద్రునితనయుండు రామచంద్రుండు సీతాలక్ష్మణ
సమేతుం డై తండ్రియానతి వనవాసంబున కేతెంచి దండకావనంబున దర్పితు
లైనఖరదూషణాదులం దునిమి యచటం దనపత్నిఁ గోల్పోయి యనుజుండును
దాను నెల్లదిక్కులు వెదకుచు ఋశ్యమూకంబు చేరి యచ్చట సుగ్రీవుతోడ
సఖ్యంబు సేసి యతనికిఁ బ్రియంబుగా వాలిం దునిమి తద్రాజ్యంబున కధిపుం
గా సుగ్రీవుం బట్టంబు గట్టి సీతాన్వేషణంబు సేయింపు మనిన సుగ్రీవుండును
గరుడానిలవేగులును మహాసత్త్వసంపన్నులు నగుననేకవలీముఖకోట్ల సర్వలో
కంబులు వెదకి సీత నరసి రం డని పనిచె నేనును రాఘవసుగ్రీవులయానతి సము
ద్రం బవలీల దాఁటి లంకాపురి సొత్తెంచి యంతట వెదకి యయ్యశోకవనిమ
ధ్యంబున నున్నజనకరాజనందనం గాంచితి ధర్మవిరుద్ధంబును గులనాశకంబు న
గుపరదారాపహరణంబు నీయట్టిబుద్ధిమంతులు గావింతురె ధర్మశీలుఁ డగువాఁ
డనపాయసుఖంబులం బొందుఁ బాపశీలుండు వివిధాపాయదుఃఖంబు లనుభవించు
నీవు పరకాంతం దెచ్చి పాపంబున కొడిగట్టి చెడ నున్నాఁడ వని పలికి మఱియును.
సీ. చరణాగ్రమున నీభుజాదర్ప మడఁచిన, ధూర్జటివిలు లీలఁ ద్రుంచి వైచె
వాలపాశంబున వడి నిన్నుఁ గట్టిన, వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నని నిన్నుఁ జెఱగొన్నయర్జునుఁ బోరిగొన్న, పరశురాముని నాజి భంగపఱిచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ, బదునాల్గువేవుర బారిసమరె
నమ్మహాధనుర్ధరున కె గ్గాచరించి, హరిహరబ్రహ్మశక్రాదు లైన నతని

భయదనిర్ఘాతసంఘాతపాతశాత, బాణఘాతహతులు గాక । బ్రదుకఁ గలరె.
ఉ. ఊరవడి రాఘవాస్త్రతతు । లుగ్రతరార్చుల మింట నంట నీ
కరము లురంబు నంగములుఁ । గంఠము లాస్యము లంఘ్రు లూరులున్
శిరములు మర్మముల్ బరులుఁ । జించుచుఁ ద్రుంచుచు నుచ్చిపాఱుచున్
మురియలు సేయుచున్ నిగుడ । మూఁడుజగంబులు నాఁప నోపునే. 442
శా. శ్రేణీభూతము లై దిగంతముల విక్షేపించు సౌమిత్రిదో
స్తూణాగ్రోజ్ఝితరుక్మపుంఖకషణోద్భూతస్ఫులింగచ్ఛటా
క్షీణజ్వాలధురీణబాణములు వర్షింపంగ నీ వేల స
ప్రాణత్రాణశరీరు లై నిలుతురే । బ్రహ్మాదులున్ ముందటన్. 443
మ. తురగస్యందనమత్తవారణభటస్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁ గాల్చి సైనికసుహృత్పుత్రానుజశ్రేణి న
త్తురు గ్రక్కం బడ గ్రుద్ది చంపి మఱి మృత్యుక్రూరతం బట్టి నీ
శిరముల్ ద్రుంపఁగ నేన చాలుదు జయశ్రీలబ్ధి వర్ధిల్లఁగన్. 444
క. సుగ్రీవాదులయెదుట నుదగ్రగతిన్ నిన్నుఁ ద్రుంతు । ననురఘుకుల వీ
రాగ్రణిప్రతిజ్ఞ కతన న,శగ్రీవుఁడ బ్రతికి తీవు । చావక నాచేన్. 445
ఆ. అజునివరము నీకు । నమరగంధర్వాసు, రాహియక్షరాక్షసాలిచేత
మడియ కుండఁ గాని । మనుజవానరులచేఁ, గలనఁ జావకుండఁ । గాదు వినుము.
క. ఘనుఁ డగురాముఁడు మనుజుం, డినజుఁడు వానరుఁడు గాన । యియ్యిరువురచే
ననిఁ జావఁగలవాఁడవు, మనమున నామాట నమ్మి । మతకరి వగుచున్. 447
శా. నీకంఠార్పితకాలపాశము శిరోనిర్ఘాతపాతంబు లం
[1]కాకస్సంవయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క
న్యాకారాంగతమృత్యువున్ జనకకన్యన్ వేగ యొప్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీ । కీబుద్ధి గా కుండినన్. 448
క. సీతాశ్వాసములకోప,స్ఫీతానలశిఖలు గలయఁ । బేర్చుచు లంకా
భూతవ్రాతము భస్మీభూతముగాఁ జేయు ననుడుఁ । బొడమినకిన్కన్. 449
మ. కుటిలభ్రూకుటిభీమఫాలదశకక్రూరోరునాసాపుటో
ద్భటలంబోష్ఠహనుప్రకంపననటద్దంష్ట్రాతిఘోరాస్యుఁ డై
పటుదృష్టిస్ఫుటవిస్ఫులింగములు పైపైఁ గ్రమ్మ నీకష్టమ
ర్కటునిం జంపుఁడు నా విభీషణుఁడు ధర్మం బొప్ప లంకేశుతోన్. 450
శా. ఈకోపంబున కగ్నియో వరుణుఁడో । యీశానుఁడో వాయువో
నాకాధీశుఁడో యక్షనాయకుఁడో కీనాశుండో కోణేశుఁడో
యాకీశాధముఁ డెంతవాఁ డరయ వీఁ । డి ట్లగ్గ లే మాడినన్

1 కాకస్సంచరకాళరాత్రి.

నీకుఁ వధ్యుఁడు గాఁడు సైఁపు మదిలోఁ ♦ నీ వింక లంకేశ్వరా. 451
క. దూతకు వధకంటెఁ గశా,ఘాతము ముండనము నంగ♦కర్తన మంకం
బాతతదండము లెందును, దూత యవధ్యుఁ డని చెప్ప♦ నుదు ధర్మవిదుల్.
వ. అని పల్క రావణుండు విభీషణునిపల్కు లాదరించి. 453
క. తరుచరునకు వాలము ప్రియ, కర మగుటను వీనితోఁకఁ ♦ గాలిచి నక్తం
చరు లందఱుఁ జూడఁగ నీ, పుర మంతయుఁ గలయఁ ద్రిప్పి ♦ పుచ్చుం డనినన్.
వ. ఉద్ధతి రణకర్కశు లగురక్కసు లక్కపీంద్రుం గవిసి. 455

—❖ రక్కసులు రావణునాజ్ఞచే హనుమంతునితోఁకఁ గాల్చుట. ❖—

క. హనుమనివాలము పెరుఁగఁగ, ఘనతరకార్పాసపట్ట♦కాశ్రేణులఁ గ
స్కనిఁ జుట్టి నూనె నానిచి, యనలం బిడి మండ నూఁది ♦ రర్చులు నెగయన్.
ఉ. అప్పుడు శుష్కకాష్ఠనిచ♦యజ్వలితాగ్నిసమప్రదీప్తుఁ డై
యొప్పుచుఁ గీలజాలకలి♦తోన్నతవాలము రాతిసాలిపై
నిప్పులు రాలఁ ద్రిప్పుచును ♦ నిండినసందడి వాయఁ జూఁడుచుం
దప్పక పౌరు లోలిఁ దనుఁ ♦ దద్దయు విస్మయ మంది చూడఁగన్. 457
క. రోమాంచావృతవపు వు,ద్దామాభ్రముభంగి మెఱయఁ ♦ దర్కోద్య
ద్భీమతరవాల ముగుసా,దామనిగతిఁ దనరఁ దనరి ♦ తరుచరుఁ డాత్మన్. 458
క. ఈకట్లు ద్రెంచికొని యీ, నాకాగులఁ జంపునపుడు ♦ నానారక్షో
నీకంబులు గల వేగతిఁ, జేకొని కడలేనిరణము ♦ సేయుదు నింకన్. 459
వ. కొంతకడ వేమైనఁ జేయ నిమ్ము సైరించెద మున్ను రాత్రి గానంబడనియీలంకా
పురంబునం గలయశేషవిశేషంబులు దివాసమయంబున నీరక్కసులు ద్రిప్పి
కొనిపోవం బోయి చూచెదం గాక యనుచుండ నంతలోఁ గాలకింకరభయం
కరాకారు లగునారాతిసకింకరులు బిలువిడిం గవిసి. 460
ఉ. ఉరవడి శంఖకాహళము ♦ లూఁదుచు దిక్కులు వ్రయ్య నార్పుచుం
బెరసి మృదంగనిస్సహణ♦భేరులు ఘోషిల ద్రేయుచుం భుజో
ద్ధురబలుఁ డైనవాయుసుతుఁ ♦ దోరపుమ్రోకుల బల్వుగా మద
ద్విరదముఁబోలెఁ గట్టికొని ♦ వీథులఁ ద్రిప్పఁగఁ జూచి రక్కసుల్. 461
క. చని సీతో భాషించిన,వనచరునిం బట్టి తోఁక ♦ వడిఁ గాలిచి యం
గన పురిఁ ద్రిప్పుచు నున్నా, రనవుడు నాపల్కు శస్త్ర♦హతిగతిఁ దాఁకన్. 462
వ. సీత యత్యంతదుఃఖాక్రాంత యై యాత్మ నతినిష్ఠ నగ్నిదేవు నుద్దేశించి. 463
సీ. నాజీవితేశుఁడు ♦ నావగ లుడుపంగ, వడి సముద్రము దాఁటి ♦ వచ్చునేని
పతి కృతజ్ఞుఁడు సత్య♦భాషావిశేషుండు, నతిపుణ్యచరితుఁడు ♦ నయ్యెనేని
గురుల కే శుశ్రూష ♦ కోరి చేయుదునేని, నఖిలసన్నుతసాధ్వి ♦ నైతినేని
తపము సేయుదునేని ♦ దమశమాన్విత నేని, నిరతశీలవ్రత♦నియత నేని

వెలయ భాగ్యవిశేషముల్ గలుగునేని, నీవు నాపయి సత్కృపాన్వితుఁడ వేని
పరఁగ నగ్నిదేవుఁడ రామభక్తుఁడైన,మారుతాత్మజునకు శైత్యకారి వగుము.
క. అని జనకజ యనలప్రా, ర్థన చేయఁగ నంతటం బ్రదక్షిణశిఖ లే
పున నెగయఁ బ్రజ్వలించుచు, ననలుఁడు హనుమంతునకు హిమాంశుండయ్యెన్.
క. [1]ఆయెడ వాలాగ్రంబున, నాయతగతి మండుచున్న యయ్యనలము ప్రా
లేయముగతి నతిశీతల, మై యుండుట కరుదు నొంది యనిలజుఁ డాత్మన్. 466
క. రామునిసామర్థ్యముననొ, భూమిజకారుణ్యముననొ పొందుగఁ బవనో
ద్దామసహాయంబుననో, నా మేను దహింప వీయనలతీవ్రశిఖల్. 467
వ. అనుచు సంతోషించి మహోత్సాహంబున. 468
చ. బలువుగ రక్కసుల్ దిగిచి పట్టినపాశము లెల్లఁ ద్రెంచికొం
చలఘురయంబుతో నెగసి యార్చుచు గోపుర మెక్కి యచ్చటన్
బలువిడి సూక్ష్మగాత్రుఁ డయి బంధము లన్నియు నూడ్చి యున్నతా
చలనిభదేహ మెప్పటి విశాలముగా ధరియించి యేపునన్. 469
క. మును తోరణమునఁ బెట్టిన,ఘనతరపరిఘంబు లీలఁ గ్రాలఁగఁ గేలం
గొని తనుఁ బట్టినదనుజుల, మునుకొని వడి నేలఁ గూల మోఁది వధించెన్.
క. వాలి యిటు విక్రమించి వి,శాలారుణవదనహారిజం బలరఁగ లాం
గూలాభీలజ్వాలా,మాలి యగుచు మెఱసె నంశుమాలియుఁబోలెన్. 471
వ. ఇట్లు మెఱసి. 472
క. నావాలంబున వెలిఁగెడు,పావకునకుఁ దృప్తి గాఁగఁ బైపైఁ గ్రవ్యా
దావాసము లాహుతులుగఁ, గావించెద నింక ననుచుఁ గపిపతి కిన్కన్.

హనుమంతుఁడు లంకఁ గాల్చుట.

ఉ. మింటఁ జటచ్చటధ్వనులు మేఘఘనధ్వను లై చెలంగ నిం
టింటికి దాఁటి వాలమున నేచినచిచ్చు దగిల్చి దిక్కుల
న్నింటను విస్ఫులింగములు నిండఁగఁ జల్లుచు మంట లాకసం
బంటఁగ నుబ్బి యుగ్రత సమస్తగృహంబులు గాల్చుచున్నెడన్. 474
చ. అవె యివె పెన్బొగల్ నెగసె నక్కడ మండెఁ దొడంగె నల్లచో
నవె ఘనవిస్ఫులింగతతు లాకస మంటెడుఁ బేర్చునర్చు ల
ల్లవె హయశాలలన్ రథగజాయుధశాలల ధాన్యశాలలన్
ద్రవిణలసత్త్రశాలలను రావణుపట్టపుసర్వశాలలన్. 475
వ. అనుచుం గళవళంబునం బౌరు లిట్టట్టును బఱవం జొచ్చి రట్టియెడ. 476
మ. అమరేంద్రాయుధసన్నిభంబు లయి ఫుల్లాశోకకాలాయసా
భము లై కింశుకలోహితప్రకరరోచిష్యస్ఫూర్తు లై హేమవి

1 ఆయెడను మహాగ్రంబుగ, నాయతశిఖ లడరుచున్న యయ్యగ్నియుఁ బ్రాలేయ,

భ్రమధూమప్రతిమంబు లై వివిధవర్ణశ్రేణు లై సుద్యదమ్మా
మము లై యొక్కొకయింటిపై నెగసెఁ బెన్నాదుచుండ గ్రధ్వనిన్. 477

క. భాసురధవళాభ్రనిభ,ప్రాసాదచయంబు లోలి కెగఁ గాలిన
లాసక్తము లై మండుచు, భాసిల్లెం గనక శైలమ్మఁ దలఁచిగన్. 478

సముదనలకీల సర్వ,క్రమముల మండుచు మ[redacted]గ్నిఁ గాల్లవిత
ద్రుమతతులు కింశుకాశో,కమహీజావలులుఁ స్వామికఘాతుఁడు నుండెన్. 479

క. గాలితనూజుఁడు మూర్త,జ్వాలియుఁబోలెఁ సేయఁ గొంక
జ్వాలాజాలావృతుఁ డై, పౌలస్త్యవిమానపహొత్తు కోపానకెకెన్. 480

చ. సురుచిరహేమవజ్రమణిరశ్మికిజకుట్టిమచారు రార్యులు త్తవ
స్ఫురితవిమానరాజములు భూరితరార్చులఁ వెంగలి నై తినేం
బొరిఁబొరి నేలఁగూలెఁ గృతపుణ్యఫలానుభ[illegible]కీలల[illegible]
చ్చెర దివినుండి భూమిఁ బడుసిద్ధవిమానచయం[illegible]కై వడిన్. 481

వ. ఇట్లార్చి పేర్చి వాతూలనందనుండు నిజవాలవ్యజనసంజాతమారుతసహాయుం
డును దత్పవనప్రవృద్ధానలప్రదీప్తుండు నగుచు మఱియు. 482

శా. కాలాభీలతరాగ్నికీలచయనిర్ఘాతంబు లింటింటిపైఁ
గూలఁగ వాలము ద్రిప్పుచుం దిరిగె దిక్కూలంకషోగ్రస్ఫులిం
గాలోలచ్ఛట లుద్ధతిఁ నెగయ నుద్యద్భ్రమధూమంబు వా
తూలవ్యాప్తనభోంతరాళముగ మృత్యుక్రూరసంరంభుఁ డై. 483

క. రక్షోనాయకుఁ డప్పుడు, రాక్షసులుం దాను శోకరభసంబులతో
నక్షీణము లగుమంటలు, వీక్షించుచు నగరువెడలి వెలుపట నుండెన్. 484

క. కొందఱు ఘనధూమంబుల,సందడి నేదిక్కు వోవఁ జాలక మంటల్
క్రందుగఁ గ్రమ్మెడువీథుల,యందు భయార్తులయి బ్రమసి రంగము లెరియన్.

చ. కవిసినధూమజాలములఁ గన్నుల నీళ్లులు గ్రమ్మ నేడ్చుచున్
యువతులు బాలవృద్ధులును నొండొరుచెట్టలు పట్టికొంచు నా
రవముగఁ జీరుచున్ గృహపరంపర వెల్వడి త్రోవ గాన కా
భవనగణాంగణంబులను బైపయి మ్రందిరి తీవ్రకీలలన్. 486

చ. పదములు వట్టుచుం దొడలు ప్రాకుచు నేచి కుచంబు లంటుచుం
బెదవులు చీఁకుచుం గరము పేర్చి కచగ్రహణంబు సేయుచున్
సుదతులయందు భాగములు సూపుచుఁ బావకుఁ డొప్పె నెంతయున్
మదనసుఖోచితక్రియలు మక్కువఁ జల్పెడుకామికై వడిన్. 487

వ. మఱియు నప్పుడు పానమదావేశంబున గేహంబులు వెలువడ నెఱుంగక తీవ్ర
కీలలం గాలి మ్రందువారును బ్రియకాంతలుఁ దారును రతిశ్రాంతు లై నిద్రించి
యుగ్రజ్వాలలు పొదివిన నట్ల పెనఁచికొని చచ్చువారును దమతమసొమ్ములు దేర

గృహంబులు సౌశీతమముల్ గోనాభీలార్చులు పేర్చిన నచ్చట గతాసులైనవారును నతిస్ఫీతస్వేద రామకభలు పట్టదిగం దాంచి దిగంబరులగుచుం బోవువారును విస్ఫులింగనలస్ఫారిధన స్రకేశంబులు పట్ట వెతకుడిచి దులుపుకొనువారును శాలలు వెలువజ్వలించుచు, బఱచి నలుగడల ననలశిఖలు పొదువం దిరుగుడువడి పుడమిం బడుతుగ్రంబున, నాయపొండంబులుం గొమ్ములుం దోంకలు గురుసులు దాంకం గాలి శైలాత్రిశిఖల, మైయ్యులినశుండాలంబులును బత్తుంబులు కమలిన సుడివడుచు ముడింగియ్యమునన్, భూమినపారావతంబులును నంగారంబులైన తేరులును బెనుమంట మబ్బుననో, నామేనుకినయట్టాలకచిత్రయంత్రవ్రాతంబులును దునిసి పడినకైదువులేషించి మహాత్తాలెగయ మండెడుధాన్యరాసులును జూర్ణంబులైనవజ్రవైదూర్యముల్ దిగిచి కపౌక్తికపద్మరాగాదినానారత్నంబులును జిటిలిపడి పొడిపొడి యై యంత్రేనగర్ప్రాకారసౌధహర్మ్యాదులును బెనుముద్దలుగాం గరంగి కూలినరజతకాంచనమయప్రాకారతోరణంబులును భస్మంబులైనధ్వజాతపత్రంబులును గలయం గాలినబొక్కసంబులును గారాకులు దరికొని మండి ఛటచ్ఛటధ్వనుల మొదలంటం గాలి చాంపకట్టుగాం బడినయుద్యానవనంబులును నై సర్వవస్తుశూన్యంబును గరాళజ్వాలాజాలావృతంబును నుద్ధూతభీమధూమస్తోమాలక్షితాంతరాళంబు నగుచు నశోభితంబై లంకాపురం బుండ నప్పు డుగ్రకీలల మేనులు గాలం గనలి క్రూరాకారులు నుద్దీపితప్రతాపులు నగురక్షోవీరులు కోపాటోపంబునం జేరి. 488

తే. [1]ప్రాసశూలపరశ్వధపట్టిసాసి,ముసలముద్గరపాణులై మునుంగ మునరి
రభసమునం దన్ను నొంపంగ బ్రబలశక్తి, వారినందఱ వధియించె వాయుసుతుండు.

వ. ఇట్లు వనభంగంబును లంకాదహనంబు నొనర్చి తొడరినరాక్షసానీకంబునుం బరిమార్చి తన్ను గోపురశిఖరతోరణహర్మ్యగవాక్షంబుల నిలిచి రక్షోవీరులాశ్చర్యభయంబులతోడం జూడ దేవగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరకింపురుషమునిగణంబులును సర్వభూతంబులును బరమసంప్రీతులై ప్రశంసింపం జని సముద్రంబునం దనవాలానలం బార్చుచుండె నంత నిక్కడ సీతం గదిసి వీనుల కింపు నంపాదింప సరమ యిట్లనియె. 490

చ. జనకజ నీవు తద్దయు విషాదము నొందుచు వాయుపుత్త్రుకై
మనమున నేల చింతిలెదు మారుతపుత్త్రుండు కట్టులెల్లం దు
త్తునియలు గాంగం ద్రెంచికొని దుష్టనిశాచరకోటిం గ్రొవ్వఱం
దునిమి సమస్తదిక్కులను దోర్బలసంపదం బేర్చి వెండియున్. 491

క. అఖిలవాలకీలల,భూభృచ్చరపుంగవుండు పొరిం బొరి నీలం
శాభవనము లన్నియు భ, స్మీభూతమ్ములుగం జేసి చేవ యెలర్పన్. 492

---

1 ప్రాసతూలాయుధాయసపట్టిసాసి.

క. సేమమున నున్నవాఁ డని, యామారుతి పల్క నుద్యదమృతోపమ మై
యామాట చెవులు సోఁకిన, నామోదము నొందుచుండె నవనిజ యంతన్.

క. తరుచరవరుఁ డప్పుడు భీ,కరశిఖి భస్మంబు గాఁగఁ గాలినలంకా
పుర మెల్లఁ గలయఁ జూచుచు, ధరణీసుత నాత్మఁ దలఁచి తల్లడపడుచున్.

క. కోపమున నకట యీలంకాపుర మంతయు ఘోరాగ్నిఁ గాల్చితిఁ బురిలో
భూపుత్త్రి యునికి దలఁపక, కాపేయము సేసి స్వామిఘాతుఁడ నైతిన్. 495

క. కోపులు గురువధ కోడరు, కోపులు పరనింద సేయఁ గొంకరు కోపం
బాపదల కెల్ల మూలము, కోపము పాపంబుపొత్తు కోపానలమున్. 496

క. విపులక్షమాజలంబుల, నుపశమ మొందింతు రార్యు లుత్తమబుద్ధిన్
వ్యపగతమతి నై నే నీ,విపరీతక్రమముఁ జేసి వెంగలి నైతిన్. 497

ఉ. భీమము గాఁగ నెల్లెడలఁ బేర్చినయాఘనవహ్నికీలలన్
భూమితనూజ కే మెడరు పుట్టెనొ యింక నృపాలుపాలి కే
నే మని పోదు భానుజున కే మని చెప్పుదుఁ జావు దక్క నొం
డేమియు లేదు నాకు మనుజేంద్రమనోరథకార్యఘాతికిన్. 498

వ. అనుచుఁ గొంతవడి చింతాక్రాంతుం డై మగుడఁ దెలివి నొంది. 499

క. భూసుతకు రామవిభునకు, దాసుఁడ నగునాదుమేను దరికొని శిఖలన్
గాసిల్లఁగ మును గాల్పం, డాసతి జగదంబ నేల యనలుఁడు గాల్చున్. 500

చ. అదియును గాక జానకిసమగ్రసతీత్వతపఃప్రభావసం
పద రఘురాముపుణ్యగుణపావనశీలపరాక్రమంబులం
గదియఁగ నెట్లు వచ్చు విభుకామిని నగ్నికి నాఁగ నంతలో
ముద మెదవంగ నింగి నట ముందట నేఁగెడుసిద్ధచారణుల్. 501

చ. అనిలతనూజునంతనముదగ్రబలుండు గలండె సర్వభూ
జనములు మెచ్చ భీకరనిశాచరకోటులఁ ద్రుంచి వైచి య
త్యనుపమశక్తి లంకఁ గలయంతయుఁ గాల్చె నొకండ సీతమై
యనలము సోఁక దించుకయు నాసతిభాగ్యవిశేష మెట్టిదో. 502

క. అనుడుం బావని యెంతయు, మనమున సంతోష మంది మఱి నే విభుమ
న్నన గంటి ననుచు నే చని, జనకజపాదముల కెరఁగి సమ్మతి నిలువన్. 503

క. వైదేహి చిత్తమునఁ గడు, మోదించుచు విభునిమీఁది మోహంబున నా
భూదయితుప్రియునిఁ బావని, నాదటఁ బలుమాఱుఁ జూచి యనురాగమునన్.

క. అనిలుఁడు గరుడుఁడు నీవును, వననిధి దాఁటంగఁ జాలువారలు వేగం
బునఁ గడిమి నీవు దక్కఁగ, ననిమిషరిపుపురముఁ గాల్ప నన్యులవశమే. 505

క. భూమీశునిష్ఠోరామికి, నీమెయిఁ దక్కొరులు గలరె నీయురుబంధ
స్తోమము నేగతిఁ బాసితి, సేమము నొందితె మహాగ్నిఁ జిక్కక యనఘా. 506

క. కడుఁ గ్రూరనిశాటుల నే, వడువున నిర్జించి యిటకు వచ్చితి నా కీ
యెడ లుడుపఁగ నిం కేగతిఁ, గడిఁదిసముద్రంబు నీవు గడచెదు కడిమిన్.

క. నీయున్నయంతదడవును, బాయనిదుఃఖముల నెల్లఁ బాసితి నింకన్
వాయుసుత నీవు వోయిన, నాయతదుఃఖములు నాకు నయ్యెడిఁ దండ్రీ. 508

క. నేఁ డుండి యెల్లి పోదఁట, పోఁడిగ నొకచోట దప్పి పో నుండు తగన్
నేఁ డైన శోకవహ్నిన్, మాఁడక యుండెద సహించి మారుతపుత్రా. 509

క. అనవుడుఁ దల్లీ వగవకు, ఘనతరసైన్యములతోడఁ గపిపతి సుగ్రీ
వుని రామలక్ష్మణుల వే, కొనివచ్చెద నిటకు నీదు కోరిక లారన్. 510

వ. వచ్చి యవ్వీరవరుండు కింక నీలంకపై విడిసి యుద్దండకోదండపాండిత్య మమర.

ఉ. మండితవిస్ఫులింగవిష మజ్వలితానలకీల లబ్జగ
ర్భాండము నిండ రామవసు ధాధిపుఁ డేసెడు వజ్రసాధనా
ఖండితపంక్తికంఠఘన కంఠపురాంతకశైలచాలనో
ద్దండబలప్రచండభుజ దండవిఖండనచండకాండముల్. 512

వ. ఇ ట్లేసి యవక్రవిక్రమంబున. 513

ఉ. రావణుఁ ద్రుంచి లోకములు ప్రస్తుతిసేయఁగ ని న్నయోధ్యకున్
భూవరపుంగవుండు గొని పోయి మనోరథభోగసౌఖ్యముల్
వావిరిఁ బొందుచున్ నృపతి వంద్యపదాబ్జము లొప్ప సర్వథా
త్రీవలయంబు నేలెడి మదిం దలఁ కొందకు మింకఁ బోయెదన్. 514

వ. [1]అని కండలితహృదయారవిందుండై పవననందనుండు దశస్యందననందనసుందర
పదారవిందంబుల కందండ వందనంబులు సేసి యద్దేవి వీడ్కొని గమనోన్ముఖుం
డగుచు సాలతాలహింతాలతమాలనీలోపవనంబుల బహుళమంజులమంజరీరం
జితలతాకుంజపుంజంబుల నాభీలసింహశార్దూలశుండాలస్థూలకోలవృకప్రముఖ
మృగంబుల నానామునియక్షగంధర్వసిద్ధవిద్యాధరకిన్నరోరగసేవితకందరంబుల
విచిత్రవర్ణంబులఁ జెలఁగునొక్కశైలం బెక్కి యుత్తరాభిముఖుం డై. 515

—❀ హనుమంతుఁడు మరలి సముద్రంబు దాఁటివచ్చుట. ❀—

మహాస్రగ్ధర. కనియెం గపీశుఁ డంతన్ గగనగతతరంగచ్ఛటోత్సేధి శశ్వ
ద్ఘనవేలాభీలకూలంకషమకరముఖగ్రాహసంబాధి భూరి
ధ్వనిసంరంభప్రబోధిన్ వరమణినికరవ్యాప్తనద్యాపగాత
త్యనురోధిన్ బాడబోష్ణాతతచటులశిఖాంతర్నిరోధిం బయోధిన్. 516

వ. కని మహోత్సాహంబున. 517

సీ. బిట్టూని కుప్పించుపృథుపాదములవడి, శేషాహిఫణములు సెదరి పాఱ
విపులోరుజవమున విఱిగి తో నెగసిన, తరులు తారకముల దెరియ నడువ

---

1 ‘అనుచుం బ్రణమిల్లి యద్దేవి వీడ్కొని గమనోన్ముఖుం డగుచుఁ బవనజుండు సాలతాల’ వ్రా. ప్ర.

మెయిగాలిఁ గడలెత్తి మిన్నేఱు గలఁగంగ, నురుమేఘమాలిక లోలిఁ దూల
ఘనఘోషణం బన ఘనసింహనాదంబు, బ్రహ్మాండభాండంబుఁ బగులఁజేయ
బెదరి సింహతతులు బిలముల ఘోషింప, వితతశిఖరవితతి విఱిగి పడఁగ
సానుకందరముల సంధులు వ్రీలంగఁ, బవనసరణి కెగసెఁ బవనజుండు. 518

సీ. అప్పుడు గంధర్వయక్షకిన్నరనాగ,విద్యాధరస్త్రీలు వెగడు నొంది
యంబరంబులు వీడ నాకల్పములు రాల,విభులతో నిలయముల్ విడిచి చనఁగ
శిరములు చదియంగ జిహ్వలు వెడలించి,విపులసర్పంబులు విషము లుమియ
జలధాతుచయములు సెలయేఱులై పాఱఁ,బెలుచ నాడెడుభంగిఁ జలనమొంది
యొగిశిలల్ రాల ముప్పదియోజనముల,పొడవుఁ బదియోజనమ్ముల నడిమివలము
గలుగు నగ్గిరి తరుమృగాళులతోడ, ధరణితలసమానంబుగా ధరణిఁ గ్రుంగె.

వ. ఇట్లద్భుతమహాకారుం డగుచుఁ బక్షంబులతోడి శైలంబునుంబోలె నాకాశ
మార్గంబున నభ్రభీషణఘోషంబుగా నార్చుచు మనోజవంబునం బఱతెంచు
సమయంబున. 520

చ. అనిలజుసింహనాదరవ మచ్చుగ నంగదముఖ్యవానరుల్
విని పరమప్రియంబునను వృక్షము లెక్కియుఁ గొండ లెక్కియుం
గనుఁగొనఁ జాపముక్తపటుకాండసమత్వరఁ బాఱుతేరఁగా
ఘనుఁ డగుజాంబవంతుఁడు దగం గపివీరులతోడ నిట్లనున్. 521

క. జనకజఁ బొడగన నోపును, హనుమంతుఁడు గానకున్న నతిగంభీర
ధ్వని యేల గల్గు మోదం,బున వచ్చుచు నున్నవాఁడు భూరిధ్వనితోన్. 522

క. అనునెడఁ [1]దన కూఁతటగా, ఘనమైనాకంబు నిల్వఁ గని యగ్గిరి న
ల్లన కేల నంటుచున్ వడి, హనుమంతుం డబ్ధి దాఁటి యచ్చెరువారన్. 523

ఉ. అంగదముఖ్యవానరులు హర్షసముద్గతరోమహర్షులై
యంగము లెల్లఁ బొంగ హృదయం బలరంగఁ జెలంగి చూడఁగా
నింగిఁ బతంగుభంగిఁ బ్రభ నిండి వెలుంగ మహేంద్రభూమిభృ
చ్ఛృంగము గ్రుంగఁ బెట్టుతికెఁ జేవ మహాశనిభీకరంబుగన్. 524

వ. ఇట్లుఱికి యమ్మహేంద్రాద్రిపై నిలిచి తనరాకకు సంతోషించు నంగదజాంబవం
తులకు నమస్కరించి మధుమధురఫలాదివివిధోపాయనంబులు గొనుచుఁ బరి
వేష్టించి యాలింగనంబుల నభివందనంబుల నతిప్రశంసల నందఱు వనచరులు
నయ్యైవిధంబులం బూజింపఁ బూజితుం డయి కంటి సద్గుణాభిరాముం డగు
రాముదేవిం బుణ్యాసమేత సీత ననవుడు నాపలు కమృతోపమానం బగుచు వీను
ల కింపార మేనులు పొంగ వాలంబు లెత్తికొని గంతులు వైచుచు నార్చుచు
బహుప్రకారంబుల వానరులు చెలంగ నప్పు డంగదుం గౌఁగిలించుకొని హను

1 బొడవుగ నుండట.

మంతుండు కరం బవలంబించి చని దుర్ధరంబు ప్రవేశించి యొక్కవిపులశిలాత
లంబున జాంబవత్పనసగజగవయగవాక్షులనడుమ నఖిలవనచరపరివృతుం డ
గుచు నాసీనుం డై యుండ నంగదుండు హనుమంతున కి ట్లనియె. 525

ఉ. క్షోణిఁ బయోధి దాఁటి యిటు చూడఁగ నెవ్వఁడు వచ్చు నీకు గీ
ర్వాణులు సాటి గారు రఘురాముఁడు రాఁగల సీతఁ గంటి మా
ప్రాణము లెల్లఁ గాచితి నృపాలశిఖామణిపాలికిం జగ
త్ప్రాణతనూజ నీదుతగుప్రాపునఁ బోయెద మిప్డు నెమ్మదిన్. 526

వ. అని పల్కె నంత జాంబవంతుండు హనుమంతున కి ట్లనియె. 527

ఉ. శరనిధి నెట్లు దాఁటితి నిశాచరుపట్టణ మెట్లు చొచ్చి తే
వెరవున సీతఁ గంటి పృథివీసుత యే మనెఁ గ్రూరరాక్షసో
త్కరముల నేగతిం దొలఁగి క్రమ్మఱ వచ్చితి పోలఁ జెప్పుమా
తరుచరవీర నావుడు ముదంబున వారల కాతఁ డింపుగన్. 528

సీ. జడనిధి దాఁటుచో నడుమ మైనాకంబుఁ, గనుటయు సురస వచ్చినవిధంబు
సింహికాహింసయు సింధుని స్తరణంబు, లంకాభిముఖతయు లంక సొచ్చి
సీతఁ గాంచుటయును సీతతో భాషించు,టయు వనక్షతి సేయుటయు నిశాట
భటులఁ ద్రుంచుటయును బంధక్రమంబును, బంక్తికంధరుదూఱఁ బల్కుటయును
లీల బంధవిముక్తుఁ డై వాలవహ్ని, లంకఁ గాల్చుటయును నకలంకచరిత
సీతఁ గ్రమ్మఱఁ గాంచి భాషించుటయును, జెప్పనందఱు ముద మంది చెలఁగి రపుడు.

క. అంగద నిజసేనాజయ, సంగదుఁ డుద్దండసమర[illegible]హితవి
రాంగదుఁ డురుమణిమయకన, కాంగదుఁ డంగదుఁడు గపులనందఱఁ బల్కెన్.

క. జానకిఁ గొనపోవక రఘు, భూనాయకుకడకు రిత్త పోవుట మెచ్చే
పూనిక మన మాసతిఁ గొని, రా నేఁగుద మబ్ధి దాఁటి రావణుపురికిన్. 531

క. మీ రేటికి మీపనుపున, వారిధి లంఘించి లంక వడిఁ జొచ్చెద నా
కారులఁ బొరివుచ్చెద ధా, త్రీరమణుని దేవి నేన తెచ్చెదఁ గడిమిన్. 532

చ. ప్రకటబలోద్ధతిం గడఁగి రావణి నాపయిఁ గిన్క బావకాం
బకమును మారుతాస్త్రమును బాశుపతప్రదరంబు బ్రహ్మసా
యకమును నైంద్రబాణమును యామ్యశరంబును నేయ లెక్క సే
యక దశకంఠముఖ్యదివిజారుల నెల్ల వధించి వచ్చెదన్. 533

చ. పవనతనూజుఁ డొక్కరుఁడ బాహుబలంబున సర్వరాక్షస
ప్రవరులఁ ద్రుంప నోపు ఋషభద్వివిదుల్ గజుఁడుం గవాక్షుఁడుం
గవయుఁడు మైందుఁడుం నలుఁడు గాఢబలుల్ పనసుండు మేటియా
హవమున జాంబవంతుఁ డెనయుం గలవీరులు లేరు గావునన్. 534

వ. మన మిందఱముం బోయి జనకనందనం గొని వ త్తము కాక యేన పోయి తెత్తు

నో యనవుడు నంగదు వారించి జాంబవంతుం డతని కి ట్లను మనల సుగ్రీవుండు సీతాన్వేషణంబు సేయుం బనిచె మనవచ్చినపని పావనికతన సఫలం బయ్యె లోకవిద్రావణుం డగురావణుని వధియించెద నని రణవిజయుం డగురాముండు ప్రతినపట్టినవాఁ డమ్మహాబలుం డక్కార్యం బనుష్ఠింపం గలవాఁడు మనము పోవుదము రం డనవుడు నౌఁ గాక యని హనుమత్పురస్సరంబుగా సమస్తవానరులు మేరుమందరమహీధరంబులుంబోలె మహోన్నతాకారంబున వెలుంగుచు మత్తశుండాలంబులుంబోలెఁ జండోద్దండగతి మించుచు నంబుదంబులుంబోలె నంబరంబు నాచ్ఛాదించుచు నేతెంచి ఫలదళకుసుమసమృద్ధం బగుచు నందనారామంబునుంబోలె నయనాభిరామం బగుచు సుగ్రీవమాతులుం డగు దధిముఖపాలితం బైనమధువనంబు ప్రవేశించి యంగదానుమతి నయ్యుద్యానతరుసంతానంబునకుం గవిసి. 535

—హనుమత్ప్రముఖవానరులు మధువనఫలాదులం దృప్తినొంది శ్రీరామునకడకు వచ్చుట.—

ఉ. పండులు పొట్టనిండఁ దిని । పం డ్లవి మిక్కుట మైనఁ ద్రొవ్వనం
బండుల వాటు లాడుచును । బైపయిఁ దేనియ లోలిఁ గుత్తుకల్
నిండఁగఁ గ్రోలి సోలుచును । నిద్దురవోవుచు లేచి కొంగ ఱు
చ్చుండతఁ గిట్టి తేనియవ।సంతము లాడుచుఁ బొంగి వెండియున్. 536

చ. కనుకనిఁ దోఁక లెత్తుకొని । గంతులు వైచుచు వీఁక నార్చుచున్
గునియుచుఁ బాఱుచున్ నెగసి । కొమ్మల వ్రేలుచు నేలఁ గూలుచున్
ఘనతరు లెక్కుచున్ దిగుచుఁ । గ్రమ్మఱఁ బ్రాఁకుచుఁ జెట్టుచెట్టుపై
కనువుగ దాఁటుచుం జెలఁగి । యాడుచుఁ బాడుచు నోలవెట్టుచున్. 537

చ. పండినభూజ మెక్కి పరి।పక్వఫలంబులు దించు నొక్కరుం
డుండఁగ వానిఁ ద్రోచి మఱి।యొక్కఁడు చేకొన వాఁడు వోయి తా
నొండొరుపంటి నెత్తికొని । యుద్ధతిఁ బాఱఁగ వానిఁ దాఁకి యా
పం డొకరుండు పుచ్చుకొనఁ । బైపడి యొక్కఁడు దాని మ్రింగుచున్. 538

ఉ. ఒక్కనివీఁపుపై కుఱికి । యొక్కరుఁ డుండఁగ వానిమూఁపుపై
నొక్కరుఁ డెక్క వానితల । నొక్కరుఁ డెక్కఁగ నోలి దొంతులై
దిక్కుల నాడఁగా నొకఁడు । తీవ్రత వారలఁ గూలఁ దన్నఁగా
నొక్కఁడు వానిమూఁపులు మ।హోన్నతి నెక్కుచుఁ జీరుచుం దగన్. 539

చ. ఫలములు దించుఁ దేనియలు । పైపయిఁ ద్రావుచుఁ బుష్పగుచ్ఛముల్
దులుచుచుఁ గాయ లెల్ల వడి । డొల్లఁగ వ్రేయుచు లేఁజిగుళ్లు నా
కులు వెరఁ జాడి త్రుంచుచును । గొమ్మలు దక్క సమస్తభూజముల్
బలువిడి గాసిచేసి బహు।భంగుల నిట్టులు ద్రుళ్లుచున్నడన్. 540

వ. వనపాలకు లత్యంతకోపాటోపంబునం బఱతెంచి వనచరేంద్రుం డగుసుగ్రీ

వునివన మంతయు నుఱుమాడుచున్నవా రనుచు నదలించి తోలుటయును హను
మంతుండు ముందటికిఁ బఱతెంచి వెఱవకుఁడు వలసినట్లు మధురసఫలాదు లనుభ
వింపుఁ డన నంగదుం డట్ల సమ్మతింపఁ గ్రమ్మఱనవ్వానరులు వనంబుసొచ్చి వనపా
లకుల నఖంబుల వ్రచ్చియుఁ దన్నియుం బొడిచియుం గఱచియు బహువిధంబుల
నొప్పింప వారలు భయంబునం బఱచి దధిముఖున కత్తెఱం గెఱింగింపం గనలి
యుద్ధతిం బోరిగొందు ననుచుఁ గెరలి సాలతాలశిలాయుధు లగువనపాలకులుం
దానును వడిం బఱతెంచి కటంబులు నోష్ఠంబులు నదరఁ గొందఱ జంకించియుఁ
గొందఱ మోఁదియు నాక్రమింపం గినిసి హనుమత్ప్రముఖవానరు లరుగుదేర
నంగదుం డుద్ధతిఁ గోపోద్దీపితముఖుం డగుచు దధిముఖుం బట్టి మొగంబును
మోఁకాళ్లును గూడ నేలం బ్రామిన విసంజ్ఞుం డై తెలిసి తనయనుచరులంగూడు
కొని యతివేగంబున రామలక్ష్మణసహితుం డయి యున్నసుగ్రీవుకడకుం బోయి
దీనాననుండును ముకుళితాంజలియు నగుచు నమ్మువ్వురకు దండప్రణామంబులు
సేసినం జూచి సుగ్రీవుం డి ట్లనియె. 541

కం. వెఱవకు లె మ్మెవ్వఁడు ని, న్నెఱుఁగక యిటు నొవ్వఁ జేసె ǂ నీ వది నాతో
నెఱిఁగింపుము నావుడు న, త్తఱి దధిముఖుఁ డల్ల లేచి ǂ తరణిజుతోడన్. 542

కం. బలువిడి నంగదహనుమం, తులు మొద లగువృక్షచరులు ǂ దుర్వారితులై
ఫలదళమధుశూన్యముగాఁ, [1]గలమధువన మెల్లఁ జొచ్చి ǂ గాసిలఁ జేయన్.

చ. చని ఫలమూలపుష్పమధు ǂ సంపద లొప్పఁగ వాలినాఁడు త
జ్జనకునినాఁడు నెన్నఁడును ǂ నంచల మొందనియీవనంబు మీ
రనుచితభంగి నేల నుఱు ǂ మాడెద రం చట నానవెట్టఁగా
నను నిటు మోఁది రన్న రవి ǂ నందనుఁ డాత్మ నెఱింగి యి ట్లనున్. 544

కం. ధరణిజఁ బొడఁగన నోపును, ధరణీంద్రనిభుండు వాయు ǂ తనయుఁడు లోకో
త్తరుఁ డాతఁడు దక్కఁగ న, య్యరుదుం బని చేసి రాఁగ ǂ నన్యులవశమే. 545

కం. జనకజఁ గానక యుండిన, ననుపమతరబుద్ధిమంతు ǂ లంగదముఖ్యుల్
మును దేవాసురులును గది, యనినావన మేల చొత్తు ǂ రంతటిమీఁదన్. 546

కం. వన మెల్లఁ బెఱికి దధిముఖ, వనపాలుర నిట్లు సేయ ǂ వచ్చునె భూనం
దనఁ గనుఁగొని ముదమున వ,చ్చిన కతనన్ వార లేమి ǂ చేసినఁ జెల్లన్.

కం. అనవుడు లక్ష్మణుఁ డత్తెఱఁ, గినజు నడిగి తెలిసి నిక్క ǂ మిట్టిద యంచున్
జననాయకుండుఁ దానును, ననురాగాంబుధిని నోల ǂ లాడఁగ నంతన్. 548

వ. సుగ్రీవుండు దధిముఖుం గనుంగొని యింక నీ వేమియు వగవకు మంగదాదులు
రామకార్యనిర్వాహకులు గాన మనకు మాననీయులు నీ వింక. 549

చ. జవమున నేఁగి రామవిభు ǂ సన్నిధి కంగదముఖ్యవానర

---

1 గఱచి మధువనంబు సొచ్చి.

ప్రవరులఁ దోడితెమ్ము వనపాలన మీవ యొనర్పు నా మహీ
ధవునకు నర్కపుత్రునకుఁ దద్దయు భక్తి నమస్కరించి యు
త్సవమున నేగి కేల్మొగిచి సర్వవనాటుల నాదరంబునన్. 550

క. ఇనజుఁడు మిముఁ దోడ్కొని ర,మ్మని ముదమునఁ బనిచెఁ గుమతినయి యే మిమ్ముం
గినిసితి ననుగ్రహింపుఁడు, చనుఁ డంచుం బలుక వారు సంతోషమునన్.

వ. ఆంజనేయపురస్సరంబుగా రామలక్ష్మణసుగ్రీవదర్శనకుతూహలచిత్తు లగుచు.

చ. కమియఁగ నింగికిన్ నెగసి కన్కని మ్రాఁకులఁ గూలఁ ద్రోచుచున్
భ్రమరులు వాఱుచున్ దెసలు వ్రయ్యఁగ నార్చుచు శైలశృంగముల్
దుముఱుగ వీఁకఁ దన్నుచును దోయదమాలిక లోలిఁ దూల వా
లము లొగిఁ ద్రిప్పుచుం గిలకిలధ్వను లిచ్చుచు వచ్చుచున్నడన్. 553

చ. జనవర చింత వోవిడిచి సమ్మద మందుము వారె వానరుల్
జనకజఁ గన్నవా రగుట సంతస మందుచు వచ్చుచున్నవా
రని యినజుండు వల్క నవు డంగదముఖ్యులు వచ్చి రుత్సవం
బెనయఁగ రామలక్ష్మణకపీంద్రులకన్నులు చల్లసేయుచున్. 554

వ. ఇట్లు వచ్చి రామలక్ష్మణసుగ్రీవులకు నమస్కరించి హనుమంతుం బురస్కరించి
కొని యుండ నఖిలవనచరానుమతి నాంజనేయుం డి ట్లనియె. 555

క. కనుగొంటి సీత సేమం,బున నున్నది మిమ్ము భావమున నిడికొని వా
కున రామ రామ నృప యం,చును వెస మీరాక కెదురుచూచుచు నెపుడున్.

ఆ. వఱపు దాఁకి యున్నవల్లికై వడి వాడి, బాలచంద్రరేఖ పగిది డస్సి
మధుపకలితపుష్పమాలికగతి మాసి, వసుమతీతనూజ వగలఁ బొగులు. 557

క. మనమున మీపైఁ గూర్మియుఁ, గనుఁగవ బాష్పములు మేనఁ గార్శ్యంబును జె
క్కునఁ గెంగేలును వదనం,బున దైన్యముఁ బాయ దెపుడు భూమిజ కధిపా.

క. ధరణిసుత యేకవేణీ, ధరయును నుపవాసకృశయుఁ దతఘోరతపో
నిరతయు భూశయనయు నై, పరితాపముఁ బొందు దైత్యభామలనడుమన్.

వ. అని విన్నవించి దేవా మీరు సుగ్రీవుతో సఖ్యంబుసేయుటయు మీగుణచరిత్రం
బులు శుభలక్షణంబులు నెల్లవిశేషంబులు వినిపింప నట్టకేలకు నమ్మిన
యజ్జనకతనయకు మీ రొసంగినభద్రముద్రిక యిచ్చిన నక్కునం జేర్చి శోకింప
మెల్లనఁ గొంతదడవున కేను బోధింపం దెలివి నొంది తనకుచాంతరగతకాకనఖ
రేఖలును నరసత మీరు నించినగండస్థలమనశ్శిలాపత్రరేఖలును దలఁపింపు మ
నియె మఱియు లక్ష్మణసుగ్రీవాదులకుశలం బడిగె మూఁడవమాసంబునఁ బ్రాణం
బులు నిలుప లే ననుచు మిమ్ము వేగం గొని ర మ్మని పలికె నని పలికె. 560

క. ప్రేమం గొంగునఁ బదిలము,గా ముడిచినదివ్యరత్నగణఖచితం బౌ
భూమీసుత యిచ్చినచూ, డామణి యిదె యనుచు రుచు లదర నిచ్చుటయున్.

—✤ హనుమంతుఁడు సీత యిచ్చినశిరోరత్నము రాముని కిచ్చుట. ✤—

క. భూరిప్రభ నొప్పారెడు, నారత్నము నల్లఁ గేల ♦ నక్కున నిడికొం
చారాముం డనుజుండు మ, హారోదనము లొగిఁ జేసి ♦ రధికాతురతన్. 562

వ. అప్పుడు సుగ్రీవాదులు బోధింప నెట్టకేలకు శోకం బుడిగి రామచంద్రుం డిట్లనియె.

క. ఏదెసఁ జూచిన నాదెస, నాదృష్టికిఁ దాన యగుచు ♦ నామది నెపుడున్
వైదేహి పాయ దొండెడ, వైదేహిం గంటి మనుట ♦ వాదో నిజమో. 564

క. మును నిమిషాంతరమును సైఁ, పనిమత్ప్రియ జలధిశైల♦బహుళాంతర యై
నను నెట్టు పాసి యున్నది, ఘనతరవిరహాగ్నిచేతఁ ♦ గ్రాఁగుచు నకటా. 565

క. జనకసుతఁ బాసి నిలువవు, దనువునఁ బ్రాణములు నాకుఁ ♦ దడయక యింకన్
జనకసుత యున్నచోటికి, ననుఁ గొని చని వగలు మాన్పు ♦ నగచరవర్యా. 566

వ. అనుచుం బ్రలాపించురామచంద్రు నూరార్చి హనుమంతుం డిట్లనియె. 567

క. అర్ణవము దాఁటి బహుభుజ, పూర్ణుం డగుపంక్తికంఠుఁ ♦ బొరిగొని జగముల్
వర్ణనసేయఁగ నీవర, వర్ణిని గొని తేరఁ బోవ♦వలయు నరేంద్రా. 568

క. అని పలికి జలధి దాఁటిన, తనవిక్రమ మాది గాఁగఁ ♦ దగువృత్తాంతం
బును సీతావృత్తాంతము, విన సర్వముఁ జెప్పె రామ♦విభుతో వెలయన్. 569

క. సురతరుణీకోమలతర, కరసరసిజపీడ్యమాన♦కమనీయభవ
చ్చరణసరోరుహసేవా, కరణచణప్రమథనాథ ♦ గౌరీనాథా. 570

మాలి. నవనభుగభినంద్యా ♦ సర్వలోకైకవంద్యా
రవిశశిశిఖనేత్రా ♦ రమ్యరామార్ధగాత్రా
భువననివహనేతా ♦ భుక్తిముక్తిప్రదాతా
ప్రవిమలగుణసంగా ♦ భవ్యకోటీరగంగా. 571

గద్యము. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికా
ర్జునభట్టప్రణీతం బైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు సుందరకాండ
ము సర్వంబు నేకాశ్వాసము. 572



శ్రీ ర స్తు.

# భా స్క ర రా మా య ణ ము.

## యు ద్ధ కాం డ ము.



క. శ్రీకర కరుణారుచిరవి
లోకనలీలావికాసకల్లోల విపశ్చి
ల్లోకవివేకకలాశ
స్తోకకళలా మేరుధీర సాహిణిమారా. 1

వ. ఇట్లు హనుమంతుండు సీతావృత్తాంతం బెఱింగించుటకు హర్షవిషాదంబులు మనం
బునం బెనంగొనుచుండ రఘువరుం డిట్లనియె. 2

క. వినతాసుతునకుఁ బవనున,కును నితనికిఁ దక్క నొరులకుం జెల్లునె మర్త్య
వననిధిని దాఁటి యవ్వలి,పని మఱి యెవ్వాఁడు దీర్చెఁ బావని దక్కన్. 3

ఉ. ఉత్తముఁ డేలుతేనిపని యొక్కరుఁ డయ్యును జేయు మధ్యముం
డత్తి యొనర్చుఁ దోడు గలయప్పుడు చాలియు నీచుఁ డెప్పుడుం
జిత్తము సేయఁ డత్తెఱఁగు సేయుటకై యసహాయశూరుఁ డ
త్యుత్తమభృత్యుఁ డీకపికులోత్తముఁ బోలుదు రెట్టు లెవ్వరున్. 4

వ. అని మఱియు రఘువరుం డాంజనేయుం గనుంగొని. 5

క. తమ్ముఁడ విను మేనును నా,తమ్ముఁడు లక్ష్మణుఁడు నీకుఁ దమ్ముఁనఁ గాదే
క్రమ్మఱఁ గలుగుట రఘువం,శమ్మట రక్షింప నీకుఁ జనియె మహాత్మా. 6

క. ఉపకృతమతి నీకుం బ్ర,త్యుపకారము సేయ నెద్దియుం గల్గమి నీ
యుపగూహనంబు గైకొను, కపికుంజర యనుచుఁ దిగిచి కౌఁగిటఁ జేర్చెన్.

వ. ఇట్లు గారవించి సమీరకుమారా నీవు సీతావృత్తాంతం బెఱింగించుటకు సంతో
షంబును గడలిఁ గడచుతెఱం గెట్లు చెప్పెదో యనువిచారంబును బొడము
చున్న దనుచుఁ గొండొకసేపు డోలాయమానమానసుం డగుటయుం జూచి
సుగ్రీవుం డిట్లనియె. 8

శా. మాత్సర్యంబున నిమ్మహాకపివరుల్ మా తెం దు లే కున్నవా
రుత్సాహంబున సేతుబంధమునకు నుద్యోగింతు గా కింక భూ
భృత్సింహుం డగునీకుఁ జింత దగునే పెల్లీవు విల్లంది శుం
భత్సంరంభము సూపినన్ నిలుతురే బ్రహ్మాదులుం బోరులన్. 9

క. క్షత్రియుఁడు మందుఁ డైన ధ,రిత్రీప్రజ లోట చెడి చరింతురు జగదే

కత్రాణపరాయణ విను, శత్రులు భీతిల్ల నలుక ǂ సమకొల్పు మదిన్. 10

క. చిచ్చు చొరుఁ డన్న నురవడిఁ, జొచ్చెద మమరారిపురము ǂ సొచ్చెద మరులం
దెచ్చెదము దీనదశ కిటఁ, దెచ్చెద మవలీల దేవ ǂ దేవరదేవిన్. 11

క. ఓలిం దోఁచుచు నున్నవి, మేలుగ నెల్లెడల బహుని ǂ మిత్తంబులు భూ
పాల జయ మవశ్యము నీ,పాలిద నిక్కంబు లంక ǂ పై విడియు మిఁకన్. 12

వ. అనిన విని నరేశ్వరుం డవ్వానరేశ్వరువాక్యంబుల కలరుచుఁ బవనతనయు
నుపలక్షించి. 13

ఆ. వరము వడసి యైన ǂ శరము ప్రయోగించి, వట్టఁజేసి యైనఁ ǂ గట్టి యైన
వనధి దాఁట నెట్లు ǂ వచ్చుఁబో దుర్గంబు, తెఱఁగు చెప్పు నాకుఁ ǂ దెలియ ననుడు.

శా. ప్రాకారంబు లగడ్త లట్టడులు యం ǂ త్రవ్రాతముల్ వప్రముల్
వాకిళ్లాయుధసంపదల్ గజము ల ǂ శ్వంబుల్ రథంబుల్ భటా
నీకంబుల్ బహుకేతనాదులు మదిన్ ǂ నిర్మించిన ట్లుండు భూ
నాకం బప్పుర మేకొ అంతయును గా ǂ నంబట్ట దెప్పట్టునన్. 15

ఉ. ఎక్కడఁ జూచినం బుడమి ǂ యీనెకొ యన వేలు లక్షలుం
బెక్కులు కోటులుం గలిగి ǂ భీకరభంగులఁ గ్రొవ్వు లారఁగా
నుక్కునఁ దీరిన ట్లమరు ǂ నుగ్రపుమేనులయాతుధాను లొ
క్కొక్కని మెచ్చనట్టిభటు ǂ లుండుదు రొక్కొకవానివాకిటన్. 16

వ. మఱియు నన్నగరంబు పడమటివాకిటఁ గరాళశూలహస్తులైన పౌలస్త్యులు పది
వేవురును దక్షిణోత్తరద్వారంబులఁ జతురంగబలసమేతులై యొక్కొక్కలక్ష
యుం దూర్పుగవనిఁ జర్మకృపాణపాణులు పదిలక్షలును మధ్యమస్కంధంబున
సింధురబంధురం బగుసైన్యంబుతో ననేకసహస్రంబులు నుండుదు రట్లున్న నేమి
మనయంగదమైందద్వివిదపనసనలనీలజాంబవంతులు కడంకం గడంగి లంకఁద్రికూ
టాచలంబుతోన పెఱికి పేటాడం జాలుదురు దేవరసామర్థ్యంబు దలంప నది
యేమిదుర్గమంబు తగినముహూర్తంబునఁ బ్రయాణంబు సేయుదు గాక యని
హనుమంతుండు విన్నవించిన నన్నరేంద్రుం డినతనయుం గనుంగొని. 17

తే. నేఁడు రెండవఫల్గుని ǂ నిండుదిక్కు, గగనమణి నభోమధ్యంబు ǂ గదిసినాఁడు
నామనంబును నలరెడు ǂ నీముహూర్త,మొప్పు నిప్పుడు కదలిన ǂ నోడుదు రిపుల.

క. నలులక్షకపులతో ని, బ్బలములకును దెరువువెట్టఁ ǂ బనుపుము నానా
ఫలమూలమధూదకములు, గలకందువ లరసి గమన ǂ కౌతుక మొప్పన్. 19

—⸙ రాముఁడు వానరబలంబులతోడ లంకకుఁ బ్రయాణ మగుట. ⸙—

వ. మఱియుం దగువారి వలయునెడల నడవ సేనానాయకుల నియోగింపు మనిన
నట్లు చేసి యతండు ప్రార్థించినం బార్థివనందనులు పవననందనవాలినందనుల
నెక్కి యైరావణసార్వభౌమాధిరోహణంబులు సేసినత్రిదశేంద్రకిన్నరేంద్రులతె

అంగున మొఱసి రప్పుడు తమతమసైన్యంబులతో గజగవయగవాక్షులబ్బలంబు ము౦దటను వృషభుండు వలపటను గంధమాదనుండు దాపట ననేకభల్లూక యూథంబులతో సుషేణవేగదర్శిజాంబవంతులు సుగ్రీవపురస్సరంబుగా నడుమను ముందఱ మైందద్వివిదాదులును బలసి కొలువ రఘువీరునగ్రభాగంబున వలీముఖులు పదికోట్లతో శతవలియును బిఱుంద నూఱేసికోట్లతో నతిబలార్కపనన కేసరు లొక్కొక్క చెంగటను బొలిచిరి భరతదరీముఖజంఘప్రజంఘులు బరవసంబు సేయు నెలుంగులఁ జెలంగుచు నీలప్రయత్నంబునం గడంగి నడవం దొడంగి రాసమయంబున. 20

చ. దిగిభము లోలిఁ దూల జగతీతల మల్లలనాడ నాదిప
న్నగ మద్రువంగఁ దద్బహుఫణామణిఘట్టనఁ గూర్మరాజువె
న్నగల మహాట్టహాసముల నార్పుల దిక్కులు వ్రయ్య నొక్కపె
ట్టుగ నడవం దొడంగిరి కఠోరతరోద్ధతు లొప్ప నయ్యెడన్. 21

ఆ. అడవి చాఁపకట్టు వడి నుగ్గునూచమై, బయలుగాఁగ ధూళి [1]బయలప్రేఁగ
నడరి మన్ను మిన్ను నగచరు లిట్టట్టు, తిరుగ వైచినట్టి తెఱఁగు దోఁచె. 22

ఆ. సేతుబంధనంబు సేయునంతకుమున్న, జలధిపట్టు నవనితలము సేయ
నెగసె ననఁగ మఱియు నిగుడుచు ముంగలి, బలసముత్థరేణుపటలి యడరె.

ఆ. సీత నట్లు పేతు సేసి మిన్నక యున్క, నఖలభూతములకు నధిపునల్కఁ
బట్టపగలు నింగి పడియె నా సేనార, జాంధకార మడర నపుడు కపులు. 24

చ. మదమునఁ దూఱి పాఱి పెనుమ్రాఁకులఁ బ్రాఁకుదు రిట్టునట్టు దాఁ
టుదురు లతాంతగుచ్ఛములు దుల్తురు ముందటిగండశైలముల్
పదములఁ బాఱఁ జిమ్ముదురు ప్రాంతమహీరుహశాఖలం బెనం
గుదు రొగి నుప్పరం బెగసి కూలఁగ దాఁతురు శైలశృంగముల్. 25

క. ఒక రొకరిమూఁపు లెక్కుదు, రొకనిపయిం ద్రొతు రొకని నొక్కఁడు దినుపం
డొకఁ డొడిసికొనఁగ నడుమన, యొకఁడది పడ నడువ నదియు నొక్కఁడ మ్రింగున్.

ఉ. పండినభూజముల్ పెఱికి పట్టి ఫలంబులు దించు నన్యుఁ డ
ప్పండులు వేఁడినం దనదు పం డ్లిగిలించు నొకం డొకండు చే
పం డటు చూప వాఁడు కరపల్లవ మల్లనఁ జాఁప మ్రింగి బ్ర
హ్మాండముఁబోలె నున్నతనయంగిలిఁ జూపుచుఁ బోయెఁ బొ మ్మనున్. 27

వ. ఇత్తెఱంగునం దమజాతిచేష్టితంబుల దాశరథుల కిం పొదవింప నెడనెడ మధురఫలాదు లుపయోగించుచు నడచి సహ్యామలయాచలంబులు గడచి మహేంద్రమహీధరాధిరోహణంబు సేసి యనతిదూరంబున. 28

మహాస్రగ్ధర. కని రారాజన్యు లభ్రంకషబహులహరీఘట్టనోద్ధూతఫేనం

---

[1] బయలు ప్రింగ.

బును గంభీరాతిఘోరాద్భుతరవబధిరీభూతరోదోంతరంబుఁ
ఘననక్రగ్రాహదర్వీకరమకరమహాకచ్ఛపానేకమీనం
బును జూడారంగరంగద్భువనపవనభుగ్భ్వానభోంతర్ధి వార్ధిన్. 29

వ. కని తదీయం బైనమహామహిమంబు గొనియాడుచుం జేర నరిగి నానాతరులతా
కుంజపుంజంబులం బొల్చువేలావనంబున విడిసి రప్పుడు. 30

సీ. పృథులహాసంబులు పెన్నురువులభంగి, వఱల వాలములు ప్రవాళలతల
కైవడిఁ జెలువార ఘనబాహుశాఖలు, బహుళవీచీపరంపరలకరణి
విలసిల్ల నుద్భటవీరసంచారముల్, కుటిలతరగ్రాహఘోరగతుల
చాడ్పున నొప్పార సందడి[1]పలుకుల, యులి వఖండధ్వనియోజ నిగుడ
వివిధవాహినీసంగతి వెలయ నినజు
నాజ్ఞ చెలియలికట్టయై యడర రామ
చంద్రునుదయ ముదంచితోత్సవముఁ జేయ
నొప్పెఁ [2]కపిబలోదధి వార్ధి కుద్ది యగుచు. 31

వ. తదనంతరంబ. 32

ఆ. జానకీవియోగసాగరమగ్నుఁ డై, రామచంద్రుఁ డుండఁ గా మనోజ్ఞ
భంగి నింకఁ దగునె పద్మినీభోగ మ,న్నట్లు గ్రుంకె నర్కుఁ డపరజలధి. 33

తే. ఇనతురంగరింఖాహతి నెసఁగునస్త, శైలధాతుశిలోద్ధూతధూళిపటల
మనఁగ నపరదిశాభాగమునకు వింత, చెలువుసేయుచు నెఱసంజపొలుపుమిగిలె.

క. భూపాలకపరమేశ్వరు,కోపానలకీల లంటికొని కమలినలం
కాపతికీర్తియొకో యని, రూపింపఁగఁ [3]జీకువాలు గోడసి నిండెన్. 35

క. వనచరనాయకసంఖ్యకు, వనజభవుఁడు బొట్టు లిడుచు వచ్చెనొకో నాఁ
గనదురుదీప్తుల గగనం,బున నొక్కఁడొకండ తోఁచెఁ బొరిఁ దారకముల్.

శా. గంగాతుంగతరంగపాండురమయూఖశ్రేణిని శ్రేణికా
భంగిఁ నింగికి నబ్ధికిఁ నడుమఁ బైపై నొప్పఁ బ్రాగ్భూమిభృ
చ్ఛృంగాగ్రంబు నలంకరించె సితరోచిర్మండలం బభ్రమా
తంగోదంచితకుందకందుకముచందం బొంది రమ్యాకృతిన్. 37

క. వెడవిలుతుకీర్తిజాలము,వడువునఁ జంద్రాతపంబు వాలుటయును ము
న్నడుకెత్తినడెందముతో, వడఁకాడెదుర్ధైర్య మెడల వగలఁ బొగులుచున్.

వ. కౌసల్యానందనుండు సుమిత్రానందనున కిట్లనియె. 39

ఉ. రక్కసుచేతఁ బట్టువడి రాజనిభానన యేఁగునప్పు డే
దిక్కున నాసలేమి నలుదిక్కులుఁ జూచుచు భీతి నాథ నీ
వెక్కడఁ జిక్కితంచు నెలుఁగెత్తి పొరింబొరి నన్నుఁ జీరుచుం

---

1 పలుకుల, యుద్యదధిచండధ్వని. 2 కపిబలం బుదధికి నుద్ది యగుచు. 3 చీకువాయ.

బెక్కు దెఱంగులన్ వగలఁ బెల్లునఁ దూలుచు నెట్టు లుండెనో. 40

ఉ. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరుకోడల రాముభార్యఁ జం
ద్రోజనులార యడ్డపడ రో సురలార సురారి కంచు నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీజలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమి సేయుదున్. 41

సీ. వననిధి బంధించి చని లంక భేదించి, రాక్షసాధము పెన్నురంబు రయము
మెఱయ నందంద క్రొమ్మెఱుఁగునారసముల, గ్రుచ్చియచ్చెరువారఁ గులిశఘోర
భల్లపరంపరల్ పరఁగించి ధనురాది, సాధనప్రకరంబు చక్కు చేసి
చేతులు ఖండించి శిరములు దునుమాడి, వెస వానిశోణితవృష్టిచేతఁ
బుత్రి వెసకుఁ బొగులు భూదేవియుడుకార్చి, తీవఁబోఁడి నపుడు దెత్తునొక్కొ
చంద్రవదనవదనచంద్రిక నెన్నఁడు, దృక్చకోరతృష్ణఁ దీర్తునొక్కొ. 42

క. తోయధివీచులకు నిశా, నాయకరోచులకు నడుమ నాతను వున్నం
గాయజతాపం బాఱుఁ జుమీ యటఁ గొనిపొమ్ము నను సుమిత్రాపుత్రా. 43

వ. అని పల్కి పురోభాగంబున. 44

క. వలరాజు ఖడ్గపుత్రిక, జళిపించిన తెఱఁగు దోఁపఁ జారులతాకో
మలపల్లవములు పొరిఁబొరిఁ, జలియించుటఁ జేసి విరహచకితుం డగుచున్. 45

క. మందానిలంబ నాపైఁ, బొందుగ సతిమీఁదఁ బొలసి పొలయుము నీచే
నొందుదుఁ దత్తనుసంగతి, చందురునం దెట్లు దృష్టిసంగతి గలుగున్. 46

క. అని [1]కమ్మగాలిపొలపం, బునఁ దాలిమి దూలి పోవఁ బొవులుచు నున్నం
గని యవ్విభునుచితోక్తుల, ననుజుఁడు బోధించె నంత నక్కడ లంకన్. 47

—రావణుండు మంత్రులతో మంత్రాలోచనము సేయుట.—

తే. వాసవారాతి వేగులవారివలన, దాశరథులవృత్తాంత మంతయు నెఱింగి
పవనసుతుచేత నయ్యైనపరిభవంబు, దలఁచికొనుచు నాస్థానంబు కలయఁ జూచి.

చ. ఒకకపి సాగరంబు కడు నుగ్రరయంబున దాఁటి వచ్చి స్రు
క్కక వన ముద్ధతిం బెఱికి కావలి యున్న నిశాటకోటి న
ఱుకుఁ బరిమార్చి మత్పురముఁ గాలిచి క్రమ్మఱ నేఁగె లెక్కసే
యక హరిసేనతో విడిసి రంబుధి దాఁటఁగ నిప్డు రాఘవుల్. 49

ఉ. ఆవసుధేశు లింక మకరాలయ మేగతి నైన దాఁటి సు
గ్రీవపురస్సరంబుగ నొకగిన్ నడ తెంతురు తప్ప దాహవం
బేవెర వాచరించిన జయింతుము చెప్పుఁడు మీరు నీతివి
ద్యావిదులుం దలంపఁ బరమాప్తులు నా కని పల్కి వెండియున్. 50

1 కమ్మదావిపొలపంబున.

తే. అఖిలసమ్మతిఁ గావించునదియు బహువి
చారములు దోఁప నం దొక్కసరణి నడపు
నదియు నొఁ గాదు నాఁ జేయునదియు నివ్వి
ధంబు లుత్తమమధ్యమాధమము లండ్రు. 51

ఆ. కాన మంత్రు లొక్కకార్య మందఱుఁ గూడి, నిశ్చయింపుఁ డంబునిధిఁగడాక
మున్న రిపుల గెలిచి మూఁడులోకంబుల, కళుకు పుట్టఁజేయువలయు ననిన.

చ. కొలువున నున్నరక్కసులు ఘోరతరోద్ధతు లొప్ప ఖడ్గరో
చులు నిగిడించుచుం గనలుచూడ్కుల నొక్కట విస్ఫులింగముల్
వెలువడ భీకరభ్రుకుటివీచులు వీరరసాబ్ధికట్టపైఁ
బొలసినభంగి ఫాలములఁ బొల్పుగ ని ట్లని రాసురారితోన్. 53

శా. లీలం గొంటి కుబేరుపుష్పకము బల్మిన్ గిట్టి [1]ముప్పెట్టులం
దూలం దోలితి వాసవాదిసురులన్ దోర్దండకండూతికై
కైలాసాచల మెత్తి తివ్విధమునన్ గర్వంబు సర్వంకషం
బై లోకంబులఁ జెల్ల నీ కొకఁ డసాధ్యం బెద్ది లంకేశ్వరా. 54

వ. అదియునుం గాక. 55

సీ. మయుఁడు బాహావిక్రమము చూచి తనకూఁతుఁ, దెచ్చి నీపట్టంపుదేవిఁ జేసె
జతురంగసహితులై సరిఁ బోరి వరుణాదు, లే పఱి నీవెట్టి కియ్యకొనిరి
పాతాళలోకంబుపైఁ జన్న వచ్చి ప, న్నగరాజు నీశరణంబు గనియె
నడరి కౌంభీనసేయాదిదానవు లాహ, వక్రీడ కోడి నీవార లైరి
కాలదండభయంకరగతి నడంచు, నపుడు మృత్యువు నీయట్టహాసమునకు
బెగడె మఱియు నీచేఁ బడ్డబిరుదుమగల, లోనఁ గడిమి నెవ్వీరుఁ బోలుదురు వీరు.

వ. అని పల్కి సభామధ్యంబునం గుటిలభ్రూకుటిదుర్నిరీక్ష్యుం డగుచుఁ గనలు నింద్ర
జిత్తుం గనుంగొని. 57

మ. జగదాభీలుఁడు మేఘనాదుఁడు మహాసామగ్రి మాహేశ్వరం
బగుయాగం బొనరించి లబ్ధవరుఁడై యన్వాప్తసేనార్ణవం
బొగి బాహాద్రి మథించి యెల్లసిరిచే నొప్పారుజంభారిఁ జం
డగతిం బట్టినవాఁడు గాఁడె యితఁ డుండం జింత నీ కేటికిన్. 58

వ. అని వెండియు. 59

చ. పెఱుకుదుమే ఫణీంద్రువిషభీషణదంష్ట్రలు నేలఁ గ్రుంగఁ జే
సెఱుతుమె నింగి వ్రింగుదుమె చండదిశాగజదంతకాండము
ల్విఱుతుమె వారిధుల్ పుడిసిలింతుమె మందర మంగుటంబునం
జెఱుముదుమే జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాక్షసేశ్వరా. 60

1 ముప్పెట్టునన్.

క. నరు లిరువురు గొందఱు వా, నరులం గూడికొని వచ్చి నరభోజనులన్
దురమునఁ జెనకుదురఁట యీ, యరుదులు వినఁబడియె నిప్పు డమరారాతీ.

వ. అని విజృంభించుసమయంబునఁ బ్రహస్తుం డనుసేనానాయకుం డి ట్లనియె. 62

చ. తురగసమాకులంబు రథదుర్గమముం గరిభీకరంబుఁ దో
మరధనురాదిసాధనసమంచితవీరభటోద్భటంబు సొం
పరుదుగ నీయనీకము నిరాయుధ మైనపదాతిమాత్ర మా
హరిబల మెట్లు హస్తిమశకాంతర మారసి చూడ రెంటికిన్. 63

వ. అదియునుం గాక. 64

చ. అనిమిషదానవాదులకు నాజుల నీదెసఁ దేఱి చూడ రా
దనిన మనుష్యు లెవ్వరు దశానన నీ కది యట్టు లుండె నే
మనఁ గల దిప్డు నీచుఁ డగుమర్కటుఁ డొక్కఁడు వచ్చి లంకఁ గా
ల్చెనఁట జగం బవానరముఁ జేసికదా పదివేలు నైజముల్. 65

వ. ఏము మున్నేమఱి యున్నతప్పు గల దనిన దుర్ముఖుం డనువాఁ డి ట్లనియె. 66

క. తారాపథమున కెగసినఁ, బారావారమునఁ బడినఁ బాతాళము [1]దు
ర్వారగతిఁ బాఱి తూఱిన, బారిసమరి పుత్తుఁ గపులఁ బంపుము నన్నున్. 67

వ. అనిన వజ్రదంష్ట్రుం డనువాఁ డి ట్లనియె. 68

మ. పురజిత్కైటభజిద్విరించియుతులై భూపాలు రేతెంచినం
బురదాహం బొనరించి పోయినమరుత్పుత్రుండు తొల్మిద్దగాఁ
బరిఘావర్తవజాతవాతహతి నభ్రశ్రేణిఁ దూలించుచుం
బరిమార్తుం బరిపంథికోటి నిది నాపంతంబు లంకేశ్వరా. 69

తే. మఱియుఁ జెప్పెద విను మొకమతము భరతుఁ
డనికి నిటఁ దోడుపుత్తెంచె ననుచుఁ గపట
నరుల మై పోయి బహుసాధనముల వారిఁ
జంపి వచ్చెద మమరారి పంపు మమ్ము. 70

వ. అనినఁ గుంభకర్ణునికొడుకు నికుంభుం డనువాఁ డి ట్లనియె. 71

క. సురకంటక విను రణమున, సురగణములతోడఁ గూడ సురపతి నైనం
బొరిగొనియెద నెక్కడివా, నరులున్ గీనరులు నేటినరులున్ గిరులున్. 72

వ. అనిన విని మహాపార్శ్వుండును మహోదరుండును ధూమ్రాక్షుండు నతికాయుం
డును మహాకాయుండు నగ్నికేతుండును రశ్మికేతుండును వజ్రదంష్ట్రుండును సు
ప్తఘ్నుండును సూర్యశత్రుండును నింద్రజిత్తు ననుమహావీరు లైనమేటిరక్కసు
లొక్కట లేసి క్రొమ్మెఱుంగు లెగయఁ గైదువు లంకించుచు రావణుం జూచి
యిదె చని యన్నరుల వానరులం దునుముదుము పొడుతుము చెక్కుదుము వ్ర

1 దుర్వారముగఁ దూఱి పాఱిన.

క్కలుసేయుదు మనునివి మొదలగురోషపరుషభీషణభాషణంబులు గ్రందుకొన
నవష్టంభంబునం బలుకుచున్న నెట్టకేనియు వారి వారించి విభీషణుం డిట్లనియె.

—విభీషణుండు రావణునకు నీతి చెప్పుట.—

క. వినుఁడు నిశాచరు లిందఱు, మనరా జారాజుదేవి । మాయోపాయం
బునఁ దెచ్చె నింత సేయం, జనునే యీతప్పు రామ । చంద్రునితప్పే. 74

శా. ఆదుశ్చారిణి యైనశూర్పణఖ ఘో । రాకారదుర్దర్శ యై
వైదేహిం గని మ్రింగఁ బోక మొదలన్ । వా రల్గిరే దానికై
కాదే పూని ఖరుండు పోయి మడిసెన్ । గర్వంబునన్ రామునం
దేదీ పేర్కొనఁ దప్పు తప్పు మనయం । దే పో విచారించినన్. 75

క. తగవును ధర్మముఁ బలికిన, మగతన మది సెడునె వారు । మనపంతములం
దగిరే లేరే మీ ర,య్యగచరుఁ డటు సేయునప్పు । డది యట్లుండెన్. 76

తే. తొలుత మూఁ డుపాయంబులు । గొలుపకున్నఁ
దుదిఁ గదా విక్రమోద్యోగ । మదియు రిపుఁడు
మత్తుఁ డై యున్న నొరుచేత । నొత్తఁబడిన
వీతబలుఁ డైనఁ జను నండ్రు । నీతివిదులు. 77

వ. కావున రఘువరుం డప్రమత్తుండును విజిగీషుండు నధికబలసమేతుండు నగుట నెవ్వరికి నజయ్యుం డంతియకాదు ధర్మం బెచటవర్తించు నచటికి జయం బవశ్యంబు నగు నొక్కహనుమంతుండు మనల నెంతలుసేసె నిప్పు డమ్మహాత్మునిం గొల్చి యపారసత్త్వసంపన్ను లైనమేటివనచరవీరు లనేకు లనేకానీకంబులతో నరుగుదెంచినవా రింకను నిత్తెఱంగున వృథావైరంబు దగ దని పెక్కుహేతువులు సూపి చెప్పుచు ముకుళితకరకమలుం డై దశముఖుం గనుంగొని. 78

శా. రక్షోనాయక నిన్ను మమ్ము సచివ । వ్రాతంబు నీసేనల
న్రక్షింపన్ వలతేని పుచ్చు మరల । న్వైదేహి న ట్లేచి యా
జిక్షోణిం దృణకల్పుఁ డై ఖరుఁడు ప్ర । స్ఫీతోగ్రకీలాదురు
త్ప్రేక్షుం బై నరఘుక్షితీశుశరవ । హ్నిం బాటు గంటేకదా. 79

వ. అనిన విని నిశాచరేశ్వరుం డతనినయనిష్ఠురోక్తులు చెవుల కింపుగామి దిగ్గన నాస్థానంబు వెడలి నిజనివాసంబున కరిగె నంత నందఱుం దమతమమందిరంబులకుం జనిరి విభీషణుండు మఱునాఁడు ప్రభాతసమయంబున. 80

ఉ. మంగళతూర్యనాదములు । మానుగ మాగధసూతవందివా
క్సంగతమేదురంబు లయి । క్రందుకొనం బెనుమంది గల్గి మా
తంగఘటాసముత్కటమ । దద్రవనిర్ఝరపాతపంకిల
ప్రాంగణ మొప్పు నొప్పునమ । రారిగృహంబున కేఁగి మోసలన్. 81

క. అరదము డిగి చని యభ్యం,తరమునఁ దగుమంత్రివరులు । దనుఁ గొల్వ మణి

స్ఫురదురుసింహాసనమున, గరిమంబున నున్నయన్నఁ గని మ్రొక్కి తగన్. 82
వ. తన్నియోగంబున నొక్కపసిండిపీఠంబున నుండి కొండొకసేపునకుఁ బ్రసంగంబు దిగిచి యిట్లనియె. 83
సీ. సీత [1]నీ విటకుఁ దెచ్చినయది మొదలుగా, హోమాగ్ను లపసవ్యధూమ మడర
విస్ఫులింగంబులు వెలువడు చునికిని, నొప్పక హవ్యము లుప్పతిల్లుఁ
బొరిసరీసృపములు పొడముఁ గుండంబుల, నిభములు మదధార లింక వనరుఁ
దురగముల్ గన్నీరు దొరఁగ డిల్లంబులై, యుండును వికిరరోమోద్గమంబు
లశ్వకరికలభాదులయందుఁ గానఁ
బడు గవంకుల వాపోవుఁ బట్టపగలు
మొగి వఱల్లీమహోత్పాతములకు శాంతి
చూడ నద్దేవి మరలఁ బుచ్చుటయ లెస్స. 84
క. ఇత్తెఱఁగు మంత్రు లంత,ర్వృత్తములం గనియుఁ జెప్ప వెఱతురు నీచేఁ
జత్తురు నొత్తురుగాక వి, పత్తియెడం దగదె హితము పలుకం దమకున్. 85
క. అనవుడుఁ గోపంబున ని, ట్లను నాతని కతఁడు వార లమరగణములం
గొనివచ్చిన నేఁ బుత్తునె, జనకజఁ బొమ్మిమ్మ వలదు చక్కటి చెప్పన్. 86
క. రాముఁడునా నెవ్వఁడు సు, త్రాముఁడొ వరుణుండొ జముఁడొ ధనదుఁడొ పటుసం
గ్రామక్రీడకు నాతో, నీమాటలు విడువు విడువ నేను మహీజన్. 87
వ. అని పల్కి మందిరద్వారంబు వెలువడి కనకరథాధిరూఢుండై ధవళచ్ఛత్రచామరంబులు మెఱయ సరదంబుచుట్టును జర్మకృపాణపాణులును ముందటఁ బిఱుందఁ గెలంకులం బరిఘగదాముద్గర భిండివాలశూలాదిసాధనంబులు కీలాభీలంబులుగా రక్షోవీరు లనేకులు బలసి కొలువ మాతంగతురంగాదుల నెక్కి సేనానాయకులును మంత్రులును జనుదేర నానారుచిరరత్నచిత్రితంబును విశ్వకర్మనిర్మితంబును బహుపిశాచరక్షితంబు నగునాస్థానమండపంబున కేతెంచి మణిఖచితసింహాసనాసీనుండై మఱియుం దగువారిఁ గోలలవారిం బంచి రప్పించి నిజనియోగంబున నందఱు నర్హపీఠంబుల నుల్లసిల్లఁ గొండొకసేపునకు నక్కొలువు గలయం గనుంగొని. 88
తే. నేఁడు మేల్కని చనుదెంచినాఁడు కుంభ, కర్ణుఁ డింతకు మున్నెఱుఁగండు సీత
నేను దెచ్చినయవ్విధమితని కింకఁ, దెలియనంతయు వినిపింపవలయు ననుచు.
క. శూర్పణఖముక్కు పోవుట, దర్పితుఁ డౌఖరుఁడు వడుట ధరణిజఁ దానా
నేర్పునఁ దెచ్చుట పుర మన,లార్పిత మగుటయును వరుస నంతయుఁ జెప్పెన్.
వ. చెప్పి సభాసదులం గలయం గనుంగొని. 91
క. బృందారకు లింద్రునకును, నిందునకును దారకంబు లెట్టులు నా

1 సీత నీ విచటికిఁ జెఱదెచ్చినది మొదల్, హోమా.

కుం దలఁప నీనిశాచరు, లందఱు నని పల్కి మఱియు ✽ నందఱితోడన్. 92

క. నరులకు వానరులకు సా,గర మెట్లో దాఁటవచ్చుఁ ✽ గార్యస్థితు లే
వెరవులొ కా దనఁగా రా, దరుదుగ నొకక్రోఁతి గాదె ✽ యంతలు సేసెన్. 93

క. కాన విచారింపుఁడు మన, మేరీతిఁ జరింపవలయు ✽ నెన్నివిధములన్
జానకి నటఁ బుచ్చక య,మ్మానవుల జయించుతెఱఁగు ✽ మంత్రప్రౌఢిన్. 94

వ. అని పలికి విజృంభించి. 95

మ. నరులే నన్ను జయించువారు మొదలన్ ✽ నాలావు మీ రాసురా
సురయుద్ధంబులఁ జూడరే రఘుకులా ✽ స్తోకప్రతాపాగ్ని నా
శరవృష్టిం జెడ నాఱిపోవుట మదిన్ ✽ సందేహమే చూడుఁడీ
యరుదుం జూపెద నెల్లి నేఁడ ధనుర ✽ భ్రాడంబరం బొప్పగన్. 96

వ. అనిన విని కుంభకర్ణుం డి ట్లనియె. 97

శా. సీతం దెచ్చితి కార్యవేది వయి నీ ✽ చే మున్న సర్వంబు ని
ర్ణీతం బైనది యింక నేల చెపుమా ✽ నీకేవిచారంబు నీ
నీతిజ్ఞుల్ మును గాఁగ రాఘవధను ✽ ర్నిర్ముక్తనిర్ఘాతసం
ఘాతక్రూరశిలీముఖాగ్నిఁ బడి మృ ✽ గ్గం బోదు గా కే మనన్. 98

తే. నీతిపథమునఁ గార్యంబు ✽ నిశ్చయించి, తగవు దప్పక సేయున ✽ తండు మీఁద
నిడుమపొందఁడు ధర్మంబు ✽ విడిచి చొప్పు,దప్పి కావించునతఁడు సం ✽ తాపమొందు.

క. మొదల విచారింపక చే,యుదు రది తుది నొప్పకున్న ✽ నుక్కడఁగి ముదుం
గుదురు విను తులువ లప్పను, లొదవక చెడు [1]బూడ్ద నిడిన ✽ హుతములకరణిన్.

ఆ. ఎఱుక లేక చపలుఁ ✽ డేవంకఁ దిగిచిన, నల్పమతులు వాని ✽ ననుసరింతు
రొక్కకొంగ పాఱ ✽ నున్నకొంగలు గూడ, నెగసి పాఱు చునికి ✽ తగవు గాదె.

వ. అదియునుం గాక. 102

తే. [2](ఆదిమధ్యాంతరహితుఁ డై ✽ నట్టివిష్ణుఁ
డసురకులవధార్థం బిట్టు ✽ లవతరించె
రవికులాంబుధిసోముఁ డై ✽ రామచంద్రుఁ
డురుబలుఁడు గాని సామాన్య ✽ నరుఁడు గాఁడు. 103

క. ఈవిధమున మును నారదు,చే వింటిం బంక్తికంఠ ✽ సీతను మరలన్
భూవిభునకు నర్పింపు శు,భావహ మయ్యెడిని మనకు ✽ నమరారాతీ. 104

వ. అనిన విని పదిమొగంబులు జేవుఱింప నున్నదశగ్రీవుకోపరసభావం బెఱింగి
మఱి యొక్కింతసేపునకుఁ గుంభకర్ణుం డి ట్లనియె). 105

శా. ఇం కీమాటలకుం బ్రయోజనము లే ✽ దీజీవనం బేటికిన్
లంకాదాహము విన్ననాయలుక యె ✽ న్నం డాఱు న ట్లుండెనా

---

1 బూది నిడిన. 2 ఈకుండలీకరణములోనిది కొన్నిప్రతులం గానిపింపదు.

హుంకారంబు సహింప నెవ్వఁడు గలం డుగ్రాహవక్రీడలం
గింకన్ గిట్టి వధింతు రాఘవుల సుగ్రీవాదులన్ మ్రింగుదున్. 106
ఆ. దాశరథులు సమరతలమునఁ జంద్రార్కు, లైన ననలవరుణు లైన ధనద
పవను లైన నాదుపరిఘుంబుపాలు గాఁ,గలరు గాక గెలువఁ గలరె నన్ను.
వ. అనిన నతనిపార్శ్వంబున నున్నమహాపార్శ్వుం డన్నిశాచరేశ్వరున కిట్లనియె.
ఆ. కాన జున్ను రేఁచి తేనియ సమకొన్నఁ, గ్రోలకున్నవాఁడు బేల గాఁడె
యువిదఁ దెచ్చి యూర కుండుదురే తామ్ర,చూడకేళి కింకఁ జొత్తుగాక.
ఉ. నిండిననీమనోరథము నేఁడు ఫలించినఁ జాలు మీఁద ని
వ్వాం డని నిన్ను నోర్వఁ గలవాఁడు బలాధికుఁ డైనకుంభక
ర్ణుండును మేఘనాదుఁడుఁ గనుంగొన వజ్రము కేలఁ గ్రాల నా
ఖండలుఁ డెత్తివచ్చిన నఖండమదోద్ధతు లేన చూపెదన్. 110
క. కార్యం బిప్పుడు మనకుం, దుర్యోపాయంబ యున్నతోవలు బాహా
వీర్యవిరుద్ధము లవి జయ,ధుర్యులు గైకొనరు గాన దొడరుద మనికిన్. 111
వ. అనిన నతనిపలుకులకు సంతోషించి దశకంధరుం డిట్లనియె. 112
చ. కల దొకగోప్య మంబురుహగర్భునిఁ గొల్వఁ జనంగఁ బుంజిక
స్థల యనునచ్చరం దగవు దప్పి రమించితి నొల్ల నాఁగ న
న్నలువయు నంత నంతయు మనంబునఁ గాంచి శపించె నన్ను న
న్యలలన బల్మిఁ బట్టికొని నష్టశిరంబులు వ్రయ్య లై పడన్. 113
వ. అది కారణంబుగా నత్తెఱం గలవడదు రాఘవులం జంపినవెనుక నొకవిధంబునఁ గోర్కి సఫలం బయ్యెడుఁ గాక నాకొలంది వారెఱుంగరు గుహాంతరంబున నిద్రించుకంఠీరవంబు మేలుకనుపం జనుదెంచు (చున్నభద్రదంతావళంబులుం బోలె వచ్చు)చున్నా రని పలికి వెండియు. 114
ఉ. మింటికి మంటికిన్ నడుమ మిక్కుట మై దెస లెల్ల నొక్క పె
ట్టంటికొనం బ్లవంగకులభావలి మున్నుగ నాశరాగ్నిక్రొ
మ్మంటలచేత రాముఁ డనుమత్తగజేంద్రము నేర్చి పుచ్చి ని
ష్కంటకలీల నత్తరుణిఁ గైకొని యేలెద ముజ్జగంబులన్. 115
వ. అనినం గుపితమానసుం డగుచు విభీషణుం డిట్లనియె. 116
మ. తగవే రజ్జులు నేఁడు నీదగుమహాస్థానంబులో నింతటం
బగవా రక్కడ నుక్కరే మనమహాపార్శ్వాదివీరోత్తము
ల్మిగులం బంతము లాడి తప్పెదరె నిల్చెం బొమ్ము రారామునా
శుగవేగంబును వాలితమ్ముఁ డగునాసుగ్రీవుదోర్గర్వమున్. 117
వ. అనినఁ బ్రహస్తుం డతనిం గనుంగొని. 118
ఆ. వీరధర్మ మిట్లు విడిచి విభీషణ, రాజునెదుట దాశరథులఁ బొగడఁ

బాడి యగున క్రోధి బ్రహ్మరాక్షసుఁ జేయ, వచ్చినాఁడ వెంత వారు వారు.

మ. అవనీనాథులరక్తపూరములు ము న్నాపోశనం బెత్తి జాం
బవదాదిత్యతనూభవప్రభృతులం బ్రాణాహుతుల్ చేసి యు
న్నవనౌకంబుల వ్రేఁచి మ్రింగి పిదపం బ్రహ్మాండభాండంబు బి
ట్టవియం ద్రేఁపక కుంభకర్ణుఁడు సనం డాఁకొన్నవాఁ డెంతయున్. 120

ఆ. ఇతనియంతవాఁడ నెవ్వాఁడు రానిచ్చు, నొక్కఁ డొకఁడ వారి నుక్కడంపఁ
జాలియున్నవారు సమర్థులై యాతు, ధాను లొక్కనీవు దక్క వినుము.

వ. అనినఁ గుంభకర్ణానుజుండు కోపరక్తాననుం డగుచు నతనిం గనుంగొని. 122

మ. మగమాటల్ మన కేల నాఁ డలహనూమంతుండు లంకాపురం
బెగువం గాల్పఁగ నెందుఁ బోయితిమి నే నెవ్వండు లజ్జింపఁ డే
తగవుం జెప్పఁడు సీతఁ బుచ్చు మనఁ డాధాత్రీశునుల్కాసమా
శుగవేగంబు దలంపఁ డింక నిదియుం జూడంగ నౌ నాజులన్. 123

వ. అనిన నింద్రజిత్తు కర్ణశూలంబు లగునప్పలుకులకుం గనలి యి ట్లనియె. 124

క. పిఱికితన మెచట నలవడెఁ, గఱచితొకో పగఱ నింత గాఁ జేసి మముం
వెఱపించె దిచటఁ గొండఱు, వెఱతురె నినుబోఁటివారె వీ రెవ్వారున్. 125

క. నాకముపై నేఁగి సురా, నీకంబులఁ దోలి యింద్రునిం జెఱ దేనే
లోక మెఱుంగఁగఁ బ్రార్థన, వే కైకొని బ్రహ్మకొఱకు విడువనె పిదపన్. 126

చ. అనిమొన దేవదానవసహస్రము లొక్కటఁ గూడి వచ్చినం
దునుమఁగఁ జాలునావిపులదోర్బలలీలల కెవ్వఁ డోపు న
ప్పను లటు లుండనిమ్ము శలభంబులకై వడి మద్వరూథినీ
వనశిఖిపాలుగా రిపులు వత్తురు గా కిటు జంకె లేటికిన్. 127

తే. బలిమి మూఁడులోకంబులు గెలిచి దివిజ, సిద్ధయక్షాదికాంతలఁ జెఱలు గొన్న
యట్టిదశకంఠుతమ్ముఁడ వైననీకు, నీయధీరోక్తు లిటు నోరి కెట్లు వచ్చె.

సీ. నావుడు నమ్మేఘనాదున కతఁ డిట్టు, లను నీతికోవిదు లల్పు మూర్ఖు
బహుభాషి నుత్సుకు బాలు రహస్యంపుఁ, గార్యంబునప్పుడు గదియ నీక
నిరసింతు రెప్పుడు నీబుద్ధి యెంతయు, నవగుణంబుల కెల్ల నాలయంబు
గావున నీ వున్నకడ మంత్ర మూహించు, నీరాజు నేర్పున కేమికొఱత
పుత్రరూపంబు గైకొని పుట్టినట్టి, పగతుఁడవు గాక హితుఁడవే పతికి నిట్లు
తగవు వినఁజాల కేల మీతండ్రియట్ల, చిటిలిపడుచున్నవాఁడవు చెడఁ దలంచి.

తే. సురవరుఁడు గాఁడు కిన్నరేశ్వరుఁడుఁ గాఁడు
పావకుఁడు గాఁడు పితృలోకపతియుఁ గాఁడు
ఆహవక్రీడ నీకోడ నాదివిష్ణుఁ
డైనరాముని గెల్వ నీ కలవి యగునె. 130

వ. అని పల్కి మఱియు నతండు పల్కుతుచ్ఛోక్తులు లెక్కసేయక దశానను
నవలోకించి. 131

ఉ. ఏచినతాటకం దునిమె ఽ నెక్కుడువీరు విరాధు ఘోరనా
రాచముపాలు చేసె ఖరు ఽ గ్రక్కున నుక్కడఁగించె నట్టిమా
రీచు వధించె నారఘువ ఽ రేణ్యు నెఱింగియుఁ జక్కగావు లం
కాచరయామినీచరులఁ ఽ గాలము చేరిన నీకు శక్యమే. 132

క. వారితమకోలఁదు లెఱుఁగరు, బీరము లాడెదరు నీకుఁ ఽ బ్రియములుగా నీ
వీరుల నీవ యెఱుంగుదు, వీరలపంతములు వినక ఽ విను నామాటల్. 133

ఉ. (తాత పులస్త్యుఁడుం గనిన ఽ తండ్రియొ విశ్రవసుండు వైదికో
పేతము నిర్మలాచరణ ఽ మీవును బ్రహ్మవు చెప్పవచ్చినన్
నీతివివేకముల్ దొఱఁగి ఽ నిందకు నోర్చితి వేల దేవ ము
న్నీ తెఱఁ గెల్ల నొప్ప దని ఽ యీవ యెఱుంగుదు చెప్ప నేటికిన్. 134

వ. అని మఱియు నిట్లనియె. 135

మ. జగతీనాథుఁడు నీనెపంబునఁ బులఽస్త్యబ్రహ్మవంశంబుపైఁ
దెగ నంభోధి గడాకమున్న కపు లుఽద్వృత్తిం ద్రికూటాద్రి పె
ల్లగిలం ద్రోవకమున్న లక్ష్మణుఁడు కీఽలాఘోరనారాచముల్
నిగుడం జేయకమున్న పుచ్చు మరలన్ ఽ వేవేగ పృథ్వీసుతన్. 136

సీ. అనుడు నద్దశకంఠుఁ ఽ డతని కి ట్లను విను, రోషంబుతో బిట్టు ఽ రోఁజుచున్న
చటులోరగముతోడిఽ[1]సహనివాసమ్మున, కంటె నీతో నిట్లు ఽ గలసి యునికి
కడుఁ గీడు హితునట్ల ఽ కదియుచు శాత్రవ, మొకదెస జరపుచు ఽ నోట లేక
పగవానిపక్షంబు ఽ పలికెదు నీకంటె, నిక్కంపుఁబగవాఁడు ఽ నెరయ మేలు
ధనము విద్య కీర్తి ఽ దమలోన నొకనికిఁ, గలుగుటకు నసూయఁ ఽ గ్రాలువారు
నెడరు వేచువారు ఽ నెందు దాయాదుల, కారె కాన నమ్మఁ ఽ గాదు నిన్ను.

క. ఉదకము నళినీపత్రము, గదిసియు నెరవైనయట్లు ఽ కలయవు నీమా
హృదయములు గజస్నానము, తుది మఱి నీతోడిపొందు ఽ దుష్టచరిత్రా. 138

క. నాపెంపున కిట్టు లసూ,యాపరతం జూడఁ జాల ఽ కాదు చెఱుఁగనే
పోపో కులపాంసన యిం, కీపలుకులు పలికితేని ఽ యేను సహింపన్. 139

వ. అని యిత్తెఱంగున దైత్యభర్త కర్ణకఠోరంబులుగాఁ దనపిన్నతమ్ముని దూఱఁ
(బల్కుసమయంబునఁ గుంభకర్ణుం డంభోజసంభవుశాపవశంబున నిద్రాసక్తుండై
ధర్మవిరుద్ధంబు లగుదశకంధరువాక్యంబులును నీతికార్యప్రరుచిరంబు లగు
తమ్మునివచనంబులును మనంబునం దలపోసి యొండన నేరక దిగ్గున లేచి యన్న
కుఁ బ్రణమిల్లి యాస్థానంబు వెడలి నిజమందిరంబున కరిగెఁ దదనంతరంబ సూ

1 సహవాసమునకంటెఁ గడఁగి నీతో నిట్టు.

రాక్షసేశ్వరుం గనుంగొని కర్ణభీషణంబులుగా) విభీషణుం డి ట్లనియె. 140

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంతియ కా దటమీఁద రాజ వే
మన్నను జెల్లుఁగాక మణిమండనముఖ్యము లైన కానిక
ల్మున్నుగ సీత నిచ్చి జనలోకపతిం గని మమ్ముఁ బ్రోవు మీ
సన్నపుఁగార్యముల్ వలదు సంధియ మే లటు గాక తక్కినన్. 141

శా. జ్యాఘోషంబు నిరంతరం బగుచు మ్రోయం బెల్లు దంభోళిధా
రాఘోరాస్త్రపరంపరల్ దరఁగ లై రాజిల్ల వాపూరితా
మోఘావృత్తిఁ దనర్చు రామధనురంభోరాశి దోర్విక్రమ
శ్లాఘాగాధము నేఁడు ముంచుఁ బెలుచన్ లంకాపురీద్వీపమున్. 142

తే. వలదు చాటితి నతఁడు నీకోలఁది గాఁడు, చేటుతటి గాన నీ కిట్లు చెడ్డబుద్ధి
పొడముచున్నది నాశంబుఁ బొందనున్న, మేఘమునకు విశీర్ణంపు మెఱుఁగునట్లు.

ఉ. నీచెవిక్రిందఁ జేరి రజనీచరనాయక తుచ్ఛవాక్యముల్
నీచులు గన్కనిం బలుక నీ కవి పథ్యము లయ్యె నేగతిం
జూచిన నాహితోక్తులకుఁ జొన్పదు నీమది గాన [1]దుర్మదుం
డై చెడువానిపొంతఁ జన దంత్రు వసింపఁగ నీతికోవిదుల్. 144

వ. అదియునుం గాక. 145

సీ. నీ వెత్తఁ జాలని నీలకంఠునివిల్లు, పుడుకకై వడిఁ దున్మి ప్రోగు వెట్టె
నిలఁ గార్తవీర్యుబాహులు వేయుఁ ద్రుంచిన, పరశురాముని నాజిభంగపఱిచెఁ
గైలాస మెత్తినఘను నిన్నుఁ గట్టిన, వాలి నొక్కమ్మునఁ గూల నేసె
నీపుత్త్రు వధియించి నీలంకఁ గాల్చిన, హనుమంతు నేలినయతని నేలె
నట్టిరాముతోడ ననమానవైరంబు, పట్టి గెల్తు ననుట పడుచుబుద్ధి
చనదు సీత నిచ్చి శరణ నని రఘురాముఁ, గనుట మేలు చెడక మనుట మేలు.

వ. అనిన విని వికటభ్రూకుటిదుర్నిరీక్ష్యుం డగుచు రాక్షసేశ్వరుండు. 147

—రావణుఁడు విభీషణుఁ బరిభవించుట.—

చ. మెఱుఁగును గర్జితంబుఁ గల మేచక మేఘము పర్విన ట్లొఱం
బెఱికినవాలు కేల జళిపించుచు హుంకృతిభీకరంబుగా
నుఱికి యురంబు దాఁపఁ బిడు గుక్కఱఁ దాఁకినకొండభంగి బి
ట్టొఱగె నతండు మూర్ఛఁ దను నొందిన గద్దియనుండి భూస్థలిన్. 148

వ. ఇట్లు విభీషణుం దాఁచి భీషణరోషభాషణంబులు చెలంగఁ గేలం గరాళకరవా
లం బంకించునెడ నెడసొచ్చి దేవ మన్నింపు మనుచుఁ బ్రహస్తప్రముఖు లగు
వారు వారించి గద్దియకుం దెచ్చి రంతఁ గొంతదడవునకుఁ దెలిసి విభీషణుండు.

క. కామక్రోధమదంబులు, నీమనమున నిండి యుండ నిర్మలధర్మం

[1] కర్మతుం డై.

బేమూల నుండు రావణ, నామాటలు సెవులఁ జొచ్చుఁ§గనా నీ కింకన్. 150

వ. అనిన విని సైరింపక నిలింపారాతి ప్రహస్తునిం జూచి వీనిం గొలువు వెడలఁ
ద్రోవు మని పనిచిన నతండునుం గదిసి. 151

క. రక్కసులరాజు నీతో, మిక్కిలి కోపించినాఁడు § మిన్నక నీవుం
దక్కవు వెడనీతులు పొ, మ్మిక్కడ నీయునికి పొసఁగ § దింతటిమీఁదన్. 152

వ. అనిన నవ్విభీషణుండు సభామధ్యంబున నిల్చి రావణుం గనుంగొని. 153

చ. 'చనదు మహద్విరోధ మని § చక్కటి చెప్పిన నింతతప్పనం
గనలితి నీతిశూన్యులకుఁ § గార్యము లేటికిఁ దోఁచు నిష్ఠు వే
యును బనిలేదు నీవలన § నొప్పనినావచనంబు లెల్ల నీ
వని మొన రాముచేఁ బడిన§యప్పు డెఱింగెదు గాక పోయెదన్. 154

వ. అని పలికి వినతుండై తనమంత్రులు నలనీలహితసంపాతు లనువారలు నలు
వురుఁ దానును గదాపాణు లగుచు నాస్థానంబు వెడలి యేకదండిత్రిదండు లగు
ననేకవృద్ధబ్రహ్మరాక్షసులు ధర్మకథ లుపన్యసింప వినుచు ధవళాంబరశోభినియై
చిత్రాసనంబున నున్నతల్లిపాలికిం జని నమస్కరించిన నక్కైకేశియు నతని
నవలోకించి. 155

ఆ. అన్న నీవు తగవు § లన్నకుఁ జెప్పంచు, నున్నమాట లేను § విన్నగోలె
బెగడుచున్నదాన § మొగ మొప్ప కున్నది, యేమి తెఱఁగు చెప్పు§వే తనూజ.

చ. అనవుడు నాతఁ డిట్లను ద§శాననుఁ డారఘునాథుదేవి వం
చనఁ గొనివచ్చి లోక మని§శాచరలోకము సేయఁ బూనినన్
జనని కడంగి యే నతనిఁ § జక్కటిమాటలఁ దేర్పవాఁడ నై
జనపతివిక్రమంబు ఖరు§చావును బేర్కొని పెక్కుభంగులన్. 157

శా. మే లూహించుట సీతఁ బుచ్చుటయ చు§మ్మీ యన్న నమ్మాటకుం
గాలం దాఁచి శిరంబు ద్రుంతు ననుచుం § గౌక్షేయకం బుత్కట
జ్వాలాభీలము గాఁగ నెత్త సచివుల్ § వారించి రుల్కాతతుల్
దూలం గ్రమ్మఁటఁ జూచి కొల్వువెడలం § ద్రోపించినన్ వచ్చితిన్. 158

క. జననీ రఘుపతిఁ గొల్వం, బనివినియెద నీవు తాల్మి § పదిలించి మనం
బున దీనికి శోకింపకు, మనవుడు మూర్ఛిల్లి తెలిసి § యాసతి సుతుతోన్. 159

చ. వినుము తనూజ నాకు మును § విశ్రవసుం డెఱిఁగించినాఁడు మీ
జననమునష్ట మీఁద నగు§సర్వము రావణకుంభకర్ణు లే
పున నొనరించుబాధ లోగిఁ § బోయి నిలింపులు విన్నవింప న
ద్దనుజవిరోధి వీరలవ§ధంబునకై జనియించె రాముఁడై. 160

క. దోషాచరవంశము ని, శ్శేషము గా కొంట రెంటఁ § జిక్కినవారిం
బోషింప నీవ నిలుతు వి,భీషణ రఘురాముకరుణఁ § బెంపు దలిర్పన్. 161

వ. కావున నీ వింక నాశరణాగతవత్సలు నాశ్రయింపం జనుము తండ్రీ మీతండ్రి తపోమహత్త్వంబున హరిహరహిరణ్యగర్భులు లోకపాలురు గ్రహతారకంబులు గులపర్వతంబులు సముద్రంబులు మహానదులు నుభయసంధ్యలును వేదంబులు వేదాంగంబులు నహోరాత్రంబులు నిన్ను రక్షింపనిమ్ము నెమ్మదిం బోయి రమ్మని దీవించిన నతండు నభివందనపూర్వకంబుగా జనయిత్రి వీడ్కొని మంత్రి సమేతుం డై గగనమార్గంబునం జన నక్కడ సుగ్రీవుం డనతిదూరంబునం గనుంగొని కపులతో నిట్లనియె. 162

మ. ఒకనక్తంచరపంచకం బదె కరాళోదగ్రహేతిద్యుతి
ప్రకరం బీక్షణభీకరంబుగఁ దటిద్భాభాసురం బైనమే
చకమేఘౌఘము పెంపు నొంది మనపై సంగ్రామగర్వంబునం
బ్రకటం బై చనుదెంచుచున్నది నభోభాగంబునం గంటిరే. 163

క. అని పలుకఁ దరులు గిరులుం, గొని యారక్కసుల నేలఁ గూల్చెద మనుచున్
వనచరులు సంభ్రమింపఁగఁ, గని యట నెలుఁగెత్తి కుంభకర్ణానుజుఁడున్. 164

ఉ. ఓకపివీరులార కరుణోదధి నీరఘురాము సర్వలో
కైకశరణ్యునిం గొలువఁగా నిట వచ్చితి నొండు గాదు నా
రాక మహాపరాధి యగురావణుతమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు లర్కకులాగ్రణితోడఁ జెప్పరే. 165

ఉ. వంచన సీత నేల కొనివచ్చితి రావణ మిన్నకుండి రా
త్రించరవంశ మేల కడతేర్చెదు భూసుత నింక వేగ మొ
ప్పించుట మేలు నా నతఁడు పెంపఱ నొక్కనీచుఁబోలె భ
ర్త్సించుచుఁ గాలఁ దాఁచి నిరసింపఁగఁ బంచె సభాంతరంబునన్. 166

వ. అనిన విని వానరేంద్రుం డన్నరేంద్రున కిట్లను నిట్లేతెంచినవీరు రావణువేగులవారు గాఁబోలు మనమర్మంబు లారయ వచ్చినారు రాక్షసులు మహాసాహసికులు గామరూపంబులు గైకొని వర్తింప నేర్తురు గాన నమ్మి వీరలఁ జొరనిచ్చు టుచితంబు గా దట్లుం గాక పగతుతమ్ముం డితని నెవ్విధంబునను వధియించుటయ కార్యం బనవుడు నారఘువరుండు ప్లవంగపుంగవులం గనుంగొని. 167

ఆ. రవితనూజుపలుకు లవినీతియుక్తంబు, లగున యైన సీతఁ దన్నతోడ
నలిగి వచ్చినాఁడొ యటుగాక సంధి కే, తెంచినాఁడొ మనకుఁ దెలియవలయు.

క. అనవుడు నినసుతుఁ డిట్లను, మనుజేశ్వర కరుణ మమ్ము మన్నించుతలం
పున నడిగెదు గా కీ వెఱుఁ,గని కార్యస్థితులు ముజ్జగంబులఁ గలవే. 169

వ. దేవా నీ వవధరించినయట్టిద కార్యం బనవుడు నప్పు డంగదుం డిట్లను గుణదోషంబులు విచారించి కదా కార్యనిశ్చయం బితండు శత్రుండు మిత్రత్వంబు భావింపం జన దనిన జాంబవంతుం డిట్లనియె. 170

తే. ఎట్టివాఁ డైనఁ బగఱపై § నెత్తినపుడు, విడిచి పోవునె చుట్టంబు § నెడరు వేచి
యాతఁ డీవేళఁ దమవారి § నెల్లఁ బాసి, వచ్చినపుడ విచారింప § వలయు ననిన.

క. మొదల నొకవేగువానిం, గద లరయఁగఁ బనిచి పిదపఁ § గార్యము సేయం
బదిల మని పలికె శరభుఁడు పదపడి మైందుండు నట్ల § పలికెఁ బలుకుడున్.

సీ. హనుమంతుఁ § డిట్లను నధిప పంచినచారు, లేఁగియు నింగితం § బెఱుఁగ రితఁడు
దుష్టాత్ము నమ్మూర్ఖు § దొఱఁగియు రాఁబోలు, నేఁ బట్టువడ్డప్పు § డితఁడు దూత
దండింపఁదగ దని § దశకంఠునకుఁ జెప్పి, నను నాఁడు విడిపించె § నాఁడు గాన
దోషాచరాకృతి § దోఁప దీతనియందు, నయమార్గవర్తియ § నాకుఁ జూడ
వాలిఁ జంపి మీరు § వనచరేశ్వరపట్ట, మినతనూభవునకు § నిచ్చు టెఱిఁగి
యన్నఁ బాసి రాజ్య § మర్థించి నినుఁ గొల్వ, వచ్చినాఁడు గాన § వచ్చుఁగాక.

మ. అటు గాఁ గొండు దలంచి వచ్చిన తెఱం § గై నం గపిశ్రేణియుం
దటఁ జక్కం జనఁ బోల దెవ్వరికి నీ § తం డెంతవాఁ డన్న న
వ్వటుచూడామణిఁ జూచి రాముఁ డను నీ § వాక్యంబు లొప్పం గడుం
గుటిలుం డైన భయాతురుం డితనిఁ గై § కొందుం బ్లవంగోత్తమా. 174

ఉ. నావుడు లక్ష్మణుండు నర § నాథున కిట్లను దేవ మీరు సు
గ్రీవునివిన్నపం బవధ § రింతురు గా కపరాధి యైనమీ
రావణుతమ్ముఁ డీతఁ డట § రాక్షసమాయలు పెక్కుత్రోవ లే
త్రోవఁ దలంచి వత్తురో వి § రోధులతో సహవాస మేటికిన్. 175

క. శరణార్థి నన్నమాటకు, ధరణీశ్వర యెందుమాట § దలఁపక యున్నం
బరిపంథి గాన యెట్లును, బరిహరణీయుండు నీతి § పథ మూహింపన్. 176

వ. అనిన నమ్మహీనాథుండు సుమిత్రాపుత్త్రు నవలోకించి. 177

క. మృగయుం డాఁకొని వచ్చినఁ, బగవాఁ డనుతలఁపు విడిచి § పరహితబుద్ధిం
దగిలి కపోతం బచ్చెరు,వుగ నాహుతి యయ్యె మానవ § వుం డీఁ దగఁడే. 178

క. దీనుఁ గృతాంజలి నడిగెడు,వానిఁ శరణార్థిఁ జంప § వలవదు శత్రుం
డైన ననుకణ్వవచనము, మానసమునఁ [1]దలఁచి నీవు § మఱవకు మెపుడున్. 179

ఉ. అంతియ కాదు చాలి శర § ణాగతుఁ జేకొన కున్నవాఁడు ద
త్సంతతసంచితోగ్రదురి § తంబులు గైకొని వానికి నిజా
త్యంతవిశుద్ధపుణ్యనిచ § యంబులు గోల్పడి నాకలోకవి
శ్రాంతివిదూరుఁ డై చను ధ § రం గలనాఁ డపకీర్తిపాలగున్. 180

ఆ. అభయదానమునకు § నశ్వమేధాదులు, వేయు నీడు గావు § విశదకీర్తు
లఖిలదిశల నెసఁగు § నార్తు రక్షించిన, నట్లు గాన సంది § యంబు వలదు. 181

క. ఇతఁ డనఁగ నెంత శరణా,గతుఁ డయినదశాస్యు నైనఁ § గాతుఁ నాకుం

---

1 గొల్వ నీవు మదియిం పరయన్.

బ్రతిన యిదె వేగ దోడ్తెం, డితనిం గైకొంటి నభయ మిచ్చితి నెమ్మిన్. 182

వ. అనినం గపినాయకుండు రఘునాయకుం గనుంగొని దేవా దేవరగుణంబులు విచారింప నిది యెంత మీ రనుగ్రహించినప్పుడ సర్వగుణసమగ్రుం డితండు మాకుం బ్రియసఖుండు నిష్టబంధుండును గా నర్హుండు మీయడుగులు గొల్వం దోడ్కొని వచ్చెదముగాక యనుచుం దగినవానరవీరులతోడ నంబరంబున కెగసి తమరాక కెదురువచ్చునవ్విభీషణు నాలింగనంబుచేసి సముచితాలాపంబుల ముదం బొదవించుచు రామచంద్రుండు నీ కభయంబిచ్చె వత్తుగాక యనిన మంత్రిసమేతుం డై యతం డిలకు నేతెంచి యారాజపరమేశ్వరుపురోభాగంబున దండప్రణామంబు సేసి నిలిచి కృతాంజలి యగుచు నిట్లనియె. 183

—విభీషణుఁడు రాముని శరణుచొచ్చుట.—

ఉ. అర్కకులాధినాథ శరణాగతవత్సల దేవ యాజగ
త్కర్కశుఁ డైనరావణునితమ్ముఁడ నయ్యు భవత్కటాక్షసం
పర్కమునం గలంకమును బాసితి ధన్యుఁడ నైతి నింక నీ
యర్కసుతాదులం దొకఁడ నైతిఁ గృతార్థుఁడ నైతి నావుడున్. 184

మ. కరుణం జల్లెడుచల్లచూపు నిగుడం గంభీరవాక్యంబులం
బరమప్రీతి జనింపఁగా విభుఁడు సంభావించి నక్తంచరో
త్తర లంకం గలయాతుధానులభుజాదర్పంబు నీ వేర్పడం
బొరి నా కంతయుఁ జెప్పు మన్న నతఁ డాభూపాలుతో నిట్లనున్. 185

వ. దేవా దేవకంటకుం డగుదశకంఠుండు బ్రహ్మవరంబున సురాసురాదుల కజయ్యుం డతనియనుజుండు నా కగ్రజుండు నగుకుంభకర్ణుండు లావున రావణుకంటె నెక్కుడనందగినశూరుండు దశగ్రీవున కగ్రతనయుం డింద్రజిత్తనువాఁ డభేద్యకవచుం డవార్యశరాసారుం డలక్ష్యగాత్రుండు నగుచుఁ జిత్రయుద్ధంబులు సేయుం బ్రవీణుండు ప్రహస్తుం డనుసేనానాయకుండు విక్రమావష్టంభవిజృంభి యగు మాణిభద్రుం డనుగంధర్వుం బోలినవాలుమగండు జగత్కంపనుం డగునకంపనుండుఁ గుంభుండును నికుంభుండును మహోదరుండును మహాపార్శ్వుండు నతికాయుండును మహాకాయుండును నరాంతకుండును దేవాంతకుండు నగ్నికేతుండును రశ్మికేతుండును ననువారలు మహావీరులు దుర్వారబలగర్వంబుల నెవ్వారిం గైకొననివారు మఱియు నపారసత్త్వసంపన్ను లగుదోషాచరభటులు పదివేలకోట్లు లంకానగరనివాసు లైనవా రనిన విని రఘువరుండు వీరరసావేశంబున. 186

క. లోకాలోకము గడచిన, నాకసమున కెగసి చనిన నబ్ధిం బడి ద
ర్వీకరలోకము సొచ్చినఁ, బోకార్తు దశాస్యు నతనిపురి నీ కిత్తున్. 187

తే. వేయునేల బ్రహ్మాదులు వెనుకఁ బెట్టికొన్న నిఖిలరాక్షసులతోఁ గూడ నతనిఁ

జంపి తా కే నయోధ్యకుఁ । జనితినేని, [1]దశరథేశునడుగులకుఁ । దప్పినాఁడ.

క. అనుడు ముదమంది వినయం,బున మోడ్పుంగేలుమౌళి । మోపి యతం డి
ట్లను నోపినయ ట్లేనును, జనవర సమయింతు నన్ని । శాచరసేనన్. 189

వ. అనిన సంతోషించి రామచంద్రుండు లక్ష్మణుం గనుంగొని నీవు సముద్రోదకం
బులు దెచ్చి లంకారాజ్యంబునకు విభీషణు నభిషేకంబు సేయు మని నియోగించె
నాసమయంబున సుగ్రీవుం డి ట్లనియె. 190

చ. అనఘచరిత్ర మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశితబాణజాలములఁ । జోఁకున నోర్వక వచ్చి తా దశా
ననుఁ డభయంబు వేఁడికొని । నం దగ వె ట్లగు నన్న నవ్విభుం
డినసుతుఁ జూచి య ట్లయిన । నిచ్చెద వాని కయోధ్య నావుడున్. 191

తే. అఖిలవానరవీరులు । నయ్యనుగ్ర,హంబు గొనియాడి రంత న । య్యధిపునాజ్ఞ
నట్లు సౌమిత్రియును రాక్ష । సాధిపత్య,మునకు నభిషిక్తుఁ జేసె నిం । పెనయ నతని.

వ. ఆసమయంబున సుగ్రీవహనుమంతు లవ్విభీషణుం జూచి సేనాసహితంబుగా ని
న్నరేంద్రున కంబుధి గడచు తెఱం గె త్తెఱంగునం గల్గు నీమతం బెఱింగింపు మ
నిన నతం డి ట్లను రామచంద్రుండు సముద్రప్రార్థనంబు సేసి లంకపై నరుగునది,
కార్యంబు నావుడు వార లవ్వాక్యంబులు విన్నవించిన రఘువరుండును లక్ష్మణా
నుమతంబున నొక్కరమ్యప్రదేశంబున నుదధిం గూర్చి నియతుం డై యుండె నం
త శార్దూలుం డను వేగులవాఁ డింతయుం జూచి పోయి రావణున కి ట్లనియె.

క. దేవ విభీషణుఁ గడు సం,భావించి నిశాచరాధి । పత్యమునకు నా
భూవల్లభుఁ డభిషిక్తుం, గావించెఁ బయోధి దాఁటఁ । గలఁ డిటమీఁదన్. 194

క. వనచరసేనయు శతయో,జనవిస్తారంబు గలిగె । జలనిధి కీ డై
పెనుపొందుచు నేదెసఁ జూ,చిన నరుదు భయంబుఁ జేయుఁ । జిత్తంబునకున్.

క. రాఘవులును రణవిజయ,శ్లాఘాయుతు లసమసత్త్వ । సంపన్ను లురు
జ్యాఘాతకఠినబాహు ల,మోఘశిలీముఖులు సమర । ముఖవికచముఖుల్. 196

వ. కావున సామభేదదానంబులలో నొక్క తెఱంగు సేయునది కార్యం బనిన నద్దశ
ముఖుండు శుకుం డనువానిం గనుంగొని. 197

— రావణుఁడు శుకుం డనుదూతను బంపుట. —

శా. సుగ్రీవుం డనువాఁడు మర్కటభట । స్తోమంబుతో దుర్మదో
దగ్రక్రోధముఁ బూని రామునకుఁ దో । డై వచ్చుచున్నాఁడు గ
ర్వగ్రస్తుం డతఁ డీవు వే చని వృథా । వైరంబు నీ కేల పం
క్తిగ్రీవుం [2]డురునో నరుం డురునొ బు । ద్ధిం జూడుమా యేర్పడన్. 198

వ. అని పల్కి నావచనంబులుగా వెండియు ని ట్లనుము. 199

1 దశరథేశ్వరుసానకుఁ దప్పినాఁడ. 2 డురవో నరుం డురవొ బుద్ధిం.

మ. కపినాథుండవు నీవు రాఘవుఁ డనంగాఁ దాపసుం డాసురా
ధిపు ముట్టియుఁ గొన్న రాక్షసకులాధీశుండ నే నిన్ను ని
క్కపుఁదోఁబుట్టువు గా మదిం దలఁతు సఖ్యం బైన నాతోన పొం
దుపడుం గావున నేఁగు మీవెడఁగుమర్త్యుం బాసి కిష్కింధకున్. 200

క. అటు గాకున్న సురాసుర,భటులకు రారాని లంకపై నరులకు మ
ర్కటులకు రావచ్చునె యను, మటమీఁదం జూచికొందమంత తెఱంగున్.

క. నావుడు నతఁ డాకకీరం,బై వెసఁ జని నింగి నిలిచి యగచరపతితో
రావణుసందేశము గడు, [1]సావరమునఁ జెప్పి మరలి చనఁ దోన కపుల్. 202

క. వడి నెగసి వాలములఁ గొని, వెడచఱువం జఱచి దొంగ వీఁడు మనకు లోఁ
బడియె ననుచుఁ బిడికిళ్లం, బడఁ బొడిచిరి పట్టి తెచ్చి భానుజునెదుటన్. 203

క. అత్తెఱఁగున నొప్పింపఁగఁ, దత్తఱపడి రాముఁ జూచి ధరణీశ్వర వీ
రెత్తెత్తి గ్రుద్దుచున్నా, రిత్తఱిఁ గృపఁ జూడవే శుభేక్షణ నన్నున్. 204

క. (అధిపతిపంపున వెఱవక, యధికంబుగ నిష్ఠురోక్తు లాడిన నిచ్చా
విధిఁ బలికిన వార్తావహు, వధియించుట కర్జమే విపద్వంశా.) 205

వ. అనిన విని రామచంద్రుండు విడిపించి పుచ్చుటయు వాఁడు నంతరిక్షంబున కెగసి సుగ్రీవా దశగ్రీవుతో నేమి చెప్పుదుం జెప్పు మనిన నతం డలుకనచ్చిలుకం గనుం
గొని. 206

సీ. తలపోసి చూచినఁ దా నాకు నవ్వాలిఁ, బోలిన యట్టితోఁబుట్టు వనుము
వసుమతీసుత నట్లు వంచించి తెచ్చుట, మగఁటిమి గా దది మఱవకు మను
లోక మరాక్షసలోకంబుగాఁ జేయఁ, గపిసేనతో వార్ధిఁ గడతు మనుము
లంకఁ ద్రికూటాచలముతోన మున్నీటఁ, బెఱికి పేటాడి వైపింతు మనుము
యాతుధానరాజ్యంబున కర్హుఁ డైన,మావిభీషణుఁ డలర లక్ష్మణుఁడు గడఁగి
భీకరాశుగసప్తార్చిఁ బేర్చునర్చు, లెసఁగ నింద్రజిచ్ఛలభంబు నేర్చు ననుము.

మ. విలు యూపంబు శరాళి దర్భతతి మౌర్వీటంకృతుల్ మంత్రముల్
[2]గలితాసృక్ఛట లాజ్యధారలు నిమగ్నక్రోణికల్ స్రుక్స్రువం
బులు గా రాముఁడు యాజకుం డయి సమిద్భూవేదిఁ గోపానలా
ర్చులతో నద్దశకంఠుఁ డన్పశువు వేల్చుఁ నిర్జరప్రీతిగన్. 208

క. దిక్కు గలదేని చను మను, మెక్కుడుదర్పమున జగము లేఁచుట లింకం
జిక్కె నను పొమ్ము నీ వని, యక్కపిపతి పలుక నప్పు డంగదుఁ డలుకన్.

తే. కపటచారుండు వీఁడు నిక్కంపుదూత,గాఁడు వీనిఁ బోనీకుఁడు కపులు వేగ
మగుడఁబట్టి తెండనవుడు నెగిచి తెచ్చి,[3]పెలుచనొప్పించుటయువాఁడు భీతుఁడగు

చ. ఇదె ననుఁ బట్టి తెచ్చి కపు లేపునఁ గాలను గేల బిట్టు నొం [చు.

1 'సావనమున' వ్రా. ప్ర. 2 'కలితాసృగ్ఘుర లాజ్య. అ. ప్ర. 3 పెనఁచి నొప్పించుటయు.

చెదరు మొగంబు రాచెదరు | చెట్టుప లూడ్చెద రిట్లు దూతలం
జదుపఁగఁ జూతురే నయవిశారద నావుడు రామునాజ్ఞకు౯
వదలిరి వారు వానిఁ జని | వాఁడును జెప్పె సురారి కంతయున్. 211

వ. తదనంతరంబ. 212

—శ్రీరాముఁడు దర్భశయనము చేయుట.—

సీ. ఎయ్యది బహురత్న | హేమకేయూరాది, భూషణలక్ష్మికిఁ | బోలుపు నొసఁగె
నెయ్యది మిథిలేశు | నింట సిల్లడ యున్న, ధూర్జటివిలు లీలఁ | ద్రుంచి వైచె
నెయ్యది సోయగం | బెలరార వైదేహి, నేపథ్యరచనల | నేర్పు మెఱసె
నెయ్యది సన్నుతు | లెసఁగ నిచ్చలు గోస, హస్రప్రదాతృకం | బగుచు వెలసె
నట్టిచే దలయంపిగా | నవ్విభుండు, దర్భశయనుఁడై వాసర | త్రయము నియతి
నుండనిజమూర్తితోడఁ బ | యోధివచ్చి, తనకుఁబొడసూపకున్నఁ జి | త్తమున నలిగి.

శా. కంఠే లక్ష్మణ నన్నుఁ గైకొనక రం | గత్తుంగభంగంబు లొం
డొంటిం దాఁకుచుఁ బైపయి౯ నెగయఁగా | నుద్వేలమై వార్ధి మి
న్నంటం బొంగెడు నంతకంత కిటు లి | య్యాటోప మింకింతు నా
వింటం బుట్టినబాణబాడబముచే | వేవేగ విల్లీవనా. 214

క. క్షమయును బ్రియవాదిత్వము, శమమును నార్జవము దుర్వి | చారులు గడుఁ జా
లమిగా నూహింతురు లో, కము వెఱచుట బెట్టిదంబు | గలుగుటఁ జుమ్మీ. 215

క. గుణహీను లైనవారల, గుణహీనులు మెత్తు రట్టి | కుత్సితుఁ డగురా
వణునిపొగుగువాఁడఁట యో, గుణములు గల విందు వెదక | గుణరత్ననిధీ. 216

తే. అనుచు ధను వందికొని యుగాం | తాగ్నికరణి
దురవలోకుఁడై లోకముల్ | దిరుగఁబడఁగఁ
జిటిలి పడుపిడుగులతోడి | చిచ్చుఱమ్ము
లమ్మహాంబుధిమీఁద నం | దంద పఱపె. 217

వ. అప్పు డాశరపరంపరలు వారిపూరంబుపై నడరిన. 218

మ. విచలద్వీచులఁ గ్రొంబొగల్ నెగయఁగా | వెన్వెంట బాణాగ్ని నం
బుచరవ్రాతము లిట్టు నట్టుఁ బఱవ౯ | భోగీంద్రలోకంబువా
రచటం గచ్ఛపరాజు క్రిందు సొర ను | ద్యద్ఘూర్ణ నాభీలకీ
లచయోద్ఘట్టనరోచుల౯ జలధి గా | లం జొచ్చె నచ్చిచ్చునన్. 219

తే. అపుడు సౌమిత్రి కడుభయ | మంది దేవ
వలవ దిట్టులు సైరింప | వలయు ననిన
నన్నరేంద్రుఁడు మఱియుఁ గెం | పారుచూడ్కి
నిగుడ బ్రహ్మాస్త్ర మరిఁ బోసి | తెగఁ గొనంగ. 220

శా. ఆకంపించె ధరిత్రి బిట్టవిసిన క్లై మ్రోసె బ్రహ్మాండ మ
స్తోకధ్వాంతము గప్పె దప్పిరి గతుల్ సోమార్కు లుల్కాదురా
లోకం బయ్యె నభంబు దిగ్వివరము ల్దూలెన్ యుగాంతాభ్రముల్
వే కూలెం బొడలేక భూతములు లోఁ గాలెం గూలె నిర్ఘాతముల్. 221

వ. ఆసమయంబున. 222

—✿ సముద్రుఁడు రామునకుఁ బ్రత్యక్ష మగుట. ✿—

సీ. అరుణసితాసితహరితవర్ణంబులఁ, జటులఘోరానలచ్ఛటలు దెగడ
1జిహ్వాల నెగడెడుశిరములు గలమహా,ఫణులు ఫణామణిఘృణులతోడఁ
జుట్టును విలసిల్ల సురసరిన్ముఖనదుల్, తమతమదివ్యరూపములు దాల్చి
సూరెలఁ జెలువొంద సురుచిరబహుభూష,ణంబులు రక్తమాల్యాంబరములు
మెఱయఁ గాంచననిభ మైనమేను పూని, సలిలమధ్యంబువలన నజ్జలధి వెడలి
యభయపుష్పమాలిక మౌళి నమర నాన్ప,పాలుపాలికి నేతెంచి కేలుమొగిచి.

చ. నృపవర మున్ను లోకములు నిల్పినవాఁడవు నీవ కావె యా
దిపురుషుఁ డైనవిష్ణుఁడవు దేవహితం బొనరింప నిప్పు డీ
వపువు ధరించినాఁడవు భవన్మహిమంబున భూతకోటి ని
క్కపు2గతి నుండఁ గావుము జగం బెఱుఁగం గడసూప నేటికిన్. 224

క. సగరుఁడు మీకులవిభుఁ డ, జ్జగతీపతిపేర నేను సాగర మనఁగా
నెగడుదుఁ గావున నిట్టులుఁ, దెగఁ దగునె నరేంద్రచంద్ర తెగ యుడుపఁగ దే.

క. నామీఁద నేమి వైచిన, నే మునుఁగఁగ నీక యెగయ నెత్తుచు రా మీ
రామార్గంబున రం డని, సామోక్తులు పలుక నద్దశరథాత్మజుఁడున్. 226

క. కరుణం గనుఁగొని తటినీ,శ్వర విను నాబాణ మేచట వంధ్యము గా దీ
వరసాధన మే నిం కె,వ్వరిపై నడరింతు ననిన వారిధి మఱియున్. 227

క. జననాథ 3దృశ్యగుల్మం, బనుపేరం బరఁగునొకమహాగర్తము నా
కెనయఁగ నుత్తరభాగం,బున నుండు నగాధసలిలపూరం బగుచున్. 228

వ. అం దాభీలముఖంబులు గలుగురాక్షసు లుండి దుర్వారగర్వంబునం బల్మఱుం జనుదెంచి మదీయాంబుపూరంబు ననేకగ్రాహకులంబుతోడ బలువిడిఁ గ్రోలుచుండుదు రాదురాత్ములసమ్మర్దంబు నాకు సహింపరా కుండు నీ వీఘనకాండం బింక నయ్యావటంబుపై నడరింతుగాక యనుడు నాదుర్ధరధనుర్ధరుం డట్ల చేసిన.

చ. మిడుఁగుఱుమొత్తముల్ సెదర మింటఁ బొరింబొరి మంట లంట న
క్కడువడిఁ దచ్ఛరం బళనిఘోరగతిం బడి యన్నిశాచరుల్

1 జిహ్వాలు రెండువేల్ శిరములు. 2 గతి నుండఁ గాన తఱుఁగం బెరుఁగం గడచూప నేటికిన్. 3 'ద్రుమకుల్య' మని మూలము.

సుడివడి మ్రుంద నమ్మడువు § శోషిలఁ జేయుచు నేలఁ గాఁడి య
క్కడ నహిలోకముం గడచి § క్రమ్మఱఁ దూఁణికి వచ్చెఁ జెచ్చెరన్. 230

క. అంతటను దత్ప్రదేశం, బంతయు మరుదేశ మయ్యె § నచటికి నబ్జా
కాంతుఁడు సరసఫలాంచిత,[1]కాంతార మ్మఖిలహితము § గా వర మిచ్చెన్. 231

క. జల [2]మయ్యిషురంధ్రంబున, నిలకు రసాతలమువలన § నెగయుట నాదు
స్థలి నది యిషు వనుపేరఁ, ఖలకూపం బయ్యె నధ్వ § గహితం బగుచున్. 232

వ. తదనంతరంబ సంతుష్టహృదయుం డగుచు నయ్యాపగావల్లభుండు భూవిభుం గనుంగొని రఘువర మీతండ్రి దశరథుండు దేవాసురయుద్ధంబున నింద్రునకుం దోడువచ్చి సుర లసురులకుం గాక యోహటించినప్పుడు తనుగిరివర్షంబు గురియుచుఁ గడంగునాకుం దోడ్పడి కోదండపాండిత్యంబు మెఱయుచు గుదులుగ్రుచ్చిన ట్లుండఁ బలువుర నొక్కొక్కకోలం గూల నేయుచు నాగ్నేయాస్త్రం బేసి పేర్చుబలంబుల నేర్చి హతశేషు లైనబృందారకారాతులం దోలి విజయంబు గైకొని యున్నసమయంబున నాశతమఖప్రముఖు లైనదివిజులు పుత్రకాముం డైనయన్నరేంద్రునకు రామభరతలక్ష్మణశత్రుఘ్ను లనునామంబుల వెలయుచు మహాతేజు లగుతనూజులు నలువురు గలుగుదు రని వరం బొసంగి దివ్యరథంబు నమృతసంభవం బైన చూడామణియు ననేకరత్నసహస్రంబులు నిచ్చి వీడుకొల్పుటయు నమరసఖుండ నైననావలనం జెలిమివాటించి నన్నయోధ్యకుం దోడ్కొని చని యన్నగరంబున నొక్కమాసంబు నిల్పి వివిధప్రకారంబుల సంభావించె నమ్మహాత్మునియందు నాకుం జేయవలయునెయ్యంబు నీయందుఁ జరితార్థం బైన నేఁ గృతార్థుండ నగుదు విశ్వకర్మపుత్త్రుం డగునలునిచేత సేతుబంధనం బొనరింపం జేయు మని యుపాయం బెఱింగించె నయ్యవసరంబున. 233

ఆ. నలుఁడు కేలుమొగిచి § నరనాథ మాతండ్రి, విశ్వకర్మ మత్స § విత్రి కొసఁగి
నాఁడు కరుణఁ గర్మ § నైపుణ్యమునఁ దన,యట్టికొడుకు గలుగు § నట్టివరము. 234

ఉ. కావున నిమ్మహాంబునిధిఁ § గట్టెద దేవరయాజ్ఞ వానరేం
ద్రావళి తోడుగా ననుడు § నవ్వసుధేశుఁడు సంతసిల్లి సు
గ్రీవునిఁ జూచి సేతు వొన § రింపఁగఁ బంపు నలుండు మున్నుగా
నీవు వలీముఖోత్తముల § నెల్ల సరిత్పతివాక్యపద్ధతిన్. 235

చ. అనవుడు నాప్లవంగవిభుఁ § డప్డు దరీముఖమైందజాంబవ
త్పనసుషేణనీలనల § తారగజార్కగవాక్షగంధమా
దనగవయాంజనేయకుము § దద్వివిదాంగదముఖ్యవీరులం
గనుఁగొని యిమ్మహార్ణవము § గట్టుద మంచుఁ జనంగ నిమ్ములన్. 236

ఉ. మేటివలీముఖుల్ గడఁగి § మేదిని యల్లలనాడ నుద్భటా

---

1 కాంతార మ్మపహితమ్ముగా. 2 గలకూపం బయ్యె నధ్వగశ్రిత మగుచున్.

స్ఫోటన దాఁటుచుం జెలఁగు। చుం బోరి నూఱులు వేలు లక్షలుం
గోటులు దాఁటులై వడి నొ। కొండొకనిం [1]గడవంగ భూమిభృ
త్కూటములుం దరుల్ గిరులుఁ। గొంచు రయమ్మున వచ్చి వారిధిన్. 237

క. వడి వైచుడు నంబుచ్ఛట, లుడుమార్గము గడవ నెగయ। నుగ్రధ్వనితోఁ
బడుచు నవి మగుడఁ బోడమక, యడఁగెడుచందంబు చూచి। యక్కపివీరుల్.

తే. మరలి జననాథుపాలికి। నరుగుదెంచి, దేవ నిమ్నగావిభుఁ డన్న। తెఱఁగు గాక
యేమువైచినతరులుమ। హీధరములు,మునుఁగుచున్నవితోడ్తోడ। వనధియందు.

క. అని విన్నవించుసమయం,బున నవ్విభుతో నదీవి। భుం డిట్లను నీ
వనచరులు తరులు గిరులుం, గొనిరా నీనలుఁడు వైవఁ। గ్రుంకక తేలున్. 240

ఆ. మొదట నొక్కతరువు। మునిఁగిపోవక యుండ, నితఁడు వైవఁ బిదప। నెల్లవారుఁ
దరులు గిరులు దెచ్చి। దళముగాఁ దమతమ, వలసినట్లు గట్ట। వైచు టొప్పు.

క. ఇంతకు మును వైచినయవి, యంతర్గ్రాహములు మ్రింగె। ననవుడు నబ్ధ్యా
కాంతుండును నరు దందుచు, నెంతలు జలచరము లుండు। నీగతి ననుడున్.

క. తిమి యన శతయోజనమా,త్రము గల దొకమీను దాని। రఘువర యొకమీ
నము మ్రింగు మ్రింగు నమ్మ,త్స్యము నొకఝష మిట్లు గలవు। దత్తద్గిలముల్.

క. [2]అయినను నంతంతకు న,మ్మెయి నుగ్రగ్రాహకులము। మెలఁగఁగ నీపై
పయి నెగయువిచలవీచులు, వయిచినయవి తూలజడియ। వడిఁ దెరమెత్తున్.

వ. అనిన నవ్వాక్యంబులకు సంతోషించుచుఁ బ్లవంగపుంగవు లార్పులు నింగిఁ జెలంగ దిశాముఖంబులకు బహుముఖంబులం జని పర్వతపాదపాదులం దెచ్చి రాసమయంబున నంబుధిచేత ననుజ్ఞాతుండై రామచంద్రునాజ్ఞ శిరంబున ధరియించి విశ్వకర్మ్మం దలంచి. 245

### —✤ వానరులు సేతువు గట్టుట. ✤—

శా. విఘ్నేశాయ నమోనమో భగవతే। వేదండతుండాయ ని
ర్విఘ్నక్షేమకృతే నమోస్తు భవతే। విశ్వప్రభో యంచుఁ గ్రాం
చఘ్నజ్యేష్ఠుఁ బ్రసన్నుఁ జేసి నలుఁ డు। త్సాహంబుతో నద్భుతో
పఘ్నధ్యానము గాఁగ నొక్కనగ మొ। ప్పన్ వైచె నంభోనిధిన్. 246

ఉ. వైచిన నాకలోకమున। వారికి వారిధిపంపు పూని దో
షాచరనాథుచేటు వినఁ। జాట జలచ్ఛట లేగఁ దాను వే
వే చని చెప్పి వచ్చె నహి। వీరుల కన్నటు లూర్మ్ము లొక్కపె
ల్లై చెదరన్ మునింగి వెస। నగ్గిరి దేలెఁ గపీంద్రు లార్వఁగన్. 247

1 'గడఁబాఱుచుం గుభృత్కూటములుం.' వ్రా. ప్ర. 2 అయినను నది యొంతకేని పొంచి... మెలఁగం గని పైపయి...వయిచిన నది తూలఁ జడియఁబడి తెరలెత్తున్.

తే. అప్పు డచలపాతంబున § నబ్ధివలన
నెగయుసలిలచ్ఛటలలోన § దగిలి పోయి
మణులు నక్షత్రపథ మంటి § మగిడి పాయఁ
బంక్తిముఖుచేటునుల్కల § పగిది వెలిఁగె. 248

చ. ఇలఁ గలకొండ లెల్లఁ గపు § లేపున వే కొనివచ్చి పైపయిన్
నలువున నీ నలుండు బహు § నక్రమహామకరాదిసత్త్వముల్
పెలు కుటి క్రిందికిం జన గు § భిల్లు గుభిల్లున వైచి సందుసం
దులఁ దరుసంఘముల్ గదియఁ § ద్రొక్కుచు సేతు వొనర్ప నెమ్మెయిన్. 249

క. అందఱు నన్నిముఖంబుల, నందంద గిరిద్రుమాదు § లచ్చలమున నీ
నందుకొనునలునియరుదుం,జందము గని మఱియు వృక్ష § చరులు గడంకన్.

క. శిరముల బాహుసంధులఁ, గరముల వాలముల భుజశి § ఖరములఁ గఱొం
తరముల నయ్యైవెరవులఁ, దరులు గిరులుఁ దెచ్చి రధిక § దర్ప మెలర్పన్. 251

తే. అవియు నవలీల నందంద § యందికొనుచు, నడవ గావించుచున్నయ § న్నలునిసేతు
కర్మకౌశల మీక్షించు § గగనచరుల, కనిమిషత్వంబు చరితార్థ § మయ్యె నపుడు.

ఉ. వీచులతాకునం బొడమి § వెల్లువలై నవఫేనమాలిక
ల్రాచినరాముకీర్తు లొగి § లంకకళంకముఁ బుచ్చి పైపయిం
ద్రోచినలీలఁ గూలములు § దొట్టి నిలింపులఁ దొప్పఁదోఁచె నా
నాచలపాతజాతమక § రాకరభీకరశీకరావళుల్. 253

వ. ఇవ్విధంబున. 254

క. అగచరులు నాఁడు పదునా, లుగుయోజనములనిడుపు బ § లువుగా నానా
నగశృంగపాదపాదుల, గగనచరుల్ పొగడ నడవఁ § గావించు నెడన్. 255

క. నానగముఁ బెఱికి కట్టకు, వానరు లంభోధిలోన § వైవక యుండం
దా నుండెదఁ గా పనుగతి,భానుం డస్తాచలంబు § పై కేఁగుటయున్. 256

క. పని నేఁటి కింత చాలును, వనజాప్తుఁడు గ్రుంకె నెల్లి § వలసినయట్టుల్
వనచరుల మెల్లఁ దొడఁగుద, మని సుగ్రీవుండు వలుక § నగుఁ గా కనుచున్.

ఉ. కట్టకుఁ గాపుగా నిదుర § గావఁగఁ జాలెడివారిఁ గొందఱం
బెట్టుచు వచ్చి వేలములఁ § బ్రీతి ఫలాదులఁ దృప్తిఁ బొంది రే
పెట్టు పయోధిఁ గట్టుదుమొ § యెప్డు ప్రభాతమొ యంచుఁ గోర్కికిం
బట్టగు వేడ్క లుల్లములఁ § బట్టుకొనంగ వెడ గూర్కి వేగినన్. 258

క. అగచరు లంబర మార్చులఁ, బగిలించుచు దిక్కు లెల్లఁ § బరిగొని వగతో
నగములు ద్రుమములు నొండొరు,మిగులం గొనివచ్చి గుబ్బు § మెయి నాల్లోనన్.

క. పెనుగాలి మహామేఘము, గొనివచ్చువిధంబు దోఁప § ఘోరత్వరతో
నినజుఁ డొకశిఖరిశిఖరము, ఘనమార్గం బద్రువ గగన § గతిఁ గొని వచ్చెన్. 260

సీ. గవ్యూతిమాత్రంబు § గగనంబు గైకొన్న, వింధ్యాద్రిశిఖరంబు § విఱిచి యొక్క
చే సుషేణుం డొక్క § చేతన యిరువది, యోజనంబులకొండ § నొనర వాయు
తనయుండు చక్కలఁ § దాఁకినపాడవునఁ, గల[1]దుర్ధరాచలా § గ్రము సురేంద్ర
మనుమండుఁ దృణలీల § మలయశృంగంబును, నీలుండు తద్ధర § ణీధరంబు
తిరిగి వచ్చి యున్న § గిరులు మైందద్వివిదులు మహేంద్రకూట § ములు పెకల్చి
గజగవాక్షగవయ § గంధమాదనశరభులుఁ గడంకఁ దెచ్చి § రలఘుభుజులు.

వ. మఱియు ననేకు లనేకపాదపాదులు దెచ్చుచుం గడంకలు మెఱయ నాఁ డిరువదా
ఱుయోజనంబులుగట్టి యథోచితప్రకారంబున నారాత్రియుంబుచ్చిమఱునాఁడు.

సీ. పశ్చిమోత్తరపూర్వ § పాథోధిపర్యంత, మఖిలదిక్కులు నీవ § లవలఁ జేసి
కొండలు మ్రాఁకులుఁ § గోటానఁగోటులు, పృథివి బీఁటలువాఱఁ § బెఱుకువారుఁ
దలల దొంతులు గాఁగ § ధరియించి మురువులో, విడివడి చేతుల § విద్దెమనుచుఁ
దెచ్చువారును వీఁకఁ § దే నేఁగువారును, వడిఁ దెచ్చి కట్టపై § వైచువారుఁ
దెచ్చి తెచ్చి నడుమ § నిచ్చిపోయెడువారు, మాఁపుమాఁపుదాఁక § మ్రొగ్గువారుఁ
గులిశనిహతి లేని § కులగిరు లన మింట, నరుగుదెంచువారు § నైరి కపులు. 264

ఉ. కొండలు పన్నిదంబులకుఁ § గొండలు చేతుల రెంట మింటితు
ట్టందుదదాఁక వైచి మగు § డం బడ నొక్కొక కేలఁ బట్టుచుం
గందుకకేళి సల్పుదురు § కన్గొన వచ్చి విమానపంక్తులం
గ్రందుగ నున్ననిర్జరప § రంపర లోరసిలంగ సంతటన్. 265

తే. పూని తమతమకొనివచ్చు § భూరుహముల, కాయగస రెల్ల వెరఁజాడి § తాయిఅప్ప
దెచ్చువారికి నోరూరఁ § దించు వత్తు, రెవ్వ రడిగినఁ బుడుకక § నవ్వు లెసఁగ.

ఉ. ఒక్కఁడు దెచ్చుకొండ తల § నుండఁగఁ మీఁదన యెత్తికొంచు నొం
డొక్కఁడు నింగికిన్ నెగసి § యుర్వి చలింపఁగ దాఁటి క్రిందునం
ద్రిక్కులువెట్ట నొల్లఁ జన § రే యని క్రమ్మఱఁ బాఱి వాఁడు వే
ఱొక్కనగంబు పూని యరు § దొందఁగ ముందట వచ్చువానికిన్. 266

ఆ. చేతికొండ యొకని § చే నిచ్చి తల నున్న, కొండదొంతి కుదురు § కొన నమర్చి
మగుడ నడుగ వాఁడు § నగచరుల్ నగ వానిఁ, గిక్కురించి పోయి § ఢెక్కరించు.

వ. ఇత్తెఱంగున మఱియుం బరిహాసప్రకారంబులు చెల్ల వానరులు గడంగి సేతువు
కట్టం దొడంగి రప్పుడు. 268

చ. వనచరసింహనాదముల § వారనిపాదపశైలపాతని
స్వనముల మందరభ్రమణ § సంక్షుభితార్ణవలోకభీకర
ధ్వని దలఁపించుచున్ దెసలు § వ్రయ్యలువాఱఁ జెలంగ నందు నిం
దును దిరుగంబడం దొడఁగెఁ § దూలి తిమింగిలముఖ్యజంతువుల్. 269

---

1 ఇదియే 'దర్దుర' మని మూలము.

ఆ. మలయమారుతంబు మర్కటాంగముల కిం, పారఁ బొలసి చెమటలార్చుచుండ
భానుదీప్తు లడర బయ లీక మేఘముల్, నీడసేయుచుండ నిలిచినిలిచి. 270

ఉ. చెందినసేదలం దృణము సేయుచు సేతువు గట్టి కట్టి మ
ధ్యందినవేళ నూఱటల కాసలు సేయుచు వాడుమోములుం
బొందుపడంగ సాంద్రతరభూరుహపంక్తులచల్లనీడలం
గందఫలాదిఖాద్యములు గైకొని కొండొక నిల్చి వెండియున్. 271

ఉ. దట్టముగా ధరాధరవితానము లొడ్డుచు మీఁద మ్రాఁకులున్
మట్టలు వైచి కప్పుచు సమస్థలి సేయుచు సూత్ర మోజకుం
బట్టుచుఁ దెట్టియ ల్దరులు బల్వుగఁ జేర్చుచుఁ గట్ట రాపడన్
మట్టుచు యోజనార్ధశతమాత్రము గట్టిరి నాఁడు వానరుల్. 272

ఉ. అంతఁ బయోజబంధుఁ డపరాబ్ధికి దక్షిణసింధుబంధవృ
త్తాంతము సెప్ప నేఁగినక్రియం జనఁగాఁ గపిరాజునాజ్ఞ సే
పంతయుఁ గట్టివైతము సురారులదర్పము దీర్త మంచు వి
శ్రాంతు లొనర్ప నాత్మశిబిరంబులకుం జనుదెంచి రయ్యెడన్. 278

ఉ. కంటికిఁ గూర్కు లేక దశకంఠునిచేఁ బడులోక మింక ని
ష్కంటక మయ్యె నా నుదధిఁ గట్టఁగఁ దా నటఁ బంచె రాముఁ డి
[1]ట్లొంటక కాదు బెగ్గిలకుఁ డో యని వేల్పులు సాట నెత్తుజే
గంట తెఱంగునం బొలిచెఁ గైరవబంధుఁడు బంధురద్యుతిన్. 274

ఉ. ఆసమయంబునం గువలయప్రియుఁ డల్లనఁ జల్లగాలికిన్
బాసట యై శరీరములపై నటు లూనిన సేతుబంధనా
యాసపరిశ్రమంబు నిబిడామలచంద్రికఁ బాయఁజేయ ని
ద్రాసుఖసక్తు లౌచుఁ బ్రమదం బలరార బలీముఖోత్తముల్. 275

సీ. కలలోనఁ గొఱఁతకుఁ గులపర్వతంబులు, దెచ్చి [2]కట్టితి మని మెచ్చువారు
లంక సొచ్చితిమంచుహుంకారములుసెల్లఁ, గలవరించుచు బిట్టు తెలియువారు
వీచులతాఁకున నేచునర్ణవరవ, మడఁగి పోవఁగ గుఱు పొడుచువారు
నిద్రమైఁ బెకలించు నద్రులగతిఁ దోఁపఁ, జూచి చేతులు బయ లూఁచువారు
గాల రాచువారు వేలంబుచుట్టును, దిరుగువారు గట్ట యరయువారు
నిదుర లుడిగి తరణి కెదురుసూచుచు నుండు,వారు నగుచు రజని [3]పూరగింప.

ఉ. తమ్ములలోన నీవు నొకతమ్ముఁడ వంచు విరోధితమ్మునిం
దమ్ముని నింద్రనందనునిదమ్మునిఁ జూచినచూపుఁ జూచెఁ గ్రొ
త్తమ్ములతమ్ము లైనకనుదమ్ముల నవ్విభు మేలు సూచుచుం
దమ్ములఁ జూతు నన్కరణిఁ దమ్ములవిం దుదయాద్రిఁ దోఁచినన్. 277

---

1 ట్లొంటికిఁ గాదు. 2. సేతువుఁ గట్టి మెచ్చువారు. 3 పూరణింప.

వ. అంతఁ గపులు. 278

క. వనముల వనములభంగిన, గొనివత్తుము కొండలెల్లఁ గుంభిని వ్రయ్యన్
మునుముకొని పెఱికి తెత్తుము, వనరాశికి మిగిలెనేని వైతుము లంకన్. 279

ఉ. ప్రాఁకుదుమా త్రికూటశిఖరంబులమీఁదికి నెల్లవారు నో
క్కూఁకున నంచు నున్నదశయోజనమాత్రము గట్లు గుండులున్
మ్రాఁకులుఁ దెచ్చి తెచ్చి యెడమం గుడి నిచ్చుచుఁ జుట్టుఁ బైపయిం
బ్రోకలు వెట్టుచుండ నటు పూర్ణముసేసె నలుండు సేతువున్. 280

వ. ఇట్లు దశయోజనవిస్తారంబును శతయోజనాయతంబును గా సేతువు గట్టి సిద్ధవిద్యాధరగంధర్వాదు లంబరంబునం గ్రందుకొను నెలుంగులు సెలంగఁ బ్లవంగపుంగవుల నగ్గించుచు రఘుపుంగవుసామర్థ్యంబున కచ్చెరు వందుచు నీసేతువుం జూచినజను లపేతకల్మషులు నాయుష్మంతులుఁ బుత్రవంతులు నగుచు నుత్తమకీర్తుల నుల్లసిల్లుచుండుదు రని పలికి రంత నలుండు జలధిబంధనంబు తెఱంగు విన్నవించుటయు రామచంద్రుండు ముదితహృదయుం డగుచు సేనానాయకుం డగునీలునిం గనుంగొని సేనలఁ బయోధి దాఁటింపు మని నియోగించి సుగ్రీవుండును నంగదస్కంధాధిరూఢుండగులక్ష్మణుండును గొలిచిచను దేరఁ బవనతనయు నెక్కి చనుసమయంబున. 281

క. వేయోఘంబులు వానర, నాయకులం గొని గదాకనద్బాహాసా
హాయక మమర విభీషణుఁ, డాయితమై మున్న దాఁటి యద్దరి నుండెన్. 282

చ. పెఱుకుదు మింక లంక నని పేర్చి కపీంద్రులు దిక్కు లాన్పులం
బఱియలు సేయుచున్ భ్రమరి పాఱుచుఁ గేరుచుఁ గ్రేళ్లుదాఁటుచున్
మొఱములు వైచుచున్ నెగసి మేఘము లంటఁగుచు నబ్ధిలోనఁ బె
ల్లుఱుకుచు నీదుచున్ మునిఁగి యొండెడఁ దోఁచుచుఁ గట్ట చేరుచున్. 283

ఆ. ఎన్నఁ బెక్కు లగుచు నెక్కడఁ జూచిన, నడచువారు నడవఁ గడఁగువారు
విడియువారు మఱియు వీడెత్తువారు నై, నేల యీనినట్లు నిండఁబడిరి. 284

వ. ఇత్తెఱంగున దాఁటి దక్షిణతీరంబునం గలయ విడియ నాపగావల్లభుండు నిజనికేతనంబునకుం జని వలయునుపాయనంబులు గొనుచు నేతెంచి రఘువరుం గనుంగొని. 285

క. ఆజులకు నరుగునప్పుడు, రాజులు తొడి పూసి కట్టి రమణీయశ్రీ
రాజిల్ల వలయుఁ గావున, రాజోత్తమ తాల్ప నవసరము భూషాదుల్. 286

తే. అనుచుదివ్యంబులై చెలువారునంబ, రములుభూషణములుఁగవచములునాయు
ధములు నెలమిమై నిచ్చినదాశరథులు, వరుసఁగైకొనిధరియింపవార్ధిమఱియు.

క. వరుణుఁడు పూజార్థము దన, పురికిని మిముఁ బిల్వ నన్నుఁ బుత్తెంచె నరే
శ్వర విచ్చేయం దగు వత్తురు గా కని పలుక నతికుతూహలలీలన్. 288

వ. వరుణలోకంబునకుం జని సముచితప్రకారంబున నాప్రచేతసుచేతం బూజితు
లగుచు మగిడి యేతెంచి రంత నక్కడ దశకంధరుండు. 289

—❖ రాముఁడు సేతువు దాఁటి వచ్చుట విని రావణుఁడు మంత్రులతో నాలోచించుట. ❖—

క. అర్ణవము గట్టి దిక్కులు, ఘూర్ణిల్లఁగ రిపులు లెక్కఁగొనక సువేలా
భ్యర్ణమున వచ్చి విడియుట, కర్ణాకర్ణిగ నెఱింగి కలఁగినమదితోన్. 290

సీ. కొలువున కేతెంచి § కలయ మంత్రులఁ జూచి, వారితో ని ట్లను § మీరు నాకుఁ
బనులకుఁ గలవార § లని చూతుఁ బ్రెగ్గడ, లగుచున్నమీనేర్పుఁ § దగవు లెస్స
జడనిధి బంధించి § కడచి వచ్చిరి మర్త్యు, లీవార్త లరయంగ § వేవు లేద
రాజు లేమఱియున్న § రాజనీతిస్థితి, సచివు లేమఱి యుండు § టుచిత మగునె
నేర కున్నారె కొంద ఱెవ్వారొ మమ్ము, నొల్లకున్నారు గాక నాఁ § డల్లడిల్లి
1వారలందఱుఁ దల లటు § వ్రాల వైవ, నింద్రజితుఁ డంతఁ దండ్రితో § నిట్టులనియె.

ఉ. రాచగుణంబు పోవిడిచి § రాజ్యము గోల్పడి వీడు వెల్వడం
ద్రోచినఁ జిక్కవచ్చిన నరుండును గ్రోఁతులు నాఁగ నెంత దో
షాచరనాథ దీనికి వి § చారము మేలె యి ట్లైన నట్లు భ
గ్నాచలపాటనక్షమము § లైనభుజంబులపెంపు దూలదే. 292

సీ. దిగ్విజయార్థి నై § దివిజసేనల గిట్టి, జంభారి నాగపాశములఁ గట్టి
తెచ్చితి జముక్రొవ్వు § దీర్చితి వరుణు నోడించితి ధనదు నో § డిచితిఁ గాల
కేయాదిదనుజుల § గెలిచితిఁ గాద్రవేయుల నదల్చితి సోము § నుష్ణధాముఁ
బఱపితి వసువులఁ § బరిభవించితి మరుద్గణములఁ దోలితిఁ § గడఁక మఱియు
నవనిపైఁ గలరాజుల § నాజులందుఁ, గాందిశీకులఁ జేసితిఁ § గడిమి నన్నుఁ
జెనయ నెవ్వఁడు గలఁ డేల § చింత నీకు, నాశరార్భుల కెదురె వా § నరులు నరులు.

చ. గజుఁడును జాంబవంతుఁడును § గాలితనూజుఁడు నంగదుండు న
ర్కజుఁడు సుషేణుఁడున్ మొదలు § గాఁ గపికోటులు రామలక్ష్మణుల్
రజనిచరాధినాథ సమ § రంబున నీసుతుఁ డింద్రజిత్తుపె
న్భుజముల నుగ్గునూచ మయి § పోయినవారలు గాఁ దలంపుమీ. 294

వ. అనినం బ్రహస్తుండు హస్తం బెత్తి వియత్తలంబున నదరులు సెదర ముసలంబుఁ
ద్రిప్పుచు ని ట్లనియె. 295

చ. అనిమొన మేఘనాథుఁ జెన § యం గలవీరుల మున్ను గంటిమే
యనిమిషదానవోరగభ § టాదులయందును నిమ్మహాశరా
సనుకథ లెల్లనేల పెలు § చన్ విలసన్ముసలంబు గ్రాలఁ బే
ర్చిననునుఁ దేఱిచూడఁ గల § రే కపులుం గడుఁ బేదమర్త్యులున్. 296

వ. అనిన ధూమ్రాక్షుం డి ట్లనియె. 297

1 వారు దలలను వ్రాలవైచి యూరకున్న నింద్ర.

ఉ. ఏమఱిపాటు వేచి మన మిందఱుఁ బైపడి రాత్రివేళ శా
ఖామృగసేనఁ జొచ్చినమొగంబునఁ జేతులతీఁట వో ధను
స్తోమరభిండివాలపరశుక్షురికాపరిఘాదిసాధన
స్తోమముపాలు చేసి బలి సూపుదమే ఘనభూతకోటికిన్. 298

వ. అనిన మహోదరుం డతనిపల్కులకుం గనలి యిట్లనియె. 299

సీ. రాఘవసుగ్రీవరక్షితంబును మహా, వీరవానరపరివేష్టితంబు
నగుఁ గాన దురవగాహం బగుఁ దద్బల, మనిన నీవెరవులు వినుఁడు సేతు
వొనరించుచో నొండె నుదధి దాఁటెడుచోట, వీడెత్తుచో నొండె విడియుచోటఁ
జనుగాక యప్పుడు శత్రులఁ జెఱుపంగ, నేమఱియున్న వా రెలమి మనల
కంటఁబడఁ గ్రామి కడిమిఁ ద్రికూటాద్రి, యాక్రమించి రింక నధికభయము
సేయఁగలరు సకలసేనలతో వారిఁ, దాఁకి గెలుత మొండుతలఁపు లేల. 300

క. అనుడు నతికాయుఁ డిట్లనుఁ, జన దనక నిశాచరేశ జనకతనూజం
గొనివచ్చి తట్లు కేవల,వనితయె రామునకు మనకు వైరము గలదే. 301

క. దుష్టజననిగ్రహంబును, శిష్టప్రతిపాలనంబుఁ జేయుచు ధర్మా
విష్టుఁ డగురాజు చెడఁడు ని,కృష్టుం డగురా జధర్మకృతిఁ జెడిపోవున్. 302

ఉ. వంచన నన్యకాంతఁ గొనివచ్చితి వచ్చినకోలెఁ జేటు సూ
చించుమహానిమిత్తములు చెప్ప ననేకము లింక నైన న
క్తంచరనాథ సామమునఁ గల్గెడుమే లది యొంట లేదు రా
త్రించరవంశనాశ మొనరింపక జానకి నిచ్చి పుచ్చవే. 303

—రావణుఁడు శుకసారణు లనువేగులవాండ్ర వానరసేనఁ బరీక్షింపఁ బంపుట.—

వ. అన నప్పలుకు లాదరింపక నిలింపారాతి శుకసారణులం గనుంగొని మీరు వారి
మర్మంబులు సంగరోద్యోగంబులుఁ గలతెఱంగు లెఱింగి రావలయుఁ గపటరూ
పంబులు ధరియించి వానరవాహినిం బ్రవేశించి. 304

చ. తరుచరసేన సాగరము దాఁటినచందము వీటిపెంపు వా
నరభటు లున్నసొంపుఁ గపినాయకు లాడెడుపంతముల్ దివా
కరసుతుతెంపు రాఘవులగర్వము నొక్కొకవానిఁ గొల్చుపె
[1]న్నరవులసంఖ్యలుం గలయ నేర్పున నేర్పడఁ జూచి రం డొగిన్. 305

క. అనవుడు వారలు మాయా,వనచరులై వీడు సొచ్చి వరున మహీభృ
ద్ఘనవనశృంగగుహాంతర,వననిధితీరముల నున్నవానరబలమున్. 306

ఉ. ఇక్కడ నింద ఱంద ఱని యెన్నఁ దలంచియు లెక్క కెక్కదై
యెక్కడఁ జూచినం బుడమి యీనినకైవడి నిండి చూడ్కికిన్
వెక్కసపా టొనర్చుకపివీరుల నారయఁగా విభీషణుం

1 'పెన్నెరవుల సంఖ్యలుం' అ. ప్ర.

దక్కుపటక్రమం బెఱిఁగి § యారజనీచరచారయుగ్మమున్. 307

వ. వనచరులచేతఁ బట్టించి కొనివచ్చి రఘుపతిముందటఁ బెట్టి యి ట్లనియె. 308

క. వీరలు శుకసారణు లను, వారలు దశకంఠువేగు § వారలు కపటా
కారములు పూని మర్మము, లారయుచుండుదురు తిరిగి § యఖిలజగములన్. 309

వ. అని యతండు విన్నవించిన నన్నిశాచరులు భయకంపితాంగు లగుచుఁ గేలు మొగిచి. 310

క. దేవా దూతలము దశ, గ్రీవుఁడు పుత్తేర నిట్లు § కృత్రిమభంగిన్
దేవరసైన్యము చూడఁ, గా వచ్చినరాక తప్పు § గల గని పలుకన్. 311

క. అల్లన నవ్వుచు నజ్జన, వల్లభుఁ డను దూత లయ్యు § వధ్యులు మీరల్
ముల్లోకములకు డెందము, ము ల్లగుదశకంఠుతోడి § మ్రుచ్చుల రగుటన్. 312

తే. అయిన నల్పుల మిముఁ జంపి § నప్పుడేమి, గలుగునటుగాన వెఱవ కీ § బలమునొనరఁ
జూడవలయునంతయుఁ జొచ్చి § చూచిపోయి, పంక్తికంధరుతోడనా § పలుకుగాఁక.

క. క్షితిసుత నేలావునఁ దెచ్చితి నీ వాలావు సకల § సేనలతో నా
జితఱిఁ జూపుచు నాశర, తతి కించుక సైఁపు మనుము § దర్ప మెలర్పన్. 314

మ. దిననాథుం డుదయాద్రిశృంగమున కే § తే నెల్లి మారీచర
క్తనిషిక్తం బగునాశరంబు మునుగా § ధారాళమై ఘోరమై
ధనురభ్రంబునఁ బుట్టునంపజడిచే § తం గూల్తు లంకాపురీ
ఘనసాలాదుల నేలమట్టముగ నా § కంపింప నక్తంచరుల్. 315

క. అని పలికి పీడుకొల్పిన, వినతు లగుచు దేవ నీవు § విజయశ్రీ గై
కొను మనుచుఁ జక్క లంకకుఁ, జని చేతులు మొగిచికొని ద § శగ్రీవునితోన్.

వ. నిశాచరేశ్వరా యేము కపిసైన్యంబు సొచ్చి సర్వంబు నరయునెడ విభీషణుం డెఱింగి మముఁ బట్టించి వనచరుల కొప్పించి రఘుపతిముందటఁ బెట్టించిన నమ్మహాత్ముండు కరుణించి విడిచి పుత్తెంచిన వచ్చితి మంతయు నంతకుమున్న చూచి నారము విన్నవించెద మవధరింపుము. 317

ఆ. బాహుబలము నస్త్ర § బలము విచారింప, రాముతోడ సంగ § రమునఁ దొడర
వీరుఁ డెందుఁ గలుగ § నేరఁ డమ్మహితాత్ము, ననుజుఁ జూచినపుడు § నట్ల తోఁచు.

చ. ఖరకరసూనుఁ డుగ్రబల § గర్వితుఁ డాతనిఁ జెప్పనేల త
త్పరిసరవర్తులై గిరుల § తాత లనం గపియూథనాథు లు
ద్ధురగతి నున్నవారు రణ § దోహలు లందఱు యామినీచరే
శ్వర మనకం దొకం డొకఁడ § చాలు నజయ్యులు వార లారయన్. 319

క. నాఁడు మనలంకఁ గాల్చిన, వాఁడును నీలుండు నలుఁడు § వాలిసుతుండున్
వాఁడిమగలు సమరమునకు, మూఁడవకను లేనిరుద్ర § మూర్తులు వింటే. 320

వ. దశయోజనవిస్తృతంబును శతయోజనాయతంబునుగా సేతు వొనర్చి కడలి గడచి

దక్షిణతీరంబున వానరసైన్యంబు విడియుట నిక్కువం బక్కపిబలంబుల లెక్కింప నలువకు నలవి గాదు రామలక్ష్మణసుగ్రీవవిభీషణరక్షితం బై సురాసురాదులకు నభేద్యం బగుచుండు నొండువిచారంబు లుడిగి నీ వింక లంక నిరాతంకంబుగా నేలం దలంచిన జనకతనయ నారామున కొప్పించుట కార్యం బని సారణుండు పలికిన రావణుం డతనిం గనుంగొని. 321

క. సర్వజగంబులు బెదరఁగ, గర్వంబున దివిజదనుజగరుడోరగగం
ధర్వాదు లైన వచ్చిన, నుర్వీసుతఁ బుచ్చఁ బోదుతు నోడుతుం గడిమిన్.

చ. వికృతము లైనమర్కటులవేషము లక్కడ నీవు చూచి బీ
తు కుడిచి వచ్చి నోరికొలఁదుల్ పచరించెదు నానిశాతసా
యకములకుం బురందరుఁడొ యంతకుఁడో వరుణుండొ యక్షనా
యకుఁడొ మనుష్యుఁ డైనయతఁ డాకపిసైన్యము దేవసైన్యమో. 323

వ. అనుచు బహుతాలోన్నతం బగునొక్కసౌధం బెక్కి చూడ్కులకు నక్కజం బగుచున్నసైన్యంబు చూచి సారణుం గనుంగొని యివ్వానరవీరులం దెవ్వరు బలాధికు లెవ్వరు సమరోత్సాహంబు గలిగియుండుదు రెవ్వ రేకులంబువా రెవ్వ రెంతబలంబున కధిపతు లెవ్వరు యూథపయూథపు లంతయు నెఱింగింపు మనిన నతం డి ట్లనియె. 324

చ. తపనజుసేనముందట నుదగ్రబలోద్ధతు లైనలక్షయూ
థపు లదె చుట్టునుం గొలువఁ దా మనలం గనుఁగొంచు నంజన
ద్వీపమొకో నాఁగ గర్జిలుచుఁ దెంపునఁ గ్రాలెడువాఁడు నీలుఁ డ
క్కపికులనాథు రాత్రిచరకంటకుఁ గంటె నిశాచరేశ్వరా. 325

సీ. శాఖామృగేంద్రులు శంఖశతంబును, బద్మసహస్రంబు బలసి కొల్వఁ
గమలకేసరరోమకాంతిఁ జెన్నొందుచు, మేరునగోన్నతి మేను మెఱయ
దిగిభశుండాదండదీర్ఘభుజార్గళ,యుగము మీఁదికి నెత్తి యుగ్రభంగి
వాలంబు నేలతో వడి వ్రేయుచును లంక, దృష్టించి యోధులు దీడికొనుచు
వాఁడిమగఁటిమి నట్లున్నవాఁడు వాఁడు, వాలికొడు కంగదుం డనువాఁడు దేవ
కంటె కడిమి నీతఁడు తండ్రికంటె నెక్కు, డర్బుదాచలమేలు నీయరిదిబిరుదు.

క. యువరాజ్యపట్ట మితనికి, రవితనయుఁడు గట్టినాఁడు రక్షోభటపుం
గవ యిక్కపిపుంగవునకు, బవరంబునఁ దోడు నాఁటిపావని కంటే. 327

ఆ. సేతుబంధనంబు సేసినజగజెట్టి, విశ్వకర్మకొడుకు విపులభుజుఁడు
నలుఁడు సంగరాంగణమున సేనాసమ,న్వితము గాఁగ నితనివెనుక నిలుచు.

క. వనచరులు వేయికోటులు, నెనిమిదియయుతములుఁ గొలువ సేపున సుతరుం
డనువాఁడు వాఁడె చెలఁగెడు, ననుపమబలయుతుఁడు చందనాద్రిఁ జరించున్.

క. పీతశ్యామలశోణ, శ్వేతబలము పేర్చుచున్నవీరునిఁ గంటే

శ్వేతుం డనువీరునిఁ గల, ధౌతాచలనిభుని యాతు ✽ ధానకులేంద్రా. 329

చ. ధరణితలంబు పెల్లద్రువ ✽ దాఁటుచు దిక్కులు వ్రయ్య నార్చుచున్
హరు లొగి వేయిలక్షలును ✽ నన్నియె కోటులుఁ గొల్వ నట్లు భూ
ధరనిభ మైనమే నమరఁ ✽ దాల్చి వెలింగెడు వేగవంతుఁ డన్
గిరిచరవీరుఁ డర్కజుని ✽ కిం జెలి యాతఁడు రాక్షసేశ్వరా. 330

చ. కొలిచి ప్లవంగయూథములు ✽ కోటియు ముప్పదిలక్షలుం గెలం
కులఁ జెలఁగం బిశంగరుచి ✽ ఘోరపుమేను వెలుంగఁ జూడ్కి కు
జ్జ్వలుఁ డగువాఁడు రంభుఁ డను ✽ వాఁడు నిశాచరలోకనాథ ని
శ్చలమతి యేలుశైలములు ✽ సహ్యసుదర్శనకృష్ణవింధ్యముల్. 331

క. లంకాధిప పదికోటులు, బింకపువానరులు గొలువఁ ✽ బెల్లార్చి భుజం
బంకించునతఁడు కుముదుఁడు, సంకోచనశిఖరి నీప్ర ✽ చండుం డుండున్. 332

క. నలువదికోటులు కపివీరులతో శరభుఁ డనువాఁడు ✽ రోదసి పగులం
బెలుచ నదె మల్లసఱచుచుఁ, జెలఁగెడుఁ బ్రాలేయనగము ✽ చెల్లు నితనికిన్.

క. రక్షోవల్లభ యేఁబది, లక్షలు యూథపులు గొలువ ✽ లలిఁ బనసుం డన్
వృక్షచరాగ్రణి కెరలెడు, నీక్షించితె పారియాత్ర ✽ మీతం డేలున్. 334

మ. తను శాఖామృగషష్టిలక్ష గొలువన్ ✽ ధారాధరధ్వానమో
యన గర్జిల్లెడు నల్లవాఁడె వినతుం ✽ డవ్వీరుశైలంబు మం
థనగం బంతియ సేనతోఁ గనలుచు ✽ న్నాఁ డట్లు సక్రోధనుం
డనుశూరుండును వీఁడె వీఁ డునికి ప ✽ ర్ణాశాతటోగ్రాటవుల్. 335

ఆ. హరులు గామరూప ✽ ధరులు డెబ్బదిలక్ష, లని నజయ్యులైన ✽ యట్టివారు
గొలువ నడుమఁ జాఁదు ✽ కొండకై వడి నున్న, కపివరేణ్యుఁ గంటె ✽ గవయుఁ డతఁడు.

వ. అని పలికి మఱియు ని ట్లనియె. 337

క. స్కంధావారము మధ్య,స్కంధంబున నున్న సకల ✽ కపినాథులఁ ద
ద్బంధురసైన్యములను దశ,కంధర పరిపాటిఁ జూపఁ ✽ గం జూడు మొగిన్. 338

తే. వృక్షపాషాణపాణు లై ✽ వేనవేలు, యూథనాథులు దనచుట్టు ✽ నుండ వాల
రోమజాలంబు బాలార్క ✽ రుచులఁ గడవ, వెలుఁగునాతఁడు హరుఁ డను ✽ వీరవరుఁడు.

తే. నీలమేఘజాలంబుల ✽ లీల మెఱయ
వెలుఁగుబలుమొత్తములతోడ ✽ నెసఁగునతఁడు
ధూమ్రుఁ డిమ్మేటి నర్మదా ✽ తోయ మెలమిఁ
గ్రోలుచును ఋక్షవంత మ ✽ న్కొండ నుండు. 340

ఉ. కాటుకకొండలట్టిఘన ✽ కాయములం గలయూథపోత్తముల్
కోటులు చుట్టునుం గొలువ ✽ ఘూర్ణిలునీతఁడు జాంబవంతుఁ డ
న్నోటరి ధూమ్రుతమ్ముఁడు గ ✽ నుంగొను మీతఁడు వజ్రకాజిఁ దో

స్ఫోటొనరించి వేల్పులనకథం గనినాఁడు వరమ్ము లిమ్ములన్. 341

క. మాటికి మనపై నుఱుములు, చాటుచు వేగోటు లద్రిచరులు గొలువ నా
స్ఫోటించి నేల కాలం, దాటించుచు నున్నవాఁడు దంభుఁడు కంటే. 342

ఆ. ఒడలు యోజనంబు నిడుపును బొడవునై, యుర్విఁ జేతు లూఁదియున్నవాఁడు
॥ వాఁడె ధనుఁడు వాఁడు వాసవు నాజి జయించినాఁడు కపుల కెల్లఁ దాత.

సీ. మేటిమర్కటులు వే గోటిపద్మంబులు, గొలువఁ గల్పాంతవిఘూర్ణమాన
జలధరాడంబర మొలయ నజాండంబు, వ్రయ్యఁ బెల్లార్చుచు వాల మార్చు
వాఁ డింద్రజాలుఁ డన్వాఁడు సురాసురసంగరంబున దేవసైన్యమునకుఁ
దోడయి విక్రమక్రీడ సల్పినశూరుఁ, డీశానసఖునకు నిష్టసఖుఁడు
గంధవహుని చెలికి గంధర్వకన్యకుఁ, బుత్త్రుఁ డితఁడు ద్రోణభూధరేంద్ర
మేలుచుండు నెలమి వాలునవీరకుం,జరునిఁ జూచితే నిశాచరేంద్ర. 344

క. శైలాకృతి మే నమరఁగ, వేలక్షలు కపులు గొలువ వీరుఁడు గజుఁ డీ
వాలుమగఁడు హైమవతీకూలంబున శిశిరబీజకుధరం బేలున్. 345

క. వాతోద్ధూతమహాజీమూతముగతి దోఁప సేన ముందట మనపై
నేతెంచుయూథపాధిపు,నాతనిఁ జూచితె ప్రమాథి యనుకపినాథున్. 346

తే. ప్రకటబలులు గోలాంగూలభటులు నియుత
శతము శతకోటియును దన్ను నతులగతులఁ
గొలువఁ బొలుచునితఁడు గవాక్షుండు మేరు
శైల మివ్వీరునెలవు దోషాచరేంద్ర. 347

క. హనుమంతుతండ్రి కేసరి, యనువాఁ డదె పేర్చి వాల మార్చుచు మనపైఁ
గనలెడుఁ గంటే యవ్వీ, [1]రునకుం బదివేలు వింటె ద్రుమచరు లెలమిన్. 348

సీ. దంష్ట్రాచతుష్టయదారుణాననముల,నిశితోగ్రనఖముల నిడుదలైన
లాంగూలముల నొప్పి లాఁగలు వెలువడ్డ, కంఠీరవంబులకరణి వెలిఁగి
కనలుదవాగ్నులగతి విషజ్వాలలు, గ్రక్కుమహాపన్నగములపగిది
జంగమాచలములచాడ్పున నొప్పారి, కదలనికాలమేఘములమాడ్కి
నద్భుతావకాశు లైనవానరవీర,భటు లనేకు లట్లు బలసి కొలువ
సమరమునకు వాలి శతవలి యనువాఁడు,వాఁడె తిమురుచున్నవాఁడు కంటె.

క. సూరెల వేగోటులు కపి,వీరులు గర్జిల్ల నట్లు విలసిల్లెడునా
శూరోత్తముఁడు సుషేణుఁడు,తారుకొడుకు గామరూపధరుఁ డితఁ డధిపా.

తే. గంధమాదనోల్కాముఖక్రథనతార,పనసజంఘుప్రజంఘార్కభరతవృషభు
లనఁగ నేకైకయూథసహస్రలక్ష, వరులు వా రాపదుండ్రు దుర్వారబలులు.

వ. మఱియు వింధ్యాచలవాసు లైనవానరవీరు లనేకానీకంబులతో దుర్వారబలం

1 రున కఱువదివేలు నేలు ఋక్షాచలమున్.

బులఁ గడంగి కయ్యంబునకుం గాలుద్రవ్వుచున్నారు లెక్కింప నలువకు నలవి గా దని పలికె నప్పుడు శుకుండు రావణుం గనుంగొని. 352

క. ఒక్కొకటి వేయికోటులు, మొక్కలపుంగవులు గలుగు ¦ మొన లవి ముయ్యే
డొక్కటఁ గొలువఁ బొలుచునా, రిక్కలఁ దాఁకినపొదువు దధిముఖుఁ డధిపా.

సీ. శంఖంబు లేకవింశతిసహస్రంబులు, బృందంబు లవి రెండు ¦ వేలనూర్లు
గలయలపెనుమొన ¦ గాసిలి మనమీఁద, మ్రొగ్గెడుసుగ్రీవు ¦ మూలబలము
గామరూపులు దేవ ¦ గంధర్వులకు జనిం, చినయట్టివారు కి ¦ ష్కింధవారు
వృత్రభూధరఘోర ¦ వృష్టి లంకాపుర, గోపురాదులఁ గుప్ప ¦ గూల్తు మనుచు
నాకసంబు దెసలు ¦ నార్పుల నద్రువ ను, త్తాలతాలహతులఁ ¦ దార లురుల
నేపుతోడ నాజి ¦ కెదురుసూచుచు నున్న, వారు రాక్షసేంద్ర ¦ వారు కంటె.

క. అందఱిలో మెఱసెద రదె, మైందద్వివిదు లనుకపి ¦ మాగులు వీరల్
బృందారకసము లమృతము, నం ద్రాప్తిం బొందినారు ¦ నాఁ డజుదయచేన్.

తే. వారిచేరువఁ గనలెడు ¦ వారు సుముఖ, విముఖు లీరేడుకోటులు ¦ వృత్రచరులు
వారు మృత్యువుకొడుకు ల ¦ పారబలులు, తండ్రికంటె బెట్టిదులు న ¦ క్తంచరేంద్ర.

సీ. అలనాఁడు మనలంక ¦ యవలీలఁ జుఱువుచ్చి, వడిఁ జన్న వాఁ డల ¦ వాఁడు వాఁడె
కేసరితనయుండు ¦ గిరిచరాగ్రేసరుం, డనిలతనూభవుఁ ¦ డనఁగఁ బరఁగు
బాల్యంబునప్పుడు ¦ బాలార్కబింబంబుఁ, బొడగని ఫల మను ¦ బుద్ధి మూఁడు
వేలయోజనములు ¦ వినువీధి కెగసి య, ట్లందఁజాలక యుద ¦ యాద్రిమీఁద
హనువు నలియఁబడుట ¦ హనుమంతుఁ డనుపేరు, గలిగెనితని కితఁడు ¦ గామరూపి
జలధు లైనఁ గలఁపఁ ¦ జాలు నవ్వీరులా, వజున కైన నెఱుఁగ ¦ నలవి గాదు.

సీ. అక్కలి తెగలోన ¦ హరువిల్లు విఱిచిన, యాజానుదీర్ఘబా ¦ హార్గళంబు
లమర నిందీవర ¦ శ్యామకోమలకాంతి, నఖిలైకమంగళా ¦ యతన మైన
యమ్మేను విలసిల్ల ¦ నరవిందములచాయ, నచెల్లఁ బచరించు ¦ నట్లు దోఁప
నలుగుచూపులు భాను ¦ జాదుల నెమ్మోము, లలరింప ముకుళిత ¦ హస్తుఁ డగుచు
మనవిభీషణుండు ¦ దనవామభాగంబు, సేరి లంకతెఱఁగు ¦ చెప్పఁ గేల
నమ్ము ద్రిప్పు నమ్మ ¦ హాధనుర్ధరుఁ గంటె, రాముఁ డతఁడు సుమ్ము ¦ రాక్షసేంద్ర.

క. ఇతఁడు ధనుర్వేదవిదుం, డతిరథుఁ డిక్ష్వాకువంశ్యు ¦ లం దెల్ల జగ
త్త్రితయంబున లేఁ డితనికిఁ, బ్రతి బ్రహ్మాస్త్రాదిదివ్య ¦ బాణప్రౌఢిన్. 359

సీ. మృగభాతిఁ బొలిచిన ¦ మీమంత్రి మారీచు, పసిఁడిచర్మంబుపైఁ ¦ బవ్వళించి
నీపేరు విన్నంతఁ ¦ గోపించి మండెడు, మిత్రతనూభవు ¦ మీఁద వ్రాలి
నిను వాలమునఁ గట్టి ¦ వనధుల ముంచిన, వాలినందనునిపైఁ ¦ గేలు మోపి
యలనాఁడు మీసుతు ¦ నక్షుని జంపిన, గాడ్పుపట్టిపైఁ ¦ గాలు సాఁచి
మొనసి నీదునసహోదరి ¦ ముక్కుసెవులు

మోటుపఱిచినఖడ్గంబె । న్రోలఁ గాల
ఖరునిఁ దునిమినశితసాయ । కంబు మొక్క
దీర్చుచున్నాఁడు కంటె వై । దేహివిభుని. 360

చ. మెఱుఁగుపసిండిచాయ గల । మేను వెలుంగ విశాలనేత్రముల్
గిఱిగొన లంకపై యలుక । కెంపునఁ గోకనదచ్ఛదద్యుతిం
జెఱగొనుచుండ రాముపల । చే యనఁగాఁ దగియున్నవాఁడు ద
గ్గఱి కుడిదిక్కునందు రణ । కర్కశు లక్ష్మణుఁ గంటె రావణా. 361

సీ. కమనీయశతహేమ । కనకమాలిక యుర,స్థ్సలమునఁ గ్రాల ల । క్ష్మణునిఁ గదిసి
మెఱపుసొంపునఁ దన । మే నొప్ప నట్లున్న,గిరిచరోత్తముని సు । గ్రీవుఁ గంటె
యాజుల జయ మిచ్చు । నాబిరు దారయ, వానరరాజ్యంబు । వాలిఁ జంపి
యితనికి నారాముఁ । డిచ్చినాఁ డీతఁడు, నేర్పునఁ గులమున । నీతిఁ గీర్తి
బాహుబలమున జవమున । సాహసమున
నధికుఁ డగుఁ గొండలందు హి । మాద్రికరణి
నెల్లయూథాధినాథుల । నేలుచుండుఁ
బంక్తికంధర కిష్కింధ । పట్టణమున. 362

క. విను మీతనిసేనం గల,వనచరభటసంఖ్య వర్గ । వర్గము లెల్లం
బెనురాశి సేసి కవిలెం, జన వ్రాసినవెరసుబడి ని । శాచరనాథా. 363

చ. ధారిఁ బదిసున్నలుఁ నెలయు । బొట్టు మృగాంకుఁడు నేడుమిన్నలుఁ
ధరణియు మూఁడుబిందులు సుధాకరుఁడుం బదునేనునింగులుఁ
ధరయుఁ బురత్రయంబు హిమధాముఁడు నంబరసప్తకంబుఁ జం
దురుఁడు నభశ్చతుష్కము విధుండును గాఁ జను నంకమాలికల్. 364

వ. అది యెట్లంటేనిఁ గోటియు శంఖంబును మహాశంఖంబును బృందంబును మహా
బృందంబును బద్మంబును మహాపద్మంబును ఖర్వంబును మహాఖర్వంబును సము
ద్రంబును నోఘంబును ననం గల్గుమహాసంఖ్యలు నూటినుండి వరుస నొండొం
టికి లక్షగుణంబు లెక్కడగుచుండు నం దోఘంబును సముద్రంబును నూఱుఖ
ర్వంబులును వేయిమహాపద్మంబులును నూఱుబృందంబులును వేయిమహాశం
ఖంబులు నొక్కశంఖంబును వేయికోట్లు నై గణుతింపం బడు నిట్టిమహాబలంబు
లం గొని నీతో సమరంబుసేయ గర్జిల్లుచున్నవాఁ డవ్వీరుం డింతయు నెఱింగి చే
యం దగినకర్జం బాచరింపు మనిన రావణుండు. 365

ఆ. ఆనరేంద్రులతేజంబు । భానుసూనుఁ, డున్నచందంబు వానర । యూథపతుల
తెంపు నయ్యెబలంబుల్ల । సొంపుమనను,గలఁప శుకసారణులదిక్కు । గలయఁజూచి.

చ. అలుగ ననుగ్రహింపఁ బ్రభుఁ । డైనని జేశ్వరునొద్ద నాప్తులుఁ
వలఁతులు నైనవారు పగ । వారి నుతింతురె దేవదానవా

దులకు నజయ్యుఁడై నను ♦ దుర్బలు లీనరవానరాధము
ల్కలన నెదుర్చువారఁట త్వలంకకు నాకడనా వృథాకథల్. 367

క. చారులు మంత్రులు నిష్టులు, నేరుపు గలవారు ననుచు ♦ నేరక మిము ము
న్నారయ రక్షించినఫల, మారఁగ మీవలన నిప్పు ♦ డది యేర్పడియెన్. 368

క. ప్రతిపక్షపక్షపాతులు, మృతి కర్హులు మంత్రులైన ♦ మిముఁ గార్యబహి
ష్కృతులం జేయుటె చంపుట, హితులరె మీ రింక నాకు ♦ నెట్లుఁ దలంపన్.

—రావణుండు శార్దూలాదిచారులను వానరసేన నరసి రా నంపుట.—

వ. అని పలికి మహోదరుం గనుంగొని వేగు పనుపం దగినవారలం బిలువంబంపు మనిన నతండు శార్దూలుండు మొదలగువార్తావహులం దెచ్చి ముందటం బెట్టుట యు వారిని రామవృత్తాంతం బరసి రమ్మని నియోగింప వారును బ్రచ్ఛన్నమార్గం బున సువేలాచలంబున కరిగి వానరస్కంధావారంబు ప్రవేశించి యరయునెడ విభీషణుం డెఱింగి పట్టించి వనచరులచేత నొప్పించుచు రఘుపతిసన్నిధికిం దెచ్చు టయు నన్నరేంద్రుం డన్నిశాచరుల కి ట్లనియె. 370

ఉ. భూమితనూజ నట్లు గొని ♦ పోయినదుర్మద మింక కుండఁ దా
నేమఁట చేయు లావు గల ♦ రెవ్వరు దోడఁట చక్కఁ జాఁగి సం
గ్రామసమర్థుఁడై నడచుఁ ♦ గాక సమస్తసురావరోధబం
దీముదితాత్ముఁ దన్నుఁ గడ ♦ తేర్పక పోయెద రెట్లు రాఘవుల్. 371

చ. కనియెద రెల్లి రక్కసులు ♦ కన్నులపండువు గాఁగఁ బైపయిం
గనదురురత్నపుంఖకలి ♦ కారుచిజాలనిరంతరంబులై
కనలుచు లంకపై నిగుడఁ ♦ గా దశకంఠకఠోరకంఠఖం
డనచణచండమార్గణగ ♦ ణస్ఫురణస్ఫుటవిస్ఫులింగముల్. 372

వ. అని పలికి విడిపించుటయు వారు లంకాపురంబున కరిగి రావణునకుం దమపరి భవంబు మొదలుగాఁ గలతెఱం గెఱింగించి వెండియు. 373

క. గరుడవ్యూహము గా వానరసేన నమర్చికొని రణ ♦ క్రీడకు నా
ధరణిపతి వచ్చుచున్నాఁ, డురవడి నట సీతఁ బుచ్చు ♦ టుచితం బింకన్. 374

మ. అటు గాకున్న మగంటిమిం గడఁగి బా ♦ హాటోప మేపార మ
ర్కటసైన్యంబు నెదిర్చి రాఘవుకన ♦ త్కాండప్రచండానల
చ్ఛట లొక్కింత సహింతు గా కనుడు రో ♦ షగ్రంథిలభ్రూకుటీ
కుటిలస్ఫూర్తిభయంకరుం డగుచు ర ♦ క్షోనాయకుం డిట్లనున్. 375

క. తరుచరుల యేల వారికి, దురమున నింద్రాదిసురలు ♦ తోడై చనుదెం
తురు గాకే నందఱి జము,పురమునకుం బుత్తుఁ గాక ♦ పుత్తునె సీతన్. 376

వ. అనుచు నిశాచరవీరులం జూచి మీరు మీబలంబులఁ గూడుకొని యుద్ధసన్న ద్ధులరై యుండుం డని నియోగించుచు నంతఃపురంబున కరిగి విద్యుజ్జిహ్వుం

డనువానిం బిలిచి పరమరహస్యంబుగా నద్దశాననుం డతని కిట్లనియె. 377

క. శరములు నొకవిలు మాయా,శిరమును గొనిపోయి చూపి సీతా యిదె నీ
పురుషునిఁ జంపితి మని నీ,వెరవు మెఱయ వలయుఁ గపటవిద్యాచతురా. 378

వ. అని పలికి తాను నశోకవనంబునకుం జని. 379

తే. పలుచఁబాఱిననునుఁజెక్కు పాణిపంక
జమునఁ జేర్చి యందంద బాష్పములు దొరఁగఁ
గూరువగలఁ గుందుచు నట్లు ఘోరరాక్ష
సీసురక్షిత యై యున్న సీతఁ జూచి. 380

క. నీకొఱకై యత్నంబు ల,నేకంబులు సేసి మొదల నెలనాఁగ నినుం
బైకొని వేఁడఁగ నన్నుం, గైకొన వై తెట్లు నింకఁ గైకొందు గదా. 381

ఉ. ఎవ్వరు దిక్కు నీకుఁ గల రేమిటి కింతచలంబు లోకముల్
మువ్వురుసం గలంచి తుద ముట్టినన న్నవధీరణంబునం
బువ్వులు దూపు లైనవెడ పోలరి బారికిఁ ద్రోచినట్టినీ
క్రొవ్వఱ నాఖరాంతకుఁడు గూలెఁ జుమీ సమరాంగణంబునన్. 382

క. ఇట మీఁ దెవ్వరికిం దె,ల్లటిగా నీ విట్టు లునికి లలనా న న్నే
లుట మూఁడుజగంబులు నె,క్కటి యేలుట గాదె రాముకథ [1]మఱు మింకన్.

వ. వినుము తదీయవధప్రకారం బతండు కపులం గూర్చుకొని కడలిఁ గడచి దక్షిణ కూలంబున విడిసె నని వేగులవారిచేత నెఱింగి యేను బ్రహస్తప్రముఖంబుగా నిఖలబలంబును గూర్చి పోటునకుం బనుచుటయు నర్ధరాత్రివేళ నవ్వేలంబు సొచ్చి పథిపరిశ్రాంతి నిద్రాపరవశు లై యుండఁ బ్రచండగతి రక్కసులు పెక్కుముఖం బులం గదిసి ముద్గరపరిఘపట్టిసప్రాసఖడ్గచక్రాదుల సుగ్రీవజాంబవదాంజనేయ మైందద్వివిదముఖ్యు లైనబలీముఖుల వధియించిరి ప్రహస్తుండు మస్తకంబు ద్రుం చి రామచంద్రు నస్తమితుం జేసె హతశేషు లైనవానరులును లక్ష్మణుండును రయంబునం బాఱి సముద్రంబునం బడి రదె పురంబునం జెలంగెడు మదీయవిజ యభేరీధ్వను లాకర్ణింపు మతనితలయుం దెత్తు రింతకు ననునంతలోన విద్యుజ్జి హ్వుండును సంభ్రమంబునం బఱతెంచి రావణునకు మ్రొక్కి తన్నియోగంబునం దనతెచ్చినశరశరాసనశిరంబులు సీతముందటం బెట్టి చనియె నంత నంతర్గ తంబున. 384

చ. పవనతనూజుచేత వినఁబడ్డ విభాకరసూనుతోడిబాం
ధవము నిజంబు నిక్కమొకొ దైవమ యీచెడువార్త యంచు బి
ట్టవిసినయుల్లముం దొరఁగుకన్నులు నై యటు లుండి పోల న
య్యవనిజ చూచి రాముశిర మా నని మూర్ఛిలి వ్రాలె భూస్థలిన్. 385

---

1 నుఱు మింకన్.

క. నఱికినకదళీకాండము, తెఱఁగున నటు వ్రాలి తడసి । తెప్పిఱి మిను పై
విఱిగి పడినట్లు కడుని, వ్వెఱపడి మఱియు నటు సూచి । విహ్వల యగుచున్.
తే. నిష్ఠతోఁ బ్రణమిల్లి వ।సిష్ఠుచరణ,యుగళసంగతి గన్నయ।య్యుత్తమాంగ
మినకులోత్తమ నేఁ డిట్టు । లిద్దురాత్ము, మ్రాలనేల నుండెడిదఁట ।ధూళి బ్రుంగి.
వ. అనుచు నాతల నిజాంకతలంబునకుం దిగుచుకొని. 388
ఉ. ఏచినయాఖరాదుల న।నేకుల నెక్కటి చంపి సంయమీం
ద్రోచితవాక్యపూజనల । నొంది జగంబు నలంకరించునీ
యాచిఱునవ్వుతోడివద।నాంబుజమా యిది సత్తెంతుర
తూచణ తాటకాహరణ । శంసితశైశవ హా నరేశ్వరా. 389
చ. అకట నరేంద్రచంద్ర హరి।ణాధమముం గనుఁగొన్నయట్టిచూ
డ్కికి నిది పెద్ద గాదు నృప।కేసరి ని న్నిటు చూడ నేమి నో
మొకో తొలుమేన నోచితి ర।ఘూత్తమ నాకొఱకై కదే కపి
ప్రకరము గూర్చి తే నిటు ల।భాగ్యఁ గదే తుదిముట్టదే కదే. 390
సీ. ప్రాణేశ పతికి ము।న్పరలోక మరిగెడు, చెలువ లేతపములు । చేసి రొక్కొ
వల్లభ చూచితే । వైధవ్య మొక్కింత, వడి నైనఁ గైకొన । వలసె నాకు
నాథ నాతో నల్గి।నాఁడవే నను డించి, యొంటి నీ కి ట్లేఁగ । నుచిత మగునె
జననాథ సహధర్మ।చారిణి గా నన్ను, మాతండ్రి యిచ్చుట । మఱవఁ దగునె
నీడఁ గన్నుమొఱఁగి । నృపవర బొందికిఁ, బోక గల్గు టెట్లుఁ । బొసఁగ దెందు
నేను నిన్నుఁ గూడ । నిదె వేగ వచ్చెద, నిమిషమాత్ర మధిప । నిలుతుగాక.
చ. జడధి మునింగి లక్ష్మణుఁడు । సావక పోయెనయేని నన్నుఁ గో
ల్పడిన తెఱంగు నీమరణ।భంగియుఁ జెప్ప నయోధ్య నప్పు డే
వడుపున శోకసంభ్రమర।వంబులు పుట్టునో నిన్నుఁ గన్నయా
కడుపునఁ బుట్టుచిచ్చునకుఁ । గైక మనంబున సంతసిల్లఁగన్. 392
మ. ఇటు నాకంబున మామజియ్య మనచే । నీవార్త విన్నప్పు డ
క్కట మూర్ఛంబడి తేఱి లోఁ బొగులుచుం । గైకేయిదుర్భావ మిం
తటికిం దెచ్చెనె మత్కులంబు దురవ।స్థం బొందెనే యంచు న
త్కటశోకంబునఁ దూలు నగ్రమహిషీ।దైన్యంబు చింతించుచున్. 393
క. అని పలికి పనవు నట్లా, ధనువును బాణములుఁ జూచి । తల యూఁచు నగుం
దనివి సనితె దైవమ యను, నన నేమియు నింక నేటి । కను నని మఱియున్.
ఉ. రావణ నీకుఁ బుణ్య మగు । రాముపయిన్ నను వైచి ఖడ్గధా
రావిధిఁ బుచ్చవే యనఁగ । రక్కసుఁ డొక్కఁడు పాఱుతెంచి దే
వా వెస నేమొ వాకిటికి । వచ్చినవాఁడు ప్రహస్తుఁ డన్న నొం
డై వడి నిప్పు ద్రొక్కినటు । లద్దశకంఠుఁడు సంభ్రమంబునన్. 395

వ. అరిగి రామువృత్తాంతం బంతయుఁ బ్రహస్తువలనం దెలిసి మంత్రిజనులుం దానును మంత్రాలోచనంబు సేసి సేనానాయకులం గనుంగొని మీరును మీ బలంబులతోడ సమరసన్నాహంబు మెఱసి రం డనుచు నియోగించె నక్కడ నక్కపటశరశరాసనశిరంబు లదృశ్యంబు లయ్యె న త్తెఱంగునకు సీత యాశ్చర్య భయంబులం బొరయ నంతకుమున్న రావణాగమనంబునకుఁ దొలంగి మఱుఁగు పడి యున్నసరమ చనుదెంచి సకలవృత్తాంతంబు నెఱుంగుట నద్దేవి కి ట్లనియె.

ఉ. ఓచెలి యేటికిం దలఁక నోడకు శోకము మాను రావణుం
డీచెడుమాయఁ బన్ని నిది యెంతయు బొం కదె సర్వలోకర
క్షాచతురోగ్ధతిం గడలి గట్టి మహాకపిసేనతో సువే
లాచల మాక్రమించెఁ గమలానన రాముఁడు సేమ మారఁగన్. 397

క. ఆవిలు నమ్ములుఁ దలయును, నేవీ యటు గాక యున్న నిదె కనుఁగొను మా
శావలయంబున నొకపెనుఁ, గావిరి [1]కపిసైన్యధూళి గప్పినకతనన్. 398

చ. అదె కపివాహినిం గొని నృపాగ్రణి వచ్చుట కిప్పు సంభ్రమిం
చెద రవె దుందుభిధ్వనులు జృంభితఘోటకహేషితంబు లు
న్మదగజబృంహితంబులు రణత్పటునేమిరథస్వనంబులుం
జద లద్రువ౯ నిశాచరులసందడిమ్రోఁతలు నయ్యెడుం బురిన్. 399

శా. క్షోణీపుత్రి విచార మేమిటికిఁ గాకుత్స్థాన్వయగ్రామణిం
బ్రాణేశుం డగురాముఁ జూచెదవు నెయ్యం బార ని ట్లున్న నీ
వేణీబంధము నవ్విభుండు దనచే వీడ్వంగ నత్యంతక
ల్యాణస్ఫూర్తి వెలుంగునిన్నుఁ గని తెల్లం జేను నిం పొందెదన్. 400

ఉ. అక్కజపుం బ్రతాపమును నంచితనీతియుఁ గల్గునీవిభుఁ
డెక్కడ దుర్మదాంధుఁ డగునీఖలుఁ డెక్కడ నెట్లుఁ బోలు నే
దిక్కరితుండచండతరదీర్ఘభుజార్గళుఁ డైనరామునా
చిక్కనివింటిమంటలకుఁ జేరిన నింతక వీఁడు మ్రగ్గఁడే. 401

ఆ. కాక సందియంబు గలదేని చింతింప, నేల రామచంద్రుపాలి కరిగి
వార్త లరసి వేగ వచ్చెదఁ బుచ్చుము, గగనగతి సుపర్ణుఁ గడతు నేను. 402

వ. అనిన విని సంతోషించి సరమ నీ విద్దురాత్ముం డగురావణునుద్యోగం బెఱింగి ర మ్మన నవ్వనిత యట్ల కాక యని చని యచట నంతయుఁ దెలిసి వచ్చి జనక తనయం గనుంగొని. 403

తే. వినుము నీరజానన దశాననుఁడు దాను, మంత్రివరులు నూహించినమంత్రవిధము
సమరమున గెల్చుఁ గాదేని చచ్చుఁగాని, నిన్నుసంధి నీఁ డిది కార్యనిశ్చయంబు.

క. దీనికి మదిఁ దలఁకకుమీ, భూనాయకుఁ డిద్దశాస్యుఁ బొరిగొని తరుణీ

---

1 గవిసె నడ ధూళి గప్పినకతనన్.

వేనినుఁ గొని పోవు నయోధ్యానగరంబునకు బాహుదర్ప మెలర్పన్. 405
క. అనవుడు నవ్వాక్యంబులు, విని జానకి రామచంద్రువిజయంబు మనం
బునఁ గోరుచు మీఁదెట్లొకొ, యనుచుం దలపోయుచుండ నక్కడ నంతన్.
ఉ. వానరసింహనాదము లవారితవార్ధిమహోర్మిఘట్టన
ధ్వానము మ్రింగుచున్ దెసలు వ్రయ్యఁ ద్రికూటనగంబుతోన లం
కానగరంబు గ్రక్కదలఁగా నురుగోపురరత్నపాత ము
ల్కానివహంబుపాటనఁ గలంబుగఁ గ్రందుకొనం జెలంగినన్. 407
వ. అమ్మహాకలకలంబు విని నిఖిలనిశాచరులు నిక్కడక్కడఁ గడవ నప్పుడు సంభ్ర
మాకులలోచనుం డై దశముఖుం డమాత్యుల నవలోకింప నందు వృద్ధమాత్రి
యు మాతామహుండును నైన మాల్యవంతుం డిట్లనియె. 408

—✿ మాల్యవంతుఁడు రావణునకు నీతిమార్గము చెప్పుట. ✿—

తే. అఖిలవిద్యల శిక్షితుఁడై సమస్త, నీతికళలందుఁ దుదముట్ట నేర్పు గలిగి
వలనుదప్పక వర్తించువాఁడు పగఱ, గెలుచుఁ బొలుచు నైశ్వర్యంబు గలిగి వెలుఁగు.
క. సంధియు విగ్రహమును దశ, కంధర తఱి యెఱిఁగి చేతఁ గార్యం బగు నా
సంధికి సప్వాలు సములును, బంధురబలయుతులు వారు పార్ష్ణిగ్రాహుల్. 410
క. అధముఁ డనవలదు శత్రుం, డధికుఁడు విగ్రహము గొన్నయప్పుడు మన కే
విధమున సందియ మేల, ట్టిధనుర్ధరుతోడిపగ కడిఁది దలంపన్. 411
క. సురమునిగంధర్వాదులు, పరికింపఁగ ధర్మపక్షపాతులు వారా
నరనాథుజయము చూతురు, ధరణీసుత నిచ్చి పుచ్చుఁ దగు మన కింకన్. 412
వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము. 413
క. ధర్మంబు సురలకొఱకు న, ధర్మం బసురులకు నై పితామహుఁ డాదిన్
నిర్మించినాఁడు దత్త, త్కర్మము లిరుగడలవారిఁ దగ రక్షించున్. 414
క. మనుజులు దివిజులపక్షము, మన మసురలదెసయు నగుట మనకు నధర్మం
బును వారికి ధర్మంబును, ననిశము విజయమును జేయు నమరారాతీ. 415
క. ధర్మంబుచేతఁ బొలియు న, ధర్మము గృతయుగమునం దధర్మమునం దా
ధర్మము దెగుఁ ద్రేతన్ యుగ, ధర్మ మెఱుఁగవలయు నీతితత్త్వజ్ఞులిలన్. 416
క. వ్యసనాసక్తుఁడ వై రా, క్షసవల్లభ నీవు మఱపు గైకొనుట దివౌ
కసులకు విచ్చలవిడి నిం, పొసఁగుచు జన్నములు సేయుచున్నారు మునుల్.
క. హోమానలమునఁ బొడమిన, ధూమంబులు దెసలు గప్పి దోషాచర తే
జోమాలిన్య మొనర్చెడి, జీమూతావళులచెలువు సేసెడిఁ గంటే. 418
ఆ. అధ్వరంబు లిప్పు డఖిలమునీంద్రులుఁ, దఱుచుగా నొనర్ప ధర్మ మెచ్చె
సందియంబు వలదు జయ మవశ్యము గల్గు, ధర్మవర్తి యైనదాశరథికి. 419

తే. నీరజాసను మెప్పించి ♦ నీవు గన్న, వరము లనిమిషాసురయక్ష ♦ వరులవలన
భయము లేకుండ నంతియ ♦ పంక్తివదన, కపులన్నృపులచేఁ జాకుండఁ ♦ గాదుసుమ్ము.
క. నాకుం జూడఁగ విష్ణుఁడు, లోకము రక్షించుకొఱకు ♦ లోలత రఘురా
మాకృతి గయికొన్నాఁ డటు, గా కున్న మనుష్యు లబ్ధిఁ ♦ గట్టెదువారే. 421
వ. అట్లుం గాక. 422
సీ. జంతువు లొం డొండు ♦ జాతుల నీనుట, పెల్లు గర్జిల్లుచుఁ ♦ బెనుమొయిళ్లు
నెత్తురు గురియుట ♦ నిష్ఠురంబుగ శారి,కలు రొదసేయుట ♦ గములు గట్టి
నక్కలు నెలవుల ♦ నగరవీథులఁ బట్ట, పగలు వాపోవుట ♦ బలులఁ గాకు
లంటకుండుట గూబ ♦ లంతఃపురంబులు, సొచ్చుట సేనలు ♦ సొంపు చెడుట
గలిగియున్నదిమఱియును ♦ గ్మలిరొయొక్క గ్రు, శాతదంష్ట్రిలు బభ్రుకే ♦ శములుఁ గృష్ణ
దేహమును నట్టహాసప్ర ♦ దీప్తముఖము, నగుచు లంకలోఁ దిరిగెడు ♦ నట్లు దోఁచు.
క. వికటఘనపిశంగాక్షుం, డొకముండితశీర్ష దేహుఁ ♦ డొడక యింటిం
టికి వచ్చి తొంగి చూచి వె,డకినం బొడలేక యడఁగు ♦ దశముఖ వింటే. 424
వ. ఇట్టిమహోత్పాతంబు లనేకంబులు పుట్టుచున్నవి వృథావిరోధంబు విడిచి నావచనంబు లవధరింపుము. 425
శా. లంకారాజ్యము సేయుచుఁ జగము లెల్లం దల్లడిల్లన్ నిరా
తంకక్రీడల నుండి యుండి పరకాంతం దెచ్చి తీకార్య మే
వంకం గీ డిది దేల పుచ్చు మరల ♦ న్నైదేహి నీ కుండితే
నింకన్ నీదుకులాబ్ధిపై నిగుడుఁ జుమ్మీ రామునస్త్రముల్. 426
క. అని పలికి యతనిబామముడి, గనుఁగొని మఱి యొండుఁ బలుకఁ ♦ గా నోడి దశా
నన ముదుకఁ గాన మదిఁ దోఁ,చినచందం బగునొ కాదొ ♦ చెప్పితి నీకున్. 427
క. నావుడు నాఖలుఁ డిట్లను, నావిక్రమ మింద్రుఁ డెఱిఁగి ♦ నం జాలు బలే
నీ వింక నొండు వలికిన, నావలనన్ మాన్యుఁ డైన ♦ నగుము సహింపన్. 428
క. జడనిధి గట్టుటయును నొక,కడిమియ యని పగఱ నింత ♦ గాఁ జెప్పిన నే
విడుతునె సీతఁ దగవు ని, న్నడిగితినే నోరికొలఁదు ♦ లాడెద విచటన్. 429
క. జనకుఁడు వెడలం ద్రోచిన, వనమునకుం గడిమి విడిచి ♦ వచ్చినవాఁ డా
మనుజుం డెటు రక్షోనా, థు నెదుర్చు సురాసురేంద్ర ♦ దుర్జయు నన్నున్. 430
వ. అని పలికిన మాల్యవంతుండు నిరుత్తరుం డై కొండొకసేపునకుం గొలువువెడలి మందిరంబునకుం జన రావణుండు నమాత్యసమ్మతిం జతుర్థోపాయంబ కార్యం బనునిశ్చయంబున ననేకానీకంబులతోఁ బురంబు తూర్పువాకిటికిం బ్రహస్తుండు దక్షిణద్వారంబునకు మహాపార్శ్వమహోదరులును బడమటిగవనికి నింద్రజిత్తు నుత్తరగోపురంబున నేను మీరు ననుచు శుకసారణులం బలికి మధ్యమస్కంధం బునకు విరూపాక్షునిం బనిచి నిజనికేతనంబున కరిగె నంత నక్కడ రఘుపుంగ

వుండు సుగ్రీవప్రభృతులుం దానును మంత్రాలోచనంబు సేయునవసరంబునఁ
బ్రసంగం బగుటయు విభీషణుం డి ట్లనియె. 431

తే. మూఁడులోకంబులకు నెడ్డ§ముల్లువోలె, నున్నదశకంఠురక్షచే§నొప్పు మిగిలి
దివిజదనుజదుస్సాధ మై§ తేజరిల్లు, చుండు లంకానగర మప్పు§రోత్తమమున.

క. అఱువదిలక్షలు రావణు, నుఱుబాహుబలంబువీరు§లొగి నాలములం
గఱకెక్కినారు వారం,దఱు మూలబలంబుదొరలు§ధరణీనాథా. 433

తే. కరులుఁ దేరులు వాజులుఁ§గాల్బలంబు, వేయుఁ బదివేలు నిరువది§వేలు లక్ష
వేలు గలలెక్కప్రోవది§వినుము సార్ధ,కోటి భటులును గోటానఁ§గోటు లధిప.

క. తక్కినసనాయకబలమును, లెక్కింపఁ బితామహుండు§ లేఁ డనఁ దగుచుం
గ్రిక్కిఱిసి యుండుఁ బురిలో, దిక్కులఁ దమయంత నుప్ప§తిల్లినభంగిన్. 435

క. అం దెంతబలము గలిగిన, నెందఱు రథనీశు లున్న§ నే మగు నీచే
నందఱితోఁ జను నాసం,క్రందనరిపుఁ డనుజుఁ డై న§ఖరునిం గూడన్. 436

—విభీషణమంత్రులు రావణువృత్తాంతంబు రామునకుం జెప్పట.—

వ. అని చెప్పి నామంత్రులు లంకకుం జని వే గరసి వచ్చిరి రావణుండు సమరంబు
సేయువాఁ డై దుర్గరక్షణం బొనర్చుకొని యున్నవాఁ డత్తెఱంగు మీరు సమ్ము
ఖంబున నవధరింతురు గా కనుచు నయ్యనలసంపాతిప్రముఖుల నలువురం దెచ్చి
ముందటం బెట్టుటయుఁ బ్రణతు లై కేలు మొగిచి వార లి ట్లనిరి. 437

శా. దేవా దేవరబంటు వేగు పనుపఁ§ దేవారిపీ డొక్కమా
యావిద్యాగతిఁ బక్షిరూపముల నొ§య్యం జొచ్చి యే మాదశ
గ్రీవుం డున్న తెఱంగు నందుఁ గలవా§రిం దత్పురద్వారర
క్షావిన్యాసముఁ జూచి వచ్చితిమి వి§స్పష్టంబుగా నంతయున్. 438

వ. అవ్విధం బవధరింపుము. 439

ఉ. బుద్ధులు మాల్యవంతుఁ డొగిఁ§ బోలఁగఁ జెప్పిన మండి నీ వసం
బద్ధపుమాట లాడిన నృ§పాలతనూభవ నేను బుత్తునే
యుద్ధ మొనర్తుఁ గా కనుచు§నుద్ధతుఁ డై యతఁ డున్నవాఁడు స
న్నద్ధపదాతివాజిరథ§నాగసమాకులసైన్యకోటితోన్. 440

శా. గర్వస్ఫూర్తులు కాలమేఘములు నా§గర్జిల్లుచుఁ రాక్షసుల్
దుర్వారోద్ధతిఁ బంతముల్ పలుకఁగాఁ§ దోరంపుసైన్యంబుతో
నుర్వీచక్రము మ్రింగిపుచ్చు ననున§ట్టున్నాఁడు లంకాపురీ
పూర్వద్వారమునం బ్రహస్తుఁడు ముదం§బుం జేవయుం జూపుచున్. 441

క. పురిదక్షిణంపువాకిట, ధరణికి వ్రేఁ గై నయట్టి§దారుణదర్ప
స్ఫురణ మహాపార్శ్వమహో,దరు లనువా రున్నవారు§దళములతోడన్. 442

చ. కడిఁదిమగంటిమిం దొడరి§కయ్యమునం దనబాహుదర్ప మే

ర్పడ నమరేంద్రబాడుదల వట్టినగావణి రోషదీప్తుఁ డై
[1]విడివడి మించు మంచిపటువిక్రమసంపద సొంపెలర్పఁ గాఁ
బడమటిదిక్కు వాకిట నపారబలంబులతో వెలింగెడున్. 443

ఆ. అమితబలసమేతు లయి శుకసారణు, లుత్తరంపుగవని నున్నవారు
దశముఖుండు నంద తా నుండువాఁడుగా, నిశ్చయించినాఁడు నృపవరేణ్య.

క. లక్షలుఁ గోటులు గుము లై, రక్షోనాయకులు గొలువ రభసమున విరూ
పాక్షుఁడు గర్జిల్లెడు రణదీక్షితుఁ డై మధ్యమప్రదేశమునఁ బురిన్. 445

వ. అని పలికి నిశాచరవీరులసమరసన్నాహప్రకారంబు విన్నవించిన. 446

క. అతనికి నీతఁడు దగు వాఁ, డితనికి వాఁ డెక్కు డతని కీ డగు నాకు
త్సితునకు నీ డగు నని యా,యతబలు లందఱను నోర్తు మని తలఁచి తగన్.

సీ. నిష్ఠురబలశాలి నీలుఁ డాదుర్మదాంధుఁడు ప్రహస్తుఁడు గాచుతూర్పుగవని
నతివీరభంగదుఁ డంగదుఁ డమ్మహాపార్శ్వుదు లెసఁగు నవాచిగవని
నసహాయశూరుండు హనుమంతుఁ [2]డయ్యింద్రజితుఁడు నిలిచెడు పశ్చిమపుగవని
ననుజుండు నేను నయ్యఖిలలోకద్రోహి, దశకంఠుఁ డుండు నుత్తరపుగవని
వనచరేంద్రజాంబవద్విభీషణముఖ్యు, లైనమేటిదొరలు నఖిలబలము
వీటిచుట్టుఁ గలయ విడియుద మంచును, నృపవరేణ్యుఁ డనికి నిశ్చయించె.

వ. ఇట్లు కృతనిశ్చయుం డగుచు సుగ్రీవదశగ్రీవానుజులం జూచి సువేలాధిరోహ
ణంబు చేసి లంకఁ గలయం గనుంగొనవలయు నీరాత్రి దీనినెత్తంబునం
బుత్త మనుచు నధిజ్యశరాసనుండై లక్ష్మణుండును సుగ్రీవవిభీషణజాంబవదాంజ
నేయగజగవయగవాక్షగంధమాదనశరభశతవలిసుషేణమరున్ముఖప్రముఖు లైన
వలీముఖయూథనాథులు దమతమబలంబులతోడను గొలిచిరా నమ్మహీధరోత్త
మం బెక్కె నాసమయంబున. 449

మ. అట మిన్నందినకొమ్మలుం గలిగి గర్జాడంబరం బంబర
స్ఫుటనాభీలముగాఁ దటిద్బహుళ మై సొంపారునీలాంబుభృ
త్పటలంబో యన వప్రచక్రమునఁ బైపై నార్చుచుం గైదువు
ల్చిటిలం ద్రిప్పుచు నొప్పురక్కసుల నోలిం గాంచి రవ్వానరుల్. 450

వ. అట్లు గాంచి ఘనాభోంతరాళం బద్రువ నార్చుచుం గలయ నవలోకించి. 451

తే. రజనిచరదుర్జయార్జితరాజ్యలక్ష్మి, [3]దొడిమ లేక వ్రేలుచు వెలిఁగెడుబెడంగొ
కాక ముక్కంటి గెలిచినకడిఁదిపురము, లొక్కవీడుగ దశకంఠుఁ డెక్కినాఁడొ.

శా. ఈలంకాపురిక్రిందు దారి రవితేరేతేఁ బురచ్ఛాయ దాఁ
బోలం జొప్పడెఁ గాక మింట నొకవేల్పుంబ్రోలు నాఁ బోలునే
సాలం బింత విశాలముం బొడవునే సౌధావళీగోపుర

---

1 విడు విడు మంచు మిట్టిపడువిక్రమ. 2 డయ్యింద్రజిత్తుఁడు నిలుచుపశ్చిమ. 3 దొడరులేక.

వ్యాలోలధ్వజచిత్రతోరణమహాయంత్రాదు లిట్లొప్పునే. 453

ఉ. నేఁటికి నొప్పుఁ గాక రజనీచరుపీడెటు లైన నెల్లి పో
దాఁటి కవాటముల్ విఱుగఁ దాఁచుచుఁ జేతులఁ దీఁటవోవ మై
తీఁటలు వుచ్చి రక్కసులఁ దీర్చుట రాముఁ డొనర్పనున్న పె
న్వేఁటకు రావణాదిమృగబృందము దార్చు టటంచు నార్చినన్. 454

క. వనజభవాండము సంధులు, కనుకని బిట్టవిసె నపుడు ఖరకరుఁడు నభం
బున నుండ నోడి క్రిందికిఁ, జనుచుండెడుభంగి నపరజలనిధిఁ గ్రుంకెన్. 455

చ. అవిరళతారకానిబిడహారము లోలి ధరించి చంద్రికా
ధవళవినూతనాంబరము దట్టము గాఁగ ముసుంగువెట్టి కై
రవమధురస్మితం బమర రాత్రివిలాసిని యొప్పె శీతగు
వ్రవిమలరత్నదీపమును గల్గునజాండనికేతనంబునన్. 456

క. ప్రకటసుధాంశుగ్రహతా,రక మై యొకమిన్ను మింట రాయుచు నున్న
ట్లాకలంకయుఁ బాతాళము,నకుఁ గల్గినమాడ్కి నబ్ధి నడుమం దోఁచెన్. 457

వ. అంత నంశుమంతుం డుదయాచలంబు నలంకరించుటయు ననుచరు లయినవన
చరులు దమతమయూథంబులం దలకడచి లంకాపురంబునుపవనంబులకుం గవిసి.

క. మిడుతగమి గవియుతెఱచుచుఁ, బొడసిడలు నెండతునియ ప్రోవులుఁ గలయం
బుడమిం దిలతండులగతిఁ, బడఁగా నుడువీథినుండి పఱచిరి పెలుచన్. 459

తే. ఇనకులీనుఁడు సర్వాసమేతుఁ డగుచు, యోజనద్వయవృత్తమై యొప్పునగ్ర
శిఖర మెక్కి వెలిఁగె లంక చేటుతెఱకిఁ, గానఁబడు నాగ్రహప్రతిభానుఁ డనఁగ.

వ. ఆసమయంబున. 461

చ. కపులు ఫలోపజీవితులు గావున వారికి నాశ్రయంబు లం
ఘ్రిపముల యంచు రావణుఁ డొగిం బెనుఁజిచ్చులు వైవఁ బంచె నా
నుపవనపాదపావళుల నుత్థితషట్పదరాజితోడ ద
ట్టపుఁజిగురాకు లెల్లెడ నెరిడం గనుపట్టెఁ బురంబుచుట్టునున్. 462

క. వనచరసేనాలోకన,మున కచ్చెర లట విమానములు వచ్చిరి నా
ఘనచుంబిసౌధవలభులఁ, గనకరజతసాలభంజికలు పొరిఁ దోఁచెన్. 463

ఆ. మర్కటధ్వనులకు మాఱుసెలంగుచు, నున్నకొండగుహల నుండ నోడి
పొడవులెక్క నసఁగగుడులపైఁ బసిఁడిసిం, గంపుఁగొదమ లొగిన కానఁబడియె.

మ. పరదారవ్యసనంబునం దలఁపు నాపైఁ బెట్టఁ డీపంక్తికం
ధరుఁ డిం కేటికి నాకు నీతఁడు భయార్తత్రాణకేళీధురం
ధర భూవల్లభు యువ్విభీషణసనాథం జేయ రమ్మంచుఁ ద
త్పురిఁ చేసన్నలు సేసిన ట్లమరె నుద్ధూతధ్వజశ్రేణికల్. 465

వ. అప్పు డప్పురంబునం గలవిశేషంబులు సవిశేషంబుగా నెఱుంగం దలంచి విభీష

ణు నవలోకించిన నన్నరేంద్రున కతం డిట్లనియె. 466

ఉ. ఇమ్మెయి నూఱుయోజనము లీనగశృంగమునగ్రభూమియం
దిమ్ముగ విశ్వకర్మ రచియించెఁ గనత్కలధౌతహేమసా
లమ్ములఁ జిత్రగోపురములన్ మణికల్పితమందిరాధిరా
జమ్ముల వింతశిల్పముల జా నగునీనగరీలలామమున్. 467

క. రమణీయరత్నములరుచి, నమరెడునది పంక్తికంఠునగరు నృపాలో
త్తమ యది దశయోజనవృ,త్తము వింశతియోజనాయతము నై యొప్పున్.

సీ. ఉడురాజబింబంబు నుల్లసమాడెడు, ముక్తాతపత్రముల్ ముసుఁగువడఁగ
వెన్నెలఁ జల్లెడువింజామరంబులుఁ, గంకణఝుంకృతుల్ గలయఁ బొలయ
గగనమణిస్ఫూర్తి గని మాఱుమండెడు, కోటీరరత్నముల్ కొమరుమిగుల
మెఱుఁగులదిక్కుల మిఱుమిట్లుగొలిపెడు, కైదువుల్ విస్ఫులింగముల నుమియ
మేచకాంబుద మెఱసంజ మెఱసినట్లు, చెందిరపుఁజాయపట్టులఁ జెలువు మించి
యుత్తరపుగోపురంబున నున్నవాఁడు, వాఁడె దశకంధరుఁడు రఘువంశవర్య.

ఉ. వానరసేనఁ జూడ నదె వచ్చినవాఁ డని చెప్ప నప్డు లో
లోనన గుబ్బతిల్లుశిఖలోపల నాజ్యము వోసినట్టులై
భానుసుతుండు మండి గిరిపైఁ దగలన్ వెస దాఁటె మేఘసం
తానము దూల వజ్రపతనక్రియ నాదశకంఠుమీఁదికిన్. 470

— సుగ్రీవరావణులమల్లయుద్ధము. —

ఆ. దాఁటి యతనియురము దాఁచినమణులు న,ల్గడలఁ జెల్లచెదరు గాఁగ మకుట
పంక్తి విఱుగఁ జఱచి పద్మభవాండంబు, సెలఁగునార్పుతోడ నిలకు నుఱికె.

ఉ. లావున దుర్మదంబు వెడలన్ నిను నాఁ డటు వాలబంధనం
భావనఁ జేసి పుచ్చినసమగ్రభుజాబలు వాలి నాసమి
త్తోఁకవిదు నొక్కతూపునన కూల్చినరామునిబంట నేను సు
గ్రీవుఁడరా దురాత్మ రణకేళికి డిగ్గుదు గాక నావుడున్. 472

క. కూటము లురునిర్ఘాతము,పాటున భగ్నంబు లైనపర్వతముగతిం
గోటీరరహితుఁ డగుచు ని,శాటుండును నిలకు నుఱికె నలుకం జులుకన్. 473

క. ఉఱికి భుజాయుద్ధమునకుఁ, దఱిమినఁ గయిదువులు విడిచి దట్టించుచు బి
ట్టఱచేత నెత్తిఁ జఱచిన, నొఱిగి యెఱఁగి యతఁడు నతనియురుమస్తకముల్.

లయవిభాతి. వడిఁ జఱువ నెత్తురులు వెడలి ముఖరంధ్రములఁ గడలుకొన జు
మ్మనుచు నొడలు వడఁగాడం
బడ కతఁడు పాదుకొని కడునలుకతో బొమలు ముడివడఁగఁ గన్గవల
మిడుఁగుఱులు రాలం

గడఁగి తనవేగమికిఁ దొడిఁబడఁగఁ బట్టుకొని పొడవుగను నెత్తి బలువిడిఁ గుదియ వైవం
బడి మఱియు బంతికయి వడి నెగసి తన్నురము బెడిదముగఁ దాఁచి చను నెడఁ బొడిచె ముష్టిన్.

క. పొడిచినఁ జిట్టున దిరిగెడు,వడితోడన యాప్లవంగవరుఁడు పొడిచి వీ
డ్వడఁ దిరిగె వాల మహిపతి,వడువునఁ గవ్వాంపుగిరిజవం బొప్పారన్. 476

క. అప్పుడు పదఘట్టనముల,చప్పుడు బాహాస్ఫాలించుచప్పుడుఁ బెల్లై
నొప్పించుకఠిననిహతుల,చప్పుడుఁ జెవుడుపడఁ జెలఁగె సంరంభముగన్. 477

చ. బలువడి లాఁగులం బెనఁచి పట్టుచుఁ బట్టిన నూడిపోవుచున్
మలయుచుఁ దాఁకుచుం దిరిగి మర్మము లంటఁగ వ్రేయుచున్ మహీ
స్థలిఁ బడఁ దాఁచుచుం గదియ జానువు లూఁదుచు ముష్టికూర్పరా
దుల వడి నొంచుచుం గడఁకతో నిటు లొండొరు మీఱి వెండియున్. 478

చ. చిత్రగతిం బెనంగి రిలఁ జెందుచుఁ గ్రిందును మీఁదు నౌచుఁ గ్రొ
న్నెత్రు ధరాపరాగముల నిల్ప ముహుస్స్ఫురదుత్పలిత్పత
ద్గాత్రములందుఁ బెంజెమట గ్రమ్మఁగ నూర్పులు సందడింప గో
మూత్రకమండలీకరణముల్ మొదలైనవిశేషభంగులన్. 479

వ. ఇట్లు పెనంగి మఱియు మత్తదంతావళంబులకై వడిఁ గెరలి తాఁకుచు బెబ్బులుల తెఱంగునం బొంగి మ్రోఁగుచుఁ గసిమసంగినసింగంబులభంగి లంఘించి వ్రేయుచు నుగ్రశరభంబులపరుసున బెరసి నెత్తురులు రేఁచుచుఁ బ్రచండభేరుండంబులపగిది నెగసి పోవుచు విలయవలాహకంబులవిధంబున మీఁదఁ గ్రింద వడిం బడి సుడివడుచు నాఖండలుం డెఱుంగనికొండలకరణి మగుడ ధరణిం బడుచుఁ మహానాగంబులలాగునం బెనంగొని రోఁజుచు నతులగతుల మల్లయుద్ధవైదగ్ధ్యంబు నెఱయ మెఱయుసమయంబున. 480

శా. శుష్కీభూతము లైనకంఠబిలముల్ జొత్తిల్లఁ బైపై నసృ
జ్నిష్కాసంబులు సెల్ల నార్పులు వడి న్భేదింప నాకుండ మ
స్తిష్కద్వారము వీను లీనికొన నుద్వృత్తిన్ వడిం బోరి రా
కిష్కింధాధిపపంక్తికంధరు లధిక్షేపంబు లేపారఁగన్. 481

వ. ఇట్లు పోరిపోరి దగలు మిగిలినం బాసి నిలిచి రంత నినసుతుం డతనిం గనుంగొని.

ఉ. వంచన రాముదేవిఁ గొని వచ్చినయట్టులు గాదు పోరి న
క్తంచర నన్ను నాహవముఖంబున డాయుట లన్న నయ్యారే
క్రించ సహోదరుం గరముఁ గీడ్పడి మానవుచేతఁ బొంచి యే
యించుట గాదు లే నను జయించుట నీకు నటంచు నవ్వినన్. 483

క. అగు నింక మావిభీషణు,తగవును నిర్వాధమ యంచుఁ దఱిమినఁ బైపై
మగుడఁ దలపాటు ప్రేటును, నగపాటును బోటు నాటు నై యని సెల్లన్. 484

వ. మున్ను గలంగి తొలంగి యున్నయాతుధాను లందఱుఁ గూడుకొని. 485

శా. వీఁడా వానరసేనకుం బతి మహావీరుండు సుగ్రీవుఁ డ
న్వాఁ డీయొక్కఁడు పట్టువడ్డ మనపై వా రెవ్వ రేతేర రె
వ్వాఁడుం దక్కక తాఁక రం డనుచు నార్వర్వ నవ్వి కార్యంబుమై
నాఁ డై యక్కపిరాజు దాఁటె దివి మోవంగా సువేలాద్రికిన్. 486

మ. మగుడంగ దాఁటి నిల్చి తను మర్కటు లచ్చెరువంది చూడఁ గే
ల్మొగిచిన భూవిభీషణుండు ధృతి మున్ను గదల్చినసందియంబు పో
నెగిచి ముదంబుతో నతని నిమ్ములఁ గౌఁగిటఁ జిక్కఁజేర్చె మె
చ్చుగ రణధూళిసమ్మిళితశోణితపంకము వక్షమంటఁగన్. 487

ఉ. ఇట్టులు గారవించి మది నెవ్వరు నీయసహాయసాహసం
బిట్టులు సేయఁగాఁ దలఁతురే యవిచారితకర్మ మందు నీ
కెట్టులు సెల్లెనో యనుచు నేము దలంకఁగ నీవు నాకు నై
యట్టులు సిక్కినం బిదప నయ్యెడుమే లది యేల చెప్పమా. 488

ఉ. అక్కడ నీకుఁ గీడొదవినట్టిద యైన సబాంధవంబుగా
రక్కసుఁ జంపి రాత్రిచరరాజ్యవిభూతి విభీషణుండు పెం
పెక్క నయోధ్య మాభరతుఁ డేలఁగ నే నియమించి దేహముం
దక్కెడువాఁడ నైతి నుచితస్థితి వేగిరపాటు లొప్పునే. 489

క. నావుడు నిట్లను నాసుగ్రీవుఁడు నరనాథ మీరు గినిసిన నా కా
దేవద్రోహిం గని రోషావేశము రాక యున్నె యె ట్లయినఁ దుదిన్. 490

వ. అనిన విని సంతోషించి యారఘుపుంగవుం డంత లక్ష్మణుం గనుంగొని యింక లంకమీఁదఁ దడయక విడియ వలయు వివిధప్రకారంబుల సురమునుల కపకారం బాచరించునక్తంచరులనాశంబునకై మహోత్పాతంబులు వొడముచున్నయవి కృష్ణరక్తపరివేషభీషణంబును బరిస్ఫురితతారకంబును నగుమార్తాండమండలంబువలన మంటలు దెగిపడియెడు ననేకరాక్షసరూపంబులు గయికొని మేఘంబులు నెత్తురుసిలికెడుఁ బ్రపాతవేగంబున నగశృంగంబులు విఱిగికూలెడు దినకరాభిముఖంబు లగుచు సృగాలంబులు వాపోయెడు నిట్టిదుర్నిమిత్తంబులు గానంబడుటయ కాక నాకు నాంగికంబులు నాస్త్రిక్యంబులు నగుశుభసూచకంబు లెన్ని గల వన్నియుం గలిగియున్నయవి మనకు జయం బవశ్యంబు నగు ననుచు నయ్యచలంబు డిగ్గి సన్నద్ధకవచుండును గాంచనసూత్రనిబద్ధతూణీరుండును నధిజ్యధనుర్ధరుండును బాణపాణియు నై తాను ముంగలను సుగ్రీవవిభీషణులు గెలంకులను సైన్యంబునడుమను సుమిత్రానందనుండు పిఱుందను జాంబవత్ప్రము

ఖయూథాధిపతులు చుట్టునుగా నడిచె నప్పుడు. 491

మహా. బలపాదోద్ధూతధూళీబహుళపటల మస్పష్టదిగ్భాగ మయ్యె న్
వలమానోత్తాలవాలవ్యజనవిరళ మై ప్రంత మి ట్లేర్పడం జూ
డ్కులకుం బంటించున ట్లై కొని నిగిడి పురీగోపురోత్తుంగసౌధా
లి లలిం గప్పెం దదభ్రోల్లిఖశిఖరమణు ల్మిన్నుమిన్కంచుఁ దోఁపన్. 492

వ. ఇట్లు ధరాపరాగనిరంతరరోదోంతరంబుగా నడచునన్నరేంద్రుతోడం గూడ
దుర్వారవేగంబున. 493

చ. ఉగుతరవాలభోగుల భుజోర్మ్ముల నొప్పుచుఁ బొంగి మింటితో
నొరయుచుఁ బెల్లు దిక్తటము లొత్తుచు నద్రుల భూరుహంబులం
బొరిఁబొరిఁ గూలఁ ద్రోచికొని పోవుచు నంతయు ముంచికొంచు న
చ్చెరువుగఁ బోయి వెల్లివిరిసెం గపివాహిని లంకచుట్టునున్. 494

క. అప్పుడు పదియోజనముల,విప్పున గాడ్పునకు దుష్ప్రవేశం బనఁగా
నప్పురము దిరిగి రాముని,చెప్పినకందువల నట్లు సేకొని విడియన్. 495

వ. రఘుపతినియోగంబున లక్ష్మణవిభీషణు లయ్యైవాకిళ్ల నిలువ నీలునకు మైంద
ద్వివిదుల నంగదునకు ఋషభగజగవయగవాక్షగంధమాదనులను హనుమంతు
నకుఁ బ్రమాథిప్రజంఘులను గోటికోటిసంఖ్యాకంబు లైనకపిసైన్యంబుల
తోడఁ దోడుగా విడియించి మఱియును దగినయెడల వలయువలీముఖవీరులం
జాలించుచు నింద్రజిద్రావణరక్షితంబు లగుగవంకులకు మధ్యంబున మధ్యగుల్మం
బున సుపర్ణానిలసమానబలసంపన్నులు ముప్పదియాఱుకోట్లు యూథాధిపతులు
బలసి మలయ సుగ్రీవజాంబవంతుల నునిచి తారు ననేకానీకంబులు మెఱయ ను
త్తరద్వారంబున నరేంద్రుకెలంకులఁ గడిమిం బొలిచి నిలిచి గానమయంబున.

సీ. దుర్వారకల్లోలగర్వితాంబుధితోన, రాక్షసాంగనలగర్భములు గలఁగ
బొరిఁ ద్రికూటాద్రిగహ్వరములతోన న,క్తంచరభటులడెందములు పగుల
[1]సురగేంద్రదుర్భరధరణీధరములతోన, లంకాపురంబుసాలములు వడఁక
నస్తోకతరతారకస్తోమములతోన, గోపురంబులమణుల్ గుప్పగూల
బిట్టురవి తేరిహరులు నిక్కట్టుఁ బఱవ, దిగ్గజంబులు బెగడంగ దెసలసంధు
లవియ రోదోంతరాళంబుసెవుడుపడఁగ,వీకమై నార్చి రందందవృతచరులు.

తే. ఆర్చి గిరిశిఖరంబులునంఘ్రిపములుఁ,గొనుచుఁ గదియ రక్కసులునుగుంతఖడ్గ
కార్ముకప్రముఖాయుధకలితభుజులుఁ,గవచధారులునయి కోటఁగలయనలమ.

## అంగదునిరాయబారము.

వ. అప్పుడు రఘుపుంగవుండు రాజనీతివిద్యావిశారదుం డగుట విభీషణానుమతి

---

1 సురగేంద్రదుర్ధరధరణీధరములతోన.

నంగదుం బిలిచి నీవు రావణుసమీపంబునకుం బోయి నావచనంబులుగా నతని తోడం బలుకుమనప్పలుకులు విను మనుచు ని ట్లనియె. 499

మ. కడిమిం బోరికి శూరతం గడఁగి రా కాదేని వైదేహి నేఁ
గడవం దెచ్చితిఁ దప్పు గావు మని లంకారాజ్య మొప్పించి వె
ల్వడి ప్రాణంబులు గాచికొంచు దివిజుల్సంతోషముం బొంద నె
య్యెడ కైనం జను మావిభీషణుఁడు రా జివ్వీటికిన్ రావణా. 500

చ. కపటము వన్ని జానకి నకల్మషఁ దెచ్చినయట్టిపాపక
[1]ర్మపుఁబొడువం దనూజహితమంత్రిసమేతముగా దశాన్య మ
ద్విపులశిలీముఖజ్వాలనదీర్ఘతరార్చుల నేర్తు నిన్ను నీ
తపమున కట్లు [2]మెచ్చినవిధాత్రుఁడు వచ్చిన నెందుఁ జొచ్చినన్. 501

వ. అనిన విని తారానందనుండు తారాపథంబున కెగసి రెండవ వైశ్వానరుండునుం బోలె మండుచుం జని నిశాచరు లచ్చెరు వంది చూచుచుండఁ బౌలస్త్యునాస్థాన మంటపంబున డిగ్గి సాహంకారుం డగుచు నాదశకంధరు నవలోకించి. 502

చ. నెఱి నిడి నీమదం బడఁగఁ జేసినయగ్గును వేయిచేతులున్
నఱకి భుజావిజృంభణమునం గడుఁ బేర్చినజామదగ్న్యువిల్
విఱిచినరాముబంట వినవే నను నంగదు సర్వగర్వమున్
నెఱి సెడ నాల్గువారిధుల ని న్నటు ముంచినవాలిపుత్త్రుఁడన్. 503

వ. అని పలికి రఘువరుండు దనవచనంబులుగా నీతోడ నాడు మన్నవచనంబులు వినుము. 504

మ. కడిమిం బోరికి శూరతం గడఁగి రా కాదేని వైదేహి నేఁ
గడవం దెచ్చితిఁ దప్పు గావు మని లంకారాజ్య మొప్పించి వె
ల్వడి ప్రాణంబులు గాచికొంచు దివిజుల్సంతోషముం బొంద నె
య్యెడ కైనం జను మావిభీషణుఁడు రా జివ్వీటికిన్ రావణా. 505

చ. కపటము వన్ని జానకి నకల్మషఁ దెచ్చినయట్టిపాపక
ర్మపుఁబొడువం దనూజహితమంత్రిసమేతముగా దశాన్య మ
ద్విపులశిలీముఖజ్వాలనదీర్ఘతరార్చుల నేర్తు నిన్ను నీ
తపమున కట్లు మెచ్చినవిధాత్రుఁడు వచ్చిన నెందుఁ జొచ్చినన్. 506

వ. అని పలికిన. 507

శా. భుగ్నభ్రూకుటిభీకరుం డగుచు నాస్ఫోటించి బాహార్గళా
లగ్నక్రూరతరోరుఖడ్గరుచిజాలంబుల్ గదావిస్ఫులిం
గాగ్నిజ్వాలలు గన్ను లీనికొన లంకాధీశుఁడుం గ్రోధని
ర్మగ్నుం డై వడి వీనిఁ బట్టుఁ డనఁగా రాత్రించరుల్ బల్విడిన్. 508

1 ర్మపుఁబొడవుం. 2 మెచ్చినవిధాత్రునిఁ జొచ్చిన నెందుఁ.

సీ. నలువురు తనుఁ బట్ట । నవ్వుచు నవ్వాలి, సుతుఁడును విక్రమ । స్ఫురణ మమర
నొక్కని మెడ [1]వాల । ముఱివెట్టి యొక్కనిఁ, బెలుకుఱ బాహాలఁ । బెనఁచి పట్టి
యిరుగేలఁ దక్కిన । యిరువురఁ గొని వాయు, వేగంబుమై నుడు । వీథి కెగసి
యుందుండి ప్రాణము । లంతరిక్షమునన, పోవునట్లుగ వారిఁ । బుడమి వైచి
పరుషలీలఁ గులిశ । భగ్నహిమాచల, విపులశృంగపాత । విధము దోఁపఁ
గొలువుమేడ విఱిగి । కూలంగఁ దాఁచుచు, నరుగ మఱియు నద్ద । శాననుండు.

చ. వెనఁ జని పోవ నీ కడరి । వీని వధింపుఁ డనంగ రక్కసుల్
ముసలగదాధనుర్ద్విశిఖ । ముద్గరతోమరభిండివాలప
ట్టిసపరిఘాదు లొక్కరవ । డిం గొని చుట్టును ముట్టి నొంప న
య్యసమబలుండు ముష్టికరి । నాహతులం [2]బగతాడనంబులన్. 510

క. బలువిడి మెఱయఁగ వక్షం, బులుఁ దలలుం బగిలి వారి । బొందులు సుడిగొం
చిలఁ గూలఁ జూచి వనచర, నిలు నిలు మని ఖరునికొడుకు । నింగి సెలంగన్.

క. సుఖరుం డనువాఁ డార్చుచు, ముఖమునఁ గ్రోధాగ్నిశిఖలు । ముడివడఁగ శిలీ
ముఖపంచకమున నుదురు వి, శిఖదశకంబునను నురముఁ । జేతులు నొంపన్.

ఉ. వాలము ద్రొక్కఁ బద్ధఫణి । వల్లభుకైవడి నల్గి వాని నా
భీలకఠోరముష్టిహతి । భిన్నశిరస్కునిఁ జేసి శోకచిం
తాలసమానసుం డయి ద । శాస్యుఁడు సూడఁగ నేలఁ గూల్చి య
వ్వాలిసుతుండు వచ్చి రఘు । వంశ్యున కేర్పడఁ జెప్పె నంతయున్. 513

క. చెప్పిన రాముఁడు కపివర, చెప్పినపనికంటె మిగులఁ । జేసితి కార్యం
బిప్పగిదిఁ జేయ నొరులకుఁ, జొప్పడ దని పలికి రక్క । సుల గెలుఁ డింకన్. 514

వ. అనిన విని యుద్ధసన్నద్ధు లగుచుఁ గడంగి రంతఁ గుముదశతబలిసుషేణులు పదియు నేఁబదియు నఱువదియును గోట్లు మర్కటభటులం గొని పూర్వపశ్చిమ ద్వారంబులకుఁ ద్రోచి నడచిరి మఱియు బలసమేతుం డై పనసుండు కుముదుపిఱుందన తఱిమె సుగ్రీవుం డనేకయూథాధిపతులతో నుత్తరపుగోపురంబునకుఁ గవిసెఁ గోటిగోలాంగూలవీరభటులు బలయ గవాక్షధూమ్రులును మంత్రిపరివృతుం డగువిభీషణుండును రఘువరు కెలంకు లలంకరించిరి గజగవయశరభగంధమాదనులు దిరిగివచ్చుచుం బురికొలుపఁ గపులు పాషాణపాదపాదుల నగడ్తలు పూడ్పం దొడంగి రట్టియెడ రావణుండు సేనానాథులం గనుంగొని మీరును మీ బలములతోఁ బురంబు వెడలి వానరులఁ బరిమార్చి రండు పొం డనుచు నియోగించిన. 515

శా. హేషాబృంహితనేమిదుందుభిముఖా । నేకధ్వనుల్ గ్రందుగా
భూషారత్నమరీచికానికర మం । భోజాప్తదీప్తిచ్ఛటో

---

1 వాలమునఁ జుట్టి. 2 గదు నబ్బలంబులన్.

స్మేషాడంబరలీలఁ బ్రోవఁ బడగల్ మింటన్ బలద్విట్పురీ
యోషాహ్వానవిడంబనాగతిఁ గరం బొప్పారఁగా నయ్యెడన్. 516

సీ. పృథులాంకుశంబుల బిగువులు డించినఁ, గొంకక జాడించు కుంజరములు
కింకిణుల్ మొరయలం కియల కోడక మెండు, కొనుచుఁ గరాళించు ఘోటకములు
హస్తులగదురున కడరి నిల్వక క్రేళ్లు, సనుహాయంబులమణి స్యందనములు
తేరికిఁ గరికిఁ బోఁ దెరు వీక హేవాక, కలితులై కెరలు మొక్కలపుభటులు
నురువు లురువువెడఁద నోళ్లతోడుత వొరార, లెత్తికొనుచు వేదు లెత్తినట్టు
లుబ్బు రేఁగి యున్న యుష్ట్రములును సేన, నుగ్రలీలఁ జేయు చుండఁ గడఁగి.

మ. బలధూళీపటలాంధకారము దిశాభాగంబునం బైపయిం
గలయం బర్వుచు శర్వరీవిభవముం గావింప నాభీలహే
తుల నానావిధవిస్ఫులింగములు ఖద్యోతాయమానంబులై
వెలయం బెల్లునిశాచరుల్ వెడలి నుర్వీచక్ర మల్లాడఁగన్. 518

క. వెడలి గజఘటలు గుఱ్ఱపు, దడములతండంబులును రథంబులగము లే
ర్పడఁగ భయంకరగతితోఁ, నడర నజాండంబు తఱుచు టార్పులఁ బగులన్.

—✿ మొట్టమొదట వానరులకును రాక్షసులకు నయినసంకులయుద్ధము. ✿—

సీ. ముసలగదాఖడ్గముద్గరతోమర, పరశుపట్టిసకుంతపరిఘచక్ర
భిండివాలాదులు పెన్నదరుల సీన, నట్టహాసంబులు నౌడుకఱచు
దంష్ట్రాలముఖములు దారుణగతిఁ జేయ, మృత్యుదేవతనైన మ్రింగిపుచ్చఁ
జాలుదు రనఁ జాలి చండభుజాదండ, విస్ఫూర్తు లెసఁగంగ వీఁకఁ దాఁకి
కడిమిఁ దమమీఁద బల్విడిఁ గపులు గురియు, విపులపాషాణపాదపవృష్టిదూల
నర్ధచంద్రభల్లంబు లందంద పఱపి, మిన్ను దెఱపి గావించుచు మెఱసి రపుడు.

క. ఏసియు వైచియుఁ బొడిచియు, వ్రేసియు నిరుదెసలవారు వెస ననిలీలం
జేసిరి విజయము గైకొను, నాసల సిద్ధచారణాదులు వొగడన్. 521

వ. ఇట్లు యుగాంతవిఘూర్ణమానమహావర్ణంబుల శ్రేణిసేయుచుం బొంగి నిర్మర్యాదంబుగా నిరువాఁగునుం గలయ బెరయ నందు నింద్రజితుం డంగదుని బ్రజంఘుండు సంపాతిని జంబుమాలి హనుమంతుని మిత్రఘ్నుండు విభీషణునిఁ దపనుండు నలుని నికుంభుండు నీలునిఁ బ్రహస్తుండు సుగ్రీవుని విరూపాక్షుండు లక్ష్మణుని నగ్నికేతురశ్మికేతుసుప్తఘ్నయజ్ఞకోపులు నలువురు రాముని వజ్రముష్టి మైందుని నశనిప్రభుండు ద్వివిదునిఁ బ్రతపనుండు గజుని మహోదరుండు సుషేణుని మకరాక్షుండు జాంబవంతునిఁ గుంభుండు ధూమ్రుని నరాంతకుండు పనసుని దేవాంతకుండు గవాక్షునిఁ ద్రిశిరుండు శరభుని నకంపనుండు కుముదుని సారణుండు ఋషభు నతికాయుండు రంభవినతులను ధూమ్రాక్షుండు కేసరిని శుకుండు వేగదర్శిని మహాపార్శ్వుండు గంధమాదనుని విద్యుజ్జిహ్వుండు శతబలినిం దలపడి

రింద్రజిత్తు గద నైవ నంగదుం డదియ కైకొని యమ్మేఘనాథురథకూబరంబు
విఱుగను రథ్యంబు లొఱగను సారథి సమయను నంకించి వైచెఁ బ్రజంఘుండు
బాణత్రయంబున నొంప సంపాతియుఁ బెనుమద్ది నాదోషాచరుం దొడిఁబడ
నడిచె జంబుమాలి కలితస్యందనుం డై శక్తి నురంబు రయంబునం దాఁకింప
హనుమంతుం డారథంబుమీఁదికి లంఘించి హస్తం బెత్తి క్రుంగం జఱిచె మిత్ర
ఘ్నుండు శితశరంబు లవయవంబుల గ్రుచ్చిన నొచ్చి విభీషణుండు ముసలంబున
నారాక్షసునివక్షంబు వగిలించెఁ దపనుండు కులిశఘోరాస్త్రంబుల నంగంబు
జర్జరితంబు గావించిన నలుం డింద్రతరుతాడనంబున నాక్షపాచరుబాహుదండం
బులు చదిపె నికుంభుండు తరణికిరణంబుల విడంబించుసహస్రమార్గణి నడ
రింప నీలుండు నిజపాదహతిం బడినశతాంగచక్రంబు గొని తత్సూతుకంఠనా
ళంబు ద్రెంచెఁ బ్రహస్తుండు భల్లంబునఁ జేతిసాలంబు ఖండింప సుగ్రీవుం డత్త
రుశాఖాఖండంబున నయ్యాతుధానుమస్తకంబున మస్తిష్కంబు సూపె విరూపా
క్షుండు పుంఖానుపుంఖంబుగా నేయుచుం గదియ లక్ష్మణుండును రత్నచిత్రి
తంబు లగుశిలీముఖంబుల నన్నిశిథినీచరు వారించె నగ్నికేతు రశ్మికేతు సుప్త
ఘ్న యజ్ఞకోపులు బహుప్రదరంబులు పఱప రామచంద్రుం డర్ధచంద్రాస్త్రం
బులు నాలుగింట నన్నలువురతలలు ద్రుంచె వజ్రముష్టి కరవాలంబున నం
నపీఠంబు విదళింప మైందుండు నయ్యామినీచరుం బిడికిటఁ బడఁబొడిచె నశని
ప్రభుం డురుశరంబులు నిగిడింప రక్తసిక్తశరీరుం డై ద్వివిదుం [1]డచలపాతంబున
నవ్విభావరీచరు సోలించెఁ బ్రతపనుండు శూలంబున బరివోదువ గజుండు
హింతాలంబున నారజనీచరు వెగడుపఱిచె మహోదరుండు నుదుట న
క్కున నారాచంబులు మూఁడు నైదు నాటింప సుషేణుండు గండశైలంబున
నాత్రియామాచరుయుగ్యంబులను రథచోదకునిం జదిపె జాంబవంతుండు
వృక్షక్షేపణంబునం గెరలింప మకరాక్షుండు చండకాండంబుల నాభల్లూక
పతిఫాలభుజామధ్యంబులు భేదించి యతనిచేత విరథుం డై తొలంగెఁ గుంభుం
డు జము తెఱంగునం గసిమసంగి వనచరుల మ్రింగ ధూమ్రుం డద్రిశృంగ
ద్రుమంబుల నన్నిశాచరువిజృంభణం బడంచె నరాంతకుం డంపవాన గా
వింపఁ బనసుండు శమీతరువర్షంబున నన్నక్తంచరు ముంచె దేవాంతకుండు
బలుదెగ గొని కంకపత్త్రపంచకం బొక్కట దేహాంతరంబునం జొనిపి తన్ను ల
క్షించి వైచినమధూకంబు నెడ నేడుదూపులఁ దునిమి తొమ్మిదింట మర్మం
బు లంటనేయఁ [2]బంటింపక గవాక్షుండు శిఖరిశిఖరంబున నారక్కసు స్రుక్కిం
చెఁ ద్రిశిరుండు దోమరంబున శిరంబు నొప్పింప శరభుండు కనలి సప్తపర్ణం
బున నారాత్రించరుం డెక్కినకుంభికుంభస్థలం బవియించె నకంపనుండు పరిఘ

1 డచలకూటంబున. 2 బంటుతనంబు డింపక గవాక్షుండు.

ప్రహారంబున నొప్పింప మోఁకాళ్లు నేల మోవం బడి రక్తలోచనుం డగుచుఁ
దోన యెగసి కుముదుండు కఠినముష్టి నాతపాచరు నిశ్చేష్టితుం జేసి చెలంగె న
మరసమాహూతుం డై భూరిభూరుహంబున ఋషభుండు వ్రేయం జేయునది లేక
సారణుండు నారిదెగినవింటితోడన పిఱిందికి నోసరించె నతికాయుండు సాయ
కపరంపరలు గప్ప రంభవినతులు పాషాణపాదపంబుల నమ్మహాబలుబలంబు
లం గూల్చిరి ధూమ్రాక్షుండు శింజిని మ్రోయించుచు బలుగోల లెసఁగింపఁ
గేసరి శిలాదారుపాతంబుల నాతని మూర్ఛపుచ్చె శుకుండు మెఱుంగుములుకు
లు నెఱకులు నాటింప వేగదర్శి యతులవేగంబునం దదీయశతాంగవరూథంబు
నుగ్గునూచంబుగా గుప్పించి నొప్పించి యుఱికె మహాపార్శ్వుం డుభయపార్శ్వం
బులనమ్ము లెమ్ములఁ గీలింప గంధమాదనుండుత్తాలతాలంబున నమ్మేటిని శాటునా
టోపంబు దూలించె విద్యుజ్జిహ్వుం డనలజిహ్వాభీలాంబకంబులం బొదువ శతబలి
యొక్క విశంకటం బగునశ్వకర్ణంబున నారాత్రించరుం దెరల్చె మఱియుఁ దక్కిన
వలీముఖులును సర్వశర్వరీచరులు నచ్చలంబునం బెనఁగి రాసమయంబున. 522

మ. వరుసం దేరుల శూరు లై పెనఁగియుం । వైరథ్యముం బొందుచుం
గరటిస్కంధము లెక్కి [1]డీకొలిపియుం । గ్రం డై కరుల్ దూలఁగాఁ
దురగారోహకు లై కడంగియు హరుల్ । దోడ్తోఁ బడం గాల్వు రై
సరిఁ బోరాడియుఁ గైదువుల్ సమయ ము । ష్టాముష్టికిం జొచ్చియున్. 523

ఉ. నొచ్చియుఁ బోక వానరుల । నొంచియు మాఱొనరింప మూర్ఛకున్
వచ్చియుఁ గ్రమ్మఱం దెలిసి । వచ్చి కడంగియు దిక్కు లార్పులన్
వ్రచ్చియు మోఁకలం జమరి । వైచియుఁ దత్తరుతాడనాదులం
జచ్చిరి మేటిరక్కసులు । చండమదోద్ధతి నప్డు వెండియున్. 524

సీ. ఇరువాఁగు బెరయంగ । నెగయు పెంధూళుల, తఱుచు మేఘంపు మొ । త్తముల తెఱఁగు
సారథు లిలఁ గూల । నరిఁ [2]బాఱు తేరుల, మ్రోఁతలు పెన్నుఱు । ములవిధంబు
నమ్ము లేదినరథు । లంకించి వడి వైచు, చక్రాదు లుజ్జ్వలా । శనులపోలుపు
శుండాలములనుండి । జోదులు తొరఁగించు, వాలంపజాలంబు । వానవడువు
ఖడ్గరోచులు మెఱుఁగుల । గతియుఁ గుంభ, కలితమౌక్తికములు వడ । గండ్లచాడ్పు
నెత్రువఱద లేర్లపగిది । నెఱయ మెఱయ, నని పయోధరసమయంబు । ననుకరించె.

వ. మఱియు వివిధప్రకారంబుల నమ్మహాహవం బద్భుతరసావహం బై నిరంతరం
బగుటయు. 526

క. ఇరుదెసలవారు నితరే, తరజయకాంక్షలఁ బెనంగఁ । దనబింబము ప
ల్దెరువులుగ విరియ నీక నని, యరుగు కరణిఁ దరణి గ్రుంకె । నాసమయమునన్.

ఉ. వేల నతిక్రమించి లయ । వేళ మహాబ్ధివిలోలమీనక

1 ఢీకొలుప నుగ్రం బై కరుల్ క్రుంగఁగా. 2 దూలుతేరుల.

ల్లోలకరాళమై జగము ‖ లోఁగొన వచ్చినమాడ్కి ఖడ్గజి
హ్వాలభుజాభుజంగవల ‖ నాకులముం బటహాదినిస్వనా
భీలము గాఁ గడుం గడఁగి ‖ పేర్చి నిశాచరసేన త్రోచినన్. 528

క. నంజ వొడతెంచె నిఁకమీఁ,దం జీఁకటి లావు యాతు ‖ ధానుల కనుచున్
శింజిని మ్రోయించుచు రఘు,కుంజరుఁడు వెసం గడంగి ‖ ఘోరాస్త్రములన్.

ఉ. వాహనసూతయోధరథ ‖ వర్గము లొక్కటఁ గుప్పఁగూర నా
రోహకపాతముల్ బెరయ ‖ మ్రోయుచు దంతులు మ్రొగ్గ వాహనం
దోహము లాశ్వికాంగముల ‖ తోడఁ బొరింబొరిఁ గూలఁ గైదువుల్
బాహులు మున్నుగాఁ దునిసి ‖ బల్విడిఁ గాల్వురు ద్రెళ్ల నేయుచున్. 530

చ. అడరి వధింప నప్పుడు ద ‖ దాశుగవేగము సైఁప కందఱున్
వడి సెడి యొక్కదిక్కునకు ‖ వచ్చుచుఁ గూడి తగంగ వెండియు
న్నిడుతలు సిచ్చువాతఁ బడి ‖ నీఱగుకైవడి నప్పు మంటలం
దొడిఁబడి ప్రుందఁగా సమర ‖ దోహలులై కపులం దెరల్చుచున్. 531

వ. శుకసారణవజ్రదంష్ట్రమహాకాయమహాపార్శ్వమహోదరులు గాలమేఘంబులుం బోలె గర్జిల్లుచు శరాసారఘోరంబుగా నొక్కటం దనపయిం గవియ నవ్వీరశేఖరుండు దదవసరసంధ్యారాగరక్తంబు లగునుత్పలంబులుంబోలెఁ గ్రోధారుణితలోచనంబు లలర నయ్యైర్వుర నాఱుబాణంబుల నొప్పించి తొలఁగించి మఱియు లీలావిక్రమంబులు సలుపం దొన వానరులుం గడంగి. 532

క. ఆఁకరముతోడ నప్పెను,మూఁకలపై కుఱికి కఠిన ‖ ముష్టినిహతులన్
వ్రాఁకుల శిలలను బీనుఁగు,ప్రోకలు గావించి [1]రపుడు ‖ పొడవడక వడిన్. 533

క. అంగదుఁ డొక్కమహాగిరి,శృంగముఁ గొని పెలుచ [2]నింద్ర ‖ జిత్తుపై నంతన్
నింగి సెలఁగ నార్చుచుఁ గది,యంగ నదృశ్యుఁడయి చనియె ‖ నాతఁడు నంతన్.

ఉ. దిక్కులు మాయుచుం గలయఁ ‖ దెల్పులు మాపుచు మిన్ను గప్పుచుం
బెక్కు లొకండుగా ముసుఁగుఁ ‖ బెట్టుచుఁ జూడ్కుల కందకుండ నే
యిక్కలుఁ దోఁపకుండఁ దల ‖ మెక్కుచు మున్నగుసైన్యధూళితోఁ
గ్రిక్కిఱియం దమం బడర ‖ రెండుదెఱంగులవారు నొండొరున్. 535

శా. ఓరీ శాత్రవుఁ డెవ్వఁ డెవ్వఁ డనుచున్ ‖ హుంకారఘోరంబుగా
రారా యంచు మిమున్ హరించుహరి నే ‖ రా యంచు నేరా నిశా
చారిం గీశకులాళి నంచు వెసఁ గే ‖ శాకేశి వర్తింపఁ దెం
పారం బోయి రెలుంగునిక్కలకు న ‖ య్యాశ్చర్యపుంజీఁకటిన్. 536

తే. తొడినమణికంకణాదుల ‖ వెడలుదీప్త
లోమధులు గాఁగఁ దెఱచునో ‖ ళ్లుగ్రగుహల

---

1 వారిఁ జొడ వడఁగింపన్. 2 నింద్రజిత్తునిమీఁదన్; ఇంద్రజిత్తుఁడనియే వ్రాఁతప్రతులం[illegible]డిని.

దారయు జంగమాద్రులభంగిఁ గ్రోచి రాత్రి
చరులు మ్రింగఁ జొచ్చిరి వనచరుల నపుడు. 537

శా. ఖద్యోతంబులభంగిఁ బుంఖమణు లాకాశంబునం దోఁపఁగా
విద్యుద్వేగమహాశిలీముఖముఖావిర్భూతదీప్తుల్ భయా
పాద్యుల్కాగతిఁ జూపఁ జూపె ధరణీపాలుండు నాలో ధను
ర్విద్యానైపుణిఁ జిచ్చుటంపఱఁ దమోవిధ్వంసముం జేయుచున్. 538

సీ. మురిసినమణిమయముకుటపంక్తులు ప్రభాలీఢదిగ్దీపమాలికలు గాఁగఁ
గూలినదళితేభకుంభమౌక్తికతతు, లిచ్చినపువ్వుదోయిళ్లు గాఁగఁ
బడి ప్రోవులై యున్నబహుగాత్రఖండముల్, రచితమహోపహారములుగాఁగఁ
గలయంగ మడువులుగట్టినగజఘోట, కాదిరక్తములు మద్యములు గాఁగ
నట్లు పూజ నొందియుఁ దనియక మహాసి
దంష్ట్రియును నటద్భూతబేతాళయుతయు
నగుచు సంతకంతకు నేచె నతులగతులఁ
గాళరాత్రియుఁబోలె నక్కడిఁదిరాత్రి. 539

వ. అంత నంతకుమున్న కయ్యంబున వంచించి చని లంక సొచ్చి యింద్రజితుం
డంతర్గతంబున. 540

శా. దంభోళిద్యుతిదుర్నిరీక్ష్యుఁ డగుచుం దర్పంబునం బేర్చునా
జంభారిం జెఱగొన్నయేఁ గలుగఁగా శాఖామృగశ్రేణిచే
నంభోరాశికి లంకకుం గలిగె దైన్యం బింక మద్బాహుసం
రంభం బేటికిఁ జెల్లుఁ గాక రఘువీరఖ్యాతి లోకంబునన్. 541

వ. అనుచు జయోపాయంబుఁ జింతించి దారుణంబైనయొక్క మారణకర్మం బాచరిం
చువాఁడై రక్తమాల్యాంబరోష్ణీషాదులు ధరియించి హోమశాలకుం జని వి
హితప్రకారంబున దానవగురూపదిష్టం బగునాథర్వణతంత్రం బనుష్ఠింపఁ గుండ
మధ్యంబునం బ్రదక్షిణార్చులఁ బేర్చునలంబున దివ్యభూషణభూషితం బయి
యవధ్యం బగునశ్వచతుష్టయంబుతోడ వివిధాయుధభరితం బగునొక్క పసిండి
రథం బెగసినం గైకొని సమరసన్నాహంబున మెఱసి రథారోహణంబు నేసి
రాక్షసులం గనుంగొని. 542

## ఇంద్రజిత్తు మాయాయుద్ధం బొనర్చుట.

చ. రణమున నుగ్రసాయకపరంపర భానుకులం బరామల
క్ష్మణము జగం బవానరము గా విలునేర్పును మద్భుజావిజృం
భణమును జూపి తండ్రిమదిఁ బట్టినచింతఁ దొలంగఁబెట్టి శూ
ర్పణఖకు నట్లు పాటిలినబన్నము నీఁగుదు నేఁ డవశ్యమున్. 543

క. అనుచు నలక్షితరథుఁడై, ఘనమార్గంబునకు నెగసి కార్ముకధరుఁడై

మును మిడి రజనీచరవాహిని గూల్చుచు నున్నయన్న § రేంద్రులఁ గనియెన్.

క. కని మాయావిద్యాబలమున నీరంధ్రముగ మేఘ § ములు నీహారం
బు నొనర్చి మున్ను గవిసిన పెనుఁజీకటి దళము సేసి § భీకరలీలన్. 545

స్రగ్ధర. కల్పాంతామోఘమేఘా § క్రమణ మలవడన్ § గాఢనిర్ఘాతభీతిం
గల్పింపం జాలుకీలో § ద్గమబహుళకన § త్కాండముల్ భూరిభూభృ
త్కల్పాకారంబు లారం § గడఁగుకపివరుల్ § క్రందుగాఁ గూల శౌర్యా
కల్పుల్ సుగ్రీవముఖ్యుల్ § కరవిగతభుజా § గర్వులై యుండ నేసెన్. 546

క. ఏసి నిశాతశరంబులఁ, గౌసల్యాతనయు నొంచి § కవచం బఱువుల్
సేసి గవాక్షితవక్షుం, జేసెం దదనుజుం బ్లవంగ § సేన దలంకన్. 547

తే. అప్పు డారాఘవులు ననే § కాశుగములు, వింట నందంద పెనుమంట § లంట నిండు
తెగలు గావించి నిగిడింప § నిగిడి మగిడె, నమ్మహాబలుఁ డున్నచో § టంద లేక.

ఉ. వెండియుఁ జండకాండములు § వే కొని రావణి బాహుదండకో
దండవినిర్గతాస్త్రము లు § దగ్రగతిం బఱతేరఁ దగ్గరు
న్మండలజాతమారుతని § నాదమునిక్కడు నేసి వానిచే
ఖండములై కరం బరుదు § గా నవియుం బడ రోషదీప్తుఁడై. 549

శా. ఆస్ఫోటించి తటిల్లతోల్లసదురు § జ్యావల్లితో విల్లు ర
త్నస్ఫూర్తిన్ వెదచల్లఁ బెల్లు వరబా § ణశ్రేణు లేసెన్ వతం
సస్ఫూర్జన్నవభూరిపుంఖములు లో § కం జేయ రాముం డవా
ర్యస్ఫీతస్ఫుటవిస్ఫులింగవిసర § వ్యాపారఘోరంబుగాన్. 550

సీ. అమ్మహాశరములు § నందంద పఱతెంచు, కాండముల్ నఱకుచు § [1]గఱులు గాలి
యుల్కలై రాలఁగ § నుడుమండలము దాఁకి, వంచనఁ దొలఁగురా § వణికిఁ దప్పి
చని మింటిమీఁదికి § సకలభూతములును, భయ మందఁ దిరుగుడు § వడి నిశాట
సైన్యంబుపైఁ బడి § చతురంగములఁ గూల్చ, వెన హతశేషులు § విఱిగి పాఱి
లంక సొచ్చిరి దానికిఁ § గింక వొడమి, తఱిమి యమ్మేఘనాదుండు § తఱుచుటంప
సోన గావించి వానర § సేన నెల్ల, ముంచి మాయాబలంబున § మించి మఱియు.

చ. ఒకదెస నార్చు నవ్వుఁ జను § నొక్కదెసం దనుఁ జెప్పు నప్డయొం
డొకదెస శింజినీధ్వని మ § హోగ్రముగా నెసఁగించు మించు సా
యకతతు లింతలోపలన § యంతల నింతల నొక్కపెల్లుగా
నొకదెస నేయు ఘోరకులి § శోద్ధతపాతము దోఁపఁ బైపయిన్. 552

వ. అప్పుడు కపులు గల్పావసానసమయసంభూతజీమూతనిరంతరవారిధారాడంబరంబున నంబరంబుమ్రోయందొరఁగుశరంబులఁ గుప్పలుగొనంగూలువారును మార్గణమార్గం బలక్షితంబైనఁ జేయునది లేక యొండొరుమఱుఁగున నొదుఁగువారును

1 ‹ గరులు గాఁడి యుల్కలు.

వనర్గళనిర్ఘాతవేగంబునం బడునాయతసాయకంబుల నొక్కొక్కటం బలువురు గుదులుగ్రుచ్చిన ట్లుండ నిల నొఱగువారును గీలాకరాళంబు లై కవియుకంకపత్రంబులకుం గాక మాతంగతురంగకళేబరంబులు ముసుంగుకొనం దిగుచువారును నిశితనారాచంబులు శిరోమధ్యంబునం బడి యఱకాల వెడలి నేలం గీలుకొన్న నిలువునన గతాసు లగువారును మొదలం గదనంబునకుం దెచ్చుకొన్నమహాచలశృంగాదులు బలువిడిం బడుబాణజాలంబులకు మఱువుగా నొడ్డువారును వివిధవిశిఖాసారంబు ఘోరంబుగా నంతకంతకుం దఱిమిన వెఱచఱిచి విఱిగి పడినయరదంబులక్రిందు లీఁగువారును నమోఘపాతంబు లగునాశుగంబులు నిగుడ మున్నెఱుంగునిక్కలకుం గాలికొలందులం జని గిరిగహ్వరంబులు సొచ్చువారును నాభీలవాలవిక్షేపంబులం బుంఖానుపుంఖంబు లై కూలుకోలలం దూలంజదియువారును ముఖకమలంబులు ముంపకుండ నఖండకాండప్రవాహంబులకుం గాలదండప్రచండంబు లగునుద్దండభుజాదండంబులు సేతువులుగా నమర్చువారును నిత్తఱిం దరణి పొడసూపిన బిసనాళనాళీకంబు లుపాయనం బిత్తు మనుటకుం దగి శిలీముఖోన్ముఖంబు లగుపాణితలంబు లాపుంఖస్యూతంబు లై మెఱయ మెఱయువారును దరువులు మస్తకోపరిభాగంబునం ద్రిప్పుచుం గరకాపరంపరలతఱుచునం బడు నిముపుల పెల్లడంచువారును నంపజడి కోర్చి ధైర్యం బవలంబించి నిశ్చలు లై యుండువారును నింగికి లంఘించి నడుమన మెఱుంగుములుకు లవయవంబు లందుఁ గొన్న సుడివడుచు మగుడం బుడమిం బడువారును మఱియు ననేకప్రకారంబులం జిచ్చు లుమియుచు వచ్చునంపపరంపరలకుం గాక తిరుగుడువడువారును నై రయ్యవసరంబున. 553

తే. దాశరథులు భల్లార్ధచంద్రాశుగములు, పఱపిపఱపిరక్కసుఁ జేయు బాణతతుల
నఱికి వైచుచుఁ దారు వానరబలంబు, నోపినట్లు రక్షించుచు నుండి రపుడు.

వ. ఆసమయంబున సుమిత్రాపుత్త్రుండు. 555

సీ. ముందట వనచరు లందంద ప్రోవు లై, పడుచున్నదారుణభంగి సూచి
తెఱనికోపాగ్ని యాఱక పొగులుచి, త్తమునందుఁ బృథువిషాదంబు వొడమ
మనుజేంద్ర చూచితే మనకొఱకై వచ్చి, వీ రిట్లు జడిగొన్నవిశిఖవృష్టి
శోణితంబున రణక్షోణిఁ దెప్పలుగట్టి, యూరక కూలుచు నున్నవారు
మహితచాపదండసహితుఁ డై యీగతి, నెసఁగునితని నిప్పు డెవ్విధమున
గెలుచువెరవు మనకుఁ గలుగ దిమ్మాయకుఁ, బ్రతివిధాన మెఱుఁగఁ బడదు గాన.

శా. బ్రహ్మం బే యని చూడ వీఁడు కుహనాపారీణుఁ డేదిక్కునన్
బ్రహ్మాండంబున డాఁగినాఁడొ తెలియన్ రా దింక నీలంకకై
బ్రహ్మాస్త్రం బడరించి పించ మడఁతున్ రాత్రించరశ్రేణి నా
బ్రహ్మాదుల్ వెనుకైన నే నని సుమిత్రానందనుం డన్నతోన్. 557

చ. పలికిన నానరేంద్రుఁ డనుఁ బార్థివపుత్ర యొకండు సేసినం
బలువురమీఁద నింత దలఁపం దగ దట్టులు గాక నిద్రమై
నొలసియుఁ దమ్ము నేమఱియు నున్నెడ వధ్యులె శస్త్రపాణులై
నిలువనివారిఁ జంపఁ దగునే రణధర్మము నీ వెఱుంగవే. 558

క. సమయము గాదిది బ్రహ్మా, స్త్రమునకు మన మిప్పు డన్నిశాచరు మాయా
తిమిరతిరోహితు నారసి, సమయింపం జాలునద్రిచరయూథపులన్. 559

వ. పనుచునది కార్యం బనుచు నతని వారించి ఋషభశరభాంజనేయగజగవయ
గవాక్షద్వివిదనీలాంగదసానుప్రస్థు లనువారిం జూచి మీరు వీని వధియించి రం
డని నియోగించిన. 560

ఉ. వారును దిక్కు లొక్క మొగి వ్రయ్యఁగ నార్చుచు మీఁది కేఁగి వీఁ
డారయఁ దారకాగ్రహసమాకృతిఁ గైకొనినాఁడొ సర్వసం
హారము సేయ వీఁ డొకరుఁ డయ్యెనొ కాకనునంతలోనఁ ద
ద్ఘోరశరాళిచేత ధరఁ గూలి రతండుఁ జెలంగి వెండియున్. 561

—ఇంద్రజిత్తు నాగపాశములచేత రామలక్ష్మణుల బంధించుట.—

క. నాలుకలు గ్రోయునుగ్ర, వ్యాళశిలీముఖము లొక్కవరుస నభోభూ
గోళాంతరాళము విష, జ్వాలాభీలముగ నేయ జవమున నవియున్. 562

మ. కలయం బూచినకింశుకంబులగతిన్ గాత్రంబు లస్త్రక్షతం
బులఁ జెన్నారుచు నున్నదాశరథులన్ ఫూత్కారఘోరంబుగా
గళబాహాగ్రగళమధ్యమోరుయుగజంఘాకాండకాండాసనం
బుల నంటం బెనఁగొంచు దుస్సహదశం బొందించి బంధించినన్. 563

క. తెగ డందిరి సుర లప్పుడు, జగతీస్థలి మేను వైచి సౌమిత్రి యెటుం
దెగనిరణశ్రాంతిం గను, మొగిచెనొకో నాఁగ బెట్టు మూర్ఛం జెందెన్. 564

ఉ. మున్నరగాస్త్రనిగ్రహము ముట్టియుఁ గొండొకధైర్యమాత్ర గా
నున్ననరేంద్రుఁడున్ మఱపు నొందినతమ్మునిఁ జూచి యేగతిం
బన్నగబంధమోక్షమును పాయ మెఱుంగక వెచ్చ నూర్చుచుం
గన్నులబాష్పగుచ్ఛములుఁ గ్రమ్మఁగఁ గ్రమ్మఱ మూర్ఛవచ్చినన్. 565

క. ఇల నొఱగె నట్లు భుజగం, బులు పెనఁగొన రాముఁ డాదిపురుషుం డయ్యున్
బలి మును బంధించినయా, ఫల మొకమైఁ గుడువ కేల పాయు ననంగన్. 566

వ. అంత సుగ్రీవసుషేణహనుమద్ద్వివిదనీలాంగదసుముఖప్రముఖు లధికసంభ్రమం
బులం బఱతెంచి వారిం జూచి శోకింప విభీషణుండు బోధించుచుండె నింద్రజిత్తుం
డును రాఘవులు దనచేతం దెగినవారకా నిశ్చయించి గర్జిల్లుచు లంకకుం జని
రావణుం గనుంగొని. 567

మ. రణరంగంబున నేఁడు నాదుభుజదర్పం బొప్ప నుద్యద్ధను

ర్గుణనిర్ఘోషజడీకృతశ్రవణమున్ రోదోంతరాకీర్ణమా
ర్గణవర్షంబుఁ బతత్ప్లవంగబలముం గా నేచి యా రామల
క్ష్మణులం జంపితి నాగపాశములఁ జిక్కం గట్టి లంకేశ్వరా. 568

క. అనవుడు సంతోషంబున, విని నందను గారవించి వీడ్కొల్పుటయుం
దనమందిరమునకు జయధ్వను లులియఁగ నేఁగె సమ్మదంబున నతఁడున్.

శా. అంతం బంక్తిముఖుండు నున్మదమనోజావస్థచేఁ దూలుచుం
జింతింపం దొడఁగెన్ మహీసుత పతిస్నేహార్తయై చచ్చునో
కాంతాచేష్టిత మింద్రజాలము ననుం గైకొన్న భోగేచ్ఛమై
నంతర్వృత్తి మెఱుంగ రా దనుచు నూహాపోహలోలాత్ముఁడై. 570

వ. ఇట్లు చింతించి. 571

సీ. త్రిజట రప్పించి యత్తెఱవతో నిట్లను, నీల్గిరి రాఘవు లింద్రజిత్తు
చేత నేఁ డీవార్త చెప్పి తోడ్కొనిపోయి, వసుమతీతనయకు వారిఁ జూపి
చిరకాలపరిచితస్నేహంబు మోహంబు, సేసెనేనియుఁ దేర్చి చెలిమిఁ గలసి
నిక్కంబులై తోఁచు నెయ్యంపుఁజెయ్వులు, నుపచారములుఁ బతుకులున్నయపుడ
కాని వెనుకఁ జేఁత కాంతారచంద్రిక, భోగములకె కాదె పుట్టినారు
నెలఁత లట్లు గాన నీ వింక నిలంక, యేలురాతుసేంద్రు నేలు మనుము. 572

వ. అని పలుక నన్నిశాచరియు నశోకవనంబునకుం జని వైదేహిఁ గత్తెఱం గెఱిం
గించిన. 573

క. [1]దిగులుపడి బిట్టు డెందము, పగులం బడి మూర్ఛ నొంది ప్రాణము లొడలం
దెగినట్లు నేలఁ బడి య, మ్మగువయు నొకవడికి మూర్ఛ మగుడం దెలిసెన్.

ఆ. డెప్పరంబు గదిరి డెందము శోకాగ్ని, సుట్టుముట్టి తాల్మి సుడివడంగ
నశ్రువారి వెలి వెల్లార్చుచందమున నం, దంద యడలు చున్నయతివఁ జూచి.

శా. విద్యుజ్జిహ్వుఁడు మాయ వన్ని తలయున్ విల్లుం గదా చూపె నీ
యుద్యోగంబును సత్లకా వలయుఁ గాకొం డేల యా రాముఁ డా
పద్యుక్తుం డగునా విషాద ముచితంబా చూతుగా కాధను
ర్విద్యాపారగు సాయకాగ్నికణవద్విక్రాంతిపాథోనిధిన్. 576

వ. అని మఱియు ననేకవిధంబుల బోధించి దేవీ నీవు రామలక్ష్మణులం బ్రచ్ఛన్నప్రకారంబునఁ దదీయక్షేమం బరసివత్తుగాక పోదము రమ్మనుచుం బుష్పకం బెక్కించుకొని యెగసి మనోజవంబునం జని విగతమాయాజలధరజలాదికంబును దారకాగణప్రభాభాసితంబును జంద్రరేఖాతిలకితప్రథమదిశాముఖంబును నటత్కబంధబంధురంబును నగునభోభాగంబున నిలిచి కపిసైన్యంబునడుమ సుగ్రీవాంగదజాంబవదాంజనేయవిభీషణప్రముఖపరివేష్టితులును విశిఖవికీర్ణవీతకవచులు

1 దిగు లనుచు బెట్టు.

ను బతితతూణబాణాసనులును రక్తధారాధౌతధూళిధూసరితాంగులును నాగ పాశబద్ధులును విచేష్టితులు నై యున్న యన్న రేంద్రనందనులం జూపినం జూచి నిమీలితలోచన యగుచు. 577

సీ. ఉల్లంబు జల్లన నొదవుతల్లడమున, నొకమూర్ఛ గవిసిన నొయ్యఁ దెలిసి నివ్వెఱపడి తెంపున [1]నిశ్చయమున సాధ్వి, తలయూఁచి దైవంబుతెగవు మెచ్చి చిత్తంబు నాటినచెయ్వులు దలపోసి, కనుఁగొనలను నశ్రుకణము లొలుక నొగి దృష్టి కానయు నోటయుఁ బాటిలఁ, బరిణతస్నేహానుబంధ మొందఁ దెగువ మోమునఁ జేట్పాటుమిగులమతియుఁ, జూచిపాణిపంకజమునుశోకశుష్క కంఠనాళాంతరమున గద్గదిక నెగులు, గొను నెలుంగును నత్తి యజ్జనకతనయ.

—✤ నాగపాశబద్ధు లగురాఘవులం జూచి వగచుసీతను త్రిజట యూఱడించుట. ✤—

ఉ. ఓరఘునాథ పుణ్యచరితోజ్జ్వల చాపకళాకలాపశ్రీ
హారమణీయ దివ్యశరజాలపరిశ్రమశస్తహస్త నీ
వీరణశయ్యఁ గన్మొగుచు నేర్పడఁ జూచియు నున్నదాన నా
కూరిమి నూచి యిట్లు నృపకుంజర దీనికి నన్ను నేమనన్. 579

ఉ. వల్లభవీర నిట్లునవార్త సెవిం బడునంతలోన బి
ట్టుల్లము వ్రయ్యలై యొడల నుండక ప్రాణము లేఁగనేని భూ
వల్లభ కూర్మిగాక విధవాత్వము సైఁపఁగలేక చిచ్చులోఁ
[2]ద్రెళ్లుటయే యటే తగవు దీర్పక తక్కుదురే కులాంగనల్. 580

ఉ. అక్కట పత్నికోర్కికొఱకై వనభూమికిఁ బుత్తుఁ బుచ్చితిం
దెక్కలిసత్య మింతటికిఁ దెచ్చెఁ గదే నను నంచుఁ దండ్రి నీ
దిక్కునమక్కువం దనదుదేహము దక్కను గాక తాల్మిమైఁ
జిక్కను రాతిడెంద మగు సీతయటే యిఁకఁ జెప్ప నేటికిన్. 581

వ. అని శోకించి సౌమిత్రిం గనుంగొని. 582

శా. అన్నా లక్ష్మణ భ్రాతృవత్సల దురంతాయాసఖిన్నుండవ
య్యున్నిద్రారహితుండ వై యకట మున్నుగ్రాటవీభూములం
దన్నుం గొల్తు గదన్న నేఁడు రణశయ్యన్ భూవిభుం డుండఁగాఁ
గన్నాఁగం దగునయ్య నీనిదురకుం గాలం బయోధ్యం గదా. 583

చ. అనుచు విషాద మంది హృదయం బగలం బతిదిక్కు గ్రమ్మఱం
గనుఁగొని నాకునై కడలిఁ గట్టితి నాథ మహాత్మ నిగ్రహం
బనుచిత మెందు నుత్తముల కట్టిది గాదయినం బ్లవంగవా
హినులు గలంగఁ గట్టువడితే రిపుచే గుణరత్నసాగరా. 584

---

1 నిశ్చయముగ నిల్చి తలయూఁచి. 2 త్రెళ్లుదు రేయటే-త్రెళ్లుటయేయొడం-దగవు.

చ. ఇది యొకబ్రహ్మకల్ప మిటు లెన్నఁడొకో పదునాలుగేఁడులుం
దుది గను నెల్లసేమములతోఁ గొడు కెప్డొకొ వచ్చు నంచు నీ
కెదురులు సూచుచుండ దినము లెన్నుచు నాసల నున్నతల్లికిన్
హృదయకుకూలవహ్ని యగు నీదెసశోకము దీఱదే కదే. 585

సీ. నాఁడు లాక్షణికులు న న్నుపలక్షించి, యంఘ్రితలముల రేఖాంబుజంబు
లుజ్జ్వలకాంతి ని ట్టుల్లసిల్లుచు నున్కిఁ, బట్టాభిషేకంబు భర్తతోడఁ
జెలువుగా నీయింతి సేయించుకొను నిఖిలాంగకంబులు లక్షణాంచితములు
గావున సౌభాగ్యకలితయు నైదువ,యుం బుత్రిణియు నయి యొప్పు ననిరి
మద్గురులు వసిష్ఠాదులు మహితకీర్తి,యుతు లరుంధతిమొదలైన సతులు నాకు
నిచ్చుదీవనలును నట యెల్లవారి, వాక్యములుఁ దప్పెఁ జూచితే వసుమతీశ.

వ. అనుచు విలపింపం దగువాక్యంబుల శోకంబు వారింపఁ దలంచి త్రిజట యద్దేవి
నవలోకించి. 587

చ. చెలువ కనుంగొనంగ శవచిహ్నము లేమియు లేవు ప్రాణము
ల్దొలఁగిన నంగకాంతు లిటు దోఁప వనాయక మైనసైన్యము
ల్నిలువవు వారె సూరెల బలీముఖవీరులు గంటె కంటె దా
పలి దెసఁ గంటఁ జంటను శుభస్ఫురణం బదె నీకు నొప్పెడున్. 588

క. అంతియ కా దీపుష్పక, మింతీ విధవ లగువార లెక్కినఁ జన దో
క్కింతయుఁ గావున నెమ్మోయి, సంతోషము నీకు నా కసత్యము లేలా. 589

క. తేఱుదురు రిపుల నిప్పుడ, మీఱుదురును గడిఁదిమూర్ఛ మెయి ని ట్లున్నా
రాఱని తేజంబులతో, నీఱు పయిం గవిసి యున్ననిప్పులుఁబోలెన్. 590

వ. అనుచుం దగువాక్యంబుల శోకంబు వారించి మరలి యశోకారామంబునకుం
దోకొని చనియె నంత నిక్కడ రఘువీరుండు. 591

క. శోలినచిత్తము దనలో, మేలుకనం దోన తెలివి మెయికొనున ట్లు
న్మీలితనయనసరోరుహుఁ, డై లక్ష్మణుఁ జూచి దుఃఖితాత్ముం డగుచున్. 592

సీ. అకట యీయుత్తముఁడనుదినంబును నాకుఁ, బరిచర్య లొనరింపఁ బరమభక్తి
వనభూములకు జటావల్కలంబులు పూని, యేతెంచి యం దెన్ని యెక్కుడైన
దుఃఖంబులకు నోర్చి తుది వచ్చి రిపులచే, బాహుబల మ్మస్త్రబలము నడలి
విశిఖక్షతంబుల వెడలుపెన్నెత్తుటఁ, దొప్పఁదోఁగినమేను ధూళి బ్రుంగి
తూలి విన్నఁబాటి యీలంక పఱిగడ, నున్నవాఁడు సూచు చున్నవాఁడ
నేను నిట్టిదైన్య మింక నన్నేమందు, నాలిగోఱకు ననుజుఁ గోలుపడితి.

క. ప్రాణసఖుఁ డైనలక్ష్మణు, ప్రాణంబులు లేమి సీత పనియేటికి నా
ప్రాణము లేటికి నేటికి, బాణాసనదివ్యబాణభారము నాకున్. 594

చ. అకట విరోధిసన్నిధిఁ బ్రియానుజు నిట్టులు డించి యే నయో

ధ్యకు నెటు లేఁగువాఁడ నటఁ దల్లులుఁ దమ్ములు నన్నుఁ జూచి యే
మొకొ ముఖచేష్ట రెయొందుగతి నున్నది లక్ష్మణుఁ డేల రాఁడు నీ
వొకఁడవు వచ్చు టే మనిన నుత్తర మే మని యిత్తు వారికిన్. 595

ఆ. ఇనుఁడు వడిన నబ్ధు లింకిన మేరువు, పెల్లగిల్లిన నగ్ని చల్లనయిన
నేమఱదు సుమిత్ర నామీఁదివాత్సల్య, మట్టితల్లి వగలఁ బెట్టవలసె. 596

వ. అని పలికి సుగ్రీవాదులం గనుంగొని. 597

శా. ఏనా యొక్కటఁ జాపముల్ మెఱయఁగా నేపారునయ్యర్జునుం
డేనా యస్త్రము లేయునంతవడిలో నిర్వీరుఁ డాధానసం
ధానాకర్షణమోక్షణక్రమ మనిర్ధార్యంబుగా నేయఁ డో
స్తో నేనా యొకవింట నిట్టివిలుకాఁడుం జిక్కె నిం కే మనన్. 598

ఉ. అంధున కైనచంద్రునుదయంబు తెలుంగు సుమీ మదీయహృ
ద్బంధుఁ డితండు లేనివసుధాసుత నా కది యేల బంధని
ర్బంధము వాసినం దనువుఁ బాయుదు భానుజ సేనఁ గొంచుఁ గి
ష్కింధకు నేఁగు నాపలుకు సెల్లదు నీవును బో విభీషణా. 599

క. ఈసకలయూథనాథులు, సేసినలావునకు సంతసించితి మీరుం
బాసి చనుఁడు మము నిటుగాఁ, జేసినదైవంబు గడవఁ జెల్లునె నాకున్. 600

తే. అనుచు విలపింప నిఖలయూథాధిపతుల, యాననంబులు బాష్పధారాకులంబు
లగుచుఁ బరిభవవ్రీడమైనల్లనాలె, మంచు దొరఁగఁ గైవ్రాలుపద్మములకరణి.

వ. అప్పుడు విభీషణుండు గదాపాణియై సేనామధ్యంబునం దదీయరక్షణంబుకొఱకుఁ
జరియించుచుం దన్నుఁ జూచినదూరస్థు లింద్రజిత్తుం డనుతలంపునం బఱవ నె
లుంగెత్తి వెఱవకుం డనుచు వారి వారించుచు నయ్యోగముల నచట నచటం గ
లంగి తొలంగకుండ నుదారోక్తుల ధైర్యంబు దలకొల్పుచు రామచంద్రుసమీ
పంబునకుం జనుదెంచి సుగ్రీవుం గనుంగొని. 602

క. దొర లుత్సాహము విడుచుట, వెరవే భయశోకములకు వేళ యగునె మీ
రు రణంబున కుద్యోగిం,తురుగా కని పలుక నంగదుం డి ట్లనియెన్. 603

సీ. ఇది కార్య మగు నైన నిప్పుడు రాఘవు, లురగాస్త్రబద్ధు లై యున్నవారు
మా ర్గురసన్నిధి మన కింక నేగతి,యో వీరి నేమఱ కుండ వలయు
నీరాత్రి వేగిన నేన మీపనుపున, వెసఁ గోటతలుపులు విఱుగఁ ద్రోచి
యెవ్వరిఁ బోనీక యింద్రజిద్రావణ, సహితంబుగా నిశాచరుల నెల్లఁ
బ్రలయపవనంబు నీలాభ్రపటలిఁ దోలు, నట్లు తోలుచుఁ బీఁచంబులడఁచిపుత్తు
మత్తసామజాదులరక్తమాంసతతులు, భూతబలి యిత్తు వసుమతీపుత్రిఁ దెత్తు.

మ. అని పల్కం గపినాథుఁ డి ట్లనియెఁ దా నవ్వీరుతో వీరలం
గొని కిష్కంధకు నేఁగు నే నళమితక్రోధాగ్నిచే రావణా

దనిశాటాటవి నేర్చి రాముజయకీర్తిస్తంభమై యుండ నం
దన యీలంక విభీషణుర్గా నిలిపెదర్గా ధాత్రీసుతం దెచ్చెదన్. 605

వ. అనిన విని సుషేణుండు సుగ్రీవాదులం గనుంగొని మున్ను నేను సురాసురుల తెఱం గెఱుంగుదు సమరంబున ధనుర్విద్యావిశారదు లగుసనురులు సురల నిట్ల బాణపాశంబుల బంధించినయప్పుడు నొచ్చినవారి సురగురుండు దివ్యౌషధమంత్రంబుల రక్షించుచుండు మనకుం దదాచరణంబ శరణంబు దుగ్ధసముద్రంబునుత్తరభాగంబునం జంద్రద్రోణపర్వతంబులు గల వందు విశల్యాసావర్ణ్యసంధానసంజీవకరణులు గల వయ్యౌషధంబులు దేర హనుమంతుండు సమర్థుం డితని నప్పనికిం బనుచునది కార్యం బనుచు నందఱు విచారించుసమయంబున నంత వృత్తాంతంబు నంతర్గతంబునం దెలిసి పరమహితోపదేశంబు సేయువాం డై మందాకినీతీరంబున నుండి దేవర్షిపుంగవుండు. 606

—❖ నారదమహాముని రామచంద్రునొద్దకు వచ్చుట. ❖—

సీ. మహనీయకాంచనమాంజీసమేత మై, జిగిం జెల్వ మగుమృగాజినముతోడం
బరిలిప్తపాండురభసితరజోధూళి,తము లైనబ్రహ్మసూత్రములు వెలయం
గరనఖచంద్రికాకలిత మై నిర్మల,స్ఫటికాక్షమాలిక ప్రజ్వరిల్లం
బుణ్యతీర్థోదకపూర్ణ మై దీప్తిమం,డలిం బొల్చుమణికమండలువు వెలుంగం
బల్లజడలకెంపు బాలార్కరుచి పెంపుం, గడవ రామచంద్రుకడకు వచ్చె
రమ్యకాంతిజితశరన్నీరదుండు వీ, ణావిశారదుండు నారదుండు. 607

క. వచ్చినతనుం గపిపుంగవు, లచ్చెరువడి చూడ నమ్మహాపదకు మదిర్గా
నొచ్చుచుం బ్రదక్షిణముగా, వచ్చి నిలిచి యన్నరేంద్రవర్యునితోడన్. 608

శా. దేవా దేవహితంబు గా నజుండు ప్రార్థింపం గృపాశాలి వై
యావిష్ణుండవు పొందినాండవు మనుష్యత్వంబు సామాన్యున
ట్లీ వీదుర్దశం దూలు టేమి మహిమం బిట్లుండ సర్వాత్ముని
ర్భావింపం దగుం గాక నీకుం దగునే బంధవ్యథం జేర్పడన్. 609

వ. అని మఱియుం దదీయం బైనమహామహిమం బెఱింగించువాం డై యి ట్లనియె.

సీ. ఎవ్వనిపొక్కిట నీరేడుజగములు, పన్నినవిధుం గన్నపద్మ మలరు
నెవ్వనియురమున నిందిరసవతి యై, చిరలీలం గౌస్తుభశ్రీ వెలుంగు
నెవ్వనిచేతుల హేతు లారంగ గదా,కరవాలశంఖచక్రములు మెఱయు
నెవ్వనియంఘ్రి ము న్నిడిపాపములం బాపు,గంగ పుట్టినపుణ్యకథలం బొల్చు
నట్టిపరమపురుషుం డై ననారాయణుం, బుండరీకనయను భుజగశయనుం
జిన్మయాత్ము హరి హృషీకేశుం గేశవు, నిను భజింతు రఖిలమునులు సురలు.

క. నీకంటెం బరముం డెవ్వడు, లోకంబుల లేఁడు రామ లోకత్రయర
క్షాకరణనిపుణ శాశ్వత, వైకుంఠ సమస్తవేదవాదాతీతా. 612

క. మధుకైటభసూదన ధర, ణి ధరింప ననంతమూర్తి నెగడుదు దుగ్ధాం
బుధిఁ బవ్వళింతు వసియిం, తధికతపోనిష్ఠ బదరికాశ్రమభూమిన్. 613

క. మచ్ఛమయి సోమకుఁడు మును, ముచ్చిలి వేదములు గొనుచు మున్నీరు సొరం
జొచ్చి పరిమార్చి మగుడఁగ, నచ్చదువులు దెచ్చినాఁడ వచ్యుత లీలన్. 614

తే. విశ్వవిశ్వంభరాచక్రవిపులభరము, గిరులఁ గరులు శేషుండును గ్రింద నిలిచి
తాల్ప నీవు సర్వమున కాధారమగుచుఁ, గమఠమైయున్నవాఁడవు కమలనాథ.

క. అనుపమవరాహమూర్తిం, దనరి హిరణ్యాక్షుఁ దునిమి దంష్ట్రాశిఖరం
బున ధరణీచక్రము నె, త్తినవాఁడవు నీవ కావె దివ్యచరిత్రా. 616

సీ. దీర్ఘకరాళోగ్రతీవ్రదంష్ట్రారుచుల్, దిగ్దంతిదంతదీధితులఁ గ్రమ్మ
వివృతఘోరాననవివరంబు రోదసీ, కుహరాంతరాళంబుఁ గొలఁది సూపఁ
జండాట్టహాసంపుఁజప్పుడు సాగర, మేదురధ్వానంబు మ్రింగికొనఁగ
నిప్పులు వడి రాలునిష్ఠురాలోకన, మినమండలస్ఫూర్తి నినుమడింప
ఘనసటోద్ధూతవాతూలఘట్టనమునఁ, బర్వతావళి దూలఁ గంబమున వెడలి
రభసగతి గిట్టి పట్టి హిరణ్యకశిపు, మున్ను చీరిననరసింహమూర్తి వీవ.

క. జనవర వామనరూపము, గొని యదితికిఁ బుట్టి యింద్రుకొఱకై బలిబం
ధన మొనరించి త్రివిక్రముఁ, డనఁగా నుతికెక్కినాఁడ వాదియుగమునన్.

తే. కరసహస్రంబు దునుమాడి కార్తవీర్యుఁ, జంపి ముయ్యేడువరుసలసకలనృపులఁ
జమరి మఖవేళ నేల కశ్యపున కిచ్చి, ముదము నొందినపరశురాముఁడవు నీవ.

క. సగరతనూజుల భస్మం, బుగ నఱువదివేవురం దపోధనముఖ్యుం
డగుకపిలుఁడవై పలికిన, ఖగరాజధ్వజుఁడ వీవ కావే దేవా. 620

ఉ. మూఁడుగుణంబులన్ వరుస మూర్తులు మూఁడు ధరించి లోకముల్
మూఁడు రచింపఁ బెంప లయముం బొరయింపఁగఁ జాలుదేవుఁ డ
న్వాఁడవు నీవ నీవ సురవర్గముఁ బ్రోవఁ బురందరుండవై
నాఁడవు నీవ ధర్ముఁడవనం బితృవర్గము నేలువాఁడవున్. 621

సీ. గగనంబు శిరమును గాయత్రి శిఖఁ జంద్ర, దివసేంద్రు లక్షుల దిశలు చెవుల
నజుఁడు ఫాలంబును నగ్ని మోమునుఁ దొలి, చదువు లూర్పుల సరస్వతి రసజ్ఞఁ
ద్రిదివంబు గళమును దివిజులు భుజములఁ, బ్రణవ మక్కును సరిత్పతులు గుక్షి
నశ్వులు జంఘల నవని యంఘ్రుల మునుల్, రోమాళి మిత్రావరుణులు దొడల
ధర్ముఁ డుల్లమును సదాగతి బలమును, నాశ్రయించి యుండ నఖిలమయుఁడ
వై వెలుంగు దీవు నీవు గానిది లేదు, భూతసృష్టియందు భువనభరిత. 622

చ. అనుపమ మిట్లు నీమహిమ మంతయు నింకటు గాన నీదువా
హన మగు వైనతేయుని మహాబలశాలిఁ దలంపు మొందు న
య్యనఘుఁడు దుర్నివారగతి వై విలసిల్లు నతండు దక్కన

న్యూనకు నశక్య మీఘనత§రోరగబంధము మాన్ప రాఘవా. 623

వ. అని యిట్లు బంధమోచనోపాయం బుపదేశించి యాశీర్వదించుచు నమ్మహాను
భావుం డంతర్హితుం డయ్యె నంత రఘువరుండును దనదివ్యజ్ఞానంబున భావించి
సుపర్ణుం గలంచిన దుగ్ధసముద్రంబునుత్తరంబుననుండి. 624

—గరుత్మంతుఁడు రామునిసన్నిధికి వచ్చుట.—

సీ. కుప్పించునురవడిఁ § గుంభిని వడఁ గ్రుంగి, సర్వాధిపతితలల్ § సదియ నదుమఁ
నెగయునూఁకున మీఁది § కెత్తిపాటినతరు,శ్రేణులు చుక్కలఁ § జెదర నడుప
నెఱకలు జాడించు§నేపునఁ గడలెత్తి, యేడువారాసులు § నెడము లొత్తఁ
బఱచుబల్వడి నభ్ర§పంక్తులు సుడిగొంచు,వలయంపుఁగొండ యు§వ్వీలికిఁదూలఁ
బర్వతములు వడఁక § బ్రహ్మాండకోటర, మద్రువ గగనవీథి § నరుగుదెంచె
రఘుకులేంద్రబంధ§విఘటనత్వరితాంత,రంగుఁ డగుచు నవ్విహంగవిభుఁడు.

క. అప్పుడు గరుడునిఱెక్కల,చప్పుడు దూరమున నెఱిఁగి § సైరింపఁగ లే
కప్పనలు విడిచి రాఘవు, లొప్పఁగ భుజగంబు లొక్క§యురవడిఁ బఱచెన్.

వ. ఇట్లు బంధమోచనంబు సేయుచు నతండు దన్నుఁ బ్లవంగపుంగవు లచ్చెరువంది
కనుంగొనఁ బ్రభాభాసురం బగునంగంబు వెలుంగ నవనీతలంబున కవతరించి
యన్నరేంద్రనందనుల నభివందనపూర్వకంబుగాఁ గదిసి గరుడంచలంబున నంగ
సమ్మార్జనంబు సేయుచు గారవించిన. 627

క. అప్పుడు బాణక్షతములు, గప్పి శరీరములు తొంటి§కంటెను గాంతిం
జెప్ప బలోత్సాహముతో, నొప్పారుచు నవ్విహంగ§మోత్తముతోడన్. 628

క. భూవల్లభుఁ డిట్లను మము, నీ వీయాపదకుఁ బాపి § నేర్పార సుహృ
ద్భావం బిటు గావించితి, గావున దశరథుని రఘువుఁ § గా నినుఁ దలఁతున్.

ఉ. నావుడు వైనతేయుఁడు మ§నంబున సంతస మంది దేవ యో
దేవరబంట రావణు వ§ధించెదు నీవు సమస్తదేవభూ
దేవహితార్థ మిట్లరుగు§దెంచితి గాన జయం బవశ్యమున్
గావుత మంచు నెయ్య మెస§గం దగ వీడ్కొని యేఁగె నయ్యెడన్. 630

సీ. తరుశిలాపాణులై § తరుచరవీరులు, సింహనాదంబులు § సెలఁగ సమర
కేళికి లంకవా§కిళ్లకు వడిఁ బాఱ, రావణుఁ డమ్మహా§రావమునకు
మది విస్మయం బంది§మంత్రుల రప్పించి, యదె వింటిరే దిక్కు § లద్రువ నచటఁ
గపు లార్చుచున్నారు § గ్రమ్మఱ నిది యేమి, చిత్రమొ వా రింద్ర§జిత్తుచేతఁ
దెగినవార్త మనము § తెల్లంబుగా విన్న,వార మనుచు నికట§వర్తు లయిన
వారి నంతఁదెలియఁగు § నారసి రాఁ బంచె, నుదయశిఖరి నినుఁడు § నొప్పె నపుడు.

క. వెసఁ జని వారును బురవ,ప్రసమారోహణము సేసి § రాఘవులసము
ల్లసితస్థితియును సుగ్రీ,వసురక్షిత మగుచు నొప్పు§వనచరబలమున్. 632

క. చూచి చనుదెంచి యారజ,నీచరపతితోడఁ జెప్ప నిర్వ్యాజపడి లో
నేచినవంతం బొరలుచు, నీచందము దాశరథుల కెట్లొకొ కలిగెన్. . 633

క. కడిమి మెఱయ మేఘనాదుఁడు, కడఁ దిభుజంగాశుగములఁ గట్టినకట్టుల్
వడి వైనతేయుకై వడి, నెడలించినయట్టివీరు లెవ్వీరుండో. 634

—ధూమ్రాక్షునియుద్ధము.—

వ. అనుచు నతండు కుపితమానసుండై ధూమ్రాక్షుం గనుంగొని నీవు సమస్తసేనా సహితంబుగా సమరంబున కరుగు మనిన నన్నిశాచరుండు మ్రొక్కుచు నాస్థానంబు వెడలి నిజనియోగంబున బలాధ్యక్షులు మత్తమాతంగతురంగాదులం గైకొని వచ్చి కెలంకు లలంకరింప నప్పుడు తోమరపరశుపట్టిసప్రాసాయసదండ భిండివాలశూలభల్లప్రముఖప్రహరణంబులు గీలాభీలంబు లగుచుండఁ బ్రళయమేఘాడంబరంబుగతి గర్జిల్లుచు రక్షోనాయకులు నడవ వృకసింహముఖంబు లయిన వేసడంబులం బూన్చినయొక్క పసిండితేరిపైఁ బొలిచి హేషితబృంహిత ప్రభృతిశబ్దసంకులంబును భూషణమణికిరణపరిభూతబాలాతపంబును భూసముద్ధూతధూళిధూసరితదిశాముఖంబును గరికలభదానఫేనిలవేలాపంకిలప్రదేశంబును సాతపత్రచ్ఛన్ననభోభాగంబు నగుచు నుండం బ్రచండగతిం జనునప్పు డెడ నెడఁ గంకకాకగృధ్రంబు లుపరితలంబునం దిరుగ నులూకంబులు సిడంబుల నూఁకువలుగొన గొడుగులమీఁదఁ బెనుమొయిల్లు నెత్తురు సినుక మింటనుండి యొక్క కబంధంబు పురోభూమిం బడ నిట్లు దుర్నిమిత్తంబు లనేకంబులు గని యుం దలంకక లంకాపురగోపురంబు వెడలి నడచె నప్పుడు. 635

క. ఉభయబలంబులు నార్చ్చ,ర్యభయంబులు చేయ నార్పు లడర యుగాంత
క్షుభితార్ణవములవిధమున, రభసంబుగఁ దాఁకి రపుడు రాత్రించరులున్. 636

ఆ. వృక్షచరులు [1]వారి వివిధాయుధంబుల,చేతఁ జాల నొచ్చి శిలలఁ దరుల
సంగరాంగణంబు సమతలంబై యుండ, నలుకఁ గూల్చి రందు నందు మఱియు.

చ. రథముల నేమిమోఁతల ధరావలయం బద్రువంగఁ దోలుసా
రథులతలంపు లెట్లటుల రథ్యము లోజకు వచ్చి మెచ్చఁగా
రథులు గడంగ వానరులు మ్రందియు వానరు లేపు చూప నా
రథములు సారథుల్ రథులు రథ్యములుం రణవీథి మ్రగ్గియున్. 638

ఉ. మావఁతు లోలి డీకొలుప మత్తగజంబులు పోవుప్రోవులం
బ్రోవులుగట్టుచుం గపులు బొందులు గ్రందుగ జోదు లేయున
స్త్రావళిఁ దూలియుం గపు లుదగ్రబలోద్ధతి విక్రమింప నా
మావఁతులుం గజంబులును మ్రందఁగ జోదులు తోన కూలియున్. 639

చ. తురగారోహకు లెక్కుడుంగడఁకమై దోస్స్తంభశుంభద్గదా

---

1 బొరి వివిధా...నలుకఁ గూల్చి రంగు హరులు మఱియు.

కరవాలాదులఁ గ్రొమ్మెఱుంగు లెగయంగా వీఁకఁ బెన్మ్రాఁకలం
దెరలం జేయఁగ మర్కటాంగములు పృథ్విం బెల్లుగాఁ ద్రెళ్లియున్
వరుసన్ మర్కటు లోలిఁ ద్రోలఁ దురగవ్రాతంబుతో దొర్లియున్. 640

చ. తమతమపేళ్లు సెప్పుచు నదల్పులతో నిరువాఁగువారు ను
ద్దమగతి నిట్లు పెన్గదలతండము లాయుధశైలశృంగసం
ఘములు పరస్పరాహతులఁ గ్రుంగఁగ మేనులు ద్రెస్సి వ్రస్సి తు
త్తుము రయి రక్తపూరములఁ దోఁగి ధరం బడఁ బోరుచున్నెడన్. 641

క. తనబలము విఱిగి పాఱుటఁ, గనుఁగొని ధూమ్రాక్షుఁ డలుక గంభీరఘన
ధ్వని దట్టించుచు రెట్టించిన తెంపారం బ్లవంగసేనలఁ దాఁకెన్. 642

క. తాఁకి వివిధాయుధంబుల,మూఁకలపెల్లడఁచి ధనువు మ్రోయించుచు బ
ల్వీఁకం బటుశరజాలం, బాఁకగొనక పఱపె భూనభోంతర మద్రువన్. 643

చ. వడి నవి మేను లొక్కమొగిఁ వ్రచ్చుచుఁ ద్రుంచుచు నుచ్చిపాఱుచుం
దొడలు మెడల్ దలల్ బరులుఁ దోఁకలు బాహులు బాహుమధ్యము
ల్నడుములు జంఘ లంఘ్రులు లలాటము లంసము లాననంబు లే
ర్పడక పడం బ్లవంగభటపంక్తులఁ గూల్చి తెరల్పఁ జొచ్చినన్. 644

శా. ఆమ్రం బొక్కటి పూని మారుతసుతుం డంకించి వీఁకన్ సమి
త్సామ్రాజ్యోచితజైత్రఘోష మమరం జండాట్టహాసంబుతో
ధూమ్రాక్షుం గని వైచె వైచుటయు నద్దోషాచరుం డల్క నా
తామ్రాక్షుం డయి దానిఁ ద్రుంచె నడుమం దోదాల భల్లంబులన్. 645

ఉ. అక్కపిపుంగవుం [1]డొకమహాగిరిశృంగము వైచె వైవఁగా
నొక్కటఁ దేరు సూతుఁడును యుగ్యములుం బడి నుగ్గు గాఁగ న
ట్లుక్కఱి విల్లు వైచి యతఁ డుర్వికి దాఁటఁగ వృక్షపాణియై
రక్కసులన్ వడిం దలలు వ్రక్కలు వాఱఁగ వ్రేసి చంపుచున్. 646

సీ. దారుణగతిఁ బొల్చి తనచేత మున్నట్లు, విపులశిలాహతి విరథుఁ డయ్యుఁ
గడిమిమైఁ దనభద్రకటకంబు లొప్పఁచేఁ, బెనుగద మణిమయస్ఫీతవలయ
దీప్తులు సుడివడఁ ద్రిప్పుచుఁ బఱతెంచి, యార్చుచు వైచిన నది ప్రకోష్ఠ
నిష్ఠురహతిఁ బోక నెత్తిపైఁ బడి తుముఱై, పోవ శిర మొగ్గి యట్టు లలుక
భుజయుగోత్పాటితాచలభూరిశిఖర,పాతమున వాని నిర్గతప్రాణుఁ జేసి
సింహనాదంబు చేసె దిక్సింధురముల, చెవులు వగుల నవ్వానరసింహుఁ డపుడు.

వ. అట్లక్షాంతకుచేత ధూమ్రాక్షుండు వడిన హతశేషు లయినదోషాచరులు గవు
లు వెనుదగులఁ గనుకనిం బాఱి లంక సొచ్చి రంత నంతవృత్తాంతంబు విని రావ
ణుండు క్రోధమూర్ఛితుం డగుచుఁ గొండొకసేపునకుం బ్రహస్తుం గనుంగొని

1 డొకమహాశిలఁ గ్రమ్మఱ వైచె.

నీ వకంపను సేనానాయకుం జేసి పనువు మతండు నమరప్రియుండు నస్త్రవిద్యా
విశారదుండు నతిధీరుండు దళంబుల నడపింపను మోహారంబు దీర్పను బొడువ
నొడువంగ డువెరవు గలవాఁడు నదియ కాదు మదీయజయంబు గోరుచుండు
వానరబలంబులం బరిమార్చి రామలక్ష్మణసుగ్రీవుల గెలుచు నవశ్యంబు నని
పలికిన నతండు నట్లు పనుపఁ గైసేసికొని వివిధాయుధభరితంబును బతాకాభిశోభి
తంబును నగునొక్కమహారథం బెక్కి చతురంగబలసమేతుండై దుర్నిమిత్తంబులు
పెక్కులు గనియును జలింపక గడిమిఁ గడంగి. 648

—అకంపనునియుద్ధము.—

సీ. అందంద మొరయుతూర్యాదిశబ్దములకు, సంభ్రమద్గ్రాహమై జలధి గలఁగ
మెఱయుకైదువులక్రొమ్మెఱుఁగులతాఁకున, నుష్ణదీధితిదీప్తి లోహటింప
బలభరంబునఁ గ్రుంగఁబడునుర్వి మోఁతకు, ఘనులాదికూర్మంబు పడఁకుఁ దూఱ
నెరయు పెంధూళికి నింగి నిండినవేల్పు, తెఱవలు మునుఁగులు దిగిచికొనఁగఁ
దొడినకంకటములఁ దొడవుల విలసిల్లు, మణులఘృణుల దెసలమూఁగు విఱియఁ
గెరలి నడచె నిట్లు కృతనిలింపాధిప, కంపనుండు నగు నకంపనుండు. 649

క. నడచి మొనచేయ నాయిత, పడి విడువిడు మనుచు నున్న ప్లవగబలంబుల్
వడిఁ గదియ రెండుమొనలకుఁ, గడునచ్చెరు వయిన క్రందు కయ్యం బయ్యెన్.

ఉ. అప్పుడు దిక్కులొక్కమొగి నార్పుల ప్రయ్య ధరాపరాగము
లప్పటనైనచీఁకటి దళంబయి చూడ్కులు గప్పఁ గందువ
లప్పుచు శాతహేతిరుచులెల్ వెడద్రోచిన డాసి వ్రేసి తేల్
జెప్పుచు నేను దా ననక చేరిన నెవ్వరినైనఁ జంపుచున్. 651

ఉ. రోదసి వెల్లిగా శరగరుత్పతనాహతిఁ దూలి నెత్తుట
న్మేదిని దోఁగి మట్టువడి నెట్టన ధూళి యడంగఁగా శిలా
పాదపపాతముల్ బెరయ బాణముఖాయుధఘోరవృష్టిఁ గ్ర
వ్యాదబలీముఖుల్ గురిసి రాజితలంబు సమస్థలంబుగన్. 652

వ. ఇట్లుభయబలంబులవారును భుజాసంరంభవిజృంభణంబు లంతకంతకు నద్భుతా
వకాశంబు లగుచుండం బ్రచండగతిం బోరుచున్నసమయంబున. 653

క. కుముదాంజనేయమైందులు, ద్రుమములు గొని గముల కుఱికి దోషాచరసై
న్యము వీనుఁగుఁబెంటలుగా, నమయింపఁగఁ జొచ్చి రసమసమరక్రీడన్. 654

క. వారికిఁ దోడ్పడి తక్కిన, వారుం దరుచరులుఁ గూడి వారక పోరన్
వారణరథహయపంక్తుల, వారము తనమ్రోలఁ బెల్లు వసుధం ద్రెళ్లన్. 655

ఉ. చూచి యకంపనుం డలుకసొంపునఁ గన్నులఁ గెంపు దోఁపఁగా
నేచి ధనుర్గుణంబు మొరయించుచు సూతునితోడ ని ట్లనుం
ద్రోచిరి వీఁక వానరులు దూలిరి రక్కసు లింక నీవు వే

వే చన నిమ్ము తేఁ శరవృష్టిని ముంచెద శత్రుసేనలన్. 656

సీ. అన విని కోలఁదికి నతఁడు యుగ్యంబుల, పగ్గముల్ నడలించి పట్టి నేమి
ఘట్టనంబున భూమి గంపింప వానర, బలముపై నరదంబుఁ బఱపి పెలుచ
నిగుడుచో మగుడుచో నేర్పులు మనసున, కరుదును మెచ్చుగా నతులగతుల
సారథ్య మొనరింపఁ జండకాండంబుల, గగనంబు గప్పుచుఁ గపుల విపుల
గాత్రఖండము లోలిమైఁ గలన నిండు, నట్లు గావించి కడిమిమై నతిశయిల్లెఁ
[1]దనధనుఃకలాకౌశలమునకు రజని, చరులు సంతసిల్లఁగ నన్నిశాచరుండు.

వ. ఇట్లు విజృంభించిన. 658

శా. వానిం జూచి బలీముఖుల్ పఱవఁగా వారించుచుం బోక తాఁ
బై నమ్ముల్ వడుచుండఁ గొండపగిదిం బాటింప కాలో మరు
త్సూనుం డున్నతశైలశృంగమున నాస్ఫోటించి వే వైచుదుర్
దానిం జూర్ణము సేసె వాఁడు నరు కందం బెక్కుభల్లంబులన్. 659

లయవిభాతి. మఱియు నొకమద్ది వెసఁ బెఱికికొని మేనివడి విఱిగి తరు లభ్రములఁ జఱచియటు పాఱం
బఱచి హనుమంతుఁ డెడఁ దఱుముబలుమొత్తముల కుఱికి యరదంబు లఱిముఱి ధరణిఁ ద్రెళ్లం
గలుచు రుధిరచ్ఛటలు వఱదగొనఁ గుంభములు పఱియలయి కుంజరము లొఱలుచుఁ బడం బె
ల్లఱి హరులు డొల్ల భటు లొఱఁగ రథముల్ సెదర మఱువు లఱువుల్లగుచుఁ బఱిపఱిగ మోఁదెన్. 660

తే. ఇట్లు చతురంగబలములు నేపడంగ, నయ్యకంపనుఁ డందంద యలుక వోడమి
ఘోరబాణంబు లీరేడు గొని యురంబు, గాఁడిపాఱఁగ నేసె నక్కపివరేణ్యు.

ఉ. ఏయుడు నొచ్చియైనఁ జలింపక యోటుల భగ్నశాఖమై
పోయినమద్ది వైచి యొకభూరిమహీధర మెత్తి యార్పుతోఁ
దోయదమాలికల్ దెసలఁ దూలఁగఁ ద్రిప్పుచుఁ బాఱుతెంచి య
వ్వాయుసుతుండు వ్రేసెఁ దల వ్రక్కలువాఱి పడంగ రక్కసున్. 662

ఆ. అపుడు కాందిశీకులయి నిశాచరులు వా, నరులు దోల లంక తెరువు వట్టి
తలలు వీడఁ బఱచి రిలయెల్లఁ గంపింప, నొక్కమోఁత యగుచు దిక్కు లద్రువ.

—✿ మహాకాయుండు యుద్ధమునకు వచ్చుట. ✿—

వ. ఇట్లు ధూమ్రాక్షాంతకుచేత నకంపనుండు దెగుట విని రావణుండు గనలి మహాకా
యుం జూచి నీవు సైన్యసమేతుండవై చని వనచరవధం బొనర్పు మని పనుప

1. దనధనుఃకౌశలమునకుఁ దదనుచరులు, సంతసిల్లంగ నన్నిశాచరవరుండు.
2. పడవైచుచుం జనఁగ కుంభద్విపుఁడై యామరుత్సూనుండు.

నతండు నాస్థానంబు వెడలి జవసత్త్వంబులు నెఱయం బూనినపిశాచముఖంబు
లగుతురంగంబులు వేయి మెఱయం గనత్కనకదండమండితం బగుమయూరకే
తనంబు గ్రాలం గఠోరకార్ముకప్రముఖాయుధంబులు వెలుంగ మహాబలులు చక్ర
రక్షకులై రక్షోవీరు లేవురు బలసి రా రత్నరచితకింకిణీమాలికలు మొరయ నే
మిరవభైరవంబుగాం దేరు సారథి తెచ్చిన నెక్కి పుడమి నెడములేకుండ నిండి కరి
తురగరథపదాతులు పరివేష్టింప నలరుచుం గవచధారణాదిసన్నాహంబునం
బొదలి దక్షిణద్వారంబున. 664

శా. ఘంటాకాహళశంఖదుందుభిమృదం।గధ్వానముల్ దిక్కులం
న్మింటన్ నిండి యుగాంతవాతకలనా।నిస్సీమభీమోర్మి లొం
డొంటిం దాఁకం దనర్చునర్ణవముస।త్యుగ్రంపుమ్రోతం గడు
న్మింటం బర్విననైన్యధూళి నినర।శ్మిం గప్పుచున్ వెల్వడన్. 665

సీ. నీరదంబులు వన్ని । నెత్తురు గురిసె నక్కలు సేనలోపలం । గలసి నడచెం
బోరంబోరి వాహనం।బులు మ్రొగ్గె సికతాస, మేతమై మారుత । మెదురువీచెం
బఱతెంచి గ్రద్దలు । పడగలపై వ్రాలె, నడనడం గైదువు । లెడలి పడియె
వడి లులాయంబులు । వలపలిదెస దాఁటెం, బృథివీబిలంబులం । బిల్లు లఱచె
నిట్లు మఱియు నెన్ని ।యోనియుదుర్నిమి, త్తములు గనియు వినియు । సమరకాంక్ష
వాఁడు లెక్కగొనక । వానరసేనల, నంపవాన ముంతు । ననుచుం దఱిమి.

చ. నడచి రణక్షితిం బొలిచి।నం గపిసైన్యము నార్చి త్రోచె న
ప్పు డుభయసైనికుల్ బెరసి । పోరం దొడంగిరి దోర్బలంబు లే
ర్పడం దమపేరుం బంతమును । వాడి యగల్పుచు సర్వభూతము
ల్వడంక శరాదిసాధనశి।లాతరుపాతము లార నయ్యెడన్. 667

ఉ. త్రెస్సినజంఘలుం దొడలు । దీర్ఘభుజార్గళముల్ గళంబులున్
వ్రస్సినమూఁపులుం దలలు । వక్షములున్ బరులున్ మహాస్త్రము
ల్డుస్సినకర్ణముల్ నడుము।లున్ నిటలంబులుం బ్రక్కలున్ శిరో
నిస్సరదస్రపూరములు । నిండ రణస్థలిం గూలుచుండంగన్. 668

క. కరి కరితోడం దురగము, దురగముతో రథము రథము।తోడను నక్తం
చరు నక్తంచరుతో వన, చరవీరులు వ్రేసి వ్రేసి । సమయించునెడన్. 669

ఉ. దుర్జయులై నిశాచరులు । దోర్బలసంభ్రమలీల లొప్పంగా
గర్జితఘోరమేఘముల।కైవడి నందఱు నొక్కలావునం
దర్జనముల్ చెలంగ నిప।తచ్చటులాశనినిష్ఠురాశుగ
స్ఫూర్జితవిస్ఫులింగములు । మూడ్కల కోట యొనర్ప నేయుచున్. 670

క. మఱియు గదాఖడ్గాదుల, మెఱుంగు లడర విక్రమించి । మించి తెరల్పం
బఱచిరి కపు లంగదుం డ, త్తఱి నిలునిలుం డనుచు నిలిపి । తరుచరబలమున్.

క. తలకొలుప ఋషభగజశత, వలిపనసగవాక్షపృథు లవారితబాహా
బలము నిగుడంగ మగుడం, దలకొన నత్తారకొడుకు తలకడచి వడిన్. 672

చ. వగునఁ దరుప్రహారముల వాజుల నొంచుచుఁ బడ్డ తత్కళే
బరములు నుగ్గు గాఁగ రథపంక్తుల వ్రేయుచు గుండు లెత్తి స
త్వరగతిఁ గుంభముల్ వగుల దంతుల వ్రైచుచు దంతకాండముల్
గురుసులఁ గూడి రాఁ దిగిచి ఘోరనిశాచరకోటి మోఁదుచున్. 673

క. తక్కిన వానరవీరులు, నొక్కుమ్మడిఁ గడఁగి [1]సంగరోత్సాహము పెం
పక్కజము గాఁగఁ దొడఁగిరి, రక్కసులుం బోర మత్సరంబునఁ బెనఁగన్.

ఉ. అంగదుఁ డంత నంతకసమాకృతిఁ బేర్చి శతాంగమత్తమా
తంగతురంగసంఘము లుదగ్రతరాంఘ్రిపతాడనంబులం
దుంగనగాగ్రపాతములఁ దోరపుమ్రోఁతలు సెల్లఁ ద్రెళ్ల మ్రు
గ్గం గడుఁ బెల్లు ద్రొల్ల భుజగర్వము సూపె విశృంఖలక్రియన్. 675

సీ. దంతావళోత్క్షిప్తతరులీలఁ గడకాళ్లు, వడిఁ గేలఁ గొని వీచి వైచివైచి
పక్వపతత్తాళఫలభంగిఁ గ్రుంగ మ, స్తకములు దలములఁ జఱిచిచఱిచి
గాజులపేళ్లు రోఁకలిదాఁకుగతి దోఁప, ముంజేత నంగముల్ మోఁది మోఁది
బొంది లద్దులమాడ్కిఁ బ్రోవులై పడఁ బవి, స్పర్శనిష్ఠురముష్టిఁ జదిపిచదిపి
కాలపాశసంకాశోగ్రవాలవల్లి, మెడల నురివెట్టి నేలతో నడిచి యడిచి
సానుదృఢజానుహతుల వక్షములు నలిపి, నలిపి చెలఁగున వ్వాలినందనునిఁ జూచి.

క. కైదువులు విడిచి పదహతి, మేదిని గంపింప భీతిమెయిఁ బఱచిరి క్ర
వ్యాదులు వనచరు లార్వ మ, హోదధిఁ బడ లంకసొరఁగ నొక్కయురవడిన్.

వ. అంత మహాకాయునిమంత్రులు వజ్రనాభరుధిరాశకాలదంష్ట్రకాలకల్పవపాశ శతమాయధూమ్రదుర్ధరు లనువారు ననుజుం డగుమహానాదుం డనువాఁడునుం బేరెలుంగులు సెలంగ నిశాచరుల మగుడం బురికొల్పికొని కీలాకరాళశూలంబులు మెఱయం దఱిమినం బృథుండు వజ్రనాభుని గవాక్షుండు రుధిరాశుని ఋషభుండు గాలదంష్ట్రునిఁ బనసుండు కాలకల్పుని గజుండు వపాశుని శతబలి శతమాయునిఁ గ్రోధనుండు ధూమ్రుని మేఘపుష్పుండు దుర్ధరు నంగదుండు మహానాదమహాకాయులను మఱియు మహావీరు లయినవానరులు దక్కినరక్కసులను దలపడ నుభయబలంబులుఁ బరస్పరహతులం గుసుమితకింశుకవనంబుల విడంబించుచు ఘోరప్రకారంబులఁ బోరుచుండునయ్యవసరంబున. 678

సీ. వజ్రనాభుఁడు పృథు వడి నేడుగోలల, నుదు రేసి నెఱఁకులు నూట నొంచి
తత్కరోత్క్షిప్తభూధరశృంగముల నెడఁ, బదివ్రక్కలై పడ భల్లనిహతి
నఱికినఁ జూచి యన్నగచరవీరుండు, నరదంబు నుగ్గుగా నలుక నుఱికి

1 సంగరోత్సాహంబుం దక్కక పోరఁ దొడంగిరి.

భుజదండహతిసూతుఁ బోరిగొని హయముల, మర్దించి విలుద్రుంచి మఱియువాని
కడిఁదిశూలఘాతమునకుఁ గలఁక లేక, శిరముదాటించి యన్నిశాచరునినొడిసి
కాలు వట్టి మీఁదికి నెత్తి నేలతోడ, నొడలు గుల్లలత్తిగా నుదికి చంపె.

క. మగఁటిమి రుధిరాశుఁడు బలు, దెగ గొంచును వింటిమౌర్విఁ దెసలంట భుజా
యుగళము నోనేసి గవా,క్షు గవాక్షితవక్షుఁ జేసె ఘోరాస్త్రములన్.

సీ. ఏచివెండియుఁ దరుల్ వైచిన వాఁ డవి, యమ్ములఁ దునుమాడి యతనిమూర్ఛ
వోనేసి యాతఁడు భూరిసాలము వైవ, నదియు ఖండించి ఘోరాశుగములు
పదిటను నవ్వీరుఁ బరవశుఁ గావించి, యగచరావళిఁ ద్రుంప నంతలోన
వార లిర్వురుఁ దేఱి వడి నార్చి రందు గ, వాక్షుఁడు గిరిశృంగహతి రథంబు
విఱిచి తనపాటునకుఁ దప్పనుఱికి వాఁడు, ఖడ్గపాణియై యేతెంచి కదిసి తన్ను
వ్రేయ నంకింపవక్షుంబు వ్రేసిచంపెఁ, బడినపరిఘ మొక్కటిగొని కడిమి మెఱయ.

క. ఐరావతకులజం బగు, వారణతిలకంబు నెక్కి వడి ఋషభునిపై
ఘోరగతిఁ గాలదంష్ట్రుఁడు, ధీరాటోపంబుతోడ దీకొలుపుటయున్. 681

ఉ. పట్టక మున్న పై కుఱికి పాణితలంబునఁ బూన్చి కుంభముల్
బిట్టవియంగ వ్రేసి యది బిమ్మిటితో నొకవింటిపట్టు గీ
పెట్టుచు వెన్క కేఁగఁ గెడపెం గరలుంఠితతద్విషాణసం
ఘట్టనఁ జేసి దాని మదగర్వ మడంగఁ బ్లవంగసింహుఁడున్. 682

చ. అరుదుగఁ గాలకల్పుఁడు మహాశనికల్పము లైనబాణముల్
పఱువడి నేయుచుం బనసుపై నడరం బనసుండు నార్పుతో
నరదము నుగ్గుగా నతిరయంబునఁ దాఁచి కఠోరముష్టిని
ర్భరహతి వానిఁ గూల్చె రుధిరంబులు ముక్కున నోరఁ గ్రక్కఁగన్. 683

క. అలిగి వపాశుఁడు వానర, బలములఁ బొరిగొనుచు గజుఁడు పై వైచుమహా
శిల లెడఁబడ నేయుచు న,బ్బలువీరునిఁ దోన నొంచెఁ బదిబాణములన్. 684

చ. బలువిడి నొంచి మించి పటుబాణము లేడుర ముచ్చిపాఱ నై
దళికము దూఱ నేసి నిఖిలాంగకముల్ గొన నేయ నమ్మహా
బలుఁడు సుపర్ణవేగమునఁ బాఱి నిశాచరురత్నకుండల
జ్వలితశిరంబు వే పెఱికి వైచె నభంబు సెలంగ నార్చుచున్. 685

ఆ. గజునిమీఁద [1]మత్తగజలీల శతమాయుఁ, డడర నడరెఁ బరిఘహస్తుఁ డగుచు
నతఁడుఁ బనసవృషభశతవలిప్రముఖులు, తోన తరులు గిరులుఁ బూని నడవ.

వ. అప్పు డారాక్షసుండునుం దనమాయాబలంబున శరశక్తిగదాచక్రపరిఘముసల
తోమరభిండివాలప్రముఖప్రహరణంబులం గపులసుడివడ బడలువడం జేయుచుఁ
దనమీఁద నంగదుం డనేకయూథపసహితుం డై కురియునుత్తాలసాలాదిపాదపం

---

1. మంత గజలీల...డలుక నడరె...నతఁడు...ప్రముఖులతోన మనను లగలఁ బూని కడఁగ.

బులం గత్రివాతిదూపులం దునుమాడి తోడన గవాక్షుండు గిరిశృంగంబును వృషభుండు వృక్షంబును బనసుండు గండశైలంబును గజుండు పరిఘంబును శతవలి శతాంగచక్రంబును గ్రోధనుండు తోమరంబును వైవ నవియును దెగనేసి విజృంభించుచుం బురోభాగంబున నున్నయనేకబలీముఖుల శిలీముఖంబులం బొలియించుచుండఁ గ్రోధంబునం గ్రోధనమేఘపుష్పులు ధూమ్రదుర్ధరులరథంబుల కుటికి కులిశసమస్పర్శంబు లగుకరతలంబులం దలలు వగులఁ జఱిచి చంపినం గనుంగొని ధనుర్గుణంబు మొరయించుచుఁ గోపాటోపంబున. 687

సీ. ఒక్కొక్కతూపున నొక్కట నూర్వుర, నొక్కలావున గ్రుచ్చి యొక్కమాటు
మూఁడును బదియు నమ్ములు గొని సంధించి, కోల నొక్కొక్కని గూలనేసి
యిషువు లైదైదుల నింద్రుమన్ననిఁ దొమ్మి,దింట గవాక్షుఁ బదింటఁ బృథుని
నేడిట ఋషభుని నిరుమూఁట గజు రెండు,పదులఁ బనసు గృధ్రపత్ర మైన
చండకాండ మొకట శతవలి నొప్పించి, శతసహస్రసంఖ్య లతులగతుల
సాయకములు పఱపి చంపుచుఁ గపిసేన, బాణమారుతమునఁ బాఱ నూఁదె.

క. ఆయెడఁ గొండలు గపులు పలాయనముగఁ దారకొందు కలంతయు వ్రీడం
జేయ జయో వాస్తు మృతి, ర్వా యన యూథపులు నిలిచి వైచిరి శిలలన్.

ఉ. వైవఁగ వాఁడు భల్లముల [1]వారిఁ దెరల్చి సహస్రమార్గణీ
వేవుర వీరులం గెడపి వెండియు మండుచుఁ గోల నొక్కనిం
గా వెన నెల్లయూథపులఁ గన్కని నేసి చెలంగి యొత్తె నా
శావియదంతరం బద్రువ జైత్రవిశృంఖలవృత్తి శంఖమున్. 690

క. ఉరవడి నప్పుడు పైఁబడి, పరిగొని పృథుఁ డాయుధములఁ బడగ గజుండుర్
హారుల గవాక్షుఁడుఁ బనసుం,దురథంబును సూతుఋషభుఁడుం బొలియింపన్.

సీ. శతవలి నిర్ఘాతసమముష్టి శతమాయుఁ, బెలుచ మస్తకము నొప్పింప మఱియుఁ
గ్రొవ్వాలుఁబలుకయుఁ గొనిమీఁది కెగయఁగ,నొకనిఖడ్గంబు దానొడిసికొనుచు
నెగసి [2]రాక్షసుఁడ యెం దేఁగెదు నిలుమంచుఁ దలపడి పోరుచోఁ దనదు వ్రేటు
ఖేటంబుచేఁ దప్పఁ గీశ కొమ్మని యుర,స్థలము వ్రేసిన నెడఁ దప్పఁదొలఁగి
శిరమునకుఁ జూపి దిగువ లక్షించి వ్రేయఁ
దొడలు తెగి వాఁడు గరుడునితుండనిహతిఁ
బడుమహాఫణిగతి సుడివడుచు వచ్చి
నేలఁ దలక్రిందుగాఁ బడి ధూళి బ్రుంగె. 692

వ. ఇట్లు శతమాయుండు గూలినం బ్లవంగపుంగవులు చెలంగి రక్షోబలంబుల వధియింపఁ దదీయవిజృంభణంబునకుం దనమంత్రులపాటునకు రోషవిషాదంబులు వొడమ ననుజనహాయుం డగుమహాకాయుం డింద్రచాపకల్పం బగుధనువు సారించుచు సా

1. వాని నడంచి. 2. రక్కస యొక్క తేఁగాదు.

గధిం జూచి యమోఘబాణంబుల సుగ్రీవాంజనేయప్రముఖవలీముఖులయు రాఘవులయుఁ బ్రాణంబులు గొనియెదం దేరు వోవనిమ్మని నియోగించిన వాఁడును యుగ్యంబులపగ్గంబులు వదలి యట్ల చేయ బలువిడిఁ దరుచరులు గురియుమహాపాషాణపాదపంబులు శరపరంపరల నుగ్గునేయుచుఁ గాంచనపుంఖంబులు వెలుంగ వివిధవర్ణంబులు గలుగుమయూరపత్త్రచిత్రితంబు లగుశిలీముఖంబులు నిగుడ మిడుతపరి గవియున ట్లంబరంబు నాచ్ఛాదించుచు బలువలలం బడినపులుఁగుల తెఱంగున నద్రిచరుల దైన్యంబు నొందించుచు ఘోరప్రకారంబున. 693

అంగదుండు మహాకాయుం జంపుట.

మ. భ్రమదాలాతముకై వడిం బసిఁడిచాపం బాతతాకృష్టి వే
గమునం జూడ్కికిఁ దోఁప వెండియుఁ దటిత్కల్పోరుమౌర్వీవిరా
వ ముఖండం బగుచుండ సాంద్రశరకాశవర్షంబుచేతం బతం
గము [1]లెట్టట్టయి కూల నేసెఁ గపులం గాండప్రకాండాహతిన్. 694

ఉ. అయ్యెడ వృక్షఖండనిచయంబులుఁ బర్వతకూటకోటిపె
న్వ్రయ్యలుఁ గృత్తవానరశిరశ్చరణాదులు నేమిఘట్టనం
గ్రయ్యలు గట్టి ఱయున్నరుధిరస్థలులుం బతితాస్త్రపంక్తులుం
గయ్యపునేల నుగ్రగతిఁ గానఁబడం దఱు చయ్యె నంతయున్. 695

క. వ్రేలిడ నెడ లేకుండఁగఁ, గోలలు గాత్రములఁ గాఁడి కుసుమితవాతా
స్ఫాలితరక్తాశోకాం,దోళనగతిఁ బొల్చి రసముకతో యూథపతుల్. 696

శా. వారిం జూచి ముహూర్తమాత్రము శరవ్రాతంబు సైరింపుఁడీ
మీ రే నొక్కఁడఁ బూని వీని రణభూమిం గూల్తు నాపాలివాఁ
డీరాత్రించరుఁ డంచు వాలితనయుం డేఁ దున్నయ ట్లున్నమై
ఘోరాస్త్రంబులు వో విదిర్చికొనుచుం గ్రోధాతిరేకంబునన్. 697

క. నిడుపొక యోజన మగుశిల, వడిఁ గొని యోరోరి దీనివాటునఁ బొడియై
పడి తనుచు వైవ వాఁడును, నడుమన భల్లములఁ ద్రుంచె నాశైలంబున్.

క. వక్ష మొకట నుదు రొక్కట, దక్షిణభుజ మొంట రెంట దట్టించుచు నా
వృక్షచరవీరు నేసె న,లక్షితసంధానహస్తలాఘవ మొప్పన్. 699

ఆ. అట్టు దూల నేయ నాతండు మనసిల, కఱచి ధైర్య మూఁత గాఁగ నిలిచి
నిటలతలముగంటినెత్తురు మోముపైఁ, దొరఁగ నల్లఁ గేలఁ దుడిచికొనుచు.

ఉ. వాలుమగంటిమిం గడఁగి వారక సాలరసాలతాలహిం
తాలముఖద్రుమంబుల రణం బొనరింప నతండు తత్కరో
న్మూలితచాలితోత్థితనగముజ్ఝితవృక్షము లొక్కమాటు బ
ల్గోలలఁ ద్రుంచి వైచి నెఱకుల్ వడిఁ దూఱఁగ నేయ నయ్యెడన్. 701

1 ఠ టట్టన.

తే. మొదలఁ బిడుగు వ్రేసినవానిఁ బిదపఁ గొఱవిఁ, జూఁడినట్లన్నకును నెడ సొచ్చి మూఁడు
నేడునమ్ముల నదరంట నేసి దర్పమున మహానాదుఁ డార్వ నవ్వనచరుండు.

క. కనలి యొకగండశైలము, గొని తేరికి వైవ వాని ఘోరగదాఘ
ట్టన నదియు రాలి పొలియుట, గని పై కుఱికె విలు విఱిచి గ్రక్కున నతనిన్.

క. తల యొడిసి పట్టి గగన, స్థలి జిఱజిఱఁ ద్రిప్పి రక్తధారలు మెదడుం
బెలుచ వెలి కుఱుక లోనెమ్ములు నుగ్గుగ నేలతోడ మోఁది వధించెన్. 704

క. అంత మహాకాయుఁడు గడు, నంతస్తాపంబు సేయ ననుజునిపా ట
త్యంతక్రోధముఁ బెనుపఁగ, నంతకుగతిఁ గదిసి గుదియ నంగదు వ్రేసెన్. 705

సీ. వ్రేయ నవ్వీరుండు వివశుఁడై పడ నద్రిచరు లది చూచి పాషాణవృక్ష
వృష్టిని దను ముంప వెస గవాక్షునిఁ బది శరములఁ బృథు నైదు సాయకములఁ
గ్రోధను నేఁబదికోలల వృషభు నెన్మిదిపదులమ్ముల మేఘపుష్ప
గజుని నేనూఱంబకమ్ముల శతవలి, బాణత్రయమ్మునఁ బనసు నేడు
మార్గణముల నొంచి మఱియును నొక్కొక్క ములికి నెల్లకపుల ముడుఁగ నేసె
నంతలోనఁ దెలిసి యంగదుండును గదాపాణి యగుచు రథముపైకి నుఱికె.

చ. వికటవిశంకటభ్రుకుటివీరరసోద్భటవీచివిస్ఫుర
ద్వికృతి నటింపఁ గట్టలుక వేయిహయంబుల సూతుఁ జంపి కా
ర్ముకమును గేతనంబు రథమున్ వితథంబులు చేసి వైచి సీ
నక మెడలించి నెత్తి పెలుచన్ దగ వ్రేయుచు దాఁటె నుర్వికిన్. 707

మ. విరథుండై రజనీచరుండును గదావిస్ఫూర్తు లారన్ వసుం
ధరకున్ గ్రక్కున దాఁట నొక్కొకని దోర్దండప్రహారంబు లొం
డొరుబల్విల్లితరేతరప్రహతు లన్యోన్యప్రహింసల్ పర
స్పరధిక్కారము లొప్ప వారికి మహాసంగ్రామ మయ్యెం దగన్. 708

ఉ. అప్పుడు దీప్తహేమవలయద్యుతు లాకస మంటఁగా గదల్
ద్రిప్పుట లెత్తి వ్రేయుటలు దీవ్రగతిం బయి దాఁటి పోవుటల్
తప్పఁ దొలంగుటల్ బహువిధంబుల నొంచుట లార్చి వ్రేసినం
[1]జిప్పలువాఱ నొగ్గుటలుఁ జెల్లఁగ నిద్దఱుఁ బోరి రుద్ధతిన్. 709

క. మఱియుఁ దముఁ బొదువుమూర్ఛల, దెఱపులఁ గైకొనుచు వారు దెగఁ బోరి గదల్
విఱిగి పడ బాహుయుద్ధము, నెఱపఁ దొడంగిరి కడంగి నిష్ఠురభంగిన్. 710

క. అత్తఱి నెగసినధూళి వియత్తలభూభాగమధ్య మంతయుఁ గప్పం
దత్తిమిరతిరోహితు లై, మత్తద్విరదములకరణి మలసి బెరయుచున్. 711

క. పొడుచుచు వ్రేయుచుఁ బట్టుచు, విడుచుచుఁ గ్రొవ్వేసక మెసఁగ వెసఁ దాఁకుచు బ
ల్విడిఁ దిరిగి మడమ దాఁచుచుఁ, బడవైచుచుఁ గ్రిందమీఁదఁ బడుచు నెగయుచున్.

---

1. జిప్పలు వోవ మొగ్గుటలు.

శా. హాహాకారము లారఁగా నుభయసైన్యశ్రేణు లగ్గించును
త్సాహోక్తుల్ ఘనపాదఘట్టనలు నుద్యత్పాతముల్ హుంకృతుల్
బాహాస్ఫాలనముల్ మహాహతులు శుంభద్గర్జనల్ తర్జనో
గ్రాహూతుల్ వికటాట్టహాసములు సొంపారయం బోరి రత్యుద్ధతిన్. 713

వ. ఇత్తెఱంగునం బోరి వెండియు. 714

ఉ. శోణితధారలం బుడమి జొత్తిలఁ గూర్పరజానుముష్టిదోః
పాణితలప్రకోష్ఠనఖపాదశిరఃకరభోగ్రఘాతము
ల్ప్రాణములం గదల్పఁగ జగంబున ధైర్యము నిక్కఁ బెక్కువి
న్నాణము లొప్పఁగా సరిఁ బెనంగ నలుం డెలుఁగెత్తి యిట్లనున్. 715

ఉ. వాలితనూజ దోర్బలజవంబుల వాలికి నెత్తువత్తు నీ
వాలమునన్ భవజ్జనకుఁ డట్టిమహోద్ధతుఁ డైనదుందుభి
న్లీల వధింపఁడే యితని నీవును నింక వధించి దిక్కులన్
వాలినతండ్రికీర్తులకు వన్నియవెట్టుదు గాక నావుడున్. 716

తే. పొంగి లంఘించి యక్కపిపుంగవుండు, రక్తధారలు వదనరంధ్రముల వెడలఁ
జటులతరమై మహాశనిస్పర్శ మయిన, పాణితలమున నడినెత్తిఁ బగుల వ్రేసె.

క. వ్రేటునకు వాఁడు బిడికిటఁ, బోటుగొనం గిట్ట పట్టి పోరిఁ బ్రాణంబుల్
పేటెత్త నెత్తి మృతికఁ, ప్పా టొక్కఁడ చాల నేలఁ బడవైచి వడిన్. 718

క. ఉర మెక్కి పశువుఁ జంపిన, కరణిం జెయి గాలు మాఱు గదలుప నెమ్మై
వెరవెడలఁ బొడివి వానిం, బరుషగతిం జంపి భూతబలి గావించెన్. 719

వ. అట్లు మహాకాయుండు పొలిసినం గనుంగొని వనచరులు సింహనాదంబులు సే
యుచు నిశాచరులం దోలి వాలినందనుం గొనియాడుచుఁ దత్పరస్పరంబుగా
రామచంద్రుసమీపంబునకుం జనుదెంచి సమరవృత్తాంతంబంతయు విన్నవించిన.

ఉ. ఆవసుధేశుఁ డంగదుని నప్పుడు కౌఁగిటఁ జేర్చి యట్లు నం
భావన మొప్ప నంచితకృపామతిఁ జూడఁగ లక్ష్మణుండు సు
గ్రీవుఁడు వాయునందనుఁడుఁ దక్కినవారును గారవించి రం
దావిజయంబు పెంపు గొనియాడి విభీషణుఁ డప్పు డిట్లనున్. 721

క. జననాథ మహాకాయుం, డు నిశాచరభటులలోఁ గడుం బ్రబలుం డా
ఘనభుజుఁడు నచ్చినప్పుడ, యనిఁ జచ్చినవాఁడు సూ దశాస్యుం డింకన్. 722

వ. అనిన విని రాముండు సంతోషంబున నుండెనంత లంకాపురంబున. 723

తే. దీనవదనులుశోణితదిగ్ధతనులు, నైనిశాచరుల్ వడిఁ బాఱి యట్లు కయ్యా
మునమహాకాయశతమాయముఖ్యులయిన, రక్కసులపాటు చెప్పిన రావణుండు.

ఉ. క్రొవ్వుల వేఁడిమిం గడచుఘోరపుఁబల్కులు కర్ణరంధ్రముల్
చుఱచుఱ దాఁకి పాఱి మదిఁ జూఁడిన మోములు వాంచి మిన్నుపై

నొఱగినయట్టిచందమున | నొక్కఁడుఁ బల్కక కొంతసేపు ని
వ్వెఱపడి తూలుచుండెఁ బృథి|వీస్థలిఁ జూడ్కులు నిల్పి కొల్వునన్. 725

క. అద్దశముఖుఁ డట్లొందుటి, పద్దశ పరికించి ఱిచ్చె|వడి మంత్రులు దా
రెద్దియును బల్కకుండిరి, పెద్దదడవు వింజ మాఁక | పెట్టినభంగిన్. 726

వ. అంత దిగ్గనం గొలువువిరిసి యంతఃపురంబున కరిగి. 727

చ. పరిభవచింత చిత్తమున | బల్వొనం దలపోఁతలన్ వగల్
గరుసులు దాఁట నించుకయుఁ | గంటికిఁ గూరుకు రాక శయ్యపైఁ
బొరలుచు లేచుచున్ మరలఁ | బొందుచుఁ గూర్కొకభంగి నవ్విభా
వరిఁ గ్రమియించె రావణుఁ డ|వారితశోకసమాకులాత్ముఁ డై. 728

వ. ఇట్లు వేగించి ధైర్యంబు దెచ్చుకొని నిజనికేతనంబు వెడలి రథారూఢుం డై సమస్తమంత్రులు సామంతులుఁ గొలువ నరిగి కోటచుట్టు నున్నసైన్యంబులం గనుంగొనుచు నయ్యైగుల్మంబులం దగినయెడలకు వలయువారిం బయికావ లుండ నియోగించి కొలువు చొచ్చి కొండొకదడవునకుఁ బ్రహస్తు నవలోకించి.

తే. ఏను గుంభకర్ణుండును | నింద్రజిత్తు, నీవు నీనికుంభుడుఁ దక్క | నిట్లు పురము బలసి విడిసినకపిసేనఁ | బాఱఁ దోల, నన్యు లింకెవ్వరును గల్గ | రట్లు గాన.

ఉ. నేఁడు బలంబు నెల్లఁ గొని | నీవు మహోర్చులఁ బేర్చుచిచ్చుచే
మాఁడినకాననంబుగతి | మర్కటసైన్యము సొంపు దూల నీ
వేఁడిమి సూపి యూథపుల|వి త్తడఁగం దునుమాడి వైవుక్రొ
వ్వాఁడిశరంబులం గడిమి | వాలినవాలితనూజుఁ డాదిగన్. 731

శా. నిస్సాణంబులదుస్సహధ్వనులచే | నీసేన లందంద రో
దస్సంధుల్ వగిలించుచున్ నడువఁగాఁ | దత్సంభ్రమం బొర్వ కం
తస్సారంబులు దక్కి పాఱుదురు సు|త్రామాదు లైనన్ భవ
న్నిస్సీమప్రకటప్రతాపమునకు | న్వీ రెంతవా రారయన్. 732

చ. అమితబలాఢ్య నీకు విజ|యంబు నిజం బటు గాక నీదుచి
త్తమున నజయ్యు లాన్నృపులు | తా రని యున్న మదీయబాహుశౌ
ర్యము గడుఁ దూల వారికి ఖ|రాదులచావులు దక్కిపోవఁ గ
ష్టమునకు నోర్చి నంధికి నొ|డంబడఁ జెప్పిన నట్ల చేసెదన్. 733

వ. అనినఁ బ్రహస్తుఁ డిట్లనియె. 734

క. అస్తోకమతులచేత న, మస్తముఁ బరికించి యుక్త | మగుసామ ముప
న్యస్తం బయి మనచేత ని, రస్తం బయినది కదా ద|శానన మొదలన్. 735

క. మెచ్చగున సాహసానకు, వచ్చినతతి నంధి మనల|వారలకొలఁదుల్
నిచ్చయము నేసి యిటువలెఁ, జొచ్చితి మన కింక నొండు|చొప్పులు గలవే.

శా. నీచే మన్నన గన్నదానికిఁ దగన్ | నేఁ డాజి విద్యున్నట

జ్యాచంచద్ధనురభ్రము క్తవిశిఖాసారంబు ఘోరంబుగా
వీచీబంధురరక్తసింధువులు గావింతుం బ్లవంగాంగముల్
వే చెండాడుదుఁ దెత్తు దీనదశకుఁ వే నేల భూపాలురన్. 737
క. ధనములపైఁ దనయులపై, వనితలపై బంధుమిత్రవర్గముపైఁ [1]బు
ట్టినప్రియమునకంటెను నీ, కనిఁ బ్రాణము లిచ్చునదియ కడుఁబ్రియ మధిపా.

—❖ ప్రహస్తుండు నీలునితో యుద్ధముచేసి చచ్చుట. ❖—

వ. అని పలికి బలాధ్యక్షులం జూచి మీరు సర్వసన్నాహసమేతులరై సేనలం గొని
రం డని నియోగించిన వారు నట్ల కావింప నప్పం క్తికంధరు వీడ్కొని పటహాది
మహాభైరవారావంబులు సెలంగం జనుదెంచి. 739
సీ. నేమిఘట్టనముల నేల వ్రక్కలుసేయఁ, గడఁగుచంచమునఁ జక్రంబు లెనఁగఁ
గరువలిజవమును గడచను నన్నట్లు, తరళితగతుల రథ్యములు మెఱయ
భానుబింబము నుద్దిపట్ట నూఁకించుపొ,ల్పున నహిధ్వజము నాలుకలు గ్రోయ
నితరరవంబుల నెల్ల నుల్లసమాడు, క్రియ మణిరణితకింకిణులు మొరయ
[2]సోమరశ్ములు హిమధాముర శ్ములచెల్వు, గెలువ సూతుఁ డప్పఁడెలమిఁ దేరు
పన్ని తేర నెక్కి బలములతోఁ బ్రహస్తుండు వెడలె లంకతూర్పుగవని.
క. వెడలి మహోత్పాతము లెడ, నెడఁ బెక్కులు గనియు వానినింతయుఁ గొన కె
క్కుడువడి సేనాభరమునఁ, బుడమి వడంకాడ నతఁడు పోరికి నడచెన్. 741
వ. అప్పుడు. 742
క. జననాథుండు విభీషణుఁ, గనుఁగొని యీవచ్చునమరగర్వితుఁ డెవ్వాఁ
డనిన నితండు ప్రహస్తుం, డనువాఁడు సమస్తసేన కధిపతి వీటన్. 743
ఉ. మూఁడవభాగ మీబలసమూహము రావణుసేనలోన నే
నాఁడు దశాస్యుఁ డీతనిన నచ్చి మదోద్ధతవృత్తి నుండు నె
వ్వాఁడును నింతచెల్లుబడివాఁడు నరేశ్వర లంకలోపలఁ
లేఁ డితఁ డెప్పుడుఁ సమరలీలల ముక్కునబంటి వజ్రికిన్. 744
తే. అనఁగ నసిగదాముసలచక్రాదిసాధ,నములు మెఱుఁగులు వాఱంగనలిఁజెలంగి
యామినీచరుల్ డ్రోచిన నద్రిచరులు,వీఁక నార్పులతో వచ్చి తాఁకి రపుడు.
సీ. ఏనుంగు లడరిన నెనఁగుబొందులు రూపు,సెడి నల్గడలఁ జెల్లచెదరు గాఁగ
నరదంబు లురవడి నడరినపట్టులఁ, బీనుంగుపెంటలు పెల్లు గాఁగ
సారిది ఘోటకములు సొచ్చినచోటుల, నవయవభేదంబు లరుదు గాఁగఁ
గాల్వురొక్కుమ్మడిఁ గడఁగినతావుల, నెత్తురువఱదలు నెఱపు గాఁగ
రక్కసులు విక్రమింప మర్కటులు గడఁగి, విపులపాషాణపర్వతవృక్షవృష్టి

---

1 బుట్టినప్రియము దైవకంటెను, నవిఁ బ్రాణము లిచ్చునది ప్రియము నా కధిపా. 2 సోము
రశ్ముల హిమధాము.

హతులఁజతురంగబలసమూహములు పెక్కు,మడియరణకేళిసల్పిరి సమచ్చరమున.

వ. అంతఁ బ్రహస్తునిమంత్రులు నరాంతకుండును గుంభహనుండును మహానాదుండును సమున్నతుండు నను నలువురుఁ జెలంగుచుం బ్లవంగబలంబుల నమయింపం దొడంగిన. 747

సీ. ద్వివిదుండు గిరిశృంగతీవ్రపాతంబున, నేల నరాంతకుఁ గూలవైచెఁ
దారుండు దారుణతరలీల నిరుగేలఁ, గొని సాలమునఁ గుంభహను వధించె
జాంబవంతుఁడు శిలోచ్చయమున వక్షము, నలిపి మహానాదుఁ బొలియఁజేసె
దుర్ముఖుం డనువాఁడు దోర్బలమెసఁగ స,మున్నతుఁ దరువున మోఁది కెడపె
నిట్లు విక్రమించు నేపు ప్రహస్తుండు, సూచి కపిబలంబు సుడివడంగ
గగన మంపగములఁ గప్పుచుఁ గోదండ,గుణము మొరయఁ బేర్చి రణ మొనర్చె.

క. పెల్లుగ నటభల్లాదుల, డొల్లుతలలుఁ జిక్కువడి పదుభుజాజంఘల్
వెల్లువ లగుశోణితములు, డ్రెళ్లుశరీరములు నుగ్రరేఖం జేయన్. 749

మ. హరివీరావయవంబు లోలి రథరథ్యాపార్శ్వభాగంబులం
దఱుచై యుండ ఘనాస్రపంకములు మేదఃఫేనముల్ వక్త్రితా
మరసశ్రేణులుఁ గృత్తమస్తకవపుర్మత్స్యంబులుం గల్గి నె
త్తురుటేఱుల్ శరవృష్టిచే నొదవె నద్దోషాచరుం డేయఁగన్. 750

స్రగ్ధర. ఆలోఁ బుంఖానుపుంఖం బగుచు మథనవేళార్ణవాకీర్ణవీచీ
జాలశ్రీలట్టు పైపై శరము లడరఁగా సైఁచి కట్టల్కతోడన్
నీలుం డుత్తాలసాలాన్వితభుజ మెసఁగ న్వ్రేఁకమైఁ దాఁకి వాజుల్
వ్రాలన్ సూతుండు గూలన్ రథము వితథమై మ్రగ్గ విల్ దూల మోఁదెన్.

వ. ఇటు విరథుం జేసినఁ బ్రహస్తుండును ముసలహస్తుం డగుచు నిలాతలంబున కుఱికి తఱిమె నప్పు డవ్వానచరనిశాచరు లిరువురు నుభయబలంబులవారును దత్ప్రహారంబులకు మెచ్చుచు నచ్చెరువంది కనుంగొనుచుండం బ్రచండభంగిం గడంగి.

క. బలువులులపగిది మదగజ,ములకైవడి దృప్తసింహములచందమునం
గలయఁబడి పోరఁ దొడఁగిరి, బలరిపువృత్రులకు వారు పాటి యనంగన్.

చ. అనమున నట్లు పోరుసమయంబున రక్కసుఁ డల్కతో మహా
యసముసలంబు హేమవలయద్యుతు లారఁగఁ ద్రిప్పి వీఁకమై
నొన లవియంగ వ్రేయఁ గడు నొచ్చియు నాతఁడు వానిఁ గ్రమ్మఱన్
వన మఱఁ జేతివృక్షమున వక్షము బల్విడి వైచె నార్చుచున్. 754

ఉ. దానికి మాఱొనర్ప భయదక్రియ రోఁకలి రెండుచేతులం
బూనఁగ వెండియుం గనలి భూరిమహీధరశృంగ మెత్తి య
వ్వానరపుంగవుండు వెస వైచుడు వానిశిరంబు వ్రక్కలై
ఫేనిలరక్తపూరములు పెల్లుగఁ గ్రక్కుచు వ్రాలె నేలకున్. 755

క. తరుగిరివర్షము గురియుచు, హరివీరులు వెనుకఁ దగులు నప్పుడు లంకా
పురి తెరువువట్టి పాఱిరి, ధరణీతల మద్రువ యాతుధానులు భీతిన్. 756

వ. ఇట్లు ప్రహస్తుండు వడినం జూచి రామలక్ష్మణులును సుగ్రీవాదులును నీలు నుచితవాక్యంబులం గొనియాడి రంత నక్కడ రావణుండు నంతవృత్తాంతం బెఱింగి మాతులవధప్రకారంబునకు శోకించి పరాజయక్రోధంబున నాస్థానంబు గలయం గనుంగొని. 757

ఉ. ఇట్టి తెఱంగులుం గలిగెనే మనవీటికి నాఁడు వాసవుం
దొట్టి నిలింపసైన్యములఁ దోలినవీరవరుం బ్రహస్తు నేఁ
డెట్టొకొ చంపె నీలుఁ డని యీగతిఁ గ్రోఁతులచేతఁ బోయి నా
చుట్టలు సేనలుం బడఁగఁ జూచెదఁ జూచితిరే నిశాచరుల్. 758

క. నావా రనిఁ బడి రోడిరి, నా వారనివగలఁ బొగుల నాకుం జనునే
దేవారికిఁ దేజము గల, దే వారికి నిట్లు సెల్ల నిచ్చినమీఁదన్. 759

క. ఏన చని వట్టిపోయిన, కానలఁ గార్చిచ్చు కాల్చుకైవడి మద్బా
ణానలమున నానరులను, వానరులను నీఱుసేసి వచ్చెదఁ గడిమిన్. 760

మ. చతురంగంబులు పన్ని తెండు జవనాశ్వంబుం బతాకాభిశో
భితముం జాపశరాదిసాధనచయస్ఫీతంబు గావించి మీ
రతివేగంబునఁ దేరు తేరఁ జనుఁ డత్యుద్ధతుల్ దగఱ మీఁగు నా
యితమై రండు సమస్తసైన్యములతో నేపారఁగాఁ బోరికిన్. 761

వ. అని పలికి సమరంబునకు నరుగువాఁడై నిశ్చయించునంత నంతయు నెఱింగి మందోదరి యంతఃపురంబు వెడలి యూపాక్షుండు మొదలగుమంత్రులం గొని ధవళచ్ఛత్రచామరంబులు మెఱయ ముందట నెడగల్గి కొంద ఱాయుధపాణులతోడ నతికాయుండు నడవ నేతెంచి చిత్రధ్వజమాలికలం బొలిచి కనత్కనకసోపానశోభితంబు లగు నెనుబది తెరువులు గలిగి యున్నయాస్థానమండపంబుఁ జొత్తెంచి దౌవారికులు జడియ మస్తకన్యస్తహస్తు లగుచు రక్షోవీరు లోనరింప గద్దియం గదిసిన నద్దశాననుం డాదరంబున నద్దేవి నర్ధాసనాసీనం జేసి వచ్చిన వారల నర్హపీఠంబుల నుండ నియోగించి తదాగమనప్రయోజనంబు దెలియు తలంపున. 762

—రావణునకు మందోదరి నీతి చెప్పుట.—

క. వనితా నీవును వీరును, జనుదెంచినకార్య మేమి చందమొ నాకుఁ
వినిపింపు మనిన నమ్మయు, తనయ దశగ్రీవుతోడఁ దా నిట్లనియెన్. 763

క. నన్నధిప నీవు పెద్దయు, మన్నించుటఁ జనవు మెఱసి మంత్రులఁ గొని యే
విన్నపము సేయ వచ్చితి, విన్నం గుల మెల్ల బ్రతుకు విశ్రుతలీలన్. 764

తే. కలన ధూమ్రాక్షుఁడాదిగాఁ గలుగువీరు, లద్రిచరులచేఁ బొలియుట కలిగి నీవు

వారిపై నత్తిపోనున్న । వార్త కేను, వెఱచి వచ్చితి మఱియొండు । తెఱఁగు గాదు.

శా. రాముం బుణ్యగుణాభిరాముఁ ద్రిజగ । ద్రక్షైకదీక్షాగురున్
సామాన్యక్షితినాథుఁ గాఁ దలఁచి త । త్సామర్థ్య మూహింప కా
భూమీశాగ్రణి దేవి నుత్తమసతిం । బూతవ్రతన్ నీకుల
క్షేమం బొల్లనిభంగిఁ దెచ్చితి [1]ప్రభు । శ్రీ నింత గర్వింతురే. 766

చ. ఇనకులనాథు మున్న విన । మే మన మట్టిఖరాదులన్ రణం
బునఁ దునుమాడఁడే యొకఁడ । పూని విరాధుఁ గబంధుఁ దాటకా
తనయు వధింపఁడే వినుము । తక్కినవేయును నేల యమ్మహా
వనచరు నొక్కతూపునన । వాలిఁ బరాక్రమశాలిఁ గూల్పఁడే. 767

ఉ. ఆరసి చూడ లక్ష్మణుఁడు । నమ్మహితాత్మునియట్టివాఁడ దు
ర్వారబలాఢ్యు లాకపులు । వారలలావులు మున్న మీఁగ గ
న్నారును వేయునేల నర । నాయకుఁ డల్పుఁడు గాఁడు భూతసం
హార మొనర్ప నైనఁ గలఁ । డల్గిన [2]వాలియ సాక్షి దానికిన్. 768

క. సౌమిత్రి గొల్చిరా వన, భూమికిఁ దనతండ్రియాజ్ఞ । భూసుతతోడన్
రాముఁడు సనుదెంచినవాఁ, డీమిషమున సురల మునుల । నెల్లను బ్రోవన్.

ఆ. కాన విగ్రహంబు । కార్యంబు గాదు నీ, తిజ్ఞు లయినవారి । తెరువు దలఁచి
వలయువారిఁ బుచ్చ । వలయు సామమునకు, రాముకడకు మనకు । రాక్షసేంద్ర.

చ. ఇదియ మతంబు మంత్రులకు । హేమమహామణిముఖ్యవస్తువు
ల్మొదలుగ సీత నాసకల । లోకశరణ్యున కిచ్చి పుచ్చి నె
మ్మది మముఁ బ్రోవు [3]మీవనిత । మాటలు దోఁచితి గాక నీతికో
విదుఁడు విభీషణుండు మును । వేఱువిధంబులఁ జాటి చెప్పఁడే. 771

మ. అతికాయుండును మాల్యవంతుఁడును యూ । పాక్షుండు నీమువ్వురున్
మతిమంతుల్ మన కెంతయున్ హితులు సా । మం బొల్లఁ గావింప నే
రుతు రచ్చోన విభీషణుండు నయధు । ర్యుం డున్నవాఁ డాతఁ డే
గతి నైనన్ సమకొల్పఁ జాలుఁ దను నై । కట్యాకుండు మన్నించుటన్. 772

చ. సమరమునందు శాత్రవులె । చత్తు రనం జన దాత్మహానియున్
సమకొను గెల్పు సందియము । సన్నుతి కెక్కినసామభేదదా
నము లవి యుండఁగా మొదల । నాలవవెంట సమస్తబంధునా
శమునకు నోర్చి రాజు లిటు । సాహసవృత్తిఁ దొడంగు టొప్పునే. 773

క. మనవారలు ధూమ్రాక్షుం,డు నకంపనుఁడు ప్రహస్తుఁ । డు మహాకాయుం
డును లోను గాఁగ సమరా, వనిఁ జచ్చిరి దీన నేమి । వచ్చెం జెపుమా. 774

ఉ. ఒక్కఁ డొకండ దిక్పతుల । నోర్చినవారు ప్రహస్తముఖ్యు ల

1. ప్రభుస్త్రీ. 2. వార్ధియ. 3. నీ వనితమాటలు.

య్యొక్కఁడువీరు లాహవమ । హీస్థలి శత్రులచేత నీగతిం
జిక్కుట చూచియుం జలము । సేసెద వింతకు మున్ను వారిలో
నొక్కరుఁ డైన వీరిగతి । యూథపుఁ డీల్గినవాఁడు గల్గెనే. 775

ఆ. వెర వెఱింగి కార్త । వీర్యునితోఁ గార్య,సిద్ధిగొఱకు సంధిఁ । జేసికొనవె
పరశుజితసహస్ర । [1]బాహు రాముని మీఱు, రాముఁ డేల తగఁడు । సామమునకు.

ఉ. ఎట్టు ఘటిల్లు సంధి గడు । నెగ్గొనరించిననన్ను నేల చే
పట్టు నతండు నా వలదు । ప్రాంజలి మైతనుఁ గన్నమీఁద ని
ట్టట్టనువాఁడు గాఁడు శర । ణాగతవత్సలుఁ డమ్మహాత్మతోఁ
బుట్టువు లక్ష్మణుండు దల । పోయ గుణాఢ్యుఁడు మీఱఁ డన్నకున్. 777

క. సింధురరథఘోటకభట, బంధురబలతతులు సుతులు । బంధులుఁ దెగినన్
సంధికి రిపు లొల్లరు దశ,కంధర పద నిదియె సంధి । కార్యంబునకున్. 778

క. ఎన్నివిధంబుల నైనం, దన్న కదా కావవలయుఁ । దాఁ గల్గినమీఁ
ద న్నిఖిలము గల దని హిత,వు న్నీతియుఁ దగవు భయము । పుట్టఁగఁ జెప్పెన్.

వ. ఇట్లనేకప్రకారంబుల నమ్మయుతనయ చెప్పిననయనిష్ఠురోక్తులు మనసునం బెట్టక
నిట్టూర్పు నిగిడించి కొండొకసేపు విచారించి రావణుండు. 780

ఉ. నీవు హితోక్తు లీపగిది । నీతిపథంబునఁ బెక్కు చెప్పి తా
త్రోవకు నేగతిన్ మనసు । దూఱదు మున్ను సురాసురాదులం
జేవ లడంచి లావునఁ బ్ర । సిద్ధికి నెక్కిననేను లోకపా
లావలి నవ్వ నవ్వనచ । రాశ్రితు నేగతిఁ గాంతు మానవున్. 781

ఉ. [2]తోలితి నింద్రు నగ్ని యము । దుష్టనిశాచరు నబ్ధినాథునిన్
గాలిఁ గుబేరుఁ దత్సఖు న । ఖండబలంబులఁ ద్రుంచి మించి నే
వాలితి నేల మేలితి ధ్రు । వంబుగ నేఁబదిలక్ష లేండ్లు నేఁ
డాలము వచ్చినం గడఁగి । యంగన నిచ్చిన నన్ను నవ్వరే. 782

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె । యెగ్గొనరించెను దానికై కదా
చెఱగొనివచ్చితిం బిదప । సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రదు కింత తీయనె ఖ । రాదులచావున కేమి చింత నీ
మఱఁదలిబన్న మేపగిది । మానిని యీఁగుదు సంధిచేసినన్. 783

క. రాముని కే మ్రొక్కిన సు,త్రామాదులు నాకు వెఱతు । రా యింకిట నీ
వేమియుఁ జింతింపకు సం,గ్రామం బొనరింతు నృపులఁ । గపులం ద్రుంతున్. 784

తే. చెలువసీతనూభవునింద్ర । జిత్తుఁ జెనయు,వాఁడుమూఁడులోకములందు । లేఁడునాకు
నింతవిలుకాఁడు గలుగంగ । నంతరాదు, తలఁక వల దని దేవి లో । పలికి ననిచి.

వ. అనంతరంబ దశాననుండు చింతాకులమానసుం డగుచుఁ గొండొక విచారించి

---

1. బాహుని మీఱినరాముఁడు 2. ఈపద్యము కొన్నిప్రతులం గానిపించెడిని.

ధైర్యోత్సాహంబులు దెచ్చుకొని రాక్షసుల నవలోకించి. 786

ఆ. కంచుకంబు లూడ్చి § కాలోరగంబు లు,త్కటవిషంబు లెగయఁ § గవియుకరణి
దొనలువెడలి నాదు § తూపులు మిడుఁగుఱు, లెగయ రాముమీఁద § నిగుడు నేఁడు.

చ. ఎఱిఁగి యెఱింగి మృత్యువుప§యిం జనుదెంచునె యెట్టివాఁడు ని
ట్లుఱక సురాసురాదులకు § నొట్టినచిచ్చగుచున్ననన్ను నె
త్తెఱఁగున నోర్వ వచ్చునొకో § తెంపున రాముఁడు వచ్చెఁగాక నేఁ
డెఱిఁగెదు గాక నాకొలఁది § యెక్కుడుమాటలు వేయు నేటికిన్. 788

—✿ రావణుఁడు యుద్ధసన్నద్ధుఁడై వానరసేనం గవియుట. ✿—

క. అని పలికి శైలజీమూ,తనిభాకృతులైనయాతు § ధానులు గొలువం
గనకాచలశృంగోన్నతిఁ, దనరురథోత్తమము నెక్కి § దారుణభంగిన్. 789

సీ. శంఖభేరీముఖ § సంకులధ్వనుల లో,కాలోకగుహలసిం § హములు బెదర
రథనేమిహయఖుర § రయసముద్ధూతమ,హీరేణుపటలి [1]మి § న్నేఱు గలఁగ
నానాచమూభార § నమ్రభూవలయక,మ్పమునఁ గులాద్రుల § పాఁతు గదలఁ
[2]భటభుజోద్భాసిత § బహుహేతిరోచుల, వేల్పుటింతులకును § వెఱపు వెరుఁగ
సూతవందిమాగధజన § స్తుతులుఁగలయ, వివిధజయకేతువులుఁగ్రాల § వెడలెలంక
యుత్తరద్వారమున దర్ప § మొప్ప [3]దివిజ, రాజవిద్రావణుం డగు § రావణుండు.

క. వెడలి కడ లడరువారిధి, నడువున నడపడక మోహ్రియు § వానరసేనం
బొడగని నడవఁగ నబ్బలు, విడి గనుఁగొని రఘువరుండు § విస్మితుఁ డగుచున్.

వ. విభీషణుం జూచి మనమీఁద నిత్తెఱంగున నేతెంచుమహాసైన్యంబువాఁ డెవ్వాఁ డవ్వీరు లెవ్వారెవ్వా రనిన నిట్లనియె నట్లు నీలుచేతం బ్రహస్తుఁడు గూలినం బౌలస్త్యుండు మాతులవధాభిమానంబు మానసంబునం బూని తాన సమరంబుసేయువాఁడై వచ్చుచున్నవాఁడు నాదృష్టిపథంబునం బడినవారి దేవర కెఱింగించెద.

తే. నడపు గోపంబు గలకొండ § నాఁగఁ గలిత, దాననిర్ఝరార్ద్రం బగు § తనగజంబు
లీల నంకుశాహతిఁ గెర § లించుచున్న, వాఁడు యూపాక్షుఁడనువాఁడు § వసుమతీశ.

ఉ. ఉరుతరహేమదండరుచి § నొప్పుచు సింహపతాక మింటితో
నొరయఁగ రోహిణాచలస § ముజ్జ్వలమైనరథోత్తమంబుపై
నరుదుగఁ జాప మింద్రధను § రాకృతి నెత్తి చెలంగుచున్నపో
టరి యతఁ డింద్రజిత్తనికి § డాయరు వీని సురాసురాదులున్. 793

మ. వితతోల్కాతతు లక్షు లీనఁగ నొడల్ § వింధ్యాద్రియుంబోలె న
ద్భుతరేఖం దనరార వీనులు జడీ § భూతంబులై యుండ ను
ద్యతకోదండ మతిప్రచండముగ మోహ్రి § యం జేయునత్తెరివాఁ
డతికాయుం డనువాఁడు వీఁ డతిబలుం § డాలంబులన్ రాఘవా. 794

---

1 మున్నేఱు. 2 బటుభుజోచ్చాలితబహు. 3 నఖిలదేవవిద్రావణుండు.

క. మేదురతరాట్టహాసము, రోదసిఁ బగులంగ నల్లు మ్రోఁగుచు ఘంటా
నాదితరథుఁ డగువాఁడు మ,హోదరుఁ డనుయాతుధానుఁ డుర్వీనాథా. 795

తే. సంజమొగులునిద్దంపుఁగెంజాయమేను
గలుగుతురగరత్నము చిత్రగతుల మెఱయ
వడి మహాశనివడువున వచ్చునన్ని
శాతకుంతహస్తుండు పిశాచరాజు. 796

క. నిశితత్రిశూలరోచులు, దిశలకు నెసఁగించుమృగపతిసమారూఢుం
ద్రిశిరుఁ డనువానిఁ గంటే, దశకంఠునిసుతుఁడు వీఁడు ధరణీనాథా. 797

ఆ. ఉరగరాజకేతనోజ్జ్వలమై వచ్చు, తేరిమీఁద విల్లు ద్రిప్పుచున్న
భూరిమేఘసన్నిభుఁడు కుంభుఁ డనువాఁడు, కుంభకర్ణుపెద్దకొడుకు వీఁడు

క. ధూమధ్వజలాంఛన మగు, భీమధ్వజ మొప్పు దేరఁ బృథుపరిఘముతో
ధూమలతాయితశిఖవిధ, మై మండెడు నదె నికుంభుఁ డనువాఁ డనికిన్. 799

ఆ. కేల విల్లు గ్రాలఁ గీలాకరాళాగ్ని, దీప్తమైనపసిఁడితేగు సగాతుఁ
డార్చి తోల వచ్చునతఁడు నరాంతకుఁ, డనఁగ ననిఁ బ్రసిద్ధుఁ డయినవాఁడు.

క. తను నానాఘోరమృగా, ననములభూతములు రథము నలుగడఁ గొలువం
దనరుచునతఁడు దేవాంతకుఁ, డనువీరుఁడు పంక్తికంఠునాత్మజుఁ డితఁడున్. 801

క. మఱియు రథదంతిహయముల, మెఱయుచుఁ గైదువులు వాఁడి మెఱుఁగుల నీనం
దఱుచుగ గర్జిల్లెదునం,దఱు రక్షోనాథువీటఁ దగియెదువీరుల్. 802

సీ. కీలితస్యందనకింకిణీరవములు, ఘననేమినినదంబుఁ గ్రందుకొనఁగ
మహనీయభూషణమణిగణస్ఫూర్తులుఁ, బటులాయుధార్చులు సందడింప
నద్భుతభ్రుకుటిరేఖాభీలలీలయుఁ, [1]గార్ముకోచ్చాలనగతియుఁ బెరయఁ
జారుమౌక్తికసితచ్ఛత్రచంద్రికయును, గర్వాట్టహాసంబుఁ గలయఁబడఁగఁ
గనకదండప్రచండకేతనము గ్రాలఁ, గాలనిభమూర్తు లయినరక్కసులనడుమ
[2]వాఁడితేజంబుతో వచ్చువాఁడు లోక,కంటకుం డైనయద్దశకంఠుఁ డధిప.

క. నేఁ డనికిఁ దాన వచ్చిన,వాఁడు మహావీరు లైనవారలతో నీ
వేఁడిమి ఘనశరవృష్టిం, బోఁడిమి దూలంగ నార్చి పుచ్చఁగ వలయున్. 804

చ. అన విని యమ్మహీరమణుఁ డచ్చెరు వందుచుఁ బంక్తికంధరుం
గనుఁగొని యిట్లనుం బ్రభలక్రందున రూప మెఱుంగరానిసూ
ర్యునిగతి నొప్పుతేజమున నుజ్జ్వలుఁ డై యిటు లున్నవాఁ డితం
డసఘచరిత్రుఁ డైన జగమంతయు నేలెడువాఁడు గాఁ దగున్. 805

క. అక్కజపువీరు లారయఁ, ద్రిక్కినరక్కసులు వారిదిక్కున ధర్మం
బొక్కటియు లేమి దైవము, చక్కటి యేగతిరయి కాని సంగ్రామమునన్. 806

1 గార్ముకహేలనగతియు. 2 'వాఁడితేజంబుతో నిట వచ్చు లోక' అ. ప్ర.

వ. అని పలికి లక్ష్మణసమేతుం డై కవచధారణాదిసన్నాహంబునం బొలిచి నిలిచినం దరుచరు లందఱు శిలావృక్షహస్తు లయి నింగిఁ జెలంగునార్పులతోడం గడంగి రప్పు డప్పొలస్తుండును సమస్తనిశాచరులం గనుంగొని యేన రాఘవుల వానరుల వధించెద మీర లిందఱుం జూడుం డనుచు నిలువ నాజ్ఞాపించి నూతుండు దేరు దోలఁ శింజిని మ్రోయించుచు శరాసారఘోరంబుగాఁ గవిసిన. 807

చ. కనుఁగొని భానుసూనుఁ డలుకన్ నగశృంగము రెండుచేతులం
గొని దెస లార్పులం బగుల ఘోరరయంబున మేఘమాలికల్
గనుకనిఁ దూల వైచె దశకంఠుఁడుఁ దోడన దానిఁ దప్తకాం
చనమణిచిత్రపుంఖశరసంఘమునం దునుమాడి వెండియున్. 808

ఉ. కాలభుజంగకల్ప మగుకాండ మమర్చి మహోత్కటాశని
జ్వాలలు వాఱ నేయుటయు వక్షము బల్విడి నుచ్చి పాఱ మూ
ర్ఛాలసుఁ డై విశాఖవిశిఖాహతి వ్రస్సినక్రౌంచశైలముం
బోలెఁ జలించి యుత్తరణిపుత్త్రుఁడు వ్రాలె సురారు లార్వఁగన్. 809

వ. ఇట్లు సుగ్రీవుండు మూర్ఛిల్లినం జూచి ఋషభ గజ గవయ గవాక్ష సుదంష్ట్ర నల జ్యోతిర్ముఖులు ముఖంబులం గోపంబులు ముడివడఁ బ్రచండగతిఁ గొండ లొక్కటం గొని వైవ దశగ్రీవుండు నవి నడుమన వెడఁదవాతితూపులం దునుమాడి వారి నేడ్వుర నొక్కొక్కమెఱుంగునారసంబునం జచ్చిన ట్లుండఁ గెడపి నుతియు విజృంభించి. 810

మ. అరుదుందూపుల గ్రుచ్చె వానరులఁ బెల్లన్యోన్యసంఘట్టనం
బరుపజ్వాలలు భూరజస్తిమిరముం బాపంగ నుద్యద్గరు
న్మరుదాభీలరయంబు నిర్జరవిమానశ్రేణిఁ దూలింప ని
ష్ఠురమౌర్వీనినదంబు సాగరరవాటోపంబు భంజింపఁగన్. 811

వ. అప్పుడు. 812

క. శరములు నిగిడెడు తెరువులు, పరికించి యెఱుంగ లేక పైపైఁ బడియుం
దెరలియు మరలియు నొచ్చియుఁ దరుచరు లొగి విఱిగి వచ్చి తన వెనుకఁ జొరన్.

శా. ఉర్వీనాథుఁడు వారిదైన్యమున హాహా యంచుఁ జంచద్ధను
ర్మౌర్వీసారణ సేయ ని ట్లను సుమిత్రాపుత్త్రుఁ డి ట్లేచునీ
గర్వాంధున్ శరవృష్టి ముంచి మనపై గర్జిల్లునీసేనలన్
సర్వంబుం గడతేర్చి పుచ్చెద ననుజ్ఞాతుండ నే నావుడున్. 8:4

ఉ. వీఁకకు మెచ్చి నవ్వి రఘువీరుఁడు [1]తమ్ముని జూచి వత్స వే
తాఁకు దశాస్యు నేమఱకు తచ్ఛరమార్గము లస్త్రసంపదం
దేఁకువఁ బెద్ద యై యతఁడు దేవగణాదులతోడఁ బోరి ము

1. తమ్ముని తెంపుఁ జూచి వే.

కాఁకలుఁ దేఱినాఁడు బలు✽గయ్యములం దని పల్కి వెండియున్. 815

వ. మహాధనుర్ధరు లయిన వారికిఁ బరాస్త్రప్రయోగంబులు నరాతులు ప్రయోగించి నం బ్రతివిధానంబు లోనవ్వు తెఱంగులు నెఱింగి దృష్టిముష్టిసంధానస్థిరత్వదృఢత్వంబులు మెఱయం జిత్రకలాకలాపనైపుణ్యంబులు సూపవలయు ననుచు నుచితోపదేశంబు సేసిన నలరి వినయంబున నన్నచరణంబుల కెరఁగి దశముఖున కభిముఖుం డై కడంగునెడ నతని వారించి సమీరనందనుండు. 816

— రావణహనుమంతులయుద్ధము. —

క. రక్షోనాథున కెదు రై, దక్షిణభుజ మెత్తికొనుచు ✽ ధరణి చలింపన్
వృక్షచరు లార్వ నశనిస,దృక్షత్వరఁ బాఱుతెంచి ✽ తెంపునఁ బలికెన్. 817

మ. మును బృందారకదానవోరగముఖుల్ ✽ ముబ్బాములం బడ్డవా
రని నాచే నని యుండు దోరి కుటిల✽వ్యాపార వేడ్కం బరాం
గనలం జూచినయట్లు గా దిదియుఁ ✽ జక్కం జూడుమా తెంపు మే
కొన నీ కెత్తినకాలదండ మగునా✽యుద్దండదోర్దండమున్. 818

చ. వెఱచినఁ బోవ నీ నని ✽ వింశతిబాహుఁడు నవ్వి యోరి న
న్నొఱవక ప్రేయు మున్న మఱి ✽ నిన్ను వధించెద నన్న బంట వౌ
టెఱుఁగుదు లేర ముచ్చిలి మ✽హీసుతఁ దేఁ జనునే దురాత్మ నీ
వెఱుఁగవె నన్ను [1]నక్షకుప✽యిం దొలుప్రే టలనాఁడు చెల్లదే. 819

ఉ. అంచు రథంబుపై కెగయ ✽ నల్కఁ గలంబుగఁ బెన్నురంబు న
క్రంచగుఁ డొత్తి వ్రేసిన న✽తండు చలించుచు వానిపైకి లం
ఘించి పవిప్రచండ ముగు✽కేలన మా ఱొనరింప మూర్ఛ త
న్మ్రంచిన వ్రాలె వాఁడును గ✽నుంగొని యార్చిరి నింగి నిర్జరుల్. 820

తే. అంతనద్దశకంధరుం ✽ డంతలోన, తెలిసి హనుమంతుఁ జూచి నీ✽బలము మెచ్చ
వచ్చె నీదుప్రేటునఁ బంక్తి✽వదనుఁ డమర, వైరిప్రేతలోకముఁ జూచి✽వచ్చె నౌర.

క. నావుడుఁ గపివరుఁ డిట్లను, రావణ యిది యేటివ్రేటు ✽ ప్రాణములోడన్
నీ వుండఁగ నిట్టులు నా, లా వేమి నుతించె దేను ✽ లజ్జింప నిసీ. 822

క. అని పలికి యింకఁ బిడికిటఁ,గొను మొకపో టనిన నతఁడుఁ✽గొను మంచు నురం
బున కెత్తి వొడువ నప్పా,వని రక్కసు లార్వ నేల ✽ వస మఱి వ్రాలెన్. 823

వ. ఇట్లు విసంజ్ఞుం డై పడినహనుమంతుం గనుంగొని చెలంగుచు రావణుండు ప్రహస్తాంతకుపైఁ దేరు దోలించి మహోరగసంకాశంబు లగుశిలీముఖంబులు పరఁగింపఁ జలియింపక యతండును లంకామలయశిఖరిశిఖరంబు పెఱికి చద లద్రువం బూఁచి వైచిన. 824

ఉ. ఏడువెడందతూపుల సు✽రేంద్రవిరోధియు దానిఁ దోన తు

1. నక్షకుని నే పఱఁగాఁ దొలుప్రేటు లాడఁగన్.

న్నాడఁగ నంతలోనఁ బవనాత్మజుఁడుం దెలివొంది కయ్యపుం
బాడి దలంప శత్రుఁ డొరుపాల్పడి యుండఁగ వానిపైఁ జనం
గూడదు తప్పఁ దప్పె నని కోల్తల గోరుచు నుండె నత్తఱిన్. 825

సీ. వెండియు నీలుండు వివిధవృక్షంబులు, పెఱికి పైపై వైచినఁ జెలుచ వానిఁ
బంక్తికంఠుఁడు పెక్కుభల్లసంహతులచేఁ, గ్రొక్కారుమేఘంబు కొండనిండ
బలువాన గురిసినపగిది నమ్ములఁ గప్ప, నప్పుడవ్వీరుండు నల్పగాత్రుఁ
డై దిక్కులద్రువంగ నార్చుచు లంఘించి మొగి ధనుఃకోటిపై ముకుటపంక్తి
పైఁ [1]బతాకపై గొడుగుపై బహువిచిత్ర, భంగి దాఁటుచు లక్షింపఁబడక తప్పి
పడక వ్రేటు పోటున కగపడక లీల, నలిపె నుభయసైనికులు నాశ్చర్య మంద.

ఉ. అంత నిశాచరేంద్రుఁ డనలాస్త్రము నారి నమర్చి యోరి నీ
గంతు లడంగిపోవ నినుఁ గాలునిఁ గూర్చెద నంచు నేయ మే
నంతయు నర్చులం గమర నాకపివీరునిఁ గప్పె నాశరం
బంతియ కాని జీవమున కల్గదు తప్పితృశక్తి గావునన్. 827

వ. ఇట్లు మహాస్త్రజ్వాలావృతుం డగుచు నీలుండు. 828

శా. తాఁకెం జిచ్చది నచ్చె వీఁడు రిపుచేతం జూడుఁ డంచున్ దెసల్
సోఁకం బెద్దయెలుంగునం దరుచరస్తోమం బొగిం బల్కఁగాఁ
దోఁకం బుట్టినమంట యుల్కపగిదిం దోపంగఁ బెన్మ్రోఁతతో
మోఁకా లూఁదుచు నేల మోవఁ బడియెన్ మూర్ఛాదశామగ్నుఁ డై. 829

ఆ. అతఁడు వడినఁ జూచి యార్చుచు మేఘంబు, పగిదిఁ దేరు మ్రోయఁ బంక్తిముఖుఁడు
నంగరాభిముఖుని సౌమిత్రిఁ జటులలం, కారఘోరచాపుఁ గదిసి నిలిచి 830

— రావణలక్ష్మణుల యుద్ధము. —

ఉ. పుట్టల రోఁజుచున్ నిదురవోవుమహాహులభంగిఁ దూఁగులం
బెట్టిన మ్రోఁగుచున్నయవి పెక్కుదినంబుల కేని నాజు లే
పట్టున లేక నాకినుకఁ బడ్డజటాయువునీకలం గఱుల్
గట్టినక్రొత్తబాణములు కాంచనపుంఖములన్ వెలుంగుచున్. 831

చ. కుడువవు కట్ట వన్నపయికూరిమి నీవిధి ద్రిప్పి తేరఁగా
నడవుల నాకలంబు దిని యంతట నుండక చిచ్చువాతికిన్
మిడుత గడంగుచందమున మృత్యుముఖం బగునాదుచూడ్కికిన్
వడిఁ జనుదెంచి [2]నా తెరువు వచ్చితి చచ్చితి గాక నావుడున్. 832

క. నిను నీవ పొగడుకొనియెదు, ఘను లాత్మస్తుతికి నన్యగర్హకుఁ జొర రే
ధనువు గొని యుండ రజ్జుల, పని యేటికి వత్తుగాక బవరంబునకున్. 833

సీ. అని లక్ష్మణుఁడు వల్క నద్దశకంధరుం, డే డుగ్రబాణంబు లేయుటయును

1 బతాకపై గొడుగులపై విచిత్ర. 2 తీతెంగు వచ్చితి.

కనుఁగొని యాతండు । గరుడతుండాహతిఁ, బడగలు దెగిపడ్డ । పన్నగముల
గతి గానఁబడ నవి । ఖండంబులుగ నెల, వంకకోలలఁ ద్రుంచి । వైచి మఱియు
మిడుఁగుఱు లెగయంగ । మిడుతలతఱుచుగా, నుడుమార్గ మద్రువంగ । నుగ్రభంగి
మెఱయఁ బింజపింజ । గఱచుచుఁ బాఱ నం, దంద పఱవు మెఱుఁగు । టంపగములు
నడుమ నఱికి వైచి । నానాశిలీముఖ, వృష్టి నతనిఁ గప్పి । విక్రమించె. 884

ఉ. దానికి నద్దశాననుఁడు । తద్దయు విస్మయ మంది తాను న
మ్మానవవీరుఁ డేయుశర । మండలి ద్రుంచి విరించిదత్తకా
లానలకల్పబాణహతి । నాతనిఫాలము నొంచె మూర్ఛకుఁ
లోనయి చాపముష్టి వద । లుం గనుమూఁతయుఁ గల్గునట్లుగన్. 885

వ. ఇట్లు విసంజ్ఞుం డై కొండొకవడికిం దెలిసి రఘువీరానుజుండు. 886

క. విలు నడిమికిఁ దెగిపడ నొక, బలుతూ పడరించి మూఁడు । బాణమ్ము లుర
స్థలి దూఱ నేయ మూర్ఛా, కులుఁ డై యతఁ డట్టకేల । కుం దెలిసె వెసన్. 887

చ. జలరుహజన్ముచేఁ గనిన । శక్తి కరంబునఁ బూని ధూమసం
జ్వలితపటుచ్ఛటచ్ఛటర । వప్రచురజ్వాలనోద్భటచ్ఛటా
కులముగ వైవఁ బైఁ బఱవు । కోలలఁ జిక్కక వచ్చి బిట్టురః
ఫలకము దూఱినం బడియెఁ । బర్విన మూర్ఛ నతండు భూస్థలిన్. 888

వ. ఇట్లు పడినం గనుంగొని సౌమిత్రిం బట్టికొనిపోవువాఁ డై యన్నిలింపారాతి తేరు డిగ్గనుఱికి కదిసి యవుడుకఱచి పొదివి యెత్త శక్తిపాతసమయంబున నరాతిదుర్ధరంబుగా వైష్ణవం బగుమహాతేజంబు ప్రవేశించుటం జేసి యిట్టట్టుం గదల్పం జాలక కైలాసశైలం బెత్తినభుజదండంబులు బెండువడం బెనంగు నెడ హనుమంతుండు పఱతెంచి నిశాట విడువిడువు మనుచుం దిరిగిపడం బిడికిట వక్షంబు పొడిచి సురగణంబు లార్వ నన్నరేంద్రనందనుం గొని రామచంద్రుసమీపంబునకుం జనియె నమ్మహాశక్తియు నతని విడిచి మగిడి వచ్చె రావణుండునుం దెలిసి రథారూఢుం డై పొలిచె నాసమయంబున. 889

క. జననాథుఁ డనికిఁ గడఁగఁగ, హనుమంతుఁడు కేలు మొగిచి । యవనీశ దశా
ననుఁడు రథి గాన నే వా, హన మయ్యెద నీకు ననిన । నగుఁ గా కనుచున్.

తే. అతనివె న్నెక్కి యైరావ । తాధిరూఢుఁ, డైనజంభారి చెలువున । నగ్గలించి
శింజినీఘోరటంకృతుల్ । సెలఁగ నన్న, రేంద్రనందనుఁ డెలుఁగెత్తి । యిట్టులనియె.

## రామరావణుల ప్రథమయుద్ధము.

ఉ. నాకు మహాపకారము మ । నంబున నోడక చేసి యింక నే
లోకము దూఱువాఁడవు వె । లుంగుచు నీ వెనువెంట నాశరా
నీకము వచ్చినం దులువ । నిన్నిట నెవ్వరు గాచువారు ది
క్పాకమలాసనప్రభృతు । లైన వధింపక రాముఁ డేఁగునే. 842

క. నీవా రైనఖరాదుల, త్రోవయె నీ కనిన నధికరోషముతో నా
రావణుఁడు విల్లు మ్రోయం, బావకపటుబాణపంక్తిఁ బావని నేసెన్. 843

వ. అప్పు డారఘువీరశేఖరుండు గన్నుఁగవఁ గెంపు నిగుడం గనుంగొనుచు నప్పౌలస్త్యుం గదిసి. 844

ఉ. ఒక్కట నారిఁబోసి వివిధోగ్రశరంబులఁ దేరిచక్రముల్
చెక్కలు సేసి పైపొడవు చిందఱవందఱ లాడి వాజులన్
ప్రక్కలు వాపి సూతుఁ బడ వైచి పతాక దళించి కైదువుల్
చక్కఁగఁ ద్రుంచి యెల్లి పలుచందములం బొలియించి వెండియున్. 845

తే. అశనిసంకాశ మగునొక్కనిశితశరము, గొని రయంబున నురమేసి కొంకఁ జేసి
యర్ధచంద్రబాణమునఁ దీర్పార్పు లడరఁ, దోన కోటీరపంక్తియుఁ ద్రుంచివైచె.

వ. ఇట్లు రావణుండు పరిభవింపంబడి కోఱలు వెఱికినమహాసర్పంబు తెఱంగున దర్పం బుడిగి మనంబున. 847

చ. వరుణునిపాశముం ద్రిదశవల్లభువజ్రముఁ గాలుదండముం
సురలసమస్తశస్త్రములుఁ జూచినవాఁడన కాదె యీరఘూ
త్తరువిశిఖంబులంత బెడిదంబులు గావని నాకు నంచు మై
విరవిరవాఱఁ జేసడలి విల్లు పడం గని రాముఁడిట్లనున్. 848

ఆ. ఇంతదాఁకఁ గయ్య మినసుతాదులతోడఁ, జేసి యలసినట్లు చేష్ట దక్కి
యున్నవాఁడ వగుట ని న్నింక నే నేయ, డప్పి దీర్చుకొని కదుంగు మనిన.

క. మీఱినభయమున రామునిఁ, దేఱి కనుంగొనఁగ నోడి ధృతి కదుఁ దూలన్
వేఱొకని తెరిపైఁ బడి, పాఱి యతఁడు లంక సొచ్చెఁ బౌరులు బెదరన్. 850

వ. అంత నమ్మహీకాంతుండును సౌమిత్రిమిత్రనందనాదుల విశల్యులఁ జేసి యరయుచుండె రావణుండును బరాజయఖిన్నమానసుండగుచు నాస్థానంబు సొచ్చి వచ్చి సింహాసనంబున నుండి కొండొక చింతించి రాక్షసుల నవలోకించి. 851

సీ. నలినగర్భునిచేత నాకన్నవరము సు, రాసురగంధర్వయక్షసిద్ధ
విద్యాధరాదులవెంట నేభయమును, లేకుండ నింతియ లెక్కగొనక
నరుల వానరుల నేనాఁడు వాక్రువ్వన, యటు గాన నేఁ డింత లయ్యె మనల
గెలిచినయలదశగ్రీవుండు మర్త్యుల, కుగ్రాహవక్రీడ నోడె ననుచు
నాకు నొవ్వనిదిక్పతుల్ నవ్వ నట్లు, పూని చేసినతప మెల్ల బూదఁ గలయ
నిట్టిదురవస్థఁ బొందితి నేమి సెప్పఁ, గలదు కుంభకర్ణుని మేలుకనుపుఁ డింక.

ఉ. నిర్జరదానవాదుల నదనిం దృణరూపముగాఁ దలంచున
త్యూర్జితబాహువీర్యుఁ డతఁ డుండఁగ నన్యులఁ బంచి రాముపుల్
దుర్జయు లంచుఁ జిత్తమునఁ దూలఁగ నేటికి నెన్నిభంగులం
గర్జము నూడఁగాఁ నిదియ కాలము దెల్పుఁగ నమ్మహాబలున్. 853

## కుంభకర్ణుని మేల్కొలుపుట.

వ. అని పనిచిన యూపాక్షమహోదరు లాదిగా రక్షోవీరు లనేకంబు లగుభోజ్య
వస్తువులు గొని చని పుణ్యగంధప్రవాహతరంగితద్వారంబును సముంచితకాం
చనకుట్టిమంబును మాణిక్యదీపకళికాభిరామంబును యోజనత్రయవృత్తంబును
నైనతదీయశయనగృహమహాద్వారంబుం బ్రవేశించి పురోభాగంబున. 854

సీ. శ్వాసమారుతవేగ వశమున ముక్కుగ్రోళ్ల, వెలికి లోనికి జంతువితతి వాఱఁ
బొరి గుఱుపెట్టుచోఁ బొంగరించురవమున, గహ్వరవివరంబు గలయఁ జెలఁగ
ఘుటఘుటాయితదంత కోటిఘట్టనఁ గల్గు, వదనవిక్రియఁ గాపువారు బెదర
గీర్వాణసంగర క్రీడలు వాక్రుచ్చు, కలవరింతల భూతగణము గలఁగ
భూరిఘూత్కృతు లురగేంద్ర బుద్ధిఁ జేయ, నుగ్రగతి నిద్రవోవుచు నుండఁ గాంచి
రద్భుతాకారసమరాట్టహాసదళిత, ఘోరదిక్కుంభికర్ణు నక్కుంభకర్ణు. 855

ఉ. కాంచి నిగుడ్చునూర్పుబలు గాలి మొగంబున సోఁకనరించి శం
కించుచుఁ జేరి చేరి తమకించుచుఁ దెచ్చినపచ్చిమాంసముల్
గాంచనపర్వతోన్నతము గాఁ బెనుప్రోవిడి మద్యభాండముల్
డించి మహారవంబుగఁ బఠించిరి తద్విజయాంకగీతముల్. 856

తే. అంతఁ దెలియకున్న నార్పులు బొబ్బలుఁ, బరుషభంగి బెరయఁ బటహమురజ
శంఖకాహళాదిసంకులరావముల్, మొరయఁ జేసి రొక్కమ్రోఁత గాఁగ.

ఉ. ఆనినదంబు లంకఁ గల యంతయు నిండి మహోగ్రసాగర
ధ్వానము మ్రింగ వెండియు నతండు వొగర్చుచు నున్నఁ జూచి తో
త్తో నురుడిండిమప్రముఖతూర్యరవంబులు మ్రోయుచుండఁగా
వీనులక్రింద బిట్టు పదివేవురు రాక్షసు లార్చి రేపునన్. 858

సీ. అంత లేవకయున్న నచలశృంగములు పైఁ, నెత్తి వైచియు నోలి నినుపగదలు
గుదియలు రోఁకండ్లుఁ గొని వీఁకమోఁదియుఁ, బిడికిళ్లఁ బొడిచియుఁ బృథులహస్త
తలములఁ జఱచియు దంతావళంబులఁ, గొలిపి మట్టించియు ఘోటకముల
మేను ద్రొక్కించియు మీసలు దిగిచియుఁ, గాఱుల నిఱికియు గర్దభముల
మహిషములమీఁదఁ దోలియు మఱియు నాసి, కాబిలంబులఁగ నూర్పులు గడలుకొనఁగ
జెరమలొక్కలావున నొత్తి చెవులలోన, గూల్చిరుడికెడి తైలంపుఁ గుంభశతము.

వ. ఇవ్విధంబున నందఱు నిశాచరులు మేలుకనుప నట్టకేలకు నద్దశగ్రీవానుజుండు.

చ. తెలిసి మహాసమీరగతి దీర్ఘతరం బగునూర్పు పుచ్చి బా
హులు ఫణిరాజభోగతులితోగ్రతఁ జాఁగఁగ నీల్గి బాడబా
నలశిఖమాడ్కి వక్త్రగుహ నాలుక దోఁపఁగ నావులించి దీ
ప్తు లడర విచ్చె నూతననభోమణిమండలచండనేత్రముల్. 861

ఆ. అంత రజనిచరులు నత్యంతభక్తిమై, హస్తయుగము మొగిచి యంతనంతఁ

బాసి నిలువ శయ్యకు నాసీనుం డగుచు న,వ్వీరుం డిట్టు లనియె వారిం జూచి.

శా. నన్నుం గార్యములేక మేలుకనుపం డక్తంచరేంద్రుండు ము
న్నన్నండుం బనుపండు [1]మార్పడఁగ నయ్యింద్రాదు లుద్వృత్తిమై
నున్నారో మనతోడ దానవులు దారొండెం విరోధించిరో
నన్నంపుంబని గాదు చూడ నది యోచించంగం దెలింగింపుఁడా. 863

వ. అనిన యూపాక్షుం డిట్లను రాఘవులు వనచరులం గూడుకొని సముద్రంబు గట్టి కడచి వచ్చి మనపురంబు దిరిగిరా విడిసి మహాభయంబు సేయుచున్నవారు నేఁడు పంక్తిగ్రీవుండు సంగ్రామంబున రాముని కోహటించి పరాజయదైన్యంబు సహింపంజాలక నిన్ను మేల్కనుపం బనిచె మఱియును గలుగువిశేషంబు లతనిచే తన వినం దగు ననుచు విన్నవించిన. 864

ఉ. మానవగూఢరోషశిఖ మండఁగ నూఁదినచంద మైన కనుం
గోనల విస్ఫులింగములు ఘోరగతిం జెదరంగఁ దీవ్రదం
ష్ట్రానిబిడోరుగోచులు గడల్కొన నాడులు దీడికొంచు నే
మీ నరు లిట్లు క్రొవ్వి పులిమీసల నుయ్యెల లూఁగఁ జూచిరే. 865

క. అన్నరులఁ గపిబలంబుల, ము న్నాఁకలి వోవ మ్రింగి ముఖమున మఱి మా
యన్నం గొలువఁగ వచ్చెద నన్న మహోదరుఁడు వల్కె నాతనితోడన్.

వ. మిమ్ము మేలుకనిపితోడి తెమ్మని రాజు మమ్ముం బనిచినాఁడు మీకు నతండు సెప్ప వినవలసినకార్యంబులు గలిగి యుంటఁ నారగించి విచ్చేయుదురు గా కనిన ముఖప్రక్షాళనాదికృత్యంబులు సలిపి ము న్నమర్చినపచ్చిమాంసరాశికి మద్యభాండంబులకుం దోడు పదికాఁజెనుఁబోతులు మున్నూర్గురు మనుష్యులు నేనూఱజంబులు వేయివరాహంబులు రెండువేలు చరణాయుధంబులు దావాగ్ని తృణంబునుంబోలె నమలి యారెండువేల ఘటంబుల [2]పిశితాసవంబులుఁ బెక్కుకడవల నెత్తురుఁ ద్రావి రక్షోభటపరివృతుం డై రాజమార్గంబున మిన్నందినపొడవునం బొలిచి దశముఖునాస్థానంబునకుం జనుదేర లంక వెలి నున్న బలీముఖులు గనుంగొని భీతిం బఱవ రఘువరుండును ధనుఃపాణి యగుచు విభీషణున కి ట్లనియె.

సీ. ఇది యేమహాభూత మీయద్భుతం బేమి, నక్తంచరోత్తమ నాకుఁ దెల్పు
మనుడు దశగ్రీవునకనుజుండు నాకగ్ర,జుఁడు గుంభకర్ణుఁ డర్కసూనుం డితఁడు
రక్కసులం దెల్ల నెక్కుడులావును, ఘనతరదేహంబుఁ గలిగి యుండు
జననాథ యితనికి సహజశక్తియు కాని, తపమునఁ గన్నశక్త్యంబు గాదు
జనన మైనయపుడ జంతుకోటుల మ్రింగ, వాసవుం డెఱింగి వచ్చి వజ్ర
ములక నైవ దాని కడల కివ్వీగుండు, ధరణి యస్రువ నతనికదంతి కెగిరి.

క. తద్దతనువు దాకి మొదలికి, జన విఱిగినదానిదంతశకలంబు వెనం

---

1. మాఱ్పఱచిరో యింద్రాదు లుద్వృత్తులై. 2. శిశిరాసవంబులు.

గొని యురము వ్రేయ నింద్రుం, డనిమిషయుతుఁ డగుచుఁ బాఱి ౹ యజునకుఁ జెప్పన్.

క. ధాతయుఁ దనసమ్ముఖమున, కీతనిఁ బిలిపించి చూచి ౹ యేమీ నిన్నున్
మీతండ్రి విశ్రవసుఁ డిటు, భూతద్రోహంబు సేయఁ ౹ బుట్టించెనొకో. 870

తే. అనుచుఁ గోపించి చచ్చినయట్లు నిద్ర, వోవుచుండు నీవని పల్కి ౹ నావులింత
లడరఁ బెనుమ్రబ్బువొడమిన ౹ నవుడ వ్రాలె, నంత నద్దేవుకడకు ద౹శాస్యుఁ డరిగి.

క. తనపెట్టినచె ట్టివ్వఁడు, ననుకంప దొఱంగి పెఱుకు౹నా ఫలకాలం
బున నెంతతప్పు గలిగిన, మనమున సైరింపఁ దగదె ౹ మనుమఁడు గాఁడే. 872

క. అప్పుడు వెడలినమీఁపలు, కెప్పాటను దప్ప దింక ౹ నీనిద్దుర వీఁ
డెప్పుడు దెలియు విహారం, బెప్పుడు గను భోజనాదు ౹ లెప్పుడు సలుపున్. 873

తే. అనిన నప్పితామహుఁ డిట్టు౹లని యెనాఱు, నెలలకొక నాఁడు భోజనా౹దులకుఁ దెలియు
నాఁడు వీఁడ జయ్యుఁ డురిత్త౹నాఁడు దెలుప, బలిమిఁ దెలియునాఁ డీతని౹బలము దూలు.

చ. అన నతఁ డాతనిం బురికి ౹ నప్పుడ తెచ్చి మహాగుహాంతరం
బున జతనంబుతో నిదుర ౹ వోవఁగ రక్ష యొనర్చి మున్ను మే
ల్కనుపక యుండు నెంతపని ౹ గల్గిన నేఁ డిటు తెల్పినాఁడు నీ
కనితల నోడి పాఱె సమ౹యంబున కోడక సాహసంబునన్. 875

వ. నేఁడు జాగరదినంబు గాదు గావున నితండును దేవరచేతఁ జచ్చు నవశ్యంబు నంత కివ్వనచరులు బెదరకుండ నిది యొక్క దారుయంత్రం బని మనవీటం జాటం బంప వలయు ననిన నన్నరేంద్రుండు నీలునకుఁ దత్ప్రకారం బానతీ నతండును నట్ల కావించి ఋషభశరభాంజనేయగంధమాదనమైందద్వివిదకుముదపనసనల సుషేణధూమ్రజాంబవత్ప్రముఖంబుగా దళంబుల గవంకులకు నడపించె నచ్చటఁ గుంభకర్ణుండుఁ బురాంగనావిరచితమంగళోపచారంబు లెడనెడఁ గయికొనుచు నాస్థానంబు సొత్తెంచి యన్నచరణంబులకెఱఁగి తదీయనియోగంబున నర్హాపీఠంబునం బొలిచి కొండొకదడవున కిట్లనియె. 876

క. నను నిట్లు మేలుకనుపం, బనిచితి నిను నల్గఁ జేసి ౹ ప్రాణము లివు డొ
ల్లనివాఁడు దేవ యెవ్వం, డనవుడు నయ్యనుజుతోడ ౹ నతఁ డిట్లనియెన్. 877

క. అద్రిచరసేనఁ గొంచు స,ముద్రము బంధించి కడచి ౹ మువ్వురునఁ ద్రికూ
టాద్రి బలసి యున్నా రదె, ముద్రితలంకాకవాట౹ముగ దాశరథుల్. 878

ఉ. ఇందుఁ బ్రహస్తుఁ డాదిగ న౹నేకులు రాక్షసు లాహవంబునన్
మ్రందిరి పేర్కొనం బరఁగు౹మర్కటవీరుఁడు నన్నవాఁడు లేఁ
డం దో[illegible]ండు నా కిటు మ౹హాబలశాలివి నీవు గల్గ నం
క్రందనుఁ జీరికిం గొనని౹గర్వము సర్వముఁ దూలె నే మనన్. 879

స్రగ్ధర. శస్త్రాస్త్రప్రౌఢిఁ దూలం ౹ జమరుము నరులం ౹ జంపు శాఖామృగాలిన్
విస్త్రస్తం జేయు నన్ను ౹ న్వెసఁ జను మనికి ౹ స్వేళ గా కుండియున్ ర

తుస్త్రీశార్థంబు నిన్నె÷ల్కనుప వలసె లం÷కాచక్రుల్ [1]బాలవృద్ధా
స్త్రస్త్రీశేషంబుగా నం÷డఱుఁ బొలిసినవె÷న్క జయం బేల నాకున్. 880

— కుంభకర్ణుఁడు రావణునకు నీతి చెప్పుట. —

వ. అనిన నవ్వైశ్రవణుండు రావణుం గనుంగొని. 881

తే. మీఁదికార్య మేను ÷ మీమంత్రసమయంబు, నంద చెప్పి పోయి÷నాఁడఁ గాదె
తగవు మాని మేరఁ ÷ దప్పి మోహంబునఁ, జేసి తా ఫలంబు ÷ సేరె నిపుడు.

శా. కామక్రోధమదాతిరేకమున నే÷కగ్రాహివై యుండుని
న్నేమార్గంబునఁ దెల్పవచ్చు నధికుం÷డౌ గ్గేల సైఁచుం బర
స్త్రీ మాయం గొనివచ్చు టేతగవు నీ÷చేఁ గాక సామంతమి
త్రామాత్యాదులు నేఁడు శాత్రవులచే÷నా చచ్చి రూహింపఁగన్. 883

ఆ. మొదల వలయువిధము ÷ పిదపఁ గావించుట, తుది నొనర్చు దాని÷దొలుతఁ జేత
సంధివిగ్రహాది÷సమయజ్ఞు లగునీతి, శాస్త్రవిదులు నడచు÷సరణి గాదు. 884

వ. రాజులకు ధర్మార్థకామంబు లర్హాకృత్యంబు లం దెద్ది దొడంగిన నితరబాధకంబు గాకుండ నాచరించు టొప్పు నట్లు చొప్పడకున్న దేశకాలంబు లెఱింగి ప్రబలత్వదుర్బలత్వంబులు చింతించి గరిష్ఠంబగునవిధంబు పట్టవలయుఁ ద్రివర్గసిద్ధికిఁ బరమకారణంబు నీతియు దానికి నితాంతమంత్రపర్యాలోచనంబును దదనుష్ఠానంబును గృతసమయరక్షణంబును విశేషపరిజ్ఞానంబును మిత్రభావవివేకంబును ననం గల్గునైదుయోగంబు లవయవంబులు మంత్రుల మనుచు వృథాభిమానంబున నర్థశాస్త్రతత్త్వంబుల నెఱుంగని మొఱకులు చనవున బీఱువోవం బలుకుదురు కాదేని హితులట్ల యనుకూలశాత్రవంబు జరపుదు రీరెండు దెఱంగులవారలం దెలిసి కార్యవ్యవహారంబుల రహస్యబాహ్యులం జేయనివానిసమస్తకృత్యంబులు నిరర్థకంబులు గావున సామదానభేదదండంబులు క్రమంబునం గావింపందగియుండ మొదల నపాయబహుళం బగుచతుర్థోపాయంబున కనుమతించి నీవారు నీవును ముంగొంగునఁ జిచ్చు ముడిచికొన నపేక్షించినా రెవ్వాఁడు విహితమార్గమ్ము విడిచి వర్తించు నమ్మూఢుండు తనయత్నంబు లెల్ల విఫలంబులై పోవం జెడిపోవునని నయనిష్ఠురంబుగాఁ బలికిన బొమలుముడివెట్టుచు నద్దశగ్రీవుండిట్లనియె.

ఆ. పెద్దవాఁడ నాకు ÷ పెంపు దూలఁగ నాకు, నీతి గఱప నేల ÷ నీకు నిపుడు
పగఱవలన నయిన÷భయము వాపుట దక్క, నొండుమాటలాడ÷ననుచితమగునె.

చ. అనిన నతండు గేల్మొగిచి ÷ యన్నకు నిట్లను నొక్కనాఁడు మే
ల్కని వనభూమి నే మెలఁగఁ ÷ గా నట నారదుఁ డంబరంబునం
జని చని తాన నాకడకు ÷ సమ్మద మారఁగ వచ్చినం గనుం
గొని యెటునుండి రాక మునికుంజర నా కెఱిఁగింపు మావుడున్. 887

1. 'బాలవృద్ధార్తస్త్రీ' అనియుం గలదు.

వ. మేరుశైలంబున దేవసభ నుండి రాక విను మచటివృత్తాంతంబు లోకంబులకు
మీరు సేయు నపకారంబులు సహింపం జాలక హరిహరహిరణ్యగర్భులు లోక
పాలురు దివాకరప్రభృతిగ్రహంబులు మరుద్వసుగంధర్వగుహ్యకగరుడోరగప్ర
ముఖామరగణంబులు నఖిలమునులునుం గూడి విచారించుసమయంబున బృహ
స్పతి వేల్పులెల్ల విన రావణుం డింద్రు భంగించె హుతాశను నోటువుచ్చె నంత
కుం బఱపె వరుణుం బరిభవించె జగత్ప్రాణు ధిక్కరించెఁ గుబేరు నాక్రమించెఁ
జంద్రాదిత్యుల తేజంబు లడంచె జన్నంబులు చెఱిచె నందనోద్యానంబు పెఱికె
దివ్యాంగనలం జెఱలువట్టె మఱియు ధర్మాత్ముల ననేకులం జంపె నింక వానివ
ధోపాయంబు చింతింపుఁడనినం బితామహుండు మదీయవరంబున వాఁడు సురా
సురుల కజయ్యుండు నరవానరులచేతం జచ్చు నది గారణంబుగా విష్ణుండు దశ
రథునకుఁ బుత్రచతుష్టయంబుగా జనించు నిలింపులు తదనుచరులై జనియించి
యాతనికిఁ దోడ్పడుం డనుచు నంతర్హితుం డయ్యె నంత నందఱుం దమతమ
మందిరంబులకుం జని రని యమ్మహానుభావుండు చెప్పినాఁడు గావున రామచం
ద్రుండు నారాయణుండు బలిముఖులు బర్హిర్ముఖులు లిది నిక్కంబు నన్ననుగ్ర
హించి విగ్రహంబు విడిచి సీత నిచ్చి పుచ్చి రాక్షసకులంబును లంకను రక్షిం
పుము మనకొలుచు బ్రహ్మకు నుపాస్యుం డగు నద్దేవదేవునకు నమస్కరించిన
నేమి కొఱంత యన్న నట్టికర్ణకఠోరంబులైన కుంభకర్ణువచనంబులకుఁ గొండొక
తడవు వితర్కించి. 888

ఉ. అక్కట నీకు నిట్లు భయ మందఁగ నేటికి వచ్చె రాఘవుం
డెక్కడ దేవతామహిమ యెక్కడ నారదువార్త వోవ ని
మ్మిక్కథ లేల విష్ణుఁ డన నెవ్వఁడు వేలుపు మేన నుండఁగా
మ్రొక్కనివాఁడ నాతనికి మ్రొక్కుదునే మనుజత్వ మొందినన్. 889

క. విను రాముఁడు విష్ణుం డా, తనితమ్ముఁడు లక్ష్మణుండు దానలజిష్ణుం
డినసుతుఁడు భర్గుఁ డైనను, వనరుహగర్భుండు జాంబవంతుం డైనన్. 890

ఉ. నీ విటు విన్నవాఁడవఁట నిక్కము గాఁ దన నాకు నేటికిన్
దేవహితంబుగా మనుజదేహము గైకొని వచ్చుటం బ్రతి
జ్ఞావిధి చొప్పడన్ మనలఁ జంపక విష్ణుఁడు రిత్తవోవునే
వేవురు చెప్పినం గృపణవృత్తి కొడంబడ నీను జానకిన్. 891

ఉ. వామనమూర్తి యై మొదల వచ్చి పదత్రయమాత్ర మర్థి యై
భూమి నొసంగ వేఁడి పరిపూర్ణమనోరథుఁ డయ్యె నంతఁ బో
కామహితాత్ముఁ డైన బలి నంటఁగఁ గట్టి రసాతలంబున
న్బా మఱిఁ ద్రోచు నట్టికుహనాపరు సంధికి నమ్మవచ్చునే. 892

ఆ. కాన విష్ణుఁ డైనఁ గానిమ్ము రాముతో, విగ్రహంబె కాని వినయ మొల్ల

నని కిఁ జాలుదేని ౹ చను చాలవేని నీ, పోటు వచ్చె నిదుర ౹ వోవఁ బొమ్ము.
చ. వెఱచిన నే మనం గలదు ౹ వే చను మెన్నఁడుఁ జావు లేదు ని
న్నెఱిఁగి యెఱింగి నిద్రితుని ౹ నెవ్వరుఁ జంపరు నీకు నేమ మెం
దఱు రిపు లెత్తి వచ్చిన మ౹దం బడఁగించెద నేన విష్ణునిం
బఱపెద విష్ణులో౹కములు ౹ భస్మము సేసెదఁ గీర్తి మించెదన్. 894
క. మును నాకు నోడి పోయిన౹యనిమిషు లఁట గ్రోఁతు లైన ౹ నఁట లా వెక్కెన్
మనుజాళను నోర్వఁగ హరి, మనుజుఁ డయ్యెనఁట యిట్టి౹మాటలు గలవే.
తే. జనకసుత లక్ష్మి రాముండు ౹ వనజనాభుఁ, డగుట నిక్క మెఱింగియు ౹ నితని చేత
బవరమునఁ గూలి కైవల్య౹పదము నొంద, సీతఁ దెచ్చితి నింకేమి౹సెప్పఁ బొమ్ము.
చ. అనవుడుఁ గుంభకర్ణుఁడు దశ౹శాస్యుఁ గనుంగొని దేవ నీమనం
బునఁ బరితాప మేటికిని ౹ బొందెదు వెల్లును సామ మొల్లవే
నను వెనఁ బంపు రాఘవుల౹నామ మడంచెద భానుసూనుము
ఖ్యనిఖిలవానరావళుల ౹ నాఁకలి వోవఁగ మ్రింగి పుచ్చెదన్. 897
క. వారిధిఁ గలఁచెద వసుధ వి,దారించెద దిక్కరులమ౹దం బడఁచెద నే
మేరువుఁ బెఱికెదఁ గూల్చెదఁ, దారాహిమధామతీక్ష్ణ౹ధాముల నెల్లన్. 898
క. పొడగాన రాఁడు రణమునఁ, బడఁడు గదా పంక్తికంఠ ౹ పరిపంథులపై
నడరి విభీషణుఁ డేని, న్నడిగెద నెఱిఁగింపు మనఁగ ౹ నతఁ డిట్లనియెన్. 899
క. కొలువున నాకప్రియములు, వలికిన నే నలిగి తన్నుఁ ౹ బదహతిఁ జేయన్
నలువురు మంత్రులతో నిలు, వెలువడి రఘురాముశరణు ౹ వేఁడఁగఁ జనియెన్.
వ. అనిన నతం డొక్కింత విచారించి దేవా సహోదరస్నేహంబున నీవు మన్నిం చుటం జేసి విన్నవించితి నిటమీఁద నాచేయునంగ్రామం బవధరింపుము శూలహస్తుం డయి నీయనుజుండు కడంగిన శూలికిం దక్కఁ దక్కొరుల కేల సహింపం జొప్పడు నరవానరు లెంతవారే నాయుధంబులు ధరింపక భుజాయుద్ధంబున వారిం బరిమార్తు ననుచు విజృంభించి పలుక మహోదరుం డిట్లనియె.
చ. [1]హరి గిరి వహ్ని గిహ్ని మఱి ౹ యంతకు గింతకు దైత్యు గిత్యు వా
ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధన౹వల్లభు గిల్లభు రుద్రు గిద్రు నం
గరమున నోర్చినట్లు దశ౹కంధర నీకు జయింప వచ్చునే
సురనగధీరు నుగ్రరణ౹శూరుఁ బయోధిగభీరు రాఘవున్. 901
మ. ప్రబలుం డెంతయు రాముఁ డారణకళా౹పారంగతుం డెల్వ బా
హుబలం బొక్కఁడ నమ్మి పోఁ దలఁచునీ౹యుత్సాహ మేనీతి న
ర్వబలోపేతుఁడ వై కడంగి రిపుగ౹ర్వస్ఫూర్తి వారింపు దై
వబలం బున్నటు లుండెఁ బౌరుషముతో౹నం బోక యుక్తం బగున్. 902

1. ఈపద్యము కొన్ని ప్రతులం గానిపించెడి.

చ. అనవుడు వానిమాటలకు నాతఁ డదల్చుచు నన్నుతోడ ని
ట్లను శరదంబుదంబుక్రియ నాడెడుగర్వము లిప్పు డేటికి
న్వనియెదుగాక నీ వధిప నీచెవు లారఁగ నేఁడు నన్ను ము
న్నని మనవారి నందఱ శిరార్చుల నేర్చినరాము నోర్చెదన్. 903

వ. అని పలికిన నారావణుండు సంతోషించి నీయంతవీరుం డెవ్వం డేను మదీయ కార్యసిద్ధి బుద్ధిం దలంచి నిన్ను మేలుకనుపం బంచితి నాకుం బ్రియంబు సేయను నీకుం బేరు సేకొనను నిదియ సమయం బసహాయశూరుండ వగు దైనను సేనాసమేతుండ వయి చను మనుచుఁ దాను బూనినమణిహారం బతనిఁ బెట్టి మఱియు ననేకదివ్యాంబరాభరణంబు లిచ్చి గారవించి వీడ్కొలుపుటయు నతనికిం బ్రణమిల్లుచుఁ బ్రదక్షిణంబుగా వచ్చి బహువిధాశీర్వాదంబులు సూతవందిమాగధస్తోత్రంబులు వినుచుఁ దదాస్థానమండపంబు వెడలి సంధ్యాభ్రితరోహితమహీధరంబు తెఱంగునం గాంచనకవచధారణంబున ధనుశ్శతపరిణాహంబును సప్తశతవ్యాయామప్రమాణంబును నైనమేను వెలుంగ సహస్రభారాయసకల్పితంబును దేవదానవభయంకరంబును నద్భుతానలచ్ఛటోద్గారకరాళంబును గనత్కనకాలంకృతంబును రక్తమాల్యాభిశోభితంబును నింద్రాయుధసముజ్జ్వలంబును ననేకప్రాణిశోణితదిగ్ధంబును నగుశూలంబు కేలం గ్రాలఁ గరవాలభిండివాలప్రముఖప్రహరణంబుల నదగులు సెదర నూతంగతురంగాదిబలంబులతోడ రక్షోభటులు రా శంఖభేరీముఖతూర్యరవంబులు క్రందుకొనం జమూసముద్ధూతధూళిధూసరితదిశాముఖుం డగుచు నద్దశముఖానుజుం డెడనెడఁ బెక్కుదుర్నిమిత్తంబులం గనుంగొనియు వానిఁ గైకొనక లంకాప్రాకారంబుఁ జెంగగొని నిజదర్శనభయంబున వానరులు పెనుగాలిం దూలుమేఘంబులుంబోలెఁ గనుకనిం బఱవఁ బ్రళయభైరవాడంబరంబున నార్చె నాసమయంబున. 904

—కుంభకర్ణునియుద్ధము.—

క. కొందఱు మూర్ఛం జెందిరి, కొందఱు డెందములు పగులఁ గూలిరి భీతిం
గొందఱు దిగ్భ్రమ నొందిరి, కొందఱు రఘువీరువెనుకకుం జనిరి కపుల్. 905

క. నిండం బూచినకింశుక,షండంబులపగిది నుభయసైన్యములు శిలా
కాండప్రముఖప్రహరణ,చండహతులు సమరఁ దుములసమరం బయ్యెన్. 906

ఉ. అత్తఱిఁ గుంభకర్ణుఁడు భయంకరహుంకృతితో మహాశిలా
వృత్తకఠోరవక్షమున వృక్షచరావలి వైచుశైలముల్
దుత్తుమురై వడిం జెదరి తూలఁగఁ దాఁకె నుదగ్రవృత్తి ది
గ్భిత్తినిపాతనోగ్రగతికిం దగ నార్చుచుఁ దీవ్రకోపుఁడై. 907

వ. ఇట్లు సమయింపం దొడంగిన తదీయవిజృంభణంబు సైరింపం జాలక. 908

చ. కడచినభీతి వానరులు కన్కనిఁ బాఱియు గహ్వరంబులం

దొదిఁగియు వాఁగుప్రంతఁ బడి యుండియుఁ జచ్చినయట్టు లుండియుం
జెదరి పయోధి సొచ్చియును సేతువు పట్టియు దైన్య మొంద నం
గదుఁడు చలింప కత్తెఱఁగు గన్గొని తా నెలుఁగెత్తి యి ట్లనున్. 909

ఉ. పాఱకుఁ డేల పాఱెదరు ప్రాణము లెన్నఁటి కింక నీగతిం
బాఱిన భూతముల్ నగవె పార్థివునమ్ములు వీనిపై వడిం
బాఱెదునంతదాఁక ధృతి పట్టఁ దగుం దశదిక్కులం గొనల్
మీఱెదుమీయశంబులకు మే లగుపెంపు దలంపుఁ డీయెడన్. 910

ఆ. పలువు రొకని కిట్లు పాఱిన నే మను,వారు మనకుఁ బూని వచ్చువారు
పాఱి లోకనిందఁ బదుకంటె ననిఁ జచ్చి, బ్రహ్మలోకపదముఁ బడయు టుఱడె.

క. తాతలతండ్రులసమర,ఖ్యాతులు సెఱుపకుఁడు రాముఁ డనిలోఁ దనము
త్రాత యగుధాత గాచిన, నీతనిఁ దునుమాడు మగుడుఁ డిందఱు ననుడున్.

చ. ఎఱిఁగి యెఱింగి జీవమున కెగ్గు దలంచి దవానలంబులోఁ
నుఱుకుదురే రణంబు తెరు వొల్లము దుర్ణయుఁ డైనవీనితోఁ
నుఱక పెనంగ మాకుఁ జలమో ఫలమో తగ నీవు నిట్టు లీ
మొఱకుఁదనంబు దక్కు మిట ముందర నీఁగుద మంతభంగమున్. 913

క. అనిన విని మఱియు నడ్డము, సని నిలుపఁగ నిలిచి వృక్షచరులును మది నూ
ల్కొని పెద్దశిలలుఁ దరులుం, గొని యార్చుచు నొక్కపెట్టఁ గోల్తలసేయన్.

సీ. అప్పుడు పౌలస్త్యుఁ డధికరోషంబునఁ, బేర్చి వా రందంద పెలుచ వైచు
నచలశృంగంబులు నంఘ్రిపంబులు శూల,మునఁద్రుంచితనమీఁద నసునుఁగఁబడఁ
జలువుర గుదులుగా బలువిడి గ్రుచ్చుచు, నెత్తురువఱదలు నేల నిండఁ [గఁ
బీనుఁగుపెంటలు ప్రేవులపోగులు, మస్తిష్కపటలముల్ మానసమున
కరుదుసేయుచుండ నట్టహాసంబులఁ, గర్ణపుటము లవియఁ గపిబలంబుఁ
బ్రిశయసమయకుపితభైరవభైరవా,డంబరమున నుబ్బడంచి మఱియు. 915

ఉ. ఒక్కొకవ్రేటునం బుడమి నొక్కట నూఱులు వేలు మొత్తముల్
క్రిక్కిఱియం బడల్పడఁ బొరిఁ గద వ్రేయుచు బాహువీథికిం
జిక్కినఁ గౌఁగిటం జదియఁ జేయుచు మ్రింగుచు విక్రమింపఁగా
నక్కడ నిక్కడఁ నిలిచి రత్తఱి గుంపులుగట్టి వానరుల్. 916

క. ద్వివిదుఁ డొకగండశైలము, జవమునఁ గొని యురము వైవఁ జలియింపఁడ వై
శ్రవణుఁ డది మిట్టిపడి బి, ట్టవుల రథావలులఁ గరుల హరులం జదిపెన్. 917

ఉ. ఘోరశరంబులం దలలు గుంభినిఁ బెల్లుగ డొల్ల సేయుచుం
[1]దేరులు యామినీచరులు దీవ్రగతిం బఱపంగ వానరుల్
భూరుహపాణు లై కదిసి భూరిబలోద్ధతు లొప్ప నార్చుచుఁ

1 దేఱినయా....గతిఁ నడపంగ.

వారణముల్ వరూథములు । వాజులుఁ గాల్వురుఁ బైపయిం బడన్. 918

చ. అనిలతనూజుఁ డొక్కగిరి । హస్తయుగంబునఁ బూన్చి కైకసీ
తనయుని వైచె నాతఁడును । దానికి నించుక స్రుక్క యంతలో
నన ఘనశూల మెత్తి కఠి।నం బగువక్షము నొంప స్రైఁప క
వ్వనచరవీరుఁ డద్భుతర।వంబున ఱోలుచు వ్రాలె భూస్థలిన్. 919

క. నీలుఁ డది నూచి మండుచు, శైలంబున వైవ దాని । శతఖండము లై
తూలి కపులపైఁ బడ నా,భీలత నారక్కసుండు । పిడికిటఁ బొడిచెన్. 920

వ. అప్పుడు నలశరభవృషభగవాక్షగంధమాదనులు గదిసి పాషాణపాదపప్రహారం
బుల నొంపఁ జలింపక జానుముష్టిప్రకోష్ఠపాణితలపరిరంభణంబుల నయ్యేవురం
జచ్చిన ట్లుండఁ గెడపి విజృంభించి మఱియు నిఖలబలీముఖులుఁ దెంపునం దనపై
నుఱికి పొడువం దరుతిరోహితం బగుమహామహీధరంబుచందంబు విడంబిం
చుచు వారి నందఱం బట్టి పాతాళసన్నిభం బైనతనకంఠబిలంబున దిగవైచి
మ్రింగుచుం దప్పిచని నాసాకర్ణకోటరంబుల వెడలువారి నొడిచి కొని చదియ
నమలుచుఁ గరాళదంష్ట్రాంతరాళంబుల వెడలి పడినవారిం గాల నేలఁ జమరుచు
సమరక్షోణి మేదోమాంసశోణితమేదురప్రదేశంబుల నెఱయ మెఱయం బ్లవం
గబలంబులం దోలుచు నిట్లు [1]కాలాంతకాకృతి నద్దశగ్రీవానుజుండు చరింప సుగ్రీ
వుండు గనుంగొని. 921

మ. పటుశూలంబునఁ గీలజాల మెసఁగం । బైపై దలం బై సము
ద్భటనేత్రాంచలవీథులన్ మిడుఁగుఱుల్ । వాఱంగ నందంద మ
ర్కటయూథాధిపు లార్చి వైచునగవృ।క్షశ్రేణులం జేర్చుచుం
జటులాస్ఫోటనఁ గుంభకర్ణశిఖి మ।ర్కత్సైన్యంబు ని ట్లేర్చునే. 922

సీ. అనుచు నున్నత మగు।నచలాగ్ర మొక్కటి, కొని వెసఁ బఱతెంచి। కోప మెసఁగ
నిలిచి యోరాక్షస । నెట్టన నాసేన, నధికుండ వై గెల్చి । యసము మిగిలి
యున్నాఁడ వింక నీ।యుగ్రభంగికిఁ దగ, సన్నంపువారితో । సమర మేల
వచ్చితి నిదె నాదు।వా టోర్వు నీ వన్న, సత్తంచరుఁడు సాల । నవ్వి నీవు
బ్రహ్మమనుమఁడ వెఱుక।యుఁ బౌరుషంబుఁ, గలఘనుఁడ వేటికిని వృథా। గర్జనములు
వైతు గాక యని పల్కఁ ద।ద్వాక్య మతఁడు, వైచె దానికిఁ జలియించి। వాఁడు నదరి.

శా. జ్వాలాజాలము మిన్ను ముట్టికొనఁగా । శాఖామృగాధీశుపై
శూలం బాతఁడు వైచెఁ దోడన మరు।త్సూనుం డెడం బట్టి మ్రోఁ
కాలం బెట్టి చెలంగి దాని విఱువం । గట్టల్క మూర్ఛాలసుం
గా లంకామలయాద్రిశృంగనిహతిం । గావించె నయ్యర్కజున్. 924

వ. అప్పుడు విసంజ్ఞుం డై పడినయంబోజమిత్రసంభవుం గుంభకర్ణుండు గదిసి మూఁ

---

[1] కల్పాంతకాలాకృతి.

పునం బెట్టికొని నిశాచరు లార్వ గంధర్వసిద్ధచారణాదివియచ్చరు లచ్చెరువంద లంకాభిముఖుం డై చన నంతయుం జూచి ధీమంతుం డగుహనుమంతుండు చింతాక్రాంతుం డగుచు నంతర్గతంబున. 925

చ. ఇటు రవిసూతిఁ బట్టికొని యీతఁడు పోవ నుపేక్షసేసి యే
నటఁ జని యేమి సెప్పుదు నృపాగ్రణి కిప్పుడు వీనితోడ నె
క్కటిసమరంబు సేసి కడఁకన్ విడిపింతునొ దుర్జయుండు మ
ర్కటవిభుఁ డెట్లునుం దెలిసి రాఁ గలఁ డాతని తెంపు నూతునో. 926

క. వానరులు సంతసిల్లుదు, రే నీతని కడ్డపడిన నిది గార్యం బౌ
నైన నపకీర్తి గావున, మానధనుఁ డితండు నన్ను మది నే మనునో. 927

ఆ. కాన వేగపడుట కార్యంబు గా దని, విగతసంజ్ఞు లైనవృక్షచరులఁ
దేర్చుచుండె నట్లు దేవారితమ్ముఁడు, లబ్ధవిజయుఁ డగుచు లంక సొచ్చె. 928

మ. తనమీఁదం బురకామినీజనులు సౌధశ్రేణులం బొల్చి నూ
తసపుష్పాంజలు లోలిఁ జల్ల నగుచుం దద్రాజమార్గంబునం
జన సుగ్రీవుఁడుఁ దేటి వాని ఘననాసాకర్ణముల్ తీవ్రదం
తనఖాగ్రంబులఁ ద్రెంచికొంచు మగుడన్ దాఁటెన్ మదోద్యద్గతిన్. 929

వ. అప్పుడు కుంభకర్ణుండు వికర్ణనాసాముఖుండును శోణితదిగ్ధాంగుండును విషాదరోషాకులుండు నగుచు నంతర్గతంబున. 930

చ. చెలియలిముక్కు వోయె ననుసిగ్గున నెగ్గొనరించి రాముతో
వలవనివైర మెత్తుకొని వారక పోరుచు నున్నయన్నకుం
దులువలు నవ్వ నేమొగముతోఁ బొడసూపుదు నింక నమ్మహా
బలుఁ డగుభానుసూను జనపాలుర మ్రింగెదఁ గాక పోయెదన్. 931

క. అని తలఁచి మగిడి సైన్య,ధ్వను లులియఁగ నేఁగుదెంచి వడిఁ దలపడియెన్
వనచరులతోడ నప్పుడు, దన కూఁటువ యగుచు యాతుధానులు దఱుమన్.

ఉ. అత్తఱి రెండుసేనలకు నచ్చెరు వై సమరంబు సెల్ల ను
ద్వృత్తి నతండు పేర్చి పరవీరభటగ్రసనంబు సేయుచుం
గుత్తుకబంటిగా నటులు గ్రోలిన నెత్తుట మిన్ను దాఁకి యు
న్మత్తదశన్ నిశాచరుల మర్కటులం బొరి మ్రింగఁ జొచ్చినన్. 933

మ. ఉర మేడమ్ముల నేసి లక్ష్మణుఁడు పై నొండొండ నారాచముల్
పరపం దోడన రాముఁడుం గడఁగి యప్పౌలస్త్యువక్షంబునం
దరుదారం గులిశప్రచండ మగురౌద్రాస్త్రంబు గీలించి వే
శరవర్షంబులఁ గప్పె నాతతధనుష్టంకారఘోరంబుగన్. 934

క. అతఁ డయ్యిరువురబాణా,హతుల ముఖజ్వాల లెగయ నద్రిచరపర
క్షతముల రూపడఁచుచు న,ద్భుతముగ యూథాధిపతులఁ దోలుచు రాఁగన్.

క. కనుఁగొని సౌమిత్రి నరేంద్రునితో ని ట్లనియె వీఁడు క్రోధావేశం
బున మ్రింగెడుఁ దనవారల, మనవారల రక్తపానమత్తుం డగుచున్. 936

ఉ. ఇక్కపు లెల్ల నిత్తఱి మహీధరసన్నిభ మైనవీనిమే
నొక్కటఁ బ్రాఁకి నొంప బహుయూథభరంబునఁ జిక్కఁబోలు నా
గ్రక్కున వారు పాఱి మునుఁగంబడ నెక్కిన బిట్టు దూలి న
ల్దిక్కులఁ గూల గాత్రము విదిర్చె నతండు మదద్విపాకృతిన్. 937

సీ. అది సూచి భూనాథుఁ డనుజసమేతుఁ డై, సుగ్రీవముఖ్యులు చుట్టు బలసి
కడుగట్టిమొనలతోఁ గాసిల్లఁ గన్నులఁ, గెంజాయ వొడమంగఁ గినుకతోడ
విల్లు మ్రోయించుచు విక్రమక్రీడకుఁ, గడఁగ నుజ్జ్వలగదాకలితహస్తుఁ
డగుచు విభీషణుఁ డందఱఁ దలమీఱి, యనికి నేతెంచిన నలరి కుంభ
కర్ణుఁ డి ట్లనుఁ దమ్ముఁడ కదిసి నన్ను, ప్రేయ సోదరస్నేహంబు విడువు నీవు
యామినీచరాన్వయబీజమంకురింప,కుండ రామునికృప లంక నుండఁ గలవు.

క. ధర్మానుపాలనం బతి, నిర్మలమతిఁ జేయుచుండు నిత్యోన్నతస
త్కర్మఫలసిద్ధి నేకుఱు, ధర్మ మెచట నుండు నచట దైవము నుండున్. 939

క. మనవంశము రక్షించుట, కినవంశజు నాశ్రయింప నేతెంచితి గా
వున రక్షణీయుఁడవు నీ, వనఘాత్మా తొలఁగి చూడు మటు మీఁయన్నన్.

చ. అనవుడుఁ గేలు మోడ్చి యతఁ డాతనిఁ జూచి దశాస్యుఁ డట్లు సే
సినకొఱగామిఁ బాయవలసెన్ మిము నందఱ నిల్లు రాక నా
కనుచిత మెట్లుఁ దప్పు గల దంచు నొకింత దొలంగి సంగరా
వని గద మోపి మోము దిగవైచి విషాదము నొందుచుండఁగన్. 941

సీ. కోపచేష్టాఘోరకుటిలోరుదంష్ట్రల, మిడుఁగుఱుల్ వాఱంగ మిన్ను దాఁకి
పరుషగర్జితమున బ్రహ్మాండకోటర, మవిసిన ట్లద్రువఁ గల్పావసాన
సంభూతజీమూతసంభ్రమంబునఁ బేర్చి,భూతములకు భయాద్భుతము లొదవఁ
దనమేని నెత్తురు దావాగ్నిశిఖఁ బోలు,నాలుక నందంద నాకికొనుచు
నెదురుపడినవారి నెల్ల మ్రింగుచు నేడ, దాశరథులబాణతతులు గొన్న
లెక్కగొనక సమరలీలావిజృంభణ, మంతకంత కెసఁగ నసురుఁ గడచి. 942

మహాస్రగ్ధర. హరిసేనం గుంభకర్ణుం డని దిగిభనిభోగ్రాకృతిన్ రాముకోలల్
బరిగోలల్ వోలె రేపన్ బలువిడి నిగుడుం బట్టు నందంద మట్టుం
బొరి వ్రేయున్ నుగ్గుసేయుం బొడుముగఁ జదుముం బ్రోవులై ప్రేవు లుండన్
ధర నొత్తున్ మీఁది కెత్తుం దలలు నములు నుద్యద్గతిన్ వీచివైచున్. 943

వ. మఱియు ననేకప్రకారంబుల వనచరుల నమయించుచు సమరవిధి విశృంఖలవృత్తిం జనుదేర రఘుకులదీపకుండు గోపంబునఁ జాపంబు సారించుచు నప్పౌలస్త్యుం గనుంగొని. 944

క. ఆదిక్కు ననకు వేగమ, నాదిక్కున కేఁగుదెమ్ము నక్తంచర పో
రాదు నను మిగిలి విను బ్రహ్మాదులలోకములు సన్న నైన వధింతున్. 945

—శ్రీరాముఁడు కుంభకర్ణుం జంపుట.—

క. అన విని కోపాటోపం,బున మర్కటభటులడెందములు బిట్టవియం
బెనునవ్వు నవ్వి పరుష,ధ్వని నజ్జననాథుతోడ వాఁడిట్లనియెన్. 946
తే. వీఁడు గుంభకర్ణుఁడు సుమ్ము విక్రమంబు,[1]దూల నీచేతఁ బడ విరాధుండు గాఁడు
ఖరుఁడు గాఁడు మారీచుఁడు గాఁడు మనుజ,వర కబంధుండుగాఁడల్ల వాలిగాఁడు.
మ. ఇదె నీతో సమరంబు సేయుటకునై యేతెంచి యున్నాఁడ నా
గద నెవ్వాఁడు సహించువాఁడు దివిషద్గంధర్వదైత్యాదుల
న్మద మేదించితి దీన నన్నుఁ గపిసైన్యం బెంత నీయస్త్రసం
పదయుఁ నీవిలునేర్పుఁ జూచి మఱి దర్పం బొప్ప నిన్ ద్రుంగెదన్. 948
క. అనుచుం బఱతేర మహా,శనివేగము లయినఘోరశరములు వాలిం
దునిమినబాణము మునుగాఁ, గ నరేంద్రుం [2]డేసి వాఁడు కంపింపమికిన్. 949
చ. మఱియును బైపయిం బఱపుమార్గణవర్గము లొక్కమ్రోఁతతోఁ
దఱుమ నమోఘమేఘజలధారలు వారిధి డిందుచందమైఁ
గఱు లఱివోవ వానిపులకవ్రజకంటకితాంగయష్టిపై
గిఱిగొని లో నడంగఁ దొడఁగెం గపు లచ్చెరు వంది బెగ్గిలన్. 950
క. అప్పుడు మెఱుఁగులు సుడివడఁ, ద్రిప్పుచు గద నడుమ నిగుడుతీవ్రాశుగముల్
దప్పఁగ జడియుచుఁ గన్నుల, నిప్పు లురుల నతఁడు గదియనృపపుంగవుఁడున్.
క. వాయవ్యాస్త్రము గొని వల,చేయి దునుమఁ జెలఁగువాని సింహధ్వనితో
మ్రోయుచు నది వడిఁ బడియెఁ గ,దాయుత మై యచటికపివితతి రూపడఁగన్.
వ. ఇట్లు వికలహస్తుం డగుచు నప్పౌలస్త్యుండు. 953
ఆ. కులిశపాతభగ్నకూట మయ్యును జూడ్కి, కరుదు సేయునద్రికరణిఁ దోఁచి
యున్న కేల నొకమహోత్తాలసాలంబు, పెఱికికొనుచు నతఁడు బీఱువోక. 954
క. ఆభీలాకృతిఁ బఱతే, నాభుగ్నభ్రుకుటి యగుచు నైంద్రమున విభుం
డాభుజముఁ గూలనేసె మ,హాభుజగము గరుడతుండహతిఁ గూలుగతిన్. 955
క. వడి నదియును దనమునుమునఁ, బడిన మహాశిలలు పగులఁ బాదపవితతుల్
పొడిగాఁగ నుభయసేనలు, నడఁగఁ జదిపికొనుచు డొల్ల నాలో విభుఁడున్.
చ. కనుఁగొని యర్ధచంద్రవిశిఖంబుల రెంటను గాళ్లు రెండు వే
తునిమి భయంకరాకృతి విధుం గబళింపఁ గడంగుసైంహికే
యునిగతి మింటికిన్ నెగయు నుజ్జ్వలపుంఖశరాళి నించె న
ట్టన వికటాట్టహాసము లడంగఁ దదాననగహ్వరంబునన్. 957

1 దూలి నీవాతఁ బడ. 2 జేసె వానిఁ గంపింపఁగన్.

సీ. దానికి మూర్ఛిల్లు § తఱి భానుకిరణసం,కాశంబుఁ బవనవే § గంబు బ్రహ్మ
దండచండము నింద్ర § దత్తము నగుకోల, వక్షంబు గొని పాఱి § వసుధఁ గాఁడ
నిగిడించి తోడన § నిర్ఘాతగతిఁ బొల్చు,యామ్యాస్త్ర ముగ్రార్చు § లడరఁ బఱపి
పర్వతకూటని § భం బైనతలఁ ద్రుంప, నదియు లంకాసాల § హర్మ్యపంక్తిఁ
[1]గూలఁ ద్రోచికొనుచుఁ § గొఱలురక్తము నంబు,జంతుకోట్లు గ్రోల § జలధి మునిఁగె
నద్భుతంపుమ్రోఁత § నాతనిమేనును, బడియెఁ గోటికపులు § పుడమిఁ జదియ.
క. పడి కుంభకర్ణుశిర మ, ప్పుడు జలములు గ్రోలఁ బృథుల § బుద్బుదములచ
ప్పుడు దోడ్తోడం బొడమెను, బడబాగ్నిఁ బయోధి యుడుకు § పట్టె ననంగన్.
ఉ. అంత వలీముఖుల్ సురగ § ణాదులు భూగగనాంతరాళ మె
క్కంతర మై పయిం దఱుచు § టార్పుల రాముఁ బ్రశంససేయువా
క్సంతతులం జెలంగఁగ నిశాచరు లుర్విఁ జలింపఁ బాఱి ర
త్యంతభయంబుతోడ విగ § తాయుధు లై తల లూడ లంకకున్. 960
వ. అట్లు పాఱి కుంభకర్ణునిపా టెఱింగింప రావణుండు బిట్టు మూర్ఛిల్లి తనతనయు
లు దేవాంతకుండును నరాంతకుండును త్రిశిరుండు నతికాయుండును మహో
దరుండును మహాపార్శ్వుండు నయ్యవస్థం జూచి శోకించుచుం దెలుప నెట్టకేల
కుం దెలిసి దెసలు సెలంగఁ బేరెలుంగున. 961
ఉ. హా రిపువీరదర్పహర § హా ఘనవిక్రమకేళిలోల హా
శూరవరేణ్య నీ కిటులుఁ § జొప్పడునే ననుఁ బాయ నింక లం
కారజనీచరావళికిఁ § గావలి యెవ్వనిబాహుదండ మె
వ్వా రిటమీఁద నాకుఁ గల § వారు రణంబునకుఙ్ మహాబలా. 962
క. అకట సురేంద్రునివజ్రము, నొకచీరికిఁ గొనవు కపిబ § లోగ్రాటవిఁ బా
వకుభంగి నేర్చి నరనా, యకుసాయకవృష్టి నెట్టు § లాఱితి తండ్రీ. 963
ఉ. ఆలములోన భూతబలి § యైతె నిశాచరవీర నిర్జరుల్
గేలిగొనం బులస్త్యకుల § కేతువ రామశరానిలంబున
న్వ్రాలితె కైకసీతనయ § నాదగుదక్షిణబాహుశాఖ భూ
పాలుఁడు ద్రుంచెనే యిటు వి § పద్దశఁ ద్రోచితె నన్నుఁ దమ్ముఁడా. 964
క. ఇదె నీవు ననిన భీతి,లైద రెల్లనిశాచరులు ని § లింపులు లీలం
జదల విహరించెదరు ప్రాఁ,కెద రార్పులతోడఁ గోట § గిరిచరవీరుల్. 965
తే. ఇంక నీవు లేని § యీలంక నా కేల, సీతచింత యేల § జీవ మేల
సంగరమున నిన్నుఁ § జంపినరాముని, జంపఁ దగదు గాక § చావఁ దగదె. 966
ఉ. అప్పుడు సర్వకార్యవిదుఁ § డైనవిభీషణుఁ డన్నిభంగులం

1 కూలఁ ద్రోచుచుఁ జని శిరః♦కోటరంబు, జంతుకోటులఁ గ్రోలుచు ♦ జలధి మునిఁగి, నద్భు
తపు మ్రోఁతగా వచ్చి ♦ యతనిమేను, పడియెఁ బదికోటియగచరుల్ ♦ పుడమిఁ జదియ.

జెప్పఁడె చాటి మీఁద నగుచేటు నయజ్ఞులమాట లేటికిం
దప్పు నవజ్ఞమై నకట ధర్మపరుం డగునట్టివాని కే
నొప్పమి సేసి తత్ఫలము నొందితి నిందకు నైతి నేమనన్. 967

వ. అనుచు ననేకప్రకారంబుల విలపింపఁ ద్రిశిరుం డిట్లనియె నీవాక్యంబులు నిక్కంబు లగు నైనను గడచనినదానికి శోకం బేల మూఁడులోకంబులు గెలువం జాలునీయట్టిమహావీరుండు ప్రాభవంబు దూల నుత్సాహంబు విడుచు టేవెరవు నీవు కైదువు ధరియించిన సురాసురాదులు సన్న్యస్తశస్త్రు లగుదురు రాముఁ డన నెంత నాకు బ్రహ్మదత్తంబు లైనశరశరాసనశక్తికవచంబులు నశ్వసహస్రయుతం బగు దివ్యరథంబును గలవు నన్నుం బంపు నీపగ దీర్చెద ననిన నతికాయదేవాంతకనరాంతకు లట్లు పలుక నప్పౌలస్త్యుండు నిరస్తశోకుం డగుచు నల్లేకమనస్కులు నంతరిక్షచరులు మాయావిశారదులు వివిధాయుధప్రవీణులు జవసత్త్వసంపన్నులు దేవదర్పఘ్నులు విజయగర్వితులు లబ్ధవరులుఁ గీర్తికాములు నయి సంగ్రామంబునకు వేడ్కయు వెరవునుం గలయక్కొడుకుల బహుప్రకారంబుల మన్నించి వీడ్కొలిపి మహోదరమహాపార్శ్వులఁ దోడు పనుప నయ్యార్వురు నేన నేన రిపుల రూపడంతు ననుచు గర్జిల్లుచు వెడలి రందు మహోదరుం డైరావతకులంబునఁ బుట్టినసుదర్శనం బను నేనుంగును నరాంతకుండు వెలిమావును దక్కనలువురు నరదంబులను నెక్కి ధవళచ్ఛత్రంబులు మెఱయఁ గ్రూరగ్రహంబులుంబోలె వెలుఁగొందుచుఁ జతురంగంబులతోడఁ గడంగి నడచునమయంబున.

—✥ దేవాంతకనరాంతకమహాపార్శ్వాదులయుద్ధము. ✥—

సీ. మదసౌరభంబులు మధురింప నెడఁజేయు,గంధవాసనలకు గర్వ మొసఁగఁ
జెన్నొందుపుష్కరశీకరోత్కరములు, దుహినయంత్రములకుఁ దోడుపడఁగఁ
గర్ణవ్యజనములు ఘనతాళవృంతరా,జికిఁ బూని మేనులచెమట లార్ప
దానలీలాహూతతరుణాళిఝంకృతుల్; నూతగీతములకు సొం పొనర్పఁ
గరులు నాయుధశాలలకరణిఁ జారు
[1]మణిమయస్యందనమ్ములు మహితరేఖ
లమర లఘుచిత్రగతులఁ జెల్వారుహరులు
జమునిచెలు లనఁ దగుభటుల్ నందడింప. 969

చ. వెలిగొడుగుల్ శరద్ఘననవీనవిలాసము దోఁప నంబర
స్థలి మెఱయం గిరీటమణిజాలమరీచులు భానుదీప్తులన్
గెలువఁగ విస్ఫులింగపటుకీలలు గైదువు లీన సేనతో
వెలువడి రార్పులన్ దెరలు ప్రీలఁగఁ జేయుచు నన్నిశాచరుల్. 970

చ. అద్భుతసింహనాదముల నబ్ధి గలంగఁ బ్లవంగవీరులన్

1 మణిమయస్యందనమ్ముల మహితసేమ, లమితలఘుచిత్ర.

హృద్భరితోగ్రకోపముల నేచి శిలాతతు లెత్తికొంచుఁ జం
చద్భిదురప్రచండగతి చండము చొప్పడ వీఁకఁ దాఁకి ర
త్యుద్భటవైరిహుంకృతులతోఁ దొడరన్ వికటాట్టహాసముల్. 971

వ. అంత నుభయబలంబులు గలయ బెరయుసమయంబున. 972

సీ. అరదంబు లడరిన నశనివేగోద్ధతు, 2లుఱ మీఁద నుఱుముగా నుఱుకువారు
దంతులు ద్రోచినఁ దాలసాలాదుల, మొగదప్ప బలువిడి మోఁదువారు
నాశ్వీకు లఱిమిన హయములకడగాళ్లు, వెసఁ బట్టి నేలతో వ్రేయువారుఁ
గాల్బరు గడఁగిన ఘనముష్టినిహతులఁ, గీలాలములు గ్రక్కఁ గెడపువారు
మఱియుఁ దఱుచు మొనలు దఱిమిన నందంద, శిలలు గురియువారు నలుఁగులొడిసి
పాఱవైచువారుఁ బటుదంతనఖకేళి, నలుపువారు నైరి శైలచరులు. 973

చ. అఱిమి విభావరీచరులు నమ్ములమర్మము లాడు నేటులన్
గఱులు మునుంగఁ దూలు సెల కట్టియవాటులఁ గుంతశూలముల్
దఱుచుగఁ దాఁకుపోటుల గదాపరిఘాదులవ్రేటులన్ మొనల్
పఱిపఱిగా బలీముఖుల పాటులుఁ జెల్లఁ బెనంగి రయ్యెడన్. 974

క. తరుచరరజనీచరు లొం, డొరుచేతులయాయుధములు నుర్వీజములుం
బొరి నొడిసికొనుచుఁ బోరఁగఁ, బరస్పరాహతుల నవియు భగ్నము లయ్యెన్.

ఆ. రిక్తహస్తులైన నక్తంచరులు వృక్ష, చరునిఁ బట్టి వృక్షచరునితోడ
వ్రేసి వ్రేసి సమరవీథి విశృంఖల,లీలమైఁ జరింప లెక్కగొనక. 976

ఉ. ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచే
రూపడఁగంగ మోఁదుచును రోదసి మ్రోయ రథంబుపై రథ
క్షేప మొనర్చి తుత్తుమురు చేయుచు రక్కసుతోడ రక్కసుం
బ్రోపడ వ్రేయుచుం గపులు పోరుచు నుండఁగ నన్నిశాచరుల్. 977

వ. అర్ధచంద్రక్షురప్రభల్లప్రముఖశిలీముఖంబుల బలీముఖులు బహుముఖంబులం గురి
యుశిలాతరుషండంబులు ఖండించుచుఁ దఱుమ నుభయసైనికులు నితరేతరహ
తుల మూర్ఛలకు డాసియుఁ దోన పాసియుఁ బరస్పరజయేచ్ఛలం జలంబు లెక్కఁ
బెనంగి రత్తుములసమరంబునకుం బొంగి నింగి నిర్జరు లార్చి రాసమయంబున.

సీ. విఱిగినరథములు నొఱగినహయములుఁ, గ్రందుగాఁ ద్రెళ్లిన కరటిఘటలుఁ
దఱుచుగాయము లొప్పఁ దెఱపులు లేకుండఁ, బడిననిశాటులుఁ బ్లవగభటులుఁ
బుఱియలు పఱియలై యుఱికినమస్తిష్క, పంకముల్ బహురక్తపల్వలములు
నఱికినతరుశిలల్ నఱుమైనకైదువుల్, గిఱిగొన్నగొడుగులుఁ గేతనములుఁ
గలయఁ బ్రేవులప్రోవులుఁ గలిగియున్క, నధికదుర్గమమగు నంగరాంగణమున
నార్చి తురగంబుఁ బఱపి నరాంతకుండు, శైలచరసత్తతిఁ గూల్చె శక్తి వైచి.

చ. మఱియు విచిత్రవల్గనసమక్రియ ఘోటక మొప్ప నబ్ధిఁ బెం

జొఱఁ దఱియంగఁ జొచ్చుగతి చొప్పడ వానరసేనఁ జొచ్చి పై
నఱిముఱి వైచుపాదపశిలావలిఁ బ్రాసము ద్రిప్పి తప్పిపోఁ
జఱచుచు విస్ఫులింగములు సల్లుమొనం బొరిఁ దట్టిపుచ్చుచున్. 980

లయగ్రాహి. [1]వ్రేటు భుజదండములఁ బోటు ఘనముష్టి నగకూటములఖండముల వాటు లఱచేతం,
జాటుగొన డగ్గఱువనాటభటులం దనదుపోటు మునుగాఁ బెలుచ గీటడఁచుచుం బై,
పాటుఁ దలపాటు నగపాటుఁ గనునాఖచరకోటి మది నచ్చెరువుపాటొదవ వీటం,
బాటి గలపోటరుల మేటిగములం గదనపాటవము సెల్ల విటతాటనము సేయన్. 981

క. మును కుంభకర్ణు నురవడిఁ, గనుఁగొని వడిఁ బాఱినట్లు కపు లధికభయం
బునఁ బాఱిరి సుగ్రీవుని, వెనుకకు నద్దాశకంఠి వెంటం దగులన్. 982

ఉ. అప్పుడు భానుసూనుఁడును నంగదుఁ జూచి కుమార సైన్య మీ
చొప్పునఁ బాఱుచున్నయది చూచితె వీనిమదం బడంతు గా
కిప్పుడు నీవు నావుడు దినేంద్రుఁడు మేఘచయంబుఁబోలె నే
నొప్పుఁగ సేన వెల్వడి మహోగ్రగతిం బఱతెంచి ముందటన్. 983

క. నిలువఁబడి యోరి కడున, ల్బులఁ గొండఱఁ జంపి మనములో గర్వింపన్
వల దిదె నాయురమదె నీ, వలచేతం బ్రాస మెత్తి వైవు మనవుడున్. 984

తే. అట్టహాసంబుతోఁ బ్రాస మలుకఁ బూఁచి
రక్కసుఁడు వైవఁ దనపెన్నురంబు బిట్టు
దాఁకి యది తుత్తునియ లయి ధరణిఁ బడినఁ
గేలి దోఁపంగ నవ్వి యవ్వాలిసుతుఁడు. 985

క. వడి నెగసి హస్తతలమునఁ, బిడుగుగతిం జఱువ నెత్తు పై బ్రెగ్గుడుల్
మిడిసి తల పగిలి తురగము, నడునాలుక గఱచికొని రణస్థలిఁ బడియెన్. 986

ఆ. వాజి వడినఁ బడక వాఁడు పై లంఘించి, కఠినముష్టి మస్తకంబు వగులఁ
బొడువ నొడలు దడియ వెడలునెత్తుటితోడఁ, దొడరుమూర్ఛగవిసితోన తెలిసి.

క. వాలితనూజుఁడు పిడికట, వ్రీలఁగ నెఱుంబుఁ బొడువ వెన రోఁజుచుఁ గీ
లాలము ముక్కున వాతం, గూల నతఁడు గూలి తన్నికొనుచుం జచ్చెన్. 988

వ. అట్లు నరాంతకుండు గూలినం బ్లవంగపుంగవులు సిద్ధచారణాదులుం జెలఁగుచు నంగదు నగ్గించునెలుంగులు నిశాచరులభయశోకారావంబులు భూనభోంతరా

1 వ్రేటు భుజదండమునఁ బోటు ఘనముష్టినగకూటమునఖండమునవాటు నఱచేతం బోటుగొన దగ్గఱువనాటభటులం దఱటువాటు మునుగాఁ.

ళంబు గ్రందుకొన నత్తెఱంగునకుం గ్రోధాభిమానంబులు మానసంబున నిండ దేవాంతకుండు పరిఘం [1]బంకించుచు నడవఁ దొడఁగ త్రిశిరుండు తేరు దోలుచు మహోదరుండు గజంబు డీకొలుపుచుం గదిసి రవ్వ డప్పౌలస్త్యులం గనుంగొని.

క. ఒకఘనవృక్షము కపినాయకసూనుఁడు పెఱికి వైచె నార్చుచు దేవాం
తకుపయి నడుమన త్రిశిరుఁడు, శకలంబులు సేసె దాని శరసంఘములన్.

సీ. అది యట్లు వమ్మైన నమరేంద్రమనుమఁడు, వెండియుఁ గడుమండి విపులశిలలు
భూరిభూరుహములుఁ బోరిఁబోరిఁ గురియంగ, లఘుగతి వాఁడు భల్లములనవియుఁ
ద్రుంచుచుఁ గ్రొవ్వాఁడితూపుల నవ్వీరు,నవయవమర్మంబు లదర నేసె
దేవాంతకుండు నర్దన నచ్చుపాదపా,దులు పరిఘంబునఁ దూల జడిసి
కొనుచుఁ బఱతెంచెఁ దద్ఘాతమునఁ [2]గెరల్చి
యోసరించిన భ్రాతృవ్యయుగమునకును
దొడుపాటొప్పఁ గరిఁ ద్రోచి తోమరముల
నురము నొప్పించె నొగి మహోదరుఁడు గడఁగి 991

ఉ. అంత మహోగ్రవేగమున నక్కపిసింహుఁడు సింహలీల న
ద్దంతికి దాఁటి బిట్టొఱల దట్టనతో నఱచేత వ్రేసి త
ద్దంతము బల్విడిం బెఱికి తన్ మును రేఁచి తొలంగి యున్న దే
వాంతకు డాసి వ్రేసె వడఁ గాడుచు నెత్తురు గ్రక్కునట్లుగన్. 992

చ. పడివడి యాన మీల్కఱచి పట్టుచు వాఁడును నెట్టకేలకున్
వడిఁగొని బాహుగర్వ మొదవం బరిఘంబున నేసె నాతఁడున్
ముడుసులు నేలమోవఁ బడి మూర్ఛకు మున్ నెగయంగఁ బుంఖముల్
గడవ లలాట మేసె నలుకం ద్రిశిరుండు నిషుత్రయంబునన్. 993

క. అత్తెఱఁగు సూచి కడునుద్వృత్తి దిశావలయ మద్రువ దేవాంతకుపై
నొత్తిలి యార్చుచుఁ గడఁగె మరుత్తనయుఁడు సమరపరుషరోషం బెసఁగన్.

క. అంగదుఁ డట్టులు నొచ్చుట,కుం గనలుచు ననిలసుతుఁడు కొండతునియ వై
చెం గత్తివాతితూపున, నింగలములు సెదరఁ ద్రిశిరుఁ డెడ నది త్రుంచెన్. 996

వ. ఆసమయంబున.

మ. పరిఘం బుద్ధతిఁ జండతుండగతి నొప్పం బొల్చు దేవాంతక
ద్విరదంబుం గని పొంగి నింగి హనుమత్సింహంబు దాఁటెం గృశో
దరముం జాలితదీర్ఘవాలము బలోద్దామైకవేగంబు భీ
కరదంష్ట్రాలిముఖంబుఁ బెన్నఖములుం గన్పట్టఁ గట్టల్కతోన్. 997

సీ. అమరారిసుతుఁడు దానతులవేగంబునఁ, బరిఘంబు మెఱుఁగులు వాఱఁ ద్రిప్పి

1 బంకించుకొనుచుఁ ద్రిశిరుండు. 2 జెరల్చి మోసరించినసోదరయుగళమునకును. 3 ముడుసులు...ము న్నెగయంగ.

బలువిడి వైవ నప్పవమానసూనుండు, కులిశకఠోర ప్రకోష్ఠనిహతి
భగ్నంబు సేయుచుఁ బఱతెంచి ఘనముష్టి, వడి నెత్తినడు నెత్తి వ్రయ్యఁబొడువ
నురురక్తధారల నోడ లెల్ల జొత్తిల్ల, మెడ గ్రుంగ వీనుల మెదడు వెడల
నిడువెడందజిహ్వ నడుకొనఁ బండులు, గఱచి వెలికి గ్రుడ్డు లుఱుక సమర
రోషఘటితకుటిలభీషణభ్రుకుటిప, తాకతోన తిరిగి ధరణిఁ బడియె. 998

వ. ఇట్లు దేవాంతకుఁడు పడినం గోపించి. 999

క. నీలునివక్షము ద్రిశిరుఁడు, వాలమ్ముల నుచ్చిపాఱ వడి నేసెం ద
జ్జాలకములఁ బటుసాయక, జాలములు మహోదరుండు జవమున నేసెన్. 1000

ఆ. అతఁడు నవశుఁ డగుచు నాలోనఁ దెలివొంది, వడి నగంబుఁ బెఱికి వైవ శిరము
పగిలి గజముతలయుఁ బఱియలై యమ్మహో, దరుఁడు దానితోన ధరణిఁ బడియె.

మ. త్రిశిరుం డాతనిపాటు సూచి మదిలో దీపించుకోపంబుతో
[1]నశనిస్ఫీతము లైనపాతములుగా నంగందఁ దా వేగ తీ
వ్రశరవ్రాతము లాంజనేయునిపయిన్ వర్షించె నవ్వీరుఁడున్
దశనాగ్రంబులు దీఁడుచున్ వయిచె నుత్తాలాద్రికూటంబునన్. 1002

క. అది తునియ నతఁడు నుగ్ర, ప్రదరంబులు పఱపి మఱియుఁ బావనిమీఁదం
జక లద్రువ నేసె నప్పుడు, చిదురలు గా నాప్లవంగసింహుం డంతన్. 1003

ఉ. తేరికి దాఁటి చండగతిఁ దీవ్రనఖంబులఁ బెల్లుగా నసృ
గ్ధారలు నేలఁ గూలఁ దురగంబుల వ్రచ్చి తొలంగి భీకరో
ల్కారయ మార శక్తి గొని లక్షితవక్షముఁ వైచె దాని న
మ్మారుతి కేలఁ బట్టి నడుమం దునుమాడిన వాఁడు వెండియున్. 1004

క. ఉఱక తనశక్తి పొలిసిన, నొఱఁ బెట్టినవాలు పెఱికి యుడుపథమునకున్
మెఱుఁగు లెగయ జళిపించుచు, నుఱికి మరుత్తనయువక్షు మురవడి నేసెన్.

ఉ. ఆతఁడు దానికిం గనలి హస్తతలంబునఁ బూఁచి మేటిచ
ట్రాతికిఁ బాటిగాఁ దగువెడందయురస్స్థలి వ్రేసి మూర్ఛమైఁ
జేతికృపాణమున్ విడువఁ జేసి విజృంభణ మొప్ప రాక్షస
వ్రాతముఁ దోలఁ జొచ్చె ననివారణఁ దత్కరవాలహస్తుఁ డై. 1006

వ. అట్లు వినంజ్ఞుం డగుచుఁ దెలిసి నిశాచరుండు హనుమంతుం గనుంగొని. 1007

క. వడి నెగసి వచ్చి వక్షము, బెడిదం బగుపిడుగుఁబోని పిడికిటఁ బొడువం
బొడమినమూర్ఛం గరువలి, కొడుకు గడుం దూలి తేఱి కుపితుం డగుచున్.

మ. ప్రకటమదోద్ధతిం గడఁగి పంక్తిముఖాత్మజుపైకి లెక్కసే
యక వెస దాఁటి ఘోరకులిశాహతి నింద్రుఁడు విశ్వరూపుమ
స్తకమును ద్రుంచినట్టు లడిదంబున నొక్కటఁ ద్రుంచెఁ దత్త్రిమ

1 నశనిస్ఫీతముగా వెసం దఱుముచున్ సందంద.

స్తకి వడి భీకరభ్రుకుటిచాపకలాపలలాటపట్టికన్. 1009
ఆ. మస్తకంబు లట్లు మహనీయబహురత్న, రచితకుండలములరుచులఁ బొల్చి
ధర నలంకరింపఁ బొరి రక్తధారలు, గురియఁ ద్రిశిరుఁ డాజిఁ గూలె నపుడు.
శా. కీశశ్రేణులసింహనాదములఁ గిష్కింధావిభుం డుబ్బి యా
కాశం బందఁగ నందు వేల్పుగములం గ్రందైహనూమత్ప్రశం
సాశబ్దంబులు నింగి ముట్ట రజనీచారుల్ భయం బంది రా
దాశగ్రీవి రణస్థలిం బడిన నార్తధ్వానముల్ సేయుచున్. 1011
వ. అవ్విధం బంతయుం జూచి విషాదరోషంబులం బొందుచు మహాపార్శ్వుండు.
క. అమరాసురదర్పఘ్నియుఁ, గమనీయసువర్ణవలయకలితయు దిగిభ
భ్రమలీమసయును నగునొ, క్కమహాగదఁ గొనుచు గవిసెఁ గపినాథునకున్.
క. వడి నట్లు గవియ నతనికి, నెడసొచ్చి చెలంగి ఋషభుఁ డెదురై నిలిచెం
గడఁగి నిశాచరుఁడును న, ప్పుడిదపుగదఁ బూన్చి వైచెఁ బెన్నుర మవియన్.
చ. ఋషభుఁడు దత్ప్రహారము సహింపక మూర్ఛిలి యెట్టకేల కు
న్మిషితవిలోచనుం డగుచు నెత్తిపయిం బడ మోఁదె నాసుర
ద్విషుఁ దన కెత్తునగ్గదయ వే కొని నెత్తురు నాఱ నాసికా
సుషిరములం బొరింబొరి వసుంధరఁ గూలఁగ సోలుచుం బడెన్. 1015
వ. ఇట్లు మహాపార్శ్వుండు వడినఁ బుడమి నాయుధంబులు వైచి నిశాచరులు పఱవ నతికాయుండు కోపంబునఁ జాపం బెత్తి నారి మ్రోయించుచు వనచరబలంబు మీఁదఁ దేరు దోలించినం గలంగి వనచరులు కుంభకర్ణుండు మగుడఁ బ్రాణంబులు వచ్చి వచ్చెనొకో యనుచుం బాఱి రామచంద్రువెనుకఁ జొచ్చిన నవ్వీరుండు వారి వెఱవకుండు వెఱవకుం డనుచు విభీషణుం గనుంగొని. 1016
శా. విల్లాఖండలచాపతుల్యముగ మౌర్వీరేఖ సౌదామినీ
వల్లిం బోలఁగ మేను మేఘవిపులత్వం బొంది శోభిల్లఁగా
నెల్లిం జంద్రిక మించునీరథమువాఁ డెవ్వాఁడు దిగ్భిత్తులం
బెల్లల్ రాలెడు నిష్ఠురస్తనితగంభీరాట్టహాసంబునన్. 1017
తే. కేతనాగ్రంబుపై సైంహికేయుఁ డమర, బహుతురంగముల్ పూనినపసిఁడితేరు
నగ్నికీలలు నిగుడు సర్వాయుధములు, నొప్ప నుజ్జ్వలుఁడై వచ్చుచున్నవాఁడు.
చ. అన విని యాతఁ డీతఁడు దశాస్యునకుం దనయుండు ధాన్యమా
లినికి జనించినాఁడు భుజలీలల రావణుఁ బోలువాఁడు వీఁ
డనికిఁ గడంగినప్పుడు సురాసురముఖ్యులుఁ దల్లడింతు రీ
ఘను నతికాయుఁ డండ్రు ఘనకాయమునుం గలవాఁడు కావునన్. 1019
వ. రఘువరా విను మితం డచలనిష్ఠం బరమేష్ఠి నారాధించి యవధ్యాశ్వసహస్రం బగునరదంబు నవార్యంబు లగుననేకాస్త్రంబుల వెలుంగుతూణీరంబు లిరువది

యును బదునెనిమిది శరాసనంబులుఁ బిడిపట్టుహస్తచతుష్టయంబు నిమువుపది చేతులుం గరకరాళకరవాలంబులు రెండు నభేద్యకవచంబును బడసినాఁడు వీఁడు తురగకరిరథారూఢుం డైనప్పుడు ఖడ్గకంపణకార్ముకసమరంబులం బ్రవీణుం డిమ్మహాబాహుం డస్త్రధరశ్రేష్ఠుండు నార్యసేవానురక్తుండును బహుశ్రుతుండును నీతిశాస్త్రకోవిదుండు ననం బ్రసిద్ధుం డితనిభుజబలంబున లంక నిరాతంకం బై యుండు వీనిబాణంబుల వజ్రప్రముఖదివ్యాయుధంబులు నిష్ఫలంబు లైనవి కావున దేవ మీ రివ్వీరునం దధికయత్నంబు సేయునది కార్యం బని చెప్పె నానమయంబున.

క. మిడుతగమి వాఱుతఱుచున, నుడుమార్గము నిండి పాఱ నుగ్రాస్త్రములన్
మిడుఁగుఱులు రాలఁ గపులను, సుడివడి వడిఁ బాఱ నేయుచుం గట్టల్కన్.

క. ఘననేమిఘట్టనధ్వని, వనధిధ్వానంబు నడఁప వడిఁ జాపజ్యా
నినదంబు దాని లోఁగొన, వనచరబల మతఁడు సొచ్చి వ్రచ్చెం గడిమిన్.

ఆ. అప్పు డార్పు లెసఁగ నందఱు నతనిపై, నుక్కు మెఱసి వచ్చి యూథపతులు
మార్కొనంగ నందు మైందద్వివిదనీల,శరభకుముదు లద్రిచరులు గడఁగి.

క. తరులును గిరిశృంగంబులు, నురవడిఁ గొని మీఁద వైవ నురుభల్లములన్
మురియలు సేయుచు [1]నయ్యు,చ్చరకొడుకు ధనుఃకలావిశారదుఁ డగుచున్.

క. ఒక్కొకనెఱనారసమున, నెక్కుడువడి వారియురము లేసి నిలుపుచున్
స్రుక్కించెం గరలాఘవ, మక్కజముగఁ గోలఁ గోల నందఱు కపులన్. 1025

వ. అట్లు విక్రమించి గర్జించినం బ్లవంగపుంగవులు చేయునది లేక కంఠీరవభైరవారావంబు విన్నకురంగంబుల తెఱంగు నొంది రప్పొలస్త్యుండును జేర నేతెంచి రఘువరుం గనుంగొని. 1026

మ. శరచాపంబులు గేలఁ బూని రథి నై సంగ్రామ మర్థించి భూ
వర నీపై నిదె వచ్చినాఁడ మొదలన్ వారాశిపై వాలిపై
ఖరుపై నేసినకోల లేయు మిటఁ జక్కం గమ్ము నాయమ్ము లిం
కొరుపైఁ బాఱవు దేవదానవజయోద్యోగాభిమానంబునన్. 1027

—లక్ష్మణుం డతికాయునిఁ జంపుట.—

ఉ. నా విని లక్ష్మణుండు నరనాథున కడ్డము చొచ్చి నిల్చె రో
షావిలమానసుం డయి కులాచలగహ్వరదిగ్గిగంతదం
తావళకర్ణకోటరవితానవియద్భరితంబుగా గుణా
రావము సేయుచుం బటుశరంబు గరంబున నల్లఁ ద్రిప్పుచున్. 1028

తే. అప్పు డవ్వింటిమ్రోతకు నఖలరజని,చరులు భీతచేతస్కు లై సంభ్రమింప
నద్దశాననతనయుండు నరుదుతోడి, మెచ్చుమనమునఁ బొడమ సౌమిత్రిఁ జూచి.

ఉ. పిన్నవు మున్ను గయ్యములు పెక్కు లెఱుంగవు దివ్యబాణసం

1 నారాత్రించరుకొడుకు.

పన్నుని నన్ను నోర్తు నని బాణములున్ విలుఁ గేలఁ బూని మీ
యన్నకు నడ్డమై నిలిచి తౌ నవు నంతన పంత మెక్క నీ
మన్నన సేసితిం దొలఁగు మా యతికాయుఁ డెఱుంగు నల్పులన్. 1030
శా. ప్రాణంబుల్ వలతేని రాముదెస సౌభ్రాత్రంబు వోఁబెట్టి నీ
బాణశ్రేణులతోడఁ దూణయుగముల్ బాణాసనంబుల్ రణ
క్షోణిం బెట్టి తొలంగు నాపటుశరస్తోమంబు రా కుండ ని
ద్రాణక్రూరభుజంగముం దెలుపుయత్నం బిట్లు నీ కేటికిన్. 1031
శా. కేలం బుంఖమణిప్రభల్ మెఱయఁగాఁ గీలోద్గమాభీలలీ
లాలోలం బయి నీదుప్రాణములు గ్రోలన్ నాలుకల్ గ్రోయుచుం
గాలవ్యాళముఁబోలె నున్నయది చక్కం జూడు నాసాయకం
బాలం బెక్కడ మర్త్యుఁ డెక్కడ భుజాహంకార మింకేటికిన్. 1032
వ. అనిన విని సక్రోధంబుగా నవ్వి యవ్వీరుం డి ట్లనియె. 1033
క. అధముఁడు దనుఁ దాఁ బొగడిన, నధికుఁడు గాఁ డల్పుభంగి నాత్మశ్లాఘా
విధికిఁ జొరఁ డుత్తముం డ, వ్విధ మెఱుప్పమిఁ జేయుటను వివేకవిహీనా.
ఆ. విల్లు గేల నుండ వీటిఁ బోయినవట్టి,మాటలందుఁ గలదె మగతనంబు
శస్త్రబలము సూపఁ జాలక వినువాఁడు, లజ్జఁ బొందరి త్రరజ్జు లేల. 1035
క. ఇదె విలునమ్ములుఁ గొని నీ,యెదురను నిలుచున్నవాఁడ నే విద్యాసం
పద వాసికి నెక్కన నీ,మదిఁ గలగర్వంబుఁ జూపుమా సర్వంబున్. 1036
ఉ. వంచన నన్యకాంతఁ గొని వచ్చినతుచ్ఛుని మీఁద శాననుం
గొంచెపువానిఁగాఁ దలఁచుకొమ్మిట నల్పులు లేరు విన్మన
త్కంచర బాహువిక్రమము గాక శరీరమహత్త్వ మేటి కూ
హించినఁ గొండ యెంత పిడు గెంత వినుం దెగటార్చి పుచ్చెదన్. 1037
ఆ. పక్వతాళఫలముభంగి నీతల గూల్పఁ, బిన్నతనము నీదుపెద్దతనము
నీవ కనియె దిట్లు నీ కేను మృత్యువై, వచ్చినాఁడ ననికి వత్తు గాక. 1038
వ. అని పలుకుసమయంబున. 1039
ఉ. కాంచనపుంఖమై వెలుఁగుకాండము మంటలు వాఱ వింట సం
ధించి గరుత్సమీరమున దిక్కులు మ్రోయ నిశాచరుండు ద
ట్టించుచు నక్కతోడ నిగిడించిన దాని వెడందతూపునం
ద్రుంచుచు రాముతమ్ముఁడును దోడన యేసె లలాట మొక్కటన్. 1040
ఆ. రక్కసుండు నిటలరక్తచ్ఛటోద్గమ, మద్భుతావకాశ మగుచు మెఱయ
హరుని వైష్ణవాస్త్రహతి మంట లెగసిన, త్రిపురగోపురంబు తెఱఁగు నొందె.
వ. ఇట్లు విక్రమించిన దశకంఠనందనుండు దశస్యందననందనుం గనుంగొని. 1042
క. విలుకాఁడ వౌదు నన్నుం, జలియింపఁగఁ జేసి తిట్లు శస్త్రప్రౌఢిం

గలఁగి తొలంగక నాతో, [1]నిలిచి రణము సేసినపుడ ♦ నిను నే మెత్తున్. 1043
తే. అనుచు నొక్కటియును మూఁడు ♦ నైదు నేడు, గాన నేకసాయకములు ♦ ఘనపథమ్ము
నిండ నిగిడించె ఘర్మప్ర ♦ చండకిరణు, కిరణజాలప్రసారవి ♦ స్ఫురణ మమర. 1044
వ. అవియు నవ్వీరుం డర్ధచంద్రాస్త్రంబులం ద్రుంచిన. 1045
క. కనలి నిశాచరుఁడు మహా, శనికల్పం బగుచు వెలుఁగు ♦ శర మొక్కటి వే
కొని బలు తెగఁ బెన్నురమునఁ, జొనిపి సుమిత్రాతనూజు ♦ స్రుక్కం జేసెన్.
తే. బాణహతి నించుకయ డిల్ల ♦ పాటు గలిగి, తొనతిరమైన ధైర్యంబు ♦ తోడఁ బొలిచి
తొరఁగు నెత్తుట నొడలెల్లఁ ♦ దోఁగ నట్లు, [2]నెఱనునోఁ గొన్నయక్కోలఁ ♦ బెఱికివైచి.
శా. నిండం గీలలు గ్రమ్మ రాకొమరుఁ డా ♦ గ్నేయాస్త్ర ముద్దండదో
ర్దండాటోపము సూపఁ జండతరకో ♦ దండప్రకాండంబుఁ జే
ర్పం డంకారభయంకరాయతధను ♦ ర్జ్యావల్లి సంధించెఁ బ్ర
హ్మాండం బెల్ల వెలుంగ ఘోరముగ రౌ ♦ ద్రాస్త్రంబుఁ బౌలస్త్యుఁడున్. 1048
చ. ధనువుల సిట్లు బాణములు ♦ దారుణలీల నమర్చి బద్దెగల్
గొని నిగిడింప రెండుఁ బ్రతి ♦ కూలగతిం గులిశద్వయంబు చా
డ్పునఁ బఱతెంచి మంటలు మి ♦ డుంగుఱులుం జెదరంగఁ దాఁకి వే
పొనుపడి భస్మమై పొలిసి ♦ పోయెఁ బరస్పరతుల్యశక్తులన్. 1049
క. దోషాచరుఁ డప్పుడు పై, నైషికబాణంబు వఱప ♦ నైంద్రాస్త్రమునన్
రోషాకులుఁ డగుచు మహా, భీషణగతి లక్ష్మణుండు ♦ పెలుచం ద్రుంచెన్. 1050
శా. ఆయేటుం దనకోలపాటుఁ గని యా ♦ మ్యాస్త్రంబు సంధించి వాఁ
డేయం గ్రమ్మఱ నమ్మహాభుజుఁడు లో ♦ నేపారు కోపంబుతో
వాయవ్యాస్త్రముచేత దాని నడుమన్ ♦ వారించుచుం గప్పె వి
ల్లొమ్మియం బెల్లగుచిత్తజల్లుగతిగాఁ ♦ గ్రొవ్వాఁడిబాణంబులన్. 1051
ఆ. అవియు వానిదివ్య ♦ కవచంబుపైఁ బడి, బిట్టు మొనలు దునియ ♦ మిట్టిపడిన
మఱియు నలుక నేసె ♦ నెఱనారసములను, గంకటమున కవియుఁ ♦ గాక చెదరె.
వ. అట్లు కవచంబు భేదింపం జాలక విస్మితుం డగుచుండ వాయుదేవుండు సనుదెం
చి యిది యనన్యాస్త్రభేద్యంబు బ్రహ్మాస్త్రప్రయోగంబున వీని వధియింతు గా
కనుచు నుపదేశించి చనియె నంత నాసుమిత్రాపుత్రుండును. 1053
క. బ్రహ్మకు డాక న్నదరఁగ, బ్రహ్మాండము ప్రభలు నిండ ♦ బలుపుట్ట మహా
జిహ్మగము వెడలుగతి నా, బ్రహ్మాస్త్రముఁ దూణిఁ దిగిచి ♦ పటువేగమునన్.
చ. నిరతముగాఁగ వింటఁ దొడి ♦ నిండు దెగన్ వడి నేయ నమ్మహా
శర మెడమాఱుసేయు నిషు ♦ శక్తిగదాదులఁ గాల్చుచున్ భయం
కరగతిఁ బాఱి రక్కసుని ♦ కంఠము ద్రుంచెను మేరుశృంగము

1 జలిపి రణము నిలిచినపుడ ♦ చాలఁగ మెత్తున్. 2 నెఱఁకు లోఁగొన్న.

న్దొరయుపసిండిబొమ్మికము।తోడిశిరంబు వసుంధరం బడన్. 1055

వ. ఇట్లతికాయుండు గూలినం బ్లవంగపుంగవులు సిద్ధచారణాదులు నుచితవాక్యం
బుల సౌమిత్రిం గొనియాడి రతం డరుదెంచి యన్నచరణంబులకుం బ్రణమిల్లిన
నమ్మహాత్ముండు గాఢాలింగనపూర్వకంబుగా నమ్ముని గారవించె నంత హతశేషు
లయినదోషాచరులు విఱిగి పాఱి లంక సొచ్చి సమరవృత్తాంతం బెఱింగించిన
రావణుండు శోకమూర్ఛితుం డై కొండొకదడవునకు బాష్పాకులలోచనుం
డగుచు మంత్రులం గనుంగొని. 1056

క. కదనంబున ధూమ్రాక్షుఁడు, మొదలుగఁ గలరాక్షసో త్తములు శస్త్రకళా
విదు లహితులచేతం బొలి, సెదరే యిటు పోయి పోయి । సేనలతోడన్. 1057

ఉ. నాసుతుఁ డింద్రజిత్తు కద।నంబునఁ బన్నగపాశబద్ధులం
జేసిన నిర్జరాదులకుఁ । జెల్లదు వీడ్వడ వట్టికట్టులుం
బాసి పరాక్రమించెదరు । పంక్తిరథాత్మజు లింక వీరితో
నీ సొనరించువీరవరు । నెవ్వనిఁ గాన జగత్త్రయంబునన్. 1058

తే. మున్ను నాదాడి కెప్పుడు । మూసియుండు, దివిజపురివాకి లిప్పుడు । దెఱచినారు
లంక ఘటితకవాటమై।పొంక మడఁగి, యుండ రిపు లిట్టు లుండ నే।నున్నవాఁడ.

క. నడురేయి సంజవడున,ప్పుడు వేగెడువేళఁ జొచ్చి । పోటునకు రిపుల్
గడఁగుదురు మీరు నాయుత,పడి యుండుం డెల్లవారు । బలములతోడన్.

వ. అని పలికి యంతఃపురంబునకుం జని చింతాకులమానసుం డై నిట్టూర్పు నిగిడిం
చిన మేఘనాదుండు తండ్రి కిట్లనియె. 1061

ఉ. ప్రాకృతునట్లు నీవు ధృతి । పట్టక ప్రాభవ మెల్లఁ దూలఁగా
శోకముఁ బొందె దాలముల । శూరులు చచ్చుట లింత వింతలే
నీకొడు కింద్రజిత్తు రజ।నీచరనాయక దివ్యసాయకా
నీకముతోడ వీఁడె పగ । నీఁగఁ గలండు విచార మేటికిన్. 1062

తే. దివిజదనుజయక్షాదులఁ।దృణము సేయు,నాశరాగ్నులు సైఁప వా।నరులు నరులు
నెంతవా రింతఁ జింతింప । వింక నైన, రాజధర్మంబు పరికింపు । రాక్షసేంద్ర.

—✿ ఇంద్రజిత్తు రెండవయుద్ధము. ✿—

క. అని నేఁడు దాశరథులను, వనచరసైన్యంబుఁ గూల్చి । వచ్చెద నంక్రం
దనముఖ్యులు వెను కైనను, విను నాదుప్రతిజ్ఞ యనుచు । వీడ్కొని కడిమిన్.

వ. చతురంగబలసమేతుం డై ధవళచ్ఛత్రచామరంబులు మెఱయ శంఖభేరీమృదం
గాదితూర్యరవంబులు భూనభోంతరాళంబు నిండం బ్రచండగతి లంకానగరంబు
వెడలి సమరభూమి నుచితప్రదేశంబునం దేరు డిగ్గి తనచుట్టును గరితురగాది
సైన్యంబుల నుండ నియోగించి యగ్నిప్రతిష్ఠాపనంబు సేసి మంత్రతంత్రకలా
పంబులు నెఱయ మెఱయ విహితప్రకారంబున. 1065

క. శరములు నెత్తురుచీరలు, శరపత్త్రావళులుఁ దాడి | సమిధలు నసితో
మరపరిఘాదులు వేల్వఁగ, నరుడుగ మందుచుఁ బ్రదక్షి | ణార్చులతోడన్. 1066

ఉ. ఆహుతు లగ్ని యందుకొన | నచ్చపునల్లని మేఁకపోతుఁ బూ
ర్ణాహుతి సేసి బ్రాహ్మ్య మగు | నస్త్రవరేణ్యము నిష్ఠతోడ నా
వాహనచేసి చాపశర | వర్గరథాన్వితుఁ డై నతన్ను నం
దాహుతిగాఁ దలంచుకొని | యాహవకేళికి నుత్సహించుచున్. 1067

చ. రథసహితం బదృశ్య మయి | రాక్షసరాజసుతుండు తారకా
పథమును బొంద శూలములుఁ | బ్రాసములుం బరిఘంబులుం బర
శ్వథములు భిండివాలములు | శక్తులు లోనగునాయుధంబులం
బృథురుచు లారఁ దాఁకి రతి | భీమగతిం గపిసేన రక్కసుల్. 1068

ఆ. తరులు గిరులుఁ గొంచు | హరులుఁ గడంగిన,నధికతుములసమర | మయ్యెనపుడు
మింటిమీదనడంగి | మేఘనాదుండును, ఘోరబాణవృష్టి | గురియఁ దొడఁగె.

క. గిరు లశనిహతిం గూలిన,కరణిం బొరి నతనిచండ | కాండాహతి వి
స్వరముగ నాపోవుచుఁ గూ,లిరి భూభాగం బదర్వ బ | లీముఖవీరుల్. 1070

చ. మఱియును బై పయిం బఱపు | మార్గణవర్గము లంబరంబునన్
గిఱిగొనుచుం బ్రచండగతిఁ | గీలలు వాఱఁగ వచ్చి వక్షముల్
దెఱపులు సేయుచున్ మెడలు | ద్రెంచుచుఁ బొట్టలు సించుచుం దొడ
ల్వ్రఱుచుచు మస్తకంబు [1]లగ | లించుచు నిట్లు వధింపఁ జొచ్చినన్. 1071

క. నానాభంగుల మెఱయుచు, వానరయూథపులు వృక్ష | వర్గము రక్ష
స్సేనపయిఁ గురియ నలుఁగుల,వానఁ గలంచెం బ్లవంగ | వాహిని నెల్లన్. 1072

వ. అప్పుడు సుగ్రీవాంగదగంధమాదనజాంబవదాంజనేయసుషేణమైందద్వివిదగజగవయగవాక్షకుముదాక్షకుముద హరిరోమ కేసరి వేగదర్శి విద్యుద్దంష్ట్రసూర్యప్రభదధిముఖజ్యోతిర్ముఖప్రముఖు లైనబలీముఖవీరుల నభిమంత్రితగదాశూలప్రాసాదిప్రహరణంబులఁ దూలనేయుచుఁ దరణికిరణసంకాశంబు లగుమహాశుగంబులఁ దమ్ముఁ గప్పి నొప్పింపఁ దదీయశరవేగంబు సహింప కచ్చెరు వందుచు రఘువరుండు లక్ష్మణుం గనుంగొని నేఁడు శత్రుండు బ్రహ్మాస్త్రంబు నాశ్రయించు టంజేసి యెవ్వరికి నజయ్యుం డయ్యె నయ్యస్త్రంబు మనకు మాననీయం బగుం గాక యని యుపదేశించుచు. 1073

చ. కడిమి నతండు బ్రహ్మవర | గర్వమునం బొడలేక మింటిలో
నడఁగి విచిత్రవేగమున | నాశుగజాలము లంతకంతకున్
జడిగొనఁ జేయుచుం బ్లవగ | సైన్యము దైన్యము నొంద నీగతిం
గడపెడునే శరాంగణము | గ్రిక్కిఱియం బడి రెల్లవీరులున్. 1074

1. లు దళించుచు.

సీ. అని కడుఁ జింతింప । నతఁడు వెండియుగంధ,మాదను ముయ్యాఱు । మార్గణముల
వృషభనీలాంగద । ద్వివిదసుగ్రీవుల, ముప్పదేనేసియ । మ్ముల మహోగ్ర
శరములఁ బదిటను । జాంబవంతుని మైందు, బాణసప్తతి నస్త్ర । పంచకమున
[1]గజునిఁ దొమ్మిదిసాయ । కమ్ముల నలు నేసి, పటుశిలీముఖపరం । పరల దెసలు
నాకసంబు నిండ । నందంద పఱపుచు, యూథపతుల నెల్ల । నుర్విఁ గూల్చె
సకలభూతతతులఁ । జండాట్టహాసంబు, చేసి చేసి బెదరఁ । జేసి చేసి. 1075

చ. ఉఱుముచుఁ గాలమేఘము మ । హోగ్రతగాశనిపాతఘోర మై
మెఱయు తెఱంగు దోఁప నట । మింటఁ బొరింబొరిఁ జాపటంకృతుల్
గిఱిగొనుచుండ నద్దెసలఁ । గీలలు వాఱుశరంబు లేసి క
న్దెఱవనిమూర్ఛ గాఁగ జగ । తిం బడ నేసె నృపాలసూనులన్. 1076

వ. ఇట్లు విక్రమించి మేఘనాదుండు సింహనాదంబు సేయుచు లంకకుం జనిన బ్ర
హ్మాస్త్రమంత్రజపంబున నస్త్రపాతంబునకుం దప్పినవిభీషణుండు దదాచరణశర
ణుం డైనహనుమంతుం గనుంగొని. 1077

చ. పడిరి విరోధిచేత నిటు । పార్థివసూనులు సేన లన్నియుం
మడిసెఁ బ్లవంగయూథపులు । మందున కొక్కఁడు లేఁడు సూడఁగాఁ
బొడవడకుండ నుగ్రగతి । భూస్థలిఁ గూలిరి జాంబవంతుఁ డె
య్యెడఁ బడినాఁడొ కార్య మతఁ । డెల్లదియుం గనుఁ జావకుండినన్. 1078

చ. ఇఱుముకొనం దొడంగె దెస । లేచినచీఁకటి నంచుఁ జేతులం
గొఱవులు పట్టి క్రుమ్మరుచుఁ । గొండొకప్రాణము లున్న బాణముల్
వెఱుకుచుఁ బెంట లై పడిన । పీనుఁగులం గలయంగఁ జూచుచుం
నెఱఁకులఁ జండకాండములు । నిండినయూథునిఁ గాంచి రొక్కెడన్. 1079

క. కని కదిసి విభీషణుఁ డి, ట్లనియె విభీషణుఁడ నేన । జాత్మజ ప్రాణం
బున నున్నాఁడవె మనవా, రనిఁ గూలిరి మేఘనాదు । నమ్ములవానన్. 1080

చ. అఱువదియేడుకోటు లర । యం సురసంభవు లైనయూథపుల్
నఱు మయి రన్యజాతులు ర । ణంబునకుం గలవీరు లెంద అం
దఱుఁ బడి రమ్మహాబలుఁడు । దత్తవరుం డని బ్రహ్మవాక్యముం
గుఱిచి విసంజ్ఞ నొందిరి ర । ఘుక్షితినాథులు నేమి సెప్పుదున్. 1081

వ. అనిన విని యొట్టకేలకు నెలుంగు దెచ్చుకొని రక్షోవీర ని న్నెలుంగున నెఱిఁగితిం
గన్ను లమ్ములుగొనుటం దెఱవరాదు హనుమంతుండు బ్రదికెనో యే మయ్యె
నో చెప్పవే యతనిసేమం బనవుడు నప్పౌలస్త్యుండు. 1082

క. ధరణీనాయకు లుండఁగ, హరిపతి సుగ్రీవుఁ డుండ । నంగదముఖ్యుల్
తరుచరు లనేకు లుండఁగఁ, గరువలిసుతు నడుగ నేమి । కారణ మార్యా. 1083

---

1. 'దొమ్మిదిబలుసాయకమ్ముల నలు నేసి' అ. ప్ర.

వ. అనిన జాంబవంతుం డిట్లనియె. 1084

చ. రజనిచరేంద్రకయ్యమున ♦ రావణనందనుబాణవృష్టి న
క్కజముగ నందఱుం దెగినఁ ♦ గ్రమ్మఱఁ బ్రాణము లెత్తు నంజనా
త్మజుఁ డతఁ డొక్కఁడుం గలుగఁ ♦ దక్కినవీరులతల్లు లెల్ల సు
ప్రజలు నజీవులుం మృతులు ♦ భానుసుతాదు లతండు దప్పినన్. 1085

వ. అని పలుక నాంజనేయుండు గోత్రనామంబులు సెప్పి నమస్కరించుటయు నభి
నందించుచుఁ దన్నుఁ బునర్జాతుంగాఁ దలంచుకొని జాంబవంతుం డిట్లనియె.

శా. తండ్రిం బోలెఁ జరించు నెవ్వఁడు విశు♦ద్ధఖ్యాతి వంశోత్తరుం
డం డ్రాపుణ్యుని భూతకోటులకు న ♦ ట్లాధార మై యున్కి మీ
తండ్రిం బంకజసంభవాదులు జగ♦త్ప్రాణుండు నారే మముం
దండ్రీ యెత్తుదు గాక నీవును విభుల్ ♦ దక్కెవ్వ రిక్కీర్తికిన్. 1087

క. క్రిక్కిఱియ సమరతలమున, నిక్కయి వడిఁ బడినమమ్ము ♦ నెప్పటి వడయం
దక్కినవెర వెద్దియు లే, దొక్కఁడు దివ్యౌషధప్ర♦యోగము దక్కన్. 1088

క. వాయుసుత మేఘనాదుని,సాయకములఁ దెగినకపుల ♦ సప్రాణుల భూ
నాయకసుతులను బ్రదుకం, జేయం గొనివత్తుగాక ♦ సిద్ధౌషధముల్. 1089

వ. తదీయమార్గంబు విను మిక్కడలి గడచి చక్క నుత్తరాభిముఖుండవై చనం జన
హిమవంతం బక్కొండ కాకడ బహుకూటశోభితం బగుహేమకూటం బన్న
గంబున కవుల ఋషభాచలంబు దాని కాదిక్కున మేగు వాగ్గ్రావగ్రామణి కద్దెసఁ
గైలాసం బాశిఖరికులశేఖరంబున కట నధికదూరంబున శృంగవంతం బగ్గిరి కుత్త
రోత్తరంబులై నీలశ్వేతకనకాకరంబు లనుశైలంబులు నుత్తరలవణసముద్రంబు
ను శాకద్వీపంబును క్షీరసాగరంబును బొలుచు వానిం గ్రమంబున నతిక్రమించి.

ఉ. సంద్రము దుగ్ధబిందువులు ♦ సల్లెడునుత్తరతీరభూస్థలిం
జంద్రనగంబు ద్రోణగిరి♦సందున నొప్పు మహోదయాద్రి యం
దింద్రునియాజ్ఞఁ బెం పెసఁగు ♦ నెట్టనిపువ్వులఁ బచ్చపండులం
జంద్రమరీచులం దెగడు♦చల్లనియాకుల నోలి నోషధుల్. 1091

వ. అవియు నమ్మహీధరంబు దక్షిణశృంగంబున విశల్యకరణియు సంధానకరణియు
సావర్ణ్యకరణియు సంజీవకరణియు నన నాలుగుదెఱంగు లై వెలుంగు మఱియు
నొక్కవిశేషం బెఱింగించెద నాకర్ణింపుము. 1092

ఉ. ఈరజనీచరేంద్రుపురి ♦ కేఁబదిలక్షలయోజనంబులం
దార లధిత్యకాతరువి♦తానలతాంతములో యనంగఁ బెం
పారుచు నుండు నయ్యచల♦మందుల మందులు రాత్రి వేళలం
దారయ శక్తిమంతము ల♦హస్సమయంబుల శక్తిహీనముల్. 1093

క. కావున నీ వీరాతిరి, వేవెడునీలోనఁ బోయి ♦ వెస నౌషధముల్

దేవలయుఁ బోయి రమ్మని, దీవించుచు వీడుకొలుపఁ ✽ దిర మగు వేడ్కన్.

—✿ హనుమంతుండు సంజీవనిఁ దెచ్చుట. ✿—

క. వే చని చేయుదు నిప్పని, కే చింతయు నేటి కనుచు ✽ నేతెంచి నట
ద్వీచీసంఘట్టనమున, వాచాలం బైనలవణ✽వారిధిచెంతన్. 1095

క. అమరుసువేలము గని వే,గమ యాగిరి యెక్కి రాము✽కార్యము,నిర్వి
ఘ్నముగం జేయం గృపసే,యుము భూధర నాకు ననుచు ✽ నుత్సాహమునన్.

ఉ. పుట్టినవిక్రమస్ఫురణఁ ✽ బొంగినమే నతిఘోరభంగికిం
[1]బట్టుగ నేపుమై నిలిచి ✽ బాహులు సాఁచి మహాట్టహాసనం
ఘట్టన లంక గ్రక్కదలఁ ✽ గాఁ గపివీరుఁడు దాఁటె [2]దాఁటునన్
మెట్టినకొండ గ్రుంగఁబడి ✽ మేదిని బీఁటలువాఱ మింటికిన్. 1097

క. వడి దాఁటుమేనిగాలిం, గడలెత్తి పయోధి మ్రోయఁ ✽ గా మేఘంబుల్
సుడిగొనుచుఁ జెదరి దిక్కులు, గడవఁ బఱవం బ్రచండ✽గతి నటు చనుచున్.

చ. కలధౌతాద్రితటాంతరిక్షమునఁ జ✽క్కం బాహుముల్ మీఁదుగాఁ
దలక్రిం దై కరపద్మముల్ నుదుట నం✽దం బొంద జేపెట్టుచున్
లలి నాశంకరుశైలముం గడచి [3]బా✽లస్వేద మాస్యంబుపై
వలియం గ్రమ్మఁగఁ గ్రమ్మఱం దిరిగి పో✽వం బోవఁగా ముందటన్. 1099

మ. అమృతాంశుద్యుతిజాలశీతలవికీ✽ర్ణాంభఃకణస్యందమై
చెమటార్పన్ వలిగాలి రాఁగ నెదురన్ ✽ క్షీరాబ్ధిఁ గాంచెన్ నగో
త్తమమంథక్షుభితాంతరంగము దర✽ద్దైత్యారిశయ్యాభుజం
గము నుత్తుంగతరంగముం గృతవియ✽ద్గంగాపరిష్వంగమున్. 1100

క. కని యాజలధికి మ్రొక్కుచుఁ, జని యుత్తరతీరభూమి ✽ సరి మూఁడద్రుల్
ఘనవీథి దాఁకి యుండఁగ, వినువీథిం జేర నరిగి ✽ వికసితముఖుఁ డై. 1101

క. కెలఁకులఁ జెన్నగునీనగ,ములు చంద్రద్రోణశైల✽ములు మధ్యమునం
బొలుచు నిది యౌషధాచల, మలఘుతరద్యుతుల వెలుఁగు ✽ నవి యాతీఁగల్.

క. అనుచు నగోపరిభాగం,బునకుం జనుదెంచి వాయు✽పుత్త్రుం డచటన్
మును వెలిఁగెడునాలతికలు, కనుఁగవకుం దోఁపకున్నఁ ✽ గడు విస్మితుఁ డై.

సీ. కొండొక చింతించి ✽ కొండతో నిట్లను, హనుమంతుఁ డనువాఁడ ✽ నఖిలలోక
[4]కంటకుఁ డగుదశ✽కంఠుని దెగటార్చ, నాలంకపై దొర ✽ లట్లు విడిసి
సంగరక్రీడల ✽ శత్త్రువీరులచేతఁ, బోటేటుఁ బడి తూలి ✽ పుడమిఁ బడిన
వారి నందఱఁ దేర్ప ✽ వలసినమందులు, నీయందుఁ గలుగుట ✽ నిక్క మెఱిఁగి
వచ్చినాఁడ నింక ✽ వంచన యేటికి, నెలమి నౌషధంబు ✽ లిత్తుగాక

---

1. బట్టుగమూఁపునై నిలిచి. 2. దాపునన్ మెట్టిన. 3. ఫాలస్వేద.
4. కంటకు దశకంఠుఁ గడతేర్ప లంకపై, విడిసిన యారఘువీరుబంట, సంగర.

రాజవృషభుఁ డైన ॥ రామునికార్యము, పేక్షణీయమే న ॥ గేంద్ర నీకు. 1104

క. ప్రాలేయాద్రియు మేరువుఁ, గైలాసముఁ జూడ కేను ॥ గార్యాతురతన్
శైలోత్తమ వచ్చితి నీ, పాలికి న న్ననుపు మనినఁ ॥ బటురోషమునన్. 1105

క. ఏమీ మందులు గొనిపో, నా మర్కట నీవు వచ్చి ॥ నాఁడవు [1]నగిరిన్
బో మహి నీ వెవ్వండవు, రాముం డన నెవ్వఁ డేల ॥ రాముఁడు నాకున్.

క. నాకనివాసులు నిండ్రుఁడు, నాకడఁ బదిలంబు చేసి ॥ నమహౌషధముల్
మీ కేటికి దొరకొను నివి, నీ కిచ్చుటకంటె నాకు ॥ నేరము గలదే. 1107

క. లాఁతిఁ గని యిచటిక్రోఁతులు, [2]కూఁత లిడుఁ నిలువవలదు ॥ కూయక పోపో
క్రోఁతులకుఁ గాయొ పండ్లో, బ్రాఁతిగ నా తేనెపెఱయొ ॥ పరమౌషధముల్.

వ. అనిన విని కోపాటోపంబున నట్టహాసంబు చేసి. 1109

క. ఓరి కఠినాత్మ నన్ను వి, చారింపవు నీవు రామ ॥ చంద్రు నెఱుంగన్
మేరువవో హిమగిరివో, గౌరీపతినిలయ మైన ॥ కైలాసమవో. 1110

క. దిట్టతనంబున గర్వ, మ్మిట్టుండఁగ నిన్నుఁ బెఱికి ॥ దేఁ గొని పోదుం
బెట్టుదు రఘుపతిముందటఁ, బెట్టిన నెఱిఁగెదవు గాక ॥ ప్రియమున రామున్.

చ. అనుచు నుదగ్రసాను వగు ॥ నన్నగ మాయతబాహుశాఖలం
బెనఁగొనఁ బట్టి లావుమెయిఁ ॥ బెట్టినపాదము లూఁది మూఁపు లే
పున నెగయించి ఘోరగతిఁ ॥ బొంగినవాలము మీఁది కెత్తి మ్రేఁ
గినబలదర్ప మొప్పఁ బెఱి ॥ కెం బృథివీస్థలి వ్రయ్య నయ్యెడన్. 1112

సీ. కనుఁగొని ముందటఁ ॥ గాపున్న గంధర్వు, లాయుధపాణు లై ॥ యలుకతోడ
నోరోరి వానర ॥ యోటలే కీ విట్లు, దివిజనాయకునాజ్ఞ ॥ ధిక్కరించి
క్రొవ్వున నిక్కొండఁ ॥ గొనిపోవుచున్నాఁడ, వెట పోవవచ్చు మా ॥ యెదుర నీకు
ననుచు నొక్కుమ్మడి ॥ నందంద దిక్కులు, పగులంగ నార్చుచు ॥ బరవసమున
వచ్చి తాఁకిరి తాఁకిన ॥ వారి నచటఁ, గడిమిఁ దెగటార్ప నొల్లక ॥ కాలపాశ
తులితవాలమారుతమునఁ ॥ దూలఁ ద్రోలె, నల్పతరతూలికలభంగి ॥ ననిలసుతుఁడు.

ఉ. అప్పుడు దోఁచునోషధుల ॥ నద్రి వెలుంగుచు వేయిధారలన్
వి ప్పగుచక్ర మై మెఱయ ॥ వెన్నునికై వడి నేఁగుదేరఁగాఁ
దప్పక చూచి రావణవి ॥ దారణదారుణబాణవృష్టికిం
దప్పినవానరుల్ దెసలు ॥ తల్లడిలం గడువీఁక నార్చుచున్. 1114

క. ఆహవభూమి నిశాచర, దేహంబులు వెదకి వెదకి ॥ తెచ్చి మహోగ్ర
గ్రాహములు మ్రింగ బాహుబ, లాహంకృతి వీచివైచి ॥ రంబుధిలోనన్. 1115

క. ఆలోన సముద్రంబు ను, వేలాద్రియుఁ గడచి వచ్చి ॥ వెరవున డించెన్
లీలాలసగతి నతఁ డా, శైలము గపిసేననడుమ ॥ సన్నుతు లెసఁగన్. 1116

1. గాఁ బో వీవహి. 2. లిడం కూఁత క్రేలవలదు.

వ. ఇట్లు మహౌషధంబులు దెచ్చి మూర్ఛల మునింగియున్న యన్నరేంద్రనందను
లకు సుగ్రీవాదులకు నాంజనేయుండు నమస్కరించె నాసమయంబున. 1117

చ. మెలఁగెడునౌషధానిలము మెల్లనిసోఁకున మర్మసంధులన్
బలువిడిఁ గొన్నశస్త్రములఁ బాసి శరీరము లొప్పఁ బ్రాణము
ల్నెలకొని కాలు సేయి గదలించుచు నూర్పులు పుచ్చి లోచనో
త్పలములు విచ్చి చూచి రొగిఁ బర్వినమూర్ఛలు దేఱి రాఘవుల్. 1118

తే. తరుచరావలియు విశల్యకరణివలన, నెఱఁకులాడినయలుఁగులు పెఱికిపోయి
తుడిచినట్టుల గండ్లును నడఁగి మేని,గనియ లన్నియు సంధానకరణి నదికి.

క. సావర్ణ్యకరణి నమ్మె,పావనతనుకాంతు లెసఁగఁ బ్రాణంబులు సం
జీవనిచే నెలకొన ని,ద్రావస్థలఁ బాసినట్టు లమరెం జూడన్. 1120

సీ. అప్పుడు సుగ్రీవుఁ డాదిగా నగచరు, లినసుధాంశులభంగి నెసఁగి వెలుఁగు
పార్థివసుతులకుఁ బ్రణమిల్లి హనుమంతుఁ, గొనియాడి రా రాజకులవిభుండు
పవననందనుఁ జూచి పాకశాసనునాజ్ఞ, నెమ్మితో మనకు మన్నింప వలయు
నీకొండఁ దొంటిచో నిడిరమ్ము నావుడు, వెన నాతఁ డట్ల కావించి వచ్చె
నంత నుదయాద్రిమీఁదికి నరుగుదెంచె, దాశరథులముఖారవిందంబు లలరఁ
గపులు మగుడఁ బ్రాణంబులు గలిగి వెలుఁగు, కడఁకఁ జూడ నేతెంచిన కరణిఁ దరణి.

చ. నగచరనాథుఁ డంత రఘునాథుఁ గనుంగొని కుంభకర్ణుఁ డా
దిగఁ గలవీరు లెల్లఁ గడతేఱి రనేకులు శూరశూన్య మీ
నగరము లంక నింకఁ గదనం బనుమాటలు సిక్కె నేగతిన్
మొగియఁడు పంక్తికంఠుఁడు సమున్నతిపెం పఱి యుద్ధకేళికిన్. 1022

ఆ. కాన నేఁటిరాత్రి గాకుత్స్థకులవీర, కపుల నెల్ల లంక గాల్పఁ బనుపు
మనిన నానరేంద్రుఁ డట్ల నియోగించె, సకలవృక్షచరుల సమ్మదమున. 1023

ఉ. అంత నిశాచరేంద్రపుర మంతయుఁ గాల్పఁ బ్లవంగవీరు ల
త్యంతకుతూహలంబున దినాంతము గోరఁగ నంతరిక్షగో
శాంతరవీథి శోభిలుచు నంబుజబంధుఁడు వారుణాంబుధి
ప్రాంతము సేరె జక్కవలు పశ్చిమభాగము సూడ నోడఁగన్. 1124

ఆ. అట్లు సేరి యంత కంతకు నరుణిమం, బెసఁగ నస్తశిఖరి కేఁగి క్రుంకె
నింక మంట లడరు లంక నిట్లనుభంగిఁ, బరఁగె సంజకెంపు పశ్చిమమున.

క. ఘనముగ సంధ్యారాగము, నినుపార నిషిద్ధవేళ నిద్దురవోవం
గని కమలంబుల నగువిధ,మునఁగుముదములొయ్యనొయ్య మూతులువిచ్చెన్.

క. దిక్కాంతలు గాటుకఁ గడుఁ, బిక్కటిలం గరవటమునఁ బెట్టినగతి నీ
దిక్కాదిక్కనకుండఁగ, నక్కజ మగునంధకార మఖిలముఁ గప్పెన్. 1127

వ. ఇత్తెఱంగున రోదోంతరంబు నిరంతరధ్వాంతం బగుటయుఁ గనుంగొని. 1128

—❀ వానరులు లంకఁ గాల్చుట. ❀—

క. ఏపునఁ గొఱవులు గొని లం,కాపురగోపురము లెల్లఁ గపులుం గోపా
టోపమునఁ గదిసి యక్కడఁ, గా పున్ననిశాటకోటిఁ గడతేర్చి వడిన్. 1129

క. తలుపులు తుత్తునియలుగా, బలువిడిఁ బడఁదాఁటి చొచ్చి పటువేగమునం
బెలుకుఱఁ బట్టి వధించిరి,తల లూడఁగఁ బాఱ నెగిచి దౌవారికులన్. 1130

చ. అదటునఁ గోట సొచ్చి కపు లార్చుచుఁ జిచ్చులు వైచి రెల్లచో
నడ రథశాలలం గవిసె నగ్నులు ఘోటకశాల లెల్లఁ బె
న్నదరులు దంతిశాల లటు లాకస మంటినమంట లాపొగల్
గదిసెను ధాన్యశాలలను గర్వ మడంగిరి పో నిశాచరుల్. 1131

క. పొగులుచు మిడుఁగుఱు లెగయఁగఁ,బొగలు నభోంతరము నిండ భూరిజ్వాలల్
దెగిపడి దరికొనఁగ భుగుల్, భుగు లనుచుం గాలఁజొచ్చెఁ బురిమందిరముల్.

ఉ. ఇంక బలీముఖుల్ బలసి రెక్కడిరావణుఁ డేటిలంక పొం
డింకెను మేఘనాదునకు రీపెనుమంటలతోడిచిచ్చు ల
భ్రంకషశాతకుంభశిఖరం బగుమోసలఁ గంటి రెట్లు నా
వంకఁ జరింప దగ్ని యవి వారి విభీషణుపుణ్యగేహముల్. 1133

ఉ. [1]శ్రీనుతమూర్తి యైనరఘుశేఖరు తేజముఁబోలెఁ బర్వుచున్
భానుసహస్రమండలవిభాసిసముగ్రతరప్రకాశుఁడై
మానుగ మింటితో నొఱయుమంటలు దిక్కులఁ గ్రమ్మ నుగ్రవై
శ్వానరుఁ డేపుతో నెసఁగె వానరరోషసముత్థుఁడో యనన్. 1134

మ. పొగ లెచ్చె న్నెగయుం గృశానుఁ డచటన్ భూమార్చి యై మండు మా
నుగ భీతిల్లినవాఁడపోలెఁ [2]గదియు న్మున్వారివాహాంగ మై
తగ నూహింపక నాశహేతు వగుధూర్తవ్రాత మాత్మీయహా
నిగ వర్తించునకాదె లోలుఁడు జగన్నింద్యుం డగుం జూడఁగన్. 1135

క. వితతాగ్నిఁ గరఁగి పిండీ,కృతము లయినచారుకనకగేహంబులు వి
శ్రుతహాటకగిరితటవి,చ్యుతఘనతరశిలలభంగిఁ జూడఁగ నొప్పెన్. 1136

మ. కనదభ్రంకషతుంగసౌధములపైఁ గాంతాసమేతంబుగాఁ
దనివోవన్ సురతోపభోగముల నిద్రాపారవశ్యంబుఁ బొం
దినదైత్యేంద్రులు మ్రగ్గ నగ్ని వికసద్దీప్తోష్మలుం డై వెసం
గనలెన్ రామునివాలిచందమున లంకాత్రాససంపాది యై. 1137

సీ. ప్రళయకాలమునాఁడు బలువేదిమేరువు,బహుభంగి వ్రక్కలై పడియెనొక్కొ
సంవర్తసంభ్రాంతజలదముక్తంబు లై, మెఱపులు గిఱిగొని మెఱసె నొక్కొ

1 ఈఘట్టమువఱకు హుళిక్కిభాస్కరకవివిరచితము. ఇదిమొదలు కడవఱకు వేదగిరినాయనింగారిప్రేరణమున నయ్యలార్యుఁడు రచియించినవి. 2 నదిమున్ను వారివాహాంగమై, తగ నూహింపఁగ.

భర్గులలాటంబుఁ గాసి కృశానుండు, చదల నుద్గతితోడఁ బొదలె నొక్కొ
సలిలంబు ద్రావవే సతిబాడబము వచ్చి, పురవరం బురవడిఁ బొదివెనొక్కొ
యింక నీచిచ్చు బారి కేవంక నోడుఁగ, వచ్చు నెక్కడ వెరవులోఁ జొచ్చువార
మనుచు నక్కడనక్కడ నసురు లెల్ల, దిక్కు గానక తమలోనఁ దిరుగఁబడఁగ.

మ. శరదభ్రంబులతోడ సాటి యగుప్రాసాదంబులున్ హేమసుం
దరగేహంబులు రత్నరాజియుతనూత్నస్తంభసంభారగో
పురముల్ మండపచైత్యముల్ ధనగృహంబుల్ దుర్గమాట్టాలకో
త్కరముల్ గాలి మహీస్థలిం బడియె నుగ్రంబై నయాచిచ్చునన్. 1139

సీ. ఘనసారచందనకస్తూరికాగురు,కుంకుమాదులు గాలెఁ గొలఁది మిగుల
వజ్రవైదూర్యప్రవాళముక్తాపద్మ,రాగమహానీలరాసు లగలె
వెలలు సేయఁగరానివివిధచీనాంశుక,చిత్రాంబరాదులచెలువు దీఱె
సొలవక మున్నున్నసొమ్ములతోడన, భాండగేహంబులు భస్మమయ్యె
విపులధాన్యగృహంబులు[1] వెలయు నెఱిన, పూర్వవస్తునిచయములపొలుపుగనలె
సుభటవర్మంబులొక్కటసొబగుమాలెఁ, గరటితురగేంద్రరాజిపక్కెరలు వ్ర

క. అసిముద్గరకుంతశరే,ష్వసనపరశ్వథగదామహాతోమరప [గ్గె.
ట్టిసములు గాలెను దైత్యులు, వస మఱి వగనొంది పొగిలి వనరుచు నుండన్.

క. వదలక పెనుఁబొగ కన్నులఁ,బొదివినఁ జీకాకుపడుచుఁ బొగులుచు శోకా
స్పదులై ముందఱఁ గానక, యుదితాగ్నికి శలభవృత్తి నొందిరి దైత్యుల్. 1142

సీ. సొరిది మద్యము గ్రోలి చొక్కెడివారును, బలునిద్రచేఁ దొట్రుపడెడువారు
లలనాగ్రభుజలతాలంబితవస్త్రులుఁ, గార్ముకముద్గరఖడ్గధరులు
భామలఁ గూడి తల్పముల నిద్రితులును, బుత్రదారలఁ దేరఁ బోవువారు
బొగ సుట్టుముట్టినఁ బోలేనివారును, గరమును బిమ్మిటి గదియువారు [వారు
జేరఁగారానిసెగ దాఁకి చిక్కువారుఁ, బొదలుమిడుఁగుర్లతాఁకునఁ బొగులు
నైనదైత్యులు పదివేవు రగ్నియందుఁ, బండుటాకులకై వడి భస్మమైరి.

క. మణికనకకలితమందిర,గణములు దరికొనినపావకముచేఁ గనలెం
బ్రణుతదవానలవృతరో,హణగిరిశృంగములపోల్కి యనుమతి సేయన్. 1144

తే. అనలదందహ్యమానంబు లగుచు నేలఁ,[2]గూలె రత్నవిచిత్రితగోపురములు
కులిశసాధనుదంభోళిఁ గలయ వ్రాలు,కుధరకూటము లెనయునఁ గొమరుమిగుల.

క. రమణీరమణీయమణి,క్రమశుభకాంచీరవములుఁ గంకణఝుంకా
రములును నూపురకనినా,దములును నొకమాత్రఁ బొలిసె దహనునిచేతన్.

క. నలిఁ గాలి పగులురత్నం,బులు జీవము లెగయుభంగి బొరి నెగసె మహో
జ్జ్వలవిస్ఫులింగములు ను,ల్కలుఁబోలె దశాస్యునాశలక్షణ మొదవన్. 1147

1. వెలయు మఱి యపూర్వ. 2. గడుసు రత్నవిచిత్రితగృహచయములు.

శా. విభ్రాంతద్విరదేంద్రఘోటకరవావిర్భూతనాదంబు గా
లాభ్రాదభ్రరవంబుతో నొరయుచున్ వ్యాధూతమంథానశై
లభ్రాంతిక్షుభితాంబురాశికరణిన్ లంకాపురం బాత్తర
క్షోభ్రాజిష్ణుత లేకయున్ వెలిఁగె సంక్షోభీకృతాగార మై. 1148

చ. ఘనతరనిక్వణం బొదవఁ గాలుచుఁ దోరణముల్ మహేంద్రనీ
లనిచయమేచకంబులు విలగ్నమహాగ్నిశిఖాళిచేఁ దటి
త్సనితసముల్లసజ్జలదసంఘముఁ బోలుచు హేమసానుమం
డనశుభనీలభూధరవిడంబన [1]మొప్ప వహించునట్లుగన్. 1149

తే. పరఁగఁ జాలిండ్లపయ్యెద పరికొనంగ, ఘనకబరికాభరంబును గమరిపోవఁ
బ్రియులబిడ్డల నుడివడఁ బిలిచిపిలిచి, దానవీచయ మంతంతఁ [2]దఱలఁ బాఱె.

సీ. సరభసోత్థితభృంగపరిశూన్యగతి నున్న,కటముల ధూమంబు గలయఁ బర్వ
దానజంబాలితాలానంబు లందంద, విఱిచి శాలలలోను వెడలి వచ్చి
యపరాంగలూనలగ్నాందూనినాదంబు, లులియఁ గ్రంతలు వట్టి కలయఁ బాఱి
కర్ణతాళోత్థితోద్దీర్ణమారుతమున, నగ్ని యభ్రంకషావార్తిఁ బొదలఁ
[3]దిరుగఁ జొచ్చెఁ గరులు దిక్కులు గానక, బృంహితంబు లొదవఁ బృథువిషాద
మంది తొట్రుపడుచు నందంద కన్నీరు, దొరఁగ నిర్ఝరాంకగిరులఁ బోలె.

వ. అంత మర్కటులపయిం బేర్కొని మార్కొనుదైత్యులును వనచరుల వధింపం గడంగురక్కసులును నపత్యంబులు సిక్కె నని గేహంబుల కరుగుదానవులును సమాక్రందనంబులతో బాలకులు వెంటఁజను దేరం బఱచునిశాటులును జనిచని నడుమ దహనదాహంబున నీలుగుయాతుధానులును నాసురీజనంబుల నోడకుఁ డోడకుం డనుచుఁ బాణిపల్లవంబులు బలువుగా నవలంబించి యొండుదెసల కరుగ నచ్చో నప్పుడ మెండుకొనిమండుచు నెదురువచ్చుచందంబునకుం గృశానుం డకృశార్చియై యేర్చిన రూపుచెడుదైతేయులును గోటఁ బ్రాఁకి యగడ్తల కుఱికిచనుచుఁ గపివీరులచే సమయువారును బాఱుచుం దాఱుచు దశవదనునవినయంబు దూఱుచుం బ్రేలుచు శిఖాహతిం గాలుచు శాఖామృగంబుల నిందించుచు దందహ్యమానాజ్యతైలగుడాదిద్రవ్యంబులకుఁ బొగులుచుఁ బగిలి విశీర్ణంబు లై యున్నరత్నరాసులకు వగచుచుం దమతమపాలిదైవంబుల కేడ్చుచు దౌర్భాగ్యంబులకుం బొక్కుచుఁ బ్రాణంబులు గలిగె నింతియ చాలు ననుచు ధైర్యంబులు సిక్కం బట్టుచుఁ బుత్రమిత్రకళత్రపితృభ్రాత్రాదివినాశంబునకు శోకించుచు విధిచేఁతకుం దిట్టుచుఁ దడఁబడఁ బుడమి మొట్టుచు నక్కడక్కడ నీభంగి బహుప్రకారంబులం దిరుగుడుపడిరి తదనంతరంబ. 1152

1. శోధన మొప్పనట్లుగన్. 2. 'దరలి చేర.' అ. ప్ర. 3. దిగులు సొచ్చి కరులం దిక్కుఁ గానక దీనబృంహితంబు. ···గన్నీరు దొరఁగు.

చ. సురిఁగెడువారి గొందులకుఁ జొచ్చుచు డాఁగెడువారి నుద్ధతా
తురమునఁ బాఱువారి నతిదూరము లేఁగినవారిఁ గ్రంతలం
దిరిగెడువారి [1]మాటుకొని త్రిమ్మరువానిని బట్టి కీశు లు
ద్ధురగతి మంటలోపలను ద్రోతురు విక్రమదుర్నివారులై. 1153

చ. అంత ననంతసాహసులహంకృతితోడుత రామలక్ష్మణుల్
సంతతశింజినీరవవిశంకటకార్ముకహస్తులౌచు రో
దోంతర మెల్ల నిండ నహిమాంశుసమద్యుతిబాణకోటులన్
సంతమసం బడంచిరి నిశాచరలోకవినాశకారులై. 1154

క. భూనాథతనయులపటు,జ్యానిర్ఘోషంబు బహునిశాచరకోటి
ధ్వానంబు నార్తరవమును, వానరనిస్వనముఁ గూడి వడి నొకటయినన్.

మ. కదలెన్ భూమి గలంగె వార్ధులు వడిం గంపించె నాకంబు వే
చదిసెన్ శేషునిమస్తకంబులు దిశాచక్రంబు భేదిల్లె ను
న్మదదిగ్దంతులు మ్రొగ్గ నాదివరకూర్మంబుం గదుల్ స్రుక్కెఁ బెం
పదరెన్ ధైర్యము దక్కె కాలగళుచిత్తాంభోరుహం బత్తఱిన్. 1156

క. ఆరాముచాపనిర్గత,ఘోరాస్త్రిచ్ఛటలఁ గూలె గోపుర మంతం
బౌరందరదంభోళి,స్ఫారాహతిఁ జేసి వ్రాలుశైలమపోలెన్. 1157

క. గృహముల విమానముల నతి,బహుళము లగురాముబాణపంక్తులు గొన స
న్నహనములు గలిగె దివిజని,వహములకు[2]ను విక్రమోత్సవ మ్మొదవంగన్.

వ. అంతఁ దపనతనయుండు బలీముఖుల కిట్లనియె. 1159

చ. గవఁకుల వెళ్లురక్కసులఁ గావలివారలలోన నొక్కనిన్
జవమును బీరముల్ మెఱసి చంపక పోవఁగ నిత్తురేని రా
ఘవుచరణంబు లాన యనుకంప యొకింతయు లేక వాని నేఁ
దవిలి ప్రశాస్యుఁగాఁ దలఁతుఁ [3]దప్పిది సైఁపఁగనోప నావుడున్. 1160

క. కొఱవులు సేతులఁ గొని కొం,దఱు లంకాగోపురంబు దడయక కదియన్
నెఱి మండెడునడగొండల,యొఱవు దలఁపఁ బట్టు గలిగె నూహింపంగన్.

వ. తదనంతరంబ. 1162

శా. ప్రౌఢాఖండలదోగుదీరితపవిప్రవ్యక్తగర్జారవ
వ్యూఢంబై విలయోత్థశూలిహతథక్కోద్దీర్ణమై పర్వుచున్
రూఢంబై నకపీంద్రనాయకచమూరోషోత్థితధ్వాన ము
ద్గాఢంబై వినిపించినం గినిసి యుద్యత్క్రోధదుష్ప్రేక్షుఁడై. 1163

ఉ. కుంభనికుంభులం బనిచెఁ గ్రూరతరాత్ముల సంగరక్రియా
రంభతృణీకృతామరుల రాజితకర్కశకార్ముకోగ్రదో

1 'దాఁటుకొని.' అ. ప్ర. 2 నభిక్రమోత్సవం. 3 దప్పిధి సైఁపఁగరాదు నావుడున్.

స్తంభుల జంభవైరిపవిదంభవిజృంభణులం బ్రకల్పితా
లంభులఁ గుంభకర్ణసుతులన్ దశకంఠుఁ డకుంఠవీర్యులన్. 1164

—కంపనుఁడు మొదలగు రాక్షసులు వానరవీరులతోఁ బోరి చచ్చుట.—

చ. ఘనుని నిలింపకంపనునిఁ గంపనునిన్ శరలూనవైరిజం
ఘుని సభయుం బ్రజంఘుని విఘూర్ణితభీషణవృత్తశోణితా
క్షుని నలశోణితాక్షుఁ గరిఘోటకకోటిశతాంగపంక్తిసం
జనితమహీప్రకంపముగ సత్వరులై కదలంగఁ బంచినన్. 1165

క. చాపాభ్యసనోపమితవి,రూపాక్షుఁడు చక్రసమవిరూపాక్షుఁడు సా
టోప మగుబలము గొలువ వి,రూపాక్షుఁడు గదలెఁ జూడ్కి రోషం బొదవన్.

చ. పరశుగదామహేష్వసనపాశకృపాణికభిండివాలము
ద్గరశితశూలపట్టిసవికస్వరకుంతకరాళపాణులై
దురధిగమప్రతాపపరిదూషితనిర్జరు లాజిదుర్జయుల్
పొరయఁగ వాద్యఘోషములు భూషణదీప్తులు నోలిఁ గ్రాలఁగన్. 1167

వ. కల్పాంతసమయంబున విడివడి మెఱసి గర్జిల్లుజీమూతంబులపగిది వివిధాస్త్రప్ర
భలు నిగుడ నార్చుచుఁ గవియున క్తంచరులపైఁ బ్రచండులైన ప్రభంజనులుం
బోలె మర్కటులు మార్కొని వీఁకం దాఁకి రట్టియెడ. 1168

క. గిరులఁ దరులఁ బిడికిళ్లను, సురరిపులం బ్లవగు లేచి సుడివడఁ జేయన్
శరముద్గరాసిగదలం, దిరుగుడువడఁ జేసెఁ గపుల దితిజబలంబుల్. 1169

క. అలుకమెయి [1]వానరేంద్రులఁ, దలపడి వడిఁ దూలనేసె దైత్యబలంబుల్
గలఁచియుఁ గఱచియు విఱిచియు, బలువుగఁ బొడిచియును బగఱఁ బఱపిరి కపులున్.

చ. వడిగొని వానరోత్తము లవారితవిక్రమసాహసాంకులై
పిడికిట నుద్ధతిం బొడువ బీరము దక్కి నిరస్తజీవులై
పుడమిపయిన్ వడిం బడిరి పూర్వనిలింపులు వజ్రసంహతిం
దడయక గండశైలములు ధారుణిఁ గూలెడుచంద మేర్పడన్. 1171

క. నక్తంచరచండధను,ర్ముక్తము లై నిశితభల్లములు వడితోడన్
రక్తము చవిచూడక యు,త్సిక్తము లై శైలచరులజీవముఁ గ్రోలెన్. 1172

క. ఆరాక్షసులును లంకా,ద్వారంబులు గాచి యున్నతరుచరసేనన్
ఘోరాహవమునఁ బఱపిరి, భూరేణువు నింగి ముంగి పోరిఁబోరిఁ బెఱుగన్.

చ. విఱిగినయాత్మసేనఁ గని వీరుఁడు కేసరియుం బృథుండునున్
మఱి హరిరోముఁడుం గినిసి మత్తగజంబులమాడ్కి వృక్షముల్
పెఱికి నిరర్గళంబుగ నిలింపవిరోధులమీఁద వైవ డ
గ్గఱిరి నిశాటు లస్త్రపరిఘచ్ఛురికాశితశూలహస్తులై. 1174

[1] వానరేంద్రులతలలు వడిం దూల నేసె దైత్య.

లయగ్రాహి. ఒక్క మొగి వీరతతి నుక్కడఁచు తెంపు గలయక్కజపువీరు లగు రక్కసులు మిన్నుం
దిక్కు లదృవంగ వడి నొక్కటిగ నార్చుచును జిక్కువడ వానరుల లెక్క గొన కాజిన్
నిక్క మగుసారమున మొక్కలము సేయుచును దిక్కరులసత్త్వముల ధిక్కరణతోడన్
నిక్కరణసీధువులఁ జొక్కి యరివాహినుల కెక్కి నిశితాస్త్రములఁ జిక్కువడఁ జేయన్. 1175

సీ. నిష్ఠురకరవాలనిశితంబు లై యున్న, ఘోరనఖంబులఁ జీరి చీరి
పిడుగులకంటెను బెడిదంబు లై యున్న, పిడికిళ్ల నందంద పొడిచి పొడిచి
భిదురధారలభంగి భీమంబు లై యున్న, కఠినదంతంబులఁ గఱచి కఱచి
చటులంబు లైనసంపెటలతాఁకులఁ బోలి, వఱలుతలంబులఁ జఱచి చఱచి
మొనసివాలంబులార్చుచు మోఁది మోఁది, దర్పమొదవంగఁబదములఁ దన్ని తన్ని
తరులు గిరులును బై పయిఁ గురిసి కురిసి, కపులు పోలియించిరప్పుడు కడఁగి రిపుల.

చ. నిలు నిలు పోకు పోకు రజనీచర యెందుఁ జనంగవచ్చు నా
బలముఁ జలంబునన్ మెఱయఁ బట్టి వధించెద నిన్ను రూఢదో
ర్బల మెసఁగంగ నంచు నరిభంజనుఁ డొక్కరుఁ డొక్కరుండు పే
రలుకమెయిన్ వనాటుఁడు నిరంకుశుఁ డై పలుకున్ రణస్థలిన్. 1177

చ. వనములయందుఁ గ్రుమ్మరుచు వాఁగుల వంతల నీరు ద్రావి పెం
పెనసినపండు గాయ గన రేమియు నైనను నేఁటి తించు జీ
వనమున నుంట యొప్పునది వానరులార రణంబు సేఁత మీ
కనుచిత మంచుఁ బల్కిరి నిశాటు లుదగ్రబలాగ్రహంబునన్. 1178

క. పొడుచుచుఁ బట్టుచుఁ దన్నుచు, నొడుచుచుఁ జంపుచును నిట్టలొకఁడొకఁడు వెసం
గడిమి మెయిఁ గపియు నసురయు, వడిగొని పోరిరి [1]యుదీర్ణవారక్రము లై.

క. పదుర సేనమండ్ర నొక్కటఁ, బొదివిరి వానరుల నసురపుంగవులు వెసం
జదిపిరి వనచరు లాక్రియ, నదితిజులం బట్టి బహురణక్రమ మొదవన్. 1180

ఉ. కూలినదంతులం బడినఘోటములన్ నఱు మైనశస్త్రులన్
వ్రాలినకేతనంబులను వావిరి దక్కినచామరంబులన్
రాలినభూషణాళిఁ జెదరం బడి యున్నశతాంగకోటి నా
భీలత నొందె నారణము భీమనిశాచరనాశశంసి యై. 1181

శా. ఆసౌత్రామిజుఁ డంగదుండు ఘనబాహావిక్రముం డాహవో
ల్లాసవ్యగ్రతతోన కంపనుపయిన్ లాంగూల మల్లార్చి వి

1 'యుదీర్ణవరవిక్రము లై.' అ. ప్ర.

త్రాసుం డై చనుదెంచి తాఁకె బ్రతిఘోరక్రాంతదృఙ్మండల
శ్రీ సాంపార నఖర్వవిక్రమగుణోత్సేకానుభావంబునన్. 1182

క. హరియును గుంజరమును ఖగ,వరుఁడును గాకోదరుండు వడిఁ బోరు క్రియన్
హరివరుఁడు కంపనుఁడు ను,ద్ధురభుజబలదర్ప మెసఁగఁ దొడరిరి పెలుచన్,

క. గద వాఁ డంగదు వ్రేయం, జదికిలఁబడి లేచి యొక్క శైలము రోషం
బొదవ వడితోడ నేసిన, నది యాతని నుగ్గుచేసె నసురులు బెదరన్. 1184

వ. అంత. 1185

ఉ. క్రోధనుఁ డేఁగుదెంచి కపికుంభిపతిన్ గద వ్రేయ నుద్ధత
క్రోధముతో నతండు నొకకొండ వడిం బడవైచె వాఁడు దు
స్సాధకఘోరముష్టిహతి శైలము చూర్ణముచేయ వెండియున్
భూధర మెత్తి వానిరథముం దురగంబుల నుగ్గుచేసినన్. 1186

వ. క్రోధనుండును గరవాలంబు [1]నొడ్డనంబును గొని లాఘవంబున ధరణికి లంఘించి
యార్చుచుం బేర్చినం జూచి దుందుభివైరిసంభవుండు సంరంభంబున విజృంభించి
సింహనాదంబు సేసి సైంహికేయుండు చందురుం బొదువుచందంబున నరవాయి
గొనక కరవాలంబుఁ దిగిచి పుచ్చుకొని యలికంబు వగులనడిచి [2]యపరిమితవిన్యా
సవిరచనావిశేషంబుల వ్రేసి వానిం గాలుప్రోలికిం గాఁపుపుచ్చి యెదురులేక యసమ
సమరసాహసముత్సాహంబుననమరవైరులసమయించుచున్నంగని శోణితాక్షుం
డరదంబు వఱపి బెడిదంబు లగుతూపులు పరఁగించిన నతండు దద్రథంబున కుఱికి
కోదండంబు ఖండింప వాఁడును బోఁడిమి వాటించి వాఁడిమి మెఱసి యసిచర్మ
ధరుం డై యుప్పరవీదికి నెగసిన దెప్పరంబునం దోడ నెగసి వానిం బొదివి పెను
మూర్ఛనొందించె నంత నతిసత్వరులై ప్రజంఘుండును యూపాక్షుండును బఱతేర
మైందద్వివిదు లనువానరాధిపు లిరువురు నంగదునకు సాహాయ్యకం బొనరింప
నట శోణితాక్షుండుం దేఱిన నమ్మువ్వురుదానవులకు వానరత్రయంబునకుం బోరు
ఘోరం బయి వర్తిల్లె నందు. 1187

క. అంగదమైందద్వివిదులు, సంగరమునఁ దరులు గిరులు సరిఁ గురియింపం
బొంగి శరంబులఁ ద్రుంచిరి, భంగపడక దైత్యవరులు బలములు వొదలన్.

క. ఎడపక మైందద్వివిదులు, వడిఁ బాదపవృష్టి దుర్నివారతఁ గురియన్
నడుమన త్రుంచెను గద గొని, యుడుగక యాశోణితాక్షుఁ డుద్ధతలీలన్.

మ. అసి లీలన్ జళిపించుచున్ గురుతరాహంకారుఁ డై సంగరో
ల్లసనం బొప్పఁ బ్రజంఘుఁ డార్చుచు బలాలంకారుఁ డై వచ్చినం
బ్రసరత్సాహసుఁ డంగదుండు సముదగ్రస్ఫూర్తితో మద్దిమ్రా
నసమానోద్ధతి వైచియుం బిడికిటన్ సాటోపుఁ డై దూఁటినన్. 1190

1 'నడ్డనంబును' అ. ప్ర. 2 యు ఫలితవిన్యాసవిరచనావిశేషంబున.

చ. అడిదము నేల వైచి సముదగ్రత నంగదు నాప్రజంఘుఁడుం
బిడికిట బిట్టుగాఁ బొడువ బిమ్మిటిపోవుచుఁ దేటి కన్నుల
న్నిడుఁగుఱు లుప్పతిల్ల నతినిష్ఠురవృత్తి శిరంబు నుగ్గుగాఁ
బొడిచిన నంత వాఁడు మృతిఁ బొందెఁ గపీశ్వరు లుబ్బి యార్వఁగన్. 1191

క. పినతండ్రిచావు గని యు, ద్దనుజుఁడు యూపాక్షుఁ డంతఁ దరవరి గొనుచుం
దనరథము డిగ్గి సింహ,ధ్వని యెసఁగఁగ ద్వివిదుఁ దాఁకె దర్ప మెలర్పన్.

క. కోపాటోపము గదురఁగ, యూపాక్షు నతండు [1]పొడిచి యురవడిఁ బట్టెన్
రూపఱ సింహము గలభము, నేపారఁగఁ బొదువుభంగి నిద్ధబలుం డై. 1193

మ. అనుజుం డుద్ధతి శోణితాక్షుఁడు రణవ్యగ్రాగ్రహోదగ్రుఁ డై
చను దేరంగ లయాంతకోపముఁడు వక్షంబుం బొరిం దాఁచినన్
ఘనసత్త్వాఢ్యుఁడు మేను జిల్లు దిరుగం గా మూర్ఛచే వ్రాలినం
జనియెన్ వే విడిపించి యద్భుతభుజాశ్లాఘానసముల్లాసి యై. 1194

మహాస్రగ్ధర. చటులోద్ధత్యంబుతోడన్ సరభసగతి యై చండకోదండసత్త్వో
ద్భటుఁ డత్యుగ్రప్రతాపప్రతిహతదివిజప్రాభవుం డేఁగుదేరం
గుటిలభ్రూవిక్రియాసంక్షుభితదనుజుఁ డై ఘోరముష్టిన్ శిరంబుం
[2]ద్రుటితంబుం జేసి యార్చెన్ ద్రుతగతి నద్రువన్ దోన దిగ్జాల మెల్లన్.

వ. ఇట్లు ద్వివిదుండు శోణితాక్షుం దెగటార్చె నంత యూపాక్షుండు మైందుతోడం
బోరునవసరంబున. 1196

ఉ. బల్లిదుఁ డైనవానరుఁడు బాహుబలంబునఁ బట్టి యుద్ధతిం
బల్లదుఁ డైనరక్కసునిపక్కలు వ్రక్కలు గాఁగ నేలతో
గుల్లలతిత్తిగా నదికి ఘోరవధం బొనరించి యుల్కసం
ధిల్లఁగ నార్చె దైత్యులు మదిన్ భయ మంది కలంగఁ బాఱఁగన్. 1197

తే. క్రోలుపులిఁ గన్నమృగములఁ బోలి కన్న
గతులఁ బాఱుచు నున్నరక్కసులఁ జూచి
మగుడఁ బెట్టుటకై వారిబెగడు దెలిపి
నిలువఁబడి యున్నవానరబలముఁ గాంచి. 1198

—సుగ్రీవుండు కుంభునిం జంపుట.—

సీ. దర్వీకరాధీశదర్పహం బగుచున్న,విపులసారం బైనవిల్లు దాల్చి
[3]కమనీయమణిమయకనకాంగదప్రభా,విలసనంబులు దెసల్ గలయఁ బర్వఁ
దరువంగఁబడుసముద్రముమ్రోఁతవడువున, శింజినీటంకృతుల్ చెలఁగఁజేసి
రోదోంతరవ్యాప్తి రూఢ మై నీరంధ్ర,బాణపరంపరాభరము నిగుడ

1 పొడిచి...నేపారఁగఁ బట్టుభంగి. 2 ద్రుటితం బైపోవఁ జేసెం దెస లద్రువఁగ నందీకృత శేషుఁ డాచుక. 3 కమనీయతరకనత్కనకాంగద.

మఘవదురుచాపచంచలామహాదుదగ్ర, గర్జితాసారములు గలఘనముపోలెఁ
గుంభుఁ డేతెంచె నద్భుతారంభుఁడగుచుఁ, గపులు గలఁగంగ నసురులు గడఁగి

మ. హయరింఖాపుటకోటిపాటితధరోద్యద్రేణుజాలంబుల [యార్వ.
న్వియదాశాంతర మంతయుం వరుసతో నిండంగ నానాగతి
ప్రయుతస్యందననేమిఘోష మొదవం రక్షోగణోపేతుఁ డై
భయదుం డై వడిఁ దాఁకె వానరుల శుంభద్వేగసంరంభతన్. 1200

క. శరసంధానవిశేషము, దురమునఁ దెలియంగరాక తూణీరముఖాం
తరమునఁ దనయంతన చను, కరణిగ నతఁ డేసె నిశితకాండముల వడిన్.

తే. ఒలసి యాఁకొని పుట్టలోనుండి వెడలు, కాలసర్పంబులో యనఁ గడఁగి యతని
దొనలు వెలువడి శరము లుద్ధురతఁ బేర్చి, యొగిఁ గపీంద్రులప్రాణవాయువులఁ గ్రోలె.

శా. ఆకర్ణాంతవికృష్టమై కనకదీవ్యత్పుంఖరోచిశ్ఛటా
లోకం బై కపిదుర్నిరీక్ష్యగతి మై లోలప్రభావల్లరీ
వ్యాకోచస్థితి నేగుఁదెంచి బెడిదం బై యున్నకుంభాస్త్రము
త్సేకోదగ్రతఁ దాఁకినం ద్వివిదుఁడుం జెయ్వోది మూర్ఛిల్లినన్. 1203

వ. మైందుండు దనతమ్ముం డగుద్వివిదుండు కుంభబాణపీడితుం డగుట సూచి కనలి
యొక్కమహాశిలయెత్తికొనిపఱతెంచినఁ గుంభకర్ణనందనుం డేనుశరంబులనమ్మ
హోపలంబు పగుల నేసి యొక్కసునిశితం బగుసాయకంబున మైందువక్షం బు
చ్చిపో నేసిన వాఁడు నది మర్మభేదకం బగుటం జేసి పడినఁ దారేయుండు విగత
చేతనులై పడియున్నతనమామలం బొడగాంచి భుజైకసహాయుండై యెదుర్కొ
నిన నెనిమిదిశరంబులు నిగిడించి మఱియును బెక్కుదూపుల నొప్పించిన నిరుదె
సలం గానంబడుకాండంబుల శలలమృగంబు ననుకరించుచుఁ బాషాణపాదపం
బులు పఱపిన నద్దనుజుండును బ్రచండటంకపరశుసమవిశిఖషండంబులం బొడి
చేసియుఁ దుమురుగావించియు రెండుబాణంబుల బొమలు బెట్టేసిన. 1204

ఉ. ప్రన్ననిదైనధాతుర్ఘురరంజన నొప్పుమహాద్రికై వడిం
గన్నులు రెండునుం మునుఁగఁ గాఱెడునెత్తురు వాలిపుత్త్రుఁడుం
నన్నుతలీలఁ బోఁ దుడిచి సాలము వైచినఁ ద్రుంచి తూపులం
భిన్నునిఁ జేసె రక్కసుఁడు పెల్కుఱి యాతఁడు మూర్ఛవోవఁగన్. 1205

సీ. అంత వానరసైన్య మెంతయు భీతిల్లి, కొంత యంగదుఁ గాచికొనియెఁ గొంత
రాముఁ గెఱఁగింప రఘుకులోత్తంసుండు, [1]వాలితనుజునకు వనటఁ బొగిలి
భల్లూకనాయకప్రముఖులఁ బంపిన, వారు శిలావృక్షధారు లగుచుఁ
గ్రోధంబు గదురంగఁ గుంభుపై నడిచిన, వాఁడిబాణంబుల వాఁడు పఱపఁ
దఱిమి కదియలేక తలఁకిన వారలఁ, జూచి యేపు రేఁగి సూర్యసుతుఁడు

1 వాలితనూభవువలనఁ బొగిలి.

కుంభుఁ డాఁకె వేగ § కుంజరేంద్రముమీఁది, కెగయుసింహ మనఁగ § నెదురులేక.

ఆ. తరణిసంభవుండు § తరులును శిలలును, గిరులు మీఁద వైవ § సరకుగొనక
వాని నెల్లఁ ద్రుంచె § వాఁడిశరంబుల, గర్వ మెసఁగఁ గుంభ § కర్ణసుతుఁడు.

క. చండతరకాండములు మా, ర్తాండాత్మజుమీఁద వైవఁ § దలఁకక యతఁడున్
ఖండించెఁ గుంభు ఘనకో, దండము దుర్వారబాహు § దర్పం బెసఁగన్. 1208

వ. రవినందనుండు సగౌరవంబును సక్రోధంబును సవిస్మయంబునుంగాఁ గుంభున
కి ట్లనియె. 1209

శా. బాహాసారము ప్రాభవంబు బలముం § బ్రౌఢత్వమున్ సంగరో
త్సాహంబున్ విపులప్రతాపము ధను § స్సాహిత్యచాతుర్యమున్
మాహాత్మ్యంబును నీక యొప్పు నెటు లన్యన్ దానవాధీశ నా
తో హేలాగతిఁ బోరి తీవు సరిగా § దుర్వారతాశాలి వై. 1210

చ. చటులతరాస్త్రజాలముల § శైలచరావలి రూపుమాపి సం
ఘటితసుశక్తి వైననిను § గర్వము దూలఁగఁ బట్టి యేపునం
బటుతరముష్టిఘాతమునఁ § బ్రాణము లంగముతోడఁ బాసి యు
త్కటగతి వేగ నీ కరుగఁ § గాలునిప్రోలికిఁ ద్రోవ సేసెదన్. 1211

క. సుగ్రీవుపలుకు విని యతఁ, డాగ్రహమునఁ దేజరిల్లు § నాజ్యాసారో
దగ్రుఁ డగుగహనుక్రైవడి, నుగ్రాహవకౌతుకాధి § కోత్సాహుం డై. 1212

సీ. ఉద్ధతాకారత § నురవడి నేతెంచి, భాస్కరనందనుఁ § బట్టికొనిన
నిరువురు గంధసిం § ధురములగతి ఘర్మ, మదసిక్తగాత్రులై § కదిసి పోరి
యురగనాథులఁ బోలె § నూర్పులు నిగుడంగఁ, జరణఘట్టనమున § ధరణి గదల
నార్పులఁ గమలభ § వాండంబు భేదిల్ల, రేణుజాలముల వా § రిధులు గలఁగ
నంత సుగ్రీవుఁ డాకుంభు § నడరి పట్టి
త్రిప్పి యంబుధిలో వైవ § నుప్పతిల్లె
జలము మి న్నంది మందర § శైలపాత
భరము దోఁపంగ జలచరో § త్కరము [1]గలఁగ. 1213

క. తడయక యాకుంభుఁడు న, జ్జడనిధిలో వెడలి వచ్చి § సక్రోధుం డై
వడి సుగ్రీవునివక్షము, పిడుగుం దడఁబఱుపఁ జాలు § పిడికిటఁ బొడిచెన్. 1214

చ. మెఱయుచు నున్నవజ్రహతి § మేరుతటంబున [2]రాలునమ్మిడుం
గుఱు లన విస్ఫులింగములు § కుంభునిముష్టివిఘట్టనంబునన్
వఱలుచు వానరోత్తముని § వక్షమునన్ వెడలెన్ సముద్ధతి
న్మెఱయుప్రతాపపావకవి § నిస్స్రుతహేతికణంబులో యనన్. 1215

వ. దానికిం గినిసి వానరేంద్రుండు కాలాంతకుకాలదండంబుంబోని యుద్దండభుజా

1. శీల్ల. 2 రాల్లునమ్మిడుంగు.

దండం బెత్తి కాఠిన్యాపహసితభిదురం బగుతదీయోరస్స్థలంబు పిడికిటం బొడి
చినఁ గుంభుండు గతప్రాణుం డై ప్రశాంతార్చి యైనకృశానుండునుంబోలె
వేఁడిమి దక్కి పుడమిం బడినం జూచి రక్కసులు దిక్కు లద్రువ ధరణి గ్రక్కదల
దిక్కు గానక చిక్కువడి తనమఱువు సొచ్చిన. 1216

—•• హనుమంతుండు నికుంభునిం బరిమార్చుట. ••—

సీ. ఘనతరక్రోధాగ్ని కలుషంబు లై యున్న, కన్నుల నిప్పులు గడలుకొనఁగఁ
జటులదంష్ట్రాప్రభా పటలంబు లిరుగెలం, కులఁ జామరచ్ఛాయ లలవరింప
రోదసీకుహరంబు మేదురితంబుగాఁ, బంబినసింహనాదంబు సెలఁగ
భూరిమణిస్వర్ణ భూషిత మయి గంధ, కుసుమార్చితంబు నై ఘోర మైన
పరిఘ ద్రిప్పికొనుచుఁ బఱతెంచె గిరులును, గుతల మద్రువఁగా నికుంభుఁ డంతఁ
జండ మైనకాల దండంబు దాల్చిన, దండధరుఁడపోలె మండికొనుచు. 1217

మ. పరిఘభ్రాంతిఁ జలించె భూమి పగిలెన్ బ్రహ్మాండభాండంబు వే
తిరిగెం దగ్గ్రహతారకాచయము భేదిల్లెన్ దిశాచక్రముల్
విరిసెన్ గోత్రమహీధరంబులు వడిన్ విచ్చెన్ సురేభంబులుం
బోరి వంచెం దల లాభుజంగపతి సంభూతాతిభారంబునన్. 1218

క. అనుగతి దోఁచుచునుండఁగ, నినసుతునకు వాయుపుత్రుఁ డెడసొచ్చిన న
ద్దనుజుఁడు తద్వక్షంబున, ఘనపరిఘము ద్రిప్పి వైచెఁ గడుసత్వరుఁ డై. 1219

ఆ. పరిఘ కఠిన మైనపావనివక్షంబు, దాఁకి తునుక లయ్యెఁ దత్క్షణంబ
కుటిలుఁ డయినవానికూరిమియునుబోలె, గాలిఁ దూలుతరువుఁబోలె నపుడు.

క. [1]పాలివోవనిధైర్యంబున, బలియుండు నికుంభుఱొమ్ముఁ బగులఁగఁ బొడువన్
నిలువక నెత్తురు గాఱఁగ, [2]నిల నొకయావంత సోలి తేపున మఱియున్.

ఉ. హర్షము నొంద దానవు లహంకృతితోడ నికుంభుఁ డుద్ధతా
మర్షత వాయుపుత్రు నసమానబలంబునఁ బట్టి యెత్తను
త్కర్షము గల్గి పావని యుదగ్రతతో విడిపించికొంచు దు
ర్ధర్షుఁడు వాని నొంచె సమరస్థలి వానరు లుబ్బి యార్వఁగన్. 1222

ఉ. నెట్టన వాయుసూతి రజనీచరు నుద్ధతిఁ బట్టి నేలతో
బిట్టుగ వ్రేసి యెమ్ములు విభిన్నము లై పడ మేను నుగ్గుగా
మెట్టుచు ఱొమ్ముపై నిలిచి మించి వడిన్ మెడ ద్రిప్పి చేతులం
దట్టి శిరంబు ద్రుంచి సముదగ్రత నార్చె ననూనతేజుఁ డై. 1223

ఆ. దివియు భువియు దెసలుఁ బవిలినగతి మ్రోయ, నిహతశేషు లైననిర్జరారు
లరిగి రావణునకు నంతయు నెఱిఁగింపఁ, బరమశోకరోషభరితుఁ డగుచు.

మ. ఖరుపుత్రున్ మకరాక్షుఁ బిల్చి సముదగ్రస్ఫూర్తి యై పల్కె ను

1. 'పాలివోవనిధైర్యమున న,నిలసుతుఁడు నికుంభువక్షమెడలఁగఁ బొడువన్' 2 నిల నొకసేపంత,

ద్ధురలీలం జతురంగసేన గొలువన్ దుస్సాధదోస్సారని
ష్ఠుర¹భావోచితకార్ముకుండ వయి విస్ఫూర్జద్గతిం బోయి వా
నరులన్ రాఘవులన్ వడిం దునిమి యానందంబు గావింపుమా. 1225

—మకరాక్షుఁడు రామునితో యుద్ధముచేసి చచ్చుట.—

క. అని దశకంఠుఁడు పంచినఁ, బనివిని యెద ననుచు లేచి ప్రణమిల్లి ముదం
బున వెడలి ²సజ్జరథుఁడై, దనుజులు వినఁ బలికె నధికదర్ప మెలర్పన్. 1226

క. దుర్ధర్షవృత్తి మీరు ధ,నుర్ధరులై కవిసి రణవినోదంబున సం
స్పర్ధమెయి మర్కటావలి,మూర్ధంబులు దునుముఁ డేచి ముదమున నేనున్.

ఉ. రావణుపంపునం దివిరి రాఘవులన్ రణభూమిఁ గూల్చి స
ద్భావముతోడఁ దండ్రిపగ పన్నుగఁ దీర్పఁగఁ గంటి నేఁడు సు
గ్రీవునిఁ జంపి యూథపుల గీటడఁగించి మహాశరార్చులన్
దావమపోలెఁ గీశసముదాయవనంబుల నెల్ల నేర్చెదన్. 1228

వ. అని కదలునవసరంబున. 1229

మ. ఘనదంతావళబృంహితంబులుఁ దురంగవ్రాతహేషామహా
స్వనితంబుల్ రథనేమిఘోషములు రక్షస్సింహనాదంబులున్
వనధిధ్వానగభీరదుందుభివిరావంబుల్ బృహచ్ఛంఖని
స్వనముల్ దిక్కులఁ బిక్కటిల్లఁ గదలెన్ వాఁ డుగ్రుఁడై యేపునన్. 1230

క. దుశ్శకునంబులు గనియును, నిశ్శంకతఁ గదియ యామినీచరతతికిన్
దోశ్శక్తి మెఱసి పృథుతే, జశ్శత్రు³బలంబుతోడ సరిఁ బో రయ్యెన్. 1231

తే. కొండలును ఱాలుఁ దరువులుఁ గొనుచు వచ్చి
దానవులమీఁద వైచిరి తఱిమి కపులు
వాని నన్నింటిఁ దునుమాడి రా నిశాటు
లురుశరంబుల నొకమాత్ర నుత్సహించి. 1232

సీ. ఘనగదాహతుల నొక్కట నుగ్గు గావించి, తలలు గూలఁగ నడిదముల వ్రేసి
యురుశక్తిహతి మేను లుచ్చిపోవఁగ నేసి, తఱిమి యందంద కుంతములఁ బొడిచి
భీమతరంబైన తోమరంబుల నొంచి, భిండివాలంబులఁ బిండిచేసి
ముసలపాతంబులఁ గసిబిసి గా మొత్తి, సునిశితోద్యతపరశువుల నఱికి
మారిమసఁగినకైవడి బారిసమరె, ఖరతనూజాతుఁ డీభంగిఁ గరుణ లేక
దానికోర్వక వడిఁ బాఱె వానరాలి,యుబ్బియసురలు మిన్నంది బొబ్బలిడఁగ.

చ. కనుఁగొని రాఘవేశ్వరుఁడు గారుణికాగ్రసరుండు గావునన్
వనచరులార పాఱకుఁడు వారక నేఁ గలుగంగ మీకు నీ
పెనుబెగ డేల యంచు నతిభీషణుఁడై యని నిల్చి దైత్యులం

---

1. బాణార్చితకార్ముకుండ. 2. సజ్యరథుఁడై. 3. భయంబుతోడ.

దునిమియు నుగ్గుచేసియును దోలియు రూపఱఁ జేసె నత్తఱిన్. 1234

వ. ఖరనందనుం డతనిపై నతిత్వరితంబున నరదంబు పఱపించి కదిసి రోషారుణిత నయనుం డై యిట్లనియె. 1235

శా. వీరాగ్రేసరు నస్మదీయజనకున్ విఖ్యాతసత్త్వున్ ఖరుం
ఘోరం జంపితి నామనం బెరియ నే ప్రొద్దున్ నరాధీశ నా
నారక్షస్తతి నేచి చంపి తిచటన్ నాపాలిభాగ్యంబునం
జేరన్ వచ్చితి వెందుఁ బోయెదవు నాచేఁ జిక్కి తింకన్ వెసన్. 1236

ఉ. తండ్రికి సూడుపట్టక వృథాస్థితి నుండితి నింట నిందతో
మండ్రె మహాస్త్రసాధనులు మానము దూలినవాని సజ్జనుం
డండ్రె సభాంతరంబుల మహాత్ములు నేలినవారు వానిఁ జే
కొండ్రె యటుండ మున్ను సమకూఱెను నేఁ డది నాకుఁ జేయఁగన్. 1237

క. మనిచెద నామానాంగము, ననిచెద భువనములఁ గీర్తి నిష్ఠురగతితో
ననిచెద నిను జముప్రోలికి, నునిచెదఁ బౌలస్త్య సుఖము లోగిఁ బొందంగన్.

ఆ. ఖడ్గశక్తి నైనఁ గద నైనఁ జేతుల, నైన వింట నైన నరసి చూడఁ
గడఁగి నీకుఁ బోరఁగా నేర్పు మిక్కిలి, యెందుఁ గలదు దాని నేఱిఁగొనుము.

మ. అనినన్ రాముఁడు వాని కిట్లనియెఁ గ్రవ్యాదాధమా ఘోరమ
ద్ధనురుచ్ఛృంఖలతీవ్రబాణపటలిన్ దర్పంబు దూలించెదన్
వినుము నీ కీపలుమాట లేమిటికి దోర్వీర్యంబు గల్గంగ ని
న్ననుమానం బొకయింతె లేకిపుడ యుగ్రాజిన్ వడిం గూల్చెదన్. 1240

వ. అనునంత ఖరనందనుండు నిశితబాణసహస్రంబులువఱపి యంబరంబుదీటుకొల్పిన.

క. చండమకరాక్షశరములు, ఖండించె రఘూద్వహుండు ఖరబాణములన్
మెండుకొని వైనతేయుఁడు, తుండనిపాతముల నహులఁ దునిమినమాడ్కిన్.

సీ. గరుడఖేచరసిద్ధగంధర్వు లాదిగా, నరుదెంచి యచ్చోట నంది చూడ
నిరువురకోదండగురుతరజ్యానాద, మడరి బ్రహ్మాండంబు బడలువఱుప
దోషాచరేంద్రునితూపులపెనుమంచు, రామార్కుఁ డస్త్రకరములఁ జెఱుప
నరనాయకాంబుదశరకరకావృష్టి, లీల నక్తంచరశైల మోర్చి
రోదసీగర్భగోళంబు మేదురముగ, శరచయంబుల నారామచంద్రుఁ బొదువఁ
గోప మెసఁగిన నానృపకుంజరుండు, వెడఁదతూపున నాదైత్యువిల్లు దునిమి.

క. ఎనిమిదితూపుల సారథిఁ, దునిమియు నన్నిటన మఱియుఁ దురగంబులఁ ద
ద్ఘనరథముతోన త్రుంచిన, దనుజుండును విరథుఁ డగుచు ధరణికి నుఱికెన్.

వ. అంత. 1245

శా. క్రుద్ధ్యద్దానవముక్తశూల మధికక్రూరారవం బై వియ
న్మధ్యం బెల్ల వెలుంగుచుండఁ ద్రిశిరోనాగోపమం బై దృఢా

సాధ్యం బై చనుదేరఁ ద్రుంచెఁ బతియుగ్ర శస్త్రత్రయం జేసి తా
సాధ్యుల్ రాము నుతించి రప్పుడు నరేశవ్రాతచూడామణిన్. 1246

చ. అడరుచు దానవుండు ప్రళయాంతకుఁడై వడిఁ దన్ను నుగ్రుఁడై
పిడికిట బిట్టుగాఁ బొడువ భీషణుఁడై చనుదేర రాముఁడుం
దడయక పావకాస్త్రమున దైత్యునివక్షముఁ గాఁడ నేసినం
బడియె నతండు భూమిపయిఁ బ్రాణము మున్నును దన్నుఁ బాసినన్. 1247

క. హతశేషులైన రక్కసు, లతిరయమున లంక కరిగి యంతయు రక్షః
పతి కెఱిఁగించిన శోకా,వృతుఁడై కోపించి పలికె వృత్రారిహరున్. 1248

చ. ప్రణుతపరాక్రమాన్వితుల బాహుబలోద్ధతులైన రామల
క్ష్మణులను వానరాధిపుల సాహసనంపదఁ జేసి యోర్వఁగా
రణమున నీవు దక్క మఱి రాక్షసుఁ డెవ్వఁడు గావునన్ మహా
క్వణనము మీఱ దైత్యవరవాహిని గొల్వఁగ నేఁగు ముద్ధతిన్. 1249

వ. అని దశకంఠుండు నియోగించిన. 1250

—ఇంద్రజిత్తుమూఁడవయుద్ధము.—

శా. రక్షోనాయకనందనుండు సమరారంభోగ్రుఁడై వాహినీ
లక్షల్ వే చనుదేర సత్వరవిలోలత్సైంధవస్యందనం
బక్షోభ్యోగ్రత నెక్కి రేణుసముదాయాంధీకృతామర్త్యుఁడై
సాక్షాదంతకుఁడో యనం గదలె నాశాచక్ర మల్లాడఁగన్. 1251

చ. సుత్రామారిశిరంబుమీఁదఁ దనరెం జూడం గడుం బాండుర
చ్ఛత్రం బున్నతశైలశృంగ మనఁ జంచచ్ఛారదాభ్రంబుతో
మైత్రిం జేయుచుఁ గుంచె లోలి నిగుడన్ మాంద్యన్మరాళోల్లస
ద్గోత్రాధీశసమత్వ మేర్పడఁగ నస్తోకానుభావంబునన్. 1252

క. ఉత్తరపుగవను వెల్వడి, యుత్తఱి నరదంబు డిగ్గి యారణభూమిన్
మొత్తములై దనుజులు దను, నిత్తెఱఁగునఁ గాచికొనఁగ నెంతయుఁ గడఁకన్.

వ. అక్కడఁ ద్రికోణాకృతిగా నొక్క వేదిక దక్షిణపథంబుగాఁ గావించి శ్మశానాగ్ని యందుఁ బెట్టి ప్రజ్వలించి రక్తమాల్యాంగరాగాంబరాభరణుం డై యచ్చేరువ ఖట్వాంగధ్వజమ్ములు నిల్పి కపాలాసనుం డై కంకాలంబులు పరిధులుగాఁ జేసి దక్షిణపుదిశయందు నలాబూపాత్రలయందు నినుపపాత్రలయందును నల్లనిమేని వాని నెత్తురు మజ్జయుం [1]బోసి నిలిపి మౌనంబు సలుపుచు [2]నాథర్వణమంత్రంబులు క్రమంబుగా నుచ్చరించుచు స్రుక్స్రువంబులు దాల్చి తాడిసమిధలును దిలలును సర్షపంబులును సక్షీరంబుగా నాజ్యంబును మానుషి యగువసయును హోమంబు గావించుచుండ ధూమంబు భూనభోదిగంతరాళంబులం బొదువ నాదహన

1. సురయుం బోసి. 2. నాథర్వణవేదంబు లగుమంత్రంబులుచదివి విక్రమంబుగా నుచ్చరించుచు.

మధ్యంబున. 1254

సీ. మృత్యువుజిహ్వతో । మేల మాడెడునసి, దాల్చి కపాలపా । త్రంబు వట్టి
బాడబార్చులఁ బోలు । పల్ల వెండ్రుకలును, జండప్రకాశదం । ష్ట్రాయుగంబు
మెఱవ మండుచు నున్న । మిడిగ్రుడ్లు గనలంగఁ, బెను పైనపునుకల । పేర్లు గలిగి
యట్టహాసమున వి । యచ్చరు లదరంగ, మెట్టినఁ బుడమియు । బిట్టు గ్రుంగఁ
గృత్యగమె తెంచియాయుగ్ర । కృత్యఁ బలికెఁ, బంపు మెయ్యదియైన నేఁ । డెంపుతోడ
నిపుడ చేయుదు ననవుడు । నింద్రజిత్తు, తేరు వడి నెక్కి శక్తితో । దివికి నెగసె.

క. మఱి దైత్యులు లంకకుఁ గ్ర, మ్మఱి చనినను దాశకంఠి । మదమునఁ గపులన్
నుఱుమాడఁ జొచ్చెఁ దూపుల, నెఱయ నదృశ్యత్వ మొంది । నిష్ఠురలీలన్.

క. వడి రాలవాన గురిసినఁ, దడఁబడఁ బడుఖగము లనఁగఁ । దరుచరులును బెం
పెడలి చెడ విఱిగి నేలం, బడి కూలిరి శక్రజిత్తు । పటుబాణములన్. 1257

తే. రావణాత్మజుఁ డేసె నా । రాచతతులఁ, గపులు గొండఱు నెత్తురు । గాఱఁ గూలి
తఱచు జేవుఱు సెలయేళ్లు । నొఱపు గలిగి, యున్నకొండలచందంబు । నోజ దోఁప.

శా. సుస్ఫారాస్త్రమహాపరంపర తమ । స్తోమంబు గావింపఁ గ్ష
త్యాస్ఫీతాంగసమగ్రనీలిమయుఁ ద । ద్ధ్వాంతంబు రెట్టింప మా
యాస్ఫాతిం బొడచూప కాతఁడు ధను । ర్జ్యావల్లరీసాంద్రనా
దాస్ఫోటంబున నిశ్చయింపఁ బడె న । త్యాసన్నభావంబునన్. 1259

ఉ. ఇంచుక గాలికిం జొరవ । యీక దిగంతనభోంతరంబులన్
ముంచిన దైత్యబాణముల । మొత్తము లేచిన నిచ్చఁ జోరు గా
వించు తెఱంగు లేమిఁ గపి । వీరులు ముందఱఁ గానరైరి వా
రించు తెఱంగు నేరక పొ । రింబొరిఁ గూలిరి వీతసత్త్వులై. 1260

సీ. పిడుగులొక్కో కావు । పొడ తేవు ఘనము లు, ల్కాసహస్రంబులో । కావు ధరణి
[1]యడలదు కాలస । ర్పావళులొక్కో కావు, పాతాళవివరంబు । బయలుపడదు
ఖరమైనముక్కంటి । కంటిమంటలొ కావు, జగదవసానంబు । జాడ లేదు
కాలకూటార్చులో । కావు [2]మందరగోత్ర, మానితాంభోరాశి । గానఁబడదు
మొదల తెఱుంగరాదు । మునుకొని పుట్టిన, చొప్పు దెలియరాదు । చూడ నెచట
నని కపీంద్రు లిట్టు । లాజిఁ దల్లడ మంది, రింద్రజిత్తుతూపు । లేపు మాప. 1261

వ. అంతఁ బవనసుతాంగద నలనీలజాంబవత్పనస గజగవయగవాక్ష గంధమాదనాది కపియూథపోత్తములు శిలాపాదపశైలంబుల నాకాశంబు నిరవకాశంబు గావించియు నతనిం గానరైరి వాఁడును వాని నన్నింటిని దుమురుచేసియు నొంచియుఁ బొడిచియు వ్రేసియు నేసియు మఱియు వానరకోటిదశకంబు గీటడంచిన నిహన్యమానమానసులైన వనచరులు రామచంద్రుమఱువు సొచ్చుసమయంబున

1. చక్రంబయడలదు సర్పావళులొకావు. 2. మంథరసూత్రమానితాహీనుఁడు గానఁబడఁడు'. అ.ప్ర.

ననిలదేవుండు సనుదెంచి యల్లన నిట్లనియె. 1262

మ. ఉరుసత్త్వుం డగువీఁడు మాయల నజ§య్యుం డేరి కే నింక నాం
గిరసం బైనయమోఘబాణమున నా§కృత్యం బెడంబాపు భూ
వర వాఁ డంతన కానవచ్చు ననుడున్ § వైళంబ యారాఘవుం
డరుదారంగఁ దదస్త్రి మేసె విధిపూ§ర్వాసక్తిగా నత్తఱిన్. 1263

క. వనజాప్తాన్వయునస్త్రం,బునఁ గృత్యయు నొక్కమాత్రఁ § బొలిసినవేగం
బునఁ గానఁబడుచు దైత్యుఁడు, తనయరదముతోడ వచ్చి § ధరపై నిలిచెన్.

వ. అంత. 1265

సీ. అష్టాదశాస్త్రంబు § లాగంధమాదను,పై నేసి తొమ్మిది§బాణములను
నలు నొంచి యేడుగో§లల మైందు ద్వివిదునిఁ, గీలించి యైదింట § నీలుఁ బొదివి
శతవలి మూటను § [1]బొతము దప్పఁగఁజేసి, గవయుఁ బండ్రెంటను§గడఁకనొంచి
యేడింట నేడింట § నేపున నందంద, గొనకొని కపులను § గుదులు గ్రుచ్చి
డెప్పరంబు గాఁగ § డెబ్బదిశరములు, నినిచె రామచంద్రు§ననుజుమేనఁ
బ్రహ్మాండ మెల్లఁ § బగులంగ నార్చుచు, మేఘనాదుఁ డిట్లు § మెఱసి పోరె.

శా. ఉచ్ఛ్రాయత్వవిజృంభమాణదృఢచా§పోన్ముక్తభల్లీకృతో
ద్యచ్ఛ్రీ నెంతయు మించి రాఘవభుజా§దర్పోద్యమన్యక్క్రియా
నచ్ఛ్రియఃకుతుకంబునం బొలిచె [2]వి§శ్వవ్యాప్తిమద్భీమలో
లచ్ఛ్రీత్యధ్వసుదుస్సహధ్వనితలీ§లాభూతజీమూతుఁ డై. 1267

వ. ఇట్లు కపివాహినీచక్షురంధ్రీకరణపటువిశిఖాంధతమసంబు గావించిన. 1268

సీ. హనుమంతుఁ డద్రియు § నంగదుం డుపలంబు, శక్తి నీలుండును § సర్జకంబు
నలుఁడు సుగ్రీవుండు § నగపరంపరలును, జయశాలి యవ్విభీ§షణుఁడు గదయు
ననలుఁడు [3]ఘనపన§సావనీరుహమును, సంపాతి తాలవృ§క్షమును నితర
కపియూథపులు మహా§ఖదిరాదితరువులు, సౌమిత్రియినుమూఁడు§సాయకములు
రామచంద్రుండు మూఁడునా§రాచములును, శరభజాంబవదాదులు§శైలతరులు
నొక్కపరి మీఁదనడరింప§నురుశరముల, నుఱక యన్నింటి రావణి§నుఱుము సేసి.

తే. ఒలసి మేనులు నువ్వుగిం§జలకు నైనఁ, దెఱపి లేకుండ శరములు § దీటుకొలిపి
ప్లవగచక్రము నంతయు § బడలుపఱిచి, యేఁగి లంకకుఁ గ్రమ్మఱ § నింద్రజిత్తు.

క. అంతయుఁ దన కెఱిఁగించిన, నెంతయు దశముఖుఁడు గినిసి § యి ట్లనియె మహా
సంతాపదహనతప్త,స్వాంతోత్థితధూమజాల§సాదితతనుఁ డై. 1271

చ. కొలఁదికి మీఱువానరులఁ § గూలిచి వచ్చితి నంచు నేపునం
బలుమఱుఁ జెప్పనేల నినుఁ § బంపుట యూరక [4]వచ్చుచుంట కే

1. జలము డింపక నొంచి గవయు. 2. శశ్వద్వ్యాఘ్రఘువద్భే. 3. మహదసనావనీరుహమును.
4. వచ్చుపొంటికే.

నిలుతురె నీ యెదుర్చునెడ నిర్జరు లాదిగఁ గ్రోఁతు లెంత మ
ర్త్యులయును జేమిచెప్ప వసిఁ ద్రుంపుము పొమ్ము జయించి రమ్ముగన్.

మ. అనినన్ రావణి తండ్రి వీడుకొని ము న్నాకుంభకర్ణాదివీ
రనికాయంబులు గూలె నింక ననిలో రాముం దదీయానుజున్
ఘనబాహాయుగశక్తి గెల్వఁగ నశక్యం బంచు మాయాబలం
బున నోడింపఁగ నుత్సహించి కదలెన్ భూరిప్రతాపంబునన్. 1273

—ఇంద్రజిత్తు మాయాసీతను జంపుట.—

శా. మాయాసీత నమర్చికొంచును మహామత్తద్విపేంద్రవ్రజా
శ్వీయస్యందనబృందభీమపలభుక్సైన్యైకసాహాయ్యక
ప్రాయుం డై కదలెం బ్రచేతసునిదిగ్భాగంబునం దంతలోఁ
బాయం జొచ్చిరి వానరుల్ భయపరిభ్రాంతాత్ము లై యత్తఱిన్. 1274

శా. హేలోత్పాటితశైలుఁ డై యనిలజుం డేతేరఁగాఁ జూచి నీ
వేలా వచ్చెద వృద్ధతిం గపులతో నీజానకిం జూడుమా
యాలోలాక్షికతంబునం గలిగె మా కీపాట్లు ఖడ్గంబునన్
వే లీలం దల ద్రెవ్వ వ్రేసెద రణోర్విం బూజ యా నట్లుగన్. 1275

చ. పులికడఁ జేరి యున్నమృగిపోలిక నశ్రులు గ్రమ్ము దేరఁగాఁ
దలఁకుచు హా రఘుప్రవర దాగుణుఁ డై యిదె యింద్రజిత్తు న
న్నలయక చంపఁగాఁ దొడఁగె నాథ ననున్ విడిపించి కావఁగాఁ
దలఁపఁగదయ్య నాఁగ నతిదర్పితుఁ డై తల పట్టి యీడ్చినన్. 1276

చ. అనిలజుఁ డంత ని ట్లనియె నాతని కోరి దురాత్మ యక్కటా
దనుజుఁడ వైన నేమి యతిదర్పమునన్ సతిఁ జంపఁగూడునే
యనయము విశ్రవస్సునకు నారయ మన్మఁడ వాదు చెప్పడుం
గనికర మేది దైత్యులకుఁ గట్టిఁడిధర్మ మెఱుంగవచ్చునే. 1277

మ. అనుచుండం బ్రహసించి కైకొనక వాఁ డంకించి ఖడ్గంబునం
దునిమెం గ్రైతవజానకీశిరము వే తూలంగ వాతూలనం
దన నీయేలిక యైనరామునకు నీతత్స్త్రీవధం బంతయుం
జని వేవే యెఱిఁగింపు మన్న విని నా సామీరి శోకార్తుఁ డై. 1278

వ. ధైర్యం బవలంబించి పురోభాగంబున నక్షిగతుం డగుకృతాపరాధు నింద్రజిత్తు నక్షిగతుంగాఁ దలంచి నలుదెసలం బఱచువనచరానీకంబు ననూనయించి మరల్చినం దద్బలంబు గృతసన్నాహం బై మహీధరమహోపలమహీరుహాదిసనాథం బై పరివేష్టింపం బవమానసూనుండు నొక్కమహాపాషాణంబు మేఘనాదు నరదంబుపై వైవ నతండు మేఘనాదంబు ననుకరించుసింహనాదంబు సెలంగ రథంబు తోలంగం బఱపి తప్పించిన నది నేలం బడినం గపిబలంబును బిరుసున

రాక్షసానీకంబుపైఁ బాదపాదివర్షంబులు గురిసినం జెదరి పఱచుచున్న నిజసై
న్యంబుదైన్యంబు మాన్చి రావణతనయుండు పరిఘపరశుపట్టిసప్రాసశూలముద్గ
రాదిసాధనంబులం గపులఁ గాందిశీకులం జేసె నంత నాంజనేయుండలసి సాల
సినశాఖామృగేంద్రుల నివర్తించి వారల కిట్లనియె. 1279

క. మీ రేల యిచట నిలువఁగఁ, బో రేల నరేంద్రుకడకుఁ బో రేల విభుం
డేరీతిఁ జెప్పు జరపుద, మారీతిన యంచుఁ బోయి రట రావణియున్. 1280

ఉ. నిఘ్నతతోడ వీరు కృతనిశ్చయులై చని రింక నేను ని
ర్విఘ్నమునన్ నికుంభిలఁ బ్రవీణత శత్రువినాశకృత్క్రియో
పఘ్నత హోమకృత్యము విభావముతో నొనరింతు నంచు జం
భఘ్నవిషూదనుం డరిగెఁ బ్రస్ఫురదర్కసమానతేజుఁడై. 1281

ఆ. ఆభిచారికక్రియారంభుఁడై వాఁడు, నుదుతరార్చి వీతిహోత్రుఁ బ్రీతిఁ
బలలశోణితాదిబహువిధాహుతులచే, నమరఁ దృప్తుఁ జేయునవసరమున.

సీ. పశ్చిమదిగ్భాగబహుళనినాదంబు, విని రామచంద్రుండు వెఱఁగుపడుచు
ఋక్షనాయకుఁ బిల్చి యి ట్లను హనుమంతు,నకుఁ గీడు గల్గెనో నామనంబు
గలఁకెడు నీ వేగి దానిఁ దథ్యంబుగా, నరసి ర మ్మని పంప నాతఁ డపుడ
భల్లూకశతకోటిబలములతోఁ గూడి, పడమటికరుగుచో నడుమఁ గనియె
వచ్చువాయుసుతునిఁ జెచ్చెర నాతండు, నింద్రజిత్తుచేత లెల్లఁ జెప్పి
యేను రాఘవులకు నెఱిఁగించి వచ్చెద, నీవు గదలకుండు మిచట ననుచు.

ఉ. వచ్చుచునున్న వానిఁ గని వారిజబాంధవవంశసంభవుం
డిచ్చ మెయిం దలంచె నిపు డీతనిచందము వేఱు గావునం
గ్రచ్చఱఁ గీడు చెప్ప నొకకర్జము దోఁచెడు నంచు నాతఁడుం
జెచ్చెర రావణాత్మజుఁడు సీత వధించినజాడ చెప్పినన్. 1284

ఉ. అశనినిపాతఘోరతరమైననిజప్రియభామపాత మ
ద్దశముఖసూతి చేసె నని తత్క్షణమాత్రమునన్ విచేష్టుఁడై
దశరథరాజనందనుఁడు ధారుణిపైఁ బడి మూర్ఛ నొందె దు
ర్దశతనుఁడై సమీరహతి బ్రాలినభూమిరుహంబుచాడ్పునన్. 1285

క. హరిసేన వగలఁ బొగులఁగ, నెరియుచు లక్ష్మణుఁడు దుఃఖ మెడలింపంగా
నరుదెంచి తొడలమీఁదట, నిరవుగ రాఘవుని నునిచి యి ట్లని పలికెన్.

ఉ. సముచితధర్మవర్తనము సల్పుచు సత్యదృఢప్రతిజ్ఞను
త్తముఁ డగునీకు నిట్టి వితతం బగుకీడు జనించె నక్కటా
యమలినధర్మమార్గము జయాస్పద మం ద్రది నేఁడు వైపరీ
త్యము నిటు లొందె సజ్జనుల కాపదలున్ సమకూఱె నీగతిన్. 1287

మ. భజనీయుం బనుచింత లేక మదిలోఁ బ్రాజ్యాత్మమారాజ్యముం

ద్యజనీయంబుగఁ జేసి కాఱడవులం దద్భంగి వర్తింపఁగా
నిజమై యాపురుషార్థముం గలుగునే నిక్కంబు కాదే పుర
స్థజగన్మానితవస్తువుల్ విడిచినన్ సౌఖ్యంబు సిద్ధించునే. 1288
క. ధనహీనుఁ డైనపురుషున, కనయముఁ జెడుఁ గార్యసిద్ధు లన్నియు గ్రీష్మం
బున సెలయేఱులక్రియ బహు,ధనుఁ డైన నభీష్టసిద్ధి తథ్యము పొందున్.
సీ. అతం డెపురుషుండు నతిగుణాన్వితుఁడును, భాగ్యవంతుండును బండితుండు
సర్వసంపన్నుండు సరసుండుఁ గులజుండు, శూరుం డుదారుండు సువ్రతుండు
మాననీయుండును మహితచారిత్రుండుఁ, బ్రాజ్ఞుండు జగదేకపూజ్యతముఁడు
సకలకలావంతుఁ డకలంకమతిశాలి, రూపింపఁగా శుభరూపయుతుఁడు
మిత్రు లతనికి బంధులు [1]మేటిసఖులు
ఘనయశఃఖ్యాతిబలధర్మకామములును
బరమసౌఖ్యంబు లుపభోగభవ్యములును
ధనికుఁ డెవ్వఁడు మిక్కిలి ధరణిలోన. 1290
క. ఎదిరికి వచ్చినరాజ్యము, మదిమది నటు గోలుపోయి మానము దూలం
జదు రేది కాననమునకు, ముదమునఁ జనుదెంచుకంటె మోసము గలదే.
వ. అది యట్లుండె. 1292
మ. నికృతిప్రోద్ధతుఁ డైనరావణునకున్ సీచేతఁ జా కుండ న
త్యకలంకం బగుసచ్చరిత్రమున నిత్యాసక్తయై యున్నజా
నకికిం గూడనిచావు గల్గె నవసానం బైనఁ దప్పింప నే
రికి శక్యంబును గాదు దైవఘటనారిష్టంబు సామాన్యమే. 1293
క. అనుచును శోకావేశం, బునఁ బొగులుచు లక్ష్మణుండు భూపుత్రియెడం
బెనువగలఁ బొందురఘుపతి, ననునయమునఁ దేర్చుచున్నయానసమయమునన్.
శా. కాలోత్తాలపయోదమధ్యగతశక్రస్పర్ధియై సాహసా
భీలాస్త్రౌఘను లేఁగుదేర నడుమం బెంపారుమత్తద్విప
శ్రీలీలన్ దశకంధరానుజుఁడు వచ్చెన్ రాఘవుం గానఁగాఁ
బ్రాలేయాంచితపద్మతుల్యవిగళద్బాష్పాంబుసిక్తాననున్. 1295
చ. కని యది యేమియో యనుచుఁ గారణ మారయఁగాఁ దలంచి చ
య్యన నరుదెంచి రాఘవనరాధిపుచంద మెఱుంగ వేఁడి య
ల్లన తను వంతతో నడుగ లక్ష్మణుఁ డిట్లను నింద్రజిత్తు దా
ననిమొన సీతఁ జంపె నని యాహనుమంతుఁడు చెప్పె నావుడున్. 1296
శా. భూనాథోత్తమ సీతచా వరయఁగా బొం కౌట తథ్యంబు మా
యానిష్ణాతుఁడు మేఘనాదుఁ డనపాయప్రౌఢిఁ దా హోమతం

1 మేలుసఖులు...ఖ్యాతిబలవర్ధకాముకులును...డెవ్వఁడు వానిని ధరణిలోన.

త్రాణాసత్వము నిర్వహింపఁగ నుపా§యం బిట్టు చింతించె దే
వా నా పల్కిది నమ్ము ధీరునకు నీ§వంతం బడం బోలునే. 1297
క. కావున వేలిమి విఘ్నము, గావింపఁగ వలయుఁ గపిని§కాయము నెల్లన్
రావించి వేగ పనుపుము, భూవల్లభ తడవుసేఁత §పోల దరయఁగన్. 1298
శా. గృధ్రోలూకగరుత్సమీరవిచల§త్కేతువ్రజంబున్ గల
త్వధ్రిచ్ఛేదవివల్గనోద్ధతహయ§వ్రాతంబు దైన్యోపసీ
దద్ధ్రిస్వీభవదార్ద్రదానజలమా§తంగంబు గాఁ బోరిలో
సధ్రీచీనతఁ దాల్పఁగాఁ బనుపుమీ §సౌమిత్రితో సైన్యముల్. 1299
చ. గొనకొని హోమకృత్యము ని§కుంభిలయం దొనరించు చున్నయ
ద్దనుజునిఁ గూల్ప లక్ష్మణు ను§దగ్రతఁ బంపుము వేగవత్కన
త్కనకమనోజ్ఞపుంఖశర§తాడితుఁ జేయుఁ బ్రచండమూర్తియై
మొనసి నఖంబులన్ హరి స§ముద్ధతిమైఁ గరిఁ ద్రుంచుచాడ్పునన్. 1300
మ. వినుమా రాఘవ దాశకంఠి మును దో§ర్వీర్యం బఖర్వంబుగా
నొనరింపంగఁ దలంచి చేసెఁ దప మ§త్యుగ్రంబుగా దాన మె
[1]చ్చినవాఁడై సరసీజయోని వెస ని§చ్చెం గామగాశ్వంబు లిం
పొనరన్ బ్రహ్మశిరోస్త్రముం దగ నజ§య్యుం డేరికిం బోరులన్. 1301
ఉ. కీశచమూసమేతముగఁ §గింకను లక్ష్మణుఁ డాజిలోన నా
కీశనిషూదనుం గదిసి §వేపునఁ దూపులపాలు చేయఁ గీ
నాశనివేశనంబునకు §నమ్మినకాఁ పగుపక్తికంఠుఁడున్
నీశరవృష్టి నీల్గు నిది §నిక్కము గాఁగఁ దలంపు మాత్మలోన్. 1302
వ. అనిన విని దశరథనందనాగ్రజుం డనుజున కిట్లనియె. 1303
చ. అరయఁగ మేఘమండలము§నందుఁ దిరోహితుఁడై నభానుతో
నొరయుచు మాయలం దనరి §యుద్ధము సల్పెడుమేఘనాదుతో
డొరయఁగ లేరు దిక్పతులు §దోర్బల మొప్పఁగ నీవు వాని ను
ద్ధురతరసాయకావలులఁ §ద్రుంచి వధింపుము తెంపుపెంపునన్. 1304
చ. జయ మొసఁగున్ రమావరుఁడు §శంకరుఁడున్ సుఖ మిచ్చు నగ్నియున్
నియతము దేజ మొప్పఁ గరు§ణించుఁ జిరాయురుపేతుఁ జేయు బ్ర
హ్మయు నని పెక్కుదీవనల §నాపతి తమ్ముని గారవించె వే
డ్కయుఁ గృపతోడి నెయ్యము బె§డంగున ముప్పిరి గాఁగ నెంతయున్. 1305
మ. హరుచాపం బనఁ బోలువిల్లు నశని§వ్యాఘాతబృందంబుతో
నరిఁ జేయుం దగుసాయకంబులు నుదం§చద్భీమనక్తంచరో
త్కరముం గూలుపఁ జాలుఖడ్గము సము§ద్యద్వజ్రసంఘాతభా

1 చ్చినవాఁడౌచు సరోజయోని.

స్వరసారం బగుజోడుఁ దాల్చి తనరెఁ । సౌమిత్రి చూడం గడున్. 1306
మ. అనపాయం బగురామచంద్రునియమో । ఘాశీర్వచోవిభ్రమం
బున నత్యంతముఁ దేజరిల్లుచు మహా । భూరిప్రతాపంబుచే
ఘనుఁడై శారదచండభానుకరణిం । గ్రవ్యాదసేనాతమో
హననుం డై కపివక్త్రపద్మములకుఁ । హర్షంబుఁ బెంపారఁగన్. 1307
ఉ. అన్నకు మ్రొక్కి నిల్చి విన । యంబున రాఘవునాజ్ఞ నెంతయుం
బ్రన్ననయించి విష్ణుఁడు సు । పర్ణుని నెక్కినమాడ్కి వేడ్కతోఁ
బన్నుగ వాయుసూతిపయి । భాతిఁ దనర్చుచు లక్ష్మణుండు మే
రూన్నతశృంగదేశమున । నొప్పుమృగేంద్రునిఁ గ్రేణిసేయుచున్. 1308

—❀ లక్ష్మణుఁడు వానరసైన్యముతో నికుంభిలకుఁ బోవుట. ❀—

క. కదలె రభసమున ధర గ్రక్క దలఁగ శేషుండు [1]శిరము । లల్లన వంపం
బదిలంబులేక కూర్మము, చదికిలఁబడ దిగ్గజములు । సరి మ్రొగ్గతిలన్. 1309
క. గోలాంగూలబలంబులు, వాలము లల్లార్చ జాంబ । వత్ప్రముఖమహా
భీలతరభల్లయూథము, కోలాహల మొదవఁ గదలెఁ । గోటులసంఖ్యల్. 1310
క. చటులతరసమయజయలం, పటుపటుతరబాహుదండ । భాసురశైలో
త్కటకోటికూటపాటన, నటనం బొనరంగఁ గదలె । నగచరబలముల్. 1311
క. శుండాలసములును దటి, న్మండలనిభులై నబుత్ । నగచరవీరుల్
మెండుగఁ గదలిరి కాటుక, కొండలలోఁ గలయుపసిఁడి । కొండ లనంగన్. 1312
తే. ఉగ్రవేగులు ముప్పది । యోజనములు, నొక్కనిమిషంబులోపల । నుక్కుమిగిలి
కదియఁదరువులువడిఁజాఁప । కట్టువడియెఁ, బాదఘట్టనఁబొడియయ్యెఁ । బర్వతములు.
వ. అంత.
సీ. ధీరసత్త్వంబుల । దిగ్గజంబుల కైన, సిగ్గు పుట్టించెడి । సింధురములు
గతివిశేషంబుల । శతమఖుతురగంబుఁ, జలవంపఁ జేయుసైం । ధవగణంబుఁ
జటులజవంబునఁ । జండభానుని తేరు, సరకుసేయనిమహా । స్యందనములు
భూరిపరాక్రమం । బున సింహముల తెంపు, కలిమి మెచ్చనియట్టి । కాల్బలంబు
బృంహితంబులు హేషలుఁ । బృథులనేమి, సింహనాదంబు లందంద । సెలఁగ ఘోర
సమరసన్నద్ధమైనరా । క్షసబలంబు, రమణ ముందటఁబొడగాంచె । రాజసుతుఁడు.
క. వడిఁ దటిమికొనుచు నదియును, నడతెంచెఁ వెల్లివిరిసి । నాదము లెసఁగన్
జడనిధుల మీఁటి కపులను, సుడిగొలుపుచు ననమసమర । శుంభద్గతి నై. 1315
చ. దరువులుఁ గొండలుం బెఱికి । దారుణభంగి నిశాటకోటిపైఁ
గురిసిరి వానరాధిపులు । కుప్పలుగా నట రాక్షసాలియుం
బరశుగదాస్త్రముద్గరకృ । పాణములన్ వడి మర్కటేంద్రులం

1 దలలు గదలుప సరసన్.

బోరిఁ గడవంగఁ జొచ్చె సురబృందము లుబ్బుచు స్రుక్కుచుండఁగన్. 1316

చ. అదలుపులం బ్రచండ మగునార్పుల లంకయు నీవలావలై
కదలినభంగిఁ దోఁపఁ బరిఘంబుల నీఁటెల ముద్గరంబులన్
గదలను భిండివాలముల గ్రక్కునఁ గూల్చుచు వాఁడితూపులన్
గుదులుగ గ్రుచ్చె నాదితిజకోటి వనాటులఁ జేటుపాటుగన్. 1317

ఉ. గ్రక్కున వానరాధిపులు గర్వమునం దమలావుపెంపున
న్లెక్క యొకింతలేక యతినిష్ఠురతం గడకాళ్లు వట్టి యే
దిక్కునఁ దారయై చదలఁ ద్రిప్పుచు వీచి వధించి రేపునన్
ముక్కులఁ గన్నులం జెవుల మోముల నెత్తురు లొల్కఁ దైత్యులన్. 1318

శా. ఖేలద్విక్రమ మైనదైత్యబలముం గీశావలిం గిన్కతోఁ
గేలన్ వ్రేయుచుఁ దూపు లంగములలోఁ గీలించుచుం దెంపునం
గాలన్ మట్టుచు నిట్టు నట్టుఁ గదలం గా నీక యుద్వృత్తిఁ గీ
లాలంబుల్ దొరఁగంగ నొక్కవడి నేలం గూల్చెఁ బెల్లార్చుచున్. 1319

క. ఎరగలి యెండినయడవుల, దరికొనుచందంబు మిగుల దర్పము పెరుఁగన్
హరిసేన గడఁగి దైత్యులఁ, బోరిమార్పఁగఁ జొచ్చె ముష్టి భూరుహగిరులన్.

ఆ. శైలతటము దాఁకి సలిలప్రవాహంబు, మిగులజవము గక్కి మగిడి పాఱు
కరణి దైత్యబలము కపినికాయంబుతోఁ, దెగువఁ బొడిచి యోడి తిరిగిచనిన.

చ. పదిలముతోడ నాహుతులు పావకులో హరివైరి నూటతో
మ్మిది దగ వేల్చి యంతటను మిక్కుటమై కపు లేఁగుదెంచినం
బదరుచు స్రుక్కువంబు లటు పాఱఁగవైచి రథంబుపై రణో
న్మదసముదగ్రవృత్తి నురుమాయుఁడు నిల్చెఁ బ్రతాప మేర్పడన్. 1322

సీ. కోపంబు గదిరినఁ గొలుముల కెన యైన, కన్నుల నిప్పులు గడలుకొనఁగ
మెఱుఁగారుకోఱల మించులు గదురంగ, నతిభీషణంబుగా నవుడు గఱచి
పెనుపొందఁగా మృత్యుభీషణభ్రూలతా, విభ్రమం బగు చున్నవిల్లు దాల్చి
కడఁగి కాలాంతకుకడగంటిచూడ్కులఁ, దలఁపించుశరములదర్ప మెసఁగ
గుణనినాదంబు లెల్లదిక్కులను నిండఁ, బద్మజాండంబు నొక్కటఁబగుల నడువ
రౌద్రమున వచ్చునయ్యాదిరుద్రుఁ డనఁగ, నిట్టు లేతెంచె నత్తఱి నింద్రజిత్తు.

వ. వచ్చి తోరంబు లగుశరాసారంబుల రోదోంతరంబు నీరంధ్రంబు గావించి
కపిసేనకుం గవిసి. 1324

ఉ. కట్టలుకం బ్రచండతరకాండము లొక్కొకనందు నేపునం
గట్టలు గాఁగ నేసి తమకం బొదవం గడుదుర్నివారుఁడై
చట్టలు చీరియుం దొడలు చక్కలు చేసియుఁ జెండి వైచియుం
బొట్టలు సించియున్ మెడలు బోరనఁ ద్రుంచియుఁ బో రొనర్పఁగన్. 1325

వ. అయ్యవసరంబున ననిలనందనుం డొక్క మహామహీధరంబు పెఱికి కదిసి దా
నవులం జదుపుచు వ్రేయుచుం బడలుపఱుచుచుం గసిమసంగి బారిసమరునప్పు
డు గినిసి యొక్కమొగిం జుట్టుముట్టి శూలపరశుకరవాలపట్టిసప్రాసపరిఘభిండి
వాలచక్రశరముష్టికరతలప్రహారంబుల నొప్పించిన నవి గైకొనక వారల సమ
యించుచున్నం గని మేఘనాదుం డాంజనేయున కభిముఖుం డై తనసారథి నర
దంబు వఱప నియోగించిన వాఁడు నట్ల చేయ నిజానుజాతువధంబు దలంచి బహు
విధాయుధంబులు పరఁగించి క్రమ్మఱి యవశిష్టం బగుహోమంబు సంపూర్ణంబు
సేయం దలంచి యరిగిన నెఱింగి విభీషణుండు సౌమిత్రి నచటికిం దోడ్కొనిపోయి
వానిహోమంబు సూపి యి ట్లనియె. 1326

సీ. మున్న వీఁ డిచ్చోన మునుకొని హోమంబు, సలిపి భూతములకు బలులనొసఁగి
సంప్రాప్తకాముఁడై సంగ్రామమున నదృశ్యాకారుఁడై పేర్చి యమరనాథు
నోడించెఁ బలుమాఱు నోలి దిగీశుల,తోన కావునఁ గడు దుర్జయుండ
యిదె కంటె యిప్పుడు నీహుతాశనులోన, నరుదార వెడలెడి నురురథంబు
రక్తలోచనాంగ రాగమాల్యాంబర,కవచములును నసిత కాయుఁ డైన
సూతుతోడ రక్త సురుచిరాశ్వములతో, [1]నగ్నివర్ణభాతి ననుకరించి. 1327

ఉ. ఈరథ మెక్కి వీఁడు రణ మేపునఁ జేయఁగ వచ్చెనేని బృం
దారకనాథముఖ్యు లగు దానవవైరులు నిల్చి గెల్వఁగా
లే రది గావునన్ నృపని లింపకులాధిప యింతలోన నీ
ఘోరశరాబ్ధి ముంచి వడిఁ గూల్పుము విక్రమ మొప్ప నావుడున్. 1328

చ. ప్రణుతపరాక్రమార్కుఁ డగు రాజకుమారమృగేంద్రుఁ డవ్విభీ
షణుపలు కంతయున్ విని నసారశరాసనచారుశింజినీ
రణనముచేత రోదసి విరావము నొందఁగ దిక్తటాత్తవా
రణములు మ్రొగ్గతిల్లఁగ ధరావలయంబు వడంకునట్లుగన్. 1329

వ. నిశితప్రచండకాండసహస్రంబులు పరఁగించి యాహ్వానంబు సేసినం బరిత్యక్త
హోమవిధికలాపుం డై. 1330

ఆ. అంత నగ్నివర్ణ మయినరథం బెక్కి, ఘోరుఁ డైనయంతకుండపోలె
నరుగుదెంచి పలికె నవ్విభీషణుఁ గాంచి, యింద్రజిత్తు రోష మినుమడింప.

క. పినతండ్రి వయ్యు నక్కట, కనికర మొకయింత లేక కడఁగి వధింపం
బనిచెదవు మానవాధము, నను గెలువఁగ వశమె దేవనాథున కయినన్.

క. పొం దైనబంధువర్గము,పొం దొల్లక యన్నతోడి పొత్తు విడిచి చే
రం దగనిమనుజుఁ జేరుట, నిందకు నొడికట్టి తీవు నీచచరిత్రా. 1333

వ. అనిన నప్పలుకులు విని విభీషణుం డతని కి ట్లనియె. 1334

1 నగ్నివర్ణజాతు.

చ. పరులధనంబు లొంచుఁ బరభామలఁ బట్టుచు విప్రులన్ మునీ
శ్వరుల వధించుచుం ద్రిదశవర్గముతోడుత విగ్రహించుచుం
గరుణ యొకింత లేనిదశకంఠునిచెయ్వులఁ జేసి నామనం
బెరియుచునుండ నిప్డు ధరణీశ్వరు రాఘవు నాశ్రయించితిన్. 1335

చ. నిను వధియించు లక్ష్మణుఁడు నీ వెట కేఁగెద వింక నోరి నీ
కును నిటఁ దొంటికై వడి నికుంభిలకుం జొరరాదు మిన్ను సొ
చ్చిన జలరాశిలోపల వసించిన దిక్కులయందు దాఁగినన్
వెనుకన వచ్చి కూల్చు నృపవీరునిబాణ మమోఘ మై వెసన్. 1336

వ. అనినఁ బంక్తికంధరనందనుండు గినిసి యి ట్లనియె. 1337

చ. నమలెదఁ గాలమృత్యువును నామ మడంగఁగఁ బట్టి కాళ్లచేఁ
జమరెద బాడబానలముఁ జండతభైరవు రూపుమాపెదన్
సమయఁగఁ జేసెదన్ విబుధసంఘము నెల్ల నవక్రవిక్రమ
క్రమమున భద్రకాళిఁ గడకాలన మట్టెద నొక్కవ్రేల్మిడిన్. 1338

ఉ. పంతముతోడ దిక్కరులఁ బన్నుగఁ జేతులఁబట్టి తాఁకులా
డింతునె యేడువార్ధులఁ గడిందిమగంటిమిఁ జొచ్చి రొంపి గా
వింతునె నింగియున్ భువియు వేడుకఁ దాళముచేసి బిట్టు వా
యింతునె కొంకులేక వడి నీభువనంబులు మ్రింగిపుత్తునే. 1339

శా. ఓహో చాలును బెక్కుపంతములు శౌర్యోద్వృత్తిమై నున్ననా
బాహాసత్త్వము నీకుఁ గానఁబడఁగా బాణావలిన్ వానర
వ్యూహంబుం బొలియించి రాముజయోద్యోగంబు మాయించెదన్
హాహాకారము పుట్టఁజేసెద నిలింపాధీశలోకంబునన్. 1340

—✿ ఇంద్రజిల్లక్ష్మణులయుద్ధము. ✿—

మ. అనుచుం జేరఁగ వచ్చి లక్ష్మణ వృథాయాసంబు నీ కేల వే
చను మెచ్చోటికి నైన నీతరమె దోస్సారంబునం బోరఁగా
నను మున్నీవు నెఱుంగు దారయఁగ నా నాగాస్త్రపాశంబు లే
పున బంధించిన వన్నియున్ మఱచితే మోహంబునుం గల్గెనే. 1341

క. నాకార్ముకముక్తము లై, భీకరబాణములు నిన్నుఁ బిడుగులఁబోలెన్
వేకూల్చి తనివి సల్పుం, గాకోలూకోగ్రజంబుకంబుల కాజిన్. 1342

క. అన విని లక్ష్మణుఁ డిట్లను, గనునట్లుగ నెదుర నిల్వఁ గాలేక మమున్
గనుమొఱఁగి పాడి దప్పుచు, నని చేసిన నిన్ను శూరుఁ డండ్రే చెపుమా.

క. ఉరుబలుఁడ వయ్యుఁ దస్కర,చరితంబునఁ బొడిచి తీవు చటులాస్త్రమునన్
ధరఁ గూల్తు నిన్ను ననవుడు, నరుదెంచి యుదంచితాట్టహాసం బొదవన్.

క. కోపంబు గదుర దృఢతర,చాపము తెగనిండఁ దిగిచి శరములు గురియన్

భూపసుతుఁ గాఁడి మఱియును, నేపున ధరఁ జొచ్చి చనియె నెంతయు వడితోన్.

వ. మఱియు మూఁ డేసి యంతం బోవక నిశితశరపరంపరలు నిగిడింప నవియు నతనియంగంబులందుల శోణితంబునం దడియక భూవివరంబు సొచ్చె నంత రుధిరధారాసిక్తాంగుం డై సధాతునిర్ఝరం బైన ధరాధరంబునుంబోలె సౌమిత్రి సక్రోధుం డై చండభానుని కెదురు మందునట్టి నిశితకాండంబున వానివక్షంబు గాఁడ నేసిన రుధిరోద్గారం బొదవ మూర్ఛిల్లి యంతన తెలిసి. 1346

మ. రభసోదంచితసింహనాదము ధనుర్జ్యారావమున్ వజ్రస
న్నిభబాణౌఘవిఘట్టనధ్వనితమున్ నీరంధ్ర మై కల్పసం
క్షుభితోగ్ర[1]తరాంతకప్రహసితక్రూరక్రమం బై వెసన్
నభమున్ దిక్కులు భూమియుం బగిలెనో నాఁగం బ్రవర్తిల్లఁగన్. 1347

ఉ. లావును విక్రమంబును బలంబును బీరము నొప్పఁ దేజముం
జేవయు మత్సరంబుఁ దమచిత్తముకింకయు నొక్కరూపుగా
రావణుకూర్మినందనుఁడు రాఘవుతమ్ముఁడుఁ బోరి రుగ్రసం
భావనతోడ బాణశతపాటితవిహ్వలితోరుగాత్రు లై. 1348

చ. అరయ ననూన మైనవిజయంబుఁ బరాజయమున్ సమంబు లై
పరువడితోడ నిర్వటిల భానుకులుండును దాశకంఠియుం
దిర మగుసత్త్వభుత్వమున ధీరత నొచ్చెము లేమిఁ జెందుచున్
సరసిజమిత్రుచందమును జందురుచందముఁ దాల్చి రెంతయున్. 1349

సీ. పెనుమంచు గవిసిన మునిఁగి కానఁగరాని, భూధరంబులతోడిపోల్కి గలిగి
మిగులదట్టము లైన మేఘమండలముల, నడిమిచంద్రార్కులబెడఁగు గలిగి
ప్రథితమహాయనపంజరంబులలోని, వరమృగేంద్రంబులకరణి గలిగి
మొగిఁ బ్రమాదంబున [2]నోదంబులోఁ జిక్కు, సామజంబులతోడిసాటి గలిగి
దశరథాత్మజుండు దశకంఠసూనుండు, మొగిఁ బరస్పరాస్త్రములను జేసి
యతితిరోహితాంగు లై తమస్సంఛన్న, పరపదార్థము లనఁ బఱవు దక్కి.

వ. మఱియును. 1351

క. ధీరోద్ధతు లురుగర్జా,ధారులు నరదైత్యరాజతనయులు బాణా
సారములు దఱిమి కురియుచు, ధారాధరము లనఁగా నుదారక్రము లై.

క. రవికిరణంబులు దూఱక, పవనునకుం జొరవ లేక బాణావలిచే
నవిరళతిమిరము గవిసెను, భువనోదర మెల్ల నిండఁ బృథుసంచర మై. 1353

మ. బలగర్వంబుల వీఁడు లోకములకుం బాటిల్లుహృచ్ఛూల మై
బలభిద్భేదము సేసె వీనిఁ దగ నీబాణానలోగ్రార్చులన్
శలభప్రక్రియ సీఱు సేయు మని కీశవ్రాతముల్ పెక్కుభం

1. తరాట్టహాసహసిత. 2. నోదంబులోపలఁ బడుగజంబులతోడి పాటి గలిగి.

గుల దీవించిరి రాఘవానుజు బలోగ్రుర్ వీరచూడామణిన్. 1354

క. బాహాసారము నురుస,న్నాహంబును జాపనైపుణంబును విజయో
త్సాహంబు మెఱయ లక్ష్మణుఁ, డాహవమునఁ దేజరిల్లు | నర్కుఁడుఁబోలెన్.

సీ. చెలువారుజయలక్ష్మి | చేయూఁతగాఁ గగు, విలసితకార్ముక | మలవరించి
విక్రమశ్రీకంఠ | విపులగుణం బైన, గొనయంబు [1]సారణం | బును నొనర్చి
నీరంధ్రసాంద్ర [2]మహా | ధీరనాదంబునఁ, దిగిచి కర్ణాంతంబు | తెగకుఁ దార్చి
పుంఖానుపుంఖమై | పొరిఁ గమయంతన, వెడలె నా నర్పుల | వింటఁ బేర్చి
వడి రసాతలభాగంబు | వెడలి వచ్చి, కడఁగి కన్నుల విషములు | గ్రక్కునట్టి
కాలభీషణభుజగుల | కంటె బెడిఁగ, మైనతూపులు సౌమిత్రి | పూని యేసె.

చ. గిరిశుఁడు సంధకాసురుఁడుఁ | గేసరియుర్ మదసింధురంబు నా
హరియును వృత్రుఁడుర్ ఖగకు | లాధిపుఁడుర్ భుజగంబు నేపుతో
నురవడిఁ బోరుచందమున | నుద్ధతవిక్రముఁ డైనమేదినీ
శ్వరతనయుండు దైత్యకుల | వర్యతనూజుఁడుఁ బోరి నుగ్రతన్. 1357

లయ. చండతరసారవిను | తుం డగుసమీరతన | యుండు ఫణిరాజభుజ | దండములు గ్రాలన్
మెండుకొని రక్కసుల | గుండె లగలం బొడిచి | కొండలను వృక్షములను | నిండఁ బడఁగా ను
ద్దండముగ గీటడఁచి | దండి గలదానవుల | నొండెడకుఁ బాఱఁ గని | చెండి తననత్త్వో
చ్చండిమకు సాటిగ న | ఖండరణవిక్రముఁడు | చండకరుభంగి నరి | చండుఁ డయి క్రాలెన్.

చ. మఱియు విభీషణుండు దన | మంత్రులుఁ దానును గూడి యేపునం
దఱిమి నిశాతహేతివిత | తస్ఫురదస్త్రము లేసి దైత్యులర్
నఱుకుచు రూపుమాపుచును | నొంచుచుఁ ద్రుంచుచుఁ బేర్చి కంఠముల్
నఱకుచు నొక్కపెట్టను ర | ణంబునఁ గూల్చె నుదగ్రమూర్తి యై. 1359

ఆ. ఇంద్రజిత్తు మునప | నెంతయుఁ గోపించి, యతనిమీఁద వాఁడు | వితతశరము
లేసి వాయుసూను | నేపున నొప్పించి, చిత్రగతుల రాజ | పుత్త్రు నొంచె. 1360

వ. సౌమిత్రియు నమిత్రకులనిషూదనంబు లగుశరంబుల నతనికాండంబుల ఖండించుచు నర్ధచంద్రాననంబు లగుశిలీముఖంబుల వానికార్ముకంబు దునిమి దశవిశిఖంబుల నురస్స్థలి గాఁడనేసి చటులజవంబు లగుఘోటకంబులం జతుశ్శరంబుల నొప్పించి యభ్రంకషం బగుకేతనంబు పంచసాయకంబుల నఱికి యొక్కశరం

1. సారణంబున నమర్చి. 2. మూఁడులోకంబులు మునుమిడి కలఁగంగ, వరసింహనాదంబు. వరుసఁ జేసి.

బున సూతుశిరంబు డొల్ల నేసి సింహనాదంబు సెలంగించిన నవ్వీరుండు పాలి
వోనివిక్రమంబున నాక్రమించి తాన సారథ్యంబునుం బ్రవర్తించుచు నుల్కాస
మానంబు లైనశరంబులు కోపంబున నతనిమేనఁ గీలుకొల్పిన నమ్మేటిమగం
డు గండుమిగిలి ఘోరనారాచధారాసారంబుల గాఢంబుగా నో నేసిన వాఁడు
సొమ్మసిల్లి యంతన తెలిసి యాత్మగతంబున. 1361

చ. హరి ననలుం గృతాంతు దనుజాధిపు నవ్వరుణుం సమీరుఁ గి
న్నరవరు నీశ్వరుం బహురణంబుల గెల్చితి నోటలేక యి
న్నరుఁ డిటు నన్ను నొంచెడు ఘనంబుగఁ దూపులఁ గాల మెవ్వరుం
దిరుగఁగఁబెట్ట లేరు విధిత్రిప్పులు [1]దప్పి చనంగ నేర్చునే. 1362

ఆ. అనుచు నాత్మలోన నచ్చెరు వందుచుఁ, దనబలావసానమునకు వగచి
నిగుడుకోపమునను నిట్టూర్పు లెగయఁగ, నెఱకులాడ నేసె మఱియు నతఁడు.

సీ. కడువాఁడితూపులఁ గడఁగి విభీషణు, ఘనలలాటస్థలి గాఁడ నేసి
నిశితాగ్రమై యున్నవిశిఖంబు గొని రాజపుత్రునురం బుచ్చి పోవ నేసి
నెఱిమూఁట మూఁటఁ గ్రమ్మఱ వారి నొంచి వాతూలనందను నటుతూలఁ జేసి
నింగియుఁ బుడమియు నిశితాస్త్రముల నించి, యేదిక్కుఁ దానయై యెదురులేక
ప్రల్లదంబున బ్రహ్మాండభాండ మెల్లఁ, బగుల నార్చిన దశకంఠుపట్టి వఱుఁ
[2]మేనుదూపుల లక్ష్మణుఁ డెగువనేసె, సోలి [illegible]లోన తెలివొందె శూరవరుఁడు.

క. నాగాస్త్ర మింద్రజిత్తు ప్రయోగింప నుదగ్రవిక్రమోద్ధతశత్రు
ప్రాగల్భ్యము సైరింపక, సాగరగంభీరఘోషసమనాదుం డై. 1365

ఉ. కాలవిలోలదీర్ఘతరకాయము లై విగళన్మహావిష
జ్వాలలతో డిధూమములు వావిరి దిక్కుల నెల్లఁ బర్వఁగా
నాలుక లోలిఁ గ్రోయుచు ఘనస్ఫుటనిశ్శ్వసితానలంబులం
దూలిచె దేవయానములఁ దోరము లైనభుజంగసంఘముల్. 1366

క. గరుడాస్త్ర మంత నురవడి, నరనాయకతనయుఁ డేసె నానాస్త్రమహా
స్ఫురణంబు దూలి పోవఁగ, దరహసితము మోముఁ గ్రమ్మఁ దళుకొత్తంగన్.

సీ. పక్షవిక్షేపజపవనవేగంబున, విఱిగి వృక్షంబులు వెనుకఁ దూలఁ
దోయధిసలిలంబు పాయ యిచ్చినయంత, ఫణిరాజలోకంబు బయలుపడఁగ
గ్రహమండలముఁ దారకాచక్రమునుదమ, గతిదప్పి విభ్రాంతిఁ గలఁగి పఱవఁ
దునుక లై చెదరినతోయదంబులలోన, దివిజయానంబులు దిరుగువడఁగ
ఖరము లగుమహానఖరముల ముక్కులఁ
జీరి పొడిచి బిట్టు చించి త్రుంచి
యక్కజంబు గాఁగ నహిసమూహము నెల్ల

1. ద్రిప్పఁగ నేరవచ్చునే. 2. మైదతూపుల లక్ష్మణుఁ డగలఁజేయ, సోలి.

సమయఁ జేసె విహగసముదయంబు. 1368

తే. అమరవైరియు నటుకు బేరాస్త్ర మేయ, భానుకులదీపకుఁడు యామ్యబాణ మేసె
నడరి దివ్యశరంబుల నసుర వఱవఁ, బ్రతిశరంబుల నతఁడును బరిహరించె.

శా. చాపాభ్యాసవిశేష మింపొదవ నుత్సాహంబు నాయోధనా
టోపంబుం జలమున్ నిలింపతతిచూడ్కుల్ చూఱవట్టన్ జయ
వ్యాపారంబుల మించి యొండొరులదివ్యాస్త్రంబులం ద్రుంచుచుం
గోపం బారఁగఁ బోరి రిద్దఱును దిక్కూలంకషధ్వానులై. 1370

ఉ. పెల్లుగఁ బెద్దసేపు రణభీషణలీలఁ జెమర్చి డస్సియు
న్బల్లిదుఁడైన రాజవరనందనుపై రణశ్రాంతి మాన్పఁగా
ఫుల్లసరోజగంధములపొత్తు వహించుచు గంధవాహుఁడుం
జల్లఁదనంబు మీఱఁగ వెదచల్లుచు నింపుగ వీచె మెల్లనన్. 1371

శా. విల్లాకర్ణము గా వెసం దిగిచి మౌర్వీరావ మేపారఁగా
భల్లంబుల్ పరఁగించి రోష మొదవన్ బ్రహ్మాండభాండంబు భే
దిల్లన్ బెట్టుగ నార్చి పేర్చి ప్రళయోద్వృత్తాంతకాకారుఁడై
మొల్లంబై నబలంబునం బొలిచె [1]సమ్మూర్ఛత్ప్రతాపంబునన్. 1372

సీ. కడఁగి కానన మేర్చుకార్చిచ్చుకైవడి, మిగుల నుద్ధతిఁ దనమేను వెంచి
జయలక్ష్మివిహారణశైలంబు లన నొప్పు, గలయంసములు దలకడచి పెరుఁగ
మేరుసారం బగుమేటిచాపము దాల్చి, శక్రుచేఁ గొన్నయస్త్రంబు దొడిగి
మూఁడులోకము లింకమోదించుఁ గావుత, మని పల్కి మఱియును మనములోన
రామచంద్రుండు సద్ధర్మరతుఁడయేని, సీత సుచరిత్ర సాధుత్వశీలయేని
వెలయదైవంబు కృపనాకుఁ గలిగెనేని, యిదిమహేంద్రాదిసురులకు హితమయేని.

క. అని దశరథభూవరనందనుఁ డేకాగ్రతఁ దనర్చి దర్పం బెసఁగం
దనదృష్టి రాక్షసేంద్రుని, తనయునిపై నిలిపి యేసెఁ దచ్ఛరవరమున్. 1374

వ. అదియును నిర్ఘాతసంఘాతపాతభయానకంబై ప్రచండచండకరశతావిర్భావంబై మణిచిత్రితపుంఖప్రభామండలమండితంబయి సుపర్ణోదీర్ణతూర్ణంబై ప్రళయదహనదాహావహంబై మహావిషోదగ్రభుజంగరాజభీషణంబై యనేకముఖంబుల మండుచుఁ జదలును దెసలును బుడమియుం బగులం బఱతెంచి. 1375

ఉ. అనుపమమైన తేజము మహాత్మ్యమునున్ జవముం బ్రతాపముం
దనరఁగఁ గ్రొమ్మెఱుంగు లొగి దట్టములై తొరఁగంగ నుద్ధతిన్
గొనకొని హేమచారుమణికుండలమండితమైన యింద్రజి
త్తునితల తత్క్షణంబునన త్రుంచి ధరం బడఁగూల్చెఁ బెల్లనన్. 1376

క. మొరసెన్ దుందుభు లత్తఱిఁ, బోరిఁ గురిసిరి పుష్పవృష్టి బృందారకుల్

1. సమ్మోదప్రతాపోగ్రుఁడై.

నరి నాడిరి సురసతులును, సరసంబునఁ [1]బొగడె నంతఁ జారణతతియున్.

తే. అపరవారాశిలోఁ గ్రుంకు నర్కుఁ డనఁగ, నాజితలమున నాదైత్యుఁ డస్తమించి
యధిక తేజోమయాత్ముఁడై యాక్షణంబ, పరమవైష్ణవసాయుజ్యపదము నొందె.

శా. ఆసౌమిత్రియు నంత వానరనికాయంబుల్ ప్రశంసింపఁగా
నాసామీరియు నావిభీషణుఁడు నత్యాసన్నులై రా జయ
శ్రీ సొంపారఁగ వచ్చి సంభ్రమయుతస్నేహంబుతో నన్నకుం
జేసెన్ సన్నతి రక్తశోభితగళత్స్వేదానువిద్ధాంగుఁడై. 1379

ఉ. నిక్కవమైనకూర్మి గలనిండుమనంబున రాఘవేశ్వరుం
డక్కునఁ జేర్చి లక్ష్మణు నిజాంకముపై నిడి మోదబాష్పముల్
చెక్కుల నిండ గద్గదిక చెన్నెసలారఁగఁ బల్కె వేడ్కతో
నక్కమలాప్తసూను నసురాధిపుఁ గన్గొని ధీరనాదుఁడై. 1380

మ. ఘనమాయుం డగునింద్రజిత్తు ననిలోఁ గాలుండపోలెన్ వడిం
దునిమెన్ లక్ష్మణుఁ డింక నేఁ దశముఖున్ గర్వోర్వ్య మేపారఁగా
ననిలోఁ గూల్చెదఁ జేర్చి యీనడుమ దైత్యానీకముం బట్టి నె
ట్టనఁ జో నీక వధింపుఁ డొక్కమొగిఁ గట్టల్కం గపివ్రాతముల్. 1381

వ. అనియె నంత. 1382

సీ. హతశేషులైన యాదితిజులు లంకకుఁ, జని దశాననుఁ గాంచి సభయు లగుచు
దనుజకులేంద్ర నీతనయుండు రణమునఁ, బ్లవగకోటుల నెల్ల బారిసమరి
మనలంకఁ గాల్చినమారుతాత్మజు నొంచి, యవ్విభీషణుమేన నధికశస్త్ర
చయములు గీలించి చటులబలుండైన, సౌమిత్రితోడుతఁ జాలఁ బ్రొద్దు
సమరలీల సల్పి చండప్రతాపుఁడై, ఘోరభంగిఁ జేర్చి కొంతవడికిఁ
బ్రథితలక్ష్మణాస్త్రపావకజ్వాలల, శలభవృత్తిఁ దాల్చి బొలుపు దక్కె. 1383

—✿ ఇంద్రజిత్తుచావునకు రావణుండు దుఃఖించుట. ✿—

వ. అని విన్నవించిన. 1384

చ. విని విన నంతలోన తనవీనులు వ్రయ్యఁగ మేను దుర్విషం
బునఁ బరివీతమైనక్రియఁ బొల్పగలం బ్రళయాపతన్మహా
శనిహతిఁ బొందుచాడ్పున నిశాతతరక్రకచంబుకోఁతలం
దునిసినభంగి నెమ్మనము దూలఁగ వ్రాలె నతండు భూస్థలిన్. 1385

చ. తెలియక కొంతసేపునకుఁ దేఱి డెసల్ పరికించి చూచి మి
క్కిలి యగుశోకవేగమునఁ గీడ్పడి సాహసధైర్యవిక్రమం
బులు జయలక్ష్మితోఁ దొలఁగి పోయినచందము దోఁప నెంతయుం
బెలుకుఱి పెక్కుభంగి విలపించె దశాననుఁ డీక్రమంబునన్. 1386

1. బొగడి రంతఁ జారణపతులున్. 2. ధీరతాత్ముఁడై.

ఉ. హా జగదేకవీరవర । హా కులసాగరపూర్ణచంద్రమా
హా జితలోకపాలగణ । హా భుజగేంద్రలసన్మహాభుజా
హా జనితప్రభావయుత । హా సమరార్ణవకర్ణధార నీ
తేజము విక్రమంబు ఘన।ధీరతయుం దెగటాఱె నక్కటా. 1387

సీ. విలసితం బైననీ।విపులప్రతాపంబు, భానుతేజమునకుఁ । బాయుత్రోవ
యుసూతరం బైననీ।యుత్సాహసంపద, పరఁగ జయశ్రీకిఁ । బట్టుకొమ్మ
యనుపమం బైననీ।ఘనతరక్రోధంబు, వీరులధైర్యంబు । వీడుకోలు
గురుబలం బైననీ।యురుభుజాయుగ్మంబు, శేషభోగీంద్రుని।సిగ్గుపాటు
అట్టి నీపెంపు లెచ్చోట । నడఁగిపోయె, సమరకౌశల మెక్కడ । సమసిపోయె
నస్త్రశిక్షయు నేభంగి।నడఁగిపోయె, మాయలన్నియు నెచ్చోట।మాయమయ్యె.

సీ. సురకులాధీశుని।సొంపెల్లఁ దూలించి, కడఁగి పావకుఁ బట్టి । కాలఁ జమరి
పెంచి కృతాంతుని।గెంపు రూపఱఁ జేసి, నిర్ఋతిసత్త్వంబును । నేలఁగలిపి
వరుణుని శౌర్యంబు । వఱితిపాలుగఁ జేసి, యనిలునియుద్ధతి । నంటఁగట్టి
ధననాథునిధులను । దక్కోలుగాఁ గొని, శూలిఁ గాఱడవుల।పాలు చేసి
మెఱసి వీరలయువిదలఁ । జెఱలువట్టి, జగము లన్నిటి నక్కట । బెగడుపఱిచి
[1]యొప్పనాపట్టి యెచ్చట । నున్నవాఁడొ. వెలమి సొంపార నీమదుల । కేల రావు.

మ. అకటా భాగ్యము లేమిఁ జేసి సుతుమా।యాసంప్రయోగంబునుం
బ్రకటం బైనబలంబు బాహుయుగళ।వ్యక్తసారంబు నై
నికసన్నాహము శస్త్రశస్త్రవిభవో।న్మేషంబు నీభంగి నూ
రక పోయెన్ విధిచేతఁ దప్పఁ దిరుగన్ । రా దంట దా మిథ్యగో. 1390

చ. తలఁచిన నిప్డు నావలనఁ । దప్పొకయింతయు లేదు నీకు ని
ట్టలుగఁగ నేల తొంటివిన।యంబును భక్తియు నెందుఁ బోయె స
న్నలజడిపాలు చేయఁ దగు।నయ్య రయంబున రాఁగదయ్య నీ
కలుషత మాని రాగమునఁ । గౌఁగిటఁ జేర్పఁగదయ్య పుత్రకా. 1391

శా. సారోదగ్రుఁడ వై ననీకతిమునన్ । సంగ్రామరంగంబులో
నారామముం బొలియించి కీశపతి సై।న్యంబున్ వెసం గూల్చి లం
కారాజ్యంబు తిరంబుసేయుదు ననం । గా నింతలో దుష్టదై
వారంభంబున నిట్టికీ డొదవె నీ।తాధారతం జెందితిన్. 1392

క. ఉరుబాహుబలము గల్గియు, వెరవిఁడి నై తేరకాని।విధమున నకటా
కరుణ యెదలోనఁ దలఁపక, దురమున జమువాత నిన్నుఁ । ద్రోచితి పుత్రా.

క. నా కెవ్వరు దిక్కింకను, శోకాంబుధిఁ గడతు నెట్లు । శూరత మై భూ
లోకాధిపనుతు ననిలోఁ, నేక్రియ నిర్జించువాఁడ । [2]నెట్టిది తెలఁగున్. 1394

---

1. యటుక యెచ్చోటనో పట్టియున్నవాఁడ, వేమి సొంపార. 2. నెట్టి తెలంగో.

క. అని తలమునిఁగినవగలం, దను మఱచి దశాననుండు | ధరపై మూర్ఛి
ల్లిన నంత మంత్రివర్గము, సనయంబునఁ దెలిపి పలుక | సంరబ్ధుం డై. 1395

తే. తెలిసి యేదిక్కుఁ జూచె నా | దివిజవైరి, పఱచి రద్దెస దనుజులు | భయము నొంది
చటులతన్ముఖనిశ్శ్వాస | జవనపవన,ధూతు [1]లగుమాడ్కిఁ లఘుతూల | భాతి గలిగి.

చ. కుటిలభ్రూ|కుటిలత్క్యధూమపటలీ | క్రూరంబు దుర్లక్ష్యదృ
క్పుటలౌహిత్యకరాళకీలలహరీ | పూరంబు లోలద్విశం
కటనిశ్శ్వాససమేధితం బగుసమ | గ్రక్రోధసప్తార్చిచే
జటిలుం డై దశకంఠుఁ డంతఁ బలికెం | జండాహవోల్లాసి యై. 1397

మ. నినుపారం దప మాచరించి గిరిశు | న్మెప్పించి శస్త్రాస్త్రము
ల్గాని శక్రాదిసురేంద్రదుర్జయుఁడ నై | లోకంబులన్ నాదుశా
సనమార్గంబున నిల్పి యుద్ధముల దు | స్సాధుండ నై ఘోరదుః
ఖనినాదంబులు లేక యుంటి నవిభం | గప్రాభవం బొప్పఁగన్. 1398

క. తనయుల మిత్రుల భృత్యుల,ననుజుల ననిఁ గూల్చె రాముఁ | డవనీసుతకై
దనుజు లెట దానవులభో, జన మగునను లెచట నిట్టి | చంచము గలదే. 1399

క. శిలలు సలిలములఁ దేలెడుఁ, జలమున నరు లసురవరులఁ | జంపెదరు ప్లవం
గులు పను లొనరించెదరు కు,టిల మయ్యెం గాలగతియు | దెప్పర మొదవన్.

వ. అని మున్నింద్రజిత్తుండు మాయాసీతం దునిమె నది బొంకగుటం జేసి యిప్పు డది
గదా నిజంబు కావించెద నని రోషంబున దశముఖంబులం బొమలు ముడివడ [2]దం
ష్ట్రామండలంబులు గనల నుల్కాలుంబోలె లోచనంబుల మిడుంగుఱు లురులఁ
జంద్రహాసంబుఁ గేలఁ దాల్చి పదవిన్యాసంబులం బుడమి గ్రుంగ వృద్ధప్రధానవ
ర్గంబు లిది యనుచితం బనుచుండ నాగ్రహంబున. 1401

రావణుఁడు సీతఁ జంపఁ బోవుట.

సీ. పెరిఁగినయాఁకటి | బెల్లున బెబ్బులి, వడి బాలమృగిఁ బట్ట | వచ్చుకరణిఁ
గోపంబు గదిరిన | ఘోరమై సింహంబు, కరిణిఁ గాఱింపఁగఁ | గదియుపగిది
మదము గ్రాలంగ సా | మజయూథనాథుండు, గమలినిఁ బెటాడఁ | గడఁగుమాడ్కిఁ
గరళంబు మొగమునఁ | గ్రమ్మ భుజంగము, మడరి శారిక మ్రింగ | నరుగుభంగిఁ
గరుణలేక మిగులఁ | గఠినాంతరంగుఁడై, రభస మొదవఁ జేరె | రావణుండు
పరమసాధ్వి రాము | భార్య భయంబున, డెంద మదరి తల్ల | డిల్లుచుండ. 1402

వ. అయ్యవసరంబున. 1403

క. వడి వీచుగాడ్పుతాఁకునఁ, బుడమిం బడుకదళిపోల్కిఁ | భూనందన త
ల్లడ మంది యొఱగె నిఁక నీ, వడువున దశముఖునిసిరియు | వ్రాలు ననంగన్.

---

1. లఘుతూలజాలవిభాతిఁ గలఁగి. 2. దంష్ట్రాగ్రంబులు దాటించుచు నుల్కాపాతంబులుంబోలె లోచనంబుల.

ఉ. వ్రాలి నిజాంతరంగమున వారనిశోకముచిచ్చు పెల్లునం
బ్రేలుచు దైత్యనాథుఁ గని బిమ్మిటిఁ బొందుచు దిక్కులేమికిం
జాలఁగఁ బొక్కుచున్ వగల సందడిచిక్కులఁ జిక్కి యెంతయుం
దాలిమి దక్కి సీత వితతం బగుకంపము నొంది యి ట్లనున్. 1405

ఉ. చలమున రావణుండు వడిఁ జూపఁగ నుగ్రత వచ్చె నాత్మజుం
డిలిగినశోకవేగమున నెంతయుఁ గోపము పట్టలేక వీఁ
డలిగిన వాసవాదిసురు లైనను నోర్తురె నన్నుఁ గావఁగాఁ
గలరొకొ దిక్కు మృత్యువుముఖంబునఁ జిక్కితి నెల్లభంగులన్. 1406

చ. గొనకొని యల్లనాఁడు పగ గొన్నవిధంబున నోటలేక నా
లినచల మొప్ప నూరు వెడలించి వనంబులపాలు చేసి యీ
యనుజునియింట నిట్టిచెఱఁ దార్చితి వేర్పడ నింత చేసియుం
దనియక చంపఁ దెచ్చితివి దారుణచేష్టితఁ బాపు దైవమా. 1407

చ. [1]కరమును బాపజాతి నయి కట్టిఁడి నై తెగునాకతంబునన్
ధరణివిభుండు రాఘవుఁడు తమ్ముఁడు దాను ననేకభంగులం
బొరిఁబొరి నిట్టియాపదలఁ బొందుచు నుండుటఁ జేసి యాత్మలోఁ
[2]బురపురఁ బొక్కుదుం దనదుపూర్వకృతంబు దలంచి స్రుక్కుదున్. 1408

చ. కడవఁగ రానినెవ్వగలక్రందున నుండుటకంటె వీనిచే
నడిదపుధారపాలు వడి ప్రాణము లిమ్మెయి నొక్కమాత్రలో
విడిచెద నెల్లజన్మముల వీరుఁడు రాముఁడ నాకు భర్త య
య్యెడు మని యాత్మలో నిలిపి నీశ్వరు రాఘవు నేకచిత్తనై. 1409

వ. అంత నచ్చేరువ నున్నదానవులు తమలో ని ట్లనిరి. 1410

మ. మది ఘోరం బనుచింత లేక కడుదుర్మానంబునం జేరె ను
న్మదుఁడై యింతి వధింపఁగా దనక యన్యాయంబు మైకొన్న నా
పద లేతెంచుట కేమి సందియము పాపం బిట్లు చేయం దలం
చి దశాస్యుండు దురాగ్రహంబునకుఁ జొచ్చెం గీడు వాటిల్లదే. 1411

క. వల దని మానుప నెవ్వరు, గల రిక్కడ ననఁగ నంతఁ గడఁగి సుపార్శ్వుం
డలుక శమింపఁగ ని ట్లని, పలికెన్ దశముఖుని నీతిపథధర్మమునన్. 1412

ఉ. తాత పులస్తి నీకు గుణధాముఁడు విశ్రవసుండు తండ్రి నీ
వాతతవేదశాస్త్రములు సాంగముగాఁ దగ నభ్యసించి వి
ఖ్యాతిగ ధర్మమార్గములయందుఁ బ్రవీణుఁడ వయ్యు నక్కటా
నాతి వధింపఁగాఁ దగునె న్యాయము దప్పినఁ గీడు పుట్టదే. 1413

1. కరమును బాపజాతియను గట్టిఁడియన్న గు. నా. 2. బురపురఁ బొక్కుచుందుఁ దనపూర్వ... స్రుక్కుచున్.

ఉ. అలములో నరేంద్రసుతుఁ డాత్మజుఁ గూల్చిన మాఱుసేయఁగాఁ
జాలక శోకరోషములసందడిఁ గోర్వక రావణుండు దు
శ్శీలమునం బ్రచండగతి సీత వధించె ననంగ నిట్టి నిం
దాలయమైనదుర్యశము నందుదురే యిది నీకుఁ బాడియే. 1414

క. [1]ఎల్లి రణంబునఁ గోపం, బెల్లను రాఘవులమీఁద నింకఁజు నెఱుఁగం
జెల్లింపు మనుచు మగుడను, బల్లిదుఁడై తోడితెచ్చెఁ బంక్తిగ్రీవున్. 1415

ఆ. మఱువరానిపుత్త్ర మరణశోకాబ్ధిలో, మునిఁగి తెలిసి రోషఘనతరంగ
తతులహతులఁజేసి దరిచేరఁగ్రుంగి వడి, మలసి రావణుండు కొలువు చొచ్చి.

సీ. రోషాధిదేవతారుధిరోపహారపా, త్రలభంగి నెఱ్ఱ కన్నులకుఁ దెచ్చి
ముడివడ్డబొమలచే మొగములు ఘనగుహ, విలయార్కమండలము లనఁ దనరి
దిగ్గజాధిపదంతదీర్ఘంబు లగుచున్న, కోఱలఁ గ్రొమ్మెఱుంగులు వెలుంగ
రదనఘట్టనములఁ బొదలినమిడుఁగుఱు, గము లోలి మిన్నెల్లఁ గలయఁబర్వ
జగము లన్నియు నొక్కట సమయఁజేయ, నప్పళించుకృతాంతుని ననుకరించి
కలయ రాక్షసకోటులఁ బిలికె నిట్లు, ధీరవారాశినాదంబు తేటపడఁగ.

ఉ. రెండు నిశాటులార యవలీలమెయిన్ బహుసైన్యయుక్తులై
పొండు ప్రతాప మేర్పడఁగఁ బోరిన రాఘవులన్ వధించి వే
రండు నిరర్గళం బగుపరాక్రమ మింపెసలార నంత నా
ఖండలముఖ్యనిర్జరులగర్వములుం బొలివోవఁ జెచ్చెరన్. 1418

వ. అని యాజ్ఞాపించునవసరంబున. 1419

క. కరితురగరథపదాతి, స్ఫురణంబులు చెలఁగ భూనభోవలయదిగం
తరములు నిండఁగ నార్చుచు, సురవైరులు గూడి రాజు శుంభద్గతులై.

క. పటుభేరీభాంకృతులును, బటహానినాదములు శంఖబహురావంబుల్
కటుకాహళనాదంబులుఁ, జటులములై పర్వె నోలి జగములు నిండన్.

—❖ మూలబలములయుద్ధము. ❖—

సీ. బృంహితంబులతోన పృథులఘంటారావ, ములు పదిదిక్కులఁ గలయఁ బర్వ
ఖురపుటధ్వనులతోఁ బరపైన హేషిత, ఘోషముల్ భూధరగుహల నిండ
[2]ఘనతరకింకిణీస్వనములతోఁ గూడ, నేమిశబ్దంబులు నింగి ముట్ట
నిగిడినశింజినీనిస్వనంబులతోన, సింహనాదంబులు చెలఁగుచుండ
గజములశ్వంబులరథముల్ కాల్బలంబు, పుడమియీనినచాడ్పునఁ బొలుపుమిగిలి
యెన్నఁగా గోచరము గాక యేపు మీఱె, లంక వెలువడె నెంతయు శంక లేక.

తే. ఇంతసేనకుఁ బోరంగ నిమ్ము సాల, దారణస్థలిఁ గావున వారిరాశిఁ
గలను గావింపఁ బూనినకరణి నెగసెఁ, జదలు మ్రింగుచుఁ బెల్లైనసైన్యరజము.

1. ఎల్లి టిరణమున 2. వరధుర్యకింకిణీ.

క. ఆవానరబలవారిధిఁ, ద్రావఁగ లంకాబ్ధి వెడలె దర్పం బెసఁగన్
దేవారిబాడబాగ్నులు, వావిరి శస్త్రార్చు లేచి వడి మండంగన్. 1424

మ. ఘనవాలమ్ములు దాఁకి చుక్క లురులంగా నుద్యమత్పాదఘ
ట్టనలన్ ధారుణి గ్రుంగ శైలములు చూర్ణల్ నేలపై వ్రాల లం
ఘనచాతుర్యము నింగి క్రిందుపఱుపంగా వానరానీకముం
గినుకం బొంగుచు నేఁగుదెంచి వడిఁ దాఁకెన్ వీఁకమై నత్తఱిన్. 1425

మ. దివిషద్వైరులమీఁద వానరవరుల్ దెంపారఁ గోరంబుగా
నవనీజంబులు పర్వతంబు లసమానానేకపాషాణము
ల్దివి నీరంధ్రముగా వెసం బఱపి ఘూర్ణీజాలముల్ నేల బి
ట్టవియంగా నెరయించి పేర్చిరి రణవ్యాపారపారీణులై. 1426

మ. దనుజానీకము నాగ్రహంబున భుజాదర్పానురూపంబు గాఁ
దనువుల్ దాల్చినయంధకారములచందంబుల్ గడుర్ వింతగా
ధనురాద్యాయుధరోచు లోలిఁ జదలన్ దట్టంబులై పర్వఁగాఁ
జనుదెంచెం దటిదుజ్జ్వలాసితఘనశ్లాఘైకజంఘాలమై. 1427

లయగ్రాహి. అంట వడిఁదాఁకి యదరంటఁ బడవ్రేసి పెనుమంట లెగయం జటి
చిటంటతన మొప్పన్, వెంటఁబడి పట్టుకొని గొంటుతన మేర్పడఁగ గంటివ
డఁదాఁచుచు మగంటిమి దలిర్పన్, వెంటిగొనఁగా నులిచిమింటి కెగయన్ వయి
చి మంటఁ లయం గజదిపిబంటుతన మిల్లె, వెంటఁ దనరాఁరగనుగంటకితులై
విబుధకంటకులు వానరులు నొంటిమెయిఁ బోరన్. 1428

సీ. రాక్షసీకబరీభరంబులచాడ్పున, విపులాంధకారంబు విరియఁ బాఱ
దానవీహారముక్తాఫలంబుల క్రియఁ, బొరిఁబొరిఁ దారలపొలుపు దొలఁగ
నసురీముఖోజ్జ్వలహాసంబుకైవడి, నిండారువెన్నెలనిక్కు దక్క
నక్తంచరీలోచనంబులపోలికి, నసితోత్పలంబులపసను బొలియఁ
గపులముఖములతోఁగూడఁ గమలచయము
లోలి వికసింప నభ్రంబునొఱపుతోన
జనపతులనెమ్మనములు ప్రసాద మంద
నుదయశైలంబుపైఁ దోఁచె నుష్ణకరుఁడు. 1429

వ. అంత నయ్యుభయబలంబులుఁ దలపడునప్పుడు కొండలపాటులం జదియువారును దరువులవ్రేటుల వ్రాలువారును గండశైలంబులతాఁకున గుండుగిలువారును ముష్టివిఘట్టనంబుల బిట్టవిసిపడువారును జానుఘాతంబుల రోఁజువారును జరణతాడనంబుల మరణంబు నొందువారును గులిశకఠినమస్తకాభిఘాతంబుల నురంబులు పగులువారును బార్ష్ణిఘాతంబులఁ బంచత్వంబు నొందువారును గూర్పర

ప్రహారంబుల నూర్పులకుఁ బాయువారును నాభీలవాలకాలపాశంబులఁ బొడ వడంగువారును ఖరనఖరవిదారణంబులం గూలువారును గరవాలంబులఁ ద్రెళ్లువారును దారుణదంతనిపీడనంబులఁ దెరలువారును గడకాళ్లు వట్టి వీచివైచినం జదియువారును నగురాక్షసులును, దైత్యనికాయంబులగదాఘాతంబులఁ గదల లేనివారును ముసలంబులమోఁదులం గసిబిసియగువారును ముద్గరంబుల మూర్ఛిల్లువారును భిండివాలంబుల గుండెలవియువారును దోమరంబుల నామం బడంగువారును బరశువుల నఱకంబడువారును గరవాలంబులఁ దుత్తునియ లగువారును గుంతంబుల గుదులై కూలువారును గటారుల మర్మంబులు విచ్చి త్రెళ్లువారును జక్రంబుల ఖండితు లగువారును భల్లంబుల లూనమూర్ధు లగువారును నైయున్నబలీముఖులును గలిగి, మఱియును దెగినచరణంబులును దునిసినజంఘలును విఱిగినతొడలును రెండై యున్నమధ్యంబులును బగిలినయురస్స్థలంబులును మురిసినమణిబంధంబులును బరిచ్ఛిన్నంబు లగుకూర్పరంబులును నికృత్తంబు లగుభుజమూలంబులును విపాటితంబు లగుశిరంబులును గలిగి యవిచ్ఛిన్నరుధిరప్రవాహంబు తరంగిణియును శరకుంతఖడ్గంబులు మీనంబులును గళేబరంబులు మకరంబులును శిరస్త్రాణంబులు గమఠంబులును దుమురులైనభూషణమణిసమూహంబు లిసుకయు వికీర్ణంబు లగుమస్తకంబులు పుండరీకంబులును బ్రకీర్ణకంబు లగుప్రకీర్ణంబులు హంసలును విలోలంబు లగుకేశసముదాయంబులు శైవాలంబును మేదోమాంసమస్తిష్కపటలంబు కర్దమంబునుం గా నిట్లపూర్వంబును మహాఘోరంబును నగుసంగ్రామరంగంబున. 1430

తే. గిరులు గిరులును గరులును గరులు హరులు
హరులు శరభములును వరశరభములును
గండభేరుండములును భేరుండములును
బోరుకై వడి నిరువాఁగుఁ బోరె నెలమి. 1431

చ. కరిఁ గరితోడ ద్రేసి తురగంబును నొక్కతురంగమంబుతోఁ
బొరిగొని తేరు తేరిపయిఁ బొల్పగలించి యదల్చి దైత్యు నొ
క్కరునిపయిన్ మఱొక్కరుని గ్రచ్చఱఁ దాఁచి వధించి రిట్లు వా
నరులు వివర్ధమానజయనాదతిరోహితరోదసీకులై. 1432

చ. చలముం జేవయు బీరమున్ బిరుదులున్ సంరంభముల్ సాహసా
చలభావంబులుఁ బంతముల్ నెఱపుచున్ శస్త్రాస్త్రజాలంబులం
గలయం గప్పుచుఁ ద్రుంచుచున్ నుఱుముచున్ ఖండించుచుం జీరుచుం
బెలుచం జంపెను వానరాలిఁ బలభుగ్బృందంబు దుర్వారమై. 1433

సీ. రథులు గుఱ్ఱములు సారథులును రథములుఁ, గూలంగఁ గొండలు గుప్పిగుప్పి
యారోహకులతోన యగ్గజంబులు ద్రుగ్గ, సాలవృక్షంబులఁ జదిపి చదిపి

ఘాతులతోన తురంగముల్ చదియంగ, నడరుచుఁ బిడికిళ్లఁ బొడిచిపొడిచి
వరపదాతుల ఘనవాలాగ్రములఁ గట్టి, తిగిచి జీవము పోవఁ ద్రిప్పిత్రిప్పి
తన్ని చీరి కఱచి తాటించి యొండొంటి, తోన విసరి వైచి దోర్బలంబు
మెఱసి పోరి రిట్లు నెఱయఁగఁ బ్లవగులు, మిగుల సమరగణము పొగడుచుండ.

లయవిభాతి. తఱిమి వెన రక్కసుల వెఱచఱవఁ బట్టుకొని పఱిపఱిగ వే తలలు
నుఱిపి యవలీలన్
నుఱుములుగఁ ద్రొక్కి వడి నెఱఁకు లగలం జదిపి నెఱి చెడఁగ నెమ్ము లొగి
విఱిగి తునియంగాఁ
బఱపి గజబృంహముల కుఱికి ఘనదంతములు పెఱికి తెగిమోఁది మద [illegible]
మఱిగి ధర మ్రొగ్గన్
నెఱపి తురగమ్ములకుఁ జుఱు కొదవ నెత్తురులు వఱద లయి పాఱఁ గవ
లుఱక సమయింపన్. 1435

క. ఏచినబలములతో రజనీచరులుం జలము గలిగి నిష్ఠురతరనా
రాచములు మునుఁగ నేసిరి, చూచుసురల్ దల్లడిల్ల స్రుక్కక హరులన్.

మ. పరిఘప్రాసకఠోరకోణపరశుభ్రాజిష్ణుశూలాస్త్రము
ద్గరచక్రక్రకచోగ్రశక్తిముసలోద్యద్భిండివాలాసితో
మరభల్లాతతఖేటపట్టిసకచర్మప్రోద్యమత్కార్ముక
క్షురికాద్యాయుధహస్తులై దితిజు లస్తోకప్రభావంబునన్. 1437

ఉ. ప్రేసియుఁ జీరియుం బొడిచి వీచియు గ్రుచ్చియుఁ జించి త్రుంచి బి
ట్టేసియుఁ గూల్చియుం బగుల నెమ్ములు రాల్చియు గ్రుచ్చి నుగ్గుగాఁ
జేసియుఁ గంఠముల్ దునిమి చిందఱవందఱ గాఁగఁ దోలినం
గీశులు భీతిఁ బొంది తమకించుచు రాఘవుమర్వు సొచ్చినన్. 1438

—శ్రీరాముఁడు మూలబలంబుల నుగ్గాడుట.—

చ. వెఱవకుఁ డంచు వానరుల వీరవరేణ్యుఁడు పల్కి కిన్క పెం
పెఱుకపడంగఁ గన్నుఁగవ నించుక యెఱ్ఱఁదనంబు తోఁపఁ గ్ర
చ్చఱఁ దనక్రేవ నున్నఘనచాపము దాల్చి యసంభ్రమంబునం
జిఱునగ వొప్పఁగా వితతశింజినిరావము చేసె నత్తఱిన్. 1439

మహా. కుతలం బట్టట్టు వీఁగెం గులగిరు లొఱగెం గూర్మనాథుండు గ్రుంగెం
జతురంభోధుల్ గలంగెన్ సకల మగుదిశాచక్ర మల్లాడె దిగ్దం
తితతుల్ చెల్వేది మ్రొగ్గెన్ దినమణి యదరం దేరు దప్పంగఁ బాఱెన్
దితిజానీకంబు లెల్లన్ ధృతి సెడి బెదరం దేజముల్ మాయఁజొచ్చెన్. 1440

క. పెనుమంచు గవియుచందం,బున శరములు దఱుచు పఱవ భూగగనంబుల్
చన నిశ్చయింప నరుదుగ, ఘనతిమిరము పొదివె దిశలఁ గలయఁగ నంతన్.

క. గిఱిగొన్న యంపకోలల, తఱుచున దానవులు తెరువు దప్పుచు రాముఁ
నెఱియారఁ గానఁగా లే, కఱిముఱిగా విఱిగి చెదరి రందఱుఁ బెలుచన్.
క. చాపాభ్యాసప్రౌఢిమ, చూపఱు మెచ్చంగ రాజసూనుఁడు దైత్యా
టోపంబు పెంపు దూలఁగఁ, దూపులు గీల్కొలిపె సమరదుర్దమలీలన్. 1443
మ. నిమిషార్ధంబున నబ్బలంబు గలయన్ నిస్సీమబాణాళి భూ
రమణుం డేసిన రోమకూపముల దుర్వారంబుగా నాటి దు
ర్గమభావంబున నంబరంబు దెసలుం గానంగ రాకుండఁ గ
ప్పె మహాధ్వాంతము దుర్విభేదగతితో భీమత్వసంపాది యై. 1444
క. అనిఁ గూలుదితిజతతియా, ర్తనినాదము రామవిభుశరంబులు వే నిం
డినఁ బట్టక వడిఁ బగిలెడు, వనజభవాండంబురవము వడువునఁ దనరెన్. 1445
క. పరివేషమధ్యగతుఁ డగు, తరణిక్రియన్ మండలీకృతస్థిరచాపాం
తరమున రఘుపతి పొలిచెను, వరకరసాయకసహస్రవలయము మెఱయన్.
సీ. నిడుదబాణంబులు నెఱఁకులు నాటినఁ, గాలుసేయాడక సోలువారుఁ
బగుమనారాచాదిపరిపీడితాంగులై, వస మఱి యూరక వనరువారుఁ
గ్రూరార్ధచంద్రాస్త్రకృత్తోరుబాహులై, మునుకొని మురమురమూల్గువారు
నుగ్రసాయకంబుల నురములు పగిలిన, మొనసి నెత్తుటిలోన మునుఁగువారు
సొలసి మూర్ఛిల్లి యొక్కింత దెలియువారుఁ, దెలిసి కైదువులంకించి నిలుచువారు
నిలిచి యెప్పటి పోరఁగ నిగుడువారు, నిగిడి జమునిల్లు చేరఁగ మొగియువారు.
వ. అయిరి మఱియును. 1448
తే. ఒక్కశరమునఁ బెక్కండ్ర నుక్కడంచుఁ
బెక్కుతూపుల నొక్కని స్రుక్కఁ గూల్చు
ఘోరశరములఁ గొందఱ గుదులు గ్రుచ్చు
నస్త్రశయ్యలఁ గొందఱ నడఁగ నునుచు. 1449
ఆ. చెలఁగి కృషికుఁ డొక్క చేను చేయఁగఁ బూని, తఱుచు టడవిగలయఁ దఱిమి నఱక
నొక్కటొకటి మీఁద నొగిఁ గూలుచాడ్పునఁ, బడుగుఁ బేకపగిదిఁ బడిరి రిపులు.
చ. చలమున నస్త్రపాణు లయి జన్యతలంబున మానవాధిపు
న్గెలిచెద మంచు వచ్చి చొర నేరక దట్టము లైన రాముపై
న్మలుకులపాలివార లయి మోహముఁ [1]జుబ్బనచూఱ గాఁగ దై
త్యులు నొకమాత్రలో నిలిగి రుగ్రరణంబున నిర్వ్యథంబునన్. 1451
వ. మఱియు రఘునాథుండు సాయకంబులం దలలు నఱకియు మెడలు ద్రుంచియుఁ జేతులు ఖండించియు నురంబులు వ్రచ్చియు నుదరంబులు చీరియుఁ దొడలు దుమురుచేసియు జంఘలు విఱిచియుఁ జరణంబులు గుత్తులకుం ద్రెంచియు మర్మం

1. నచ్చిన చూర గాఁగ.

బులు నొప్పించియుఁ జర్మంబులు సించియు బొమిడికంబులు పగిలించియు ధను రాదిసాధనంబులు నుగ్గుసేసియు గొడుగులు గూల్చియుఁ గిరీటమణులు రాల్చి యుఁ జామరంబులు ద్రుంచియుఁ గేతనంబులు దునుమాడియు విహరింపఁ బును కలతునుకలుఁ బ్రేవులప్రోవులు నెమ్ములయుమ్ములును మెదళ్లకుప్పలును బీనుంగు లైనయేనుంగులును జిట్టనం దిరిగి కూలుగుఱ్ఱంబులును మనోరథంబులతోన భగ్నంబు లగురథంబులును నొక్కండడ కావించి యుగావసానసమయసమవర్తి యుంబోలె విజృంభించిన. 1452

చ. ఇదె రఘుపుంగవుం డెదిరె । నెక్కడికిం జనవచ్చు నింక న
ల్లదె రఘునాథుబాణతతి । యక్కడివాఁ డెట కేఁగెనొక్కొ నాఁ
డిదె యదె వచ్చెఁ బోయె మఱి । యెప్పటి ముంగర నున్నవాఁడు వే
చదుపఁగఁ జొచ్చె నంచు దనుజప్రవరుల్ గలయంగఁ బాఱఁగన్. 1453

ఆ. సమరదుర్జయుండు । సమ్మోహనాస్త్రంబు, మెఱసి దనుజకోటి।మీఁదఁ బఱపె
నెదిరిఁ దమ్ము నాజి।నెఱుఁగక [1]తమలోన, భ్రమసి పోరి కులుకు। క్రమము దోఁప.

వ. సమ్మోహనం బగుగాంధర్వాస్త్రంబుసామర్థ్యంబునం జేసి. 1455

చ. ఒకఁడు పదుండ్రు నూర్వురు స।హస్రతతి వేవురు నొలి లక్షలుం
బ్రకటముగాఁగఁ గోట్లు నయి । రాఘవుఁ డాహవభూమి దైత్యసై
నికులకుఁ గానఁగాఁబడియె । నిక్కువ మైబహుసంగరక్రియా
ధికనిపుణత్వ మేర్పఱిచి । ధీరత నెక్కడఁ జూడఁ దాన యై. 1456

వ. పదునాలుగువేలుగుఱ్ఱంబులను బదునెనిమిదివేలు మత్తగజంబులను లక్షరథంబు లను రెండులక్షలు మహావీరరాక్షసులను నొక్కనిమిషంబున సమయించి యార సాతలంబుగా ధరాతలంబున మస్తిష్కమాంసాస్థిమహారాసులు గావించి యు ల్కాసహస్రసమంబు లై తేఱిచూడఁ దరంబుగాక తటిద్వల్లీనిభంబు లై మిడుఁ గుర్లు వెదచల్లుచు నురవడిం దాఁకురఘుపుంగవుశరంబుల కోర్వక హతశేషు లయినయాతుధానులు గవు లార్వ లంక సొచ్చిన. 1457

క. సురవిద్యాధరకిన్నర,గరుడోరగయక్షసిద్ధ।గంధర్వాదుల్
సరసిజహితవంశధురం,ధరు రాము నుతించి రెలమిఁ । దత్త్వజ్ఞంగిన్. 1458

—✿ లంకాపురస్త్రీలు శ్రీరామునిపరాక్రమంబు గని చింతించుట. ✿—

ఉ. అంతట లంకలోనఁ దగ । నక్కడ నక్కడ వాడవాడలం
గ్రంతలఁ గ్రంతలన్ నిలిచి । క్రచ్చఱ మూఁకలుగట్టి క్రవ్యభు
క్కాంతలు విస్మయంబు నధి।కం బగుశోకముఁ బొంది యాత్మలో
నెంతయుఁ దూఱఁగా వగచి । యిట్లని పల్కిరి పెక్కుభంగులన్. 1459

మ. తరుణీ చూచితివే రఘూద్వహుభుజా।దర్పంబు నీచంద మి

---

2. పడియును, భ్రమసి పోరు గలుగుక్రమము.

ద్ధరణిం గంటిమె వింటిమే త్రిజగతీధారేయభావంబు ను
ద్ధురకోదండసమగ్రకౌశలము నస్తోకప్రభావంబు సం
గరచాతుర్యము నస్త్రసంపదయు నుగ్రస్ఫారవిక్రాంతియున్. 1460

చ. అరుదుగఁ జెప్పనైనఁ దడవయ్యెడు రాముఁడు విల్లు వట్టినన్
దురమునఁ దిట్టినట్లు గతదోర్బలులై రజనీచరుల్ పోరిం
బోరి నిమిషార్ధమాత్రమునఁ బొల్పును రూపును దప్పి సంగర
స్ఫురణము దూలి వే పొలిసి పోయిరి కాలునిప్రోలు సూడఁగన్. 1461

క. వరవారణాయుతంబులు, నురుతరజవతురగవివిధయూథశతంబుల్
గురురథసహస్రములుఁ గా, ల్వురలక్షలుఁ గూలె రాఘవునిరణలీలన్. 1462

శా. వాలాగ్రంబునఁ బంక్తికంఠుని వెసన్ వ్రాలంగ బంధించి నా
నాలీలం జతురంబురాసుల నసూనస్ఫూర్తిమై ముంచి యు
ద్వేలం బైనభుజాబలంబున జగద్విఖ్యాతుఁ డై యున్నయా
వాలిం గూలిచె నొక్కబాణమున దుర్వారుం డితం డెన్నఁగన్. 1463

క. పుష్కలకరుణాసంధా, విష్కరణము తేటపడఁగ వేడుకతోడన్
దుష్కరముగ రవితనయుం, గిష్కింధకు రాజుఁ జేసెఁ గేవలనరుఁడే. 1464

సీ. కమలజాండము నొక్కకడి చేసికొని మ్రింగ
నగుదెంచుచున్న కాలాంతకుండొ
జగము లన్నియు నొక్కమొగి నమయింపంగ
మెయికొని గమకించుమృత్యువొక్కొ
భూతకోటుల నెల్లఁ బోరిఁబోరి నొకమాత్ర
రూపఱఁ జేయునారుద్రుఁడొక్కొ
కమలగర్భుఁడు వినోదమునఁ జేసిన వచ్చు
పొలుపైన[1]జంత్రంపుబొమ్మయొక్కొ
యనఁగ నింద్రాదిసురులకు మనసులోనఁ, గలయ నాటినశల్యంబుకరణి నున్న
కుంభకర్ణునిరణమునఁ గూల్చెనితఁడు, గులిశహస్తుండు కుధరంబుఁ గూల్చుపగిది.

మ. కులగోత్రప్రతిమానసారుఁ డనియుం గోదండపాండిత్యని
శ్చలసత్త్వుం డనియున్ భుజంగకులరాజస్ఫీతదృప్యద్భుజా
ర్గళరూఢుం డనియున్ రఘుప్రవరు నాకర్ణించియున్ నేరమిం
జల మొక్కింతయు డింపఁ డిట్లు దనకున్ శక్యంబు గా కుండఁగాన్. 1466

చ. అతులపరాక్రమాప్రతిము నయ్యతికాయుని మేఘనాదు న
ప్రతిహతశౌర్యభూషణుఁ [2]దపారబలుం దగులక్ష్మణుండు సం
తతశితబాణపూరముల దర్ప మడంచి వధించె వానరుల్

1. జంత్రంపుబొమ్మ. 2. నిరర్గళసత్త్వుఁడు లక్ష్మణుండు.

దితిజులఁ బట్టి కూల్చెదరు । దేవబలంబునఁ జేసి యెంతయున్. 1467

క. సుతులు మృతు లయిరి తమతమ, పతు లీల్గిరి సోదరులును । బడి రని లంకన్
వితత మగువగలఁ బొగులుచుఁ, బ్రతిహతమతి నున్నయట్టి । ప్రమదాజనముల్.

క. తనపాలిమృత్యుదేవతఁ, గొనివచ్చినమాడ్కిఁ బాప । కుటిలాత్మకుఁ డై
యనయమున సీతఁ దాఁ దెచ్చినవాఁ టంగోలెఁ జేటు । చేకుఱఁ జొచ్చెన్.

తే. గుణగణోత్తరుఁ డగువిభీ । షణునిపలుకు, వినక చెడియెను దశకంఠుఁ । డనయవృత్తి
విధికృతంబునఁ జెడ నున్న । వేళలందు, బుద్ధిఁ బరికింప కూరక । పోలియుఁగాదె.

తే. ఎంతయేనియుఁ దగబుద్ధి । మంతుఁడయ్యు, మెఱయనయవిధిగప్పక । మెలఁగిచేయు
నేర్పుగలఁడయ్యుఁ జెడువేళ । నిహతమతికిఁ, దవిలిసద్బుద్ధు లెవ్వియుఁ । జెవులఁ జొరవు.

క. అమరాజయ్యులు దితిజులు, సమరంబున నాఁడునాఁడు । సమయుచు నుండన్
సమకొనఁడు సీతఁ బుచ్చఁగ, బ్రమసియొకో యకట యిట్టి । పాపము గలదే.

వ. అని మఱియుఁ బెక్కుభంగులఁ బలుకుచు వగచుచుఁ దనదుర్వ్యసనంబుల దూఱుచు స్వజనమరణశోకంబులం దాఱుచు నున్నపురసత్త్వంచరీజనంబులకలకలం బాకర్ణించుచు లంకావల్లభుండు రోషశోకపరాభవంబులు ముప్పిరిగొన సంవర్తానలుభంగిఁ గనలుచు యుగాంతసమయసముత్థితద్వాదశార్కమండలంబులొక్కటియైనచందంబునం బ్రకాశంబున దురవలోకుం డగుచు కల్పాంతకుపితుం డగుఫాలాక్షుపగిది దుస్సహుం డై మత్తవేదండగమనుం డగునున్మత్తుని సింహసంహననుం డగువిరూపాక్షునిఁ బిలిచి మీర లపరిమితవాహినీసమేతుల రయి సమరంబునకుం జనుండు నాకు నొక్కజైత్రం బగురథంబు దేరం బనుపుం డని తానును యుద్ధసన్నద్ధుం డయి. 1473

—❖ రావణుఁడు రెండవమాఱు యుద్ధమునకు వచ్చుట. ❖—

సీ. నేఁ డాజిలోపల । నృపకుమారులఁ బట్టి, శరపరంపరలచే । సమయఁ జేసి
వివిధమహాభూత । బేతాళడాకినీ,గణము లన్నియు నన్నుఁ । బ్రణుతిసేయఁ
బలలంబు నెత్తురు । బహువిధమస్తిష్క, మేదఃప్రపూరంబు । మేదురముగ
బలు లిచ్చి వనచర । బలనికాయంబున, కాయఖండంబులు । గలయ దెసలఁ
గాకజంబుకకౌశిక । కంకగృధ్ర,ములకు నెంతయుఁ దృప్తిగా । ముదము మీఱఁ
జల్లుఁబోరాడి బహుపిశా । చములు మెచ్చఁ, జించి చీరెద నొంచెదఁ । జెదరిపఱవ.

క. నిస్సీమాభిక్రమమున, దుస్సహనిరపాయవిపుల । దోస్సారమునన్
నిస్సహశరశక్తుల నే, దుస్సాధుఁడఁ జక్రి కయిన । ధూర్జటి కయినన్. 1475

శా. గీర్వాణాధిపుఁ డస్మదున్నతధనుః । క్రేంకారరావంబునన్
గర్వం బేది తొలంగఁ బాఱి ముఖరం । గద్బాణధారాహతిన్
దుర్వారప్రథితప్రతాపశిఖని । ర్ధూతార్చి యై యార్చినన్
సర్వాంగీణసమగ్రకంపమున నా । ఖండలార్తుఁ డై పాఱఁడే. 1476

ఉ. దండధరుండు మున్ను దనదండము నాపయి వైవ నుద్ధతి
న్మండుచు వచ్చుదానిఁ గని నాద మెలర్పఁగఁ బట్టి క్రమ్మఱం
జండతరంబుగా నతనిసైరిభనాథుని వ్రేసి వాని ను
ద్దండతఁ గిట్టి నేలఁ బడఁ దన్నిననాఁకు సమానుఁ జూపుఁడా. 1477

చ. వననిధినాయకుండు మును వారక పాశము మీఁద వైవ [1]దా
నన వల వైచి వాని జతనంబుగ మద్రథకేతుయష్టితో
డన తగులంగఁ గట్టి వికటభ్రుకుటీకుటిలాస్యవిస్ఫుర
ద్దనుజులు సేయుతర్జనలఁ దాలిమి దూలఁడె నిర్విచేష్టుఁ డై. 1478

చ. బెగడక శూల మెత్తుకొని భీమతరంబుగ నోర మంటలుం
బొగలును గ్రమ్మ దేర మును బోరన మృత్యువు వచ్చి తాఁకినన్
దిగు లొదవించి పెద్దగదఁ ద్రిప్పుచు నొంచి ధరిత్రిఁ గూల్చి పె
ల్లుగ నెడలించి నాలుక విలూనము సేయక కాచి పుచ్చితిన్. 1479

క. సుగ్రీవుని దగ నొంచి య,సుగ్రీవుం జేయువాఁడ సుదృఢాస్త్రములన్
[2]నిగ్రీవునిఁగాఁ జేసెద, నుగ్రాహవసంప్రధారణోత్సాహమునన్. 1480

వ. అని రణవ్యగ్రాయమానచేతస్కుం డై. 1481

సీ. చండభానుప్రభామండలంబులఁ బోలు,కుండలంబులచేతఁ గొమరు మిగిలి
దిగ్దంతికరదండదీర్ఘహస్తంబునఁ, గమనీయమణిమయాంగదము లమరఁ
దపనీయగిరితటవిపులవక్షంబునఁ, దారహారంబులు దళుకు మిగుల
నుదయాద్రిశిఖరసమున్నతశిరముల, దశకిరీటంబులు దనరుచుండఁ
బరశుపట్టిసకరవాలపరిఘశూల, చక్రకార్ముకతోమరశక్తికుంత
సాయకాదికసాధనసహితుఁ డగుచు, ననుపమేయత దశకంఠుఁ డొనరె నంత.

సీ. పక్వ మై పగిలెడుబ్రహ్మాండ మనఁ బటు,పటహనిక్వణము లుత్కటము గాఁగ
ఘూర్ణమానార్ణవఘుమఘుమాయితము లై, భేరీనినాదముల్ బిట్టు మ్రోయ
దట్టించులయభైరవాట్టహాసముక్రియ, శంఖనాదంబులు సరవి నిగుడ
సంవర్తఘనముక్తచటులాశనులఁ బోలి, కాహళరవములు గలయఁ బర్వ
సమరకౌతుకమునఁ జతురంగసేనలుఁ, దన్ను బలసి కొల్వ దశముఖుండు
నురుజవంబుతోడ నుత్తరద్వారంబు,నందు వెడలుచున్నయవసరమున.

మ. వసుధామండలి సంచలించెఁ గలయన్ వారాశి ఘూర్ణిల్లె నా
కన మెల్లం బొరిఁ గప్పెఁ జీఁకటులు దిక్చక్రంబు గంపించె న
శ్వసమూహంబులు మ్రొగ్గె మత్తకరటివ్రాతంబు దూలెన్ రథా
త్తసమస్తాంగము భగ్న మై పడియె నుత్పాతప్రవేగంబుగన్. 1484

మ. కురిసెన్ నెత్తురువాన మేఘగణముల్ క్రూరాశనిస్తోమముల్

1 దానన దలవైచి. 2 విగ్రీవు నొందఁ జేసెద.

దూరఁగన్ మిన్నక జంబుకవ్రజములుం । గోఁడ్గోన వాపోయె ని
ష్ఠురభంగిం బడియెన్ మహోల్కలు పరిక్షోభంబుగా గాలియుం
బరుషప్రక్రియ వీచె శర్కరిల మై । ప్రత్యంతదేశంబునన్. 1485

వ. అంత నిశాచరచక్రంబు కార్చిచ్చు కాననంబునకుం గవియుకరణిఁ గపినికాయంబునకుం గవిసి యరవాయిగొనక కరవాలంబుల ఖండించి గదలఁ జదిపి ముసలంబుల విసరివ్రేచి కూల్చి యత్తలంబుల నొత్తి వియత్తలంబునకుఁ బోఁ జిమ్ముచు ముద్గరంబుల మొగ్గరంబులు విరియఁ గొట్టుచుఁ బంతంబు లొదవఁ గుంతంబులఁ బొడుచుచు నంకుశంబులఁ గొంకుగొనక నొప్పించుచుఁ దోమరంబుల భీమరంధ్రంబులు సేయుచుఁ బట్టిసంబుల నెట్టి పట్టి సమయించుచుఁ గఠారంబులఁ గఠోరంబుగా గ్రుచ్చుచుఁ గుఠారంబుల హఠారంభంబుగా నఱకుచుఁ బరిఘంబులఁ బరిఘట్టనంబు సేయుచుఁ [1]దలపాటు దలంపక తలపాటుసేయు వనచరులును దలపడి సాలంబులు వైచియు రసాలంబులు గురిసియుఁ దాలంబులు పఱపియు హింతాలంబులు వేసియుం గుద్దాలంబులు నిగిడించియుఁ దమాలంబుల నొప్పించియుఁ గృతమాలంబుల సుక్కించియు పనసంబుల పనసము దింపక మోఁదియు ఖదిరంబులఁ జర్జరంబులుగాఁ గొట్టియు నక్షంబుల వక్షంబులు నొగిలించియుఁ బర్వతంబుల గర్వతంత్రంబులు మాన్పియు నుపలంబుల నుపలంఘనంబులు దప్పించియుఁ దలప్రహారంబులఁ దలలు పగిలించియు [2]విజృంభించునవసరంబున.

శా. ముల్లోకంబుల కెల్లనాఁ డెడఁజేలో । ముల్లైనపౌలస్త్యుఁడున్
భల్లంబుల్ వడి వెల్లిగొల్పి సమర । ప్రారంభ వేల్లద్ధను
ర్వల్లీజ్యాఘననాదమేదురసభో । రంధ్రంబుగాఁ గీశులన్
భల్లానీకము నొల్లఁబోవ శరసం । పల్లంపటాస్ఫోటుఁ డై. 1487

తే. అదరి యొక్కొక్కనిశితసా । యకము వఱపి
నిక్కి పెక్కండ్ర నొక్కట । నుక్కడంచి
కుఱుశరంబులఁ గొందఱ । గుదులు గ్రుచ్చి
నిమిషమాత్రన కపిసేన । నెఱయఁ ద్రుంచె. 1488

క. తరువులు దునుకలుసేయుచు, గిరివరముల నుగ్గుసేసి । కీశబలంబుల్
వెరవారఁ బించమడఁచుచు, శరములు నిగిడించె భువియుఁ । జదలును నిండన్.

వ. గంధమాదనుఁ బంచవిశిఖంబులఁ బ్రత్యేకంబ నలనీలపనసులను దశాశుగంబుల ద్వివిదు షడస్త్రంబుల వినతు సప్తసాయకంబుల మైందుఁ బంచమార్గణంబుల గజుని సప్తరోపంబులఁ గుముదునిం బంచపృషత్కంబుల శరభుని బంచాశత్ప్రదరంబులం దారక్రతుల నేకైకకలంబంబున నంగదునిఁ బదిబాణంబుల నాంజనే

1. నున్నం దలపాటు దప్పక తలపాటు చేయువానరులును.
2. దంతంబుల ముష్టిఘాతంబులఁ బాదంబుల వాలంబుల దైత్యసమూహంబుల నొప్పించి విజృంభించు.

యుని వింశతిశస్త్రంబుల గవాక్షు దశనారాచంబులఁ గ్రథను నవతిభల్లంబుల
నొప్పించి మఱియు వివిధప్రకారంబుల నంపగములు నించుచుండ. 1490

—సుగ్రీవుఁడు విరూపాక్షోన్మత్తులఁ జంపుట.—

సీ. శిరములు దెగిపడ ♦ ధర మ్రగ్గువారును, మొగిఁ బాదములు ద్రెవ్వ ♦ మ్రొగ్గువారు
జంఘలు విఱిగినఁ ♦ జనలేనివారును, నూరులు నుగ్గైన ♦ నొరగువారు
నడుములు రెండైనఁ ♦ బడి చచ్చువారును, నురములు పగిలినఁ ♦ దెరలువారుఁ
గరములు దునిసిన ♦ మురువు దప్పినవారుఁ, బొట్టలు చీలినఁ ♦ దొట్టువారు
నోలి నెత్తురుటేటిలోఁ ♦ దేలువారు, మొనసి మాంసపురొంపిలో ♦ మునుఁగువారుఁ
జేతులాడక యూరక ♦ చిక్కువారు, వెడఁదపోటులఁ బ్రాణముల్ ♦ విడుచువారు.

క. అనిలోన దానవేశ్వరు, ఘనశరముల కోర్వలేక ♦ కపిసైన్యంబుల్
కనుకనిఁ బఱవఁగఁ గని యా, యినసూనుఁడు మగుడనిల్వ ♦ నెంతయుఁ గడఁకన్.

శా. హేలోత్పాటితశైలుఁడై కపికులా♦ధీశుండు సుత్రామసుం
డాలోదారగతిక్రమంబున నిరూ♦ఢక్రోధుఁడై వచ్చుచో
నాలోనం గుపితాంతకుం డన విరూ♦పాక్షుండు దా వచ్చి యా
భీలత్వంబున వానిమీఁదఁ బఱపెన్ ♦ భీమాస్త్రముల్ చెచ్చెరన్. 1493

చ. అనిమొన వానిఁ గైకొనక ♦ యగ్గిరితోడన లాఘవంబునన్
దనుజుని తేరిపై కుఱికి ♦ తద్రథసారథితోడ మావులం
దునియలు సేయ వాఁడు విర♦థుం డయి భూమికి వచ్చి బాణముల్
సొనుపుచు నంత నొక్కకరిఁ ♦ జొప్పడ నెక్కి యుదగ్రవేగుఁడై. 1494

చ. వడిగొని తీవ్రబాణము ల♦వార్యపరాక్రమసాహసంబు లే
ర్పడఁ గపికోటిపైఁ బఱపఁ ♦ బన్నగ మేఘము వృక్షపంక్తిపైఁ
బడ వడగండ్లు రాల్చుక్రియ ♦ బాహుయుగంబులతీఁట వోవఁగా
సుడివడ దంతి డీకొలుపు♦చుం దనుజుం డసమానవేగుఁడై. 1495

ఉ. అక్షతవిక్రమం బొదవ ♦ నాజి వినోదము సల్ప నవ్విరూ
పాక్షు వధింప నర్కసుతుఁ ♦ డాత్మఁ దలంపఁగ నంతలోన హ
ర్యక్షముఁ బోలుచుం గ్రథనుఁ ♦ డక్కపివీరుఁడు దంతికుంభముల్
వృక్షమునన్ వడిం బగుల ♦ వ్రేసెఁ బరాసుత నొందునట్లుగన్. 1496

మ. అది నేలం బడునంత దైత్యుఁడు గదా♦హస్తాఢ్యుఁడై పాసి యు
న్మదలీలం జనుదెంచి యాక్రథను దు♦ర్మానంబునం దాఁక నే
ర్పు దలిర్పన్ రవిసూనుఁడుం గినిసి యా♦ర్పుల్ నింగి ముట్టంగ దు
ర్మదుఁడై శైలము వైవ బాణములఁ గ్ర♦మ్మం జేసెఁ జూర్ణంబుగన్. 1497

తే. [1]దైత్యుఁ బెడకాలమఱియును దాఁచె వాఁడు, నడిదమున వ్రేసె నిద్దఱు నవనిఁ దూలి
తేఱి యొక్కట వడి లేచి తెంపుమిగిలి, బలిమిఁ బోరిరి గజముల భంగి దోఁప.

సీ. మల్లయుద్ధముసేయ మదిఁ గోరి యిద్దఱుఁ, దివురుచు విడుచుచుఁ దెఱపిగొనుచుఁ
బెడకేల వ్రేయుచుఁ బిడికిటఁ బొడుచుచుఁ, బుడమిపైఁ బడఁ దాఁచి యెడసి పాసి
కడిమి మీఁదికిఁ జిమ్మి కరములఁ దట్టుచుఁ, గాళ్లఁ గన్నుచును మోఁ కాళ్లఁ జదిపి
బలుగేల వ్రేసినఁ బడుబంతికయి వడి, నెగసి [2]లాగము గొని యేపు మిగిలి
దైత్యుఁ డర్కసూనుఁ దలమునఁ జఱచిన, సోలి తలిసి పేర్చి సురలు వొగడ
నురము వ్రేసె వాఁడు నొగి నెత్తురుమియుచుఁ, గొండయొఱగు భంగిఁ గూలెనంత.

క. మద మఱి దైత్యులు పాఱిరి, ముదమునఁ గపు లార్చి రంత మొగములు గనలం
ద్రిదశేంద్రవైరి గని తన, మదిఁ గోపం బొదవఁ బలికె మానము వెలుగన్.

శా. ఆసామర్థ్యము దూలిపో నిట విరూపాక్షుండు గూలెన్ గదా
ప్రాసోదంచితు లైన దైత్యు లనిలో భస్మంబు లై పోయి ర
త్యాసక్తిం బ్లవగాలి పెల్లుఱికి ప్రోద్ధాహంకృతిన్ సేసలన్
గాసింబెట్టెడి నీకుఁ జూడ నగునే కారింపఁగాఁ బోలదే. 1501

చ. అన నున్మత్తుఁడు నుత్సహించి సమరవ్యాపారసన్నద్ధుఁ డై
యనిలోఁ గూలినయన్నఁ జూచి ఘనకోపాయత్తుఁ డై రామభ
ద్రునితోఁ బోరఁ దలంచి వానరబలస్తోమంబు బాణావలిం
దునిమెం జించె వధించెఁ గూల్చెఁ బఱపెం దూలించెఁ జెండెన్ వడిన్. 1502

శా. ఆలోనన్ రవిసూనుఁ డాదనుజుపై నంకించి కోపంబునన్
శైలం బొక్కటి వైవ వాఁడు విశిఖాసారంబునం గూల్చినన్
లీలన్ వానిరథంబుపై కుఱికి యక్లేశంబునన్ సూతున
శ్వాలిన్ విల్లును ద్రుంచి యార్చె ఘనగర్జాడంబరస్ఫూర్తి యై. 1503

వ. అంత నయ్యిద్దఱుఁ బరిఘగదాహస్తు లై తలపడి మహోరగంబులక్రియ నిట్టూర్పులు నిగిడించుచుం బ్రస్వేదసిక్తాంగు లై మదకుంజరంబులక్రియం బ్రవర్తించుచు సమరసముత్సాహపులకితగాత్రు లై కంఠీరవంబులకరణిఁ బ్రహారంబులఁ దలలు పగిలి నెత్తురుగాఱ నడజేవుఱుఁ గొండలచాడ్పున లంఘనలాఘవంబులు గలిగి గరుడులచందంబు దోఁప సింహనాదంబుల జీమూతంబులకైవడిఁ బరస్పరంబు జంఘల నొప్పించుచు జానుప్రదేశంబుల నొగిలించుచు నూరుల భేదించుచుం గటిప్రదేశంబులఁ బగిలించుచు నుదరంబులఁ గలంచుచు నురంబుల నగలించుచు బాహుల స్రుక్కించుచుఁ గంఠంబులఁ జఱుచుచుఁ జరణంబుల బిట్టడుచుచు ఫాలతలంబుల నలంచుచు శిరంబుల నెత్తురు జొత్తిల్ల మొత్తుచు సోలుచు వ్రాలుచుఁ దెలియుచు మలయుచుఁ దేఱుచు మీఱుచుఁ గేరుచు నితరేతరజ

1 దైత్యుఁ బిడికిట రవిజుండు దాఁచె. 2 లాఘవము గోరి.

యుకాంతు లినుమడింపఁ జలంబు డింపక తెంపు పొంపిరివోవ మండలక్రమభేదం
బులు సూపుచుం బెద్దసేవు పోరి. 1504

సీ. కరికరాయతమహా కరముల ముసలంబు, వెస దానవుఁడు ద్రిప్పి విసరివైవ
దాన సుగ్రీవుఁడు ధరఁగూలి వెస లేచి, పరిఘంబు వానిపైఁ బఱపెఁ బెలుచ
వాఁడును శితకర వాలంబు వైచిన, వడి వచ్చు దానిన యొడిసి పట్టి
జళిపించి పెల్లార్చి సైన్యంబు చెలఁగంగ, దితిజాధమునితల ద్రవ్వ వైచె
మణికిరీటహేమ మయచారుకుండల, మండితంబు నగుచు మంట లెగయ
నవనిఁ ద్రెళ్ళ రోహిణాచలశృంగంబు, వజ్రనిహతిఁ జేసి వ్రాలుకరణి. 1505

—సుపార్శ్వుఁ డంగదునిచే మడియుట.—

క. విఱిగి నిశాటులు రావణు,మఱువున కేతేరఁ జూచి మనమునఁ గోపం
బెఱుకపడ సుపార్శ్వుఁడు వడిఁ, బఱపెన్ వానరులమీఁదఁ బటువిశిఖంబుల్.

క. వడితోఁడ గాలి వీవఁగఁ, బడలువడం దొరఁగుతాటి పండులక్రియఁ గ్రొ
వ్వడర సుపార్శ్వుఁడు శరములఁ,బడనేసెం గపులతలలు పఱువులు గొనఁగన్.

ఉ. వాలిన తెంపుసం గినిసి వాలితనూజుఁడు వాని తేరిపైఁ
దేలి యదల్చి ముద్గరము తీవ్రతి నేసిన వాఁడు నేలపై
వ్రాలిన నొక్కకొండ వడి వైచిన సారథితోడ గుఱ్ఱముల్
దూలెను నుగ్గునూచ మయి తోడన వాఁడును దేఱి చెచ్చెరన్. 1508

క. పదితూపుల నయ్యంగదుఁ, బ్రదరత్రయమున సరోజబంధుతనూజున్
బెదరంగ నైదుకోలలఁ, బొదివె గవాక్షుని నుగ్రభూరిబలుం డై. 1509

ఆ. వాలిసూనుఁ డలిగి వానిం బరిఘమున, మోఁదఁ గరుణలేక మూర్ఛవోవఁ
జెఱకుఁగోల పెల్లు విఱిచినక్రైవడి, మించి దైత్యువిల్లు ద్రుంచివైచె. 1510

క. తెలిసి పరశువున వక్షః,స్థలి వ్రేసిన నంగదుండు చలియించుచు భూ
స్థలమున వెస మూర్ఛిల్లెం, బెలుచన నక్తంచరుండు బెట్టుగ నార్వన్. 1511

చ. అదరుచు నంతలోఁ దెలిసి యంగదుఁ డంతకృతాంతుక్రైవడిన్
వడి నరుదెంచి బిట్టు ఘనవక్షము వజ్రసమానముష్టిచేఁ
బొడిచిన దైత్యపుంగవుఁడు బోరన నెత్తురు లోలిఁ గ్రక్కుచుం
బడియె గతాసుఁడై ధరణిభారమునన్ వెసఁ గ్రుంగునట్లుగన్. 1512

వ. అట్లు విరూపాక్షోన్మత్తసుపార్శ్వులు కూలినం గినిసి దశముఖుండు. 1513

శా. కోపాటోపము మోములన్ ముడివడన్ ఘోరాంతకాకారుఁడై
యాపౌలస్త్యుఁడు రక్తలోచనవినిర్యద్విస్ఫులింగోగ్రుఁడై
పైపై నూర్పులు గ్రమ్మఁ గోఱలరుచుల్ భాసిల్లఁగా సంగర
వ్యాపారంబున దుర్నిరీక్ష్యవిభవుం డై సూతుతో ని ట్లనున్. 1514

ఉ. నేరుపు నశ్వశిక్షణవినిర్ణయముం దన రారునట్లుగాఁ

దేరు రయంబునం బఱపు తీర్చెద నాపగ యెల్ల నెమ్మెయిం
బోర వధింతు రాఘవుల భూరుహసాధను లైనవానరుల్
బీరము దక్కి దిక్కులకుఁ బెల్కుఱి పాఱఁగ నెల్లభంగులన్. 1515

మ. అతితుంగధ్వజయష్టి మి న్నొఱయ నశ్వానీకలోలక్షుర
క్షత మై భూమిరజంబు పె ల్లెగసి యర్కస్ఫూర్తి మాయింప నూ
ర్జితనేమిధ్వని దిక్కులందుఁ బెరుఁగం జిత్తానుకూలోల్లస
ద్గతి మై క్రాల రథంబు సూతుఁడు సముద్దామంబుగాఁ దోలినన్. 1516

సీ. పటహకాహళశంఖపటునినాదంబులుఁ, జటులకార్ముకఘోషజ్యారవంబుఁ
గుటిలరాక్షసకోటికోలాహలంబులుఁ, గరటిఘటానీకఘనరవములు
వలమానఘోటకవరహేషితంబులు, నిష్ఠురరథనేమినిస్స్వనములు
సూతమాగధజయస్తుతివిరావంబులు, మంజులమంజీరశింజితములుఁ
గలయఁబెరయఁ బంక్తికంఠుఁడునను దేరఁ, గపులు లయకృతాంతుఁ గనినయట్లు
తలఁకి పఱచి రంతఁ బులిఁ గాంచి మృగములు, బెదరి పాఱుభంగిఁ బెంపుదక్కి.

చ. కనుఁగొని రాఘవేశ్వరుఁడు కన్గవ నెఱ్ఱఁదనంబు నొందఁగా
ధను వవలీలఁ బుచ్చుకొని ధారుణి తల్లడ మంద వాసవు
ల్వినుతులు సేయుచుండఁగ నిలింపులు సంతస మంది చూడఁగా
మునుకొని బాణవర్షమున ముంచె నభోవలయంబు దిక్కులున్. 1518

— రామరావణులద్వితీయయుద్ధము. —

ఉ. తేకువ పెంపు గల్గి జగతీతలనాథుఁడు పంక్తికంఠుఁడుం
దాఁకిరి బాణపంక్తి వితతంబుగ దేవవిమానకోటిపైఁ
జోకఁగఁ గ్రొమ్మెఱుంగు లొగి సొంపు వహించుచు నుండ వేడుకన్
మూఁకలు రెండు నుగ్గతవినోదము నొంది చెలంగి చూడఁగన్. 1519

మ. మింటం బర్వుచు జృంభమాణగరుదస్త్రౌఘంబు లై పెచ్చి యొం
డొంటిం దాఁకుచుఁ దొట్టి మిట్టిపడి యత్యుగ్రంబు లై గొప్పునన్
మంటల్ దిక్కుల నిండ నెంతయు నసామాన్యంబు లై తూపు లే
వెంటం బాఱఁ దొడంగె దైత్యనృపదోర్వీర్యంబు లేపారఁగన్. 1520

క. ఇరువుర బాణములు దిగం, తరములుఁ బుడమియును మిన్నుఁ దలముగఁ బొదువన్
గురుతరతిమిరము గవిసెం, బర పగునడురేయివోలెఁ బరువడితోడన్. 1521

మ. నలినీబాంధవుఁ డస్తమించిన ననూనం బై తమం బెల్లచో
గలయం బర్వినభంగి [1]సంతసమయాకారంబుచందంబుగా
గెలువన్ దైత్యుఁడు దామసాస్త్రము ప్రయోగించెం బ్లవంగేంద్రు లం
ధులమాడ్కిన్ మును గానలేక ధరణిం దోఁతో [2]వెసన్ మ్రొగ్గఁగన్. 1522

1. సంతమస మాకారంబు. 2. మునుంగన్ వెసన్.

సీ. కెందమ్మితేకుల§యందంబు గలిగిన, కనుఁగవ రోషాగ్ని § గడలుకొనఁగ
దండభృత్పురవర§ద్వారతోరణ మన, మొగమునఁ బెనుబొమ§ముడి దలిర్ప
గరళకంధరవృష§స్కంధాంసయుగళంబు, ఘనతరంబుగఁ దల§కడచి పెరుఁగ
సౌదామినీలతా§సమమైనగొనయంబు, సారించి దైత్యుల § సమయఁ జేయఁ
బదులు నూర్లు వేలుఁ§బఱఁగించెఁ దూపులు, పిడుగుఁదునియ లనఁగఁ§బెల్లుగడఁగి
వెలయ నేర్చియున్న§విలువిద్య మెఱయుచు, వివిధగతుల నెఱసె § వీరవరుఁడు.

క. ఇనకులుఁ డేసినశరములు, దునిమె దశాననుఁడు గడఁగి § దుర్దమశక్తిన్
వనసింధురంబు బలువడి, వనరుహనాళంబు ద్రుంచి § వైచినకరణిన్. 1524

క. దశముఖుఁడు దఱిమి తూపులు, దశరథనందనునిమీఁదఁ § దఱుచుగఁ బఱపెన్
నిశితార్ధచంద్రశరముల, విశకలితము లయి పడంగ § వెస నతఁ డేసెన్.

క. ప్రతిరోమకూపములపై, నతులితగతిఁ దనర మనుకు§లాధిపుఁడు శర
ప్రతతులు రావణుమేనం, జతురంబుగఁ గీలుకొల్పె § సంరబ్ధుం డై. 1526

క. రౌద్రాస్త్ర మేసి రిరువురు, రౌద్రరసం బొదవ రెండు § రథసమునఁ గృతో
పద్రవము లగుచు నొక్కట, నుద్రేకము లుడిగి పడియె § నురుజవ మెడలన్.

వ. అంత దశరథతనయదశకంఠు లకుంఠితవిక్రమం బొప్పఁ గంఠీరవంబులచాడ్పునం బరస్పరవిజయసముత్కంఠితు లయి కృతాంతభ్రూవిభ్రమంబులు గలచాపంబులఁ దదీయకటాక్షపాతంబులం బోనిమహోగ్రసాయకంబులు పఱపుచు సముద్రంబులచందంబున ఘూర్ణిల్లుకోదండంబులవలనం గల్లోలంబులం బోనిభల్లపరంపరల వెల్లిగొల్పుచుఁ బైపైఁ దిమిరంబులు గల్పించుచు రేలుం బగళ్లు నొక్కొక్కముహూర్తంబునఁ గావించుచుండ నంత లంకావల్లభుండు ఘోరనారాచపరంపరల రాముఫాలభాగంబు గంటి చేసిన నతండు నిందీవరదామంబు దాల్చువిధంబునం దనరి కోపించి రవికరంబులం బోని వేఁడిమిగలవాఁడికోలల వానికంకటంబు చించి నొప్పించిన. 1528

ఆ. సర్పముఖము లయిన§శరములు నృపుమీఁద, నేసి యార్చె దాన§వేశ్వరుండు
వాని నడుమఁ దునియఁ § గా నేసె రఘుపతి, పరఁగుచున్న నిశిత§భల్లతతుల.

ఆ. అసురాస్త్ర మంత § నాదైత్యుఁ డేసిన, నడరి యేఁగుదెంచె § నంబరమున
జడధివెడలివచ్చు § బడబాగ్నికై వడి, నంబుదంబువలని§యశనిపగిది. 1529

సీ. ప్రాకటంబుగఁ బుండ§రీకాననంబులు, వఱలఁగఁ బంచాస్య§వదనములును
భీకరాకృతి దోఁప § సూకరాస్యంబులు, వరమహోరగతుల్య§వక్త్రములును
జటులదంతావళి§సన్నిభముఖములు, విపులోగ్రభేరుండ§లపనములును
భల్లూకభీషణ§బహుళముఖంబులు, శరభసముత్కరా§స్యములు మఱియు
గాకకంకగృధ్ర§కౌశికజంబుక, శునకముఖము లైన§ఘనశరముల
నొక్కమాత్రలోన § నుర్వీశతిలకుండు, వాని నెల్లఁ ద్రుంచి§వైచి యార్చె.

శా. మాయాగ్రేసరుఁ డైనరావణునిదుర్మానంబు దూలన్ యుగ
ప్రాయోదారభుజుండు రాఘవుఁడు శుంభద్వేగుఁ డై పేర్చి గో
పాయత్తం బగుమానసంబున జయవ్యాసక్తి రాజిల్ల నా
గ్నేయాస్త్రంబు సమంత్రకంబుగఁ బ్రయోగించెం బ్రయోగించినన్. 1532

సీ. తఱుచుగా గిఱిగొన్నమెఱుపులు నెఱపుచుఁ, దోరంపుధూమకేతువులుఁబోలె
నుగ్రతేజముతోడియుల్కల నీనుచుఁ, బెల్లుగాఁ బిడుగులు వెల్లిగొల్పి
బహుభేదభాస్వరగ్రహములఁ బోలుచు, వితతోగ్రతారకాతతుల మీఱి
భానుమండలకోటిభాసురాననము లై, విలయాగ్నిముఖము లై కలయఁబర్వి
జానకీజానియాగ్నేయసాయకములు, పొగలి రావణుశరములఁ బొలియఁజేసె
వైదికాగమపరిశుద్ధవాక్యతతుల, నోజ నక్కినసౌగతయుక్తు లనఁగ. 1533

క. ఆసుర మాగ్నేయమునన్, గాసిం బొందిన సమస్తకపివరులు సము
ల్లాసంబు నొంది యార్చిరి, త్రాసము రాక్షసుల కొదవ ధరణి వడంకన్.

మ. మయమాయామయశక్తినిర్మితము భీమప్రాభవంబున్ మహో
రయసంపజ్జితవాతచక్రము సురవ్రాతాసురానీకదు
ర్జయసంరంభము భానుబింబసమతేజం బైనయస్త్రంబు భూ
రియశోధాముఁడు రావణుండు సమరోద్రేకంబుతో నేసినన్. 1535

చ. పరశుగదాకృపాణశరపట్టిసముద్గరశక్తికుంతతో
మరవరభిండివాలముల మంటలు నొక్కట నుప్పతిల్ల నం
బరమును దిక్కులుం గలయఁ బర్వుచు నుగ్రభుజంగమండలో
ద్ధురగతి నేఁగుదెంచె వడితోడ నుదారశరంబు చెచ్చెరన్. 1536

శా. దుర్వారక్రమవిక్రమంబు పెరుఁగన్ దోర్వీర్య మేపారఁగా
గీర్వాణుల్ దివి మెచ్చి యచ్చెరువడం గేలిగతిన్ వీఁకతో
నుర్వీచక్రము గ్రుంగఁ బాదయుగ మత్యుల్లాసి యై యూఁది గాం
ధర్వాస్త్రంబు నరేంద్రుఁ డేసెఁ గపిబృందం బుబ్బి గర్జిల్లఁగన్. 1537

క. ఆయస్త్రనిహతి నప్పుడు, మాయామయసాయకంబు మాయం బయ్యెం
దోయదపటలము దుస్సహ, వాయువుచే విరిసి పాఱువడువున నంతన్. 1538

ఉ. రావణుఁ [1]డేయ నుగ్ర మగురౌద్రశరంబునఁ దోఁచె మింట నా
నావిధభానుమండలఘనద్యుతిపుంజము లైనచక్రముల్
పావకసన్నిభంబు లగుబాణము లుగ్రభుజంగమంబులున్
వావిరి సింహముల్ బహురవం బొదవన్ జనియించె నత్తఱిన్. 1539

క. మించినయాచక్రాదుల, నంచితదివ్యాస్త్రనిహతి నన్నియుఁ దూలం
ద్రుంచె రఘుపుంగవుఁడు రా, యంచ మృణాళములు ద్రుంచునాక్రియ దోఁపన్.

---

1. డేసె నుగ్ర మగు...శరం బరివోసి మింట.

సీ. మిక్కిలి కోపించి యక్కజంబుగ దశకంఠుఁడు రాముపైఁ గడఁగి యార్చి
నిశితనారాచముల్ నిగిడించి మర్మముల్, నొప్పింప రాముండు దెప్పరముగ
మంచుముంచినమాడ్కి నించుక యెడలేక, భూనభోవివరంబు మునుఁగ నేసె
నెఱకులు దూలంగ నిష్ఠురాస్త్రంబులు, మేదురంబులుగాఁగ మేన గ్రుచ్చెఁ
బరఁగ నిరువురు నన్యోన్య బాణహతులఁ, బుష్పితాశోకకింశుక స్ఫురణ గల్గి
శాల్మలీతరుసముదగ్ర శైలలమ్మృగము, లనఁగ నొప్పిరి జయకాంతి లినుమడింప.

వ. అయ్యవసరంబున గిరిగుహాకుహరంబు వెడలి వచ్చుమృగేంద్రంబు ననుకరించు
చు నంభోధరమండలంబు పాసి చనుదెంచుదంభోళిం బోలి సాగరంబు వెడలి
యేతెంచుబడబానలంబుమాడ్కిఁ బాతాళవివరంబువలన, నరుగుదెంచుమహా
నాగంబుపగిదిఁ బ్లవంగబలమధ్యంబువలన నేఁగుదెంచి విక్రమోద్ధతతేజోదృష్టి
భీషణుండై లక్ష్మణుం డెడచొచ్చియొక్కభల్లంబునం గనత్కనకమణికుండలమం
డితం బగుతత్సారథిమస్తకంబు దునిమి మేరుసారం బగుతదీయకార్ముకంబు నొ
క్కసాయకంబునఁ ద్రుంచి యభ్రంకషం బగుకేతనం బొక్కయర్ధచంద్రసాయ
కంబునం గూల్చి యతివిశాలకఠినం బగుదశకంఠువక్షంబు పంచవిశిఖంబుల
నొప్పించె నంత విభీషణుండును నీలజీమూతనీకాశంబులును బర్వతప్రమాణగా
త్రంబులును నగురథితురంగంబుల నొక్కటఁ జదియ గదవ్రేసిన విరథుండై లం
కేశ్వరుండు మహీధరోపరిభాగంబున నుండి లంఘించుశరభంబుచాడ్పున నిల
కుఱికి నిలిచి. 1542

మ. స్ఫుటరోషంబున నవ్విభీషణునిపై భ్రూవిభ్రమాడంబరో
త్కటుఁడై పంక్తిముఖుండు శక్తిఁ బఱపన్ దంభోళిసంరంభసం
ఘటనాకారత నేఁగుదేరఁ గని యుగ్రస్ఫూర్తి సౌమిత్రి దాఁ
బటుబాణత్రయ మేసి త్రుంచెఁ నది భూభాగంబునన్ వ్రాలఁగన్. 1543

సీ. జంభారిచే నున్న దంభోళికై వడి, మెఱుఁగుఁదీగలు మిఱుమిట్లుగొలుప
నీలకంఠునిచేతిశూలంబుచాడ్పున, మంటలు దొట్తోన మింటఁ బొదలఁ
గాలాంతకునిచేతికాలదండముఁబోలెఁ, జూపఱకును దేఱిచూడరాక
జలజలోచనుచేతిచక్రంబువడువునఁ గడునమోఘం బయి కడలుకొనుచు
మయవినిర్మితమైమహామహిమఁదనరిఁభూరిమాంసాస్త్రములనోలిఁబూజనొంది
పూని విజయైకసాధనమైనశక్తి, వడి విభీషణుపై వైవ నడరె నతఁడు. 1544

చ. అనయము నెల్లనాఁడు శరణాగతరక్షకుఁడై నవానికిం
దను నభయంబు వేఁడినఁ బ్రదంపడి కాచుట ధర్మువే కదా
యని రఘునందనావరజుఁ డారజనీచరనాథుతమ్మునిన్
వెనుకకుఁ ద్రోచి నిల్చి పటువీర్యమునన్ విశిఖంబు లేసినన్. 1545

శా. విల్లుం గోలలుఁ దాల్చి నీవు భువిలో వీరుండవై పోలేవ్ నమీా

కోల్లాసంబున నవ్విభీషణునకై యూహింప కేతెంచుచోఁ
జెల్లింపం దగు నీకు నీప్రతిన నాచేఁ జావు సిద్ధంబు నీ
పెల్లెల్లం బొలియించు శక్తి యని సుస్మితంబుగాఁ బల్కుచున్. 1546

—రావణునిశక్తిచేత లక్ష్మణుండు మూర్ఛఁ బొందుట.—

సీ. ప్రళయోగ్రమార్తాండపరివేషమండల, దీప్తులు సుడివడఁ [1]ద్రిప్పివైవ
నష్టఘంటానాద మవనిభూధరగుహా, గర్భగేహంబులఁ గలయఁ బర్వఁ
గల్పాంతపావకకల్పమహోజ్జ్వాల, లంబరంబుననుండి యవులఁ జనఁగ
శేషభోగీశ్వరజిహ్వాకరాళమై, చనుదేరఁగా రామచంద్రుఁ డప్ప
డడరి సౌమిత్రి చావకుండెడు మనంగఁ, గపులహాహారవంబులు గలసిచెరయ
శరములన్నియుఁ జదుపుచు శక్తి వచ్చి, యురము గాఁడిన లక్ష్మణుండుర్విఁ గూలె.

చ. బలపరిణాహసంపదయు బంధురబాహుసమగ్రశక్తియుం
బొలిసిన నిర్విచేష్టుఁ డయి భూస్థలిపైఁ బడె సంశయంబునన్
నిలువక కూలుమేరుధరణీధరమో యనఁ గూర్మితమ్మునిం
దరలక చూచి నెమ్మనము తాలిమి దూలఁగ రామభద్రుఁడున్. 1548

చ. వనజదళాగ్రభాగముల వావిరిఁ గ్రమ్ముహిమంబుచాడ్పునం
గనుఁగవ నశ్రుబిందువులు గాఱఁగ డెందము తల్లడిల్లఁగా
బెనువగచిమ్మచీఁకటులపెల్లు వివేకదినేశమండలం
బునఁ దొలఁగంగఁ ద్రోచి గుణభూషితధైర్యనఖావలంబుఁ డై. 1549

చ. వనరుహమిత్రసన్నిభునివక్షము పెల్చన దూఱి భూమి గాఁ
డినఘనశక్తియుం బెఱుక డెప్పర మైనఁ గపీంద్రు లూర కుం
డినఁ జనుదెంచి రోషము నటింపగ వే పెకలించి త్రుంచె నే
పున వినతాసుతుండు ఫణిపుంగవముం దునుమాడుకై వడిన్. 1550

శా. ఆలోనన్ రజనీచరేశ్వరుఁడు కర్ణాంతోపసర్పద్గుణా
భీలుం డై ఫణిరాజసన్నిభధనుర్భీమత్వసంపాది యై
కీలాలంబులు మేనఁ గ్రమ్మ తొరఁగం గీలించె నారాచము
ల్భూలోకాధిపుమీఁద మత్సరకరాళుం డై రణవ్యగ్రతన్. 1551

మ. కరకావర్షము లద్రియోర్చుకరణిం గర్వాంధనక్తంచర
స్ఫురదస్త్రంబులు లెక్కసేయక జగత్పూర్ణానుభావుండు భూ
వరుఁ డామారుతుకూర్మినందనుని భాస్వత్సానునిం గాంచి సం
గరసంరంభరసంబు వెల్లివిరియం గా వారితో నిట్లనున్. 1552

చ. గొనకొని శోకవేగమునకున్ సమయం బిది గాదు విక్రమం
బున కగు వేళ గావునఁ బ్రభూతభుజాయతశక్తి చూపెదన్

1. దిర్చి త్రిప్పి.

మునుకొని మీర లిందఱును మోసము నొందక మించి నేర్పుతో
నొనరఁగఁ జేరి కాచుకొని యుండుఁడు లక్ష్మణు నేకచిత్తులై. 1553

సీ. రమణీయ మగుమహీరాజ్యంబు వోనాడి, యడవుల నిడుమలు గుడిచి డస్సి
దండకావనములో నుండి ప్రాణమ్ముల, కంటెఁ బ్రియం బైన కాంతఁ గోలు
పోయి వియోగార్తిఁ బొంది మీతోఁ గూడి, వాసవనందను వాలిఁ జంపి
వారాశి బంధించి వడితోడ లంఘించి, నెట్టన నీలంక చుట్టుముట్టి
కడఁగి యనిలోనఁ బెక్కురక్కసులఁ ద్రుంచి, కుంభకర్ణాదివీరులఁ గూల్చి యింద్ర
జిత్తు వధియించి ముదమునఁ జెలఁగునంత, నిట్టియాపద చనుదెంచె నివ్విధమున.

క. నాకన్నులయెదురం బడి, నాక్రియ మెయిమెయిన బ్రదికి నేఁగెడు నింకన్
లోకంబు లెల్ల సుఖముం, జేకొనఁ జిత్తమున వేడ్క సిద్ధింపంగన్. 1555

క. నీచాత్ముఁ డైనయీరజ, నీచరుతో నాదుయుద్ధనిపుణత వేడ్కం
జూచుచు నుండుఁడు విస్మయ, గోచరు లై మీర లెలమిఁ గుతుకితమతు లై.

తే. మీర లిందఱు వినుచుండ మెఱసి యొక్క, ప్రతిన చేసెద దుర్వారబాహుశక్తి
నెరయ నేర్చినవిలువిద్య నేర్పు గలిగి, పోరొనర్చెద సురకోటి పొగడుచుండ.

సీ. వనరుహబాంధవవంశంబునందు నే, జననంబు నొందుట చనునదేని
ధర్మశీలుం డైన దశరథేశ్వరునకు, నాత్మసంభూతుండ నయితినేని
ననిలోన నేపున నాదశకంఠుండు, నెఱి దప్పి పాఱక నిలిచెనేని
తగవును సత్యంబు నగుభంగి నేప్రొద్దు, వదలని ప్రీతిఁ జల్పుదునదేని
రాముఁ డొండెను భువిలోన రావణుండు, నొండె నింతియ యుండును[1] చెట్లు
గలుగ నేర్చును గావునఁ గడఁగి వీని, నేపుమాపెదఁ దూపుల ప్రేఁపు లెగయ.

—రావణుఁడు రామశరవిద్ధుం డై కాందిశీకుం డగుట.—

మ. అని యారాఘవుఁ డంత రోషవివశోగ్రాకారుఁ డై వింటినే
ర్పును దోస్సారము నొక్కరూపుగ వెసం బుంఖానుపుంఖంబుగాఁ
గనదస్త్రంబులు రాక్షసేశ్వరునిపైఁ గల్పాంతదంభోళిగ
ర్జనసంరంభము లేర్పడం బఱపె నూర్జత్సత్త్వసంపన్నుఁ డై. 1559

క. ఇరువుర బాణావళు లం, బరతలమునఁ గలయ నిండఁ బర్వుచు నితరే
తరహతులఁ జేసి నేలం, దొరఁగె మహోల్కాసమానదుస్సహరుచు లై.

శా. ఆనక్తంచరరాజరాఘవులదృప్యత్సారబాణాసన
జ్యానిర్ఘోషములం గలంగె జలధుల్ సర్వంసహాచక్రముల్
దూనం బై కదలెం గులాచలములుం దోడ్తోన వ్రీలం బడెన్
హీనత్వంబు భజించి వంచె భుజగాధీశుండు మూర్ధంబులన్. 1561

సీ. మండలీభూతకోదండుఁ డై పైపయిఁ, జండకాండంబులు మెండుకొలిపి

1. చెట్టుఁ గలుగ నేర్చు నె.

చండాంశుదీధితిమండలంబులఁ బోలు, వేఁడిచూడ్కులు మీఁద వెల్లిగొలిపి
యన్యోన్యధిక్కారణాదివాక్యంబుల, నూతనస్థితితోడ నూలుకొలిపి
సింధుగంభీరోగ్రసింహనాదంబుల, నోలి భూతములకు జాలిగొలిపి
దశరథాత్మజుండు దశకంధరుండును, హరులు గాఁడుసులును నడరి పొగడ
నేవు మిగిలి చూడ నిరువురుఁ దుల్యులై, కోరి పోరి రిట్లు కొంతసేవు. 1562

వ. అంత నతికఠోరంబు లగురామునిబాణపాతంబుల జర్జరీభూతసర్వావయవుం డై కుసుమితపారిభద్రంబు ననుకరించుచు సర్వతోధికంబులై పఱతెంచుసీతావల్లభుఘోరనారాచధారల కోర్వక దశశిరంబులకేశకలాపంబులు వెన్నునం దూల మణిమకుటదశకం బెడలిపడ నిలువంబడినం బరిధానాంచలంబు సమరతలంబునఁ గేతనపటాకారం బమరింప ధరణి గంపింప నసహ్యావిక్రమం బైనసింహంబుఁ బోడగాంచి పఱచుకుంజరంబుచాడ్పున నసురులుబెదరఁ గవు లార్వఁ గాందిశీకుం డై లంకేశ్వరుండు మగిడి లంక సొచ్చి యంతఃపురంబున కరిగి సేద దీర్చుకొని డెంగంబుతల్లడం బుడిపికొని లజ్జ యుజ్జగించి మందోదరి రావించి పెద్దయుం బ్రొద్దు చింతించి యి ట్లనియె. 1563

స్రగ్ధర. ప్రౌఢాహంకారయుక్తప్రథితగుణభుజాప్రాభవోదారసార
వ్యూఢోరస్కుండు చాపాభ్యుపగమచతురతోర్జితుం డాజిఁ బ్రత్యా
లీఢస్థానోగ్రుఁ డై శూలిక్రియ నతికరాళీభవల్లోచనశ్రీ
గాఢుం డై రాముఁ డత్యుత్కటగతి శరముల్ గాఁడ నొప్పించె నన్నున్.

ఉ. నీతిరహస్యసారకృతనిర్ణయబుద్ధివివేకశాలి సం
ప్రీతిమెయిన్ విభీషణుఁడు పెక్కువిధంబుల నాహితంబు నం
స్ఫూతి దలిర్పఁ గోరి మును వల్కిన చందము లాత్మ మేలు నా
నైతి వివేకశూన్యమతి నై తలపోయక వారిజాననా. 1565

చ. ఘననిభుఁ గుంభకర్ణుని నకంపను విక్రమశాలి నింద్రజి
త్తుని నతికాయు శౌర్యవినుతుం డగుకుంభు నికుంభునిం బ్రహ
స్తుని నభయున్ నరాంతకునిఁ ద్రుంచిరి యానరవానరాధము
ల్మనమునఁ గిన్కయున్ వగయు లజ్జయు నిప్పుడు నాకు నయ్యెడిన్. 1566

సీ. బలభేది వ్రేసినకులిశంబునకు నోర్చి, యనలునిశక్తి కై కొనక జముని
దండంబు సైరించి దైత్యేంద్రుఖడ్గంబు, సరకుసేయక పేర్చి వరుణుచేతి
పాశంబునకుఁ జిక్కవడక ప్రభంజను, భంజించి ధననాథుబాహుగదకుఁ
దలఁకక యీశానుదారుణశూలంబు, లెక్కసేయక తొల్లి యుక్కుమిగిలి
గరుడసిద్ధసాధ్యగంధర్వయక్షుల, గెలిచి యున్ననాకు బలము దూల
నొక్కనరునిచేత నోటమి సిద్ధించె, నిట్టిపోరు లెన్నఁ డే నెఱుంగ. 1567

క. పిడుగులకంటెను మిక్కిలి, బెడిదము లై వచ్చురామభీమాస్త్రంబుల్

నుడిగొని నెఱికులు నాటఁగ, వడి దప్పక నిలిచి యోర్చు § వాఁడుం గలఁడే.
క. తురగములమీఁద మదకుం,జరములపై రథములందుఁ § జదలను ధరణీ
ధరములయందును రత్నా,కరమందు నృపాలుఁ డపుడు § గానంబడియెన్. 1569
తే. అదరి యెయ్యదిచూచిన § నదియ నాకు, రాఘవాకృతియై తోఁచు § రణములోన
నిపుడు రామసహస్రంబు § లెల్లచోట్లఁ, గానవచ్చుచు నున్నవి § కమలనయన.
సీ. కావున నే నింకఁ § గందర్పదర్పఘ్ను, భసితాంగరాగసం § భరితగాత్రు
భుజగకులాధీశ § భూషణభూషితుఁ, గమనీయశశిఖండ § కలితమౌళి
నీలజీమూతవి § నీలలసత్కంఠు, సునిశితవరమహా § శూలహస్తు
నభ్రగంగాసలి § లార్ద్రజటాజూటు, శైలజాముఖచంద్ర § చలచకోరు
దేవదేవు నభవుఁ § ద్రిణయనుఁ ద్రిపురాంత,కరు వరేణ్యు వరదుఁ § బరమధాము
నజరు నాదిమధ్య § మావసానరహితుఁ, గొలుతు నాత్మ భక్తి § నెలకొనంగ.
సీ. మును నాదుసంగీత § మును మెచ్చి వరమిచ్చె, నగసుతానాథుండు § నాకుఁ బ్రీతి
నరులకు నీ వోఁడు § నప్పుడు ననుఁ గూర్చి, హోమంబు విధితోడ § నొనరఁ జేయఁ
దివిరి గ్రక్కున నొక్క § దివ్యరథం బందు, జనియించు నురుజవా § శ్వములతోడఁ
గమనీయ మగుమహా § కవచంబు మాహేశ్వ, రం బగుదివ్యచా § పంబు గలుగు
నడుమ విఘ్నంబుగాకుండ § నడిచెనేని, జయము చేకుఱునన యంబు § సంగరముల
ననియెఁ గావున నేఁడు నా § కట్లు చేయ, వలయు నీపగ దీర్పంగ § వలనుగలుగ.

—❀ మందోదరి రావణునకు హితము చెప్పుట. ❀—

వ. అని స్నానంబు సమాచరించి హోమంబు యథాపూర్వంబుగాఁ బ్రవర్తించి భూసురుల కనేకధనంబు లొసంగి రక్తమాల్యాంబరాభరణయజ్ఞోపవీతాలంకృతుండై పరమేశ్వరాలయంబున కరిగి యచ్చో నచ్చుపడ నొక్క వేదిక నిర్మాణంబు సేసి దర్భసమాస్తరణంబు గావించి సర్వతోధికంబుగాఁ దనకు రక్షణార్థంబు నక్తంచరులఁ బెక్కండ్ర నియోగించి హోమంబు ప్రవర్తింప నమకట్టునిజవల్లభుం డైనలంకానాథునొద్దకు నేతెంచి సింహకృశోదరి యైనమందోదరి యి ట్లనియె. 1573
మ. అకటా చాపవిశేషకౌశలము మా § యాకృత్యపాండిత్యముం
వికటాస్త్రావలిపెంపు దుర్దమభుజా § వీర్యాదిసామగ్రియుం
బ్రకటాడంబరఘోరసైన్యములశుం § భచ్ఛక్తియుం గల్గి యూ
రక నీ కీమునివృత్తి నొందఁ దగునే § రక్షోగణాధీశ్వరా. 1574
క. హేలావిక్రమ మొనరఁగఁ, గైలాసనగేంద్ర మెత్తి § ఘనవిఖ్యాతిం
ద్రైలోక్యంబుల నుద్ధతిఁ, గ్రాలినహస్తములు గలుగఁ § గా భయ మేలా. 1575
సీ. నీవు గోపించిన § నిర్జరాధిపుఁ డైనఁ, గుంభినీధరములఁ § గుహల నడఁగు
దహనుండు వేఁడిమి § దఱిముచూపఁగ లేఁడు, పద్మబంధుఁడు దపిం § పంగ వెఱచుఁ

గడఁగి సదాగతి కడలఁగ బెగడొందుఁ, దోయరాశియు నుబ్బి మ్రోయనోడు
పొలుపేది జముఁడును బొడసూపఁ దలఁకును, వసుమతీస్థలి వడవడవడంకు
నరయ నీపేరు వినుమాత్ర నిలువలేరు, సురమహోరగగంధర్వవరులు నాజిఁ
జెలఁగి వైరుల శక్తి నిర్జింతు గాక, తాపసత్వము నీ కేల దనుజనాథ. 1576

క. నీ కింత బెగడు గలిగిన, లోకోత్తరుఁ డైన రాములోలాక్షి వెసం
జేకొని తెత్తువె తెచ్చితి, వీకార్పణ్యంబు నొంద నిం కేమిటికిన్. 1577

క. రాముఁడు సమస్తజగదభి, రాముఁడు గాంభీర్యధైర్యరాజితసుగుణో
ద్దాముఁడు దనుజానీకవి, రాముఁడు సామాన్యుఁ డగునె రాక్షసనాథా. 1578

మ. పురుహూతుండొ కృశానుఁడో శమనుఁడో పూర్వామరాధీశుఁడో
వరుణుండో యనిలుండొ యక్షపతినా విఖ్యాతుఁడో యీశానుఁడో
దొరయన్ నీకు రఘూద్వహుం డలుకచే నోర్వ్యమ్ముల్ వింతగా
ఖరునిం గూల్చిననాఁడు నీ వెఱుఁగవే కారింపఁగా శక్యమే. 1579

క. మునిచందము విడు మింకను, మునుపటితాలిమి సహింపు మోహంబున ని
మ్మనమున ధైర్యము విడిచిన, నిను సగరె సు[illegible] నిర్జరవైరీ. 1580

ఆ. పెక్కు మాటలేల నిక్కువం బగుపల్కు, వినుము భుజబలంబు వెలయుచుండఁ
బగఱ నోడుచు టొప్పఁ బంకతనంబున, విమలమయినయశము వెలయఁగలదె.

క. అని మందోదరి చెప్పిన, విని దైత్యుఁడు సిగ్గు నొంది వెలఁదియుఁ దానుం
జనె నభ్యంతరమునకును, మనమున జయకాంక్ష మిగుల మల్లడిగొనఁగన్.

ఉ. అత్తఱి రాముఁ డుగ్రసమరాంగణధారుణిఁ గూలి నెత్తుటన్
జొత్తిలి ధూళి బ్రుంగి వివశుం డగుతమ్మునిఁ జూచి నెమ్మనం
బుత్తలపాటు నొంద మది నోర్వక ధైర్యము దూలి పోవఁ బై
నెత్తినపెల్లునెవ్వగల నిట్లనుచున్ విలపించె దీనుఁడై. 1583

ఉ. ఆలములోన దైత్యులఁ గృతాంతునికై వడి నుగ్రభంగి బా
ణాలి నిమేషమాత్రఁ దెగటార్చి ప్రియం బొసరింతు నిచ్చలున్
వాలుమగం డితం డనఁగ వాసికి నెక్కి దశాస్యుశక్తిచే
నేలకు వ్రాలి మేల్కనని నిద్దుర నొందితివయ్య తమ్ముఁడా. 1584

ఉ. చండమృగేంద్రభల్లవృకసైరిభసూకరపుండరీకభే
గుండతరక్షుశల్యపటురోషమహాశరభోగ్రమత్తవే
దండవిభీషణాటవులఁ దద్దయు నన్ను భరించి దీర్ఘదో
ర్దండసమగ్రసార దిగఁ ద్రావి చనం దగునయ్య యిక్కడన్. 1585

చ. ఘనభుజ నీవు నేను మును గానకునై చనుదెంచి యిక్కడన్
నిను నిటు గోలుపోయి ధరణీతలరాజ్యము సౌఖ్యశక్తియున్
జనకజయుం బ్రవృత్త మగు సంగరకృత్యము నేటి కింక జీ

వన మిది యేల కూడ నిదె వచ్చెదఁ దమ్ముఁడ కూడ నీఁ గదే. 1586

చ. అడవికి వచ్చునాఁడు నయ మారఁగ నిన్ దగ నప్పగించె నా
కడలుచు నేను నట్ల యగు నంటి నయోధ్యకు నింక నేఁగఁ ద
ల్లడమున నిన్నుఁ గాన కొగి లక్ష్మణుఁ డేఁ డనుచున్ సుమిత్ర న
న్నడిగిన నేమి చెప్పుదు దశాననుచే ననిఁ గూలె నందునే. 1587

క. ననుఁ బాయలేక యడవికిఁ, జనుదెంచి పరాసుఁ డయ్యెఁ జయ్యన యే నీ
తనిఁ గూడఁ బోవకుండిన, నను జనులు కృతఘ్నుఁ డనరె నానాభంగిన్.

క. ఎలనాఁగలుఁ జుట్టంబులుఁ, గలుగుదు రెచ్చోట నయినఁ గర మరుదారం
దలఁప సహోదరు నెలమిం, గలుగఁగ నెచ్చోటఁ బడయఁగాఁ దర మగునే.

వ. అని బహుభంగుల విలపించుచు నెవ్వగలం బొగులుచు బాష్పధారాసిక్తాననుం
డగురఘువీరుం గనుంగొని డెందంబువంత దొలంగించుచు సాంత్వనపూర్వకం
బుగా సుషేణుం డిట్లనియె. 1590

తే. తగునె యీక్రియ రఘుకులోత్తంస వగవ
నరయ దేవర యెఱుఁగనియదియుఁ గలదె
సర్వకార్యములకు వినాశకర మయిన
శోక ముడుగుము ధైర్యంబు ప్రాకటముగ. 1591

శా. మేనం బ్రాణము లున్న వీతనికి నున్మేషక్రియాసుందరం
బై నేత్రద్వయ మబ్జపత్రసదృశం బై యున్న దాస్యంబు రా
కానీహారకరోపమంబు గరయుగ్మంబుం బ్రవాళప్రతీ
తానూనచ్ఛవి నొప్పుచున్నయది వీతాసుత్వ మిం దున్నదే. 1592

తే. నిద్ర నొందినచందంబు నెరయ నితని, హృదయపంకజ మల్లన యదరుచున్న
దినకులేశ్వర నావాక్యమెలమి నమ్ము, మితఁడుసప్రాణుఁడై యుంట యింతనిజము.

సీ. అని హనుమంతుతో నాసుషేణుం డను, జాంబవంతుఁడు మహౌషధులవిధము
మును నీకు నెఱిఁగించె మునుకొని సావర్ణ్య, కరణియు సంజీవకరణియు మఱి
సంధానకరణి విశల్యకరణి దెచ్చి, సౌమిత్రి బ్రతికింపు సరభసమున
లవణపయోరాశి లంఘించి యాకుశ, ద్వీపంబు దాఁటి యుద్వేల మయిన
పాలవెల్లి గడచి యావలి నుత్తరమునఁ, బరఁగు ద్రోణచంద్రగిరివరమ్ము
లమృత మచట నుండు నందు నీమందులు, గలవు రాత్రులందు వెలయుచుండు.

వ. అక్కడ గంధర్వరాజులు పెక్కండ్రు తద్దివ్యౌషధంబులు గాచుకొని యుండుదు
రు వారలతోడఁ బోరు గలుగు మఱియు నడుమఁ గామరూపధరులు వివిధమా
యావిశారదులు నగువిభావరీచరులతోడం గయ్యంబు ప్రవర్తిల్లు నప్రమత్తుండ
వయి యరుగు మిచటికి మూఁడులక్షలు నిరువదివేలుయోజనంబులు నీకు రాక
పోకల నినుమడించు. 1595

తే. ఒగి విభావరి యవసాన । మొందకుండ, రవియు నుదయాద్రిమీఁదికి । రాకమున్న
యింతలోనన రమ్ము క । పీంద్రతిలక, తడవుసేసినఁ గార్యంబు । దప్పిపోవు.

క. ఆకులు మిక్కిలి తెల్లన, ప్రాకటముగ వానిపండ్లు । పచ్చన పుష్పా
నీకమ్ము లరయ నెఱ్ఱన, నీ కెఱిఁగించితిని వాని । నిజ మగుచిహ్నల్. 1597

శా. ఈచందంబున నాసుషేణుఁ డన ధా । త్రీశుండు సామీరితో
నీచే నీపని సిద్ధిఁ బొందు టిది దా । నిక్కంబు వే పొమ్ము ర
మ్మా చిత్రమ్ముగ నాకు సోదరుని ని । మ్మా ద్రోణశైలంబు దె
మ్మా చిత్తంబు ప్రమోద మొందఁగ ననా । మాన్యప్రభావోదయా. 1598

క. సోదరుల మేము నలువుర, మైదవతోఁ డగుదు వీవు । ననయముఁ జేతో
మోదంబు మిగులఁ గలుగుఁ గాఁ, నాదెసఁ గృపసేయవయ్య । నగచరవర్యా.

మ. అని యారాముఁడు పల్క నాతఁడు [1]సమ । గ్రానందుఁడై యుబ్బి యా
ర్చినఁ గంపించెను లంక వార్ధి గలుషిం । చెన్ దిక్కు లల్లాడె భూ
మి నగంబుల్ చలనంబు నొందెఁ బగిలెన్ । మి న్నంతలోఁ బుష్పవృ
ష్టి నిలింపుల్ గురియించి రోలి మొరసెం । జెల్వారఁగా దుందుభుల్. 1600

వ. అంత హనుమంతుండు మేదినీకాంతున కిట్లనియె. 1601

శా. సప్తద్వీపసముద్రముద్రితమహీ । [2]చక్రంబునన్ వేగఁ బ
ద్మాప్తుండుం బొడతేకమున్న యణుమా । త్రార్ధంబునన్ వత్తు నే
నాప్తుండం గలుగంగ నోషధగిరి । వ్యావృత్తి దా నెంత సం
[3]ప్రాప్తప్రాణునిఁగాఁ దలంపవె యమో । ఘారంభు నీలక్ష్మణున్. 1602

క. అనవుడు నాతని నుపగూ, హనమున మన్నించి రఘుకు । లాధిపుఁడు ముదం
బున నాశీర్వాదంబులు, మన మారఁగ నొసఁగె ననుప । మానప్రీతిన్. 1603

సీ. హరి శిర మాదిత్యుఁ । డాననపద్మంబు, శశి మనోవృత్తియు । శైలతనయ
కటియు వాయువు వీఁపు । కామారి వాలంబు, నగ్ని పాదంబులు । నబ్జభవుఁడు
మతిఁ బాశహస్తుండు । మహనీయశక్తియుఁ, బంకజనాభుండుఁ । బాణియుగము
గజముఖుఁ డుదరంబుఁ । గడఁకతో నేర్పడ్డుఁ, గాతురు నినుఁ బ్రీతిఁ । బ్రోతురెపుడు
ననిన నుత్సుకుఁడై యాతఁ । డడరియుబ్బి, వినయసంభ్రమసద్భక్తి । వివశుఁడగుచు
వీరశేఖరుపాదార । విందములకు, నెరఁగి వానరకోటులు । నెలమిఁ జెలఁగ. 1604

—✿ హనుమంతుఁడు రెండవసారి సంజీవనిఁ దేఁబోవుట. ✿—

సీ. శేషాహి వ్రేఁగున । శిరములు వంపంగ, నవనీధరంబుపై । నడ్డు నూఁది
సురరాజకరికర । స్థూలహస్తంబులు, మింటితో నొరయంగ । మీఁది కెత్తి
వాసుకి కెన యన । వాలినవాలంబు, పెఱిగి చుక్కలతోడ । నొరయుచుండ

1 "సమగ్రారంభుఁడై. 2 చక్రంబు వేగంబ పద్మా. 3 సంప్రాప్తప్రాణుఁ దలంపు లక్ష్మణు నమోఘారంభసంభావనా". అనియే వ్రా. ప్ర.

మేరుశైలంబుతో ♦ మేలమాడెడిమేని, [1]మెఱుఁగుల మిఱుమిట్లు ♦ గిఱిగొనంగ
నడు మొకింత వంచి♦మెడయు సంకోచించి, నెగసెఁ దోన గిరులు♦నెగసి వెంటఁ
దగిలి పఱవ నభ్ర♦తటినీజలంబులు, గలఁగి దిశలఁ గడచి ♦ కడలుకొనఁగ.

చ. సరసిజనాథముక్త మగు♦చక్రముకైవడి దుర్నిరీక్ష్యుఁడై
[2]సరభసవృత్తి గంధవహు♦చాడ్పున నేఁగుచుఁ గాంచె మేదినీ
ధరములుఁ గాననంబులు న♦దంబులుఁ బుణ్యనదుల్ మహాసరో
వరములు నూళ్లుఁ [3]బల్లెలును ♦ వాసికి నెక్కిన దేవభూములున్. 1606

క. అట వేగరు లగువారలు, పటురయమున నేఁగుదెంచి ♦ పంక్తిముఖున క
చ్చటి రాముకార్యగతు లు, త్కటమున నెఱిఁగించి రతఁడు ♦ తల్లడ మందన్.

క. విని యాచారులఁ బోవం, బనిచి విచారించి విగత♦పరివారుం డై
చనుదెంచెఁ జంద్రహాసము, గొని యల్లన కాలనేమి♦గృహమున కంతన్. 1608

ఆ. అర్ధరాత్రసమయ ♦ మగుట నచ్చో నున్న, కాంత లెల్ల నతనిఁ ♦ గాంచి కాలుఁ
డరుగుదెంచె ననుచు ♦ నంతంత నడఁగంగ, నెఱుఁగనట్ల పోలె ♦ నిల్లు చొరఁగ.

చ. వినయముతో నెదుర్కొని ప్ర♦వీణతమైఁ దగఁ గాలనేమి యా
దనుజకులాగ్రగణ్యునకుఁ ♦ దద్దయుఁ బెంపున నర్ఘ్యపాద్యముల్
మన మలరంగ నిచ్చియు స♦మాదరణంబునఁ గేలు మోడ్చి యి
ట్లనియెఁ దదీయమానసము♦నందుఁ గుతూహల ముప్పతిల్లఁగన్. 1610

క. నడురేయిఁ బిలువఁ బంపక, కడుఁగొని నీ వరుగుదెంచు♦కత మెయ్యది యేఁ
దడయక చేసెద నోపిన, నడపక నీరాక నాకు ♦ నెఱిఁగింపు తగన్. 1611

వ. అనిన దశముఖుం డతని కిట్లనియె. 1612

చ. అనుజుఁడు నాదుశక్తిఁ దెగ♦టాఱినచో బ్రతికింపఁ బూని నేఁ
డనిలజుచేత రాముఁడు మ♦హౌషధశైలము దేరఁ బంపినం
జనియెడు నాతఁ డిప్పుడు స♦సంభ్రముఁడై వడి వాని నీవు చం
పిన నది మేలు వైరిగణ♦భీషణబాహుబలంబు చొప్పడన్. 1613

క. ఏవెంట నయినవిఘ్నము, గావింపుము భానుఁ డుదయ♦గతుఁ డగునేని
జీవింపఁడు విమతుం డది, గావున నాకోర్కి దీర్పఁ ♦ గాఁ దలఁకొనుమా. 1614

సీ. ఆక్రోణగిరిక్రేవ ♦ నడవిలో నొకసరో, వరము దేవాసుర♦విరచితంబు
గల [4]దందులో మహో♦గ్రగ్రాహియది యుండి, వడిఁ బ్రింగు వనగజా♦వలులనయిన
దానికి వెఱచు సు♦త్రాముండు నీశుండు, నైనను నరయ వ♦నాటుఁ డెంత
మసలక యాహను♦మంతు నాకొలనిలోఁ, జొచ్చునట్లుగఁ జేయు ♦ సురుచిరముగ
నీవు దప్ప నాకు ♦ నీవేళ నెవ్వఁడు, తెఱఁగుతోడఁ గోర్కి ♦ దీర్చువాఁడు

1. మెఱుఁగులతుప్పలు గిఱిగొనంగ. 2. సరభస మైనయాశసముచాడ్పున. 3. బట్నములు.
4. దందులో మహాగ్రాహి మకరి యుండు, నది మ్రింగు వనగజహారుల నైన.

చనుము కార్యసిద్ధి సమకూరఁ జేయుము, దనుజవంశతిలక యనిన నతఁడు.

ఉ. దేవర యానతిచ్చుపని దీర్చెద నేర్చినభంగి నీదుసం
భావన లన్నియున్ వఱితిపాలుగఁ జేయుట నాకు మంచిదే
సేవిధి నైన దేహుల కెల్లవిధంబులఁ జేటు గల్గుటన్
జీవితకాంక్ష గా దయినఁ జెప్పెద నొక్కటి నీకు నేర్పడన్. 1616

క. నేరమి మాయామృగ మయి, మారీచుఁడు నీకు వెఱచి మానవపతిదు
ర్వారశరంబునఁ గూలు వి,చారము నా కొదవఁ జొచ్చె శక్రారాతీ. 1617

మ. ఖరు నాదూషణుఁ దీవ్రసత్త్వుఁ ద్రిశిరున్ గర్వాంధు నక్షున్ భుజా
స్ఫురణాఢ్యుం డగుకుంభకర్ణుని నికుంభుం గుంభు నమ్మేఘనా
దు రణోగ్రున్ మకరాక్షు దుర్దమబలున్ ధూమ్రాక్షునిం జేర్చి చం
పిరి పెక్కండ్రు గపీంద్రులున్ నరులు నీకెపెం పెల్ల వే తూలఁగన్. 1618

మ. సుతులం దమ్ముల మిత్రులన్ సుభటులన్ సొంపారఁగా నాజి జం
పితి విం కేటికి లంక దమ్మునకు సంప్రీతిన్ సమర్పించి భూ
సుత నారాముని కిచ్చి తాపసుఁడ వై శోకంబు పెల్లార్చి రా
జతశైలంబున కేఁగు మిక్కిడివృథాసంజీవనం బేటికిన్. 1619

ఉ. ఓపితి వేని శాపుపరిఘోన్నతితో సరిఁ బోను మొందె సా
టోపదురంతరాఘవకఠోరశరాగ్నులయందు మ్రగ్గి [1]దు
ష్పాపపదంబు నాఁ బరఁగుసన్నుతవిష్ణుపదంబు నొందు మీ
యాపద నిస్తరింపఁగ నుపాయము లెక్కడి వింక రావణా. 1620

మహాస్రగ్ధర. అనినన్ దుర్వారగర్వస్వ్యతికరకలుషోదగ్రనేత్రానలీసం
జనితోద్దామస్ఫులింగస్థగితదశదిశాచక్రుఁ డై వక్త్రనిర్య
ద్ఘనధూమస్ఫారజీమూతపటలగుచిరధ్వాంతుఁ డై చంద్రహాసం
బున వ్రేయంగాఁ దలంచెన్ భ్రుకుటికుటిలుఁ డై పూర్వదేవేశుఁ డంతన్.

క. మది నీకుఁ గోప మేటికి, నిదె వెసఁ జనుచున్నవాఁడ నిప్పుడ యనుచుం
బదములకు నెరఁగి వీడ్కొని, కదలెన్ మారీచసుతుఁడు గ్రక్కునఁ జడలన్.

వ. అంత నద్దశముఖుండు క్రమ్మఱి వచ్చి యంతఃపురంబు సొచ్చి సెజ్జపయి మేను
వైచి నిర్భరచింతాభరపారావారనిర్మగ్నుం డై యుండె నంత నక్కడఁ గాల
నేమియును. 1623

—మారీచసుతుం డగుకాలనేమి రావణుపంపున మాయాతపస్వి యగుట.—

సీ. చంపకసహకారజంబీరపాటల,నారంగపున్నాగనారికేళ
తాలతమాలహింతాలకేసరపూగ,మందారకురవకమాతులుంగ
కర్ణికారాశోకఖర్జూరకృతమాల,ఘనసారచందనపనససాల

1. దుష్పాపహరంబు నా.

స ప్తపర్ణ పలాశ సర్జర సార్జున, వటనల్ల కాశోక కుటజతరువు
లెలమి సాంసార వేదశాస్త్రేతిహాస, పఠనములు రత్నమయదీప భరితగుచులు
వల్కలంబులుసుహుతపావకములొప్పఁ, గలుగునాశ్రమ మొక్కటి కడఁగిచేసె.

సీ. వల్లరీవలమాన ఝల్లరీఝుంకార, వల్లకీకలనాద వేల్లితంబు
వరకుహూకంఠీర వస్ఫారకంఠీర, వత్రస్తపథికే భవలయితంబు
శుకశారికారబ్ధ సురుచిరశ్రుతితర్క, మూలవచోయుక్తి ముఖరితంబు
శింజానమంజీర మంజుగుంజితహంస, సారసోత్సుక సార సారసంబుఁ
బ్రాజ్యమంత్రస్వరయుతదీ ప్రాజ్యహోమ, ధూమధూసర కేసర ద్రుమవిభాగ
మాహుతీరీతశిఖిశిఖా వ్యాకులంబు, నైనయాశ్రమమండల మది దనర్చె.

క. భాస్వరవిశాలతరకా, [1]త్నస్వరతోరణవిరాజితమ్మును ఘనవే
దస్వరముఖరితనభము వి, కస్వరబహువిటపివల్లి కాకలితంబున్. 1626

క. తమలోన సహజ మగువై, రము దక్కి మృగేంద్రకుంజరంబులు శార్దూ
లమృగములు బర్హిణభుజం, గమములు మక్కువలు గలిగి కడు నొప్పారన్.

సీ. నిక్కి మూఁపులు వంచి ముక్కుపైఁ దనదృష్టి, నిలిపి నిశ్చింతత నెలకొనంగ
జప మంచు నొకపాటి నెప మిడి పలుకుచు, జపమాలపూసలు జరపి జరపి
జడలును రుద్రాక్ష లొడలివిభూతియుఁ, బొచ్చె మేమియులేక యచ్చుపడఁగ
ఘనతపోవ్రతములఁ గడు డస్సి కృతకపు, శ్రమమున మిక్కిలి యమరియున్న
కాలనేమిచేతఁ గమనీయతర మైన, యాశ్రమంబు సూచి యనిలసుతుఁడు
యిది మహాద్భుతంబు [2]గ×× ఁగ వనంబొకో, యిచటమున్నగాన మేమియొక్కొ.

క. ఎక్కడిపాలసముద్రం, బెక్కడియూపసిఁడికొండ యెక్కడివిపినం
బెక్కడిద్రోణమహీధర, మక్కట మార్గంబు దప్పె నతిరభసమునన్. 1629

మ. అనుమానింపఁగ నేల యీద్విజునిచే నధ్వక్రమం బేర్పడన్
విని యే నేఁగెద నంచు డిగ్గి ఫలముల్ వీక్షించి కాంక్షించి కో
పనశీలుర్ మును లంచు నుగ్రతరశాపత్రస్తుఁడై మాని య
మ్మునికిం జాఁగి నమస్కరించి పలికెన్ మోదంబు సంధిల్లఁగన్. 1630

ఉ. మారుతసూతి నేను హనుమంతుఁడ రాముఁడు పంపఁగాఁ బయో
వారిధి కేఁగుచో నొదవె వావిరి మై జలతృష్ణ నాకు నీ
చేరువఁ దోయముల్ గలవె చెప్పుఁడు నావుడు నవ్వి యి ట్లనున్
ధీర కమండలూదకము తృష్ణ సనం దగఁ ద్రావు మేర్పడన్. 1631

వ. అమృతోపమానంబులు రసవంతంబులు నగుఫలంబు లుపయోగించి యీరా త్రి యిచ్చట నాసమీపంబున నిద్రాసుఖం బనుభవింపు మేను భూతభవిష్య ద్వర్తమానంబు లగుమూఁడుకాలంబులు నెఱుంగుదుఁ దపోబలంబున రాఘవు

1. త్నస్వరతోరణవరణవిరాజితమును వేద. 2 యేమునివన మొకో, యచల...గాన నేమి.

కృత్యంబు సమస్తంబును నాకధిగతంబు. 1632

సీ. ఆరాముసుందరి ౹ నాసీత దశకంఠుఁ, డచ్చుగా వంచించి ౹ తెచ్చుటయును
దన్నిమిత్తంబునఁ ౹ దగ వాలి వధియించి, కడఁగి సముద్రంబు ౹ గట్టుటయును
లంకచుట్టును బెనుఁ ౹ లగ్గపట్టుటయును, గొనకొని దితిజులఁ ౹ గూల్చుటయును
ఘననాదుఁడును గుంభ ౹ కర్ణుండుఁ బడుటయు, శోకించి కోపించి ౹ సురవిరోధి
శక్తి వ్రేసి కూల్ప ౹ సౌమిత్రిఁ దజ్జీవ,నార్థ మరుగుదెంచె ౹ దరయ నీవు
గాన లేరు ధర్మ ౹ హీనులు నను నీకుఁ, గానఁబడితిఁ బుణ్య ౹ ఘనుఁడ వగుట.

చ. చెలువుగ రామకార్యములఁ ౹ జేయుట మా కది లెస్స యౌషధా
వలు లవలీల నీకుఁ గన ౹ వచ్చువిధంబుగ దివ్యమంత్రముల్
నలి నుపదేశ మిచ్చెద వ ౹ నంబున నిక్కడ నట్టిమందులుం
గల వవి వాని రేపకడఁ ౹ గైకొని యేఁగుము లంక కిమ్మెయిన్. 1634

ఆ. విను నిమేషమాత్ర ౹ మునకంటె వేగంబ, లంక కరుగునట్టి ౹ లావు గలుగు
నాదుమంత్రశక్తి ౹ నయమున ననవుడుఁ, బలికెఁ గ్రమ్మఱంగఁ ౹ బవనసుతుఁడు.

మ. అట రామానుజుఁ డీల్గి యుండ నిట న ౹ న్యాయంబు నాయున్కి య
క్కట నోరాదు నె నాకుఁ బండ్లు దినఁగాఁ ౹ గన్మోడ్చి నిద్రింప మి
క్కుట మీతృష్ణ కమండలూదకము సం ౹ కోచంబునుం గాన యి
చ్చట వాపీతటినీనదంబు లలరుగ ౹ సంప్రీతితోఁ జెప్పవే. 1636

క. కడ లేనినీసుకరుణం, గఁడుపారఁగ నీరు ద్రావి ౹ కద లెదఁ గడఁకం
దడ వయినఁ బ్రొద్దువోడుచుర్గ, మడియును సౌమిత్రి మఱియు ౹ మగుడఁడు విప్రా.

వ. అనిన నమ్మహామాతాపసుండు దరహసితవదనుం డై యిట్లను మదీయాశ్రమంబు నకుఁ బూర్వభాగంబున నొక్కదివ్యసరోవరంబు గలదు నీ వందుల కేఁగి యమృతతులితంబు లగుతత్పుణ్యసలిలంబులు యథేష్టంబుగాఁ గ్రోలుము నీవు ననం తసత్త్వసంపన్నుండ వయి యొప్పెద వద్దివ్యౌషధంబులు నీకుం బొడసూపు నరుగు మని తనకూటశిష్యగణంబులచేతం ద్రోవ చూపించినం గపివరుండును గరళమిళితం బగు తేనియం బోలునమ్మునిపలుకులు విని యజ్జలాశయంబు గాంచి.

—హనుమంతుఁడు ధాన్యమాలిని యున్నకొలంకునకుఁ బోవుట.—

చ. మదనునియాటప ట్టయిన ౹ మావులజొంపములందు మ్రోయుతే
మ్మొదలు దదీయశింజినికి ౹ మిం చొదవింపఁగ రాగసంపదు
న్మదపికకూజితంబులును ౹ మన్మథకీర్తన సేయుచుండ మై
పొదలఁగ ముగ్ధవాక్యశుక ౹ పోతకసంశ్రయశాఖశాఖ మై. 1639

సీ. మలయమారుతమున ౹ మలయుపూఁదీఁగల, విరులనెత్తావులు ౹ వెల్లిగొనఁగ
మానక ౹ తొరఁగెడు ౹ మకరందరసములు, కాలువ లై భూమిఁ ౹ గలయఁజాఱఁ
దేఁటిమొత్తంబులు ౹ తెఱవలతోఁ గూడి, వలరాజుబిరుదులు ౹ వఱలఁ బాడఁ

బొలుపార నెగసినపుష్పాళి వనలక్ష్మి, కమనీయ మగుమేలుకట్టనంగఁ
దలిరుటాకులు మరుత్తూపుటలుఁగు లనఁగఁ
గోరకములు వనపులకాంకురము లనఁగ
వనవసంతుఁడు శాసించువన మనంగఁ
దిరిగి వచ్చినతరుపంక్తిఁ బరఁగుదాని. 1640

చ. తిలకితకాంతి నొప్పఁ గలతీఁగల నుయ్యెల లూఁగురాజహం
సలఁ జెలువారుదానిఁ గలసారసరాజితమత్తకూజితం
బులఁ బొలుపారుదాని నలిపోతకమేదుర[1]గుంజనాదసం
కుల మగుదానిఁ గ్రౌంచబకకోటియుతం బగుదాని నెంతయున్. 1641

చ. కనకసరోజజాలములఁ గైరవషండములన్ వికస్వర
స్వనమధుమత్తమత్సరణసంయుతనీలసరోరుహంబులన్
జనితతరంగరంగదలిచంచలహల్లకజాలకంబుల
న్వనజముఖీవిలోలనయనచ్ఛవిమీనకదంబకంబులన్. 1642

క. చెలువారుదాని నున్మద, కలహంసనినాదవిహగకలకలమధుపా
వలిగుంజితపికకోలా, హలసారసగీతచిత్తహర మగుదానిన్. 1643

సీ. కామినీకమనీయగతివిభ్రమస్పర్ధి, రాజహంసీరాజిరాజితంబు
మానినీవక్షోజమండలాసూయాఢ్య, వలమానచక్రవాకలసితంబు
లలనాజనభ్రూవిలాసాపహాసిత, రంగరంగదభంగసంగతంబు
నారీవిలోచననవకాంతితస్కర, వికసదుత్పలవనవిలసితంబు
ఫుల్లకైరవమకరందపూరితంబు, మీలితాంబుజగతభృంగమిథునయుతముఁ
గూలతరుపతితకుసుమలాలితంబు, నగుసరోవర మల్లన యతఁడు మ్రోల.

మ. కని సమ్మోదముఁ బొంది వాయుజుఁడు దృక్పంకేజముల్ మూసి య
ల్లన యాలోనికి డిగ్గి పైకలఁక నేలం బాయఁగాఁ ద్రోచి యే
చినతృష్ణం దనివోవ [2]నుద్ధతమహాజీమూతమో నాఁగఁ గా
ననమాతంగముఁబోలెఁ దోయము లనూనప్రేమతోఁ ద్రావఁగన్. 1645

చ. సరసమనంబునం దనివి చాలక దుస్తరదుర్భవోగ్రసా
గరమున మున్గి దుర్విషయగాథరసంబులు గ్రోలువాని మా
య రభస మొంది మ్రింగుక్రియ నాతనియంఘ్రియుగంబు పట్టె ని
స్సరదురువేగ మై మకరి శాపవిముక్తియ కోరుకై వడిన్. 1646

మ. ప్రకటగ్రాహము దన్నుఁ బట్టె నని విభ్రాంతాత్ముఁడై చూచి తా
మకరింగాఁ బరికించి [3]యుద్ధతరసోన్మాదంబునం జేర్చి వా
లకతోరాళని దానిపంట్లు డులిచెన్ లంకేశలోలద్యశ

1 మంజుగానసంకుల. 2 ‘నుద్ధతమహీజీమూతమో’ అ. ప్ర. 3 యుద్ధురతరోన్మాదంబునం.

శ్శకలప్రక్రియ దోఁప మారుతి మహాసంరంభసంపన్నుఁడై. 1647

ఆ. అదరి వైనతేయుఁ డహిఁ జీరుకైవడిఁ, బరుషకంటకాదిభరిత మైన
మకరిజిహ్వఁ ద్రుంచె మారుతతనయుండు, కఠినసునిశితాగ్రకరరుహముల.

చ. అదియును నంతఁ బోవక రయంబున నాఁగి మహాగ్రహంబునన్
బ్రిదులఁగ నీక పట్టుకొని భీకరదుస్సహశాపరోగశాం
తిద మగుదివ్యభేషజము తేఁకువతోఁ గొనుభంగి మ్రింగె న
స్మదుఁ డగువాయునందను నమానుషపౌరుషసత్త్వసాహసున్. 1649

సీ. అది దన్ను మ్రింగుచో నాతఁ డిట్లను నాత్మ, నేమిసేయుదు నింక నెద్ది తెఱఁగొ
జననాథుకార్యంబు చంద మిం కెట్లొకో, తెగటాఱవలసెనో దీనిచేత
వనజాప్తసుతుఁడును వనచరావలితోడఁ, బొలియునో నాజాడఁ బొందు లేక
[1]మేనితోఁ బాయునో మిథిలేంద్రతనయయు, మనువంశ్యకీర్తియు మడియునొక్కొ
యని విచారించి నేర్పున నడరి దీని,కుక్షిలోపల వడిఁ జొచ్చి కూల్తు ననుచుఁ
దనువు సన్నముగాఁ జేసి తఱిమిచొచ్చె, నంధకూపములోపల నడఁగునట్లు.

క. కడుపారఁగ నాహారము, పడసితి నని ఘోరమకరి ప్రమదం బెసఁగన్
జడములలోనికి నరిగెం, దడయక పవమానుకూర్మితనయుం డంతన్. 1651

క. నరములు ప్రేవులు నెమ్ములు, వెరవారఁగఁ ద్రెంచి త్రుంచి విఱిచి యుగ్ర
స్ఫురణమున నోన నిండిన,గరళముచందమున నోర్వఁ గా రాకున్నన్. 1652

ఉ. ఉగ్రతర మైనవేదనకు నోర్వక భీకర మైనవక్త్రగ
హ్వరము రయంబునం దెఱవ వావిరి భీకరనక్రకూర్మన
క్రరసముపేత మై జలము దొట్టుచు వచ్చిన వాత నించెఁ బొం
పిరి దగ వాయునందనుఁడు ప్రేవులప్రోవులముద్దఁ జెచ్చెరన్. 1653

చ. నెఱఁకులు దాఁకి నొప్పి వడి నెమ్మనముల్ దిగులొంద సంధులున్
నుఱుముగఁ బార్శ్వభాగములు నుగ్గుగ నెత్తురు గ్రమ్మ నెమ్ములున్
విఱుగఁగ మాంసపూరములు వే నెఱయంగ నరంబు లన్నియున్
నెఱి దెగిపోవ నమ్మకరి నిల్వఁగ నోర్వక సంచలించుచున్. 1654

వ. పైపయిం బ్రవర్ధిల్లుమూర్ఛ నొందుచు దుశ్చికిత్సం బగుమహావ్యాధియుం బోలె సముద్రోదరగతం బగుబడబానలంబు ననుకరించుచు మందిరాంతరజాజ్వల్యమానపావకునివిధంబునఁ బరిఘానాంతర్లీనమహోరగంబుకైవడిని గర్భకుహరవర్తి యైనయతనివిజృంభణంబున నోర్వక తదీయచరణనఖరతలప్రహారముష్టివిదారణవాలఘట్టనంబులు సైరింపం జాలక యొఱలుచు నిది నాకు నఱుగునాహారంబు గాదు దీన మరణంబు సిద్ధం బగు నని వెగడొందుచున్నంతఁ బ్రాభంజని యమ్మహోగ్రగ్రాహిరుధిరప్రవాహంబుల సిందూరితజలం బగుతత్సరోవరతటం

1 మేనితోఁ బాసెనో మిథిలేంద్రసుతయును, మనువంశకీర్తియు మడిసెనొక్కొ.

బునకు దానిం జేర్చి ప్రచ్చి వెడలివచ్చి. 1655

చ. తిమిరచయంబు వాసి చనుదెంచిననూతనభానుఁ బోలి రా
హుముఖవినిర్గతామృతమయూఖుఁ డనం దగి యొప్పె సాంద్రర
క్తమునఁ బరీతుఁ డై యతివికస్వరశుద్ధతరాంతరంగుఁ డై
సముదితబాడబానలవిసారిశిఖావృతవార్ధిఁ బోలుచున్. 1656

సీ. వనభూమిఁ జూడంగ వనయంబు నేతెంచి, వఱలుజలాధిదేవత యనంగ
వాసవుఁ బెడఁబాసి వచ్చినసురలోక,లాలిత్యయుతరాజ్యలక్ష్మి యనఁగ
వలరాజుతోడుత నలిగి లోకతమునఁ, దిరిగి యాడెడురతీదేవి యనఁగ
సలిలవిహారంబు సలుపంగ నరుదెంచి, చెలువారుకాననశ్రీ యనంగఁ
జెలఁగుకన్నులుఁజన్నులుఁజిన్నిమొగము, గలువఱేకులచెన్ను జక్కవలయన్ను
నిండుచందురుచందంబు నెరయ గెలిచి, మానినీత్వంబు గైకొన్నమకరిఁ గాంచె.

శా. ఆలోనన్ మణికాంచనోజ్జ్వలవిమానారూఢ యై విస్ఫుర
ద్రోలంబాలకహేమబంధురచలద్దోర్మ్యాలవిద్యుల్లతా
జాలంబుల్ వెసఁ దొంగలింపఁగ నురోజద్వంద్వకుంభంబులన్
లీలం బయ్యెద మాటుసేయుచును బల్కెం బ్రీతిపూర్వంబుగన్. 1658

ఉ. అంబుజమిత్రతేజ పవనాత్మజ కీశపతీ భవత్ప్రసా
దంబున నాకుఁ బూర్వకృతదారుణశాపవిముక్తి గల్గె నే
నుం బురుహూతునొద్ద కిదె నూతన నై చనుచున్నదాన నీ
కుం బరమార్థవృత్తి సమకూరఁగ నొక్కటి విన్నవించెదన్. 1659

సీ. వలనుగా నీసరోవరమున మకరి నై, యుండుట యారావణుం డెఱింగి
మాయావి యైనయామారీచనందనుఁ, బంపిన వీఁడు తపస్విరూప
మున వచ్చి నాచేత నిను వధియింపఁగఁ, బుత్తేర నేతెంచి పూని నీవు
నలిఁ బట్టువడియును బలసిద్ధుఁడవు గాన, విడిపించికొంటివి తడయ కిపుడు
వీని నమ్మ వలదు వేవేగ దెగఁ జూడు, మరయ నిదియుఁ గృత్రిమాశ్రమంబ
యిచటి కుత్తరమున నేపారుదుగ్ధాబ్ధి, త్రోవ నీకు నిదియ ద్రోణగిరికి. 1660

ఉ. అనినన్ విస్మయ మంది యిట్లను ముదంబారంగ సామీరి యా
ఘనగంభీరజలాశయంబున మహోగ్రగ్రాహి వై యుండి చ
య్యన దివ్యాంగన వైతి వెట్టులు మనోజ్ఞాభాషణప్రక్రియ
న్వినిపింపం దగు నేని చెప్పఁ దగు నన్నింద్రాబ్జపత్రేక్షణా. 1661

—✿ ధాన్యమాలిని తనపూర్వవృత్తాంతము హనుమంతునకుఁ జెప్పుట. ✿—

వ. అనినం ద్రిదశకాంత దనపేరు ధాన్యమాలిని యని చెప్పి. 1662

ఉ. తొల్లి మనోజ్ఞలాస్యమున దోషితుఁ డై గిరిశుండు వేడ్కనం
దిల్లఁగ నాకు నిచ్చెఁ దగుదివ్యవిమానము దాని నెక్కి నే

నెల్లజగంబులుం గలయ § నించుకమాత్రన సంచరించి యు
త్ఫుల్లసరోజషండములఁ § బొల్పగుసీనలిలాశయంబునన్. 1663

మ. జలకేళీరతి నున్న నాకడకు రాజేజద్దివ్యతేజుండు ని
శ్చలదుస్సాధతపోధనుం డెలమితో § శాండిల్యుఁ డేతెంచి సం
చలితాత్ముం డయి నన్నుఁ జూచి మదనా § స్త్రవ్రాతపాతవ్యథా
[1]కలితుం డై పలికెం బ్రియోక్తుల సరా § గస్వాంతుఁ డై యేర్పడన్. 1664

మ. తరుణీ నాదెస నిల్పు మించుక దయా § ర్ద్రం బైననీచూడ్కి సుం
దరమందస్మితకాంతి నెమ్మొగమునం § దళ్కొత్తఁగాఁ బల్కు ని
ర్భరవక్షోజయుగంబు నాయురముపై § రాగిల్లఁ బైకొల్పు దు
ర్ధరకందర్పదవాగ్ని యార్పఁ దరమే § తన్వంగి నా కెమ్మెయిన్. 1665

సీ. జిగిఁ దళుకొత్తునీ § చెక్కులు పలుమాఱు, చుంబింప వేడుక § సురుచిరముగఁ
బవడంపుఁగెంజాయఁ § బరఁగినకెమ్మోవి, యమృతంబు గ్రోలంగ § నాస మీఱఁ
జిక్కనిపయ్యెదఁ § బిక్కటిల్లెడుచన్నుఁ, గవ నాయురంబునఁ § గదియ నదుమఁ
దిరిసెంపుఁబువ్వులఁ § దెగడుదోర్వల్లరీ, [2]యుగమునఁ గాఁగిటి § గొనరఁ జేర్పఁ
దలఁపుకోర్కులు పరిపాటి § దప్పెనేని, మదనుతూపులు నన్నేల § మనఁగనిచ్చుఁ
బ్రాణరక్షణ మరయంగఁ § బరమధర్మ, మని యెఱుంగవె యుత్ఫుల్ల § వనజవదన.

వ. అనిన నమ్మునీంద్రునిపలుకులు విని యల్లన యి ట్లంటి. 1667

చ. అరయఁగ సర్వసిద్ధులకు § హానికరంబులు నెల్లభంగులన్
దురితపదైకమూలములు § దుష్టతరంబు లధర్మమూలముల్
సురతసుఖాభిలాషములు § సూరులు మెచ్చరు వీని నీవు దు
ర్భరతరభవ్యదుశ్చరత § పఃఫల మాఱడిఁ బుచ్చఁ బాడియే. 1668

క. అని పలికిన శాండిల్యుఁడు, మనసిజశరపీడ్యమాన § మానసుఁ డై యి
ట్లనియెం దపమును జపమును, నినుఁ గవయుట సుమ్మి బుద్ధి § నిక్కువ మబలా.

చ. మదనునిపూవుటమ్ము లొగి § మర్మము లాడిన మేనఁ బ్రాణముల్
మదిఁ బరికింప నిల్వ వను § మానము లే దది కారణంబుగా
ముదమున నిన్నుఁ జెంది తప § మున్ సుకృతంబు ఘటింప నోపుదున్
బ్రదికిన సర్వసిద్ధులును § బన్నుగఁ బొందఁగవచ్చు నుగ్మలీ. 1670

చ. చటులసదర్పదర్పకభు § జంగమదష్టుఁడ నైతి నాకు న
క్కట యని పల్లవాధరవి § కస్వరసాంద్రసుధారసంబు ను
త్కటముగ నిచ్చి మన్పు మతి § దారుణమన్మథదావపావక
స్ఫుటితుఁడ నైతి మేలె తల § పోయఁగ నీ కిది ధాన్యమాలినీ. 1671

వ. అని యివ్విధంబున. 1672

1. కలితుం డై ... సరాగుం డై ప్రియం బేర్పడన్. 2. యుగము నాఁగాఁగిటి.

చ. పలుమఱుఁ బెక్కుచందములఁ బల్కుమునీంద్రుని బల్కి తీర్ రజ
స్వల నది గాన మూఁడుదివసంబులుఁ దాలిమినై సహింపఁగా
వలయుఁ గృతాభిషేక నయి వచ్చెద నాలవనాఁడ యిప్డు నర్
దలఁపఁగఁ బొందఁ గా దనినఁ దాపసముఖ్యుఁడు సమ్మతించినన్. 1673

వ. అంత నేనును గంధమాదనభూధరంబున కరిగితి నిట శాండిల్యుండు తద్దివసత్రయంబు యుగత్రయంబుగాఁ బుచ్చు చుండు నెడఁ బ్రథమదివసంబునాఁటిరాత్రి యందు దశగ్రీవుండు దిగ్విజయంబుసేసి సేనాసమేతుం డయి వచ్చి యామహీధరంబుపయి విడిసిన. 1674

సీ. బలములదండడిఁ బర్వతాగ్రముమీఁది,తోరంపుశిల లెల్ల దార్లిపడఁగ
సింధురఘనతరస్కంధకషణములఁ, గఱచుగాఁ దరువులు విఱిగి కూల
గుహాలలోపల నున్నకుంజరవైరులు, గోలాహలంబున జాలిగొనఁగ
సామజభేరుండశరభశార్దూలాది,తతులు భయంబునఁ దల్లడిల్ల
హరిణచయములు బెగ డొంది తిరుగఁబడఁగ
భుజగకులములు వడి బిలంబులు సొరంగఁ
దలఁకి పక్షిగణము నభస్థలికి నెగయ
నిర్ఝరావలి మిక్కిలి జర్ఝరముగ. 1675

ఆ. అంత దశముఖుండు నాగంధమాధన,శైలతటములందు సరసవృత్తిఁ
దిరిగి తిరిగి పువ్వుఁదీఁగలఁ బొదరిండ్ల, నెమ్మనంబు చెలఁగ నిలిచి నిలిచి.

చ. శ్రుతు లొడఁగూడ నింపు మది సొంపు వహింపఁగ మంద్రమధ్యతా
రతిలకితంబుగా సకలరంజనరాజిత మైన గేయ మేఁ
జతురతతోడఁ బాడుచుఁ బ్రసన్నతి నుయ్యెల లూఁగి యాడఁగా
నతులితశౌర్యధాముఁడు దశాననుఁ డక్కడి కేఁగుదెంచినన్. 1677

చ. కనుఁగొని జాతసంభ్రమవికారభయాకులితాంతరంగ నై
తనువు సమీరకంపితలతాగతిఁ దల్లడ మంద దీర్ఘలో
చనసరసీరుహంబులకు సంతమసం బొదవంగ నున్ననా
కనియె విభావరీచరకులాధిపుఁ డంగజరాగమత్తుఁ డై. 1678

శా. లంకానాథుఁడ సర్వరాక్షసకులాలంకారభూతుండ ని
శ్శంకుండర్ సమరంబులం దురుభుజాసారోగ్రుఁడర్ వాసవా
తంకాపాదనదక్షసాహసమహాదగ్రుండ నే నన్ను మీ
నాంకుం డిప్పుడు నీదునేత్రవిశిఖవ్యాలీఢుఁ జేసెర్ వెసన్. 1679

చ. తవిలి ప్రియంబుతో నవసుధారసపూరము గల్గుమోవి నేఁ
జవిగొని మెచ్చుచుర్ వలుఁదచన్గవ యక్కునఁ జేర్పఁ గోరెదం
గవయుము నన్ను మన్మథునిగాఢశరంబులఁ జాక మున్న యో

పవనవిధూయమానవరపంకజపత్త్రవిశాలలోచనా. 1680

క. అనిన రజస్వలఁ బరతంత్ర ననుం గవయంగ నీకుఁ దగ దని పల్కన్
దనుజపతి పరవశుం డై, యను నాతోఁ దమకపడుచు నతిలాలసుఁ డై. 1681

చ. సొలవక మద్యపానమునఁ జొక్కినయయ్యెలనాఁగలున్ రజ
స్వలలుఁ బరాంగనల్ గలుగ సంతస మందుదుఁ గాన నాకు మి
క్కిలి గడులెస్స యంచుఁ దమకించుచు వాఁడు రమించె దీర్ఘికా
జలజిని మత్తసింధురము సంభ్రమ మొంది నలంచుకై వడిన్. 1682

వ. అంత. 1683

శా. నాగేంద్రప్రతిమానహస్తుఁ డసమానప్రాభవోద్యన్మరు
న్నాగేంద్రప్రథితోగ్రవిగ్రహుఁ డనూనభ్రాజమానప్రతా
పాగణ్యుండు విశాలవక్షుఁడు కఠోరాకారుఁ డై నాకు స
ద్యోగర్భంబున నుద్భవించె నతికాయుం డింద్రవిద్వేషి యై. 1684

వ. దశముఖుండు వానిం దోడ్కొని చనియె నంత వాసరత్రయావసానసమయంబు
నఁ గృతస్నాన నయి సంప్రాప్తశరీరశుద్ధిసాధిమ నై ధౌతపరిధానాభరణాంగరాగ
మాల్యాలంకృత నై మునివల్లభుమ్రోల నిలిచి యల్లన యిట్లంటి. 1685

క. కృతపుణ్యాశీల దివసత్రితయంబును గడచె నేఁడు దివిరిన వేడ్కన్
రతిసుఖము నీకు నీ వచ్చితి నన్నుఁ బరిగ్రహింపు చిత్తం బలరన్. 1686

వ. అనినంత. 1687

క. నాచందము శాండిల్యుఁడు, సూచి వివేకించి యకట సొలవక కడుదు
ష్టాచరణ నాకుఁ బ్రతికూలాచరణము సేయ నుచిత మగునే నీకున్. 1688

సీ. నామందిరంబులోనన యుండి వంచించి, యెవ్వనిఁ బొందితి వింతి చెపుమ
శఫరాక్షి నీవయస్సారస్య మెవ్వఁడు, మనమున బెగడక కొనియె నేఁడు
మగువ యెవ్వఁడు వచ్చి మదమున నీకచగ్రహణంబు గావించి కడఁగి పట్టె
నెలనాఁగ యిచటికి నెవ్వఁడు చనుదెంచి, కామాంధుఁ డై నిన్ను గాసిచేసెఁ
దగవు నీవు నిచటఁ దప్పితి గావున, నీజలాశయమున నోజ దక్కి
యడరి ఘోరమకరి వై యుండుమని యుగ్ర, శాప మిచ్చె నాకుఁ గోప మెసఁగ.

మ. అనురాగంబున నిన్నుఁ బట్టుకొని కామాయత్తుఁ డై గాసిచే
సినదుష్టాత్ముఁడు పుత్త్రసోదరసుహృత్సేనాసమేతంబుగా
ననిలో శత్త్రుచయంబుచేఁ బొలియు నన్యాయోదయత్పాతకం
బున నంచున్ ఘనశాప మిచ్చెఁ బ్రతిఘాస్ఫూర్జత్స్ఫులింగాక్షుఁ డై. 1690

సీ. ఎనయంగ దర్పజితేంద్రియత్వములకు, ననుభోగరతినిస్పృహత్వములకు
విదితమహామోహవిజ్ఞానములకును, ననురాగవైరాగ్యఘనతలకును
ఘోరతృష్ణాలోభదూరతములకును, జనసంగమరహానచతురతలకు

గురుతరాహంకార-[1]వరశాంతతలకును, మదలౌల్యరుచిరాప్ర-మాదములకుఁ
నొక్కచోట నునికి - యెక్కడ సిద్ధించుఁ, దిమిరమునకు నుదిత-తేజమునకుఁ
జటులపావకునకు-సలిలపూరమునకు, నెందు నరసి చూడఁ - బొందు గలదె.

చ. పరహితసత్యశీలకులభావదయాశమధర్మపుణ్యస
చ్చరితవివేకబుద్ధిభయ-సత్త్వగుణంబులు లేమ లున్నయా
పొరువునఁ బోవు చర్మమయ-పుత్రికలం దొకయింతసౌఖ్యముల్
దొరకునె మోసపోయి కడు - దూషితచిత్తుఁడ నైతి నక్కటా. 1692

క. నిరయమున కేఁగు తెరువులు, సురలోకము తెరువు గాని-చొప్పలును మహా
దురితంబులపొలిమేరలు, పరికింపఁగ నింతు లెందుఁ - బ్రవ్యక్తముగన్. 1693

వ. అని వితర్కించుచున్నయమ్మునివరునిం జూచి వడవడవడఁకుచు ముకుళితకర
కమల నై యిట్లంటి. 1694

చ. నిరుపమసత్కృపాకలిత - నే నపరాధిని గాను వాఁడు దు
ర్భరభుజసారుఁ డై బలిమిఁ - బట్టి పరాభవ మొందఁజేసె మీ
గురవడి శాప మిట్లుగ మ-హోగ్రత నిచ్చితి రింక నాకు దు
స్తర మిది వార్ధికై వడిఁ బ-దంపడి దీని విముక్తిఁ జేయరే. 1695

వ. అనిన ననుకంపాభరితుండై నావచనం బమోఘంబు గావున నిది యనుభవనీయం
బ కొంతకాలంబునకు దశరథపుత్త్రుం డగురామునిపనిఁ బూని హనుమంతుం
డిందుకు వచ్చు నతనిచేత నీకు శాపవిముక్తి యగు నని యానతిచ్చి యాశాండి
ల్యుండు గంగాతటంబున కరిగె నట్లు నేడు నీప్రసాదంబున నేను గృతార్థ నైతిం
బోయివచ్చెద నని జగత్ప్రాణనందను దీవించి మెఱపునుంబోలె నప్పుడ యంత
ర్ధానంబు నొందిన నతండును జమత్క్రియమాణచిత్తుం డై క్రమ్మఱి కాలనేమి
సమీపంబునకు వచ్చిన వాఁ డిట్లనియె. 1696

క. నీ వీమడువున సలిలము, ద్రావెద నని పోయి యెంత - తడసితి వట సం
జీవని నీ కుపదేశము, గావించెద వలతు వేనిఁ - గైకొను మెలమిన్. 1697

— కాలనేమి హనుమంతునిచేఁ జచ్చుట. —

క. వెరవారఁగ శిష్యుఁడ వై, గురుదక్షిణ పెట్టు మనినఁ - గోపం బెసఁగన్
గురుదక్షిణ యిదె కొ మ్మని, యురవడితో నురము పొడిచె - నురుతరముష్టిన్.

క. ఘనముష్టిఘాతమున నద్దనుజుఁడు దండాభినిహత-దర్వీకరకో
పనుఁ డై యెగయుచు నాపావనివక్షస్స్థలము వ్రేసె - వడి ఖడ్గమునన్. 1699

చ. చటులని శాతఖడ్గశర-ఘాతనుఁ డై పవమానసూతి యు
త్కటగతిఁ జీరి వ్రేసి వడిఁ - దన్నిటలంబునఁ దాఁచి యార్చి నీ
కెటఁ జనవచ్చు నాయెదుట - నిప్పుడ నిల్ బొలియింతు నంచు ను

1 వరశాంతులకుఁ బృథుమద.

ద్భటముగఁ బల్క దానవుఁడు ✽ పక్షిశరీరము దాల్చి గ్రక్కునన్. 1700

క. ఎఱకలగాడ్పున నొగి వెడ, చఱువఁగ వడి వీచి యతని ✽ శాతనఖములం
జఱుచుచుఱఁ జీరియు ముక్కునఁ, గఱచియు నొప్పించె వాఁడు ✽ గరువలిసుతుఁడున్.

శా. ఆటోపంబున వానిఁ బట్టి పరుషో ✽ ద్యన్ముష్టిఘాతంబునం
ద్రోటీపాటన మాచరించి భుజగ ✽ స్థూలోగ్ర వాలంబునం
దాటించెన్ వడి నేల వ్రేసి చదిపెన్ ✽ దర్పంబు గ్రక్కించె నా
స్ఫోటం బొప్పఁగ తెక్క లెల్ల విఱిచెన్ ✽ శుంభత్సమారంభుఁ డై. 1702

వ. అంత వాఁడు సింహాకారంబు దాల్చి. 1703

చ. వికటసటావిపాటితన ✽ వీనవలాహకుఁ డై మహాప్రభా
వికసితదంష్ట్రికాగ్రముల ✽ వీరుని నాహనుమంతు గ్రుచ్చి సా
యకములఁ బోనిగోళ్ల నద ✽ రంటఁగఁ జీరి రవంబు సేసినం
జకితము లయ్యెఁ దద్విపిన ✽ సామజయూథము లెల్ల నత్తఱిన్. 1704

ఉ. ఇద్ధపరాక్రమాంచితుఁ డ ✽ హీనబలాఢ్యుఁడు సింహరూపసం
సిద్ధవిభావు నద్దనుజుఁ ✽ జేరి మహాశనిఁ బోలుముష్టి న
త్యుద్ధతి బిఱువోఁ బొడిచె ✽ నూర్జితగర్జితతర్జనక్రియా
రుద్ధదిగంతుఁ డై యుదిత ✽ రోషలసచ్ఛరభంబుచాడ్పునన్. 1705

[1]క. కేసరితనయుఁడు వడి నక్కేసరిచరణములు శిరముఁ ✽ గెరలుచు నడుమున్
గాసిగ నప్పుడు దునుకలు, సేసియుఁ దనవాల మెత్తి ✽ చెలఁగుచు నడిచెన్.

వ. అంత నద్దానవుండు. 1707

శా. సుగ్రీవుం డయి చేరి యిట్లను మరు ✽ త్సూనుం బ్లవంగేశ యీ
వ్యగ్రత్వంబు దొఱంగు లక్ష్మణుఁడు స ✽ త్యం బార జీవించె ద్రో
ణగ్రావంబున కేఁగ నేటి కనమా ✽ నప్రీతితో రమ్ము దుః
ఖగ్రాహ్యంబులు మందు లేల ధరణీ ✽ కాంతాజ్ఞ నే వచ్చితిన్. 1708

తే. అనినమతిమంతుఁడగుహను ✽ మంతుఁడతనిఁ, దెలియనారసి కాకుంట ✽ తెలిసియిచటి
కర్కసంభవుఁ డేటికి ✽ నడరి వచ్చు, ననుచు నాగ్రహనిగ్రహా ✽ వ్యగ్రుఁ డగుచు.

ఉ. ఓరి నిశాచరాధముఁడ ✽ యుగ్రసముద్ధతి మాయలాఁడ వై
సారము లేమిఁ జేసి పలు ✽ చందపురూపులు దాల్చి యాక్రియం
బోరొనరింప వచ్చితివి ✽ పోయిన నిన్నిఁకఁ బోవ నిత్తునే
దూరము గాదు కాలుపురి ✽ త్రోవ యటంచు నుదగ్రమూర్తి యై. 1710

శా. తాలోత్తాలకరాళదున్సహభుజా ✽ దండంబునన్ వ్రేసె నా
భీలప్రాభవదుర్నివారగతి యై ✽ భీమాసురోరస్స్థలీ
శైలోపాంతము దాన దానవుఁడు ని ✽ స్సత్త్వాత్ముఁ డై సోలి కీ

---

1 ఇట నడుమ నీపద్యము వ్రాఁతప్రతులఁ జూపట్టుచున్నది.

లాలాఘుంబులు నోరఁ గ్రమ్మఁగ విశాలధ్వానుఁ డై గ్రక్కునన్. 1711
సీ. అంతన శతశృంగుఁ డై నిర్జరారాతి, గర్జిల్లి సముదగ్రకార్ముకంబు
దాల్చి కర్ణాకృష్టదారుణశరజాల,ముల నాంజనేయుని ముంచెఁ బెలుచఁ
జదిపె వాలంబున సాయకావలి నెల్ల, నవలీల నలయక పవనసుతుఁడు
మఱియు మర్మంబులు నెఱయంగ నొప్పించె, రాత్రించరుండు నారాచములను
దన్ని చీరి కఱచి తాడించి పిడికిళ్లఁ, బొడిచి చఱచి యెత్తి పుడమి వైచి
మొగము పగులవ్రేసి [1]మ్రోఁకాళ్లఘట్టించి, వఱు మెడలి పగుల వాయుసుతుఁడు.
క. సామజరాజుకరంబునఁ, దామరసము ద్రెంచుభంగి దర్పోద్ధతుఁ డై
సామీరి బాహుయుగమున, నామనుజాశనునియుత్తమాంగముఁ దునిమెన్.
తే. అనుపమానైకఘోరమాయాబలాను,కలితు మారీచతనయునిఁ గాలనేమి
నగణితస్థితిఁ గాలుని నగరి కనిచి, కీశనాథుండు వెస ద్రోణగిరికి నరిగె. 1714
ఉ. సింధురవైరివిక్రమణశీలి యతండు పరిభ్రమింప సౌ
గంధికసంగబంధురితగంధసమీరణశాలి యై మను
త్సింధుమనోజ్ఞశీకరవశీకరణాచరణాభిరాముఁ డై
గంధవహుండు వీచె నెసకంబున నాత్మజుమీఁద మెల్పునన్. 1715
వ. అంత ననిలసుతుండు. 1716
ఉ. ద్రోణము గాంచె నిర్జరవధూజనమంగళగేయవిస్ఫుర
ద్రాణము దీపరాజిరుచిరస్ఫురదోషధసత్త్వకల్పిత
త్రాణము రత్నదీధితివిరాజితహాటకసానుమండలీ
క్షోణము నభ్రచుంబిగురుకూటవికస్వరధాతుశోణమున్. 1717
వ. అనిలతనయుం డమ్మహీధరారోహణంబు సేసి దావదహనజ్వాలాదందహ్యమానంబులఁ బోని కనత్కనకకటకంబులు గనుంగొనుచు సౌదామనీదామసముద్దామంబు లగుహేమలతావితానంబులు సూచుచుఁ దారకితం బగుశశరన్నభోభాగంబు ననుకరించుచుఁ బతితతరుకుసుమం బగుమహేంద్రనీలస్థలంబు లాలోకించుచు నవశోణితరణాంగణవికీర్ణగజకుంభపతితముక్తాఫలంబులుంబోలె ధాతుమయసానుతలంబుల వేణుమూలపతితంబు లగుమౌక్తికంబులు సూచి మెచ్చుచు సుషేణుండు చెప్పినయభిజ్ఞానంబు లుపలక్షించి యమ్మహౌషధంబులు డగ్గఱనుంత నని యదృశ్యత్వంబు నొందిన నప్పర్వతంబున కిట్లనియె. 1718
సీ. ఓమహీధరరాజ యుర్వీశపతి యైన, దశరథరాజనందనునియాజ్ఞ
సమకూర్ప వచ్చితి సర్వలోకములకు, హిత మైనసత్కార్య మెల్లభంగిఁ
గావున నీయందుఁ గలిగినదివ్యౌష,ధంబులు నా కిమ్ము తడయ కిపుడు
వలయు నే వడిఁ బోవ వంచింప నీ కేల, పెంపుతోఁ దుతెఁ గరుణింపు మనిన

1 మొగిఁ గాళ్ల దట్టించి.

నాథరాధరుండు నతిగర్వితుఁడపోలెఁ, దన్ను సరకుగొనక దర్ప మొదవ
నవినయమున నమ్మహౌషధు లీకున్న, నలిగి పలికె నంత ననిలసుతుఁడు. 1719

మ. ప్రియముల్ చెప్పిన నన్నుఁ గైకొనక దర్పిం చిట్లు [1]జాల్మత్వదు
ర్ణయశీలంబున నూరకుండితివి క్రూరత్వాత్మ దుర్బుద్ధి వై
దయయున్ ధర్మము సత్యమున్ గుణములున్ దాక్షిణ్యముం గల్గ వా
రయ నెందుం గఠినాత్ములందు సముదగ్రగ్రావ శైలాధమా. 1720

మ. అని యుద్యత్పటురోమకూపవివరౌఘావిర్భవద్విస్ఫులిం
గనికాయంబులు గూడి మింటఁ గలయంగాఁ బర్వి మండంగ రో
ధనసర్వంకష తేజుఁ డై చటులనాదన్యక్కృతాంభోధర
ధ్వని నార్చెన్ వెస సప్తలోకకుహరవ్యాప్తిక్రియాపాది యై. 1721

చ. ఒఱగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడు క్రుంగెఁ గూర్మముం
దఱలె నభంబు మ్రోసె సురదంతులు మ్రొగ్గ దిగంతరంబు ల
త్తఱి నదరెన్ మరుత్సుతుఁడు దర్ప మెలర్ప నహార్య ముద్ధతిం
బెఱుకఁగ గోత్రశైలములు పెల్లగిలెం గలఁగెం బయోనిధుల్. 1722

క. వ్యాళేంద్రతులిత మగుతన, వాలమ్మునఁ జుట్టి పెఱికె వానరపతి యా
శైలము మును మందరగిరి, హేలోత్సాహమునఁ జక్రి యెత్తినమాడ్కిన్.

వ. ఇట్లు దశయోజనవిస్తారంబును బంచయోజనాయతంబును నగునమ్మహీధరంబు పెఱికి యెత్తి యార్చునవసరంబునం జిత్రసేనాదిగంధర్వులు త్రయోదశకోటిసంఖ్యాకు లై పరస్సహస్రంబు లైనమొనలు దీర్చి పరశుగదాముద్గరపట్టిసప్రాసముసలకుంతభిండివాలకరవాలాదిమహాసాధనంబులక్రొమ్మెఱుంగులు గనల నతని వీక్షించి వీఁడు నాఁడు గొనిపోయినదొంగ యెప్పటి సనుదెంచె వీనిఁ గృతాంతగోచరుం జేయుద మని యిట్లనిరి. 1724

—హనుమంతునితో గంధర్వులు యుద్ధముచేయుట.—

మ. ఇది నీ కేటికి మేరుభూధరసమం బీయద్రి దేవప్రజా
స్పద మిం దుండుదు మేము గావు త్రిజగత్సంజీవనాఢ్యంబు నీ
వది యుచ్చోటన పెట్టు తక్కిన మదగ్రానేకశస్త్రాళిచే
బ్రదుకన్ వచ్చునె యన్న నాతఁడు రణారంభోన్ముఖుం డై వడిన్. 1725

సీ. దట్టించి యంఘ్రులఁ దన్ని నఖంబులఁ, జీరి తలంబులఁ జిక్కపఱిచి
పెడకేలఁ బొలియించి పిడికిళ్ల నొప్పించి, మోఁచేతిపోటులఁ బీఁచ మడఁచి
కఱచి వాలంబునఁ గట్టి యంబుధి వైచి, శైలతటంబునఁ జదియ వ్రేసి
కడకాళ్లు పట్టి యుత్కటముగా వడిఁ ద్రిప్పి, యొకనితో నొక్కని నొగిని జఱిచి
కడఁగి కారింపఁ గొందఱుపుడమిఁ బడిరి, వెఱచి కొందఱు గనుకనిఁబఱచిర పుడు

1 జాడ్యత్వదుర్ణయ.

మూర్ఛనొందిరి కొందఱు మూఁకగట్టి, కొంద ఱారక భ్రమ మొందిరందులోన.
తే. తల్లడించుచు మింట గంధర్వవరులు, నీకుఁ దెరువులు శుభములై నెరయుఁ గాక
యీయుపక్రమ మేరికిఁ జేయఁ దరమె, కొండ గొనిపొమ్ము వానరకులలలామ.
క. అని గంధర్వులు తొలఁగిన, ననిలతనూజుఁడు మహీధరాన్వితభుజుఁ డై
తను సిద్ధసాధ్యగణములు, వినుతింపఁగ గగనవీథి వెలుఁగుచు నరిగెన్. 1728

—భరతునిదుస్స్వప్నము.—

చ. భరతుఁడు నాఁటిరాత్రి యశుభం బగునక్కలలోనఁ గాననాం
తరమున రామలక్ష్మణులు తైలనిషిక్తశిరస్కులై సుదు
స్తర మగుపంకమధ్యమునఁ దద్దయుఁ జిక్కి కృశాంగులై మహో
ద్ధురగతి నేడ్చుచుం వితతదుఃఖము నొందుటఁ గాంచి భీతుఁ డై. 1729
చ. తడయక మేలుకాంచి కల దారుణ మం చెదఁ జింత నొంది త
ల్లడమున వెల్లి వచ్చి వికలత్వము నొందుచు దుర్నిమిత్తముల్
గడుకొని చూచి మేను వడఁకం బటుధైర్యము దూలిపోయి పెం
పెడలి బహుప్రకారముల నిట్లనుచుం దలపోయు నాత్మలోన్. 1730
ఉ. నక్కలు గూయఁ జొచ్చె గగనంబున నుల్కలు రాలఁ జొచ్చె నే
దిక్కున నైన ధూమములు దీటుకొనం గవిసెన్ ధరిత్రియున్
గ్రక్కతిలంగఁ జొచ్చె నధికంబుగ నొక్కత ముక్తకేశ యై
మిక్కిలి యేడ్చుచున్నయది మీఁదటికిం దది యేమి పుట్టునో. 1731
ఉ. రాముఁడు లక్ష్మణుండును ధరాసుతయున్ బలుకాననంబులం
దేమివిధిం జరించిరొకొ యేవిధిఁ బొందిరొ యేమి యైరొకో
యామహనీయకీర్తులకు నాపదలున్ వెనఁ గల్గునొక్కొ యిం
కేమి తెఱంగొ దీనికి సమీహిత మెయ్యదియొక్కొ దైవమా. 1732
క. పదునాల్గువత్సరమ్ములు, దుదముట్టఁగ వచ్చె నేఁడు తుదగా గురుస
మ్మదముగ వార్తయు వినరా, దది యేమియొ తెగిరొకో కృతాంతుని చెయిదిన్.
క. కృతయజనతపోదాన, వ్రతజప[1]తీర్థోపవాసవరసుకృతంబుల్
కృతమతి నిచ్చితి రామున, కతులితముగఁ గలుగ నభ్యుదయ మనుచు వెసన్.
చ. అనఘుఁడు భూసురోత్తముల నాగమవిత్తములైనవారి రాఁ
బనిచి యనేకదానజపపావకతర్పణధర్మశాంతు లిం
పొనరఁగ వేదచోదితనియోగముతో నొనరించి నెమ్మనం
బున [2]దురపిల్లి నెవ్వగలఁ బొందుచుఁ గుందుచు నుండ నత్తఱిన్. 1735
మ. ఉదయద్భాస్కరమండలోల్లసితకాయుం డుగ్రసంవర్తని
ర్యదుదగ్రానితుల్యనత్త్వుఁ దురుధైర్యాతీతశైలుండు భా

1. తీర్థాధివాసవర. 2. దురటిల్లునెవ్వగలఁ బొందుచు వందురుచుండ.

తి దలిర్పం బవమానసందనుఁడు నంది గ్రామముం గాంచె భా
స్వదమేయద్యుతిపూరితాఖిలదిశాచక్రుండు సంభ్రాంతుఁడై. 1736
మ. ఘనసంకాశశరీరు వల్కలజటాకల్పుం దపోనిష్ఠితున్
వనజాతాయతచారునేత్రు భరతున్ వాతాత్మజుం డచ్చటం
గని యారాముఁడు లక్ష్మణుం డిలిగినం గాంతాలలామంబు సీ
తను నచ్చోటనె డించి వచ్చెనొకొ యుద్యద్దుఃఖభారంబునన్. 1737
సీ. అరసి చూచెదఁగాక యని యాత్మఁ దలపోసి, యక్కట రఘురాముఁ డట్టివాఁడె
ధర్మదయాసత్యధనుఁడు ధీరోదాత్తుఁ, డచలేంద్రగురుధైర్యుఁ డనుజునింతి
నర్కతనూజాతు నావిభీషణుఁ గపి,వీరుల దిగనాడి పేరు చెఱచి
చనుదెంచునే దశాననుఁ బోరఁ గూల్పక, యీకానితలఁ పేల నాకుఁ బుట్టె
దాశరథిఁ బోలు నితఁ డొకతాపసుండు,గలుగఁబోలును నిజమని కడఁకతోడ
లఘుజవంబునఁ బావని లంక కరుగఁ, గనియె నప్పుడు భరతుండు గగనవీథి.
ఉ. రాజకుమారశేఖరుఁ డరాతిభయంకరుఁ డభ్రవీధి వి
భ్రాజితతేజుఁడై యరుగుపావనిఁ జూచి యుదగ్రవిక్రమో
ద్వేజక మైనభూత మిది దీని శరంబునఁ గూల్తు నంచుఁ దా
రాజధరోరుకార్ముకకరాళతరాలఘుచాపధారి యై. 1739
క. నిలిచినతఱి నశరీరిణి, పలికెన్ నీ కరయ నాప్తబంధుఁ డితనిపై
నలుగ వలదు కరుణింపుము, బలవదమోఘాస్త్రజాల భరతనృపాలా. 1740
మ. అని వీతెంచినఁ గైకయీతనయుఁ డత్యాశ్చర్యనిర్మగ్నుఁడై
ధనువుం దూపుపసంహరించి రఘునాథక్లేశముల్ మాన్పఁగా
మన మారం బరమేశ్వరార్చన లసామాన్యంబుగాఁ జేసి స
జ్జనగోష్ఠిం దగ నిల్చి యుండె భయదస్వప్నప్రసంగంబునన్. 1741
చ. కనియెఁ గపీంద్రుఁ డంత ఘనగర్జననిస్వనవీతనిద్రమున్
ఘనతిమినక్రచంక్రమణకల్పితవీచికదంబభద్రముం
గనదురురత్నరాజిభుజగవ్రజసంచరణాతిరౌద్రమున్
జనితమరాళఫేనవిలసన్నవముద్రము నానముద్రమున్. 1742

—✿ మాల్యవంతుఁడు రాక్షసబలంబులుం దానును హనుమంతుని నడ్డగించుట. ✿—

వ. అంత దశవదనుపంపున మాల్యవంతుండు సమగ్రబలసంపన్నులును వివిధమా యావిశారదులును సమరకర్మదుస్సహులు ననేకాయుధోపేతులు నయినయట్టు వదికోట్ల రాక్షసులతో నొక్కటం గదిసి జలరాశిమధ్యంబునఁ గపివీరునిఁ బో నీక పొదివిన నతండు విద్యుల్లతావేల్లితంబులును విజృంభితదంభోళిసంరంభంబులు నూర్జితగర్జితంబులు నగుజీమూతంబులు గా శంకించి భీషణవివిధాస్త్రసింహనా దంబుల నక్తంచరులుగా నెఱింగి గగనవీథిం బదఘట్టనంబులు లేమిం జేసి నిశ్చల్బం

బగుసంగరంబు ప్రవర్తించె నప్పుడు శరంబులఁ గీలించియు గదల వ్రేసియు భిండివాలంబుల వైచియు శక్తులఁ బఱపియుఁ జక్రంబులఁ బ్రయోగించియుఁ గత్తళంబుల నొత్తియు బరిఘంబులఁ బరిఘట్టించియు ముసలంబుల మోఁదియుఁ గుంతంబులఁ బొడిచియు గోణంబుల విసరివైచియు నంకుశంబుల నాటియుఁ గఠారంబుల నాటియుఁ గుఠారంబుల నఱకియు ని ట్లనేక ప్రకారంబుల నొప్పింప నతండు నాజ్యాహుతులం బ్రవర్ధమానతేజుం డగుజాతవేదు ననుకరించి యనూనసత్త్వంబునం బేర్చి మహార్ణవంబునం దిరుగునాదిమీనంబునుంబోలెఁ గాననంబునం గనలుమహానలంబుచాడ్పునఁ దుంగమదువు సొచ్చి కలంచుమదకుంజరంబుపగిది హరిణంబుల బెగడువఱచుపుండరీకంబుమాడ్కి సర్వంబులదర్పం బడంచువైనతేయునివిధంబున వాలంబున నసురులఁ జుట్టిపట్టి త్రిప్పి వారాశిలో వైచియుఁ జరణతాడనంబుల మరణంబు నొందించియుఁ బార్ష్ణిఘాతంబులం బడలువఱచియుఁ బాదాగ్రంబులం దట్టుచు జానుఘాతంబులం గూల్చుచుఁ బార్శ్వప్రహారంబులం బొలియించుచు నున్నం గనుంగొని యంత మాల్యవంతుండు.

మ. దివిజానీకము దల్లడిల్లఁగ సముద్దీప్తప్రతాపోగ్రుఁ డై
శ్రవణోపాంతనిషణ్ణకార్ముకవరజ్యానాదభూయిష్ఠుఁ డై
పవమానాత్మజుమీఁద వేయిశరముల్ భాస్వత్కరాథంబు లా
ర్చి వడిం గీల్కొలిపెం బ్రచండవిపులార్చిస్తోమభీమంబు గాన్. 1744

వ. అంత హనుమంతుండు. 1745

శా. లీలావిక్రమ మేర్పడ రణకరాళీభూతుఁ డై భోగిరా
జాలోలం బయి ధూమకేతనసముద్యద్దీధితిం బొల్చునా
వాలం బార్చుచు వాని నన్నియును దుర్వారంబుగాఁ ద్రుంచె ను
ద్వేలాతిప్రథమానమానసహజస్థేమానుభావంబునన్. 1746

చ. తలకొని మాల్యవంతుతల దన్ని సమీరసుతుండు దా వియ
త్తలమున కంత బి ట్టెగసెఁ దానును దానవవీరుఁ డస్త్రధా
రలు దొరఁగంగ సొమ్మసిలి రౌద్రరసం బొదవంగఁ దేఱి యు
గ్గలముగ నేసెఁ గీశపయిఁ గాలునిచూపులఁ బోలుతూపులన్. 1747

క. ఆలమున ననిలతనయుఁడు, వాలంబున విల్లు విఱువ వడితో వాఁడున్
శూలమున బిట్టుపొడిచెన్, ఫాలమునను రుధిరధార పఱపుగఁ దొరఁగన్. 1748

తే. మఱియు శూలముమారుతాత్మజునియురము, గాఁడ వైచిననాతండు గడఁగిపట్టి
యంఘ్రియుగమున నవలీల నడరి విఱిచె, నిక్షుదండముఁ బోలంగ నింతలోన.

చ. గద గొని వైచె దానవుఁడు గంధవహాత్మజుమీఁద నేపుతో
నది చమదెంచి తాఁకెఁ జటులాశని శైలముఁ దాఁకుచాడ్పునం

గదలక [1]నిల్చి కాలుగతిఁ గన్నుల నిప్పులు రాల నుగ్రుఁడై
పదముల బిట్టు తన్నె నరిభంజనవిక్రమసార మేర్పడన్. 1750

వ. అంత నమ్మాల్యవంతుండు మారుతి కిట్లనియె. 1751

మ. వినతానందను నెక్కి వారినిధిలో విష్ణుండు నాతోడఁ బో
రొనరింపం గలుషించి నే ననుపమాసోదగ్రబాణంబు లే
సిన నిల్పోపక కాందిశీకుఁడయి సాసెం బోరికిన్ నీతరం
బె ననున్ సంగరభూమిలో గెలువఁ గాసేయంబునం జాకుమీ. 1752

క. ఈగిరి నాపంపున నీ, సాగరమున వైచి పొమ్ము చంప ననుచు ర
క్షోగణవీరుఁడు వానర, నాగేంద్రుని మీఁదఁ బఱపె నవశితశక్తిన్. 1753

తే. కడఁగి యొక్కట విస్ఫులింగములగములు
మింటఁ జెదరంగ వడిఁ బెనుమంట లెగయ
వచ్చునాశక్తిఁ బొడగాంచి వాయుసుతుఁడు
చెలఁగి పదములఁ దునుకలు సేసి యార్చె. 1754

సీ. అంతట నమ్మాల్యవంతుండు గోపించి, కాళికటాక్షప్రకాశ మొనరు
కరవాల మంకించి కదిసి వక్షస్స్థలి, వ్రేసిన నది వేగ విఱిగి పడిన
వజ్రసంహననుండు వాయుతనూజుండు, వాలపాశంబున వానికంఠ
మొగిఁ జుట్టి వైనతేయుఁడు భుజంగము పట్టి, త్రిప్పుకైవడి వడిఁ ద్రిప్పి మింటఁ
బెక్కుమాఱులు వెస వీచి త్రెక్కొనంగ, వదల వారిధిలోపల వైవ నతఁడు
ముక్తకేశాంబరోజ్జ్వలభూషుఁడగుచుఁ, బడి రసాతలమున కేఁగె బలము దక్క.

క. జితకాశి యైనయమ్మా, రుతసూనుని యుగ్రమైనరూపము గని ని
ర్గతసాధనులై దితిజులు, హతశేషులు లంకలోని కరిగిరి పెలుచన్. 1756

క. గెలుపుగొని వాయుతనయుఁడు, బలవిక్రమభూతి యొదవ బాహాదండో
జ్జ్వలదివ్యభూధరుండై చెలఁగుచు వడి నరిగె గగనసీమ వెలుంగన్. 1757

చ. స్ఫుటతరదివ్యరత్నఘృణిశోభిమహౌషధభూధరప్రభా
పటలము మింటిపై నిగుడఁ బ్రస్ఫురదగ్నిరుచిచ్ఛటావిశం
కటుఁడగువాయుసూనుఁడు వికస్వరుఁడై చనుదేర రాఘవుం
డిట సరసీజబంధుఁ డుదయించెనొ యంచుఁ బరీతశోకుఁడై. 1758

మ. రణలక్ష్మీరతిసక్తుఁడై యలసి నిద్రాణత్వముం బొంది [2]స
ప్రణతప్రక్రియ దోఁప నప్పుడు గతప్రాణుండు నా భీమరా
వణసంప్రేరితశక్తిఁ గూలి హతనిశ్శ్వాసానిలుండైన ల
క్ష్మణు నాత్మానుజుఁ జూచి యిట్లనియె నిక్ష్వాకుప్రభుం డార్తుఁడై. 1759

1. నిర్వికారుఁడయి కన్నుల. 2 'సత్ప్రణుతప్రక్రియ.'

—రాముఁడు ద్రోణాద్రిప్రభం గాంచి యరుణోదయకాంతి యని శంకించి చింతించుట.—

క. నగరాజధీర లక్ష్మణ, విగతస్నేహుండ వై వివేకింపక నన్
దిగనాడి నీకుఁ బోవఁగఁ, దగునే నా కేది దిక్కు తమ్ముఁడ చెప్పుమా. 1760

క. రూపింప నెల్లవారికి, నేపారఁగఁ బ్రొద్దు వొడువ నీసమయమునన్
నాపాలఁ బ్రొద్దు గ్రుంకెను, బాపపుదుఃఖాబ్ధిలోనఁ బడఁ బా లయితిన్. 1761

క. నీరాక కెదురుచూచు చ, హోరాత్రము వగలఁ బొగిలి యుండుసుమిత్రం
జేరి యడుగ నే మనియెద, నేరీతి మొగంబుఁ జూతు నెక్కడఁ జొత్తున్.

క. భరతున కే మని చెప్పుదు, సరసుఁడు నీతమ్ముఁ డయినశత్రుఘ్నునితో
నిరవుగ నేక్రియ బొంకుదు, గురుతరదుర్యశము నొంది కుందఁగ వలసెన్.

తే. అన్న దిగనాడి నను శరణన్న నేను, లంకఁ బట్టము గట్టితి శంక మాను
మని విభీషణుఁ బలికితి నదియుఁ దప్పె, నిల నభాగ్యుల కెందును గలదె పెంపు.

మ. కమలాప్తుం డుదయాద్రిచేగువకు నిక్కం బారయన్ వచ్చె ని
త్తిమిరంబుల్ విరియంగఁ జొచ్చెఁ గలయన్ దిగ్భాగముల్ నిర్మల
త్వము వొందెన్ గ్రహతారకాతతులభాస్వత్స్ఫూర్తియుం దప్పె నే
నమరన్ లక్ష్మణువెంట నేఁగెద నసహ్యాం బిచ్చుటన్ నిల్వఁగన్. 1765

వ. అని సుగ్రీవున కిట్లనియె. 1766

ఉ. బంధుఁడ వై తలిర్చుచు నపారబలీముఖసేనతోడుతన్
సింధువు గట్టి రక్కసులఁ జీరికిఁ [1]గొక వధించి తీవు నీ
బాంధవ మెల్లప్రొద్దుఁ దలఁపం దగు నాత్మ మదాత్మ మింకఁ గి
ష్కింధకుఁ బొమ్ము భానుసుత కీశబలంబులు నీవు నావుడున్. 1767

చ. రవిసుతుఁ డంతయుం దెలిసి రాముని కిట్లను భూమిపాలక
ప్రవర విచార మేమిటికిఁ బన్నుగ నాలవజాము సొచ్చె న
ప్పవనసుతుండు వచ్చు నరిభంజన శోకము మాను మింక నా
ప్లవగవరుండు వోవుపని పన్నుగ విశ్వసనీయమే కదా. 1768

వ. అనినయనంతరంబ నిబిడప్రభామండలదుర్నిరీక్ష్యుం డయి హనుమంతుండు ప్రజ్వలన్మహౌషధీదీధితిభాసురం బగునాద్రోణనగంబు ధరియించి యేతెంచిన నఖండచండతేజోమండలం బనఁ దేజి చూడ రాకుండినఁ గపివీరులు భీతిల్లి పరవశులై యుండ రఘూద్వహుం డయ్యవసరంబున మార్తాండుం డని శంకించి.

సీ. ప్రలయకాలోదగ్రభర్గుచండంబునఁ, గంటిమంటలు [2]మింటఁ గలయఁ బర్వ
రోమకూపంబుల భీమంబుగా విస్ఫులింగకణంబులు నింగి కెగయ
బ్రహ్మాండ మంతయు భగ్నంబుగాఁ జేయ, నప్పళించుతలంపు లుప్పతిలఁగ
నమరకులాధిపప్రముఖదిక్పాలుర, మసలక లీల భస్మంబుసేయఁ

1. గోరక వంపి తీవు. 2 గూడి కలయఁ బెరుఁగ.

బూనుకై వడి రఘురాజపుంగవుండు, తఱిమి జగములు విగతసత్త్వములుగాఁగ
జలధు లేడునునొక్కటఁగలఁపఁజూచు,విధమునొందుచు నుద్ధతవేగుఁ డగుచు.

సీ. ద్రోణాఖ్యశిఖరికై దూర మేఁగినకపి,రాజలలామంబు రాకమున్న
రణభూమిఁ బడినలక్ష్మణుఁడు లేవకమున్న, ఘనమనోరథసిద్ధి గాకమున్న
యన్వయంబున కాదియయ్యును బగవానిఁ, గలసి నాకార్యంబుఁ దలఁపులేక
కట్టిఁడితనమున ఖరకరుఁ డుదయించు,చున్నవాఁ డుద్ధతి నుచిత మేది
యరయఁ గల్లరి గావున సడరి నాఁడు, దివ్యశరమునఁ బడఁగూల్తు దివిజులడర
వసుమతీతల మే నరాక్షసముగాఁగఁ, జేయుదును నాకుఁగలదె యజేయమెందు.

వ. అని పలికి. 1772

శా. ఆస్ఫోటించి పరాక్రమించి భయదవ్యాపారసన్నద్ధుఁడై
విస్ఫూర్జల్లయకాలదావదహనావిర్భావమూర్తిక్రమ
ప్రస్ఫీతుం డయి వీరరౌద్రరససంరంభంబునం బొల్చి యు
గ్రస్ఫారప్రథితప్రతాపతపనైకత్వప్రతిష్ఠాత్ముఁడై. 1773

చ. పరఁగఁ బినాక మందుకొనుఫాలవిలోచనుమాడ్కి రాఘవుం
డురుతరసంభ్రమం బొదవ నూర్జితచాపముఁ దాల్చి పావకో
ద్ధుర మగురౌద్రసాయకము దుర్దమశక్తి దలిర్పఁ జేర్చి భా
స్కరు నొకమాత్ర నేలఁ బడఁ గా వెస నేయఁ దలంచునత్తఱిన్. 1774

వ. జాంబవత్సుగ్రీవవిభీషణాదులు సంభ్రమంబునం బఱతెంచి వినయవినమితశిర
స్కులై ఫాలభాగరచితకరసంపుటులై యొక్కనికయి భువనత్రయంబుఁ జెఱు
పం జన దని మఱియు నిట్లనిరి. 1775

సీ. రఘువంశవర నీవు రౌద్రాస్త్రమందిన, సురసిద్ధసాధ్యఖేచరభుజంగ
గంధర్వులాదిగాఁ గడుభయంబునఁబొంది,[1]యొగి దిక్కులకుఁ బాఱుచున్నవార
లతిశయోల్కాతతి నంబరస్థలి కాలి, పగులుచందంబున బడలువడియె
ధర గ్రక్కదలఁజొచ్చె ధరణీధరంబులు, వ్రాలుచు నున్నవి వార్ధు లెల్లఁ
గలఁగుచున్నవి గావునఁ గడఁగి దీని, సంప్రయోగంబు వల దింక జనవరేణ్య
దివ్యశైలంబుతోఁ జనుదెంచుచున్న,వాఁడు భానుండవోలె నవ్వాయుసుతుఁడు.

క. వరదివ్యౌషధలతికా, స్ఫురితం బగుద్రోణశిఖరి భుజబల మెసఁగం
గరువలితనయుఁడు దెచ్చెడు, సరసిజమిత్త్రుండు గాఁడు సౌజన్యనిధీ. 1777

వ. అఖండత్త్వేశారవపూరితాశాంతరుం డగుటం జేసి తపనుండు గామికి విచికిత్స వ
లదు పావనియ యగు నని పల్కి యమ్మహాత్మున కెదురుగాఁ గపులం బనుపు
మనవుడు. 1778

మ. దళదిందీవరచారుకాంతివిలసద్గాత్రుండు కౌతూహలా

1. యొదిఁగి దిక్కులఁ బాఱుచున్న.

మలఫుల్లత్సరసీజనేత్రుఁ డపరిక్లాన ప్రసాదాననో
జ్జ్వలసంపూర్ణసుధాకరుండు రవిరాజద్దివ్యతేజుండు భూ
పలలాముండు కడంకతో నెనుసుగాఁ బంపెం బ్లవంగావలిన్. 1779

శా. అంతర్భూమికి వచ్చు భానుఁ డన నత్యాశ్చర్య మొప్పన్ హనూ
మంతుం డాదట నేఁగుదెంచి కడు రమ్యస్ఫూర్తి యై మేదినీ
కాంతాగ్రేసరుఁ డుత్సహింపఁగఁ బ్లవంగశ్రేణి మోదింపఁ ద
త్ప్రాంతన్యస్తగిరీంద్రుఁ డై సవినయవ్యాపారసంరంభుఁ డై. 1780

సీ. ఇట్లను రఘునాథ యేఁ బోయి దివ్యౌషధంబులు తద్ధరాధరమునందుఁ
బరికించి కానక గిరియ తెచ్చితి నిది, యవధరింపుము వేడ్క నవని నాథ
మును మీరు పంచినఁ జనఁగ నేతేరంగ, నడుమ విఘ్నంబులు నాకుఁ గలిగె
మసలుట తప్పఁగా మదిలోనఁ దలఁపకుఁ, డనిన రాముఁడు వల్కె ననిలతనయ
నీకుఁ దప్పులు గలవయ్య నీకతమున, దినకరాన్వయ మరయఁ బ్రతిష్ఠ నొందె
నన్నుఁ గాచితి వనుజప్రాణములఁ బడసి, తింక నీఋణ మెన్నఁ డే నెట్లు దీర్తు.

వ. అనునయ్యవసరంబున భానునందనుండు సుషేణున కిట్లనియె. 1782

తే. ఎలమి సాంపార భూధర మెక్కి నీవు, నామహౌషధివల్లరి యరసి తెచ్చి
దాన సౌమిత్రిఁ బ్రతికింపు తడయ కిపుడు, కౌతుకామృతపూరంబు గడలుకొనఁగ.

—విశల్యకరణిచే లక్ష్మణుండు పునర్జీవితుఁ డగుట.—

చ. అనిన సుషేణుఁ డంతఁ బ్లవగావలితోఁ జనుదేర సత్వరం
బున మణిజాలహాటకవిభూషితసానుతలంబు సాలచం
దనసహకారసుందరముఁ దామరసాంకసరోవిరాజితం
బును రమణీయశృంగ మగుభూధరరత్నము నెక్కి యిట్లనున్. 1784

సీ. ఇచట నింద్రుండు దిగీశులతోఁ గూడి, లోలుఁ డై యమృతంబు గ్రోలు వేడ్క
నిక్కడఁ ద్రైలోక్యహితముగా రాహువు, తల చక్రమునఁ ద్రుంచె దానవారి
చెలువంబు లగుమహాజీవనౌషధలతలు, లిచ్చోటఁ గల వని యచ్చుపడఁగ
వానరావలి కెల్ల వరుసతోఁ జూపుచుఁ, జతురుండు గాంచె విశల్యకరణి
యనువుతోడుత నది పుచ్చుకొని మహీధ, రావతరణంబు వేగ సమాచరించి
ఘనతరస్థితి సంప్రయోగంబు సేయ, నాక్షణంబునఁ జూడ నత్యద్భుతముగ.

క. గతవేదనుఁ డై సుప్తో, త్థితుని క్రియన్ లక్ష్మణుండు దెలిసి సముజ్జీ
వితుఁ డై గ్రక్కున లేచెం, బతిమనమున సంతసంబు పరువడిఁ బెరుఁగన్.

మ. అమితప్రాభవ మొప్ప నేఁగి నిరపాయప్రౌఢితో సర్వవి
ఘ్నములన్ లావున నిర్వహించి ఘనదోర్గర్వంబు నిండార న
శ్రముఁ డై యేలినవానికార్యము లుదారస్ఫూర్తితోఁ దీర్చె ను
త్తముఁ డీమారుతి యంచు వానరులు మోదం బంది యగ్గింపఁగన్. 1787

మ. ధరణీకాంతుఁడు రాముఁ డత్తఱి సముద్యత్కౌతుకాయత్తుఁ డై
పరమానంద[1]రసామృతంబుకరణిఁ బాష్పాంబువుల్ గన్నులం
దొరఁగంగాఁ బులకాళికంచుకితగాత్రుం డై నరేంద్రుండు సో
దరునిం గౌఁగిటఁ జేర్చె నిత్యసహజార్ద్రస్నేహభూయిష్ఠుఁ డై. 1788

చ. అమలచరిత్ర సంభృతదయారసపూర్ణ సుషేణ నీప్రసా
దమున సహోదరుం బడసి ధన్యుఁడ నైతి సుపుష్కలోపకా
రము గలనీకు నేమియుఁ దిరంబుగఁ బ్రత్యుపకారపూరణ
క్రమ మది నాకుఁ దోఁప దది గల్గునె నేమిట నిర్వహింపఁగన్. 1789

వ. అనిన నంతఁ గపివీరులు గౌతుకాయత్తాంతరంగు లై రామలక్ష్మణసుగ్రీవాను
మతంబునఁ దన్మహీధరారోహణం బాచరించి బహువిధమణిశృంగంబులు గనుం
గొనుచు నతిమధురమధురసంబులు గ్రోలుచు నభ్రామరుచిభూమరుచిగఫలరసంబు
లాస్వాదించుచు నమృతసోదరంబు లగుపానీయంబులు ద్రావి విగతశల్యక్షతవే
దను లై క్రమ్మఱ యవతరించి రంత రాఘవుం డమానుషతేజుం డగుపవమాన
తనూజున కిట్లనియె. 1790

తే. తొల్లి యుండినచోటనె ద్రోణశైల, మునిచి రమ్ము రయంబున ననుడు నట్ల
కాక యని యాగిరీంద్రంబుఁ గడఁకఁ గొనుచు, నంబరంబున నురవడి నరుగునపుడు.

—స్థూలజంఘాదిరాక్షసులతో హనుమంతుఁడు యుద్ధము సేయుట.—

క. రాక్షసులు వాయుసంజను, వీక్షించి యుగ్రగోషవివశాత్మకు లై
రక్షఃపతి కెఱిఁగించిన, నాక్షణమున దశముఖుండు నతిరభసమునన్. 1792

వ. స్థూలజంఘ మహానాద మహాదంష్ట్ర మహోరస్కోల్కాముఖ మహావీర్య చతుర్వ
క్త్ర శంఖకర్ణ హస్తికర్ణ మేఘవర్ణ చిత్రాద్యు లగున క్తంచరులఁ బెక్కండ్ర నియో
గించి మీర లిందఱుం జని యప్పవమానతనయుఁ బట్టుకొని యతనిచేత శైలం
బు సాగరంబునఁ బడ వైపింపుఁ డొండెఁ గాదేని వానిఁ దెగటార్చి జనుదెం డని ని
యోగించి యెవ్వండేని నిట్టిపరాక్రమంబుసేయు నతనికి నర్ధరాజ్యం బొసంగుదు
నిది యమోఘం బనిన వారలు ననేకవరూథినీసహస్రంబులతోఁ గదలి నానాప్ర
హరణపాణు లయి దేవాసురరూపంబులు దాల్చి కదిసి యురవడిం దాఁకి జీమూ
తంబులు శైలంబుఁ బొదువుపగిదిఁ బొదివి యాగ్రహంబున నహంకారహుంకా
రంబు లులియ నార్చి యి ట్లనిరి. 1793

మ. ప్రవరానేకమహాస్త్రదుర్ణయభుజప్రఖ్యాతులన్ దేవదా
నవులన్ శూరుల మమ్ముఁ గైకొన కనూనస్ఫూర్తితోఁ గొండ గొం
చవలీలం జన నెట్లు వచ్చు నవివేకాయత్తచిత్తుండ వై
దివి నిం కెక్కడి కేఁగ శక్యము మదాంధీభూతదుష్టాశయా. 1794

1. రసంబుఁ జిల్కుకరణిఁ.

మ. అనినం బావని వారి కిట్లనియె సాహంకారుఁ డై మిమ్ముఁ గై
కొనఁగా నెంతటివారు గర్వమునఁ బెక్కుల్ వల్కఁగా నేల యే
పున నాముందట నిల్చి మీకు మెయిమైఁ బో వచ్చునే యంచుఁ బెం
చె నుదగ్రం బగువాల ముద్ధతమహార్చిస్తోమభీమంబుగన్. 1795

ఉ. వాసుకిభోగభీకరము వాసవదంతికరోపమంబు వి
త్రాసితభూతమండలము దర్పితదానవగర్వదారణో
ల్లాసము ధూమకేతనవిలాసము నిత్యసముల్లసజ్జయా
వాసము నైనవాయుసుతువాల ముదగ్రతఁ బేర్చె నెంతయున్. 1796

సీ. శూలిఫాలానలాభీల మై మండుచు, నురవడిఁ గొందఱ నొగి దహించి
కాలదండాతికరాళ మై యడరుచుఁ, గ్రూరతఁ గొందఱఁ బారిసమరి
హాలాహలచ్ఛటోత్తాల మై పెనఁగుచు, నేపునఁ గొందఱ రూపుమాపి
వ్యాళోగ్రమృత్యుపాశావార్య మై చేరి, సొలవక కొందఱఁ జుట్టి తాచి
కఠిననిర్ఘాతసంఘాతఘాతజాత, వేదనాపాదనానూనవిదిత మగుచుఁ
జక్రిచక్రక్రమక్రియావక్రగతుల, వాయునందనువాలంబు వాలె నిట్లు.

శా. అంధీభూతము లయ్యె భూతములు త్రాసాయత్తచేతస్కు లై
గంధర్వుల్ గలఁగంగఁ బాఱిరి కులగ్రావంబు లల్లాడె ది
గ్బంధంబుల్ శిథిలత్వ మొందె వసుధాభాగంబు గంపించెఁ బ్రా
క్సంధానంబులు దప్పె లోకముల కుత్సాదంబు సంధిల్లఁగన్. 1798

క. పదములఁ దన్నుచు గర్జా,స్పదహుంకారముల బడలుపఱుచుచు నత్యు
న్మదమున మూర్ఛల ముంచుచు, నదయతఁ బోనీక పొదివి యదటడఁచె వెసన్.

తే. వచ్చి పొదివినయాసురవారిదములు, వేయివిధముల నెల్లెడ విరియఁ బాఱ
భూరిబలుఁ డైనపవమానపుత్త్రుఁ డొప్పె, భాసురద్యుతిశారదభానుఁ డనఁగ.

చ. విజయముఁ బొంది విష్ణుపదవీథి నిరావరణప్రసన్నుఁ డై
నిజతనుకాంతి యెల్లెడల నిండఁ గళాపరిణాహశాలి యై
రజనికరుండుఁబోలె నభిరామదరస్మితపూర్ణచంద్రికా
రజనిచరాస్యపద్మనికరంబులయుల్లసనంబు దూలఁగన్. 1801

క. పోవుచు నానందితుఁ డగు,పావనిపై సిద్ధగణసుపర్వులు గురుసం
భావనలఁ బుష్పవర్షము, వావిరిగాఁ గురిసి రంబువాహములగతిన్. 1802

ఉ. మానితవేగుఁ డైనపవమానతనూజుఁడు వీతఖేదుఁ డై
మానుగ ద్రోణశైల మసమాననిరూఢి దలిర్పఁ బ్రాక్తన
స్థానమునందు నిల్పి రఘుచంద్రునియొద్దకు వచ్చె నుల్లస
న్మానసవేగుఁడో యన నమానుషదైవికసత్త్వసంపదన్. 1803

క. మనుజపతికి సౌమిత్రికి, నినసుతునకుఁ గ్రమముతోడ నెఱఁగి వినతుఁ డై

తనపూర్వవృత్తమెల్లను, వినిపించెం గపివరుండు వేడుక యొదవన్. 1804

వ. తదనంతరంబ రామసౌమిత్రిరవితనయులు తదీయప్రసంగంబు లాకర్ణించి విస్మయం బంది యిది యనన్యసుకరంబు నీక చేయంబోలు నింతియ యని హర్షోత్కర్షపులకితశరీరు లయి యతని నుపగూహనంబుల సంభావించిన నుబ్బి కాననచరు లందఱుం దమలోనఁ బరస్పరాలింగనసుఖంబు లనుభవించి హనుమత్సుపేణుల నగ్గించి లంకాపురసౌధజాలంబులం బ్రతిధ్వను లెగయ సింహనాదంబులు సేసి చెలంగుచుండునాసమయంబున. 1805

చ. వెలయఁ గలాఢ్యుఁ డైనశశి వేడుకఁ జేయురతోత్సవంబునన్
లలితరుచిస్ఫురద్గగనలక్ష్మి మనోహరహారమౌక్తికం
బులక్రియ నున్నతారకలు పూర్వసురాధిపుభాగ్యచిహ్నముల్
దొలఁగినమాడ్కి దృష్టిపథదూరము లయ్యెఁ గ్రమక్రమంబునన్. 1806

చ. ఘనతరదానకర్దమితగండమతంగజకల్పు లై మహా
స్వనగళదంబుసాంద్రతరవారిదబృందముఁ బోలుచున్నయ
ద్దనుజులశౌర్యసాహసమదస్ఫుట[1]సంతమసంబుతోన నొం
గె నతిభృశాంధకారము వికీర్ణతరం బయి యెల్లదిక్కులన్. 1807

చ. కమలము లొప్పె వానరనికాయముఖాంబుజరాజితోన య
క్కుముదగణంబు పెంపఱిగె ఘోరనిశాటమనంబుతోన ఘూ
కములమదంబు దూలె దశకంఠసముద్ధతితోన చక్రవా
కము లనురాగ మొందె నధికంబుగ రామసముద్యమంబుతోన్. 1808

సీ. ఘనతమిస్రోన్మత్తకరిరక్తజలములఁ, జెలువారఁ దోఁగినసింహ మనఁగఁ
బూర్వపయోరాశిఁ బొందున నుండక, వచ్చుబాడబమహావహ్ని యనఁగఁ
బ్రథమాద్రిశృంగంబుపైఁ దెచ్చి పెట్టిన, ఘనపద్మరాగకలశ మనఁగఁ
బ్రాచీవధూకరపల్లవతలమునఁ, గొమరారువిద్రుమగుచ్ఛ మనఁగ
భానుఁ డుదయించె రాఘవమానవాధి,పతిమనోరథపరిపక్వఫల మనంగ
భూరితేజంబు వెలుఁగంగ భువనభవన,తిమిరహతిఁ జేయఁజాలినదీప మనఁగ.

వ. అంతఁ గాల్యకరణీయంబు లగుసద్విధులు నిర్వర్తించి. 1810

ఉ. మందరశైలధీరుఁ డసమానగభీరగుణాంబురాశి ని
ష్యందిసుధారసామలదయాపరిపూర్ణవిలోచనుండు సా
నంద[2]మనోహరుండు ఘనసవ్యముఖేందువిలాసుఁ డై దశ
స్యందననందనుండు ప్రియమారఁగ లక్ష్మణుతోడ నిట్లనున్. 1811

ఉ. ఈనునఁ జేసి దానవకులేశుఁడు భీకరశక్తి వైవ ను
ల్లాసము దక్కి లావు వికలత్వము నొందఁగ నేల వ్రాలి ని

1. 'సంతమసంబు నా వడంగె నతి' అ. ప్ర. 2. కళామనోహరుఁడు నవ్య.

శ్వాసము పెంపునుం దఱిఁగి । సంచలనాదులు దప్పి నీవు నేఁ
జేసినయిట్టిభాగ్యమున । జీవము నొందితివయ్య క్రమ్మఱన్. 1812

ఆ. నాకు నీవు లేని । నగరంబురాజ్యంబు, సుఖము జయము భూమి । సుతయు ద్రుదుకు
నేమి కార్యమునకు । సౌమిత్రి నావుడు, మ్రొక్కి పలికెఁ గేలు । మొగిచి యతఁడు.

మ. అనఘా నీ కిటు లానతీఁ దగునె బాహాసత్త్వ తేజఃప్రభా
వనిరూఢత్వము లుండ దీనునిగతిన్ । వర్తింతురే దండకా
వనభూమిన్ మును నీవు సన్మునుల వి । శ్వాసంబుతోఁ బల్కి స
జ్జనసంఘంబులు మెచ్చఁ జేసినప్రతి । జ్ఞల్ విస్మృతిం బొందునే. 1814

క. ధరణిని గృతప్రతిజ్ఞా, పరిపాలనదక్షుఁ డెందుఁ । బరమోత్కృష్టుం
డరయంగ నిదియ ధర్మువు, పురుషునకుం బరిగణింప । భూరిప్రాభవ. 1815

క. శరణాగతపరిపాలన, పరమవ్రతపరుఁడ వనుచుఁ । బాటించి భవ
చ్చరణములు గన్నశుభతర, చరితు విభీషణుని మఱవఁ । జనునె నరేంద్రా.

చ. ఇనుఁ డపరాద్రికూటమున । కేఁగక మున్న యెదిర్చి చంపు మ
ద్దనుజుని వాఁడు నీయెదురఁ । దార్క్ష్యుని(?)ఁ జెందుభుజంగమంబుచా
డ్పున మృగరాజుఁ జేరుకరిఁ । బోలుచు నుద్ధతహేతిపావకం
బునఁ బడి కాలునాశలభ । పోతముభంగి నశించు గ్రక్కునన్. 1817

తే. కమలమిత్త్రుండు కరములఁ । దిమిర మడఁచు
పోల్కి శరముల రావణుఁ । బొదివి చంపు
మాజిఁ బడి యున్నయాతని । యాననములు
సూడ వేడుక య య్యెడు । శూరతిలక. 1818

క. తమ్ముఁడు సెప్పినవచనము, లిమ్మెయి నంగీకరించి । హృదయములోనన్
సమ్మదము నొంది ఘనసమ, రమ్మున కుద్యుక్తుఁ డయ్యె । రాఘవుఁ డంతన్.

వ. దశముఖుండును రాఘవునధ్యవసాయంబు సర్వంబు నెఱింగి పవననందనుప్రభావంబు దలపోసి డెందంబు దల్లడిల్లం బరాక్రమశౌర్యసాహసక్రమంబులు దిగనాడి కులగురుండును నీతిశాస్త్రనిర్ణయకుశలుండును బరమమాయోపాయవేదియు నగుశుక్రసమీపంబున కేతెంచి దైన్యరసంబు మొగంబుల నిండి దైవాఱ సాష్టాంగనమస్కృతు లొనర్చి దశనిటలతటసంఘటితదశకరపుటుం డై గద్గదస్వరంబున ని ట్లనియె. 1820

—✿ రావణుఁడు శుక్రాచార్యులతో మోచించుట. ✿—

సీ. లంకాపురంబుపై । శంక యింతయు లేక, భానుజాదికపీంద్ర । సేనతోడ
విడిసి లగ్గలువట్టి । విడువక పోరుచు, సుతుల సోదరులను । హితుల భటుల
నందఱ సమయించె । నతిదుర్నివారుఁ డై, రణమహోగ్రుం డై న । రాఘవుండు
విచ్చలవిడి మందు । చిచ్చులోపలఁ బడు, మిడుతలఁ బోలుచు । మిడుక లేక

యతని బాణాగ్నిమంటల । నడఁగిచనిరి, కుంజరంబులు రథములు । ఘోటకములుఁ
గాల్బలంబులు నానాఁటఁ । గలయఁ బొలిసెఁ, జొచ్చి యొకఁడును బ్రదికిన । చొప్పు లేదు.

క. ఏచందంబున బ్రదుకుదు, నేచొప్పున నడచువాఁడ । నెఱిఁగింపు తగన్
నీచెప్పినట్ల చేసెద, నీచే మద్రాజ్యపదము । నిలుచు మహాత్మా. 1822

వ. అనిన శుక్రుం డిట్లనియె. 1823

మ. సమరక్షోణితలంబునందుఁ బగఱన్ । సాధింపఁగా దివ్యమం
త్రములుం దంత్రములున్ మహౌషధులు దక్షధ్యం బార నుండంగ నీ
కు మనస్తాప మి దేల యేఁ గలుగ రక్షోనాథ నీశత్రుసం
ఘము ప్రాణంబులు దాల్చి యాజి నిలువం । గా నోపునే చెప్పుమా. 1824

చ. ఉరుతర మైనధైర్యమున । హోమము నీకు నపేతవిఘ్న మై
జరిగిన దివ్యఖడ్గశర । చాపరథాశ్వములున్ మణిప్రభా
గురుతరవిస్ఫురత్కవచ । కుండలముల్ ప్రభవించు నగ్నిలో
నరుదుగ వానిఁ దాల్చి విమ । తాలి జయించెద వీవు నాజిలోన్. 1825

క. కొను మీవరమంత్రంబులఁ, జను మింటికి హోమవిధియుఁ । జలుపు మనిన న
ద్దనుజపతి వానిఁ గొని పురి, కనురాగం బొదవ వచ్చె । నతిరభసమునన్.

క. నలి నగరవరణమార్గంబులు జతనము సేసి దనుజ । బృందమ్ముల ని
మ్ముల నుండఁ బనిచి తలుపులు, బలుపుగఁ బెట్టించి దెసలు । పరికించి వెసన్.

శా. ఉద్యత్సత్త్వతృణీకృతత్రిదశు మా । యోపాయరూఢక్రియా
మాద్యత్సాహసు నంతకప్రతిము దు । ర్మానాంధు నస్త్రైకసం
పద్యుక్తుం జతురంగచక్రసహితున్ । బాహోద్ధతుం జేరువన్
విద్యుజ్జిహ్వుని నుంచె హోమవిధిని । ర్విఘ్నత్వసాకాంక్షుఁ డై. 1828

—రావణుఁడు పాతాళహోమము చేయుట.—

వ. స్నానాదికక్రియలు నిర్వర్తించి పాతాళంబుఁబోనిగుహాగర్భంబు మృత్యుముఖగహ్వరంబు సొచ్చుక్రియం బ్రవేశించి రక్తస్రగనులేపనపటాలంకృతుం డై గంధకుసుమాక్షతార్చిత యైనవేదికయందు యథావిధి ననలంబు ప్రతిష్ఠించి హోమీయంబు లగుపాత్రలు సంస్కరించి తత్సమీపంబున నస్త్రపరిధులు సేర్చి బిల్వభల్లాతకకరంజంబులసమిధలుఁ దత్ఫలంబులును సర్షపాగురుగుగ్గులుదూర్వలును దధిమధుఘృతరక్తసురలును బ్రవాళపాయసదర్భలును గాకగృధ్రకంకశ్యేనకురరభల్లసర్పంబులును ఛాగమీనమకరకచ్ఛపమేషంబులును ధాతురసంబులును గర్పూరకుంకుమచందనకుసుమంబులును గేశంబులును వేల్చుచు నిశ్చలనియమంబున హోమంబు సేయునంత. 1829

శా. పాతాళోపమగహ్వరాంతరమునం । బై పై మహాధూమసం
ఘాతంబుల్ ప్రభవించి భీషణభుజం । గస్తోమదృప్యద్విష

ప్రాతానూనము లై యుగాంతజలదాకరంభంబు లై విస్ఫుర
ద్వాతోద్ధూతము లై నభంబు గలయన్ వ్యాపించె భీమంబుగన్. 1830

ఉ. ఓలిన ధూమమండలము లుగ్రతఁ బేర్చి నభంబుఁ గప్పెఁ బా
తాళములోననుండి సముదగ్రత వచ్చి రవిం దమోఘ్ను నా
భీలత నొక్కమైఁ బొదువు భీకరసంతమసంబులో యనం
గాలకరాళగాత్రలయ కాళిశిగోరుహాసోదరంబు లై. 1831

చ. అలఁగిరి సేంద్రదిక్పతు లహంకృతి దప్పిరి సిద్ధచారణుల్
గలఁగిరి యక్షకిన్నరులు గంపము నొందిరి నందనౌకసుల్
నలఁగిరి దివ్యకామినులు నాశముఁ బొందిరి ఖేచరేంద్రులుం
దలఁగిరి నమ్మునీశ్వరులు దల్లడ మందిరి వానరేశులున్. 1832

క. ఆసమయంబునఁ గడుసం,త్రాసమున విభీషణుండు దశముఖుహోమో
ల్లాసితధూమంబులు గని, కౌసల్యాతనయుఁ బల్కెఁ గడురభసమునన్. 1833

సీ. నినుఁ బోరిలోపల నిర్వహింపఁగ లేక, తద్దయు విముఖుఁ డై దశముఖుండు
తివిరి యాశుక్రోప దిష్టమార్గంబున, విజయార్థి యై యదె వేల్చుచున్న
వాఁడుచూచితె నభోవలయంబు పటుధూమ,బహుళకదంబక పిహిత మగుచు
నున్న దిప్పుడు మహాహోమంబునిర్విఘ్న, మై యథావిధిఁ బూర్ణ మయ్యెనేని
కులిశచక్రపినాకహస్తులకు నైన, దుర్జయుం డగుఁ గావునఁ దొడరి వేగ
మతనితద్విధి కంతరాయంబు సేయఁ, బనుపు వానరవీరుల బరవసమున. 1834

వ. అనిన మనుకులకేతనుండు పవనసుతగంధమాదనాంగదమైందద్వివిదపనసశరభ తారగజగవాక్షగవయవినతధూమ్రజ్యోతిర్ముఖనలనీలశతవలిక్రోధనకుముదవేగదర్శిగోముఖప్రముఖు లయినమహాబలీముఖవీరులఁ బదికోట్ల నియోగించిన వారు పాదపపాషాణపర్వతపాణులై వియన్మార్గంబున నరిగి లంక సొచ్చి ఘూర్ణమానార్ణవోదీర్ణు లయి గర్జత్పర్జన్యసమూర్జితులై సింహనాదంబుల దిక్కులు పిక్కటిల్లం జద లద్రువం బుడమి బడలువడం దఱిమి. 1835

మ. నగసంకాశమహాశరీరులు మరున్నాగోపముల్ వానరుల్
నగరోపాంతము సేరి రక్షకుల నున్మార్గంబునం గూల్చి బి
ట్టుగ దౌవారికులన్ వధించి సమరాటోపంబునన్ బాహుగ
ర్వగరిష్ఠాసురభంజనోత్సవకృతవ్యాపారపారీణు లై. 1836

సీ. పృథుశాలలం దున్న రథముల నేలతో, విఱుగంగ నురవడి ద్రేయువారు
విపులగేహస్థితద్విపరాజకుంభముల్, పోరిఁబోరిఁ బగులంగఁ బొడుచువారు
మందురావలి సొచ్చి మహితాశ్వములఁ బట్టి,చదియంగ నేలతోఁ జఱచువారు
నాయుధాలయముల కతిరయంబున నేఁగి, వివిధాస్త్రవితతులు విఱుచువారు
భాండగృహములలోనున్న బహుధనములు,సరకుసేయక మొగిఁ బాఱఁజల్లువారు

గోలఁదికెక్కినసౌధముల్ గోపురములు, ధరణిపైఁబడ వేడుకఁ దాఁచువారు.

ఉ. రావణుఁ బట్టి తెం డనుచు రాక్షసులన్ వడి మోఁదువారు దు
ర్భావుఁడు వానిఁ జూపుఁ డని బాధలఁ బెట్టెడువారు వాఁడు నే
తావున నున్నవాఁడొ ప్రకటంబుగ మా కెఱిఁగింపుఁ డంచు బా
హావరశక్తియుక్తులు వనాటులు విక్రమలీల నల్పఁగన్. 1838

చ. తలఁకుచు నాండ్రు బిడ్డలును దద్దయు నేడ్వఁగ నిండ్లు చొచ్చి యి
ట్టలముగ దైత్యవీరులఁ గడంగి వడిన్ వెడలంగ నీడ్చి త
ల్లులు వగ నొంది కుందఁ దలలుం జరణంబులుఁ గూడఁబట్టి భూ
తలమున వ్రేసి చంపి రతిదారుణచేష్టితులైనవానరుల్. 1839

లయవిభాతి. కడలుకొనురౌద్రమునఁ గడఁగి సమరోత్సవము లెడపడక యుండ
నొగి నడుముకొని శక్తిం
గడఁబడక పేర్చి వడి నడుగు లిడు వేగమునఁ బుడమి పెనువ్రయ్యలయి
బడలువడి క్రుంగన్
జడిసి చనురక్కసుల నొడిసి వెసఁ బట్టుకొని నడుము లగలం జఱచి తో
డరి తల లూడం
బొడిచి పెనునెత్తురులు మడువులుగఁ బాఱఁగను బెడిదముగ వానరులు
సుడివడక పోరన్.

ఉ. భీతకరీంద్రదీనతరబృంహితనాదములం దురంగమ
వ్రాతవికీర్ణహేషితవిరావములన్ శిశువృద్ధకామినీ
జాతనితాంతరోదనవిసర్పిరవంబుల దుఃఖవిక్రియో
పేతము గాఁగ లంక వడి నేడ్చుచు నున్నదివోలె నుండఁగన్. 1841

తే. సురిఁగి భయమున గొందులుసొచ్చువారు, నెగిచి పఱతేర నందులకేఁగువారు
నరుగ వానరు లెదురైనఁ దెరలువారు, నైరి దితిజులు మద మఱియంతనంత.

చ. పతిహిత మాచరింప నతిభవ్య విభీషణుభార్య సాధుస
మ్మతసుచరిత్ర యాసరమ మానుగ వే చనుదెంచి యెంతయుం
జతురత వాలిసూనునకు సమ్మతిగాఁ గరసంజ్ఞఁ జూపె న
ద్దితిజుఁడు వేల్చుగహ్వరము ధీరులు వానరు లుత్సహింపఁగన్. 1843

—అంగదాదివానరులు రావణుహోమము చెఱుచుట.—

వ. అంగదుండును నమ్మహాసంరంభరోషంబులు ముప్పిరిగొన రావణుం డున్నగుహా
ద్వారంబు సేర వచ్చి. 1844

క. ఆవాకిట నున్నఘనగ్రావం బవలీల నుగ్గు గాఁ దన్ని మహా
రావంబు సెలఁగ లోపలి, కావాలితనూజుఁ డేఁగి యంతటిమీఁదన్. 1845

ఉ. రావణుఁ గాంచె నం దురుతరస్ఫుటసాయకజాలవిద్ధుఁడై

రావణు సిద్ధఖేచరసు॥ర ప్రమదాజనగర్భగోళవి
స్రావణు సద్భుజాతులిత॥రాజతశైలవిభక్తశక్తివి
ద్రావణు లోకపాలకని॥రాకరణప్రవణైకరావణున్. 1846

క. ఘనుఁడై నరామచంద్రుని, పనుపున జయభద్రుఁ డింద్ర॥భంజనుఁ గదిసెం
మును హరుఁడు దక్షునొద్దకుఁ, బనిచిన వడి నరుగువీర॥భద్రుఁడపోలెన్. 1847

వ. అంత. 1848

క. దనుజాధిపుఁ బొడగంటిని, జనుదెం డని యతఁడు పిల్వ॥ సంరంభముతో
ననిలసుతుఁగూడి చొచ్చిరి, వనచరు లాగహ్వరంబు॥ వసుమతి వడఁకన్.

క. గుహఁగాచియున్నదనుజులఁ, బహుభంగుల బారినమరి॥ప్లవగులు బాహా
బహుమానంబునఁ బేర్చిరి, మహనీయజయాభిరామ॥మహిమాస్పదులై. 1850

వ. అంత నంగదాదులు గూడి యొంటిమెయి హోమంబు సేయుభీమాసురనా
థునకుఁ దోడు వేల్చువారపోలెఁ దిరిగివచ్చి యున్నసమిధలును బరిధులును
గలశంబులును గరిమకరహయసృగాలకృకవాకుకుర్కురోష్ట్రమస్తకంబులును
దధిరుధిరఘృతక్షీరపాత్రలును ననలకుండంబున వైచి వెఱచఱచి యుఱవం బొది
వి పట్టి కట్టి పరిచారకులను నంద పడవైచి దశముఖుచేతిస్రుక్స్రువంబులు పు
చ్చి పాఱవైచి తలప్రహారముష్టిఘట్టనంబులు సేయ నచలుండై యచలంబుఁ
బోలె నున్నం గని కినిసి యంగదుం డంతఃపురంబున కరిగి. 1851

సీ. కిసలయవిన్యస్త॥కేతకీద్యుతి దోఁపఁ, జేతిపైఁ బలుచని॥చెక్కు సేర్చి
కమలదళోపాంత॥గళితహిమంబు నాఁ, గనుఁగవ బాష్పముల్॥ గడలుకొనఁగ
నుపరక్తుఁడై యున్న॥యుడురాజుక్రియ మోము, చెలువంపునిగ్గులు॥దొలఁగిపోవ
వేఁడియూర్పులచేతఁ॥ బోఁడిమి చెడి యున్న, లలితోష్ఠరుచిరప॥ల్లవము వాడ
వగలఁ గందినడెందంబు॥ వడఁకు దెల్పు, హారవల్లరి పలుమఱు॥ నదరుచుండ
విరులదండలఁ బెనఁగొన్న॥విపులకేశ, పాశ మంసస్థలంబునఁ॥ బర్వి తూల.

క. వెర వేది చిన్నఁబోయిన, తరుణులు దను బలసియుండ॥ దద్దయ దుఃఖా
తుర యగుమందోదరి సుర, వరవైరివధూటిఁ గాంచె॥ వాలిసుతుండున్. 1853

వ. కని కదియంబోవునప్పు డజ్జోటి యచ్చటినిశాటీగణంబులతో నిట్లని చెప్పివగచుచు.

చ. కలనను గుంభకర్ణముఖ॥గర్వితవీరసహోదరాలియుం
బొలిసె సురేంద్రజిత్ప్రముఖ॥పుత్త్రులుఁ గూలిరి బంధుకోటిభృ
త్యులుఁ దెగటాఱి రింక మఱి॥ యొక్కఁడ తక్కె దశాననుండు దాఁ
జలమున రాము గెల్తు నని॥ సంగరలీలకుఁ గాలుద్రవ్వెడిన్. 1855

క. అనిలోన రామచంద్రునిఁ, దనతరమే గెలువ నింక॥ దశముఖుఁ డకటా
మన నొల్లఁడు మనుజేంద్రుం, డనయు మజేయుండు హరిహ॥రాదుల కయినన్.

మ. అని శోకించుచు సాంద్రబాష్పపటల॥వ్యాప్తాస్యయై బంధుశా

మినులుం దానును దాటకాదళనసౌమిత్రిప్రభావంబులన్
ఘనదోర్గర్వబలీముఖేంద్రబలముం గంపంబుతోఁ జెప్పికొం
చును భావిప్రళయంబు చూపుచు భయాస్తోకత్వ ముప్పొంగఁగన్. 1857

—అంగదుఁడు రావణునొద్దకు మందోదరి నీడ్చి తెచ్చుట.—

వ. ఉన్నయత్తఱి నయ్యంగదుండు సింహంబు కరిణిం బొదువుకైవడి సైంహికేయుండు సుధాధామమండలిం జేరుపగిదిఁ గదిసి కరివరంబు సశైవాలంబుగాఁ గమలినిఁ దిగుచుమాడ్కి మందోదరిఁ గచగ్రహణంబు సేసి తివిచిన. 1858

మ. చెలువం బై చలతారకారుచిలసత్సీమంతముక్తాఫలం
బులు రాలెం గమనీయగాత్రలతికాపుష్పంబులో నాఁగఁ గుం
తలముల్ దూలె ముఖాబ్జభృంగము లనం దన్వంగిరత్నాఢ్యకు
ణ్డలముల్ జాఱె దశాస్యమంగళపరీణామక్రమం బేర్పడన్. 1559

ఉ. రావణనాశలక్షణపరంపర లేర్పడఁ దెల్పునట్టి యు
ల్కావలి నాఁగ భూషణసమంచితరత్నము లెల్ల డుల్లఁ గం
గ్రేవల సాంజనాశ్రు లసత్కీర్తిఝరంబులుఁబోలెఁ గ్రమ్మ బా
హావలయంబు లూడి పడె నాసురదోర్బలరూఢులో యనన్. 1860

సీ. వరునికౌఁగిలి లేనివగఁ జన్నుఁగవ బాష్పకణములు నాహారమణులు దొరఁగ
దశకంఠవిజయావధానరావముతోన, మణిమేఖలాస్వన మణఁగిపోవ
దనుజేంద్రుచెడుట కేడ్చినభంగి నూపురంబులు వింతమ్రోఁతతో భూమిఁబడఁగ
వాసవారాతిగర్వగ్రంథికైవడి, నరవితో నీవియు సడలి జాఱ
దానవాధిపునిలుకడ దప్పినట్లు, పదసరోజయుగము దొట్రుపడుచు నుండ
దితిజనాథునిదర్పంబు దీఱుపగిది, వెలఁది కౌఁదీఁగ యెంతయు నులియ నపుడు.

మ. దనుజశ్రీఁ దల వట్టి యీడ్చుకరణిం దన్వంగికేశగ్రహం
బొనరం జేయుచు నంగదుం డసురకాంతాదీర్ణసంక్రాంతరో
దనరావంబులు నింగి ముట్ట సురకాంతాహర్షనాదంబు లో
లిన తోఁపంగ నలంఘ్యవిక్రమకరాళీభూతరోషంబునన్. 1862

వ. అరుదెంచి కురరియుంబోలె రోదనంబుసేయుమందోదరి నవిశంకుం డై ముందటికిఁ దెచ్చి సాట్టహాసావలేపంబుగా లంకావల్లభు నవలోకించి యిట్లనియె.

శా. మాయాకృత్యవిశారదుం డయినయామారీచుతోఁ గూడి య
న్యాయప్రక్రమవృత్తిమై వనములోనన్ రాము వంచించి చా
ర్వాయాసంబున కోర్చి రూఢతరబాహాశక్తి వోనాడి దై
న్యాయత్తుండవ పోలెఁ దెచ్చితివి నీ వాధారుణీనందనన్. 1864

ఉ. నే నిదె బాహుసత్త్వమున నిక్కి నిశాచరు లెల్లఁ జూడఁగాఁ
బూని నిరర్గళక్రమవిభూషితవిక్రమసాహసంబులో

మానిత మైనసీమగువ మానుగఁ దెచ్చితిఁ జూడు మిప్పు డో
దానవనాథ చూపు భుజదర్పము లెన్నఁటి కింక డాఁపఁగన్. 1865

వ. అనియెనంతమందోదరి భయలజ్జాశోకపరాభవరోషపరీత యై రావణున కిట్లనియె.

మ. వనభూమిన్ మనువంశరాజతిలకున్ వంచించి యజ్ఞానకిం
గొని యేతెంచుట యెంతశౌర్య మని నీకుం జెప్పఁ జందంబునన్
నను నీదైత్యులు సూచుచుండఁగ ననూనస్ఫూర్తితోఁ బట్టి తె
చ్చెను నీయొద్దకు నీవనాటుఁడు భుజస్థేమావలేపంబునన్. 1867

మ. అని నింద్రాదులఁ జీరికిం గొనక మాయాచాతురీవర్తనం
బున దుస్సాధత నుగ్రసాహసులలోఁ బూర్వాభిగణ్యుండు నా
తనయుం డుండిన నిట్లు సేయఁ దరమే దర్పంబునన్ వీని క
త్యనఘాచారుఁడు దుర్జయుండు నను నీయందాక రా నిచ్చునే. 1868

ఉ. చి చ్చొడిగట్టి తెచ్చుక్రియ సీత నరణ్యములోన నుండఁగాఁ
దెచ్చినపాప [1]మయ్యదియుఁ ద్రెక్కొని కాల్పక పోవ నిచ్చునే
యిచ్చ వివేకనీతిపథహీనత నార్యహితోపదేశముల్
మెచ్చక యింత చేసితివి మిన్నక పోవు కృతాపరాధముల్. 1869

చ. కృత మిది కార్య మెల్లఁ బరికించిన సిద్ధియు లేదు గావునన్
గతజలసేతుబంధనముకై వడిఁ జూడ నిరర్థకంబు దీ
నతఁ బగవానిచేఁ బడిననాదెసఁ జూడవు వీని భస్మసా
త్కృతముగఁ జేయ నేల తమకింపవు రాక్షసలోకనాయకా. 1870

ఉ. శంక యొకింత లేక త్రిదశద్విషు రావణుకూర్మిసుందరిం
గొంకక వానరుం డొకఁడు గ్రొవ్వున ముందల వట్టి యీడ్చె నీ
లంకకు నేది దిక్కనఁగ లక్షిత మై ఘన మైనదుర్యశః
పంకము నిన్ను ముంచె నుదపానము నేనుఁగు ముంచుచాడ్పునన్. 1871

సీ. విశ్వాత్ముఁ డీశుండు వెలయంగ నుండుకై, లాసపర్వత మెత్తి వాసికెక్కి
ధారాళమదదిశాదంతిదంతంబులు, కేలిమైఁ దునుమాడి కీర్తి మించి
పోర నింద్రాదులఁ బో నీక వడిఁ బట్టి, మన్నించి విడిచినమహిమఁ దనరి
చంద్రహాసాదికసాధనసామగ్రిఁ, బృథులసారంబు లై పెంపు మిగిలి
యుండునీభుజముల వేడ్క లోదవ నర్థిఁ, బారిజాతప్రసూన మింపార ముడువఁ
బడినమామకకుంతలభార మిట్లు, బలిమిఁ గానచరుచేతఁ బట్టఁబడియె.

ఉ. మానము లజ్జయున్ విడిచి మందబలంబున హోమనిశ్చల
ధ్యానపరాయణుండ వయి తాపసవృత్తిఁ జరించి రాఘవుం
బూని జయింపఁ గోరు టిది పోలదు తద్ఘనకార్ముకచ్యుతా

1. మేల యది ద్రెక్కొని.

నానాశిలీముఖానలమహోగ్రతరార్చులఁ గాలు మేర్పడన్. 1873

క. మాయలు మంత్రంబులుఁ బని, సేయవు నీ కింక నింద్రజిత్తునితోడం
బోయె నవి యెల్ల విజయమొ, పాయము హోమమునఁ గలదె పరికింపంగన్.

ఉ. బాహుబలంబు రామనరపాలునిముందటఁ గొంతసేపు సో
త్సాహతఁ జూపి తత్ప్రదరదారుణపావకకీలలందుఁ బూ
ర్ణాహుతి గమ్ము చయ్యన నుదగ్రత దక్కిన సీత నిచ్చి సం
దేహము మాని పార్థివపతిన్ శరణొందినఁ గాచు నెమ్మెయిన్. 1875

వ. అనిన విని దశవదనుండు రోషదహనదారుణధూమవిభ్రమంబు లగుభ్రూభంగంబులు వికటంబు లయి యుండ నభియాతిం గనుంగొని సప్రేమకరుణంబు లగుచూడ్కుల మందోదరిం జూచి దూరావధూతాహుతి యై మూర్తం బైన రౌద్రంబుంబోలె సశరీరం బగుభయానకంబు ననుకరించుచుం గరవాలం బంకించి యంగదుభుజాంతరంబు బిట్టు వ్రేసి జీవితేశ్వరి విడిపించిన నదియును వికీర్ణకేశకలాప యై బాష్పధారాసిక్తదుకూలసంశ్లేషవిభక్తగురుపయోధర యై యేడ్చుచు నంతఃపురంబున కరిగె నిట వాలినందనుండు ప్రహారమూర్ఛాపరాధీనుం డై వ్రాలిన. 1876

తే. పొంగి కోపించి పవమానపుత్త్రుఁడంత, మదము దూలఁగ రావణుమస్తకములు
మొనసి వజ్రంబుఁ బోలెడిముష్టిఁ బొడిచెఁ, బొదలి నెత్తురుధార లై చెదరిపడవ.

ఆ. అంతలోనఁ దెలిసి యంగదుఁ డస్త్రంబు, ధార లొలుక లేచి ధాతుశైల
మనఁగఁ గోప మడరి యాదైత్యుఁ దలమున, భూరిసత్త్వ మెడలిపోవ వ్రేసె.

శా. ఆదైత్యేంద్రుఁ డఖర్వవిక్రమకళాహంకారఘోరాట్టహా
సోదీర్ణధ్వను లుప్పతిల్ల నియమోద్యోగాంతరాయోద్యమ
క్షేదుం డై గద వ్రేసె నంగదుని నుద్దీప్యద్బలామ్రేడిత
ప్రాదుర్భావమురంతదుష్ప్రసహశుంభత్సాహసోల్లాసి యై. 1879

క. బి ట్టలిగి సమరకాంక్షం, బుట్టినయుత్సాహ మొదవఁ బొంగి యసుర దా
నెట్టన డగ్గఱి మారుతు, పట్టిన్ దట్టించి వ్రేసెఁ బటుఖడ్గమునన్. 1880

శా. ప్రద్యోతప్రతిమప్రతాపవిభవప్రాగల్భ్యసంపన్నతా
విద్యోతుం డగురావణుండు గపులన్ వీక్షించి దర్పంబున
ఖద్యోతంబులుగాఁ దలంచి యసమానప్రౌఢశస్త్రావలీ
విద్యాపాటవ మొప్పఁ బోరె సమరోర్వీకంపసంపాది యై. 1881

వ. ముసలంబున నీలునిఁ బరిఘంబున నలుని నంకుశంబున గజుని శక్తి శతబలిని ముద్గరంబున మైందునిఁ దోమరంబున ద్వివిదుని గదాఘాతంబున గవాక్షునిఁ గుంతంబున గంధమాదనుని నొప్పించిన వారును దుర్వారు లై సింహనాదం

బులు సెలంగ నతని ముష్టితలప్రహారపార్ష్ణిఘాతవాలపాతనఖదారణదంతనిపీడ
నాదుల నొప్పించి కృతకృత్యులై నిజసేనలం గూడుకొని నరపాలుపాలికి వచ్చి
రంత హనుమంతుండు రాఘవునకు మ్రొక్కి ముకుళితకరకమలయుగళుం డై
యి ట్లనియె. 1882

ఉ. దేవరపంపునం జని యుదీర్ణసముద్ధతి లంక సొచ్చి యా
రావణుహోమకృత్యము నిరాకృతి నొందఁగఁ జేసి దుష్టదై
త్యావలి రూపు మాపి విహితస్థితి నేర్పడ విన్నవింపఁగా
భూవర యేఁగుదెంచితిమి పొల్పుగఁ గర్జము లానతి మ్మొగిన్. 1883

వ. అని పలికిన. 1884

క. రాఘవుఁడు దైత్యుహోమము, మోఘత నొందుటకుఁ జాల మోదించి జయ
శ్లాఘాయుక్తుల నాహవ, లాఘవయుతులం బ్లవంగులం గొనియాడెన్. 1885

వ. అంత నక్కడ. 1886

మ. దనుజాధీశుఁడు హోమవిఘ్నమున నత్యుత్త్రాసుఁడై నిర్వికా
రనిరూఢాకృతి వైరివీరవిజయారంభంబుతో నేఁగి నె
మ్మనమున్ మేనును గందఁ గుందుసుదతిన్ మందోదరిం గాంచి యి
ట్లనియెన్ సాంత్వనపూర్వవిక్రమరసవ్యాపారఘోరంబుగన్. 1887

శా. నీ వీభంగి మృగాక్షి వందఁ దగునే నే నుండఁగా నుగ్రబా
హావీర్యంబున రామలక్ష్మణులఁ గీశాధీశులన్ జాతవై
రావేశంబునఁ గూల్తుఁ బూర్వకృతకర్మాగ్రానురోధంబునన్
దైవాయత్తము లెన్ని చూడఁ దరమే తప్పింపఁగా నుగ్మలీ. 1888

ఆ. రణములోన నేఁడు రాఘవుఁ జంపుదు, నొండె నతనిచేత నుగ్రశస్త్ర
నిహతి నొందువాఁడ నిక్కువ మిది యిందు, నందియంబు లేదు చపలనయన.

క. ననుఁ బోర నతఁడు చంపిన, జనకజ వధియించి నీవు సరభసగతి వై
యనలప్రవేశకృత్యం, బొనరింపుము వేడ్కతోఁ బయోరుహనయనా. 1890

వ. అనిన వల్లభుపలుకు లాకర్ణించి మందోదరి యి ట్లనియె. 1891

—మందోదరి రావణునకు రాముని మహత్త్వము చెప్పుట.—

మ. రఘురాముండు రణభూమిలో గెలువఁగా రా కుంట తథ్యం [1]బతం
డఘుదూరుండు కడిందివీరుఁడు ప్రభావాఢ్యుండు పూజ్యుండు లో
లఘునాస్త్రక్రమవేది లోకనతతశ్లాఘార్హసచ్చేష్టితుం
డు ఘనప్రాభవదూరితాసురవరాటోపానుభావుం డిలన్. 1892

---

1. బు లో లఘునాస్త్రక్రమవేది లోకసతతశ్లాఘార్హసచ్చేష్టితుం, డఘుదూరుండును మేరుధీరుఁ డు నయవ్యాపారపారంగతుండు ఘనప్రాభవ.

ఉ. ఊర్జితభవ్యవిక్రమమహోన్నతుఁ డాయతబాహువైభవో
పార్జితవీరశబ్దుఁ డనపాయబలుండు రఘూద్వహుం డనిన్
నిర్జరసిద్ధయక్షరజనీచరగుహ్యకఖేచరాలికిన్
దుర్జయుఁ డాతనిన్ గెలువ ధూర్జటి యైన నశక్తుఁ డారయన్. 1893

ఉ. మానమదాతిరేకఘనమత్సరహీనయతీంద్రవిస్ఫుర
న్మానసరాజహంసు ననమానుఁ బరాభవదూరు నూర్జితా
మానజగత్ప్రపూర్ణమహిమస్ఫురణున్ హరి నాదిపూరుషున్
మానవరాజరూపధరు మానవమాత్రునిఁ గాఁ దలంచితే. 1894

మ. శ్రుతిచోరుం డగుసోమకుండు భువనక్షోభంబు గావించి యా
తతకల్లోలవిలోలవారినిధి నుద్యద్దర్పుఁ డై చొచ్చినం
గృతకోదంచితమత్స్యమై యతఁ డతిక్లేశాత్మ నాక్రవ్యభు
క్కృతి మర్దించి తనర్చెఁ దొల్లి నిగమాగణ్యానుభావుం డొగిన్. 1895

మ. భ్రమణామందరయోగ్రమందరగిరిప్రవ్యక్తపాషాణవి
క్రమణాపాకృతపృష్ఠభాసురమహాకండూతివిభ్రాంతుఁ డై
కమఠాకారము దాల్చి మున్ను విలసత్కారుణ్యమేపారఁగా
నమృతం బిచ్చె దయార్ద్రుఁ డై యతఁడు దేవానీకముల్ గ్రోలఁగన్. 1896

మ. అవలీలన్ రజనీచరాధిపు హిరణ్యాక్షున్ వెసం గూల్చి య
ర్ణవదుర్వారతరాంబుమధ్యమనిమగ్నన్ ధారుణీదేవి ది
వ్యవరాహాకృతి యై యతండు లలితవ్యాపారుఁ డై యెత్తె ను
ద్భవనాశాదివిదూరుఁ డుజ్జ్వలమహాదంష్ట్రాగ్రభాగంబునన్. 1897

సీ. వికటసటాకోటివిదళితాంభోదుఁ డై, కుటిలాగ్నిమయనేత్రఘోరుఁ డగుచుఁ
జటులనిశ్వాససంచలితకులాద్రి యై, భానుకోటిప్రభాభాసి యగుచు
నఖిలదిక్కూలంకషాయతహస్తుఁ డై, తర్జనగర్జనోదగ్రుఁ డగుచు
నట్టహాసవిదారితాజాండభాండుఁ డై, దివ్యాయుధస్తోమదీప్తుఁ డగుచు
నాతఁ డుగ్రత నరసింహుఁ డై హిరణ్యకశిపువక్షము ఖరతరకరరుహములఁ
జీరి ప్రహ్లాదు నుత్తమశీలుఁ గాచె, భువనరక్షణశిక్షణప్రవణుఁ డగుచు. 1898

క. నుతదివ్యమూర్తి ఖర్వాకృతి యై యాతండు మున్ను కృతకవటుఁడు నం
దితభువనుఁడు నక్తంచరపతి నుద్యత్సత్యయుక్తు బలి బంధించెన్. 1899

మ. ప్రవరోదారతరప్రభావసహజప్రాగల్భ్యుఁ డై నిర్ఘృణా
తివినోదంబున జామదగ్న్యుఁ డగుచుం ద్రిస్సప్తకృత్వంబుగా
నవలీలం దునుమాడె హైహయముఖక్ష్మాధీశులన్ భీకరా
హవరంగంబున వజ్రసన్నిభకుఠారాభీలదోస్సారుఁ డై. 1900

తే. చటులభుజగర్వవిక్రమసాహసమునఁ, దఱిమి చేకొన్నధారుణీతలము నెల్ల

విమలతర మైననిస్పృహత్వమునఁ జేసి, భవ్యతముఁ డై నకశ్యపబ్రహ్మ కిచ్చె.

క. దశకంఠ నిన్నుఁ జంపఁగ, దశదశమఖరక్షణైకతత్పరమతి యై
దశరథసుతుఁ డై పుట్టెను, దశశతకరదీప్తి శౌరి తథ్యము సుమ్మా. 1902

క. ఆతనిమహానుభావము, లాతనిభుజయుగళమహిమ లాశౌర్యబల
ఖ్యాతులుఁ దగ వర్ణింపఁగ, నాతరమే పెక్కు లేల నలువకు వశమే. 1903

శా. విశ్వామిత్రుమఖంబు గాచుటకునై విల్లంది బాల్యంబునన్
విశ్వామిత్రపథంబు నొందినమహావీరోద్ధతం దాటకన్
విశ్వత్రాణము సేయఁ బూని సమరోర్విం గూల్చె లీలాగతిన్
విశ్వాధ్యక్షుఁ డితండు నీ వెఱుఁగవే [1]వీరోత్తమగ్రామణీ. 1904

క. మారీచుఁ బాఱఁదోలి యు,దారబలుం డగుసుబాహు దర్పోద్ధతునిన్
శూరుని నొక్కటఁ గూల్చెను, బోర నితఁడు పిన్ననాఁడ పృథుబాణమునన్.

క. క్షణమాత్రలోనఁ గ్రూర,క్షణదాచరవరుల నోర్చి సవనరచితర
క్షణుఁ డయినయితనికి విచ,క్షణుఁడు మునీంద్రుండు దివ్యశరముల నొసఁగెన్.

మ. జననాథుల్ గురుబాహువీర్యసహితుల్ సజ్యంబుగాఁ జేయఁ జా
లనిభూతేశుశరాసనంబు నవలీలం ద్రుంచినన్ మెచ్చి య
జ్జనకుం డాతని కిచ్చె భూమితనయన్ సాధ్వీలలామంబు సీ
త ననూనప్రియపూర్వకంబుగ సమాప్తప్రస్ఫురత్సంధుఁ డై. 1907

చ. చలమున నిన్నుఁ బట్టి చెఱసాలను ద్రొప్పినకార్తవీర్యుచే
తులు దునుమాడి కూల్చినసుదుర్జయు ధూర్జటిశిష్యు భార్గవున్
బలమునఁ జీరికిం గొనక బ్రాహ్మణుఁ డౌటను నొండు సేయఁగాఁ
దలఁపక పుణ్యలోకములు దప్పఁగఁ జేసె నమోఘబాణుఁ డై. 1908

వ. జనకునియోగంబున నజ్జనకజాసౌమిత్రిసహితుం డై వనంబునకుం జనుదెంచి
జటాజినవల్కలధరుం డై యుండి వెండియు దండకాటవియందు. 1909

మహాస్రగ్ధర. ఘనుఁ డాజిం ద్రుంచె నత్యుత్కటవికటబలాక్రాంతదేవావరోధుం
గనదుగ్రోదారశూలగ్రథితబహువిధాకారసత్త్వానురోధున్
జనితత్రాసాత్యుదంచజ్జలనిధిజలదస్ఫారనాదావరోధున్
హననప్రోద్యద్విరోధున్ యతిమునిసురనిత్యాపరాధున్ విరాధున్. 1910

మ. అనపాయప్రథితప్రభావభుజగోద్యద్వ్యాలపాశంబునన్
నిను బంధించి చతుస్సముద్రముల సన్నిద్రస్థితిన్ ముంచి వా
లినసత్త్వంబున నొంచి వే విడిచి యాలీఢప్రభావక్రమం
బున రూఢుం డగువాలిఁ గూల్చె జవవద్భూమైకబాణంబునన్. 1911

క. మానవనాథుండు జన,స్థానంబుననుండి బాహుదర్పితుల బలా

1. వీరోత్తమాగ్రేసరున్.

నూనుల ఖరదూషణులం, బో నీక వధించి త్రిశిరు బొంక మడంచెన్. 1912
తే. వాలిఁ బొలియించి కిష్కింధ వానరేంద్రుఁ, గరుణ సుగ్రీవుఁ బట్టంబు గట్టినట్లు
నిన్నుఁ బొలియించి యీలంక నీతిశాలి, యగువిభీషణునకు నిచ్చు నవ్విభుండు.
క. రామునిపరాక్రమము సంగ్రామోదగ్రతయు వివిధ ఘనతరశస్త్ర
గ్రామకుశలతయు నెఱిఁగియు, నేమిరయో యెఱుఁగనేర వే మనవచ్చున్.
చ. శలభగతిన్ రఘూద్వహుని సాయకపావకహేతిరాశిలోఁ
బలఁ బడి కాల నేమిటికి భాసురరాజ్యముతోడ సీత ని
మ్ములఁ దగ నిచ్చి సంసరణమోహము భోగము లెల్ల మాని కా
నల మునివృత్తి నుండుదము నా కిది దోఁచినచొప్పు వల్లభా. 1915
క. పతితోడ ననుగమించుట, సతికిఁ బరమధర్మ మండ్రు సజ్జనులు దగన్
శ్రుతిచోదితాచరణములు, మతిఁ దలఁచిన నుభయలోకమహితము లెందున్.
తే. నీవు రణమున నీల్గిన నిక్కువంబు, నాకు నీతోడియనుగమనంబు లేదు
జనకువరమున మరణంబు జరయు నన్నుఁ, జెంద వెన్నఁడు నే నేమి సేయుదాన.
చ. సరసమనోరథాధిగమశాలి విభీషణుభార్య యైనయా
సరమయు రాముపత్ని యగు జానకియుం దగఁ జెప్పకృత్యముల్
పరువడిఁ జేయఁగా వలయుఁ బన్నుగ నోప ననంగ రాదు కిం
కరిగతి నుండఁ బా లయితిఁ గర్మఫలంబులు దప్పిపోవునే. 1918
వ. అనిన విని నిశాచరవల్లభుండు నిజవల్లభ నూరార్చి యి ట్లనియె. 1919
చ. అనుజుల భృత్యులం బ్రియుల నాత్మజులం దగునట్టిమంత్రులన్
మునుకొని [1]యుద్ధరంగమున ముందటఁ జావఁగఁ ద్రోచి పుచ్చి యే
మని సుఖవృత్తి గోరెద నిరర్గళవిక్రమసాహసంబు పెం
పున రఘురాముతోఁ దొడరి పోరెదఁ గూల్చెద నొండెఁ జచ్చెదన్. 1920
క. శతమన్యుప్రభృతిహరి, త్పతివిజయప్రథితబాహుబలగర్వితు మ
త్సుతు నింద్రజిత్తుఁ జంపిం,చితి నా కేమిటికి బ్రదుకు చింతింపంగన్. 1921
మ. సురవిద్యాధరకిన్నరోరగవరస్తోమంబులన్ గెల్చి యు
ద్ధురతన్ సన్మునులన్ వధించి సుమహాదోషాతిరేకంబునం
బరకాంతావలిఁ బట్టితెచ్చి యెపుడుం బాపంబు గావించు నే
వెరవారన్ ముని నైన నవ్వరి రణోర్విన్ భీతి నా కేటికిన్. 1922
క. నీ వేల నాకు నశ్వర,జీవం బది యేల భోగసిద్ధులు నీలం
కావాస మేల నిశ్చయ,భావితనాశాంగ మేల పంకజవదనా. 1923
సీ. జంభారిదోస్తంభదంభోళిఘాతంబు, దహనుబాహాశక్తితాడనంబు
దండధరోద్దండదండనిపాతంబు, దైత్యేంద్రఖడ్గవిదారణంబుఁ

1. 'యుద్ధశాహితుల ముందట. అ. ప్ర.

బాళహస్తోదగ్ర పాశబంధంబు సమీరణకేతన ప్రేగణంబు
యతునాముకగదా విక్షేపణంబును, హరుశూలహతి నోర్చి యడరు నేను
నన్నుఁ గావు మనుచు నరు నెట్లు వేఁడుదుఁ, దెచ్చినట్టిసీత నిచ్చు టెట్లు
భరితచంద్రహాస బలము గల్గుచునుండ, నింతదీనవృత్తి యేల నాకు. 1924
క. పరమార్థ మొకటి చెప్పెద, నిరపాయపదైకలబ్ధి నిశ్చితమహిమో
త్తర మైనపొందు వడయఁగ, నరుదుగ నాకిరవు గలిగె నంబుజవదనా. 1925
చ. ఎఱుఁగుదుఁ బద్మబాంధవకులేశుఁడు పంకజనాభుఁ డౌట యే
నెఱుఁగుదు మున్న యిందిర మహీసుత యై తనరారుసీతగా
నెఱుఁగుదు నాకు రాఘవమహీశునిచేతివధక్రమంబు ని
ట్లెఱిఁగియు ముక్తిఁ బొందఁగ నభీష్టము గల్గుట నింత చేసితిన్. 1926
చ. ధరణితలేశదివ్యశరదత్తసుదుర్లభముక్తికామినీ
పరిణయమంగళోత్సవము భాగ్యమునం జనుదెంచెఁ గాన య
త్యురుతర మైనయీశుభముహూర్తము తప్పక యుండ నేఁగి నే
నిరతిశయానుభావపదనిశ్చలసుస్థితిఁ బొంది యుండెదన్. 1927
చ. అమితబలుండు రాఘవుఁడు యాజకుఁ డైనఁ దదస్త్రవహ్నిసా
త్క్యమున మదీయసాంద్రతర కాండశతాహుతు లొప్ప వేల్చి మో
దమునను ముక్తికాంత నిరతంబుగ మంగళలీలఁ బెండ్లి యై
విమలతదీయభోగపదవిశ్రుతసౌఖ్యనిరూఢిఁ బొందెదన్. 1928
వ. అని సమరసన్నాహవ్యగ్రాయమానచిత్తాభినివేశసంపాదితమోక్షసుఖలీలానుభవ లాలసుం డై కదలిపోవ సమకట్టి మందోదరిం జూచి మఱియు నిట్లనియె.
సీ. కరిరాజుతోఁ బాయు కరిణిచందంబున, గురుమరాళము లేని సరసిఁబోలె
సుభగభృంగము లేని చూతమంజరి క్రియ, మిహిరుతోఁ బాయుపద్మిని యనంగ
వరవసంతుఁడు లేని [1]వనలక్ష్మి కై వడి, [2]ధృతిఁ దరువును బాయు తీఁగ యనఁగ
హిమధాముఁ జూడని కుముదినిచాడ్పునఁ, బ్రద్యుమ్నుఁ బాసిన రతి యనంగఁ
దోయజానన నీవు నాతోడఁ బాసి, పుణ్యమంగళచేష్టిత స్ఫురణ దక్కి
యుచితసౌభాగ్యహీనవై యుండు మసిన, నువిద సిగ్గున నూరక యుండె నపుడు.

—❖ రావణుఁడు యుద్ధమునకు వెడలుట. ❖—

వ. తదనంతరంబ నిజసహచరి వీడ్కొని చరణవిన్యాసంబున ధరణి గ్రక్కదల నుదగ్ర ప్రత్యగ్రమహాగ్రహంబున దురవలోకుం డై బహిరాస్థానసదనాంతరవిన్యస్తమహోచ్చతరమణిహేమమయసింహాసనాసీనుం డై రోహిణశైలోపరిగతకాలజీమూతంబు ననుకరించుచు గర్జావిభ్రమంబుగా ప్రస్థానభేరి వ్రేయ నాజ్ఞాపింపఁ దదనంతరంబ. 1931

1. వనరాజికై వడి. 2. ద్రుమముతోఁ బాసినతీఁగఁ బోలి.

సీ. రోదసీకుహరంబు ∫ మేదురం బై యుండ, దిగ్గజశ్రేణియు ∫ మ్రొగ్గతిలఁగ
ధారుణీచక్రంబు ∫ తల్లడ మందంగఁ, బృథుగోత్రశైలముల్ ∫ పెల్లగిల్ల
సప్తార్ణవంబులు ∫ సరవితో ఘూర్ణిల్ల, దినమణి గతి తప్పి ∫ తిరుగఁబడఁగఁ
గొనకొని సురకోటి∫గుండెలు పగులంగ, శేషాహిఫణులు ∫ చెవుడుపడఁగఁ
నగలి బ్రహ్మాండభాండంబు∫పగిలెననఁగఁ, బ్రళయరుద్రుండు వాయించు∫పటహమనఁగఁ
బిడుగులొక్కట వడిమ్రోయు∫పెల్లుడోఁప, భీషణంబుగఁ బ్రస్థానభేరి మ్రోసె.

మ. సమరోల్లాసకుతూహలాదరసమం∫చద్విక్రమాడంబరా
సమరోషజ్వలనస్ఫులింగలహరీ∫సంఛన్నదిగ్భాగుఁ డై
యమరోత్సాహము దక్క నుద్ధతమహా∫హంకారగర్జారవ
క్రమరోచిష్ణుఁడు జిష్ణుఁ దుష్ణకిరణ∫భ్రాజిష్ణుతేజంబునన్. 1933

మ. స్ఫురదుద్యద్ఘృశమస్తకార్పితఖరాం∫శుప్రఖ్యసన్మౌలిబం
ధురుఁ డై రత్నపరిష్కృతాంగదలస∫ద్దోస్తంభుఁ డై దివ్యభా
స్వరకర్ణాభరణాఢ్యుఁ డై రుచివిరా∫జత్తారతారావలీ
తరళోదంచితతారహారధరుఁ డై ∫ దైత్యేంద్రుఁ డొప్పెం గడున్. 1934

చ. హరి మొదలై నదిక్పతుల∫యాకృతులం దనరారి యున్నయా
బిరుదులఁ గ్రాలుపెండియముఁ ∫ బెం పగురత్నమయూఖచారునూ
పురమును వామపాదమునఁ ∫ బొల్పు వహింపఁగ సాంధ్యవారిదాం
బరములు దాల్చె రావణుఁడు ∫ భాస్వదుదారతరప్రతాపుఁ డై. 1935

వ. చంద్రహాసప్రాసతోమరఖడ్గభిండివాలశరాసనముసలముద్గరగదాపరిఘపట్టిసశూలపరశుకఠారగోణచక్రాదిప్రహరణసమేతబాహుదండంబులు దేజరిల్లఁ దివిరి షోడశచక్రసంఘటితంబును బటుతరకోటిద్వయఘంటాకలితంబును భల్లూకచర్మవర్మసమాచ్ఛాదితపవనజవనతురంగసహస్రవాహ్యమానంబును గాలకేతునమాఖ్యాకసూతనియమితంబును రాహుశిరశ్చిహ్నితకేతనత్రయవిరాజమానంబును నగుమహారథంబు వైకుంఠరథారోహణంబు సేయువడువున నారోహించి రాకానిశాకరమండలోపమానమహనీయాతపవారణదళకంబు దనరం గమలగర్భవాహనమరాళవిలాసాపహాసిప్రకీర్ణకంబులు వెలయ భేరీపటహఢక్కామృదంగకాహళశంఖనినాదంబు లులియఁ గరటిఘటాఘోటకకోటిరథస్తోమపదాతివరసహస్రంబులతో వెడలునవసరంబున. 1936

మ. కదనోత్సాహరసంబు వెల్లివిరియం∫గా నట్టహాసస్ఫుర
ద్వదనోదగ్రమయూఖవేల్లితమహా∫దంష్ట్రాకరాళీభవ
ద్వదనోత్తాలవినిర్యదుగ్రదహన∫జ్వాలాపరీతాభుఁ డై
కదలెన్ వీరుఁడు ఖడ్గరోముఁడు సమ∫గ్రప్రాభవవ్యగ్రతన్. 1937

శా. అభ్రాంతాహిమధామధాముఁడు యుగాం∫తాబ్ధిస్వనత్కార్ముకా

దభ్రాహీనభుజాతిభీముఁడు సముద్యద్రత్నభూషాసమా
హాభ్రాజిష్ణుఁడు [1]జిష్ణుఁ డూర్జితబలాహంకారఘోరుండు జ
న్యాభ్రాంతాత్ముఁడు సర్పరోముఁ డసమానారంభుఁ డై యేఁగెఁ దాన్. 1938

చ. కదలె ననూనవేగరథకాంచనకేతనకాంతిజాలముల్
చదలఁ గ్రమంబుతోఁ బొదల సజ్యశరాసనరత్నహస్తుఁ డై
యుదితతటిన్మహేంద్రధనురూర్జితమేఘముఁబోలె వీరవై
రిదళనకౌతుకం బొదవ వృశ్చికరోముఁడు గర్జితోగ్రుఁ డై. 1939

ఉ. మండలితోగ్రచాపరుచిమండలనిర్గతసాయకప్రభా
మండలచండసత్త్వుఁ డభిమానధనుండు సువర్ణవిస్ఫుర
త్కుండలమండితుండు పటుదోర్బలశాలి లయోత్థితాగ్నివ
ర్ణుం డగునగ్నివర్ణుఁడు వినోదగతిం గదలెన్ ససైన్యుఁ డై. 1940

క. హరిసైన్యకాననంబుల, దరికొని కాల్పంగ వచ్చుదహనములగతిన్
వరశస్త్రార్చులు గ్రాలఁగ, నరుదెంచి రుదగ్రు లై నిశాటులు పెలుచన్. 1941

క. తరుచరులుఁ దరులు గిరులును, గురుభూధరశృంగతతులుఁ గొని రణకేళిం
బరిణతమతు లయి తాఁకిరి, ధరణిపరాగంబు లెగసి తరణిం గప్పెన్. 1942

క. కోలాహలంబు లొప్పఁ గ, రాళగదాకుంతశితపరశ్వధపరిఘా
భీలకరవాలభీషణు, లై లీలం బొడిచి రసురు లాకపికోటిన్. 1943

సీ. మదసత్త్వరణకర్మమహితమహోత్తుంగ,కుంజరేంద్రముల డీకొలిపికొలిపి
ఖురకోటిపాటితక్షోణితలోద్ధత,ప్రథితాశ్వవరములఁ బఱపి పఱపి
రవిరథాతిశయాళురథనేమినిస్వనో,ద్ధురశతాంగంబులఁ దోలి తోలి
హర్యక్షదుస్సహశౌర్యగుణాకల్ప,ఘనపదాతులఁ బయిఁ జొనిపి చొనిపి
దైత్యనాథులు నలువురు దర్ప మెసఁగ
దిశలుఁ జదలును దూపుల దీటుకొనఁగఁ
గ్రమముతోడుత సింహనాదములు బెరయ
భూరిజవమునఁ గపులతోఁ బోరి రెలమి. 1944

సీ. కలితలీలాకందుకక్రీడనక్రియ, వరమహీధ్రము లెత్తి వైచి వైచి
తర్జించి ఘనకశాతాడనస్థితి మహా,వృక్షజాతంబుల వ్రేసి వ్రేసి
కులిశసమాఘాతఘోరారిదుస్సహ,కూర్పరహతులను గూల్చి కూల్చి
నిష్ఠురనారాచనిశితోగ్రచటులదు,ర్వారనఖంబుల వ్రచ్చి వ్రచ్చి
యార్పు లొదవ సమితినేర్పులు మెఱయుచు
బలముఁ గినుకతోడి చలము మిగులఁ
గపులు పోరి రమరరిపులు భీతిల్లంగ

---

1. దూఢవిక్రమబలా.

నఱిమి తోడుతోడఁ ఽ దఱిమికొనుచు. 1945

వ. అసిగదాప్రాసతోమరభిండివాల ముసలముద్గరపరిఘపట్టిసపరశుశూలచక్రశరంబులు ప్రయోగించి నొంచియుఁ ద్రుంచియుఁ జించియు వ్రచ్చియు గ్రుచ్చియు వ్రేసియు నేసియుఁ దలలుదునిమియుఁ గరంబులునఱకియుఁ జరణంబులుద్రెంచియుఁ దొడలు నలంచియు నురంబులు ఛేదించియు నుదరంబులు చీరియుఁ బ్రక్కలు వ్రక్కలుసేసియు నుదగ్రు లగుయాతుధానులపయిం గవిసి మర్కటులును నగంబులు గురియించుచు గిరిశృంగంబులు వైచుచు నరదంబులకు లంఘించి బిరుదులు సెలంగ రథసారథిరథ్యంబు లొక్కటఁ జదియ మోఁదుచు నుప్పరవీదికి దెప్పరంబుగా నెగసి సతురంగు లై నరాహుతులు సమయఁ గుప్పించి యుఱుకుచు నరవాయిగొనక యాధోరణనివహంబుతోన రణపరిణతవారణంబులు సమంబుగాఁ జదియఁ గొండలు వైచుచు నదల్చి కదల్చి తరునివహంబులం బదాతుల యుక్కు స్రుక్కించుచు నరదం బరదంబుతోడ వీచివైచి తెగటార్చుచు నేనుంగు నేనుంగుతో వైచి పీనుంగు గావించుచు ఘోటకంబుఁ బట్టి యన్యఘోటకంబుతోఁ దాటించి కారించుచు సుభటుం బటురయంబునం బట్టి యితరసుభటుతోఁ జఱచి వధించుచుఁ గఱచియుఁ జఱచియుఁ బొడిచియు నొడిచియు నిట్లనేకప్రకారంబులం బోరు సల్పుచు మఱియును. 1946

చ. ఉరుతరముష్టిఘాతముల ఽ నుగ్రనఖంబుల నోలి దైత్యులం
బొరిఁబొరిఁ గూలఁగాఁ బొడిచి ఽ పొంకము దక్కఁగఁ జీరి తన్ని వి
స్ఫురదురువాలపాశములఁ ఽ జుట్టి వెసన్ దివి వీచివైచి ని
ష్ఠురరదనంబులం గఱచి ఽ శుంభదుదగ్రతఁ జేర్చి వానరుల్. 1947

చ. కడిమిమెయిన్ నిశాచరుల ఽ గ్రక్కున మింటికి వీచి వైచినం
బిడుగులుఁబోలె నుద్దవిడి ఽ బెట్టిదు లై పొలియింపఁ బూని పైఁ
బడఁ జనుదేరఁ జూచి పటుఽబాహుబలంబునఁ జేర్చి యార్చుచుం
బిడికిటిపాలు సేసి యతిఽభీమముగా సమయించి రత్తఱిన్. 1948

సీ. ముదితవానరఘనఽముష్టిఘాతంబున, నొఱలుచుఁ బడి కూలుఽనురుగజములు
దీప్రకపీంద్రతఽలప్రహారంబులఁ, గొలఁది మీఱఁగ వ్రాలుఽఘోటకములుఁ
గుపితహరిక్షిప్తఽభూధరపాతంబుల, నఱిముఱి యైనశఽతాంగగణము
నుద్ధతశాఖామృఽగోద్ధూతతరుహతిఁ, దల లొగిఁ జదియుపఽదాతిచయముఁ
గలిగియుండియుఁ దఱుఁగనిఽకడఁక పెరుఁగ, సమరకుతుకము మనమునఽసందడింప
ధూపరాగంబు నభమునఁ ఽ బొదలి నెరయ, ధూపరాగంబుసైఁపకఽయేపు రేఁగి.

క. దానవులు గవిసి యురవడి, వానరులన్ లెక్కగొనక ఽ వరతరనిశితా
నూనవివిధాస్త్రసంహతి, నోనాటఁగ నేసి రతివిఽనోదస్థితితోన్. 1950

ఆ. మస్తకములు చిదిమిఽహస్తముల్ దునుమాడి, పదయుగములునఱకిఽప్రక్కలోలి

వ్రక్కలించి మేను $ జెక్కి వక్షస్స్థలి, పటుతరాస్త్రతతులఁ $ బగులనేసి. 1951

వ. రక్కసులు భీమతరంబుగాఁ బోరునవసరంబున, 1952

ఉ. దానవభూషణాయుధశ$తప్రతిబింబితచారుబింబుఁడై
మానుగ నుష్ణరోచి నిజ$మండలభేదవిశంకమానుఁడై
మానుపఁ బూని వచ్చుక్రియ $ మంజుసముద్ధతరోపరోధనం
స్థానవిశేషసంపద ను$దంచితుఁడై తనరారె నెంతయున్. 1953

ఉ. వానరదానవాశ్వరథ$వారణధూతవసుంధరాతలా
లూనపరాగ మంబుదము$లో యన మింటికిఁ బోయి పోయి సో
పానపరంపరారుచిర$భంగులభంగి సుయోధనిర్ఝరీ
యానసమాగతంబులకు $ నాయితమై విలసిల్లె నత్తఱిన్. 1954

ఉ. లోలనిశాటసాయకవి$లూనములై సముగ్రహుంక్రియా
భీలత నొప్పి యుత్థితక$పిప్రకరస్ఫురదుత్తమాంగముల్
లాలితలీలతోఁ ద్రిదశు$లం గలయం జనుదివ్యమూర్తులం
బోలఁగ వేడ్కతో ననుపఁ $ బోవువిధంబున నుండెఁ జూడఁగన్. 1955

ఉ. భీకరవానరాధిపవి$భిన్నతురంగమతంగజానురా
నీకము లూర్జితాస్త్రమయ$నిర్గతదుర్గమవార్ధిలోన ను
త్సేకము దక్కటన్ మునిఁగి $ తేలుచు నొప్పెఁ బయోధిఖేలనా
స్తోకసముద్యమన్మకర$దుష్టభుజంగఝషంబులో యనన్. 1956

సీ. పెడకేల నొప్పించి $ పిడికిళ్లఁ దాడించి, పార్ష్ణిఘాతంబుల $ బడలువఱిచి
గిరులు పైఁ బడవైచి $ తరువులఁ బడమోఁది, దంతవ్రజంబులఁ $ దఱిమి కఱచి
మోఁచేతులను నొంచి $ మోఁకాళ్ల గట్టించి, కఠినతలంబులఁ $ గదిసి చఱచి
కరురహంబులఁ జీరి $ చరణాగ్రములఁ దాఁచి, పటువాలనిహతుల $ భంగపఱిచి
బిట్టు మీఁది కెగసి $ నెట్టన నార్చుచు, నశనులో యనంగ $ నసురవరుల
శిరముతోన మేను $ చిదిసిపోవఁగ నుబ్బి, యుఱికి చంపి రిట్టు $ లుఱక కపులు.

శా. తుండాగ్రంబులఁ బట్టి మత్తకరులన్ $ దోర్గర్వమేపార ను
ద్దండప్రాభవలీలఁ ద్రిప్పి వడితో $ ధాత్రీస్థలిన్ వ్రేసి యు
చ్చండప్రస్ఫుటవిక్రమంబున నుదం$చత్స్యందనానీకినీ
తండంబుల్ వడి నుగ్గుసేసిరి కపుల్ $ దైత్యాంతకృచ్ఛౌర్యులై. 1958

క. హరిదళితకరటికుంభో,త్కరనిస్సృతతారమౌక్తి$కము లెగయుచు నం
వరణాగతసురకాంతా,గురుకుచకుంభములమీఁద $ గొనకొని పడియెన్. 1959

చ. చటులమహాశనిప్రతిమ$చండిమధాములై చలద్విశం
కటవిలయాగ్నిహేతితతి$కల్పములై మిహిరాంశుమండలో

త్కటరుచిరంబు లై పరఁగి దానవయూథశిలీముఖంబు లొ
క్కట వడితో బలీముఖులగాత్రము లుచ్చి పగిల్చె ధారుణిన్. 1960

మ. కలహోదంచితకీశముక్తవిపులగ్రావంబు లేతెంచుచో
బలవద్విక్రము లైనదానవులు శుంభన్ముష్టిసంతాడనం
బుల లీలాగతి నుగ్గుగాఁ బొడిచినం భూమిస్థలిన్ వ్రాలె ను
జ్జ్వలదంభోళిసముద్ధతాహతిగళత్సంధిక్రమం బేర్పడన్. 1961

సీ. మాతంగధారాళమదజలౌఘంబుల, భూతలంబు ననూపభూత మైనఁ
దురగసముద్ధూతఖురపుటంబుల రేణు,పటలంబు లెగసి నభంబు వొదువ
మిన్నేఱు గలఁగినమీనజాలంబులు, పరిచయస్థితి దప్పి తిరుగఁబడఁగ
నక్తంచరోదగ్రనారాచజాలంబు, పృథురజోధ్వాంతంబుఁ బెరుఁగఁజేయఁ
జేరి చలమున వానరశ్రేణి పేర్చి, కుధరకూటంబు లగములు గుప్పి గుప్పి
నిరతిశయముగ నార్పులు నింగిముట్టఁ, గుప్పగూల్చె నిశాచరకోటి నపుడు.

వ. అట్టియెడ మనోరథంబులతోన భగ్నంబు లగురథంబులును మదోత్సాహంబుల
తోన పొలియుమదగజంబులును సమరవ్యగ్రతలతోన సమయుజవనతురంగంబు
లు నుద్భటత్వంబులతోన కూలుసుభటనివహంబునుం గలిగి,కోదండంబులఖండం
బులును రణమండలాగ్రపతితంబు లగుమండలాగ్రంబులును శోణితపంకఘనం
బు లగునపఘనంబులును బరశుభాంగప్రచ్ఛన్నంబు లగుపరశువులును దీప్రాసం
బు లగుప్రాసంబులును గులగులలై పడుకిరీటంబులును డొల్లుతలలును బగులువ
తుంబులును దునియుచరణంబులును జెదరుమాంసరాసులును గుప్పలుగొనుమె
దళ్లును బ్రోవు లగుప్రేవులును దునుక లగుపునుకలును జొత్తిల్లునెత్తురులును
సంధిభగ్నంబులగునెమ్ములునుగలిగి, యొక్కొక్కయెడ నిలిచిననిలువున నిష్క్రాం
తజీవు లయి ప్రతిభటులనుం బ్రతిఘటించుక్రియ భయానకరసంబు దొలఁకాడఁ
[1]బొలుచువారును, సముత్పాటితశిరస్కు లయ్యుం బూర్వపరిచయవశంబున సమ
రసన్నద్ధు లగువారును, భ్రుకుటికుటిలంబులును విలూనంబులు నగునన్యోన్య
మూర్ధంబులఁ గరంబుల నవలంబించి యస్తవ్యస్తంబుగాఁ బూర్వప్రదేశంబున
నునుచువారును నాడుకబంధంబులునై యొప్పి, మేదంబు లాస్వాదించిమాంసంబు
లు నవిచూచి యస్థిగతంబు లగుమజ్జలు పీల్చి రక్తంబులు గ్రోలి శాలకులఁ దనిపి
జల్లుఁబోరాడుచు నీఁదుచుఁ దేలుచుమునుఁగుచు నొండొడలఁబొడచూపుచుం దమ
వారలఁ బిలిచి మూఁకలు [2]గట్టుచు నాపానంబులు సలుపుచు దానవవానరుల
ఫాలపట్టంబుల నున్నపరాక్రమాద్యుపన్యాసంబులు గలయక్షరపంక్తులు సదివి
మెచ్చుపిశాచబేతాళడాకినీభూతకోటిచేతం బూరితం బయి యరణ్యంబునుం
బోలె నుద్దండపుండరీకననాథం బై హేమకూటంబునుంబోలె నంస్థితానేకగంధ

1. నిలుచువారును. 2 గట్టి యుపాయనంబులు సలుపుచు.

ర్వాకలితం బై వసంతమాసంబునుంబోలె వికీర్ణశిలీముఖం బై వర్షాసమయంబు
నుంబోలెఁ గలుషకీలాలప్రవాహోపేతం బై నభోభాగంబునుంబోలె నుద్దామ
సహస్రకరాధిష్ఠానం బై శరత్సమయంబునుంబోలె శరాసనవిభ్రాజమానం బై
సముద్రంబునుంబోలె ననేకవాహినీసమాకులం బై వియత్తలంబునుంబోలె
దృశ్యచిత్రాభరణాభిరామం బై పాతాళంబునుంబోలె మహాహేయాన్వితం బై
రుద్రవిలసితంబునుంబోలె నిహతగజాసురం బై యాసంగ్రామంబు ఘోరం
బయి ప్రవర్తించె మఱియును. 1963

సీ. రథయానపాత్రంబు § పృథుచక్రకమఠంబు, శవమకరంబును § శయభుజంగ
మురుతరచామరో§త్కరఫేనవితతి తు,రంగతరంగంబు § రాజదస్త్ర
బడబాగ్నిదుర్గంబు § బహురత్నసహితలంబు, సంభ్రమావర్తంబు § సామజాద్రి
కలితంబు డాకినీ§గణహాసఘోషంబు, సాంద్రశోణితపూర§సలిలమయము
నగుచు నబ్ధిఁబోలె § నతిదుస్తరంబు న,గాధతరము దుర్వి§గాహ మంత
రహితపార ముదిత§రసవాహినీకంబు, దుర్నిరీక్ష్యగతి ను§దీర్ణ మయ్యె. 1964

ఉ. ఆసమయంబునందుఁ బవ§నాత్మజుఁ డంతకుఁ బోలి రాక్షస
త్రాసకరాట్టహాసమున § దారుణుఁ డై సురసిద్ధకిన్నరో
ల్లాసము నివ్వటిల్ల నతి§లాఘవలంఘనవిక్రమక్రియా
భ్యాసవిశేష మొప్పఁగ ర§యంబున నయ్యసిరోముఁ దాఁకినన్. 1965

—✿ ఖడ్గరోముఁడు హనుమంతునిచే జచ్చుట. ✿—

చ. అతనికి దైత్యుఁ డిట్లనియె § నందుల కెక్కడి కేఁగె దీవు ని
ర్జితహరి నైననన్ను [1]ననిఁ § జేరఁగ శూలికి నైన శక్యమే
దితిజులఁ జంపినట్టిపగ § దీర్చెద నిన్ బొలియించి భూతసం
తతి దనియంగ సద్బలివి§ధానము నల్పెదఁ గీర్తి నిల్పెదన్. 1966

మ. అనినం గోపదవానలంబు ఘనదై§త్యాభాషితాజ్యార్పణం
బున నత్యంతముఁ దేజరిల్ల నసుహృ§ద్భూజవ్రజోత్పాటనం
బు నుదగ్రం బగుశౌర్యమారుతమునం § బొల్పొంది నిర్ఘాతఘో
రనినాదంబున వానిమీఁది కుఱికెన్ § రౌద్రాతిరేకంబునన్. 1967

క. కరవాలము లగునక్తం,చరరోమములందు మునిఁగి § చలశోణితని
ష్ఠురధార లొలుక మూర్ఛా,పరవశుఁ డై తెలిసి యంతఁ § బావని కడఁకన్.

క. రోమాసినిర్గతుం డై, యామారుతసూతి సింహి§కాత్మజసుమహా
భీమాననంబు వెడలున,భోమణిక్రియ నొప్పె నుదిత§భూరిద్యుతి నై. 1969

మ. కులగోత్రోపమశైల మెత్తి గమనో§గ్రుం డై హనూమంతుఁ డా
ఖలనక్తంచరుమీఁద వైవ వడితో § ఖండించె వాఁ డుగ్రరో

1. నరిఁ జెండఁగ.

మలసత్ఖడ్గసముద్ధతాహతుల భీమప్రాభవం బేర్పడన్
బలభిద్భేదనశక్తియుక్తుఁడు దురాపస్ఫూర్తినిర్వాహుఁడై. 1970

మ. వెస ఖండించు నదల్చుఁ ద్రుంచుఁ జఱచున్ వ్రేయున్ పడిం జీరు నీ
రసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు వె
క్కసపాటొందఁగ వ్రచ్చుఁ జించుఁ బొడుచుం గారించుఁ దూలించు రూ
పుసెడం జేయు నలంచు గ్రుచ్చుఁ జిదుముం బోనీక కీశావలిన్. 1971

చ. మఱియును దానవుండు హనుమంతు మహోద్భటవృత్తిఁ దాఁకి పై
కుఱికి తనూరుహాసిహతి నొంచుచు బిట్టుగఁ గౌఁగిలించి క్రి
క్కిఱిసినపోటులన్ మిగులఁ గీడ్పడ నెత్తురు గ్రమ్మఁ జేసి యి
ద్దఱు నవలీలఁ బోరి రతిదర్పితులై సమరోత్సవంబుతోన్. 1972

ఆ. అనిలతనయుఁ డంత నాగ్రహోదగ్రుఁడై, యెలమిఁ బెద్దకొండ యెత్తి తెచ్చి
దైత్యుమీఁద వైచె దానన వాఁడును, జమునిప్రోలు చూడఁ జనియె నపుడు.

మ. అటఁ గాలాహినికాశరోమములతో నాసర్పరోముండు ప్ర
కటసత్త్వంబున వానరప్రతతులం గారింపఁగాఁ జూచి యు
ద్భటవేగంబున నంగదుండు విజయస్తంభంబు నాఁ జాలి యు
త్కటసత్త్వం బగుబాహుదండమున నాదైత్యేశ్వరున్ వ్రేసినన్. 1974

—సర్పరోమవృశ్చికరోములయుద్ధము.—

మ. వికటోద్దీప్తతనూరుహాహివదనావిర్భూతకీలోలద్విష
ప్రకరాగ్నుల్ వడిఁ జుట్టుముట్టి చగలం బర్వంగ రోషించి ద
ర్పకరాళుం డగునంగదుం బొదివి శుంభద్వేగుఁడై వ్రేసె ను
త్సుకులై దైత్యులు మెచ్చి చూడఁ బ్లవగక్షోభంబు గావించుచున్. 1975

మ. అది సైరింపక వాలినందనుఁ డమోఘారంభసంరంభుఁడై
మదిఁ గోపం బొదవంగ దానవశిరోమధ్యంబు ముష్టిస్ఫుర
ద్భిదురాపాతమునం బగిల్చి విజయోద్రేకంబునం గూల్చె నే
ర్పొదవం ద్రొక్కి శిరంబు [1]ద్రుంచె జలదానూనోల్లసద్ధ్వానుఁడై. 1976

ఉ. వృశ్చికరోముఁ డంతఁ బరివీతదురాపవిషాగ్నివిస్ఫుర
ద్వృశ్చికరోముఁడై భయదవేషమునం గపిరాజసేనలన్
నిశ్చలవృత్తి నొంచి యతినిష్ఠురశూరతఁ దాఁకి తాఁకి తే
జశ్చటులాత్ముఁడై పఱపెఁ జండభుజాయుధదుర్నిరీక్ష్యుఁడై. 1977

క. నీలుండు సాంబుతోయద,నీలుఁడు గోపించి యామినీచరుతోడం
గేళీగతిఁ దలపడియెను, వ్యాళేంద్రముఁ గవియునాగవైరియుఁబోలెన్. 1978

క. దుస్సహతరరోషాత్కర, నిస్సరదురుగరళవహ్నినిష్ఠురగతిచేఁ

1 నూనోల్లసద్ధ్వానుఁడై.

దుస్సహుఁడై వడిఁ బోరెను, మస్సాధుండైననీలుకతోఁ బటుశక్తిన్. 1979

తే. తఱిమి నీలుండు వైచినతరువు విఱిచి, దానవేశుండు దనచేతిదళము మొఱసి
యడరువానరుఁ బిడికిటఁబొడిచె నతఁడు, గినుక మిక్కిలి తొడరినమనసుతోడ.

మ. అవలీలం గరు వమ్మెయిం బెఱికి క్రవ్యాదాధముం జేరి య
ద్దివిజుల్ సంతస మంది చూడఁగ భయాంధీభూతులై రక్కసుల్
భువి నిశ్చేష్టత నుండ భూతనివహంబుల్ సంభ్రమింపంగ ను
ద్ధవడిం ద్రిప్పి యడల్చి వ్రేయఁ బడియెన్ దైత్యుండు వీతాసుఁడై. 1981

వ. తదనంతరంబ. 1982

సీ. కల్పావసానసంప్రాప్తింతమహావహ్ని, దానవరూపంబు దాల్చెనొక్కొ
జగములన్నియు వేడ్కఁ జవిచూడ వచ్చిన,జలపాయి యైనకృశానుఁడొక్కొ
విశ్వేశుఫాలంబు వెడలి గేహెంచిన,దర్పకాంతకుఁడైనదహనుఁడొక్కొ
దశకంధరోత్కృష్టదారుణక్రోధాగ్ని, పరిణామగుగుపరిపాకమొక్కొ
యనఁగ రోదోంతరం బెల్లఁ దనదుగాత్ర,నిర్గతార్చు లుదగ్రత నిండి పర్వ
హరికులాటవి గాల్పంగనాగ్రహించి, యగ్నివర్ణుండు చనుదెంచెనార్పు లొదవ.

వ. ద్వాదశచండకరమండలంబులైక్యం బొందినగతి నైరమ్మసహస్రంబు లేకీభావం
బు నధిగమించుకరణి సర్వతేజంబులయద్వైతంబు క్రియ వచ్చుచున్నని శాటుం
గనుంగొని కుంభకర్ణశైలాశని యగురఘువీరుండు వీఁ డెవ్వండు వీనిపే రేమి
దశాననునాజ్ఞ దహనుం డరుగుదెంచుచున్నవాఁడో యని తన్నడిగిన విభీషణుం
డి ట్లనియె. 1984

శా. స్ఫారాగ్నిప్రతిమాంగకీలములచే శైలంబులం గాల్చునా
యారంభైకసహాయుఁ డిద్ధసమరవ్యాపారదక్షుండు దు
ర్వారోదంచితబాహువీర్యుఁడు సుపర్వద్వేషిసేనావలీ
వీరాగ్రేసరుఁ డగ్నివర్ణుఁ డితఁ డుర్వీనాథచూడామణీ. 1985

వ. అనునవసరంబున వాఁడు ప్రచండక్ష్వేళానాదంబు సెలంగఁ గపులమనంబుల
దిగులు చొరంగఁ జటులనిశ్వాససమీరణసంధుక్షితనిజాంగదహనప్రభామండ
లుండై కర్ణాంతోపసర్పదుదీర్ణకార్ముకమౌర్వీఘోషంబున సురలమనంబులు గ
లంగ సావలేపాట్టహాసపురస్సరవీరాలాపంబుల నమ్మేటిమగండు రామునకుం గిను
కపొడమ ధరణీకంపంబుగా నరదంబు వఱపి యతిరయంబునం బఱతెంచి యెదిర్చి.

—అగ్నివర్ణుఁడు రామునితో యుద్ధముచేసి కూలుట.—

ఉ. వాఁడు నిమేషమాత్రమున వజ్రకఠోరతరంబులైనక్రొ
వ్వాఁడిశరంబు లేసియు నరవక్రపరాక్రమలీలఁ జూపుచుం
బోఁడిమియుర్ రణోద్గతియుఁ బొంపిరివోవఁగ భూమిభర్తకు
న్వేఁడిమి చూపె నెంతయును నెమ్మన మచ్చెరు వందునట్లుగాన్. 1987

ఉ. రాముఁ డుదగ్రభల్లమున । రాక్షసువి ల్దునుమాడ వాఁడు సం
గ్రామకలావిచక్షణుఁడు । ఖడ్గము దాల్చి యదల్చి వచ్చినన్
భూమివిభుండు దాని వడిఁ । బొల్పుగఁ జూర్ణముసేయ వాఁడు దా
భీమగదాకరాళుఁ డయి । పేర్చి కృతాంతుఁడపోలె నంతయున్. 1988

చ. కుటిలమహోర్జితత్వమున।కున్ రణవిక్రమరూఢశక్తికిం
బటుతరసాధనప్రవణ।భాసురయుక్తికి సాగ్రహోక్తికిం
జటులతరప్రతాపయుత।సాహసరక్తికి మెచ్చి రాముఁ డు
త్కటగతి వారుణాస్త్రము స।దర్పముగాఁ దొడిగెన్ నిశాటుపై. 1989

చ. జలదము లుప్పతిల్లఁగ వి।శంకటకోటితటిల్లతాసమా
కులితదిగంతరాళ మయి । ఘోరతరాశను లోలిఁ గ్రాలఁగాఁ
జెలఁగుచు నగ్నిరూపమునఁ । జెన్ను వహించునిశాటుఁ డాఁకినం
బొలు పఱి వాఁడు నంతఁ దెగి । పోయె సురారులు దల్లడిల్లఁగన్. 1990

చ. ప్రణుతమహాప్రభావజిత।భానుకృశానుఁడు బాహువిక్రమ
ప్రణమితలోకపాలకుఁడు । బంధురదిగ్గజదంతిఘట్టన
వ్రణకిణజాలదుర్జయత।రస్ఫుటవక్షుఁడు ఘోరసంగరాం
గణమున నగ్నివర్ణుఁ డటు । గ్రక్కున రాఘవుచేతఁ గూలినన్. 1991

సీ. విలయకాలానలా।విలధూమతతిక్రియ, వికటభయానక।భ్రుకుటి దనరఁ
జటులదంష్ట్రా।కోటి।జటిలాంశుమండలి, విపులార్కదీప్తిలో।వియ్య మంద
దహనకుండోపమ।మహదక్షినివహంబు, క్రమమున నుల్కా।శతమును నీన
దశవదనోదగ్ర।దంతంబు లన్యోన్య,ఘట్టన విస్ఫులిం।గములు నెఱపఁ
బ్రహ్మగర్భాండభాండంబు।పగులనడువ,నంబురాసులు నేడు నొ।క్కంత చేయఁ
దలఁచుకై వడి దట్టించి।దశముఖుండు, గినుక పెరుఁగఁగ రాములో।ననియె నిట్లు.

శా. నాసామర్థ్యము నీ వెఱుంగ వనిలో । నక్తంచరశ్రేణి ను
ల్లాసం బొందఁగఁ గూల్చి నిక్కెదవు వే।ల్లచ్చాపనిష్క్రాంతబా
ణాసారంబున నీప్రతాపదహన।వ్యాసంబు నే నార్చెదం
ద్రాసోపేతులఁ జేసెదం ద్రిదశులన్ । దర్పక్రియాశాలి నై. 1993

చ. గెలిచితి నిర్జరాధిపునిఁ । గీడ్వడఁ జేసితి జాతవేదునిం
గలఁచితి నాపరేతవిభు । గ్రక్కున నొంచితిఁ గోణపేశునిం
దలఁకక వ్రేసితిన్ వరుణు । దట్టనఁ బట్టితి నాసదాగతిన్
బలమునఁ గొట్టితిన్ ధనదుఁ । బాఱఁగఁ దోలితి వానిమిత్త్రునిన్. 1994

మ. బలదర్పంబుల మించి సర్వభువన।ప్రఖ్యాతిగా నద్రిజా
లలనుండుం బ్రమథామరాలియును లీ।లం గూడి యుండంగ నా
కలధౌతాచల మెత్తి బాహుపరిఘా।గ్రస్తంభకూటంబులం

దు లసత్సౌధముఖంగి నిల్పితి యశస్స్తోమోపమానంబుగన్. 1995

సీ. మన్నామమంత్రంబుఽమానుగా యమదూత,చటులభూతగ్రహోఽచ్చాటనంబు
మత్ప్రతాపప్రౌఢిఽమహిమ గంధర్వయ,క్షాదికగహనదాఽవానలంబు
మద్భుజావనములుఽమహనీయజయలక్ష్మి, విహరించునుద్యానఽవిపులతరులు
మత్కోపవేగంబుఽమత్తారికులశైల, పక్షపాతనిపాతఽపవివరంబు
అట్టినాలావు దలపోయుఽననువు లేక, నిఖిలరక్షణపర యగుఽనీతి లేక
ఘనతరం బగుసద్వివేఽకంబు లేక, పో రొనర్పంగ వచ్చితిఽబుద్ధి దప్పి. 1996

చ. దురమున నూర్జితస్థితి నెఽదుర్కొని తీవ్రశరప్రకాండముల్
పరువడితోడ నేసి భుజఽబంధురసత్త్వము సూపి పోరుమీ
నరవర భీతి నొందక ఘఽనం బగుమచ్ఛరకోటి దాఁకినన్
సురుఁగక బీఱువోక వడిఽస్రుక్కక తూలక నిల్చియుండుమీ. 1997

ఆ. ఒగి నరణ్యపథముఽనొందియు ననరణ్య,పథము నొంద నేలఽపార్థివేంద్ర
నీవు నాభుజములఽలా వెఱుంగవె భయా,శ్రితశరణ్యు నన్నుఁఽజేరి బ్రదుకు.

వ. అనియె నయ్యవసరంబున. 1999

ఉ. మానమదాతిరేకమునుఽమచ్ఛరముం జలముం దలిర్ప న
ద్దానవరాజశేఖరుఁడుఽతద్దయుఁ బల్మరు నిట్టు పల్కుచో
వీనులు సోఁకినన్ నృపతిఽవీరవరేణ్యుఁడు నవ్వుఁ గిన్కయున్
మానుగ నాననాంబురుహఽమండలిఁ దోఁపఁగఁ జూచి యి ట్లనున్. 2000

ఉ. భూమనిజానుభావపరిఽభూతసురాసుర నీవు సెప్పఁగా
నేమిటి కింతవాఁడ వగుఽదిం దనుమానము గల్గ నేర్చునే
నీమహనీయశౌర్యమునుఽనీకమనీయసమగ్రధైర్యమున్
నీమహిమానువంగమునుఽనేఁ బరికించి యెఱుంగుదుం జుమీ 2001

శా. వీరుం డాకృతవీర్యసూనుఁడు భుజాఽవిఖ్యాతశౌర్యంబునం
గారాగారమునందు ము న్నెలమిమైఁఽగాపుంచె నుద్దామన
త్సారాసారుఁడు వాలి వాలి సుమహాఽసత్త్వుండు దుర్వారతం
బారావారములందు ముంచె [1]నిను శుంఽభద్విక్రమారంభుఁ డై. 2002

తే. బహుముఖంబులుబహువిధఽభావణముల, కరయఁ గారణ మనవుడుఽననియెనంత
బహుభుజంబులుబహుతరఽప్రాజ్యసత్త్వ,మునకుఁ గానఁగవచ్చినఽమూల మనుచు.

మ. వినతానూను నెదుర్చుభోగిపగిదిన్ ఽవీరోగ్రహర్యక్షనా
థునిపై వచ్చుమదద్విపంబుకరణిన్ ఽదుర్దాంతదర్పంబున
న్మనుజాధీశు నుదగ్రతం గదిసె నాఽనక్తంచరేంద్రుండు నే
పున మార్తాండునిఁ జేరురాహుపగిదిన్ ఽభూరిస్ఫురత్సత్త్వుఁ డై. 2004

1. శుంభద్విక్రమాడంబరున్.

—రామరావణుల తృతీయయుద్ధము.—

చ. రథవరనేమిఘట్టనతురంగఖురక్షతధూళి గ్రాలఁగాఁ
బృథివి పగిల్చి [1]బంగరవుఁబింజలయమ్ములు లీల నేయుచుం
గ్రథనతలాతినిష్ఠురత రాఘవుఁ డెంతయు మెచ్చునట్లుగాఁ
బ్రథితసముద్ధతిన్ మెఱసి రాక్షసముఖ్యుఁడు పోరె నెంతయున్. 2005

మ. జలదాకారుఁడు రాఘవుండు విపులజ్యానాదగర్జారవా
కులితానేకకులాచలుం డయి చలత్కోదండపాండిత్య మి
మ్ములఁ బెంపారఁగ బాణవర్షముల నంభోజాసనాండంబు నిం
డ లసద్విక్రమ మొప్పఁగాఁ గురిసె నీడంబోక యాదైత్యుపైన్. 2006

చ. పటుతరసాహసుం డగునృపాలకుఁ డేయుశిలీముఖంబు లొ
క్కట వడితోడ నేఁగి దశకంఠముఖాంబుజషండముల్ సము
త్కటభుజకాననంబును సదంచితహృత్కమలాంతరంబుఁ బ్ర
స్ఫుటతరభంగిఁ జెండె సురపూగము సంతస మంది చూడఁగన్. 2007

మ. అసురాధీశ్వరుఁ డేయుబాణములు సర్పాకారఘోరంబులై
విసరత్తీవ్రవిషానలంబు లెగయన్ విఖ్యాతఫూత్కారని
శ్వసితారావము భూనభోంతరముఁ బర్వం జేరఁగా వచ్చి య
వ్వసుధావల్లభుపైన నేయువిశిఖవ్రాతంబులం దూలఁగన్. 2008

క. ఆగ్రహమున భువనత్రయ,నిగ్రహాకరుఁ డైనయామినీచరుసుమహా
ద్విగ్రహము గాఁడ నేసెను, విగ్రహదక్షుఁడు రఘుప్రవీరుం డలుకన్. 2009

క. క్షుణ్ణారితూణసుషిరని,షణ్ణాస్త్రభుజంగమములు జనపతిమేనన్
షణ్ణవతిసంఖ్య నేసె వి,షణ్ణత యొదవంగ రాక్షసప్రభుఁ డంతన్. 2010

చ. రథగతుఁ డై తనర్చి సమరంబు నుదగ్రతఁ జేయురావణుం
బృథివిఁ బదాతి యై యరివిభీషణుఁ డై యని నిల్చురాఘవుం
బృథుతరవిస్మయక్రమము [2]పెం పొనరంగను జూచి దిక్పతి

1. 'హేమమయపుంఖశరంబుల' వ్రా. ప్ర. 2. 'పొంపిరివోవఁగఁ జూచి'. వ్రా. ప్ర. ఈకవి బుకారముతోడ నుకారమునకు యతిమైత్రి పాటించినట్లు చూపట్టుచున్నది. ఈకాండము నను1895-వ పద్యమునఁ 'గృతకోదండచితమత్స్యమై యతఁ డతిక్రూరాత్మ నాక్రవ్యభుక్పతి' అని యున్నది. 'అతిక్రూరాత్మ' ననుటను 'అతిక్లేశాత్మ' నని పండితులు దిద్దిరి. 1980-వ సీసమున 'వరవసంతుఁడు లేనివనలక్ష్మికైవడి, ద్రుమములతోఁ బాసినతీఁగఁ బోలి' అని యున్నది 'ధృతిఁ దరువును బాయుతీఁగ యనఁగ' నని మార్పఁబడినది. 2005 వ చంపకమునఁ 'బృథివి పగిల్చి హేమమయపుంఖశరంబుల' నని యున్నది. ఇది 'పగిల్చి బంగరవుఁబింజలయమ్ముల' నని మార్పఁబడెను. 2011వ చంపకంబునఁ 'బృథుతరవిస్మయక్రమము పొంపిరివోవఁగ' నని యున్నది 'క్రమము పెంపొనరంగ' నని మార్పఁబడెను.

ప్రథముఁడు పల్కె మాతలికిఁ । బ్రస్ఫుటసాంద్రదయార్ద్రచిత్తుఁ డై. 2011

—శ్రీరామునకు నింద్రుపంపున మాతలి రథము దెచ్చుట.—

ఆ. త్రిదశహితము గోరి । ధీరాగ్రగణ్యుండు, పూని దైత్యుతోడఁ । బోరు సలుపు
చున్నవాఁడు నీవు । ననుచితత్వ మేర్పడ, రథము గొంచుఁ బొమ్ము । రాముకడకు.

వ. అని సంక్రందనుం డానతిచ్చినయనంతరంబ. 2013

సీ. కింకిణీమాలికా । ఝంకారముఖరంబు, సురుచిరనవరత్న । శోభితంబుఁ
దటిదుజ్జ్వలోచ్చకే । తనదండసహితంబు, గురుతరవైదూర్య । కూబరంబు
జలజలోచనచక్ర । చక్రసన్నద్ధంబు, నతుకసంకలిత । తాక్షయుగము
దుస్సహానిలవేగ । తురగోహ్యమానంబుఁ, దరుణార్కబింబసుం । దరము నగుచు
విమలవజ్రకల్ప । కమనీయకంకట, దివ్యచాపతూణ । దీప్తశస్త్రి
సహితమైనరథము । జవమునఁ గొనివచ్చి, మొనసి రామచంద్రు । మ్రోలమెఱయ.

వ. ధరణీస్థలంబున నిలిపి ముకుళితకరకమలుం డై రఘువీరు నవలోకించి యి ట్లను
దేవా దేవనాయకునాజ్ఞంజేసి మీకడకుం బనివింటి నీదివ్యం బగువారవా
ణంబును గృపాణంబునుం జాపశరాయుధశస్త్రంబులు నంగీకరించి సంక్రందన
స్యందనగతుండ వై నిశాచరాధము నిర్జింపు మనవుడు విభీషణుననుమతంబునం
బ్రదక్షిణపూర్వకంబుగా నద్దివ్యరథంబునకుం బ్రణమిల్లి వానరముఖకమలంబు
లు వికసింప నిశాచరమనఃకుముదంబులు ముకుళింప సహజతేజఃపుంజంబున
నసురాంధకారంబు విరియఁ గౌసలేయదివసకరుం డద్దివ్యశతాంగపూర్వాచలా
రోహణంబు సేసి. 2015

ఉ. శారదనీరదప్రతిమ । చారువిమానము లెక్కి నాకసం
చారులు యక్షసిద్ధగణ । సాధ్యమహోరగకిన్నరుల్ మహో
దారమనస్కు లై మనుజ । దానవనాథులపోరు సూడఁగాఁ
గోరి కుతూహలంబు లొడఁ । గూడఁగఁ జెచ్చెర వచ్చి రిమ్ములన్. 2016

సీ. పంచాస్యయుగళంబుఁ । బాథోధియుగ్మంబు, ఘనగిరిద్వంద్వము । గగనయుగము
భాస్కరద్వయమును । బావకద్వితయంబుఁ, గవిసి పోరుచు నున్న । గతి దలిర్ప
[1]మెఱయంగ నంతంత । మేఘగంభీరత, సమతుల్యు లగుచును । శరభసమున
సామజభేరుండ । శరభోరగంబులు, నప్రతిభటము లై । సంగరంబు
సల్పునట్లుగ నిరువురుఁ । జలము బలము
మెఱయ నన్యోన్యజయకాంక్ష । మిగులుచుండ
రఘుకులాంబుధిచంద్రుండు । రావణుండు
నొరసి వ్రేల్మిడిఁ దలపడి । రుక్కు మిగిలి. 2017

---

1. సామజభేరుండ । శరభోరగంబులు, నప్రతిభటము లై । యనికిఁ గడఁగి
వృత్రేంద్రులును ఫాల । నేత్రగజాసురుల్, చటులతరాహవ । సంభ్రమంబు, సల్పు.

శా. జ్యాఘోషంబులు దిక్కులందు నిగుడన్ జన్యక్రియాచాతురీ
శ్లాఘాయుక్తులు రామరావణులు గర్జాతర్జనాడంబరా
మోఘాపాతశిలీముఖంబుల లసన్మోదంబులం జేర్చి మ
ర్మాఘాతంబులు సేయుచుండిరి ఘనాహంకారహుంకారులై. 2018

శా. నిర్ఘాతప్రతిమానవేగయుతముల్ నిర్యత్ప్రకాశచ్ఛటా
దీర్ఘాపాతము లుగ్రభానుకిరణోద్దీప్తంబు లుద్యన్మహా
నిర్ఘోషంబులుఁ గల్పపావకశిఖోన్నిద్రంబులై విష్టపాం
తర్ఘాతం బొదవం దదీయశరజాతంబుల్ దనర్చెన్ వెసన్. 2019

చ. దొనలకుఁ జేయి సాఁచుటయుఁ దూపులు గొంటయు లాఘవంబునన్
గొనయమునం దమర్చుటయుఁ గూర్చుటతోఁ దెగవాపి లక్ష్యభే
దన మొనరించుచందమును దథ్యముగాఁ బరికింపరాక యే
పున వెలయంగఁ బోరి రిటు భూపలలాముఁడు రాక్షసేంద్రుఁడున్. 2020

మ. జననాథాగ్రసరుండు దైత్యవరుఁడున్ సవ్యాపసవ్యంబులం
బొనుపొందం దగ విండ్లు దాల్చి యెలమిం బుంఖానుపుంఖంబుగా
ఘనమార్గంబును దిక్కులుం బుడమియుం గప్పంగ ని ట్లేసి రే
పున నాటోపము లుప్పతిల్లఁగ భుజాభూయిష్ఠసత్త్వంబులన్. 2021

వ. మఱియు నేకదశశతసహస్రాయుతలక్షకోటిప్రభృతిసంఖ్యాకశరంబు లేయుచు నక్షీణతూణీరులై మర్మంబులు నొప్పించియు వర్మంబులు సించియుఁ జరణోరూదరవక్షఃకరాంసకంఠలలాటంబులు నొప్పించియు రథ్యంబుల నేసియు సారథులం దూలించియుఁ గేతనంబులఁ ద్రుంచియు నిట్లు వివిధగతుల మెఱసి పోరునవసరంబున నుభయస్యందనతురగఖురక్షతరథనేమిఘట్టనసముద్ధూతం బగు రేణుపటలంబు రాయిడి కోర్వక పుడమి మింటికి వలసపోవుచందంబున నెగసి జవనశరశతశాత్కారజనితపవనవిస్తారితంబై సమీకాలోకనాయాతానేకకామినీనికాయచికురకుంకుమస్థానకం బన నిలుచుచు వియన్నదీసలిలంబు పంకిలంబు గావించి యందున్న కనకకమలంబులకుఁ బంకజత్వంబు సార్థకంబు గావించుచు నిరాలంబం బగు నంబరంబునం జను చున్న రవితురంగంబులకు నతిసాంద్రగాఢం బగుటం జేసి విశ్రామంబు సేయుచుం దత్స్యందనచక్రపరిభ్రమణవేగానురోధంబునం బరివేషభ్రాంతి నొందించి నీరంధ్రం బగు నంధకారంబు సంపాదించుచు నుండ నుభయసైనికులు నివ్వెఱఁగంది చూచుచు నత్యాశ్చర్యంబుగా నాయకజయంబు గోరుచుండిరి తదనంతరంబ. 2022

శా. కోలం గోలయుఁ దాఁకి పెల్లెగయుచుం గ్రుద్ధోరగోద్యద్విష
జ్వాలాభీలతరస్ఫులింగలహరీసంఛాదితాభ్రాంతది
క్కూలోపాంతములై కులాచలమహాకూటాగ్రసంస్థానలీ

లాలోలస్థితి నెంతయుం దనరె వేల్లద్విక్రమప్రక్రియన్. 2023
వ. అట దశముఖుండు దైవతాస్త్రంబు ప్రయోగించిన. 2024
చ. మలయుచుఁ జెక్కుచందములఁ మండుచు మ్రోయుచు ధూమజాలకం
బులు గలిగించుచున్ వడి నభోవలయంబున నిండి పర్వుచున్
దలముగ విస్ఫులింగములు[1] తానకమై చనుదేర రాఘవుం
డలయక దాని నేసి యనయంబును శాంతము సేసె గ్రక్కునన్. 2025
వ. మఱియును రావణుండు గాంధర్వాస్త్రం బేసిన. 2026
మహాస్రగ్ధర. అదియున్ సాంద్రాంధకారవ్యతికరభయదం బై చలద్ధూమరేఖా
విదితం బై కాలజిహ్వావిపులభయదమై విస్ఫురత్కాలమేఘా
స్పదమై విభ్రాంతినిద్రాభరపరవశతాపాది యై యేఁగుదేరం
బదిలుం డై రాఘవుండుం బ్రతివిశిఖమునం బ్రచ్యుతిం బొందఁజేసెన్. 2027
క. అక్షతపౌరుషనిధి హ, ర్యక్షపరాక్రముఁడు మహదహంకృతితోడన్
రాక్షసబాణం బేసెను, రాక్షసకులవల్లభుండు రామునిమీఁదన్. 2028
ఉ. మీఱినకోఱలున్ మిగిలి మింటికిఁ బర్వినపల్లవెండ్రుకల్
తేఱినమిట్టగ్రుడ్డులు [2]సుదీర్ఘతరం బగునట్టిసాహసం
బాఱని తేజమున్ దెసల నంటినచేతులు లోకరాజిలో
నేఱినమేటిరూపముల నెంతయుఁ బేర్చిరి రాక్షసుల్ వడిన్. 2029
వ. అంత. 2030
శా. నిష్కంపప్రథితానుభావుఁడు ధనుర్నిష్క్రాంతమౌర్వీరవా
విష్కారంబుగ వైష్ణవాస్త్ర మసుహృద్విభ్రాంతిగా నేసె శో
చిష్కేశుండు శిఖాగ్రచుంబితవియత్సీమంతుఁడై మండ ధా
నుష్కాగ్రేసరురూఢిఁ జూపుచు రణానుష్ఠానశిక్షారతిన్. 2031
వ. అయ్యస్త్రంబుచేత నాసురాస్త్రతేజంబు తరణికిరణంబులచేత నంధతమసంబు
వాయుపగిదిం బ్రతిహతం బైన. 2032
క. శుష్యన్నిలింపముదముగఁ, బుష్యద్రజనీచరేంద్రభూరిరవుం డై
హృష్యత్పులకాంచితుఁ డై, దూష్యాశయుఁ డహిశరంబు దొడిగినమాత్రన్.
సీ. వెలరారుపొగగలవిషములు గ్రక్కుచు, ఫూత్కారనాదముల్ పొలుపుమిగులఁ
దఱచుగా ఘోరనేత్రముల మంటలు గ్రమ్మఁ, జూడామణిప్రభల్ చుట్టుముట్ట
భీకరదుర్గమానేకముఖములతో, వాసుకిభోగభావంబు లగుచు
నిశితదంష్ట్రాకోటినిష్ఠురత్వంబుగఁ, దార్క్ష్యుని బెగడించు[3]దలము గలిగి
దెసలు నంబరంబుఁ దెఱపి లేకుండంగఁ, గప్పె భుజగతతులు గరుడకేతుఁ

1. లతావలమై చనుదేర. 2. సు దిగ్మతరం బగునట్టహాసమున్, ఆఱని. 3. నిశితదంష్ట్రారాతి నిష్ఠురత్వంబులఁ, దార్క్ష్యుని భేదించు తలము.

డైన రాముగెలువ నరుదెంచు కైవడి, వచ్చి పొదువ నున్న వలను చూచి.

క. భూవరుఁడు పన్నగాస్త్రము, పై వచ్చుచునున్నఁ జూచి పటుతరశక్తిఁ
భావించి గారుడాస్త్రము, వావిరిగాఁ దొడిగి యేసె వసుధ వడఁకఁగన్. 2035

సీ. చటులపక్షానిల చలితమహాశైల, విపులాంగములు వెను వెంటఁ బర్వఁ
గులిశోగ్రపటుచంచు కోటిపుటంబుల, ఘనభుజంగంబులఁ గఱచి త్రుంచి
చలనఖరోదగ్ర చరణతాడనముల, విరిసి మేఘంబులు దొరఁగి పొలియ
భుజగకులంబులఁ బొదివి చంపఁగఁ బూని, భూకంప మొదవించి ప్రాకటముగ
గారుడాస్త్రజనిత గరుడగణంబులు, మింట సిద్ధసురులు మెచ్చి చూడ
రావణప్రయుక్త[1]మై వచ్చునస్త్రంబు, పొలువు నిమిషమాత్రఁ బొలియఁజేసె.

వ. రావణుండును దీవ్రంబు లగుమార్గణంబులు పైపయిం బఱపిన వాని నిశితభల్లంబుల విశకలితంబులు గావించి రాఘవుండు దుర్వారదహనదైవత్యం బగు మహాస్త్రంబు ప్రయోగించిన. 2037

శా. ఊష్మవ్యాహతిదగ్ధపత్త్రసురరాజోద్యానధాత్రీజమై
గ్రీష్మోద్యదంశుసహస్రరశ్మిశితభూరిజ్యోతిరుత్సిక్తమై
భీష్మాక్రాంతిదురంతధూమపటలీస్ఫీతాంతదిక్చక్రమై
శుష్మప్రాభవ మొప్పె నంతయును రక్షోనాథదర్పఘ్నమై. 2038

వ. అంతఁ దమిస్రాచరకులాగ్రగణ్యుండు వారుణాస్త్రంబు ప్రయోగించిన. 2039

శా. కాళీమూర్తికరాళకాలరుచియై గర్జోర్జితంబై మహా
భీళేరమ్మదభీమమై ఘనతటిద్భిన్నాఖిలాశాంతమై
వ్యాలోలాశనిపాతదుష్ప్రసహమై యంభోదబృందంబు నా
[2]నాళీకం గరిహస్తధారజలమై యార్చెం దదస్త్రాగ్నులన్. 2040

వ. అంత రఘువరుండు సమీరదైవత్యం బగునస్త్రంబు ప్రయోగించిన. 2041

మ. కులశైలేంద్రగుహావిసర్పిసుమహాఘోరైకభాంకారమై
చలవేగోద్ధృతభూరుహానుగతమై సర్వంసహాకంపియై
జలధిస్ఫారపయఃప్రపూరలహరీసంక్షోభసంపాదియై
కలయం బోవఁగ వీచె నభ్రతతి నుగ్రంబై తదస్త్రం బొగిన్. 2042

వ. అంత దశముఖుండు వారణాపత్యం బగుమహాస్త్రంబు ప్రయోగించిన. 2043

మ. తెలియన్ వారిధి యున్నదిశతనపక్షిభూతదానాంబుశై
వలినీచంద్రకితాంబురాశిజలమై వాలాహిదుష్ప్రేక్ష్యమై
చలహస్తాగ్రవిలూనదేవతటినీచంచత్సువర్ణాబ్జమై
బలసెన్ వారణసంఘ మస్త్రజనితప్రఖ్యాతినిష్పన్నమై. 2044

వ. అట నరేంద్రసింహుండు నారసింహం బగునస్త్రంబు ప్రయోగించిన. 2045

1. రౌద్రాహిశస్త్రంబుపొలుపు. 2 గాలి-వ్యాళి-హస్తసమానధారజలమై.

మ. చటులోద్వృత్తినటావిపాటితవిరాజత్సాంద్రజీమూత మై
పటుకోటీనఖపాటితేభగణకుంభస్రస్తముక్తాఫలో
ద్భటలోలచ్ఛరణాగ్ర మై విపులనాదత్రాసితాశాగజో
త్కట మై సింహచయంబు హస్తిసమితిం గారించె నిస్సీమతన్. 2046

వ. అంత. 2047

తే. విలయనిష్క్రాంతపావకవిపుల మగుచు, మిగిలియెగసినమంటలు మిన్నురాయ
నుల్లమున దేవనివహంబు తల్లడిల్ల, ననియె దైత్యుండుశితశూల మడరితాల్చి.

మ. ఘనకోదండమునేర్పు మీఱ విశిఖగ్రామంబునత్కౌశలం
బును నీ వేర్పడఁ జూపు మింక ననిలో భూరిప్రతాపంబు నే
వును గర్వంబును దూలిపోవ నిపు డీహాల్పొందుశూలంబు ని
న్నును నీసోదరుఁ గూల్చు నిక్కువము నన్నున్ గెల్వ నీశక్యమే. 2049

వ. అని మిన్నంది మహాగ్రహావ్యగ్రాయమానుం డై. 2050

ఉ. పూని యదల్చి వైచె నది భూరిజవంబున నుగ్రపావకా
నూనశిఖావలీజటిలితోద్ధత మై లయకాలరుద్రసం
ధానసమావహం బగుచు దద్దయుఁ బేర్చినశూల మంత న
ద్దానవవంశవర్ధనునుదగ్రతఁ జూపుచు వచ్చెఁ బెల్చనన్. 2051

క. నరవరుఁడు దానిపై శితశరములు గురియింప వాని సరకుగొనక యు
ద్ధురమున నొక్కటఁ గూల్చుచు, నురవడిఁ జను దేరఁ జూచి యుద్ధతి మఱియున్.

ఉ. అంచిత మైనకూర్మి నమరాధిపుఁ డెంతయు వేడ్కతోడఁ బు
త్తెంచినశక్తిఁ బుచ్చుకొని ధీరత వైచిన భానుమండలో
దంచిత మై నిశాటభయదం బగు దేవముదావహంబు నై
త్రుంచె దశాస్యశూలమును దుర్దమ మై యది వచ్చి వ్రేల్మిడిన్. 2053

వ. దశకంఠుండును వితథీభూతదివ్యసాధనుం డై సటాసముత్పాటనకుపితం బగు కంఠీరవంబుచాడ్పునఁ గరాళక్ష్వేళాపూరితదిక్కుహరుం డై విస్ఫారంబు సెలంగఁ బ్రళయాభ్రంబపోలె నశనికోటిదారుణంబు లైననిశితశరంబులు గురిసి దశవిశిఖంబుల రాఘవు నన్నియ శరంబుల మాతలిని వివశత నొందించి యొక్కనిశితభల్లంబున మణికాంచనమండితంబును నభ్రంలిహాగ్రంబును నప్రతివిహారంబును సమీరణాలోలపటవిరాజమానంబును నగు కేతుదండంబు గపులు నిలింపులు నులుక నమరవైరు లలర నవనిం బడవయిచి. 2054

చ. మఱియును దైత్యుఁ డానృపకుమారుని నుగ్రశిలీముఖంబులన్
నెఱఁకులు దూఱనేసి ధరణీస్థలిఁ గ్రక్కదలంగఁ దేరిపైఁ
బఱపి యురోలలాటతటబాహులు నాటఁగఁ గీలుకొల్పి త
త్తఱపడఁ జేసె దేవసముదాయము నెల్ల నుదగ్రవృత్తి నై. 2055

స్రగ్ధర. కర్ణాంతాకృష్టచాపగ్రథితశరశతాక్రాంతదిక్చక్రవాళో
దీర్ణధ్వాంతంబు సిద్ధత్రిదశజనమనస్స్థిత్యపాయంబుగా స
ప్తార్ణోధిధ్వానధీరాయతగుణనినదాహంక్రియాయుక్తుఁ డై సం
పూర్ణత్రాసాతిఘాతస్ఫుటితులఁ గపులం బొల్పు దూలంగ నేసెన్. 2056

మ. నృపకంఠీరవుఁ డంత సంగరకళానిష్ణాతరక్షోధిప
ద్విపముం జూచి సహింపఁ జాలక సముద్వేలాస్త్రకోటీనఖా
గ్రపరిచ్ఛేదము నూపి రోషదహనాక్రామచ్ఛటాభీముఁ డై
విపులోదంచితనాదమేదురవియద్వీథీకుఁ డై క్రాలుచున్. 2057

క. మండలితకనద్ధనుకో,దండంబున వెడలుబాణతతి నొప్పించెన్
మెండుకొని దైత్యు నవనీ,మండలనాథాత్మజుం డమందత్వరుఁ డై. 2058

క. దానవజీమూతం బా, మానవనాథాద్రిమీఁద మానక నారా
చానూనవృష్టి గురియం,గా నిశ్చలవృత్తి నుండెఁ గడు రమ్యుం డై. 2059

క. క్రందుకొని భూమిపతిసం,క్రందనుఁడు దశాననాద్రి గదలఁగ బాణా
స్పందితదంభోళి నిగుడ, నందంద యదల్చి కదిసె నతినిష్ఠురతన్. 2060

మ. దశకోదండము లొప్పఁ దాల్చి సుమహాదర్పంబునన్ మించి య
ద్దశకంఠుండు దురాగ్రహంబు గదురన్ ధాత్రీతలాధీశుపై
దశదిగ్భిత్తులు వ్రీల నార్చుచు సమిద్ధారేయతాశాలి దు
ర్దశఁ బొందన్ నిశితాస్త్రముల్ పఱపె విత్రస్యత్ప్లవంగంబుగాన్. 2061

ఉ. ఏకధనుర్ధరుం డగుమహీశకుమారుఁడు రాముఁ డుద్ధతో
త్సేకముఁ బౌరుషక్రమము ధీరతయున్ భుజలాఘవంబునుం
బ్రాకటశస్త్రకౌశలముఁ బ్రాభవముం దనరారునట్లుగా
నాకపతీకవైరిపయి నారసముల్ గురియించి నొంచినన్. 2062

చ. మదమును మానమున్ విపులమత్సరమున్ బలు పైనకోపమున్
హృదయమునందు నెక్కొనఁగ నేత్రతటిఁ జూపుచుఁ బేర్చి యార్పులం
ద్రిదశులు బీఱువోయి పడఁ దేఁకువ దప్పక మించి వీఁకతో
వదలక యేసె బాణములు వారిజమిత్రకులావతంసుపై. 2063

సీ. ఉల్కాసహస్రమహోదగ్రశరముల, రణపటిష్ఠుం డగురాము ముంచి
విస్ఫులింగోపమవిపులసాయకములఁ, బురుహూతుహయములఁ బొదుఁగ నేసి
దిననాథకరజాలతీవ్రబాణంబులఁ, జొలవక సుత్రామసూతు నొంచి
సౌదామనీదామసమవిశిఖంబుల, మహితశతాంగంబు మఱుఁగుపఱిచి
కనకకేతనంబు గానరాకుండంగ, నోలి శస్త్రసమితి గీలుకొలిపి
మఱియు నొవ్వఁ జొనిపె మానవాధిపుమేన, నిశితశస్త్రసమితి నెఱకు లగల.

వ. అయ్యవసరంబున. 2065

—శ్రీరామునియొద్దకు నగస్త్యమహాముని వచ్చుట.—

చ. నిరతిశయప్రభావుఁ డగు§నిర్జరవైరిశరాళి వేఁడిమిం
బరవశుఁ డైనరామనర§పాలకుపాలికి దివ్యఘోరదు
శ్చరసుమహాత్తపోవిభవ§శాలి యగస్త్యుఁడు బంధురప్రభా
భరజితభాస్కరుండు ముని§భవ్యదయానిధి వచ్చి యిట్లనున్. 2066

సీ. నీదివ్యతత్త్వంబు§నిఖిలాగమంబులు, మానుగా వెదకియుఁ§గాన లేవు
నీభవ్యసన్మూర్తి§నెరయ సంయమిచిత్త,తామరసంబులఁ§దగిలియుండు
నీదీప్తికణములు§నిక్కంబు పరికింపఁ, బావకుం డిందుండు§భాస్కరుండు
నీమహామాయాతి§నిబిడవిలాసంబు, జగదుద్భవస్థితి§క్షయకరంబు
విశ్వమయుఁడ వీవు§విశ్వాత్మకుఁడ వీవు, విశ్వవిభుఁడ వీవు§విష్ణుమూర్తి
వీవు సర్వభువన§హితము సేయఁగఁ బూని, నరుఁడ వైతివయ్య§నలిననేత్ర.

వ. కావున నీమహనీయానుభావంబు నెఱుంగఁ జతుర్ముఖ పంచముఖ షణ్ముఖసహస్రముఖులకు నయిన నలవిగా దది యట్లుండె నిపుడు నీవు మానుషభూమికాపరిగ్రహంబున నటించుటం జేసి సర్వజ్ఞుండ వయ్యు నెఱుంగమి దాల్చుచున్నవాఁడవు గావున సర్వలోకగురుండవు నీకు నొక్కటి యుపదేశించెద ననుట [1]చేలతనం బైనను నవధరింపుము జయప్రదంబు నిఖిలైశ్వర్యమంగళసౌఖ్యావహంబును సకలదురితదూరీకరణచణంబును నగునాదిత్యహృదయం బనుపుణ్యమహాస్తవంబు సాదరంబుగాఁ బఠియింపుము మీవంశంబునకు నాద్యుం డయినభువనలోచను నాదిత్యు నారాధింపుము నీకు జయంబు సమకూరు నని చెప్పి యరిగిన నవ్విభుండు సర్వదేవమయుం డగుభానుమంతుం బూజించి యనంత తేజోవిరాజమానుం డై సంగరోద్యోగంబునం బ్రతిఘటించి కోపించి నిలిచిన. 2068

స్రగ్ధర. భూతంబుల్ దల్లడిల్లెం§బుడమియుఁ గదలెన్§భూధరంబుల్ వడంకెన్
భీతిల్లెన్ దిగ్గజంబుల్§బెదరిరి విబుధుల్§బెల్లుగా మ్రోసె నబ్ధుల్
వే తూలెన్ శేషుఁ డంతన్§వెఱచెఁ గమఠుఁడున్§ప్రేలె దిగ్భిత్తు లెల్లం
బాతాళంబుం గలంగెన్§బవనుఁడు నిలిచెం§బాఱె దైత్యవ్రజంబున్. 2069

వ. అయ్యవసరంబున. 2070

మ. జననాథాగ్రసరుండు రాఘవుఁడు చం§చత్కార్ముకజ్యామహా
ధ్వనినక్తంచరరాజముక్తివనితా§వైవాహికారంభసం
జనితోదంచితతూర్యరావముగతిన్§సంధిల్లఁగాఁ బూఁచి యే
పున బాణత్రయ మేసి మేన నలికం§బుం గ్రుచ్చె మూఁడమ్ములన్. 2071

తే. అంతరుధిరంబుధారఁ గం§గనసురవిభుఁడు, రామశరఘాతమధుమాస§రమణఁ జేసి
పుష్పితాశోకతరువుతోఁ§బోలిరొప్పెఁ, గులిశహతమైన జేవుఱుఁ§గొండయనఁగ.

1. చేలుఁదనము; పెలుచఁదనము.

తే. కోపపావక[1]తీవ్రప్రతాపుఁ డగుచుఁ, జాపకౌశల మమరంగ నేవు రేఁగి
ధరణినాథువిపులభుజాంతరమునందు, వేయిశరములు నిగిడించె వివిధగతుల.
క. పరువడి రుధిరము దొరఁగఁగ, నరుడుగఁ దనరారె నినకులాధిపుఁ డంతన్
సురరిపునాశము సెప్పుచు, సరి నెత్తురు గురియు చున్న జలదముఁబోలెన్.
చ. పొరిఁబొరిఁ బంక్తికంధరుఁడు భూవరు నేసినఁ గాఁడి పాటి యు
ద్ధురగతి నేల నాటి యతితూర్ణము లై భుజగాలి భీతిసం
చరమతిఁ జూచుచుండఁగ రసాతలిఁ జొచ్చె నజస్రపాపమే
దురత నుదగ్రబాణము లధోగతి నొందినమాడ్కి నారయన్. 2075
వ. రాఘవుండును దశవదనకఠోరబాణపరంపరాసారజర్జరీకృతశరీరక్షతనిష్ఠ్యూతధా
రాళకరాళరక్తసిక్తుండై మండలీకృతకోదండనిర్యాతంబులును నంతమనసంపా
దకంబులును సమాచ్ఛాదితచండకరప్రకాశంబులును నీరంధ్రీకృతదిక్తటంబులు
ను గనకపుంఖమండితంబులు నగునిశితప్రదరంబులు వఱపినం జేయునది లేక
నివ్వెఱఁగంది శరగ్రహణాకర్షణసంధానమోక్షణాదులందును బరాధీనుండై యు
న్నం గనుంగొని దరహసితచంద్రికానసముల్లసితవదనచంద్రుండై రామచంద్రుం
డు పేర్కొని పిలిచి రావణున కిట్లనియె. 2076
మ. తగునే స్రుక్కఁగఁ జెక్కుపంతము లొగిన్ దర్పంబుతో నాడి యి
ట్లు గడున్ నివ్వెఱఁ గంది యుండఁగ భుజాటోపంబు దా నెందుఁ బో
యె గుణంబుల్ దలపోయ కాదుదువు నీ వీభంగిఁ బొ ల్పేదినన్
నగరే నీసరివార లిందులకు నోనక్తంచరాధీశ్వరా. 2077
మ. మును మీయన్నఁ గుబేరు గెల్చి సుమహామోదంబునం బుష్పకం
బనుమానింపక పుచ్చుకొంటి వతిమాయాదక్షతం గానలో
నను నాతమ్మునిఁ గన్మొఱంగి యిది యన్యాయంబు నా కట్లు భూ
తనయం దెచ్చితి నీవు వింశతిభుజా తర్కింపఁగా శౌర్యమే. 2078
క. నాకన్నులయెదురం బడి, నీ కెక్కడి కేఁగవచ్చు నిష్ఠురగతిఁ బో
నీక పొలియించువాఁడం, జేకూరెం గోర్కి నాకు జితబలభేదీ. 2079
తే. పాటి పోయినఁ బో నీక పట్టి కూల్తు, నాతతాయివి నమరారి వై ననిన్ను
నంబుజాననహరిహరు లడ్డమైన, నిజము సుమ్మిది యోరజనీచరేశ. 2080
వ. నీమాంసశోణితమేదోమస్తిష్కంబుల భూతతృప్తి గావింతు నని పలుకుచున్న
యవ్వసుధావల్లభు నవలోకించి లంకావల్లభుండు సాగ్రహంబుగా ని ట్లనియె.
చ. గొనకొని యుద్ధరంగమునఁ గొందఱు రాక్షసులన్ వధించి యే
పునఁ గడు విఱ్ఱవీఁగెదవు పోటరి నంచు ని దెంత పెద్ద యి
వ్వనచరసేనఁ గూడుకొని వచ్చి సముద్రము దాఁటి క్రొవ్వునన్

1. తీవ్రతాటోపుఁ డగుచు.

నను వెలిపింపఁ జూచెదవు ǂ నా కిది గణ్యమె రాజనందనా. 2082
సీ. వల్మీకమునకు నǂవ్యానవగిరికిని, రాజిలంబునకు నుǂరగవిభునకుఁ
గలవింకమునకును ǂ ఖగకులాధిపునకుఁ, బల్వలంబున కకూǂపారమునకు
ఖద్యోతమునకు నాǂప్రద్యోతనునకును, హరిణపోతమునకు ǂ హరిపతికిని
మశకజంతువునకు ǂ మదసింధురమునకు, నతృణంబునకుఁ గల్పǂవృక్షమునకు
నెట్లు నీకును నాకును ǂ నెనయ నగుట, యట్లు కావున సీతోడ ǂ నడరి పోర
సిగ్గు గదిరెడు నైన నిǂస్సీమవృత్తి, దొరయవలసెను దలపాటు ǂ దొరకుకతన.
చ. అమరులఁ జీరికిం గొనక ǂ యక్షుల నుక్కడఁగించి బల్మిమై
జము నదలించి ఖేచరభుǂజంగుల గ్రక్కునఁ దూలపుచ్చి లో
కము లవలీల గెల్చి యధిǂకం బగుకీర్తికి నెక్కి మానవా
ధము నరిఁ జేసి పోరుదునె ǂ దర్పముఁ బెంపును రిత్తపుత్తునే. 2084
మ. పటుబాహాబలశక్తి వేర్పడ ధనుǂర్బాణంబులం దాల్చి మ
ర్కటకోటిం దునుమాడి మారుతసుతుం ǂ గారించి సుగ్రీవుఁ బ్రా
కటశక్తిం బొలియించి వాలితనయుం ǂ గాలాలయుం జేసి యీ
అట నే నొందెద నిన్ను నీయనుజుఁ దీǂఱం జేసి నిశ్చింతతన్. 2085
మ. ఒగి బాహాబలయుక్తుఁ డైనయతికాǂయుం గుంభకర్ణున్ మహా
నగభిద్భేదను నింద్రజిత్తు ననిలోǂనం గూల్చి నీ వుండఁగాఁ
బగ సాధింపక లంక సొత్తునె ధనుఃǂపాండిత్య మేపారఁగా
మగపంతంబున మీఱువాఁడ [1]విజయాǂమ్లానస్థితిం బేర్చెదన్. 2086
మ. అని కల్పాంతకృతాంతుకైవడి నుదǂగ్రాటోపకోపమ్మునన్
జనితోత్సాహరసంబునం బొలిచి చంǂచత్కార్ముకజ్యాగళ
ద్ఘనదివ్యాస్త్రము లేసె రాఘవుపయిం ǂ గ్రవ్యాదనాథుండు గ
ర్జనతో నార్పుచు నేచి యుగ్రమగతిన్ ǂ సవ్యాపసవ్యంబుగన్. 2087
శా. క్షోణీచక్రము సంచలింపఁగ రథǂక్షోభంబు గావించి గీ
ర్వాణుల్ తల్లడ మంద నుగ్రదహనǂజ్వాలావలీవిస్ఫుర
ద్బాణశ్రేణులు లీలమైఁ బఱపె నǂద్ధాత్రీశుపై నుల్లస
త్ప్రాణోదగ్రత రావణుండు విజయోǂత్సాహాతిరేకంబునన్. 2088
క. జనపాలకనందనుఁ డవి, తునుమాడి నిజాస్త్రసమితిఁ ǂ దోడ్తోడన త
ద్ఘనకోదండపటుత్వము, ననురూపము గాఁగఁ బోరె ǂ నమరులు మెచ్చన్.
క. కులిశసమానశరంబులు, బలువిడిఁ గురియించె రామǂభద్రునిమీఁదం
జలముకొని దైత్యనాథుఁడు, విలయోత్థితవారివాహǂవిపులస్వానుఁ డై. 2090
క. మఱి కాలాహిశరంబులు, దఱుచుగఁ బైఁ బఱపి దెసల ǂ ధరణిని జదలన్

1. విజయోన్మాదంబునం బేర్చెదన్.

గిఱిగొని చీఁకటి ముంపఁగ, నెఱి దప్పక పోరు యామినీచరుఁ డలుకన్.

శా. క్షోణీమండలనాథసూనుఁడు నదత్కోదండుఁ డై దీర్ఘదృ
క్కోణోపాంతములందుఁ గెంపు గదురం గోపించి వల్మీకవ
త్తూణీరోదరనిర్గతాహివిశిఖస్తోమంబులన్ ముంచినన్
వేణీభూతము లై దశాస్యుఁ బొదివెన్ విధ్వంసనాయత్తతన్. 2092

ఉ. భర్మవిచిత్రపుంఖశితబాణపరంపర లేసి గ్రక్కునన్
వర్మము సించి యుద్ధవిడి వజ్రకఠోరశిలీముఖంబులన్
మర్మము లుచ్చిపోఁ జొనిపి మానక ఫాలమునందు గ్రుచ్చినన్
దుర్మదుఁ డై నరావణుఁడు దూలె రథంబునఁ గొండ కై వడిన్. 2093

వ. అయ్యవసరంబున. 2094

తే. కాలకేతుండుభీతిల్లి కణఁకతోడఁ, దొలఁగఁగొనిపోయె నరద మంబుదరమునకునఁ
నటిమి పోటుల నెత్తురు వడఁద పుడమి, నడరు పెంధూళి నొక్కట నడఁగఁజేయ.

తే. రామబాణపరంపరా రమణిచేత, నట్లు లాలింగ్యమానుఁ డై యసురవిభుఁడు
సాంద్రతర మైనపారవశ్యంబు నొంది, తెలిసి యల్లన గనువిచ్చి దెసలుచూచి.

వ. అసురవిభుం డరదంబుపై గ్రక్కున లేచి నిలిచి జగంబులు మ్రింగ నప్పళించు
మృత్యువుంబోలె నకాండప్రళయసంభ్రాంతకృతాంతాకృతి యై యాగ్రహించి
మనంబున లజ్జాసంభ్రమరోషంబులు ముప్పిరిగొన ధూమచ్ఛటాజటిలభ్రూభం
గవలయుం డై కరాగ్రస్రస్తంబు లగుధనురాదిసాధనంబు లెప్పటియట్ల యు
వరించి సన్నద్ధకంకటుం డై శిథిలమణికిరీటంబులు పొందుగా నిలిపి సారథిం
జూచి యి ట్లనియె. 2097

మ. శరసంధానవిశేషవత్త్వము భుజాసారంబు మాయాక్రియా
పరిపాకంబుఁ బ్రతాపముం గలుగఁగాఁ బాటింప కిట్లీవు నా
యరదం బేల తొలంగఁ దెచ్చితివి యీయాలంబు దా నెంత యీ
ధరణీపాలుఁడు నవ్వఁ జేసితివి నిందాదుస్థితిం బొందితిన్. 2098

క. హరిదహనశమనరాక్షస, వరుణమరుద్ధనదశూలివరగంధర్వా
సురయక్షులయుద్ధంబుల, నిరవుగ నాలావు నీవు నెఱుఁగుదు కాదే. 2099

క. ఎఱిఁగియు సాహసమతి వై, మఱలింపఁగఁ దగునె రథము మానవపతికిన్
వెఱతునె నే నాతని నని, బఱపెద నాలావుపెంపు బడి మఱచితివే. 2100

వ. అనినం గాలకేతుండు రావణున కిట్లనియె. 2101

ఆ. మున్ననేకయుద్ధముల నీకు సారథి, నైతి నింతబెడిద మైనసమర
మెఱుఁగ నీవు చిక్కి యిబ్బంగి వ్రాలిన, నిట్లు సేయ వలసె హీనవృత్తి.

వ. మూఢత్వంబును బ్రమత్తత్వంబును రథచోదనాక్షమత్వంబును భీరుత్వంబును
బొంది కావించుట గాదు సారథు లగువారలకు రథికుండు పరిపంథిబాణపీడితుఁ

డై మూర్ఛాయత్తుం డయిన రథంబు దోలంగం గొనిపోవుట పరమధర్మం బది యునుంగాక యుత్తురంగంబు లతిమాత్రరణంబున నాయ స్తంబులై రథవహనం బునం దక్షమంబు లగుటం బరికించి సేదదేర్పవలయుటం జేసి యిట్లు దెచ్చితి రథికు నుత్సాహదర్పేంగితహర్ష ఖేదదైన్యాదైన్యపారవశ్యబలాబలనిమి త్తంబు లగుదశ లక్షణంబులం బరికింప వలయు నవి నీయందుఁ గొన్ని కానంబడుటం జేసి యిట్లు గావించితి నింతట నేమికొ యంత సముత్సాహంబుతో నాయుష్మంతుండ వయి పగఱ గెలుతువుగాత మనిన నతనివలన సంతసిల్లి యెచ్చట రాముం డున్నవాఁ డచ్చటికి రథంబు రయంబునం బఱపు మని దశకంఠుండు పలికిన సూతుండును.

సీ. నేమిఘట్టనముల భూమి విదీర్ణమై, పాంసురూపమున నభంబు సొరఁగఁ
దురగసముద్ధత ఖురతాడనంబుల, ఘనసన మహిరాజు శిరము లదర
రాహుధ్వజము సూచి రవి తల్లడంబునఁ, దొల్లింటిగతి నప్పి త్రొప్పడఁగఁ
గర్ణదుశ్శ్రవమహాకఠిననినాదంబు, జగదండమండలిఁ బగులఁ జేయఁ
గాలకేతుఁడు దననేర్పు కలిమి మెఱసి
యసురనాథున కుత్సాహ మతిశయిల్లఁ
దలఁపుకొలఁదులు గడవంగఁ దఱిమి పఱపె
నురుశతాంగమునురవడి సురలు గలఁగ. 2104

తే. అంజనాచలసన్నిభుఁ డసురవిభుఁడు, ధన్వియై హేమభూషణోదారరుచుల
నింద్రచాపంబు మెఱుఁగులు నేర్పు గలిగి, కాలజీమూతమోనాఁగఁ గానఁబడియె.

మ. హరిచక్రానుపమానవేగగతి నత్యంతంబు దుష్ప్రేక్ష్యుఁడై
గరుడోద్దామసమానమానసజయోగ్రస్ఫారవేగంబునన్
ధరణీమండలి నంచలింపఁగ సముద్యద్ధాటి దైత్యేంద్రున
య్యరదం బుద్ధతి నేఁగుదేరఁగ నరేంద్రాధీశ్వరుం డిట్లనున్. 2106

శా. కంటే మాతలి పంక్తికంఠరథ ముగ్రస్ఫూర్తిమై నంచల
ద్ఘంటానాదము లద్రిగహ్వరమహాగర్భంబులం గ్రమ్మఁగా
మింటం బర్వెడు కేతనాంశువులయున్మేషంబుతో వచ్చె నా
వెంటన్ నీయరదంబునుం బఱపుమా వేగంబు రెట్టింపఁగన్. 2107

వ. అనిన నమ్మాతలియు నుల్కాపాతాతిమాత్రత్వంబు లలవడ నతిరభసంబుగా నపసవ్యగతి సంక్రందనస్యందనంబు నయ్యాతుధానుపైఁ బఱపిన. 2108

శా. గీర్వాణారి దురాగ్రహంబునఁ ద్రిలోకీభీకరాకారుఁడై
గర్వగ్రంథి దృఢంబుసేయుచు దిశాకంపంబుగా నార్చుచున్
దోర్వీర్యంబున మించి దివ్యశరముల్ దోడ్తో ధరాధీశుపైఁ
బర్వం బెల్లుగ నేసెఁ గుండలితచాపప్రౌఢిమాసక్తిమై. 2109

క. రథముపయి నేసి వడి సారథిపయిఁ గురియుచు మహేంద్రరథ్యంబులపైఁ

బృథులగతిఁ బఱపి రాముం, బ్రథనోగ్రుం బొదివె నిశితబహుబాణములన్.

క. సురవైరిసాంద్రబాణో, త్కరములచే మునిఁగి యొప్పె ధాత్రీపతి మే
దురమేచకజీమూతాం,తరితుం డగుభానుపగిదిఁ దత్క్షణమాత్రన్. 2111

చ. పవనుఁడు తూలజాలములఁ బన్నుగఁ బాయఁగ వీచుచాడ్పునన్
జవమున మేదినీపతి నిశాచరబాణమహాపరంపరల్
తవిలి వినోది యై విరియఁ దట్టి యుదగ్రతఁ దేజరిల్లె నం
త విగతధూముఁ డై కనలు దావకృశానునిమాడ్కి నెంతయున్. 2112

శా. ప్రత్యాలీఢవిశేషసంస్థితికళాపారీణతన్ రాఘవుం
డత్యారూఢసమీకరాగమున నుద్యద్బాణజాలంబు లా
దైత్యాధీశునిమేనఁ గ్రుచ్చిన సముద్దామస్ఫురత్స్వాభిభవో
ద్వృత్త్యారంభమునన్ శిలీముఖము లుర్వీనాథుపై నించినన్. 2113

సీ. సముదగ్రతరజయస్తంభంబు నాఁ బింట, మించినవారి సారించి మెఱసి
కమలసంభూతాండగర్భగోళము నిండ, ఘనతదీయధ్వాన మినుమడింప
శక్రదత్తామోఘశక్తి వే సంధించి, విడిచినఁ బవికోటి వితతు లొదవ
శతసహస్రాయుతసముదాయములఁ బేర్చి, దహనార్కసంహతిమహిమ దెగడి
సురలు సెలఁగంగ దానవవరులు గలఁగ, రాముశరములు దైత్యునురస్స్థలంబు
గాఁడి నెత్తుటఁ గడియక కనదుదార,సురుచిరోల్కలకై వడిఁ బరఁగి పఱచె.

వ. కొన్ని సీతామహాదేవికి రామువిజయంబు సెప్పఁగతి లంకకుం జనియెఁ గొన్ని
యింద్రాదులకు రావణవధంబు గాఁగలదని యెఱింగించుక్రియ నాకసంబున కరి
గెఁ గొన్ని దిక్కాంతలకు లోకంబులకు సేమంబు గల్గు నని నివేదించుకరణిఁ ద
దుపకంఠంబులకుఁ బోయెఁ గొన్ని యిటమీఁద సుఖంబున నుండఁ గలవారని
యురగులకుఁ గుశలవార్త ప్రకటించుమాడ్కిఁ బాతాళంబున కేఁగెఁ గొన్ని
దశాస్యసర్వావయవసంధమర్మంబులు గాఁడె మఱియు సీరంధ్రంబు లై రఘు
వీరుశరంబులు నిగుడం దొడంగిన. 2115

మ. అమరద్వేషి శరంబు లేసిన నసూర్యంపశ్యశైలోదర
స్థమహాగహ్వరగర్భనిర్భరమహాధ్వాంతప్రభావచ్ఛిదా
క్షమతేజంబునఁ గ్రాలి దిక్కులు వెలుంగంగా లలాటాంతరా
ర్యమసాహస్రసమంబు లై పొదివె నుద్యద్వేగసంపద్గతిన్. 2116

వ. ఇతరేతరజయకాంక్ష లినుమడింపం జలంబును బలంబును గదిరి యెదిరి స్ర
క్కక యుక్కడక్కక యుభయబాణంబులుం బరస్పరభేదనంబు నొందుచుండ
నన్యోన్యతర్జనవాక్యంబులు రోదోంతరంబు నిండ నేకైకసక్రోధశోణాలోచనమ
యూఖచ్ఛట లకాలసంధ్య గావింప సదృశసాహససంపాదనసమరవ్యాపారబల
శౌర్యశస్త్రచాతుర్యు లై యొక్కనిమిషార్ధంబు నుడుగక నిద్రాదివ్యవహారం

బుల నొందక క్రమక్రమప్రవర్ధమానభుజలాఘవు లై సప్తాహోరాత్రంబులు
సమరంబు సలిపిరి తదనంతరంబ. 2117

ఉ. దానవుతేరిపైఁ గురిసెఁ । దద్దయు నెత్తుటివాన మేఘముల్
మానక యశ్వవాలముల । మండుచు నిప్పులు రాలె నంత ర
క్షోనివహంబులోఁ దిరిగి । ఘోరత నక్కలు గూయఁ జొచ్చెఁ బై
పై నిల వ్రాలెఁ గేతువులు । పర్వె రజంబులతోడిధూమముల్. 2118

క. నలుపులుఁ గెంపులుఁ బీతం,బులుఁ దెలుపులు హరితవర్ణ।ములు నై నకరం
బులు గల్గి భాస్కరుఁడు చి,త్రలసద్ఘనధాతుయుక్త।ధరముం బోలెన్. 2119

సీ. ప్రతికూలుఁడై వీచెఁ।బవనుండు రజముతో, నుల్కలుఁ బిడుగులు।నొలిఁబడియెఁ
గాకగృధ్రోలూక।కంకాదిఖగములు, నసురేంద్రుతలలపై । నాడఁదొడఁగె
నొగి ముక్తకేశియై । యొకజోటి పలుమఱు, నరదంబుచేరువ । నరిగె నంత
నేఁడు నీ వీల్గుట । నిక్కువం బని పల్కె, నశరీరిణియును భూ।తావలియును
దిక్కులెల్లఁ బొదివెఁ।దిమిరసమూహంబు, మింట నడరె రజము।మిక్కుటముగ
నిల ప్రకంప మొందె । నెంతయుఁ దొలునాఁటి,యట్టులాడఁ జొచ్చె । నంతనంత.

క. మునుకొని యాక్రియ నెంతియు మునుముగ నగుదుర్నిమిత్త।ములుసూచిమనం
బున నాస విడిచి ధైర్యం, బనుమిత్తుని నూఁదిపట్టె । నసురుఁడు కడఁకన్.

చ. గిరితరుజాలహస్తు లగు।కీశులుఁ బట్టినభిండివాలము
ద్గరకరవాలశూలపరి।ఘప్రభృతిప్రతిభాసమాను లై
పరఁగినదైత్యవీరులును । బాయక పోరెడుపోరు మాని చి
త్తరువున నున్నభంగి విది।తంబుగ నిశ్చలవృత్తి నుండఁగన్. 2122

చ. కుటిలపరాక్రమప్రవణుఁ । గుత్సితచేష్టితగర్వితున్ సము
త్కటదురితాలవాలు నతి।దర్పితునిన్ రజనీచరాధముం
జటులనిశాతఘోరశర।జాలములం బొలియింపు మంచు నొ
క్కటఁ బలికెన్ రఘూద్వహుని । గ్రక్కున వేడుకఁ బంచభూతముల్. 2123

చ. ఎనయఁగ దుర్నిమిత్తము ల।నేకములుం బొడగాన వచ్చినం
దననిధనంబు సిద్ధ మని । దైత్యుఁడు శూరత నేపురేఁగె న
మ్మనుజవరుండునుం దనకు । మంగళసూచనచిహ్న లేర్పడం
గని విజయంబు నొందుటకుఁ । గౌతుకి యయ్యె నిజాంతరంబునన్. 2124

చ. రజనిచరుండు రాముఁడుఁ బ।రస్పరనిర్జయలాలసాత్ము లై
భుజబలసత్త్వసంపదలు । భూరిశరంబులపెల్లుఁ బ్రాభవం
బు జగదభీష్టదప్రధన।భూతియుఁ జూపుచుఁ బోరి రేపునన్
గజపతియున్ మృగాధిపుఁడుఁ । గంపము నొందక పోరుకై వడిన్. 2125

మ. వికసత్తేజము నొంది పెంపెసఁగు నుర్వీనాథుశస్త్రాలి మృ

త్యుకటాతుచ్ఛటఁ బోలి యుగ్రగతి దైత్యుం డాఁకెఁ దత్తీవ్రసా
యకజాలంబులు రాముపై జయరమాకృపాంగచ్ఛవిం బర్వె ను
త్సుకుఁడై నారదుఁ డుబ్బి యాడఁగ సురస్తోమంబు మోదింపఁగాన్. 2126

మ. లంకానాథకులాచలంబు సమరశ్లాఘాసముద్యద్బలా
లంకారం బగుసాహసంబున విలోలత్సాయకగ్రావముల్
హుంకారంబున రామచంద్రహరిపై నుత్సాహ మేపార ని
శ్శంకుం డై కురిసెన్ లసద్భుజవనస్ఫారచ్ఛవిం బేర్చుచున్. 2127

అర్ధచంద్రాకృతి నడరెడుతూపులు, నెఱిభుజంబులమీఁదఁ బఱపి పఱపి
నాగదంష్ట్రోదగ్రనారాచజాలంబు, ఘనభుజాంతరములఁ జొనిపి చొనిపి
పవికోటిసంకాశభల్లపరంపర, గురుఫాలతలముల గ్రుచ్చి గ్రుచ్చి
శూలోపమానత్రిశూలబాణంబుల, నుదరపార్శ్వములందుఁ బొదివి పొదివి
దర్పశాలి యైనదైత్యునిఁ దూలించి, క్రమముతోఁ దురంగమముల ముంచి
సూతుఁ డైనకాలకేతుని సోలించి, తేజరిల్లె నాజి రాజవిభుఁడు. 2128

పరిఘ గదా పరశ్వథ ముసల ముద్గర చక్రశూలభిండివాల కరవాల పట్టిసతోమర ప్రాసంబులు ఖరాంతకుపైఁ బఱపి దశాస్యుండు సింహనాదంబు సేసిన నవ్విభుం డన్నియు నశ్రమంబున నర్ధచంద్రబాణంబుల [1]నిక్షుదండఖండనంబుగా ఖండించి నిరంతరగభీరసాయకాసారంబుల నద్దానవవీరు వెఱచఱవం జేసిన నతండునుం గినుక గదుర రథయానపాత్రకర్ణధారుం డై సంగరసాగరంబునం బ్రవర్తింపఁ బ్రతికూలంబుగాఁ గుంభకర్ణభంజనప్రభంజనుండు సుడివడం జేయు చుండెఁ దద నంతరంబ. 2129

సుత్రాముని హయములపై, ధాత్రీపతిమేనఁ గేతుదండంబునఁ ద
జ్జైత్రశతాంగముమీఁద వి,చిత్రశరము లేసె నసురశేఖరుఁ డంతన్. 2130

అన్యోన్యాస్త్రవిఘట్టనధ్వనులు నుగ్రాటోపలీలోల్లస
జ్జన్యాడంబరనాదముల్ తురగహేషాఘోషముల్ తర్జనో
పన్యాసక్వణనంబులున్ విపులచాపజ్యారవంబుల్ యుగాం
తన్యాయంబు దలిర్పఁ బేర్చెఁ ద్రిజగత్కంపంబు సంధిల్లఁగాన్. 2131

ఇరువురుఁ బోరి పోరి యితరేతరముక్తనిశాతసాయకో
త్కరములు మేన నాటిన నుదగ్రతలుం బటుబాహుదర్పముల్
వరశరసంధిలాఘవము వావిరి రెక్కట నుజ్జగించి డె
ప్పర మగునొప్పిఁ గొంతవడి పన్నుగ నూరక నిల్చి రాజిలోన్. 2132

బోరనఁ గ్రొమ్మెఱుంగులు నభోవలయంబునఁ బర్వుచుండఁగా

1. నిక్షుదండభంజనంబుగా భంజించి నిరం.

భూరమణుండు నంత సురబృందము లౌనట మెచ్చ నిస్వన
స్ఫారతరార్ధచంద్రముఖసాయక మొక్కటి వేసి కూల్చె దే
వారిరథధ్వజత్రయము నత్తఱి మోఁగియుట వొడ్చునట్లుగాన్. 2133
క. లోకత్రితయజయస్తం,భాకృతి[1]గతిఁ గేతనత్రయము విఱిగిన ను
ద్రేక మొదవంగ రాముం, బ్రాకటముగ నొవ్వ [2]నేసెఁ బలలాశి యటన్.
చ. బలువిడిఁ గర్తరిక్రకచభల్లము లేసి నిమేషమాత్రలోఁ
దలలును జేతులుం దునుమఁ దత్క్షణమాత్ర మహాద్భుతంబుగా
మొలచినఁ జూచి రాఘవుఁ డమోఘుతిఁ దూపులు దాఁకవొక్కొ య
క్కొలఁదులఁ దాఁకినం దెగవొకో యని యచ్చెరువందె నంతియున్. 2135
తే. మఱియు నెప్పటి దునుమాడె మానవేంద్రుఁ
డవియుఁ దొల్లింటికై వడి నడరి మొలచెఁ
బదిశిరంబులు నిరువదిబాహువులును
నధిపుమనమునఁ గడుసందియంబు గదిరె. 2136
తే. ముసలకరవాలపట్టిసముద్గరాసి, బాణకార్ముకకంకణోద్భాసితంబు
లయినచేతులు మణికిరీటాభిరామ,కుండలము లగుశిరములుఁ గూడ మొలచె.
ఆ. ధీరుఁ డయిననృపతి ఘోరభల్లంబులఁ, ద్రుంపఁ గడయ కంతఁ దేలి మొలచెఁ
దాళదీర్ఘబాహుతతులును రోహణ,శిఖరమణికిరీటశిరము లొప్ప. 2138
సీ. బాణాసనవ్యగ్రపాణి యై రాముఁడు, పఱఁగింపఁ బఱచునాభల్లతతులు
పవనపథంబున బలువిడి మ్రోయుచు, నురవడిఁ దాఁకఁగ నొక్కమొగిన
కీలు దప్పించినక్రియ నూడిపడుచున్న,శిరములుఁ గరములుఁ జెలువు మిగిలి
మణికుండలప్రభామండలంబులు, భానుమండలంబులుఁబోలె మెండుకొనుచు
భుజగరాజభోగపృథులతరాయత,భుజకదంబకములు పొలుపు మిగిలె
వెఱచి యంతనంత వేల్పులు దమపుష్ప,కములుఁ దాఁకి దొలఁగి కలయఁబఱవ.
క. తెగునెడ నెత్తురు నొప్పియు, మొగి నేమియుఁ గానరాక మున్న శిరంబుల్
యుగసన్నిభహస్తము లెడ,తెగక నిమిషమాత్ర మొలచు దృప్యద్గతితోన్.
ఉ. ఉన్నవి యున్నయట్ల తల లుర్వికి డిగ్గ శిరఃప్రవాహముల్
మున్నొకసారె నిండుదెగ మోపినసాయక మట్లయుండఁ జాఁ
గెన్నఁటిదూపువెల్లి యని ఖేచరకోటి నుతించె సంచితో
త్పన్నదశాస్యరాఘవతపఃకరలాఘవచిత్రసంపదల్. 2141
ఉ. [3]త్రెవ్వెడుగంటులం గురువు దేఱెడునెత్తురు రాకమున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందకమున్న సాయకం

---

1 యాగుకేతన. 2. శితశరంబుల నేసెన్. 3 ఇది యెట్టాప్రెగడవారిపద్య మని వ్రాఁతప్రతులు గొన్నిట నున్నది.

బవ్వాలఁ బోకమున్న మకుటాగ్రవిఘట్టనరాణ మొప్పఁగా
నువ్వున నుప్పతిల్లె నసురేంద్రుమూర్ధచయంబు గ్రక్కునన్. 2142

తెగుతలలు మీఁది కురవడి, నెగయుతలలుఁ బడెడుతలలు నేర్పడ ధరణిన్
మొగిఁబడెడుతలలుఁ గలుచ్చె, గగనము ధరణియును నిండఁ గప్పెం దోర్ష్ణిన్.

తునిసి మీఁది కెగసి ఘనసత్త్వజవములఁ, గొలుపు మిగిలి మున్ను పూనివైవ
నున్న ఘోరాయుధములు పన్నుగ రఘువీరు,పైఁ బ్రసక్తివైచు బాహుతతులు.

పనివడి రాముఁ డేయుశితభల్లములం దెగి తచ్ఛిరఃపరం
పర లొగి నుప్పతిల్లుచు నభస్థలి నాఁ జనుధగ్రకాళి ని
ర్భర మగుకౌతుకం బొసవఁ బన్నుగఁ దాల్చుకపాలమాలికా
స్ఫురణములం గనర్చెఁ బ్రఘు శోణితసూత్రనిబంధనస్థితిన్. 2145

అలయక కన్నుదెప్ప కుడు సంతవిళంబము లేక రాముఁడాం
దలలును జేతులుం దునుమ దైత్యవిభుండును విస్మయంబుగాఁ
గలపడి భూమిపాలుపయి దట్టముగాఁ బఱపెన్ శిలీముఖం
బులు సురసిద్ధసాధ్యులు నభోవలయంబునఁ బిచ్చలింపఁగన్. 2146

విచ్ఛాయ నొందక వేఁడక దప్పక, కనుదెప్పవెట్టక కడఁక చెడక
హాసంబుఁ బొలియక త్రాసంబు నొందక, యూపులింతలు లేక చేవ వెలయ
భ్రూభంగరుచులును భూరిధిక్కృతులును, నుగ్రవీక్షణములు నాగ్రహములు
భూరివిరావముల్ బొబ్బలు నార్పులు, హుంకారములు బహుహుంకృతులును
గలిగి దనుజుతలలు గలయుచుఁ గ్రమ్మఱ, మొనసి ముదముతోడ ముచ్చటాడు
రామభద్రుఁ డెగడు రావణు నుతియించు, సురలఁ గోపమడరఁ జూచు మెచ్చు.

ఆర్పులు నింగి ముట్టఁగ నుదగ్రతరం బగుకిన్కతోడ ని
ట్టూర్పులు సందడింపఁగ సముజ్జ్వలకంప్రలలాటమ్మెలుంగులున్
గర్వముతోడిచూడ్కులు నుదారము లై నిగుడంగ మూర్ధముల్
నేర్పొదవంగఁ ద్రుంచె ధరణీపతి సత్వరభల్లసంహతిన్. 2148

దృప్యద్రామవిముక్తతీవ్రవిశిఖక్షుణ్ణంబు లై యెంతయున్
దృప్యద్రావణమస్తకంబులు మనోద్రేకంబునన్ భానుమ
ద్దీప్యన్మండలలక్షితంబు లగుచున్ దేవావలిం ద్రాసవై
రూప్యాలంబము నొందఁజేసె విజమూర్ధాధారవారంభతన్. 2149

తెగి యెదురై తనర్చి చనుదెంచుశిరం బది చూడ నెంతయున్
నెగడె నరేంద్రచంద్రుపయి నెక్కొని యున్నదురాగ్రహంబునం
బగగొని మ్రింగఁ బూని హతభావముతో నరుదెంచు చున్నరా
హుగతి వియత్తలంబునఁ బయోదవినీలిమభాసమాన మై. 2150

గరుడధ్వజుఁ డగురాముని, నురవడితోఁ గఱవ వచ్చునురగములగతిం

బరువడిఁ దెగిపడుచునిశా, చరుకరములు దెలిపి యాక § చదలం బొలిచెన్.

క. కరము లనుకంబములసాం, పరయుంగా నిలిపి నిలిపి § యనురాగమునన్
శిరము లనునరసిజంబుల, విరచించినతోరణములు § వెలసెం జదలన్. 2152

చ. రవికులశేఖరుం డయిన § రాముశరంబులఁ దద్విలూనదా
నవకరమస్తకంబులు ని § నాదచలద్బహుకాకకంకఘూ
కవిహగముల్ నభంబు వెసఁ § గప్పినఁ జీకటి పర్వె రేయునుం
బవలును సంధ్యయుం దెలియఁ § బ్రస్ఫుటభావము లేక యెంతయున్. 2153

శా. ఈచందంబున భాస్కరాన్వయకులా § ధీశుండు పెంపార దు
ష్టాచారుం డగుపంక్తికంధరునితో § నారూఢుఁడై పోరి బా
హాచంచద్బలవిక్రముం డయినదై § త్యాధీశునిం గూల్పఁగా
నేచొప్పుం దలపోయ లేక విజయో § పేతాంతరంగంబునన్. 2154

శా. వీనిం బోలునిశాచరుల్ గలరె యా § విశ్వంబునన్ వీనిన
త్వానూనస్థితిఁ జూడ నచ్చెరువు బా § హాశక్తియున్ వింత శ
స్త్రీనైపుణ్యము గ్రొత్త సంగరతల § స్థేమంబు దా వేఱు నే
వీనిం జంపఁగ లేనొకో యకట నా § వీర్యోద్యమం బేటికిన్. 2155

మ. తలలుం జేతులుఁ ద్రుంచి వేసరితి ను § ద్యత్క్రోధినై మోఁ బోరి దో
ర్బలముం జేవయుఁ జూపి యే విసిగితిం § బ్రత్యర్థి నేచొప్పునన్
గెలువన్ వచ్చును వీని శస్త్రములచేఁ § గీడ్పాటు వాటిల్లదో
విలయం బారయ వీని నొందదొకొ భా § వింపంగ నేచందమో. 2156

ఆ. అనుచుఁ జింతనొంది § యాత్మలోఁ దలపోసి, చేయునదియు లేక § చిన్నఁబోయి
యలసి యున్నఁ జూచి § యవ్విభీషణుఁ డిట్టు, లనియె రాముతోడ § వినతుఁడగుచు.

చ. ప్రముదితమానసుం డయిన § బ్రహ్మవరంబున వీనినాభియం
దమృతము కుండలాకృతి మ § హత్త్వమునం దగ నుంటఁ జేసి మూ
ర్ధములును జేతులుం దెగియుఁ § దత్క్షణమాత్రన పుట్టుచున్న వీ
క్రమమునఁ జావు లేకునికి § కారణ మి ట్లెఱుఁగంగఁ జెప్పితిన్. 2158

ఉ. ఎక్కడఁ బట్టి వీనిపయి § నేసెదు తూపుల నెంతఁ బోరినం
జిక్కఁడు వీడు మూర్ధములుఁ § జేతులుఁ ద్రుంచుట కేదిమాన మీ
రక్కసునాభిఁ బావకశ § రంబు ప్రయుక్తము సేయు మంతటం
దక్కక యింకిపోవు నమృ § తం బొకమాత్ర నరేంద్రశేఖరా. 2159

మ. మదమానంబులు దూలి రావణుఁడు భీ § మప్రౌఢి వో నాడి న
మ్మదియుం దక్కి నిరాశజీవుఁ డగు నా § త్మన్ నీవు దొల్లింటిచొ
ప్పు దలిర్పన్ నిశితాస్త్రజాలముల నా § స్ఫోటంబునన్ నూటతో
మ్మిదిమాఱుల్ దలలుం గరంబులు బలో § త్సేకంబునం ద్రుంచినన్. 2160

వ. మఱి పోలియుంగలవాఁడని చెప్పిన రఘువీరుండు రోషానలవివర్తంబుం బోనిపావకదైవత్యం బగుబాణంబు మంత్రపూర్వకంబుగా సంధించి యేసి తదీయనాభియం దున్నయమృతంబుఁ దదనలంబున కాహుతిచేసి చక్రీకృతచాపమండలుండై తొంటికైవడి మఱియు నూటతొమ్మిదిమాఱులు దలలును జేతులు నస్త్రమంబునం దునిమిన. 2161

సీ. గరుడమహోరగగంధర్వు లార్చిరి, ధీరతఁ గపులు మోదించి రెలమి
మొగి మస్తకంబులు దెగినవేగంబున, నొక్కట రుధిరంబు లుప్పతిల్ల
దావపావకశిఖాతతిసమావృత మైన,నడగొండకైవడి నడరి పేర్చి
శోణితజలసేకశోణ మై యున్నయా,రాక్షసాధిపుశరీరంబుమీఁదఁ
దల దనర్చె మిగులఁ దరుణాతపక్రాంత,తటవిరాజదుదయధారుణీధ
రంబుమీఁద నొప్పురవిమండలముక్రియ, దృష్టిదుస్సహోగ్రతేజ మగుచు.

మ. అకటా యెవ్వరు ము న్నెఱుంగనిమదీయం బైనమర్మంబు వీఁ
డు కృతఘ్నుం డయి చెప్పెఁ గూల్తు నని యాటోపంబు దీపింపఁ గో
పకఠోరుం డయి శక్తి వైవ నది భూపాలుండు భల్లంబులన్
శకలీభూతత నొందఁ జేసె విపులజ్వాలౌఘముల్ పర్వఁగాన్. 2163

వ. యంత్రకూటముఖంబులన్ వెడలుసాహసంబునడువున రామశిలీముఖవిలూనకంఠనాళవివరంబులవలన నుప్పతిల్లి సహజరోషమహాపావకంబుంబోలె నిష్కామిణంబు నొందుచున్నయంతర్గతప్రతాపంబు ననుకరించుచు నొక్కయనూనంబైన తేజంబు రావణశిరంబులవలన వెలువడి యతిజవనపవననిహతం బగుదీపంబపోలెఁ బొలిసిన నద్దానవుండు నేకశిరంబున రామచంద్రు నవలోకించుచుఁ గరద్వయావశిష్టుం డై కులిశభగ్నశృంగంబులు గలిగి వనగజవిలూనపాదపం బై యేకద్వికూటతాలంబులం బొలుచుశైలంబుపగిది నుత్పాటితసటం బగుకంఠీరవంబుక్రియ నపనీతదంష్ట్రిం బగుమహానాగంబుచాడ్పున నపహృతకాలదండుం డగుకృతాంతుకైవడి విభ్రష్టమహాశూలాయుధుం డగురుద్రుభంగిఁ గానిపించి విజృంభణంబు దక్కియు ధైర్యం బవలంబించి. 2164

ఉ. రాజితధాతునిర్ఝరధరాధరసన్నిభుఁ డై నదానవుం
డోజ దలిర్పఁ దొంటిక్రియ నున్నతచాపము దాల్చి భానుమ
త్తేజము లైనబాణములు దిక్కులఁ బిక్కటిలంగ సత్వరుం
డై జగతీశుపైఁ బఱపె నార్చుచుఁ జూడ్కుల మంట లొల్కఁగన్. 2165

చ. ఇనకులరాజశేఖరు నహీనసమానమహాశరాసనం
బున వడి నుప్పతిల్లుశరపూగవిషానలకీల లొక్కపెం
ట్టునఁ జనుదెంచి సాహసకఠోరతఁ బేర్చినదైత్యుఁ దాఁకెఁ బై
కొని విపులోల్క లుగ్రగతిఁ గూడి మహీధ్రము గ్రమ్ముచాడ్పునన్. 2166

చ. ఇరువురు నేయుబాణము లహీనజవంబునఁ బర్వుచుం బర
స్వరపరిఘట్టనోత్పతితపావకదగ్ధఘనచ్ఛదంబు లై
యురవడి దక్కి యుండియును యోధనమంచితహస్తలాఘవ
స్ఫురితవిశేషసంపదలఁ బొల్పుగ లక్ష్యము దాఁకు నెంతయున్. 2167

శా. ధీరోదాత్తవరేణ్యుఁ డై నపతియున్ ధీరోద్ధతుం డై నర
క్షోరాజన్యుఁడు మేరుసారనినదత్కోదండు లై సాగరో
దారోర్మిప్రతిమానసాయకము లుద్దామంబుగా నేయుచో
నీరంధ్రత్వము నొందె నాకసము శూన్యీభూతసత్పార్శ్వ మై. 2168

క. కంఠీరవఘనసత్త్వుఁ డ,కుంఠితవిక్రముఁడు చటులకోదండుఁడు సో
త్కంఠత నటించునద్దశ,కంఠునిపైఁ గురిసె నిశితకాండములు వడిన్. 2169

తే. జగము లన్నియు నొకతల చటులసత్త్వుఁ,డై నదశకంఠుఁ డొకతల యనఁగ నదియ
నిజముగావించు కై వడి నృపవరుండు, నుచితసంస్థితి నొకతల నునిచె నెలమి.

క. తలలుం జేతులుఁ దునిసినఁ, బొలివోవనిధైర్య మొంది భుజయుగళంబుం
దలయొకటి దక్కి యుండియుఁ, జలమున నయ్యసుర పోరె జనవిభుతోడన్.

సీ. ఉత్సాహశౌర్యసముత్సుకుం డై చారు,ధైర్యసామగ్రిచేఁ దరలఁబడక
విపులచాపము దాల్చి వెరవు దప్పకయుండి, బాణసంధానంబు పఱపు చెడక
నెలకొని తేరిపై నిలుకడ పాటించి, యేపారునాగ్రహ మినుమడింప
విపులతరం బైన వేదన దలఁపక, సింహనాదంబున చేవ గలిగి
కుటిలచేష్టుఁడు పంక్తిముఖుండు లేని,తలలుఁ జేతులు నున్నట్లు దర్ప మెసఁగి
యసముడింపక సాహసమెసకమెసఁగఁ, బేర్చి రాఘవుతోఁ బోరొనర్చుచున్న.

ఉ. మాతలి సూచి యిట్లనియె మానవనాయక యీదురాత్ము ని
ర్ధూతవిభావుఁ జేసి వడిఁ ద్రుంపుము దొల్లిటిభంగిఁ గ్రమ్మఱం
జేతులు మస్తకంబులును జెచ్చెర వీనికి నుప్పతిల్లునో
యీతఱి నూరకుండఁ దగ దేవునఁ జంపుట మేలు సూడఁగన్. 2172

క. కావున బ్రహ్మాస్త్రమునన్, రావణుఁ దెగటార్చు మదరి రాఘవ సురలం
బ్రోవుము సమస్తజగములఁ, గావుము భూతముల నెల్లఁ గరుణింపు తగన్.

వ. అనినయనంతరంబ రఘువంశదీపకుం డగురాజన్యనందనుండు మున్ను తాను
యజ్ఞరక్షణముదితుం డగువిశ్వామిత్రుచేత విధిపూర్వకంబుగాఁ బడసినపైతా
మహాస్త్రంబు వినయాదరభక్తిపురస్సరంబుగాఁ దలంచి పుచ్చుకొని. 2174

మ. అపధూమానలతేజుఁ డానృపతి ప్రత్యాలీఢసంస్థానుఁ డై
విపులోదన్వదుదీర్ణఘోష యగుమౌర్విం గూర్చి బ్రహ్మాస్త్రమ
భ్రపథం బందినక్రొమ్మెఱుంగు లాడవం బ్రవ్యక్తి నొందించుచుం
ద్రిపురారాతియుఁబోలె దుర్జయతరస్థేమాభిరామంబుగాన్. 2175

చ. హరి మొదలైన నాకపతు । లందఱు నంతనమంది చూడఁగా
నరవరుఁ డుగ్రకోపభర । ణంబున దైత్యునురస్స్థలంబుపై
వెరవుగ దృష్టి నిల్పి పటు । విక్రమ మొప్పఁగ నేసె నేసినన్
బరుసన నభ్రవీథి వెసఁ । బర్వుచు మండుచు దుర్నివార మై. 2176

సీ. విలయార్కమండలా । విర్భావ మొదవంగ, సంవర్తపావక । చటుల మగుచుఁ
గులిశమహాయుధ । కోటిసంకాశ మై, కాలదండాయుతా । భీల మగుచుఁ
జటులచక్రసహస్ర । సన్నిభస్ఫురణ మై, రుద్రశూలోదగ్ర । రుచులు నిగుడ
నిర్ఘాతసంఘాత । నిష్ఠురపాత మై, ఫణిరాజసముదాయ । భయద మగుచు
నప్తమారుతదుర్వార । జవము గలిగి, దానవస్తోమహృదయసంత్రాస మొదవ
శతమఖుఁడు మొదలైనదిక్పతులు మెచ్చ, నతినిరర్గళ మైనబ్రహ్మాస్త్ర మడరె.

మ. కులగోత్రంబులు గ్రుంగె నంబుధులు సంక్షోభించె నిద్ధాత్రియుం
జలనం బొందె హరిద్గజంబు లదిరెన్ సర్పాన్వయేశుండు ని
ట్టలమై యోర్వక వీఁగెఁ గూర్మపతి ప్రీడం బొందె సర్వంబు ని
ట్లు లయారంభముఁ జెందుమాడ్కిఁ దలఁకెన్ డోలాయమానస్థితిన్. 2178

వ. ఉభయపార్శ్వములందు వసువులును ముఖంబునందు దహనతపనులును బక్షం
బులయందుఁ బవనుండును నడుమ రుద్రులును దేజరిల్ల సకలసురవందనీయంబు
ను సర్వసిద్ధసాధ్యగంధర్వపూజ్యమానంబును నిఖిలదానవమదాంధకారమా
ర్తాండమండలంబును గరిరథతురగపదాతిజీర్ణకాననదవానలంబును బరిఘప్రాస
ముద్గరాదిసాధనజీమూతప్రచండమారుతంబును బరిపంథిసేనాబహువ్యూహభే
దనంబు నగునద్దివ్యశరోత్తమంబు భూతంబులును సురలును జయజయధ్వనులు
సేయఁ జనుదెంచి యింద్రాదిదిక్పతులవజ్రాదిసాధనంబులం బగులనిరావణును
రస్థలంబు గాఁడి తదీయప్రాణంబులు గ్రోలుచుం బుత్రి యగుసీతనిమిత్తంబు వ
గచువసుమతికి రాక్షసాధము వధియించితి నని చెప్పం బోవుపగిది భేదించికొని
పాతాళంబు సొచ్చి నిమిషార్ధమాత్రంబునం గ్రమ్మఱి రాముతూణీరంబు సొచ్చెఁ
దదనంతరంబ. 2179

ఆ. బ్రహ్మకులజుఁ డైన । రావణుఁ జంపిన, యఘము వాపికొనఁగ । ననఘుఁ డైన
రాముఁ జెందె ననఁగ । రభసంబుతో నస్త్ర, మడరి దొనయ చొచ్చె । నంతలోన.

శా. రామాస్త్రక్షతరక్తధార లొలుకన్ రక్షోవిభుం డంత సు
త్రామోదంచితవజ్రభిన్న మగుగో । త్రక్ష్మాధరంబో యనన్
భూమిం గూలె శరాసనంబు శిథిలీ । భూతత్వ మొందంగ ను
ద్దామాక్రందము సేయుచున్ విగళితాం । తస్సారసంచారుఁ డై. 2181

మ. ధరణీభూధరదిగ్గజాహిపతు లు । ద్యత్త్రాసు లై క్రుంగి రు
ద్ధురభీతిన్ హతశేషదైత్యగణముల్ । దూలెం బ్రమోదించె వా

నరయూథంబులు సిద్ధసాధ్యసురగు లాకనందించి రేపార న
చ్చరలుం గౌతుక మొంది యాడిరి సముచ్చద్గేయహృద్యంబుగాన్. 2182

చ. తొరఁగుచు నున్న తేనియలఁ దోఁగి విధూతపరాగజాలధూ
సరరుచిఁ బొల్చియున్నమదషట్పదముల్ చనుదేర సాంద్రబం
ధురతరగంధసంపదలఁ దోరము లౌ పెనుఁబుష్పవర్షముల్
గురిసిరి రామచంద్రుపయిఁ గుప్పలు గాఁగ నిలింపు లింపునన్. 2183

మ. మొరసెన్ దివ్యమృదంగవాద్యములు సమ్మోదంబుగా గంధమే
దుర మై చల్లనిగాలి వీచె దెసలుం దోడ్తోన నాకంబు [1]సుం
దర నైర్మల్యము నొందె భూతములు సద్యత్ప్రీతిమైఁ బేర్చె ది
క్కరినాదంబులు మించె భద్రము సమగ్రం బయ్యెఁ జంచద్గతిన్. 2184

వ. అంత లంకానాథాంతకుం డగురామభద్రుండు రోదోంతరంబునం బిక్కటిల్లి మందరమథ్యమానాంభోరాశిగభీరఘోషసమం బగుసురగరుడోరగకిన్నరఖేచరయక్షగంధర్వవిద్యాధరసిద్ధసాధ్యగుహ్యకజయజయధ్వను లాకర్ణించుచు విభీషణసుగ్రీవజాంబవదాదిగనుజవానరభల్లూకనాథులు సేయుసాధువాదంబుల లజ్జావనతవదనుం డై. 2185

మ. భుజసామర్థ్యము నివ్వటిల్ల నెలమిన్ భూమీశ్వరుం డీగతిం
ద్రిజగత్కంటకుఁ గూల్చి దివ్యసహజస్థేమానుభావంబునన్
విజయశ్రీ విలసిల్ల సంభృతసముద్వేలస్ఫురత్కీర్తి యై
రజనీనాథసమగ్రసారవిభవప్రాగల్భ్యసంపన్నుఁ డై. 2186

సీ. ఘోరవిక్రముఁ డైనతారకాసురుఁ గూల్చి, మహనీయుఁ డయినకుమారుఁబోలి
విపులసత్త్వుం డైనవృత్రాసురునిఁ ద్రుంచి, యొప్పారునాపురుహూతుపగిది
రౌద్రాత్ముఁ డైనహిరణ్యకశిపుఁ జంపి, చెలువారునన్నరసింహుకరణి
నతిమాత్రబలుఁ డైనయంధకాసురు నొంచి, శోభిల్లుచున్నయాశూలిమాడ్కిఁ
బంక్తికంఠునిఁ దెగటార్చి భానుకులుఁ డు,సమ్మదంబునఁ దనజయస్తంభ మొనర
ధరఁ బ్రతిష్ఠించుకైవడి ధన్వరత్న, మిచ్చెఁ దమ్మునిచేతికి నెసక మెసఁగ.

చ. రణమునఁ గొండపోలె రఘురాముశరంబునఁ గూలి యున్నరా
వణుఁ గని శోకవేగఘనవారినిధుల్ దను ముంప నావిభీ
షణుఁ డతిదీనుఁ డై యడలు సైఁపఁగఁజాలక చేరవచ్చి త
త్క్షణమున విన్ననౌచుఁ బలుచందములన్ విలపించె నేడ్చుచున్. 2188

—రావణుమరణమునకు విభీషణుండు శోకించుట.—

శా. అన్నా యోదశకంఠ ఘోరసమరవ్యాపారనిత్యత్వసం
పన్నత్వంబున రూఢికెక్కి విలసద్బాహాబలప్రౌఢిచే

1. సుం, దరనైర్మల.

నౌన్నత్యంబున మించి దైవగతిఁ ద్రు§ట్యుచ్ఛక్తి వై నేఁడు వి
చ్ఛిన్నాశేషశిరఃకరుండ వగుచుర్వ§ సీదగ్గతిం గూలితే. 2189
మ. సురలక్ష్మీకచకర్షణప్రవణముల్ § శుంభద్రణోత్సిక్తముల్
హరశైలోద్ధరణప్రచండబలముల్ § హర్యక్ష[1]దుస్సాధముల్
హరిదంతద్విరదేంద్రదంతదళన§[2]వ్యాపారఘోరంబు లై
కర మై యున్నకరంబు లిప్పుడు పతం§గశ్రేణిపా లయ్యెనే. 2190
క. సురతరుకుసుమశ్రేణీ,సురుచిరమృదుతల్పమధ్య§శోభిత మగునీ
యురుతర దేహం బిప్పుడు, పరుసనిసంగ్రామభూమిఁ § బడఁ బాలయ్యెన్. 2191
తే. అర్కమండలతులితంబు § లై విపక్ష, తిమిరజాలకభేదన§క్షమము లైన
విమలదీధితిమణికిరీ§టములు నేఁడు, సడలి యంతంత నుగ్గు లై § పుడమిఁ గూలె.
క. ఎనసినగురువిక్రమమున, ఘనతరభుజరాజిసత్త్వ§గౌరవముల న
త్యనుపముఁ డగునీతో నెన, యనఁ జాలినవారు జగము§లందుఁ గలారే. 2193
సీ. నయశాలివై యుండి § నరనాథుసుందరిఁ, దెచ్చి యీయాపదఁ § దెచ్చికొంటి
వల దని చెప్పినఁ § జలమున నబ్బంగి, నామాట లేమియు § నమ్మవైతి
మనువంశనాథుని § మనుజుఁగాఁగఁ దలంచి, భూమినందన నిచ్చి § పుచ్చవయితి
రామునితోడి వై§రస్థితి గేఁ ప్రొద్దు, మాను మన్నను నీవు § మానవైతి
నీతిహితములు సేకొన § నేరవైతి, తెలిపి చెప్పినఁ గ్రొవ్వునఁ § దెలియవైతి
చెడుట నిక్కమనినను § నుడుగవైతి, [3]తెగువ నాగ్రహబుద్ధియు § డింపవైతి.
క. పరకాంతలు తల్లులుగా, నిర వందఁగఁ దలఁపకున్న § నిహాముం బరముర్వ
దొరఁకొనును మేలు గలుగును, దొర యండ్రే వాని బుధులు § దుష్టుం డనరే.
క. ఘనతరదుర్మానముచే, ననయంబును గలుగునీస్వ§యంకృతదోషం
బున నింత పుట్టె నేఁ జెప్పినపలుకులు దప్పవయ్యెఁ § బిదప నరసినన్. 2196
క. అని శోకించుచుఁ దాలిమి, మనమున నెలకొనమిఁ జేసి § మానము దూలన్
ఘనమూర్ఛ మునుఁగుఁ దెలియుం, దనుజేశుఁడు శోకవహ్ని§తప్తాత్ముం డై.
క. ఇనుఁడు ధరఁబడియెఁ జంద్రుఁడు,మునిఁగెం దిమిరమున నగ్ని § మొగి హిమమయ్యెం
గనకాద్రి యొఱగె ననుక్రియ, దనుజాధిప పొలిసి తిట్లు § దర్పము దూలన్.
శా. సారస్కంధము శౌర్యమూలము విరా§జద్బాహుశాఖంబు దు
ర్వారోదారధృతిప్రవాళమతి దీ§ప్యత్కోపపుష్పంబుఁ బా
పారంభైకఫలంబు నై పరఁగుదై§త్యాధీశవృక్షంబు దా
నీరూపంబున రామహస్తి విఱిచెన్ § హేలాసముల్లాసి యై. 2199
చ. కరయుగదంతదుర్జయము § గర్వమదాంధము ఘోరచాపదు

1. దోస్సారముల్. 2 వ్యాపారఘోరాతిగు, ప్కరముల్ నీడుకరంబు. 3. తేఁపువయు నా
గ్రహపుబుద్ధిఁ ద్రిప్పవైతి.

ర్భరతరదున్సహాక్రముముఁ । బద్మజవంశసముద్భవంబు ని
ర్జరతరుషండఖండనవి।శాలతరం బగుదైత్యరాజసిం
ధురపతిఁ గూల్చె రాముఁ డను।దుర్జయసింహము బాణదంష్ట్రిమై. 2200

ఆ. నిబిడవిక్రమార్చి । నిశ్వాసధూమంబు, సాహసేంధనంబు । సత్ప్రతాప
మయినరావణాగ్ని । యారామజలదంబు,చేత నార్పఁబడుట । సిద్ధ మయ్యె.

వ. అనునయ్యవసరంబున. 2202

సీ. మొనసి మందోదరి । మొదలైనదశకంఠు,వెలఁదు లత్తఱి లంక । వెడలి వచ్చి
పదయుగంబులు దొట్రు।పడ నీవిబంధంబు, లెడలంగ మేఖలల్ । సడలి పడఁగ
ఘనకుచంబులభార।మున నడుములు వీఁగ, భూషణావలు లూడి।పుడమి నెరయ
బాష్పపూరంబులఁ । బయ్యెదల్ దడియంగఁ, జికురభారము వీడి।చిక్కువడఁగ
దీనరోదనరవములు।దెసలునిండ, మొగములుదరములురములు।మోఁదికొనుచు
మున్నెఱుంగనినెవ్వగ।మునిఁగి పొగిలి, చెలఁగుమురిపపునడపుల।చెలువు దక్కి.

ఉ. ఓదశకంఠ యోరమణ । యోరజనీచరచక్రవర్తి నీ
వీదశఁ బొందఁ బా లయితి । వీరణరంగమునందు మాకు నిం
కేది తెఱంగు నెక్కడికి । నేఁగుదు మెవ్వరు దిక్కు నిట్టిని
ర్వేదపయోధి ముంచితివి । విశ్రుతవిక్రమవర్యభూషణా. 2204

మ. అని శోకించుచు వచ్చి వచ్చి నిహతా।శ్వానీకభీత్యావహం
బును నిర్భిన్నమహామతంగజము వి।స్ఫూర్జత్కిరీటాంచితం
బును విచ్ఛిన్నశతాంగసంకులము[1]లో।లద్భూరిరక్తార్ణవం
బును వీతాసువనాటరాక్షసగణా।పూర్ణంబు నై యెంతయున్. 2205

వ. మఱియుఁ గూలినసింధురంబులును నెరసినవిభిన్నకుంభికుంభముక్తాఫలంబులు నొఱిగినగుఱ్ఱంబులును దునిసినతదీయచరణంబులును బెరసినతురంగపల్యయనంబులును బడలుపడినయరదంబులును జూర్ణితంబు లయినచక్రంబులును దునుక లయిననొగలును వ్రాలినపదాతులును బగిలినతలలును వ్రక్కలయినప్రక్కలు నామూలలూనంబు లయినకరంబులును విచ్ఛిన్నంబు లగుచరణంబులును నికృత్తంబు లగుజానుభిత్తంబులు నూరుఖండంబులుం గలిగినరాక్షసకపివీరులును గలిగి, భగ్నకరవాలంబులును జెదరియున్నగదలును దఱుచైనముద్గరంబులును బ్రస్తృతంబు లగుముసలంబులును గలయంబడియున్నవిండ్లును సంకులంబు లయినబాణంబులును దుములంబు లయినప్రాసంబులును దుమురు లైనతోమరంబులును దట్టంబు లైనపట్టిసంబులును నాభీలంబు లైనశూలంబులును దళితంబులైనచక్రంబులును శకలితంబు లయినభిండివాలంబులును జూర్ణితంబు లైనపర్వతంబులును బొడి యైనపాషాణంబులును నింతింతలై విఱిగి పడినతరువులును వడిం బఱచురక్త

1. సుద్భూతారిరక్తార్ణవంబు.

మహానదులును నందువడింబడియరుగుకరటితురంగశతాంగశకలసుభటకళేబరం
బులును నొండొంటిపయిం బడి చచ్చినచతురంగసముదాయంబులు రాశీభూతం
బులైనపిశితంబులును గర్దమీకృతంబులగుమేదోమాంసంబులును వికీర్ణంబులగు
నెమ్ములును జచ్చియుఁ జేతియాయుధంబులు విడువనివీరయోధులును నిలిచినిలు
వునం బ్రాణంబులు విడిచియుఁ గూలక నిలిచియున్నమహాశ్చర్యశూరులును భ్రు
కుటికుటిలవదనులై యీల్గినమహావిక్రాంతులును రక్తమాంసలోలుపకాకకంకో
లూకగృధ్రాదివిహంగంబులును, వృకజంబుకంబులునుం గలిగి కపాలపాత్రలును
ధ్వజయూపంబులును జతురంగపశుసముదాయంబులును శరకుశవ్యతికరంబు
లును రుధిరపూరాజ్యంబులును మాంసాదిహోమద్రవ్యంబులును దూణస్రుక్స్రు
వంబులును శీర్ణభూషణమణిదహనంబులును గలిగి, యజ్ఞాయతనంబుంబోలె,
చామరమరాళంబులును దోమరకరవాలతరంగంబులును రథచక్రకూర్మంబులు
ను యుగ్యమీనంబులును గరిమకరంబులును బతితసుభటవదనకమలంబులు
ను దదీయలోచనకుముగంబులును రక్తాంబుపూరంబును గలిగి సరోవరంబునుం
బోలెఁ బున్నాగపూగమండితంబును గదళీకాకలితంబును శిలీముఖవిలసితం
బును బహుపలాశసమీచీనంబును నై యారామంబునుంబోలె, శతాంగనంకు
కులంబయ్యు [1]నేకాంగశరీరిసమన్వితంబును, గంధర్వబహుళం బయ్యును రాక్షస
సంవృతంబును, బుండరీకశతాకీర్ణం బయ్యును గృష్ణసారవ్యాప్తంబును, సుపర్ణ
శోభితం బయ్యును నాగేంద్రసదనంబును నై యున్నరణరంగంబునందు. 2206

సీ. కరిశైలములు వైచి ♦ ఘనరక్తవారాశి, గట్టిగా సేతువు ♦ గట్టికట్టి
లంకచందము సేసి ♦ లగ్గలు వట్టుచు, నాజి గెల్చితి మని ♦ యార్చియార్చి
యులిగినదైత్యుల ♦ నిలిపి చిక్కఁతి రంచుఁ, బొనుపైనకినుకతోఁ ♦ బొడిచిపొడిచి
తరువులు గొని తెచ్చి ♦ యరదంబు లురవడిఁ, బొడిపొడిగాఁ జేసి ♦ పొంగిపొంగి
కోర్కిఁ గ్రోఁతులకై వడిఁ ♦ గొన్నియెడల, లలివినోదము లీక్రియఁ ♦ జలిపిచలిపి
యెగిన భూతంబు లిబ్బంగి ♦ నుల్లసిల్లెఁ, జేరిరామునివిజయంబు ♦ కోరికోరి.

సీ. ఎలమిఁ జచ్చినగజం♦బుల నెక్కి యదలించి, యుద్వృత్తిమైఁబోర ♦ నుత్సహించి
పడినగుఱ్ఱంబులఁ ♦ బట్టి యల్లన వేడ్క, నడలక యాజికి ♦ నడరఁ జూచి
రథములు పొందించి ♦ రమణతో నీడ్వంగ, రణము గావింపంగఁ ♦ గణఁక నేచి
దారుణోదగ్రప♦దాతులై యార్చుచుఁ, గదియఁ చందంబున ♦ నెదురులేక
దైత్యవరులు పొదివి ♦ దర్పంబు నిండారఁ, గపులమీఁది కుతికి ♦ కవియునట్టి
చంద మొదవభూత♦సముదాయములుగొన్ని, యాగ్రహించుఁ జెలఁగుఁ♦ నడరునవ్వు.

ఉ. తొట్టినబాణముల్ దొలఁగఁ ♦ ద్రోచి ప్రియం బొదవంగ దోయిటం
బట్టి [2]కవోష్ణశోణితము ♦ భామలు దారును గ్రోలి క్రోలి యే

1. ననేకాంగశరీరసమన్వితంబును. 2. నవోష్ణశోణితము.

పట్టునఁ దారలై పిశిత పంకములోఁ బడి ముల్గి ముల్గి లోఁ
బుట్టినయుత్సవం బొదవ బోరన నార్చుచుఁ బెక్కుభంగులన్. 2209
మ. ఎనయం బండువునేయఁ గల్గెఁ గుతుకం బేపారఁగా నేఁడు ద
ప్పిన లే దెన్నఁడు నిచ్చ వచ్చుగతిఁ దృ ప్తిం బొంది మోదింత మం
చు నరేంద్రుల్ వినుతించువానరబల స్తోమంబు నగ్గించు భూ
తనికాయంబులు డాకినీయుతము లై దర్పాతిరేకంబునన్. 2210
ఆ. తనివినొంది త్రేఁచుఁ దద్దయు ముదమున, సొక్కి నావులించు సోలియాడుఁ
బాడుఁ దమ్ము మఱచుఁ బరమమోదంబున,నొందు నుబ్బు నార్చునుల్లసిల్లు.
సీ. కడుపార నెత్తురు ఘనముగాఁ గొని త్రావి, దెక్కులు నెరయంగఁ బుక్కిలించు
బలలఖండంబులు పడఁతుక విచ్చుచో, నోల్లఁ బెట్టకు మని మోఁకిలించు
మేదురం బగుచున్న మేదంబుచవిగొని, యడరినసిద్ధుర నావులించు
మస్తిష్క మండంద మనమారఁగాఁ దిని, [2]నెలకొన్న యెఱుఁగమిఁ గలవరించు
మునుఁగునీఁదుఁ దేలు మోదించుఁ గ్రీడించుఁ, దుళ్లు గంతులిడుచుఁ దూలియాడు
పరసవృత్తితోడఁ జల్లుఁబోరాడుచు, భూతసమితి యిట్లు పొలుపు మిగిలి.
క. జానకి నాక్రియఁ దెచ్చిన, దానవపతి మంచివాఁడు తగ వరయంగా
దానికి నయి పోరాడిన,మానవపతి యట్టివాఁడ మది నూహింపన్. 2213
క. అని భూతావలియును డాకినులుఁ బిశాచములుఁ గౌతుకితమానసు లై
ఘనసంగ్రామంబున ని, ట్లనయంబును గ్రీడ సల్పునాత్మణమాత్రన్. 2214
సీ. రఘునాథఘోరశరంబులు విరులచే, నెఱి రచించినయట్టిపఱపు గాఁగ
మణికనకాంగద మహిత మై తెగిపడి, తనరుబాహువు లుపధానములుగఁ
[2]దోరంపుగంటులఁ దొరఁగునెత్తురు హరి,చందనోదంచితచర్చ గాఁగ
దట్టమై పర్విన ధరణీపరాగంబు, చెలువారఁగాఁ గప్పుచీర గాఁగఁ
గాకజంబుకవృకఘూక కంకగృధ్ర,గణము సముచితపరిచారకత్వ మెనయ
వీరలక్ష్మీవిహారంబు వెలయఁ జల్పి, దీర్ఘనిద్రావశంబునఁ దెలివి దప్పి. 2215
తే. విజయలక్ష్మీమహోదగ్ర విరహదహన,భూరిసంతాపదగ్ధుండ పోలె నంత
రామచంద్రోదయంబున రమణదక్కి,ధరణిఁబడియున్న రాక్షసేశ్వరునిఁగాంచి.
క. సమదగజరాజవిదళిత,ద్రుమముపయిన్ వ్రాలులతల [3]దొరయుచు రఘుభూ
రమణహతుఁ డై నరావణు,రమణులు పైఁబడిరి శోకరయహతమతు లై.
క. కరిరాజుతోడఁ బాసిన,కరిణులగతి భానుఁ బాయుకమలినులక్రియన్
వెరవేది రమణుఁ బాసిన,తరుణుల[4]బ్రతు కేమి చెప్పఁ దలపోయంగన్. 2218
వ. అంత దహనుం బాసి యవసానంబునొందుచిదురుశిఖలపగిదిఁ దపనుం బాసి వచ్చి

1. నెలకొన్నయఱుగమిఁగళవళించు. 2. దోరంబుబొట్టులఁ దొరఁగు. 3. తోసెనయుచుభూరమణ. 4. తలఁపేమిచెప్ప దలపోయంగన్.

చరించుశీతాన్యాయమాన తైనసాయంతనమరీచులయట్లు నిశానాథుం బాసి ధూ
సరకాంతు లయినతారలపోల్కి జలదమండలంబు విడిచివచ్చి క్రుమ్మరుసీదత్ప్రికా
శ లగుతటిల్లతలచొప్పున నతిదీనభావంబు గలిగి ప్రతిపదస్ఖలచ్చరణపల్లవలును
భ్రపదసక్తమణిమేఖలాకలాపసూత్రలును నావిష్కృతనాభీమండలశ్లథనీవీదుకూ
లలును గమనాయాసఖేదజనితనిశ్వాసవేగపౌనఃపున్యప్రకటీభవద్వళితరంగలును
భిదురహారయష్టిమణిప్రతినిధి [1]విసూత్రముక్తావళిశంకాపాదినిరంతరనిర్యద్బాష్ప
కణికాసమాచితపీనస్తనభారనిర్వహణాసహిష్ణుభంగభీరుశాతమధ్యలును స్రస్తప
రిధానోపలక్ష్యమాణనవనఖరేఖోచ్ఛూనతా సంపాదికరకిసలయముహుస్తాడనపీ
డ్యమానోరస్థలీదృశ్యలును నిరంతరవిరహవేదనాకృశీభూతబాహాలతావిభ్రష్ట
మణివలయలును నిజపతినిధనభూనిర్దేశాసక్తల్లక్ష్యమాణకనత్కనకకమ్రబాహు
మూలలును జిరంతననిబంధనక్లేశవిముక్తిలాభచ్ఛిన్నకంఠగుణకలాపలును నవ
వైధవ్యదీక్షోపదేశజ్ఞాపకనిపతత్కుండలలును బాష్పధారోచ్ఛ్వసితకస్తూరికాప
త్రలతాకల్పకపోలభాగలును శోకవేదనోష్ణసముచ్ఛ్వాసమ్లానబింబాధరపల్లవలు
ను భూయోభూయస్సముత్పతత్ఖేదశ్వసితసముజ్జృంభమాణనాసికాపుటలును న
యనోత్పలనిర్గతసాంజనబాష్పధారాసారరోలంబలును బ్రస్వేదజాలసిక్తరుచిరా
లికసక్తవిలులితాలకలును జరమభాగవిలంబమాననిశాంతమందారదామబంధుర
వినదషట్పదనిర్విశేషవేణికలు నగుచు హానాథ హావీర హాదశానన యనుచు.

—❀ రావణాంతఃపుర స్త్రీలవిలాపము. ❀—

చ. అడలుచు నెత్తుటం దడియు మేనంగముఁ గౌఁగిటఁ జేర్చు నొర్తు పైఁ
బడి వగ నొందు నొర్త మెడ బాహులచేఁ దవిలించు నొర్తు సొం
పడరఁగ మోము సూచి యనయంబును మోహము నొందు నొర్త పెం
పెడలి పదాంబుజంబులపయిం బడు నొర్తి విషాదవేదనన్. 2220

చ. తలఁచినఁ జూడ మావలనఁ దప్పొకయింతయు లేదు పిల్చినం
బలుకవు దీనవృత్తి బహుభంగుల మ్రంద నుపేక్షచేసితే
నిలుచునె మేనఁ బ్రాణములు నిన్ను నిమేషముఁ బాయనేర్తుమే
యలుగఁగ నేల నీకు దనుజాధిప కన్నులు విచ్చి చూడవే. 2221

క. వెఱవవు నీ వెవ్వరికిని, వెఱ పరయఁగ నీకు వెఱచు వీరత్వమునం
బఱపితివి లోకపాలుర, మెఱసితివి జగంబులందు మేటి యనంగన్. 2222

శా. హా నీ విక్రియ నొక్కమాత్రఁ బృథుబాహాశక్తిఁ బోనాడి దు
ర్మానోద్రేకము గోలుపోయి రణశూరత్వంబు దూలంగ శ
స్త్రోన్మానోచితకౌశలంబు చెడి మాయాప్రౌఢియుం దక్కి యీ
దీనత్వంబున మర్త్యుచేఁ బొలిసితే తేజోనలం బాఱెనే. 2223

1. ఛిన్నముక్తావళి.

వ. సురవిద్యాధరకిన్నరోరగగంధర్వపన్నగయక్షపక్షిసిద్ధాదుల నెల్లం జీరికిం గొనక చంద్రహాసైకసహాయుండ వై పరమేశ్వరలబ్ధవరప్రసాదానుభావంబున నెదురు లేక దుస్సాధుండ వై చటులసమరవ్యాపారపారీణత్వంబున నెగడియున్న నీవు నొక్కతాపసవేషంబు దాల్చిననరునిచేత మరణంబు నొందితివి మమ్ము నరయం గలవార లింకెవ్వరు గలరు. 2224

క. వీఱిడితనంబు వెట్టుచు, దూఱం బనిలేదు నిన్నుఁ § దొల్లిటిచెయువుల్
దీఱ వవి యనుభవింపక, వే ఱొండున పూర్వజన్మ § వివిధకృతంబుల్. 2225

క. అని యిట్లు పెక్కుభంగుల, మనమున వగ వెల్లివిరియ § మానసము దూలన్
ఘనతరనవవైధవ్యం, బునఁ బొగులుచు నుండునంత § భూరివ్యథలోన్. 2226

—✤ మందోదరీవిలాపము. ✤—

వ. అద్దనుజనాథునియగ్రమహిషి యగుమందోదరి యిట్లనియె. 2227

ఉ. హా నక్తంచరరాజశేఖర సము § ద్యత్సాహసాడంబరా
హా నిస్సీమపరాక్రమక్రమ జి § తేంద్రాదిప్రభావోన్నతా
హా నాగేంద్రసమానబాహుపరిఘా § హా వీర హా రావణా
హా నాథా ననుఁ బాయ నీకుఁ దగునే § హా చంద్రహాసాయుధా. 2228

ఉ. మూఁడుజగంబు లోలి నొక § మూలకుఁ దెచ్చి యుదగ్రవృత్తిమైఁ
బోఁడిమి నాఁడునాఁటికిఁ బ్ర § భూతముగా నుదయింపఁ బోరులన్
వేఁడిమి యెల్లవేల్పులకు § వేయివిధంబులఁ జూపి గ్రక్కునన్
నేఁ డొకమర్త్యుచేత రజ § నీచరరాజలలామ కూలితే. 2229

చ. హరి మొదలైనదిక్పతుల § కంగడకున్ సమకూరెఁ గోర్కి వా
నరయుతుఁడైనరామనర § నాథుకతంబున నవ్విభీషణుం
డరుదుగ లంక యేలఁ గలఁ § డవ్విభునత్కరుణానుభావతం
బరభయచింత లేక సుల § భస్థిరరాజ్యసుఖానుషక్తిమై. 2230

క. నెట్టన వానరు లంబుధి, గట్టినయాఁడు మొదలు § గా రాముఁడు దా
గట్టిగ మనుజుఁడు గాఁడని, పుట్టెన్ నామది భయంబు § పొలు పెడలంగన్.

ఉ. శ్రీతరుణీసమగ్రరతి § శీలుఁడు సత్త్వరజస్తమోగుణా
తీతుఁడు చక్రపాణి నిను § ధీరమతిం దెగటార్ప వానరీ
భూతదివౌకసుల్ గొలువఁ § బొల్పుగ మర్త్యశరీర మొంది వి
ఖ్యాతిగ నట్లు చేసె నిది § యన్యులకుం బొరిఁ జేయ శక్యమే. 2232

సీ. ఆజనస్థానంబు § నందు ఖరాదుల, నురమున రాముఁడు § దునుముటయును
శంకింప కసురులఁ § జంపి లంకాపురి, కపియొక్కరుఁడు మున్ను § గాల్చుటయును
గుంభకర్ణాదుల § ఘోరాజిలోపలఁ, గ్రొవ్వఱఁ గ్రమమునఁ § గూల్చుటయును
దివిషదీశుల కైనఁ § దే రానిద్రోణాద్రి, మించినకడిమిఁ దెప్పించుటయును

నిట్టు లరసి చూడ నిన్నియు దుష్కరములు నమానుషములు చలము మాని
రమణతోడ సీత రామున కిమ్మని, చెప్పుమాట లెల్లఁ జెవులు సోరవు. 2233

క. భాసురశీలఁ బతివ్రత, నాసీతం దెచ్చి తీవహంకారమునం
జేసినపాపంబులు దోఁ, జేసేఁతం గుడుచు టింతసిద్ధము గాదే. 2234

తే. శుభచరిత్రుండునిక్కము శుభమునొందుఁ, బాపశీలుండు పాపంబుఁ బరఁగనొందు
గుణగణోత్తరుఁ డావిభీషణుఁడు బ్రదికెఁ, గలుషలోలత నీ కిట్లు వాలియవలసె.

సీ. కమనీయతర మైనకైలాసగిరియందు, సలలితమందరాచలమునందుఁ
జారుసుఖావహామేరుశైలమునందుఁ, బరమైనహిమమహీధరమునందు
రమణీయ మగుచైత్రరథవనాంతమునందు, మనమార నందనవనమునందు
బహువిభ్రమోచితపాతాళములయందు, రమణ నాకాదిలోకములయందు
నేను సీతోడ దివ్యవిమాన మెక్కి, వివిధభంగుల విహరింతు వేడ్క లెసఁగ
భూరిభుజసార నీవిట్లు వాలియుకతన, నవ్యవైధవ్య మొందంగ నాకు వలసె.

క. సురతరుజకుసుమసురుచిర, పరిమళభరభరితశిశిరపరిమిళితలస
న్మరుదలసచలితసరసిజ,సురసరిమదవిహృతిబహుళసుకృతము వోలిసెన్. 2237

క. [1]జనకుఁడు దాను మయుం డని, ఘనభుజుఁడు దశాననుండు గాంతుం డనియుం
దనయుండు శక్రజిత్తని, మనమున గర్వింతు నట్టిమానము వోలిసెన్. 2238

క. లలి నీ వింద్రియముల మును, గెలిచి జగత్త్రియము నోలి గెలిచితి వని యా
చలమున నవి నిను గెలిచెను, దలఁపఁగఁ బగ దీర్చునట్లు దానవనాథా. 2239

చ. అనయము సర్వజంతువుల కారయ [2]లక్ష్యవిహీన మై ఘటిం
చినమరణంబు లేకునికి సిద్ధము గావున నీకు మేదినీ
తనయనెపంబునం గలిగె దారుణమృత్యువు దాఁ బరాంగనా
జనములమీఁదిమక్కువ లసంశయముల్ నిధనైకమూలముల్. 2240

క. జనకునిపాపపువరమున, ననయము నిను ననుగమింప నను వది లేకు
న్నను నిలువవలసె నకటా, తనపతితోఁ బాయు బ్రదుకు తరుణికి నేలా. 2241

క. నామీఁద నీకుఁ గలిగిన, యామచ్చిక లామహావిహారములు గడుం
బ్రేమపుమేలపుఁబలుకులు, నే మయ్యెనొ యెందుఁ బోయె నెఱిఁగింపు తగన్.

క. పతిచావు వినినయప్పుడ, యతివలు ప్రాణములు విడువ [3]రఁట యది హార్ద
వ్యతికరమే తలపోసినఁ, బతిదైవత మైనసతియ బహుమతి నొందున్. 2243

సీ. నేఁ డర్కకరములు నిర్భయంబుగ లంక, సొచ్చి విచ్చలవిడి సోలయఁ జొచ్చెఁ
బవనుండు సను దెంచి పయ్యెదకొంగులు, లీలమై లలిఁ గదలింపఁ దొడఁగె
నుడిగముల్ సేయుట లుడిగి గంధర్వులు, నొగి సంతసంబున నున్నవారు

---

1. జనకుఁడు దానవనాథుఁడు,... గాంతుఁడు నాకుం, దనయుండు. 2. చిహ్నవిహీనమై.
3. రది సౌహార్దవ్యతికరమే... బహుమతి నొందున్.

పరఁగ నెప్పటిహవిర్భాగముల్ చెందఁ¹గాంచుటను దివౌకులస్రుక్కు దీరె
యక్షకిన్నరగుహ్యకయాతుధాన, పక్షిఖేచరచారణపన్నగాదు
లరయనూఱటఁ బొందిరత్యనుపమాన, సమ్మదామృతరసపూరసహితులగుచు.

వ. మదీయజనకుం డైనమయుండును మహితమాయానుతి యగుమారీచుండును హితోపదేశగుణవంతుం డగుమాల్యవంతుండును బరమార్థభాషణుం డగువిభీషణుండును స్వామిభక్తిపవిత్రు లగుమిత్రులును భవదేకశరణ నగునేనును జెప్పినట్టిహితవాక్యంబులు వినవయితి వది యేల తప్పె నని యడలుచు డెందంబున నెవ్వగ నివ్వటిల్ల సైరింపంజాలక పఱుం బడి మూర్ఛిల్లి తెలిసి పతిహస్తంబులు తన యురస్స్థలంబునం గదియించుచుఁ దదీయకపోలసమాఘ్రాణంబు సేయుచుఁ దన్మస్తకంబులు దనయంకంబునం దిడుచు విశిఖవిశకలితం బగుతదీయోరస్స్థలంబునందుఁ దనయురం బదుముచు నో యసురేశా మదిరామదఘూర్ణాయమాననేత్రకమలంబులును జాటువాక్చతురంబులును మందస్మితసుందరంబులును గనత్కనకమణికుండలమండితంబులును మత్పీతలలితాధరామృతంబులును మద్విరచితహరిచందనకస్తూరికాఘనసారరుచిరతిలకలలాటంబులుం గలుగు మొగంబులు వాంచి నాకు మొగమీక మొగమోట దక్కం దగునే దిక్కరికరాకారంబులును బందీకృతబృందారకసందోహదారకచభారమందారకుసుమమకరందబిందుపరాగరాగరూషితంబులును సకలసురాసురవిజయమహాక్రతుయూపంబులును గైలాససముద్ధరణవిలాసవిలసితంబులును మదీయకబరీసురభికుసుమసురభీకృతకరరుహంబులును ద్రిభువనవిజయశ్రీవిహారాగారమూలస్తంభంబులును సమస్తప్రహరణకృతశ్రమంబులును వీరలక్ష్మీవేణికాభిరామజ్యాఘాతకిణశ్రేణిసనాథంబులు నగుకరంబులు రామశరనికృత్తంబు లై నేలం గూలెఁ గుంఠీకృతవజ్రపాణిప్రముఖదిగీశసురాసురదివ్యాస్త్రంబును దళితైరావణాదిహరిత్కరిదంతకాండప్రకాండంబును నతివిపులంబును నగునురస్స్థలం బత్యంతరణశ్రీపరిరబ్ధం బయ్యె నక్కటా నీయట్టిశూరాగ్రేసరునకును ²నిట్టివిధంబు గలిగె నింక నెవ్వరి ననవచ్చు నాతోఁ గూడి వీరె చూచితే విజితచతుర్దశభువనుండును రాక్షసకులసార్వభౌముండును నగునీదుకాంత లంతిపురంబు వెడలి సకలజనంబులునుం జూడ నిట వచ్చియున్నవారు వీరల నభ్యంతరంబులకుం బొం డని వీడ్కొలుపం దగదే పవనాతపస్పర్శంబు లనుభవింపని మేనులకు నిప్పు డవి దొరకొనియె నెట్లు సైరింపవచ్చు నానతి లేక వచ్చినా రని కినిసి యీశ పలుక నొల్లవొకో యని మఱియు ననేకవిధంబుల విలపించుచున్నమందోదరిం జూచి విభీషణుం డడలు గడలుకొన బాష్పపర్యాకులనయనుం డై యేడ్చుచు గద్గదస్వరంబున ని ట్లనియె. 2245

1. గాంచుటకు దిక్పాలురస్రుక్కు దీఱె. 2. నిట్టినిధనంబు...నెవ్వరి నమ్మవచ్చు.

సీ. దశకంఠవారాశి § దశరథాత్మజసాయ, కేద్ధబాడబమున § నింకిపోయె
రావణభూజంబు § రాఘవవాతూల, వీజనంబున నేఁడు § విఱిగికూలె
లంకేశదహనుండు § లక్ష్మణాగ్రజకాల, [1]జలదపృషత్కవ § ర్షముల నాఱెఁ
బౌలస్త్యరవి మహీ § పాలపశ్చిమమహా, దుస్తరాంబుధిలోన § నస్తమించె
ననుచు నేడ్చుచు [2]దురపిల్లు § నతనిఁ జూచి, యతివలందఱు విపులశో § కాంబురాశి
మునిఁగి దరిఁజేర నేరక § మొనసి కరుణ, పుట్టునట్టుగ నేడ్చిరి § పుడమిఁ బొరలి.
వ. అప్పు డవ్విభీషణుం గాంచి మందోదరి సోపాలంభంబుగా ని ట్లనియె. 2247
ఆ. చాలుఁ జాలు వగవఁ § గాలంబు గా దిది, లంక చేరె [3]రాజ్య § లక్ష్మి గేరెఁ
గోఱంత తీఱె నెల్ల § కోర్కులు సమకూఱెఁ, దుట్టు వాసె నింక § దొసఁగు లేదు.
ఆ. అఖిలబంధురహిత § మైనరాజ్యము సేఁత, కంటె నరసి చూడఁ § గలదె మేలు
యెడరు వేచి చెఱుచు § నేవకాఁ డగువాని, కంటె మేలు సూవె § కాలయముఁడు.
క. దనుజాధిపుఁ జంపించితి, తనిసితివే సంతసంబు § దలమయ్యె నయో
మనుజేశమిత్ర నీ కిటు, గినియక దశకంఠుఁ డేమి § కీ డొనరించెన్. 2250
వ. అనిన లజ్జావనతవదనుం డై పలుకక మిన్నకుండె నంత. 2251
ఉ. మానుప రాని నెవ్వగల § మ్రంది దురంతవిషాదవేదనన్
మానము దూలిపోవ నన § మానదయారస ముట్టునట్టుగా
మానక యేడ్చుదైత్యపతి § మానవతీజనులన్ విభీషణున్
మానవరాజశేఖరుఁడు § మానుగ ని ట్లని పల్కె నత్తఱిన్. 2252
క. వగవంగ వలదు నీ వీ, మగువల నూరార్పు ధైర్య § మహిమాత్ముఁడ వై
తగుభంగి నాదుమాటలు, విగతార్తత నాదరించి § విను మసురేంద్రా. 2253
క. వైరులఁ జంపుదు రొండెను, వైరులచేఁ జత్తు రొండె § వరజన్యములన్
వీరులజయాపజయములు, నారయ సమవృత్తి నుండ § వనిరి మహాత్ముల్.
ఉ. ఈతఁ డశేషదిక్పతుల § నేపడఁగించె నుదగ్రవృత్తి మై
నీతఁడు సప్తలోకముల § నేలె నిరంకుశశాసనాఢ్యుఁ డై
యీతఁడు సర్వదానవుల § నేర్పడ నేలె నుదీర్ణసారుఁ డై
యీతఁ డసాధ్యుఁ డేరికి న § హీనపరాక్రమశాలి యెల్లెడన్. 2255
శా. బాహావిక్రమగర్వితాప్రతిమది § క్పాలస్ఫురత్సైన్యస
న్నాహాడంబరశారదాభ్రపటలీ § నాశానిలప్రస్ఫుటో
గ్రాహోపూరుషితాతినిష్ఠురతర § వ్యాహారనాదక్రియా
మోహీభూతసమస్తవిష్టపుఁడు న § న్మోదింప నర్హుం డిలన్. 2256
శా. నీరంధ్రప్రథితప్రతాప మొదవన్ § నీయన్న చందంబునం

1. జలదపుష్కరవర్ష § సమితి నాఱెఁ. 2. దుఃఖిల్లు. 3. రాజ్యలక్ష్మి గలిగెఁ, గోఱంత తెల్లఁ దీఱెఁ గోర్కులు దలకూడె, దొట్టు వాసె.

బోరంగాఁ దరమే తదీయసమరస్ఫూర్జద్విలాసంబు గ
న్నారం జూచితి గాదె విక్రమకళావ్యాపారవిఖ్యాతి మ
న్నారే యీతనిసాటిశూరు లసమానస్థైర్యసామగ్రులన్. 2257

మ. తడఁబా టించుక లేక యుల్లసితదోర్దర్పోద్ధతుం డై యనిం
బడునందాఁకఁ బ్రవర్ధమానవిభవప్రఖ్యాతిమైఁ బేర్చి నే
ర్పడరం బోరె నితండు విస్మయరణవ్యాపారనిష్ణాతుఁ డి
య్యెడ నీదానవరాజు మెచ్చఁదగుఁ గా [1]కీదుర్దశం శోచ్యుఁడే. 2258

చ. గెలు పది యేల పోరఁ బరికింప జయంబుఁ బరాజయంబునుం
దురితగతిం ఘటించు నది తొల్లియ నిశ్చయ మా నిశాటుగో
ర్బలమును విక్రమంబు రణపాటవముం బహుదివ్యసాధనం
బులకుశలత్వ మచ్చెరువుఁ బొల్పుగ నీక్రియఁ జావు మేలగా. 2259

వ. కావున. 2260

చ. నిలుకడ గల్గి సాంగముగ నిశ్చితశాస్త్రనిరూఢితోడ నీ
వలయక ధైర్యకౌతుకసమగ్రుఁడ వై భవదగ్రసూతికిం
నెలకొని యున్నభక్తివిధినిర్ణయ మొప్పఁగ నగ్నిసంస్క్రియ
ల్సలుపుము లెమ్ము పొమ్ము సకలంబును జేయుము వేడ్క నావుడున్. 2261

ఉ. ఈతని కగ్నిసంస్కరణ మేటికి నెక్కడిసోదరుండు నా
కీతతి ముట్టఁ గూడునె మహీసుత దేవరయింతిఁ దెచ్చె నీఁ
డాతతపాపశీలుఁ డగు నాగమచోదితపశ్చిమక్రియా
ఖ్యాతికి నర్హుఁడే నయవిగర్హితచేష్టుఁడు మాననీయుఁడే. 2262

—విభీషణుఁడు రావణునకు నగ్నిసంస్కారాదులు చేయుట.—

వ. అనిన విని రఘువరుండును నద్దశాననుండు నీచెప్పినయంతకుం గలఁడైన నింక వందనీయుండ కాని నిందనీయుండు గాఁడు వైరంబు లామరణాంతంబులు గావున నితనితోడిమాత్సర్యంబు నాకు లే దితండు దురితదూషితుం డయ్యును సంగరక్రియామరనదీనిర్మగ్నుం డగుటం జేసి ప్రక్షాళితసకలమహాపాతకపంకుం డయ్యెం గావున నితనికి నౌర్ధ్వదైహికక్రియలు వైదికతంత్రోక్తక్రమంబున నిర్వర్తింపు మనిన నట్ల కాక యని రాక్షసులచేత నగ్నిత్రయంబు దెప్పించి శకటారోపితచందనాగురుప్రభృతిసురభీంధనంబులును ముక్తామణిప్రవాళంబులు గైకొని నిశాచరులు ననుదేర మాల్యవత్ప్రముఖమంత్రిసనాథుం డై [2]ప్రాజ్ఞనయను లైనయగ్రజన్ములే తేరఁ బతాకాభిశోభితసువర్ణశిబికయందు దశముఖు నునిచి తూర్యఘోషంబు లులియం జని సురభీంధనరచితం బగుచితి ప్రజ్వరిల్ల నధ్వర్యుసహితుం డై విభీషణుండు మేధ్యం బగుపశువు వేల్చి పృషదాజ్యపూర్ణం బగుస్రువంబు

1. కీదుర్దశాశోచ్యుఁడే. 2. ప్రాకృతు లైనయగ్రజన్ము.

వామభాగంబున దక్షిణహస్తంబున జుహువును నన్యకరోపరిభాగంబున ధ్రువయు నాహవనీయయు నిడి [1]నాసికయందు స్రువయును గరంబులఁ బ్రాసితయును శీర్షభాగంబున జమసంబును బాదంబుల శూర్పంబును సమంతనిపాత్ర యుదరంబునను దధిఘృతకుశపూర్ణపాత్రియు శమ్యయుం దత్పదంబునం బెట్టి ముసలోలూఖలంబులు నరణ్యుత్తరారణులు నవశిష్టపాత్రంబులు నూరుప్రదేశంబునఁ బెట్టి యావహనీయంబు పూర్వంబున దక్షిణాగ్ని దక్షిణంబున గార్హపత్యంబు పశ్చిమంబునందు నునిచి మఱియు విధేయంబులు సమాచరించి యథాక్రమంబున నగ్రజునకు నిర్వర్తితాగ్నిసంస్కారుండై యనంతరకరణీయంబులు ననుష్ఠించి క్రమ్మఱి వచ్చి రామభద్రునకు దండప్రణామం బాచరించిన నవ్విభుం డతనిం గౌఁగిలించి సంభావించి యూఱడించి కరుణాకటాక్షసుధారసం బతనిమీఁదఁ జిలికి సౌమిత్రిం గనుంగొని యిట్లనియె. 2263

ఆ. నీవు లంక కరిగి • నేఁడు విభీషణు, సకలదానవేంద్ర • సార్వభౌమ
భావ మంద లంకఁ • బట్టంబు గట్టుము, నా ప్రతిజ్ఞ నిండ • నమితవైరి. 2264

వ. అని యానతిచ్చుటయు. 2265

క. రమణమెయిఁ బాకశాసన, సముఁ డగురఘువంశతిలకు • శాసనమున సం
భ్రమమున నతండు సంపద, నమరావతిఁ బోలులంక • కరిగి రయమునన్.

సీ. బలవైరిపురిఁ గ్రిందు • పఱుపంగఁ జాలిన, లలితసౌధంబుల • చెలువు గలిగి
యేడులోకంబులు • నింతియ యనుమాడ్కిఁ, బఱపైన సప్తవ • ప్రములు గలిగి
రోహణాద్రియ పెక్కు • రూపులై యున్నట్లు, క్రీడాచలంబుల • క్రేళ్లు గలిగి
మేరుశైలంబుతో • మేల మాడెడునట్టి, కనకగేహంబుల • కలిమి గలిగి
యోలి దెసలకడల • మూలల చెంగట, నొదిఁగి యున్నసురమ • దోత్కటములఁ
దెగడుకరులఁ గలిగి • దినమణితేజీల, కంటె నొప్పుతురిక • గములు గలిగి. 2667

ఆ. అనుపమానరత్న • కనకగేహంబుల, నెగడుదైత్యనాథు • నగరు సొచ్చి
నరవరేణ్యుఁ డంత • సురగిరిప్రాంతంబు, సేరుశీతరోచి • చెలువు గలిగి. 2268

—ఓ విభీషణపట్టాభిషేకము. ఓ—

క. మానవపతినందనుఁ డట, నానాతీర్థాంబురాశి • నదులజలంబుల్
వానరవీరులచేత న, నూనతఁ దెప్పించె గురుస • ముల్లాసమునన్. 2269

సీ. సంచితమణిమయ • స్తంభాభిరామంబు, బహువిచిత్రవితాన • భాసురంబు
ఘనసముత్తేజిత • కనకవేదికమును, సామ్రపల్లవహేమ • కమ్రకుంభ
ముపకంఠగతమద • ద్విపసంకులంబును, బుణ్యాంగనాగేయ • పూరితంబు
మంగళతూర్యాది • సంగీతముఖరంబు, వందిమాగధజనా • నందితంబు
నై మనోజ్ఞమైన • యాస్థానమండపం, బమర నందు రత్న • హైమతుంగ

1. నాసికయందు స్రుక్కును గర్ణంబులయందు బ్రాశియు.

భవ్యసింహాయుక్తశుభద్రపీఠంబున, నునిచె దానవేంద్రు నుత్సహించి. 2270
క. వారిపురోహితమంత్రులు, దారమతిఁ సంతసిల్లఁ దద్దయు వేడ్కన్
భూరమణావరజుఁడు ప్రియ, మారఁగ నభిషిక్తుఁ జేసె నయ్యసురేంద్రున్.
చ. తరణియు శీతదీధితియుఁ దారలు శేషుఁడు నాదికూర్మమున్
ధరణియు రామునత్కథయుఁ దథ్యముగాఁ గలయంతకాలమున్
దిరముగ లంక యేలు మని దీవన లిచ్చె నిశాటభర్తకున్
గరుణ దలిర్ప లక్ష్మణుఁడు గౌతుకసమ్మదనిర్భరాత్ముఁడై. 2272
వ. అని లక్ష్మణుం డానతిచ్చిన సంప్రాప్తలంకాసామ్రాజ్యుండై విభీషణుండు వివిధమంగళోపకరణమహనీయమణిభూషణాదులు గొనుచు లక్ష్మణానుచరుండై వచ్చి సవినయంబుగ మ్రొక్కి రామాభిధానుం డగునారాయణునకు సమర్పించిన.
మ. అనఘుం డర్కకులప్రదీపుఁడు ప్రమోదాయత్తుఁడై శక్రసూ
తున కాదివ్యవిభూషణాంబరము లస్తోకోత్సవం బొప్ప ని
చ్చి నయం బారఁగఁ బల్కి వీడ్కొలుప సుస్థితాశ్వసాహస్రకే
తనసర్వాంగశతాంగుఁడై యరిగె నాకం బింద్రునిం గొల్వఁగాన్. 2274
వ. అయ్యవసరంబున. 2275
క. తనచేరువ ముకుళితకర, వనజుం డగువాయుసుతుని వదనేందురుచిన్
వనచరచకోరపంక్తుల, కనురాగము నివ్వటిల్ల ననియెం బ్రీతిన్. 2276
ఉ. లంకకు నేఁగి సీత నకలంకపవిత్రచరిత్రఁ గాంచి ని
శ్శంకితవృత్తి దా గెలుపుచందము దైత్యులు చచ్చుచందమున్
గొంకక పోరుచందము నకుంఠితసంగరకేళినిర్గతా
తంకు దశాస్యుఁ గూల్చినవిధంబును వేగమ చెప్పి రావనా. 2277
వ. అనిన. 2278
క. జనపతియానతిఁ బావని, దనుజులు దనుఁ జుట్టి కొలువఁ దత్పుర మెల్లన్
గనుఁగొనుచు సీత యుండెడు, వనవాటికిఁ జేర నరిగె వలయితగతి యై. 2279
క. కూజత్పికాలపచ్ఛుక, రాజితగుంజద్ద్విరేఫరవయుతబహుధా
త్రీజాతజాతవతత, భ్రాజితవనసన్నికర్షభవ్యతఁ దనరన్. 2280
క. కీలితవిచిత్రతరమణి, జాలకహాటకవితర్దిసంభృతసుమనో
త్తాలతరశింశుపాతరు, మూలనిషణ్ణ మహీజ ముద మలరంగన్. 2281
క. వినయాదరసంభ్రమములు, మనమునఁ బెనఁగొనఁగ భయసమంచితభక్తిం
జనుదెంచి కాంచె ముందట, జనకసుతన్ రాముదేవి సాధుచరిత్రన్. 2282
సీ. చెలు వేది పవలింటిశీతాంశుకళవోలె, ఘనధూమవృతదీపకలికవోలె
మలినవస్త్రచ్ఛన్నమణిశిలాకయుఁబోలె, నవహిమాకులనైననలినిఁబోలెఁ
గదుపుతోఁ బాసినకోదమజింకయుఁబోలె, వాడువాఱినసవవల్లిఁబోలెఁ

బవనాభిహత మైన బాలకదళిఁ బోలె, లీనకర్దమమృణాళికయుఁ బోలె
వగలఁ బొగులుచు వలవంత నంది కుంది, చేరుగడ లేమిఁ జెక్కిటఁ జేయి సేర్చి
యాత్మవల్లభు రాముని నాత్మలోన, నిలిపి యొండు దలంపక నెలఁగుసాధ్వి.

చ. పులులకు లోఁగియున్నమృగిఁ బోలికిఁ బాములలోన నున్న లేఁ
జిలుక యనంగ సింహములచెంతను హస్తినిభంగిఁ జేఁదుతీఁ
గెలకడ నున్నకల్పలత కేళి మహీసుత ఘోరదైత్యకాం
తలనడుమం దమశ్శితరదష్టసుధాకరరేఖచాడ్పునన్. 2284

క. వనరెడుజానకిఁ గని పద,వనజములకు నెరఁగి భక్తివశమున వినయా
వనతుఁ డయి మ్రోల నున్నం, గని తలఁచి యెఱింగి సీత కడుమోదమునన్.

ఆ. జనకునాజ్ఞఁ బూని సామ్రాజ్య మొల్లక, యడవి కేఁగుదెంచినట్టివిభుఁడు
కుశలియే యుదారగుణసముద్రుండునా,మఱఁదిసుఖమునొందె మెఱయునయ్య.

వ. అనవుడు. 2287

—హనుమంతుఁడు సీతకు రామునివిజయంబు చెప్పుట.—

ఉ. రాముఁడు లక్ష్మణుండును చిరంబుగ నెమ్మది నున్నవారలు
ద్దాముఁడు భానుసూతియును దైత్యవిభుండు విభీషణుండు ని
స్సీమవిభూతి వాలెద రశేషకపీంద్రులు నిర్భరప్రమో
దామృతవార్ధిఁ దేలెద రపాయము లేమియు లేవు జానకీ. 2288

శా. కైలాసాచలచాలనోద్ధతభుజాగర్వాంధు నింద్రాదిది
క్పాలోపాకరణస్ఫుటాధికరణప్రాగల్భ్యసంపన్ను ను
ద్వేలాడంబరదుస్సహాదికరణస్థేమానుభావస్మయుం
బౌలస్త్యుం దశకంఠుఁ జంపె నతిశుంభత్ప్రౌఢి రాముం డనిన్. 2289

క. అతికాయుఁ డై తనర్చిన,యతికాయుని మేఘనాదు ననిలో నపరా
జితబలుఁడు లక్ష్మణుఁడు వి,శ్రుతగతిఁ దెగటార్చె నస్త్రశుంభద్గతి నై. 2290

ఉ. అంబరవీథి వచ్చి నిశితాయుధనిర్గతవిస్ఫులింగకా
డంబరులై నిరంతరజటాలసటాలసదేణరాజఘో
రాంబుదనాదమేదురవియత్కటుబంతురులై నదైత్యులం
బంబినకింకఁ జంపి రురుబాహులు వానరు లాజి నుగ్రులై. 2291

ఆ. నీదువల్లభుండు మోదంబు నిండార, లంకలోన గతకలంకచరితు
నాదశాస్యునను జనఘు విభీషణుఁ, బట్ట మమరఁ గట్టెఁ బద్మనయన.

క. నీయంత నున్నగతి నిర,పాయంబుగ నూఱడిల్లు మరయఁగ లంకా
శ్రీయుతరాజ్యము రఘుతన,యాయత్తము గాదె సందియం బిం దేదీ. 2293

ఉ. నీరధి గట్టి రామధరణీపతి తమ్ముఁడుఁ దాను లంకపై
దారుణకోపుఁ డై విడిసి దానవకోటులఁ బంక్తికంఠునిం

బోర వధించి నిన్నుఁ గొనిపోవఁ గలం డని మున్ను నీకు నే
ధీరతతోడఁ జెప్పినప్రతిజ్ఞలు వచ్చెఁ జుమీ మహీసుతా. 2294

వ. అనునయ్యవసరంబున. 2295

ఉ. వేదనఁ బైపయిం దొరఁగువెచ్చనికన్నులనీరు సాంద్రస
మ్మోదము కల్మిఁ జల్లనయి మున్కొని క్రమ్మఁ గృశాంగయష్టియుం
మేదుర మై తనర్పఁగ సమీహితరోమసముద్గమంబున
న్మేదినిపట్టి రామవిభు నెమ్మదిలో నెలకొల్పి సోలుచున్. 2296

క. కపివీర నీవు చేసిన,యుపకారంబునకు సామ్య మొదవంగాఁ బ్ర
త్యుపకృతి సేయఁగఁ దరమే, విపులత్రిజగత్ప్రదానవిధులును సరియే. 2297

చ. పతిహితముం బ్రతాపము నుపాయము శౌర్యము ధైర్యముం సమీ
హితకరణక్షమత్వము నహీనజవంబుఁ బరాక్రమంబు నం
చితవినయంబు నీతియు వశిత్వముఁ దేజము నీక యొప్పు మా
రుతసుత నీకు ధారుణి నొరుల్ సరివత్తురె వారి మెత్తురే. 2298

సీ. నీకతంబునఁ గాదె నృపకులాధీశ్వరుం, డెలమి నావృత్తాంత మెల్లఁ దెలిసె
నీప్రసాదమునఁగా నెరయంగ సౌమిత్రి, ప్రాణముల్ భూపతి పడయ నేర్చె
[1]నిండి దైవాఱిన నీదయచేతఁగా, పరఁగ నేఁ జావక బ్రతికి యుంటి
దుస్తరం బైనపాథోరాశి యెవ్వఁడు, నీవు దప్పఁగ దాఁట నేర్చువాఁడు
రమణ నీ వనుయానపాత్రమునఁ జేసి, భూతలేశ్వరుఁ డాపదంభోధి దాఁటె
నెన్నిచూచిన నీఋణ మెట్లు దీఱు, ఘనయశోధామ మా కేడుగడయు నీవ.

వ. అనిన హనుమంతుండు లజ్జావినయవినమితుం డై యి ట్లనియె. 2300

శా. తల్లీ మీ రిటు లానతిత్తురె భవద్దాసుండ మీయాజ్ఞ నేఁ
జెల్లింపం గలవాఁడ మీయభిమతశ్రీ కింత [2]పాత్రుండ న
త్ఫుల్లత్సత్కరుణుండు భూవిభుఁడు నన్ బొల్పార మన్నించుచోఁ
దెల్లం బైనబలంబునం బరఁగితిం దేజంబునం బేర్చితిన్. 2301

తే. పుణ్యభాగిని భవదీయభూరిశుద్ధ, మహితసాధ్వీత్వసుచరిత్రమహిమఁ జేసి
పరఁగ నెల్లెడ శుభము లప్రతిహతంబు,లయ్యె నిక్కువ మంభోరుహాయతాక్షి.

వ. అని తత్సమీపంబున నతిభయంకరాకారలు నతివిశంకటదంష్ట్రావికటవదన
లు నతివృత్తోన్నతస్తిమితతారలోహితకపిలాదివర్ణనేత్రలుఁ బరుషతర్జనవచనలు
నగురాక్షసాంగనలం జూచి కోపించి యుగ్రాకారుం డై యి ట్లనియె. 2303

చ. పెలుచనినిన్నుఁ జేరి వెఱపించుచు నూరక యెగ్గు లాడుచుం
గొలఁదికి మీఱ నుగ్రగతిఁ గ్రొవ్వునఁ బాపము నాక చంపఁగా

---

1. నిండఁ బైఁ బాఱిననీకృపామృతమునఁ బరఁగ. 2. పాత్రుండ నే, ఫుల్లాంతఃకరణుండు భూవిభుఁడు.

నలుగుచుఁ జెక్కుచండముల ǂ నప్పటి కప్పటి కేడిపించుచుం
గలఁచుచు నున్నయీదనుజ ǂ కామినులం దెగటార్చి పుచ్చెదన్. 2304

మ. అనినన్ జానకి పల్కు నిట్టు లిది య ǂ న్యాయంబు వీ రందఱుం
దనుజాధీశునిపంపు సేయుటకునై ǂ దట్టించుచో వీరలం
దునుమాడం దగునయ్య వాతసుత మ ǂ త్పూర్వోగ్రకర్మంబు ద
ప్పునె వీ రేమిటివార లింతు లెదురే ǂ పాల్పేది నీముందటన్. 2305

వ. అని తొల్లి యొక్కశార్దూలంబు వినుచుండ భల్లూకంబుచేతం జెప్పంబడినయది
గల దాకర్ణింపుము. 2306

క. [1]వెఱవక చేసినపాపము, మఱియొక్కఁడు పుచ్చుకొన స ǂ మర్థుఁ డగునె క్ర
మ్మఱఁ దనక కుడువవలయును, మఱలదు వెనువెంట వచ్చు ǂ మానుప నగునే.

క. సమయంబు రక్షణీయము, సమయము లంఘింపఁ గీడు ǂ సమకూరు నిలన్
సమయంబు దప్పి నడవరు, సమవృత్తిని సత్పురుషులు ǂ సన్నుతమతులై.

ఆ. తనదుతొంటిజన్మ ǂ మునఁజేయుపాపంబు, శుభము నయినఁబిదపఁ ǂ జొలవ కెలమి
ననుభవింప వలయు ǂ నది యెన్నివిధములఁ, లేఁడు గీడు సేయు ǂ వాఁడు దనకు.

వ. కావున నిరపరాధినులు నిజస్వామివచనపరాధీనలు నగు వీరలం గరుణింపు మిప్పు
డు రావణనిధనంబు వినియు నన్నుం దొంటిక్రియఁ దర్జించుచున్నవారే యని
మఱియు ని ట్లనియె. 2310

చ. ఒకనిమిషార్ధమైన నిట ǂ నూరక జీవితనాథు వేడ్కఁ జూ
డక నిలువంగ లే నతివి ǂ డంబన మైనను నిర్వహింప ను
త్సుకమతి నున్నదాన నృప ǂ సూనున కింతయు విన్నవింపు పొ
మ్ము కపివరేణ్య నీ వనిన ǂ మోదితుఁడై తదనంతరంబునన్. 2311

క. చని రామున కప్పలుకులు, వినిపించినఁ గొంతవడి వి ǂ వేకించి మనం
బునఁ జింతించి క్రమంబున, దనుజాధిపుతోడ ననియె ǂ ధాత్రీపతియున్. 2312

ఉ. దానవవంశభాస్వదవ ǂ తంస విభీషణ నీవ యేఁగి య
జ్జానకి నాదుపంపునఁ బ్ర ǂ సన్నమతిం దగుభంగి మంగళ
స్నానము సేయఁబంచి విల ǂ సన్మణిభూషణదివ్యవస్త్రమా
ల్యానుపమాంగరాగముల ǂ నర్థి నలంకృతఁ జేసి తేవనా. 2313

వ. అని పంచిన నతండును సహర్షుండై లంక కరిగి యంతఃపురంబుఁ బ్రవేశించి
నిజాంగనలకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్పి పంచిన వారలు సీతకడకుం జని
మ్రొక్కి దేవీ నీవల్లభుం డగురఘువల్లభుపంపున విభీషణుండు మమ్ము నీసమ్ము
ఖంబునకుం బుత్తెంచెఁ గావున నీవును దద్వచనానురూపంబున మంగళస్నానం
బాచరించి విలసన్మణిభూషణాంగరాగమాల్యాంబరంబులు దాల్చి భవజ్జీవితే

1. మఱియొకఁడు చేయుపాపము, మఱొకఁడు దాఁ బుచ్చుకొన సమర్థుఁ డగునె.

శ్వరుపాలికి విజయంచేయు మనిన జానకి వారల కిట్లనియె. 2314

క. స్నానాంగరాగమాల్యా,నూనాంబరభూషణంబు లొల్ల మదీశుం
గానంగ నిట్ల వచ్చెద, నే ననవుడు వార లి ట్లనిరి జానకితోన్. 2315

క. కృతపుణ్యాశీల వినుమీ,పతియానతి సేయు మనినఁ బడఁతుకయును న
మ్మతమున జలకమున నవా,మృతధౌతశశాంకరేఖ మించు దెగడుచున్.

క. మొగలని చెలువము నెలవగు,ముదితకుఁ బునరుక్తభావము లగుతొడవు లా
సుదతీమణిఁ జెందుట నొ,ప్పిదమునకుం బాత్ర మయ్యెఁ బెంపు దలిర్పన్.

క. అవిరళమణిభూషణముల, నవనితనూజాత యుజ్జ్వలాంబర యై చా
రువిమలతారలు గలిగిన,నవచంద్రిక గల్గురాత్రి నాఁ దనరారెన్. 2318

క. దానవసుందరు లత్తఱి, జానకి నందలముమీఁద సమ్మద మొదవం
గా నునిచి శారదాభ్రవి,లీనత నేపారుచంద్రలేఖయుఁ బోలెన్. 2319

వ. సగౌరవంబుగాఁ దెచ్చిన. 2320

చ. రజనిచరేశుఁ డత్తఱి ధరాసుతకుం బ్రణమిల్లి ముదంబునన్
నిజ మగుభక్తియున్ భయము నివ్వటిలం దగ వేత్రవిస్ఫుర
ద్భుజుఁ డయి క్రందు మాన్పుచుఁ బ్రభూతనిశాచరసేవ్యమానుఁ డై
విజితదశాస్యుఁ డై నరఘువీరునకుం బ్రణమిల్లి యి ట్లనున్. 2321

విభీషణుఁడు సీతను దెచ్చి రామునకు సమర్పించుట.

ఉ. దేవ రపంపునన్ వరసతీతిలకం బగుసీతఁ దెచ్చితిం
గావున నీదుదర్శనము కాంతకు నీఁదగు వేడ్క నావుడున్
భూవరుఁ డంత దైన్యమును మోదముఁ గోపము నొంది జాతచిం
తావిలమానసుం డయి రయంబున జానకిఁ బిల్వఁ బంచినన్. 2322

సీ. దానవాధీశుండు జానకిఁ దోడ్తెచ్చు,నప్పుడు చలవేత్రహస్తుఁ డగుచు
సందడి జడియుచు నందంద దైత్యులఁ, గపుల నొక్కుమ్మడిఁ గడఁగి ప్రేయ
ఘూర్ణాయమానమహార్ణవఘోషంబు, ననుకరించుచు మహానినద మొదవ
విని కోసలేంద్రుండు కనుకని వీరలఁ, గలయ నొప్పింపంగ వలవ దుడుగు
వింత లెవ్వరు మన కిందు వీరి నీవు, భీమవేత్రాహతుల నడ్డపెట్ట నేల
కోరి విచ్చలవిడిఁ గనుగొండ్రు గాక, చూచునంతన యె గ్గేమి శుద్ధచరిత.

క. చీరలు దగుగృహములుఁ బ్రా,కారములును దగినతెరలుఁ గాపులు మఱి వే
నారీజనులకు సమ్యగు,దారం బగుచరిత మొందు దప్పింపంగన్. 2324

క. వ్యసనంబులఁ బరిణయముల, నసమము లగుసంగరముల యాగంబులఁ బ్రో
ల్లసదుత్సవముల మఱువులు, బిసరుహనయనలకు వలదు పృథులవిచారా.

వ. కావున నిది సంగ్రామంబు పరికించిన వ్యసనంబును నగు నింతియ కాదు విజయ
మహోత్సవంబు వర్తిల్లుచున్నయది విశేషించియు మత్సమీపంబునందు దూ

మణియుం బెద్దియు లేదు సానుజమిత్రుండ నగునన్నుం జూచుఁగాక తోడ్తెమ్మన
వుడుఁ దద్వచనానంతరంబ ముందట సతీజనశిరోభూషణం బగుభూనందనం
దెచ్చి నిలుప నియోగించిన. 2326

మ. ఇనసూనుండును వాయుపుత్రుఁడు ధరా।ధీశానుజుండుం బ్లవం
గనికాయంబులు రాముపల్కులు దదా।కారంబునుం జేష్టలుం
గని సత్వనిరపేక్షుఁడై యకట భూ।కాంతుండు చూడంగఁ గో
పనభావంబున నున్నవాఁ డని మదిం । భావించి చింతింపఁగన్. 2327

సీ. తొంగలిఱెప్పలఁ । దొంగలించుచు సిగ్గు, నునుఁజూడ్కి నడుగుల । నూలుకొనఁగ
నరిఁ గూడి తిరిగెడు । గరువతనంబున, నిలుకడమైఁ బెంపు । నెలకొనంగ
నుపవాసముల డస్సి । యున్నయాకొందిఁగ, నిలువరించెడులావు । వెలితిపడఁగఁ
బెద్దగాలమునకుఁ । బ్రియచంద్రుఁ గాంచుట, ఘనసమ్మదాంబుధి । గడలుకొనఁగ
దుఃఖ మనియెడుచెఱుపునఁ । దొరుఁగునలుఁగు
లనఁగఁ గన్నీరుధార లై । యతిశయిల్ల
బెరుఁగునడలునఁ దనముకుఁ । జెరమ లదరఁ
దనుతలోదరభావంబు । ఘనత నొంద. 2328

క. నయమార రామచంద్రో,దయము మనోజ్ఞత్వ మొంద । ధాత్రీతనయా
హ్వయచంద్రకాంతపుత్త్రిక, ప్రయతస్వేదాపదేశ । భరమునఁ గరఁగెన్. 2329

ఆ. అంత సీత యేడ్చె । నెంతయు నిట్లని, యడలు నిలుపలేక । యార్యపుత్త్ర
నిన్నుఁ బాయఁజేసె । నిన్నిదినంబులు, నాపురాకృతోగ్ర । పాపఫలము. 2330

ఆ. నృపతి తనదుమ్రోల । నిస్సహాఖేదంబు, నొంది యేడ్చుసీత । నుగ్రదృష్టిఁ
జూచి కెంపుపెంపు । చూడ్కుల మొలతేర, నిగ్రహోక్తిఁ బలికె । నాగ్రహమున.

క. అవమానవైరు లనియెడి, యవనిజములఁ బెఱికి వైచి । యభిమానమునం
దివిరితి దైవాఱించితి, భువనముల ననింద్యకీర్తి । భూమామృతమున్. 2332

ఉ. పౌరుషముం బ్రతాపమును । బాహుబలంబుఁ బ్రతిజ్ఞయుం బ్రియం
బార ఫలింపఁ జేసితి మదాంధనిశాచరమర్దనంబునం
గ్రూరత నిన్ను మున్ను చెఱ । గొం చరుదెంచినపంక్తికంధరుం
బోర వధింపఁ గంటిఁ బరి । పూర్ణమనోరథసిద్ధిఁ బొందితిన్. 2333

సీ. నీనిమిత్తంబుగ । వానరస్నేహంబు, వాలిఁ జంపుటయును । వాయుసుతుఁడు
నినుఁ జూడ వచ్చుట । యును బ్లవంగులఁ గూడి, సేతువు బంధించి । సింధునాథు
దాఁటుట నూరోనఁ । గమయున్నయుద్ధతి, నీవిభీషణుఁ డాశ్ర । యించుటయును
నితనికి నీలంక । యిచ్చెద ననుటయు, వెలయ నిప్పరిచుట్టు । విడియుటయును
వాలి దుర్జయుఁడై నరా । వణునిఁ జంపి, నెరయ నీచెఱ విడిపించు । కోఱికఁ జూపె
నేఁగృతార్థుండ నిక్కంబు । నేఁడు నాకుఁ, గోర్కు లేపార సఫలతఁ । గూడె నిపుడు.

క. మానం బరయఁగఁ బ్రాణస, మానము మానంబు నఖుఁడు ♦ మానమె ధనముం
మానము విడుచుటకంటెను, మానుగఁ బ్రాణములు విడువ ♦ మంచిది తలఁపన్.

క. ఆమానము గాచుటకయి, యీమానము లైనచెయ్వు ♦ లేపారంగా
నామహనీయతఁ దగ నిను, నే మగుడం దెచ్చు టెల్ల ♦ నింతియ కాదే. 2336

వ. కావున నీయందు నాకుఁ బరిగ్రహబుద్ధి లేదు పురుషునకుఁ బ్రతిజ్ఞాపరిపాలనంబ పరమధర్మంబు సుచరితతీర్థోదకంబులఁ దుర్యశఃపంకంబు గడిగి పరమయశస్సుకృతంబు గూడఁబెట్టుటయ పరమార్థంబు సుధాసాగరశుద్ధం బైనయిక్ష్వాకువంశంబునం బ్రభవించినరాజన్యులు గాంభీర్యౌదార్యౌన్నత్యాదిగుణంబులు పాటించి లోకాపవాదంబునకు నోడి పరిత్యాజ్యం బయినచోఁ దమశరీరంబు నయిన విడుతు రనినఁ దదితరంబు లెంత నీ విన్నిదినంబులు పరదారాభిమర్శకుం డగురావణునింట నుండుటం జేసి నాకు విడిపింప కుండుట లోకంబులయందు యశోలజ్జామానచ్యుతు లవుం గావున నీచందం బనుష్ఠింపవలసె నింతియ కాని నీవలన నాకు నెయ్యంబు లేదు ని న్నొల్ల నీవు వలసినచో నుండు మని మఱియు ని ట్లనియె. 2337

ఆ. ఇంతి వినుము పురుషుఁ ♦ డెట్టివాఁ డయినను, బరునియింట నున్న ♦ పడఁతి మగుడఁ
బ్రాకృతుండపోలెఁ ♦ జేకొన నేర్చునే, యింతకంటె నింద ♦ యెద్ది గలదు. 2338

క. ఘనతరసౌందర్యము గల, నినుఁ జూచి దశాననుండు ♦ నిశ్చలమతి యై
మనసిజరాగము నొందక, మనమున ధైర్యంబు గలిగి ♦ మనలునె చెపుమా.

తే. భరతలక్ష్మణశత్రుఘ్న ♦ తరణిసూను, వాలినంగదదానవ ♦ వరులలోన
నీమనంబున కెవ్వఁడో ♦ నెఱఁ బ్రియుండు, వానిఁ జేకొను మిప్పుడు ♦ వనిత యనిన.

సీ. క్షితిపాలుకోపలో ♦ హితదృష్టిపావక, భూరిశిఖాహతిఁ ♦ బొగిలి పొగిలి
రామునిష్ఠురవాక్య ♦ భీమాస్త్రములు లోన, వఱలఁ గాఁడిన బిట్టు ♦ వడఁకి వడఁకి
[1]కాంతానుచితనియో ♦ గవిషమహావ్యాప్తి, మూర్ఛిల్లి యెంతయు ♦ మునికి మునికి
నరలోకపాలక ♦ పరిహారపవనంబు, చేఁ దూలి పటురీతిఁ ♦ జెదరి చెదరి
తనశరీరంబులోనన ♦ తా నడంగు, కరణి దెస లేనివెరవున ♦ ధరణి సొచ్చు
పగిది స్రుక్కుచు నప్పటి ♦ పరమమోద, మెల్లఁ బోనాడి విన్నయై ♦ యొల్లఁబోయి.

చ. కడుకొని వేఁడిబాష్పములు ♦ గ్రమ్మి పయింబయిఁ బర్వ భీతయై
నదరుచు విన్నయైనహృద ♦ యంబునఁ బొల్పగుహారయష్టి ప
య్యెద దడియంగఁ గానఁబడి ♦ యంచితనిర్మలరత్నభూమలం
దదుచితదృశ్యమానమణి ♦ ధామసముజ్జ్వలభాతి దోఁపఁగన్. 2342

వ. గద్గదస్వరంబు గదుర ని ట్లనియె. 2343

మ. తగునే న న్నిటులాడ నీకు ననవ ♦ ద్యుం బై సద్వర్తనా

1. కాంతానుచితయోగ ♦ గరళమహావ్యాప్తి.

దిగుణౌఘంబుల శుద్ధి నా నెఱుఁగవే § తెంపాడ యుక్తంబె సా
రగరిష్ఠుండవు నీవు దుశ్శ్రవవిచా§రవ్యక్తిదూరీకృతం
బగువాక్యంబుల నొంప నేల యకటా § యన్యాయనంసక్తనే. 2344
చ. అనయము ధాత్రికిం దనయ § నై యెలమిన్ మిథిలేశుఁ డైనయ
జ్జనకుఁడు పెంపఁగాఁ బెరిఁగి § సమ్మద మందఁగ నీకుఁ బత్ని నై
యినకులుఁ డైనయాదశర§థేశ్వరుకోడల నైననాకు ని
ట్లనుచితపాపకృత్యముల§యందుల వేడ్కలు గల్గనేర్చునే. 2345
ఆ. నృపకులాగ్రగణ్య § నీవు బాలుఁడ వైన, నాఁడు బాల నైన§నాకరంబుఁ
బట్టినాఁడ [1]వదియుఁ § బాటిసేయవు దీని, కగ్నిసాక్షి యగుట § యరయఁదగదె.
మ. మదధీనం బగుజీవితంబును మనో§మానానురాగంబులుం
ద్వదధీనంబులు సేసి యన్యజనచిం§తాదూర నై తావకా
భ్యుదయం బెప్పుడుఁ గోరుచుండ నిట నీ § వుగ్రంబుగాఁ బల్క వ్ర
య్యదు కంటే హృదయంబు వజ్రకఠినం § బై యున్న దిప్పట్టునన్. 2347
తే. పాపరతుఁ డైన దైత్యుచేఁ § బట్టువడిన
యపుడు లంకాపురంబులో § నడఁచునపుడు
పరమదుర్భాషణంబులు § పలుకునపుడు
జనకులాధీశవర నాకుఁ § జావ తగవు. 2348
చ. పురుషులు నమ్మ రేనిఁ గమ§పొల్తులచేష్టితచిత్తవర్తనం
బరయుట దప్పు గాదు మను§జాధిప యుక్తమ కాన నీ వొగిం
బరుసనిపల్కు పల్క వినఁ § బా లయితిన్ సభలోన నక్కటా
శరములఁ బోలువాక్యములు § సైఁతురటే సతు లింత కోర్తురే. 2349
చ. నరవర నీవు చిత్తమున § నమ్మనివాఁడవ యేని మున్న న
న్నరయఁగ మారుతాత్మభవు § నంపినయప్పుడ నీతలంపుచొ
ప్పరుదుగ నాకు నేర్పడఁగ § నాతనిచే నెఱిఁగింతు వేని నే
నెరియుచుఁ బ్రాణముల్ విడుతు § నిప్పుడు నన్నిటు లాడఁగూడునే. 2350
వ. అని లక్ష్మణు నవలోకించి యేడ్చుచు ని ట్లనియె. 2351
ఉ. లక్ష్మణ చూచితే యనఘ§లక్షణలక్షిత నైననన్ను దు
ర్లక్ష్మచరిత్రఁ బోలె విక§లస్థితిగా భవదగ్రజుండు దా
సూక్ష్మనిశాత మైనమతిఁ § జూడక ఘోరవచోమహాగరు
త్పక్ష్మలితేక్షణాస్త్రముల§పాల్పడఁ జేయుచు నున్నవాఁ డొగిన్. 2352
సీ. పరవృత్తచేష్టిత§భావేంగితంబులు, సూచి తెలియు దీవు § శుద్ధచరిత
యౌదార్యగంభీర§తౌన్నత్యధైర్యాది,గుణముల నెంతయుఁ § గొమరుమిగిలి

1. నదియు పాటిసేయుము దీని.

యాగమలౌకికవ్యవహారములయందు, నరయ నీ వెఱుఁగనియదియుఁ గలదె
నను నీవు దగఁ జిన్ననాఁటనుండియుఁ జూచు, చుండుదు విట యెగ్గులున్న వయ్య
యొగి మహీపతి యప్పటనుండి పలుకు, ననుచితంబులు మాన్పంగ ననువులేదె
పరుషదుశ్శ్రవభీషణభాషణములు, నీవు దయ మాలి విన నెట్లు నేర్చితయ్య.

క. మీ రింత నమ్మకున్నను, గారవ మేపార నన్నుఁ గరుణించి మహో
దారం బగుసొదఁ బెటుఁడు, ధీరమతిం జొత్తు నందుఁ దిర మగుకడఁకన్.

— సీత యగ్నిప్రవేశము చేయుట. —

చ. కలఁగక జాతవేదసుముఖంబున నెంతయు శుద్ధురాల నై
నలువయు శూలియుఁ హరియు నన్ను వెసం గొనియాడునట్లుగాఁ
జొలవక మీరు మెచ్చుగతిఁ జొచ్చెదఁ జిచ్చు మదీయభర్తక
న్నల వగునంతమీఁద శుభశీలత ధారుణి నాశ్రయించెదన్. 2355

మ. అనినం దల్లడ మంది లక్ష్మణుఁడు దైన్యాయత్తచేతస్కుఁడై
తనలోనం దలపోసి ఖేద మొదవన్ ధాత్రీపతిం జూచి య
జ్జనపాలాగ్రణి సన్నచేసిన నుదంచద్వేగ మేపార నే
చినమంటల్ మొగి మిన్నుముట్ట సొదపేర్చెన్ సీతి మోదింపఁగాన్. 2356

తే. పరమపావని యగుసీత పరఁగ నేఁడు, చెలఁగి నాయందుఁ జొచ్చుటఁ జేసి మిగుల
ననఘుశీలుండ నయ్యెద నని ముఁగంబుఁ, బొందుకై వడి మిన్నంది పొదలె నగ్ని.

వ. తదనంతరంబ. 2358

క. తల వాంచియున్న భాస్కర, కులపతికిఁ బ్రదక్షిణించి గుణతరకీలా
కుల మగుసొద చేరంగా, సలలితగతి నేఁగుదెంచి జానకి యంతన్. 2359

చ. వినయముతోడ మ్రొక్కి యరవిందనిభానన వేడ్క వీతిహో
త్రునకుఁ బ్రదక్షిణంబు సనుదెంచి కృతాంజలి యై త్రిలోకపా
వన గతసర్వభావన నివారితకల్మష సర్వనిర్జరా
నన సకలక్రియాధికరణప్రవణాభినివేశ పావకా. 2360

చ. స్థిరమతులార దోసకలదిక్పతులార సురేంద్రులార కి
న్నరవరులార సర్పకులనాయకులార మునీంద్రులార ఖే
చరవరులార యక్షగణచారణగుహ్యకసాధ్యులార వి
స్ఫురదినచంద్రులార వరభూతములార యెఱింగి యుండుఁడా. 2361

క. మీ రిందఱుఁ [1]దగుకరిగాఁ, గోరుచు నే నున్నదాన గురుహితమతి నా
చారిత్రం బేచందం, బేరూపము దాని మీర లెఱుఁగుదు రరయన్. 2362

వ. కావున వాఙ్మనఃకాయకర్మబుద్ధీంద్రియతదర్థంబులం జేసి నిమేషకాష్ఠాకళాక్షణ
ముహూర్త యామ సంధ్యాహోరాత్రపక్ష మాసర్త్వయన వత్సరపరిగణితంబు

1. 'దగుగుతిగా' అనియే వ్రా.ప్ర.

లగుకాలంబులు సాక్షిగా స్వప్నాద్యవస్థలయందును జ్ఞానాజ్ఞానంబులయందును మద్వల్లభుం డగురఘునాథునకుం దప్పుట లేదు. 2363

క. చాయగతి నాదుచిత్తము, పాయక రఘునాథునంద ♦ పరఁగున యేనిన్
న్యాయము దప్పక దహనుఁడు, ధీయుక్తిన్ నన్నుఁ గాచు ♦ ధృతియొడఁగూడన్.

తే. దుష్టకల్మషబుద్ధినై ♦ దోషమునను, జనకులాధీశునకుఁ దప్పి ♦ సచ్చరిత్ర
మొదలి నడుచుట గలిగిన ♦ నీక్షణంబ, చెలఁగి నను నగ్ని భస్మంబు ♦ సేయుఁగాత.

మ. అనుచున్ నిశ్చలచిత్తయై రఘుకులేంద్రాయత్తచింతావశం
బునఁ దాత్పర్యము గల్గి నిర్మలలసద్బుద్ధిప్రసాదంబు పెం
పున నభ్రంకషకీలుఁడై కనలుచున్ భూరిప్రభుండైన య
య్యనలుం డుప్పతిలంగఁ జొచ్చె నిరపాయస్నేహరాగంబునన్. 2366

ఆ. అనఘమంత్రపూత ♦ మైనయాజ్యాహుతి,పగిది ధరణిపుత్రి ♦ పడియె నంతఁ
దేజ మెసఁగ నగ్ని ♦ దేవుండు మిన్నంది, మహితశిఖలు గలిగి ♦ మండఁ జొచ్చె.

ఉ. లోలవిలాసఖేలనవి ♦ లోచనమీనము లాననాబ్జమున్
లాలితబాహువల్లరిమృ ♦ ణాళములుం బృథుకేశభారశై
వాలము నొప్ప సీత యన ♦ వద్యపవిత్రచరిత్రవిస్ఫుర
చ్ఛీల కృశానునందు సర ♦ సీగతిఁ జూడఁగ నొప్పె నంతయున్. 2368

చ. పవడపురాశిలోనినవ ♦ భర్మశలాకయుఁబోలెఁ జారుప
ల్లవములకుప్పలోఁ నిడిన ♦ లాలితచంపకదామమట్లు ర
క్తవనజరాజిహంసి యనఁ ♦ గా నగణాభ్రములోన నున్నయా
నవశశిరేఖఁబోలె దహ ♦ నస్థిత [1]యయ్యె విదేహకన్య దాన్. 2369

వ. అప్పుడు పతివ్రతాశిరోమణి యగుసీత దహనశిఖావృతయై యున్నం గనుంగొని దానవాంగనలు శోకింప నిశాచరులు దుఃఖింపఁ గపులు సమాక్రందనంబులు సేయ సుగ్రీవుండు బెగ్గిల విభీషణుండు పారవశ్యంబు నొంద నంగదుండు విన్నఁదనంబు నెంద హనుమంతుండు ఖేదింప లక్ష్మణుండు వగలం బొగుల రాఘవుం డవాఙ్ముఖుండై నిర్వేదింప సుర లనుచితం బన సాధ్యు లన్యాయం బన యక్షు లనుపేక్షణీయం బన గంధర్వు లద్భుతం బన మహోరగంబులు తగ దనఁ జరాచరంబులు దృశ్యాదృశ్యంబులు నగుభూతంబులు దల్లడిల్ల మహాభూతంబు లాక్రోశింప నక్కోలాహలంబు లొక్కపెట్ట నొదవిన. 2370

సీ. ప్రమథులు సనుదేర ♦ బాలేందుధరుఁడైన, మూఁడుగన్నులవేల్పు ♦ మున్నుగాఁగ
జగముల సృజియింపఁ ♦ జాలి యాద్యుండైన, చతురాస్యుఁ డగుపద్మ ♦ సంభవుండు
గమనీయవికసిత ♦ కమలపత్రము లన, వేయికన్నులు గల ♦ వేల్పుఱేఁడు
వహ్ని కాలాసుర ♦ వరుణానిలశ్రీద, శూలహస్తులుఁ గూడి ♦ సురుచిరముగ

1. రాయె మిథిలేంద్రకన్య దాన్.

గరుడసిద్ధసాధ్యగంధర్వఖేచర, యక్షపక్షినాగయాతుధాను
లాదిగాఁగఁ బుష్పకారూఢు లయి రాము, ధీరుఁ జూడ నేఁగుదెంచి రెలమి.

క. అత్యాదరమున రాముఁడు, ప్రత్యుత్థానంబు సేసి భక్తి యెసఁగ స
న్నత్యాదివిధు లొనర్చెం, బ్రీత్యుత్కర్షాతిరేకబృంహితతనుఁ డై. 2372

వ. తదనంతరంబ. 2373

క. అంభోవాహంబులు నిఖిలాంభోధులుఁ గూడి మ్రోయుననువునఁ బృథుసం
రంభమున లోకపాలురు, గంభీరార్థముల ననిరి కాకుత్స్థునకున్. 2374

—✤ ఇంద్రాదిదేవతలు రాముని స్తుతించుట. ✤—

శా. నీతత్త్వం బెఱుఁగం దలంపఁ దగ వర్ణింపంగ శక్యంబె మా
చేతఃపద్మగృహంబులన్ మెఱఁగి యక్షీణానుభావంబునన్
భూతాదిప్రకృతిప్రపంచరచనాభూమవ్యవస్థానసం
జాతప్రాభవ మగ్గి యుండుదువు చంచద్విభ్రమాదభ్రతన్. 2375

శా. వేదాంతంబులయందు నీ వొకఁడ వై వేద్యస్థితిం బొంది లో
కాదిత్వంబున నొప్పి సంసృతిపదార్థయత్తాతిదూరుండ వై
రోదోంతంబు సమాక్రమించి గురుచిద్రూపంబు నీ వై బహు
ప్రాదుర్భావము నొంది యుండుదువు శుంభత్ప్రాభవస్ఫూర్తి వై. 2376

వ. స్థూలసూక్ష్మగురులఘుకఠినమృదువ్యక్తావ్యక్తరూపారూప గుణాగుణ సన్నాసన్న
సరసనీరసతత్త్వాదిరూపంబులు నీవ కాక యన్యథాభావం బెఱుంగ మవి నిర్వర్తక
ప్రవర్తనం బై విలసించు. 2377

తే. నీవు నారాయణుండవు నీరజాక్ష, శంఖచక్రగదాశార్ఙ్గశాలి నీవ
యేకశృంగవరాహంబ నీవ దేవ, యక్షరం బగు బ్రహ్మంబు నరయ నీవ.

తే. నీవు విశ్వంబులోపల నరయఁ గలవు, తలఁప విశ్వంబు నీయందు నిలిచియుండు
వెలయ విశ్వంబునకు నీకు వేఱు గల దె, నిజము సర్వంబుఁ దలఁపంగ నీవ కావె.

సీ. అరయ రూపనామాదిభేదంబుల, విశ్వంబునం దెల్ల వెలయు దీవు
కావున నిట నీవు కానిది యెద్ది యీ, కమలసంభవసృష్టిఁ గలదు దాని
నే మెఱుంగుట లేదు నీ వాదిమూర్తివి, నీనిజరూపంబు నిక్కవముగఁ
దెలియ నెవ్వఁడు చాలు దృష్టిగోచరుఁడవు, కాకుండియును నెప్డుఁ గలవు నిన్నుఁ
దలఁచునాతండు పుణ్యుండు ధన్యతముఁడు
నొగి నుతించినయాతండు యోగ్యతముఁడు
వెలయఁ బొడగన్నయాతఁడు విదితయశుఁడు
సకలలోకంబులకు నెల్ల సాక్షి నీవ. 2380

వ. భూమ్యాదిలోకంబులును సప్తసాగరంబులును సప్తద్వీపంబులు నుపద్వీపంబు
లుఁ బృథివ్యాదిభూతంబులును మేరుహిమవదాదిమహాగిరులును గాలదిశాజాహ్న

దీప్రముఖపుణ్యనదులును మానసాదిసరోవరంబులును నందనచైత్రరథాదినా
నావనంబులును మృగపక్షిసరీసృపతిర్యగ్జాతిసత్త్వంబులును మనుప్రభృతిరాజ
లోకంబులును నారదాదిదివ్యతపోధనులును మహేంద్రాదిదిక్పతులును జిత్రసే
నాదిగంధర్వులును మాణిభద్రాదియక్షులును శేషవాసుకిప్రముఖనాగకులం
బును హిరణ్యకశిపుప్రముఖదైత్యకులంబును ద్వాదశభాస్కరులు నేకాదశ
రుద్రులు నష్టవసువులు నశ్వులును నక్షత్రగ్రహతారకాగణంబులును బితృదే
వతలును నిమేషాదికాలంబులును యుగమహాయుగకల్పంబులును మంత్రతం
త్రంబులును యజ్ఞాంగంబులును నాగమంబులును శాస్త్రంబులు నేకాద్యనేక
సంఖ్యలును మఱియు నవ్యంబులు ననంతకోటిబ్రహ్మాండంబులు నీకుక్షియం
దడంగియుండు నీ వెంత గలవో యట్టినీవు యమనియమాద్యష్టాంగయోగ
పరాయణు లగుపరమయోగీంద్రులమనంబుల వర్తింతువు భవదీయం బగుమా
యాప్రపంచంబున మోసపోయి కాదె యనిత్యంబులుఁ దాత్కాలికసుఖలే
శాభాసకంబులును సకలదుఃఖైకాయతనంబులును నిరయైకహేతువులు నగు
సాంసారికబంధంబులం దగులువడి మానవులు విఱుగడ లేకున్నవా రవిద్యాప
రాధీనులై యున్నవారలకు నీపరతత్త్వం బెఱుంగం బోలున రాగాదిరసానుప్ర
వేశ [1]దృఢీకృతం బగు నజ్ఞానగ్రంథి వదల్ప నేరక వివిధజన్మాదుల నొందుచుఁ
[2]దదీయక్లేశంబు లనుభవించుచున్నవారు ని న్నెఱుంగునతఁడు నిన్ను ముట్టు
వాఁడు నీయంతవాఁడ యగు నిన్ను నిట్టివాఁ డని వర్ణింపఁ దరంబు గాదు. 2381

మ. భువనంబుల్ మనుపంగఁ బూని సుమనఃపూగంబులం గావఁగా
రవివంశోత్తముఁ డైనయాదశరథేంద్రక్ష్మావధూభర్తకుం
బ్రవరానందము గల్గ నందనుఁడ వై భాసిల్లునారాయణుం
డవు నీ వారయ మర్త్యమాత్రుఁడవె యూథప్రాభవా రాఘవా. 2382

శా. పాతివ్రత్యగుణంబు సుస్థిరమతిం బాటించి కళ్యాణస
చ్చేతోవృత్తిఁ దనర్చి లక్షణములం జెల్వొంది శుద్ధక్రియో
పేతప్రక్రియ యైనజానకి భవత్ప్రేమానురూపంబుగాఁ
బ్రీతిం బుట్టినయాదిలక్ష్మి దలఁపం బృథ్వీతలాధీశ్వరా. 2383

చ. అకట యుపేక్ష సేయఁ దగునయ్య రఘూద్వహ మందుచున్నపా
వకమునఁ దత్సతీత్వగుణవైభవ మొప్పఁగ నుండునట్టిజా
నకి నిటు చూచుచుండఁ దగునా పిలిపింపఁగదయ్య సాధ్వి నా
రక చెడనాడ నేల యనురాగదయామృతదృష్టిఁ జూడవే. 2384

క. వనజేక్షణ నారాయణ, నిను నీ విట మఱవఁదగునె నిర్దయమతి వై
జనకసుత నుపేక్షింతురె, మనుజేశ్వర మమ్ము నెలమి మన్నింపఁగదే. 2385

1. దృఢీకృతం బగునజ్ఞానగ్రంథి గదల్ప. 2. దదీయక్లేశంబు లనుభవించువారు.

మ. అని యావేలుపు లిట్లు పల్క మదిలో § నత్యంతమున్ సంతసి
ల్లి నరేంద్రుండు సమంచితాదరసమా § లీఢాశయుం డై లస
ద్వినయానమ్రశిరస్కుఁ డై దశనకాం § తిజ్యోత్స్నలన్ దేవచి
త్తనవీనోత్పలసంచయంబులు ప్రమో § దం బందఁగా నిట్లనున్. 2386

క. మీరు ననుఁ బెక్కుభంగుల, నారాయణుఁ డనఁగ వలదు § నరుఁ డనఁ దగు నే
నారయ దశరథరాముఁడ, నీరేరుహాలోచనుండ § నే తలపోయన్. 2387

వ. అని పలికిన. 2388

ఆ. అనఘుఁ డైన దశర § థాత్మజువచనంబు, విని మనంబులోన § వేడ్క నిగుడ
వనజసంభవుండు § వసుమతీపతికి ని, ట్లనియె సాంత్వవినతు § లమరునట్లు.

— బ్రహ్మ రాముని స్తోత్రము సేయుట. —

తే. వేయిగన్నులు వెలుఁగంగ § వేయిదలలు, వేయిచరణంబు లింపార § వివిధరూప
ధరుఁడవై యుండు దచ్యుత § సరసిజాక్ష, శార్ఙ్గచక్రగదాధర § జలజనాథ.

సీ. నే నీదుహృదయంబు § నీజిహ్వ భారతి, నీరోమకూపముల్ § నిర్జరాలి
నీనిమేషము రాత్రి § నీనమున్మేషంబు, దివము నీపలుకులు § దెలియ శ్రుతులు
నీసముచ్ఛ్వాస మ § నిలము నీకన్నులు, ప్రాలేయభానుండు § భాస్కరుండు
నీరోష మనలుండు § నీప్రసాదము సుధాం, భోరాశి నీపదం § బులు ధరిత్రి
నీశిరంబు నభము § నీమహాస్తంబులు, దెసలు నీదుమూర్తి § త్రిభువనములు
లోకమయుఁడ వీవు § లోకాధిపతి వీవు, లోకనుతుఁడ వీవు § లోకభరిత.

సీ. మేదినీశ్వర మున్ను § మీనంబ వై నీవు, వెదకి తెచ్చితివయ్య § వేదసమితిఁ
గాకుత్స్థకులదీప § కమఠంబు నీ వయి, యమృత మిచ్చితి వేడ్క § నమరతతికి
క్షితిభృదుత్తమ నీవు § కిటిరూపధరుఁడ వై, ధరణి యెత్తితి సము § ద్దామశక్తి
నరవరాధిప నీవు § నరసింహమూర్తి వై, రాక్షసోరస్స్థలి § వ్రచ్చితయ్య
వామనత్వంబు ధరియించి § వఱలి నీవు
ముజ్జగంబులు చేకొంటి § మూఁడడుగులఁ
బరశురాముఁడ వై భూమి § పతుల నెల్ల
నరవి ముయ్యేడుమాఱులు § చంపితయ్య. 2392

క. ఆనీవు జగద్ధితముగ, మానుష వేషంబు దాల్చి § మహిమోన్నతి మై
మానుగ దశముఖుఁ జంపితి, దానవసేనావిరామ § దశరథరామా. 2393

క. రాఘవ నీబలవీర్య, శ్లాఘావిక్రమవిశేష § సందర్శనముల్
మోఘములు గావు ఘనవిభ, వౌఘములకు నాస్పదంబు § లుర్వీనాథా. 2394

వ. అనునయ్యవసరంబున విశ్వమయుండును విశ్వైకసాక్షియు విశ్వపావనుండును
నగువైశ్వానరుండు సముత్తాలాభీలజ్వాలావలీదహ్యమానంబు లగునింధనంబు

బులు పాయఁ ద్రోచి యస్వేదబిందుజాలాంచితయు నమ్లానవదనపంకజయు న
క్లిష్టతనువల్లికయు నతాంతలతాంతమాలికయు ననవసన్నాంగరాగయు ననాహ
తదుకూలయు ననిర్ధూతకేశకలాపయు నకంపమూర్తియు నవిచ్ఛిన్నహారా
ద్యలంకారయు నవిపాయానసూయాదత్తపుణ్యాంగరాగగంధబంధురమూర్తి
యు నై తొంటిక్రియ నున్నం గనుంగొని కపులు నసురులును సబాష్పనయను
లై నృపతి కిప్పురంధ్రీరత్నంబు నిన్నియెగు లాడం దగ దన వసుమతీదుహిత
యగుసీతను రఘునాథుసన్నికర్షంబునకు నెత్తికొని తెచ్చి ముందఱ నిల్పి యి
ట్లనియె. 2395

—•• అగ్నిదేవుఁడు సీతమహత్త్వము చెప్పి రామున కొప్పించుట. ••—

చ. రఘుకులదుగ్ధవారినిధి§రాజ భవత్సతి దూషితక్రియా
లఘుచరితానుషక్తిమెయి § లౌల్యము దాల్చి చరింప నేర్చునే
యఘములు జానకిం దలఁచి§నంతనె నాశము నొందు నీకు ని
ట్లు ఘనతరాగ్రహంబునఁ గ§డుం జెడ నాడుటఁ జూడ యుక్తమే. 2396

క. పసచెడవు మేనిమెఱుఁగులు, గసుగందవు క్రొవ్విరులును § గనుఁగవ ధూమ
ప్రసరమున నెఱ్ఱఁబాఱదు, వెసఁ దలచీరయును నల్ల § వెలయుటఁ గంటే.

ఉ. దైవము ప్రాణమిత్త్రుఁడును § దాత సఖుండును జీవితార్థముల్
నీవుగ వాఙ్మనఃకరణ§నిశ్చయబుద్ధిశరీరదృష్టిసం
భావితవృత్తి నేమఱక § పన్నుగ నిన్నె తలంచు నన్యదు
ర్భావన లేదు భూమిసుత § భవ్యచరిత్రపవిత్ర భూవరా. 2398

చ. చపలాత్ముం డగుదానవాధిపతియా§జ్ఞన్ వచ్చి నక్తంచరుల్
కృప యొక్కింతయు లేక యుగ్రగతి జం§కింపంగ నోలిం బ్రలో
భవువాక్యంబులు పల్కి బిట్టు వెఱపిం§పన్ నొవ్వఁగా నాడినన్
విపులస్వాంతమునం గలంగఁబడ దు§ర్వీకన్య రాజోత్తమా. 2399

క. శుచి నై జగములకుఁ బరమ,శుచిత్వ మొనరించు నే వ§సుమతీతనయా
రచితప్రవేశమునఁ గడు,శుచి నైతిఁ గృతార్థభావ§సుభగుఁడ నైతిన్. 2400

సీ. మందారభూజంబు § మఱగినభృంగికి, బిచుమందశాఖపైఁ § బ్రేమ గలదె
లలి మానసంబున § మెలఁగెడుహంసికి, వెలయఁ బల్వలముపై § వేడ్క గలదె
మలయద్రుమంబున § మలయుభుజంగికి, బర్బూరతరువుపై § [1]వలవు గలదె
భాస్కరోదయమున § భాసిల్లుపద్మిని, కిందుకరస్పృష్టి § నెలమి గలదె
రాజితానేకసద్గుణా§రామ రామ, ధర్మపాలనపరమ నీ§ధర్మపత్ని
యైనసాధ్వికి సీతకు § నన్యునందుఁ, గూర్మి యేచందమున సమ§కూడునయ్య.

ఉ. కావున నీవు నాపలుకుఁ § గైకొనఁగాఁ దగుఁ గాదు నాక సం

1. ( బరవు గలదె.

భావనతోడ సచ్చరితǂభాసుర మైనమహీసుతన్ దిగీ
శావలి సంతసిల్లఁగఁ బ్రిǂయంబొదవంగఁ బరిగ్రహింపు రా
జీవహితాన్వయాభరణ ǂ సింధుగభీర గుణైకభూషణా. 2402

వ. అని సీత నొప్పించి విన్నవించిన. 2403

క. ఆపావకువచనంబులు, భూపాలకమౌళి విని ప్రǂభూతస్ఫుటచిం
తాపరుఁడై తనయాత్మ ని,రూపించుచు నట నిరుత్తǂరుండై యెలమిన్.

వ. ఒక్కింత విచారించి హిరణ్యగర్భవిరూపాక్షులుం బురుహూతప్రముఖదిక్పతులును గంధర్వయక్షోరగాదులును మునులును వినుచుండ దశనచ్ఛవివ్యాజంబునం దనయశంబు సకలహరిదంతరాళంబులు నిండ ధీరధారాధరోదారనాదంబున సందర్శనాగతస్కందమయూరంబు మత్తకలాపంబై యద్భుతనర్తనం బొనరింప నిట్లనియె. 2405

చ. సురనదివోలె భూమిసుత ǂ శుద్ధమనోజ్ఞచరిత్ర శీలబం
ధురతరచిత్త దా నెఱుఁగుǂదుర్ భయభక్తులు గల్గి నాయెడం
దిర మగుకూర్మి నెంతయుఁ బ్రǂతీత్యయ కావున నీమృగాక్షియం
దరసిన లేదు దోషము సǂదాదరణీయగుణాఢ్య యెల్లెడన్. 2406

క. నలకూబరుశాపంబున, బలిమిమెయిన్ రావణునకుఁ ǂ బరకాంతల ని
మ్ములఁ గవయరామి యెఱుఁగుదుఁ, గలచి పతివ్రతలఁ జేరఁǂగాఁదర మగునే.

చ. జలజిని శీతభానురుచిǂసంగతిచే వికసింపనేర్చునే
వెలయఁగ నాకుముద్వతి రǂవిద్యుతివేఁడిమి నుల్లసిల్లునే
నెలకొని పాఱునిర్ఝరిణి ǂ నీరధిఁ జేద్పడి పాసిపోవునే
నిలుకడ తప్పి సీత యతిǂనీచవృత్తికి వేడ్క సేయునే. 2408

చ. ఘనతరదోషుఁడై సదశǂకంఠుఁడు దాఁ గొనిపోయి జానకిం
దనవనభూమిలో నిలుపఁ ǂ దద్దయుఁ గాముకుభంగి రాఘవుం
డనుచితవృత్తిఁ దెచ్చె ననǂయం బపకీర్తికి నోడఁ [1]డన్మహీ
జనులమహాపవాదమును ǂ సైఁపక చేసితి నింత యుత్తటిన్. 2409

శా. సందేహంబులు మాని నన్నియు మనǂస్సంతాపముం దీఱె నా
నందానూనపయోధి వెల్లివిరిసెన్ ǂ నాకోర్కి సేకూరె భూ
నిందావాదము లెల్లఁ బాసె మదియున్ ǂ నిశ్చింతభావస్థితిం
బొందెన్ సంస్తవనీయకీర్తి నయితిం ǂ బుణ్యాతిరేకంబునన్. 2410

మ. భవదాజ్ఞామహిమాతిభూతి నెలమిం ǂ బాటించి నే జానకిం
బ్రవరప్రీతిఁ బరిగ్రహించితిఁ గృపాǂపర్యాప్తసత్కాంతి న
త్యవదాతం బగుచూడ్కి నాదెసఁ బ్రిǂయం బారంగ నూల్కొల్పి గా

1. డంచు భూజనుల.

రవ మొందం గరణీయ మేది నయ మా।రం జెప్పఁడా చేసెదన్. 2411

—❀ శివుఁడు రాముని స్తుతించుట. ❀—

వ. అనిన. 2412

ఆ. రాజతాచలైక । రాజితనిలయుండు, రాజరాజసఖుఁడు । రాజమౌళి
రాజమౌళి యైన । రాజీవహితవంశ, రాజమాన్యుఁ డైన । రాముఁ బలికె. 2413

క. నీకు సరి గలరె రాఘవ, లోకపరిత్రాణభరణ । లోలుఁడవు పర
శ్లోకచరిత్రుఁడవు సురా, నీకభయాపహృతిమాన । నీయుఁడ వెందున్. 2414

చ. సురలకు గుండెతల్లడము । [1]శూరులడెందములోనికొఱ్ఱు ఖే
చరతతికంటిలో[2]నలుసు । సాధ్యులకొంగున నున్నచిచ్చు భూ
సురులకు నెల్లనాఁడు మెడఁ । జుట్టినపాము మునీంద్రకోటిపైఁ
బోరిఁ బడ నున్నయాపిడుగుఁ । బొల్పఱఁ జేసితి వీవు రాఘవా. 2415

వ. కుంభకర్ణమేఘనాదాతికాయమహాకాయాదు లగుమహాసురుల [3]నసంఖ్యేయు ల నజేయులం దెగటార్చి ప్రాజ్యం బగుస్వారాజ్యంబు నిష్కంటకంబు గావించి సకలభువనంబులు నిరాతంకంబులుగాఁ బావనంబులు సేసితి వింక నీవు కృతకృత్యుండవు కరణీయవిశేషం బెద్దియు లే దయినను జేయవలయునది యెయ్యది యనిన భవజ్జనని యైనకల్యాగుణసాకల్య యగుకౌసల్యయు నీకుఁ బరమభక్తుండు ననురక్తుండును శుభచరితుండు నగుభరతుండు నాతనిజనయిత్రి యైనకేకయరాజపుత్త్రియు భవద్వనవాసైకసహచరుండును రణాగ్రచరుండును నగులక్ష్మణుతల్లి పోషితమిత్త్ర యైనసుమిత్త్రయు వీరశత్త్రుఘ్నుం డగుశత్త్రుఘ్నుండు నితరబంధువర్గంబులు నీదర్శనంబుఁ బ్రతీక్షించుచున్నవారు గావునం బరాయోధ్య యగునయోధ్య కరిగి వారల యథాక్రమంబున సంభావించి సకలప్రధానప్రజానురంజనంబుగా రాజ్యంబుసేయుచు హయమేధముఖంబు లగుమఖంబు లనేకంబులు నిర్వర్తించి సముచితదక్షిణాప్రదానంబుల మహీసురులం దనిపి సుఖంబు లనుభవింపు మని మఱియు ని ట్లనియె. 2416

క. నీజనకుఁడు దశరథుఁ డదె, నీజయమున కాత్మ మెచ్చి । నిర్జరతతిచేఁ
బూజితుఁ డై వరపుష్పక, రాజితుఁ డై వచ్చినాఁడు । రాఘవ కంటే. 2417

క. ముదమున సావరజుఁడ వై, మది నుల్లాసంబు నిగుడ । మహితస్థితి న
భ్యుదయమ్ము నెదుర్కొనుగతి, సదయుని దశరథునిఁ గనుము । సదమలచరితా.

క. అనినన్ భక్తిముదంబులు, పెనఁగొనఁ బులకించి మించి । పెరిఁగినకడఁకన్
జనవిభుఁడు సానుజుం డై, జనకునకు నమస్కరించె । సంభ్రమలీలన్. 2419

వ. నందనద్వయంబును దనకుఁ బ్రణామం బాచరించినం దిగిచి గ్రుచ్చి కౌఁగిటం

---

1, 'సూరులడెందము' ఆ. ప్ర. 2. కసవు. 3. 'అజేయుల' ననియే శబ్దార్థమునఁ గవి ప్రయోగించియున్నాఁడు.

చేర్చి మూర్ధఘ్రాణంబు సేసి పుత్రస్పర్శముఖావలోకనసుఖంబు సురలోకసు
ఖాతిశాయిగాఁ దలంచుచు ని ట్లనియె. 2420

సీ. త్రైలోక్యరక్షణ§దక్షు మహాప్రాజ్ఞు, శూరధురంధరు § శుభచరిత్రు
నిన్నుఁ బట్టముగట్ట § నెఱియ నాయిత మయ్యుఁ, బాపపుఁగైకేయి§పలుకు లట్లు
విని కాననమునకు § వేవేగ పంపితిఁ, గీడ్పాటుమై వివే§కింప నైతి
రాజవై సుఖలీల § రాజ్యంబు సేయంగ, హీనపుణ్యత జూడఁ § గాననైతి
నాకవాసి నయిన§నన్ను నీశోకాగ్ని, కడఁగి యెల్లప్రొద్దుఁ § గ్రాఁచుచుండు
వెరవిఁడితనమునకుఁ § బురపురఁ బొక్కుదు, స్త్రీపరత్వమునకు § సిగ్గువడుదు.

క. నీముఖసందర్శనమున, నామది వగ లెల్లఁ బాసె § నరనుతగుణ నిన్
రామ యని పిలుచుభాగ్యం, బీమహి లేదయ్యె నాకు § నినసమతేజా. 2422

ఉ. మంజుగుణాధివాస పర§మప్రియశుద్ధచరిత్రతోఁ బ్రజా
రంజనతత్పరుండ వయి § రక్షణశిక్షణదక్షతన్ ద్విష
ద్భంజనకృత్య మేమఱక § బాహ్యవిపక్షజయంబు గల్గి యి
క్ష్వాకుజహితాన్వయంబు సవి§కాసముగాఁ బ్రభవింపఁజేయుమీ. 2423

వ. అని తనమ్రోల ముకుళితకరకమలుం డయి యున్నసుమిత్రాపుత్రునిం జూచి
యి ట్లనియె. 2424

ఉ. రామునిఁ గొల్చి నీ విటు ల§రణ్యములందుఁ జరించి విక్రమ
శ్రీమహనీయకీర్తి విల§సిల్లితి నీ విటమీఁద నెంతయుం
బ్రేమము భీతియుం గలిగి § పెంపుగ నన్నకు భక్తి సేయుమీ
యీమహితాత్ముఁ డారయ మ§హీపతిమాత్రుఁడు గాఁడు పుత్రకా. 2425

వ. అని పలికి తనకు మ్రొక్కి లజ్జాత్రాసభక్తినమ్రవదన యై యున్నమైథిలిం గ
నుంగొని సస్నేహబహుమానంబుగా ని ట్లనియె. 2426

తే. ఉద్భవానుగృహీతోర్వి § పురుచరిత్ర, విహసితారుంధతివి సంప్ర§వేశపూత
హవ్యవాహవు శుభచిహ్న§భవ్య వీవు, పరమకళ్యాణి నినుఁ బోలు§పడఁతు లేరి.

క. సీతగునడవడి యెఱిఁగియు, నాతనయుఁడు భువనసమితి§నమ్మికకై యా
దైతేయగృహస్థితిసం,భూతం బగుసందియంబుఁ § బొరిఁ బెడఁ బాపన్. 2428

ఆ. నిన్ను నొవ్వఁబలికె § నీచేఁ బ్రమాణంబు, గొనియెఁ గాని నమ్మ§కునికిఁ గాదు
తల్లి నీవు తెలుప § దెల్లమి సేసితి, మనమునందు నతనిఁ § గినియ వలదు. 2429

క. పతి దైవము సతులకుఁ దాఁ, బతియ పరాయణము పతియ § పరమహితుండుం
బతిశుశ్రూషాపర యగు, సతివసుమీ పరమపూజ్య § యఖిలజగములన్. 2430

ఉ. శ్రీమహనీయమూర్తుల న§శేషజనస్తవనీయకీర్తులన్
భూషగుణాభిరాములఁ బ్ర§భూతభుజాబలశక్తిధాములన్
రామునిఁ బోలుపుత్రులఁ బ§రార్థచరిత్రుల సత్పవిత్రుల

స్థిమహితాత్ములం గనుము । నీ వని దీవన లిచ్చె నత్తఱిన్. 2431

—✿ ఇంద్రునివరంబున మృతవానరులు పునర్జీవితు లగుట. ✿—

చ. అనునెడ నింద్రుఁ డి ట్లనియె । నంబుజలోచన నీవు మాకుఁగా
మనుజుఁడ వై జనించి యతి।మానుషశక్తి వహించి పోరులన్
దనుజులఁ ద్రుంచి మాతగుప।దంబులు వేడ్కఁ దిరంబు సేసి జీ
వనములు నిల్పి కాచితివి । వారిజబాంధవవంశవర్ధనా. 2432

సీ. నీనిమిత్తంబున । నిర్జరావలిఁ గూడి, నాకాధిపత్యంబు । నాకుఁ గల్గె
నీప్రభావంబున । నెఱి హవిర్భాగంబు, లంచితస్థితి సంభ।వించె నాకు
నీప్రసాదంబున । నిఖిలదిక్పతులును, దమతమరాజ్యప।దములు గనిరి
నీదయామృతదృష్టి । నిగిడిన నిక్కంబు, పాతాళవాసులు । బ్రదికి రెలమి
మాకు నెంతయు నమకూరె।మంగళంబు, తోయజాక్షులతోఁ గూడి।తొంటిపగిది
గలిగెఁ గ్రీడింప నెమ్మది । నెలమి మిగుల, [1]నీవ శరణంబు రాఘవ।నిక్కమరయ.

వ. పరిపూర్ణసుగుణాభిరాముండును నిష్కాముండును బూరితభక్తమనోరథుండును జగన్నాథుండును జనార్దనుండు నగు నీకు వరంబు లిచ్చెద నంగీకరింపు మ మట [2]చేలతనం బయినను నీకుం బ్రియంబు లయినవాని నడుగు మిచ్చెద ననిన రామచంద్రుం డి ట్లనియె. 2434

చ. నెఱయఁగ నీప్రసాదమున । నిర్జరలోకలలామ నాకు నే
కొఱఁతయు లేదు కోరఁ దగు।కోర్కియు నెద్దియుఁ గాన నైననా
కొఱకు రణంబునందుఁ గపి।కుంజరు లీల్గినవారు వీరలన్
మెఱలఁగ వేడ్క నిచ్చుటయ । మన్నన దీనన సంతసిల్లుదున్. 2435

చ. కపివరు లున్నచోట్లఁ గల।కాలము నెందు ఫలించి వన్యపా
దపములుఁ గందమూలములుఁ । దద్దయు నొప్పఁగఁ బద్మవిస్ఫుర
ద్విపులసరోవరంబులు న।దీనదముల్ దనరారునట్లుగాఁ
గృప [3]దళుకొత్త నిమ్ము నవ।గీతమహోదయ విస్ఫురద్దయా. 2436

వ. అనవుడు. 2437

తే. ఇనకులోత్తముపలుకులు । విని సురేంద్రుఁ, డంతరంగంబులోపల । సంతసంబు
నిండి దైవాఱ నంబుద।నినద మొదవ, భంగి ని ట్లని రాఘవుఁ । బలికె నంత.

ఉ. ఘోరరణంబులోనఁ బడి । కూలినవానరు లెల్ల రోగని
ర్దారతిఁ బొంది నెమ్మదిఁ బ।దంపడి మేల్కనుభంగిఁ [4]బ్రాక్తను
స్ఫారబలంబులం దనరి । ప్రాణములం దగ నొంది యుద్ధత
స్మేరత నెంతయున్ మిగిలి । చేవఁ దలిర్తురుగాక యెమ్మెయిన్. 2439

1. నీవ రాఘవ శరణంబ టెల్లనాఁడు. 2. చేలుఁదనంబు- బెలుచఁదనంబు. 3. దిలకించి యి మ్మనపరీతమహోదయవిస్ఫురద్దయన్. 4. బ్రాప్తసంస్ఫారబలంబులం.

క. సురుచిరఫలభరితము లయి, తరువులు విలసిల్లఁగాఁ § దద్దయు నదులున్
సరసిజములఁ దనరుసరో,వరములుఁ గడు నొప్పె సకల§వానరుల కనన్. 2440

చ. చటులనిశాచరాయుధవి§శంకటఘాతకృతవ్రణంబు లు
త్కటగతిఁ గానరాక సము§దంచితవేదనపేరు లేక యు
క్కట వడి నిద్రమేలుకను§కై వడి వానరకోటి లేచెఁ బ్ర
స్ఫుటముగఁ బ్రాణముల్ మగుడఁ § బొంది సమగ్రమహాబలోన్నతిన్. 2441

క. సురపతిపనుపున మంద్ర,స్ఫురదురుగర్జితము లులియు § భూరిఘనంబుల్
సరసత్వ మొనర గిరిచర,వరవాహినిమీఁద నమృత§వర్షము గురిసెన్. 2442

ఆ. ఔర్వవహ్నిఁ బోలు§నాఁకలి గలకుంభ,కర్ణుఁ డుగ్రభంగిఁ § గడఁగి మ్రింగ
నటిగి జమునిపురికి § నరిగినవానరుల్, దక్క నితరు లెల్ల § దక్కి రపుడు 2443

చ. కనకమయంబు లై మనము§కంటె జవంబున నొప్పి యిచ్చ వ
చ్చినకడ కేఁగ నోపినప్ర§సిద్ధవిమానము లెక్కి వేల్పు లె
ల్ల నలినగర్భునిం గొలిచి § లక్ష్మణపూర్వజు సన్నుతించుచుం
జనిరి నిజాలయంబులకు § సమ్మదవారిధి నోలలాడుచున్. 2444

వ. అంత. 2445

చ. అంచితభక్తిమై నినకు§లాధిపుఁ బల్కు విభీషణుండు నా
సంచితపుణ్య మెట్టిదొకొ § సంతస మారఁగఁ గోర్కు లెల్ల సి
ద్ధించె భవత్ప్రసాదమున § దేవర నన్ గరుణించి లంక కే
తెంచిన నేఁ గృతార్థుఁడ సు§ధీజననందిత లోకవందితా. 2446

వ. అనవుడు రఘువీరుం డి ట్లనియె. 2447

క. తరణిసుతుఁడు మొద లగువా,నరులకు సత్కారవిధు లొ§నర్పుము వీరల్
పరమసుఖోచితు లతిబహు,చిరతరసంగ్రామఖేద§శీలను లరయన్. 2448

మ. భరతుం డక్కడ సాంద్రవల్కలజటా§భారంబుతో నుండ మా
కరయంగా మణిభూషణాంబరములం § దాసక్తి యొప్పారునే
పొరి భోగింప మనంబు మైకొను నె యా§పుణ్యాత్మునిం జూడఁగా
నరుగం గౌతుక మాచు నున్నయది దై§త్యాధీశవంశాగ్రణీ. 2449

వ. అనిన నవ్విభీషణుం డట్ల కాక యని కమనీయంబు లగుకనకమణిభూషణంబులు మహనీయంబు లగునంబరంబులు నతిస్వచ్ఛంబు లైనయధికారులచేత మంగళతూర్యఘోషంబులు మొరయ రయంబునం దెప్పించి భయభక్తిసమన్వితుం డై నైసర్గికప్రణయంబు తేటపడ గంధాక్షతంబు లిచ్చి రామలక్ష్మణులకుఁ బరమసాధ్వి యైనసీతకుం గట్టనిచ్చి ముందట ముకుళితకరకమలుం డై యున్న నతనిం జూచి దశకంఠారి యి ట్లనియె. 2450

క. మా కింకఁ దడవుసేయక, సాకేతపురంబునకును § జనవలయును మా

రాకకు నెదుళ్లుసూచుచుఁ, బ్రాకటగతి నుండువారు పౌరులు ప్రీతిన్. 2451

క. గిరులు వనంబులు నదులు ని,తరపురఖేటములు వేగ దాఁటఁగవలె నీ
తెరువు కడుదవ్వు నేఁడిట, వరవిభవా కదలిపోవ వలయును మాకున్.

వ. అనవుడు విభీషణుండు రామున కిట్లను మీరు నేఁడ పూర్వప్రహరార్ధంబునన
యయోధ్యకు విజయంచేయునుపాయంబు గల దవధరింపుము. 2453

చ. విపులబలుండు దైత్యకులవీరుఁడు తొల్లి రణంబునన్ ధనా
ధిపుని నుదగ్రతన్ గెలిచి తెచ్చినపుష్పక మున్న దిక్కడం
దపనరథాతివేగ మది తార్క్ష్యుని మెచ్చదు కామగంబు నీ
విపు [1]డురురూఢి నెక్కి సుఖవృత్తి నయోధ్యకు నేఁగు మంచుఁ దాన్. 2454

క. అంత రఘూద్వహుననుమతి, సంతసమున దైత్యరాజు చలదురుఘంటా
సంతతరవ ములియఁగఁ దదు,పాంతమున విమాన మునిచె నవ్విభుఁ డలరన్.

సీ. కమనీయపద్మరాగప్రభామండలి, బాలాతపస్ఫూర్తి బయలుపఱుప
లాలితహరినీలజాలాంశుపటలంబు, గలయంగ దెసలఁ జీఁకట్లుగొలుప
రమణీయచంద్రకాంతమణిప్రభావలి, నిండువెన్నెలవెల్లి నిగ్గు లుమియ
మరకతరత్నాంశుమంజరీసంహతి, రవితురగవ్యక్తిరచన చూప
వజ్రవైడూర్యమౌక్తికావలులరుచులు, వరుస దిగ్భిత్తితటముల వన్నెవెట్ట
రజతసౌవర్ణవేదికావ్రజముశార,దాభ్రములమీఁదిమెఱుపుల నలమికొనఁగ.

వ. మఱియు గగనమహోరగనిర్ముక్తనిర్మోక[2]పట్టచ్ఛేదలలితంబు లగుకేతనంబు
లును సుధాకరుకరంబులం గూడఁబెట్టి యమృతంబునం గసటువోఁ గడిగి విరచి
తంబు లైనయట్లు శోభిల్లుచు [3]పినద్ధంబు లైనచామరంబులును మయూరాధిష్ఠి
తంబు లగురోహణగిరిసానుతలంబులం బోలువిచిత్రాస్తరణంబులు గలవేదిక
లును దదీయరచనావిశేషవిస్మితు లయి కదలక చూచుచున్నయచ్చర లనం బో
లుచుమణిసాలభంజికలసొం పారురత్నస్తంభంబులును విద్యుత్సహస్రంబులు దె
చ్చి గట్టిపఱిచి తేటపడ రచించి రన నొప్పు మిగులుకనకకుట్టిమంబులును సుర
ధనుశ్శతంబులు గరఁగి నిర్మించినట్లు విలసిల్లువివిధమణిభిత్తులును గలిగి సమా
నద్ధఘంటాసహస్రగంభీరఘోషతిరస్కృతజీమూతగర్జితంబును నై విశ్వకర్మ దన
నేర్పు మెఱయఁ జేసినపుష్పకంబుఁ జూచి సంతసిల్లి రఘునాయకుండు సుగ్రీవా
దులం జూపి రావణావరజున కిట్లనియె. 2457

చ. తడయక వీరిలావున నుదారగతిన్ జలరాశి గట్టి పెం
పడరఁగ దాఁటి యుద్ధతి వియచ్చరు లచ్చెరు వంద లంకపై
విడిసి నిశాటకోటి భుజవీర్యమునం దెగటార్చి రావణున్

1. విపుడు నిరూఢి... నేఁగు మీశ్వరా. 2. 'పటలతులితంబు లగుపత్త్రచ్ఛదకేతనంబులును'
అ. ప్ర. 3. నవంబు లైనచామరంబులును.

వడి నవలీలమైఁ దునిమి • వైచితి [1]నేచితి ముజ్జగంబులన్. 2458

ఉ. కావున వీరలం దగిన•గౌరవ మొప్పఁగఁ బ్రేమతోడ సం
భావనసేయు మంచితశు•భస్ఫుటభూషణరత్నహేమవా
సోవిలసత్పదార్థముల•సొంపు వహింపఁగఁ గట్ట నిమ్ము శో
భావహభవ్యసంపదల • నందఱుఁ దృప్తులఁ జేయుమా యనన్. 2459

క. తదనంతరంబ దైత్యుఁడు, సదమలభూషాదిదాన•చతురాశయుఁ డై
ముదమారఁగ సుగ్రీవుఁడు, మొద లగువానరుల నెల్ల • ముదితులఁ జేసెన్.

—రాముఁడు పుష్పకం బెక్కి యయోధ్యకుఁ బోవుట.—

ఉ. సీతయుఁ దాను దమ్ముఁడును • జేరఁగవచ్చి ప్రసూనగంధము
ఖ్యాతులితార్చ లిచ్చి వినతి•యంబున మ్రొక్కి ప్రదక్షిణించి యా
భూతలనాథశేఖరుఁడు • పుష్పక మెక్కె శచీమురాంతకో
పేతముగా సురేశ్వరుఁడు • హేమనగేంద్రము నెక్కుచాడ్పునన్. 2461

ఆ. రాజరాజశైల•రాజతనయలతోఁ, రాజఖండధరుఁడు • రాజతాద్రిఁ
బొలుచుభంగి ననుజ•భూమిజోపేతుఁడై, పుష్పకంబుమీఁదఁ•బొలిచె విభుఁడు.

వ. పర్యాప్తమనోరథసిద్ధి యైనయమ్మహావీరుండు సుగ్రీవుండు మొదలయినవానరు
లం గనుంగొని యిట్లనియె. 2463

క. దిక్కుల నెల్లఁ బొగడ్తకు, నెక్కినయక్కజపుఁగడిమి • నేపారెడుమీ
రిక్కడ నుండియ మీమీ, యిక్కువలకుఁ జనుఁడు వాన•రేశ్వరులారా. 2464

ఆ. అన్నఁ బాసి నన్ను • నాశ్రయించినవిభీ, షణుని లంకలోన • [2]జయ మెసంగ
దనర రాజుఁ జేయఁ • గనుట మీలావునఁ, గాదె నాకుఁ గలిగెఁ • గడమపడక.

క. అనినఁ గృతాంజలు లై యా, వనచరయూథపులు రాఘు•వక్షితిపాలుం
గనుఁగొని కడునక్కఱ ని, ట్లనిరి కుతూహలకళాన•మంచితమతు లై. 2466

సీ. దేవరఁ గొల్చి యే•తెంచి భూరమణికి, భూషణం బైనమీ•పురము సూచి
చెలువార మీయభి•షేకంబు గనుఁగొని, భరతశత్రుఘ్నులఁ • బరఁగఁ గాంచి
వినయంబుమై భవ•జ్జనయిత్రులకు మ్రొక్కి, సరయూజలంబులఁ • జల్లులాడి
కన్నులపండువు • గావించి మాజన్మ, కర్మముల్ సఫలంబు • గా నొనర్చి
మఱి కృతార్థవృత్తి • మరలెద మనవుడు, జానకీధవుండు • సంతసిల్లి
వారి నాదరించి • వల నైనసత్కృపఁ, జూచి మందహాస•శోభి యగుచు. 2467

వ. తపనతనయపవనసుతవాలిసూనులును జాంబవత్సుషేణగంధమాదనాదు లగు
వానరభల్లూకయూథపులును విభీషణప్రభృతిదానవులును రా నమ్మతించినం దద
నుజ్ఞాతు లై కౌబేరం బగుయానం బెక్కి రంత నమ్మహాత్ముచిత్తం బెఱింగి యుద్ది
వ్యవిమానంబు ధరణిపతితసముత్పతత్సురలోకదృశ్యంబుగా దివికి నెగసి విస్తృత

1. గాచితి ముజ్జగంబులన్. 2. సంగతంబు దనర.

పక్షమరాళయూథసమూఢం బై సానులీలాచలశారదనీరదం బై నమేరునగంబు
గతిం దేజరిల్లుచు వలయీభూతనిజప్రభాపటలశోభితం బై యపూర్వగతి గల
భానుమండలంబుంబోలె నొప్పునద్దివ్యవిమానంబునందుఁ గుబేరుండునుంబోలె
నొప్పారునారాజపరమేశ్వరుండు వైదేహిం గనుంగొని యిట్లనియె. 2468

రాముఁడుపుష్పకాధిరూఢుండై పూర్వవృత్తాంతములు సీతకుఁ జెప్పుచుంబోవుట.

చ. చెలువుగ విశ్వకర్మ విరచించెఁ ద్రికూటముమీఁద లంక ను
జ్జ్వలతరసౌధరత్నగృహజాలములుం దనరారుకోటలుఁ
విలసితగోపురంబులు నవీనవనంబులు నిద్ధసంపద
ల్గలిగి మనోవినోదవిమలస్థితి నున్నది సీత చూచితే. 2469

మ. అని మేదోరుధిరాస్థిమాంససముదాయాపూరితం బై ఘన
స్వనబేతాళపిశాచభూతనివహవ్యాప్తంబు నిష్క్రాంతజీ
వననక్తంచరవానరేంద్రకరటివ్రాతాదికీర్ణంబు నై
జనితత్రాసమహారణంబు గమలాస్యా చూచితే ముందటన్. 2470

చ. త్రిదశులఁ జీరికింగొనక తేజమునం దగ మించి నంతతా
భ్యుదయము నొంది బాహుపరిఘోద్ధతి శంకరుశైల మెత్తి న
మ్మది భువనాధిపత్యమున మానితుఁ డైనదశాననుండు నా
కదనమునందుఁ గూలె నిటఁ గంజదళాయతచారులోచనా. 2471

ఉ. వానరవీరసంహతుల వావిరి మ్రింగుచు నుగ్రవిక్రమా
నూనబలాతిభూతి విభవోన్నతిఁ బేర్చి యెదిర్చి యుద్ధత
ధ్వానజితాంతమేఘుఁ డగుదానవవీరుఁడు గుంభకర్ణుఁడుం
దా నిట మత్ప్రయుక్తసముదగ్రశరంబులఁ గూలె జానకీ. 2472

క. ఇక్కడఁ దగ నీలునితో, నక్కజముగఁ దాఁకి యాప్రహస్తుఁడు దనుజుల్
స్రుక్కఁగ విబుధులు నిక్కఁగ, గ్రక్కున జముప్రోలి కరిగె రణసంస్థితుఁ డై.

క. విద్యున్మాలిపయోదము, విద్యున్మాలాస్త్రవితతివిభవము సెడఁగా
నుద్యత్సుషేణపవన, ప్రోద్యద్గతి రూపుమాసి పొలిసె మృగాక్షీ. 2474

ఉ. ఏచినసాహసం బొదవ నెంతయు నుద్ధతి నింద్రజిత్తు మా
యాచతురత్వ మేర్పడ నిరంకుశవిక్రముఁ డై సమస్తదృ
గ్గోచరవృత్తి లేక మము ఘోరగతిం బటునాగపాశసం
కోచితబద్ధగాత్రబలకుంఠితశీలురఁ జేసె నిక్కడన్. 2475

ఆ. అతిబలోగ్ర మైనయతికాయసింహంబు, గడఁగి కపినికాయకరులఁ జంపఁ
జండసత్త్వ మైనసౌమిత్రిశరభంబు, దునిమె నిచటఁ బేర్చి తోయజాక్షీ.

క. వికటాకారము గల్గిన, వికటభుజంగంబు దర్పవిస్ఫురితబాహా
ప్రకటాంగదతార్క్ష్యునిచే, నికటస్థలిఁ గూలె నిచట నీరజవదనా. 2477

ఉ. దిక్కరిదంతఖండనరతివ్యపనీతసమగ్రబాల్యుఁ డై
ధిక్కరణాదికృత్యకరదీకృతదిక్పతిచిత్తశల్యుఁ డై
తక్కువ గాని బాహుబలదర్పము దూలిన వీతసత్త్వుఁ డై
చిక్కె మహేంద్రజిత్తు సమసెం బటులక్ష్మణబాణసంహతిన్. 2478

వ. రోషారుణాహిమకరాక్షుం డగుమకరాక్షుండును ఘనప్రభాజితాగ్నికేతుం డగు నగ్నికేతుండును సంగ్రామాకంపనుం డగునకంపనుండును మృత్యుసహోదరుండపోలె మహోదరుండును గులిశమహాపార్శ్వుం డగుమహాపార్శ్వుండును మహీదేవాంతకుం డగుదేవాంతకుండును గిన్నరాంతకుం డగునరాంతకుండును నిసర్గప్రకాశజితాగ్నివర్ణుం డగునగ్నివర్ణుండును దపఃప్రసాదితవిరూపాక్షుం డగు విరూపాక్షుండును బొలిసినచో ట్లివి యవి యని చెప్పుచు. 2479

చ. కడఁగిన వేడ్క నభ్రనదిఁ గౌఁగిటఁ జేర్పఁగఁ బూనుకై వడిన్
విడువక మింటితో నొఱయు వీచిభుజంబుల నొప్పి సంతసం
బడరెడుభంగి మ్రోయుచు నుదంచితఫేనము నవ్వుగాఁగ నొ
ప్పెడు నదె సాగరుండు గడుఁ బెంపునఁ బేర్చుప్రియుండుఁ బోలుచున్. 2480

ఉ. సేతువుఁ జూచితే యబల సింధువుమీఁద మదీయసఖ్యతో
హేతువు సర్వజంతుసముదీర్ణమహాదురితవ్యపక్రియా
కేతువు విశ్వకర్మసుతకీశపరాక్రమకేళివిస్ఫుర
త్కేతువు మోదితత్రిదశకిన్నరగోపతిరాజకేతువున్. 2481

ఆ. సేతుబంధ మనఁగఁ జెలువారుతీరంబు, పుణ్యతమము లోకపూజితంబు
పరమపావనంబు పాతకహరణంబు, మత్కృతంబు చూడుమా మృగాక్షి.

క. [1]ఈదివ్యక్షేత్రమున మహాదేవునిసత్ప్రసాద మందితి మును నే
నీదారి నరుగుతఱి నో, వైదేహీ కంటె భక్తవత్సలునిఁ బ్రభున్. 2483

చ. లలితగతిన్ మరుత్సుతుఁడు లంకకు వచ్చుచు నుండునత్తఱిన్
జలనిధి గ్రక్కునన్ వెడలి సమ్మదలీల సపర్యసేసి యి
మ్ముల విలసిల్లునన్మణిసమూహహిరణ్యలసత్తటీసము
జ్జ్వలము హిరణ్యనాభ మను శైలముఁ జూచితె లోలలోచనా. 2484

సీ. ఇది యవ్విభీషణుఁ డేతెంచి మముఁ బొడగన్నచో టుత్ఫుల్లకమలనయన
కోరి యంబుధి వేఁడఁ గుశశయనుండ నై, యుంటి నిక్కడ సువర్ణోజ్జ్వలాంగి
బ్రహ్మాస్త్ర మంబుధిపైఁ బ్రయోగించితి, నిచ్చోట నిల్చి నే నిందువదన
వాలి నొక్కమ్మున వసుధపైఁ గూలంగ, నేసితి నిక్కడ నిగురుఁబోఁడి
విపుల మగుచున్న నీతోడివిరహమునను, వారిదవ్రజపరిముక్తవారిలేశ
ములకుఁ దల్లడమందుచు నలసియలసి, వనిత నేనుంటి నీమాల్యవంతమందు.

1 ఇది వ్రాఁతప్రతులం దఱచుగాఁ గనుపట్టదు.

క. పుల్లానేకానోకహ, వేల్లత్సముదగ్రగహన ◊ వీథీవిలస
ద్భిల్లీవృత యై యున్నది, యల్లదె కిష్కింధ చూడు ◊ మనవుడుఁ బ్రీతిన్. 2486
చ. అనఘచరిత్ర తారమొద ◊ లైనకపీంద్రసరోరుహాక్షు లా
వనచరకోటికామినులు ◊ వావిరి నందఱు నేఁగుదేరఁగా
మనమున సంతసం బొదవ ◊ [1]మానితసంస్థితిమై నయోధ్యకుం
జనఁ గడువేడు కయ్యెడుఁ బ్ర ◊ సన్నమతిం బిలిపింపు వారలన్. 2487
చ. అన విని రాముఁ డి ట్లనియె ◊ నర్కతనూభవ నీవుఁ గీశులుం
జని లలనాసమేతు లయి ◊ సమ్మద మొప్పఁగ రండు విభ్రమం
బొనరఁగ నాత్మ వేడ్కపడు ◊ చున్నది భూమితనూజ నాదు నె
మ్మనమును నట్ల యున్నయది ◊ మానుగ వారలఁ దోడి తె మ్మొగిన్. 2488
వ. అనిన సుగ్రీవుండును గపిసనాథుండై కిష్కింధకుం జని వానరుల నెల్ల నిజదార సమేతుల రయి రయంబునం జనుదెండని నియోగించి తా నంతఃపురంబు సొచ్చి తారావల్లభముఖి యగుతారం గాంచి కోసలేంద్రునాజ్ఞయు భూనందనకోర్కియు నెఱింగించిన నామృగాక్షి సంజాతకుతూహల యై సపత్నీవర్గంబునుం దాను నలంకృత యై సకలవానరవధూసమేతంబుగా నున్న నన్నిజసుందరిం దోడ్కొని వచ్చి రాఘవులకుం బ్రణమిల్లె నాకాంతలుం బ్రణత లై జానకియనుమతంబున విమానం బెక్కిన నది యతిరయంబున నరుగ రాఘవుండు ఋశ్యమూకశైలంబు చేరం జని వైదేహిం గాంచి యి ట్లనియె. 2489
ఉ. లోకముదావహం బతివి ◊ లోలమదోద్ధతవర్తివానరా
నీకము రత్నరాజిరమ ◊ ణీయతటీరుహచిత్రపాదప
శ్రీకముఁ జారుతుంగబహు ◊ శృంగశిరోధిగతస్ఫురద్దిగా
లోకము మత్తకుంజరవి ◊ లూనమధూకము ఋశ్యమూకమున్. 2490
ఉ. చూచితె యీగిరీంద్రముఁ బ్ర ◊ సూనలతారతభృంగనాదసం
సూచితపుష్పచాపగుణ ◊ శోభితమంజురవంబు నిందు శు
ద్ధాచలితాంతరంగుఁ డగు ◊ నర్కతనూభవుతోడిమైత్రి సా
మోచితవృత్తిఁ జేసితిఁ బ ◊ యోరుహపత్రవిశాలలోచనా. 2491
క. గాలివడి నొరయుచును న,త్తాలము లై పెరిఁగి మిన్ను ◊ దాఁకి పరఁగు నా
తాలమ్ము లేడు నొక్కటఁ, గూలఁగ నేసితి శరమునఁ ◊ గువలయనయనా. 2492
సీ. కరిణీసమన్విత ◊ కాననసింధుర, భూరిదానోదక ◊ పూరితంబు
శబరీపయోధర ◊ చందనోత్థితవీచి, ధవళితర క్తాబ్జ ◊ కువలయంబుఁ
దీరసంరూఢమ ◊ హీరుహపుష్పసౌ, రభ్యవాసిత వారి ◊ రమ్యతరముఁ
దటతరులంబిల ◊ తాడోలికారూఢ, ముదితనదత్పక్షి ◊ ముఖరితంబుఁ

1. 'మానితసుస్థితిమై. అ. ప్ర.

దరళవిభ్రమవనదేవతావిహార, మమృతకరబింబనిర్గళదమృతమయము
పగిదిఁ దనరుచునున్న పంపాసరోవ,రంబుఁ జూచితె పరిపూర్ణరాజవదన.

శా. సీతో! చాసి యసహ్యదుఃఖ మొదవన్ నే నిక్కడన్ విస్ఫుర
చ్చేతోజాతశిలీముఖప్రతతులం జె ల్వేది మూర్ఛిల్లుచో
శీతోదంచితశీకరోల్లసితవీచీపద్మగంధంబుతో
వీతెంచెం బవనుండు మోహాలహరీవిస్పష్టతాపాది యై. 2494

చ. దల మగుచున్ భవద్విరహతాపము మిక్కుట మై తనర్చినం
దలిరులఁ బువ్వులం దగినతల్పము నా కొనరించి లక్ష్మణుం
డలయక తాపశాంతి బిసహారపరీతుఁడ నై న మెల్పునన్
లలితనవీనవారిజదళంబుల నల్లన వీచె నుగ్మలీ. 2495

మ. తరణిన్ మ్రింగి కృశానుఁ దేజమున నుద్యద్వృత్తి నోడించి సా
గరమున్ దాఁటి నిశాటులం దునిమి లంకాదాహి యై నీదువా
ర్త రతిన్ మా కెఱిఁగించి లక్ష్మణుని నుద్యజ్జీవుఁ గావించి సు
స్థిరతం గ్రాలెడువాయుజుండు మముఁ గాంచెన్ సీత యిచ్చోఁ దగన్. 2496

క. ఘనతరతపమునఁ గృశ మగు,తనువునఁ దనరారి సత్యధర్మస్థిత యై
మునివృత్తి నున్నశబరిం, గనుఁగొంటిమి యిచట విమలకమలదళాక్షీ. 2497

క. సూకరకరిమహిషంబులఁ, బ్రాకటముగఁ బట్టి మ్రింగి బహుసత్వములం
జేకొలఁది నమలునాభయ,దాకారుఁ గబంధు నిచట నడిచితి మబలా. 2498

మ. వడి నక్తంచరరాజు నిన్నుఁ గొనిపోవన్ వానిఁ బో నీక లా
వడరన్ వచ్చి జటాయు వుగ్రగతి నుద్యత్క్రోధుఁ డై పోరి పెం
పెడలం దద్గురుచంద్రహాసహతిచే నీల్గెన్ రణారంభ మే
ర్పడ నిచ్చోట విశీర్ణలూనవిగళత్పక్షాంగుఁ డై మైథిలీ. 2499

చ. చటులస్యందనదంతివాజిసముదంచద్భీమనక్తంచరో
ద్భటవృత్తిన్ ఖరదూషణత్రిశిరు లుద్యత్క్రోధు లై వచ్చి యు
త్కటమత్కార్ముకముక్తబాణములచేతన్ గ్రక్కునం గూలి రి
చ్చట నేపారఁగఁ జూడుమా యిది జనస్థానంబు లోలేక్షణా. 2500

ఆ. రాక్షసేంద్రుఁ డైన రావణుచెలియలి,ముక్కుసెవులు పట్టి మొదలు గదియ
లాఘవంబు మెఱయ లక్ష్మణుఁ డేపార, నిచటఁ ద్రెంచెఁ గాదె యిందువదన.

శా. మారీచుండు దశాస్యుకోర్కి యొదవన్ మాయామృగం బై నిజో
దారస్ఫారశరీరకాంతి వనమధ్యం బెల్ల నిండన్ ననుం
జేరన్ వచ్చి క్రమంబుతోడ నెలయించెన్ వాని నే నత్తఱిన్
ఘోరాస్త్రంబునఁ గూల నేసితి మహాక్షోభంబుగా నిక్కడన్. 2502

మ. మన మారం దగ నీవు పుత్త్రులగతిన్ మన్నించి కుంభోదకం

బునఁ దత్త్రిక-యుఁ బ్రేమనిర్భరగతిం ◊ బొల్పొందఁగా నాఁకు పెం
చినచూతంబులనీడ బాలమృగముల్ ◊ సేమంబుతో నుండ నిం
డినలచ్చిం దనరారుపంచవటిఁ గం◊టే ధారుణీనందనా. 2503

క. మనకట్టినయుటజం బదె, ఘనమాయామేది పంక్తి◊కంఠుఁడు వడిఁ దా
నిను నిచ్చటఁ గొనిపోయె, న్వినువీథిని దివిజు లడల ◊ నీరజవదనా. 2504

వ. ఇదె చూచితే విమలచరితంబున సుతీక్ష్ణుం డగుసుతీక్ష్ణునాశ్రమం బిల్వలవాతాపిదవానలకాలమేఘంబును జులుకితపయోరాశియు [1]వామనీకృతవింధ్యాచలుండు నురగీకృతనహుషుండును నిజోదయప్రసాధితసకలజీవనుండును నగునగస్త్యమహామునిపుణ్యాశ్రమం బదె హుతవహహుతశరీరుం డగుశరభంగుతపోవనం బల్లదె పుత్రీకృతపురుషత్రయుండును దాదృగ్విధప్రభావమహితానసూయాపరిగ్రహుండును నగునత్రిమహామునీంద్రుపుణ్యాలయుం బిది యిచ్చోట నీకు ననసూయ పుణ్యానిత్యసౌరభ్యం బగునంగరాగం బొసంగె నల్లవె కంటివే యారభమాణనవోటజంబులును విరచ్యమానవల్కలంబులును సంవర్ధ్యమానబాలపాదపంబులును బరిపూజ్యమానాతిథివర్గంబులును విప్రకీర్యమాణనీవారబలులును హూయమానవైశ్వానరంబులును సంతర్ప్యమాణపితృదేవతంబులును శుకశారికాపఠ్యమానేతిహాసంబులును మూలబధ్యమానవేదికానోకహంబులును హోమధూమవ్యాప్యమాననభోభాగంబులును నగుతత్పుణ్యతపోవనంబు లని చూపుచు. 2505

ఆ. జనపదాపనీత◊జనఘనస్త్యానాస్థి, విస్రదుస్సహుండు ◊ వీరతముఁడు
రాక్షసాధముఁడు వి◊రాధుండు నాచేతఁ, బొలిసె నిందుఁ దాను ◊ బువ్వుఁబోఁడి.

క. వానరసంచయభల్లూ, కానీకవరాహసై రి◊భాకులవివిధా
నూనతరుచిత్రకూటం, బై నెరసినచిత్రకూట ◊ మదె కనుఁగొంటే. 2507

ఆ. దురితదూరుఁ డైన ◊భరతుండు నను దెంచి, రమణమై నివృత్త◊రాజ్యకాంక్షుఁ
బరమభక్తి నన్నుఁ ◊ బ్రార్థించి పాదుకల్, గొనుచు నరిగె నిచటఁ ◊ గుటిలకేశి.

క. క్షోణీరమణికి నమరిన, వేణి యనం దగినయమున ◊ వీక్షించితివే
క్షీణీకృతాఘసలిల,శ్రేణీయుత జహ్నుకన్యఁ ◊ జెలువుగఁ గంటే. 2509

క. హరులకుఁ బుట్టినగతి ది,క్కరులకు జనియించినట్టు ◊ ఘనసత్త్వములం
బరఁగిననిషాదులం గదు, బెరసినగుహుఁ డున్నశృంగి◊బేరము సుమ్మీ. 2510

క. మహనీయచరితశీలుఁడు, బహుమానమునన్ నిషాద◊భటపరివృతుఁ డై
గుహుఁ డిక్కడ ననుఁ గాంచెను, బహుశస్త్రిఫలోపహార◊బంధురకరుఁ డై.

క. పలుయాగంబుల నన్మ,త్కులనృపయాగములఁ జెప్పఁ◊గూలంబులచేఁ
జెలువారుచు నతిపావన, జల యగుసరయూనదిం బ్ర◊సన్నతఁ గంటే. 2512

1. ధారుణీకృతవింధ్యా.

చ. సురనదివీచులం దడియు శృంగములం దనరారుమేడలన్
సురతసుఖంబుచే నలసి సోలి ప్రియం బగుచల్లగాలిచేఁ
బరమముదంబునం జెలఁగు పౌరులచేఁ దగ నెల్లకాలముం
బరఁగునయోధ్య సూచితివె పంకజపత్రవిశాలలోచనా. 2513

వ. అని యీరాజధాని యస్మత్కులనృపక్రమపాలిత యై యొప్పుచున్నది యిప్పురి
కిం బ్రణమిల్లు మని జానకి నియోగించినం బ్లవంగనక్తంచరులు చూచి యచ్చె
రువడుచు. 2514

సీ. దిగ్గజోపమమదద్విపదాననిర్ఘర, దుర్దినాయితభూమిదోహలంబు
హరితురంగోపమహారిఖురక్షతహేమ, కుట్టిమోత్థితరేణుగూహితంబు
జితమనోజవహయోజ్జితమణిస్యందన, విస్తారితాదిత్యవిపులరథము
నన్యోన్యవిభవాపహాసిమహాయోధ, శరభపంచాననసంకులంబు
సురవధూపమసుందరీశోభితంబు, గనకమందిరధృతమేరుగౌరవంబు
నిప్పురోత్తమ మెంతయు నొప్పు ననుచుఁ, జూచి సంతసమందిరి చూడ్కు లలర.
ఎ. అంత. 2516

—✣ శ్రీరాముఁడు భరద్వాజాశ్రమంబు చేరుట. ✣—

ఉ. రాజితపుష్పితక్షితిజరాజిసమన్వితమైనయాభర
ద్వాజమునీంద్రునాశ్రమము దవ్వులఁ గాంచి రఘూద్వహుండు తే
జోజితభానుయానమయి సొంపెసలారెడుపుష్పకంబు వి
భ్రాజితలీల నిల్పె ననుభావపదస్థితి నంబరంబునన్. 2517

ఉ. ఆవిభుఁ డంత నీలజలదాకృతి నల్లన డిగ్గి శాంతస
త్త్వావృత మైనయమ్మునివరాశ్రమ మెంతయు మెచ్చి చూచుచుం
బావనహోమగంధయుతభాసురధూమము గ్రోలి సోలుచుం
బావకకల్పతేజుఁ డగు భవ్యమునీంద్రునిఁ గాంచె వేడుకన్. 2518

క. వినయాదరసంభ్రమములఁ, జనుదెంచి మహామునీంద్రుచరణంబులకున్
జనలోకవిభుఁడు మ్రొక్కెను, ఘనభక్తిని నిలిచి ఫాలఘటితాంజలి యై. 2519

క. అమ్మునివలన విభుండు ప్రి, యమ్మున దీవనలు వడసి హర్షోత్కర్షో
త్కమ్మయినచిత్తమలర ర, యమ్మున నిట్లనియె సవినయాదరమతి యై. 2520

క. పదునాలుగేండ్లు నిండెం, దుదిఁ బంచదశమ్ము నిదియె తోఁతెంచె దయా
స్పద నీసందర్శనమున, సదమలగతి నాకు సంతసము సమకూరెన్. 2521

మ. తమలో వైరము దక్కి యెంతయుఁ బ్రమోదం బంది యుష్మత్సమీ
పమునం గ్రుమ్మరి సత్క్రియాప్రహితదర్భగ్రాససంవర్ధ్యమా
నము లై యున్నమృగవ్రజంబు లసమానవ్యాధముక్తాశుగా
దిమహాబాధలు లేక యున్నవె తపోధీనాశయప్రక్రియన్. 2522

చ. వరసుతనిర్విశేషపరివర్ధిత మై రుచిరామ్రతైకసో
దరఫలభార[1]పూర్ణ మయి సంభృతపల్లవపుష్పయుక్త మై
పర పగునీడలం దనరుపాదపబృందము తీవ్రమారుత
ద్విరదజనాద్యుపద్రవవిధిం జెడిపోవక యొప్పుచున్న దే. 2523

క. స్నానాదిక్రియలకుఁ దగి, మానుగఁ బితృతర్పణక్రమములకుఁ [2]దగ నిం
పూనినసలిలాశయము ల,నూనము లై సంతతంబు నొప్పుచు నున్నే. 2524

చ. జపములు హోమకర్మములు జన్నములున్ నియమంబులున్ మహా
తపములు నాగమాధ్యయనతత్పరభావము లాశ్రమాగతా
దిపరిచితార్హణక్రియలు దేటపడన్ భవదాశ్రమంబునన్
వ్యపగతవిఘ్నవృత్తిఁ దనరారునె నంచితసత్తపోధనా. 2525

ఆ. అనిన సంతసిల్లి యమ్మునీంద్రుఁడు రామ,ధరణిపతికి ననియె దంతకాంతి
దెసలఁ బర్వ చంద్రదీధితిఁ దెగడంగ, నోలిఁ బులకితాంగశాలి యగుచు.

చ. జనవర నీప్రసాదమున సర్వము భద్రము మాకు సంతతం
బును గతవిఘ్నదోషముగ భూరితపోవిభవంబు గల్గెనీ
వనయము [3]శాసితుండ వయి సాయుధహస్తుఁడ వైనఁ జాలదే
ఘనతరధర్మసచ్చరితగౌరవముల్ విల్లసిల్ల నెంతయున్. 2527

క. నీపాదుక లొగి ముందట, నేపారఁగ నిడి ప్రమాదహీనాశయుఁ డై
భూపతి యగుభరతునిచే, గోపాయిత మబ్జజాండగోళం బెల్లన్. 2528

క. లలి నీ వడవికి నరిగిన, వెలయఁగ నీనడుమ నైనవృత్తాంతంబుల్
దెలిసితి విమలజ్ఞానో,జ్జ్వలదీపముమహిమ కలిమి జలజదళాక్షా. 2529

క. వనవాసము దగ నిండిన, వినకుల నీ వెట్టకేని నే తెంచితి మా
మన మలరఁగ నేఁ డిక్కడ, ఘనరాగముతోడ నుండఁ గావలయుఁ జుమీ.

క. [4]రేపకడ యెల్లి యెమ్మొయి, మాపనుపున నరిగి భరతు మానితచరితున్
రూపితతాపసజనవే, షోపేతుం జూడవలయు నుర్వీనాథా. 2531

క. నరపాలలోకశేఖర, వర మిచ్చెద వేఁడు మనిన వసుధాపతియుం
గర మనురాగంబునఁ దన,కరములు ముకుళించి పలికె గౌరవ మెసఁగన్.

క. సాకేతపురముచుట్టును, నైకతరుల్ యోజనత్రయాయామము లై
ప్రాకటఫలమధునిష్యం,దాకల్పము లై తనర్ప నానతి యీవే. 2533

ఆ. అనిన నట్ల కాక యని ముని పల్కిన, మధురమధురసార్ద్రమంజుమంజ
రీఫలాదివల్లరీరమ్యదృశ్యంబు, లై నగంబు లెల్ల నతిశయిల్లె. 2534

---

1. పూర్ణసముదంచితపల్లవపుష్ప. 2. గతి నై పూనిన. 3. శాసకునకు శాసితుం డని యీశబ్దప్రయోగము. 4. 'రేపకడ సెల్లి సెమ్మొయి' అ. ప్ర. 5. రీఫలతరువల్లరీ... లై వనంబు లెల్ల నతిశయిల్లె.

— రాముఁడు హనుమంతుని భరతునొద్దకుఁ బంపుట. —

వ. తదనంతరంబ జానకీజాని పవనతనయు నవలోకించి చేరం బిలిచి నీవు శృంగిబేర
పురంబున కరిగి నాకుఁ బ్రియసఖుం డగుగుహునికి మదాగమనంబు సెప్పి
తన్ముఖవిదితపథుండ వై నందిగ్రామంబున కేఁగి భరతుం గాంచి తదీయేంగితమనో
భావచేష్టితవచనంబు లెల్ల నెఱింగి మద్వృత్తాంతంబు నివేదించి రమ్ము పొమ్మనిన
నతండు కామరూపి గావున మానుషరూపధరుం డై కడలి శృంగిబేరపురంబు
నకు వచ్చి యందు. 2535

సీ. ఘనతరవ్యాయామకర్కశాకారుని, దిగ్దంతికరమహాదీర్ఘహస్తు
శైలతటాభవిశాలతరోరస్కు, మహితసమున్నతమాంసలాంసు
ననవరతకృతచాపాభ్యాసనిష్ణాతు, విఖ్యాతతనుభావవృత్తమధ్యుఁ
గనదురుజ్యాఘాతకఠినస్ఫుటాంగుళిఁ, జటులారిభయదోగ్రసమరదక్షు
శీలశుద్ధసత్త్వు సేవాసమాగత, శబరసేవ్యమానుఁ జారుకీర్తి
కాంతుగుహుని నంతఁ గాంచె హనూమంతుఁ, డధికమోదనిర్భరాత్ముఁ డగుచు.

ఉ. అంతఁ బుళిందసైన్యపతు లందఱు నచ్చెఱువంద నాహనూ
మంతుఁడు సేరవచ్చి యసమానకుతూహల మొప్పఁగా మహీ
కాంతుని రాక యాశబరకాంతుని కేర్పడఁ జెప్పి వానిచే
నెంతయుఁ బూజ నొంది యట యేఁగె నుదగ్రమనోజవంబునన్. 2537

వ. చని సరయువు దాఁటి నందిగ్రామంబు సొచ్చి. 2538

సీ. కపిలసమున్నద్ధవిపులజటాభారు, ధృతవల్కలాజినోర్జితశరీరు
భసితత్రిపుండ్రకభాసితోజ్జ్వలఫాలు, రుద్రాక్షమాలికాభద్రమూర్తి
నసమాగ్రసంభవవ్యసనకృశీకృతు, శీలితతరుఫలమూలనిరతు
హితమంత్రిగణపురోహితయోగిమునిజన,పరివృతు నరవేషధరగిరీశు
నగ్రవిన్యస్తతత్పాదుకార్చనాఢ్యు, భువనరక్షణదక్షిణబుద్ధిమహితుఁ
బరమపావనచారిత్రుభరతుఁ గాంచి, మ్రొక్కి పావని నిలుచుండె ముదముతోడ.

వ. భరతుం డతనిం గనుంగొని పూర్వపరిచయంబు లేకుండియు నాత్మీయబుద్ధిం జేసి
సస్నేహంబుగ ని ట్లనియె. 2540

ఉ. ఎక్కడనుండి వచ్చి తిట యెవ్వరివాఁడ వి కెందుఁ బోయె దీ
విక్కడి కేఁగుదేరఁ గత మెయ్యది తావకనామ మెద్ది ని
న్నిక్కము చూచుచుండ మది నెయ్యము పుట్టుచునున్న దెంతయున్
గ్రక్కున నీసమాగమనకారణ మంతయు నాకుఁ జెప్పుమా. 2541

చ. అనవుడు ఫాలభాగఘటితాంజలి యై కపియూథనాథుఁ డి
ట్లను రఘునాథుబంటఁ బవనాత్మజుఁడన్ హనుమంతుఁడన్ జగ
ద్ఘనుఁ డగుభూమిభర్త నను గారవ మొప్పఁగఁ బంప నర్థితో

నినుఁ బొడగాన వచ్చితి న।నిందితవర్తన వైరికర్తనా. 2542
క. సీతాలక్ష్మణయుతుఁ డై, భూతలపతి దుర్గగహన।భూముల భువన
ఖ్యాతిగఁ జతుర్దశాబ్దము, లాతతగతిఁ బుచ్చి వచ్చె।ననఘచరిత్రా. 2543
ఉ. ఆతతపుణ్యశీలుఁ డన।పాయసమంచితసత్యపాలన
స్ఫీతుఁడు శీలవృద్ధజన।సేవకుఁ డాభరతుండు భక్తివి
ఖ్యాతి మదీయపాదుకల।యందుఁ గృతక్షితిభారుఁ డైనవాఁ
డాతనిసేమ మారసి ర।యంబున రమ్మని పంప వచ్చితిన్. 2544
మ. అనినన్ సంతస మంది కర్ణపుటపే।యం బైనవాక్యామృతం
బున సౌహిత్యము నొంది యశ్రులహరీ।పూర్ణాక్షుఁ డై కంపితాం
గనతుం డై పులకించి కోర్కు లొదవం।గా నుబ్బి యాలింగనం
బొనరించెన్ భరతుండు వాయుసుతుఁ జి।త్తోద్యత్ప్రమోదంబుగాన్. 2545
వ. అంత నతనికి భరతుండు గోసహస్రంబును గ్రామశతంబు నుత్తమతురంగసహస్రంబును మత్తదంతావళసహస్రంబును మణిమయభూషణంబులును రమణీయలావణ్య లగురమణులను ధనకోట్లునుం బసదనంబు లొసంగి యిట్లనియె. 2546
సీ. తండ్రిపంపున ధరా।తలరాజ్య మది మాని, తాపసవేషంబు।దాల్చి యడవి
కరిగి చతుర్దశ।హాయనంబులు నెట్టు, జరపె దినంబులు।జరపినట్టు
లెచ్చోట నేక్రియ।నిచ్చమై వర్తించె, నాదట నెయ్యది।యాచరించె
నిప్పుడు భూమీశుఁ।డెక్కడ నున్నవాఁ, డంతయు నెఱిఁగింపు।మమలచరిత
నమ్మనయ్యెద నీమాట।నరవరేణ్యుఁ, డరుగుదెంచుట నిక్కమే।యనినఁ జారు
మందహాసితంబుతోఁ బవ।మానసుతుఁడు, భరతు నేర్పడ వినుమని।పలికె నంత.

—✤ హనుమంతుఁడు భరతునితో రామువనవాసాదివృత్తాంతంబు చెప్పుట. ✤—

చ. అనయము భూవిభుండు ముద।మారఁగఁ బట్టముఁ గట్టఁ బూని మీ
జననివరంబులం గరుణ।సాలక రాము నరణ్యభూమికిం
జను మనినన్ జటాజినవి।శంకటవల్కలముల్ ధరించి యా
జనకసుతాసుమిత్రభవ।సంయుతుఁ డై వెస నేఁగి కానకున్. 2548
సీ. అట పాదచారి యై।యారాఘవుఁడు చిత్ర,కూటంబు సేరినఁ।గోసలాధి
పతి సంస్థితుం డైన।భరత నీ వప్పుడు, రప్పింపఁబడి మహీ।రాజ్య మొల్ల
నని రాముఁ బ్రార్థింప।జనపతి రాకున్నఁ, దత్పాదుకలు దాల్చి।ధరణి యేలు
తలఁ పేమియును లేక।తాపసవేషంబు, గైకొంటి విచ్చోటఁ।బ్రాకటముగ
నీప్రసంగ మీవు।నెఱుఁగుదు వటమీఁద, వెలఁది లక్ష్మణుండు।వెనుక నరుగ
దానవోగ్ర మైన।దండకాటవిని వి,రాధుఁ జంపెఁ గడఁక।రామవిభుఁడు. 2549
వ. అంత సాయంతనసమయంబున శరభంగునాశ్రమంబు సేరి తపోధనుల నూఱడించి జనస్థానంబునకుం జని విచ్ఛిన్నశూర్పణఖాకర్ణనాసుం డై ఖరదూషణత్రిశిరః

ప్రముఖచతుర్దశసహస్రరాక్షసులం జంపె నంత శూర్పణఖానివేదితస్వజనవృ
త్తాంతుం డై పౌలస్త్యుండు మాయాదక్షుం డైనమారీచుం దోడ్తేర నద్దానవుం
డు మృగరూపంబు ధరించి రామాశ్రమంబునకుఁ జనుదెంచి. 2550

సీ. అంతంతఁబొడసూపు । నడఁగుఁ జేరువ నేఁగుఁ, బొదలఁగు నిలుచును । బెదరుఁ గలఁగుఁ
గదలుఁ గ్రమ్మఱవచ్చు । నెదురుగా నేతెంచు, మగిడి యుప్పరవీది । కెగయు దెసలు
సూచును దరువులు । సొచ్చి లేఁదలిరులు, చవిచూచు దర్భలు । చప్పరించు
మృగయూథములఁ గని ।[1] యెగయుచు నల్లన, గొమ్ముల నంగంబు । గోఁకికొనుచు
నున్న నట్లు మృగంబు న । య్యుర్విజ చూచి, దీనిఁ దెమ్మన్న నజ్జగ । తీవిభుండు
చటులశరచాపహస్తుఁ డై । చనియె నట్ల, యతనితమ్ముఁడు లక్ష్మణుఁ । డరిగె నంత.

క. మునివేషంబున జానకిఁ, గొనిపోవఁగఁ బంక్తిముఖుఁడు । ఘోరాకృతి యై
చనుదెంచి యజ్జటాయువు, దనుజపతిం దాఁకి కూలెఁ । దద్ఘనహేతిన్. 2552

తే. ఆజటాయువు నిర్జించి । యసురవిభుఁడు, సింధునాథుని లంఘించి । సీతఁ గొనుచు
లంకలోపల వనభూమి । శంక లేక, యునిచె నెమ్మదిఁ దత్సతి । నుత్సుకతను.

వ. అంత దాశరథులు సీతను వెదకుచువచ్చి దశాననహేతిహతపక్షీంద్రప్రకటితజాన
కీవృత్తాంతులయి గోదావరీతటంబునఁ గ్రమ్మరుచుం గబంధువధియించి తన్నియో
గంబున శబరిం గాంచి పంపాతీరంబున నన్నుం గని సంభావించి ఋశ్యమూకా
ద్రియందు సుగ్రీవునితో బద్ధసఖ్యులయి వాలిం బొలియించి తత్పదంబునఁ
సుగ్రీవు నునిచి యంగదు యౌవరాజ్యంబున కభిషిక్తుం జేసి రంత భానుసూ
నుండును సీత వెదకం గపులఁ బనుప నేనును సంపాతివచనంబున నుల్లంఘితసా
గరుండ నయి లంకయందు సీత నీక్షించి రామదత్తం బైనయభిజ్ఞానం బిచ్చి
యప్పురంబు దహించి హతరాక్షసుండ నయి మగిడి రామునకుఁ దద్వృత్తాం
తంబు సెప్పినం గపిసేనాసమేతుం డై సముద్రతీరంబున విడిసిన. 2554

సీ. అంత రావణు దిగ । నాడి విభీషణుఁ, డర్కకులాధీశు । నాశ్రయించె
వానరోపేతుఁ డై । వారాశి బంధించి, వీరుఁడు లంక పై । విడిసి కుంభ
కర్ణాదిదైత్యులఁ । గడతేర్చి రావణుఁ దెగటార్చి జగములఁ । దేజ మెసఁగ
దైత్యరాజానుజుఁ । దత్పురాధిపుఁ జేసి, సరసిజగర్భాది । సురులచేతఁ
దగినవరములు గొని యట । దశరథేశుఁ, గాంచి ప్రణమిల్లి యగ్నిము । ఖంబునందు
శుద్ధయగుసీతఁ గయికొని । శుభవిమాన, మెక్కి రాక్షసవానరో । పేతుఁ డగుచు.

తే. వచ్చి రఘుపుంగవుఁడు భర । ద్వాజుపావ, నాశ్రమంబున నున్నవాఁ । డనఘచరిత
యఖిలపౌరుల కానంద । మతిశయిల్ల, నెల్లి నిక్కువ మిక్కడి । కేఁగుదెంచు.

క. అనవుడు నాతనిపలుకులు, విని మిక్కిలి సంతసిల్లి । వేడుక శత్రు
ఘ్నునిఁ గాంచి పలికె నుగ్గల, ఘనతరసమ్మోదబాష్ప । కణములు దొరఁగన్.

1. యగలించు నల్లన.

చ. తడయక నీ వయోధ్యకు ముదంబున నేఁగి మహోత్సవంబు పెం
పడరఁగఁ జాటఁ బంపుము ప్రియంబున సౌధములందు వీథులం
బడగలుఁ దోరణావళులు భాతి దలిర్పఁగఁ గట్టఁ బంపు మీ
యెడ నెడలేక భద్రము లనేకము లుర్వి విలసిల్లునట్లుగాన్. 2558

ఆ. అమల మయినరాఘవాస్థానగృహమున, సింధుబంధనాదిచిత్రకథలు
వ్రాయఁ బంపు దేవ వసుమతీసురమందిరము లలంకరింప రమణఁ బంపు.

క. రాముఁడు దశముఖుఁ బొరిగొని, శ్రీమహితుం డెల్లి వచ్చు సిద్ధ మనుచుఁ ద
ద్భూమీశుల నిట రమ్మని, వే మనుజులఁ బంపుమా పవిత్రచరిత్రా. 2560

వ. అనిన శత్రుఘ్నుండు నని జననీవర్గంబునకు రాఘవాగమనంబు చెప్పి యధికారి పురుషుల రప్పించి సాకేతపురనందిగ్రామమధ్యపథంబు సవరం జేసి కస్తూరికాఘనసారమిళితచందనరసంబున నపనీతరజంబు గావించి [1]శోభితార్థంబుగాఁ గ్రొవ్విరులు నెఱపి పొడయెండయుఁ బొలయనీక కేతనంబులు గట్టించి తత్ప్రదేశంబు లలంకరింపం బంపుం డని నియోగించినయనంతరంబ. 2561

సీ. ఘనసారచందనకలితజలంబుల, లలి మణివేదిక లలుకువారుఁ
దారాగణోదారతారమౌక్తికములఁ, బెంపార ముగ్గులు పెట్టువారు
మణిమరీచులు నభోమణిదీధితులఁ గప్ప, నెలమిఁ గేతనతతు లెత్తువారు
సుకుమారపిప్పలచూతపల్లవములఁ, గడఁగి తోరణములు గట్టువారు
సౌధవాతాయనంబుల సరస వెడల, మంచిధూపంబు లెలమి నమర్చువారుఁ
జారుమంగళధీరఘోషములు వెలయ, మించితూర్యములొగినివాయించువారు.

వ. అంత ననంతసేనాసహితసేనాపతిదండనాథులును నానాపురాణేతిహాసకుశలులగు పౌరాణికులును జతురామ్నాయచతురు లగుమహీసురులును ధృష్టి జయంత విజయ సిద్ధార్థ ధర్మపాలాశోకమంత్రిపాలసుమంత్రప్రముఖు లగుమహామాత్యులును మార్దజిక వాంశిక వైణిక వైణవిక గాయక నర్తకాదు లగుకుశీలవులును లావణ్యసాగరసముద్ధృతలక్ష్మీప్రతియాతనంబు లగుశరీరంబుల నొప్పు వారవిలాసినులును వందిమాగధులును హస్తిపకసారథిపదాతివరసహస్రంబులును బంధుమిత్రధాత్రీపాలబాలవృద్ధులును జనుదేర శిబికాందోళికాకర్ణీరథగజవరాశ్వోష్ట్రాదియానారూఢు లయినవారలచేతం బరివేష్టితుం డయి కౌసల్యాకైకేయీసుమిత్రాసమేతంబుగా శత్రుఘ్నుండు పంచమహాశబ్దంబు లులియ వచ్చి భరతునకు మ్రొక్కి నిలిచియున్నఁ దదవసరంబున. 2563

క. ధర గదలఁ గొండ లగలఁగ, వరరథహయగజపదాతివర్గస్థితి భూ
వరులు గొలువంగఁ గదలెను, భరతుం డానందసారభరితాత్ముం డై. 2564

క. మానుషరూపంబునఁ బవ, మానతనూజుండు దనరి మంజులదంతా

1. గుల్భద్వయసమంబుగాఁ గ్రొవ్విరులు.

నూనరుచి నిగుడ నిట్లను, భానుకులప్రవరుఁ డైన § భరతునితోడన్. 2565

శా. కంటే ముందట మింట నూర్జితగతి § క్రాంతాఖిలాశాంత మై
ఘంటాగర్ఘరికానినాద మొదవం § గా సాంద్రతేజంబు లే
వెంటం బాఱఁగఁ జారుహేమమణిది § గ్వీథీక మై వచ్చె ము
క్కంటిం బోలునృపాలుపుష్పకము వే § గక్షిప్తపక్షీశ మై. 2566

—భరతుఁడు రాము నెదురుకొనుట.—

క. వనవాసపరిక్లేశం, బున నెంతయు డస్సి వల్క § భూషితతనుఁ డై
యనుజన్మసేవితుం డగు, జనకసుతాసహితు రామ § చంద్రునిఁ గంటే. 2567

వ. అని సుగ్రీవజాంబవత్సుషేణులను విభీషణాదులను జూపిన నతండు పరమానందంబునం బొంది యద్దివ్యవిమానంబు గనుంగొని నమస్కరించి ప్రాచీశైలోపరిభాగంబున నొప్పుపద్మబాంధవుమాడ్కి నిజప్రకాశదీప్తదిగ్వలయుం డై యున్న యారాఘవుం జేరి సాష్టాంగనమస్కృతి సేసి యగ్రజుచేత నాలింగితుం డై యతం డంకపీఠంబున నునిచి నఖాగ్రంబులఁ గపోలంబులు పుణికి యానందాశ్రుతిరోహితనయనుం డై విఘ్నీభూతతద్దర్శనుం డగుటయు మ్రొక్కి మ్రొక్కి పునఃపునరాలింగితుం డై తదనంతరంబ. 2568

క. అకలంకుఁ డయినలక్ష్మణు, నకు ధరణీతనయకుం బ్ర § ణామము సేసెఁ
వికచాననుఁ డై నామముఁ, బ్రకటించుచు భరతుఁ డంతఁ § బ్రముదితుఁ డగుచున్.

వ. విభీషణసుగ్రీవజాంబవదంగదాదుల నాలింగనంబు సేసి వార లటమున్న నరరూపధరు లై యుండుటం జేసి మనోహరాకారు లగువారలకుశలం బడిగి తదనంతరంబ విభీషణుం గనుంగొని. 2570

క. దనుజాధిప నీకతమున, మనుజాధిపుఁ డని [1]గతప్ర § మాదుం డై యే
పున మిగిలినదశకంఠునిఁ, దునుమాడె నుదగ్రశస్త్ర § దోర్వీర్యములన్. 2571

తే. అనియె వేడుక శత్రుఘ్నుఁ § డరుగుదెంచి, దశముఖాచలవజ్రపా § దముల కెరఁగి
పంబి లక్ష్మణునకుఁ బ్రణా § మంబు సేసి, ముదము నొందుచు సీతకు § మ్రొక్కె నెలమి.

క. పతినిధనంబునఁ గృశ యై, హతపాదపవల్లికరణి § నాత్మజశోకా
వృత యగుకౌసల్యకు భూ, పతి సాఁగి నమస్కరించె § భక్తిభరమునన్. 2573

క. చన్నుల మొగిఁ బాలొలుకఁగఁ, గన్నులబాష్పములు దొరఁగఁ § గాఁ దల్లిసమా
సన్నుఁ డగుకొడుకుఁ గౌఁగిటఁ, జెన్నగునెయ్యమునఁ జేర్చి § చెలఁగెం బ్రీతిన్.

ఆ. తనరఁ గేకయేంద్ర § తనయకుఁ బ్రణమిల్లి, యట సుమిత్ర కెరఁగి § యవనివిభుఁడు
ననుపమానతత్త § దాలింగనాదిసం, భావనలఁ దనర్చె § భానుకులుఁడు. 2575

ఉ. అత్తఱి సీత యత్తలకు § నందఱకుం దగ మ్రొక్కి యున్న వా
రత్తరళాక్షి నత్తి ప్రియ § మారఁగఁ గౌఁగిటఁ జేర్చి సాధ్వి నీ

1. గతప్రమాదుం డై.

యుత్తమసచ్చరిత్రమున । యుద్ధమునన్ రఘువల్లభుండు దాఁ
దత్తదుదగ్రదానవుల।దర్ప మడంచె విపద్విదూరుఁడై. 2576

వ. అంత. 2577

క. సోదరవనితాయుతుఁడై, మోదంబున నవ్వసిష్ఠ।మునిపతివిలస
త్పాదముల కెరఁగి గురువిన,యాదరములతోడ మానవాధిపుఁ డెలమిన్.

ఆ. తలఁచినపుడ నీవు । తడయక రమ్మని, పూజచేసి ధనదు।పుష్పకంబు
నృపతి వీడుకొల్పె । నెటి నుత్తరమునకు, నరిగి యాకుబేరు । నాశ్రయించె.

చ. దురితవిదూరుఁడైనభర।తుండు కృతాంజలియై వసుంధరే
శ్వరుఁ డగురాముతో ననియె । నప్రణయాదరభక్తినమ్రుఁడై
తిరముగ నేఁటిదాఁక భవ।దీయపదంబులయందు ధారుణీ
భర మిడి నీదురాజ్యము వి।భావమునం బరికించితిం దగన్. 2580

క. దేవరయానతి తప్పక, యావరపాదుకలు గొలిచి । యిల్లూ రనుసం
భావనతో నిలఁ గాచితి, నేవెంటం దప్పు లేక । యినసమతేజా. 2581

చ. అని తనయిష్టదైవతము । లై తనరారుచు నున్నపాదుకల్
గొని చనుదెంచి భక్తి నొడఁ।గూడఁగ మంగళతూర్యనాదముల్
ఘనముగ మ్రోయుచుండ దశ।కంధరవైరిపదంబులందుఁ బెం
పునఁ బ్రమదంబుతోఁ దొడిగి । భూనుతపుణ్యచరిత్రుఁ డిట్లనున్. 2582

క. గిరిగజఫణిరాజులచే, ధరియింపఁగఁ దగినధరణి।భారమ్ము దగం
గరికలభము రాజిలమును, ధరియింపఁగ నెట్టు లోపు । దానవభేదీ. 2583

క. అవిరళ మయి భువనంబులఁ, గవియునభేద్యోద్ధతాంధ।కారము నెఱుపన్
రవి దక్కఁగ ఖద్యోతము, వివరింప సమర్థ మగునె । విశ్రుతచరితా. 2584

సీ. దివసకృత్యము లెల్ల । దివసాంతమున నీదు,పాదుకలకు విన్న।పంబు సేసి
కాని నిద్రింప మ।హీనాథ [1]యిల్లూరు,సొమ్మును నేమఱు।చొప్ప లేద
యవధరింపుము ధాన్య।భవనముల్ కోశగృ,హమ్ములుఁ గరిరథ।హయపదాతి
వర్గముల్ నీప్రభా।వంబున దశగుణి,తంబులై యున్నవి । ధర్మవృత్తిఁ
దప్పి శాసింపఁ బ్రజల ను।దారవృత్తి, నున్నవారలు బాధల । నొంద రెలమిఁ
బ్రాకటేప్సితసంసిద్ధి । నాకుఁ గలిగె, ననఘవృత్తి కృతార్థుఁడ । నయితి నేఁడు.

ఉ. కావున నీవ ధారుణికిఁ । గర్తవు భర్తవు [2]శాసితుండవుం
గావఁగఁ బ్రోవ దక్షుఁడ వ।ఖండితశాసనవైభవాదినం
భావనతోడ నీభువన।భారము నెల్ల వహించి సర్వమో
దావహ మైనరాజ్యముఁ బ్రి।యంబునఁ జేకొను మిద్ధపౌరుషా. 2586

1. యిల్లూరసొమ్మని యేమఱుచొప్ప లేక. 2. 'శాసితుం' డనియే శాసకపర్యాయముగా తిక్కవిప్రయోగము.

సీ. నేఁడు నాకోర్కులు నివ్వటిల్లఁగ నయోధ్యకుఁ బోవవలయును ధరణినాథ
యీనారచీరలు నీజటాభారంబు, విడిచి యీతాపసవేష ముడిగి
మహనీయరాజార్హమంగళాలంకార,ములు దాల్చి సాంద్రప్రమోద మెసఁగ
మాన్యబాంధవమిత్రమంత్రివర్గంబుల, చిత్తాభిలాషముల్ చెలువు మిగులఁ
గరము గన్నులపండువుగా సమస్త,జనులువిప్రులుమునులు నుత్సాహమొంద
నెఱయ నావిన్నపమ్మును నీవు ప్రీతి, నవధరించుట యొప్పగు నవనినాథ.

వ. అనవుడు [1]భక్తిప్రణయపూర్వకంబు లగుభరతుపలుకులకు సంతసిల్లి యంగీకరించిన శత్రుఘ్నుపనుపునం బ్రసాధకులు వచ్చి భరతపూర్వకంబుగా రామలక్ష్మణులజటాభారంబు లల్లన వెరవుతోడ విడిచి యతిసురభితైలాభ్యంజనం బాచరించిన నిర్వర్తితోద్వర్తను లయి మంగళాభిషేకం బవధరించి సహవర్తిసుగ్రీవాదివానరేంద్రవిభీషణాదినక్తంచరాభిషేకు లై తదనంతరంబ. 2588

తే. శేషనిర్మోకనిర్మలస్ఫీతపట్ట,వస్త్రములు దాల్చి హరినీలవర్ణుఁ డైన
రామచంద్రుండు విమలశారదపయోద,పరివృతాసితశైలంబుభాతిఁ దనరె.

క. నునువెన్నెలఁ దడఁబఱిచెడు,ననులేపన మమర నలఁది యాతతశోభా
జనితాలంకృతి నెంతయుఁ, దనరినతొడవులు ధరించె ధరణీపతియున్. 2590

క. భరతుఁడు నాసౌమిత్రియుఁ, దరణిజుఁడును దైత్యవిభుఁడుఁ దక్కినవారుం
వరభూషణాంబరాదుల, నురుతరశోభావిభూతి నొప్పిరి మిగులన్. 2591

తే. దశరథేశ్వరుతరుణులు ధరణిసుతకు, నిబిడనిర్భరహార్దంబు నివ్వటిల్లఁ
జెలువు దళుకొత్తఁ జేయారఁ జేసి రెలమిఁ, గారవంబునఁ దగునలంకారవిధులు.

శా. సుగ్రీవాదికపీంద్రకాంత లెలమిం శోభావహాకల్పసా
మగ్రీభాస్వరమూర్తు లౌచు నపరిమ్లానోత్సవశ్రీకరో
దగ్రస్మేరముఖంబులం దనరి యుద్యచ్చంద్రరాజత్త్రియా
మాగ్రస్ఫారరుచిం దలిర్చి రట దీవ్యద్రత్నహారోన్నతిన్. 2593

వ. అంత శత్రుఘ్నుపనుపున సుమంత్రుండు సజ్జంబుగా రథం బమర్చి తెచ్చిన. 2594

క. సురరాజు వరుణహస్తం, బరుదారఁగఁ బట్టి యెక్కునపనుపున ధాత్రీ
వరుఁడు భరతుచే యూఁదుచు, సురుచిరగతి నరద మెక్కెఁ జూపఱు లలరన్.

క. తనకంటె మును వసిష్ఠుం, డనుపమశోభనముహూర్త మరయుట కై యె
క్కె ననూనరథము మంగళ,జననమహామంత్రపఠనచతురాననుఁ డై. 2596

క. విలసన్మణిరంజిత మై, జలజాహితచారుబింబసమ మై దుగ్ధా
బ్ధిలసత్ఫేనసదృశ మై, పలితం బగుతెల్లగొడుగు భరతుఁడు పట్టెన్. 2597

క. కమలాసనహంసద్వయ,విమలము లగుచామరములు వేడుకతోడం
యము లొగి వీచిరి పుంజిత,హిమధామకరంబు లన మహీపతి కెలమిన్. 2598

1. భరతుభక్తిప్రణయంబులకు సంతసిల్లి.

తే. భూధరంబునఁ దనరారు భూతపతియుఁ, బోలె నత్తఱి రాక్షసపుంగవుండు
చారుహిమధామమండలసదృశమైన, రథ మధిష్ఠించి వెనుకనరమణఁ గదలె.

క. శత్రుంజయనామక మగు, గోత్రాచలసదృశమైన కుంజరపతి నా
మిత్రసుతుఁ డెక్కి కదలెను, సుత్రాముఁడపోలె విభవశోభితుఁ డగుచున్.

క. అందలము లెక్కి వానర,సుందరులు ప్రియంబుతో వసుమతీసుత నా
నందమునఁ గొల్చి చనిరి పు,రందరుసతిఁ గొల్చువిబుధరమణులుపోలెన్.

చ. అడవులలోనఁ గొండలఁ బ్రయానము నాక సుఖైకలీలలై
నిడుమలఁ బొంది ధైర్యమున నెంతయు వంతల కోర్చి నేఁడు మా
కొడుకులు పుణ్యశీల యగుకోడలు నిమ్మెయి వచ్చి రంచుఁ జొ
ప్పడర మహీశుభార్యలు ప్రియంబున నేఁగిరి హృష్టచిత్తలై. 2602

క. కర్ణాంతాయతనేత్ర సు,వర్ణసువర్ణోజ్జ్వలాంగి వరమణిభూషో
దీర్ణ యగుజనకనంగన, కర్ణిరథ మెక్కి కదలెఁ గౌతుక మెసఁగన్. 2603

—❖ రామునియయోధ్యాపురప్రవేశము. ❖—

వ. అంతఁ బౌరులు యథోచితవాహనంబు లెక్కి పరివేష్టింప నానావిధభృత్యులుం బరిచారకులు నంతంతఁ జనుదేర విజయాదిమంత్రివర్గంబు సుగ్రీవాదివానరపరాక్రమంబులు దనవలన వినుచుం జనుదేరఁ బురోహితవిప్రవర్గంబులు ముందటం జన నుభయపార్శ్వంబుల గజారూఢులై వాలితనయపవనతనయు లరుదేర రథాధిష్ఠితుం డగువిభీషణుండు చరమభాగంబున నడవ నెడనెడ ననేకాశీర్వాదంబులు సేయువిప్రజనులవాక్యంబులు నిగుడ సేతుబంధనాదిప్రసంగంబులు సంకీర్తించు వందిమాగధాదులస్తుతివచనంబులు బెరయ భేరీభాంకారంబులుఁ బటహపటుఘోషంబులుఁ గాహళబహుళరవంబులును దిక్కుహరస్పర్శిఢక్కానిక్వాణంబులును మృదంగమంగళరవంబులును శంఖవిరావంబులును డోలికాధ్వానంబులును గాంస్యమయతూర్యనిస్వనంబులు వివిధనాళీభేదారావంబులును మత్తసింధురబృంహితంబులును జటులఖురపుటదళితధరాతలతురగహేషితంబులును బ్రసర్పిస్యందననేమిధ్వనులును బ్రహృష్టసుభటోద్భటకలకలంబులును సందర్శనాగతపురజనకోలాహలంబులును నొక్కటయి బోరుకలఁగ రఘునాథునిరథాగ్రభాగంబున వృద్ధపురంధ్రీవర్గంబు ముఖవిన్యస్తనవామ్రపల్లవాశ్వత్థకిసలయపూర్ణసువర్ణకలశహస్త లయి మంగళగానంబులు సేయుచు నడవ నంతంత దూర్వాక్షతకుసుమలాజలు మీఁదఁ జల్లుచుం బౌరకామిను లరుగఁ దారాగణసహితుండైనచంద్రుండునుంబోలె విలసిల్లుచు రామచంద్రుండు నిజరాజధాని యగు నయోధ్యానగరంబుఁ బ్రవేశించె. 2604

ఆ. అంతఁ బౌరు లెల్ల నక్కడ నక్కడ, సంతసంబు నొంది జలజమిత్ర
కులపవిత్రుఁడైనకోసలేశ్వరుఁ జూడ, నరుగుదెంచి యతిరయంబుతోడ. 2605

వ. తమలో నిట్లనిరి. 2606

సీ. ఆలిమాటలకు భూపాలుండు వీరల, బేలయై యడవికి § నేల పంపెఁ
దనయులతోఁ బాసి § తల్లు లేక్రమమున, నుల్లంబులను నోర్చి § యుండిరొక్కొ
యంటినఁ గందెడు §[1]నంగంబు గలసీత, యలయక వనముల § మెలఁగె నెట్లు
కొడుకునకై యిట్టి § ఘోరంబు సేసిన, యింతి యాకైకేయి § యేమి గనియె
విమలమంగళచరితులు § వీరు లేని, పురములోపల నిలువంగఁ § బోలు నెట్లు
మనకుఁ దొల్లింటిపుణ్యంబు § మహిమఁ జేసి, సాలవ కెప్పటి వీరలఁ § జూడఁగలిగె.

క. తనపిన్ననాఁడ తాటక, దునిమెం గౌశికుమఖంబు § దొలఁగక కాచెన్
మనసిజహరువిలు విఱిచెను, మునుకొని యాజామదగ్న్య § ముని భంజించెన్.

తే. తండ్రి పంపున నడవికిఁ § దపసియగుచుఁ, జని విరాధునిఁ దునుమాడి § దనుజసమితిఁ
గూల్చి సుగ్రీవుతోఁ దగఁ § గూర్మి చేసి, వాసవాత్మజు నతిశూరు § వాలిఁ దునిమి.

క. సింధుగభీరుఁడు వారిధి, బంధించి సమగ్రకీశ § బలసహితుం డై
సంధానుకూలముగ దశ, కంధరుఁ దెగటార్చె నితఁడ § కంపితబలుఁ డై. 2610

క. జనకునిపనుపున నడవికిఁ, జనునప్పుడు నేఁడు మగిడి § జనతతు లలరం
జనుదెంచునపుడు నానన, వనజముఁచి యొక్కరూప § వర్ణింపంగన్. 2611

తరల. ఘనభుజాయుగశక్తిమైఁ ద్రిజ § గంబులన్ సురరాజుఁ గై
కొనక మాయల దుర్జయుం డయి § క్రూరసాహసచేష్టలం
దనరుశూరుని మేఘనాదుని § దర్ప మంతయుఁ దూలఁగాఁ
దునిమి తేజము నొందులక్ష్మణుఁ § దోయజానన చూచితే. 2612

మత్తకోకిల. పాపచేష్టితుఁ బంక్తికంధరుఁ § బాసి యీరఘురామునిన్
భూపతిన్ శరణంబు సొచ్చెఁ బ్ర § భూతసద్వినయంబునం
బ్రాపు గల్గి సమగ్రపుణ్యవి § భావ మొప్పగువాఁడు లం
కాపురీపతి యైనదైత్యని § కాయవల్లభుఁ జూచితే. 2613

పృథ్వీవృత్తము. ఇతండు హరిసూనుసోదరుఁ డ § హీనసత్త్వోద్ధతుం
డతం డరయ వాలినందనుఁ డు § దారశీలుండు వాఁ
డతుల్యబలపౌరుషుం డురుభు § జార్జితారాతి యూ
ర్జితప్రకటకీర్తి కాంతుఁడు సు § షేణుఁ డబ్జాననా. 2614

క. వనరాశి దాఁటి జానకిఁ, గని లంకానగర మెల్లఁ § గాలిచె నీతం
డనిలోఁ గూలినలక్ష్మణు, మనిచెన్ సంజీవి దెచ్చి § మహితబలుం డై. 2615

క. ఇలపైఁ గలశైలంబుల, జలనిధి బంధించి విపుల § సారము పేర్మిన్
లలి లంకకు నడపించిన, నలుఁ డితఁడు విశ్వకర్మ § నందనుఁ డబలా. 2616

క. జగములఁ గలవీరులలో, నెగడినవాఁ డితనిపేరు § నీలుఁడు ఘోరం

1. వందంబు గల.

బగురణములోఁ బ్రహస్తుం, డెగటార్చె ననూన మైన । తేజం బెసఁగన్. 2617

క. తారావల్లభసమరుచి, తారావల్లభుఁ డితండు । దానవసేనా
పారావారౌర్వానల, సారభుజుం డర్కజుండు । చంచలనయనా. 2618

చ. అని ముద మంది పౌరజను । లందఱునుం దమలోన నిట్లు పెం
పొనరఁగ వేడ్కఁ జెప్పుకొను । చుండఁగ రాఘవుఁ డింద్రగేహమం
దనసమపూర్ణవైభవవి । డంబన మై తనరారుచుం గన
త్కనకమయాలయాతిసము । దంచితరాజగృహంబు సొచ్చినన్. 2619

క. పరమానందామృతరస, భరితాంతఃకరణు లగుచుఁ । బౌరు లమందా
దరు లై తమతమయిండ్లకు, నరిగిరి రవివంశవల్ల । భాశ్రితకరు లై. 2620

వ. అంత ననంతప్రసాదసుందరుం డగురఘునందనుండు భరతశత్రుఘ్నులం జూచి మణికనకరమణీయంబు లగుమందిరంబులు గలిగి యుపకంఠస్థితపల్లవితకుసుమితఫలితతరువాటికాశోభితం బగుస్థలంబున సుగ్రీవునిం దత్సమం బగుప్రదేశంబున విభీషణుని విడియించి నలనీలాంగదహనుమత్సుషేణజాంబవదాదులకుం దగినవీడుఁబట్లు చూపి సముచితభక్ష్యంబులు యథోచితంబుగా సమకూర్చి రండని పంచిన వార లట్ల చేయం దరణితనయాదులు మనోనురూపమజ్జనభోజనాదుల నపనీతప్రస్థానఖేదు లయి సుఖం బున్నంత భరతుండు మందస్మితచంద్రికాసముల్లసితవదనచంద్రుం డై సుగ్రీవున కి ట్లనియె. 2621

ఉ. స్వీకృతపుణ్యశీలుఁడు వ । శీకృతసర్వనిలింపనాథుఁ డూ
రీకృతధర్మమార్గుఁ డుర । రీకృతనీతివిశారదుండు దూ
రీకృతదుష్టచేష్టుఁ [1]డు స । రీకృతదానవవల్లభుండు మో
ఘీకృతవీరవైరి సుము । ఖీకృతధీరుఁడు రాఘవుం డిలన్. 2622

క. శరణాగతవత్సలునకుఁ గరుణామృతమానసునకు । ఘనతరతేజ
స్స్ఫురణాపరిణతమయునకుఁ, జరణానతరక్షకునకుఁ । జతురాత్మునకున్. 2623

క. క్షితినాథశిఖామణికిని, జితవైరికి భక్తలోక । చింతామణికిం
దతకాంతినిశామణికిని, బ్రతీతతేజోనుభావ । భరదినమణికిన్. 2624

క. రాజీవదళాక్షునకును, రాజితబహుధర్మనిరతి । రణదక్షునకున్
రాజితపృథువక్షునకును, రాజసదృక్షునకుఁ బతికి । రాముని కెలమిన్. 2625

క. పట్టము గౌతూహలమునఁ, గట్టంగా వలయు నెల్లి । కమనీయగతిన్
నెట్టన సంభారంబులు, గట్టిగ నాయితము లయ్యెఁ । గమలాప్తసుతా. 2626

తే. ఘననదీశతతీర్థోదకములు నబ్ధి, వారిపూరంబుఁ దెప్పింప । వలయుఁ గాన
వానరేంద్రులఁ బంపుము । వలనుగాఁగ, నుదయవేళకుఁ జనుదేర । నోజచేసి.

ఉ. అనినన్ సంతస మంది భానుతనయుం । డత్యాదరోల్లాసి యై

1. డుపరీకృతదానవ.

మన మారంగ మనోజవం బొదవ సన్మానైకసత్వాద్యధీ
ను నుదగ్రుం డగుజాంబవంతుని సుషేణుల్ వేగదర్శిం గ్రమం
బున గంగాదికపుణ్యతీర్థసలిలంబుల్ దేరఁగాఁ బంపుచున్. 2628

వ. గవాక్షుం బూర్వసముద్రంబునకు ఋషభు దక్షిణాంబుధికి నలుం బశ్చిమపయో
ధికి హనుమంతు నుత్తరపారావారంబునకు నరుగ నియమించి వారలచేతికిం
గనకకలశంబు లిచ్చి పంపిన వార లతిత్వరితగమనంబునం [1]దత్తీర్థనదీపరికలిత
పుణ్యసలిలంబులుం జతురుదన్వదుదకంబులుం దేరం జనిన. 2629

—ప్రాతస్సాయంకాలములవర్ణనము.—

ఆ. మఱ్ఱులీనుఁ డైనమనువంశపతి యెల్లి, యతులరాజ్యపదము నందు నాకు
నింకఁ దడవుసేయ నేటికి ననుభంగి, నస్తశిఖరిఁ జేర నరుగఁ డంత. 2630

చ. ఉరుతరకుంకుమారుణపయోధర యై కరసక్తభాసురాం
బర యగుపాశహస్తుదెస భానుఁడు చేర దృఢానురాగసుం
దర యగుతూర్పు దాల్చె నుచితస్థితి లేనిదపోలె నన్యుఁడిట్
మరగినయింతి కాంతులకు మానుగఁ బశ్చిమగణ్య యే కదా. 2631

చ. రవివరబింబ మూర్ధ్వగతరశ్మిక మై పరిలంబమాన మై
వరుణహరిద్వధూటి తగ వారిధితోయము చేదు వేడుకం
గరపరిముక్త మైనకనకంపుఘటం బనఁ జక్రవాకికా
విరహకృశానుకూట మన వీక్షణదృశ్యత నొందె నెంతయున్. 2632

చ. తరువులయందుఁ బల్లవపదస్థితి నద్రులయందు ధాతుబం
ధురగతి నంగనాజనపృథుస్తనమండలిఁ గుంకుమంబు నై
పరఁగుచు సాంధ్యశోణిమ విభాసుర మై జలనాథదిక్తట
[2]ద్విరదముకుంభసంభవనవీనగళద్రుధిరంబు నాఁ దగెన్. 2633

తే. విపులతర మైనకమలినీవిరహ మంది, పల్లవారుణభాసురపటల మమర
నంగజాగ్నికి [3]నోర్వనియట్లపోలె, వనజినీపతి వారాశి మునిఁగె నంత. 2634

చ. చెలు వగుభంగిఁ గించిదవశిష్టసిమీలనవారిజాస్య యై
జలజిని భానుమద్విరహసంభృతఖేదయపోలె విన్న నై
చలదగురుసౌరభోచ్ఛ్వసితసంకుల యై ప్రవిశన్మధువ్రతా
[4]విలరవ ముప్పతిల్లఁగ నవీనదశాంతర మొందె నెంతయున్. 2635

క. కవ వాసినకతమున జక్కవ లంతను విరహదాహకలితమనములం
బవలింటికూర్మి దలఁచుచుఁ, బొవులుచుఁ గాసారకూలభూముల నుండెన్.

చ. లలితగతిం గళంబులు మరలంచి తనూరుహజాలమధ్యమం

1. దత్తీర్థనదీపంచకళతపుణ్యసలిలంబులు. 2. ద్విరదళకుంభసంభవనవీనగళద్రసరాజి నాఁ దగన్. 3. నోర్వమినట్లుపోలె. 4. విలపము లుప్పతిల్లఁగ.

బుల నిడి యింపుతో దివసభు క్తమృణాళము లైనరాజహం
సలు వరటాసమేతముగ సంభృతనిద్రల నొప్పి నిమ్నగా
పులినపరార్ధ్యతల్పములఁ బొందుగ నుండె నెల్లెడన్. 2637

ఆ. సురతనాటకంబు దొరఁకొన రాతిరి, కరపుటమునఁ జల్లువిరు లనంగ
నెఱసె నంబరమున నెఱిఁ దారకలు వియ, జ్జలధిఁ బెరుఁగు ఫేనసమితి యనఁగ.

చ. తన కరయుంగఁ దండ్రి యగుతామరసప్రియుఁ డంతరించినన్
మనమున శోకవేగ మది మానుపఁజాలక ఖిన్నమూర్తి యై
వెనుకన వచ్చు నయ్యమునవీచులఁ బోలుతమంబు లెల్లచో
మునుకొని నిండఁ బర్వె నతిమోహతరస్థితిభాసమాన మై. 2639

శా. పాతాళంబుననుండి వచ్చెనో నభోభాగంబునందుండి సం
ఘాతవ్యగ్రత నేఁగుదెంచెనొకొ దిక్చక్రంబునందుండి యు
జ్జాతం బై యరుదెంచెనొక్కొ యనఁగా సర్వంకషం బై తమో
జాతం బంతఁ బదార్థదర్శనవినాశక్షేమ మై పర్విసన్. 2640

చ. అమితలసత్ప్రకాశ మలరార నదృశ్యత నొంది పోవుఁ దే
జము దగ లేక యున్నరథసంబున నప్పుడ తోఁచు నింద్రజా
లము దగ నేర్చు చందమున లాఘవవృత్తి వహించుచున్నయా
తిమిరము రాకపోకలు మఱదిం బరికింప నశక్య మేరికిన్. 2641

వ. అంత వివేకశూన్యం బగురాజుచిత్తంబునుంబోలె సమీకృతనీచానీచపదం బై కల్పావసానంబునుంబోలెఁ గ్రోడీకృతబ్రహ్మాండం బై కుకావ్యంబునుంబోలె నన భివ్యంజితపదార్థం బై వధూచేష్టితంబునుంబోలె ననిశ్చితతత్త్వం బై శబ్దావబో ధరహితకృతవాక్యబంధంబునుంబోలె సాశంకీకృతపదవిన్యాసం బై సూచి భేద్యం బగునంధతమసంబు కవచితగజాజినం బగుహరశరీరంబుగతిఁ గజ్జలపట లంబు నిగిడింపంబడినయట్లు భువనంబుం బొదువునవసరంబున. 2642

చ. కలువలవిందు జక్కవలగాలము తమ్ములకెల్ల వైరి చు
క్కలచెలికాఁడు చోరతతికన్నులనొప్పి తమంబుగొంగ జా
రులపెనుఁగాలిసంకలియ [1]రుద్రునిపువ్వు సుధాహ్రదంబు వె
న్నెలయనుతీఁగదుంప రజనీకరుఁ డొప్పె సురేంద్రుదిక్కునన్. 2643

చ. కుముదిని నవ్వె నత్తఱిఁ జకోరము గ్రొవ్వెఁ గరావరుద్ధ మై
కమలిని స్రుక్కె వారినిధి గ్రక్కున నిక్కె సమస్తచంద్రకాం
తములు కరంగె మన్మథుఁ డుదగ్రతఁ బొంగె వియోగిబృందమా
నములు దొలంగె దస్యులమనంబు కలంగెఁ గ్రమక్రమంబునన్. 2644

సీ. నెలకొన నమృతంబు నిండారఁ బోసిన, గోమరారురాజతకుంభ మనఁగ

1. 'రొక్కపుమేటి' అ. ప్ర.

జిరకాలసంభృతవిరహపాండుర మైన, వరయామినీవధూవదన మనఁగఁ
గాలసముద్రంబుఁ గాసి వచ్చినసుధా, గురుతరసారంపుఁగుప్ప యనఁగ
వలరాజు శృంగార మలవడ వీక్షింప, నమరింపఁ దగునిల్వుటద్ద మనఁగ
వెలయ రామునియభిషేకవిధికిఁ ద్రిదశ, కాంత లెత్తినమహాకీర్తికలశ మనఁగ
జీవలోకంబు మిక్కిలి చెలఁగిచూడ, మిగులఁజంద్రుండునభమునఁ బొగడ నెగడె.

వ. అంత. 2646

చ. తిమిరముఁ బాపి యంబుజతతిన్ వికసింపఁగఁజేసి చక్రవా
కములకుఁ బొందొనర్చి పరికల్పితదిగ్వలయప్రకాశుఁడై
కుముదిని నిద్రపుచ్చి పరికుంచితచంద్రమరీచిజాలుఁడై
సముదితుఁ డయ్యె భాస్కరుఁడు సర్వజగజ్జనబోధకారి యై. 2647

ఆ. కపివరేణ్యు లంత గౌతమీనది దాఁటి, సలిలపూర్ణకనకకలశహస్తు
లై రయంబుతోడ నరుదేర భాస్కరా, త్మజుఁడు భరతుఁ బలికె మనము చెలఁగ.

ఉ. తీర్థజలంబు గొంచు నరుదెంచిరి వీరె కపీంద్రు లింక నీ
వర్థి మునీంద్రులం బురజనావళిలన్ ధరణీసురేంద్రులం
బార్థివబృందముం బిలువఁ బంపు రఘూద్వహుమంగళాభిషే
కార్థము నిర్వహింపు జగదభ్యుదయం బొడఁగూడునట్లుగన్. 2649

మ. అని సుగ్రీవుఁడు పల్కినన్ భరతుఁ డుద్యన్మోద మొప్పం బురీ
జనులన్ విప్రుల రాజులన్ మునుల శశ్వత్ప్రీతి రప్పించినన్
ఘనగంభీరతదీయఘోషము చలత్కల్లోలమాలోల్లస
ద్వనధిధ్వానముపోలె నిండె నట దిగ్వ్యాప్తితంబునన్ భూమియున్. 2650

వ. అట భరతుశాసనంబున వసిష్ఠుండును విజయుండును జాబాలియుఁ గశ్యపముని యును గాత్యాయనుండును గౌతముండును వామదేవుండును భరద్వాజుండును గణ్వుండును నగస్త్యుండును మొదలుగాఁ గలతాపసోత్తములు చనుదెంచి రంత రత్నస్తంభనిర్మితంబును విచిత్రవితానశోభితంబును బినద్ధలంబమానవివిధమణి మాలికాకీర్ణంబును రత్నకుడ్యభాసమానంబును జంద్రకాంతకుట్టిమంబును ననూనామ్రాశ్వత్థపల్లవతోరణభాసమానంబును [1]నగుచతుష్కంబునందు మధ్యవిన్యస్తభద్రపీఠంబున బహువిధతూర్యమంగళఘోషంబు లులియ వందిమాగధస్తుతులు బెరయఁ బౌరజనసమ్మోదాలాపంబులు నెఱయఁ బుణ్యాంగనాభద్రగీతంబులు చెలంగ విప్రజనాశీర్వాదంబులు నిగుడ ద్వారోపాంతవిన్యస్తపూర్ణకలశసనాథం బగుమణిమండపంబు ప్రవేశించి యందు సీతాసమేతుం డగురామభద్రు నునిచి యవాంకురదూర్వాంకురప్లక్షచూతాదిమంగళౌషధీసనాథంబు లగుకలశోదకంబుల ఋగ్యజుస్సామాథర్వణమంత్రంబుల నభిషేకంబు,

1. నగుచతుఃస్తంభమంటపమధ్యవిన్యస్తభద్రపీఠంబున.

చేయునంతఁ గన్యకామహామాత్యమూలభృత్యమాగధులు నైగములు నభిషే
కించునవసరంబున.

—✤ శ్రీరామచంద్రపట్టాభిషేకమహోత్సవము. ✤—

ఆ. అమరలోకవిభుఁడు యముఁడును వరుణుండు, యక్షనాయకుఁడును హర్ష మెసఁగఁ
జెలఁగి రాఘవాభిషేకంబు చూడంగ, వచ్చి రఖిలవిబుధవరులతోడ. 2652

ఆ. మంత్రసంయుతంబు మంత్రనిబద్ధమై, ఫాలమందు హేమపట్ట మమరఁ
జలజటాంశుకపిలశశిఖండుఁ డగుభర్గు,పగిది నపుడు రామభద్రుఁ డొప్పె.

క. శతమఖుఁడు సౌరభాంగీ,కృతనందనమధుపగణపరిష్కారమహో
జ్జితకనకపద్మమాలిక, యతనికిఁ బుత్తెంచెఁ బ్రీతి ననిలునిచేతన్. 2654

ఆ. మహితనిఖిలరత్నమయ మగుహారంబు, నమరువేడ్కతోడ నమరవిభుఁడు
నెలమిఁగూర్మిమిగుల నిచ్చిపుత్తెంచిన, మఱియు ననిలుఁడొసఁగె మనుజపతికి.

ఉ. అంచిత మైనకూర్మి నమరాధిపుఁ డెల్ల సమీరుచేతఁ బు
త్తెంచినరత్నహారము ధృతిఁ ఘనశీలుఁడు రాఘవుండు పా
టించి ధరించి పొందు ఘటియించిన నుజ్జ్వలతారకాలిచే
మించినయభ్రమండలము మీఱె మనోహరదివ్యమూర్తి యై. 2656

తే. కంఠలగ్నకనకకమలమాలికచేతఁ, దనరెఁ జూడ నంత ధరణివిభుఁడు
చక్రవాకమిథునసంగతిచే నొప్పు, వరకళిందజాప్రవాహ మనఁగ. 2657

ఆ. మహితపద్మరాగమణికిరీటము దాల్చి, యుదయదర్కమండలోదయాద్రి
యనఁగఁ బొలిచెఁ ద్రిజగదభ్యుదయస్ఫూర్తి,మూర్తివై భవప్రమోద మెసఁగ.

వ. అంత రాఘవుండు వసుమతీదేవోత్తములకు ముప్పదికోట్లసువర్ణంబులును లక్ష
గుఱ్ఱంబులును నన్నియ మదగజంబులును గోటిపరిగణితంబు లగుసవత్సధేను
గణంబులును దాసదాసీజనంబులును బహువిధసస్యసమగ్రంబు లగుమహాగ్ర
హారంబులును ననేకాభరణంబులును నొసంగె నమ్మహోత్సవంబున. 2659

క. ధర సస్యసమితిఁ బొలిచెను, దరువులు గుసుమఫలరాజిఁ దనరారెఁ దగన్
విరులు సుగంధము లయ్యెను, బరువడి నెయ్యెడల నధికవిభ్రమము లయ్యెన్.

క. వననిధిగంభీరుం డగు, జనపతికులశేఖరుండు సమ్మదలీలం
గనకమయపుష్పమాలిక, వినతనయున కిచ్చె నాతఁ డిచ్చం జెలఁగన్. 2661

సీ. కమనీయమణికనత్కనకాంగదంబులు, ముదితచిత్తునకు నంగదున కిచ్చె
నరఘమాలాకారహారినీలమాలిక, ఘనతరాత్మునకు నీలునకు నిచ్చె
మరకతమాణిక్యమహనీయదామంబు, మానుగా మారుతాత్మజున కిచ్చె
బద్మరాగారుణప్రాలంబ మేపార, ననఘాత్మునకు సుషేణునకు నిచ్చె
నంత వేడుక వీరు వా రనక రామ,ధారుణీపతి కపులకు వేఱువేఱ
యమలభూషణచారుదివ్యాంబరములు,గొమరుమిగులంగఁజిత్తముగొలఁదినిచ్చె.

క. ధనదానుజుఁ డగుదైత్యుని, మనమున విస్మయము గదుర న్మన్ననతోడన్
మనుజపతి గట్ట నిచ్చెను, దనుజులఁ గరుణించి నముచిహితం బగుపూజన్. 2663

చ. అమృతకళాంశుతుల్య మగుహారము రాముఁడు సీత కిచ్చె నా
రమణి ధరింప నొల్లక కరంబులఁ దాల్చి నిజేశుఁ జూడ భూ
రమణుఁడు నింతిక న్నెఱిఁగి రాగముతో నగుఁ గాక యన్న న
క్కమలదళాక్షి వాయుజునికంఠమునం దగిలించె వేడుకన్. 2664

క. ఆముక్తాహారంబున, నామారుతసూతి శారదాంబుదనిచితం
బై మెఱయుమేరుగిరిగతి, భూమివిహారమున జనులు పొగడఁగ నెగడెన్.

క. మందరధీరుఁడు రాఘవుఁ, డందఱఁ గరుణించి చూచి హర్షామృతని
ష్యంది యగుప్రియము పలుకుచు,మందస్మితవదన మమరమఱి యి ట్లనియెన్.

చ. అనయము మీకతంబునఁ బ్రయాసము నొందక యొక్కమాత్రలో
వననిధిఁ గట్టి దాఁటి యనివార్యబలుం డగుపంక్తికంధరుం
దునిమితి నెల్లరాక్షసులఁ ద్రుంచితి మించితి నీజగంబునన్
నినిచితిఁ గీర్తి రాజ్యపదనిష్ఠితవృత్తిఁ దనర్చితిం దగన్. 2667

క. నెఱినీతియు ధర్మంబును, మఱవక నాతోడికూర్మి మానక మర్మం
బెఱుకపడ నీక మతి నే,మఱక సుఖం బుండి యప్రమాదుల రగుఁడీ. 2668

వ. అని హితోపదేశంబులు మఱియునుం జేసి మీమీదేశంబులకుఁ జనుం డని యాలింగనప్రియాలాపమందస్మితకరుణాతరంగితకటాక్షవీక్షణాదుల సంభావించి సుగ్రీవాంగదపవనసుతాదు లగుప్లవంగయూథపులను విభీషణాదిరాక్షసులను జాంబవదాదు లగుభల్లూకనాయకులను వీడ్కొలిపిన వారలు కృతప్రణాము లై నిజనివాసంబులకుం జనిన. 2669

ఉ. విశ్రుతకీర్తి యైనరఘువీరుఁడు ధర్మనయానయాదులం
బ్రశ్రయధైర్యశౌర్యగుణభాసురుఁ డై నిరపాయవృత్తి వ
ర్ణాశ్రమపాలనంబులు ప్రయత్నముతో నొనరించుచున్ [1]సమా
పాశ్రయుఁ డై జగత్త్రయనియామకశాసన మొప్పఁ జేయుచున్. 2670

సీ. ధర్మార్థకామముల్ దమలోన నొండొంటిఁ, బెంపుసొంపార బాధింప నీక
పంచాంగమంత్రంబు పరిపాటి దప్పక, తగుమంత్రిపక్షపాతంబు గలిగి
[2]ప్రణిపాతముఖగుణప్రథితప్రయోగంబు, సేయుచుఁ దత్ఫలశ్రీఁ దనర్చి
శక్తిసిద్ధిత్రయసంప్రాప్తి భవ్యుఁ డై, విజితారిషడ్వర్గవిమలుఁ డగుచు
నంచితప్రవృద్ధి సప్తాంగముల మించి, చతురుపాయయుక్తి వితతి నొంది
యాతతవ్యసనములందు సంగతి లేక, యేలె ధరణి రాఘవేశ్వరుండు. 2671

మ. నిరతిశయాభ్యుదయభావమును నీతియు ధర్మపదైకనిష్ఠయున్

1. శమాపాశ్రయుఁ డై. 2. పణబంధముఖగతప్రథిత.

హేయకర్మాన్యాయ ॥ హింసాపరాభవ, శరణంబులును బాల ॥ మరణములును
బ్రజ లెఱుంగకుండఁ ॥ బ్రథమానశాసన, పాకశాసనుండు ॥ లోకగురుఁడు
దండ్రిపోలె మిగుల ॥ దయతోడఁ గాచుచుఁ, బరఁగ రామవిభుఁడు ॥ ధరణి నేల

క. సారాచారోదారుఁడు, వీరేంద్రుఁడు పదునొకొండు ॥ వేలేండ్లు నిజా
జ్ఞారంభ మొదవ నిత్య, స్మరయశస్స్ఫూర్తి నేలె ॥ మేదిని యెల్లన్. 2680

క. ఈరామాయణసంహిత, సారమతిఁ వినిన వ్రాయఁ ॥ జదివిన దురితా
పారజలరాశిఁ గడతురు, ధీరులు ధర్మార్థకామ ॥ దీపితవృత్తిన్. 2681

ఆ. [1]ఎవ్వఁ డెద్దిగోరి ॥ యిక్కథ విను వ్రాయు, నాతఁ డదియ పడయు ॥ నర్థితోడ
ననఘుధర్మవైభ ॥ వాయురారోగ్యముల్, గలుగు నొక్కమాత్రఁ ॥ జెలఁగిచదువ.

చ. అమర హుళక్కిభాస్కరమ ॥ హాకవి చెప్పఁగ నున్నయుద్ధకాం
డము తరువాయి చెప్పెఁ బ్ర ॥ కటప్రతిభామణిఁ దప్పలార్యస
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృ ॥ తస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకరతారభాస్కరమ ॥ హీవలయస్థిరలక్ష్మి చేకుఱన్. 2683

ఉ. ఆగమసత్యవేద్య దివి ॥ జాధిపమానసహృద్య సంతత
శ్రీగరిమాభిరామ పరు ॥ షీభవదాసురభీమ [2]నిస్సర
ద్రాగయతీంద్రసాధ్య వినతత్రిదశాఖిలసాధ్య సుస్థిరా
భోగమహానుభావ బహు ॥ భూతిదనిర్మలభావభావనా. 2684

క. ప్రణమన్మరుదీశశిరో, మణిఘృణివిమలాంబుధౌత ॥ మానితచరణా
గణనాతిగగుణశరణా, గణలోకకృతాధికరణ ॥ కరుణాభరణా. 2685

మాలిని. కనకకుధరచాపా ॥ కల్పకల్యాణరూపా
వనజనిలయవంద్యా ॥ వారిజాతాభినంద్యా
జననవిలయదూరా ॥ సర్వవిష్వన్నహారా
మనసిజహరనేత్రా ॥ మంగళోద్యచ్చరిత్రా. 2686

గద్యము. ఇది శ్రీశాకల్యమల్లకవిరవిరాహు నృసింహావర జాప్పలార్యనందనోభయ
భాషాకవితావిశారద శారదాచరణకమల పరిచరణపరిలీఢమానసాయ్యలార్య
విరచితం బయిన శ్రీరామాయణమహాకావ్యంబునందు యుద్ధకాండశేషంబు సర్వము.



సీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత
శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

1. ఎవ్వఁ డెద్దిగోరి ॥ యొక్కెడ విను నాతఁ, డదియు పడయు సందియంబు లేదు
ననఘుధర్మవైభ ॥ వాప్తులఁ గలుగును, జగతి నొక్కమాత్రఁ జదువఁగనిన. 2. నీరసద్రాగ